# విషయసూచిక.

## ఆరణ్యకాండము.

విషయము.

## కిష్కింధాకాండము.

## సుందరకాండము.

## శ్రీరాముఁడు మునులయాశ్రమములఁ జూచుట.

క. శ్రీనయగుణవిభవాఢ్యా, జ్ఞానలసన్మానిహృదయ ♦ చారుసరసిజ
స్థాన నిరంతరవాసా, శ్రీనిర్మితరూపమహిమ ♦ శ్రీరఘురామా. 1

ఆ. అవధరింపవయ్య ♦ యవ్వలిదైననీ, దివ్యచరితమెల్ల ♦ దేవతలకుఁ
దెలియరానిదాని ♦ దివ్యమునీంద్రుని, వాక్యసరణిఁ దెలుపు♦వాఁడ భక్తి. 2

[1]క. శ్రీరాముఁ డతులధైర్య, స్ఫారుఁడు దుర్ధర్షుఁడౌటఁ ♦ బరదుర్గమమౌ
ఘోరారణ్యముఁ జొచ్చి మ,హారమ్యమునైన మునుల ♦ యాశ్రమవితతిన్. ౧

సీ. కనియె నయ్యెడ యజ్ఞ♦కార్యార్థ మానీతములగుదర్భలునార్ద్ర♦ములగు వల్క
లము లాతపమునకు♦లలినాఱఁగట్టఁగాఁబడియుండునవియందుఁ♦బరఁగుచుండెఁ
దపము సల్పుటయు వే♦దములఁ బఠించుట మొదలగువానిచే ♦ నొదవినట్టి
తేజోవిశేషంబు ♦ దీపించుచుండుట నాకసంబునఁ బ్రదీ♦ప్తార్కమండ

తే. లము వలెన్ భూరిరాక్షసు♦లకును దేఱి
చూడరానిదిగా వెల్గు♦చున్ నితాంత
కాంతి నలరారుచుండె, స♦కలములైన
ప్రాణులకు వాసయోగ్యమై ♦ పరఁగుచుండె. ౩౪ 4

క. ముంగిళులెప్పుడు నం దల, కంగంబడి యుండె మృగని♦కాయము, మిగులన్
రంగులుగల పక్షులు చాలం గల్గుట నొప్పెఁ గడు వి♦లాసము మీఱన్. 3

క. అతిరమణీయముగా స్థల, వితతులు కన్పడుట దేవ♦వేశ్యల గుంపుల్
సతతము నృత్యము సేయుచు, స్తుతిచేయుచు నుండు, దాని♦సొంపువిధములన్.

సీ. అట విశాలములగు ♦ నగ్నిగృహంబులు, మఱి స్రుక్స్రువాదిక♦మఖపరికర
ములును, కృష్ణాజిన♦ములును దర్భాసనములు సమిధలు జల♦కలశములును

---

1 పూర్వకాండమునఁ బితృవాక్యపరిపాలన పరమధర్మము సజ్జనుల కవశ్యాచరణీయమని తెలుపఁబడినది. ఇపుడు సజ్జనసంరక్షణరూప పరమధర్మమును దెలుపుచు రామచంద్రుని యద్భుతపరాక్రమముల విస్తరించి చెప్పుట కీకాండ మారంభింపఁబడియె నని యెఱుంగవలయు.

ఫలమూలములును మి♦క్కిలి యొప్పుచుండెను; స్వాదుఫలంబులై ♦పావనంబు
లౌ భూరివనమహీ♦జావళి తగియుండె; బలిహోమముఖములఁ ♦ బరఁగి పూజి

ఆ. తంబు నగుచుఁ బావ♦నంబయి శ్రుతినినా
దములఁ బ్రతినినాది♦తంబు నగుచు
దేవతార్చనలకుఁ ♦ దేఁబడు వన్యకు
సుమము లొప్పు నుండె ♦ సొంపు గులుక. ౭౹ 7

క. సరసీరుహములఁ జెన్నగు, సరసులు తనరారుచుండె; ♦ స్వాదుఫలములన్
వరమూలములనుదినుచుం, గరము జితేంద్రియులు నోచుఁ♦గ్రాలుమునీంద్రుల్.

తే. నారచీరలఁ గృష్ణాజి♦నములఁ దాల్చి
భానువహ్నిసమానతఁ ♦ బరఁగి వృద్ధు
లగుచు నంతటఁ గాపుండి ♦ రట్టి మునుల
చేతఁ బూజింపఁ బడుచు వి♦ఖ్యాతు లగుచు. ౯౹ 9

క. వెలయుచు నియతాహారం, బులఁ గొనుచుఁ బవిత్రులయిన ♦ మునివర్యులు శో
భిలుచుండి; రిట్టు లాశ్రమ, ములు[1] విధిలోకోపమాన♦ములగుచు మఱియున్.

సీ. కర్మము లొనరించు♦కాలంబులన్ శ్రుతి మంత్రఘోషంబుల♦మహితములయి
బ్రహ్మవేత్తలు మహా♦భాగులునగు విప్రవరులచే నెంతయు ♦ వఱల, భూరి
తేజుండు శ్రీమంతుఁ♦డౌ జగన్నాథుండు రాముఁడు గాంచి [2]యు♦ద్ధామచాప
ముననుండి జ్యాలతి♦కనుడించియాయాశ్రమములఁజూడఁగఁ బోయె♦మౌనివరు[లు]

[3] తే. వార లంత దివ్యజ్ఞాన♦వైభవులు న
లౌకికములగు విషయంబు♦లను గనంగఁ
జేయుశక్తియుఁ గలవార♦లై యలరెడు
వారు గావున వచ్చిన♦వాఁ డితండు. ౧౦ 11

క. నారాయణు నవతారం, బౌ రమణీయు లక్ష్మణుఁడు మ♦హాత్ములనుచుఁ బెం
పార నెఱింగిన వారగు, టారసి ముదమంది యప్పు ♦ డాదృతి మీఱన్. ౧౦౹

క. శ్రీరాముని సౌమిత్రిని, జారుయశోరాజితయగు ♦ క్ష్మాపుత్రిని దా
రారసి మెదుసుగఁ జని యిం, పారఁగ వారలను గాంచి ♦ యలరిరి ప్రీతిన్.

సీ. ధార్మికుల్ మఱి నియ♦తవ్రతులునగు మహాములు లుదయించు♦నట్టి చంద్రు
భంగి నుండెడు రఘు♦వరుని సౌమిత్రిని కీర్తిమతిన్ సీతఁ ♦ గేవలంపు
భక్తిచేఁ గనుఁగొని ♦ వారికి మంగళములగుఁగాకనుచును ♦ బలికి రాము

1 విధిలోకోపమానములు=బ్రహ్మలోకతుల్యములు. 2 విజ్యం కృత్వా మహద్ధనుః-అనిమాలము 3 దివ్యజ్ఞానోపపన్నాస్తే రామం దృష్ట్వా,మహర్షయః-అనిమాలము. దీనికి గోవిందరాజ వ్యాఖ్యయందును, తనిశ్లోకియందును జెప్పఁబడినయర్థమే యనువదింపఁబడెనని యెఱుంగునది.

నిష్టదైవముగనె ♦ యెంచి గ్రహించిరి; భూషణములె లేక ♦ పొదలుచున్న
రాముని రూపంబు ♦ రమణీయసౌందర్యమును దివ్యమయిన కాం♦తిని సువేష

తే. తను దగఁ వనవాసు లు♦దార విస్మి
తాకృతులనొప్పి చూచి; ర♦[1]య్యటవి నున్న
పశుపతత్రిముఖంబులు ♦ వారి రాము
సీతనుఁ లక్ష్మణుని సువి♦చిత్రతనుల. ౧౩ 14

క. కనుఁగొని మున్నెన్నఁడు చూ,చినవారలలోన నట్టి ♦ చిత్రాకృతులం
దనరారు వారు లేమిని, ననిమేషేక్షణము లొప్పు♦నట్లుగఁ గనియెఁ. ౧౪ 15

క. అంతట నందుం దగు ముని,కాంతులు భూతహితమును ద♦గంగోరిన భూ
కాంతుఁడు రాముం డతిథిగ, వింతఁగ రా నుటజములకు ♦ వేడుక లలరఁ.

క. కొనిపోయి నిలుపుకొని ర,మ్మును [2]లనలోపములు ధర్మ♦మును బూనినవా
రును నౌట రాము సత్కృతిఁ, దనిపి పవిత్రోదకమును ♦ దమిఁ దెచ్చి వెసఁ.

సీ. ధర్మవిదుల్ మౌని♦తల్లజు ల్మహనీయుఁ డగు రామచంద్రుకో ♦ నటవిఁ గల్గు
మూలంబులను ఫల♦పుష్పంబులను నాశ్రమంబుల నీవిగా ♦ మది నెఱింగి
యిచ్చవచ్చిన యట్టు ♦ లివ్వాని నుపయోగపఱచుకొమ్మా యని ♦ భక్తిఁ బలికి
కరములు ముకుళించి ♦ ఘనభణితిం బల్కి రతుల విఖ్యాతిచే ♦ నలరు నీవు

తే. ధర్మపాలకుఁడవు గాన ♦ ధరణి నిందు
నార్తులగు నీజనులకు న♦త్యంతరక్ష
కుండ వమరులవలెను బూ♦జ్యుండ వధిపు
గాఁ దలంచుచు మన్నింపఁ♦గాఁ దగుదువు. ౧౭ 18

క. క్షితిపతిదండధరుండగు, నతఁడె గురుఁడగు; నదెట్టు♦లని యడుగుదువో?
క్షితి నింద్రు చతుర్థాంశం, బితరదిగీశాంశములును ♦ నెల్లఁ దనరుటఁ. ౧౮

క. మనుజుల రక్షించును జూ,కను కనె దివ్యముల భోగ♦కాండంబులనుం
గనుచున్నవాఁడు మఱి లో,కనమస్కృతుఁడగుచు నుండు; ♦ క్ష్మాపతి తనయా.

సీ. ఇట్లార్తులైన మే♦మెల్లర మార్తరక్షణదీక్షఁగల నీదు♦సాయమున నె
జీవింపఁగలము రక్షింపంగఁబడుటకు నీదేశమున నుంట ♦ గాదె హేతు
[3]వగు; నేను బరిపాల♦కాధికారంబున నుండినఁగద గాచు♦టొప్పు నంచుఁ
బలికెదవో యేమొ? ♦ పట్టణమున నున్నఁ గానలో నుండినఁ ♦ గాని మాకు

---

1 ఆశ్చర్యభూతా దదృశు స్సర్వే తే వనచారిణః-అని మూలము. దీనికి వ్యాఖ్యానచతుష్టయము వేఱువే ఱర్థముల నుపపాదించినది. దానిసారమే యిందుఁ జెప్పఁబడినది. 2 అనలోపమాది విశేషణంబులును, దీని తరువాతిపద్యమున ధర్మవిదుల్ అను మొదలగు విశేషణంబులు మూలాను సారమే యనుసఁబడినవని యెఱుంగఁదగు. 3 ఇందు నవతారికలోనిమాటలు చేర్పఁబడియునని తెలియవలయు.

ఆ. రక్షకుండ వీవె ♦ రాజవు గావునఁ
దపము బలిమి మీరె ♦ తగినరీతిఁ
గాచుకొనఁగఁ దగును ♦ గా యనుదువయేని
వినుము యుత్తరంబు ♦ ఘనమనీష!. ౨౦ 21

సీ. విజితేంద్రియులమయి ♦ వెలయుచుందుము గాన నింద్రియవ్యాప్తికి ♦ నెల్లమూల
మయిన కోపమ్ముండ ♦ దంతియ కాక సామర్థ్యముండియు మేమె ♦ సమ్ముఁ గాచు
కొనరాదు, తపమె మా ♦ ధనమగు, నీపుత్రసముల మము గాన ర♦క్షణము చేయఁ
దగుమమ్ము నీవు సం♦తతము గావుమ యని యమ్మహర్షులు పల్కి ♦ యడవిఁ గలుగు
తే. సుమఫలంబులు మూలమ్ము♦లు మఱి యితర
ములయి సంకల్పసంసిద్ధ♦ములయి తనరు
పలువిధాహారముల రాఘ♦వులను బూజ
చేసి రెంతయు మోక్షేచ్ఛ♦చేత నెలమి. ౨౧ 22

క. అనలాభులు సిద్ధులు నగు, మును లితరులు న్యాయమార్గ♦మునఁ దగు వృత్తిం
గనువారు న్యాయమున విభు, ఘనురాముని దనిపి రెలమి♦గ్రాలఁగ నుతులన్.

మొదటి సర్గము సంపూర్ణము.

---

## ౨ - వ సర్గము.

రాఘవులు విరాధునితో సంభాషించుట.

క. మునివరు లిటు లతిథిసమ,ర్చనమును గావింప రామ♦చంద్రుఁడు పిదపన్
వనజాప్తుం డుదయించిన, నొనరిచి కృత్యముల మునుల♦నొగి వీడ్కొనుచున్.

క. వనమును జొచ్చెను వివిధమృ,గనికాయవ్యాప్తమగుచు ♦ గండుఁబులులచే
తను వృకతతిచే సేవిత,మునగుచు నవ్వనము ఘోర♦మగు నపు డుండెన్. ౧౫

సీ. లతలు గుల్మములు వృ♦క్షతతులు చిందఱ వందఱలై కానఁ♦బడియె; నచటి
సలిలాశయములు న♦సహ్యములై చూడఁ దగకుండె వివిధప♦త్త్రిచయము
భయమున నేమియుఁ ♦ బలుకక చలియింపకుండె నెల్లెడఁ గూయు♦చుండె నీల
పురుగులు; తనసహో♦దరుఁడు వెంబడిరాఁగఁ జనుచువనాంతర♦మును రఘువరుఁ
తే. డచటఁ గాంచెను ఘోరమ్ము♦గాన్వితమగు
నవ్వనంబున సీతతో ♦ నరుగుచుండి
భూధ్రశిఖరము వలెఁ గడుఁ ♦ బొడవు గాఁగఁ
గానఁబడుచున్న యొక్క రా♦క్షసునిఁ గనియె. ౪ 26

క. వెనునాదంబును జేయుచు, గను యుగ్మము లోఁతుగాఁగఁ ♦ గన్పడ వక్త్రం
బును బెద్దదగుచుఁ దగఁగాఁ,దను వధికవిశాలమగుచుఁ ♦ దగి యుండంగన్. ౪౫

క. దనుజుఁడు విషమోదరుఁడై, కనఁబడియెన్ రక్తమాంస♦కలితమగుట రోఁ
తను గలిగించుచు నాతని, తనువుండెన్ విషమదీర్ఘ♦తను వికృతంబై. ౫ 28

చ. కనుఁగొన ఘోరమై యతని♦కాయము నిక్కుచునుండె; రక్తమాం
సనిచయ సంతతార్ద్రమయి ♦ సాధ్వసదంబగు వ్యాఘ్రచర్మముం
దనువునఁ గప్పి భూతభయ♦దంబగు నాకృతి విస్తృతాస్యుఁడై
కనఁబడు కాలుచందమునఁ ♦ గన్పడుచుండెను దద్వనంబునన్. ౬ 29

సీ. వ్యాఘ్రచతుష్కంబుఁ ♦ బంచాననత్రితయము వృకయుగ్మంబు♦సమదహరిణ
దశకము, మాంసయు♦క్తంబయి దంతంబు లొప్పఁగాఁ దగు నొక♦గొప్పహస్తి
శిరము, నాయసమయి♦చెలఁగు శూలంబునఁ దగఁ గ్రుచ్చి పట్టి ని♦తాంతనాద
మడరంగ నార్చుచు♦నాదనుజుఁడు పొల్చుచుండె; వాఁ డంతట ♦ నుద్యమమున

తే. రామునిన్ లక్ష్మణుని రాము ♦ రమణి సీతఁ
గాంచి కోపంబునన్ ఁలయ♦కాలయముఁడు
ప్రజలపయి కేగుదెంచెడు ♦ భంగి వారి
పయికి నొక్కుమ్మడిగ వడిఁ ♦ బాఱె నంత. ౭౪ 30

క. సురవైరి ధరఁ గదల్చెడు, కరణిన్ భయదారవంబుఁ ♦ గావించుచు న
త్తరుణిన్ జంకన నిడుకొని, సరగున నవ్వలికిఁ దొలఁగి ♦ చని రాఘవులన్. ౯౪

సీ. కని వచించెను జడ♦లను నారచీరల ధరియించి మీరొక్క ♦ తరుణితోడ
శరచాపములఁ బూని♦వరఖడ్గములఁ బట్టుకొని యాయువు నశించు♦టనుదగంగ
నీదండకాటవి ♦ కేతెంచుటనె యింక బ్రదుకుట కష్టమే♦పల్కు డినుఁడు
మీరు తాపసులె యీ♦నారితో నెట్లుగాఁ గాఁపున్నవార లి♦క్కరణిఁ దపసి
వేషముం జేకొని ♦ వృత్తికి భిన్నంబుగా శరచాపముల్ ♦ ఖడ్గములును

తే. దాల్చి యీరీతి గాఁగ న♦ధర్మ మాచ
రించుచున్నట్టి పాపాత్ము ♦ లెంచ మీర
లెవ్వ రేను విరాధుండ ♦ నిచట నుండు
వాఁడ రాక్షసుఁడను భూరి♦బలుఁడఁ జుండి!. ౧౨ 32

క. నే నాయుధములఁ దాల్చుచు, మానుల వధియించి వారి♦మాంసముఁదినుచున్
బూనికచే దుర్గమమగు, కాన నిటం దిరుగుచుండుఁ ♦ గడు స్వేచ్ఛమెయిన్.

*తే. ఈవరారోహ నారి నా ♦ కింతి కాఁగ
లదు రణంబునఁ బాపాత్ము♦లను మిముఁ దగఁ
జంపి త్రాగుదు మీదేహ♦సంగతమయి
తనరు రక్తంబు ననిపల్కె ♦ దనుజుఁ డపుడు. ౧౩౪ 34

* ఇయం నారీ వరారోహా-అనిమూలము.

చ. అని యిటు దుష్టచిత్తుఁడగు ♦ నట్టి విరాధుఁడు దుష్టరీతిఁ బ
లి్కిన గరువంపుఁబల్కుల ల♦లిన్ విని జానకి తొట్రుపాటు భీ
తిని గొని [1]ఘోరుగాలి దగు♦దెబ్బకు భీతిలి కంపమొందు చ
క్కనికదళీద్రుమంబువలెఁ ♦ గంపమునొందెను; రాముఁ డంతటన్. ౧౫ 35

చ. దనుజుని చంకఁ జిక్కిన ని♦తంబిని మంగళచిత్తఁ గాంచి వే
దనఁ గని వక్త్రమెండఁ దన♦తమ్ముని లక్ష్మణుఁ గాంచి పల్కె ని
ట్లని; యిదె సౌమ్య! యాజనకు♦నాత్మజయై సుఖసంపదల్ దగం
గను బ్రియమారఁగాఁ బెరిఁగి ♦ ఖ్యాతిని గాంచి నృపాలపుత్త్రియై. ౧౬ 36

క. సురుచిరమగు నాచార, స్ఫురణముఁ గని నన్నుఁ బతిగఁ ♦ బొందియలరు నీ
తరుణి విరాధాంకంబునఁ, గరము విచారముగఁ జిక్కెఁ ♦ గనుమా సీతన్.

సీ. మనవిషయంబయి♦మదిఁ జక్కఁగా నెంచి యే యభిప్రాయ మా♦యింతికై క
గలిగియుండెనొ వర♦ముల నెపమునదేనిఁ బ్రియమార నడిగెనో ♦ వేగ యద్ది
యంతయు ఫలియించె ♦ నామెకు దూరపుఁజూపును గల యట్టి ♦ సుదతి యప్డు
తనయునకై రాజ్య♦మును బొందుటనె తృప్తినొందదో సంతృప్తి♦నొందకామె
తే. [2]సర్వభూతహితుండనై ♦ జననిమాట
కష్టమును జెప్పకయె యున్న♦యట్టి నన్ను
వనికిఁ బంపెనొ మధ్యమ♦జనని కోర్కి-
[3]యిపుడె నేఁడే ఫలించిన ♦ దివ్విధమున. ౨౦ 38

క. అనుజా! పరపురుషుఁడు సీ,తను దాఁకుటవలన నా కె♦దం గల్గిన చిం
తను బోలినంతవెత నా,జనకు వియోగముననైన ♦ న్రాచ్యుతినైనన్. ౨౧ 39

ఆ. కలుగలే దటంచుఁ ♦ గాకుత్స్థుతుఁ డెంతయు
వగలఁ గుంది బాష్ప♦వారివిడుచు
చును వచింప నతని♦శోకముఁ గని క్రుద్ధుఁ
డగుచు మంత్రరుద్ధ♦మగు నహివలె. ౨౧ 40

క. పలికెన్ లక్ష్మణుఁ డూర్పులఁ, గలఁగుచుఁ గాకుత్స్థ! ముజ్జ♦గములకుఁ బతివై
యలవాసవతుల్యుఁడవై, యలరెడునీవే లనాథు♦నటులు పహార్తిన్. ౨౨ 41

సీ. కనియెదవీవు చె♦ప్పినయటుచేయంగ నున్నాఁడ నేనిందె ♦ యుద్యమమున
నేల యనాథుని♦పోలికఁ బరితాప మందుచున్నాఁడ వో♦యన్న చెపుము
యిపుడు క్రుద్ధుఁడనగు ♦ నేను శరంబున నీవిరాధుని వధి♦యింప వీని
రక్తంబు భూకాంత ♦ ద్రాగును దృప్తిఁగా రాజ్యంబుఁ గోరు భ♦రతునిపైన

1 సీతా ప్రావేపతోద్వేగా త్ప్రవాతే కదళీయథా-అనిమూలము. 2 యయాహం సర్వభూతానాం హితః ప్రస్థాపితో వనమ్-అనిమూలము. 3 ఇపుడె నేఁడే యనుపదములు వ్యర్థములు కావు. అద్యేయాసీం సకామాసా-అనుమూలము ననుసరించినవనియే తెలియవలయు.

తే. నాకుఁ గల్గినకోప మం♦తయును వజ్రి, పర్వతముపైన వజ్రంబు ♦ వైచుకరణి
నీవిరాధాసురునిపైన ♦ నిపుడె విడుచు, వాఁడఁ జూడుము శ్రీరఘు♦వర్య! నీవు.

క. కనుమూ భుజబలవేగంబున నారిం బట్టి తిగిచి ♦ మునుకొని నే వై
చిన శరము వెడఁదయురా నీ,తనియొమ్మును జీల్చి ప్రాణ♦తతి వెకలించుః. ౨౫

క. శరఘాతంబునఁ బ్రాణో,త్కరము చనక బింకమెడలఁ♦గా గిఱగిఱగాఁ
దిరుగుచు నిలఁబడుఁగా వే, పరితాపము మానవయ్య ♦ పల్కులిఁకేలా. ౨౬

రెండవ సర్గము సంపూర్ణము.

## 3 - వ సర్గము

### విరాధునితో యుద్ధము.

క. [అని శ్రీమంతుఁడు లక్ష్మణుఁ, డనఘునితోఁ బలికి యసురు ♦ నంతటఁ గని యీ
వనిలో సుఖముగఁ దిరిగెడు, దనుజుఁడ వెవ్వఁడవొ చెప్పు ♦ తగునటు లనినః.]

క. దనుజుం డంతట నవ్వన,మునఁ బ్రతిశబ్దంబు పుట్ట ♦ మూల్గుచు మీరీ
తినె యడుగుచు నున్నానే, వినిపింపుఁడు మీరలెవరొ ♦ వివరము గాఁగః. ౧

క. చనుచున్నా రెక్కడికో, యనఁ గడుఁ దేజమున నొప్పు ♦ నారాఘవుఁ డా
దనుజుని జ్వలితాననుఁ ద,న్గని యడిగెడువాని నపుడు ♦ గని తనవార్తః. ౨

క. తెలుపం దలంచి యిట్లని, పలికెః క్షత్రియుల మేము ♦ భవ్యాచారం
బులు గలవారము విపినం, బులఁ దిరిగెడువారమనుచుఁ♦బోలనెఱుఁగుమా.

చ. నినుఁ దెలియంగఁ గోరెదము ♦ నీవిట దండకకాననంబులః
బనివడి సంచరించెద వె♦వండవు నాఁగ విరాధుఁ డంత రా
ముని ఘను సత్యశౌర్యుఁ గని ♦ మోమున గర్వము చిందులాడ ని
ట్లనియెను; నాదువార్తవిన ♦ నో వినిపించెద [1]భూమిపాలకా!. ర 49

సీ. నాతండ్రి జయుఁడు జ♦ననియు శతహ్రద నన్నుఁ గ్రవ్యాదు లం♦దఱువిరాధుఁ
డని పిల్చుచుందు ర♦వనియందు మఱి నేనుఁ దపమొనర్చి విరించి♦దయనుగంటి
దానిచే నన్ను శ♦స్త్రములఁ జంప నశక్య మట్లె ఛేదింపంగ ♦ నలవిగాదు
ఛేదింప శక్యమే♦గాదు మీరీనారిపై నాశ వదలి యి♦ప్పుడఁతి విడిచి

ఆ. వచ్చినట్టిదారిఁ ♦ బట్టి వే పాఱుఁడు
లలన చిక్కినందు♦వలన మిమ్ముఁ
బ్రాణములను గొనక ♦ వదలెద ననఁ గోప
రక్తనేత్రుఁ డగుచు ♦ రాముఁ డపుడు. ౭౫ 50

క. కనుఁగొని వికృతాకారుని, దనుజుని బాపాత్ము నతని ♦ ధైర్యంబున ని

1 నిబోధ మమ రాఘవ-అనిమూలము.

ట్లనియెను నిస్సీ! నీచా!, పనియిది యతినీచ మిట్టి♦పనిఁ బూనితివే?. ౮౹ 51

క. విను నీ మరణము నిశ్చయ, మున నీవే వెదకె దిపుడు ♦ మూర్ఖా! యుద్ధం
బున నీకోర్కి ఫలించును, నను మార్కొని బ్రదికి యే చ♦నఁ లేవుసుమా!.

చ. అని వచియించి చాపమున ♦ నప్పుడె నారిని గూర్చి తీక్ష్ణబా
ణనికర మట్లె చేర్చి పటు♦నాదము పర్వఁగ వానిమీఁద వై
చెను దగ నేఁడు బాణములఁ ♦ జెచ్చెఱఁ బోయెడువానిఁ దార్ఢ్య న
య్యనిలుని బోలు వేగము న♦హార్యపటుత్వము నొప్పువానినిఁ. ౧౦౹ 53

తే. అవ్వి బంగారు పిడులతో ♦ నమరుపఁబడి
యుండెను మయూరపత్రసం♦యుక్తములయి
యగ్నితో సాటియై యొప్పు ♦ నాశరములు
దనుజు దేహంబు భేదించు♦కొని జవమున. ౧౧౹ 54

సీ. అతని దేహమునుండి ♦ యంత రక్తము ప్రవాహముగను వెడలని ♦ యంతలోన
వెడలి వచ్చుటచేత ♦ విపులసాయకములు కొంత నెత్తుటఁదోఁగి♦కువలయమునఁ
బడియె; బాణములుచ్చి♦పాఱనొచ్చియతండుమిగులఁగోపమునొంది♦సొగసులా
నట డించి వేగ శూ♦లాయుధమును నెత్తికొని రామలక్ష్మణు♦లను వధింపఁ [డి

ఆ. బాఱు తెంచె; వాఁడు ♦ పటునాదమునుజేయు
చును మహేంద్రుధ్వజము ♦ సొంపునఁ దగు
చును జెలంగు శూల♦మును బట్టుకొని నోరు
దెఱచుకొనిన యముని♦తీరు దోఁప. ౧౩౹ 55

క. కనుఁగొనువారికిఁ గన్పడె, దనుజుఁడు జానకిని డించి ♦ తమపైకి వెసం
జనుదేర రామలక్ష్మణు, లసూనగతి వానిపైన ♦ నంబకవితతుల్. ౧౪౹ 56

[1] తే. జీవితచ్ఛేదమును వెసఁ♦జేయు కాలు
పగిదిఁ, బ్రాణాపహరణత♦త్పరతఁ గనిన
యంతకునిరీతిఁ, బుణ్యపా♦పాళిభేద
మును నిరీక్షించు యముగతిఁ ♦ దనరువాని. ౧౫ 57

క. దనుజునిఁ గని తీక్ష్ణంబుగ, ననుపమగతి వర్షమట్టు ♦ లప్పుడు గురిపిం
చినఁ గడు రౌద్రుండగు నా, దనుజుఁడు వీరనఁగ నెంత ♦ తలఁపఁగ నాకుఁ.

క. అని నవ్వి యావులించుచుఁ,దన దేహము విఱుచుకొని యెఁ♦డత్సమయమునఁ

---

1 విరాధే రాక్షసే తస్మిఁ కాలాంతకయమోపమే-అనిమూలము. 'కాలః అంతకో యమ శ్చేతి త్రయో మారణాధికారిణః. తత్ర కాలస్యాధికారో జీవితవిచ్ఛేదే అంతకస్య ప్రాణాపహారే యమస్య పుణ్యాపుణ్యవివేక ఇతిభేదః' అను మహేశ్వరతీర్థులవారిభావ మిటఁ బద్యమునఁ జేర్పఁ బడియెనని తెలియవలయు.

దనుజుని కాయమునుండియె, ఘనశరములు వెడలి పడియె ♦ క్ష్మాస్థలి నంతన్.

తే. వేగవంతము లయ్యు న♦వ్విశిఖములొగిఁ
ద్రుళ్లిపడియెను; మఱి విరా♦ధుండు తనదు
వరమహిమమునఁ బ్రాణాళిఁ ♦ బట్టి యుంచు
కొని కరంబున శూలంబుఁ ♦ గొని జవమున. ౧౯ 60

క. ఆరఘువీరుల మార్కొన, నారావమువీఱఁ బొఱ ♦ నాయుధధరులం
దారయ మేటిగ నొప్పెడు, నారాముఁడు జ్వలను మాడ్కి ♦ నగపడుదానిన్.

సీ. వజ్రాయుధముఁబోలి ♦ వచ్చుదానిని శూలమును గని గరయుగ్మ♦మున నెత్తుంచెఁ
దద్బాణభిన్నమై ♦ దనుజుని శూలమ్ము వజ్రంబుచేఁ ద్రుంపఁ♦బడిన మేరు
నగశిలాతలము చం♦దమ్మునఁ దత్కరముననుండి ధరఁబడి♦యెను; విరాధుఁ
డంత వారలపైకి ♦ నరుదెంచె నదిగని వార లిద్దఱు కృష్ణ♦ఫణులరీతి
తే. నలరు వరఖడ్గములఁ బూని ♦ యతనిబలిమి
వెలయఁ బ్రహరించి రంతట ♦ విపులరౌద్ర
మూర్తి యయి వాఁడు వారిచే ♦ మోదఁబడియుఁ
బట్టువదలక కదలింపఁ ♦ బడనివారి. ౨౦ 62

క. పురుషవరేణ్యుల నారఘు, వరులను బిగఁబట్టి తనదు ♦ బాహువులను భీ
కరరీతిఁ గౌఁగిలించెడు, కరణినిగా నెత్తుకొని త♦గం బోఁ గోరెన్. ౨౧ 63

సీ. దనుజుఁడు మఱియొక♦వనమునకుం దమ్ముఁ గొనిపోవ నున్నరీ♦తిని నెఱింగి
రామచంద్రుఁడు సుమి♦త్రానందనుంగని యూరకుండుముసుంత♦యూరసమున
నీతఁడు మనమేగ♦నెంచిన యీమార్గముననె చక్కఁగ మోచి♦కొనిచనియెడుఁ
గాక; స్వాభీష్టమా♦ర్గమున నే కొనిపోవుఁ గాక యీవనమధ్య♦గతపథమున
తే. జనఁగ నెంచితిమిగద; యీ♦దనుజుఁ డరుగు
మార్గమే మనమేగనౌ ♦ మార్గమగును
దాళుమా యేమియనక యీ♦తనిని ననియె
నంత బలవీర్యములను మ♦హాసురుండు. ౨౩ 64

క. బలయుతుల వారినిర్వుర, నలయక వాహూరకుంట ♦ నర్భకయుగముగ్
బలె నెత్తికొనుచుఁ దనమూఁపులపై నిడుకొనియె దనుజ♦పుంగవుఁ డంతన్.

సీ. మూఁపులపైఁ జేర్చి ♦ వే పరుగిడుచు భయంకరంబుగ నార్చి♦యాత్మ నెంచి
నట్టి వనిం గూర్చి ♦ యరిగె; మహామేఘసన్నిభంబయి సుంత ♦ సందు లేక
బహువిధవనవృక్ష♦వారయుతంబయి పలువన్నెలం దగు♦పక్షి నికర
ములచేతఁ జిత్రమై♦యలరుచు నక్కలువ్యాఘ్రముల్ మొదలగు♦భయదమృగని
తే. కాయములతోడ సందులే♦కయె చెలంగు
చున్న ఘోరవనంబును ♦ నన్నదమ్ము

లను జవంబునఁ గొని మహా♦దనుజుఁ డతఁడు
చొచ్చెఁ దనమదిఁ దోఁచిన♦చొప్పునఁ దగ. ౨౬ 66

మూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౪ - వ సర్గము.

సీత శోకించుట, రామలక్ష్మణులు విరాధుని బాహువుల నఱకుట.

చ. జనకజ రాములక్ష్మణులఁ ♦ జయ్యన నాదనుజుండు స్వేచ్ఛఁగాఁ
గొని చనుచుండుటం గనుచుఁ ♦ గోమలబాహువులన్ విదుర్చుచున్
ఘనరవమొప్ప నేడ్చె; నృప♦కాంతునిసూనుఁ డితండు సత్యవా
క్కునఁ దగువాఁడు, [1]శీలమునఁ ♦ గూడిన సాధుమనీషుఁడౌఁ గదా. ౧॥ 67

క. మతిమంతుఁ డిట్టి శ్రీరఘుపతి లక్ష్మణుతోడ మిగుల ♦ భయదంబగు నా
కృతిఁ గల్గు దనుజుచే నీ, గతిఁ గొనిపోవంగఁబడెడుఁ ♦ గద యేమందున్. ౨

క. దనుజోత్తమా! నమస్కృతి, [2]నొనరించెదనిదిగొ వృకము♦లోఁగఁ బెబ్బులులున్
దిను నన్నుఁ జిఱుతపులులును, గనుక న్ననుఁ గొనుము వీరిఁ♦గరుణ విడువుమా

చ. అని జనకాత్మజాత కరు♦ణాతురయై విలపింప వీరులై
తనరెడు రామలక్ష్మణులు ♦ దానవుఁ ద్రుంచుట యత్నమంచు నె
మ్మనముల నెంచి; రాత్రపడి ♦ మానితఖడ్గము నెత్తి యావిరా
ధుని దగు సవ్యహస్తమును ♦ ద్రుంచెను లక్ష్మణుఁ డొక్కవ్రేటునన్. ౪॥ 70

క. దనుజుని కుడిచేతిని వే, తునుమాడెను రాఘవుండు ♦ తోరపుబలిమిన్
[3]ఘనతుల్యుఁ డతఁడు పవిచే,తను ద్రుంపంబడిన పర్వ♦తమువలె నిలపై. ౫

క. కరములు విఱుగుటఁ బడియెన్, ద్వరగా సంవిగ్నుఁడగుచుఁ; ♦ దద్దనుజుని వే
ధరనైచి జానువులనున్, జరణంబులఁ బిడికిళులను ♦ సముదగ్రగతిన్. ౬॥ 72

ఆ. ఎత్తియెత్తి తన్ని ♦ యత్తఱిఁ బిసుకుచు, ముద్దగా నొనర్చి; ♦ రద్దనుజుఁడు
పెక్కుబాణములను ♦ నిక్కడనక్కడఁ, బొడువఁబడియుఁ గత్తి♦పోట్లఁ గనియు.

క. ధరపై బహుభంగుల భీ,కరగతి ముద్దవలెఁ జేయఁ♦గాఁ బడియును దా
మరణమ్ము నొందఁడయ్యెను, దరణికులాంభోధితుహిన♦ధాముండంతన్. ౮ 74

సీ. భయకాలములయంద♦భయదుఁడౌటనుబర్వతాకారుఁడై నయ♦య్యసురునెట్టి
శస్త్రాస్త్రములనైనఁ ♦ జంప శక్యముగామిఁ దలపోసి చక్కఁగాఁ♦దమ్మునిఁ గని
పలికెఁ బూరుషవర్య!♦ఖలుఁ డీతఁడెంతయుఁ దపమొనర్చినవాఁడు ♦ దాన వీని
నని నాయుధములచే♦తను జంప శక్యమ్ము గాకయున్నది యట్లు♦గాన వీని

---

1 శీలవాం చ్ఛుచిః-అనిమూలము. శీలవాన్=సదాచారసంపన్నః శుచిః బుజుబుద్ధిః-అని వ్యాఖ్య. 2 మాం హరోత్సృజ్య కాకుత్స్థౌ నమస్తే రాక్షసోత్తమ-అనిమూలము. 3 ధరణ్యాం మేఘసంకాశః-అనిమూలము.

ఆ. ధరణిఁ బాఁతిపెట్టఁ♦దగునట్లు చేయుద
మనియె; దనుజుఁడంత ♦ మనుజవిభుని
పల్కు విని నరేంద్రుఁ ♦ బరమాత్ము రాముని
గాంచి వినయ మొప్పఁ♦గా వచించె. ౧౧ 75

-: విరాధుని పూర్వవృత్తాంతము. :-

క. పురుషవరా! శక్రునితోఁ, సరియగు బలమలరు నీవు ♦ సమయించితి వి
క్కరణిఁ నను నజ్ఞాన, స్ఫురణంబున నేను నిన్నుఁ ♦ బురుషోత్తముఁగన్.

ఆ. మున్నె తెలియనైతి ♦ సన్నుత కౌసల్య, సుప్రజయె యెసంగు ♦ సురహితంబు
చేయఁబూని నీవు ♦ శ్రీపతి విటు రాముఁ, డనఁగఁ బుట్టినాఁడ♦వని యెఱిఁగితి.

క. సరసిజనిలయయె సీతయు, నిరుపమ సద్యశముచేత ♦ నెగడు సుమిత్రా
వరసుతుఁడు నీదు కళయని, పరికించితిఁ దత్త్వమెల్ల ♦ బాగుగఁ దెలిసెన్. ౧౩

క. విను మేను దుంబురుండనఁ, దనరెడు గంధర్వుఁడ నొక♦తగుణమునఁ గుబే
రుని శాపమొంది భయక్రృద్దనుజాంగముఁ బొందినాఁడ ♦ ధరణీనాథా. 79

సీ. అనఘాత్మ! రంభపై ♦ననురాగముం బొంది యక్షేశుకొలువుచే♦యమికినతఁడు
మిగులఁ గోపమునొంది♦తగనిరాక్షసతనుబొందుమాయనిపల్కఁ♦బొంక మెడలి
యతనిఁ బ్రసన్నుఁజే♦యఁగ నమ్మహాయశుం డాదృతి ననుఁ గాంచి♦యనఁ నిదశర
థాత్మజుండగు రాముఁ ♦ డని నెప్డు నినుఁ జంపు నప్పుడె నీరూప♦మంది స్వర్గ

ఆ. మొందఁగల వటంచు ♦ నొయ్యన వచియించె;
నిచట నీదు కరుణ ♦ నేను భయద
మగుచు నొప్పునట్టి ♦ యలశాపమున నుండి
ముక్తిఁ గాంచినాఁడ ♦ ముదముఁ గంటి. ౧౬ 80

క. చనియెద నిఁక నాలోకం, బునకున్ శుభమగుత మీకు; ♦ బుధసన్నుత! యి
వ్వనినుండి సార్ధయోజన, మునఁ దగుదూరమునఁ గలఁడు♦మునినాథుఁడునా.

ఆ. అధికధర్మయుక్తుఁ ♦ డతుల తపశ్శాలి, యర్కతుల్య తేజుఁ ♦ డయి చెలంగు
ధరణిసురవరుండు ♦ శరభంగనామకుఁ, డతనిచెంత కరుగ♦వయ్య వేగ. ౧౮

క. ముని యతఁడు నీకు మేలును, బొనరించును బ్రహ్మపదముఁ♦బొందును నిన్నుం
గని యింక నన్నుఁ బల్లం, బునఁ బూడిచి యవల సేమ♦మున వే పొమ్మా.

క. అసువుల విడనాడిన రాక్షసులకు నిటు పూడ్వఁబడుట ♦ సమధికధర్మం
బు సుమా; భూస్థలి నే రాక్షసుల శరీరములు పూడ్వఁ♦గాఁ బడునో తగన్.

క. వారికి శాశ్వతలోకము, లారూఢిగఁ గలుగునని మ♦హాబలుఁ డతఁ డిం
పారఁగఁ బల్కుచు రాము గభీరశరావళులచేతఁ ♦ బీడితుఁ డగుచున్. ౨౧

క. తనతనువు విడిచి స్వర్గం, బును బొందినవానిరీతిఁ ♦ బొలిచెన్; రాముం
డును వాని వాక్యమున్ విని, యనుజాతునిఁ గాంచి యిట్టు♦లను నాదృతిమై.

సీ. రౌద్రగజంబు క♦రణి భయంకరకర్ముఁ డైన యీతనికి ని♦కానకమునఁ
దగినంతబిలమును♦ద్రవ్వుమా యనిపల్కి వీర్యంబు చెలువార♦వెలయు రాముఁ
డవ్విరాధుని కంఠ♦మందుఁ బాదమ్మూంచి నిలుచుండి యుండెన♦ప్పలుకువినుచు
నత్యుత్తమ ఖనిత్ర♦మప్పుడె కైకొని యమితదేహము గల్గు♦నతనిపార్శ్వ
తే. మున నె గొప్పబిలంబుఁ ద్ర♦వ్వెను; రఘుపతి
యతని కంఠంబునందున్న♦యంఘ్రిఁ దీసి
కొనినవాఁ డట్టె యార్చుచుఁ♦గుంజరంబు
కరణి మేకులవలెఁ జెవు♦లురుతఁ జూప. ౨౬ 87

క. వని నెల్ల మాఱుమ్రోయం, గను జేయఁగ నతనిఁబట్టి♦కడఁకన్ బల్లం
బున నందుం బడవైచిరి, ఘనబల మేర్పడఁగ భూమి♦కాంత తనూజుల్. ౨౭

చ. అతిశయశౌర్యవేగముల♦నాహవమందు జయంబుఁ గాంచు నా
క్షితిపకుమారు లిద్దఱును♦గేవలమోదమునంది భీకరా
కృతిగల యావిరాధుని జ♦యించి యతండొగి నార్భటింప ను
ద్ధతి బిలమందు వైచిరి ని♦తాంతము దోర్బలసారముల్ దగన్. ౨౮ 89

సీ. ఎట్టి కార్యంబుల♦నేని చేయంగల నైపుణ్యములఁ దగు♦భూపతనయు
లాపురుషర్షభు♦లాదనుజుని మహాకాయు శస్త్రాభేద్యుఁ♦గా నెఱింగి
యిదియె వానివధింపఁ♦గఁదగు నుపాయనుం చెంతయు యోజించి♦వింతరీతి
బిలమునఁ బూడ్చి యా♦భీకరతనువును విడువంగఁ జేసి; రీ♦విధిని గాన
తే. నమునఁ జరియించు రాముఁడు♦నైజమ్మృతిని
గోరి బిలమునఁ బూడ్వఁద♦గున్ దగునని
యాయుధావధ్యతనుఁ దెల్పి♦యట్టి పనిని
దా నె యసురుఁడుఁ దెల్పెఁగాఁ♦దాను నట్లె. ౨౯ 90

క. ఒనరుప నెంచెను నట బిల,మున బలమునఁ బూడ్చు తరుణ♦మున వాఁడెంతో
ఘనరవము నిగుడ నఱచెను, వనమెల్లను మాఱుమ్రోగ♦భయద గళమునన్.

చ. మనముల మోదమంది యణు♦మాత్రము భీతియనంగ లేక య
వ్వనమునఁ దచ్ఛరీరమును♦[1]శ్వభ్రమునం దగఁ జావవైచి యా
తనితనువెల్లఁ బ్రస్తరవి♦తానముచేతనె గప్పిపుచ్చి యొ
య్యనఁ బులకావృతాంగులయి♦హాటకచిత్రితచాపధారులై. ౩౧ 92

క. దనుజుని ననిఁ జంపి ధరా, తనయం జేకొని మహాము♦దంబున నభ్రం
బున నున్న రవినిశాకరు, లనఁగా విహరించుచుండి♦రవ్వనసీమన్. ౩౨ 93

నాల్గవ సర్గము సంపూర్ణము.

---

1 శ్వభ్రము=రంధ్రము.

## ౫ - వ సర్గము.

### శరభంగాశ్రమ గమనము.

క. తరువాత రామచంద్రుఁడు, పరాక్రమోపేతుఁ డగుట ♦ భయకృద్దనుజున్
మరణము నొందించి వసుం,ధరతనయన్ గౌఁగిలించి ♦ తగుమాటలచేన్. ౧

క. కలఁకం దేరిచి తేజో, జ్జ్వలితుండగు తమ్మునిఁగని ♦ వనమిది కష్టం
బులకాకరంబు దుర్గమ,ములు తావులు; వన్యకష్ట♦ముల మనమెపుడున్. ౨ 95

క. అనుభవమున నెఱుఁగము కా,వున శరభంగుండు మౌని ♦ భూపతి వసియిం
చిన వనమున కతివేగమ, చనుదము పయనంబు చేయుఁ♦జను మన కనుచున్.

క. వరతపముబలిమి పరమే,శ్వరు సాక్షాత్కారమొంది ♦ శత్రుప్రభావ
స్ఫురణమున వెలయుచుండిన, శరభంగునివాసమునకుఁ♦జనియెన్ ద్వరఁగాన్.

క. శరభంగాశ్రమమునకుం, బరిసరమున మిగులఁ గాంతి ♦ వఱలు తనువుతో
నరుణశశాంకులభంగిగ, నరుదుగఁ గన్పడెడు వస్తు♦వలరన్ గనియెన్. ౫ 98

సీ. అద్ది గొప్పది యయి ♦ యగపడె నంతట రాముఁ డచ్చటికిఁ జే♦రంగఁ బోయి
స్యందనంబును దిగి ♦ క్ష్మాస్థలిముట్టక విబుధులు గొలుచుచు ♦ వెంట రాఁగ
నాశ్రమపరిసర♦మందున్న దివిజేశుఁ గాంచె; నయ్యింద్రుండు ♦ కాంతివెలయు
నాభరణంబుల ♦ నంగంబు చెలువార భాసిలి నిర్మలాం♦బరములఁ దగఁ

తే. గట్టుకొనియుండె నారీతిఁ♦గాఁగ వెలయు
సురలు మహిమాధికులు కొంద ♦ ఱురుతరముగ
నతనిఁ బూజించుచుండి ర♦య్యాశ్రమపరి
సరముననె నింగిఁ గన్పడె ♦ స్యందనంబు. ౬ 99

క. హరిదశ్వంబులు మెఱయఁగ, నరదం బది తరుణభాస్క♦రాభంబయి యం
బరమున వెలయఁగఁ గాంచెన్, సురుచిరమగు ఛత్ర మచట♦శోభిలుచుండెన్.

తే. పాండురాభ్రమువలె గొప్ప♦ప్రభలు తనరఁ
జంద్రమండలతుల్యమై ♦ సాధుచిత్ర
మాల్యపరిశోభితంబయి ♦ మహిమ వెలయ
నుండె శ్వేతాతపత్ర మొ♦క్కండు దివిని. ౮ 101

తే. చామరవ్యజనంబులు; ♦ చారుదివ్య
హైమదండంబులును నమూ♦ల్యమ్ము లుత్త
మాంగనలు వజ్రి శిరముపై ♦ నల్లనల్ల
నం జలింపంగఁ జేయ నెం♦తయుఁ జెలంగె. ౯ 102

క. వినుతించిరి గంధర్వులు, మునివర్యులు సిద్ధదేవ♦ముఖ్యులు దివిను
న్న నముచిసూదను శ్రుతివా,క్యనికరముల నంత నిర్జ♦రాధిపుఁ డెలమిన్.

సీ. శరభంగమౌనితో♦సరసంపుఁ బల్కులఁ బల్కుచుండఁగ రామ♦భద్రుఁ డతనిఁ
గని లక్ష్మణునకు నా♦తని రథమ్మును జూపి యిట్లనిపల్కె నీ♦వి దె నభంబు
నందు నర్చిష్మంత♦మై సిరిపెంపున నలరి యద్భుతమయి ♦ యతిశయముగ
భాసిల్లు మధ్యాహ్న♦భాస్కరుగతి నొప్పు నరదంబుఁ జూడుమా ♦ యాఁగకర్త

తే. లలరి పలుమఱు వాసవు ♦ నశ్వములను
బిలువ వినియున్నవార, మె♦వ్విధిగ నుండు
నో యటంచివిగో యవ్వి♦యే యిట నభ
మందు నున్నవి ధ్రువముగ ♦ సుందరముగ. ౧౮ 104

సీ. పురుషవర్యులు వీరె ♦ సురుచిరకుండలంబులను దాలిచి వయ♦స్సులఁ జెలంగి
బహువిశాలములైన ♦ వక్షస్స్థలంబులు పరిఘాయతములగు ♦ బాహువులును
వెలయు రక్తాంబరం♦బులఁ గట్టి వ్యాఘ్రంబు లట్లు చేరఁగరాక ♦ యతులఖడ్గ
ములు కరంబులఁదాల్చి♦యలస్యందనముచుట్టుఁ బ్రతిదిక్కునందును♦శతపరిమిత

తే. ముగను నిలుచున్నవా రన♦లుగతి వెలుఁగు
హారములు వక్షములనెల్ల ♦ వారికిఁ గల
వరయ వీరెల్ల నిరువది♦యైదు వత్స
రముల ప్రాయంబు గల్గు వా♦రలు ధ్రువంబు. ౧౯ 105

క. అనవరత మీవయస్సె, కనఁబడు దేవతలయందుఁ ♦ గవ్రాభరణా
దినిఖిల [1]కలాపములఁ దగి, కనుపండువు గాఁగ వీరు ♦ కనఁబడురీతిన్. ౧౯౪

క. సురలు కనుపట్టుచుందురు, ధరాసుతను గూడి యిచటఁ ♦ దగ నిల్వు సహో
దర! యొకముహూర్తమాత్ర, స్ఫురిగెదఁ దేజస్వి యెవ్వఁ♦డాతఁడొ తెలియన్.

చ. అరదమునందు నున్న సుమ♦హాత్ముని స్పష్టముగా నెఱింగి నీ
పరిసర మేను జేరెద జ♦వంబున; నంచు వచించి [2]వీడ కా
దరమున వెంటవచ్చు తన♦తమ్ముని నుండుమటంచుఁ బల్కి తా
దరలి మునీశ్వరా[3]వసథ♦తల్లజ ముండెడుచోటి కేగఁగన్. ౨౦ 108

చ. సురపతి రాముఁ డాశ్రమముఁ ♦ జొచ్చుటఁ గాంచి జవంబునన్ మునీ
శ్వరుశరభంగుఁ జేరఁజని ♦ సంతసమొప్ప రహస్యరీతి మా
నిరమణ! యల్లవాఁడె వ్రత♦నిష్ఠుఁడు రాముఁడు వచ్చుచున్నవాఁ
డరయ నితండు స్వీయవిధి♦నంతయుఁ దీరిచి యాందటం దగన్. ౨౧౪ 109

క. ననుఁ గాంచి మాటలాడం, జనుఁ దన కార్యములనెల్లఁ ♦ జక్కఁగఁ దీర్పం

---

1 కలాపములు=భూషణములు. 2 తమేవముక్త్వా సౌమిత్రి మిహైవ స్థీయతా మితి-అని మూలము. 'విరహాసహిష్ణుతయానువ్రజంతం లక్ష్మణం పునః ప్రదిశ్య జగా మేత్యాహ తమేవమితి.' అనివ్యాఖ్య. దీనియర్థమే ''వీడ కాదరమున వెంటవచ్చు'' అని తెనిఁగింపఁబడినది. 3 ఆవసథము=ఆశ్రమము.

జనుఁ గాన నిప్డు చూడం,గను దగ దాడటను జూచుఁ♦గాకని మఱియున్.౨౨

చ. దనుజునిఁ జంపి నిర్జరహి♦తంబగు కార్యముఁ దీర్చి యాతఁడుం
డినతఱి నీతనిన్ సుకృతి ♦ నేనుఁ గనంగల; నెంతమాత్ర మే
మనుజులకే నసాధ్యమగు ♦ మానితకార్య మితండు చేయఁగాఁ
జనుఁగద దానిఁ దీర్చి మఱి ♦ సంతసమొప్పఁగ నన్నుఁ జూచెడిన్.౨౩ 111

క. అరిసూదనుఁ డా త్రిదశేశ్వరుఁ డివ్విధి గౌరవించి ♦ జానకినాథున్
శరభంగునిఁ బూజించి స్వపురికరిగెన్ సాశ్వుఁడగుచుఁ ♦ బొలుచు రథముపై.

-శరభంగుఁ డగ్నిప్రవేశముఁ జేసి బ్రహ్మలోకమున కరుగుట.-

క. దేవాధీశుం డివ్విధిఁ, బోవన్ రాఘవుఁడు జనక♦పుత్త్రిని ననుజున్
రావించి వారితో ముని, భూవిభునిం గనెడు వేడ్కఁ ♦ బోయె నచటికిన్.౨౫

క. జ్వలను నుపాసించుచు నా, జ్వలనుం జొచ్చుటకు నున్న ♦ శరభంగునిఁ దో
య్యలియును రాముఁడు లక్ష్మణుఁ,డలరుచుఁ బాదములఁబట్టి♦యతిశయభక్తిన్.

ఆ. వందనములు సలుప ♦ వారలఁ గూర్చుండఁ
బనిచి సత్కరించె ♦ మునివరుండు
వార లతనియాజ్ఞఁ ♦ గూరుచుండిరి; రాముఁ
డంత నింద్రువార్త ♦ నడిగె మునిని. ౨౭ 115

సీ. శరభంగుఁ డంతట ♦ జంభారి వృత్తాంత మెల్లఁ జెప్పంగఁ దా ♦ నెంచి రామ!
వరదుఁ డీనిర్జర ♦ వల్లభుఁ డేఁ జేసినట్టి యుగ్రతపోని♦యతిని నాకుఁ
బ్రాప్తించి యాత్మవి♦ద్వర్యులకేఁగాని యన్యుల కలవిగా♦నట్టి బ్రహ్మ
పదమునకుం బ్రీతి♦గదుర నన్ దోడ్కొని చనఁగోరుచున్నాఁడు♦మనుజవర్య!

తే. వినుము నీవిందు నికటంబు♦ననె మెలంగు
వాఁడ వనియే యెఱింగి నిన్ ♦ జూడకిట్టు
లేగరాదు ప్రియాతిథి ♦ వెన్న నీవ
టంచుఁ దలపోసి మానితి ♦ నచటి కరుగ. ౨౮ 116

సీ. పురుషవర్యుఁడవయి♦పొలిచి ధార్మికుఁడవై జగముల కాధార♦ముగఁ జెలంగు
వాఁడవై నిర్జర♦వల్లభుఁడవు నయి పరమప్రమోదరూ♦పమున నెనఁగు
సీతోటికూడిక♦చేత బ్రహ్మానంద మనుభవించుచు స్వీయ♦మైన కర్మ
వశమునఁ బొందనౌ ♦ బ్రహ్మలోకమ్మును సురసేవితంబును ♦ జొచ్చువాఁడ;

తే. నరవరా! బ్రహ్మలోకము♦నను సురపురి
నక్షయములయి భోగసా♦ధ్యంబు లౌ ప్ర
దేశములనెల్ల నేను సా♦ధించినాఁడ
వాని నర్పింతు గ్రహియింప ♦ వలయు నీవు. ౩౦ 117

చ. అనుటయు శాస్త్రసంతతుల ♦ నన్నిఁటి నేర్చి నరేంద్రుఁడైన య
య్యనఘుఁడు రామచంద్రుఁ డిటు ♦ లమ్ముని పల్కిన నాలకించి యా
తనిఁ గని మౌనివర్య! ప్రమ♦దంబున మీర లొసంగినట్టి లో
కనిచయ మేన పూన్కి తగఁ♦గాఁ దమిఁ జేకొనువాఁడ నెంతయున్. ౩౩ 118

క. అలరుచు నిట నీచూపెడు, స్థలమునె యావాసమునకుఁ ♦ జక్కనిదిగ ని
మ్ములఁ జేసికొనఁగఁ గోరెదఁ, దెలుపుమ యన మౌనినికర♦దేవేంద్రుండున్.

క. సరసమతి, ప్రాజ్ఞవర్యుఁడు, శరభంగుఁడు దేవనాథ ♦ సమబలుఁడౌ రా
డ్వరుఁడిట్లు పల్కె నిట్లనుఁ, గర మనురాగమ్ము పొంగఁ♦గా రఘువర్యా!. ౩౪

క. వనమున నిందు సమీపం,బున నే ధర్మమతి తేజ♦మున మించెడు పా
వనమూర్తి సుతీక్ష్ణుండను, మునిగలఁ డాతండు శ్రేయ♦మును మీకొసఁగున్.

చ. చనుమల మౌనినాయకుని ♦ సన్నిధి కీవతఁ డంత నీకు ని
వ్వనమునఁ జాల నందమయి ♦ పావనమైన ప్రదేశమెన్ని నీ
కనువగు వాసభూమిగ మ♦హాత్మ! రఘూద్వహ నిర్ణయించు *గం
గను గను మిద్ది తూర్పుదెసఁ♦గాఁ బ్రవహించెడుఁగాన నిత్తఱిన్. ౩౬ 122

క. విను దీనికెదురుగా నీ,వును బశ్చిమదిశకు సరిగఁ ♦ బోవు పథమునన్
జనుమా! యొకపరి నదిచెం,తను మఱియొకచోట దూర♦తలమున జననౌ.౩౭

సీ. పూవులు తెప్పల ♦ పోలిక నీనదిఁ దేలుచుండును జూడఁ ♦ జాలవింత
గానుండు నందందు;♦మానవనాయకా! యిదిగొ పోయెడుమార్గ♦మిందుసుంత
నిలిచి నన్గనుచుండు ♦ మెలమి మీఱఁగ నీవు ఫణి కుబుసంబును ♦ వదలునట్టు
లీ జీర్ణకోశంబు ♦ నేను విడిచెదనం చీరీతిఁ బల్కి యా♦యిద్ధతేజుఁ
తే. డంతటన్ బ్రహ్మమేధమం♦త్రాళిఁ జదువు
చును శుచిన్ ఘృతమును వేల్చి ♦ చొచ్చె నగ్ని
నంతఁ దత్కేశములు జీర్ణ♦మైనచర్మ
మస్థులున్ రక్తయుతమాంస ♦ మనలునందు. ౪౦ 124

తే. దగ్ధమయ్యెను ధీరుఁడై ♦ తనరు రాముఁ, డవనిజాతయు లక్ష్మణుఁ ♦ డధికవిస్మ
యంబు నొందిరి; శరభంగుఁ ♦ డగ్నిరీతి, నలరి ముప్పదియేండ్లవ♦యస్సుగలిగి.

చ. అనలునినుండి లేచి విమ♦లాయతతేజముతో వెలింగె న
మ్మునివరుఁ డాహితాగ్నిగణ♦ముఖ్యులు, మౌనిశిఖామణుల్ సురల్
గనఁదగునట్టి లోకములఁ ♦ గ్రన్నన మీఱుచు బ్రహ్మలోక మొ
య్యనఁ జని పొంది యందుఁ గనె ♦ నబ్జభవున్ బరివారయుక్తునిన్. ౪౩ 126

---

* ఇమాం మందాకినీం రామ ప్రతిస్రోతా మనువ్రజ-అని మూలము. 'మందాకినీశబ్దః పుణ్య నదీమాత్రే మునిభి రుపచర్యతే.' అని గోవిందరాజులు.

తే. పుణ్యకర్ముఁడు బ్రాహ్మణ♦పుంగవుండు
నైన శరభంగుఁ గాంచి యా♦యబ్జయోని
యధికముదమంది స్వాగత ♦ మడిగి తగిన
భంగిఁ బూజించి యలరించె ♦ బహువిధముల. ౨౨ 127

ఐదవ సర్గము సంపూర్ణము.

---

## ౬ - వ సర్గము.

మునులు రాముని శరణుఁ జొచ్చుట, దనుజులం జంప రాముఁడు ప్రమనుట.

క. శరభంగ మౌనినాథుఁడు, సరసిజభవు లోకమునకుఁ ♦ జన నందలి మౌ
నిరమణు లొక్కటిగా వచ్చిరి తేజశ్శాలి రామ♦శీతాంశుఁ గనన్. ౧ 128

సీ. వైఖానసులు మఱి ♦ వాలఖిల్యులు శరీరాంతరభాగంబు ♦ లరసి కడిగి
పరిశుద్ధముగఁ జేయు♦పరమర్షులును, సూర్యచంద్రకాంతులఁ ద్రాగి♦సమయమెట్లొ
గడుపువారును, శిలా♦కాండంబుచే దేహమును గొట్టుకొనునట్టి♦మునులు, పత్ర
ములఁ దిని జీవించు ♦ మునులును, పళ్లు మొదలగువానిని గొని♦దంతములనె
తే. నమలి జీవించువా రుద♦కమును గంఠ
దఘ్నముగఁ జేసికొని నిష్ఠఁ ♦ దపముచేయు
వారు భుజములపయిఁగాని ♦ వక్షమందుఁ
గాని తలలుంచి నిదురింపఁ ♦ గల్గు మునులు. ౨ 129

సీ. నిదుర యే యెఱుఁగక ♦ నిష్ఠ నుండెడివారు బయలనుండియె చలి♦వలని బాధ
లనుభవించుచుఁ దపం♦బును జేయువారునుజలభక్షకులు వాయు♦వులనుగ్రోలు
వార లాకాశ మా♦ధారంబుగా నిల్చి యుండువా రిలను బ♦రుండువారు
వ్రతమునకయి యుప♦వాసంబు నిత్యంబు సల్పువా రార్ద్రవ♦స్త్రముల నెపుడు
తే. గట్టువారును దాంతులు ♦ కడఁగి వివిధ
మంత్రముల జపియించు స♦న్మతులు వేద
పాఠకులు గ్రీష్మమున నగ్ని♦పంచకాంత
రముననుండి తపంబు సే♦యు మును లపుడు. ౩ 130

క. వారెల్ల బ్రహ్మతేజం, బారూఢిగ వెలయ యోగ♦మందు దృఢరతిన్
జేరిన మనముల సుస్థితు,లై రయమున నచట నున్న ♦ యారఘురామున్. ౪

క. కనఁబోయిరి ధర్మజ్ఞులు, ఘనమతులును నైన మౌని♦కాంతులు ధర్మం
బు నెఱింగి చాపధరులం, దును మేటిగ నున్న యతని♦తోఁ గడుఁ బ్రాఙ్కిన్.

సీ. పలికి రిట్లని భక్తి పరులయి యోరామ! యోమహారథ! సుర♦వ్యూహముఖ్యకు
శక్రునిరీతి ని♦క్ష్వాకుకులంబునకును భూమికిని నాయ♦కుఁడవు నీవు

కావు సుమీ! లోక♦కాండరక్షణధారణములకు నీవె న్యా♦యముగఁ గర్త
నగుటచేఁ గీర్తి శౌ♦ర్యములచే సకల జగంబుల విఖ్యాతిఁ ♦ గాంచినాఁడ
విట్టి లోకేశుఁడు ♦ వీవు క్షత్త్రియరూపమున భూస్థలంబున ♦ జననమంది

తే. నాఁడ వటులౌట జగముల ♦ న్యాయబోధ
మునకు సూనృతవచనత్వ♦మును బిత్యా_క్తి
పాలకత్వము ధర్మమీ ♦ వరున నివ్వి
గానఁబడియెడు నీయందు ♦ మానివరద!. ౩ 133

క. శరణాగత రక్షణమును, బరికించి యెఱింగి దానిఁ ♦ బరిపాటిగఁ జే
యురతిం గని యున్న కృపా, కరచిత్తుఁడ వీవు నాథ! ♦ కావున నెలమిన్. ౩౪

క. నినుఁ గాంచి శరణుఁజొచ్చుట, యనూనమగు కార్యసిద్ధి ♦ కాధారంబౌ
మనముల నార్తియె మిక్కిలి, కనుకన్ వేఁడెదము దాని♦క్షమియింపఁదగున్.

క. బలిగా షడ్భాగముఁ గొని, యిలాధిపతి యెవఁడు ప్రజల♦నెల్లఁ గొడుకులన్
వలెఁ గావకుండునో యి,మ్ముల నతని కధర్మ మొదవు ♦ మునిజనవరదా!. ౧౧

మ. ధరణీశుం డెవఁ డెల్లకాలము ప్రయ♦త్నంబూని ప్రాణాళి నె
వ్వరుసం గాచునో యంతకంటె ముదమున్ ♦ వర్ధిల్లఁగాఁ జేయు భా
సురపుత్త్రావళి నెట్లుగాచునో మహా♦శూరత్వ మేపార న
క్కరణిన్ స్వీయధరన్ వసించు ప్రజలం ♦ గావందగున్ రాఘవా!. ౧౨౪

క. విను మీ రీతిం గాచెడు, జనపతి చిరకాల ముండఁ♦జాలిన కీర్తిం
గనుఁ బిదప బ్రహ్మలోకం, బును బొంది సమర్చితుఁడయి ♦ పొల్చుం జుమ్మీ.

సీ. పన్నిచ్చు ప్రజల నే♦ప్రభువు రక్షింపనౌ బలియీయలేని మా♦నుల నదెట్లు
రక్షింపఁదగునని ♦ రాఘవా! యందువో? ఫలమూలముఖముల ♦ భక్షణంబు
సేయు మానివరుండు ♦ చేయు మహాధర్మమునను ధర్మంబున♦జనులఁ గాచు
పతికి నాలవదగు ♦ భాగంబు గలదు, కావున వీరిఁగూడఁ బ్రో♦వనగుఁ జుమ్ము

తే. వచ్చినారు వానప్రస్థ♦వరులు వీరె
బ్రాహ్మణులు. వీరియం దెక్కు♦వగఁ జెలంగు
వారు, వీరలకెల్లను ♦ బ్రభుఁడ వీవ
యిట్టులుండి యనాథుల♦యట్టు వీరు. ౧౫ 139

క. పలుభంగుల రాక్షసబా,ధలఁ బొందుచు నున్నవారు; ♦ తగనటు రమ్మా
యలయక యాత్మధ్యానం, బులు సేయు మునీంద్రసంఘ♦ముల దేహంబుల్.

క. దనుజులు దునుమఁగ నెల్లెడ, వనమునఁ బడియున్న వెన్నొ♦వసుధానాథా
కనుమా! పంపాతీరం,బున గంగాతీరమందుఁ ♦ బొల్చెడు మునులన్. ౧౬౪

ఆ. చిత్రకూటనామ♦శిఖరంబునం గల, మునుల దనుజులెల్ల ♦ వనటఁ గుంద
హింస చేయుచుంద ♦ రెప్పు డీరీతి భ,యంకరమ్ములైన ♦ యట్టిపనుల. ౧౭

ఆ. పట్టుపట్టి యిట్లు ♦ వనముల దనుజులు
మునుల కార్తిఁ గూర్పఁ ♦ గనుచు నున్న
మాకు నేమి యోర్పఁ♦గాక యున్నది రామ!
శరణుఁ జొచ్చినాము ♦ సరగ నిన్ను. ౧౮ 143

క. విను సర్వశరణ్యుండవు, గనుకన్ దనుజాళి మమ్ముఁ ♦ గడఁక వధింపన్
వనటన్ బొందుచు నున్నా, మనఘా! కాపాడవయ్య! ♦ యార్తశరణ్యా. ౧౯

క. నరపతితనయా! వీరా, ధరణిన్ నీకంటెఁ గలదె ♦ తగుగతి మాకున్
సురరిపులనుండి మమ్మున్, గరుణన్ రక్షింపవయ్య! ♦ కరుణామూర్తీ!. ౨౦

చ. అని వచియింప ధర్మమతి ♦ యా రఘురాముఁడు గొప్పదౌ తపం
బునఁ జెలువారు నమ్మునులు ♦ భూరితరార్తిని నిట్లుపల్కఁగా
విని తమి వారితో ననియె ♦ విశ్రుతనిష్ఠల నున్న మీరు న
న్ననని యిటు పల్కఁగాఁ దగునె ♦ కారుణికోత్తములార! చెప్పరే. ౨౧ 146

[1]సీ. నన్ను నాజ్ఞాపించు♦టన్న న్యాయము మీకుఁ గాని ప్రార్థింపంగఁ♦గాదునిజము
దనుజబాధలనుండి ♦ తలఁగించి కాపాడు పని నాయదియె యిట్టి ♦ పనికిబట్టి
యే నేను వనమున ♦ కేగుదెంచితిఁ, బితృవాక్పాలనముచేయ ♦ వచ్చినాఁడ
నందురా పితృవాక్య ♦ మనునది వ్యాజమే భక్తుల రక్షించు♦పనియె నాది
తే. కాన మీ కార్యములనెల్లఁ ♦ గడఁగి చేయ
వచ్చినాఁడను రాక్షస♦వ్రజముఁ ద్రుంతు
మీకు సౌఖ్యముఁ గల్గింతు ♦ నాకు నిదియె
చేయఁదగినట్టి కార్యంబు ♦ సిద్ధమిద్ది. ౨౩ 147

క. మనమున మీపని నెఱవే,ర్పను దలఁచియె వచ్చినాఁడ ♦ స్వచ్ఛందముగాఁ
గనుక వనవాస మిది నా, కనుపమఫలదాయకంబె ♦ యగు మునులారా!.

చ. మునులకు వైరులౌ దనుజ♦ముఖ్యులనెల్ల ననిన్ వధించువాం
ఛను గనుచుండు నామనము ♦ సత్తపమే ధనరాశిఁగా మనం
బునఁ దలపోయు మీరలిదె ♦ భూరిపరాక్రమ మస్మదీయ మీ
యనుజునిశౌర్యసారమును ♦ నాదృతిఁ జూతురుగాక చక్కఁగన్. ౨౪ 149

చ. అనిహతవిక్రముండు మహి♦మాఢ్యుఁడు ధర్మమునందె పూన్కితోఁ
దనరెడు రాఘవుండు ముని♦తల్లజపూజ్యసువృత్తి గల్గుఁ గా
వున నభయమ్ము మౌనులకుఁ ♦ బొంగుచు నిచ్చి సహోదరుండు రాఁ
జనియె సుతీక్ష్ణమౌనిపతి ♦ సన్నిధికెంతయు వేడ్క మీఱఁగన్. ౨౬ 150

ఆఱవ సర్గము సంపూర్ణము.

---

1 ఈఘట్టమున రాముని యుత్తరమునఁ గల యర్థచమత్కారము వ్యాఖ్యానుసారమని తెలియుఁదగు.

## ౭ - వ సర్గము.

### రాముఁడు సుతీక్ష్ణమునిం జూచుట.

చ. పరభయదుండు రాఘవుఁడు ♦ భ్రాతను సీతను గూడి బ్రాహ్మణో
త్కరములు వెంటరాఁ గదలి ♦ కమ్రగతు ల్దగఁగా సుతీక్ష్ణభూ
సురముని యాశ్రమస్థలముఁ ♦ జూడఁగఁబోయెను; దూరమేగి పు
ష్కరములఁ బూర్ణమై పరఁగు ♦ శైవలినీమణి జాహ్నవీనదిన్. ౧ 151

తే. పెక్కుతావులఁ దరియించి ♦ యొక్కచోటఁ
బర్వతంబును, దానిపా♦ర్శ్వమున వెలసి
యంబుదమురీతిఁ గార్కొన్న ♦ యడవిఁ గాంచె,
నంత భ్రాతలు సీతయు ♦ నవ్వనమ్ము. ౨ 152

చ. పలువిధవృక్షసంతతుల ♦ భాసిలు దానిని జొచ్చి; రంత న
య్యలఘుబలుండు రామవిభుఁ ♦ డప్పుడు పూవులుఁ బండ్లు గల్గు శా
ఖలు గల చెట్లు భీతిదము♦గాఁ దగు నవ్వనిఁ జొచ్చి యందు వ
ల్కలములఁ జాలుగా నిడఁగఁ ♦ గన్నుల కింపగు సత్కుటీరమున్. ౩ 153

సీ. ఏకాంతముననుండి ♦ యెసఁగు దానింగాంచె: నందుఁ దపోవృద్ధుఁ♦డై సుతీక్ష్ణుఁ
డనునామమున నొప్పి♦యభ్యంజనాదులు కలుగమి మలపంక♦కలితుఁ డగుచు
జడలు దాలిచియున్న ♦ సన్ముని నాసీనుఁ గనియె వృద్ధుండౌటఁ ♦ గానఁ జాల
కున్న యాతనితోడ ♦ నోమహాత్మా! నీవు ధర్మవేత్తవు మహా♦త్తరతపోవి

తే. భూతి గలవాఁడ వే రఘు♦భూపకులజుఁ
డనుగదా రాముఁడనువాఁడ ♦ నినుఁ గనంగ
[1]వచ్చినాఁడను మ్రొక్కెద ♦ బదులు మ్రొక్కు
మనుచుఁ బ్రార్థించె; నంత మ♦హర్షి యతఁడు. ౬ 154

క. వీరుఁడు ధార్మికసత్తముఁ, డా రామునిఁ గౌఁగిలించి ♦ యతిదృఢముగ నో
వీరాగ్రణి! స్వాగత మి,ట్లో రామా నీవు ధార్మి♦కోత్తముఁడవు సూ. ౭ 155

తే. నీవు వచ్చుటచేతనే ♦ పావనముగఁ
దనరు నీయాశ్రమము సనా♦థంబు నగుచు
వెలయుచున్నది; నేనును ♦ వీరుఁడవగు
నిన్ను దర్శింపఁగోరుచు ♦ నున్నవాఁడ. ౮ 156

[2]సీ. రావణుఁ జంప ధ♦రాస్థలి నవతార మందినాఁడవు, తండ్రి♦యాజ్ఞ రాజ్య

---

1 త్వం మాభివద ధర్మజ్ఞ మహర్షే సత్యవిక్రమ-అనిమూలము. 'అభివద=ప్రత్యభివాదనం కురు' అని వ్యాఖ్య. 2 ప్రతీక్షమాణ స్త్వామేవ నారోహేఽహం మహాయశాః, దేవలోకమితో వీర దేహం త్యక్త్వా మహీతలే-అని మూలము. 'ఏస్తుతస్తు రావణవధార్థం రఘుకులే అవతీర్ణస్య తవ రాజ్యభ్రంశః' అని మహేశ్వరతీర్థులు. దీని ననుసరించియే యీపద్యము వ్రాయఁబడినది. గోవిందరాజు లీ శ్లోకమునకు విశేషార్థము వ్రాయకపోవ నేలొకో యని శంక కలుగుచున్నది.

మును విడనాడి యి♦మ్మొగిఁ జిత్రకూటంబునకు వచ్చినది మొద♦లుకొని యెల్ల
వార్తల విన్నాఁడ ♦ వత్తు వీత్రోవనే యని నీదు రాకనే ♦ మనమునందు
వాంఛించి దానికై ♦ పరమముదంబున వేచియున్నాఁడ; నా♦విబుధపురము

తే. పరమపురుషార్థదంబయి ♦ పరఁగు నీదు
దర్శనమునకు విఘ్నమై ♦ తగును గానఁ
దనువు వదలి యచటికి నేఁ ♦ జనుట మాని
యుండె యున్నాఁడ నినుఁ జూడ ♦ నెంచి రామ. ౯ 157

క. సురపురికే నరిగెడు తెఱఁ, గరయుము శరభంగమునికి♦నై శతముఖుఁ డా
సురపతి వచ్చి తనంతన, యరుగుచు నిట వచ్చి నన్ను ♦ నాదృతి మెఱయన్.

[1]చ. కనుఁగొని నేను బుణ్యమగు ♦ కర్మముచేత సమస్తలోకముల్
పనివడి గెల్చినాఁడ నని ♦ పల్కుచ నేన్; దివిజర్షి సన్నుతిం
గని ఘనయోగనిష్ఠమెయిఁ ♦ గాంచిన మామకలోకపాళి స్వే
చ్ఛను గని మత్ప్రసాదమున ♦ శర్మముగా విహరింపు రాఘవా. ౧౧ 159

క. అనుజన్ముని ధరణీజా,తను గూడి మదీయలోక♦తతి విహరింపం
జను నీకుఁ గరుణమెయిఁ దగ, ననఁగా రాముండు మదిని ♦ నాదృతి దోఁపన్.

సీ. కాశ్యపమునిపతి ♦ కమలయోనిం గాంచి పలికినగతి సత్త♦పమున మించి
సత్యవాదియునగు ♦ సాధుమునీంద్రుతోఁ బలికె నిట్లని లోక♦పటల మేనె
సంగ్రహించుకొనెద ♦ సంతోషమయ్యె నీవచనంబులకు నిట ♦ వనమునందు
నావాసయోగ్యమై♦నట్టి చోటును మాత్రమును జెప్పఁ బ్రార్థించె♦దనుమహాత్మ

తే. పరమచిత్తుండు గౌతమ♦వంశజాతుఁ, డైనశరభంగమునియు, మ♦హాత్ముఁడ వని
భూతహితమతి వని నీదు♦ఖ్యాతి నెల్లఁ, బలికియున్నాఁడు గావునఁ♦దెలిసికొంటి.

క. అని రాముఁడు పల్క జగం,బునఁ గడుఁ బ్రఖ్యాతినొందు♦ముని ముఖ్యుం డా
తనిమాట కతులహర్షం,బున మున్గుచు మధురవాక్య♦ముల రామునితోన్. ౧౪

క. మునులెందఱో యీయాశ్రమ,మున నున్నారిచటఁ గంద♦మూలఫలాళుల్
కనుపట్టు సమృద్ధముగాఁ, గనుకన్ గుణవంతమగుచుఁ ♦ గ్రాలునిది సుమా.

సీ. నివసింపుమా యిందు;♦నిర్మలవిఖ్యాతిసాంద్రా! మృగంబులు♦సంఘములుగఁ
జనుదెంచి దేనికి ♦ జడియక యీయాశ్రమమునఁ జరించుచు ♦ మహితగతి వి
శేషాదులను జూపి ♦ చిత్తసమాధికి భంగంబు గలిగించి ♦ పాఱిపోవు
చున్న పీమృగముల ♦ యుగ్రబాధయె తప్ప నితరదోషంబెద్ది♦యేని లేద

తే. టంచు నెఱుఁగుము; నావిని ♦ యధికధైర్య
మునఁ జెలంగెడు శ్రీరామ♦మూర్తి వింట

---

1 సర్వాన్ కామాన్ జితా నాహ మమపుణ్యేన కర్మణా-అని మూలము.

నారి సంధించి యోముని♦నాథ! నేను
దావకాజ్ఞను శిరమునఁ ♦ దాల్చి యుందు. ౧౯½ 164

క. మునులం గొల్చి వసించిన, ననయము మృగసంతతి సము♦యంజేసెద వ
చ్చినదాని నెల్లఁ బవిసమ, ఘనశితధారాంబకముల ♦ గణములచేతన్. ౨౦½

క. వనమృగముల నిటు చంపం,గ నీకును విషాదమట్టె ♦ గలుగు నపకృతిన్
మునినాథ! నీకు నేఁ జే,సినవాఁడనె యగుదుఁ గాదె ♦ చెప్పఁగవలెనే. ౨౧

ఆ. అంతకంటెఁ గష్ట♦మున నున్నదే నాకుఁ
గాన నిందుఁ జాల♦కాల మేను
నుండఁజాల నవ్వి♦యును గంటఁ బడుదాఁక
ననుచు రాముఁ డతని ♦ యాజ్ఞ నొంది. ౨౧½ 167

చ. సరసుతటంబుఁ జేరి యట ♦ సందెను వార్చి జపించుచుండి య
త్తరుణము పోవఁగా మరలి ♦ తన్మునివాసము రమ్యమాట రా
తిరి యట నిల్వఁగోరుచు స♦తిం దనతమ్మునిఁ గూడి వాస మా
దరము చెలంగఁ జేసె; ముని♦తల్లజుఁడైన సుతీక్ష్ణుఁ డంతటన్. ౨౩ 168

ఆ. సందె గడచిపోయెఁ ♦ జనుదెంచె రాతిరి
యనుచు నమ్మహాత్ముఁ ♦ డాదరమునఁ
బురుషవర్యులగుచుఁ ♦ బొలుచు రాఘవులను
శాస్త్రరీతి మిగుల ♦ సత్కరించి. ౨౩½ 169

క. ఫలములు దుంపలు మొదలుగఁ, గలవానిని మునుల కింపు♦గాఁ దగు వానిన్
గలయం జేరిచి నాఁటికి, లలితాహారమును దాఁ జె♦లంగుచు నొసఁగెన్. ౨౪

ఏడవ సర్గము సంపూర్ణము.

---

## ౮ - వ సర్గము.

రాముఁడు మునుల యాశ్రమములఁ జూడఁ బ్రయాణమగుట.

క. అనుజునితో రాముం డ,మ్మునివరుచేఁ బూజితుఁడయి ♦ మునియాశ్రమమం
దు నిశం గడపి ప్రభాతం,బున మేల్కానెఁ దగినకాల♦మున నాపిదపన్. ౧

తే. కలువతావులఁ బొలుచు శీ♦తలజలముల
జానకిం గూడి కావించె ♦ స్నానకృత్య
మంతకున్ ముందె లక్ష్మణుం ♦ డప్పని నొన
రించియే యుండెఁ; దరువాత ♦ నంచితముగ. ౨ 172

సీ. మునిశరణ్యంబయి ♦ తనరు నరణ్యంబునం దఘదూరులై♦నట్టి జనక
జారామలక్ష్మణుల్ ♦ సాంధ్యకృత్యంబగు నగ్నికార్యము యథా♦ర్హముగఁ జేసి

దేవతాయుతుఁడగు ♦ [1]నావాసుదేవునిఁ జక్క నుపాసించి ♦ సరసిజాప్తుఁ [న
డుదయమాటనుగాంచి♦యోగి సుతీక్ష్ణునిచెంతకరిగి యెంతయుమనో♦హరముల
తే. పలుకులొప్ప మహాత్మకా! ♦ పరమపూజ్యుఁ
డవగు నీచేతఁ బూజల ♦ నంది రాత్రి
యంతయుం బుచ్చినారము ♦ హాయిగ నిటఁ
జెప్పి పోవఁగ నిపుడు వ♦చ్చితిమి మేము. ౮౪ 173

క. త్వరపెట్టుచున్నవారీ, పరమమునుల్ మమ్ము భూరి♦వనమున నిటఁ గా
పురముండి పుణ్యశీలతఁ, బరఁగెడు మునులుండు నుటజ♦పంక్తిం జూడన్. ౬

క. మేముం ద్వరపడుచున్నా, మీ మానులు తపము వేర్మి ♦ నెసఁగుచు దాంతిన్
గామవిహీనతఁ దగుచున్, దామగ్నులరీతి గుప్త♦తరమహిమఁ దగన్. ౬౪

క. వెలయుచు మీసమ్మతి నిమ్ములఁ గోరుచు నున్నవారు ♦ మునిగణనాథా!
సెలవిమ్మా! మేమరుగం, గలవారము ప్రొద్దుపొడిచెఁ ♦ గావున నింకన్. 2176

చ. మునివర! దుష్టవంశమునఁ ♦ బుట్టి మహాత్ముల మైత్రి లేని య
మ్మనుజవిభుండు న్యాయమును ♦ మాని విభూతిని సేకరించి పే
ర్మిని గరువంబు గాంచునటు ♦ మిక్కిలి తాపముఁ గల్గఁజేయు నీ
వనజహితుండు గాయఁగల♦వాఁడిక నెండను గాన ముందుగన్. ౮ 177

క. చనఁగోరెద మని రాముఁడు, వనజాక్షియు లక్ష్మణుండు ♦ బ్రాహ్మణమానీ
శునిచరణములకు మ్రొక్కిరి, ముని మ్రొక్కుచునున్నవారి♦ముదమునఁగనుచున్.

ఆ. లేవనెత్తి స్నేహ♦భావంబు వెలయంగఁ, గౌఁగిలించుకొనుచు ♦ గారవమునఁ
బలికె ననుజు [2]నీడ♦వలె వెంబడించు నీ, జనకతనయఁగూడి ♦ చనుము రామ!.

క. సరణి యిఁక నీకు నెంతయు, నిరుపద్రవమగును గాక ♦ నిర్మలయోగ
స్థిరబుద్ధులగుచు నొప్పుచు, నరణ్యమున నిందు నున్న ♦ యమ్మునివర్యుల్. ౧౧౪

క. అనవరతము నివసించుటఁ, గన రమణీయంబు లగుచుఁ ♦ గ్రాలు స్థలములన్
గనుఁగొనుమా మఱి యందలి, వనములు ఫలమూలములును♦భాసిలుచుండున్.

సీ. కుసుమాకరంబులై ♦కొమరొప్పు మఱి యందు సన్నుతికిం దగు♦సాధుమృగము
లెల్ల గుంపులుగూడి ♦ యుల్లసిల్లుచు నుండు నిర్వైరములతోడ ♦ నిఖిలపక్షు
లధికశాంతము గల్గి ♦ యలరుచు నుండును బూచిన సరసిజ♦పూగములయి
స్వాదుతరంబైన ♦ జలము చెలంగఁగఁ గారండవంబులు ♦ గలయఁదిరుగ
తే. నందలి తటాకములు సరో♦బృందములును
వెలయుచుండును, మది కెంతొ ♦ వేడ్కగలుగ

---

1 అథతేఽగ్నిన్ సురాంశ్చైవ-అని మూలము. 'సురాన్ నారాయణం పరివారాపేక్షయా బహువచనమ్' అని గోవిందరాజులు. 2 సీతయాచానయా సార్థం ఛాయయేవానువృత్తయా-అని మూలము.

దృష్టిరమ్యములగు సెల ♦ యేళ్లు బర్హి
నినదములమించు నడవులు ♦ తనరు నందు. ౧౫ 182

క. చనుమా సౌమిత్రీ! నీవును రామా! యరుగుమింకఁ ♦ బొదలు కరుణ న
న్ననుఁగొన నొకపరి నాయీ, వనమునకున్ రావలయును ♦ వదలక వత్సా!. ౧౬

చ. అనిముని చెప్పఁగా రఘువ ♦ రాన్వయుఁ డల్లె యటంచుఁ బల్కి త
మ్మునిఁ దగఁ గూడి భక్తిమెయి ♦ మ్రొక్కి మునీంద్రునకుం బ్రదక్షిణం
బొనరిచి తాఁ బ్రయాణమున ♦ కుద్యమ మొప్పఁగఁ జేసె; నంత భూ
తనయయు సొంపు నింపు కను ♦ వమ్ములతీఱు వెలుంగుచుండఁగన్. ౧౭ 184

క. ఇరువుర కమ్ములపొదలను, నిరుపమచాపములఁ గాంతి ♦ నెగడుచుఁ దగు న
క్కరవాలముల నొసంగెను, ధరణీసురు నాశ్రమమున ♦ దాఁచినవానిన్. ౧౮

ఆ. అంత వారలిర్వు ♦ రమ్ములపొదలను, మూఁపులను ధరించి ♦ మొరయుచున్న
ధనువులను గరంబు ♦ లను బట్టుకొని మాని, యాశ్రమంబు నుండి ♦ యరిగి రంత.

క. సిరి యలరఁగ సౌందర్యము, పరఁగన్ నిజతేజములను ♦ భాసిలుచున్ దు
ర్భరధనువులఁ దాల్చినవా, రిరువురు జానకిని గూడి ♦ యేగిరి వనికిన్. ౨౦ 187

ఎనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ౯ - వ సర్గము.

*సీత రామునితో రాక్షసులఁ జంప మానుఁ డని మనవి చేయుట.

సీ. ఈవిధమునఁ దాప ♦ సేశ్వరు ననుమతిఁ బడసి యరుగుచున్న ♦ పతినిఁ జూచి
హృదయంగమంబయి ♦ యెంతయు మైత్రికి నాకరంబయి యొప్పు ♦ నట్టి పలుకు
లలరంగ నిట్లని ♦ పలికె నీవూనిన యీమునిధర్మ మెం ♦ తే మహితము
మిగుల సూక్ష్మంబయి ♦ తగినమార్గమున విచారమొనర్చి యీ ♦ సమధికమగు
ధర్మంబుఁ బురుషులు ♦ ధర్మకాములు పొందుదురు; తనయిచ్ఛ చే ♦ సరిగఁగలుగు
ఆ. వ్యసనములఁ ద్యజింప ♦ వలయు నెవ్వరు వాని
మానుదురొ తలంప ♦ దీని వారు

---

* రామా ! నీవాయుధములఁ దాల్చి వనములోఁ జొచ్చిన రాక్షసులు విరోధింతురు. దాన మనకిరువురకు వియోగము వియోగమహాక్లేశము గలుగును. కాఁబట్టి నిరాయుధుఁడవై యుండుట మంచిదని సీత యీసర్గమున బోధించుచున్నదని గోవిందరాజులు. రాక్షసవధప్రతిజ్ఞను మునులయెదుటఁ జేయు భర్తను గాంచి "అహింసా పరమో ధర్మః" అనున్యాయమును మనమున నిడుకొని హింసానివృత్తిని దెలుపఁగోరి లోకదృష్టాంతముగా సీత రాములతో విన్నవించుచున్నదని మహేశ్వరతీర్థులు. ఈయిరువురి భావములో నేది యుత్తమమను విషయము పాఠకులే నిర్ణయించుకొనఁగలరు.

పొందఁదగినవారు ♦ పుడమిని గామజం
బులగు వ్యసనములును ♦ గలవు మూఁడు. ౨౪ 188

క. వ్యసనము లన్నిఁటికంటెను, ననత్యమును జెప్పు టరయ ♦ నతిశయతరమా
వ్యసనము దానికిఁ మించుఁ బ,రసతీసంగమము దు స్త ♦రంబగు నఘమా. ౩

ఆ. పగయె లేకయుండఁ ♦ బరుల హింసించుట
తత్సమానమగును; ♦ ధారణీశ !
యనృతవాక్యమింత ♦ యును బూర్వమీవాడి
నదియె లేదు ముందు ♦ నాఁడఁబోవు. ౪ 190

క. ధరధర్మనాశకరమా, పరదారం గవయ నెంచు ♦ వాంఛ గలుగు నె
క్కరణిఁ నీమది; విను భూ,వర! యన్యకళత్ర విషయ ♦ వాంఛయె నీకుఁ. ౪౫

తే. ఇప్పుడును లేదు పూర్వమం ♦ దెప్పుడేని, కలిగినదిలేదు మనసునఁ ♦ గాని యద్ది
యెప్పుడుం గల్గఁబోదది ♦ యిట్టులుండఁ, గారణము లేకపోలేదు ♦ ధారణీశ.

క. అనయము స్వభార్యయందే, యనురక్తిం గల్గువాఁడ ♦ వతిశయముగ ధ
ర్మనిరతి గలవాఁడవు స,త్యనియతిచేఁ జెలఁగువాఁడ ♦ వౌదువు రామా!.

క. కనుకనె జనకుని యానతి, యన దాఁటక చేసితిట్టు ♦ లతిశయధర్మం
బున సిరిని సత్యమున నొ,ప్పినవాఁడవు రామచంద్ర! ♦ వినుతము నీంద్రా! ౭

క. నెలకొని యున్నది నీయం, దలఘుతరంబైన ధర్మ ♦ మట్లె యుతంబుఁ
నెలకొని యున్నది సుగుణం, బులు వైరాగ్యాదులెల్లఁ ♦ బొలిచి యెసంగుఁ.

సీ. ఓమహాబాహూ! మ ♦ దుక్తంబులో సత్య సంధత్వముఖములౌ ♦ సకలసుగుణ
ములు జితేంద్రియులకు ♦ నలవడియుండు నితరులయం దుండంగఁ ♦ దగవటంచు
నెఱుఁగుదుఁ జూ; విజి ♦ తేంద్రియుండవు నీవు తగినసాక్ష్యము శుభ ♦ దర్శనంబె
పగయనునది లేక ♦ పరుల హింసించుట యతిరౌద్రమైనట్టి ♦ వ్యసన మగును

తే. దీనిఁ బామరులే చేయఁ ♦ బూనుచుందు
రజ్ఞులౌటను నదిచేయు ♦ నట్టి సమయ
మిపుడు సమకూరె నీకు న ♦ దెట్లొ చెపుదు
నాలకింపుము ప్రాణేశ ! ♦ యాదరమున. ౯౪ 196

క. వీరవరా! దండకమునఁ, జేరిన మునివరులఁ గావఁ ♦ జెచ్చెఱ రక్షో
వీరుల ననిఁ గూల్పంగాఁ, బౌరుషమున శపథ మిందుఁ ♦ బల్కితివిగదా. ౧౦౪

సీ. మునులయభ్యర్థన ♦ ముం బట్టియే కాక యనుజునితోడ నీ ♦ వరయ నిందు
లకె చాపబాణంబు ♦ లం దాల్చి దండకారణ్యమ్మునకు రఘు ♦ రామ! పయన
మై వచ్చితివిగాదె ♦ యీవిధి వచ్చుటఁ గని సత్యశపథాది ♦ వినుతసకల
తావకసద్గుణ ♦ తతిఁ గని యీకష్టములు పోయి సుఖములె ♦ ట్లలనడునొకొ

తే. నీకటంచును సాధనం ♦ బేకరణియొ
దీనికంచుఁ దలంప నా ♦ మానసమ్ము
మిగులఁ జింతాకులమ్మయి ♦ మించె నిపుడు
గాన నాభావమును జెప్పు♦దాన మీకు. ౧౨౪ 198

తే. దండకారణ్యమునకుఁ బోఁ♦దలఁచు విషయ
మునను నాకిష్టమే లేదు ♦ వినుము హేతు
వును వచించెదఁ గోదండ♦మును శరములఁ
దాల్చి తమ్మునితోఁగూడి ♦ తరలివచ్చి. ౧౩ 199

క. వని నిందు నీవు చేరఁగ, వనచరులగు రాక్షసులు భ♦వద్దృష్టిపథం
బునఁ బడఁగ వారిపై విశి,ఖనికరమును విడుతుగాదె ♦ క్ష్మాపతితనయా!. ౧౩౪

క. అనలున కింధనములు చెం,తనున్నఁ దేజంబు బలిమి ♦ తగ హెచ్చగున
ట్లు నరపతులకు సమీపం,బునఁ జాపంబున్న తేజ♦ముఁ బలమట్లా. ౧౪౪

క. వినుము మహాబాహూ! [1]గా,థను దీనికుదాహరణముఁ ♦ దగ వచియింతుఁ
మును మృగపక్షులు మెలఁగెడు, వన మొకఁ డతిపావనముగ♦భాసిలుచుండెఁ.

చ. వనమున నందు సత్యమును ♦ బల్కుచు శుద్ధమతిం జెలంగు స
న్ముని వసియించియుండఁ దప♦ముం జెఱుపం దలపోసి యింద్రుఁ డా
తనిదగు పర్ణశాలకును ♦ దా నరుదెంచె భటాకృతిం గరం
బున నొకఖడ్గమూని యటఁ ♦ బుణ్యతపం బొనరించు మానికిఁ. ౧౬౪ 203

తే. ఉత్తమము తీక్ష్ణము౦ నయి ♦ యొప్పుచున్న
కత్తి దాఁపుడు ద్రవ్యమ్ము♦గా నొసంగి
చనియె నమ్ముని దాఁపుడు ♦ ధనముఁ గావఁ
దత్పరుండౌటఁ గత్తిని ♦ దానిఁ గొనుచు. ౧౯ 204

క. తనపైఁగల విశ్వాసం, బున నుంచిన దానిఁ గాఁగ ♦ బుద్ధిఁ దలఁచి తా
వనమునఁ దిరుగుచుఁ బదిలం్బు, గనేఁ దానిం గాచుచుండెఁ♦గడుశ్రద్ధమెయిఁ.

క. మునివరుఁ డాతఁడు ఖడ్గం, బును గావ సమాదరంబుఁ ♦ బూనుటచేఁ దాఁ
దినఫలమూలాదుల దేఁ, జనినపుడెల్లను సఖడ్గ♦చంచత్కరుఁడై. ౨౦౪ 206

క. అరుగుచునుండును దానిఁ, ధరించుచుండంగ నంతఁ ♦ దన్మానితప
శ్చరణసమావృతిగను మతి, వరుసఁ విడనాడెఁ గంటె ♦ వజ్రి కుపథముఁ.

క. పరహింసాకరము భయం, కరమును నగు బుద్ధి మాని♦కాంతున కంతఁ
బరఁగెఁ దత్సంబంధము, నిరతము గల్గుటను ధర్మ♦నియతి చెడుటచేఁ. ౨౧౪

క. తనువే తెలియక ధర్మం, బునఁ బీడితుఁ డగుచుఁ దుదకుఁ ♦ బొందె నరకముఁ

1 పురాకిల మహాబాహో-అనిమూలము.

మనుజేశ! ఖడ్గయోగం, బున నీవృత్తాంతమయ్యెఁ ♦ బూర్వమని బుధుల్.

సీ. పలుకుదు; రగ్నిసం♦బంధమెట్లో యట్లె యాయుధసంబంధ ♦ మనవరతము
వైకారికంబని ♦ వర్ణింతు రార్యులు నీయందు నాకున్న ♦ స్నేహమునను
నాయందు నీకును♦న్న బహుమానంబునఁ దెలిసిన విషయమే ♦ తెలఁపునకును
నేఁ దెచ్చుచున్నాను ♦ నీకు నింతేకాని తెలియనివిషయంబుఁ ♦ దెలుపలేదు

తే. దండకారణ్యవాసులౌ ♦ దనుజవరుల
వైరమేలేక విలుపూని ♦ మారణంబు
సేయుబుద్ధిని బూనఁగ ♦ నేయుపాయ
మునను మానుము తగదది ♦ యనఘ నీకు. ౨౫ 210

క. విను నపకారము లేకయె, ఘనవీరా; ప్రాణిహింస ♦ గావింపఁగ నే
నును సమ్మతింప నట్లే, జనపతు లిఁకఁ బట్టనేల ♦ చాపం బనెదో. ౨౫౹ 211

చ. వనముల సంచరించు ముని♦వర్యులు లోనగువారి కాపదల్
పొనరుపనెంచు వారలను ♦ బోవఁగఁ జేయుచు వారిఁ గాంచుటే
యొనరుప నర్హమైనపని ♦ యుత్తమవీర్యము గల్గి పొల్చు న
జ్జనపతివర్య సంతతికిఁ ♦ జాపము పట్టుట యిందుకే సుమా. ౨౬౹ 212

[1]క. ఆపనికై నను జేతం, జాపమ్మును బూనవలదె ♦ జానకి యనెదో
భూపరిపాలనమునఁ దగుఁ, జాపము; వనమేడ నేడ ♦ శస్త్రవితతియుఁ దా. ౨౭

తే. క్షాత్రమెక్కడఁ దపమ♦దెక్కడఁ దలంప
నివి పరస్పరభేదంబు♦లే యగుఁ జుము
కనుక దేశధర్మంబునె ♦ మనము పూని
యాచరింపఁగఁ దగిన దో ♦ యార్యవర్య!. ౨౭౹ 214

క. వనికిం దగినది తపమే, యనుమానంబేల దాని ♦ నాదృతిఁ జేయం
గనుఁదగు; స్వధర్మమెట్లో, చనుఁగద యని యందువేమొ♦శస్త్రము పూనన్.

చ. మతిచెడుఁ గాన నట్టి పని ♦ మాను మయోధ్యకుఁ బోయినంత భూ
పతిహితధర్మముం గొను; త♦పంబులె చేయుచు రాజ్యవాంఛ సం
తతము త్యజించి సన్మునివి♦ధంబున నుండువయేని నైక భూ
పతియును నక్షయప్రమద♦భారము పూనుదు రాత్మలం దగన్. ౨౮౹ 216

సీ. నీమది ధర్మైక♦నియతమై యుండును ధర్మంబువలన న♦ర్థంబు సుఖము
గలుగు నివ్వవి యని ♦ పలుకంగనేల ధర్మంబుననే సక♦లంబు గలుగుఁ
గాన ధర్మంబె జ♦గంబున సారము నిపుణత గలవార ♦ లపరిమితము
లగు ప్రయత్నములచే ♦ నగణితవ్రతముల నాచరించుటచేత ♦ నాత్మ దేహ

---

1 ఇందలిపూర్వార్థము వ్యాఖ్యలోని యవతారికకని తెలియుచది.

తే. మును గృశింపఁగఁజేసి యో ♦ యనఘ! ధర్మ
మును గ్రహింతురు యోజింపఁ♦గను సుఖమున
సుఖము లభియింప దెందును ♦ సూనృతమిది
గాన నిత్యము నిర్తపరి♦కాననమున. ౩౧ 217

తే. విమలచిత్తుండ వగుచు ధ♦ర్మము సమాచ
రింపుమా; ముజ్జగంబుల ♦ రీతి యెల్ల
నున్న దున్నట్లు తెలిసియే ♦ యుండుఁగాదె
నీకు రఘురామ! సద్గుణ♦నిచయధామ!. ౩౨ 218

చ. వనితలకెల్ల నుండిన స్వ♦భావపుఁ జాపల మూది చెప్పితిన్
మనుజవరేణ్య! యీభువి స♦మస్తమెఱింగిన నీకు ధర్మముల్
గనఁబఱుపంగ నేర్పడియుఁ ♦ గల్గునె యన్యుఁడు బుద్ధినెంచి నీ
యనుజునితోడఁ బల్కుకొని ♦ యవ్వల నెయ్యది యిష్టమానొ దా
నినె యొనరింపుకాలమును ♦ నీ విఁకఁ బుచ్చక ప్రాణనాయకా. ౩౩ 219

తొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

౧౦ - వ సర్గము.

రాముఁడు సీతప్రశ్నలకు నుత్తర మిచ్చుట.

చ. జనకజ భర్తపై నిఁగల ♦ చక్కని ప్రీతిని నిట్లు పల్కఁగా
విని రఘురాముఁ డెంతయును ♦ విశ్రుతధర్మమునందె చిత్తమొ
ప్పిన మతిమంతుఁడౌటఁ దన♦ప్రేయసిఁ గాంచి వచించె దేవి! యో
జనకునిపుత్త్రి పీవు మతి ♦ శాశ్వతధర్మ మెఱుంగు దెంతయున్. ౧ 220

తే. నీకు నాయందుఁ గల్గిన ♦ స్నేహభావ
మునకుఁ దగినట్లు హితవాక్య♦మును వచించి
తివి భవద్దివ్యవంశంబు ♦ తెఱఁగు దీన
వెల్లడించితి వెంతయు ♦ వేడ్కఁ గంటి. ౨ 221

క. నామాట హితమె యగుచో, నామాడ్కిం జేయుమనెదొ ♦ యందులకే నే
మేమి వచింపఁగఁదగునో, యామాటం జెప్పువాఁడ ♦ ననురాగమునన్. ౩

చ. నరపతు లార్తశబ్దము వి♦నం దగదంచు శరాసనంబుఁ దా
ల్తురు గద యంచుఁ జెప్పితివి ♦ తోయరుహానన! నీవె జానకీ
నిరతము సంశ్రితవ్రతులు ♦ నెమ్మిని గావఁగఁ బాత్రులై మహా
త్తరవనమందు నిందుఁగల ♦ ధర్మవిదుత్తము లౌ మునీశ్వరుల్. ౪ 223

క. అరుదెంచి తారె నన్నున్, శరణుం దగఁ జొచ్చినారు ♦ సర్వజ్ఞులు భూ

సురపుంగవు లవ్వారలు, నరణ్యమున మూలఫలము ♦ లాహారముగన్. ౭౫
క. తినుచుండియుఁ గ్రూరులుగా,వనిఁ దిరుగు సురారికోటి♦వలన భయంబున్
గని సుఖముఁబడయకున్నా,రనయము మాంసంబుఁదినెడు♦నసురులుభయదుల్.
సీ. వనమున నెప్పుడు ♦ బహువిధ వ్రతములఁ గావించుచు నదెట్లొ ♦ కాల మొక్క
విధమునఁ బుచ్చు భూ♦విబుధమునీశుల భక్షించుచున్నారు ♦ పంక్తి వినుము
దండకారణ్యమం♦దుండు నమ్మును లట్లు దనుజులు భక్షింపఁ ♦ దాళలేక
నాయొద్ద కరుదెంచి ♦ నాయనా మముఁ గావు మని వేఁడిరేను న♦మ్మునులపలుకు
తే. లాలకించుచు వారల ♦ యంఘ్రులకును
వందనముచేసి యిట్లంటిఁ ♦ బరమ కరుణ
నన్ను మీరు క్షమింపుఁడు ♦ నన్నుతులరు
గాన నేవచ్చి సేవింపఁ♦గాఁ దగుఁ గద. ౭౫ 226
సీ. ఇట్టి యార్యులు మీర♦లే నన్నుఁ గనవచ్చి ప్రార్థించుచుండుట ♦ నరయ నాకు;
జెప్పంగఁ దగనంత ♦ సిగ్గు గల్గించె; నేనేమి చేయంజను ♦ నిపుడె చెప్పుఁ
డని వారియెదుటనే ♦ నాడితి నీమాట నంత నమ్మునివర్య ♦ లందఱు ననుఁ
గాంచి రామా! దండ♦కంబునఁ గామరూపులగు రాక్షసు లనే♦కులు చెలంగు
తే. చుందు రవ్వార లరుదెంచి ♦ యురుతరార్తిఁ
బొందఁగాఁ జేయుచున్నారు ♦ పూన్కి మీఱ
నట్టి బాధలు లేకుండ ♦ నాదరమునఁ
గావుమా వారి నెదిరింపఁ♦గాదు మాకు. ౧౧ 227
చ. దనుజులు మాంసభక్షకు లు♦దగ్రులు హోమము సేయువేళలం
దును మఱి పర్వకాలములఁ ♦ దోరపు వేడుక మీఱ వచ్చి మ
మ్మును భయపెట్టుచుందురు స♦మూహముగా నరుదెంచువారిచేఁ
బెనువగ లొందఁజేయఁబడి ♦ వేఱొకదిక్కును లేని మానులన్. 228
చ. అనయము సంశ్రితవ్రతుల ♦ నార్తుల దిక్కఁకె నెవ్వరంచు నె
మ్మనముల నెంచువారలను ♦ మమ్మును గావఁగ నీవె యాశ్రితా
వనచణ! రామ! యర్థ్యుఁడవు ♦ భవ్యతపంబున రాక్షసోత్కరం
బును హరియింపఁ జాలుదుము ♦ పొంగుచు మేమె తలంచి చూచినన్. ౧౩౫
క. సురవైరులఁ బొలియించినఁ, జిరకాలతపంబు తఱుఁగుఁ ♦ జిత్తమ్మున న
క్కరణి నొనర్పఁ దలంపము, పురుషోత్తమ! తపము కష్ట♦పుంజాకరమా. ౧౪౫
ఉ. దానికి నంతరాయ సము♦దాయము లెప్పుడు నుండుఁగాన న
ద్దాని వ్యయింపఁజాలకయె ♦ తప్పక వారలు చంపుచుండినన్
దానవులన్ శపింపక ని♦తాంతశమంబును బూనినాము పెం
పూనిన నీవు లక్ష్మణుఁడు ♦ సుగ్రవనంబున నున్న మమ్ములన్. ౧౫౫ 231

తే. అసురపీడితులను గావ ♦ నౌను జుమ్ము
దండకారణ్యమున మీరు ♦ దక్క దిక్కు
వేఱెకెవ్వరు లేరని ♦ వివిధవిధము
లను మునీంద్రులు పల్కి రో ♦ జనకపుత్రి!. ౧౬ 232

క. మునివరుల మాటలెల్లను, విని యీవనినున్న మౌని♦బృందము గష్టం
బును బొందకుండఁ గాచెద, నని శపథము చేసినాఁడ ♦ నవనీతనయా. ౧౭ 233

క. తనువునఁ బ్రాణములుండం,గను మౌనినిమిత్త మొప్పఁ♦గాఁ జెప్పిన ప
ల్కును దప్పఁజాల సత్యం,బనవరతము నాకు నిష్ట♦మని యెఱుఁగవొకో. ౧౮

[1]సీ. దనకళత్రములకం♦టెను హెచ్చుగా నున్న ప్రాణంబునైనను ♦ వదలువాఁడఁ
దనదు రెండవమూర్తి ♦ యనుజాతు, మఱి శరీరార్ధభాగంబుగా ♦ నలరు నిన్ను
వదలువాఁడంగాని ♦ ప్రతిన మాత్రము తప్పఁ జాలను వాస్తవ♦జ్ఞానవేత్త
లైన బ్రాహ్మణులకై ♦ నేను జేసినప్రతిజ్ఞను దప్పుదునె గాన ♦ జనకపుత్రి

తే. మునులు ప్రార్థింపకే పోయి♦నను దనుజుల
నే నవశ్యము పొలియింప ♦ నౌను మునులఁ
గావఁగాఁ దగు వారు న♦న్నని వచింపఁ
బ్రతినవట్టితి నన వేఱు ♦ పలుకవలెనె. ౨౦ 235

క. అనఘమతీ! నీపై నా,కును గల స్నేహంపుబలిమిఁ ♦ గువలయనేత్రా
ఘనముగ నాపై నీకుం, దనరెడు సౌహార్దమునను ♦ దగినవిధమునన్. ౨౧

తే. ఇట్లుపల్కితి సంతోష ♦ మెసఁగ నాకు
నప్రియున కెవ్వఁడైనఁ బ్రి♦యంబుఁ జెప్ప
నెంచునే నీవు చెప్పిన ♦ హితవచనము
[2]త్వన్మనోవంశములకును ♦ దగును జుమ్ము. ౨౧॥ 237

క. జలజాక్షి! నాదుప్రాణం,బులకంటెను నెక్కువయయి ♦ పొల్తువు నీ వ
ట్టులెయైనను నే ధర్మం,బుల నేఁ బూనుదునొ చేయఁ ♦ బోలఁతీ వానిన్. ౨౨

చ. ఒనరుపఁ బూనఁగా వలయు ♦ నొక్కవిధంబున నంచు రాముఁ డా
జనకజఁ బ్రేయసిన్ మదికి ♦ సంతసమొప్పఁగఁ గాంచి పల్కి చ
య్యన ననుజన్ముతోడను శ♦రాసనముల్ ధరియించి మించు వే
డ్కను రమణీయమై తనరు ♦ కాననునేగె విచారహీనుఁడై. ౨౩ 239

పదియవ సర్గము సంపూర్ణము.

---

1 అప్యహం జీవితం జహ్యాం త్వాంవా సీతే సలక్ష్మణామ్-అనిమూలము. దీనికి గోవిందరాజులు. తన్శ్లోకి వినియందుఁగల భావ మీపద్యమున సారభూతముగా నిమిడింపఁబడినదని తెలియవలయు. 2 సదృశం చానురూపంచ కులస్య తవ చాత్మనః-అనిమూలము.

## ౧౧ - వ సర్గము.

### మాండకర్ణివృత్తాంతము.

క. రాముఁడు ముందుగఁ జనఁగా, భూమిజ సొగసైననడుము♦పొంక మలరఁగా
రామునివెంటం జనియెను, సౌమిత్రియు ధనువుఁదాల్చి♦చనియెఁ బిఱుందన్.

చంపకమాలిక:—

ఇరువురు సోదరుల్ చనుచు ♦ నింపుగఁ గన్పడు శైలసానుపం
క్తి, రహిఁ జెలంగు సద్వనత♦తిన్ బహుభంగుల నొప్పుచున్ మనో,
హరములు నౌతరంగిణుల♦నప్పులినంబుల మీఁద నింపుగాఁ
దిరిగెడుసారసంబులను ♦ దివ్యములై తగుచక్రవాకసుం
దరఖగపంక్తులన్, జలప♦తత్రులు పద్మములొప్పమించు బల్
సరసుల; గుంపుగాఁ దిరుగఁ♦జాలిన దుప్పులనున్, మదించి కా
వరమున వాడికొమ్ముల జ♦వంబునఁ బోవఁగఁ జాలుశక్తిచేఁ
బరఁగెడు కారుదున్నలను; ♦ బందులఁ, జెట్లనుగూల్చునట్టి కుం
జరములఁ జూచుచున్ జనక♦జాతనుగూడియె పోయి; రిట్లు వా
రరిగిరి దూర మంత నినుఁ ♦ డస్తమయాద్రికిఁ బోవనుండ సుం
దరముగ నాల్గుదిక్కులను ♦ దప్పక యోజనమాత్రమానమౌ
విరివిగలట్టిపుష్కరిణి ♦ వింతఁగఁ గాంచిరి వార లొక్కటన్. ౯ 241

సీ. సితరక్తపద్మముల్♦చెలఁగియుండఁగ గజయూధముల్ సొంపుగ♦నొప్పియుండఁ
గలహంస రాజహం♦సలును సారసములు జలములఁ గలయంగ ♦ సంచరింప
నందమై నిర్మల♦మగుజలం బొప్పంగఁదగు దానినుండి గీ♦తముల ధ్వనియు
వాద్యస్వనము విన♦వచ్చెను గాని యందొక్కరుఁడును జూడ ♦ నుద్యమింపఁ
తే. గనఁబడకయుండె; రాముండు ♦ కౌతుకమునఁ
దమ్ముఁడున్ వినఁగాఁగోరి ♦ తత్తటాక
విధము నెల్లను ముని దమ♦వెంట వచ్చి
నట్టి ధర్మభృతుం గని♦యిట్టు లనియె. 242

చ. మునివర! చాల నద్భుతముఁ ♦ బుట్టఁగఁజేసెడు నీమహాస్వనం
బును వినినంత దీనివిధ♦ముం దెలియందగు నన్న సంతసం
బు నెగడెఁ గానఁ జెప్పఁదగుఁ ♦ బొందుగ నంతయుఁ జెప్పవచ్చునే
ఘనుఁడవు నీవు చెప్పుటకు ♦ త్యాదివిజోత్తను! యానతీయుమా. ౯ 243

క. పరమరహస్యము చెప్పం,గరానియంతటిది యిద్ది ♦ గాకుండినచోఁ
గరుణాత్మ! యనఁగ ధర్మ,స్థిరమతి యాధర్మభృతుఁడు ♦ చిత్తం బలరన్. ౧౦

తే. ఆదరంబున శ్రీరాముఁ ♦ డడిగె నిట్టు
లనుచు నది పుట్టినవిధంబు♦నందు గీత,

నిస్వనము వినఁబడురీతి ♦ నెమ్మి తనరఁ
జెప్పఁగాఁ బూని యిటు పల్కె ♦ శ్రీరఘువర!. ౧౦½ 245

సీ. వినుము పంచాప్సరం ♦ బనఁబడు నీతటాకము సర్వకాల మి♦క్కరణి గీత,
వాద్యనిస్వనముల♦భాసిల్లుచుండును మాండకర్ణియనెడు♦మౌని తపము
బలిమి నిర్మించె నీ♦వరతటాకంబును; బదివేలయేం డ్లోగి ♦ వాయుభక్షు
కుండయి యీనీట♦నుండి తీవ్రతపంబు, నతఁ డొనరింపంగ ♦ నగ్నిముఖ్యు

తే. లైన దేవతలెల్లను ♦ వ్యథితచిత్తు
లగుచు నొండొరులం గూడి ♦ యతిరహస్య
మగుస్థలంబునఁ దమలోన ♦ ననఘుఁ డితఁడు
మనస్థలంబులలో నొండు♦గ నెడువేడ్క. ౧౩½ 246

క. ఘోరతపం బీలాగున, నాయూఢిగఁ జేయుచుండు♦నని యార్తిని నీ
తీరునఁ జెప్పుకొనుచు ననురారులు సంవిగ్నచిత్తు♦లై; యాపిదపన్. ౧౪½ 247

సీ. మెఱుపుఁదీవియలట్లు ♦ మించు దేహచ్ఛాయ లెల్లెడ వ్యాపింప ♦ నుల్లసిల్లు
నట్టి యప్సరసల ♦ నైదుగురను మౌని,తప మడంపఁగ దేవ♦తలు పనుపఁగ
నావధూమణు లేగి ♦ యమ్మునిఁ దత్త్వంబు నెఱిఁగినవాని న♦దెట్లొ మోహ
పరవశునిగఁ జేసి ♦ వశముగావించుకొనిరి దేవకార్యంబు ♦ సరిగఁ జేయ,

తే. నంతవార లమ్మౌనికి ♦ ననుఁగుఁబత్ను
లైరి వారల కీతటా♦కాంతరమున,
నాలయమ్ము నిర్మింపంగ♦నయ్యె వార,
లిందలిగృహమ్మునన్ నిల్చి♦యెలమి మిగుల. ౧౮ 248

క. మునిని దపోబలమున యా,వనమును దగఁ బొందినట్టి♦వానిన్ మిగులన్
మనసిజుకేళులఁ దేల్చుచుఁ, గనుచున్నా రిందులో సు♦ఖంబును రామా!. ౧౮½

మ. వనితాపంచక మిట్లు కేళి మెలఁగన్ ♦ వాదిత్రసంగీతని
స్వన మవ్వారల భూషణధ్వనులతో; ♦ సంయుక్తమై యీవిధం
బునఁ జెల్వారి వినంబడున్ శ్రుతిహితం♦బుం జేయుచున్ రాఘవా
యని యాధర్మభృతుండు జ్ఞాని యనఁగా ♦ నాలించి యారాఘవుల్. ౨౦

క. విన నిది యాశ్చర్యంబౌ,నని తగ నంగీకరించి; ♦ రప్పుడె కుశచీ
రనిచయరంజితమై వి,ప్రనికరసంపదల మిగుల ♦ భాసిలుదానిన్. ౨౦½ 251

ఆ. ఆశ్రమవ్రజంబు♦నటఁ గాంచి; రాసోదరులు మహాయశమున ♦ వెలయు రాముఁ
డవనిజాతతోడ ♦ ననుజునితోడ నా,యాశ్రమములఁ జొచ్చె ♦ నంత మునులు,

క. అతిథిగ రాముఁడు వచ్చెను, గృతకృత్యులమైతి మంచు ♦ నెలమిని భక్తిన్
హితపూజ లాచరించిరి, క్షితిసురమునిగణముతోవ♦సించె నతఁ డటన్. ౨౨½

సీ. సకలమహాస్త్రశ♦స్త్రంబుల నెఱిఁగిన శ్రీరామచంద్రుండు ♦ సికుల వెలయు
నాశ్రమమండలం♦బందు మహామునుల్ పూజించు చుండంగఁ♦బొదల సుఖము
వసియించియుండి య♦వ్వారియాశ్రమముల మునుపొకపర్యాయ♦ము నివసించి
యుండియు నుఱియు న♦య్యెప్పుడుతావుల కఖలరాక్షసబాధ♦లడఁపఁబోయి

తే. యుండె నివసించె నొకచోట ♦ నతఁడు మూఁడు
పదియు నొకచోటఁ బండ్రెండు ♦ వాసిమీఱ
మఱొకతావున నాలుగు ♦ మఱొకనెలవు
నందు నివసించె మాసము ♦ లై డతండు. ౨౫॥ 254

ఆ. ఆఱు నేడు నొకటి ♦ యూపైని బాదము
మూఁడుపాదములును ♦ మూఁడునెలలు
నష్టమాసములుమ♦హాశ్రమములయందు
నందు నాతఁ డుండె ♦ హాయి తనర. ౨౬॥ 255

క. మునుల కుటీరంబుల ని, ట్లనువుగ నివసించి మిగుల ♦ హాయిగ నుండం
గను బదిసంవత్సరములు, వనవాసమునందుఁ గడచె ♦ వసుసఁగ నంతన్. ౨౭॥

రాముండు మరల సుతీక్ష్ణాశ్రమమునకు వచ్చుట.

క. రాముఁడు ధర్మవిదుత్తముఁ, డా మానుల యాశ్రమముల ♦ నన్నిఁట వాసం
బీమాడ్కి నేసి మరలఁ, భూమిజతోఁ దఁ సుతీక్ష్ణ♦మునిఁ గనవచ్చెన్. ౨౮॥

క. అరిసూదనుఁ డౌ శ్రీరఘు,వరుఁ డా యాశ్రమముఁ జేరి ♦ బ్రహ్మమునులచేఁ
బరిపూజితుఁడై యం దా, దరమునఁ గొన్నాళ్లు గడపెఁ ♦ వద్దయుఁ బ్రీతిన్.

చ. శ్రమ మనఁగా నెఱుంగకయె ♦ రాఘవుఁ డందు వసించి యొక్కనాఁ
డమలతపఃప్రభావుఁడగు ♦ నమ్మునిఁ గాంచి వినీతుఁడై వచిం
చె మునివరేణ్యుఁడై తనరు ♦ సిద్ధతపస్వి యగస్త్యుఁ డీయర
ణ్యమున వసించు నంచుఁ గథ ♦ లావృతిఁ గొందఱు చెప్పుచుండఁగన్. ౩౦॥

క. వినుచున్నవాఁడ మునివర, వన మిది కడుగొప్ప దౌట ♦ బ్రహ్మము నివసిం
చినచో టదెద్దియో యెఱుఁ,గను జ్ఞానధనుం డతం డ♦గస్త్యుఁడు వేడ్కన్.

తే. ఏప్రదేశమునం దుండు ♦ నెందు నతని
పావనాశ్రమ మలరారు ♦ బ్రహ్మవాని
తమ రనుగ్రహమునిచి యా♦స్థలముఁ దెలిపి
పంపఁ బరివారయుతుఁడనై ♦ పయన మగుదు. 33 261

క. మునిపతి కభివాదనముల, నొనరుపఁబోయెద; నగస్త్యు ♦ నొగి సేవింపం
గను గోర్కి పెద్దదిగ నా, మనమునఁ జిరకాలముగ న♦మరియుండుఁ జుమీ.

క. ఆమునిపతి శుశ్రూషల, నేమమునం జేయఁజాలు ♦ నిర్మలభాగ్యం
బీమేని కున్న బాగని, యోమహానీ! తలఁచువాఁడ ♦ నుల్లమునందున్. ౩౪॥

మ. అని ధర్మాత్ముఁడు రామభద్రుఁ డనఁగా ♦ నమ్మాట లాలించి య
మ్మునినాథుండు సుతీక్ష్ణుఁ డెంతయును స♦మ్మోదంబునం బల్కె నా
తనితోఁ; జానకితోడ నీవును సుమి♦త్రానందనుం డయ్యగ
స్త్యునిఁ గానం జనుఁ డంచు నేఁ బలుకఁగా ♦ నూహించుచుండం దగన్.

క. దైవికముగ నీవేనను, నీవిషయము నడిగినాఁడ ♦ విఁక వత్సా! నీ
కావిషయమ్మును జెప్పెద, నావరముని యాశ్రమము ను♦దాశ్రమమునకున్.

తే. యామ్యభాగంబున న్నాలు♦గామడలను
జనినఁ గన్పడు నాసుద♦ర్శనుని వసతి
యాయగస్త్యుని యనుజాతుఁ ♦ డాతఁ డతని
వనము మిక్కిలి యున్నతిఁ ♦ దనరుచుండు. ౩౮౪ 266

సీ. అది బహుపుష్పఫ♦లాన్వితంబయి బహుపక్షినినాదసం♦భరిత మగుచుఁ
బిప్పలివనముగ ♦ వెలయుచు వేఱొక్క వనమునం దున్న ద♦వ్వనమునందుఁ
బలు తెఱంగుల తామ♦రలు వన్నెమీఱెడు కొలఁకులు నిర్మల♦జలము వెలయ
నుండును హంసకా♦రండవములు చక్రవాకముల్ తనరారు ♦ వనమున నట

తే. నొక్కరాత్రి వసించి సూ♦ర్యుండు పొడువ
నవలఁ బయనంబుచేయు మ♦య్యాశ్రమమున
నుండి దక్షిణదిక్కున ♦ నురుతరవన
సంతతికిఁ బ్రక్కగ నొకయో♦జనము పోవ. ౪౧౪ 267

క. తనరెడు నగస్త్య నాశ్రమ, వనమట బహువృక్షతతులు ♦ నఱల మనోజ్ఞం
బునగుఁ దదాశ్రమమున నీ,వును సీతయు లక్ష్మణుఁడును ♦ బొదలెదు కాంక్షన్.

క. అలరుచు నట విహరింపం, గల; రావనసీమయందుఁ ♦ గడు రమ్యములై
పలు తెఱఁగుల భూరుహములు, వెలయుఁ జుమీ యాయగస్త్య♦ద్విజమునినాథున్.

క. కనుఁగొనఁ గోరిక కలదే, ననుపమకీర్తీ! ప్రయాణ♦మయి యుత్తరుణం
బున నే చనుమా! యని య,మ్మునిపల్కిన నాలకించి ♦ ముద మాలరంగన్.

చ. అనుజునితోడ రాముఁ డపు ♦ డమ్మునికేనికి మ్రొక్కి సీతతో
ననుజునితోడ నమ్మునికు♦లాధిపుఁ జూడఁ బ్రయాణమయ్యెఁ ద్రో
వను రమణీయభూరివన♦వారము మేఘమురీతి నున్న భూ
ధ్రనికరముం గొలంకులను ♦ రమ్యనదీతతిఁ బ్రీతిఁ జూచుచున్. ౪౬ 271

చ. అరిగె సుతీక్ష్ణమౌనిపతి ♦ యాదృతిఁ జూపిన దారిఁ బట్టి భూ
వరసుతుఁ డెంతయో సుఖము ♦ వర్ధిల మోదముతోడ; నంత సో
దరుఁ గని యిట్లుపల్కె సుకృ♦తంబులఁ జేయుచు మాన్యచిత్తుఁ డై
పరఁగు [1]నగస్త్యభ్రాతదగు ♦ వాసపదం బిదియే చెలంగెడున్. ౪౮ 272

1 అగస్త్యభ్రాతనామధేయము సుదర్శనముని యని యెఱుంగఁదగు.

ఆ. సందియంబెలేదు ♦ సహజ! సుతీక్ష్ణుండు, చెప్పినట్లె త్రోవ ♦ చిహ్నములును
గాననయ్యెఁ జక్కఁ♦గా ఫలభారంబు, వలన వంగి పిప్ప♦లులు తనరెడి. ౪౯

సీ. ఈవనంబులనుండి ♦ యెంతయుఁ బండిన పిప్పలి పండ్లదై ♦ యొప్పు కటుక
వాసన యిదె గాలి♦వలన వ్యాపించెడు నందందు మునులు హో♦మాదికార్య
ములకుఁ గాఁ గూర్చి రా♦సులుగానమర్చినయింధనములు పెక్కు♦లివిగొ యున్న
వీత్రోవ మునివర్యు ♦ లెల్ల ఛేదింపంగ వైడూర్యమణికాంతి ♦ వఱలు దర్భ

తే. లివిగొ కనఁబడుచున్నవి ♦ కృష్ణమేఘ
శిఖర సంకాశమగుచు లే♦చిన మునీంద్రు
నాశ్రమాగ్నిశిఖల్ కన♦నయ్యె నివిగొ
యతనియాశ్రమమధ్యమ ♦ మగును నిదియె ౫౨ 274

సీ. పావనజలముల ♦ భూవిబుధులు స్నానమాడి స్వార్జితకుసు♦మావళులను
బుష్పబలిక్ భక్తిఁ♦బూన్కిఁ జేయుచున్నవారు; సౌమ్యా! మునీ♦శ్వరుఁడు చెప్ప
విన్నమాటలరీతి ♦ విపినమం దిట నగస్త్యానుజు నాశ్రమ ♦ మలరు; నిశ్చ
య మ్మిమ్మునీంద్రుని ♦ యన్నయుఁ బుణ్యకర్మాభిరతుండయి ♦ యలరు నయ్య

తే. గస్త్యముని లోకహితమందుఁ ♦ గాంక్షఁ బూని
*తనకుఁ గలిగిన మృత్యువుఁ ♦ దపము బలిమి
నిగ్రహించి యీదిక్కును ♦ నిఖిలజనుల
కుండఁ దగినదిగాఁ జేసె ♦ నుద్యమమున. ౫౫ 275

ఆగస్త్యముని యిల్వలవాతాపులం జంపుట

క. మును పిట నిల్వల వాతాపినామకులు సహజు లుర్వి ♦ విబుధాంతకు లు
ర్విని వెలసిరి రాక్షసు లం,దు నిల్వలుఁడు నిర్ఘృణాత్మ♦తో నపుడపుడున్. 276

చ. ధరణి సురేంద్రరూపమును ♦ దాల్చి సుపర్వులభాష పల్కుచున్
గర మనురక్తి శ్రాద్ధమని ♦ త్మానుకులం దగఁ బిల్చుచుండు; సో
దరుఁడును మేషరూపమును ♦ దాల్చును వానివధించి వండి భూ
సురులకు శ్రాద్ధకర్మమును ♦ జొప్పు దొలంగక యుండఁ జేయుచున్. ౫౮ 277

సీ. భుజియింపఁగాఁ జేయు ♦ భూదివిజేంద్రుల నంత భుజించి బ్రా♦హ్మణులు మిగుల
సంతృప్తులై యుండ ♦ సహజుని వాతాపి నిల్వలుం డెంతయు ♦ నెలుఁగు తనర
వాతాపి! రమ్ము జ♦వంబున నని పిల్వ నతనివాక్యము విన్న♦యంత మేఁక
వలె నఱచుచు విప్ర♦వర్యుల కుక్షుల ఛేదించుకొనివచ్చుఁ ♦ జిత్రరీతిఁ

తే. గామరూపులు మాంసభ♦క్షకులు నైన, వార లిర్వురు గలిసి దు♦ర్వారరీతి
వేలకొలఁదిగ నిత్యము ♦ విప్రవరులఁ, జంపియున్నారు నంతయు ♦ శంక లేక.

క. సుర లంత నగస్త్యమునీ,శ్వరునిం బ్రార్థించి రతఁడు ♦ చని యిల్వలుఁ డా

---

* వాతాపి ఇల్వలుఁడు అను రక్కసులవలనఁ గలిగిన మరణమునని తాత్పర్యము.

దరపునఁ బిలువఁగ సంగీకరించి వాతాపిఁ గుడిచెఁ ♦ గతినాత్ముఁ దమిన్. ౨౨

క. అంతట శ్రాద్ధము ముగియఁగ, సంతృప్తియె మీకు మాని♦చంద్రా! యని దు
ష్స్వాంతుం డిల్వలుఁ డడుగన్, సంతృప్తియెనాకుననుచు♦త్మ్యాసురుఁడనియెన్.

తే. ఉత్తరాపోశనం బిచ్చి ♦ యురునినాద, మడర సోదరు రమ్మని ♦ యఱచె; నంత
మునియు ధీమంతుఁ డౌటఁ ద♦మ్మునిని బిలుచు, విప్రఘాతకునిల్వలు♦ వేగచూచి.

క. అలరుచుఁ బ్రహాస మొనరిచి, పలికెన్ మేషతనువొంది ♦ త్వద్భ్రాత మహా
బలశాలి నాదు కుక్షిస్థలమున జీర్ణించి [1]యమని♦శాంతము నొందెన్. ౨౮౪

క. అనుజుం డతఁ డేలాగున, దనుజా! వెడలంగనేర్చుఁ ♦ దప్పెం గార్యం
బని తమ్మునిమృతిఁ దెల్పెడు, మునివాక్యము వినుచు రోష♦మునఁనిల్వలుఁడున్.

చ. ముని వధియింపఁ బూని ద్విజ♦ముఖ్యునిపైకిఁ జనంగఁ బ్రజ్వల
న్ఘనతరతేజమొప్ప శుచి♦కల్పముగాఁ దగు కంటఁ జూచె న
ద్దనుజుఁడు దానిచే మడిసెఁ ♦ దన్మునిసోదరు నాశ్రమం బిదా
వనములు సత్తటాకములు ♦ వర్ణ్యములై తగియున్న పీస్థలిన్. ౨౭౪ 284

క. అనుజా! విను బ్రాహ్మణులం, దనుకంపన్ దుష్కరంబె ♦ యగుకార్యం బీ
మునియన్నచేసె నాతని,యనుజుఁడె యీయాశ్రమమున ♦ నలరుంజుమ్మీ. ౨౮

క. అనియిట్లు శ్రీరఘూద్వహుఁ, డనుజునితోఁ బల్కుచుండు ♦ నంతట సూర్యుం
డును జనియె నస్తగిరిదా,పునకున్ సంధ్యాసమయము ♦ పొలిచెన్ ద్వరఁగన్.

తే. అపుడు వారిద్ద రచ్చట ♦ నపరసంధ్య
శాస్త్రవిధివార్చి మునివరా♦శ్రమముఁ జొచ్చి
యతని కభివాదనముసేసి; ♦ రంత రాముఁ
డతనిచేఁ బూజితుండయ్యె ♦ నమ్మునియును ౨౦౪ 287

క. ఫలమూలము లిడినం దిని, యలఘుముదంబొప్ప, నా రాత్రి♦యాము నచట ని
మ్ములఁ బుచ్చి తెల్లవాఱిన, జలజహితుం డచ్ఛకాంతి ♦ సాంద్రుం డగుచున్.

క. తనదారిఁగ రాముం డమ్ముని వీడ్కొనిపోవఁ దలఁచి ♦ మ్రొక్కి మహాత్మా!
చనియెన్ రాత్రి సుఖంబుగఁ, జనఁదలఁచితి నీదు నగ్ర♦జన్ముని కడకున్. ౨౨౪

క. గురుఁడుగదా! మీకమ్ముని,వరుఁ డేఁకఁ బోవలయుఁ బోయి ♦ వచ్చెద నాజ్ఞన్
గరుణింపు మన్న నట్లే, గురుఁ గానంజను మటన్నఁ ♦ గోరిక లలరన్. ౨౩౪ 290

క. మునుపు సుతీక్ష్ణుఁడు చెప్పిన,వనిఁ జూచుచు నాపథమున ♦ భార్యాయుతుఁడై
యనుజుఁడు పిఱుంద రాఁగాఁ, జనియెన్ మునిచంద్రుఁ గాంచు♦సంతసమలరన్.

సీ. వనమునం దచట నీ♦వారముల్ పనసలు తాళముల్ తిమిశాఖ్య ♦ తరువరములు
వకుళముల్ ఖదిరముల్ ♦ వరుసఁ గానుఁగుచెట్లు నిప్పలుబిల్వమ్ము♦లొప్పుమిగులు

---

[1] గతస్య యమసాదనమ్-అనిమూలము.

తిందుకద్రుమములు ♦ పొందుగ వెలయుచుఁ బుష్పితాగ్రలతలు ♦ పూచియున్న
శాఖాగ్రములనెల్ల ♦ సందు లేకుండఁగ వ్యాపించియును దగ ♦ నతఁడు చూచె;
తే. మఱియు బహువిధభూరుహ ♦ మండలములు
పందలకొలంది నింపుగా ♦ వఱలుచుండఁ
గాంచె నందొక కొన్నివృ ♦ క్షమ్ములు కరి
కరవినిష్పాతితములయి ♦ కానఁబడియె. ౭౬ 292

క. తరువులఁ గొన్నిటఁ గోఁతులు, చరియించుచు నుండెఁ బక్షి ♦ సంతతి మదవి
స్ఫురితంబై శతసంఖ్యఁగఁ, దరువుల ధ్వనిఁ జేయుచుండెఁ ♦ దమితోనంతన్.

క. తనవెంట వచ్చు శ్రీవర్ధను లక్ష్మణుఁ గాంచి [1] తెల్లఁ ♦ దామరలవలెఁ
దనరారు నయనములు గల, వనజాప్తకులాభరణము ♦ పలికెం దమితోన్.

చ. తరువులు స్నిగ్ధపత్రసము ♦ దాయమనోజ్ఞములై చెలంగుటన్
గరువము మాని పక్షిమృగ ♦ కాండము శాంతము గల్గియుంట నిం
దరయఁగ భావితాత్ముఁడగు ♦ నట్టి యగస్త్యమునీంద్రువాస మి
ప్పరిసరసీమ నున్నదని ♦ బాగుగఁ దోఁచెడి నాకుఁ దమ్ముఁడా. ౭౯ 295

సీ. వింధ్యభూధ్రమును స్తం ♦ భించి యద్దాననే జగతి నగస్త్యుఁడన్ ♦ సద్యశంబుఁ
బడసెనో యామునీ ♦ శ్వరుని యాశ్రమమిదె కనఁబడియెడి; మార్గ ♦ మునజనించు
కష్టమ్ములం దొలఁ ♦ గం జేయుచుండుఁ జూ హోమాగ్నిధూమమే ♦ యొక్కరీతి
నిందు వ్యాపించియే ♦ యొసఁగె వల్కలములు వరుసఁ జెట్లకుఁ గట్టఁ ♦ బడియొప్పుగవి
తే. తతులు శాంతంబులై యున్న ♦ వతులరీతిఁ
బక్షు లఱచుచు నున్నవి ♦ [బ్రహ్మహాని
సుప్రభావమ్మునన్ రాక్ష ♦ సులును దీనిఁ
గాంతురేకాని చేరనేర ♦ రింతయేని] ౮౧ 296

తే. అట్టి మునినాయకుని దగు ♦ నాశ్రమ మిదె
యీమహాపుణ్యకర్ముఁ ♦ డీదెసఁ గయి
కొనిన యప్పటినుండి యీ ♦ దనుజులు పగ
మాని శాంతగుణంబును ♦ బూని రిందు. ౮౩ 297

క. వినుమా యగస్త్యుఁ డిక్కని, ముని పేరిట నామధేయ ♦ మును బొంది ప్రసి
ద్ధిని గాంచెఁ గ్రూరతరులగు, దనుజులకుం జూడరాక ♦ తా లోకములన్.

క. గిరిపతివింధ్యమ్ము దివా,కరుమార్గం బడ్డగింపఁ ♦ గాఁ బూనియు నే
పరమర్షి యాజ్ఞఁ గొనుటం, బెరుగక నిల్చినదొ చూడ ♦ వింతఁగ ననుజా.

తే. లోకవిఖ్యాతకర్ముఁడై ♦ శ్రీకలితుఁడు
నగుచు దీర్ఘాయువును బొందు ♦ నాయగస్త్య

1 శాంమో రాజీవలోచనః-అనిమూలము.

మునిది సుమ్మీ వినీతస♦జ్జన నిషేవి
తంబయిన యాశ్రమంబిది ♦ [1]తగియెడి సిరి. ౮౬ 300

మ. ఇతఁడే లోకసుపూజ్యుఁడై సుజనుఁడై ♦ యెల్లప్పుడున్ సాధుసం
తతికిన్ మేలె యొనర్పఁగోరు మనమీ ♦ ధన్యాత్మునిం జేరినన్
గృతకృత్యాత్ములఁ జేయు లోకమున స♦త్కీర్తిం దగం జేయుఁ జు
మ్మతులంబై తగు నిందె యుండి ముని నీ♦యారాధ్యు సేవించుచున్. ౮౭

క. వనవాస శేషమును నీ, తనిచెంతనె పుచ్చువాఁడ ♦ ధన్యమతీ! యీ
తని నిర్జరగంధర్వులు, మునిసిద్ధులు గొల్చువారు ♦ ముద మలరారన్. 302

సీ. ఆహారనియతిచే ♦ నమరితపస్సును గావించునతఁ డిందుఁ ♦ గల్లలాడు
వాఁడును క్రూరుండు ♦ వంచకుండునుఘాతకుఁడు శాస్త్రమార్గంబు ♦ విడిచిస్వేచ్ఛ
వర్తించువాఁడును ♦ బ్రదుకంగనేర రిమ్ముని మహాత్వం బిట్టి♦దని యెఱుఁగుము
క్రతుభుజుల్ యక్షులు ♦ కాకోదరంబులు పక్షులు భోజనా♦పేక్షనియతిఁ

ఆ. గనఁగఁ జేసి ధర్మ♦మునె యాచరింపుచు, దానిఁ గొల్వ నిచటఁ♦దమి నివాస
మొప్పఁ జేసికొనుచు ♦ నిప్పుడు నున్నట్లు, వినినవాఁడ నిందుఁ ♦ గనెద నిట్లు.

చ. వినుమిట సాధుచిత్తు లగు ♦ విప్రులు భక్తిఁ దపంబు సేసి సి
ద్ధినిఁ గని మానుషంబయిన ♦ దేహముఁ దాల్చి దివాకరాభమై
తనరెడి వ్యోమయానసము♦దాయము నెక్కి దివంబు నొంది, రి
మ్మునివరు నాశ్రమస్థలిని ♦ మోదమునం దముఁ గొల్చువారికిన్. ౯౨ 304

తే. కరుణ దివిజులు దేవయ♦క్షత్వములను
బహువిధములగు రాజ్యాధి♦పత్యములను
నిత్తు రిటఁ జేరితిమి నీవు ♦ నిపుడె మునికిఁ
జెప్పు నే సీతతోడ వ♦చ్చిన తెఱంగు. ౯౮ 305

పదునొకండవ సర్గము సంపూర్ణము.

---

౧౨ - వ సర్గము.

శ్రీరాముఁ డగస్త్యాశ్రమమును బ్రవేశించుట.

చ. అనవిని రాఘవానుజుఁ డ♦హార్యతపోధనుఁ డైన యాయగ
స్త్యునిదగు నాశ్రమస్థలిని ♦ జొచ్చి మునీంద్రునిశిష్యు నొక్కనిం
గని నికటంబుఁ జేరి నృప♦కాంతుఁడు పంక్తిరథుండు భూస్థలిన్
దనరు దదగ్రసూనుఁడు [2]ని♦తాంతబలాఢ్యుఁడు రాముఁ డిత్తఱిన్. ౧౪ 306

క. మునినాథు నగస్త్యునిఁ దాఁ, గనఁ గోరి కళత్రమైన ♦ క్ష్మాపుత్త్రికతో

1 శ్రీమాన్ వినీతజనసేవితః-అనిమూలము. 2 జ్యేష్ఠస్తస్య సుతో బలీ-అనిమూలము

డను వచ్చినాఁడు లక్ష్మణుఁ, డనువాఁడను నేను రాము ♦ ననుజుఁడ హితుఁడన్.

క. [1]అనుకూలుఁడ భక్తుండను, మునిపుత్త్రా! రాఘవునకు ♦ ముద మొనఁగూర్పం
గను జాలిన కృత్యంబుల, నొనరుచుచుందును సతంబు ♦ నొక్కవిధమునన్.

క. జనకుని యానతి మువ్వుర, ము మే మీ భయదవిపిన ♦ మును జొచ్చితి మి
మ్మునిచంద్రుని మహితాత్మునిఁ, గనఁదలఁచితి మివ్విధంబుఁ ♦ గరుణఁ దెలుపుమా.

చ. అనవిని యాతపోధనుఁడు ♦ హర్షముపొంగఁగ నట్లె యంచు నా
యనకలవార్తలం దెలుప ♦ నగ్నిగృహంబున కేగె; నాయగ
స్త్యునిమది కెంతొ సమ్మతిని ♦ నొప్పుగఁ గూర్పఁగఁ జాలుశిష్యుఁ డో
య్యన నటుచొచ్చి మౌనినివ ♦ హాధిపు దుష్ప్రసహున్ దపోధనున్. ౯౹ 310

క. కని లక్ష్మణుండు చెప్పిన, యనువున రఘురాముఁరాక ♦ నతనికిఁ దెల్పన్
మనమునఁ దలంచి కరయుగ,మును మోడ్చి వచించె వినయ ♦ మున మునివర్యా.

సీ. దశరథభూనాథ ♦ తనయులు రామలక్ష్మణులు నా జనకభూ ♦ కాంతుతనయ
యగు సీతయును మన ♦ యాశ్రమంబును జొచ్చి రయ్యరిసూదను ♦ లనఘ! నిన్నుఁ
గనఁగోరి యున్నారు ♦ గావున నీకఁ జేయవలసినకార్యంపు ♦ భంగి నెల్ల
నానతి యిం డన ♦ నాతనివలన రాఘవుఁడు సౌమిత్రి భా ♦ గ్యవతి సీత

తే. వచ్చుట నెఱింగి యాతని ♦ వలను చూచి
నాయదృష్టవశంబున ♦ నన్నుఁ జూడఁ
జాలకాలంబునకు రఘు ♦ సత్తముండు
వచ్చినాఁ డాతఁడు నిట రా ♦ వలయు ననుచు. ౧౦ 312

క. చిరకాలమునుండి హృదం,తరమునఁ గోరుచునె యుంటిఁ ♦ ద్వరఁగాఁ బొమ్మా
తరుణీమణి భూపుత్త్రియు, నిరువురు సోదరులుఁ బూజ్య ♦ లే యగుదురు సూ. ౧౧

క. త్వరితముగ వారి నాపరి,సరమునకుం దోడి తెమ్ము ♦ జాగేల మహీ
వరులను బూర్వమె చేర్పక, విరామముం జేసితేల ♦ విప్రకుమారా. ౧౧౹ 314

చ. అనియిటు ధర్మవేత్తయగు ♦ నమ్మునిపల్కిన జాగు సేసినం
దునఁ గయిదమ్మిమోడ్చి యిదె ♦ తోడ్కొనివచ్చెద నంచు భక్తిమైఁ
దనకరయుగ్మముఁ ముడిచి ♦ తత్క్షణమే చని రాముతమ్మునిం
గని రఘురాముఁ డేడ? ముని ♦ కాంతునిఁ జూడఁగ నిచ్చె రాఁ దగున్. ౧౩ 315

క. తానే లోపలి కేగం,గా నో నని పల్క వినుచుఁ ♦ గడువడిఁ జని య
మ్మౌనికుమారునితో నృపసూనుఁడు కనిపెట్టి యున్న ♦ చోటికి నచటన్. ౧౪

చ. జనకజఁ గూడియున్న నృప ♦ సత్తముఁ జూపెను బ్రహ్మచారికిం
త నతఁడు ప్రశ్రయం బలరఁ ♦ దద్రఘువర్యునిఁ బూజనీయుఁ జ

---

1 భ్రాతా త్వవరజో హితః, అనుకూల శ్చ భక్త శ్చ-అనిమూలము.

క్కనివిధిఁ బూజలం దనిపి ♦ గ్రన్నన లోనికిఁ దోడుకొంచుఁ బో
యెను; సహజన్ముతోడ మిథి♦లేశునిపుత్త్రికతోడ రాముఁడున్. ౧౯ 317

సీ. తాను బ్రవేశించె ♦ దత్థ్సలంబున శాంతమును గన్న హరిణాళిఁ♦గనుచు నంత
నయ్యాశ్రమమున బ్ర♦హ్మస్థానమును, నగ్ని విష్ణుశతక్రతు♦విధుదివాక
రులస్థానములఁ గుబే♦రునిస్థానమును, భగుండను దేవతాస్థాన♦మునుమఱియును
ధాతృవిధాతృవా♦తస్థానములను శేషస్థానమును బ్రభా♦శాలియైన

తే. యయ్యనంతుని స్థలము గా♦యత్త్రి స్థలము
వసునివాసంబు, మహితుండు ♦ పాశహస్తుఁ
డైన వరుణుని స్థలము ష♦డాననుని ని
వాసమట్టులె ధర్మని♦వాసముఁ దగ. ౨౦ 318

చ. కనుచును బోవుచుండఁగ న♦గస్త్యమహర్షి యు శిష్యసంఘముల్
వెనుకనె రాఁగ రాముఁ గను♦వేడ్క నెదుర్కొనె, రాముఁ డంతటన్
ఘనతరతేజము ల్వెలయఁ ♦ గ్రాలు మునీంద్రులముందు వచ్చు న
మ్మునిపతి నయ్యగస్త్యు నతి♦మోదము మీఱఁగఁ గాంచి యంతటన్. ౨౧

చ. సిరి వెలయంగనున్న తన♦చిన్నిసహోదరుఁ గాంచి లక్ష్మణా!
పరమతపస్వి వచ్చెడిని ♦ భవ్యతమాయతకాంతి రూపవి
స్ఫురితుని నీతనిన్ సుకృతి♦పుంజతపంబులకెల్ల స్థానమై
పరఁగు నటంచుఁ జూచెదను ♦ భద్రములెల్లఁ జెలంగు నింతటన్. ౨౨ 320

చ. అనుచు మహాభుజుండు దివ♦సాధిపవర్చసు నయ్యగస్త్యునిన్
గని పరమప్రమోదము త♦గం జని యాతనిపాదపంకజం
బును గరమర్థిఁ బట్టుకొని ♦ భూరితరంబగు భక్తి మ్రొక్కె *శ
త్రునికరకాలుఁ డా రఘువ♦రుండును ధర్మవిదుత్తముం డొగిన్. ౨౩ 321

క. కరములు మోడిచి నిలిచెన్, దరణీమణితో సుమిత్త్ర♦తనయునితోడన్;
ధరణీసురమౌనియు రఘువరు నాతిథ్యమునఁ గొనుచుఁ ♦ బరవస మలరన్. ౨౪

ఆ. ఆసనం బొసంగి ♦ యర్ఘ్యపాద్యము లిచ్చి, కుశలమడిగి యుచటఁ ♦ గూరుచుండుఁ
డని వచించి యంత ♦ నగ్నికృత్యంబుల, జరపి వారికెల్ల ♦ సలిపెఁ బూజ. ౨౫

క. వానప్రస్థులధర్మముఁ, బూని ఫలంబులను మూల♦ముల భుక్తికి నై
మాని యొసంగెను బిదపన్, దానే తొలిఁ గూరుచుండె♦ధర్మ మెఱుఁగుటన్.

తే. హస్తములు మోడ్చి కూర్చుండి♦నట్టి రాము
ధర్మకోవిదుఁ గని పల్కెఁ ♦ దమి మునీశుఁ
డార్య వైశ్వదేవమ్ము స♦మాచరించి
యర్ఘ్యము నొసంగి పూజింప♦ నౌ నతిథిని. ౨౭ 325

* తస్యపాదౌ పరంతపః-అనిమూలము.

క. కాకుత్స్థా! మునియగువాఁ, డీకరణి సమాచరింప ♦ కింకొక రీతిం
గైకొని యతిథికిఁ దగు పూ,జాకృత్యము తోఁచినట్లు ♦ సల్పునయేనిన్. ౨౯

—అగస్త్యుఁడు రామునకు దివ్యాస్త్రము లిచ్చుట.—

*క. అనృతపు సాక్ష్యముఁ బల్కిన, మనుజునికరణిన్ స్వకీయ♦మాంసమ్మునె తాఁ
దినుఁ బరలోకంబునఁ గా,వున నిట్టులె యతిథిపూజఁ ♦బోలును జేయన్. ౩౦

సీ. నీవు రాజవు లోక♦నిచయంబునకు మహారథుఁడవు ధర్మాచ♦రణపటిష్ఠుఁ
డవు పూజఁ గొనఁదగు♦దువు మాన్యుఁడవు రామ యిట్టి ప్రియాతిథి♦వెన్ననీవు
ప్రాప్తించితివి నాకుఁ ♦ బరమభాగ్యంబున నని పల్కి దివ్యఫ♦లాళిమూల
ముల సుమంబుల వనం♦బులఁ గల్గు నితరపదార్థంబులను విధి ♦ తప్పకుండ

తే. రామునకు నిచ్చి పూజించి ♦ ప్రేమ మఱియుఁ
బలికె నరపుంగవా! దివ్య♦భర్మరత్న
భూషితం బిది చాపంబు ♦ భూరితరము
వైష్ణవము విశ్వకర్మసం♦భవము సుమ్ము. ౩౨ 328

క. హరిదశ్వకరణి వెలిఁగెడు, శరమియ్య దమోఘమగును ♦ శతధృతిదత్తం
బురుతరముసుమ్ము మఱి శిత, శరసంపూర్ణములు వహ్ని♦సమభాసురముల్. ౩౩

తే. శరము లక్షయములగుచు ♦ సతము గ్రాల
నున్న తూణీరయుగ మిది ♦ మున్ను జంభ
శత్రు విచ్చెను స్వర్ణకో♦శంబు భర్మ
భాసురము ఖడ్గ మిది జంభ♦వైరి యొసఁగె. ౩౪ 330

చ. సరసిజనేత్రుఁ డీమహిత♦చాపముఁ బూని రణంబునందు దే
వరిపుల సంహరించి సుర♦వర్యుల కుజ్జ్వలసంపదన్ మనో
హరగతి నిచ్చెఁ దొల్లి జయ♦మందఁగ నీ ధనువున్ శరంబు భీ
కరవరఖడ్గతూణములు ♦ గైకొను మింద్రుఁడు వజ్రమున్ బలెన్. ౩౫ 331

క. అనిపల్కి మహాతేజుఁడు, ఘనశక్తి యగస్త్యమౌని♦కాంతుఁడు శ్రీరా
మున కవ్వరాయుధంబులఁ, గొనుమా యని యిచ్చి మరలఁ♦గూర్మిం బలికెన్.

పండ్రెండవ సర్గము సంపూర్ణము.

---

౧౩ - వ సర్గము.

—రాముఁ డగస్త్యాశ్రమమునుండి పంచవటికి బయలుదేరుట—

క. రామా! సౌమిత్రీ! మీ, రీమానినితోడఁ గూడి ♦ యిటు మ్రొక్కఁగ నెం
తేమది భక్తిని వచ్చితి, రీ మన్నన కలరినాఁడ ♦ నెంతయుఁ బ్రీతిన్. ౧ 333

* దుస్సాక్షీవ పరే లోకే స్వాని మాంసాని భక్షయేత్ -అనిమూలము.

సీ. మార్గంబునడుచు శ్ర ♦ మంబున మీఁకు స్వేదము పోసి మిగుల బా ♦ధలఁగనంగఁ
జేయుచున్నది యిదె ♦ సీతయు సుకుమారి శ్రమముకోర్వక యె వి ♦ శ్రాంతిఁగోరు
చున్న దియ్యెడ నను ♦ టూహింప స్పష్టమై కనుపట్టుచున్నదీ ♦ కాంత మిగుల
సుకుమారి కష్టముల్ ♦ సోఁకఁగా బాధల నందినయదిగాదు ♦ సుందరాంగి

తే. పతిపయింగల నెయ్యంబు ♦ వలనఁ దాను
బురికొలుపఁబడి బహుదోష ♦ పుంజములకు
వాసమగు విపినమునకు ♦ వచ్చియున్న
దీమె యిందెట్టు లలరునో ♦ యింపుమీఱ. 334

క. నీ వవ్విధమును దమితోఁ, గావింపుము దుష్కరముగు ♦ కార్యము నీతో
నీవిపినమునకు వచ్చుట, నీవిమలాంగియె యొనర్చె ♦ నెంతయుఁ బూన్కిన్. ౩

క. పెనిమిటి భాగ్యాదులతోఁ, దనరిన నలరింతు రతని ♦ దశ మాఱినచో
వనితలు దిగవిడుతురు సూ, గన రామా! సృష్టి మొదలుఁ ♦ గా నెలఁతలకున్. ౪

ఆ. ఇది స్వభావకర్మ ♦ మే యగు వనితల, మనసు మెఱుపుఁదీఁగె ♦ మాడ్కిఁ జంచ
లతను గాంచుఁ బ్రేమ ♦ లత నట్టె వసలును, గానఁ గత్తివాఁడి ♦ కరణినుండు. ౫

క. వెనుకకు ముందుం జూడక, పని దేని గాని చేయఁ ♦ బాటుపడును గా
వున గరుడానిలులకు మించిన వేగము గల్గియుండు ♦ సిద్ధము రామా. ౬

సీ. నీభార్యకన్ననో ♦ నిఖిలదోషమ్ముల యం దొక్కఁడైన లే ♦ దరయ నీమె
శ్లాఘింపఁదగినది ♦ సాధ్వీశిరోమణి యని యరుంధతిరీతి ♦ ననఁగఁదగును
శత్రునిషూదనా! ♦ సరసమతీ! రామ! సౌమిత్రితోడ నీ ♦ సాధ్వితోడ
వచ్చి యీస్థలమున ♦ వసియించుటం జేసి యీయాశ్రమస్థల ♦ మెల్ల నిపుడు

తే. భూషితంబయ్యె నని ముని ♦ పుంగవుండు
పల్కఁ గరములు ముకుళించి ♦ ప్రజ్వరిల్లు
చున్న శుచిరీతి వెలుఁగుచు ♦ నున్నమానిఁ
గాంచి రాముఁడు వినయంబు ♦ గ్రాలఁ బలికె. ౯ 339

క. అనుజునిగుణములు భార్యా, ఘనగుణములుఁ జూచి మాని ♦ కాంతుఁడు వరదుం
డనఁబడు నీ వలరెతి కావున ధన్యుఁడ సుకృతమతిని ♦ బోలఁగ నైతిన్. ౧౦

తే. అనుగృహీతుండ నైతి నెం ♦ దాశ్రమంబు
గట్టుకొన సుఖమెంతయుఁ ♦ గాన నగునొ
యట్టిస్థలమును జెప్పు మ ♦ య్యాది వనాళిఁ
దనరి యాపన్నుమృద్ధిఁ బొం ♦ దనగుఁ జుమ్ము. ౧౧ 341

చ. అనవిని ధర్మచిత్తుఁడగు ♦ నమ్ముని యొక్కముహూర్త మాత్మలో
నన తలపోసి సర్వము మ ♦ నంబునఁ దోఁచుట ధీరుఁడై వచిం
చెను ఫలమూలసంతతిని ♦ శీతజలంబుల నొప్పి రెండుయో
జనములదూరమందు మృగ ♦ సంఘయుతంబగుచోటు రాజిలున్. ౧౨ 342

క. సిరులం దులఁ దూఁగుచు నా, ధరణియుఁ బంచవటి యనఁగఁ♦దనరారుమహీ
శ్వర! నీవు వీరిఁ దోడ్కొని, యరిగి సుఖాశ్రమపదంబు ♦ నందొకచోటన్.

తే. కట్టుకొని తండ్రి చెప్పిన ♦ కరణి వాక్య
పాలనము చేయుచుండ్ల మనో♦వాంఛ తీఱ
నందుఁ గ్రీడించుచుండుమా ♦ యాస్థలంబు
నీకు సుఖహేతువై యుండుఁ♦గాక రామ. ౧౪ 344

సీ. రాఘవా! యద్దశ♦రథుండు కావించిన సమయమురీతి వ♦నమున నుండఁ
దగినట్టి యాచతు♦ర్దశవత్సరంబులయం దించు మించుగా ♦ నరిగెఁ జాల
కాలంబు ప్రతిన చ♦క్కఁగఁ దీర్చుకొని నీవు రాజ్యంబునొంది మ♦రలసుఖంబు
గా నుండఁగలవు రా♦ఘవ! యా యయాతిచందమున నీజనకుండు♦తనకుఁ బెద్ద
తే. తనయుఁ డైనట్టి నీచేతఁ ♦ దనప్రతిజ్ఞఁ
దీర్చుకొనియెనుగాన శ్రీ♦తిప్రభుండు
ధన్యుఁ డయ్యెను; విను నాకు ♦ దశరథుపయిఁ
గల్గు నెయ్యంబునం దప్ర♦కలితమహిమ. ౧౫ 345

క. జరగిన యా వృత్తాంతముఁ, బరిపూర్ణముగా నెఱుంగఁ♦బడియెం జుమ్మా
పరమకృపాకర! శ్రీరఘువర! యింకొకమాటఁ జెప్ప♦వలసె న్నాకున్. ౧౬

చ. వినుము తపఃప్రభావమున ♦ వేడుకతోడఁ ద్వదాశయంబు నేఁ
గనుఁగొనినాఁడ సర్వమును ♦ గావున నిందును నన్నుఁగూడి యుం
డను దగ సమ్మతించి రఘు♦నాథ! త్వదాశయ మెల్లఁ గాంచి పో
మ్మని వచియించినాఁడను సు♦ఖార్హముగాఁ దగుచోటి కిత్తఱిన్. ౧౭ 347

ఆ. ఆవనప్రదేశ ♦ మత్యంతరమణీయ, మగును వేడ్క నందు ♦ నవనితనయ
విమలచిత్తమలర ♦ విహరింపఁ గలదు శ్లాఘ్యంబు దాపునం దె♦యలరుసదియు.

సీ. ఆపంచవటికి న♦త్యంతసమీపంబునందు గోదావరి ♦ యనునదియును
బ్రవహించుఁ గావున ♦ వనజాతనేత్ర సీతయు నదిదాపునఁ ♦ దాను గ్రీడ
సేయంగవచ్చు; నా♦క్షితి మూలఫలములు సర్వకాలంబుం డు ♦ సకలపక్షి
జాతులు గలవు ని♦ర్జనముగా విలసిల్లు నో దీర్ఘబాహూ! య♦దొప్పుఁ బుణ్య
తే. మగుచు రమణీయమై గాన ♦ ననుఁగుఁబత్ని
యుతముగా నీవు వసియింప ♦ నొప్పు నందు
నార్తరక్షణశక్తుండ ♦ వైననీవు
పంచవటియందె నివసింప♦వలయుఁ జుమ్మ. ౨౨ 349

క. వినుమా! యట వసియించుచు, మునివర్యులఁ బ్రోవఁగలవు ♦ ముందిదిగో య
వ్వనమలరు నిప్పచెట్లటఁ, గనఁబడు నో వీర! చూడఁ♦గల వవ్వానిన్. ౨౩

ఆ. ఆవనంబునుండి ♦ యరుగు ముత్తరమున, కందు వటమహీరు♦హంబు గలదు

దానికడకుఁబోవఁ ♦ దరువాత నాదారి, నాశ్రయించి ముందు♦నరిగి తేని. ౨౩౪

క. ఉన్నతభూమియుఁ గన్పడు, నన్నెలవును నెక్కి నొక్క♦యద్రివరము నీ
కన్నులకెదుటం దోఁచు న,మున్నతసుగుణా! యనంత♦రోర్వికిఁ జెంతన్. ౨౮

క. విలసిల్లుఁ బంచవటి యను, స్థలమందలి వనములెల్ల ♦ సమధికపుష్పం
బుల నొప్పుచుండునని ముని, పలుకఁగ విని రఘువరుండు ♦ ప్రమదం బలరన్.

క. ఋతవాదియైన యమ్ముని, శతమఖుఁ బూజించి పాద♦సరసిజముల కు
న్నతభక్తి మ్రొక్కి లక్ష్మణు, సతిఁ గూడి యనుజ్ఞవడసి ♦ సత్వరగతితోన్.

తే. పంచవటికేగె నంత భూ♦పతికుమారు, లిరువు రమ్ములపొదులనెం♦తేనిపూన్కిఁ
దాల్చి ధనువులఁ బట్టి య♦త్తపసి చెప్పి, నట్టి త్రోవ హెచ్చరికల♦నరిగి రంత.

పదమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౧౪ - వ సర్గము.

-జటాయుదర్శనము. అతఁడు రామునకుఁ దనవృత్తాంతమును దెల్పుట.-

చ. అరుగుచు నంత రాముఁడు [1]భ♦యంకర శౌర్యము దీర్ఘకాయముం
బరఁగఁగ నున్నగృధ్రమును ♦ బంచవటీనికటంబునందుఁ గాం
చె; రఘుకులైకవీరు లొక ♦ సిద్ధవటద్రుమసంస్థుఁ గాంచి భీ
కరసురవైరిగాఁ దలఁచి ♦ గాఢరవంబునఁ బల్కి రివ్విధిన్. ౧౪ 356

చ. ఎవఁడవు నీవు మత్త్రిపయి ♦ నేల వసించెద వన్న వారిగృ
ధ్రవరము గాంచి చాలమధు♦రంబగు వాక్కతిఁ బ్రీతిఁ బుట్టఁజే
యువిధమునన్ రఘూత్తముని ♦ నోయయ్యన వత్స! యటంచుఁ బిల్చి భూ
పవరుఁడు మీకుఁ దండ్రియయి ♦ భాసిలు [2]నాజికి నేను మిత్రుఁడన్. 3 357

క. జనకునకు వయస్యునిఁగా, నను నెఱుఁగుము వేఱుగా మ♦నంబునఁ దలఁపం
జన దనఁ బితృసఖునిఁగ నా,తనిఁ దలఁచుచుఁ బూజచేసి ♦ దా నెచ్చరికన్.

క. కులనామంబుల నడుగన్, దొలినుండియు భూతసంత♦తులు పుట్టుట ని
మ్ములఁ జెప్పఁదలఁచి తనదా, కులమును జెప్పంగఁబూని ♦ కోరికఁ బల్కెన్.

క. విను మాదినుండి యిజ్జగ, మున దీర్ఘభుజా! ప్రజేశ♦ముఖ్యులుగా నుం
డినవార లెవ్వరెవరో, వినిపించెద దాని విన్న ♦ వేడుక కలుగున్. ౬ 360

సీ. వారిలోఁ గర్దమా♦హ్వయుఁ డాద్యుఁడగునంత విక్రీతశేషులు ♦ [3]వితతపుత్రుఁ
డయి శౌర్యశాలియు ♦ నగు సంశ్రయుండును స్థాణు మరీచ్యత్రి♦సంజ్ఞలు మఱి
యతిబలుండగు క్రతు♦వను వాఁడును బులస్త్యుఁ డంగిరసుండును♦నటు ప్రచేత
సుఁడు పులహుండు ద♦క్షుఁడు వివస్వతుఁడు ప్రజాపతులైరి; తే♦జమున వెలయు

---

1 గృధ్రం భీమపరాక్రమమ్-అని మూలము. 2 ఆజి=అజమహారాజుకొడుకు దశరథుఁడు.
3 వితతపుత్రుఁడు=బహుపుత్రులు కలవాఁడు. బహుపుత్రశ్చ వీర్యవాన్-అనిమూలము.

ఆ. చును నరిష్టనేమి ♦ యను మఱి యొకపేరఁ
బరఁగు కాశ్యపుండు ♦ పతియు నయ్యె
దక్షునకును గీర్తిఁ ♦ దనరు వారలువది
మంది తనయలౌట ♦ మనమెఱుఁగమె. ౧౨ 361

సీ. శుభమధ్యమలుగాఁగ ♦ శోభిల్లుచుండిరి వారిలోఁ గశ్యప♦బ్రహ్మ ప్రేమ
నదితిని దితి దను♦వనుదానిఁ గాళికఁ దామ్రను మఱియుఁ గ్రో♦ధవశ మనువు
ననలను నెనమండ్ర ♦ నంతటఁ బెండ్లాడి; యాకన్యకలఁ గాంచి ♦ యతిశయప్ర
మదమునఁ బల్కె నో ♦ మానినులార! మత్సములను సుతుల ము♦జ్జగము లేలు
తే. శక్తిగలవారిఁ గనుఁడని ♦ సరసమతిని
బలుక నమ్మాట కదితి యర్ధ♦వనిత దితియుఁ
గాళికయు సమ్మతించిరి ♦ గాని తక్కు
గల్గువారలు సమ్మతిఁ ♦ గాంచరైరి. ౧౩ 362

[1]క. పురుషవరా! గురుబాహూ!, పరజనసూదన! మహాత్మ! ♦ వరుస నదితి భా
స్కరులను బన్నిద్దఱ భీకరతేజుల శక్తియుతులఁ ♦ గాంచె న్మఱియున్. ౧౪

సీ. వసువుల నెనమండ్రఁ ♦ బదునొక్కరిని రుద్రులను నశ్విదేవత♦లను నిరువురిఁ
గనియె ముప్పదిముగ్గు♦రను దేవవర్యుల నీరీతి; దితియును ♦ భూరికీర్తి [బు
యుతుల దైత్యులఁగాంచె♦నొగిమున్ను వనసముద్రములఁగూడినయాధ♦రాతలం
దైత్యులవశమునఁ ♦ దనరారుచుండెను; బరనిషూదన! హాయ♦వదనుఁ డనెడు
తే. తనయునిం గాంచె దనువను♦తరుణి కాళి
కయును నరకునిఁ గాలకుఁ ♦ గాంచెఁ దామ్ర
యనెడు నాతియుఁ [2]క్రౌంచి భా♦సిని మఱి శుకి
శ్యేని ధృతరాష్ట్రినిం గాంచె ♦ మానినులను. ౧౫ 364

క. ఈయైదుగురును జగమున, నేయెడ విఖ్యాతిఁ గాంచి ♦ యెసఁగిరి రామా!
యాయేవురలోఁ గ్రౌంచియుఁ, గూయిడు గూబలను గాంచెఁ♦గోరికమీఱన్.

సీ. భాసపక్షులఁ గాంచె ♦ భాసియు శ్యేనియు మంచివీర్యంబున ♦ మించు డేగ
లను గృధ్రములను గాం♦చెను ధృతరాష్ట్రియు హంసలమఱికల♦హంసలఁ గనె
నామెయే [3]చక్రవా♦కాహ్వయపక్షులఁ గనియె శుభంబగుఁ♦గాక నీకు
రాఘవా! శుకియను♦రమణియు నతఁగాంచె నామెయు వినతను♦నాత్మజాతఁ
తే. గనియెఁ; గ్రోధవశ యనెడు♦కాంత మృగిని
నల్లె మృగమంద యనుదాని ♦ హరిని భద్ర

---

1 ఈపద్యమందలి రామవిశేషములన్నియు మూలోక్తములే యని తెలియఁదగు. 2 క్రౌంచి, భాసిని, శుకి, శ్యేని, ధృతరాష్ట్రి=ఈయైదుగురుకన్యలు తామ్ర యనుదానిపుత్రికలు. 3 చక్రవాకాం శ్చ భద్రంతే-అనిమూలము. అప్రసక్తవృత్తాంతానాదరప్రతిషేధాయ మధ్యే భద్రంతే ఇత్యుక్తిః-అనివ్యాఖ్య.

మదను మాతంగి శార్దూలి ♦ మఱియు శ్వేత
సురభిఁ గద్రువఁ గాంతయా ♦ సురసఁ గనియె. ౨౬ 366

సీ. నరవరా! యీపదు♦గురిలోన మృగకిని హరిణగణంబెల్ల ♦ నాత్మజత్వ
మొందెను; మఱి మృగ♦మందకు భల్లూకములుచమరాహ్వయం♦బులుజనించె
హరి యనుదానికి ♦ నతివేగమునఁ బాఱు వానరంబులు సింహ♦వార మట్లె
జనియించె నవ్వల ♦ విను భద్రమద కిరావతి యను కాంత సం♦భవముగాంచె
తే. నామెకేలోకమున మేటి♦యై తనరెడు
నాగ మైరావతంబను ♦ నామ మలరఁ
బుట్టె మాతంగికిం గరుల్ ♦ పుట్టెఁ బురుష
సింహ! రఘువర్య! యవ్వలఁ ♦ జెప్పువాఁడ. ౨౭ 367

క. తనయుల శార్దూలియుఁ దాఁ, గనె గోలాంగూలములను ♦ గడుభయదములై
తనరెడు వ్యాఘ్రంబుల; శ్వే,తనామ్నిగనె దిగ్గజముల ♦ దశరథతనయా. ౨౮

క. సురభికి రోహిణియు యశో,గరిమం దగుచున్నయట్టి ♦ గంధర్వియు ని
ర్వురు పుత్రిక లుదయించిరి, *పరమశుభం బలరుఁగాక ♦ వరగుణ! నీకున్. ౨౯

సీ. అందు రోహిణి గాంచె♦నావుల, గంధర్వి హయరత్నములఁ గాంచె♦నంత సురస
పెక్కుశిరస్సుల ♦ వెలయు నాగంబులఁ గనియెఁ గద్రువయును ♦ గాంచెఁ బన్న
గంబుల, మనువను ♦ కాశ్యపునిల్లాలు, బ్రాహ్మణక్షత్రియ♦వైశ్యశూద్రు
లని ప్రశస్తిని గన్న ♦ మనుజులఁ గాంచెను ననలయుఁ బుణ్యఫ♦లాళిఁ దనరు
తే. వృక్షములఁ గాంచె; శుకికి న♦వ్వినత పౌత్రి
యగును, గద్రువ సురసకు ♦ నగును జెల్లె
లందుఁ గద్రువ శీర్షస♦హస్ర మలర
ధరణి భరియించు శేషుని ♦ దాను గనియె. ౩౦ 370

క. వినత కనూరుఁడు గరుడుఁడు, తనయులు ఖలగర్వహరణ ♦ ధాత్రీరమణా!
వినుమ యనూరునకు నేఁ, దనయుండను శ్యేని నాదు♦తల్లియగుఁ జుమీ.

తే. అగ్రజుండగు సంపాతి ♦ యనెడుపక్షి
వర్యుఁడు; జటాయు వనుపేరఁ ♦ బరఁగువాఁడ
నేను వనవాసమందును ♦ నీవు కోరు
దేని సాయమొనర్చెద ♦ మానసీయ. ౩౨ 372

చ. వనమున నిందుఁ గ్రూరమృగ♦వారము రాక్షసు లుండువారు గా
వున నిది దుర్గమంబు నను♦బోఁటి సహాయుఁడు గల్గియున్న ని

* రోహిణీం నామ భద్రం తే-అని మూలము. ఇది పాఠకులకుం గూడ శుభప్రదమను నభిప్రాయము వాల్మీకిదని వ్యాఖ్యాత లందందు వ్రాసిరి.

వ్వనమున నీకు మేలు, రఘు♦వర్య! సహోదరుతోడ నీవు నెం
దును జనినన్ ధరాత్మజను ♦ దోరపుశక్తిని గాచుచుండెదన్. ౩౩ 373

చ. అనవిని యాజటాయువును ♦ హర్షము మీఱఁగఁ గౌఁగిలించి యా
తనిఁ దమి సత్కరించి వివి♦ధప్రియభాషలఁ దండ్రికిం దగన్
దనకును గల్గుసఖ్యము సు♦దారమతిన్ వచియించునప్పుడె
ల్లను వినుచున్ నమస్కృతి ని♦లాపతి బాంధవయుక్తిఁ జేసెఁ దాన్. ౩౪

ఆ. ఆత్మవేత్త యయిన ♦ యారాముఁ డంత భూ,తనయ నాజటాయు♦వునకు రక్ష
ణార్థ మప్పగించి ♦ యతులబలాఢ్యుఁడై, తనరు నతనితోడ ♦ ననుజుఁ గూడి.

క. వనితామణితో శలభము, ననలుండు దహించునట్టు ♦ లరులం గూల్పం
గను గోరి పంచవటికిం, జని యందుం జొచ్చె నతుల ♦ సాహస మలరన్. ౩౫

పదునాలవ సర్గము సంపూర్ణము.

---

## ౧౫ - వ సర్గము.

రాముఁడు పంచవటియందు నివాసము చేయుట.

తే. అంత రాముఁడు బహువిధా♦త్యంతకుటిల
భుజగమృగసంకులంబయి ♦ పొలుచు పంచ
వటిని జేరి తేజంబున ♦ వఱలు ననుజుఁ
గాంచి పలికెను, సౌమ్య! యి♦క్కడకు మనము. ౧ 377

క. మునిపతి చెప్పినచొప్పునఁ, జనుదెంచితి మిదిగొ కుసుమ♦జాలావృతకా
ననములు గలయీభాగమె, తనరుం బంచవటి యనఁగ ♦ ధన్యతమంబై. ౨

క. వనమును నెల్లెడఁ జక్కఁగఁ, గనుఁగొనుమా! యాశ్రమంబుఁ♦గట్టఁగఁదగు నెం
దని చూచు నేర్పు నీకును, [1]జనితోఁ బుట్టినదిగాదె ♦ సౌమిత్రి, యిఁకన్. ౩

తే. ఏప్రదేశమ్మునన్ మన♦కెల్లరకును
సమ్మతంబుగ నాశ్రమ♦స్థలము గుదురు
నద్ది వైదేహికిని నాకు ♦ ననుజ! నీకు
సంతసము పుట్టఁజేయఁగాఁ ♦ జాల వలయు. ౪ 380

[2]సీ. సన్నికృష్టంబున ♦ సరసులుండం దగు నందుఁ జాతాదివ్య♦తోయలరు
చుండంగవలయు సం ♦ దొప్పువనంబులు రామణీయకమున ♦ రాజిలంగ
వలయుసీతయును బూ♦వులఁ గోసికొని వేడ్కఁగనదగియుండంగఁ♦గ్రాలవలయు
నిమ్నోన్నతంబయి ♦ నేల యుండక సుఖశయనాదులకుఁ దగి ♦ శర్మదాయ

---

1 జనితోన్=పుట్టుకతో. 2 వన మారణ్యకం యత్ర స్థలరామణ్యకం యథా, సన్నికృష్టం చ యత్ర స్యా త్సమిత్పుష్పకుశోదకమ్ - అనిమూలము. దీనికి గోవిందరాజులు వ్రాసినయర్థమే యీపద్యమునఁ జెప్పఁబడినది.

ఆ. కముగ నుండవలయుఁ ♦ గడుమెత్తగా నిసు,కయును గ్రావలయుఁ ♦ గమ్రకుసుమ
దర్భలును జలంబుఁ ♦ దన్నికటంబున, సమిధలుండవలయు ♦ సరసధిషణ! ౫
క. అనుజా! యీలాటిస్థలం,బును వెదకుము యనియె రామ ♦ భూవిభుఁ డిటు వ
ల్కిన లక్ష్మణుండు కరయుగ,మును మోడిచి యవనిజాత ♦ మ్రోల నచించెన్.
[1]సీ. నీకును సీతకు ♦ నెమ్మిఁ బుట్టించెడు స్థలమునయందె యా♦శ్రమముఁ గట్టు
మని చెప్పఁదగు నాకు ♦ ననుభావమలరంగఁ బరతంత్రుఁడనయియేఁ ♦ బరఁగువాఁడఁ
గాని స్వతంత్రుండఁ ♦ గాను నేనెప్పుడు శతవత్సరములైన ♦ హితమతివయి
యువ్వనంబున నుందు ♦ వేని నీదాసుఁడనై యుండువాఁడ న♦ట్లాట నాకు
ఆ. నింపుఁ గూర్చునట్టి ♦ యిలపయి ననక నీ,కింపుఁ గూర్చుచోట ♦ నిపుడె కట్టు
మాశ్రమం బటంచు ♦ నానతియిమ్ము నే,పాదసేవకుండఁ ♦ గాదె నీకు. ౭ 383
క. అనిన మహాత్ముఁడు లక్ష్మణుఁ,డను నప్పల్కులకు మోద♦మలరఁగఁ జక్కం
గను నందు విమర్శించుచు, ననుపమగుణసంఘయుక్త ♦ మైనస్థలంబున్. ౮
ఆ. ఒక్కచోటఁ గాంచి ♦ యురుతరరమణీయ
మయిన యాప్రదేశ♦మందు నాశ్ర
మంబుఁ దనకుఁ గాఁగ ♦ మమతఁ గట్టింపంగఁ
దలఁచి యతనిహస్త♦ములను బ్రీతి. ౯ 385
[2]క తనకయిఁ బట్టుకొనుచు నిటు, ననురాగముతోడ సౌమ్య! ♦ యనిపల్కె నిటన్
గన నిమ్నోన్నతహీనము,గ నున్న దీ స్థలము సిరులఁ ♦ గమనీయంబై. ౯ 386
క. తరువులు పుష్పోత్కరముల, నరుదుగఁ జూపట్టి యున్న ♦ వాశ్రమమిందున్
బరికించి శాస్త్రహితముగ, వరుస న్నిర్మింపవయ్య! ♦ బాగుగ నింకన్. ౧౦
చ. సరసిజమిత్రురీతి రుచి♦జాలము పర్వుచునుండఁ దామరల్
వరుస సువాసనల్ వెలయ ♦ భాసిలఁగా సిరి కాలవాలమై
యరుదుగ సంతసంబిడుచు ♦ నల్లదె చెంతనె పంకజాకరం
బు రమణ గానుపించెడిని ♦ బొంకముగాఁగఁ బ్రియానుజా! యిదే. ౧౧ 388
సీ. భావితాత్ముండయి ♦ వఱలు నగస్త్యుండు పలికినరీతి నీ ♦ పరిసరమున
గోదావరీనది ♦ కొమరారుచున్నది పూచి చెలంగెడు ♦ భూరుహాళు
లంతట వెలయంగ ♦ హంసకారండవపక్షు లెల్లెడలను ♦ బలసియుండఁ
జక్రవాకంబులు ♦ సరసతఁ గ్రీడింప నలరారుచున్నది ♦ యనుజకంటె;
నంత దూరముగాక ♦ యంతికమునుగాక పర్వతతతి కను♦పట్టుచున్న
తే. దందు మృగయూథములు చెర♦లాడుచున్న
వవియె కేకులు కూసెడు ♦ హారికంద

---

1 పరవా నస్మి కాకుత్స్థ త్వయి వర్షశతం స్థితే, స్వయంతు రుచిరే దేశే క్రియతా మితి మాం వద-అని మూలము. దీనివ్యాఖ్యలో నిభావసారమే యీపద్యమునఁ జెప్పఁబడినదని గ్రాహ్యము. 2 హస్తౌ గృహీత్వా హస్తేన-అనిమూలము.

రాళ్లి కనుపట్టుచున్నది ♦ యమలకుసుమ
నిబిడతరువులు వెలసెడు ♦ సొబగుమీఱ. ౧౪ 389

సీ. ఆయాయి దేశంబు ♦ లందుఁ గన్పడునట్టి రజతసువర్ణతా♦మ్రమయధాతు
వులు చాలఁ దోఁచుట ♦ వలన గవాక్షము లట్లు చిత్రించిన ♦ హస్తిబృంద
మట్లు శోభిలుచున్న ♦ వవియె సాలతమాలతాలఖర్జూరామ్ర♦తరువు లవియె
పనసలు జలకదం♦బకములు దిమిశముల్ పున్నాగము లశోక♦భూరుహములు
తే. తిలకకేతకచంపక♦ములును బుష్ప
గుల్మలతలెల్లఁ దముఁ జుట్టు♦కొనఁగ నొప్పఁ
బలువిధములగు వృక్షముల్ ♦ బలసియుండఁ
బర్వతము లవ్వి యెంతయు ♦ భాసిలుఁ దగ. ౧౫ 390

తే. చందనకదంబవృక్షముల్ ♦ స్పందనాఖ్య
ములును బనసలు మఱియు ని♦మ్మలు ఖదిరము
లుఁ దగు నినుమద్దులుఁ జమ్ము♦లును బలాశ
పాటలములు నుమ్మెత్తలు ♦ పరఁగు నవిగొ. ౧౬ 391

క. అనుజా! యీ దేశము పా,వనమును బుణ్యదమునగును ♦ బహుమృగపక్షుల్
గనఁబడుచున్నవి కావున, వనమున నీపక్షితోడ ♦ వసియింతుఁ జుమీ. ౧౭

క. అనవిని పరవీరాంతకుఁ, డనుపమబలుఁడై చెలంగు ♦ నాలక్ష్మణుఁ డో
య్యనఁ గట్టె నందు నాశ్రమ,మును నన్నకు మదికి నెక్కి ♦ ముదమిడుదానిన్.

సీ. అనలసగతి గాన ♦ నతఁ డాస్థలంబునఁ ద్రవ్వి గోడలు పెట్టి ♦ స్తంభములుగ
వెదురుల నిలుపుచు ♦ వెన్నుగాఁడిని వానిపయి నడ్డముగఁ దీర్చి ♦ పరఁగ దాని
కిరుప్రక్కలను నడ్డ ♦ మేగఁగ వెదురుల నలవరించుచు వాని♦యందు జమ్మి
శాఖలఁ దిర్యక్ప్ర♦సారితంబులఁ జేసి వానిరెండింటిని ♦ వల్కలశక
తే. లములు మొదలగు గట్టిత్రా♦ళ్లను నుపాయ
మలర బంధించి యందు ద♦ర్భలును బెల్లు
మొదలయిన యాకులను సొగ♦సుఁదనమొప్పఁ
గప్పి నేలను సమముగఁ ♦ గ్రాలఁ జేసి. ౧౯ 394

క. కనుఁగొనఁగాఁ దగి రమ్యం,బును నయి తగు నాశ్రమమును ♦ బొలుపగుదానిం
దనయన్నకొఱకు నిర్మిం,చెను వాసాగ్రమును నతఁడు ♦ శీఘ్రము పూన్కిన్.

ఆ. అతివిశాలమగుచు ♦ నయ్యది పొలుపారె, నంత సిరులమించు ♦ నయ్యనుజుఁడు
గౌతమికిని బోయి ♦ కడువడి జలకంబు,లాడి పద్మఫలము ♦ లాదరమున. ౨౧

క. కొని యతివేగమ మరలం, జనుదెంచెను వాస్తుకల్ప♦సరణి నచటఁ బూ
జను జేసి శాంతికర్మం,బును నిర్వర్తించి రాఘు♦వున కది చూపెన్. ౨౨ 397

క. జనకజతో శ్రీరాముం, డనుజుఁడు నిర్మించినట్టి ♦ యాయాశ్రమమున్

గని దాని సౌష్ఠవమునకు, మనమున నరుదంది సుఖని♦మగ్నుం డయ్యెన్. ౨౬

మ. పరమామోదమునంది రాఘవుఁడు త♦త్పర్ణాలయశ్రీకి ని
ర్భరమైత్రిం దగ బాఱసాచి యనుజున్ ♦ భవ్యాత్ము నాలింగన
స్ఫురదుద్యత్క్రియఁ బ్రీతుఁజేసి రసమున్ ♦ శోభిల్ల రమ్యంబునై
పరఁగం బల్కెను నీచసత్కృతికి నా♦స్వాంతంబు రంజిల్లెఁ జూ. ౨౭ 399

ఆ. గొప్పకార్య మిద్ది ♦ కోరి యొనర్చితి, విప్పునికిని మోద ♦ మెసఁగె నాకు
దాన నీకు నియ్యఁ♦దగిన కానికకుఁగాఁ, గౌఁగిలించుకొంటిఁ ♦ గరము సహజ.

*సీసమాలిక:—

చెప్పకయున్న నా♦చిత్తవృత్తి నెఱింగి క్రీడకు యోగ్యమౌ ♦ గృహము గట్టి
తివిగాన భావజ్ఞుఁ♦డవు నీవు లక్ష్మణ! చంద్రతారాబల♦సరణి మీఱ,
జనకుండు గట్టిన ♦ సద్ధర్మురీతిని, వరుస నెఱుంగుట♦వలన నీవె
యగుదు కృతజ్ఞుఁడ ♦ వవనీశపుత్త్రుఁడ వయ్యు నీకొక్క గృ♦హంబుఁ దగిన
యట్లు నిర్మింపక ♦ యన్న కానందమె ట్లగునో యటంచు రచించి ♦ యనవరతము
కైంకర్యమునకునై ♦ గాచియుండుట ధర్మవేత్తవు నీవిట్టి ♦ యుత్తముఁడవు
కానఁ బున్నామకా♦ఖ్యను బొల్చు నిరయంబునుండి కాపాడుట♦నొప్పఁ బుత్త్ర
శబ్ద మద్దానికి ♦ సరిగ నీవుండుట ధర్మాత్ముఁడైన నా♦తండ్రి మృతుఁడు

తే. కాఁడు జీవించియే యున్న♦వాఁడటంచు
నాకుఁ దోఁచుచు నున్నద♦నంగ లక్ష్మి
వర్ధనుండగు రాముండు ♦ పలుకునట్టి
వాక్యముల వినుచుండె నా♦భక్తుఁ డంత. ౨౯ 401

చ అనుజున కిట్లు చెప్పి బహు♦శామల సత్ఫలరమ్యమైన య
వ్వనమున నాప్రదేశమున ♦ స్వాంతము నిశ్చలవృత్తినొప్ప నె
మ్మనమున కెంతొ ప్రీతి రఘు♦నందనుఁ డందు వసించియుండె న
య్యనుజుఁడు ధర్మపత్నియు మ♦హాదరణంబునఁ దన్నుఁ గొల్వఁగన్. ౩౦ 402

క. నిరతము ధర్మస్వాంత, స్ఫురణం బెంపొందు రామ♦భూపతి యట ని
ర్జరలోకమందు నింద్రుని, కరణిన్ సుఖరీతిఁ గొంత♦కాలం బుండెన్. ౩౧ 403

పదునైదవ సర్గము సంపూర్ణము.

---

౧౬ - వ సర్గము.

హేమన్తర్తు వర్ణనము.

క. అచ్చట నిట్లు మహాత్ముఁడు, ముచ్చటగ వసించి యుండ ♦ మోదంబును దా

---

* భావజ్ఞేన కృతజ్ఞేన ధర్మజ్ఞేన చ లక్ష్మణ, త్వయా పుత్త్రేణ ధర్మాత్మా నసంవృత్తః పితా మమ- అనిమూలము. దీనికి గోవిందరాజులు వ్రాసినభావములన్నియు నిటఁ జేర్పఁబడినవని యెఱుంగునది.

హెచ్చుగ నిడు హేమంతము, వచ్చె శరత్కాల మేగ ♦ వైభవ మెసఁగన్. ౧

క. తెలతెలవాఱఁగ నొకనాఁ, డలరఘునందనుఁడు రమ్య♦మా గౌతమికి
మ్ములనేగె స్నాన మొనరుప, నలఘుపరాక్రముఁడు రాము♦ననుజుఁ డడఁకువన్.

చ. కలశము చేతఁ బూని యల♦త్సౌనుతయుం జను దేర రమ్యశై
వలినికిఁ బోవుచుండి రఘు♦వర్యునితోఁ బ్రియమార నిట్లుగాఁ
బలికెఁ బ్రియంవదా! యెది భ♦వన్మతికిం బ్రియమౌ నొ దేనిచే
త లలి నలంకృతంబగు వి♦ధంబున నబ్దము వెల్గుచుండునో
యల తుహినర్తు విప్పు డల♦రారె మనోహరరీతి రాఘవా. ౪ 406

చ. జనుల శరీరముల్ తుహిన♦సంగమ మొప్పుట గట్టివాఱి యుం
డును, బృథివీతలంబు కడు♦నూతనసస్యమనోహరంబుగాఁ
గనఁబడు, ముట్టసాధ్యములు ♦ గాక జలంబులు శైత్యమొందు, న
య్యనలుఁడు సర్వసమ్మతము♦నంది చెలంగెడు నిష్టుఁడై తగన్. ౫ 407

సీ. నవధాన్యముల నుజ♦నస్తోమము భుజింపఁదలఁచి ముందుగఁ జేయ♦వలసినట్టి
యాగ్రయణములచే ♦ నలపితృదేవతలను బూజసేసి, కా♦లమున నాగ్ర
యణము నిర్వర్తించి ♦ యపగతపాపులై యుందురు జానప♦దోత్కరంబు
మిగులఁ గామోద్రేక♦ము గలిగియును రుచిగోక్షీరములఁ దారు ♦ కోరినట్లు
తే. పడయుచుందురు, రాజులు ♦ పరుల గెలువఁ
గోరి రణయాత్రయందును ♦ భూరికుతుక
మలరఁ దిరుగుచునుందు ర♦హార్పతియును
దక్షిణంబున నివసించి ♦ తాఁ జెలఁగుట. ౭౪ 408

*క. తిలకము మోమునఁ బెట్టని, లలనామణివోలె భాసి♦లకయున్నది యి
మ్ముల నుత్తరదిక్సతి; యో,యలఘుగుణా! రామచంద్ర! ♦ యార్తశరణ్యా. ౮

సీ. ప్రకృతిచేతనె మంచు♦బలసియుండును నిప్పు డది దక్షిణాయన♦ముందు సూర్యుఁ
డతిదూరగతుఁ డౌట ♦ నతిశయముగ హెచ్చి హిమవంతమునునామ♦మెల్లభంగు
లను సార్థకమ్ముగాఁ ♦ దనరెనదౌ నిది సువ్యక్తమే యగుఁ ♦ జుమ్ము రామ!
యీదివసంబుల ♦ నిపుడు మధ్యాహ్నము లింపుగా వేఁడిమి ♦ యెల్లచోట్ల
తే. సోఁకుచుండుట మిక్కిలి ♦ సొంపుఁగూర్చు
చుండుఁ గావున నెండలో ♦ నొగిఁ దిరుగుట
హాయిగా నుండు దివసంబు ♦ లఱ్కఁ డంత
తీవ్రముగ నుండమిని సుఖ♦తృప్తిఁ జేయు. ౯౪ 410

క. జలములు నీడలు తగ నిం,పులఁ గల్గింపక యో యుండుఁ ♦ బోలఁగ శీతం
బలవడుటవలన; నీదిన,ములయం దర్కుండు మృదుత♦ముండయి వెలయున్.

* విహీనతిలకేవ స్త్రీ నోత్తరా దిక్ప్రకాశతే-అనిమూలము.

ఆ. మంచుగురియుచున్న ♦ దించుక సందులే,నట్లు చలియు హెచ్చ ♦ నవులమారు
తాళి వీచుచున్న ♦ నడవులలో నున్న,వారు చలికిఁ జివికి ♦ బయటరాక. ౧౦౪

ఆ. ఎచట నున్నవార ♦ లచటనే యుందురు, గాన శూన్యములయి ♦ కానలెల్లఁ
గానఁబడెను, సందుఁ ♦ గాపురమున్నట్టి, జనులు తుహినబాధఁ ♦ గనెడువారు.

సీ. బయల నీరాత్రులఁ ♦ బండియుండరు జనుల్ పుష్యతారక గల♦పున్నమ యిటఁ
బ్రప్రధానము సుమ్ము ♦ ప్రాలేయమున రాత్రికాలము బూడిదఁ ♦ గప్పినట్టి
వన్నెఁ జెలంగును; ♦ వాయువుల్ శైత్యముగా వీచుచున్న వి♦క్కాలమందు
జానులు పొడవులై ♦ సాగుచున్నవి; చంద్రునకుఁగలయట్టి సౌం♦దర్యమెల్ల

ఆ. భాస్కరునకుఁ జిక్కెఁ ♦ బరమహిమావృత,ముగఁ జు నెఱ్ఱఁబాఱె ♦ యాత్మబింబ
ముందుటఁ దలంప ♦ నొగిని నిశ్వాసాంధ,మైన యద్దమట్లు ♦ లలరఁడు శశి.

చ. హిమమునఁ గప్పఁగాఁ బడిన♦దే యగుటం దలపోయఁ జంద్రికా
సుమహితపూర్ణిమానిశయు ♦ శోభిలకున్నది కాన నిద్దియ
ర్యముని మరీచులం గనలి ♦ యారయ నల్లఁదనంబుఁ గన్నయా
క్షమసుతవోలెఁ గన్పడెడిఁ ♦ గాని యొకింతయుఁ గ్రాల దిత్తఱిన్. ౧౫ 415

సీ. పడమటిగాలి న్వ♦భావంబుచేతనే
చల్లఁగాఁ దనరు నీ♦సమయమందుఁ
దుహినశీకరములఁ ♦ దోఁగుట నీప్రభా
తమునందు ద్విగుణశై♦త్యమున మించి
పొలయుచున్నది; యడ♦వులు బాష్పసంఛన్న
ములయి గోధుమలు య♦వలు సమృద్ధిఁ
దనరఁగాఁ గ్రౌంచప♦క్షినికరములు నార
సములును గూయ భా♦స్కరుఁడు తూర్పు

ఆ. పర్వతమును జేరు♦పట్టున సొంపుగఁ, గానఁబడెడుఁ; జక్కఁ♦గా ఫలించి
స్వర్ణకాంతి మించి ♦ సంపూర్ణతండుల,ములను గూడి యగ్ర♦ములును వెలయ.

క. వరిపైరులు ఖర్జూరకు, జరమ్యకుసుమప్రభలకు ♦ సామ్యము గనుచున్
బరువున వంగుచు నెంతయు, నరుదుగఁ గన్పట్టుచున్న ♦ వార్యమహేంద్రా.

క. అతిశీతలతుహినకణ, ప్రతతియుతంబయి మయూఖ♦వార మలరఁ దీ
క్ష్ణతమాని యొంతకు నిశా,పతివలెఁ జల్లఁగనె తోఁచు ♦ భానుఁడు కంటే. 418

సీ అగ్రాహ్యరూపమై ♦ యాతపము దినపూర్వాహ్ణమునందొప్పి ♦ యంగమునకు
హాయిగా మధ్యాహ్న♦మందుమండి యించుక యెఱ్ఱఁగాఁదెల్లఁగా♦నెసఁగిధరణిఁ
గనఁబడుచున్నది ♦ కాననంబులనేల ప్రాలేయసిక్తశా♦ద్వలయుతంబు
నయి లేఁత యెండపై ♦ వ్యాపింప వెలయుచున్నది, వనగజ♦ములు తృషార్త

ఆ. మగుచు మిగులశీత♦ముగ నున్న తెలినీటి
మెలపుమీఱఁ దాఁకి ♦ మిగులఁ జల్లఁ

దనమునకు సహింపఁ ♦ దనకు శక్యము గామిఁ
గరము నీడ్చుకొనెడుఁ ♦ గనుము రామ. ౨౧ 419

ఆ. అప్రగల్భులెల్ల ♦ ననికిఁ బూనినయట్లు
జలపతత్రులివ్వి ♦ సలిలనికట
మందుఁ గూరుచుండి ♦ యతిశీతమున కుల్కి
యుదకమందు దిగక ♦ యున్నవిచట. ౨౨ 420

చ. వనతతు లంధకారముల ♦ వైఖరి సాంద్రముగా హిమాంబువృ
ష్టి నిగుడ నిశ్చలత్వమును ♦ జెంది తుషారతమస్సమాయుతిం
గని కుసుమాళిలేక పయి ♦ గట్టిగ దుప్పటి గప్పి నిద్రపో
వునరునిరీతి నున్నయవి ♦ భూరికృపాయతచిత్తపంకజా. ౨౩ 421

సీ. శైవలినీగత♦సలిల మావిరిచేతఁ గప్పఁగాఁ బడినది ♦ కడుఁ దుహినము
గ్రమ్మ సారసపక్షి♦కాండముల్ కూఁతలవలననే తెలియంగ ♦ వలసియున్న
వవ్వానితీరంబు ♦ లందలియిసుకయు హిమసమాసిక్తమై ♦ యొనఁగె నిపుడు
హిమపతనంబున ♦ నినుఁడు మార్దవమును బొందుట శీతంబు ♦ పొదలుచుంటఁ

తే. బర్వతంబులపయినున్న ♦ ప్రస్తరముల
యందుఁగల నీరుకూడ వి♦షాభమగుచుఁ
ద్రాగుట కశక్యమై యున్న ♦ దీగతి నిటఁ
జూడుమా రామజనపాల ! ♦ శుభదశీల !. ౨౪ 422

క. జరచే జర్జరితములై, యరవిందము లొప్పకుంట ♦ నపగతమృదుకే
సరకర్ణికమ్ము లౌటన్, గరము హిమధ్వస్తనాళ♦కాండము మిగులన్. ౨౫॥

*సీసమాలిక:—

సరసులు గ్రాలక ♦ విరహితశోభ చే
నున్నవి; యని యిట్టు ♦ లొగి సమస్త
దనుజపీడయు, సాధు♦జనసంక్షయంబును
శతమఖుబాధ య♦చ్చరలపీడ
రామునికరుణయు ♦ రామునిరాకచే
వేదఘోషములును ♦ వెలయుచుంట
యును, వృద్ధులును రాఘు♦వునకు మ్రొక్కఁగ నెంచు
టయును రాక్షసుల యా♦టంకము లిఁక
నోర్చుట యేలని♦యును దానవులశక్తి
యడఁప కూరకయుండ ♦ నగునె యనెడు

* నభాంతి కమలాకరాః-అనిమూలము. దీనికి ముందు హేమంతర్తువును వర్ణించు శ్లోకముల కన్నింటికి గోవిందరాజులు వ్రాసిన యభిప్రాయములన్నియు నీసీసమాలికయందుఁ జెప్పఁబడినవని యెఱుంగవలయు.

భావము రాముకృ♦పారస మతిశయ
మనియును దివిజసం♦ఘాధినేత
భయమంది భోగైక♦పరత మానుటయును
మునుల తపోభంగ♦మును వనచర
దైన్యము, మానుల♦దైన్యము, తపసుల
స్వాంతదుఃఖమ్మును ♦ వరుసఁ దుహిన

తే. కాలవర్ణనరూపంబు♦గా నెఱుంగఁ
జెప్పి యవ్వల నిట్లని ♦ చెప్పె మరల;
నిట్టితఱి ధర్మవేత్తయై ♦ యెసఁగి పురుష
తిలకుఁడును నగు భరతుండు ♦ దీప్తమూర్తి. ౨౫ 424

చ. నిను నెడఁబాసి దాననగు ♦ నిర్భరదుఃఖమునన్ ద్వదాత్తభ
క్తిని బురమందుఁ దాను నియ♦తిం దపముం బొనరించుచున్నవాఁ
డని మఱియున్ వచించె, నతఁ ♦ డప్పురియందు నృపత్వ, మేను రా
జున నెడు మానమున్ వివిధ♦శూరజనార్హసుఖాళి మానుచున్. ౨౬ 425

క. మునివేషంబున వల్కలము,లను జటలను దాల్చి సత్ఫ♦లంబుల మూలా
ళిని దినుచు వట్టిబయలన్, ఘనశీతమహిం బరుండు ♦ క్ష్మాపతితిలకా. ౨౭ 426

క. అనుదిన మీవేళకుఁ దా, మునుఁగుటకై సరయువునకు ♦ ముఖ్యప్రకృతుల్
తనుఁ గొలిచి రాఁగఁ బోవును, బని పూనియె, భక్తిమీఱ ♦ భరతుఁడు రామా.

సీ. తండ్రియు నీవు నా♦తని నుపలాలింప నత్యంతసుఖవృద్ధి ♦ నమరి, నీదు
కనుఁబాటునకుఁ దాళఁ♦గాలేని సౌకుమార్యము దగ నినుఁ గూడి♦పోయి గాఁగ
వసియింపఁదగి, యిట్టి♦వాఁడగు భరతుఁడు *నవవిధవతఁ గల♦నారు లితర
జనముఖంబులఁ గనుఁ♦గొనకుండ నదికెట్లు చనుదురో కైకకుఁ ♦ దనయుఁడౌట
నితనిమూలముననే ♦ యిన్ని యనర్థముల్ కలిగె నంచని జనుల్ ♦ పలుకుదురని

తే. వెఱచి వేకువనేపోయి ♦ విహ్వలమతి
సరయువున నెల్లి మున్గునో ♦ సరసిజేక్ష
ణుఁడును వీరుఁడు శ్యామత♦నుఁడును సింహ
మధ్యముఁడు, పూజనీయుఁడు ♦ మానధనుఁడు. ౨౯ 428

క. పలువిధములైన ధర్మం,బుల నెఱిఁగినవాఁడు సత్య♦ముం బల్కెడువాఁ
డల భరతుండు నిషేధం,బులగు క్రియల్ సేయ సిగ్గుఁ♦బూని చరించున్. ౩౦

---

* నవవైధవ్యాః స్త్రియః మనుష్యసంచారా త్పూర్వమేవ మనుష్యముఖ మనవలోకయంత్యో గచ్ఛంతి తథాయమపి కైకేయీపుత్రోఽయం ఏతన్నిమిత్తోఽనర్థ ఇతి జనావక్ష్యంతీతి భీత్యా అపరరాత్రే ష్వేవగచ్ఛతి-అని గోవిందరాజులు వ్రాసినభావమే యిటఁ జేర్పఁబడినదని తెలియఁ దగు.

సీ. ఇంద్రియాళిజయించి ♦ యింపుగాఁ బల్కుచు సుందరదేహుండై ♦ శుభదదీర్ఘ
బాహుండై, పరవీర♦పౌరుషాంతకుఁడయి తనరారు నిట్టి యి♦తండు సకల
భోగంబులను వీటిఁ ♦ బుచ్చి, జ్యేష్ఠుఁడవగు నిన్నెల్లవిధముల ♦ నిశ్చయముగ
ననుసరించినవాఁడు; ♦ ఘనమనీషుండగు త్వత్సోదరుఁడు నీవు ♦ వనిఁ దపస్వి
తే. వేషమును బూని యున్ననీ♦విధమున నతఁ
డాదరంబున మునివేష ♦ మలవరించు
కొనుటచే స్వర్గమును గొల్ల♦గొన్నవాఁడె
యగుఁ జుమీ, రామచంద్ర, యా♦ర్యగుణసాంద్ర. ౩౩ 430

క. జననీస్వభావమును వే, జను లొగిఁ బూనుదురు కాని ♦ జనకుస్వభావం
బును బూనరనెడు నానుడి, వినఁబడుఁగద యెల్లచోట్లఁ ♦ బృథ్వీస్థలిలోన్. ౩౪

క. జనకుస్వభావంబునె నీ, యనుజుఁడు పూనుటను లోక♦మందలి యామా
టను జేసె నసత్యముగా, వినుమా యొకమాట రామ! ♦ విమలగుణమణీ.

సీ. దశరథపృథ్వీశ♦తల్లజుం డెవతికి భర్తయో నాథువౌ ♦ భరతుఁ డెవతి
కిని దనూజాతుఁడై ♦ తనరునో యాకైక కిట్టిదుశ్శీలమ♦దెట్లు గలిగె
నని ధార్మికుండగు ♦ ననుజుఁడు లక్ష్మణుం డన్నయందున్న స్నే♦హమున నిట్లు
పల్కుచుండఁగ రఘు♦వరుఁ డంబదూషించుటనుసైఁపఁజాలక♦యనుజుఁగాంచి
తే. వత్స! మధ్యమజననిని ♦ బల్కరాదు
సుంతయును నిట్లు; పూర్వము ♦ శుభదలీలఁ
బల్కుచున్నట్టి యిక్ష్వాకు♦వరుని భరతు
వార్తనే చెప్పుమా! యదె ♦ భవ్యతరము. ౩౫ 433

క. వనవాసమున దృఢవ్రత,మును బూనిన నైన నేను ♦ మునుకొని యనుజా
తునియందలి స్నేహమున న,తనిఁ దలఁచుకొనినతఱి మది ♦ తల్లడమందున్. ౩౬

చ. భరతుని చారువాక్యములు ♦ భవ్యములై మధురంబులై మనో
హరములునై సుధాసమత ♦ నంది ప్రమోదము నిచ్చుచుండు నే
నరుదుగ వానినేఁ దలఁతు ♦ నయ్యవి చిత్తముఁ బల్లవింపఁజే
యు, రఘుకుమారకా! విను మ♦఼కొక్కటి చెప్పెద నాదుభావమున్. ౩౭ 435

*క. భరతుని మఱి శత్రుఘ్నుని, నిరుపమవీరుండవైన ♦ నిన్నును సీతా
తరుణిని నందఱ నెపుడె,క్కరణిని దమిఁగూడి యుండఁ ♦ గలనో యెఱుంగన్.

సీ. అనియిటు భరతుని ♦ యందలి స్నేహంబునను బెక్కురీతుల ♦ వనటఁ గుంది
పలవించుచును రఘు♦వరుఁడు గోదావరి కేగి సౌమిత్రిని ♦ సీతఁ గూడి
యభిషేక మొనరించె ♦ నంతటఁ బితరులకును దేవతలకును ♦ మననులు ప్రియ
మును బొందుచుండంగ ♦ ననుపమవిధి మీఱ జలతర్పణమ్ములు ♦ సల్పియుదయ

---

* భరతేన మహాత్మనా, శత్రుఘ్నేన చ వీరేణ త్వయా చ రఘునందన-అని మూలము. చకారేణ సీతా సముచ్చయః-అని తన్‌శ్లోకి. దీని ననుసరించియే సీతాశబ్దము ప్రయోగింపఁబడినది.

ఆ. మందినట్టి భాను♦నట్లె సంధ్యాదిదేవతల సాధుభక్తి ♦ వరుసమంత్ర
ములనుతించి రంత ♦ నలరాముఁ డింతిని, ననుజుఁగూడి యమ్మ♦హానదిఁ దగ.

*క. కృతమజ్జనుఁడై గిరిరాట్సుత నందినిఁ గూడి సకల♦శుభగణయుతుఁడై
ప్రతిలేనిశంకరునివలె, నతిశయముగ వెలిఁగె సజ్జ♦నాళిప్రియుఁడై. ౮౩ 438

పదునాఱవ సర్గము సంపూర్ణము.

---

## ౧౭ - వ సర్గము.

–శూర్పణఖ వచ్చుట, సంభాషణము.–

క. సీతయు రాముండు సుమిత్రాతనయుఁడు స్నానమాడి ♦ తరువాతను శ్రీ
గౌతమితటమున నుండియె, ఖ్యాతాత్మతపోవనమున ♦ కరిగిరి వేడ్కన్. ౧

సీ. ఆశ్రమంబున కేగి ♦ యనుజయుతుండయి బ్రహ్మాయజ్ఞాదులై ♦ పరఁగునట్టి
పూర్వాహ్ణకర్మముల్ ♦ పొందుగ నొనరించి పర్ణశాలను రఘు♦వరుఁడుచొచ్చి;
యచట మహామునీం♦ద్రార్చితుఁడై తనతమ్మునితోఁ గూడి ♦ తమిసుఖముగ [ముఁ
నుండి యాయాయిపూ♦ర్వోదంతములఁబల్కుచుండెను; దీర్ఘబా♦హుండగురా

తే. డందు సీతాసమేతుండు ♦ నగుచుఁ జిత్ర
యనెడుతారకతోఁ గూడి♦నట్టి చంద్రు
వలెఁ బ్రకాశించె నాయాయి♦భవ్యగాథ
లందుఁ దగిలినమది నాతఁ ♦ డందు నుండ. ౪ 440

క. అక్కడికి స్వేచ్ఛమీఱఁగ, రక్కసి యొక్కతుక వచ్చె ♦ రక్షోవిభుఁడై
యుక్కునఁదగు రావణునకు, నక్కామిని భగిని శూర్ప♦ణాహ్వయ యదియా.

క. సురసన్నిభుఁడౌ శ్రీరఘు,వరుఁ గని చేరంగ నదియు ♦ వచ్చి నిడుదయౌ
నురమున, దీర్ఘభుజంబుల, సరసిజపత్రేక్షణములఁ ♦ జంచద్ద్యుతిచేన్. ౬ 442

సీ. ఆజానుభుజముల, ♦ నతిసుందరంబగు మోమున, వెలసి స♦మ్మోదమొసఁగు
దర్శనంబున నొప్పి ♦ దర్పకజాభవిక్రాంతయానంబులఁ ♦ గ్రాలి జటల
గుంపును ధరియించి ♦ కోమలగాత్రుఁడై బలవిశేషంబునఁ ♦ బరఁగి రాజ
లక్షణసముదయ♦లక్షితుండయి నల్లఁగలువరేకులవంటి ♦ కాంతిమదన

తే. సనుసు తేజస్సు వెలయంగ ♦ శక్రుఁబోలి
యున్న శ్రీరాముఁ గాంచి యా♦యగ్రదనుజ
కాంత మదిలోన నెంతయుఁ ♦ గామ మడర
మోహమందెను, మదిలోని ♦ యూహపొలయ. ౭ 443

చంపకమాలిక:—

కనఁదగుమోమువాఁడు రఘు♦కాంతుఁడు దుర్ముఖి యద్ది గుండ్రనై
ననడుము, పోగకన్నులు క♦నంగలవాఁ డతఁ డామెయో కనుం

---

* కృతాభిషేకో గిరిరాజపుత్ర్యా రుద్రస్సనందీ భగనానివేశః - అని మూలము.

గోనఁ బెనుపొట్టయున్ వికృతిఁ ◆ గొల్పెడు కన్నులు గల్గియుండు, మె
త్తని నునువెంట్రుకల్ వెలయఁ ◆ దా నలరారు నతండు రాక్షసాం
గనయును దామ్రమూర్ధజని◆కాయము గల్గిన దెంతొ సంతసం
బును దగ నిచ్చు నాకృతిని ◆ బొందినవాఁ డతఁ; డద్ది క్రూరమౌ
తనువున నొప్పుఁ జారునిన◆దంబునఁ బొల్చెడువాఁడు రాముఁ; డా
దనుజకుమారి భీనునిన◆దంబున నొప్పుచునుండు రాఘవుం
డనుపమయౌవనస్ఫురణ ◆ నందినవాఁ; డది దారుణాకృతిం
గని జరతావిశీర్ణతను ◆ గాంచిన; దాతఁడు మంజుభాషి, యం
గనయు వికారభాషిణి, ని◆కామసుశీలము గల్గువాఁ డతం
డనుదిన మెన్నదుష్టమగు ◆ నాచరణంబును బూను నద్ది; యిం
పునిడెడుదర్శనంబుగల ◆ భూపతి యాతఁ డసహ్యదర్శనం
బునఁ దగునద్ది యిట్లు కనఁ◆బోలని యాసురపుత్త్రి యెంతయున్
గనఁదగి యున్నరాఘవునిఁ ◆ గాంచి యనంగవశంగతాత్మయై
చని నికటంబుఁ జేరి మది ◆ సంతస మొప్పఁగఁబల్కె నిర్వధిన్. ౧౩ 414

క. మునివేషంబున జటలం, దనరుచుఁ గాముకునిరీతిఁ ◆ దారయుతుఁడవై
మనుజేంద్రరూపమున నీ, ఘనశరచాపములఁ దాల్చి ◆ క్రాలెద విచటన్. ౧౪

క. దనుజులు మెలఁగెడు నిచటికిఁ, జనుదెంచితి వెట్లు నీవు ◆ సరగున నిట రాఁ
బని యేమి? యిద్దియంతయు, వినుపింపుము నాకుఁ దత్త్వ◆వృత్తాంతంబున్.

క. అనినఁ బరంతపుఁ డతఁడా, వనితోక్తుల నాలకించి ◆ భవ్యమనీషం
దనరారుఁ గానఁ దనవా, ర్త నంతయుం జెప్పఁబూని ◆ దా నిట్లనియెన్. ౧౬

సీ. అనృతమెప్పుడు రాఘ◆వున కిష్టముగ నుండనేరదు గన ముని◆నియతవృత్తి
నాశ్రయించి తపోవ◆నాంతరమున నున్నతఱిని స్త్రీజనముచెం◆తను నసత్య
మది విశేషించి నా◆కప్రీతికరమంచుఁ జెప్పంగవలయు నే ◆ క్షితితలమున
నమరవిక్రముఁ డైన ◆ యట్టి దశరథుఁడన్ ధరణీశుఁ డుండె న◆తనికి నేను

తే. నగ్రపుత్త్రకుఁడను రాముఁ ◆ డనుచు నన్ను
జనులు పిలుతు రితఁడు నాకు ◆ ననుజుఁ డగును
నితనినామము లక్ష్మణుఁ ◆ డెపుడు నన్ను
ననుసరించియె వర్తించు ◆ నాదరమున. ౧౭ 418

క. తరుణి యిది నాకళత్రము, పరఁగును సీతాహ్వయమున ◆ వైదేహియె నూ
తరుణి! నాజనకుండగు, ధరణీశుం డాజ్ఞ సేయఁ ◆ దల్లియుఁ బలుకన్. ౧౮

చ. జనకుని వాక్యపాలనమె ◆ చక్కనిధర్మమటంచుఁ జేయఁగా
మనమున నిర్ణయించుకొని ◆ మానితమౌ మునివర్తనాకృతిం
గనఁదగుధర్మముం బడయఁ ◆ గా నిటువచ్చితి నిన్నెఱుంగఁ గో
ర్కిని గనువాఁడ నీ వెవరి◆కిం దనుజాతవొ తల్లి యెవ్వతో. ౧౯ 450

సీ. ఇంతగా సొగసైన ♦ యాయంగమునఁ బొల్చు నీవు రాక్షసివని ♦ నిర్ణయింపఁ
గాఁ జాలకున్నాఁడఁ ♦ గాంతరో! యిచటికి నేలవచ్చితివి నీ♦వీవిషయము
సర్వము నిజముగా ♦ సరగునఁ జెప్పుమా యనిన రామునివాక్య ♦ మాలకించి
కామార్తినిం బొంది ♦ కరఁగినమదితోడ నద్ది యిట్లనిపల్కె ♦ నాలకింపు
తే. మున్నదున్నట్లు చెప్పెద ♦ నోరఘువర!
విషయమంతయు నాయది ♦ వేడ్క మీఱ
రాక్షసాంగన నేను శూ♦ర్పణఖ పేరు
కామరూపిణి నాపేరు ♦ కడు భయదము. ౨౨ 451

చ. వనమున నిందు నొక్కతెనె ♦ వారక నేఁ జరియించుచుందు స్వే
చ్ఛను బలశాలి విశ్రవసు♦సత్తనయుండయి విక్రమంబునన్
దనరిన రావణుం డసుర♦తల్లజుఁ డన్నయె సుమ్ము, నీవు నా
తని వినియుండవచ్చు; సత♦తంబును నిద్రను జెంది వీరుఁడై. ౨౩ 452
క. బలియునగు కుంభకర్ణుం, డలఘుగుణా! తోడఁబుట్టు♦వగు నా కసురా
ఖిలచేష్టలు లేకయె యి,మ్ముల ధర్మమునందుఁ జిత్త♦ము దనరుచుండన్. ౨౪
తే. పొదలుచున్న విభీషణుం♦డు దగు నాకుఁ
దోడఁబుట్టువుగా ఖర♦దూషణాదు
లతులవీర్యంబునం దగు♦నట్టివారు
భ్రాతలగుదురు వారికై ♦ భయపడకుము. ౨౫ 454
క. వారల నందఱ మీఱుచుఁ, గోరికకుం దగినరీతిఁ ♦ గొంకుఁగనక నే
నే రయమున వర్తింతును, శ్రీరామా! యట్లుగానఁ ♦ జిత్తమునందున్. ౨౬
క. పురుషోత్తముండవగు నినుఁ, గరమనురాగమున భర్తఁ♦గాఁ గోరితి నె
త్తరుణమునఁ గన నిదర్శన, మరయఁగ నిపుడొట నాదు♦నాత్మను రామా.
చ వనితయు నాకు నున్నదని ♦ పల్కకు మేను మహాప్రభావముం
గనుచును స్వేచ్ఛకుం దగిన♦గాఢబలంబున వెల్గుదాన, ని
చ్ఛను జరియించుదాన, రఘు♦సత్తమ! నీవును జాలకాల మొ
య్యనఁ బతిగాఁగ నుండు మిఁక ♦ హర్షముపొంగఁగ నాకు నీమెతోన్. ౨౭
*క. వనియేమి? నీకు వికృతయుఁ, గనుఁగొనఁగఁ గురూపయునయి ♦ కానంబడునీ
వనిత యిది నీకుఁ దగదిఁకఁ, దనుమధ్యను నేనె తగిన♦దానను నీకున్. ౨౮
తే. భార్యగా నన్నుఁ జూడుము ♦ పడఁతి యిద్ది
యసతి వికృతాంగి, భీతిద ♦ యయి మహోద
రమునఁ దగుఁ గాన దీనిమ♦ర్త్యప్రభవను
ననుజునిం గూడ భక్షించె♦దను దగంగ. ౨౯ 459

* వికృతాచ విరూపాచ-అనిమూలము.

క. కాంతా! నీవును నాతో, నంతట ధరశిఖరములను ♦ నఖిలవనములన్
సంతసమునఁ జూచుచు నీ, కాంతారమునం జరింపఁ ♦ గలవని పలికెన్. ౨౯

క. పలుకులయెడ నేర్పఱితన, మలవడు నారాముఁ డట్టు ♦ లారాక్షసియుం
బలుకన్ దానిం గని యిటు, పలికెన్ సుస్మితము దోఁప ♦ బరవస మలరన్.

పదునేడవ సర్గము సంపూర్ణము.

## ౧౮ - వ సర్గము.

### రామ శూర్పణఖల సంవాదము.

క. స్మరపాశవశంగతయా, తరుణిన్ శూర్పణఖఁ గాంచి ♦ తగుభావము వి
స్ఫురణముగఁ దోఁప మృదుతం, బరఁగెడు పల్కులను స్మితము♦పర్వఁగ నంతన్.

క. పలికె నిటు రాముఁ; డమ్మా!, యలవనిత నొకర్తుఁ బెండ్లి ♦ యాడితి నది మి
క్కిలి ప్రేమఁ గూర్చునదిగా, న లలిన్ విడఁ నంగరాదు ♦ నాకున్ దీనిన్. ౧

చ. వనితలు పెక్కునుంది చెలు♦వంబుగ నుండిననేమి యందువో
విను నినుబోఁటికాంతలకు ♦ వేఱొకయింతి సపత్నియుంటయున్
జనదు; సుశీలుఁడై తగిన♦చక్కఁదనంబునఁ బొల్చి శ్రీయుతిం
దనరి పరాక్రమంబున ని♦తాంతము నొప్పినవాఁడు చూడుమా. ౨ 464

*సీ. అకృతదారుఁడు విను ♦ మతఁడిష్ట భార్యాసుఖంబు నెఱుంగఁడు ♦ గానఁబత్ని
నర్థించువాఁడు నా♦యనుజుఁడు లక్ష్మణుం డతఁడభర్తయె సుమ్మి♦యన్నమిన్న;
యిట్టిరూపమునకు ♦ నిష్టుఁ డాతఁడు తగకుండునా యని మఱి♦యును వచించె
నోవిశాలాక్షిరో ♦ యోనరారోహా! సుమేరుభూధరమును ♦ మిత్రకాంతి

తే. పొందినట్లుగ నీవును ♦ బొందు మనఘు
నాసహోదరు దాన నీ♦యర్థమెల్ల
ఫలము నొందును నీ వస♦పత్ని వగుచు
శర్మమందుమ యని రామ♦చంద్రుఁ డనిన. ౩ 465

* శ్రీమానకృతదారశ్చ లక్ష్మణో మమ వీర్యవాన్, అపూర్వీ భార్యయా చార్థీ తరుణః ప్రియదర్శనః, అనురూపశ్చ తే భర్తా రూపస్యాస్య భవిష్యతి-అని మూలము. ఈశ్లోకములకు గోవిందరాజమహేశ్వరతీర్థులు వ్రాసినయర్థవిశేషము లిముడుటకై యందలిపదము లట్లే యిం దుప యోగింపఁబడియె. తే౽భర్తా భవిష్యతి=నీకు భర్తగాఁడని యర్థము విశేషార్థముగా వ్రాయుటచేత నాయర్థము వచ్చుటకై పద్యమున 'ఇతఁడభర్తయె సుమ్ము' అని వ్రాయఁబడినది ప్రాతీతికార్థము. ఇతఁడ = ఈనాసోదరుఁడే, భర్తయె. నీకు భర్తయగునని నిశ్చయార్థము. ఇతఁడు= ఈలక్ష్మణుఁడు, అభర్తయె = భర్తకానేకాఁడని యంతరార్థము. ఇట్లు కొన్నిమార్పులతో వ్యాఖ్యానసార మిందుఁ గలదని తెలియఁదగు.

చ. వనితయుఁ గామమోహిత య♦భవ్యమనస్కయుఁ గాన రాఘవో
క్తిని విని యాతనిన్ వదలి ♦ తెప్పున లక్ష్మణుచెంత కేగి యా
తనిఁ గని యుష్ణకాలమునఁ ♦ దద్దయుఁ జల్లఁగ, శీతమందు వేఁ
డిని గలిగింపఁగాఁదగిన ♦ శీవిని బొందును జూ! మదంగముల్. ౬౪ 466

క. పెనిమిటియం దనురాగం,బునఁ దగి వర్తింతు రూప♦మున నీకుం జ
క్కనిదాన నౌటఁ దగియుం,దును సుఖములఁ గాంచు మీవు♦తోరపు వేడ్కన్.

క. ననుఁగూడి దండకాటవి,ని నెల్లెడం దిరుగఁగలవ♦నిన రాక్షసినిం
గనుచున్ వాజ్ఞ్నపుణ్యం,బునఁదగు సౌమిత్రి స్మితము♦మోమునఁ దోఁపన్.

తే. యుక్తమగురీతిఁ బలికె నో♦యుత్పలాక్షి
కమలవర్ణిని! దాసుండఁ ♦ గాదె యన్న
కతఁడె నాథుఁడు నాకు భా♦ర్యవయి నీవు
దాసిగా నుండవలదె యీ♦తలఁపి కేల. ౯ 469

*సీ. ఓవిశాలాంక్షి నీ♦వాగి నెల్లయర్థముల్ నిండారఁ గల్గిన ♦ నృపవరేణ్యు
నకు నార్యునకు రాము♦నకు శూర్పణఖ నీవ ముదితవై విమలమై♦పొదలు వర్ణ
మలర రెండవభార్య ♦ వగుము, విరూపయై యసతికరాళయు ♦ నగుచు నిర్గ
తోదరి యయి వృద్ధ♦యునగుచుఁ దగుసీత విడనాడి నిన్నె యీ♦తఁడునుభార్య

తే. గా భజించును; శ్రేష్ఠమై ♦ క్రాలు నిట్టి
నీదురూపంబు వరవర్ణి♦నీ! యెవండు
తెలివిగలవాఁడు విడిచి తా ♦ నెలమి పొందు
మనుజవనిత వరారోహ ♦ మనమునందు. ౧౨ 470

చ. అనియిటు లక్ష్మణుండు పరి♦హాసముగా వచియింపఁగా భయం
బును గలిగించు నాకృతియు ♦ భూరుదరంబును గల్గినట్టి యా
వనితయు వేడ్క మాటలను ♦ వాని నెఱుంగనిదాట వానినె
ల్లను దగ సత్యరీతిగఁ ద♦లంచుచుఁ గామవిమోహితాత్మయై. ౧౩ 471

ఆ. పర్ణశాలయందుఁ ♦ బద్మాయతాక్షిని, గలిసి కూరుచున్న ♦ లలితమూర్తిఁ
దేఱిచూడరాని ♦ దివ్యతేజస్కుని, శత్రుహరుని రాము♦చంద్రుఁ గాంచి. ౧౪

ఆ. ఈవిరూప నసతి ♦ నీకరాళను లంబ, మానకుక్షి వృద్ధ ♦ మనుజనారి
నాశ్రయించి యాస♦హాయంబునన్ నన్ను, గారవింప వీవు ♦ కామరూప ౧౫

క. ఈనరకామిని నిపుడే, యోనాథా! నీవు చూచు♦చుండఁగఁ దినెదన్
నేనంత సవతిపోరున్, గానక విహరింతు హాయి♦గా నీతోడన్. ౧౬ 471

* ఆర్యస్య త్వం విశాలాక్షి భార్యాభవయవీయసీ, యేనాం విరూపా మసతీం కరాళాం నిర్ణతోదరీం, భార్యాం వృద్ధాం పరిత్యజ్య త్వామేవైషభజిష్యతి-అనిమూలము. ఈశ్లోకములకు వ్యాఖ్యాతలు వ్రాసిన యర్థచమత్కారము లీపద్యమున నిమిడియున్నవని గ్రహింపఁదగు.

క. అనిపల్కి యలాతేక్షణ, ఘనకోపము గదురఁ బ్రళయ♦కాలోల్క నభం
బునఁ గ్రాలు రోహిణిపయిం, జనుగతి హరిణేక్షణపయిఁ♦జనెఁ ద్వరమీఱన్.

చ. అతిబలశాలియై చెలఁగు ♦ నాతఁడు ధర్మనిపాశమట్లు భూ
సుతపయి కేగుదెంచు నల♦శూర్పణఖం గని కోపమొప్ప ను
ద్ధతగురుహుంకృతిన్ నిలిపి ♦ దాని సహోదరుఁగాంచి [1]క్రూరు లు
ద్ధతులగువారితోడ సత♦తంబును జేయఁగరాదు వేడుకల్. ౧౯ 476

క. కనుమూ! సౌమ్యా! లక్ష్మణ, వనితామణి సీత దనుజ♦భామిని క్రౌర్యం
బును గనియు నెట్లొ తనమున,సును నిలుపుచు నున్నదిదిగొ♦చూడుము దీనిన్.

చ పురుషవరేణ్య! క్రూరయయి ♦ పొల్చి విరూపయునై ప్రమత్తయై
కర ముదరంబు నొప్పఁ, గనఁ♦గాఁ దగకున్న సురారినారి ని
త్తరుణమునందు నింకను ని♦తాంతవిరూపఁగఁ జేయుమన్న భీ
కరబలశాలి లక్ష్మణుఁడు ♦ క్రన్నన రాముని వాక్యరీతిఁగన్. ౨౦ 478

సీ. అతికుపితుండయి ♦ యన్నప్రక్కనునున్న ఖడ్గంబుఁ జేకొని ♦ కఠినరాక్ష
సిని బట్టి దాని నా♦సికయుఁ గర్ణంబులు ఛేదించె; ముక్కును ♦ జెవులుఁ గోయ
భయదరూపంబునఁ ♦ బరఁగు శూర్పణఖ వికారస్వరంబున ♦ నారవంబుఁ
గావించుచున్ యథా♦గతముగ నడవికిఁ బాఱిపోయెను; విరూ♦పయు భయంక

తే. రాంగియు నగు దను♦జాంగన రక్తంబు గాఱుచుండఁగ వృష్టి♦కాలమందు
జలధరం బట్లు బహువిధ♦ములుగ నఱచె;
నంత రుధిరంబు మేదిని♦యందుఁ బాఱ
భయదరూపంబు గన్పడ ♦ బాహుయుగళి
మెత్తుకొని యార్చుచున్ వని♦కేగి యచట. ౨౧ 479

చ. దనుజసమూహసంవృతు ని♦తాంతభయంకరమూర్తి భ్రాతయై
తనరు ఖరాఖ్యుఁజేరి వివ♦తంబగు నాదము పర్వ నంబరం
బును విడనాడినట్టి పవి ♦ భూమిపయిం బడునట్లు వ్రాలె, నా
తనిసముఖంబునన్ వికృతి♦తం గనినట్టిది కాన నేడ్చుచున్. ౨౨ 480

క. పెనుభీతి విసంజ్ఞం గని, దనుజాంగన రక్తసిక్త♦తనువునఁ దనయ
న్నను ఖరుని జనస్థానం, బునఁ జెలఁగెడువానిఁ గాంచి ♦ పొగులుచు నంతన్.

క. తరుణీయుతుఁడై శ్రీరఘు,వరుఁ డడవికి వచ్చుటయును ♦ వదలక తన్నున్
గరము విరూపఁగఁ జేయుట, వరుసగ వినిపించె నచటి♦వార్తలఁ బూన్కిన్.

పదునెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

1 క్రూరైరనార్యైః సౌమిత్రే పరిహాసః కథంచన-అనిమూలము. క్రూరానార్యశబ్దములు స్త్రీపుంశబ్దసమానార్థకములని యెఱుఁగవలయు.

## ౧౯ - వ సర్గము.

శూర్పణఖ ఖరునకు రామునివృత్తాంతమును దెల్పుట.

క. విరహితనానాశ్రవణయు, ధరపతితయు రక్తసిక్త♦తనుయష్టియు నై
పరఁగెడుభగినిం గన్గొని, ఖరుఁ డుత్కటకోపతాప♦కలితుం డగుచున్. ౧ 483

తే. పలికె లేలెమ్ము ముందు నీ♦వార్తఁ జెప్పు
మూర్ఛ మునుఁగుటయును మాను♦ము మది సంభ్ర
మమును విడువుము నిను విరూ♦పమునఁ దిరుగఁ
గా నొనర్చిన దెవ్వఁడో ♦ కాంత! చెపుమ. ౨ 484

సీ. విస్పష్టముగఁ జెప్పు ♦ విని యెద నెవ్వండు దంష్ట్రలయందు ను♦ద్ధతవిషంబు
గ్రాలఁగా నున్నట్టి ♦ కాలభుజంగంబు తన్ను బాధింపంగఁ♦దలఁప కెదురు
వచ్చి నిశ్చలముగ ♦ వసుధనుండఁగ దాని వేడుకగా నెత్తి♦ ప్రేలితుదను
గారించుచున్నాఁడు? ♦ కాలపాశంబు న దెవ్వండు తెలియక ♦ యేగళంబు

తే. నకును దగిలించుకొని దాని ♦ నైజమొఱుఁగ
కున్నవాఁ డెవ్వఁ డివ్విధి ♦ నిన్నుఁ జెనకి
భయదవిషమును ద్రావిన♦వాఁడు? చెప్పు
బలపరాక్రమయుక్తవై ♦ పరఁగు దీవు. ౩ 485

తే. కామరూపిణివి మఱియుఁ ♦ గామగమన, వంతకప్రతిమాన వో♦యమ్మయిట్టి
నీకు నీలాటిదురవస్థ ♦ నెమ్మిఁ గల్గఁ, జేసినాఁ డెవ్వఁడో వానిఁ ♦ జెప్పు మిపుడు.

క. సురగంధర్వుల నతిభీ,కరభూతసమూహమునందుఁ ♦ గానియతుల సు
స్థిరమహిమ మెప్పు రాజిలు, వరమునిగణమందు వీర్య♦వంతుం డెవఁడో. ౫

క. నిను నిట్లు విరూపఁగఁ జే,సినవాఁడు? జగంబునందుఁ ♦ జెప్పెదఁ బాకా
ఖ్యుని దనుజుఁ జంపి వేయి న,యనములఁదగు వజ్రిత ప్పు ♦ నపకృతి నాకున్.

క. ఒనరించు వాఁడికెవ్వఁడు, కనఁబడఁడు సుమీ తలంపఁ♦గా [1]నంబుయుతిం
గనినట్టిపాల హంసము, తనశక్తిం ద్రావునట్లు ♦ దారుణరీతిన్. ౭ 489

క. కనుమా యిదిగో యసువులఁ, గొనఁజాలిన తీవ్రవిశిఖ♦కూటమ్మున వా
నినిజంపువాఁడ శరముల,కును నాహారమ్ము నేను ♦ గూర్తుం దరుణీ. ౮ 490

తే. మచ్ఛిలీముఖసంకృత్త ♦ మర్ముఁ డగుచు
నురుగుతో నెత్తురగా రక్త♦మొగిఁ దొరుగఁగ
నెవఁడు హతుఁడయి పడునో యీ♦యిల తదీయ
రక్తమును శీఘ్రముగఁ దమిఁ ♦ ద్రాగఁగలదు. ౯ 491

క. అని నాచే నిహతుండగు, మనుజుని కాయంబునుండి ♦ మాంసమ్మును బ
క్షీనికరము పెఱికి ముదమునఁ, దినఁ గలదికఁ బిండుగట్టి ♦ తృప్తిగ వినుమా.

[1] అంబుయుతిం గనినట్టిపాలన్=నీళ్లతోఁ గూడినపాలను.

క. అని మొన కిదిగో నాచేఁత నీడ్వఁబడినట్టివానిఁ ♦ దగ దీనునిగా
వను గంధర్వులు దివిజులు, దనుజపిశాచములు శక్తి♦తం దనరవు సూ. ౧౧
క. వనమున నే యవినీతుఁడు, తనవిక్రమ మేర్పడంగఁ ♦ దగనివిధమునన్
నినునిట్లు చేసెనో తెల్పిని మెల్లఁగఁ బొంది చెప్పు ♦ విని యెద వానిన్. ౧౨
క. అని మిక్కిలి కుపితుండై, తనసోదరుఁ డిట్లు పలుకఁ ♦ దా విని యంతం
గనులజలంబులు గాఱఁగ, ఘనరవ మెసరంగఁ బలికెఁ ♦ గ్రవ్యాది తగన్. ౧౩
[1]సీ. దశరథపుత్త్రు లు♦దారులు రామలక్ష్మణులను నాఖ్యలఁ ♦ గ్రాలువారు.
భ్రాతలు, నిందుజ♦వ్వనమునఁ దగువారు చక్కఁదనంబున ♦ నిక్కువారు
ప్రకటబలంబున ♦ భాసిల్లువారును బుండరీకవిశాల♦పూజ్యనయను
లగుదురు; చీరకృ♦ష్ణాజినధారులు ఫలమూలభక్షకుల్ ♦ [2]పరమదాంతు
తే లగుదు రవ్వారు మునివృత్తి ♦ నాశ్రయించి
ధర్మముల నాచరించుచుఁ ♦ దనరువారు;
వారు గంధర్వవిభునకుఁ ♦ బ్రతియొనర్పఁ
దగి మహీధవలక్షణ♦తతులు గ్రాల. ౧౪ 496
క. అలరుదు రాయిద్దఱు త్రిదశులొ మానవులో యెఱుంగఁ ♦ జొప్పడ దేని
మ్ములఁ దర్కించితి నచ్చటఁ, గలవనిత తెఱంగు వినుము ♦ క్రవ్యాదేశా. ౧౫
చ. అనుపమయౌవనంబు చెలు♦వారఁగఁ జక్కఁదనంబు గ్రాలఁగా
ఘనతరరత్నభూషణని♦కాయము దేహ మలంకరింప న
న్నని నడుమొప్పఁ బొల్పెసఁగు ♦ నాతియు వారలయంతరంబునం
గనఁబడెఁ దన్నిమిత్తమయి ♦ కాదె సహోదరు లిద్దఱేకమై. ౧౬ 498
తే. కులటభంగి ననాథయు♦వలెను నన్ను
నిట్టి దుర్గతిఁ బొందించి ♦ రేమి చెప్ప
దాన నిఁకనని తా నన్న♦దమ్ముల నుతి
సేయుట ఖరుండు తనదగు ♦ చిత్తమందు. ౧౮ 499
సీ. ఇద్ది కాముకి యని ♦ యెంచునేమో యని దానిఁ బాపఁగ నెంచి♦దారుణముగఁ
బలికె దుశ్శీలయౌ ♦ పడఁతి రక్తము రణాగ్రమునందు హతులగు ♦ త్త్వాపతినుత
యుగళరక్తము ఫేన♦యుక్తంబుగాఁద్రావఁగోరెదఁ; దండ్రినా♦కోర్కి యిదియె
మొదటిది దీని నీ♦వు దయను దీర్పఁగవలయును నట్టివా♦రలరుధిరము
ఆ. ద్రాగఁ దీఱవలయు ♦ దానవనాథ! నీ, వట్లు సేయకున్న ♦ ననశనవ్ర
తమును బూని నాదు ♦ తనువును విడిచెద, నవనుతికిని నోర్వ ♦ నగు నదెట్లు.
క. అనిభగిని చెప్పుచుండఁగ, విని ఖరుఁ డతికోప మెసర ♦ వితతబలమునన్
దనరి యమప్రతిములుగాఁ, గనఁబడుచున్నట్టివారిఁ ♦ గ్రవ్యాదులనున్. ౨౦

1 వ్యాఖ్యాతల విశేషార్థముల సారాంశమును జేర్చి యీపద్యము వ్రాయఁబడినదని యెఱుం
గవలయు. 2 ఫలమూలాశనౌ దాంతౌ-అనిమూలము.

క. పదునల్వురఁ గని యిట్లని,యోఁ దగ నరు లిద్ద ఱటవి♦నిం దాయుధభీ
తిదకరులై కృష్ణాజిన, మృదువల్కలధారులగుచు ♦ మెలఁగెదరు సుఁడీ. ౨౧½
చ. వనిత నొకర్తు వెంటఁగొని ♦ వచ్చి భయంకరదండకాటవిన్
గనుఁగొని వాసయోగ్యమని ♦ కాపురముం దమి నున్నవార ల
మ్మనుజుల దుష్టవృత్తియగు ♦ మానిని నిన్ వధియించి తెండు నా
యనుజయు నిద్దిత్రుధిర ♦ మాదృతిఁ ద్రాగును దృప్తిమీఱఁగన్. ౨౩ 503
సీ. ఈనాభగిని మాన♦సేష్టము నాకును సన్నుతంబేయగు ♦ శౌర్యమడరఁ
జని రాఘవులఁ జంపి♦జనకజఁ బొలియించి సత్వరంబుగ నీమె♦స్వాంతవాంఛ
నొనఁగూర్పుఁడని రాక్ష♦సోత్తములకుఁ జెప్పె నంత నాపదునల్వు♦రసురవరులు
ఖరునియాజ్ఞనుగొని♦నరగశూర్పణఖయుఁదమకుమార్గముచూపఁ♦దరలి రాఁగఁ
తే. బవనసంప్రేరితములగు ♦ వారిదముల
భంగి నతివేగమున రామ♦భద్రుఁ డున్న
కడకుఁ బోయిరి; రాక్షస♦కాంతు లంత
భయదనారాచధరులయ్యు ♦ బరవసమున. ౨౫½ 504
క. అనుపమతేజంబునఁ దగు, ఘనవిక్రము రామచంద్రుఁ ♦ గని దీప్తాగ్నిన్
గని వనగజములు భీతిం, గనురీతిం గొట్టఁజాల♦కయె యుండంగన్. ౨౬ 505

పందొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౨౦ - వ సర్గము.

-పదునల్వురు రాక్షసవీరుల రాముఁడు పొలియించుట.-

క. ఘోరాకారంబునఁ దగు, నారాక్షసకాంత యంత ♦ నయ్యాశ్రమముం
జేరి రఘూత్తములను దగ, నారాక్షసులకును జూపె ♦ నవనిజఁ గూడన్. ౧
చ. నిరుపమపర్ణగేహమున ♦ నిల్చిన జానకి రామునిన్ సహో
దరుఁ దమిఁగూడి పీఠమునఁ ♦ దద్దయుఁ బొల్చెడు వానిఁ గాంచి; రా
సిరి మెఱయంగనున్న నృప♦సింహుఁడు రాక్షసి దానితోడ భీ
కరగతివచ్చు రాక్షసులఁ ♦ గాంచి సహోదరుఁ దీప్తతేజసున్. 507
క. కనుఁగొని యిట్లను లక్ష్మణ, జనకజపరిసరమునందు ♦ [1]క్షణ ముండుము నే
నును శూర్పణఖామార్గం, బును ద్రొక్కియె దీనిఁ గావఁ ♦ బూనినవీరిన్. 3½
తే. ఇపుడె వధియించి వచ్చెద ♦ నిచటి కనిన
సువిదితాత్ముని రాముని ♦ శుభవచనము
విని తదాజ్ఞను బాటించి ♦ జనకజకడ
నిలిచె; ధర్మాత్ముఁడగు రాముఁ ♦ డలఘుగతిని. ౫ 509

---

1 క్షణముండు మనుటచే వీరిం బొలియించుట గొప్పకార్యము కాదనుట వ్యాఖ్యము.

చ. కనకవిభూషితంబయిన ♦ కప్రశరాసన మెక్కుపెట్టి య
ద్దనుజులఁ గాంచి యాదశరథ♦క్షితిపాలుని యాత్మజత్వముం
గని రఘురామలక్ష్మణులఁ ♦ గా జనులెల్లను మమ్ముఁ బిల్వఁగాఁ
దనరుచు నుందు మేము వని♦తామణి సీతను గూడి యిమ్ములన్. ౮॥ 510

[1]క. చరియింప నసాధ్యంబయి, పరఁగెడు నీదండకాఖ్య♦వనమున నిందున్
దిరుగన్ వచ్చితి మేమిా, ధరణిం గల మూలఫలవి♦తానముఁ దినుచున్. ౯॥

సీ. [2]అంతరింద్రియనిగ్ర♦హంబునఁ దగి తపంబును సల్పుచున్ ధర్మ♦మును సమాచ
రించుచున్ భీకర♦రీతిగానున్న యీ దండకారణ్యంబె ♦ తగినవసతి
యని యిందు నున్నార♦మనఘవ్రతుల మమ్ము [3]నేలహింసించెద,♦ రేనుమునుల
యానతి వారల ♦ నందఱ హింసించునట్టి పాపాత్ముల ♦ నసురుల మిము

తే. నని వధించుటకై విశి♦ఖాయుధములఁ
దాల్చి యిచటికి వచ్చితి; ♦ దనుజులార!
యందె నిలువుఁడు పరువెత్త ♦ నర్హమెట్టు
లగును బ్రాణాళి వలచిన ♦ మగుడి చనుఁడు. ౧౦ 512

క. అనిపలుకన్ విప్రఘ్నులు, దనుజులు పదునల్వురిట్లు ♦ తముఁగూర్చి వచిం
చిన రామువాక్యముల విని, యనంతకోపమున శూల♦హస్తులు నగుచున్.

ఆ. [కన్నులెఱ్ఱఁ బాఱఁ♦గా మధురాభాషుఁ
డయి యపూర్వశౌర్య ♦ మడర రాముఁ
డకు లెఱ్ఱఁబాఱ ♦ నట్లు చెప్పుట నెంచి
భయదరూపులగుచుఁ ♦ బలికి రిట్లు.] 514

[4]సీ. సుమహాత్మునకు ఖరా♦సురునకు మాప్రభువునకు మహాగ్రహం♦బును జనింపఁ
జేసితి వీవు మా♦చేత సంగరమున వధియింపఁబడుదు వే♦వరుసనైన
నొక్కండవేనీవు ♦ పెక్కండ్రముగద మేమని మొన మాముంద♦ఱను నిలువఁగఁ
జాలినంతటి మహా♦శక్తి నీకున్నదే మాతోడ నింక స♦మరము సేయు

ఆ. టను వచింపనేల? ♦ యనిచేయుటకు రమ్ము, మాభుజప్రయుక్త ♦ మహితశూల
పరిఘపట్టిసముల ♦ బలిమికిఁ బ్రాణాళి, విడువఁగలవె; భూరి♦వీర్యమెడల. ౧౩॥

---

1 దుశ్చరం దండకావనమ్-అనిమూలము. 2 దాంతా తాపసా-అనిమూలము. 3 కిమర్థ ముప హింసథ-అనిమూలము. 4 క్రోధ ముత్పాద్య నోభర్తుః ఖరస్య సుమహాత్మనః, త్వమేవ హాస్యసే ప్రాణా నద్యాస్మాభి ర్హతో యుధి......పట్టసైః-అనునీసార్ధశ్లోకమునకు మహేశ్వరతీర్థులవారి విశే షార్థ మిట గర్భితమని యెఱుంగవలయు. ఎట్లనఁగా: వధియింపఁబడుదు వే వరుసనైన=వరుసమిాఱ మే మెంతయుద్ధము చేసినను మాచేఁ జంపఁబడుదువా? లేదనుట. మహాశక్తి నీకున్నదే-అనుచోట మాయెదుట నిల్వ నీకు శక్తిగలదు అనుట. ప్రాణాళి విడువఁగలవె-అనుచోట మాయాయుద్ధసాధన ముల బలిమికి నీప్రాణములు పోవునా? పోవనుట. ఇట్లు వాస్తవార్థము తెలియఁదగు.

క. కరమునఁ బట్టిన భీకర, శరాసనము శక్తి యిట్టి ♦ సమరమునఁ జెడకన్
దరమే జయింపనని యిటు, సురవైరులు పలికి చాల ♦ శూరత్వమునన్. ౧౪

తే. కోప మడరంగ రాఘవ♦క్షోణిపాలు
పైన దుర్జయుఁడని యెంచ♦కానిశాటు
లెల్ల శూలంబులను వైచి ♦ రుల్ల మలర
నడుమ ఖండించెఁ గనకబా♦ణములవాని. ౧౫॥ 517

క. సమసంఖ్యసాయకంబుల, సుమహితముల వైచి యట్టి ♦ శూలంబులఁ ద్రుం
చె మహితశౌర్యంబున న,య్యమరారులమీఁదఁ దేజ♦మలరఁగ మరలన్.

చ. ఖరకరసన్నిభంబులయి ♦ గండశిలాతతులం బగుల్చు భీ
కరశితధారలన్ వెలసి ♦ క్రాలు చతుర్దశసాయకంబులన్
గరమున సంగ్రహించి తగఁ ♦ గర్ణముదాఁక ధనుస్సులాగి యా
సురులను జక్కఁగా గుఱుతు ♦ చూచి భయంకరకోప మొప్పఁగన్. ౧౭॥

క. హరిహయుఁడు వజ్రసాయక,ము రహిఁ బ్రయోగించురీతి ♦ మూర్ఛలపయి భీ
కరగతి నార్చి ప్రయోగిం,చె రయం బొప్పార నంత ♦ శితసాయకముల్. ౧౮

ఆ. కనకభూషితములు ♦ కడుదీప్తములు రుక్మ
పుంఖములును నగుచుఁ ♦ బొలిచి వారి
వక్షములను జీల్చి ♦ వడి రక్తసిక్తము
లగుచు నవలికేగి ♦ యశనులవలె. ౧౯॥ 521

క. ఘనరవమడరఁగఁ జొచ్చె న,వని; నారక్కసులు భూరి♦వక్షము లగలం
గను నెత్తుటఁ దోఁగినయం, గనిచయ మొప్పంగ వికృత♦గాత్రము లొప్పన్.

సీ. ప్రాణముల్ విడిచి వి♦శ్వంభరపై వ్రేళ్లు తెగినంతమాత్రన ♦ త్రెళ్లు వృక్ష
ములభంగిఁ బడిరి; వా♦రలునేల నవ్విధిఁ బడుటఁ గనుంగొని ♦ భయదకోప
మడరంగఁ జేయంగ ♦ నగునట్టిదేలేక భయపడి భయదని ♦ స్వనము లడర
నతివేగమునఁ దన♦యన్నయొద్దకుఁ బోయి యుంచుకగా రక్త♦మెంచియుండ

తే. నార్తయయి బంకతోఁ గూడి♦నట్టి సల్ల
కీమహీజముపోల్కిఁ దా ♦ భూమి వ్రాలె;
నంత నాశూర్పణఖ ఖరు♦నంతికమునఁ
బలువిధంబులఁ బలుమాఱు ♦ వనటఁ గుంది. ౨౩॥ 523

ఆ. మోముఁ వాంచి దుఃఖ♦మున నార్చియేడ్చుచు, విడిచెఁ గంటనీరు♦విపులబాహు
శౌర్యులైన దనుజ♦సత్తము లీరీతి, నని విరోధిచేత ♦ నట్లు తెగుట. ౨౪॥ 524

క. కనుఁగొనినది కావున నం,దును నిలుచుట కనువుపడమి ♦ ధూర్తుఁడగు ఖరుం
గనఁబోయి యచటివార్తల, ననువుగ నెఱిఁగించెనిగులు♦నార్తిఁగనలుచున్.

ఇరువదియవ సర్గము సంపూర్ణము.

## ౨౧ - వ సర్గము.

పదునల్వురు రాక్షసులచావును శూర్పణఖ ఖరునకుఁ జెప్పుట.

చ. ఖరుఁ డటువచ్చి శూర్పణఖ ♦ క్ష్మాస్థలిపైఁ బడియుండఁ గాంచి యా
సురమృతిఁ గోరి యచ్చటికి ♦ శూరులనుం గొనిపోవవచ్చిన
ట్టి రమణితోడఁ గోపమున ♦ దీవిగఁ బల్కెను; నీకుఁ బ్రీతిఁగా
గరువముఁ దేజముల్ గలుగు ♦ గాఢరణోగ్రుల శూరవర్యులన్. ౧ 526

క. పనిచితిఁ గద నే రక్తా, శనులను, నేడ్చెదవు మరలఁ ♦ జనుదెంచి జవం
బున వినఁగోరెదఁ గారణ, మని మఱియుం బలికె; నేను ♦ నంపినదనుజుల్. ౨

సీ. భక్తులు నాకను♦రక్తులు హితులును నయి యెట్టిపగవారి♦నైనఁ జంపఁ
జాలి యేవారికి ♦ సమరరంగమ్మున నెదిరింపరానట్టి ♦ యుద్ధశౌర్య
మేపారఁగా నుందు ♦ రేను జెప్పినపని చేసి తీరుదురు వా♦రీసరణిని
మరల నీవే తెంచి ♦ మానిని యేలొకో యక్కటా! నాథుఁడా! ♦యనిమిగులఁగ

తే. నేడ్చుచున్ సర్పమట్లుగ ♦ నిలవయిఁ బడి
పొరలుచున్నావు; కారణం♦బును వచింపు
మేదియో వినఁగోరెద ♦ నేను దాని
దిక్కుగా నేనుఁ గ్రాలంగ ♦ నిక్కరణిని. ౩ 528

క. వనితా! పలవించెద వి, ట్లనాథవలెనేల చాలు ♦ నమ్మా లేలె
మ్మనయము భయలేశంబును, గనకుము దీనతయు మానఁ♦గాఁ దగు నీకున్.

చ. అని పలుభంగులన్ ఖరను♦హాసురుఁ డూఱడిలంగఁబల్క [1]మా
ర్కొనఁ దగనంత ధైర్యమున ♦ దూఁకిగ నొప్పెడు నామె బాష్పముల్
కనులను గ్రమ్మఁగాఁ దుడిచి ♦ గాదిలి యన్నను గాంచి పల్కె నో
దనుజవరేణ్య! యిప్పుడె వి♦దారితకర్ణయుగోరునాసనై. ౫ 530

తే. రక్తసిక్తాంగినై నేను ♦ రయముమీఱ
వచ్చితిని నూఱడించితి ♦ విచ్చట నను
వీర! నీవును గ్రుద్ధ రఘు♦వీరయుగముఁ
జంపఁ బదునల్వురను దను♦జవరులఁ దగ. ౬ 531

క. నాకొఱకుఁ బంపితివి వా, రాకోసలపతిని గోప ♦ మడరఁగఁ గనుచున్
వీఁకన్ శూలంబులఁ గొని, వే కదిసిన నతఁడు మర్మ♦భేదిశరములన్. ౭ 532

క. అనిమొనఁ జంపెను సంగతి, ననుపమబలులయ్యు వార ♦ లటువడుటయు రా
ముని శౌర్యకృత్యమును నేఁ, గనుటయు భయమంకురించె ♦ గాఢముగాఁగన్.

చ. దనుజవరేణ్య! నేనును ని♦తాంతభయంబును బొంది దుఃఖముం
గనితిని జెప్పనేల? యమ♦కల్పుని రాముని యంతటన్ గనుం

---

1 దుర్ధర్షా ఖరేణ పరిసాంత్వితా-అనిమూలము.

గొనుచును నీవెదిక్కనుచు ◆ గొబ్బున వచ్చితి దీననైతి నీ
వనుపమ శౌర్యయుక్తుఁడ వ◆హార్యబలుండవు గానఁ గావుమా. ౧౧ 534

తే. వ్యథయనెడు నక్రమంతర◆మందు నొప్ప
భయతరంగావళుల్ నిండఁ ◆ బర్వ వెలయు
భూరితరశోకసాగరం◆బున మునిఁగితి
[1]నిట్టి ననుఁగావఁ బూనవా ◆ యేమి వీర!. ౧౨ 535

క. నావెంటం జనుదెంచిన, యావీరపలాశను లని ◆ నా రాఘవుచేఁ
జేవ యడంగఁగ శితశర, పావకశిఖలన్ దహింపఁ◆బడి మ్రందిరిగా. ౧౩ 536

చ. దనుజవరేణ్య! నాపయిని ◆ దత్సురవైరులపైఁ గృపారసం
బును గలవాఁడవేని రఘు◆భూపకులాభరణోపమానమై
తనరెడుశక్తిశౌర్యమును ◆ దప్పక నీకును గల్గునేని యి
వ్వని దనుజాంతకుం డయిన◆వానిని రామునిఁ జంపుమా తగన్. ౧౪ 537

క. నాపగవానిన్ రాముని, వేపట్టి వధింపవేని ◆ విమతకృతహ్రీ
వ్యాపాదితనై యిపుడే, నీపరిసర మందె విడుతు ◆ నేఁ బ్రాణములన్. ౧౫

సీ. మహితాత్ముఁడైన రా◆మశశాంకు నంతికంబున సంగరమున నీ◆వును బలాళిఁ
గలిసియు నిలువంగఁ ◆ గలుగు దిట్టతనంబు గలవాఁడవను నమ్మ◆కంబు నాకుఁ
గలుగలే; దాసోద◆రులు మనుష్యులుగదా యట్టివారి వధింప ◆ కిట్టులున్న
వాఁడవే నిను నీవె ◆ బాహుశౌర్యంబులు గలవానిఁగా మదిఁ ◆ దలఁచువానిఁ

తే. గాఁ దలంతుము, సత్యంబు◆గాఁ దలంప
శూరుఁడవు గావు, పట్టిదా ◆ శూరతను బ
యిని దగన్ బెట్టుకొంటివి ◆ [2]దనుజకులముఁ
బాడుచేయంగఁ బుట్టిన◆వాఁడ వీవు. ౧౬ 539

క. రామునితో సమమగు నుద్దామపరాక్రమము నీకుఁ ◆ దనరునయేనిన్
భీమాహవమున నివ్వని, రాముని వధియింపు దివిజ◆రాజప్రతిమున్. ౧౭

తే. సత్వహీనుఁడ వీవు నీ◆శౌర్య మల్ప, మిట్టి నీకిందు నివసింప ◆ నెట్లు తగును?
గాన వే బంధువులఁ గూడి◆కదలు మిచట, నుండఁగూడదు నీవిట◆నుండు దేని.

తే. రామతేజోభిభూతుఁడ◆వై మహోగ్ర
శౌర్య మడఁగంగ నశియింపఁ ◆ జాలు దీవు
త్వరగ; రాముండు దశరథా◆త్మజుఁడు శక్తి
సంయుతుఁడు సుమ్మి; యాతని◆సహజుఁ డిపుడు. ౨౦ 542

క. నన్ను విరూపఁగఁ జేసిన, సన్నుతబలశాలియైన ◆ సౌమిత్రియు ను

---

1 కిం మాం నత్రాయసే మగ్నాం-అనిమూలము. 2 దండకారణ్యనిలయం జహితం కులపాంసన-అనిమూలము.

త్పన్నపరాక్రముఁ డనుచున్, విన్నఁదనం బొప్ప నేడ్చె ♦ వితతోదరియున్.

తే. ఇట్టు లాశూర్పణఖ యప్పు♦డెంతొ దుఃఖ
మట్టె యభివృద్ధినొంద స్వ♦హస్తముల ను
దరము మోదుకొనుచును రో♦దనముచేసి
[ఖరునిచెంతనె మూర్ఛిల్లెఁ ♦ గళవళించి.] ౨౨ 544

ఇరువదియొకటవ సర్గము సంపూర్ణము.

## ౨౨ - వ సర్గము.

ఖరుఁడు యుద్ధమునకుం బయనమగుట.

క. ఖరుఁ డిట్లు రాక్షసౌఘాంతరమున శూర్పణఖచేతఁ ♦ దా ధర్షితుఁడై
నిరుపమశూరుఁడు గావున, [1]ఖరతరవచనంబుఁ బల్కెఁ ♦ గడుఁ గ్రౌర్యమునన్.

తే. నీకుఁ గల్గినయవమతి ♦ నాకు నిపుడు
తీవ్రకోపంబు గల్గిన♦ది విను మద్ది
పర్వమునఁ బొంగినట్టి [2]ల♦వణజలనిధి
కరణి భరియింప నలవిగా♦కయె యెసంగె. ౨ 546

సీ. క్షణజీవితుండయి♦శౌర్యము గలవానిఁగాఁ దన్నుఁ దానె ని♦క్కముగఁ దలఁచు
చున్నరాముని మను♦ష్యుని వీర్యమున నేను గణియింప నాతఁడి♦క్కాలమందుఁ
దా నొనర్చిన దుష్కృ♦తములకు ఫలముగ నాచేత నిహతుఁడై ♦ నైజపంచ
కాసువులను వీడఁ♦గా సిద్ధముగ నున్నవాఁడు నీవింక మీఁద ♦ బాష్పములను
తే. దుడుచుకొమ్ము సహోదరి ♦ తొందరను వ
దలుము నే రాఘవుని వాని♦తమ్ముని యమ
పురికిఁ బంపెద రాక్షసీ! ♦ దురమున నత
నిని [3]కుఠారంబునం ద్రుంచె♦దను నిజంబు. ౩ 547

క. క్రమముగ నాతనివా ప్రాణములును మందగిలుచుండ ♦ నారీమణిరో
మనుతం ద్రాగంగల నుష్ణముగాఁ దగువాని రక్త♦సారముఁ ద్వరలోన్. ౪

చ. అనవిని తన్ముఖచ్యుతమ♦హావచనంబుల నిక్కమంచు నె
మ్మనమున నమ్మి యుబ్బి కడు♦మౌర్ఖ్యమునన్ దనుజేంద్రు నన్ననా
తని మరలం దగంబొగడెఁ ♦ దన్వి తనున్ మునుదిట్టి యవ్వలన్
మనమలరారఁగాఁ బొగడ ♦ మందమతిత్వముచేత నొప్పుటన్. ౫ 549

క. సేనాపతియగు దూషణుఁ, డానప్పుడు చూచి ఖరుఁడు ♦ దతరవయుక్తిన్
మానిని విన నిట్లనియెన్, దానవులన్ విపులసమర♦దర్పుల హితులన్. ౬ 550

1 ఖరః ఖరతరం వచః-అనిమూలము. 2 లవణాంభ ఇవోత్థితమ్-అనిమూలము. 3 పరశ్వధహతస్యాద్య-అనిమూలము.

సీ. పదునాల్గువేవుర ♦ భయదవేగుల నాపదిని నెఱింగియె ప్రవ♦ర్తించువారి
నీలమేఘాంగులఁ ♦ జాలఁ గ్రూరులఁ, గ్రూరకర్ముల మఱియు లో♦కములకెల్ల
హింసఁ గూర్చుచుఁ దమి♦ నెసఁగఁ గ్రుమ్మరువారి బలవంతులను దగ్ర♦పౌరుషంబుఁ
గలవారి శార్దూల♦గణసమదర్పులఁ బెనుమోముగలవారి ♦ వినయవిరహి
తే. తులను గర్వితులను గొని ♦ వలయు సర్వ
కలహయత్నంబులను ద్వర♦గా నొనర్పఁ
బంపుమా, సౌమ్య! నా రథ♦వరముఁ జాప
ములను ఖడ్గంబులను బాణ♦ములను వేగ. ౧౦ 551

క. పలువిధశక్తులఁ దీక్ష్ణం,బుల నాయత్తంబుచేసి ♦ పొలుపుగఁ దెమ్మా
కలహమిదె వచ్చె మనకుఁ, గులపౌరుష మలరఁబోవఁ ♦ గోరెద ననికిన్. ౧౧

*ఆ. విను పులస్త్యవంశ♦మునఁ బుట్టి మహాత్ము
లైనవారిముందు ♦ నేను యుద్ధ
కోవిదత్వ మలరఁ ♦ గోరెదఁ బోవంగ
వారిఁ జంపనె మదిఁ ♦ గోరి కోరి. ౧౨ 553

ఆ. దుర్వినీతులయిన ♦ ధూర్తులఁ జంపుటే, నాదుకోర్కి; యనిన ♦ నాదనుజుని
పలుకు వినినయంతఁ ♦ బలురంగులం దగు, నుత్తమాశ్వవితతి ♦ యుక్తరథము.

క. కైసేసియె తెప్పించెను, నాసేనాపతియు నంత ♦ స్యందన మదియున్
భాసురమై రవివలెఁ దగఁ,గా సేనాపతియు వచ్చెఁ♦గా రథ మనియెన్. ౧౩ 555

సీ. అది మేరుగిరిశిఖ♦రాకారమై తప్తకాంచనభూషణ♦కలిత మగుచు
వైదూర్యకూబరం♦బై దగఁ గాంచనచక్రమై విపులమై ♦ జాతరూప
మయపుష్పభూరుహ♦మత్స్యపర్వతచంద్రభానుపక్షితతులు ♦ పరఁగఁ దార
కలు నాల్గువంకలఁ ♦ గలిగి శుభంబయి ధ్వజఖడ్గయుక్తమై ♦ భవ్యకింకి
తే. ణీకసంపన్నమై వాజి♦నిచయయుక్త
మగుచుఁ దనరారె, సామర్షుఁ ♦ డగుచు ఖరుఁడు

---

* అగ్రే నిర్యాతు మిచ్ఛామి పౌలస్త్యానాం మహాత్మనామ్, వధార్థం దుర్వినీతస్య రామస్య రణకోవిదః - అనిమూలము. దీనికి మహేశ్వరతీర్థులు "వస్తుతస్తు దుర్వినీతస్య దుష్టేషు వినీతస్య రామస్య అగ్రే పౌలస్త్యానాం రాక్షసానాం వధార్థం నిర్యాతు మిచ్ఛామీతి సంబంధః" అని వ్రాసిరి. అనఁగా దుష్టజనుల కంతకుం డగు రామునియెదుట రాక్షసుల వధనిమిత్తమై బయలుదేరఁ గోరుచున్నానని యర్థము. ఈవిశేషార్థము ఈపద్యమున నిమిడింపఁబడినదని తెలియవలయు. ఇందు మహాత్ములనఁగా ముక్తికిఁ బోవఁజాలిన పులస్త్యవంశజనితులయిన మాజాతివారికి ముందే నేను దుష్టసంహారకుండగు రాముని యెదుట యుద్ధము చేయఁబోవుచున్నానని ఖరుని మనోభావమనుట నిట ముఖ్యముగా గ్రహింపఁదగినది. ఖరాదిరాక్షసు లెంతమూర్ఖులవలె నితరులకుఁ దోఁచినను వారు ముక్తికాములై భగవంతునితో యుద్ధముచేసినఁ గాని మృత్యువు లభించి ముక్తిదొరకదని తెలిసినవారని స్పష్టమగుచున్నది.

దానినెక్కెను; ఖరుఁ డర♦దంబు నెక్కఁ
గాంచి వానిని దూషణు ♦ నంచితబలు. ౧౬॥ 556

క. భీమపరాక్రములగు సు,త్రామారులు కొలిచియుండ ♦ దానవపతియు
ద్దామధనుర్ధరులను గవ,చామండితతనుల నాయు♦ధాయతకరులన్. ౧౭॥ 557

సీ. పెనుధ్వజంబులుగల్గి ♦ వెలయు నారాక్షసవీరులఁ గనిపల్కెఁ ♦ దా రథంబు
నందునుండియె, యిఁక ♦ నరుదెంచనికి నంచు నాజ్ఞ యిచ్చిన భీతి♦దాయుధధ్వ
జములను సత్కవ♦చంబులఁ దాల్చిన యాసైన్యమంతయు ♦ నతిభయంక
రారవంబులు తగ ♦ నప్పుడె యాజనస్థానంబునుండి చం♦చద్గతులను

ఆ. బయనమయ్యె; నంత ♦ బలశాలురగు పదు, నాల్గువేవు రపుడు ♦ నైజతీవ్ర
మడర వెలయు ముద్గ♦రాళిఁ బట్టిన శూల, శితపరశ్వధములఁ ♦ జిత్రగతుల.

ఆ. చక్రఖడ్గములను ♦ జంచదాకృతులగు, తోమరముల మిగుల ♦ ధూర్తతఁ దగు
పరిఘములను శక్తి♦పటలములను బలు,చాపములను గదల ♦ నరగఁబూని.

[1]క. నిరుపమతరాసు లొప్పఁగ, వరపవిముసలములఁ దాల్చి ♦ పౌరుషమలరన్
ఖరుచిత్తమునకు సరిగాఁ, జరియించుచు బయలువెడలి ♦ చని రనిసేయన్. ౨౨

తే. భీమవిక్రములగు దైత్య♦వీరు లనికి
బరవసంబునఁ బోవుట ♦ ఖరుఁడు గాంచి
సైన్యసమ్మర్దమునఁ దన♦స్యందనమును
[2]వారివెనుకనె పోనిచ్చెఁ ♦ ద్వరను మాని. ౨౩ 561

సీ. అంత సారథి ఖరు ♦ నభిమతరీతిని దప్తకాంచనభూషి♦తములు చిత్ర
వర్ణములు నగు న♦శ్వములశీఘ్రుచుతోలె; నరికాలుఁడగు ఖరా♦సురునిరథముఁ
ద్వరఁగ సారథితోలఁ ♦ దద్గ్రివంబునదిక్కులునువిదిక్కులునిండె♦ఘనబలుఁడగు
ఖరుఁడంతఁ బరుషంబు♦గా నార్చుచున్ వృద్ధియగుకోపమునఁ దన♦పగతుర వధి

తే.యింప యమురీతి నడరుచు ♦ నెసఁగు వాయు
వట్టె పురికొల్ప నొకభంగి ♦ నశ్మవృష్టి
గురియ నుద్యుక్తమగు జల♦ధరము తన్ను
నావరించిన ఘనముఁబో ♦ నడచుభంగి. ౨౫॥ 562

క. పెనునాద మడర సారథిఁ, గని యరదముఁ దోలుమింకఁ ♦ గడువడి నని యా
జ్ఞనిడెన్; శూర్పణఖావా,క్యనికరములు తొందరింప ♦ నతిగర్వమునన్. ౨౬

ఇరువదిరెండవ సర్గము సంపూర్ణము.

---

1 నిరుపమతరాసులు=నిరుపమతర, అసులు అని విభజింపనలయు. 2 ఖరస్యాపి రథఃకించి జ్జగామ తదనంతరమ్-అనిమూలము.

## ౨౩ - వ సర్గము.

### ఖరునకు దుశ్శకునము లగుట.

ఆ. అసురసేన లిట్టు ♦ లాజనస్థానంబు, నుండి వెడలు నంత ♦ నొక్కరీతి
గర్ద భారుణమగు ♦ కడిఁదిమేఘమువాని, పై నమంగళ మగు♦భంగి మెఱయ.

క. కురిసెన్ రక్తోదకమును, ఖరురథమునఁ గట్టియున్న ♦ గంధర్వములున్
ద్వరఁగాఁ జనునవి యయ్యును, సురుచిరపుష్పాంచితమయి ♦ శోభిలు త్రోవన్.

క. దైవగతిం బడియెను నా, భూవిభుమార్గంబు సమము ♦ పుష్పాంచితమై
యేవిధముగ నైనన్ శ్రమ, నావాజుల కియ్యఁజాల ♦ నట్టిదియైనన్. ౨ 566

క. ఖరకరుచుట్టును బర్వెను, బరివేష మలాతచక్ర♦భంగిఁ [1]దుదలయం
దరయఁగ రక్తద్యుతియై, సరగున నీలమ్ముగాఁగ ♦ సాంద్రద్యుతితోన్. 567

క. పెనుకాయము భయదంబుగఁ, గనఁబడఁగా గృధ్రమొండు ♦ కాంచనదండం
బున నుచ్ఛ్రితమగు కేతన,మును ద్వరఁగా నావరించి ♦ మునుకొని నిలిచెన్.

సీ. పలలంబె తిను మృగ♦పక్షిసంతతి జనస్థానాంతికముఁ జేరి ♦ తగనియట్లు
పలురీతుల వికార♦ములు పరుషంబులు నగు నారవంబుల ♦ నార్భటించె;
నర్కుండు వెలయుచు♦న్నట్టి దిక్కును జేరి ఘోర[2]శివావళి ♦ కుమతులైన
యసురవీరులకెల్ల ♦ ననభిమతంబుగా నఱచె బ్రద్దలువాఱ♦నట్టి గిరుల

తే. శరణి భయదంబులై పొల్చి ♦ కడురవంబు
సేయుచున్ రక్త మట్టిదౌ ♦ తోయమునటు
గురియుచున్ మేఘబృందంబు ♦ నిరవకాశ
ముగను గావించె నాకాశ♦మును క్షణమున. ౭ 569

తే. భయదమై రోమహర్షణ♦మయి తగు తిమి
రము క్షణంబున నిండె నీ♦రంధ్రమగుచు;
వెలయ దిసుమంతయును విది♦శలును దిశలు
సంధ్యరాకయె యెఱ్ఱని ♦ సంజ యలరె. ౮౪ 570

క. దనుజేంద్రు దిక్కు మొగమై, పెనుభీతిని గలుగఁ జేయు ♦ వివిధమృగమ్ముల్
ఘనపక్షికంకగోమా, యునికరములు గృధ్రములును ♦ నొక్క తెఱఁగునన్.

క. భీతిని గలుగన్ జేయుచు, నాతతరీతిం దగంగ ♦ నఱచెన్ మఱి యే
వేతఱిఁ దోఁచిన నశుభం, బాతఱి నే గలుగు భీతి ♦ యనురునో యనిలోన్.

తే. అట్టినక్కలు ఖరుసేన ♦ కప్పు డెదురు
గాఁగ నాస్యంబులన్ నిప్పు♦కణము లురుల
నఱచె; రవిచెంతఁ [3]బరిఘోప♦మాంగము దగు
నరుని మొండెము చూపట్టె ♦ నల్లనగుచు. ౧౧ 573

---

1 శ్యామం రుధిరపర్యంతమ్-అనిమూలము. 2 శివంబులు=నక్కలు. 3 కబంధం పరిఘాభాసో దృశ్యతే-అనిమూలము.

క. దినకరు నపర్వకాలం,బున రాహువు సంగ్రసించె ♦ భూరిక్రోధం
బున; వాయువు ప్రతికూలగ,మునమునఁ జరియించెఁ గాంతి♦ మాసెన్ రవియున్.

క. కనఁబడెఁ దారలు ఖద్యో,తనిభ ప్రభ లొప్పఁ బగటఁ ♦ దామరకొలఁకుల్
ఘనమత్స్యజలపతత్రులు, [1]వనముల నడఁగంగ నెండఁ ♦ బంకజచయముల్.

తే. కాంతిహీనములై యుండె ♦ క్ష్మారుహములు
పుష్పఫలరహితంబులై ♦ పొదలకుండె;
గాలిలేకయె జలదంబు♦కరణి ధూస
రమగు రేణువు రేఁగె నా♦సమయమందు. ౧౮ 576

క. పరుషముగ శారికోత్కర,ము రాక్షసులపైని దిరిగి ♦ మునుకొని కూసెన్
గరువమున [2]వీచి కూచి య,నురావమేర్పడఁగ నటఁ గ♦నుంగొన నసదై.

క. చూపఱకు భీతినొసఁగుచు, వే పిడుగులు విషమకాంతి♦ వెలయఁగఁ బడియెన్;
ఆపట్టున వనగిరియుత, భూపద్మాక్షియు వడంకె ♦ భూరితరార్తిన్. ౧౮౹ 578

సీ. ధీమంతుఁడయి రథ♦స్థితుఁడయి ఖరుఁడంత గర్జించుచుండఁ ద♦ద్గర్వ మడఁప
సవ్యభుజంబు చం♦చద్గతి నదరెను వానికంఠధ్వని ♦ వరుసఁ దగ్గి
తడఁబడసాగె; నా♦తఁడు నలుప్రక్కలఁ గనునప్పు డాతని ♦ కనులనుండి
జలము గాఱఁగసాగెఁ♦ దలయందు నొకవ్యాధియంకురించెనుగాని♦ యనినొనర్ప

ఆ. వలయు ననెడు మోహ♦భావంబు మాత్రము
విడువకుండె; నతఁడు ♦ విషమము లగు
నపశకునము లట్టు ♦ లగపడుటఁ దలంచి
భయదములనియెంచి ♦ పౌరుషమున. ౧౮౺ 579

క. పకపకనవ్వుచు రాక్షస, నికరముఁ గని పల్కె భీతి ♦ నింబుట్టఁగఁ జే
యుకడింది మహోత్పాత, ప్రకరము గనఁబడెడినైన♦ వానిన్ నేనున్. ౧౯

తే. పౌరుషంబున బలహీను ♦ బలయుతుండు
సరకుఁగొననట్లు లేశంబు ♦ సరకుసేయ;
నాగ్రహించితి నామహో♦గ్రాంబకముల
నంబరమునుండి తారల ♦ నవనిఁ గూల్తు. ౨౦ 581

క. మరణము మృత్యువునకు నే, సరగునఁ గల్పింతు రామ♦చంద్రు బలమునన్
గరువము గాంచినవానిన్, నిరుపమతీక్ష్ణాంబకములు ♦ నిగిడించి క్రుధన్. ౨౧

తే. అతని తమ్ముని లక్ష్మణు ♦ ననివధించి
కాని మరలంగ నెంచి; రా♦ఘవుల రక్త
మాదరంబునఁ ద్రావి నా♦యనుఁగుభగిని
యభిమతముఁ దీర్చుకొనుఁగాక ♦ యటవి నిందు. ౨౨ 583

---

1 వనములన్=నీటియందు. 2 వీచికూచీతి వాశ్యంతః-అనిమూలము. వీచికూచి యను నుచ్చారణము గలశబ్దములు.

క. నా సోదరికొఱకై కద, యా సీతారాములకును ♦ నాయతబలుఁడా
నా సౌమిత్రికి నాపద, యీ సరణిన్ సంభవించె ♦ నీసమయమునన్. ౨౨౪ 584

క. నాకిది వలె కెన్నండే, నేకడలఁ బరాజయం బ♦ దేరీతిని లే
దీకథ మీకుం దెలిసిన, దేకద [1]సత్యేతరంబు ♦ నేఁ జెప్పను జూ. ౨౩౪ 585

సీ. నేను గోపింతున♦యేని మదించిన యైరావతము నెక్కి♦నట్టి బలుని
వజ్రహస్తుని దేవ♦పతినేని చంపుదు నని నీకుఁ గుత్సిత♦మనుజులకథ
వచియింపఁగా నేల? ♦ బలయుతులార! నా దనుజులు ఖరుని యు♦దారవాక్కు
లను విని మృత్యువు ♦ ఘనపాశములఁ జిక్కి నట్టివారలు గాన ♦ నతులహర్ష

తే. మునను బొదలిరి; యుద్ధంబుఁ ♦ గనుఁగొనంగఁ
దలఁచి మహితాత్ములగు సిద్ధ♦పలును మునులు
చారణులు సిద్ధగంధర్వ♦సత్తములును
వచ్చి రచటికి మదిలోని♦వాంఛ లెసఁగ. ౨౬౪ 586

ఆ. పుణ్యకర్ములగుచుఁ ♦ బొలుచు నవ్వీర లొం
డొరులతోఁ బలుకుకొ♦నిరి దగంగ
గోధరామరులకుఁ ♦ గోర్కి జగంబుల
కెల్ల మేలుసేయు ♦ హితమతులకు. ౨౭౪ 587

క. మంగళమగుఁగాక; సదా, భంగురచక్రంబుఁ దాల్చి ♦ వనజాక్షుఁడు తా
సంగరమున భీమాసుర, పుంగవుల జయించినట్లు ♦ భుజబలములరన్. ౨౮౪

క. శ్రీరాముఁడు పౌలస్త్యుల, నీరాక్షసవర్యులన్ జ♦యించుత మనుచున్
బోరనఁ జెప్పుకొనుచు సుర, వీరులు మానులును గాంచు ♦ వేడుక లలరన్.

ఆ. వ్యోమయానములను ♦ దా ముండి విగతాయు
షులగు దనుజభటవ♦రులను గనిరి;
భయదయోధవీర ♦ పటలావృతుండయి
ఖరుఁడు వెడలె ననికిఁ ♦ గడుజవమున. ౩౦౪ 590

చ. అరదమునెక్కి తానటు ఖ♦రాసురవర్యుఁడు పోవఁగాంచి యా
సురవరు లెల్లఁ దారు రణ♦శూరత మీఱఁగఁ బోయి; రంత నా
ఖరుని రథంబువెంటఁ దమ♦గాఢపరాక్రమ ముల్లసిల్లఁగాఁ
బరుషుఁడు, కాలకార్ముకుఁడు, ♦ భాస్కరకల్పుఁడు శ్యేనగామియున్. ౩౧౪ 591

సీ. యజ్ఞశత్రుండు, వి♦హంగముఁడును, బృథుగ్రీవుండు దుర్జయుం ♦ డావిధమునఁ
గరవీరనయనుండు ♦ కడుశౌర్యవంతుఁడౌ నట్టి మహామాలి ♦ యహిముఖుండు
నమ్మేఘమాలియు ♦ నట్టులె రుధిరాశనుఁ డను నీశూరులు ♦ నూత్న బలము
లలరఁగాఁ బన్నిద్ద ♦ ఱెలమి వెళ్లిరి; ఖరు ననుసరించుచు నమ్మ♦హాకపాలి

1 సత్యేతరంబు=అసత్యము.

తే. త్రిశిరుఁ డతిధీరుఁ డౌ ప్రమాథియును స్థూల
నయనుఁడను నల్వురున్ సైన్యనాయకు లొగి
దూషణుని బరివేష్టించి తోడన చని;
రంత సాధ్వసకరవేగులై తనర్చి. ౩౪ 592

క. నిరుపమబలములఁ బొల్చెడు, సురశైరులు సమరమెల్లఁ జూచెడుకాంక్షన్
[1]ధరణీసుతముఖు లావిధు, తరణులవలెఁ బొండి రచటఁ దతోన్నసమలన్. ౩౫

ఇరువదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౨౪-వ సర్గము.

రాముఁడు యుద్ధసన్నద్ధుఁ డగుట.

క. ఖరతరశౌర్యుండగు నా, ఖరుఁడా శ్రీరామునకడకుఁ గనఁ బయనంబై
యరుగుచు నుండఁగ రఘువరు, లరసిరి దుశ్శకునముల మహోత్సవసీమన్. ౧

సీ. అంత రాముండు భయంకరములు, రోమహర్షణములు [2]మనుజాళి కహిత
ములగు మహోత్పాతములు గనఁబడుటను దమ్మునిఁ గని యోయాయతభుజ! వినుము
సకలదైతేయుల సంహరింపఁగ నీమహోత్పాతపుంజంబు లొగి సమస్త
భూతసంహారకంబుగఁ గనుపట్టిన విదె చూడుమా యిట నివియె మేఘ

తే. ములు కటువులయి గార్దభంబులద్యుతి తగ
రక్తధారలు గురియుచు రవము మిగులఁ
గలుగునట్లుగ నార్చుచు గగనమందుఁ
దిరుగుచున్నవి గమనంబు స్థిరత మాన. ౪ 595

క. అనుజా! నాశరములు ధూమనిచయసంవృతములౌచు మానక యుద్ధం
బును గోరుచున్న వివిగో, ధనువులు కనకంపుఁబిడులఁ దగ రాజిలుచున్. ౫

క. కలహముఁ గోరుచు నెంతయుఁ, జలియించుచు నున్నవిపుడు; శబ్దించెడు ప
క్షులవన్యంబులఁ గనఁగాఁ, గలిగెడు[3] మును భయమటంచుఁ గడుమదిఁ దోఁచెన్.

[4]ఆ. ప్రాణసంశయంబు వాటిల్లు ననియును
దోఁచె నిపుడు మనకుఁ దుముల మొండు
జరగనున్నదిందు సంశయమే లేదు
మామకోక్తి వినుము మఱొకదాని. ౭ 598

క. మరలన్ మరలన్ దక్షిణ, కరమదరుట నిద్ది తెలియఁ గానయ్యెఁ జుమీ
త్వరఁగా శూరా! మనకున్, జరగెడు యుద్ధమునయందు జయము గలిగెడున్.

---

1 మాలాగ్రహాణా మివ చంద్రసూర్యౌ - అనిమూలము. 2 ప్రజానా మహితాన్ - అని మూలము. 3 అగ్రతో నోభయం ప్రాప్తమ్-అనిమూలము. 4 సంశయో జీవితస్య చ-అనిమూలము.

క. పరిపంథుల కపజయముఁ, జరగును [1]దన్ముఖముకాంతి ♦ సంపన్నంబై
యరుదుగఁ బ్రసన్నమగుచుఁ, బరికింపఁగ నయ్యెఁగాన ♦ భద్రము గలుగున్.

క. సమరము వచ్చినతఱి నెవ,రిముఖమ్మునఁ గాంతి హీన♦రీతిం గను న
ట్టి మనుజునకుఁ బ్రాణక్షయ, మనరుఁ జుమీ తప్పదిద్ది ♦ యమలగుణాఢ్యా!.

చ. దనుజుల సింహనాదము లు♦దాత్తము లై తగు భూరిభేరికా
ధ్వనులును భీతిదంబులయి ♦ దారుణరీతి వినంగ నయ్యె న
ద్దనుజులు క్రూరకర్ములు గ♦దా; మఱి యాపదవచ్చునంచు భీ
తిని గనువాఁడు మేలును మ♦దిం దగఁ గోరెడువాఁడు పాండితిం
గనఁదగువాఁడు నౌ నరుఁడు ♦ కార్యములం దలపోసి నెమ్మదిన్. ౧౦౪ 602

క. ఆపదవచ్చుటకున్ మును,పే పరఁగఁ బ్రతిక్రియన్ వి♦హితరీతిని గా
నాపట్టునఁ జేయఁగ నౌఁ, గాపురుషుం డట్లు సేయఁ ♦ గడఁగఁడు సుమ్మీ. ౧౧

క. కానన్ శరచాపమ్ములుఁ, బూని తగన్ నీవు వేగ ♦ భూసుతఁ గొనుచున్
నానాతరుగణదుర్గను, మై నీరంధ్రమగు ధరగు♦హం జేరి యటన్. ౧౨ 604

చ. వనితను గాచియుండు మిఁకఁ ♦ బల్కిన కష్టముచెప్పఁబోకు మో
యనుజ! మదీయపాదముల ♦ యానసుమీ త్వరతోడ సీతతోఁ
జను; బలశాలి వీవు రణ♦శౌర్యము గల్గినవాఁడవౌట ని
ద్దనుజులఁ జంపఁజాలుదువు ♦ తప్పక; సందియ మిందు లేదుగా. ౧౩౪ 605

క. ఈదనుజాతులనెల్లర, నేదర్పమునన్ వధింప ♦ నిశ్చయము మదిన్
గాదిలియనుజా! చేసితిఁ, గాదన కిఁకఁబొమ్ము యనినఁ ♦ గడు భక్తిమెయిన్.

క. శరచాపంబులు తాలిచి, ధరణిసుతం దోడుకొనుచుఁ ♦ దవ్వర దుర్గమమై
పరఁగెడు గుహఁ జేరెను న,క్కరణిన్ లక్ష్మణుఁడు వెళ్లఁ♦గా రాఘవుఁడున్. ౧౫

క. ఆ! మంచియుపమ తోఁచిన, దీమాడ్కిన్ లక్ష్మణుండు ♦ హితకృత్యము నే
నామాటరీతిఁ జేసెను,గా మానక యనుచుఁ దొడిగెఁ ♦ గవచము తానున్. ౧౬

సీ. అగ్నిసమానమై ♦ యలరు నాకవచంబు ధరియించి రాముండు♦ధ్వాంతమందు
నపగతధూమమై♦నట్టి యగ్నింబోలి వెలసె; వీర్యంబున ♦ నలరు రాముఁ
డాత్మమహాచాప ♦ మతులశరంబులఁ గైకొని జ్యానాద♦కలన నెల్ల
దిశల నింపుచు నండె ♦ దితిజుల రాకకై వేచియుండఁగ నంత ♦ విబుధసిద్ధ
చారణగంధర్వ♦సమితి యుద్ధముఁ జూచు కాంక్షలతో వచ్చి ♦ కలిసియుండి

ఆ. రంబరంబున; లోకత్ర♦యంబునందుఁ
గలమహాత్ములు పావన♦కర్మనిరతు
లయిన [2]బ్రహ్మర్షివర్యులు ♦ నైనమునులు
వచ్చి యచ్చటఁ జేరి సు♦స్వాంతులగుచు. ౨౦ 609

---

1 సప్రభం చ ప్రసన్నం చ తవవక్త్రం హి లక్ష్యతే-అనిమూలము. 2 ఋషయశ్చ మహాత్మానో లోకే బ్రహ్మర్షిసత్తమాః-అనిమూలము.

తే. విప్రులకు గోవులకు జగ♦ద్వివులశుభముఁ, గోరు సజ్జనవర్యుల♦కుఁ శుభంబు
 గలుగుఁగాక; సుదర్శన♦కరుఁడు విష్ణు, వనిని దానవవీరుల ♦ ఘనబలమున. ౨౧

క. తాను జయించినరీతిని, దానవులఁ బుల స్త్యవంశ♦తస్కరులఁ జటం
 బూని జయించుతమని తను,లోనఁ దృఢరీతిగాఁ బ♦లుకుచుఁ సురలన్. ౨౨

తే. భీమకర్ముల బదునాల్గు♦వేవుర, దను
 జులను వీరిని ధర్మైక♦విలసితమతి
 యైన రాఘవుఁ డొక్కఁడే♦యని నదెట్లు
 వేఁటసల్పునో, యుద్ధ మె♦వ్విధి జరగునో. ౨౩ 612

క. కనుఁగొంద మనుచు నొండొరు,లను జూచుచుఁ జెప్పుకొనుచు ♦ లలివారెల్లన్
 ఘనమార్గమున రణంబును, గనువేడ్క విమానములను ♦ గ్రాలుచు నుండన్.

సీ. ఆవిష్టతేజుఁడై ♦ యనిమొననున్న రాఘవుఁగని భూతాళి ♦ కడుభయమునఁ
 గలవిలపాటొందెఁ ♦ గడఁగి యెవ్వరికైన నపకృతిఁ గల్గింప ♦ నట్టి నైజ
 మునఁ దగు రాముని♦యనుపమాకారంబుఁ బ్రళయంబునం గ్రోధ♦పరిణతిఁగను
 నట్టి రుద్రునిరూప ♦ మట్లు భీషణముగ నలరు రుద్రునిచిహ్న♦ములను రాము
తే. నందు గంధర్వముఖ్యు ల♦య్యదనునఁ గని
 [రంత దివిజాదు లీరీతి ♦ నంబరమునఁ
 బలుకుచుండంగ] నంతలో ♦ భయదసింహ
 నినదములు తగ ధ్వజవర్మ♦నిచయ మలర. ౨౫ 614

క. సురవైరులు దివ్యాయుధ, పరికరములఁ దాల్చి యొల్ల ♦ భాగంబులఁ గ్ర
 మ్మి రయంబున వచ్చిరి; వా, రరుదుగఁ బంచాస్యనిస్వ♦నావళి నిగుడన్. ౨౮

సీ. నేను జయించెద ♦ నేను జయించెద ననుచు నొండొరులతో ♦ ఘనరవంబు
 గలుగ గర్జించుచుఁ♦గాండాసనంబుల మ్రోయించుచుఁ గర్వ♦మున నెసఁగుచు
 ఘనముగ [1]గుంజన♦ధ్వనులు గావించుచు దుందుభులను గొట్టి ♦ తోఁచకుండ
 ధ్వనుల నింపుచుఁ గ్రమ్మఁ ♦ దత్తుములధ్వని యావనం బంతట ♦ నావరింప
తే. వనచరములగు క్రూరస♦త్త్వములు దాన
 బెదరి తిరిగియు చూడక ♦ వెసఁ బఱచుచు
 స్వస్థలంబుల కేగె ని♦శ్శబ్దముగను;
 సైన్యమది వేగమునఁ దీక్ష్ణ♦శరము లూని. ౩౧ 616

క. ఇతరాప్రవేశమై యు,ద్ధతసాగరమట్లు రాము ♦ దరిఁ జేరె; నతం
 డు తగన్ రణపండితుఁడై, క్షితివెలయుఁ గాన నాల్గు♦కెలఁకులఁ గనుచున్.

క. అనికై సన్నద్ధంబై, తనుడాయఁ వచ్చియున్న ♦ దానవపతి సే
 నను జూచి భయదనిస్వన,మునఁ దగు చాపంబుఁ బట్టి ♦ మునుకొని కినుకన్.

---

1 విప్రఘుష్టస్వనానాంచ-అనిమూలము. ఘోషో గుంజనాఖ్యవాద్యవిశేషః-అనివ్యాఖ్య.

తే. త్వరగఁ దూణీరములనుండి ♦ వాడిబాణ
ములను గైకొని రక్షస్స♦మూహములను
జంపఁగాఁ దీవ్రకోపంబు ♦ సంశ్రయించె;
నట్లు రాముఁడు కోపంబు ♦ నాశ్రయించి. ౩౩ 619

క. ప్రళయాగ్నిపగిదిఁ జూడఁగ, నలవియె గాకుండ వెలయ ♦ నాతనిఁ దేజో
విలసితునిఁ గాంచి వనమునఁ, గల దైవతవితతి పఱచెఁ ♦ గడు రయ మమరన్.

క. దనుజవధార్థము కోపం,బును బూనినరాము దేహ♦ము మునుపు దక్షుం
డొనరుచు జన్నముఁ జెఱుపం,గను గ్రుద్ధుండౌ పినాకి♦కాయమురీతిన్. ౩౫

ఆ. అతిభయంకరముగ ♦ నప్పుడు కన్పట్టె, నటు రణాగ్రమందు ♦ నతులతేజ
మలర నిలిచియున్న ♦ నారాముఁ గని సర్వ,భూతములును బాఱె ♦ భీతి నిగుడ.

చ. ధనువులఁ గేతనంబులను ♦ దాల్చి మహాభరణంబు లొప్పఁగా
ననలునిఁ బోలి వెల్గెడు మ♦హాకవచంబులఁ దొడ్గి యామహా
దనుజుని సైన్యమయ్యది ని♦శాంతము రవ్యుదయంబునందు న
ల్లని ఘనబృందమట్టులు వి♦లాసము మీఱఁగ నొప్పె నయ్యెడన్. ౩౭ 623

ఇరువదినాల్గవ సర్గము సంపూర్ణము.

## ౨౫ - వ సర్గము.

### రాముఁడు ఖరుని సేనతోఁ బోరుట.

క. ధనువుం గైకొని క్రోధం,బును దాల్చి రిపువ్రజంబుఁ ♦ బోకార్చెడు శూ
రుని రాముని సైన్యముతోఁ, జనియాశ్రమ మొందిఖరుఁడు ♦ చక్కంగనియెన్.

క. ఖరుఁ డంత రామునిం గని, పరుషజ్యానాద మడర ♦ బాణముఁ దగఁ గూ
ర్చి రయమున వైరికెదురుగ, నరదముఁ బోనీయనిచ్చె ♦ నాజ్ఞం గడఁకన్. ౨

క. సారథియు ఖరునియాజ్ఞన్, దా రయమున ఘోటకముల ♦ ధనువు చలింపన్
గా రాముఁడు దీర్ఘభుజుం, డారయుచును నొకఁడె యున్న♦యచటికిఁదోలెన్.

చ. ఖరుఁ డటు రాముపై నడరఁ ♦ గాఁ గని యాతనిమంత్రులౌ నిశా
చరులు [1]మహాస్వనంబొలయ ♦ సాంద్రముగాఁ గడుసింహనాదముల్
పరఁగ ఖరాసురుం గొలిచి ♦ బాహుబలంబులఁ బోయి; రంత నా
ఖరుఁడు నిశాటసంఘమునఁ ♦ గ్రాలెను [2]భాంతరభూసుతుండు నాన్. ౪

క. అరదంబుననుండి యతం, డురుదీప్తుల నిట్లు వెలసి ♦ యుగ్రప్రభలన్
గరము విరాజిల్లెడు రఘు,వరు వేయిశరంబు లేసి ♦ బాధించి క్రుధన్. ౫

---

1 నర్దమానా మహానాదం సచివాః పర్యవారయన్ - అనిమూలము. 2 బభూవ మధ్యే తారాణాం లోహితాంగ ఇవోదితః-అనిమూలము. భాంతరభూసుతుండు - భా=నక్షత్రములయొక్క, అంతర=నడుమునున్న, భూసుతుండు=అంగారకుఁడు.

క. కలహమున కాయితుండై, జలదార్భటి మించనార్చి; ♦ సత్వరముగ న
బ్బలమెల్లఁ; గుపితమై భీ,తిలఁజేయు ధనుస్సుఁ దాల్చి ♦ తీవ్రప్రభలన్ ౭

ఆ. తనరుచున్న దుర్జ♦యుని రాముఁ గని బహు
శరము లొక్కమొగిని ♦ గురియఁ జేసి
ప్రాసశూలములఁ బ♦రశ్వథముద్గర
పట్టసముల, ఖడ్గ♦వారములను. ౮ 630

క. అనిమొనఁ గోపం బడరఁగ, దనుజోత్తము లమ్మహాత్ముఁ ♦ దగ నొంచి జవం
బున శౌర్యమలర వారలు, ఘననినదం బట్టు లార్చి ♦ కాకుత్థ్సుఁదగన్. ౯

ఉ. కాలునివీటికిం బనుచు ♦ కాంక్షలతోడ రథాశ్వసంస్థితిం
గ్రాలుచు శైలకూటములఁ ♦ గాదను హస్తిగణంబు నెక్కి యా
భీలముగాఁ బయింబడిరి ♦ విక్రమ మొప్పఁగ నంత వారు మే
ఘాళి మహీధరంబుపయి ♦ నాయతవృష్టి నిగుడ్చునట్లుగన్. ౧౦ 632

తే. బాణవర్షంబు గురిసి; రా♦భయదరాక్ష
సాళి తనుఁ గ్రమ్ముకొన రాముఁ ♦ డలరుచుండె
నబ్ధి శైవలినీప్రవా♦హములు మాయు
నట్లు దనుజుల ఘోరశ♦స్త్రాళి యపుడు. ౧౧ 633

సీ. రాముని ఘోరశ♦స్త్రవ్రజంబును దాఁకి నశియించె; రాముఁ డా ♦ నిశితదనుజ
బాణఘాతంబునఁ ♦ బరఁగ భిన్నాంగుఁడయ్యును బ్రజ్వరిల్లు న♦శనిగణమ్ము
పడినను గదలని ♦ పర్వతరాజమట్టులు బాధనొందియుఁ ♦ గలవిలపడఁ
డయ్యె; నంతటఁ దన♦యవయవములనెల్ల బాణముల్ నాటఁగా ♦ భయదరీతి

తే. నెత్తుటను దోఁగి సంధ్యాభ్ర♦నిచయపరివృ
తార్కకరణిఁ బ్రకాశించె; ♦ నపుడు దేవ
సిద్ధగంధర్వ పరమర్షి ♦ శేఖరులును
రాముఁ డొక్కఁడు వేవుర ♦ రక్కసులను ౧౨ 634

క. తలపడి పోరాడుటఁ గని, కలవిలపాటొంది; రంతఁ ♦ గడుఁ గోపమునన్
జ్వలనాభుఁ డగుచు రఘువర, కులదీపకుఁ డంత దివ్య♦కోదండంబున్. ౧౩

తే. మండలాకారముగ వంచి ♦ చండసాయ
కములు శతసంఖ్యలుగ సహ♦స్రములు గాఁగ
నర్ధచంద్రాగ్రములుగ న♦య్యసురవరుల
పైఁ బ్రయోగించె నాహవ♦పరత మెఱయ. ౧౪ 636

క. అని దుర్నివారముల నో,ర్వను రాకయుఁ గాలదండ♦భంగిఁగ గుఱిద
ప్పని బాణంబుల నవలీ,లను వైచెను రాముఁ డనుసు♦లపయిం బెలుచన్. ౧౫

తే. శరవరము లవ్వి ధర్మరా♦జప్రయుక్త
పాశములఁ బోలి దానవ ♦ ప్రాణములను

గొనియె నవలీల రాముండు ♦ కుమతహరణ
వాంఛ వైచుట నెంతయు ♦ బరవసమున. ౧౮ 638

క. ఘనశరము లవియు రాక్షస, తనువుల భేదించి రక్త♦ధారలలోనన్
మునిఁగి దివంబున కెగయుచుఁ, గనదుద్యజ్జ్వాలను భంగిఁ♦గా రుచి వెలిఁగెన్.

తే. మండలాకార మౌ రాము♦చండకార్ము
కంబు నుండి యుగ్రమ్ములై ♦ గణనచేయ
నలవియేగాక శరములు ♦ వెలసి వెడలి
యసురసంతతి యసువుల ♦ నపహరించె. ౨౦ 640

సీ. దనుజుల ధనువుల ♦ ధ్వజశిఖరంబుల వర్మాళి శిరముల ♦ భవ్యకంక
ణాలంకృతములగు ♦ హస్తములం గరికరసన్నిభములుగఁ ♦ గ్రాలుతొడల
శతసహస్రములుగ ♦ సరగున ఖండించెఁ గాంచనసన్నాహ♦కలితములయి
సారథితోఁ గూడి ♦ యారథంబులఁ గట్టఁబడిన ఘోటకముల ♦ పటలములను

తే. మావటీలనుగూడిన ♦ మత్తహస్తి
తతుల రౌతులతోడిగం♦ధర్వములను
భటుల దునుమాడి ధర్ముని ♦ పత్తనమున
కనిపెఁ దనశౌర్యమును గని ♦ మునులు పొగడ. ౨౩ 641

క. దనుజులు తీక్ష్ణోగ్రములయి, తనరెడు [1]నాళీకబాణ♦తతి నాయసబా
ణనికరమునఁ గర్ణశరాళిని గడుభిన్నాంగులయి వి♦లీన స్ఫూర్తిన్. ౨౩½ 642

తే. భిన్నతనులయి యంతట ♦ భీమనాద
మార్తిఁ దెలుపంగ నఱచి; ర♦య్యసురసేన
యంతఁ దీక్ష్ణాంబకముల, మ♦ర్మాళి చెడుట
నార్తిఁ గనె నగ్నితప్తశు♦ష్కాటవి వలె. ౨౪½ 643

క. ఇనకులునివలన నించుక,యును సుఖమును గాంచదయ్యె;♦నొగిఁ గొందఱుశూ
రనిశాచరు లాతనిమా,ర్గాన నెదురునఁబోయి తీవ్ర♦కోపం బడరన్. ౨౫½

సీ. ఖడ్గశూలములను ♦ గడఁగి పరశ్వథములను నాతని నొంచి ♦ రలఘుబాహుఁ
డగురాముఁ డప్పు డ♦య్యసురులు వైచినయాయుధంబులనుది♦వ్యాంబకముల
నడుమనే నిలిపి తీ♦క్ష్ణశరంబులన్ వైచి వారికంఠంబుల ♦ వరుస నతికి
కొనియెఁ బ్రాణముల; నా♦దనుజులు శిరములు తెగియును జాపవ♦ర్మగణమెల్లఁ

తే. దునిసియున్ దార్క్ష్యపక్షైక♦జనితవాయు
వునను ద్రెళ్ళిన భూరుహం♦బులవడువున
ధరణిఁ గూలిరి మిగిలిన ♦ దనుజులెల్ల
రాముశరముల ఛిన్నమ♦ర్మముల వగల. ౨౮½ 645

1 తతో నాళీకనారాచైః-అనిమూలము.

చ. ఖరుఁ గని కావు కావు మని ♦ గాఢరవంబుల నార్చి యాతనిన్
శరణమటంచుఁ జుట్టుకొనఁ ♦ జయ్యన దూషణుఁ డట్టి వారలన్
మరలను గూర్చి తోడుకొని ♦ మంచిసువాక్కుల నాదరించి [1]ఈ-
శ్వరుపయి కేగు క్రుద్ధసమ♦వర్తివిధంబున రామచంద్రుపై. ౩౦ 646

ఆ. ఉరవడించి చాల ♦ నూర్పులు విడుచుచుఁ, దలపడియెను; నంత ♦ దనుజులెల్ల
దూషణాశ్రయమున ♦ ధూతసాధ్వసులయి, సాలతాళములను ♦ జాలవైచి.

క. జనకాత్మజాపతిన్ మా,ర్కొనఁ జని; రారాక్షసులును ♦ గోపంబుఁ దగన్
ధనువుల ముద్గరశూలము, లనుగరములఁ దాల్చి పృథుబ♦లంబులు గ్రాలన్.

క. శరవర్షంబును శ్రీరఘు,వరుపైఁ గురియించి వృక్ష♦వర్షంబును బ్ర
స్తరవృష్టి బాణవృష్టిని, గురిపించిరి యుద్ధమద్ది ♦ ఘోరము గాఁగన్. ౩౨½

క. దనుజులకు రాఘవునకున్, గన నద్భుతదాయకంబు♦గా గగుపు జనిం
పను జేయునదిగ జరగెను, మనములఁ గోపములు మిగుల♦మార్కొనియంతన్.

క. నలుఁగడలఁ జుట్టుముట్టిరి, ఖలులగు రాక్షసులు; బలము ♦ గ్రాలఁగ రాముం
డలయక ప్రాసాంబకవృ,ష్టులఁ గురియుచు నెల్లచోట్లఁ ♦ జుట్టుకొనంగన్. ౩౪½

క. కనుఁగొని వారల నీఁక నీ, దనుజానీకములఁ జంపఁ♦దగు వేగ యటం
చును మదిని దలఁచి సింహా,స్వన మొనరిచి తీవ్రశౌర్య♦సారము పొంగన్.

శ్రీరాముఁడు గాంధర్వాస్త్రమున రాక్షసులఁ దునుముట.

తే. భాస్వరంబగు గాంధర్వ♦బాణమేయఁ
దలఁచి ధనువునఁ గూర్చి వా♦రల నడంప
వైచె; నట నుండలాకృతిఁ ♦ బరిఢవిల్లు
ధనువునుండి సహస్ర బా♦ణనిచయంబు. ౩౬½ 653

చ. వెలువడె; దానినుండి తగ ♦ వేలశరంబులు నిష్క్రమింప న
య్యలఘుశరాళిచేత దిశ♦లన్నియుఁ గప్పఁబడెన్; దదంబకం
బులఁ బరిపీడితాంగులయి ♦ భూరిబలంబులఁ గ్రాలు దానవుల్
చలమునఁ దీయుటన్ విడుచు ♦ జాడఁ గనుంగొనరైరి దీనతన్. ౩౮½ 654

తే. నారి లాగుటఁగాని బా♦ణముల వైచు
సరణియేగాని యెఱుఁగఁగఁ ♦ జాలకుండి;
రాశరావళిచే నార్తి ♦ నందుచుండి
రంత శరములఁ జీఁకటు ♦ లావరించి. ౩౯½ 655

చ. ఖరకరుతోడ నంబరము ♦ గ్రన్ననఁ గప్పెను; రాముఁ డంత నా
శరములఁ గ్రక్కుచున్నగతిఁ ♦ జాలఁగఁ దోఁపఁగఁ జేయుచుండె; నా

1 క్రుద్ధో రుద్ర ఇవాంతకః-అనిమూలము.

శరతతు లేక కాలమున ♦ క్ష్మాస్థలి వ్రాలుట వానిచే మహా
సురులు వధింపఁగాఁ బడుట ♦ చూడఁగనయ్యె సమానరీతిగన్. ౩౯౹ 656

క. ధరవ్రాలు శరము లప్పుడె, శిరములు పగులంగ వేగ ♦ క్షితిఁ బడు దనుజో
త్కరముం గలుగుటచే సం,గరరంగముఁ జూడనయ్యెఁ ♦ గడుభయదముగన్.

సీ. ఆయుద్ధరంగంబు ♦ నం దచ్చటచ్చటఁ
జంపంగఁబడియు న ♦ శనపతనభ
యమున నేలంబడి ♦ నట్లు ద్రెళ్లియుఁ గంఠ
గతములౌ ప్రాణముల్ ♦ గలిగియుఁ దను
వులు రెండుగాఁ ద్రుంపఁ ♦ బొరలుచుండియు నవ
యవములు ఖండింప ♦ నార్తిఁ గనియుఁ
గంఠంబుదనుక నొ ♦ క్కవిధంబునం జీల్పఁ
బడియును బెక్కురు ♦ పుడమిఁ ద్రెళ్లి
తే. కనఁబడుచు నుండి రాఘోర ♦ దనుజులందు
దాశరథితీవ్ర బాణహ ♦ తంబులగుచుఁ
జెలఁగు నుష్ణీషములతోడి ♦ శిరములు నఱి
వట్టితలలును సాంగద ♦ బాహువులును. ౪౦౹ 658

సీ. బహువిధాలంకార ♦ వస్త్రాళిగల్గిన యూరువుల్, కటకంబు ♦ లొప్పఁ జెలఁగు
జానువుల్ భిన్నము ♦ లైన సామజఘోటకస్యందనములును, ♦ గడువిభిన్న
ములగు సచ్చామర ♦ ములు వ్యజనంబులు ఛత్రధ్వజంబులు ♦ శతసహస్ర
భిన్నమ్ములగు శూల ♦ విసరంబులునుబట్టసములుఖడ్గములుప్రా ♦ సములు మఱియుఁ
తే. దగిన గొడ్డండ్లు శిలలు చి ♦ త్రమ్ములైన
తనువులును యుద్ధభూమియం ♦ దును గనఁబడ
నద్ది చూడంగ నతిభయ ♦ దాకృతిగను
దోఁచె సకలాంగముల వ్యాప్త ♦ మై చెలంగె. ౪౧ 659

ఇరువదియైదవ సర్గము సంపూర్ణము.

---

## ౨౬-వ సర్గము.

### రాముఁడు దూషణాదులఁ జంపుట.

చ. ఘనభుజుఁ డైనదూషణుఁ డ ♦ ఖండబలంబును రాముఁ డొక్కఁడే
తునుముచు నుంటఁ గాంచి యటఁ ♦ దోరఁపుశౌర్యమునన్ జయింప నోం
పను దగినట్టివారిని జ ♦ వంబును గల్గినవారి నైదువే
లను వెనుదీయనట్టి బల ♦ లాఘవముల్ తగుదైత్యులన్ ద్వరన్. ౧౹ 660

క. తలపడుఁడీ రాముని నని, కలఁగని మది నాజ్ఞ సేసెఁ ♦ గ్రవ్యాదులు వా
రలు శూలఖడ్గపట్టస,ములను శిలావృక్షవృష్టి ♦ ముంచిరి రామున్. ౨ 661

క. శరవృష్టి నిగుడఁగాఁ జే,సిరి నాలుగుదెసలఁ గ్రమ్మి ♦ చెచ్చెఱ విచ్ఛి
త్తిరహితముగ; నంతట రఘు,వరుఁ డెప్పుడు ధర్మయుద్ధ♦పరుఁడౌటఁ దగన్. ౩

తే. ప్రాణహరమైన యాశిలా♦వర్షవృష్
వర్షములఁ దీవ్రసాయక♦పటలమునను
నడఁచె; నాఁబోతు కనుమూసి ♦ యఱిగి వృష్టి
సరకుసేయనిగతిని, రా♦క్షసశరముల. ౪ 663

క. మనమున లక్ష్యముచేయక, దనుజుల వధియింపఁగాఁ గ్రు♦ధంబూనెను దై
వానుకోపంబున రాముం, డనలునిగతి దీప్తతేజుఁ♦డై యుగ్రుండై. ౫ 664

క. సేనాపతియగు దూషణు,తో నాసైన్యంబునెల్లఁ ♦ దోడ్తోన భయం
బూన నలుదిక్కులన్ భయ,దానూనశరాళి ముంచె ♦ నాసమయమునన్. ౬

క. అరిదూషణుఁడగు దూషణుఁ, డురుకోపము మీఱఁ బిడుగు♦లోయన నతిభీ
కరములగు బాణములఁ బఱ,పె రయం బొప్పంగ రామ♦పృథ్వీశునిపై. ౭

క. అనిఁ గత్తివాతియమ్మున, ఘనవీరుఁడు రాముఁ డతని♦కార్ముకవర మొ
య్యనఁ ద్రుంచి నాల్గుశరములఁ, బనిపెన్ గుఱ్ఱముల యమని♦పత్తనమునకున్.

సీ. ఇట్లు హయంబుల ♦ నేపునఁ బొలియించి యర్ధచంద్రశరంబు ♦ నంది దాన
నతనిసారథిఁ ద్రుంచి♦యంతఁ బోవక దూషణుని వక్షమును జాల♦నొవ్వఁ జేసె
బాణత్రయంబున ♦ బాణాసనము చెడి యరదంబు విఱిగి హ♦యాళి మడిసి
సారథి హతుఁడౌట ♦ నారసి దూషణుఁ డద్రిశృంగమువలె ♦ నతిశయముగ

తే. గగురుపుట్టించు పరిఘంబుఁ ♦ గై ధరించె
నదియు బంగారుకట్లచే ♦ నమరి యినుప
మేకులను గల్గి వజ్రము ♦ లేకరణిని
దాఁకునట్లుగఁ బగతురఁ ♦ దాఁకుచుఁ గడు. ౧౦ 668

చ. కులిశమురీతి నొప్పి సుర♦కూటము నొవ్వఁగఁ జేసి శత్రుసే
నల నలయించుచున్ మెదడు♦నం దగ మున్గుచు శత్రుగోపురం
బుల బడలించి యొప్పు; నటఁ ♦ బూనిక నాతఁడు క్రూరకర్ముల్
లలి నొనరించువాఁ డగుట ♦ లాఘవ మొప్పఁగ దానిఁ గైకొనెన్. ౧౧ 669

చ. ఉరగముఁ బోని యాపరిఘ ♦ ముద్ధతిఁ జేకొని రామభద్రుపై
కరిగెను; రాముఁ డట్లడరు ♦ నాతనిఁ గాంచి శరద్వయంబుచే
[1]బిరుదకలాపసంతతిని ♦ బెంపువహించు తదీయహస్తముల్
సరగునఁ ద్రుంచె హస్తములు ♦ త్స్మాస్థలిఁ వ్రాలిన నంత వేగమే. ౧౩ 670

1 సహస్రాభరణౌ భుజౌ - అని మూలము. సహస్రాభరణా విత్యనేన శౌర్యబిరుదవత్త్వం లక్ష్యతే-అనివ్యాఖ్య.

మ. పెనుకాయంబున నొప్పు నాపరిఘ ము♦ర్వీభాగ వ్రాలె నింద్రధ్వజం
బనఁగా జాతి; కరద్వయంబు దెగ సై♦న్యాధీశ్వరుం డంత నా
య్యన దంతద్వయ మంతరింపఁబడు ధీ♦రానూననాగంబురీ
తిని నేలంబడెఁ జంపఁగాఁ బడి ధరి♦త్రిం ద్రెళ్లె నాదూషణుణ్. ౧౫ 671

క. కని సర్వభూతములు రా,ముని మెత్తెలనుచుఁ బొగడె; ♦ మునుకొను కోపం
బున సైన్యేశత్రితయ మ,తనిచావుం గాంచి భయద♦దర్పస్ఫూర్తిన్. ౧౬

సీ. రామునిపైఁ బడె ♦ రయమున నందు మహాకపాలుండు స్థూ♦లాక్షుఁడును మ
హాబలుండు ప్రమాథి ♦ యనువారలుండిరి వారలు యమపాశ♦బద్ధు లగుచు
నడరి రామునిఁ దాఁకి ♦ రందు మహాకపాలాఖ్యుఁడు పెద్దశూ♦లాయుధమును
స్థూలాక్షుఁడును మహా♦స్థూలపట్టసమును నా ప్రమాథి పరశ్వ♦థాయుధంబుఁ
తే. గరములం దాల్చి దాఁక రా♦ఘవుఁడు వారిఁ
గాంచి యతిథికి నర్ఘ్యాది♦కల్పనంబుఁ
జేయురీతి నవ్వారిఁ జె♦చ్చెఱ సుతీక్ష్ణ
శరములన్ మూఁడిటన్ వైచి ♦ సంగ్రహించె. ౧౮ 673

క. కినుకన్ మహాకపాలుని, కనదుగ్రశిరంబు సాయ♦కంబుల వే త్రుం
చెను నా ప్రమాథిమస్తక,మును నగణితశరములేసి♦మునుకొని త్రుంపన్. ౨౦

క. వాఁడును బలుకొమ్మలతోఁ, గూడిన పెనువృక్షమట్లు ♦ కూలె నవనిపైఁ
దోడనె స్థూలాక్షు కనుల్, గాడఁగ శితశరములేసెఁ ♦ గాకుత్స్థుండున్. 675

చ. అనితరసహ్యకోపమున ♦ నాతఁడు దూషణు వెంబడించి వ
చ్చిన దనుజావళిం గనుచుఁ ♦ జెచ్చెఱ వారల నైదువేల న
న్నిశితసాయకంబుల న♦నిన్ క్షణమాత్రమున న్వధించె; నం
త నిటుల దూషణున్ సమద♦తత్పరివారముఁ ద్రుంచి యార్వఁగన్. ౨౩ 676

క. కనుఁగొని ఖరుండు కోపం,బునఁ దనసేనాధిపతుల ♦ భూరిబలులఁ గాం
చి నృపతిసుతుఁ డీ దూషణు,నిని బరివారమును జంపె ♦ నేర్పున నిచటన్. ౨౪

చ. దనుజవరేణ్యులార! వివి♦ధంబులుగాఁ దగురూపముల్ దగం
గనఁబడు నాయుధంబులను ♦ గ్రన్ననఁ బోయి మనుష్యుఁడైన రా
ముని నెదిరించి పోరుచు య♦ముం గనఁబోవఁగఁ జేయుఁడంచు నా
జ్ఞను గ్రుధఁజేసి; తాను రణ♦శౌర్యమునన్ జనె రాముమీఁదికిన్. ౨౫ 678

సీ. యజ్ఞశత్రుండు వి♦హంగముండును బృథుగ్రీవుండు దుర్జయుం ♦ డావిధమునఁ
గరవీరనయనుండు ♦ కేతుశౌర్యవంతుఁడౌనట్టి మహామాలి ♦ యహిముఖుండు
నమ్మేఘమాలియు ♦ నట్టులె రుధిరాశనుండును మఱి పరు♦షుండు శ్యేన
గామియు మఱి కాల♦కార్ముకుఁడను వీరు పన్నిద్ద ఱెంతయు ♦ బలయుతు లొగి

తే. సైన్యనాయకు లాత్మీయ♦సైన్యములను
గలిసి పృథుబాణములఁ గ్రూర♦ములను వైచు
చును రఘూత్తమునిఁదికిఁ ♦ జనిరి; పిదప
నతులతేజస్వి రాఘవుఁ ♦ డాగ్రహించి. ౨౮ 679

చ. అలరుచు దివ్యవజ్రకన♦కాంచితరూపములొప్పఁ దీక్ష్ణుఁడై
జ్వలనుని బోలియున్న శిత♦సాయకము ల్పఱగించి వేగమె
గలనను మృత్యువక్త్రమును ♦ గానక యుండినవారిఁ జంపె దో
ర్బలమడరంగ నట్టి ఖర♦బాణము లేగి నితాంతశక్తిచేన్. ౨౯ 680

[1] తే. వజ్రములు భూరి భూరుహ♦వారములను
జీల్చునట్లుగ వారలఁ ♦ జీల్చె; రాముఁ
డపుడు కర్ణాకృతిం దగు ♦ నంబకములు
శతము పఱగించి యందఱ ♦ సమయఁజేసె. ౩౦ 681

క. దనుజుల వేవురఁ నన్నిఁట, ఘనశరములఁ జంపె; నంతఁ ♦ గ్రవ్యాదులు వే
తునిసిన కవచంబులఁ బో,యినసొమ్ముల భిన్నములగు ♦ నెల్లధనువులన్. ౩౧

క. నెత్తుటఁ దోఁగినతనువుల, నుత్తలపాటొంది నేల ♦ కొరగిరి; మఱియున్
మెత్తనివెంట్రుక లటు విడి, నెత్తుట మునుఁగంగ నున్న ♦ నిఖిలదనుజులన్.

ఆ. కనుఁగొనంగ నపుడు ♦ స్థ్సాస్థలి దర్భల,చేతఁ గప్పఁగఁబడి ♦ చెలఁగుచున్న
యజ్ఞవేదికవలె ♦ నారయఁగా నయ్యె, నంత భీతిదమగు ♦ నాపనంబు. ౩౩

క. దనుజన్ములు క్షణమాత్రం,బున హతులౌటను దలంపఁ ♦ బొదలెడు రక్తం
బును మాంసము రొంపిగ నొ,ప్పు నిరయమును బోలియుండె ♦ భూతభయదమై.

క. పదునాల్గువేలదనుజులఁ, బదాతి మనుజుండు నొచ్చుఁ ♦ బరఁగు రఘువరుం
డుదితక్రోధంబునఁ జం,పెఁ దగన్ బలమలర నొకఁడె ♦ పృథుశౌర్యమునన్.

సీ. అమ్మహాసైన్యమం♦దతిబలుండయి మహారథుఁడైనఖరుఁడుశౌ♦ర్యమున వెలయు
త్రిశిరుండు మఱియు న♦రినిషూదనుండగు నట్టి శ్రీరాఘవుం ♦ డంత మిగిలి
రీమువ్వురే; బలో♦ద్వృత్తిచేఁ దగి భయంకరమూర్తులొప్పు సం♦గరమునందు
మార్కొనరానట్టి ♦ మానవంతులు దనుజులు లక్ష్మణాగ్రజు ♦ నలఘుబాణ
తే. ములను జచ్చిరి కొందఱు ♦ బలవిహీను
లగు పదాతులు మిగిలి ర♦య్యని మొనఁ దన
భీమబలమంతయును మహో♦ద్దామశక్తి
నలరు రామునిచే హత♦మగుటఁ జూచి. ౩౬ 687

క ఖరుఁడపుడు మహత్తరమగు, నరదముపై నెక్కి తీవ్ర♦మగు వజ్రమునుం
గరమునఁ దాల్చిన యింద్రుని, కరణిన్ రఘువర్యుపైని ♦ గవిసెన్ గడిమిన్.

ఇరువదియాఱవ సర్గము సంపూర్ణము.

---

1 నిజఘ్నుస్తాని రక్షాంసి వజ్రాఇవ మహాద్రుమాన్-అనిమూలము.

## ౨౭ - వ సర్గము.

—రాముఁడు త్రిశిరుని వధించుట.—

క. ఖరుఁ డిటు రఘువర్యునిపై, నరుగుటఁ గని త్రిశిరుఁ డనెడు ♦ నఖిలచమూనే
త రయమున నతనిపాలికి, నరిగి నియోగింపు నన్ను ♦ నాహవమునకున్. ౧

*సీ. శౌర్యనిధీ! నీవు ♦ సాహసంబును బూన కిఁకవేగ మరలుమా; ♦ యిదిగో సర్వ
సైన్యముఁ జంపిన ♦ శౌర్యఘనున్ రామునివధించెదఁ జూడ ♦ వయ్య యిపుడె
సర్వమహాసుర ♦ సంతతికిన్ వధ్యుఁ డౌ రాము వధియింతు ♦ నని నిజముగ
నాయుధమ్ములఁ దాఁకి ♦ యతులప్రతిజ్ఞను గావించెదను నేను ♦ గడఁగి యతనిఁ
ఆ. జంపువాఁడనట్లు ♦ సమయింప లేనేని, యతఁడె చంపుఁగాక ♦ యనిమొన నను
సమరమొనరుపంగ ♦ సముధికోత్సాహంబు, వదలి సాక్షి గాఁగఁ ♦ బరఁగు మీవు.

---

* మాం నియోజయ విక్రాంత సన్నివర్తస్వ సాహసాత్, పశ్య రామం మహాబాహుం సంయుగే వినిపాతితం. ప్రతిజానామి తే సత్య మాయుధం చాహ మాలభే, యథారామం వధిష్యామి వధార్హం సర్వరక్షసామ్. అహం వాస్యరణే మృత్యు రేషవా సమరే మమ, వినివృత్య రణోత్సాహా న్ముహూర్తం ప్రాశ్నికోభవ. ప్రహృష్టో వాహతే రామే జనస్థానం ప్రయాస్యసి, మయి వానిహతే రామం సంయుగాయోపయాస్యసి-అని మూలము. ఇందు 'వధార్హం సర్వరక్షసా' మ్మని గోవిందరాజుల పాఠము. ఈశ్లోకములకు మహేశ్వరతీర్థులు విశేషార్థమును వ్రాసిరి. ఆయర్థమునకే యీసీసమాలిక వ్రాయఁబడియె.

సీ. శౌర్యనిధి! ఖరా! ♦ సమరరంగంబున వినిపాతితబలరా ♦ మునిని గనుము
సాహస మిఁక నేల? ♦ సమరమునకు నన్నుఁ బనుపుము; నీవు రా ♦ముని వధింపఁ
గలవా యటంచును ♦ బలుకఁబూనుదువేమొ దనుజవధార్థుని ♦ మనుజనాథుఁ
జక్కఁగా నెఱుఁగుదు ♦ నిక్క మిదని యాయుధముఁ దాఁకి నేశప ♦ థంబు చేయు
వాఁడ, నారాముఁ జం ♦ పఁగల నేనేనని; వేఱొక పల్కును ♦ వినుము తోఁడ
యీరామచంద్రున ♦ కీమహాభుజునకు నే మృత్యువగుదునే ♦ యెట్టు? లతఁడె
నాకు మృత్యువె యగు ♦ నీకడ నొకముహూర్తము విజయాపజ ♦ యాముల నిర్ణ
యించువాఁడవు కమ్ము ♦ మించి యాతఁ డహతుఁ డగు నేనె నిహతుఁడ ♦ నగుట గలుగ
తే. సంతసంబున నే జన ♦ స్థానమునకుఁ, బోవుటో యుద్ధమును జేయఁ ♦ బూనుటో యు
వల మదిన్ దలపోయె నా ♦ బలిమి ననెడు, త్రిశిరుప్రార్థనఁ జక్కఁగాఁ ♦ దెలిసికొనుచు.

ఈ పైశ్లోకములకు విశేషార్థములసారాంశము రామునిచేఁ జంపఁబడిన సేనను జూడుము సకలరాక్షసహంత యగురాము నెఱుంగుదును ఆయనను నేఁ జంపఁజాలను. నన్నే యాతఁడు వధించును. అని యీయర్థము సీసమాలికనుండి తేలును. ఎట్లన: వినిపాతితబలరామునిని-వినిపాతిత=చంపఁబడిన, బల=సేనలుగలరామునినని యు; దనుజవధార్థుని=రాక్షసనాశనమే ప్రయోజనముగాఁగలవానిననియు ఆరాము జంపఁగలనే; నేనని=ఆరాముని నేఁ జంపఁగలనాయనియు, నేనేఁ జంపఁగలననియు, నేమృత్యువగుదునే=అగుదునా? కాను అనియు, ఇట్లు గ్రహింపవలయును.

ఆ. ఒకముహూర్త మిట్టు♦లుండుము రాముండు, వచ్చునేని చాల ♦ సంతసమునఁ
జనఁగఁగలవు నీవు ♦ సరగ జనస్థానమునకు లేక నేనె ♦ యని నసుసిన. ౭౪

క. తలపడుమా యనిసేయఁగ, నలరాఘవుతోడ ననుచు ♦ నాత్రిశిరుండున్
బలికిన ఖరుఁ డంతట నుజ్జ్వలతేజుం డాతఁడిట్లు ♦ వడిఁ బ్రార్థింపన్. ౮౪ 692

క. తనకున్ మృత్యువు పుట్టించిన సంగరలోభ ముడిగి ♦ చెచ్చెఱఁ బొమ్మా
యనిసేయఁగ నని యంతట, ననుమతి నిడ రాముపైకి ♦ నాతఁడు వోయెన్. ౯

క. తురగంబులఁ బూన్చినది, వ్యరథంబును నెక్కి త్రిశిరుఁ ♦ డారామునిపై
కరిగెం ద్రిశిఖర భూధ్రము, కరణిన్ శౌర్యంబు మెఱయఁ ♦ గా గర్వమునన్.

క. శరవర్షమ్మును ధారా,ధరములు జలవృష్టి నిడు వి♦ధంబునఁ గురిపిం
చి రహిన్ జలసిక్తభయం,కరదుందుభినాదమట్లు♦గాఁ; గడునార్చెన్. ౯ 695

చ. త్రిశిరుఁడు వచ్చుటం గనుచుఁ ♦ దీక్ష్ణశరంబులు వింటఁ గూర్చి యా
దశరథరాజనందనుఁడు ♦ దారుణరీతిగ వైచుచున్ మహా
ద్రి శమనుఁ బోలి యాతని మ♦దిం గలిగించెను; నంత రాఘవ
త్రిశిరను లాత్మబాహుబల♦తీవ్రతలుం జెలువారఁ బోరఁగన్. ౯౪ 696

క. కరిసింహములకుఁ దీవ్రసమరమగునటు ఘోరమా స♦మరమయ్యెను నా
యిరువురకంతటఁ గోపస్ఫురణంబున దానవుండు ♦ శూరత మెఱయన్. ౧౦

తే. రామునొసటను మూఁడుశ♦రంబులేసి
నొంచె; రాముఁడు క్రుధచేతఁ ♦ జంచలించి
పలికె నయ్యారె! శౌర్యంబు ♦ ప్రౌఢవిక్ర
మంబు గలరాక్షసునిదా బ♦లంబు గనఁగ ౧౧౪ 698

క. అతిశయముగ నున్నది యే, యతుల విశిఖనికర మిద్ది ♦ యారా పుష్పా
కృతిగా నున్నది యిఁక న,ప్రతిను మదీయాంబకముల ♦ జ్వలనాభములన్.

తే. ప్రతిగ గ్రహియించి చూడుమా ♦ వితతచాప
గుణవిముక్తము లివియని ♦ కోపమునఁ
బలికి క్రూరాహులన్ వలె ♦ నలరి నాల్గు
పదియునగు బాణముల బొమ్ము ♦ పగులనేసె. ౧౩౪ 700

చ. అనుపమశౌర్యసారుఁ డగు♦నట్టి రఘూత్తముఁ డంత దానవే
శునివగు నాల్గుగుఱ్ఱముల ♦ శోభిలు పర్వము లొప్పునున్న చ
క్కనిబలుసాయకంబులను ♦ గ్రన్నన నన్నియొ నాటి కూల్చె న
ల్లనిమిది తీవ్రబాణముల ♦ నేసి ఘోరిన్ బొలియించె సారథిన్. ౧౫ 701

చ. అరదముపైఁ జెలంగు ధ్వజ ♦ మల్లన నొక్కశరంబుచేతనే
ధరణిని ద్రెళ్లఁజేసె; నర♦థంబు వివాజికె మాటచే వసుం

ధరపయి కుద్గమించు బలు◆దానవుఁ గాంచి రఘూత్తముండు స
చ్ఛరముల వానివక్షమును ◆ జక్కఁగ నాటగ వాఁడు మూర్ఛిలెన్. ౧౬ 702

తే. అప్రమేయాత్ముఁడగు రాముఁ ◆ డంత రోష
మడరఁగా వేగవంతంబు ◆ లైన మూఁడు
వాఁడిశరములఁ ద్రిశిరుని ◆ మూఁడు తలల
నవనిపైఁ ద్రెళ్లనేసె; న◆య్యసురుఁ డపుడు. ౧౭ 703

క. శిరములు మూఁడును రాముని, శరములఁ దెగ నల్లఁ గ్రక్కి◆క్ష్మాస్థలిఁబడియెన్
శిరసులతోఁ గూడఁగ; నా,తరుణమునన్ జావునుండి ◆ తప్పినయోధుల్. ౧౮

ఆ. పెద్దపులికి నులికి ◆ వే పాఱు మృగముల, భంగి భీతినొంది ◆ పఱచిరట్లు
పాఱుచున్న దనుజ◆పటలంబుఁ గని క్రుధ, ఖరుఁడు వారిభయము◆మరలఁబలికి.

క. మరలించి త్రిశిరుఁ జంపిన, విరోధి యగు రామభద్రు ◆ వెస మార్కొనియెన్
సరసిజరిపుని పయింబడ, నరిగెడు స్వర్భానువట్లు ◆ లతిజవ మొప్పన్. ౨౦

ఇరువదియేడవ సర్గము సంపూర్ణము.

---

## ౨౮ - వ సర్గము.

ఖరుని రథాదిపరికరముల రాముఁడు కూల్చుట

క. త్వర దూషణుఁ ద్రిశిరునిసంగరమున రాముండు త్రుంపఁ◆గా ఖరునకు భీ
కర రామవిక్రమమునకు, గరువము చెడి భయము మదిని ◆ గానంబడియెన్. ౧

చ. బల మధికంబుగాఁ గలిగి ◆ బాలిశుఁడౌ ఖరుఁ డొక్కరాముచే
నిలపయి దుర్జయంబయిన ◆ యెల్లసురారిబలంబు దూషణుం
డల త్రిశిరుండునుం బడుట ◆ నప్పుడు కాంచి బలాధికాసురా
వళి నశియించుటెంచి తన◆వారని గర్వముదూలి యంతటన్. ౨ 708

క. పురుహూతునిపై నముచియుఁ, బరువడిఁ జనునట్లు రామ◆భద్రునిపైకిన్
బరువెత్తి పోయి మార్కొని, ఖరుఁ డాత్మబలంబు నొలఁది◆గాఁ జాపంబున్.

తే. లాగి క్రుద్ధంబులగు ఫణు◆లను నితాంత
మును సమానము సేయఁజా◆లినశరముల
[1]నల్లఁ ద్రాగెడు గతి విల◆సిల్లువాని
రాముపయిని బ్రయోగించె ◆ రయము మెఱయ. ౪ 710

సీ. అరదంబుపైనుండి ◆ యాఖరుండును ధనుర్వేదంబుఁ గఱచిన ◆ విపులకౌశ
లం బేర్పడంగ జ్యా◆లతవిదుల్చుచు బహువిధములౌ నారాచ◆వితతి వైచు
పాటవంబును గనఁ◆బఱచుచు నేర్పును బ్రకటించె; నతిరథ◆వర్యుఁడైన
దాశరథియుఁ బర◆దానవుఁ డీరీతిఁ దనపైకిఁ గవియుటఁ ◆ గని నితాంత

---

1 నారాచాన్ రక్తభోజనాన్-అనిమూలము.

తే. శక్తిచే దివ్యమయినట్టి ♦ చాపమందు, శరములఁ గూర్చి వానిచే ♦ సకలదిగ్వి
దిశల నిండంగనిగుడించె ♦ దీప్తవహ్ని, విస్ఫులింగంబులంబోలి ♦ వెలిసియవియు.

క. పరులకు సహింపరాకయె, పరఁగె; ఖరుం డిట్లు బాణ ♦ వర్షము ధారా
ధర మతివృష్టిని నభమం, తరశూన్యము చేయునట్లు ♦ తాఁ గురిపించెన్. 712

చ. ఖరుఁడు రఘుప్రవీరుఁ డిటు ♦ గాఢపరాక్రమముల్ చెలంగ నొం
డొరులపయిన్ వెసన్ విడుచు ♦ నుగ్రశరంబులు నిండియుంప నం
బరము నిరంతరం బగుచు ♦ భాసిలె; నొండొరులన్ జయింప నా
తురులయి వారు పోర నటఁ ♦ దోయజమిత్రుని మండలంబొగిన్. ౧౩ 713

క. శరజాలావృతమై భా, సురముగఁ జెలువారకుండె; ♦ సురవైరియు భీ
కరనాళీకవికర్ణిక, శరములఁ దీక్ష్ణాగ్రములను ♦ శౌర్యం బలరన్. ౧౪ 714

క. బరిగోలలఁ గరిఁ బొడిచెడు, కరణిం బ్రహరించె; నట్లు ♦ కనునీయంబా
[1]నరదమువనుండిచాపముఁ, గరమున ధరియించి యునికి ♦ ఖరుఁడుపొలుచుటన్.

క. కని యతని బాణములఁ దా, ల్చిన యంతకుకీతి భీతిఁ ♦ జెందించెడు వా
నిని నాభూతగణంబులు, కనియెన్ దదనంతరంబ ♦ ఖరుఁ డిటు తలఁచెన్.

చ. బలమున నెక్కుడై యతుల ♦ పౌరుషముం గనుపట్టి నొప్పియుఁన్
జలమున గొప్పసైన్యమును ♦ జంపుట నప్పుడు డస్సియున్న వాఁ
డలఘుభుజుండు రాముఁ డని ♦ యాత్మఁ దలంచుచు నుండ; రాముఁ డు
జ్జ్వలగతి సింహము ట్లడరి ♦ శౌర్యము పొంగుచు నుండఁ బొల్చుచున్. ౧౭ 717

తే. సింహమునుంశటిబీరంబు ♦ చెలఁగ వచ్చు
ఖరునిఁ గని క్షుద్రజంతువు ♦ హరికనుగతిఁ
దాఁ జలింపక నిలిచె; నం ♦ తట ఖరుండు
భానునిభమౌ మహారథ ♦ వరమునందు. ౧౮ 718

చ. పొలిచి రణంబు సేయుటకుఁ ♦ బూని పతంగము నిప్పుమీఁదికి
జ్జ్వలగతి మీఱఁ బోవుగతి ♦ [2]భార్గవరామమదాపహారియై
యలరెడు రామచంద్రుపయి ♦ నాతుర మొప్పఁగఁబోయి యమ్మహా
త్ములలితచాపమున్ సశర ♦ మున్ గరకౌశల ముల్లసిల్లఁగన్. ౧౯ 719

తే. లస్తకమునకుఁ జెంత వి ♦ లాసమడరఁ
దునిమి మఱియును గోపంబు ♦ తోడ శక్రు
వజ్రమున కుద్దియౌ స ♦ ప్త బాణములను
గవచమున నాటనేసె వి ♦ క్రమము పొంగ. ౨౦ 720

సీ. సాధుపర్వమ్ములఁ ♦ జక్కఁగ మెఱసెడు ఖరము క్తబాణముల్ ♦ కవచవరము
భేదింప నాదిత్య ♦ విధమున వెల్గురాముని కవచంబు భూ ♦ మినిఁ బడియెను

1 తం రథస్థం ధనుష్పాణిమ్-అనిమూలము. 2 భార్గవరామమదాపహారియై-ఇది రామపరాక్రమాతిశయద్యోతకముగాఁ బ్రయోగింపఁబడియె నని గ్రహింపవలయు.

ప్రతిలేనితేజంబు ♦ భాసిల్లఁదగు రాము ఖరుఁడు సమీపించి ♦ శరసహస్ర
మున నొంచి పెనునాద♦మును జేసె; రాముఁడట్లనిఁదన దేహంబు♦ననుశరములు
తే. నాఁటఁగాఁ గ్రోధమొంది యెం♦తయు విధూమ
హుతవహునిరీతి వెలిఁగె; న♦ట్లొప్పి యతఁడు
వైరికాలుఁడు గావునఁ ♦ బగతునణఁపఁ
బెనురవంబునఁ దగు క్రొత్త♦ధనువరంబు. ౨౦ 721

చ. కరమునఁ బట్టి యెక్కిడియెఁ ♦ గమ్రధనుస్సది యాయగస్త్యమా
నిరమణదత్తమై వెలయు ♦ నిర్భరవైష్ణవమై చెలంగు; నా
ఖరుపయి కాళరాసనముఁ ♦ గైకొని రాముఁడు విక్రమించి క
ర్బురమయపుంఖముల్ తనరఁ ♦ బొల్చిన సన్నతపర్వబాణముల్. ౨౧ 722

క. పరగించి సంగరంబున, ఖరునిధ్వజం బవనిఁ గూల ♦ ఖండించెఁ గనన్
సురుచిరమై తగుకాంచన, వరకేతన మద్ది చెదరి ♦ వసుధన్ బడుచున్. ౨౨

క. సురశాపంబున భూమిని, సరసిజమిత్రుండు పడిన♦చాడ్పునఁ గననై
యరుదై యుండెను; ఖరుఁడున్, బరమర్మజ్ఞుండు గానఁ ♦ బటుశౌర్యమునన్.

క. పెనుమార్గణముల శ్రీరాముని యంగములెల్ల నార్తిఁ ♦ బొందఁగ నాటెన్
ఘనతోమరముల ద్విరదం,బును బొడిచెడురీతిఁ దీవ్ర♦ముగ నాల్గింటన్. ౨౪

పంచచామరము. ఖరాసురోగ్రభూరిచాప ♦ గాఢముక్తబాణముల్
త్వరన్ శరీరమందు నాటి ♦ బాగుగాఁ జొరన్ భయం
కరంబుగాఁగ నల్లయట్టె ♦ కాఱుచుండఁగా మహా
త్తరక్రుధార్తచిత్తుఁడయ్యెఁ ♦ దా రఘూత్తముం డనిన్. ౨౫

క. విలుకాండ్రలోన మేటిగ, విలసిల్లుచు నొండుమేటి ♦ విలుదాలిచి మి
క్కిలి వెడదలైన సాయకముల నాఱేఁటిఁ గొనుచు లక్ష్య♦ము దనరుచుండన్.

చ. ఖరుశిర మొక్కటన్ భుజయు♦గంబును రెంటను సాయకత్రయం
బరుదుగ నర్ధచంద్రు లస♦దాకృతి నొప్పినదానివైచి భీ
కరముగ నున్నవక్షమును ♦ గాఢముగాఁ బరితాప మొందఁ జే
సె రఘుకులుండు తేజమునఁ ♦ జెన్ను వహించుచుఁ గ్రోధచిత్తుఁడై. ౨౭ 728

చ. దనుజునిఁ జంపఁగాఁదలఁచి ♦ [1]ధామనిధిం బురుడించి చాల మిం
చిన పదుమూఁడుబాణములఁ ♦ జెచ్చెఱఁ దీసి మహేంద్రతుల్యమై
తనరు బలంబు పెంపెసఁగఁ ♦ దచ్ఛరపంక్తిని నవ్వుచున్నరీ
తిని వెలయించుచున్ మిగులఁ ♦ దీవ్రముగాఁ దగు నొక్కకోలచేన్. ౨౮ 729

సీ. అరదముకాఁడిని ♦ నశ్వపంక్తిని నాల్గుశరముల సారథి♦శిరము నొకట
సాయకత్రయమున ♦ స్యందనవేణువు నడ్డకమ్మిని రెంట ♦ నవుడె త్రుంచి

---

[1] ధామనిధిన్=సూర్యుని.

వజ్రాయుధంబన ♦ భాసిల్లు నొకసాయకంబున సశరమౌ ♦ కార్ముకంబు
ఖండించి యొకసాయ♦కమునఁ దదంగంబుఁబగులించె; ఖరుఁడంత ♦ భగ్నధనువు

తే. రథము తురగోత్తమములు సా♦రథియుఁ బోవ
గదను గరమున ధరియించి ♦ కడురయమున
స్యందనమునుండి లంఘించి ♦ యవని నిలిచె
దివి విమానాగ్రములనున్న ♦ దేవవితతి. ౩౨ 730

చ. మునులు మహారథుండు రఘు♦ముఖ్యుఁ డొనర్చిన గొప్పకృత్యముం
గని కడు సంతసించి తమ♦కంబున నంజలులొప్ప నంద ఱా
తని నొకరీతిఁ గూడి ఖర♦దానవుపాటునకైన యుబ్బునెం
పున వినుతించి భక్తిమెయిఁ ♦ బూజ లొనర్చిరి పూన్కి మీఱఁగన్. ౩౩ 731

ఇరువదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ౨౯ - వ సర్గము.

రాముఁడు ఖరునితోఁ జతురోక్తులుగఁ బరుషము లాడుట.

క. ఘనతేజుఁడు రాముఁడు స్యందనవిరహితుఁ డగుచు గదను ♦ దాల్చి నిలిచియు
న్న నిలింపవైరిఖరునిం, గని నయమూనుటను మృదువు♦గాఁ గ్రాలి తగన్. ౧

తే. మర్మములనెత్తి పొడుచుట ♦ మానకెంతొ
పరుషములయి చెలంగెడు ♦ పల్కులలర
ఖరునితో నిట్టులనియెను; ♦ ద్విరదతురగ
రథసమన్వితబలమెల్లఁ ♦ గ్రాలుచుండ. ౨ 733

క. దానికి నధిపతివై పెం, పూనుచు నీవెల్లజగము ♦ లొగిని జుగుప్సం
బూనఁగ దారుణకర్మము, మానక చేసితివిగాదె ♦ మానము దూలన్. ౩ 734

తే. ఆర్తిఁ బ్రాణులకుం గల్గు♦నట్లు చేసి, ఘాతుకుండయి పాపైక♦కార్యములను
జేయుచుండున యేని యా♦త్మీతివరుండు, త్రిజగదీశ్వరుఁడైనను ♦ దెగునిజంబు.

చ. ఇఁక నినుబోఁటివాని పలు♦కేటికి? రాక్షస! [1]దుష్టసర్ప మొం
డు కనఁబడంగ దానిని గ♦డున్ దయఁగల్గినవారలైనఁ జం
పుకరణి లోకనింద్యమయి ♦ పోల విరుద్ధమునైనకర్మ మ
త్యకుటిలబుద్ధిఁ జేసెడు దు♦రాత్మునిఁ జంపుదు రెల్లవారలున్. ౪ 736

[2]సీ. ప్రాప్తవస్తువులను ♦ వదలనోపని లోభమునఁగాని మఱి లభిం♦పనిపదార్థ
ములు కావలయునని♦పలుతెఱంగులఁ గోరు కామమునంగాని ♦ కలుషములను
నాచరించుచు వాని ♦ నఘములుగాఁ దరువాత నెఱింగియు ♦ స్వాంతమందుఁ
బరితాపపడక యె♦వ్వఁడు సుఖముండునో భ్రష్టుఁడై పడిఁ గల్గు♦రాయిఁ దిన్న

---

1 సర్పం దుష్ట మివాగతమ్-అనిమూలము. 2 లోభా త్పాపాని కుర్వాణః కామా ద్వాయో నబుధ్యతే-అనిమూలము. అప్రాప్తస్య ప్రాప్త్యాశా కామః, ప్రాప్తపర్యాశా లోభః-అనివ్యాఖ్య.

తే. యట్టి నలిగండ్ల సర్పంబు♦నట్లు దాని
ఫలముఁ బొందుదు; నేనేమి♦పాప మొనరి
చితి నటంచెంతువా ధర్మ♦చింతనున్న
దండకారణ్యవాసులఁ ♦ దత్త్వవిదుల. ౫౪ 737

చ. మునుల వధించితీవు ద్విజ♦ముఖ్యులఁ జంపి ఫలం బదేమి నీ
వును దమిఁ బొందినాఁడవొకొ ♦ భూమినిఁ బాపులు పెక్కుమంది జీ
వనమును గాంచలేదె యని ♦ పల్కెదవేమొ యఘంబు చేయు న
మ్మనుజులు వేఱుజన్మమున ♦ మానక తత్ఫలమొందువారు సూ. ౬౪ 738

తే. క్రూరులయి లోకములకును ♦ రోఁతబుట్టు
నట్టు సేసెడు వారన్న ♦ నాత్మసుకృత
వేశమున సుంతయైశ్వర్య ♦ మాశకొలఁదిఁ
బొందియున్నను జిరసిద్ధిఁ ♦ బొందరిలను. ౭ 739

క. వారును విచ్యుతమూలమహీరుహములభంగి నాశ♦మే పొందుదు; రో
రీ! రాక్షస! ఋతుకాలము, చేరం దదుచితముగాఁగఁ ♦ జెట్లెల్లెడలన్. ౭౪

చ. సుఖములఁ బొందునట్లు మను♦జుల్ కడు రోసెడు పాపరూపక
ర్మము నొనరించి సత్వరము ♦ మానక దుఃఖఫలంబు గాంత్రు సు
మ్ము; మఱియు క్ష్వేళయుక్తబళ♦ముల్ దినువాఁడును దత్ఫలంబు వే
గమ గనునట్లు మిక్కిలి య♦ఘంబులు సేసినవాఁడు రాక్షసా. ౮౪ 741

తే. దానిఫలమును వేగమె ♦ తాను బొందు; దానవా! ఘోరపాపవి♦తానములను
జేయుచున్ లోకులకుఁ గీడు♦చేయఁగోరు, చున్న దుష్టులప్రాణాళి♦నుక్కడంప.

క. జనపతియౌ దశరథునాజ్ఞను నేనిట వచ్చినాఁడ ♦ స్వర్ణాంబకముల్
గొనివైవ నవ్వి నిగుడుచు, నిను జీలిచి పుట్టలో ఫ♦ణిప్రభుభంగిన్. ౧౦౪

క. ధరణిం జొచ్చును జుమ్మీ, యరణ్యమున నిందు ధర్మ ♦ మాచరణముగాఁ
బరఁగు మునీంద్రుల నెవరె,వ్వరి భక్షించితివొ మున్ను ♦ పౌరుష మలరన్.

క. అని నాచేఁ జంపఁగఁబడి, ఘనసేనలఁ గూడి నీవు ♦ కదలి యల మునీం
ద్రనికరము కడకుఁ బోఁగల, వనుమానము లేదు వినుము♦యసుర మదుక్తిన్.

సీ. పూర్వము నీచేతఁ ♦ బొలియింపఁబడినట్టి పరమమునీంద్రు లి♦ప్పట్టునందు
వ్యోమయానంబులు ♦ రొప్పుచు నాకాశమందుండి నీవు నా♦యంబకములఁ
బడి నరకంబున ♦ బహుళదుఃఖములందఁ గనుదురుగాక యో♦దనుజవంశ
పాంసనా! యిష్టము ♦ వచ్చినట్లుగ నీవు ప్రహరింపుమా నను ♦ వలసినట్లు

తే. యత్న మొనరించి చూడు మీ♦యదనునందుఁ
దాళఫలమట్లు నీతల్లు నీ♦తలను నేలఁ
బడఁగ నడవిని కోపంబు ♦ ప్రబల ఖరుఁడు
కనుయుగం బెఱ్ఱవాఱ ని♦ట్లనియె నగుచు. ౧౧ 746

సీ. దశరథాత్మజ ! ప్రవి♦దారణంబున నీవు సామాన్యులయిన రా♦క్షసులఁ గొంద
ఱిని జంపి దాననే ♦ నినునీవ వినుతికిఁ దగనివానిని గడుఁ ♦ బొగడుకొనుచు
నున్నాఁడ వేమి యి♦ట్లొప్పు నీకిది యుక్తమగునె నీవంటిశౌ♦ర్యఘనులౌచు
బలవంతులైన నరా♦జులు తమవిక్రమమునకు గర్వించి త♦మ్ముఁ దమరిట్టు
లెంతమాత్రము నుతి♦యించుకొనరుసుమా యట్టివారలు కొంద♦ఱగుదురిలను
తే. రామ దుర్బలులగుచు ధై♦ర్యమ్ముగ నని
క్షత్రియాధములెల్ల ని♦ష్ఫలముగాఁగఁ
దమ్ము నుతియించుకొందురు ♦ తారె యట్లు
నిన్ను నుతియించుకొనెదవు ♦ నీవె దగునె. ౧౮ 747

క. ధర నెవ్వఁడు వీరుఁడు సంగరమున మృతి వచ్చునపుడు ♦ గాని యవసరం
బరుదేర నపుడుగానీ, వరమా స్వకులీనతను న♦భంగురరీతిన్. ౧౯ 748

సీ. ప్రకటించుకొనుచు స్వ♦పౌరుషంబును గొనియాడునో; యెఱుఁగుమీ♦వట్టులేల
చేసికొనెదవో; యో♦క్షితిపకుమారకా నిను నీవె నుతిచేసి♦కొనుటచేత
నీయల్పతయె యిట ♦ నిర్మలముగ నెఱుఁగంగనయ్యెను దర్భ♦గంట రాఁజు
కొనునట్టి యగ్నికాం♦చనమట్లు త్వరగాఁ బ్రకాశించి యుండినఁ ♦ గడురయమున
తే. నాటి వేఱొకవస్తువు ♦ నది దహింపఁ, జాలనట్లుగఁ దన్నుదా ♦ స్తవముచేసి
కొనినవాఁ డందులకు సరి♦గను బరాక్రమమునుజూపంగఁజాలఁడు♦మాటలేల.

చ. విను భవదగ్రమం దచల♦వృత్తిని నిల్చి రిపువ్రజంబు నొం
చినదగు నీగదాయుధముఁ ♦ జేత ధరించిననన్ను ధాతువుం
జనియతపర్వతంబువలెఁ ♦ జంచలతం గనఁజేయఁగాఁ బొసం
గనిఘనుఁగాఁ గనుంగొనవు ♦ కాననె యీనుతిఁ జేసికొంటయున్. ౨౧ 750

చ. కరమున నీగదాయుధము ♦ క్రాలఁగఁ బాశము కై ధరించి భీ
కరగతి నున్న యవ్విలయ♦కాలునిరీతిని నీదుప్రాణముల్
త్వరగ జగత్త్రయాసువులఁ ♦ బాపఁగ నేన యొకండఁ జాలుదున్
బరుషముగా నిజస్తుతిని ♦ బల్కఁగఁజాలఁగ నున్నవీ నుడుల్. ౨౨ 751

సీ. ఐన నిప్పుడు చెప్పు♦నట్లు చెప్పఁగఁ బూన నర్కుఁ డస్తాద్రికి ♦ నరుగుఁదానఁ
గదనంబునకును వి♦ఘ్నము గల్గు నీవును బదునాల్గువేల దే♦వద్విషులను
వధియించితివి నిన్ను ♦ వధియించి యిపుడేను వారిబంధ్వశ్రుల ♦ వారిఁ దుడిచి
కార్యసంసిద్ధిని ♦ గాంచెద ననిపల్కి పరమాంగదుండగు ♦ ఖరుఁడు కోప
తే. మడర వజ్రమువలెఁ బ్రదీ♦ప్తాంగ మలర
నున్నయాభీల గదఁ ద్రిప్పి ♦ యాచివైచె
జానకీపతిపై నంత ♦ మానితగద
యద్ది మిగులన్ వెలుంగుచు ♦ నడరి వేగ. ౨౩ 752

క. దారికి నడుమం దగునా, భూరుహముల గుల్మములను ♦ బోరిఁబోరి బూదిన్
గా రయమున నొనరించుచు, శ్రీరాముని సన్నిధికిని ♦ జేరెన్ గదఁకన్. ౨౬

ఆ. మృత్యుపాశమట్లు ♦ మిఱుమిట్లు గొలుపుచు
వచ్చుచున్నగదను ♦ బార్థివుండు
గాంచి యాకసమున ♦ ఖరబాణములచేతఁ
దునిమెఁ బెక్కులైన ♦ తునియలుగను. ౨౭ 754

క. శరములచే నాగద యి,క్కరణిన్ దుత్తునుకలగుచు ♦ క్ష్మాస్థలిఁ బడియెన్
వరమంత్రౌషధబలమున, ధరఁ ద్రోయంబడిన ఫణివి♦ధంబున నచటన్. ౨౮

ఇరువదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౩౦ - వ సర్గము.

రాముఁడు ఖరునిం జంపుట.

చ. ఖరుని గదాయుధంబు నిటు ♦ గాఢశరంబులఁ ద్రుంచివైచి ధ
ర్మరతుఁడు గాన నాఖరు ని♦రస్త్రమహాయుధు నేయనొల్ల కే
పరిహసనంబు సేయ స్మిత♦భాసురవక్త్రము సొంపునింప సం
గరమునఁ దొట్రుపాటుఁగను ♦ కర్బురవర్యునితోడ నిట్లనున్. ౧ 756

క. దనుజాధమ! నీదుబలం,బునంతయుం జూపితివిఁకఁ ♦ బూనిక నేయే
పనుల నొనర్పంగలవో, కన నెంచితి, మదిఁ దలంపఁ♦గా నాకంటెన్. ౨ 757

క. బలహీనుఁడవయ్యు వృథా,పలుకులు ప్రేలితివి వట్టి♦పలుకుల నాడం
గలవాఁడ వందుఁ బొండితి, గలవాఁడవె వైరినడచు♦గద నీగదయున్. ౩

సీ. ఆగద యిదిగో నా♦యతుల బాణంబుల శకలంబులై పడె ♦ క్ష్మాతలమున;
నింతకు మును పల్కి ♦ తీవు నన్నుం జంపి నాచేతహతులైన ♦ నాకిరిపుల
బంధువులకు నేత్ర♦వారిని దుడిచెద ననిగద యామాట ♦ వ్యర్థమయ్యెఁ
గద యిప్పు; డాచార♦కలితుండవునుగాక హీనస్వభావుఁడ♦వే యయి మఱి
తే. యల్పుఁడవు నయి దనుజుండ ♦ వైన నీదు
ప్రాణములనెల్ల నమృతంబు ♦ వైన తేయుఁ
డపహరించినవడువున ♦ నపహరింతుఁ
గనుఁగొనుము నాదుసాహస♦మును రణమున. ౪ 759

చ. దనుజ! మదీయబాణములఁ ♦ దావకవక్షము బ్రద్దలై గళం
బును దెగి కాఱురక్తమును ♦ బుద్బుదఫేనవిభూషితమ్ముఁ జ
క్కనిగతిఁ ద్రావఁగాఁగలదు ♦ క్ష్మాస్థలి యోకులపాంసనా! జవం
బున నె త్వదంగసంతతులు ♦ భూమిరజంబున బ్రుంగియుండఁగన్. ౫ 760

తే. కరయుగమ్మును జాపుగా ♦ ధరణిపైచి
దుర్లభాంగననుంబోలెఁ ♦ దొడరి భూమిఁ
గౌఁగిలించుకొనుచుఁ బెద్ద♦గా నిదురను
బోవఁగల విద్ది సత్యంబు ♦ పో ౖత్రిశుద్ధి. ౭ 761

తే. దనుజకులపాంసనా! నీవు ♦ పెను నిదురను
బొంది శయనించినపిదప ♦ మునుల కగతి
కులకు నీదండకాటవి ♦ లలితసుఖ ని
వాసమగుఁగాక; పెక్కులు ♦ పలుకు లేల. ౮ 762

క. వినుము జనస్థానమునం, దనరారెడు దనుజవాస♦తతి మచ్ఛరవ
హ్నిని గూల మౌను లీవన,మున నిర్భయముగను దిరుగఁ ♦ బూనఁగలరు సూ.

చ. దనుజకులాధమా! మునుపు ♦ తద్దయు భీతిని నెల్ల వారికిన్
మనమున నించుకేని యను♦మానము లేకయె కల్గఁజేయు మీ
వనితలు బాంధవు ల్దెగిన ♦ బాష్పసుసంభృతవక్త్రలై భయం
బును గలిగింప కార్తలయి ♦ పొంది భయంబుఁ జరింతు రెల్లెడన్. ౧౦ 764

సీ. త్వత్తుల్యదుర్వృత్తి ♦ బాగుగా నలవడఁ
బాపివౌ నిన్నును ♦ భర్తఁగాఁగ
గ్రహియించినట్టి రా♦క్షసకాంత లింతకు
మును దుఃఖమెఱుఁగకుం♦డినను నిపుడు
దుఃఖరసంబును ♦ దోరంబుగా నెఱిం
గినవారలై కామ ♦ మనఁగఁ బరఁగు
పురుషార్థమును మాని ♦ పొగులుచుందురు; నీచ
ఘాతుకా! తు ద్రాత్మ! ♦ క్షామ రేంద్ర

తే. కంటకా! మౌను లగ్నులఁ ♦ గడఁగి వేల్చు
నపుడు నినుఁ బట్టి యే విఘ్న ♦ మనురునో యని
సతతశంకితు లగుచునే ♦ సాధ్వసమున
నగ్నిపై తురు గాదె యా♦హవినులార్తి. ౧౨ 765

సీ. రణమున నిట్లు సం♦రంభించి పలుకు రామునిఁగాంచి ఖరుఁడు ప్ర♦భూతరోష
మడరఁగాఁ బరుషమై♦నట్టి నిస్వనమునఁ బలికె నిట్లని రామ♦భద్ర! నీవు
గర్వితమతివై తి ♦ కడు నిశ్చయంబిది కావున సాధ్వస♦కారణములు
పొడసూపుచున్నను ♦ బొందక భయమును గాలవశ్యుండవై ♦ యోలి నిద్ది

తే. వాచ్య మిద్ది యవాచ్యపుఁ♦బలుకటంచుఁ
దెలియఁజాలక ప్రేలెద; ♦ విలను గాల
పాశబద్ధులు పురుషులె♦వ్వారో వార
లఘగతషడింద్రియార్థులై ♦ యల్పమతులు. ౧౪ 766

క. తెలియరు కార్యాకార్యం,బుల నించుకయేనియనుచు ♦ భూరిధ్వనితోఁ
బలుకుచు బొమముడి పెట్టుచుఁ,గలహామునకు నాయుధములఁ♦గానకత్వరతోన్.

క. కనుఁగొని నాలుగుదిక్కులఁ, గనియెం దాపునను జూడఁ ♦ గడు భయదంబై
తనరెడు పెనువృక్షంబును, దనపూనిక కద్ది మిగులఁ ♦ దగియుండుటచేన్.

తే. పెదవిఁ గొఱుకుచు దానిని ♦ బెల్లగించి
యంత నద్ది మహాస్త్రాలు♦నై యొసఁగుట
నతిబలుండగు ఖరుఁడల్లై ♦ యారవంబు
చెలఁగఁగా నెత్తుకొనె రెండు♦చేతులఁ గడు ౧౭ 769

చ. కరములఁ బైకి నెత్తుకొని ♦ గాఢబలం బడరంగ వైచి ని
ర్భరమగు దీనఁ జచ్చితివి ♦ రామ యటంచును బల్కె; విక్రమ
స్ఫురణమునం దనర్చు రఘు♦భూపకులాభరణుండు పైకి స
త్వరముగ వచ్చు నాద్రుమము ♦ బాణములన్ వడిఁ ద్రుంచె లీలతోన్. ౧౮

క. ఖరుఁ డొగి రణసాధనతతి, విరహితుఁ డై సాధుభావ♦విరహితుఁ డౌటన్
బరికించి తీవ్రకోపము, ధరియించెన్ మదిని దద్వ♦ధంబును జేయన్. 771

క. అంతట రాముఁడు రోషా,క్రాంతుండయి స్వేదబిందు♦గణవృతతనుఁడై
యంతట రక్తిమ కనులను, వింతఁగ నెలకొనఁగఁ గూర్చె ♦ వేయిశరంబుల్.

చ. ధనువున వేయిబాణముల ♦ దానొగిఁ గూర్చి సురారి నొంచె, న
ప్పెనువిశిఖంబులం గలుగు ♦ విస్తృతమౌ వివరంబునుండి యొ
య్యనబహుఫేనిలావృతమ♦హారుధిరంబులు వే స్రవించెఁ బెం
పునఁ దనరారు ప్రస్రవణ♦భూధ్రమునుండి ప్రవాహము ల్వెలెన్. ౨౧ 773

క. అని రాముం డేసిన బా,ణనికరముల నంగములు వ♦నటఁ బొందంగన్
బెనుమదమున నెత్తుకువా,సన గ్రమ్మఁగ నురవడించె ♦ జానకిపతిపై. ౨౨ 774

*సీ. ఖరుఁ డట్లు జృంభించి♦కార్ముకమున సాయకము గూర్చుటకుఁగాని♦కడఁగి దాని
విడుచుటకుంగాని ♦ తడవు లేకుండఁగఁ దనమీఁదఁ బడివచ్చు♦టను రఘూత్త

---

* తమాపతంతం సంరబ్ధం కృతాస్త్రో రుధిరాప్లుతం, అపాసర్పత్ప్రతిపదం కించి త్త్వరిత విక్రమః-అనిమూలము. దీనికి వ్యాఖ్యానకర్తలు వ్రాసిన యర్థమంతయు నీసీసపద్యమున నిమిడి యున్నది. ఇందు శ్రీరాముఁడు వెనుకకుఁ గొంచెము జరగెనని యుండుట గన్పట్టు. ఈవిషయమై గోవిందరాజులు "యద్యపి రణే కించి దపసర్పణం శూరస్యాయుక్తం. తథాపి సర్వతో బలవతీహ్యా న్యథానుపపత్తి రితిన్యాయే నాపసర్పణం వినా తత్సంహారహేత్వలాభా దపసర్పణం నదోష ఇతి హృదయమ్" అని వ్రాసిరి. మహేశ్వరతీర్థులు "క్వచి దతిసంకటదేశకాలయోః వీరధురంధరాణా మపి సమ్మత మిద మపసర్పణ మితి భావః" అని వ్రాసిరి. ఈభావము పద్యమునఁ గనఁబడకుండుటకుఁ గారణ మిట్టిని ప్రశ్నోత్తరములు చమత్కారముగా వ్రాయఁబడునవి. వానిని దెనుఁగునఁ జేర్పరాదని నాభావమని గ్రహింపవలయు. ఈకార్యము రాముఁడు చేయుటనుగూర్చి భవభూతిమహా

ముఁడు చూచితా నప్డు♦తొడిగినయానాయకము వైచుటకుసందుఁ♦గల్గుటకును
దనుజునిమేనిర♦క్తము తనతనువును నంటునో యను నన♦హ్యమున నడుగు
తే. లిడుచు నొకకొంత వెనుకకు♦ నేగె; నంత
ఖరునిఁ జంపంగఁ బూని వి♦క్రమము మెఱయ
నగ్నివలె మండుచుఁ బొల్చి ♦ యపరమైన
బ్రహ్మదండమువలె నున్న♦బాణముఁ గొని. ౨౪ 775

క. నారిం గూర్చెను మును జం,భారియు మతివిభవయుక్తుఁ ♦ డై రామునకున్
దారాఁదగు కాలస్థితి, నారసి యాశరమగస్త్యుఁ ♦ డను మునివలనన్. ౨౫

ఆ. కలుగునట్లు చేసెఁ ♦ గాన నాశరమును, ఖరునిపైనివైచె ♦ ఖరశర మది
చాపముక్త మగుచు ♦ సరభసగతి వజ్ర,పాత మట్లు ఘనర♦వంబు సెలఁగ. ౨౬

క. ఖరువక్షంబున నాటెను, సురారియును రామ బాణ♦శుచిదగ్ధుండౌ
చు రయమునఁ బడియెనప్పుడె, ధరణిన్ విగతాసుఁ డగుచుఁ ♦ దల్లడపడుచున్.

*క. మును పల శ్వేతారణ్యం,బున రుద్రుని నేత్రవహ్నిఁ ♦ బొలిసిన భయకృ
ద్ఘనవిక్రముఁ డగు నంతకు, ననువున ఖరుఁ డట్టెకూలె ♦ నవనీస్థలిపై. ౨౭ 779

చ. హరిహయవజ్రభిన్నతనుఁ♦డై పడు వృత్రునిభంగిఁ, జాల భీ
కరుఁడయి యొప్పియున్ నురుగు ♦ గాడినమాత్రనె చచ్చినట్టి యా
సురరిపువర్యుఁడౌ నముచి♦చొప్పున, నింద్రునివజ్రసాయక
స్ఫురణమునన్ మృతుండయిన ♦ శూరబలాసురురీతిఁగాఁ బడెన్. ౨౮ 780

సీ. అంత బ్రహ్మర్షులా ♦ యపనీశమానులు పరమసంతుష్టులై ♦ వచ్చి కూడి
రఘురాముఁ బూజించి ♦ రమణ నిట్లనిపల్కి రతుల తేజుండు పా♦కాదిదనుజ
శాసకుండయిన ని♦ర్జరనాథుఁడీ ఖరవధమునకై శర♦భంగునాశ్ర
మమునకు వచ్చెను ♦ గ్రమము దప్పి నటించు పాపకర్ములు క్రూరు♦లై పరఁగెడు
తే. నీసురారులఁ జంపింప ♦ నెల్లమాని
వరు లుపాయములను జాలఁ ♦ బన్ని యిందుఁ
గలుగు నాయాయి యాశ్రమం♦బులఁ గనునెప
మున నె నిన్నీస్థలంబును ♦ బొందఁజేసి. ౩౧ 781

---

కవి చమత్కారముగా నుత్తరరామచరిత్రమున
"వృద్ధా స్తేన విచారణీయచరితా స్తిష్ఠంతు కిం వర్ణ్యతే
సుందస్త్రీదమనే ప్యఖండయశసో లోకే మహాంతో హి తే
యాని త్రీ ణ్యపరాఙ్ముఖాన్యపి పదాన్యాసన్ ఖరాయోధనే
యద్వా కౌశల మింద్రసూనునిధనే తత్రాప్యభిజ్ఞో జనః."
అని లవకుమారునినోటఁ జెప్పించిరి. ఇట్టివి చమత్కారమునకేకాని కథకు సంబంధించినవి కావు.

* రుద్రేణేవ వినిర్దగ్ధః శ్వేతారణ్యే యథాంతకః-అనిమూలము.

క. కృతకృత్యులైతిరి; దశరథ, సుతవర్యా! నీవు మాకు ♦ శూరత మెఱయన్
క్షితినొనగుపఁ దగు పనియిది, యతులమ్ముగఁ జేసినాఁడ ♦ వప్పనిఁ బూన్కిన్.

క. పరమర్షు లింకమీఁదట, నరణ్యమున నిందు శర్మ ♦ ములరఁగ ధర్మో
త్కరకృత్యములం జేయుచు, నిరతము నివసింపఁగలరు ♦ నెమ్మింగనుచున్. ౩౨

చ. అని వచియింపుచున్న సమ ♦ యంబున నిర్జరచారణుల్ దివం
బునఁ బరిహర్షముం గనుచుఁ ♦ బొల్చుచు భేరుల మ్రోయఁజేసి, రా
మునిఁ దమిఁ బుష్పవర్షమున ♦ ముంచిరి విస్మయ మొప్పుచుండ నొ
య్యన విబుధేశ్వరుల్ గలిసి ♦ యాదృతిఁ బల్కిరి వ్యోమమం దొగిన్. ౩౩ 784

సీ. సార్ధముహూర్తమం ♦ దతిభయంకరమగు నీయాహవంబున ♦ నెంతొ ఘోర
విక్రములయి లోక ♦ భీకరులగు ఖరదూషణాదులును జ ♦ తుర్దశసమ
సంఖ్యాసహస్రముల్ ♦ సమసిరి రాముచే నిశితబాణములచే ♦ నియతశక్తి
నేమియద్భుతకృత్య ♦ మిది విదితాత్ముఁడౌ మనరాముఁ డెంతటి ♦ మహితకార్య

ఆ. మును నొనర్చెనొర! ♦ భూరివిక్రమ మేమిఁ?
యితనిశక్తియేమి ? ♦ యిద్ది యంత
యును దలంపఁ గేశ ♦ వుని శక్తిసామర్థ్య
ములవలెను నచింత్య ♦ ముగను దనరె. ౩౪ 785

చ. అని వచియించి దేవవరు ♦ లందఱు వచ్చినదారిఁబోవ న
జ్జనకజతోడ లక్ష్మణుఁడు ♦ శౌర్యఘనుండు మహీధ్రకంధరం
బును విడనాడి రాఘవుని ♦ భూతగణస్తవకార్యమెంచి వ
చ్చెను దనయాశ్రమంబునకుఁ ♦ జెచ్చెఱ నంతట రామమూర్తియున్. ౩౫

మ. ఘనశౌర్యం బలరారఁగా విజయుఁడై ♦ త్వష్టా దేవమానీంద్రపూ
జను మోదంబునఁ గాంచి లక్ష్మణుఁడు తా ♦ సంతోష మేపార రాఁ
గని తత్పూజను గాంచి యాశ్రమము ను ♦ త్కంఠంబునం జొచ్చె; న
జ్జనకక్ష్మాపతిపుత్రి యాత్మవిభుఁ జం ♦ చత్తేజు లోకేశ్వరున్. ౩౬ 787

సీసమాలిక:—

*పదునాల్గు వేలతో ♦ వసుధాపతికుమారుఁ
డొక్కఁడే మాఱొక్కని ♦ యుద్ధమెట్లు
చేయఁగాఁ గలఁడని ♦ చిత్తంబునన్ భీతి
నందుచున్నది గాన ♦ నపుడు రాముఁ
డసురులఁ జంపి జ ♦ యంబును బొందఁగా
వీరకులంబున ♦ విశ్రుతమగు

* తంద్పష్ట్వా శత్రుహంతారం మహర్షీణాం సుఖావహమ్-అనిమూలము. దీనికి గోవిందరాజమహేశ్వరతీర్థులు వ్రాసినయర్థ మీసీసమాలికలో నిమిడింపఁబడినదని గ్రహింతురుగాక.

జననంబుఁ గాంచిన ♦ వనితాశిరోమణి
కావున శ్రీరాముఁ ♦ గాంచె; మఱియుఁ
బెనుసంగరమునందుఁ ♦ గనఁబడకయె యుండి
యపుడు చెంతనెయున్న ♦ యమ్మహాత్ముఁ
గనులపండువుగాఁగఁ ♦ గనుఁగొనియెను; రక్త
సిక్తాంగ మెంతయుఁ ♦ జెలఁగుచుండ
స్వేదబిందువులొప్పఁ ♦ బ్రియుఁడైనరాముఁడు
బడలియుండఁగఁ గాంచెఁ ♦ బంకజాక్షి;
జనకజాలక్ష్మణుల్ ♦ చనుదెంతురా యని
యాదిక్కు చూచుచు♦న్నట్టి రాముఁ
గనుఁగొనియెను; మఱి ♦ దనుజులెందఱో తాను
నన్నిరూపంబుల ♦ నమరి దివ్య
మంగళవిగ్రహా♦భంగసౌందర్యంబు
తనరార నున్నట్టి ♦ ఘనునిఁ గాంచె;
నింద్రాదులకు నెల్ల ♦ నెదిరింపఁగారాని
ఖరదూషణాది రా♦క్షసనివహము
నొక్కఁడె పొలియించి ♦ యురుతరజయమొంది
యవలీలఁగా నట ♦ నలరు నాథుఁ
గనుఁగొనియెను; బురు♦షుని యాకృతింబొంది
వనితయె యైనయ♦ల్లునిని నిన్నుఁ
బొంది నాతండ్రి యె♦ప్పొల్కిఁ దలంచునో
యని యవివేకంబు♦నను మును మదిఁ
దానుఁ దలంచిన♦వాని మహాత్ముని
గనుఁగొనియెను; శత్రు♦కాండములను
క్షణమాత్రమునఁ బ్రౌఢ♦శౌర్యంబునం జంపి
తమకు రక్షకుఁడని ♦ తలఁచి తనదు
రక్షకరూపమే ♦ రహిఁ జెలంగఁగవలె
నంచు నెంచెడు ముని♦సంచయముల
కఖిలసుఖమ్ములు ♦ నమరు నట్లొనరించు
కరుణాస్వరూపునిఁ ♦ గాంచి యంత
వైదేహి సంతోష♦వార్ధిఁ దెప్పలఁదేలి
బిగియఁ గౌఁగిటఁజేర్చి ♦ వితతదనుజ
తతి హతమౌటకుఁ ♦ దనమది మిగులంగ
హర్షముంబొంది యా♦యనిమొన నిను

తే. మంతయును గాసిఁబొందక ♦ యాత్మమహిమ
మలర నుండుటఁ గనుచు న♦త్యంతముదము
మఱియుఁ బొందెను; రాక్షస♦మండలంబుఁ
జంపినందుల కలరి మ♦హామును లొగి. ౮౧ 788

క. తనుఁ బూజింపఁగ రాజులు, తనభర్తను జూచి శశివ♦దన జానకి రా
ముని మఱి బిగ్గరఁ గౌఁగిట, నునుచుకొనుచుఁ జాలహర్ష♦మొందెన్ మదిలోన్.

ముప్పదియవ సర్గము సంపూర్ణము.

---

## ౩౧ - వ సర్గము.

అకంపనుఁడు ఖరాదుల మృతిని రావణునకుం దెల్పుట.

తే. ఖరుఁడు తెగినంత రావణా♦సురుని చారుఁ
డగు నకంపనుఁడను దైత్యుఁ ♦ డప్పుడె పోయి
లంకలోనున్న రావణు ♦ లలితశర్మ
పరుని గనిపల్కెఁ, దొందర♦పడుచు మిగుల. ౧ 790

క. విను రాజ! జనస్థానం,బుననున్న సురారినివహ♦ములు హతమయ్యెన్
ఘనబలులు ఖరముఖుల్ ధ,ర్మనిపీటికిఁ బోయి రేను ♦ మునుకొని యెట్లో. ౨

క. శ్రమపడి వచ్చితిఁ జావక, మిముఁజూడగ నన్న వినుచు ♦ మిగులం గ్రోధం
బమరన్ రక్తాంతాక్షము, లమరఁగఁ గనులన్ దహించు♦నట్లు జగములన్. ౩

చ. పలికె నకంపనుం గనుచుఁ ♦ బౌరుష ముట్టిపడంగ బాపురే
పొలిసె నెవండు? రాక్షసుల♦పుంజముతోఁ దగి రమ్యమౌచు ని
మ్ములఁదగు నాజనస్థలము ♦ మూర్ఖుఁ డెవండు హరించె నిజ్జగం
బుల నతఁ డుండఁగాఁ గలదె ♦ పోలఁ దలంచినఁ జోటు రాక్షసా. ౪ 793

క. వినుమా! నాకపకారం, బొనరిచె నేనింద్రుఁడైన ♦ నురుబలుఁడగు య
క్షనృపుండైనన్ యముఁడై,నను గేశవుఁడైన సుఖము♦నం బొదలఁడు సూ. ౫

సీ. నేనన్ననో యము♦నికి యముఁడను నగ్నినిం గూడ దహియింతు♦నిముసమునను
మృత్యువునకుఁ గూడ ♦ మృతిని గూర్పఁగ నేర్తుఁ గ్రుద్ధుండనై తినేఁ♦గోరి నాదు
తేజమ్మునన్ దగఁ ♦ దీక్ష్ణదీధితి నగ్ని దహియింతు జవమునఁ ♦ దనరు వాయు
వునుగూడ నాపనే♦ర్తునటంచుఁ గ్రుద్ధుఁడై పలుకు దశగ్రీవు ♦ పౌరుషంబుఁ
ఆ. గని యకంపనుండు ♦ కరములు మోడిచి
భయమువలనఁ దొట్రు♦పడెడుపలుకు
లను వచించె నిట్టు♦లను గోరువాఁడ నే
నభయ మనిన రాక్ష♦సాధిపుండు. ౬ 795

క. వానికి నభయంబుఁ బొసఁగిన, దానవుఁ డా భయము మాని ♦ దనుజేంద్రునిపై
నూనిన విశ్వాసంబునఁ, దానిట్లని పల్కె మదిని ♦ దత్తఱ తొలఁగన్. ౯ 796

సీ. దశరథభూజాని ♦ తనయుండు రాముఁ డన్వాఁడు గలండు రూ♦పమున నతఁడు
సాటిలేక చెలంగు ♦ సన్నుతింపందగు ప్రాయంబు చెలఁగు వీ♦ర్యమున నతని
కిలసమానులు లే ర♦హీనవృషస్కంధుఁ డగుచు వృత్తాయతం♦బగు భుజద్వ
యంబు చెన్నారంగ♦నాతఁడు పొలుపొందుఁ దత్కీర్తి యసమాన♦తం జెలంగు
తే. సిరిని దులఁదూఁగు నసదృశ♦స్థిరబలంబు
శౌర్యమును దగియుండ నె♦సంగునతఁడె
మనజనస్థాన మంతయు ♦ దనుజవితతి
నని నశింపఁగ దాను జే♦సెను గడంక. ౧౧ 797

క. ఖరదూషణముఖ్యులు చచ్చిరి; నా రాక్షసవిభుండు ♦ చెచ్చెఱ విని భీ
కరకృష్ణసర్పమట్లుగఁ, గర ముచ్ఛ్వాసములు పొలయఁ♦గా నాతనితోన్. ౧౨
తే. విను మకంపన! రాముఁడు ♦ విబుధవర్యు
ననురులను నందఱింగూడి ♦ యాజనస్థ
లమునకున్ వచ్చెనా యేమి? ♦ యమరులఁ దగు
చెలిమి లేకున్న నొకఁడేమి ♦ చేయఁగలఁడు?. ౧౩ 799

క. అన, మరలఁ బల్కె రావణు, ననూనశౌర్యోక్తులెల్ల ♦ నాలించి యకం
పనుఁడు మహాత్ముని రాముని, ఘనబలశౌర్యములఁ జెప్పఁ♦గాఁ దలఁచి మదిన్.
ఆ. పలికె ధనువుఁ బట్టు ♦ వారలలో నగ్రగణ్యుఁ డమలశస్త్ర♦గణవిదుండు
సర్వసుగుణనిధియుఁ ♦ జారుతేజస్వియు, నగును జుమ్ము రాముఁ♦ డసదృశుండు.

సీ. అనిఁ బురందరసముం♦డగు మఱి బలవంతుఁ డయి రక్తనయనుఁడై ♦ యతిగభీర
దుందుభినిధ్వాన ♦ తుల్యకంఠస్వనుం డయి చంద్రబింబాస్యుఁ♦డై చెలంగు
ననుజుఁడు లక్ష్మణా♦హ్వయుఁ డాతనికిఁ గలఁ డట్టి శ్రీమంతుఁడై ♦ యలరు రాముఁ
డవనీశవర్యుఁ డా♦యనుజునితోఁ గూడి వాయుదేవుఁడు హుత♦వహునిఁ గూడి
తే. నట్లు చనుదెంచి దనుజుల ♦ కాశ్రయమగు
నాజనస్థానమును వేగ ♦ నాశముసేసె
నతనికిన్ మాన్యులౌ సుర♦లనఁగ నెవరుఁ
గాని యటవచ్చి తోడ్పడఁ♦గాఁ దలఁపరు. ౧౪ 802

మ. అనుమానంబిను మంతలే దిఁకను గ్ర♦వ్యాదాధిపా! స్వర్ణపుం
ఖనితాంతోగ్రములైన తచ్ఛరము లు♦గ్రవ్యాత్తవక్త్రాహులై
దనుజేంద్రాళి గ్రసించె; సాధ్వసమునం ♦ దారెంతయుం దూలి య
ద్దనుజవ్రాతము లెన్నిత్రోవలను ను♦ద్దామార్తిచేఁ బాఱెనో. ౧౫ 803

[1]సీ. శ్రీరాముఁడే మీఱి ♦ వారికాయాయి త్రోవలముందుగా నిల్చి ♦ వరుసఁ గానఁ
బడుచుండెః ననఘాత్మ! ♦ ప్రబలుఁడై తగు రాముఁ డిట్లు జనస్థాన♦మెల్లనంత
మొందించె; ననిపల్క ♦ సుగ్రవార్తను దాని విని యాజనస్థాన♦మునకు నేను
జనియెద; రామల♦క్ష్మణులను జంపంగ ననిపల్క నయ్యకం♦పనుఁడు దనుజ
తే. పతిసి గని పల్కె రాముని♦బలముఁ బౌరు
షమును నట వారివారికి ♦ సమముగాఁగఁ
గనఁబడినరీతి విడువకే♦ను నిటఁ జెప్ప
వాఁడ వినవయ్య రాక్షస♦వర్య! యిపుడు. ౨౬ 804

[2]సీ. రామచంద్రుండు మ♦ర్యాద మీఱుటచేతఁగోపమొందునయేని♦గుతలమందు
నతనిసాధింపలే ♦ రన్యులెవ్వరుగాని యతులితయశుఁడయి ♦ యమితవిక్ర
మము గల్గి సలిలపూ♦ర్ణముగాఁగ నొప్పిన ఘననదీవేగంబు ♦ ననుపమాన
శరముల నత్యుగ్ర♦శక్తిని నిలుపఁగాఁ గలఁడు; గ్రహాళి న♦క్షత్రవితతిఁ
గ్రాలు నభంబును♦గలవిలపాటొందఁ జేయఁగాఁ దగియుండు♦శ్రీయుతుఁడగు
తే. నతఁడు సంద్రమునన్ భూమి ♦ యంతరించు
నేని దగ నుద్ధరింపఁగాఁ ♦ బూనఁగలఁడ
టంచు వామనునవతార ♦ మటు వరాహ
మూర్తియవతారమును దెల్ల♦ముగఁ దెలియఁగ. ౨౭ 805

క. పలికి యకంపనుఁ డిట్లని, పలికెన్ మరలన్ మహాను♦భావుం డతఁ డు
జ్జ్వలశక్తిగాన సంద్రము, చెలియలికట్టను దగంగఁ ♦ జెండి జగములన్. ౨౮
తే. దాని నీటను ముంచు ను♦ద్దామశరము
లను బ్రయోగించి యంబుధి♦కిని ననిలున
కును జెలంగెడువేగముఁ ♦ గూడ నడపఁ
జాలునని పల్కి మఱియును ♦ లీలఁ బలికె. ౨౯ 807

[3]సీ. సురుచిరయశుఁడైన♦పురుషసింహుఁడతండుశౌర్యంబునన్లోక♦సమితిఁద్రుంచి
మరలఁ గ్రమంబున ♦ మనుజుల సృజియింపఁగను గూడ శక్తుఁడై ♦తనరుచుండు
దశవదనా! స్వర్గ♦తలము పాపులకెల్లఁ బడయరానట్లుగఁ ♦ గడఁగి నీకుఁ
గాని రాక్షసులకుఁ♦గాని యుద్ధంబున నతని జయింపంగ ♦ నలవిగాదు
దివిజదానవు లొక్క♦తీరున వచ్చిన నతని వధింపంగ ♦ నలవి గాద

1 యేనయేన చ గచ్ఛంతి రాక్షసాభయకర్శితాః, తేనతేన స్మ పశ్యంతి రామమేవాగ్రత స్థితః-అనిమూలము. 'అనేన ప్రతిరాక్షసం స్వేచ్ఛాగృహీతదేహత్వం వ్యజ్యతే' అను మహేశ్వర తీర్థాభిప్రాయము తనిశ్లోకిభావము నిటఁ గనఁబఱుపఁబడినది గ్రహింపఁదగు. 2 శృణు రాజన్ యథావృత్తం రామస్య బలపౌరుషమ్......విభుః-అనిమూలము. ఈశ్లోకములకు మహేశ్వరతీర్థుల వారియు, తనిశ్లోకియు భావము నిట నిమిడింపఁబడినదని తెలియఁదగు. 3 ఈపద్యములలో మహేశ్వరతీర్థాద్యభిప్రాయము సంక్షిప్తము.

తే. టంచు సృష్టిస్థితులకు సం♦హారమునకు
నెల్లవేళల నవతార ♦ మెత్తినట్టి
పరుఁడయిన రాముఁడే యను♦భావమొసఁగు
పలుకులను మెల్లఁగా నకం♦పనుఁడు పలికి ౨౭ 808

క. దనుజేశా! నాయాశయ,మును జెప్పితి నింక రామ♦మూర్తి వధింపం
గను దగు నుపాయమును నే, వినిపించెద నేకమతిని ♦ వినుమా వరుసన్. ౨౮

సీ. కలదాతనికి భార్య ♦ విలసితమధ్యను యౌవనమధ్యస్థ; ♦ యనఘ్నశసుగు
ణాభిసేవిత సీత ♦ యనఁగఁ జెలంగెడు సాధ్వీమతల్లిక ♦ సమవిభక్త
సకలాంగసుందరి ♦ జగతిలోఁ గల్గిన కాంతలలో మేలు♦బంతి రత్న
భూషితమృదుదేహ ♦ పొలుచుచునుండును; దేవతలలోన గంధర్వ♦తతులలోన
తే. నచ్చరలలోన దనుజసం♦హతిని నామె, కీడుసేయఁగఁ దగినట్టి ♦ యింతి లేదు
మనుజులందెట్లు గలదను♦మాట పలుక,వచ్చు? గావున దనుజేంద్ర♦వైశమీవు.

క. చని యౌవనమున నంతటఁ, గనుఁగొని యారాముభార్యఁ ♦ గని బలిమిమెయిన్
గొనిరమ్మా, రఘురాముఁడు, వనితామణియందుఁ గామ♦పరతం గనుఁ జూ.౩౦

*చ. కనుక నె సీతఁ బాసి క్షణ♦కాలము తా బ్రదుకంగఁజాలకా
మనుజవరుండు ప్రాణముల ♦ మాననటంచు వచింప నంతటన్
దనుజవిభుండు దీర్ఘభుజ♦సర్పుఁడు రావణుఁ డయ్యకంపనో
క్తిని విని మున్ను తాను ముని♦కీర్తిత వార్తనెఱుంగుఁ గావునన్. ౩౧ 812

తే. మదిని జక్కఁగ యోజించి ♦ మంచిదనుచు
నయ్యకంపనుతోఁ బల్కె ♦ నల్లి నేనొ
కఁడనె ప్రొద్దున సారథిఁ ♦ గలిసి పోయి
సంతసంబున నీవన్న♦చందముననె. ౩౨ 813

తే. రాముపత్నిని గొనితెత్తు ♦ రమణ నిమ్మ,హాపురంబున కనిపల్కె ♦ మఱ్ఱరితి
వెలసి యశ్వతరంబుల ♦ బలితభంగిఁ, బూన్చియున్నరథంబుపైఁ♦బూన్కినెక్కె.

---

* చింతయిత్వా మహాబాహు రకంపన మువాచహ-అనిమూలము. దీనికి గోవిందరాజులు ముక్కస్యముకాృ-ర్థః అనునట్లు వ్రాసిరి. మహేశ్వరతీర్థులవారు చక్కఁగా దీనిభావమును వివరించిరి. రావణుఁడు బోధార్థియై సనత్కుమారునియొద్దకుంబోయి మునీంద్రా! "దైత్యదానవరక్షాంసి యే హతా స్సమరేఽరయః, కాంగతిం ప్రతిపద్యంతే కేన తే హరిణాహతాః" అని ప్రశ్నించెను. మహర్షియు, "యేయేహతా శ్చక్రధరేణ రాజన్ త్రైలోక్యనాథేన జనార్దనేన, తేతే గతా స్తన్నిలయం నరేంద్రాః క్రోధోఽపి దేవస్య వరేణతుల్యః. శ్రుత్వా తత స్తద్వచనం నిశాచర స్సనత్కుమారస్య ముఖా ద్వినిర్గతం, తదా ప్రహృష్ట స్సబభూవ విస్మితః కథంను యాస్యామి హరిం మహాహవే". ఇత్యాదిప్రమాణముల ననుసరించి దశకంధరుఁడు సీతను దొంగిలించుట తనకు భగవత్సాన్నిధ్యప్రాప్తికొఱకే కాని యింకొక హేతువునకుఁ గాదని స్పష్టపఱచిరి. ఆభావమే యిట

క. దిక్కుల వెలిఁగించుచుఁ జనె, నక్కరణిన్ దనుజనాథుఁ ♦ డారథ మెక్కం
జక్కనియరదం బడి పెం,పెక్కనగతి నభమునందు ♦ నెసఁగుచుఁ జనుచున్.

చ. జలధరమందు వెల్గు శశి♦చందమునన్ వెలుగొందుచుండె ని
ట్లలరుచుఁ దాటకాతనయు ♦ నాశ్రమ మొయ్యనఁజేరి యందు ను
జ్జ్వలమగు తేజు డిగ్గి సుర♦సంఘము భీతిల లోని కేగె; ని
శ్చలహృదయంబునన్ దపము ♦ సల్పెడునాతఁడు ప్రీతిమీఱఁగన్. ౩౧ 816

చ. దనుజవరేణ్యు రాకఁ గని ♦ తాను నెదుర్కొని స్వాగతోక్తులన్
మనుజుల కందరానివగు ♦ మంచిపదార్థములన్ సురారి రా
జును నలరించి యాసనము ♦ చూపి యథావిధి నర్ఘ్యముఖ్యపూ
జనము లొనర్చి యిట్లనియెఁ ♦ జక్కనియర్థము గల్గు మాటలన్. ౩౨ 817

క. దనుజేంద్రా! కుశలమె కద, దనుజుల కందఱికి నిప్డు ♦ తమరిటు వేగం
బున వచ్చుటచే సంశయ,మును బొందితి నాదుస్వాంత♦మున నని పలుకన్.

సీ. మారీచుఁ డన్న య♦మ్మాటల నాలించి వాక్యకోవిదుఁడయి ♦ భవ్యతేజుఁ
డగు రావణుం డిట్టు ♦ లనియె నాతనితోడ నక్లిష్టకర్ముఁడై ♦నట్టి రాముఁ
డకట! నాకారత్న్యుఁ♦డైన ఖరాసురుఁ జంపెఁగా వధియింప ♦ సాధ్యపడని
యాజనస్థానంబు♦నందున్న దనుజుల నందఱ వధియించె ♦ నాహవమున

ఆ. నతనిభార్య నేను ♦ నపహరింపఁగ నున్న,వాఁడ బంధుజనుల ♦ వైరికోసఁగి
యొంటినున్న నాకు ♦ నుద్ధతి సాహాయ్య, మీవు చేయవలయు ♦ నిట్టిపనికి ౪౦

క. అని దనుజేంద్రుం డాడిన, విని మారీచుండు పలికె ♦ వినవయ్యా! మి
త్రునిరీతి నున్నశత్రువు, జనకజ యనుమాట నెవఁడు ♦ చక్కఁగఁ జెప్పెన్.

ఆ. నిన్ను రూపుమాప ♦ నిక్కంబుగా నెంచి, నట్టి డాయ యెవ్వఁ ♦ డామెపేరు
నీకుఁ జెప్పె? నెవఁడు ♦ నీచేఁ దిరస్కృతుం,డగుచు నోర్వఁ డెవ్వఁ♦డసురనాథ.

సీ. నీసుహైశ్వర్యంబు ♦ నిశ్చలమగుటకు నెవఁడోర్వకున్నవాఁ ♦ డిపుడు చెప్పు
సీతనిచ్చుటికిఁ దె♦మ్మాతఱే నని నీకుఁ జెప్పువాఁ డెవ్వఁడో ♦ చెప్పు నాకు
దనుజనాయకుల సం♦తతికెల్ల శృంగంబ వే యగు నినుఁ జంప♦నెవఁడుతలఁచె
నికార్యమునకు ని♦న్నెవ్వఁడు పురికొల్పెనో యతండే నీకు ♦ నుగ్రవైరి

ఆ. సంశయంబు లేదు ♦ సమధిక క్రూరస,ర్పంబునోటినుండి ♦ ప్రౌఢదంష్ట్ర
నిక్క మెవఁడు చెపుము ♦ నీచేతఁ బెఱికించు,చున్నవాఁడు? తేఁడ♦నన్నుతయశ.

క. నిను నెవ్వఁ డిట్టికార్యం,బునఁ జెడు మార్గంబు నిపుడు ♦ పూనఁగఁ జేసెన్
దనుజేంద్ర సుఖముగా ని,ద్రను బొందెడు నీశిరస్సుఁ ♦ దగ నెవఁ డడఁచెన్.

సీ. పరిశుద్ధసద్యశో♦వంశప్రసూతియే యగ్రహస్తంబుగ ♦ నతిశయిల్ల
నతులితంబైన శౌ♦ర్యంబె మదోదకమట్లు పొసంగఁగా ♦ హారిదీర్ఘ

బాహుయుగంబె వి♦భాసురదంతంబులుగ వన్నెగులుకఁ జె♦ల్వొనఁ జెలంగు
నట్టి శ్రీరాఘవుం♦డను గంధగజముండు దాని నీదేశయు♦ద్ధములఁ దేటి
తే. చూడనైన నశక్యమే ♦ సుమ్ము యుద్ధ
మింక నెవ్విధిఁ జేయనౌ ♦ శంకవలదు
రామగంధద్విపేంద్రము♦రాతిసైన్య
తృణములం జిమ్మివైచు నూ♦నృతము సుమ్ము. ౪౬ 824

సీ. అనిమొన నిల్చుట ♦ యనునదియే సంధి వాలాగ్రముగఁ గ్రాల ♦ బాణతతియె
వితతనఖాద్యంగ♦వితతియై వెలయంగ నిశితాసిదంష్ట్రలు ♦ నిక్కుచుండఁ
బటుతరదానవ♦పంక్తిమృగావళిఁ జంపెడి శ్రీరామ♦చంద్రసింహ
మిప్పుడు నిద్రించి♦యే యున్న దద్దాని బోధింపఁదగదు వి♦భూ! శరాస
నాయతగ్రాహవి♦హారమై భుజవిచ్యుతాంబక వేగపం♦కాన్వితమయి
తే. శరతరంగసమూహమై ♦ సమరరూప
సలిలసంపూర్ణమై సాధ్వ♦సంబు గలుగ
నమరు రఘురామ బిలముఖ♦మందుఁ బడుట
తగదు తగదిది తగదయ్య ♦ దనుజవర్య! ౪౭ 825

సీ. లంకాధినాథ! క♦లఁతను మానుము రాఘవునియెడ నింక నో♦దనుజనాథ
లంకకు శుభమగు ♦ నింకఁ గలఁతను మానుము లెస్స పొమ్ము, పు♦రమున నీవు
దారలఁ గూడి ని♦త్యము క్రీడనల్పుము భార్యాన్వితుండయి ♦ వనములందు
విహరించుఁగాక యా♦పృథ్వీశసూనుండు; రాముఁడంచనిపల్క ♦ రావణుండు
తే. తాటకాసుతుమాటలఁ ♦ దగినవనుచు, విని జవంబున మరలిపు♦రిని గనఁజని
తనగృహోత్తమముంబొంది ♦ ఘనసుఖైక, నిష్ఠతో నుండె జానకీ♦నిరతి మాని.

ముప్పదియొకటవ సర్గము సంపూర్ణము.

---

## ౩౨ - వ సర్గము.

శూర్పణఖ లంకకుం బోవుట.

క. తరువాత శూర్పణఖ రఘు,వరుఁ డొక్కఁడె దూషణాది ♦ వరరాక్షసులన్
నిరుపమభీకరశౌర్యులఁ, బరజనకాలాంతకులగు ♦ వారల నెల్లన్. ౧ 827

క. పదునాల్గువేలమందిని, గదనమునం ద్రుంచివైవఁ♦గాఁ గన్గొని వా
రిద మట్లుగ గర్జిల్లెను, మదిఁదలఁచెన్ భీకరాంగి ♦ మఱియున్ వగతోన్. ౨

క. ఒరుల కసాధ్యంబగు భీ,కరకృత్యముఁ జేసెఁగాదె ♦ త్యాకాంతుఁ డిఁకే
కరణిం బ్రతికృతిఁ జేయఁగఁ, దరమగుననని భయమునొంది ♦ తత్తఱపడుచున్. ౩

క. దనుజేంద్రపాలితంబయి, తనరారెడు లంక కరిగి ♦ తాఁ బుష్పకమం
దున నున్న దీప్తతేజుని, గనితోన్ రావణుని దనుజ♦కాంతుని నచటన్. ౪

ఉ. చేరువ మంత్రిసత్తములు ♦ చేరి సువార్తలఁ జెప్పుచుండ గం
భీరనినాదము ల్వెలయ ♦ భీకరదైత్యులు కొల్చుచుండ దై
త్యారిగణంబుతోడి యమ♦రాధిపుచందమునన్ వెలుంగు లం
కారమణున్ దశాననుని ♦ గంజసఖప్రతిమాన తేజునిన్. ర౪ 831

సీ. కనకదివ్యాసనం♦బునఁ గూరుచుండి సువర్ణవేదికయందు ♦ బరవసమున
నాజ్యము వేల్వఁగాఁ ♦ బ్రాజ్యతేజంబునఁ బ్రజ్వలించెడు హుత♦వహునిరీతి
వెలుఁగుచు దేవతా♦వితతులకుంగాని గంధర్వతతులకుఁ ♦ గాని భూత
ములకుఁగాని మహోమ♦తులగు మానులకును గాని జయింపంగఁ ♦ గాక యనిని

తే. శౌర్యమున మించి వ్యాత్తాస్య♦శమనురీతి
భయదరూపంబునం బొల్చి ♦ బవరమందు
నింద్రవజ్రకృతంబులై ♦ యొసఁగు వ్రణము
లంగమునఁ బొల్పుమీఱంగ ♦ నమరువాని. ౬౪ 832

క. శతమఖగజదంతాగ్ర, క్షతకిణవక్షుని మఱియుఁ ♦ గరములు తగ విం
శతి యొప్పు దశశిరస్సులు, జతగా నొప్పాఱ ఛత్ర♦చామరములతోన్. ౭౪ 833

చ. అలరి విశాలవక్షమున ♦ నందముఁ జూపుచు, రాజలక్షణం
బులఁ దగి, వీరుఁడై, కరగి ♦ పోసిన బంగరుకుండలంబులన్
జెలఁగి, విదూరదేశమునఁ ♦ జెన్నగు రత్నములొప్పు హారపం
క్తులు చెలువార, బాహువుల ♦ కూటము వింతగఁ గ్రాలుచుండఁగన్. ర 834

సీ. శుక్లదంతంబులు ♦ శోభిల్ల, వివృతాస్య మరుదుగాఁ గన్పడ, ♦ నద్రిపోల్కి
నాయామము విశాల♦మైన యంగము తగ, దేవయుద్ధంబున ♦ దేవదేవు
చక్రక్షతంబులు ♦ శతవారములు తాఁకఁ బెక్కుసంగరములఁ ♦ బృథుతరాయు
ధక్షతంబులు సోఁకఁ ♦ దాళినధైర్యంబు వెలయఁగా దేవతా♦వితతశస్త్ర

తే. బాణవివిధక్షతంబులఁ ♦ బటుతఁ గనిన
తనువు వెలయఁగఁ గలఁతను ♦ గనఁగఁజేయఁ
దరముగాని సముద్రసం♦తతిని గలఁచి
పుచ్చఁగలశక్తి యుక్తులు ♦ పొలుపుమీఱ. ౧౧ 835

క. మనసునఁ దలఁచినకార్యం,బును దోడనె తీర్చుశక్తి ♦ పొలయఁగ; భూభ్రా
ళిని నెగఁజిమ్ము పరాక్రమ,మున వెలయుచు సురలఁ గొట్టి♦ముదముంగనుచున్.

తే. ధర్మములఁ గూల్చి యన్యుల ♦ దారలఁ జెఱ
బట్టి వివిధాస్త్రములఁ బట్టి ♦ వైవ నేర్చి
యజ్ఞములకెల్ల విఘ్నంబు ♦ లాచరింపఁ
జాలి భోగవతీపురి ♦ లీలఁ జేరి. ౧౨౪ 837

సీ. వాసుకి నోడించి ♦ వఱలు తక్షకుప్రియ భార్య హరించి య♦బ్బంగి వెండి
కొండకుఁ జని యందుఁ ♦ గూడఁ గుబేరుని గెలిచి కామగమయి♦వెలయుపుష్ప
కవిమానవర్యంబుఁ ♦ గైకొని కౌబేర మగు చైత్రరథమును ♦ నతనిసరసు
నింద్రునందనమును ♦ నితరామరులవగు నుద్యానముల నెల్ల ♦ నొక్క కీతి
తే. వీర్య మలరారఁ గోపంబు ♦ విస్తృతిఁగనఁ
జెండి, మఱియును భూధర♦శిఖరము వలెఁ
గ్రాలుచుఁ బరంతపులు జగ♦త్కారణులగు
[1]పుష్పవంతులు పొడసూపఁ ♦ బోయి యపుడు. ౧౬ 838

క. కరములఁ బట్టుచు నిల్పుచు, నిరుపమధైర్యమున నున్న ♦ నిజబలదనుజరా
డ్వరునిం గనియెన్ మఱియుఁ, సురవైరి యతండు మున్ను ♦ ఘోరత్వమునన్.
క. పదివేలవత్సరమ్ములు, సదమలతప మాచరించి ♦ స్వశిరంబులఁ దా
నె దగం ద్రుంచుచు వానిన, సదయుని నజుఁ బూజచేసెఁ ♦ జక్కనిభక్తిన్.

తే. మనుజు నొక్కనివలనఁ ద♦ప్పనితరసుర
దనుజ గంధర్వ భోగి ప♦తంగవితతి
వలన మఱియుఁ బిశాచాళి♦వలన మృతియుఁ
గలుగదని లోన నతని కె♦క్కరణినైన. ౧౯ 841

సీ. ఆమహాబలశాలి ♦ యజ్ఞమ్ములందు బ్రాహ్మణులచే మంత్రాళి ♦ నమరుపఁబడి
పావనంబయి యతి♦భవ్యమౌ సోమము పాడుచేయును; మహా♦ధ్వరములు విధి
వంతంబులుగ సాగి ♦ బ్రాహ్మణులకు దక్షిణల నిచ్చుతఱి వాని ♦ నాశమొందఁ
జేయుఁ, గ్రూరుండయి ♦ చెలఁగుచు బ్రహ్మహత్యలు చేయుదుష్టప్రవృ♦త్తమునఁ దిరుగు
తే. నిర్దయుఁడు కర్కశుండునై ♦ నిఖిలజనుల
కెపుడు హానియె చేయంగ ♦ నెంచు, భూత
వితతి నేడ్పించుచుండును ♦ వెఱపు సకల
జగములకుఁ గల్గఁజేయును ♦ సతత మతఁడు. ౨౦ 842

క. శూరుండయి పృథుబలుఁడై, యేరీతిని సాటిలేక ♦ యెసఁగు నతనిలం
కారాజ్యపాలకుని దగ, నారావణుఁ గనియె నచట ♦ నన్నను వగతోన్. ౨౧
చ. సురుచిరవస్త్రమాల్యపరి♦శోభితుఁడై నవరత్నభూషణో
త్కరముల మించి పీఠమునఁ ♦ దద్దయు వేడుకఁ గూరుచుండి సం
హరణమునందు నొప్పు యము♦నాకృతిమీఱఁగ మంత్రిపుంగవుల్
నిరతము గొల్వఁగా నలరు ♦ నిస్తులశౌర్యుని రాక్షసాధిపున్. ౨౩ 844

చ. అలరు పులస్త్యవంశమున ♦ కందముఁ గూర్చినవాని శత్రుపం
క్తులఁ బొలియించువాని రణ♦కోవిదు రావణుఁ గాంచి చెంతకి

1 పుష్పవంతులు = చంద్రసూర్యులు.

మ్ములఁ జని భీతి విహ్వలతఁ ♦ బూని వచించె; సురారికాంత! యె
వ్వలనను భీతిలేకయె య♦వార్యగతిన్ జరియింపఁ జాలియున్. ౨౮ 845

ఆ. అనుపమానచిత్తుఁ ♦ డగు లక్ష్మణునిచేతఁ, గృతవికార యగుచు ♦ నెసఁగుభీతి
మోహములను సోలి♦యూహింప బెడిదమౌ, విధమునన్ వచించె♦వింతనుడుల

ముప్పదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## 33 - వ సర్గము.

### శూర్పణఖ రావణుని దూఱుట.

క. దనుజాంగనయు విరూపిత,యు నగుచు దుఃఖమున మంత్రు♦లొప్ప నడుమలో
కనిచయభీకరుఁ డగు న,ద్దనుజేశుని జూచి క్రోధ♦దర్పిత యగుచున్. ౧ 847

క. పరుషోక్తుల నిట్లనియెన్, నిరంకుశత్వమున జగతి ♦ నీవు ముదమునన్
బరఁగుచు నిష్టముగొలఁదిగ, స్మరసుఖములఁ జిక్కియుందు ♦ సతతము లంకన్.

క. పెనుభయము రాఁ గడంగెడు, ఘనచారులవలన దాని♦మాట విరివిగాఁ
గనుఁగొనఁదగి యుండిన నో,య్యనఁ దెలిసికొనకయె యుంటి♦వతిమత్తుఁడవై.

తే. గ్రామ్యసుఖములకుం జిక్కి ♦ కామవృత్తుఁ
డగుచు లుబ్ధుఁడునై యున్న ♦ యవనిపతిని
ప్రజలు మర్యాదఁజూపక ♦ వల్లకాటి
యగ్నివలెఁ జూతు రెప్పు డో♦యన్న వినుము. ౩ 850

ఆ. తగినకాలమందుఁ ♦ దనకార్యములఁ దానె
చేసికొననిరాజు ♦ చేయఁదగిన
కార్యములనె గాంతు ♦ క్షమగూడఁ బోఁగొట్టు
కొనుచుఁ దా నశించు ♦ దనుజనాథ. ౪ 851

సీ. నదియందు మెలఁగరా♦నిది యయి లోకువ కానిదై కంటికిఁ ♦ గానఁబడని
దై యున్నకర్దమ ♦ మందుఁ జిక్కుదుమని దానిదూరముననె ♦ దంతిగణము
వదలునట్లుగఁ జార♦వర్గంబు నియమింపకయు యుక్తమైనట్టి ♦ కాలమందుఁ
బ్రజలకుఁ గొల్వీన ♦ భవ్యదర్శన మీయకయె వనితాది సం♦గతిని జిక్కి

తే. బుద్ధిమాలిన రాజును ♦ బూని విడుతు
రెల్లప్రజలును దారు న♦శ్లే నశింతు
మనుభయంబున స్త్రీవశ్యు ♦ లగుచు సరిగ
రాజ్యముల నేలలేని ధ♦రారమణులు. ౫ 852

క. పరివృద్ధిఁ బొందుచున్నను, నసుదుగ నబ్ధిన్ మునింగి♦నట్టి మహీధ్రో
త్కరమువలెన్ భాసిల్లరు; సురగంధర్వులును రాక్ష♦సులు నీకెపుడున్. ౬ 853

క. ప్రతికారము సేయుటకే, సతతముఁ దలపోయుచుంద్రు ♦ చారుల నాయా

హితకృత్యముల నియోగించి తగఁ సంగతులనెల్లఁ ♦ జిత్తం బలరన్. ౯౯

తే. తెలిసికొనకయె విషయవాం♦ఛలమునింగి
యున్నవాఁడవు నీవెట్టు ♦ లుర్విని యు
కత్వమును నిల్పుకొనెదవో ♦ కాని యెఱుఁగఁ
జాలకున్నాను; దనుజేశ! ♦ సతతమీవు. ౭ 855

క. బాలస్వభావ మలరఁగ, నీలీలన్ బుద్ధిలేక ♦ యే తెలియంగాఁ
జాలిన ముఖ్యాంశమునన్, బాలిశ! నెఱుఁగకయె యున్న♦వాఁడ విదేమో.

క. ఏరీతిరాజుగాఁ ద్రిదశారి! నీవుండఁగలవో ♦ యవనీపతు లె
వ్వారలు కోశము నీతినిఁ, జారులఁ దమపనుల నిల్పఁ♦జాలరొ వారల్. ౯౯ 857

సీ. జయశీల! సామాన్య♦జనతుల్యులగుదురు; చారులవలననే ♦ దూరమందు
జరగినవిషయాళి ♦ నిరతము రాజులు కనుచుండ్రు గాననే ♦ క్షమను [1]దీర్ఘ
చక్షువు లనుపేర♦నక్షయంబగు ఖ్యాతిఁ బడయుచుందురు; నీవు♦బంధువులగు
ఖరదూషణాదిరా♦క్షసులు జనస్థానవాసులు హతులైన♦వార్త నెఱుఁగ

తే. కున్నవాఁడవు కావున ♦ నన్న! నీవు
చారులను నిర్ణయింపక ♦ సచివవితతిఁ
బ్రాకృతంబును గూడిన♦వాఁడ వనుచుఁ
దలఁచుచున్నాను బెక్కులు ♦ పలుకులేల. ౧౧ 858

చ. నిరతము క్రూరకర్ములగు ♦ నీజనముల్ పదునాల్గువేలు, నా
ఖరుఁడును దూషణుండు నొక♦క్ష్మాపతిపుత్త్రునిచేతఁ జచ్చిరో
సురరిపునాథ! రాఘవుఁడు ♦ శోభనకర్మరతుండు మానిభూ
వరులకు మాటయిచ్చె నొక♦భంగి భయంబిఁక లేదటంచొగిన్. ౧౨ 859

తే మఱి జనస్థానమంతయు ♦ మహితశక్తిఁ
జెండి దండకమెల్లను ♦ క్షేమకరము
గా నొనర్చెను; జారాది♦గణమునకును
వాంఛితములీయ ద్రవ్యలో♦భమునఁ జిక్కి. ౧౩ 860

క. అతిశయముగ మత్తుఁడవై, నితంబినుల కట్టెచిక్కి ♦ నీవుండుట స్వ
స్థితివిషయజభయము సముద్గతి రానున్నదని గూడఁ ♦ దగ నెఱుఁగవు నూ.

సీ. అల్పదాతను గ్రూరు ♦ నధికమత్తుని గర్వితుని శఠు నిట్టిరా♦జును సమస్త
పరిజనుల్ ఘోరవి♦పత్తు వచ్చినతఱి రక్షింపఁబూనరు ♦ రాక్షసేశ!
యతిమాని నగ్రాహ్యు ♦ నాత్మసంభావితు నతిశయక్రోధుని ♦ నవనినాథు
నాపదలందును ♦ నతనిజనుల్ వానినే సంహరింతురు ♦ హితము మాని

ఆ. ధరణీనాథుఁ డెవఁడు ♦ తగినకాలములందుఁ
గార్యములను జేయ♦కయె భయంబు

---

1 రాజానో దీర్ఘచక్షుషః-అనిమూలము.

వచ్చుతఱిని భీతి♦పడకయుండునో యాతఁ
డాత్మగర్వ ముడిగి ♦ యవనిఁ బాసి. ౧౬	862

క. తలఁపఁగఁ దృణతుల్యుండై, యిల గౌరవహీనుఁడగును ♦ నెండినకాష్ఠం
బుల, లోష్ఠంబుల, రజములఁ, గలుగం దగియుండు నొక్క ♦ కార్యంబైనన్. ౧౭

ఉ. అంతియకాని రాజ్యరమ ♦ నంతయుఁ బాసినయట్టి యాధరా
కాంతులచేత నల్పమగు ♦ కార్యము గల్గదు; మున్ను తాల్చి తా
రంతటఁ బ్రీతిమాని విడి♦నట్టి స్వవస్త్రము వాడిమోడ్పుచే
నుంతయుఁ గాంతిలేకునికి ♦ సొంపువహింపని పుష్పసంతతుల్. ౧౮	864

ఆ. పనికిరానియట్లు ♦ భ్రష్టరాజ్యుండగు, పతియు శక్తిఁ జాలఁ ♦ బ్రబలియున్నఁ
బనికి రాకయుండుఁ; ♦ బార్థివుం డెవ్వండు, తాఁ బ్రమాదపడక♦తత్వమెఱిఁగి.

క. కృతమెఱిఁగి నిర్జితేంద్రియ, మతియయి ధర్మస్వభావ♦తం దగునో యా
క్షితిపతి బహుకాలము సుఖ,వితతిగ రాజ్యంబునేలు ♦ విక్రమధుర్యా. ౨౦

సీ. జనపతి యెవఁడు మాం♦సచుఁజక్షువుల మూసి నిదురించుచున్నను ♦ నీతినయన
మును మూయ కద్దానఁ♦గనుచుండునో వ్యక్తకోపప్రసాదుఁడై ♦కొమరుమిగుల
నలరునో యాతం డ♦ఖిలమానవులచేతఁ బూజితుండగు సర్వ♦భూతనాథ!
యాజనస్థానంబు♦నందలి దనుజాళి వధియింపఁబడుట సే♦వకులవలన

తే. నింకఁ దెలియకయున్నాఁడ ♦ వీవు కాన
దుష్టమతివగు నీకిప్డు ♦ శిష్టయోగ్య
గుణము లివి లేవు; ప్రతిపక్ష♦కూటమం దు
పేక్షఁ గనువాఁడ వనుటయు ♦ విదితమయ్యె. ౨౧	867

క. పరులను నవమానింతువు, నిరతము విషయేచ్ఛలందు ♦ నీవు తగిలి త
త్త్వరతిని సమయవిషయముల, గురుబుద్ధిం బొంద కీవు ♦ గుణహీనుఁడవై. ౨౨	868

తే. తారతమ్యమెఱుంగక ♦ భూరిసుఖము
లందుచున్నాఁడ వటుకాన ♦ నధిక వేగ
ముననె రాజ్యంబుఁ బోఁగొట్టు♦కొని యిడుములఁ
బడఁగఁగలవని సోదరి ♦ పలుకుటయును. ౨౩	869

క. ధనదర్పబలము లలరెడు, దనుజాధీశుఁడు స్వదోష♦తతుల నిటులు చె
ప్పినవాని బుద్ధినెంచుచు, *ఘనముగ యోజించెఁ జాల♦కాలము పూన్కిన్.

ముప్పదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

* విచింతయామాస చిరం సరావణః-అని మూలము.

## ౩౪ - వ సర్గము.

{ రావణునితో రామాదుల సౌందర్యములను వర్ణించి శూర్పణఖ సీత నపహరింపఁ బురికొల్పుట. }

చ. ఖరముఖదానవాత్యయముఁ ♦ గామిని చెప్పఁగ నాలకించి భీ
కరమగు కోపమూని దశ♦కంఠుఁడు కోపము మించుచుండఁగాఁ
బరుషతరోక్తులాడుచును ♦ బంతముఁ దీర్పఁగఁ బూనియున్న సో
దరిఁ గని మంత్రులెల్ల వినఁ ♦ దాను వచించెను ఘోరభంగిఁగన్. ౧ 871

మ. ఎవఁ డా రాముఁడు వీర్యరూపము లవే ♦ యేరీతిఁగాఁ బోల్చ నె
ట్టివిధంబై తగుఁ దత్పరాక్రమము లె♦ట్టిం డ్రైనఁ జేరంగ రా
నివిధంబై యలరారు దండకము దా♦నిం జొచ్చెనో యేల? యే
[1]మివరాస్త్రంబును బట్టి దానవులఁ, దా ♦ మించన్ వధించెన్ గడున్. ౨

క. ఖరునిం ద్రిశిరుని దూషణుఁ, బరిమార్చె నె? బాహువీర్య♦పటుశౌర్యములన్
దరుణీ! చెపుమా యనఁగాఁ, బరుషతరక్రోధ మొప్ప ♦ బరపసమలరన్. ౩

క. రామునిఁ గలరూపున నుద్దామధ్వని వెలయఁ జెప్పఁ♦దలఁచి పలికె; నా
రాముఁడు దశరథసూనుం, డామహితసుదీర్ఘబాహు ♦ వయి తగుఁ జుమ్మీ. ౪

చ. కనులు విశాలముల్ రుచిర♦కామునిరూపముఁ బోలి యందమౌ
తనువు చెలంగు వల్కలవి♦తానముఁ గృష్ణమృగాజినంబుఁ దా
ల్చును గనకాంగదంబు నగు♦చున్ సురరాజు ధనుస్సుఁ బోలి యొ
ప్పిన ఘనచాప మెక్కిడుచు ♦ వేడుకలాగి మహాబలంబునన్. ౫ 875

క. పెనుగరళ మొప్పు సర్పము,లను బోలిన దీప్తశరము♦లన్ విడుచును జు
మ్మని ఘోరశరగ్రహణం,బును దన్మోచనము చాప♦మును వంచుటయున్. ౬

క. కనఁబడ దెవ్వరికైనన్, [2]విను మింద్రుఁడు గురియు నశ్మ♦వృష్టియు సస్యం
బును మాడ్చునట్లు శరవృష్టిని సైన్యముఁ జంపుచుంట ♦ చిత్రము గాఁగన్.

చ. కనఁబడుచుండె నాకు విను ♦ గాదిలిసోదరుఁడా! పదాతియై
తనరెడు రాముఁ డొక్కఁడె ని♦తాంతభయంకరమార్గణాళి పెం
పునఁ బదునాల్గువేల దితి♦పుత్త్రుల భీకరరూపులన్ వధిం
చెను, ఖరదూషణాదులను ♦ జిత్రముగా ననిఁ జంపె నక్కటా. ౮ 878

[3]క. అలయక రెండున్నఁ గడి,యలలో నిక్కార్యమెల్ల ♦ నాతఁడు చేసెన్
బలుపల్కు వేల మునిగణ,ముల కభయం బొసఁగి గహన♦మును నభయముగన్.

క. ఒనరించినాఁడు స్త్రీవధ,మున దోషంబంచుఁ గొంకి ♦ మునుకొని మహితం
బనఘమునగు నాత్మను బో,ల్చినరాముఁడు విడిచె నన్నుఁ ♦ జెప్పన్ సిగ్గౌ. ౧౧

---

1 ఆయుధం కించ రామస్య నిహతా యేన రాక్షసాః-అనిమూలము. 2 ఇంద్రేణేవోత్తమం సస్యం మాహతం త్వశ్మవృష్టిభిః-అనిమూలము. 3 అర్ధాధికముహూర్తేన-అనిమూలము.

క. శ్రమపడి యెట్లో వచ్చితి, సుమహితతేజుండు చాల♦శూరుఁడు గలఁడో
క్రూరమహోత్ముఁడు తమ్ముండు గుణమండితుఁడు లక్ష్మణుం డ♦నఁగ విశ్రుతుఁడుగ.

క. అనురక్తుఁడు భక్తుఁడు సు, మ్మనఘుం డతఁ డసురనాథ! ♦ యతిశయకోపం
బున నొప్పి దుర్జయుండయి, ఘనశౌర్యము మీఱఁ బొల్చుఁ♦గమ్రగుణుండై

తే. విజయశీలుఁడు బలశాలి ♦ విమతహరుఁడు
భ్రాతకుఁ గుడిబుజమును ♦ బాహ్యమైన
ప్రాణమును నగు నిత్యంబు ♦ భక్తినల్పు
చుండు నాతని తెఱఁగిట్టు ♦ లొప్పుచుండు. ౧౩ 883

సీ. కలదాతనికిఁ బ్రియ♦కాంత విశాలాక్షి పూర్ణేందుసదృశాస్య ♦ పూతశీల
భర్తృప్రియంబునె ♦ పాటించు నిల్లాలు సొగసైన నెఱికురుల్ ♦ సొంపునింప
సురుచిరనాసిక ♦ శోభిల్ల నూరువుల్ బెడగునూపఁగ సుత♦ప్రియసురూప
మలరార విఖ్యాతి ♦ నందుచు నాదండకారణ్యదేవత ♦ యనఁగ నపర

ఆ. లక్ష్మియనఁగ విమల♦లక్షణములచేత, వెలయుచుండుఁ బుటము ♦ పెట్టినట్టి
కనకవర్ణమలర♦గను నరుణోన్నత, నఖములొప్పఁ జెలఁగు ♦ నాతిమిన్న. ౧౪

క. వనిత యది సీతయనఁగాఁ, దనరారు విదేహవిభుఁడు ♦ తనయఁగఁ బెంచెన్
గనుకన్ వైదేహి యనం,గను విఖ్యాతిం దనర్చెఁ ♦ గ్రవ్యాదపతీ. ౧౬ 885

తే. యక్షగంధర్వసురకిన్న♦రాంగనావి, తతిని జానకిఁ బోలిన♦దానిఁ జూడ
లేదు; మఱి భూతలంబున ♦ లేదటంచుఁ, జెప్పవలయునె? యిదివఱ ♦ కెప్పుడేని.

చ మనుజులలోనఁ గంటి నను♦మాటను జెప్పఁగ నోరురాదు సూ
జనకజఁ గౌఁగిలించుకొన ♦ సమ్మతినొందకయున్నమానె నె
వ్వనికిఁ గళత్రమౌనొ యల♦భవ్యమునీషుఁడు లోకపంక్తిమిం
చినవరశర్మముల్ వడయు; ♦ సీతయు భార్యయె గాకపోయినన్. ౧౮ 887

తే. ఎవనినొకమాఱు కౌఁగిట ♦ నెలమినుంచు
కొనునొ వాఁడు శచీపతిఁ♦గూడ మించి
బ్రదుకు, నాసీత సాధుస్వ♦భావయుక్త
యాపె దేహము శ్లాఘ్యమై ♦ యలరియుండు. ౧౯ 888

సీ. తత్తుల్యమైన సౌం♦దర్యంబు భూలోకమందు లే దట్టిదా ♦ సుందరి తగి
నట్టిభార్యయె నీకు ♦ నగుఁజుమ్ము నీవును దగినభర్తవె యల ♦ తరుణికరయ
విస్తీర్ణజఘనయై ♦ [1]పృథుతరశ్రోణీపయోధరయయి చెలు♦వొప్పుమోము
భాసిల్ల వెలయు నా♦పడఁతిని నీకు భార్యఁగ నుండునని తేఁ బ్ర♦యత్నమేను

తే. జేసితిని రావణా! యేమి♦చెప్పుదాన, నట్లు యత్నింపఁబోవఁ గ్రూ♦రాత్ముఁడైన
లక్ష్మణుఁడు నన్ను నిట్లు వి♦లక్షణవతిఁ, జేసెఁగాదె విరూపఁగా ♦ నీసుపూని.

1 పీనశ్రోణీపయోధరామ్-అనిమూలము.

క. పరిపూర్ణశశినిభాననఁ, దరుణీతిలకమును జనక♦తనయను నీవుఁ
బరికింతువేని మన్మథ,శరముల బారింబడుదువు ♦ చంచలమతివై. ౨౧ 890

క. ఆవనిత నీకు భార్యయె, గావలయునటన్న కోర్కి ♦ గలుగునయేనిఁ
బూవుఁలవారి నోర్వఁగ, నీవరదక్షిణపదంబు ♦ నిర్భయమతివై. ౨౨ 891

క. ముందెత్తిపెట్టుమా; రఘు,నందనుఁ డాఘాతుకుఁడు జ♦నస్థానము నీ
చందమునఁ జెంది యుటజము, లందుఁ గాపుండుఁగాన ♦ నాతని నిపుడే. ౨౩

తే. చంపి యారాఘవుఁడు మును ♦ చంపినట్టి
యసురులకు నెల్లరకును బ్రి♦యంబుఁ గూర్పు;
మాతనిఁ, దమ్ముఁడగుచు మ♦హారథుఁడగు
లక్ష్మణుం దీవ్రబాణము♦లఁ వధించి. ౨౪ 894

క. తరువాత ననాథయుఁ గాఁ, బరఁగెడు జానకిని సులభ♦పద్ధతిఁ గొని ని
ర్భరభోగముల యథేచ్ఛను, గరమరుదుగఁ బొందఁగలవు ♦ క్రవ్యాదవరా!

చ. దనుజవరేణ్య! నాపలుకుఁ ♦ దావకచిత్తహితంబుగాఁ దన
ర్చినయెడఁ గొంకుమాలి యిటుఁ ♦ జెప్పినచొప్పున నిర్వహింపు మి
ప్పని; నెద నాత్మశక్తులను ♦ బాగుగ నెంచి కళంకలేశమై
నను గనరానియంగము త♦నర్పఁగ నొప్పెడు సీత నిప్పుడే. ౨౬ 895

క. దనుజేంద్ర బలాత్కారం,బున భార్యఁగఁ దెచ్చుకొమ్ము ♦ భూపతి యుచటన్
ఘనశరవిషసర్పంబుల, దనుజాళిని జంపుట విని ♦ దనుజేంద్రుఖరుఁ. ౨౭ 896

తే. దూషణుని జంపుటయు విని ♦ తొందఱపడి
చేయవలసినపని నెల్లఁ ♦ జిత్తమందు
నిద్ది యని నిశ్చయింపంగ ♦ నిపుడు నీకుఁ
దగును పౌరుషమున నీవు ♦ తగుదు కాన. ౨౮ 897

ముప్పదినాలుగవ సర్గము సంపూర్ణము.

---

## ౩౫ - వ సర్గము.

రావణుండు మారీచునిఁ జూడఁబోవుట.

క. అని శూర్పణఖ వచించిన, వినుచు గగుర్పాటునొంది ♦ వేగమ నృపకా
ర్యనికర మమాత్యులెన్నఁగఁ, దనమదిని నెఱింగి వారిఁ ♦ దగ వీడ్కొలిపెన్.

క. అంతట వారలు చనఁగా, నంతగపురమునకుఁ బోయి ♦ యందొకచో నే
కాంతమున జానకిన్ బల,వంతంబునఁ దెచ్చునట్టి♦పనిఁ దాఁ బూన్కిన్. ౧

సీ. తనలోన యోజించి♦పని నిట్లు చేయఁగా వలయు నం చని తొలు♦దొలుతనిశ్చ
యించి యయ్యది చాల ♦ దృఢమగుటకు దాని నెఱవేర్పవలసిన ♦ నిఖిలమార్గ

ములయందు దోషంబు ♦ తలఁపఁగ నెందల్ప మెందుగుణంబుల ♦ శ్లైక్యవయని
వానియందలిబలా♦బలములనెల్ల విమర్శించి కడపట ♦ మదిని జేయ
ఆ. వలసినట్టి పని యి♦టులని నిశ్చయమును, జేసికొనుచు మిగుల ♦ స్థిరమతియయి
యచటనుండి రమ్య♦మైన ఘోటకశాల, కరిగి యంత రాక్ష♦సాధిపుండు. ౩

క. తానొగిఁ జక్కఁగఁ జేయం, [1]బూనినకార్యమును దనదు♦పొలఁతియు సచివుల్
జానుగ నెఱిఁగినచో నే,మేనియు వచియింతు రనుచు ♦ నెఱుఁగక యుండన్.

క. అరదము సిద్ధము చేయుము, త్వరగా సూతా! యటంచుఁ ♦ బలుకఁగ నాతం
డరిగి క్షణంబున దనుజే,శ్వరునకు సమ్మతముగాఁగఁ ♦ జను నరదంబున్. ౪

తే. ఉత్తమంబును సిద్ధమై ♦ యొప్పఁజేసి
తనదువిక్రమ మలరంగఁ ♦ దక్షణంబ
తెచ్చి నిల్పిన నాతని ♦ మెచ్చుకొనుచు
[2]ధనదుసహజుండు సిరియును ♦ దనరుచుండ ౫ 903

సీ. కామగంబయి రత్న♦కాంచనాలంకృతం బయి తగు నరదంబు, ♦ నమలకాంచ
నాలంకృతములయి ♦ యరయఁ బిశాచవదనములై తగుగాడి♦దలను బూన్చి
నట్టిదానిని, జల♦దార్భటి వెలయఁగా నెక్కి సంభ్రముచెంత ♦ కేగె; నంత
సురశత్రులై మునీ♦శ్వరఘాతుకుండగు దనుజేశ్వరుండు శ్వే♦తంబులైన
తే. వీవనలు ఛత్రమును గాంతి ♦ వెలయ స్నిగ్ధ
మైన వైడూర్యమణికాంతి ♦ నలరి దర్శ
నీయసుపరిచ్ఛదుండయి ♦ నెఱి [3]నిరువది
కరములుం బది శిరసులు ♦ గ్రాలుచుండ. ౬ 904

సీ. పదిశిఖరంబులఁ ♦ బరఁగు పర్వతరాజ మట్లు వెలుంగుచు ♦ నమలకనక
కుండలంబులఁ దాల్చి ♦ కోరినగతిఁ బాఱు నరదంబుపై నెక్కి ♦యపుడు మెఱుపుఁ
బిండులతో హంసి ♦ మండలితోఁగూడి నట్టిమేఘముభంగి ♦ నమలకాంతి
యనమమ్ముగా నొప్పి ♦ యఖిలజనస్తుత్య మగువిధంబునఁ బోలు♦పాఱుచుండ
తే. వెలిఁగెఁ బర్వతములఁగూడి ♦ వివిధపుష్ప
ఫలయుతానేకభూరుహ♦పటలనిబిడ
మగు సరిత్పతితీరంబు♦ను గనుచుఁ దమి
నరిగె నావీర్యవంతుఁ డు♦ద్యమము తనర. ౧౧ 905

క. ఆతీరంబున మంగళ, శీతలతోయముల ఖ్యాతిఁ ♦ జెందిన సరసుల్
పూతవిశాల సువేది, వ్రాతము గల యాశ్రమములు ♦ భాసిలుచుండున్. ౧౨

---

1 ప్రచ్ఛన్నో రాక్షసాధిపః-అనిమూలము. 'ప్రకాశశ్చే ద్వ్యర్థా, మందోదర్యాదయశ్చ వారయిష్యంతీతిభావః' అనివ్యాఖ్య. 2 ధనదానుజః-అనిమూలము. 3 వింశద్భుజో దశగ్రీవో దర్శనీయపరిచ్ఛదః-అనిమూలము.

[1]చ. అరఁటులు కందళీఁగెలును ♦ నంతట నిండఁగ నాళికేరముల్
నిరతము వన్నెఁజూపఁ గడు ♦ నిర్మలసాలతమాలముఖ్యస
త్తరువులు పూచి యొప్పఁగఁ బృథా♦కువులుఁ గరుడుల్ చెలంగఁ గి
న్నరముఖదేవయోనుల గ♦ణంబులు నంతట నిండియుండఁగన్. ౧౩½ 907

సీ. మఱి యయోనిజులయి ♦ మహితులౌ వైఖాన
సులు [2]మాషగోత్రభ♦వులయి సూర్య
చంద్రులకాంతులై ♦ సతత మాహారంబు
గల వాలఖిల్యులుఁ ♦ గడునియతము
గాఁ దగు నాహార♦కలితులౌ పరమర్షు
లలరుచుండిరి కామ♦ములను గెల్చి
నట్టిసిద్ధులు చార♦ణాదులు శోభిల్లి
రమలదివ్యాభర♦ణాభిరామ

తే. లగుచు దివ్యాకృతులనొప్పి ♦ సొగసుఁగుల్కు
నట్టి క్రీడారతులనెల్ల ♦ నాత్మల నెఱిఁ
గిన సురాంగన లెందఱో ♦ తనరుచుండి
రమరసతు లొప్పుచుండి ర♦య్యబ్ధిదరిని. ౧౬ 908

క. సిరు లలరారఁగ నంబుధి, దరియది శోభిల్లుచుండెఁ ♦ దగినవిధమునన్
సుర లమృతాస్వాదనమునఁ, బరఁగి యటన్ సంతతంబు ♦ భాసిల దితిజుల్.

సీ. దేవతలును గ్రీడఁ♦దేలుచు నుండంగ జలకుక్కుటములు క్రౌం♦చములు హంస
లందుఁ గ్రీడింపంగ♦నల్లె సారసవిహంగములు కూయఁగసొంపు♦లమరఁజెలఁగె;
వైడూర్యరత్నముల్ ♦ భాసిల్ల నందమై సాగరకాంతి నె♦సంగి మించి
యుండె;నంతటరావ♦ణుండుపాండరములునాయతంబులునుది♦వ్యములునగుచు
మాల్యయుక్తంబులై ♦ మఱియుఁ దూర్యధ్వనుల్ సంగీతసాధుని♦స్వనములొప్ప

తే. నందముగఁ జూడఁగాఁ దగి♦నట్టివగుచుఁ
గామగమనంబులై తపో♦ఘనబలమున
దివ్యలోకంబు సాధింప ♦ వెలసినట్టి
పురుషులెక్కు విమానముల్ ♦ పొదలుచుండ. ౧౯½ 910

క. కనియెన్ గంధర్వగణం,బును నప్సరసలను మఱియుఁ ♦ బొలుపారెడు వ
స్తునికరమును దశవదనుఁడు, కనియెన్ సంద్రంబుదరిని ♦ గడురమ్యముగన్. ౨౦

సీ. చారునిర్యాస ర♦సంబుతోఁ గూడు మూలములను, నోషధు♦లను; మనోజ్ఞ
ములు ఘ్రాణతృప్తిద♦ములగు వాసనలను జల్లుచుఁ జందన♦క్ష్మారుహమ్ము
లలరార నొప్పు ప♦న్నాళిని మేలైన యగరుతక్కోలవృ♦క్షాళులు మఱి
మేటివాసనలను ♦ మించెడిఫలయుతజాతిభూమీరుహ♦సమితి వెలయు

---

1 కదళ్యాఢకిసంబాధమ్-అనిమూలము. 2 వైఖానసై ర్మాషైః-అనిమూలము.

తే. వనసమూహములను నుప♦వనములఁ గను
చును జనెన్ రావణుఁడు; తీర♦మునఁ దమాల
పుష్పములమిరియముల సొం♦పుగఁ జెలంగు
తీఁగెలం జూచుచుం బోయె ♦ దితిజవరుఁడు. ౨౭ 912

ఉ. తీరమునందుఁ దూలి రవి♦దీప్తుఁ నెండిన మౌక్తికంబులన్
జారుతరంబులై పరఁగు ♦ శంఖములం బగడంపురాసులన్
భూరిసువర్ణశైలములఁ ♦ బొంకము గుల్కెడు వెండికొండలన్
సౌరునఁ దోఁచు భూమిధర♦శైవలినీప్రపదపంక్తి నెల్లెడన్. ౨౮ 913

క. కనియెన్; ధనధాన్యంబుల, వనితారత్నముల దంతి♦వాజిరథగణం
బున నిండియున్న నగరము,లను గనుచుం బోయెఁ దమిని ♦ లంకేశుఁ డటన్.

క. రమణీయంబయి యంతట, సనుమై మృదువుగను సోఁకు ♦ శ్వసనయుతంబై
యమరేంద్రునగరసమమగు, సముద్రతీరమును జూచె ♦ సంతసమలరన్. ౨౯

క. మునిజనసమావృతంబయి, ఘనభంగిని దోఁచుచున్న ♦ ఘనవటవృక్షం
బును జూచె నందు నొకచో, దనుజేశ్వరుఁ డద్ది చూడఁ ♦ దగి పొలుపారెన్.

సీ. సర్వదిక్కులదాని ♦ శాఖలు శతయోజనాయతంబులు గాఁగ ♦ నమరియుండె
నతిబలవంతుఁడై ♦నట్టి గరుత్మంతుఁ డద్దానిపై మును ♦ నతివిశాల
కాయముఁ గల్గిన ♦ గజమును దాఁబేలుఁ జేకొని వాని భ♦క్షింపఁగోరి
వ్రాలె; నంతటఁ బెను ♦ బలశాలియౌ గరుడునిభారమునకు నో♦ర్వను నశక్త

తే. మైనకతమునఁ దచ్ఛాఖ ♦ యపుడె పర్ణ
వితతి నెసఁగుచు నుండియు ♦ విఱిగె; దాని
యందు రవిచంద్రకిరణాళి ♦ ననుదినంబుఁ
ద్రాగుచున్ ధూమజాలంబుఁ ♦ ద్రావుచుఁ గడు. ౩౦ 917

ఆ. [1]యోనిభవులుగాక ♦ యొప్పు వైఖానసుల్
వాలఖిల్య[2]మాష♦పరమమునులు
తపముచేయుచుండఁ ♦ దాఁ గని గరుడుండు
కరుణ నూని వారిఁ ♦ గావఁబూని. ౩౧ 918

క. శతయోజనవిస్తృతి గల, వితతమహాశాఖదాని ♦ వెసఁ గొని త్రిదశ
ప్రతతులు వెఱఁగుపడన్ బో,యి తగన్ ధర్మాత్ముఁడొకట ♦ నిల నొకచోటన్.

క. ఒకపాదమూని మునులకు, నొకకీడుం గల్గకుండ ♦ నొగి వానిం జం
పి కడుపుఁజిచ్చున్ మాన్పుచు, నొకచోటనిషాదవిషయ♦ముంటఁ దెలియుచున్.

---

1 అజాబభూవుః-అనిమూలము. 2 మాషా వాలఖిల్యాశ్చ-అనిమూలము, మాషాః=పూతిమాష
గోత్రజాః-అనివ్యాఖ్య.

చ. ఘనవటశాఖ దానిపయిఁ ♦ గ్రక్కున వైచి నిషాదపల్లిఁ బెం
పున నుఱుమాడి యందుఁ గల♦బోయల నందఱి నారగించి య
మ్మునులను మెల్లఁగా వదలి ♦ మోదము పొంగఁగఁ బోయి యప్పనిన్
దనదగు పౌరుషంబు ద్విగు♦ణంబుగ నొప్పఁగఁ జిత్రసీమలోన్. ౩౩½ 921

క. అమృతముఁ దేఁ దగునని యెం,చి మహామతిమంతుఁడొటఁ ♦ జెచ్చెఱఁ జని స్వ
ర్గముఁ గని యందు నయోజా,లములన్ భేదించి రత్న♦లలితగృహంబున్. ౩౪

క. కని దానిఁ జెండి యింద్రస,దనమున రక్షింపఁబడు సు♦ధం దెచ్చెను; స
న్మునిజనులు తన్నుఁ గొల్వఁగ, ననుపమరీతిన్ వెలుంగు ♦ నావటతరువున్. ౩౫

క. గరుడుఁడు విఱిచినశాఖను, బరికింపఁగఁ దగినగుఱుతు ♦ భాసిల్లఁగ సుం
దరమయి సుభద్రనామము, పరఁగన్ జెల్వొనరునట్టి ♦ వటముం గనియెన్. ౩౬

క. ధనదానుజుఁ డిటు లర్ణవ,మును దాఁటి తటంబుఁ జేరి ♦ మునులవనమునన్
గనియె నొకచోట నాశ్రమ,మును రమణీయముఁ బవిత్ర♦మును నగుదానిన్.

చ. సరగున నందుఁ గృష్ణమృగ♦చర్మజటామృదువల్కలంబులన్
నిరతముఁ దాల్చి శాస్త్రవిధి ♦ నిశ్చితమై తగుభుక్తిఁ గొంచు మా
నిరమణుమాడ్కిఁ జూడఁదగి ♦ నిశ్చలభంగిఁ దపంబుచేయు నా
సురరిపుఁ దాటకాతనయుఁ ♦ జూచెను గోర్కులు నిండినట్లుగన్. ౩౭ 926

క. ఆరావణుఁ డంతట న,మ్మారీచుని యొద్దకేగ ♦ మనుత నతం డ
వ్వారిజభవపౌత్రున క,వ్వారిగ శాస్త్రోక్తమైన♦పద్ధతి మీఱన్. ౩౭½ 927

సీ. అర్చించె భక్తిచే ♦ నతని నమానుషసర్వకామంబుల ♦ సమధికముగ;
నంత మారీచుఁ డ♦ట్లర్ఘ్యపాద్యాదుల నాహారమునఁ దృప్తి ♦ నందఁ జేసి
యతనితో మిక్కిలి ♦ యర్థవంతంబుగఁ బలికె; రాక్షసనాథ! ♦ప్రభుమహేంద్ర!
లంకలోనున్న యె♦ల్లరకు క్షేమమెకదా? యేపనికై మీర ♦ లిట్లు లిచటి

ఆ. కేగుదెంచినారొ ♦ యివు; డన విని మహా
తేజమలర మాట ♦ తీరు వెలయఁ
దాటకాతనూజుఁ ♦ దమిఁగని యిట్లని
పలికె రావణుండు ♦ ప్రౌఢభణితి ౩౭ 928

ముప్పదియైదవ సర్గము సంపూర్ణము.

---

## ౩౬ - వ సర్గము.

రావణుఁడు మారీచుని సహాయము కోరుట.

*ఉ. నేను వచించుపల్కులను ♦ నెయ్యమునన్ వినవయ్య నాయనా!
నే నివు డార్తినొందితిని ♦ నీవె సుమా పెనుదిక్కు తజ్జన

---

*రావణుం డింతకుముందె మారీచునిచెంతకుం బోయివచ్చెను. మరల నాతనియొద్దికేపోయి ప్రాఁత వృత్తాంతమును జెప్పఁబూనుట సీతావ్యామోహమున మనస్థైర్యము లేకయే యని యెఱుంగునది.

స్థానమునందు భ్రాతయయి ♦ శౌర్యఘనుండగు నాఖరుండు నా
జానుభుజుండు దూషణుఁడు ♦ సంతతముం బాలుపాఱుచుండ్రుగా. ౧౪ 929

సీ. నాదుచెల్లెలు శూర్ప♦ణఖయు మహాతేజుఁ డయి పిశితాశనుం ♦ డైన త్రిశిరుఁ
డింకను శూరులై ♦ యెప్పుడెప్పుడు యుద్ధ మగునని యెంచెడు♦నట్టి యితర
దానవుల్ పెక్కురు ♦ దండకారణ్యమ్మునందు నాయాజ్ఞచే ♦ నఖిలమునుల
ధర్మచారులను బా♦ధల నందఁజేయుచు ననవరతంబు స్వే♦చ్ఛానుకూల

తే. మగువిధంబున నుండుట ♦ నాత్మనీకుఁ
దెలిసియేయున్నదిగద; సం♦దీప్తశౌర్యు
లయి భయంకరకర్ములై ♦ యనిని గోరి
ఖరునిచిత్తము నెప్పుడు ♦ గనుచు భక్తి. ౮౪ 930

తే. అరయఁ బదునాల్గువేలు క్ర♦వ్యాదులచటఁ
గాపురం బుండ్రుగాదె?; య♦క్కడ వసించు
నధికబలశాలులైన య♦య్యసురులెల్ల
ఖరముఖులు గుంపుగాఁగూడి ♦ కడిమిమెఱయ. ౫౪ 931

క. పలువిధములైనయాయుధ,ములఁ గొని సన్నద్ధులగుచు ♦ మునుకొని యనికిన్
దలఁపడిరి రాఘవునితోఁ, గలితక్రోధుఁడయి భూమి♦కాంతుఁ డతండున్. ౭

చ. పరుషము లించుకేనియును ♦ బల్కక జ్యాలత మీటి యుగ్రహా
శరనికరంబుఁ గూర్చి తన♦సాహస మంతయుఁ జూపె; నొక్కఁడై
ధరణిని నిల్చి మానవతఁ ♦ దాల్చిన యాతఁడె యుగ్రవిక్రమ
స్ఫురణమునం జెలంగు రణ♦శూరులనున్ బదునాల్గువేల యా
సురులను జంపెఁ దీక్ష్ణశర♦శుంభదవక్రపరాక్రమంబునన్. ౯౪ 933

క. ఖరదూషణులును త్రిశిరుఁడు, దురమున హతులైరి; భీతిఁ ♦ దోఁపఁగఁదగునా
సురవైరి నివాసంబగు, నరణ్యమది నిర్భయముగ ♦ నయ్యెం గట్టా! ౯౪ 934

*సీ. క్రుద్ధుఁడౌ తండ్రిచేఁ ♦ గొంకకపురినుండి
తఱుమంగఁ బడుటయు ♦ తథ్యమెగద
యంతసభార్యుఁడై ♦ యసురేశ! క్షీణజీ
వితుఁ డనఁ దగునైన్య♦వితతిహంత

---

* పిత్రా నిరస్తః క్రుద్ధేన సభార్యః క్షీణజీవితః, సహన్తా తస్యసైన్యస్య రామః క్షత్రియ పాంసనః. దుశ్శీలః కర్కశస్తీక్ష్ణో మూర్ఖో లుబ్ధో జితేంద్రియః, త్యక్తధర్మో హ్యధర్మాత్మా భూతానామహితేరతః.-అనిమూలము దీనికి మహేశ్వరతీర్థులు రాముఁడు శ్రీమహావిష్ణువే యని రావణు తాత్పర్యమైనట్లు వ్రాసిరి. ఆయర్థమునుగూడ నీపద్యమున నిమిడియున్నది. మూర్ఖోలుబ్ధః-అనుచో మూర్ఖః అలుబ్ధః అని పదవిభాగము. ఆయర్థమిట. "తీక్ష్ణుఁడట్లమూర్ఖుఁ" డనుచో అట్లు అమూర్ఖుఁ డని పదముల విభజించుకొనినఁ దేలఁగలదు. కాన నంతట నిట్లే యన్వయించుకొనవలయు నని తెలియనగు.

యనఁగ నపూర్వవి♦ఖ్యాతిని గనుచు క్ష
త్త్రియకులపాంసనుఁ♦డ యయి యతఁడు
దుశ్శీలుఁడేయని ♦ తోఁపఁగఁ జేయుచుఁ
బరకర్కశుండనఁ ♦ బరఁగి తీక్ష్ణుఁ
డ ట్లమార్గుఁ డలుబ్ధుఁ ♦ డజితేంద్రియుఁడు త్యక్త
విమతధర్ముఁడునయి ♦ వెలసి మఱియు

తే. సకలభూతాహితారతిఁ ♦ జాలఁ గాంచి
యున్నవాఁ డౌట దోర్దర్ప ♦ మొప్ప ఖరము
ఖులను జంపెను; బగలేక ♦ యలఘుధర్మ
మును దలంపక తనసత్వ♦మునె దలంచి. ౧౨॥ 935

క. విను నాచెలియలి ఘ్రాణ,మ్మును జెవులను గోసి రూప♦మును జెఱిచెఁ గదా!
మనుజాధముఁ డగు నాతని, వనితను సురవనితఁబోలి ♦ పరఁగెడుసీతన్. ౧౩

తే. విక్రమించి జనస్థాన♦విషమదేశ
మునకుఁ జని తేఁ దలంచెదఁ ♦ గనుక నీవు
సాయపడఁదగు నిక్కార్య♦సరణి కిచట
బలయుతుండవు నీవు కాఁ♦బట్టి యిపుడు. ౧౪ 937

క. పనిఁ బూని వేగ నాదగు, మనుజులతోఁ బార్శ్వసీమ♦యందు నిలిచి యుం
డినసంగరమున దివిజుల, మనమున లెక్కింపఁజుమ్ము ♦ మారీచ! యిఁకన్. ౧౮

క. దనుజోత్తమా! సహాయం,బును జేయుము నీవు కార్య♦ములసామర్థ్యం
బునఁ జేయువాఁడవుగదా, యని వీర్యమునందు దర్ప♦మందును జగతిన్.

తే. సాటి యెవ్వండు నీకెన్న ♦ సకలములగు
నుపసులన్నియుఁ దెలియు నీ ♦ వుర్విఁ గలుగు
మాయలన్నింటి నేర్చిన ♦ మహితమతివి
కానవచ్చితి నీయొద్ద♦కేను బూన్కి. ౧౬ 940

క. ఏకార్య మీవు తోడ్పడి, నాకుం జేయంగవలెనొ ♦ నయగతి వినుమా
యీకార్య మెట్లుసాగునొ, యేకరణి నొనర్పఁ గృత్య♦మెల్లఁ జెలఁగునో. ౧౭

సీ. వెండిబిందువులతో ♦ వింతవన్నెలుగల బంగారుజింకరూ♦పంబుఁ దాల్చి
యారామచంద్రుని ♦ యాశ్రమమున కీవు చని సంచరింపుము ♦ జనకజాత
ముందఱ; సీతయు ♦ నందుఁ జరించెడు నిన్నుఁ గాంచఁగానె "దీ♦నిని జవమున
బట్టి నాకిం" డని ♦ భర్తతో మఱఁదితోఁ దప్పక పలుమాఱు ♦ చెప్పఁగలదు

తే. వారలంతటఁ దరలిపో♦వంగ నితరు, లెవ్వరును లేక శూన్యమై ♦ నివ్వటిల్లు
నాశ్రమం బప్డు డేయడ్డి♦యరయ లేక, యుండఁగా నేనుఁబోయి యు♦ద్దండరీతి.

క, సులభముగ రావు వెవ్విధి, జలజారిని బట్టు నట్లె ♦ జానకి నిటఁ దేఁ

గల నంతట శ్రీరాముఁడు, జలజాక్షీ విరహామునఁగృ♦శత్వముఁ గాంచున్. ౨౨

సీ. కావున నతఁడు సం♦గరమున కేతెంచినను నేనును గృతార్థుఁ♦డనయి సంశ
యము లేక యోడించి♦యతుల శర్మపదంబు జూఱఁగొందు నటంచు♦శూరతఁదగఁ
బలుకఁగా శ్రీరాము♦వార్త విన్నంతనే బలశాలి మారీచుఁ♦ డెలమి దూల
నాస్యమెండఁగ దేహ♦మంతయు వడకంగ నెండిన పెదవుల ♦ నెట్లొ తడుపు

తే. కొనుచు ననిమేషములగు లో♦చనము లొప్ప
శవము చలె నార్తుఁడై దను♦జాతవిభుని
గనియె; నాతఁడు ముందె య♦వ్వనమునందు
రామచంద్రుని ఘనపరా♦క్రమ మెఱుఁగుట. ౨౩ 944

చ. దనుజునినుండి రామునిక♦ఠారసవార్త వినంబడంగనే
మనసు చలింపఁ గుంది పలు♦మాఱు వడంకుచుఁ గేలు మోడ్చి య
ద్దనుజుని గాంచి వానికి హి♦తంబును గోరుచు నాత్మకున్ హితం
బును గలుగన్ యథార్థముగఁ♦ బొల్చెడు వాక్యముఁ బల్కె నివ్విధిన్. ౨౪

ముప్పదియొకటవ సర్గము సంపూర్ణము.

---

## 32 - వ సర్గము.

మారీచుఁడు రావణునకు హితము నుపదేశించుట

ఉ. మాటలయందు నేర్పుఱియు♦ మానితమై తగు ప్రజ్ఞయుం దగన్
దాటకపుత్త్రుఁ డద్దనుజ♦తల్లజుఁ డాడిన పల్కులెన్ని యే
పాటియు ధైర్యమూనకయె♦ పల్కె సురారివిభూ! జగాన నే
మాటనుగాని యందఱును♦ మంచిగఁ బల్కుచు నుంద్రు తృప్తికై. ౧ 946

[1]క. నరపతి కాపదవచ్చిన, తఱుగాంబునవైన నుంత♦ధర్మమెఱుఁగ కే
నిరతము నిచ్చక మాడెదు, పురుషులు దొరకుదురు మిగుల♦బుద్ధిఁ దలంపన్.

తే. అప్పటికి నప్రియంబైన♦ నవల హితము
గాఁ దగినదానిఁ జెప్పంగఁ♦ గడఁగువారు
వారిహితబోధమును విను♦వారు దొరకు
టరుదు; నీవన్నసో భావ♦ మలయునట్లు. ౨ 948

సీ. చారులఁ బంపించి♦ శత్రువుల విధంబులను నెఱుంగుట లేదు♦ విను చపలుఁడ
వట్లు కావున రాము♦ నతులపరాక్రమశాలి యనియును శ్రే♦ష్ఠగుణయుక్తుఁ
డనియు మహేంద్రుతో♦ నావరుణునితోడ సముఁడనియు మది ని♦జముగ నీకుఁ
దెలియకున్నది; [2]తాత♦ యిల దనుజులకింక క్షేమము గల్గునో?♦యీమహీశుఁ

---

1 సులభాః పురుషారాజన్ సతతం ప్రియవాదినః-అప్రియస్య తు పథ్యస్య వక్తా శ్రోతాచ దుర్లభః-అనిమూలము. 2 అపి స్వస్తి భవే త్తాత సర్వేషాం భువిరక్షసామ్-అనిమూలము.

ఆ. డాగ్రహించి లోక♦మందు రాక్షసుల లే,కుండునట్లు చేయ♦కుండునా? మ
హీజ, నీయసువుల ♦ నెల్లను దీయఁగా,నుర్విఁ బుట్టదుగద ♦ యూహసేయ. ౫॥

ఆ. [1]జానకీనిమిత్త; ♦ మైనట్టి వ్యసనము, నాకుఁ గలుగకుండు♦నా? కడంగి
యెట్టి యడ్డులేక ♦ యిచ్చవచ్చినయట్లు, తిరుగునిన్ను భూప♦తిగను బొంది. ౬॥

క. దనుజావళితో నీతో, ఘనలంకాపురము చ్యుతిని ♦ గనక యెసఁగునా?
దనుజాధీశా! యెవ్వఁడు, మనమ్మునన్ సంశయంబు ♦ మాని యనృచ్ఛన్. ౭॥

క. నినుఁబోలి కామవృత్తం,బునుగొని దుర్మంత్రి యగుచుఁ♦బొలుచునొ యలదు
ర్మనసుండు తనను బంధువు,లను రాజ్యముఁ జెఱుచుకొను ని♦లాస్థలిలోనన్. ౮

సీ. జనకుఁడు తఱుమఁగాఁ♦జనుదెంచెఁ గానల కనిపల్కితివి గాదె♦ముసు? మహాత్మ!
వినుము రాముఁడు జన♦కునిచేత వెడలింపఁబడినవాఁడే కాఁడు, ♦ పరివిహీన
మర్యాదుఁడును గాఁడు,♦మఱియు లుబ్ధుండునుగాఁడు,దుశ్శీలుండు♦కాఁడు,ధర్మ
మునను సద్గుణములఁ♦గనని వాఁడునుగాఁడు,క్షత్రియాధముఁడును♦గాఁడు,క్రూర

ఆ. మతియుఁ గాడు, మహిని ♦ మానవతీమణి,యైన తల్లికెంతొ ♦ యమలసమ్మ
దంబుఁ బెంచు భూత♦తతులకు నహితంబుఁ, జేయనెంచఁడమల♦శీలుఁడతఁడు.

చ. జనకుఁడు కైకవంచనకుఁ ♦ జాలఁగ లోఁబడియుండఁ గాంచి యా
జనని మనోరథంబుఁ దమి ♦ సల్పి పితన్ ధర సత్యవాదిగా
నొనరుతు నంచు ధర్మమతి ♦ యూరును మాని యరణ్యసీమకున్
వనితను సోదరున్ గలిసి ♦ వచ్చెను గాదె? తలంప నాయనా. ౧౦ 954

తే. కైకప్రియవాంఛితముఁ దండ్రి ♦ కాంక్షఁ దీర్ప
భోగముల రాజ్యలక్ష్మిని ♦ బూన్కి విడిచి
దండకావనమునకు నెం♦తయు ముదమున
వచ్చినాఁడు సుమా దశ♦వదన! యిపుడు. ౧౧ 955

సీ. కఠినుండు మూర్ఖుండు♦గాఁడు రాముండజితేంద్రియుండునుగాఁడ♦హీనమతివి
నీవిట్లు పూని య♦నృతము దుశ్చ్రుతమును వచియింపఁగారాదు ♦ వలసినట్లు;
[2]తనువుదాల్చినయట్టి ♦ ధర్మమే రాముండు, సత్యశౌర్యుండును ♦ సాధువతఁడు
త్రిదశుల కింద్రుని ♦ తీరున నెల్లర కతఁడు విభుండగు ♦ నతనిభార్య

ఆ. తనసతీత్వతేజ♦మున నె సురక్షిత
యైన దట్టిసాధ్వి ♦ నామె నెట్లు
ప్రసభమున హరింప ♦ వాంఛించెదో? [3]రవి
ప్రభ హరింప వలను♦పడునె చెపుమ. ౧౨ 956

క. శరఖడ్గధారలెల్లెడఁ, బరఁగెడు జ్వాలలుగ విల్లు ♦ వాలును గాష్ఠో

1 అపి సీతానిమిత్తంచ నభవే ద్వ్యసనం మమ - అనిమూలము. 2 రామో విగ్రహవాన్ ధర్మః-అనిమూలము. 3 ప్రభామివ వివస్వతః-అనిమూలము.

త్కారముగ నధృష్యమై తగు, వరరాఘువదీ ప్తవహ్నిఁ ♦ బడఁదగదు సుమీ. ౧౫

చ. ధనువును లాగి దాన నెని♦తాంతము వంగినవిల్లె వ్యాప్తమై
కనఁబడి మండువక్త్రముగ ♦ గాఢశరంబులె జ్వాలలట్లుగాఁ
దనరఁగ లోకసంహృతికిఁ ♦ దద్దయుఁ గోపమునంది కార్ముకం
బును ఘనపాశముల్ గొనుచుఁ ♦ బొల్చినవీరుని శత్రుసైన్యహం
తను రఘురాముఁడన్ యముని ♦ దారుణమూర్తిని గూర్చి రావణా. ౧౬ 958

క. మనమున కింపగుజీవిత,మును, రాజ్యము, సుఖము మాని ♦ మునుకొని యిపుడే
చనవలదు; జానకీపతి, ఘన తేజం బసహ్యశముగఁ ♦ గ్రాలుం జుమ్మీ. ౧౭ 959

చ. ఘనుఁడగునట్టి రాఘవుని♦కార్ముకమే పెనుప్రాపుగాఁగ నొ
ప్పిన యలజానకిన్ బలిమిఁ ♦ బెంపునఁ దేఁ దగుశక్తి నీయెడన్
గనఁబడ; దింక మానవశి♦ఖామణి సింహవిశాలవక్షుఁ డా
ఘనుఁ డొగి సీతఁ బ్రాణముల♦కంటెఁ బ్రియంబుగఁ జూచుచుండుఁజూ. ౧౮

క. జనకజయు భర్త నెప్పుడు, ననువర్తించుచు నె యుండు; ♦ నధికజ్వాలా
ఘను నగ్నిఁ జెనకరా నటు, లనుపమ తేజమున నొప్పు ♦ నాతనిభార్యన్. ౧౯

క. జనకజనుమధ్యమను సా,ధ్వీని జెనకఁ దరంబుగాదు ♦ విను దనుజేంద్రా!
మనమున నెంచఁ బ్రయోజన,మును గాంచనియీప్రయత్న♦మునఫలమేమో.

క. అని శ్రీరాముని దృక్పథ,మునఁ బడుదువయేని ప్రాణ♦ముల కంత నుదే
యనుకొనుమా యీయత్నం,బును మానుము చాలు నింకఁ♦బోలదు చేయన్.

సీ. దనుజేంద్ర! జీవితం♦బును శర్మమును దుర్లభములగు రాజ్యంబును♦బడయఁగోర్కి
గల్గి వానిని జిర♦కాలము ననుభవింపగఁ గోరుదే, రఘు♦పతికి నప్రి
యము చేయకుండు మీ♦వరిగి ధర్మాత్ములైనట్టి విభీషణుఁ ♦ డాదియైన
సచివులఁ గూడి యో♦జనచేసి యొంటిగా నిశ్చయించి పిదప ♦ నీవుగుణము
లను దోషముల మిగు♦ల బలాబలంబులఁ జక్క విమర్శించి ♦ స్వబల మట్లె

తే. వైరిబలమును జర్చించి ♦ వానిభేద
ముల నెఱింగి హితాహిత♦ములను నిర్ణ
యించుకొని యేదియుక్తమో ♦ యెఱిఁగి దానిఁ
జేయుమా! రాక్షసేశ్వరా! ♦ న్యాయబుద్ధి. ౨౪ 964

[1] తే. నాకుఁజూడఁగ దశరథ♦నందను ఘను
ననిమొనన్ దగ మార్కొను ♦ టర్హమనుచుఁ
దోఁపకున్నది; [2]పలుసారు ♦ లీపలుకు నె
యొత్తిచెప్పెద వినవయ్య ♦ యుద్యమమున. ౨౫ 965

1 అహం తు మన్యే తవ నక్షమం రణే - అనిమూలము. 2 ఇదం హి భూయ శ్శృణు-అని మూలము.

తే. యుక్తియుక్తము దేశకా♦లోచితంబు
నైన నాయీ యనువాక్యము ♦ నాత్మయందు
మంచిదని యెంచి వినవయ్య ♦ మానసీయ
చరిత! దనుజాధినాథ! చం♦చద్గుణాఢ్య!. 966

ముప్పదియేడవ సర్గము సంపూర్ణము.

---

## ౩౮ - వ సర్గము.

మారీచుఁడు రావణునితో రామునకుఁ దనకు బాల్యమునఁ జైన యుద్ధమును జెప్పుట.

*చ. విను మొకసారి నేను మును ♦ వేయిగజంబులదౌ బలంబు పెం
పునఁ దగి పర్వతాకృతిని ♦ బొల్చుచు నీలఘనంబురీతి గాఁ
గనఁబడుచున్ మృదుప్రకట♦కాంచనకుండలమండితుండనై
జనులకు భీతిఁ గొల్పుచును ♦ శౌర్యము పొంగఁ గిరీటధారినై. ౧౪ 967

చ. పరిఘముఁ గేలఁ బూని ముని♦వర్యుల మాంసమునందుఁ గోర్కి నీ
ధరణిఁ జరించుచుండి ప్రమ♦దంబున దండకకాననంబునం
దిరుగుచునుంటి; ధర్మమతి ♦ ధీరుఁడునై తగు కౌశికుండు మా
నిరమణుఁ డంత నాభయము ♦ నిశ్చలచిత్తముఁ దూలఫుచ్చఁగన్. ౩ 968

క. తానై దశరథుఁడను నొక, భూనాథునిచెంత కపుడ ♦ పోయి యతనితో
దానవుఁడగు మారీచుఁడు, తానెంతయుఁ బౌరుషమున ♦ దారుణరీతిన్. ౪

తే. మమ్ము భయపెట్టుచున్నాఁడు ♦ మానవేంద్ర!
వానిబాధలఁ జెప్పంగ ♦ వశముగాదు
కాన నీపుత్త్రుఁడైన రా♦ఘవుఁడు వచ్చి
పర్వకాలంబులందుఁ గా♦పాడఁగాక. ౪౫ 970

చ. అని మునిపల్క ధర్మమతి ♦ యా ధరణీశుఁడు యోగనిష్ఠయే
ధనముగ నొప్పు కౌశికుని ♦ దద్దయు భీతిని గాంచి పల్కె నా
తనయుఁడు బాలుఁడై తనరు ♦ ద్వాదశవర్షవయస్కుఁ డెన్నఁగా
ఘనమగు నస్త్రవిద్యఁ దగఁ ♦ గాంచఁడు పాండితి సత్యమిద్ది సూ. ౬ 971

తే. తమరు కోరినచో సైన్య♦తతిని గొనుచు, నేనె వచ్చెద మునివర్య!♦నేనె దనుజు
లను భవన్మనమును గాంచి ♦ వనిఁ దిరిగెదు, నట్టి రిపుల వధించెదఁ♦బట్టి వారి.

క. చతురంగంబులతో సంగతిఁ బాయక వత్తు నిపుడె ♦ కౌశిక! యనఁగా
నతనిం గని ముని పల్కె జగతి రాముఁడు దప్ప దనుజ♦కాంతుని నతనిన్. ౮

తే. ఎంతబలమైన దీర్పలే ♦ దిద్ది నిజము
నీవు సామాన్యుఁడవుగావు ♦ నిర్జరులను

---

* బలం నాగసహస్రస్య ధారయన్ పర్వతోపమః.అనిమూలము.

నని మొనఁ గాచినాఁడవే ♦ యవనినాథ!
త్వత్కృతంబగు కృత్యాళి ♦ వరుస వినమె. ౯౪ 974

సీ. ముల్లోకములయందు ♦ మ్రోగుచుండును గాదె
గొప్పసైన్యములు నీ♦కుంగలుగుట
నిశ్చయమే యైన ♦ నీదుసైన్యమ్ములు
దనుజుని నాతనిఁ ♦ జెనకఁజాల
వవ్వి యన్నియు నిందె ♦ యమరి యుండుంగాక
యీకుమారుఁడు బాలుఁ♦డేయయినను
మహనీయతేజుండు ♦ మారీచు నోర్చుఁ బ
రంతపా! కావున ♦ రాముఁ దోడు
తే. కొనుచు నేఁ బోవువాఁడ నీ♦కుఁ శుభముగుఁ
గాక; యని పల్కి రామునిఁ ♦ గౌశికుండు
వెంటఁ దోడ్కొని మదిని సు♦ప్రీతి యలర
స్వాశ్రమమునకుఁ బోయె న♦య్యవసరమున ౧౨ 975

చ. మునిపతి దండకాటవిని ♦ మోదము పొంగ మఖైకదీక్షునుం
గొని తనయాశ్రమంబుననె ♦ కూర్చొని యుండుటఁ గాంచి చిత్రమా
ధనువును దీటుచుఁ మునివ♦తంసుని చెంతనె కాచుచుండె; యౌ
[1]వనగుణముల్ కనంబడవు ♦ బాల్యమునందగు రామునం దొగిఁ.౧౩ 976

చ. సిరి తనరారఁ గమ్రసర♦సీరుహపత్రనిభేక్షణంబులుఁ
బరఁగఁగ బ్రహ్మచారియయి ♦ వస్త్రమొకండు ధరించి చాపముం
గరమునఁ దాల్చి [2]కూఁకటియుఁ ♦ గాంచనమాలికచే వెలుంగ, వి
స్ఫురదురుదేహకాంతి వన♦భూమిని భాసిలఁ జేయుచుఁ గడుఁ. ౧౪ 977

తే. అపుడు పొడిచిన బాలశ♦శాంకురీతి, నయనపర్వముగాఁగఁ గ♦నంబడియెను;
నంత నేనును నీలమే♦ఘాభుఁ దప్త, కనకకుండలుగా జనుల్ ♦ వనుఁగనంగ.

క. వరములఁ గాంచిన గర్వ,స్ఫురణంబున బలము మిగులఁ ♦ బొల్చుచు మౌనీ
శ్వరు నాశ్రమంబుఁ జొచ్చితిఁ, గరముల నాయుధములొప్పఁ♦గాఁ జిత్రముగఁ.

చ. త్వరపడి నేను జొచ్చుటను ♦ వారక రాముఁడు చూచి సుంతయుఁ
బరిచలనంబు నొందకయె ♦ స్వాంతము భాసిల వింటి నెక్కిడెఁ
గరువము మోహముం గలిసి ♦ కాటియపెట్టుట వానిబాలుఁగా
నరసి యలక్ష్యబుద్ధి ముని ♦ యధ్వరవేదికపైకిఁ బోయితిఁ. ౧౭ 980

చ. పరుల నడంచు బాణమును ♦ వైచె నతం డురుశక్తి మీఱ భీ
కరమగు నాశరంబు వడి ♦ గాఁడఁగ నే శతయోజనంబు లం

1 అజాతవ్యంజన శ్మశ్రుమాఁ-అనిమూలము. అనుత్పన్న యౌవనలక్షణః-అనివ్యాఖ్య. 2 శిఖీ కనకమాలయా-అనిమూలము. శిఖీ కాకపక్షధరః అనివ్యాఖ్య.

బరమునఁ బోయి యబ్ధిఁబడి ♦ ప్రాణము లుండుట నెట్లొ వచ్చితిన్
మరలి, యతండు వీరుఁడయి ♦ మానె వధింపఁగ భీతుఁడంచొగిన్. ౧౯ 981

తే. నాయనా! రావణా! విను ♦ నన్నతండు
చంపనొల్లక దయఁబూని ♦ సాగరమునఁ
బడఁగ బాణంబువైచె నా ♦ బాణవేగ
ముననె యంబుధిఁ బడి మూర్ఛ ♦ మునిఁగినాఁడ. ౨౦ 982

[1] మ. శరవేగంబునఁ బోయి పోఁతయిన యా♦సంద్రంబునన్ నీట నా
తురతం బొందుచు భీతిమీఱఁ బడి భ్రాం♦తుల్ చాల బాధింపఁగాఁ
జిరకాలంబున కేను దెప్పిరిలి యా♦చింతన్ భవత్పాలిత
స్థిరలంకాపురిఁ జేరితిన్; మదిని యో♦జింపంగఁ జిత్రంబగున్. ౨౧ 983

సీ. బాలుఁడు రాముఁడ♦ప్పటి కకృతాస్త్రుండు నక్లిష్టకర్ముఁడో ♦ నట్టులుండి
యే ననుబోఁటినే ♦ యెంతయుశక్తిచే నట్లెగఁజిమ్మె స♦హాయులైన
దనుజులఁ బడఁగూల్చెఁ ♦ గనుక నే వలదని వారించుచున్నాఁడఁ ♦ బలుకుదీని
వినక రామునితోడ ♦ వే పగఁ గొనుదువయేని భూరివిపత్తు ♦ నిపుడె పొందఁ
తే. గలవు; [2]క్రీడారతుల్ మీఱఁ♦గా సభలను
గూడుచుం బండుగులు చేసి ♦ కూర్మిఁ గనుచు
శర్మములఁ దేలుచున్న రా♦క్షసులకెల్ల
సకలకష్టములం గూర్పఁ♦జాలు దీవు. ౨౨ 984

సీ. ప్రాసాదములు హర్మ్య♦పటలముల్వెలయంగ ద్వారంబులందుర♦త్నములతోడఁ
దగు నలంకారముల్ ♦ తనరార నున్నలంకాపురి రాముని♦కాంతదైన
హేతువుచే నశి♦యింపఁగఁ జూడఁగాఁ గలవు; రావణ! సర్ప♦ములు చెలంగు
మడుఁగున నుంటచే ♦ మత్స్యములుంగూడ గరుడభక్షితములై ♦ కడునశించు
తే. కరణిఁ బాపము లొనరింపఁ♦గాఁ దలంప
నట్టి శుద్ధాత్ములునుగూడ ♦ నకట! పాపు
లను దగం గూడుటన్ వార♦ల యఘదోష
మునను దారు నశింతురు ♦ ఘనులు నయ్యు. ౨౩ 985

చ. ఘనతమభూషణంబులను ♦ గ్రాలుచు దివ్యసుచందనంబు మే
న నలఁది మించు రాక్షసులు ♦ నాథ! భవత్కృతదోషయుక్తి నా
తని శరసంహతిం గనుచుఁ ♦ దద్దయుఁ గూలుదు రీవు చూడఁగా;
దనుజులు చావఁగా మిగిలి ♦ తమ్మొగిఁ బ్రోచెడువారు లేమిచేన్. ౨౪ 986

1 పాతితోఽహం తదా తేన గంభీరే సాగరాంభసి - అనిమూలము. 2 క్రీడారతివిధిజ్ఞానాం సమాజోత్సవశాలినామ్- అనిమూలము.

చ. వనితలఁ బాసి కొందఱును ♦ భార్యలతోడనె కొందఱున్ భయం
బున దశదిక్కులం బఱువఁ ♦ బూనఁ గనంగల వీవు రావణా
మనపురమెల్ల రామశర♦మండలసంవృతమై కృశానుదీ
ప్తినికరసంయుతంబగుచుఁ ♦ దెప్పున మండెడు నిండ్లతోఁ గనుం
గొనభయదంబుగా వెలయఁ ♦ గుంది కనంగల వీవు చక్కఁగాన్. ౨౯ 987

ఉ. ఇందును సంశయంబు గల♦దే విను రాజ! పరాంగనామణిం
బొందుటకంటె వేఱొకటి ♦ భూరితరాఘము లేదు సుమ్ము నీ
కుం దలఁపంగఁ బెండ్లియయి ♦ కూరిమిఁ బాయక వేయిమంది యా
సుందరు లున్నవారు గద! ♦ చొక్కి రమింపుము స్వేచ్ఛ వారితోన్. ౩౦ 988

క. దనుజేంద్ర పరస్త్రీరతిఁ, గనకుము వంశమును నీదు ♦ గౌరవమును భూ
మిని సంపదఁ బ్రియజీవిత,మును గాచుకొనంగఁ దగును ♦ బూనిక మీఱన్.

క. చిరకాలము సుభగతచేఁ, బరఁగెడు భార్యలను గూడి ♦ బహుభోగములన్
గర మనుభవింపు మిత్రో,త్కరములతో సుఖముఁ బొందఁ♦గాఁ గోరినచోన్.

క. రామున కపకారం బిఁక, నేమాత్రము చేయవల ద♦హీనగుణాఢ్యా!
నీమేలు గోరి చెప్పెదు, నామాటను వినక రాము♦నాతిన్ బలిమిన్. ౩౨

ఆ. పట్టుకొనుదువేని ♦ బాంధవులను నీదు, బలము నాయు వతని ♦ బాణములకు
నప్పగించి యముని ♦ యాలయమును జేరఁ,గలవు నమ్ము నాదు♦పలుకు దీని. ౩౩

ముప్పదియొనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ౩౯ - వ సర్గము.

మారీచుఁడు రావణునకు రాముని చరిత్రమును జెప్పుట.

సీ. అపుడు రాముఁడు బాల్య♦మందు నన్నున దెట్లొ విడిచె నాతనికిని♦ప్పుడు వయస్సు
వచ్చిన దీవలి♦వార్తను జెప్పెద *మాఱాడకుండ నా♦మాట వినుము;
బాలుఁడౌ రాముని ♦ బాణఘాతము నొంది యంత నూరకయుండ♦కట్టె నేను
మరలను మృగరూప♦ధరులైన యిద్దఱు దనుజులతోఁ గూడి ♦ దండకాట

తే. విని బ్రవేశించితిని; దీప్త♦వివృతజిహ్వా
గ్రాలఁ బెనుకాయమును బూని ♦ ఘనభయంక
రముగ దంష్ట్రలు మెఱయ బ♦లము దనరఁగఁ
బలలభక్షకమృగమైతి ♦ వనిఁ దిరుగఁగ. ౩ 993

చ. అనలునియొద్దఁ బావనము♦లై తగు తీర్థములందుఁ జైత్యభూ
జనికరసన్నికృష్టమున ♦ సాధ్వసరూపముఁ దాల్చి యెంతయున్

---

* తచ్ఛ్రుణుష్వ నిరుత్తరం-అనిమూలము.

మునుల నదల్చుచుఁ దిరుగఁ ♦ బూనితి నివ్వనమందు ధర్మని
ష్ఠను జరియించు మానులను ♦ జంపుచుఁ దద్రుధిరంబుఁ ద్రావుచున్. ౪॥ 994

క. పలలంబుల భక్షించుచు, ఖలమతిఁ గ్రూరుండ నగుచు ♦ త్మాసురమానీ
శుల మాంసమె యశనముగా, బలువిడి వనచరుల నెల్ల ♦ బాధించుతమిన్. ౫॥

తే. నెత్తురునె త్రావి మిక్కిలి ♦ మత్తుఁడనయి
ధర్మములఁ బాడుసేయుచుఁ ♦ దగ నొకతఱి
మానియాకృతిఁ బూని ధ♦ర్మమునె యాచ
రించుచుండిన రాము న♦రిందమునిని. ౬॥ 996

క. జనకజను మహాభాగను, ఘనుఁడు మహారథుఁడు నొచుఁ ♦ గ్రాలు సుమిత్రా
తనయునిని జేరఁబోయితి, దనుజేంద్రా! మృగతనువును ♦ దాల్చిన నేనున్. ౭

సీ. కఱకుఁగొమ్ములు గ్రాలఁ ♦ గా మున్ను గొట్టినదెబ్బను మదినిఁ జిం♦తించిమిగుల
నాగ్రహంబును బొంది♦యావైరమును నెన్ని బుద్ధిసంపదలేమి♦బుధనుతుఁడయి
తాపసుండయి నియ♦తంబగు నాహారమును గొని భూతాళి♦కిని హితంబుఁ
గోరుచు బలశాలి ♦ యా రాముఁ గని వీఁడు తాపసివేషమ్ము ♦ దాల్చినాఁడు

తే. కాన నన్నేమిచేయఁగాఁ ♦ గలఁడటంచు
జంపఁగాఁ బూని యురవడి ♦ సాహసంబుఁ
జూపఁగాఁబోయితిని; నన్నుఁ ♦ జూచి యతఁడు
ధనువు సారించి బలమునఁ ♦ గనలుచు వడి. ౮॥ 998

క. గరుడానిలనాదంబున, బరుగిడునస్త్రత్రయంబుఁ ♦ బగవారిని వే
పరిమార్చుదాని విడిచెను, బరమక్రోధమున నన్ను ♦ భంజించు తమిన్. ౧౦॥

క. కులిశంబురీతిఁ గఠినం,బులు గాఁ దగ రక్తపాన♦మును జేయునవై
యలఘుగతిన్ నతపర్వం,బులునయి యామూఁడు బాణ♦ములు నొక్కమొగిన్.

క. చనుదెంచె నంత నేనును, మును రాముని తీవ్రబాణ♦ములఁ జిక్కి భయం
బును గన్నవాఁడఁ గాన న,తనిశౌర్య మెఱింగి యుండఁ ♦ దగదని పెలుచన్.

క. పరుగెత్తితి శ్రీరాముని, శరము పలాయితునిఁ జంపఁ ♦ జనదను నియతిం
బరఁగుటఁ దద్బాధను గన,క రయంబునఁ బాఱినాఁడఁ ♦ గ్రవ్యాదేశా. ౧౨॥

చ. దనుజులు వారలిద్దఱును ♦ దద్భుజశౌర్య మెఱుంగకుంట మా
ర్గొని హతులైరి; నేను నటఁ ♦ గ్రూరశిలీముఖముక్తి నెట్టులో
గని యనుసంతతుల్ నిలువఁ♦గాఁ జెడుకార్యములెల్ల మాని యో
గనిరతిఁ గాంచి మానినయి ♦ కాలముపుచ్చుచు నున్నవాఁడఁజూ. ౧౩॥ 1003

సీ. ప్రతిభూరుహంబున ♦ వల్కలంబులను గృష్ణాజినంబును దాల్చి ♦ యతులచాప
హస్తుఁడౌ శ్రీరాముఁ ♦ డత్యుగ్రపాశముల్ హస్తంబునం బట్టి♦నట్టి యముని
కరణి నాకింకను ♦ గనఁబడుచున్నాఁడు; రాముఁ డొక్కఁడెతరు♦వ్రజముచెంతఁ
గనఁబడుచుండుట ♦ గాదు భీతుండనౌ నాకు వేలుగ రామ♦నామధరులు

తే. కనఁబడుచు నున్నహారలీ ♦ కాననంబు
తన్మయంబుగఁ దోఁచెడి ♦ దనుజనాథ
యిదియుఁ దన్మాయఁగల్గిన ♦ యదియొగా ద
తండు లేనట్టితావునఁ ♦ దగ నతండె. ౧౭ 1004

చ. కనఁబడుచున్నవాఁడు స్మృతి ♦ గల్గిన యప్పుడెకాదు స్వప్నమం
దును రఘురాముఁడే యెదుటఁ ♦ దోఁచును గావున భీతిఁజెంది యిం
కను బహుభంగులన్ వెతలఁ ♦ గాంచుచుఁ బల్కుచునుందు రావణా
వినుమిట రామభీతిఁ గని ♦ వ్రేఁగెడు నేనును భ్రాంతినొందుటన్. ౧౮ 1005

సీ. ఆదిరేఫమ్మను ♦ నక్షరము గలరత్నరథాదులైన ప♦దములఁ గూడఁ
బ్రథమాక్షరము వినఁ♦బడినతోడనె రాము నాహ్వాయమే చెప్ప♦నగునొయనెడు
భయముతోఁ చెదుఁ;దరు♦వాతివర్ణము విన్నయంత నేయాభయ♦మడఁగుచున్న;
దేను రామునిశక్తి ♦ నెంతయు నెఱుఁగుదుఁ గాన నాతనితోడఁ ♦ గలహమీవు

తే. సేయుటది మేలుగాదు నీ♦చేతఁగాదు, బలిని నముచిని నని వధిం♦పంగఁ జాలు
బలముగలవాఁడు సూ రఘు♦వరుఁడు నీవు, పగను దీర్పంగఁగోరిన♦వాఁడవైన.

క. ఆయనను మాఱుకొని యని, చేయుము కాకున్న సఖులఁ ♦ జెండినకృత్యం
బే యెడలఁ దలఁపకుండుము, [1]నాయన! ప్రాణయుతుఁజూడ♦ననుఁగోరుదు వేన్.

తే. అతనిముచ్చట నాచెంత ♦ ననవలదిఁక
జగమునన్ యోగ్యులై ధర్మ♦సాధనమ్ముఁ
జేయుచున్ దగు సజ్జనుల్ ♦ చెంతనున్న
యొరుల యపరాధములచేత ♦ నొక్కమొగిని. ౨౦ 1008

క. పరిజనులతోడఁ దారును, గరము వినాశంబు నొందఁ♦గాఁ దగుదురునూ
పరికింప సాధువృత్తిని, నరణ్యమున నున్ననేఁ దవ్వ♦దపరాధమునన్. ౨౧ 1009

తే. నాశమొందుదు; నేది మ♦నంబునందు
యుక్తమని తోఁచునో యట్లె ♦ యొనరుచుకొను
మింక నాజోలికిని రాన♦దేమి యైన
[2]నేను నీవెంట రా నిది ♦ నిశ్చయంబు. ౨౨ 1010

క. గురుతేజోధైర్యబల, స్ఫురణంబులు గల్గు రామ♦శుభ్రాంశునియం;
దరయఁగ నతఁడే దనుజో,త్కరమునకుం గాలసముఁడు ♦ కాకున్నె యిఁకన్?.

సీ. ఒకరికిఁ గష్టంబు ♦ లొదవించు కార్యముల్ చేయఁడు రాముండు ♦ సిద్ధమిద్ది
శూర్పణఖ విరూప ♦ నేర్పడఁ జేసినకతన యుద్ధముచేయఁ♦గా నచటికి
వచ్చిన ఖరుని జం♦పఁగ లేదె యందువే వినుము శూర్పణఖ సీ♦తను వధింపఁ
బోవ నట్లొనరించెఁ♦బూని దానికినయి ఖరుఁడు మార్కొనఁబోవఁ♦గావధించె

1 యది మాం ద్రష్టు మిచ్ఛసి-అనిమూలము. జీవితు మిచ్ఛ సీత్యర్థః అనివ్యాఖ్య. 2 అహం త్వా నానుయా మిహ-అనిమూలము. దీనియర్థమే యిట విస్తృతము.

తే. నిందు రఘురాము నపరాధ ♦ మేమియున్న
ది? నిజముగఁ జెప్పుమా; నేను ♦ దివిరి బంధు
హితముఁ గోరినవాఁడను ♦ సతతముగుటఁ
బరమహితవాక్యమును దీనిఁ ♦ బలికినాఁడ. ౨౪ 1012

తే. ఇట్టిపల్కుల గొనవేని ♦ యెల్లబంధు
వులను గూడి రణంబున ♦ నలఘురాము
శరములకుఁ జిక్కి నీయసు♦సంతతులను
విడువఁగల విధి నిక్కమా ♦ వినుము దీని. ౨౫ 1013

ముప్పదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

౪౦ - వ సర్గము.

మారీచుని పల్కుల నిరాకరించి రావణుఁడు సహాయముగ రమ్మని నియమించుట.

మ. అని మారీచుఁడు యుక్తియుక్తముగ నె♦ట్లైనన్ మరల్పంగ నే
యనుమానంబును లేక చెప్పినను దై♦త్యాధీశుఁ డవ్వాక్యమున్
వినఁడయ్యెన్ మరణింపఁ గోరునతఁ డు♦ద్యద్వృత్తిన్ దగన్ మందుఁ గై
కొననట్లే మఱి కాలచోదితుఁడునై ♦ కోపంబు నిండారఁగన్. ౧ 1014

క. అనపాయముగాఁగ సుఖం,బును గల్గఁగఁ జేయునదిగఁ ♦ బొల్చెడు వాక్యం
బును మారీచుఁడు పల్కఁగ, వినియు నతనితోడఁ బరుష♦వృత్తి తగంగన్.

తే. ఎంతయు నయుక్తముగఁ బల్కె ♦ నిట్టు లనుచు;
నోరి మారీచ! రాజుగా ♦ నొప్పు నావి
షయమునన్ నీవనుచిత ని♦స్సారవచన
మును దగం బల్కితివిగ భీ♦తిని ద్యజించి. ౨ 1016

తే. అట్టివాక్యంబు లూషర♦మందు నాటి,నట్టి బీజంబువలె ఫల ♦ మందఁజాల;
వతఁడు నిష్కారణముగ ఖ♦రాదిదనుజు,లనువధించిన దుశ్శీలుఁ♦డనఁగఁదగఁడె.

క. అరయఁగ మూర్ఖుఁడు మఱియున్, నరుఁడగుఁజు మ్మతనితోడ ♦ నాకుండగునే
దురమొనరించుట కానం, దరుణీమణి బలిమిఁగొనఁగఁ ♦ దప్పదు నాకున్. ౩

సీ. అంగనామణ్యప♦హరణమునుండి నన్ మరలించి యతనితో ♦ దురముసేయఁ
బురికొల్పుటను నది ♦ పోల నీమాటల కెంతమాత్రము శక్య ♦ మెట్టు లగును?
గాన నాతని కిటఁ ♦ గాంతాపహరణమే తగినట్టి ప్రతికృతి♦యగు; నతండు
మూర్ఖుఁడెట్లని ప్రశ్న♦మును జేయుదో యొక్క ప్రాకృతకామినీ♦వాక్యమువిని
తే. సఖుల రాజ్యంబు జననిని ♦ జనకు విడిచి
వనముఁ జేరెను గద; ఖర♦దనుజుఁ జంపి

నట్టి యారాఘవునకుఁ బ్రా♦ణాళికంబె
నింపుగా నున్నసీతను ♦ నిపుడె తెత్తు. ౧౯ 1019

క. కనుఁగొనుచుండ నీవుండఁగఁ, జనితెచ్చెద బలిమి మెఱయ ♦ సాధ్వీమణిసం
చని ప్రతినచేయువాఁడను, వినుమా! మారీచ! తీవ్ర♦విషయము దీనిన్. ౨౦

చ. మనమున నిశ్చయించుకొని ♦ మార్పు నొనర్పకయుండఁ జేయఁబూ
నిన నను నిర్జరేంద్రుఁడును ♦ నిర్జరదైత్యులు వచ్చిరేని మర
ల్పను గడుఁజాల; రే నిపుడు ♦ పట్టినకార్యము నిశ్చయింపుమా!
దనుజవతంసమా! యెటులు ♦ తప్పక తీర్పఁగనౌనొ పూనికన్. ౨౧ 1021

తే. ఇందు గుణమేది? దోష మ♦దేది? దాని
నెట్లు సాధింపవచ్చు నిం♦దే దపాయ
మనుచు నిన్నేను బ్రశ్నించి♦నట్టులైన
నిట్లు చెప్పంగవచ్చు నీ ♦ వింతసేపు. ౨౨ 1022

సీ. సంపత్తిఁ బడయు వాం♦ఛను గల్గియున్నట్టి పండితుండౌ మంత్రి♦వరుఁడు తనను
బ్రభువు ప్రశ్నించిన♦భక్తిఁ జేతులు మోడ్చి మదికిఁ దోఁచినయట్టి♦మాటఁ జెప్ప
కొనవలయును భూమి♦పునకు హితంబును జెప్పునప్పుడుగూడ ♦ క్షితిపుమదికి
నొగి విరుద్ధముగాక ♦ యుండునట్లుగ నుపచారపూర్వకముగ ♦ శ్రావ్యముగను

ఆ. హితముగను జెలంగు ♦ నింపైనమాటలు, పలుకవలయు విహిత♦వాక్యమైన
నది తిరస్కృతిగను ♦ ననువదింపంబడు, నేని గౌరవార్హుఁ ♦ డైనరాజు. ౨౩

క. మానవివర్జిత మగుటన్, దానిన్ మెచ్చుకొనఁ డమిత♦దర్పముగల యా
మానితులగు నృపతులు వై, శ్వానర దేవేంద్ర వారి♦పతిరూపములన్. ౨౪

తే. చంద్ర యమరూపములఁ దాల్చి ♦ యుంద్రు, దనుజ!
యగ్నివేఁడిమి, నింద్రుశౌ♦ర్యంబు, వారి
పతిప్రసన్నత, సరసిజ♦వైరి చల్లఁ
దనము, యమునిదండమ్మును ♦ దాల్చియుంద్రు. ౨౫ 1025

క. కావున నేమఱకయె సర్వావస్థలయందు మిగుల ♦ నాదృతి మీఱన్
భూవిభుల గౌరవించుచు, వేవిధులం బూజచేయ ♦ విహితము సుమ్మీ. ౨౬

క. తెలియక పార్థివధర్మంబుం నీ వజ్ఞానమందు ♦ మునిఁగి కుమతితం
జెలఁగి త్వదాశ్రమమున కిమ్ములవచ్చిన నన్నుఁ బరుష♦ములఁ బల్కుదువా.

చ. పరుషము లాడఁగోరుటిది ♦ పాడియె; యిందిపుడేదిదోషమో?
పరమగుణంబదేదొ? తగఁ ♦ బల్కుమటంచు వచింపలేదు; ని
న్నరసి యొనర్పఁగాఁదగునె ♦ యంచును నే నడుగంగఁబూన నీ
తరుణమునందు నింతపనిఁ ♦ దప్పక చెప్పితి దాని నీవికన్. ౨౮ 1028

ఆ. అమితవిక్రమంబు ♦ నందినవాఁడవు, గాన నాదుమాటఁ ♦ గాదనకయె

చేసి తీఱవలయుఁ ♦ జిత్తవిభ్రాంతిచే, మాఱుపల్కరాదు ♦ మాననీయ!. ౧౮॥

సీ. ఆకార్యమేమని ♦ యడిగెదో? యీమహా
కార్యంబునందీవు ♦ కడఁగి నాకు
సాహాయ్యముం జేయఁ♦జనుఁ దద్విధానంబు
వచియింతు వినవయ్య! ♦ ప్రచురధైర్య!
వెండిచుక్కలచేత ♦ వింతఁగాఁ జిత్రింపఁ
బడిన బంగరుజింక♦వపువుఁ దాల్చి
యతనియాశ్రమసీమ ♦ కరిగి జానకిమ్రోలఁ
జరియింపుమా యంతఁ ♦ దరుణికెట్లు

తే. మిగుల నాసక్తి సేపయి ♦ మించునో యటు
వంటి యాశను గల్గించి ♦ వలసినట్టు
లంత నీదారిఁబట్టిరొ ♦ యరుగవచ్చుఁ
గనకమయమైన మాయామృ♦గమగు నిన్ను. ౧౯॥ 1030

క. కనినంత జాతవిస్మయ,మున సీతయు "దీనివేగ♦ముగఁ దెచ్చి ముదం
బున నాకిమ్మా" నాథా!, యని రాముని నడుగఁగలదు ♦ హరిణాక్షి! తమిన్.

మ. నినుఁ బట్టన్ రఘునాయకుం డనుజు నిం♦టిన్ వేగమే పాసి వ
చ్చినమీఁదన్ గడుదూరమేగి యకటా ♦ సీతా! సుమిత్రాత్మజా!
యని యారాముని కంఠనాదముగనే ♦ యారావముం జేయుమా
విని యప్పల్కును లక్ష్మణుండు మదిలో ♦ విభ్రాంతి యానన్ ద్వరన్. ౨౦॥

క. జనకజతన్ బురికొల్పఁగ, ఘనమతియతఁ డన్నయందుఁ♦గల మైత్రిని నా
తని దారిఁబట్టి పోవును;, జన నవ్వారలిటు దూర♦సరణికి నంతన్. ౨౧॥ 1033

క. సురపతి శచినిం దెచ్చిన, కరణిన్ సుఖరీతి రాము♦కాంతను దెత్తున్
సరిగా నాయీచెప్పిన, సరణిన్ నెఱవేర్చి దీని ♦ స్వచ్ఛందగతిన్. ౨౨॥ 1034

తే. అరుగుమా! సువ్రతా! రాజ్య♦మందు సగము
నేను నీకు నొసంగుదు ♦ దీనిఁ దీర్ప
నందమగు మృగరూపంబు ♦ నంది దండ
కాటవికిఁ బొమ్ము సౌమ్య! నే ♦ నరదమెక్కి. ౨౩॥ 1035

క. నిను వెంటనంటి వచ్చెద, ననిసేయక యేక్షితీశు ♦ నాత్మజుకాంతం
గొని బలిమి రాము వంచిం,చి నినుం గూడుకొని కార్య♦సిద్ధిం గనుచున్. ౨౪

క. పురమునకు మరలి పోయెదఁ, ద్వరపడి యీకార్యమీవు ♦ తగ నొనరుపవే
నిరయమున నిన్నుఁ జంపుదుఁ, గరుణం బూన నిఁక నిన్నుఁ ♦ గావఁగ దనుజా!.

క. బలవంతంబుననైనను, దొలఁగక యుండంగ నిన్నుఁ ♦ దోరపుశక్తుల్
తెలియఁగ బంధించియు ని,మ్ములఁ జేయించెదను గార్య♦ముం దీనిఁ జఖా.

క. జనపతికి విరుద్ధముగాఁ, బనిచేసెడు నాతఁ డెట్టి ♦ పట్టునను సుఖం
బును గాంచలేఁడుగద! రా,మునియొద్దకు నీవు పోవఁ ♦ బూనుదువేనిన్. ౨౬॥
క. నిలిచిన నిలుచును బ్రాణం,బు లోక్కతఱి, సంశయంబె ♦ పో మృత్యువు; నీ
వలయక నాతోఁ బగఁగొనఁ, దలఁచితివా మరణ మిపుడె ♦ తప్పదు సుమ్మీ.
క. ఇదియిట్లై జరగఁగలదని, మది రూఢిగ నిశ్చయించి ♦ మఱి యాద్వయి నీ
కెది హితమని తోఁచునొ య,య్యది చేయుము మేలుగీళ్ల ♦ నరయుచు దనుజా.

నలుబదియవ సర్గము సంపూర్ణము.

---

౪౧ - వ సర్గము.

మారీచుఁడు రావణునకు మరల హితోపదేశము చేయుట.

చ. అని యిటు లాదశాననుఁ డ♦హంకృతి మీఱఁ బ్రభుత్వచిహ్నముల్
గనఁబడఁ జేసి తీఱఁదగుఁ ♦ గార్యమటంచు విరుద్ధరీతి నా
జ్ఞను వడిఁ జేయఁగా మది వి♦చారము మీఱఁగఁ దాటకాసుతుం
డనియెను రాక్షసేంద్రుఁగని ♦ యత్తఱిఁ దీవ్రతరోక్తు లొప్పఁగన్. ౧ 1042
సీ. ఏపాపకర్ముఁడో ♦ భూపాల! నీకు నీతనయులకును రాజ్య♦మునకు మంత్రు
లకు వినాశనము గ♦ల్గఁగఁ జేయు నీయుపాయము నీకు నుపదేశ ♦ మాదరమున
నిచ్చినాఁడో? దను♦జేంద్ర! నీవు సుఖంబుగా నుండుటను బాప♦కర్ముఁ డెవఁడు
కనఁజాలకున్నాఁడొ? ♦ కాలుపురమునకు ద్వారమువంటి యీ♦తగనికార్య
తే. మునకు బోధించెనో పూను♦కొనఁగ నెవఁడు
శౌర్యహీను లెవ్వరో ♦ శత్రువులుగ
దనుజులుందురు నిజమిది ♦ తలఁప బలము
గల్గు రామునిచేతిలోఁ ♦ గరము చిక్కి. ౪ 1043
క. నీవు నశింపఁగఁ జూడం,గా వారలు కోరుచుంద్రు♦గద? దశవదనా!
కేవలమై రియు నివ్విధి, గావింపం దందు నీచ♦కర్ముం డెవఁడో. ౪౪ 1044
తే. ఇట్టియత్నంబు నీకు నీ♦వే యొనర్చి
నాశమొందంగవలెనను ♦ నాశయమున
నహితవాదియునై యిట్టి ♦ యపథమునఁ ద
గంగ నుపదేశమిచ్చెను ♦ గాదె చెపుమ. ౫ 1045
తే. శాస్త్రలోకవిరుద్ధమా ♦ సరణిఁ జనెడు, నిన్ను నీమంత్రు లెవ్వరు ♦ నిగ్రహింప
కున్నవా రేకదా! కాన♦నొక్కమొగిని, వారలందఱు నిక్కంబ♦వధ్యు లిపుడు.
చ. ధరణిపుఁ డిచ్చవచ్చిన వి♦ధంబునఁ బోవుచుఁ గాపథంబునం
దిరుగఁగఁ బూనునేని సుమ♦తిం దగు మంత్రిసమూహ మాతనిన్
బరిపరి నిగ్రహింపఁదగు ♦ వారలు దుష్పథమొంది స్వేచ్ఛనం
చరణము సేయు నిన్నడఁపఁ♦జాలక యూరక యుండు టేలొకో?. ౭ 1047

క. దనుజేంద్ర! విజయశీలా!, విను రాజు సమస్తదోష♦విరహితుఁడై యుం
డినఁ దన్మంత్రులు ధర్మం,బును గామముఁ గీర్తి నెపుడు ♦ పొందుదురు సుమీ.

సీ. నృపతి దుర్గుణయుక్తుఁ♦డేని మంత్రులకు ధర్మాదులం దొక్కటి ♦ యైనఁగలుగ
దవ్విధియన్నియుఁ జూడ ♦ వ్యర్థంబు లే రాజు నిర్గుణుఁ డైనచో ♦ నిఖిలజనులు
వ్యసనంబులం గాంత్రు; ♦వసుమతిశుఁడెధర్మ,జయమూలముసుమీ; వి♦జయసుశీల
యతనిచేత స♦ర్వావస్థలందును బార్థివు రక్షింప♦వలయుఁ గ్రూరుఁ

ఆ. డైనఁగాని ప్రజల ♦ కండఅకుం బ్రతి,కూలుఁడైనఁగాని ♦ కుటిలుఁ డగుచు
నింద్రియాళిఁ గెలువ♦నే లేకయుండినఁ,గాని ధరణిఁ గావఁ♦గలఁడె ? నృపుఁడు.

తే. తురగములు మందసారధి ♦ తోల విషమ
భూమి వేగంబు మీఱంగఁ ♦ బోయి యచట
నతనితోఁ గూలునట్లు ల♦త్యంతతీవ్ర
యోజనలుగల మంత్రులు ♦ నుర్వి విభుఁడు. ౧౧½ 1050

సీ. అసమర్థుఁడగుటచే ♦ నన్నివిధంబులఁ దమ భాషములు వినఁ ♦ దలఁచునేని
యతనితోఁగూడి న♦ష్టాశయులగుదురు; నీతిమార్గమునందు ♦ నిష్ఠతనర
ధర్మము నెఱపుచుఁ ♦ దగు సాధువులు పెక్కుమంది యన్యుల నప్టి♦యట్టివారి
యపరాధములచేత ♦ నఖిలపరిచ్ఛదయుక్తంబుగాఁ దాను ♦ నొక్కకీర్తి

ఆ. వరుస నాశమొంది; ♦ రరయ మేఁకలు తమ
వైరియైన నక్క♦పాలనమున
నుండునేని నాశ ♦ మొందునట్లుగఁ గ్రూరుఁ
డయి విరోధియయిన ♦ యధిపుఁ గొలిచి. ౧౪ 1051

క. పాలింపఁబడదు రేని మ,హాలక్షణహీన! పెంపు ♦ నందక నాశం
జేలికవలనం గాంతురు, కూళవు నీ వింద్రియముల♦కుఁ లోఁబడుచున్. ౧౪½

క. కుమతివయి యుంట నీదువ,శమునం దగు దనుజులెల్ల ♦ క్షయముఁ గనుడు; రీ
సమయమునఁ గాకతాళీ,యముగా నాకీవిపత్తు ♦ హా! కలిగెఁ గదా. ౧౫½

ఆ. అతిభయంకరమగు♦నట్టి యీకార్యము, పొసఁగెఁ గాన నేను ♦ బొగులవలసి
నట్టిదేమి లేద ♦ యైనఁ గావలెనని, పృథువిపత్తుఁ దెచ్చి♦పెట్టుకొనుట. ౧౬

క. నీవే బంధుయుతంబుగఁ, జావంగల విట్టి నిన్ను ♦ స్వాంతంబుననే
భావించి దుఃఖమొందం, గావలసియె యున్న దిపుడు ♦ క్రవ్యాదవరా!. ౧౬

క. నీ వుండ లేదె యనినన్, భూవిభుఁ డాతండు నన్నుఁ ♦ బొలియించి తగన్
రావణ! నిను శీఘ్రంబుగ,నే వధియించున్ నిజంబ ♦ యిదె నీరిపుచేన్. ౧౬½

క. పొలియింపఁబడుదుఁ గావున, నిలఁ గృతకృత్యుండ నగుదు;♦నిఁక రాముని గ
న్నులఁ గాంచినంత నన్నుం, బొలిసినవానిగనె యెంచఁ♦బోలును నీకున్. ౧౭½

క. జనకజ హరించినంతనె, నిను బాంధవగణముతో న♦శిం బొలిసినవా

నినిగనె తెలియుము; నీవిఁక, ననుఁగూడి తదాశ్రమంబు♦నకు నేగి వెసన్.

క. సీతను దెత్తువయే నిఁక,భూతలమున బ్రదికి యుండఁ♦బోవు టనృత మా
నీతో నేనుం దెగుదును, ఖ్యాతిం దగు లంకగూడ ♦ నష్టే చెడుఁ జూ. ౧౯

క. దనుజులు జీవింపరు; దైత్యనికాయేశా! భవద్ధి♦తంబును మదిలో
ననిశముఁ గోరుచు వలదని, వినయంబునఁ బల్కుచున్న ♦ వినవిదియేమో?.

తే. పలుకులియ్యవి, పాలింపఁ♦బడక యున్న, వకట! నీచే గతాయుషు♦లౌ మనుజులు
ప్రేతకల్పులె కావునఁ ♦ బీనుఁగువలె, మిత్రవాక్యంబు వినరిది ♦ మేలటంచు.

నలుబదియొకటవ సర్గము సంపూర్ణము.

---

## ౪౨ - వ సర్గము.

రావణుతోఁ గూడిపోయి మారీచుఁడు మాయామృగ మగుట.

క. అని మారీచుఁడు దనుజేంద్రునితోడం బల్కి రావ♦ణునివలని భయం
బున దుఃఖితుఁడై పోవుద,మని మఱియుం బల్కె నార్తుఁ♦డై తడఁబడుచున్.

క. శరచాపంబుల ఖడ్గము, ధరించి ననుఁ జంప నాయు♦ధముఁ దొడిగిన భూ
వరుఁ గంటఁ బడఁగవలసెన్, మరలన్ దానన్ దనంత ♦ మాయు నసువులున్.

క. కనినంతనె నా ప్రాణము, లనుమానము లేకపోవు; ♦ నతని యెదుటికిం
జని పౌరుషమును జూపుచుఁ, దనయసువులతోడ మరలు ♦ ధన్యుఁడు గలఁడే.

తే. ఎట్టివాఁడైన మరలలేఁ ♦ డిద్ది నిజము;
యమునిదండహతుండవై ♦ యంతమొంద
నున్నవాఁడవు నీవు నే ♦ నొక్కఁడను భ
వాదృశుండను నిన్నేమి ♦ పలుకుదు నిఁక. 3 1065

క. కానిపథంబునఁ బోవం, బూనిన యీదుష్టబుద్ధి ♦ పుట్టిన నిన్నున్
నే నేమందుం బోయెద, *నేనిదిగో నీకు శుభము ♦ లెసఁగుంగాతన్. ౪ 1066

క. అని మారీచుఁడు పల్కఁగ, విని మిక్కిలి సంతసిల్లి ♦ బిగ్గఁ గరములం
దనివారఁ గౌఁగిలించుచు, ననియెన్ రావణుఁడు తృప్తి ♦ యలరుచు నుండన్.

క. నీవిట్లు వీరధర్మము, భావించి వచించినట్టి ♦ వాక్యముఁ గనఁగా
నావంటివాఁడు పల్కిన, నేవిధమున నుండునట్టు♦లే యున్నది సూ. ౫ 1068

తే. ఇపుడు నీవు మారీచుఁడ ♦ వింతకు మును
మఱొక దనుజకుమారుని♦మాడ్కి నుంటి
వమల రత్నాభిమండితం♦బై పిశాచ
వక్త్రఖరములఁ బూన్చిన ♦ పరరథంబు. ౬ 1069

---

* స్వస్తితేస్తు నిశాకర-అనిమూలము.

క. తనరారెడు నీయరదం,బును నాతోఁ గూడి శీఘ్ర♦ముగ నెక్కుము; చ
య్యన సీత కానఁ గొలిపిన, యనంతరమె నీవు స్వేచ్ఛ ♦ నరుగుము వత్సా!.

క. నే నారాఘవు లిర్వురు, జానకి విడనాడి తొలఁగి ♦ చన నెవ్వరునుం
గానంబడనితఱిక వే, మానినిఁ గొని తెచ్చువాఁడ ♦ మారీచ! తమిఁక. ౮

తే. అనియె; మారీచరావణు ♦ లంతవోక్యను
యాన మట్లున్న దివ్యమా ♦ స్యందనంబు
నెక్కి యాయాశ్రమము వీడి ♦ యెలమి మీఱఁ
జనిరి వేగముగా నట్లు ♦ దనుజయుగము. ౯ 1072

క. కనుఁగొనుచుఁ బత్తనంబుల, వనముల, శైలముల, ద్వీప♦వతులఁక, రాష్ట్రా
ళిని, నగరంబులఁ బోయిరి;, దనుజేంద్రుం డిట్లు దనుజ♦తల్లజుతోడక. ౧౦॥

క. అరుదెంచి దండకాటవి, కరుదా రామాశ్రమంబు ♦ నందుం గనియెక
సురవైరి కనకమయమగు, నరదంబును డిగ్గి ప్రీతి ♦ యలరఁగ నంతక. ౧౧॥

తే. తాటకాసుతుహ స్తంబుఁ ♦ దనకరములఁ
బట్టుకొని ప్రియమిత్ర! రం♦భాద్రుమాభి
వృతముగానున్న యాశ్రమ♦మిదిగొ యిందె
జానకీపతి యుండును ♦ దీనిఁ గనుము ౧౨॥ 1075

క. మనమేటికి వచ్చితిమో, పని దానిక వేగ తీర్ప♦వలయుం జుమ్మీ;
యని పలుకక మారీచుఁడు, విని మృగరూపంబుఁ దాల్చి ♦ వింతగతులతోక.

క. శ్రీరాముని యాశ్రమ, ద్వారంబునఁ దిరుగుచుండెఁ; ♦ దన్మృగరూపం
బారయ నద్భుతదర్శన,మై రమ్యం బగుచుఁ జూడ ♦ ననువుగ నుండెక. ౧౪॥

సీసమాలిక:—

ఇంద్రనీలాకృతి ♦ నెసఁగు శృంగాగ్రముల్ వెలయంగ మోమున♦విమలరుచిర
సితనీల రేఖలు ♦ చెలఁగుచు నుండంగ నాస్యపుటద్వయ♦మందు నొకటి
యరుణపద్మాకృతి ♦ నమర వేఱొకటి యుత్పలవర్ణమగుచు నం♦దంబు గులుక
నింద్రనీలోత్పలా♦కృతిఁ గర్ణయుగ మొప్పఁ గించిదభ్యున్నత♦గ్రీవ మలర
హరినీలదళసమా♦నాధర మొప్పంగ శశికుందవజ్రక♦సన్నిభోద
రము పొల్పు మీఱఁగ♦రమ్యమధూకపుష్పాభమై యొకపార్శ్వ♦మలరుచుండఁ
దక్కునంగంబులు ♦ తామరసవిలోల కేసరసమములై ♦ భాసురముగ
నమరవైడూర్యర♦త్నాకృతిఖురములు మెఱయంగ జంఘలు ♦ మిగులఁ దనుతఁ

తే. దనరి వెలయంగ సంధిబం♦ధములు దృఢము
లగుచు విలసిల్లఁ బుచ్ఛోర్ధ్వ ♦ మమరనాథ
ధనువువలెఁ బలురంగులఁ ♦ దనరుచుండఁ
గన్నుఁగొనంగ మనోజ్ఞమై ♦ కాంతి వలరి. ౧౫ 1078

క. పలురంగుల రత్నంబుల, నలరుచు బిందువులు తనరు♦నట్లు మృగంబై
యల మారీచుం డుటజ,స్థలమున రమణీయరీతిఁ ♦ జయ్యనఁ దోఁచెన్. ౧౯

క. వనమును దానిన్ భాసుర,మునుగా నొనరించుచున్ బ్ర♦మోదముఁ గూర్పం
గనుజాలి దర్శనీయం,బు నగుచుఁ బలురంగులొప్పఁ ♦ బొలుచు తనువుతోన్.

క. జనకజకు నాస పుట్టం,గను జేయఁగఁ బూని పచ్చి♦కను మేయుచు మె
ల్లన నిందు నందుఁ బాఱుచుఁ,గనఁబడుచున్ బోవుచుండెఁ♦గడుఁ జిత్రముగన్.

చ. తనువున రూప్యబిందుసము♦దాయము చిత్రముగాఁగ నుండుటన్
గనుఁగొన నింపుగాఁ దనరి ♦ క్ష్మారుహకోమలపల్లవాళి నా
ర్యున మునిపంక్తిచేఁ గొఱికి ♦ యూఁకలిచేఁ దినుచున్ జరించె; నిం
కను గృహరీతిగా నమరి ♦ క్రాలు ననంట్లకుఁ బోయి యవ్వలన్. ౨౨| 1082

ఆ. కొండగోఁగుచెట్ల♦కుం బోయి నిలుచుచు, మందగతులు మీఱ♦సుందరముగఁ
గానఁబడుచు సీతఁ ♦ గనఁదగు స్థలమున, కరిగి తిరుగుచుండె ♦ నందు నిందు.

చ. సరసిజకేసరప్రభల♦చందమునం దగు పృష్ఠకాంతితోఁ
బరఁగుచు నామహామృగము ♦ భద్రగతుల్ దగ రాము[1]నాశ్రమ
స్థిరఁ గడుదాపునన్ సుఖముఁ ♦ జెందినమాడ్కిఁ జరించుచుండె; ని
ర్ఝరణిఁ జరించి కొంతవడిఁ ♦ గన్పడకుండఁగఁ బోయి యంతలోన్. ౨౪|

క. మరలం జనుదెంచి మహో,దరమునఁ జరియించు నొక్క♦తఱి నెచ్చటికో
యరిగి మఱికొంతవడి కా,ధరణికె తా మరలివచ్చుఁ ♦ దగునటు తిరుగున్. ౨౫

క. ఈరీతిన్ విహరించుచు, మారీచుఁడు గొంతసేపు ♦ మహిఁ గూర్చుండున్
గౌరవము తనర నుటజ,ద్వారంబున కరిగి యందుఁ ♦ దగు మృగగణమున్.

క. చేరఁగఁ జూచున్ మృగతను, ధారి మహారాక్షసుండు ♦ తన్ను మృగగణం
బారసి వెంటన్ రాఁగా, శ్రీరాముని పత్నిఁజూడఁ ♦ జెచ్చెఱ మరలున్. ౨౭

చ. అరుదుగ మంగళాకృతుల ♦ నందుఁ జరించుచు నుండె; నావనిన్
దిరుగు మృగంబులెల్లఁ జను♦దెంచి మహాద్భుతరీతి నున్నదా
ని రమణఁ జేరఁబోయి కరు♦ణించిన[2]మాడ్కిని మూరుకొంచు భీ
కరుఁడగు రాక్షసుం డితఁడు ♦ కాదు మృగంబని తా రెఱుంగుటన్. ౨౮|

సీ. ఎల్లదిక్కులకేగె ♦ నీరీతి నవి పాఱ నాతఁడు మృగవధ♦మందు నిరతుఁ
డయ్యును దనభావ♦మప్పు డాచ్ఛాదింప నామృగంబులఁ దాఁకి♦యంత విడిచెఁ
గాని భక్షింపఁగఁ ♦ బూనఁడయ్యెను నప్డు భవ్యలోచనములఁ ♦ బరఁగుసీత
యంత నప్పుడె కుసు♦మాపచయంబునఁ దగులుకోరికమీఱఁ ♦ దరువుల పరి

---

1 ఆశ్రమస్థిరన్=ఆశ్రమభూమియందు. 2 ఉపాగమ్య సమాఘ్రాయ విద్రవంతి దిశోదశ.
అనిమాలము. రాక్షసుం డితఁ డనునది భావము.

తే. సరమునకు వచ్చె సురుచిరా♦స్యయును మదిర
నయనయునునయి చెలువారు ♦ నాతిమిన్న
కర్ణికారద్రుమాశోక♦కమ్రచూత
ముఖ్యతరువులకడకును ♦ బోయెఁ గామిని. ౩౧ 1089

క. పరమప్రమదారత్నం, [1]బరణ్యమున నుండఁదగని ♦ యాజానకిచి
త్రతరువువలె రత్నమయమై, వరమౌక్తికబిందుచిత్ర♦భవ్యతనువుతోన్. ౩౨

క. కనసందమైన యామృగ,మును గాంచెను; రుచిరదంత♦ముల నోష్ఠములం
దనరారు సీత విస్మయ,మున విచ్చిన కన్నుఁగవయు ♦ మోము వెలయఁగన్. ౩౩

తే. ధాతురూప్యమయంబులై ♦ తనరు వెండ్రు
కలను ముద్దులుగులుకు జిం♦కను విచిత్ర
ముగఁ గనంబడఁగా స్నేహ♦మునఁ గనియెను;
నంత మాయామృగంబు రా♦మాంగనఁ గని. ౩౪ 1092

చ వనమును దాని దేహరుచి ♦ భాసిలఁ జేయుచుఁ జిత్రరీతిగాఁ
గనఁబడి సంచరించె; జ♦నకప్రభుకన్య యదృష్టపూర్వమై
కనదురురత్నబిందువులఁ ♦ గాంతినిఁ జూపుచునున్న యామృగం
బును గని చాలవిస్మయముఁ ♦ బొందెఁ [2]దదీయవిచిత్రసృష్టికిన్. ౩౫ 1093

నలువదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## ౪౩ - వ సర్గము.

సీత మృగమును బట్టియిమ్మని రామలక్ష్మణుల నడుగుట.

చ. సురుచిరహాటకాభరుచి ♦ శోభిలఁగా ననవద్యగాత్రయై
వరకటిభాగమెంతో రుచి♦వర్ధిల నొప్పెడు సీత పూవులా
దరమునఁ గోయుచుండి యిరు♦తట్టుల హాటకరూప్యకాంతులన్
బరఁగుచు నున్న యామృగము ♦ బాగుగఁ గాంచి ప్రమోదచిత్తయై. ౧

క. పెనిమిటిని రామచంద్రుఁ ద,దనుజుని లక్ష్మణుని నాయు♦ధాళిం గొనిరం
డని పిలిచె గట్టిగా న,జ్జనకజ యిటు పిల్వఁ బురుష♦సత్తము లంతన్. ౨

తే రామలక్ష్మణు లరుదెంచి ♦ రమ్యమైన
యాస్థలంబున నెల్లెడ ♦ నరసి యొక్క
ప్రక్క నున్న మృగంబును ♦ భవ్యతరముఁ
గనిరి సౌమిత్రిమాత్ర మ♦క్కజమునొంది. ౩ 1096

---

1 అనర్హారణ్యవాసస్య-అనిమూలము. 2 తదీయవిచిత్రసృష్టికిన్-అనునది సమయానుగుణ్యమగుటఁ జేర్పఁబడినదని తెలియవలయు.

క. మనమున సందియమందుచు, ననియెన్ శ్రీరాముతోడ ♦ నలమారీచుం
డను దనుజుఁడె యీమృగతను,వును దాల్చె నటంచు నాదు♦బుద్ధిఁ దలంతున్

చ. వనముల వేఁటలాడుటకు ♦ వచ్చిన రాజులఁ గామరూపి యీ
దనుజుఁడె యీమృగాకృతిని ♦ దాల్చి యఘప్రదమైన దీనిచే
తనె పొలియించెఁ బూరుషవ♦తంసమ! మాయలెఱుంగుఁ బెక్కుఁగాఁ
[1]గనుకనె వానిమాయయె ని♦కామరుచుల్ తగు జింకయయ్యెఁజూ. ౫౪ 1098

తే. వినుము గంధర్వపురము భం♦గిని విచిత్ర
మగుచుఁ గనఁబడుచున్నది; ♦ జగతి నిట్టి
రత్నబిందుసమూహచి♦త్రమగు మృగము
లేదు వెదకిన నెందును ♦ మేదినీశ!. ౬౪ 1099

క. కనుక నిది మాయయే యగు, ననుమానము లేదటంచు ♦ న్యాయముగాఁ బ
ల్కిన లక్ష్మణు వారించుచు, జనకజ సుస్మితము గ్రాల ♦ సంతస మలరన్. ౭౪

క. సురుచిర మా మృగచర్మము, గరము మనంబును హరింపఁ♦గా రామునిఁ గాం
చి రమణఁ బల్కెను మృగమిది, హరించె నామదిని సుంద♦రాకృతిచేతన్. ౮౪

తే. ఆర్యపుత్త్రా! మృగంబిది ♦ యాటలాడు
కొనుట కుపయోగపడును గా♦వునను దీని
బట్టి తెమ్మా! మనసంబున ♦ వాంఛ యలరె;
[2]దీర్ఘబాహూ! మనోహర! ♦ ధీర! శూర!. ౯ 1102

సీ. మనయాశ్రమపదంబు♦నను మనోజ్ఞములయి సుందరాంగమ్ముల ♦ సొంపునింపు
మృగములు సృమరంబు♦లెల్లెడఁజమరమ్ము వెలుఁగుబంట్లునుబిందు♦మృగములల్లె
వానరంబులు తను♦వైభవమునఁ బొంగునట్టి [3]కిన్నరసమూ♦హములు గుంపు
గాఁగూడి పావన♦గాత్రంబులం జూడఁ దగ సంచరించెడు ♦ ధరణినాథ!

తే. యీమృగమ్మునఁ గన్పడు ♦ నెల్లవిషయ
ములను బోలిన మృగగణ♦ములు మదీయ
నయనపథమున మును పడి♦నయది లేదు
కాన నీలాటిమృగమునుఁ ♦ గాననిందు. ౧౧౪ 1103

క. ఘనతేజము క్షమదీప్తియుఁ, దనరారం దిరుగు, దీని♦తనుగుణములలోఁ
గనఁజాల నితరమృగగణ,మున నొక్కండైనఁ గాన ♦ మోదంబలరెన్. ౧౨

క. పలువర్ణంబులఁ జిత్రం,బులైన యంగముల రత్న♦పుంబొట్టులచే
వెలిఁగించుచుఁ గానందగు, లలితమృగం బిద్ది శశివి♦లాసమురీతిన్. ౧౨౪ 1105

క. కనఁబడుచున్నది చల్లఁగఁ, గనులకు నారారా! యేమి♦గాత్రం బిది యే

1 అస్యమాయాదిదో మాయామృగరూప మిదం కృతమ్-అనిమూలము. 2 ధీరశూర=ఈవిశేష
ణద్వయ మర్థపోషకమగుటఁ జేర్పఁబడినది. 3 కిన్నరాః మృగవిశేషాః-అని వ్యాఖ్య.

మనిచెప్పవచ్చుఁ గాంతియు, వినఁదగు కంఠస్వరంబు ♦ వింతయి దేమో. ౧౩

తే. అద్భుతంబుగఁ జూపట్టు ♦ నవయవముల
సంపద యి దేమొ? చూడ నా♦శ్చర్యమయ్యె
దీనిపై భవమెల్ల నా♦మానసమును
లాగుచున్నది తనవైపు ♦ లలితమగుట ౧౪ 1107

క. రామా! ప్రాణంబులతో, నీమృగమింట నీకుఁ జిక్కె♦నేని మనకు స
త్యామోదము నాశ్చర్యముఁ, దా మించఁగఁ జేయుకున్నె ♦ ధరణీశవరా. ౧౫

క. వనవాసనియతి దీరిన, వెనుకను రాజ్యమునను సుఖ♦వృద్ధిం గనుచుం
డినతఱిని విస్మయంబును, జనియింపం జేయు దీని♦చక్కఁదనము సూ. ౧౬

తే. అంతిపురమున కిద్ది భూ♦షార్థ మనుపఁ
దగినదియుఁ గాఁగలదు; ప్రభూ! ♦ ఘాగడఁదగిన
యీమృగాకృతి భరతున ♦ కెలమి నీకు
నాకు నాయత్తలకును సం♦తతముదంబు. ౧౭ 1110

క. కలిగింపఁగలదు విస్మయ, మలరారెడు నెల్ల వేళ♦లందును; ప్రాణం
బులతో నీమృగవర మిమ్ములఁ జిక్కకయున్నఁ జర్మ♦మును వింతనిడుఁ౯. ౧౮

సీ. దీనిని జంపియే ♦ తెత్తువేని మహాత్మ! బంగరురంగుచే ♦ వఱలుదీని
చర్మము లేఁతప♦చ్చనిగడ్డిచే వేయఁబడిన మున్యాసన♦వరముపైని
జక్కఁగాఁబఱచి నీ♦సంగతితో నేను దానిపైఁ గూర్చుండఁ♦దలఁతుఁ జుమ్ము
కాంత లివ్విధి స్వేచ్ఛఁ♦గా భర్తలను బురికొల్పు వృత్తమ్మది ♦ క్రూరమగును

తే. దగ ది దేమాత్రమైన నా♦థ! యటులైన
దీనితనువును జూడ నెం♦తేని విస్మ
యంబు గలుగుచు నున్నదే ♦ యరిగి తెమ్మ
యనుట తగదిది నీకిష్ట♦మైనఁ దెమ్మ!. ౨౦ 1112

చ. అలరుచు నిట్లు పల్కె జన♦కాత్మజ! యంతట నింద్రనీలరో
చులు గలకొమ్ములం జెలఁగు♦చుఁ౯ గనకాభములైన రోమముల్
వెలయఁగ బాలభాస్కరుని ♦ వింతపుచు ల్దగ మించుచున్నచు
క్కలవలె నున్నమచ్చలను ♦ గ్రాలెడుదాని మృగంబుఁ జూడఁగా౯. ౨౧

క. రాముసీమునమున నచ్చెరు, వామూర్తిం బొవలె నిట్టు ♦ లంగనవేఁడం
గా మనుత వినియుఁదానై, యామృగిమునుజూచియునుము♦హాద్భుతమగుట౯.

తే. దానిరూపంబునందాశ ♦ తనర సీత
యట్టె పురికొల్ప సంతుష్టుఁ♦డగుచు ననుజు
నాదృతిం గాంచి పల్కె ని♦ట్లనుచు; ననుజ!
జనకజకు దీనిపై నెంత ♦ మనసుగలదొ. ౨౩ 1115

క. కనుఁగొనుమా యీచందం,బునఁ దగురూపమున మిగులఁ♦బొల్చెడు మృగమొం
దును లేదిల మఱియొక్కటి, వనమున నిండరసినఁ గనఁ♦బడ దెచ్చోటన్. ౨౮

క. విను లక్ష్మణ! నందనమం,దును జైత్రరథంబునందుఁ ♦ దోఁపవు గన దీ
నిని బోలిన మృగములు; ధా,త్రిని దొరకుట లేదనుటయుఁ ♦ దెల్లమకాదే.

సీ. ఎదురుమొగంబుగాఁ ♦ గుదురుగఁ దిరిగియు
నొకమొగంబుగఁ జాఁగి♦యును జెలంగు
చున్నట్టి వెండ్రుక ♦ లొగి భర్మబిందువు
లను జిత్రితములయి ♦ తనువునకును
జక్కఁదనంబును ♦ సమకూర్చుచున్న వి
య్యది యావులించు న♦య్యదనునందు
నాలుకయును వద♦నమునుండి వెడలి వై
శ్వానరజ్వాలల♦వలె వెలుఁగుచు

తే. జలధరమునుండి వెడలెడు ♦ చంచలవలె
వెలయుచున్నది; చూడుమా ♦ విబుధనాథ
నీలపుంగిన్నెవలెఁ జాల ♦ మేలిమోము
ముట్టె యందంబుగాఁ గను♦పట్టుచుండ. 1118

ఆ. శంఖ,మౌక్తిక,ముల ♦ చందంబునం దెల్ల,నైన కడుపువెలయ ♦ నందమగుచు
నున్న యీమృగంబు ♦ నుర్వి యెవ్వరిచి,త్తమును హరింపకుండు?♦ననుజతలఁపు.

చ. కనకమయంబు రత్నచయ♦కాంతి మనోహరబిందుసంయుతం
బును నయి చాల నందముగఁ ♦ బొల్చెడుదీని మనోహరాంగముం
గనినపు డేరిచిత్తము ని♦కామము విస్మయమందకుండు? [సీ
జనకజ, ముగ్ధ, నారి, గనఁ♦జాలక యుండునె విస్మయంబికన్.] ౨౯ 1120

క. మనుజేశులు మాంసముకొఱ,కును మఱి విహరించుకొఱకు ♦ ఘోరవిపినమం
దును వేఁటయందు మృగగణ,మును జంపుదు రిట్టిదానిఁ ♦ బోనిత్తురొకో?. ౩౦

తే. వేఁట యనుపని నెపమున ♦ వింతమణుల
రత్నకనకాదులను నిచ్చు ♦ రమ్యధాతు
వులను మృగరూపధనమును ♦ నెలమిఁ జేర్చు
కొందు రటుగాన దీనిఁ గై♦కొనుట తగదె?. ౩౧ 1122

చ. మనుజులు వృద్ధిరీతిఁ దమ♦మానససీమలఁ గోరుద్రవ్యమె
ల్లను దగ శుక్రకోశము వి♦లాసము మీఱఁగ నిండఁజేయురీ
తిని వనమందుఁ జిక్కఁదగు ♦ దివ్యపదార్థము లుర్వినాథు చ
క్కనిదగు బొక్కసంబును ని♦కామము నిండఁగఁ జేయు లక్ష్మణా. ౩౨ 1123

తే. ఐన యోజించి యేపని♦నైనఁ జేయఁ
దగు ననుచుఁ బల్కు దోపదా♦ర్థంబుఁ గోరు

వాఁడ దేవస్తువితతలో♦భమున నేమి
యును విచారింప కర్దానిఁ ♦ గొనఁదలఁచునొ. ౩౨ 1124

తే. దానినే నీతిశాస్త్రవే♦త్తలును నర్థ,వంతులును నర్థమందురు; ♦ భవ్యచరిత!
యర్థమనఁగ నాశింపఁగ ♦ నర్హమైన, వస్తువేగద? యిద్ది యా♦భంగిగాదె?. ౩౩

సీ. మృగరత్నమున దీన ♦ మిక్కిలి మూల్యమౌ కనకచర్మంబదె ♦ గలదు గాన
శుభమధ్యమ యగు నీ♦శ్లోకకుమారిక యాచర్మమందు న♦త్యాదరమున
ననుఁగూడి కూర్చుండ ♦ ననువగునటు సేయఁ గల; దీక నల్లచా♦ఱలను దనరు
నిట్టియు నుఱిబొట్ల ♦ యిట్టియు నాలిమృగంబుఁ బ్రవేణీమృ♦గంబుఁగాని

తే. మృదువుగా స్పృశియించిన ♦ నెట్టిసుఖము
గలుగునో దాన దీనికిఁ ♦ గాదు సాటి
యనుచుఁ దోఁచెడు నాకు; నో♦యనుజ! మఱియు
నొక్కమాట వచించెదఁ ♦ జక్కవినుము. ౩౪ 1126

చ. కరమరుదా ప్రకాశమునఁ ♦ గ్రాలెడు నీమృగ మంబరంబునం
దిరుగుచుఁ జంద్రదైవతము ♦ దివ్యమునౌ మృగశీర్షమన్ మృగం
బరయఁగ నీధరామృగము ♦ సంబరమం దలరారు నామృగం
బు రమణఁ గ్రాలు రెం డివియె ♦ పో సరిలేనిమృగంబు లెన్నఁగన్. ౩౫

తే. అనుజ! నాతోడ నీవు ప♦ల్కినవిధంబు
గా నిదియుఁ దాటకాసుతు ♦ కామరూప
మగునయేని వధింపంగ ♦ నర్హమెకద
తప్పకుండఁగ నిప్పుడే ♦ దారుణముగ. ౩౬ 1128

క. క్రూరుఁడు దుశ్శీలుం డీ,మారీచుఁడె యిందుఁ దిరిగి ♦ మానుల నెల్లన్
ఘోరముగాఁ జంపెను మును; భూరమణులు మేటిచాప♦ములఁ బూని యిటన్.

క. చరియించుచు మృగయారతి, నరసి భయంకరమృగాళి ♦ నంతయుఁ దునుమన్
గరువమున నీతఁడే, యానరపతులం బట్టి చంపి♦నాఁడు కుమారా!. ౩౭

క. కనుకన్ వీని నవశ్యము, పని పూని వధింపవలయు; ♦ వాతాపియు ని
ల్వలునుండి మున్ను భూసుర,మునులకుఁ దా మేఁకరూప♦మున భోజ్యంబై.

తే. వారియుదరంబులందునె ♦ చేరి యశ్వ,
*తరియుఁ బ్రసవించువేళ వ♦త్స మ్ముదరముఁ
జీల్చుకొని వచ్చి దానిని ♦ జెండినట్లు
వారికుక్షులఁ జీల్చి య♦వార్యరీతి. ౪౦ 1132

క. పనిపూని చంపుచుండెన్, దనుజుం డతఁ డట్లు చంపి ♦ దగ నొకకాలం
బున మాంసలోభమున నే, చనియె నగస్త్యుఁడను ఘూని♦చంద్రుని దరికిన్.

* స్వగర్భోత్పన్నతరీమివ-అనిమూలము.

సీ. తేజఃప్రభావసం♦దీప్తుఁ డాతండని యెఱుఁగక భోజ్యమ♦య్యెను నతనికె
భగవంతుఁ డమ్ముని♦వరుఁడు శ్రాద్ధాంతమ్మునందును దనకుక్షి ♦ నాగ్రహమున
వ్రచ్చి యాతఁడు స్వరూ♦పముఁబొల్పఁగోరఁగఁగనినవిప్రవానితోఁ♦గడిమిపలికె
వాతాపి! భూమిఁ బో♦పంబని యెంచక పెక్కంత్ర శాంతులౌ ♦ విప్రవరులఁ
తే. జంపితివిగాదె దద్దోష♦శాంతికొఱకు
నాదుకుక్షిని జీర్ణించి♦నాఁడ వనియె;
[1]ధర్మనిరతు జితేంద్రియు ♦ నిర్మలమతి
నైన నను మించునేని యీ♦యసురుఁ డిచట. ౭౩౪ 1134
క. వాతాపిభంగి నుండఁడు, భూతలమున నయ్యగస్త్య♦మునివరుచేతన్
వాతాపి తెగినగతి నా,చేతన్ వధియింపఁబడును ♦ శీఘ్రమె యిందున్. ౭౭౫

—— రాముఁడు మృగమును బట్టుకొనఁ బయనమగుట. ——

క. నీ విచ్చట సన్నద్ధుఁడ,వై వారిజనేత్ర సీత ♦ నరయుచు నుండం
గావలయు మనముచేయం,గావలసినపను లవెల్ల ♦ క్ష్మానుతయందే. ౭౫౬ 1136
క. ఆయత్తములై యున్నవి, నాయన! యీసీతరక్ష♦ణంబే మనకుం
జేయందగు కృత్యంబగుఁ, బోయక యీమృగము నేను ♦ బట్టెద నొండెన్.
ఆ. పట్టువడకయున్న ♦ వధియింతు నొండె నే, నిదిగొ మృగముఁ బట్ట ♦ నేగువాఁడ
దీనిచర్మమందు ♦ మానిని కాశయుఁ, గలిగియుంట నీవు ♦ కనుమ యిపుడు.౭౮
క. కనుకం జర్మమె ముఖ్యము,గ నుండుటంబట్టి యీమృ♦గము బ్రదుకదు నూ;
ఘనబాణమ్మున నొకటన్, బనిపూని మృగంబు దీని ♦ వధియించి వెసన్.
ఆ. వచ్చువఱకు నీవు ♦ వసుమతీపుత్త్రిక, కయియె యాశ్రమమునఁ ♦ గదలకుండి
యప్రమత్తతను మ♦హాదరమునఁ గాంచి, యుండవలయు నేను ♦ నురుజవమున.
క. సురుచిరమా మృగచర్మము, తరుణీప్రీతికయి తెత్తుఁ; ♦ దతబలమున భీ
కరశక్తి బుద్ధిబలమునఁ, బరఁగు జటాయువను పక్షి♦వర్యునితోడన్. ౭౯౫
క. జతగూడి నీవు భూమీ,సుత నలుదిక్కులను గాచు♦చున్ రాక్షసనం
తతిబాధ గల్గునో యని, ప్రతిక్షణం బెన్నికొనుచు ♦ వలయుం గావన్. ౫౦

నలువదిమూఁడవ సర్గము సంపూర్ణము.

## ౪౪ - వ సర్గము.

—— మారీచవధ కథ. ——

క. అనుపమతేజుఁడు రాముం, డనుజున కిట్లానతిచ్చి ♦ [2]హాటకమయమై
తనరుపిడిం దగు పెనుక, త్తిని నడుమునఁ గట్టుకొనియె ♦ దీప్తాకృతియై. ౧

1 మద్విధం యోఽతిమన్యేత ధర్మనిత్యం జితేంద్రియమ్-అనిమూలము. 2 బబంధాసిం మహాతేజా జంబూనదమయం త్సరుమ్-అనిమూలము త్సరు పిడి యనఁగాఁ గత్తిపిడి.

ఆ. పిదప దుస్సహోగ్ర♦విక్రముండు తనకు
భూషణముగఁ బొలిచి ♦ [1]మూఁడువంక
లుగల చాపవరముఁ ♦ దగఁ దీసికొని నిషం
గద్వయంబు వెనుకఁ ♦ గట్టుకొనుచు. ౩ 1144

క. చనియెన్ నృపవరుఁ డాతఁడు, తనపైఁ గరుదేరఁ జూచి ♦ తాటకసుతుఁడా
తని మోసపుచ్చు భయమునఁ, గనఁబడకయె యుండి మరలఁ♦గనఁబడియెఁ దగన్.

చ. ధనువును జేతఁబట్టుకొని ♦ దారుణఖడ్గముఁ దాల్చి యామృగం
బును గ్రహియించువేడ్క నది ♦ పోయిన మార్గముపట్టి పర్వనం
జనియెను; దేహకాంతిని వి♦శాలవనస్థలిముందఱన్ గనుం
గొన వెడఁగై మృగం బదియు ♦ ఘోరధనుర్ధరుఁడైన రామునిన్. ౫ 1146

క. కనుచుం గనుచుం గానన,మునఁ బాఱుచు నొక్కటి భయ♦మున జంకుచు రా
మునిశరము దగులకుండఁగ, ననువునఁ దప్పించుకొనఁగ♦నవలఁ దొలఁగుచున్.

క. కరమునకుఁ జిక్కునట్టులు, పరిసరమును జేరి యాశ♦పడఁజేయుచు స
త్వరగతి నుద్భ్రాంతిం గని, పరుగిడుచున్ దివికి నెగయు♦పగిది నెగయుచున్.

చ. [2]ఘనశకలాంతరాళమునఁ ♦ గ్రమ్మ శరత్తున నప్పుడప్పుడో
య్యనఁ గననౌచుఁ గానఁబడ ♦ కట్టెనుఱుంగున కేగు పూర్ణచం
ద్రునిదగు మండలంబువలెఁ ♦ దోఁచుచుఁ గాననమందుఁ గొన్నిటన్
గనఁబడకుండ నుండెను మృ♦గంబది రాముని మ్రోల లీలచేన్. ౮ 1149

సీ. అది యొక్కక్షణమున♦కంతికంబునఁ గనఁబడు నొక్కక్షణమునఁ♦గడఁగి దూర
మున కేగికన్పడు; ♦ వనమున మారీచుఁ డారఘునందను♦నట్లు దర్శ
నాదర్శనంబుల ♦ నాశ్రమముననుండి చాల దూరముగొని ♦ చనియె; నంత
దానిచేష్టలకుఁ గ్రో♦ధమునొంది నొకక్షణ మామృగరూపంబు♦నచ్చెరువుగఁ

తే. గనఁబడుటచేత మోహించి ♦ కాననమున
వివశుఁడగు నిట్లతండును ♦ వేగపోయి
యంత సంభ్రాంతుఁడై యొక్క♦యవనిరుహము
ఛాయ నిలుచుండెఁ దోఁపక ♦ [3]శాద్వలమున. ౯ 1150

చ. దనుజుఁడు మాయలేడియయి ♦ తా రఘువర్యుని దూరభూమికిం
గొని చని తన్మనంబు వెతఁ♦గుందఁగఁ జేయుచు నంతలోననే
వనమృగసంవృతుండగుచు ♦ బాగుగ నంతికమందె తానయై
కనఁబడె రాముఁ డాశపడి ♦ క్రన్ననవచ్చు నటన్న యూహచేన్. ౧౦ 1151

---

1 తత స్త్ర్యవనతం చాపమ్-అనిమూలము. 2 ఘనశకలములు=మేఘముతునుకలు. 3 శాద్వలము=పచ్చికభూమి.

చ. పరిసరమందు నుంటఁ దనుఁ ♦ బట్టఁగ రాముఁడు రాఁగ వేగమే
పరుగిడె నంతలో బెదరి ♦ పాఱి యదృశ్యతఁ గాంచె; నంత స
త్వరముగ వృక్షషండమున ♦ దాపున వెల్వడి వచ్చుచుండె; నా
యుక్తతరతేజుఁ డాపగిది ♦ నుండుటఁ గాంచి వధింప నెంచుచున్. ౧౨ 1152

చ. శరమొకదాని నెత్తి యిఁకఁ ♦ జంపక యూరకయుండరాదు కా
వరమున నున్న దీమృగము ♦ బాణవిమోచనమే పొసంగు ని
త్తరుణమునందు నంచు మది ♦ దారుణకోపమునొంది యంత న
[1]య్యరిశమనుండు భానురుచి♦యట్లు జ్వలించెడు దివ్యబాణమున్. ౧౩ 1153

తే. అధికదృఢమైన చాపంబు♦నందుఁ గూర్చి
[2]బలముకొలఁది నాకర్షించి ♦ బలము మెఱయ
భుజగరీతి నిట్టూర్పులు ♦ పుచ్చుచున్న
యామృగంబును గుఱివెట్టి ♦ యాగ్రహమున. ౧౪ 1154

క. సరసిజభవనిర్మితమై, కరము భయంకరము గాఁగఁ ♦ గ్రాలెడుదానిన్
బరికించి ప్రయోగించెన్; శరమది కులిశంబుభాతి ♦ జ్వాలలు మెఱయన్. ౧౫

క. దనుజుఁడు తాల్చిన యామృగ,తనువున్ భేదించి యంత ♦ దానినడుమ ను
న్ననిశాచరహృదయంబును, జని భేదించెన్ గరంబు ♦ క్షణమాత్రమునన్.

సీ. అంతట వాఁడు శ♦రార్దితుండయి తాళభూరుహంబంతదా ♦ పొడవు మీఁది
కెగసి భైరవనాద ♦ మెంతయుఁ జేయుచు నల్పజీవితుఁడయి ♦ యవనిఁబడియె;
మరణమొందఁగనుండి♦మారీచుఁ డప్పుడె, [కృత్రిమమైన యా♦మృగతనువును
విడిచి రావణుఁడు చె♦ప్పినమాటలెల్లను స్మరియించుకొనుచు] లక్ష్మణుని సీత

తే. [3]యిచటికిన్ వేగ పంపుట ♦ కే యుపాయ?
మట్లు పంపఁగ నెవరు లే♦నట్టి తఱిని
గాంత నసురుండు హరియింపఁ ♦ గలుగు టెట్లొ?
యనుచు యోజించి సమయ మి♦య్యదియె యనుచు. ౧౭ 1157

తే. కడఁగి పరికించి రాముని ♦ కంఠరవము
నట్టిరవమున హా! సీత! ♦ యయ్యొ! లక్ష్మ
ణా! యటంచును నఱచె; న♦ట్లాయమోఘ
శరము మర్మము నాటఁగఁ ♦ ద్వరితగతిని. ౧౮ 1158

క. పెనుకాయమ్మున మెఱసెడు, దనుజుం డతఁ డామృగంబు ♦ తనువువిడిచి స్వీ
యనిశాచరరూపంబును, గొని ప్రాణమ్ములను విడిచెఁ ♦ గుందుచు నార్తిన్.

సీ. శరసమాహతుఁడగు ♦ సురవైరి మారీచుఁ డురుతరచిత్రకే♦యూరయుగము
పరఁగుచుండఁగ మహా♦భరణభూషితుఁడయి కనకహారముఁ దాల్చి♦కఱకుదంష్ట్ర

---

1 అరిశమనుండు=శత్రువుల నశింపఁజేయువాఁడు. 2 వికృష్య బలవ ద్బలీ .. అనిమూలము.
3 దత్వా కేనతు లక్ష్మణమ్, ఇహ ప్రస్థాపయే త్సీతా శూన్యే తాం రావణో హరేత్ -అనిమూలము.

లరుదుగఁ గన్పడ ♦ నసురుఁడయ్యెను; ఘోరదర్శను రుధిరసి♦క్తతను వేప
మానాంగు భూగతు ♦ దానవు రాముండు కన్గొని యచట ల♦క్ష్మణుఁడు పల్కి

తే. నట్టి పలుకుల స్మరియించి ♦ యంత సీత
పైకిఁ జిత్తము పొలయ ని♦ప్పగిది నెంచె;
నిద్ది మారీచు మాయయే ♦ యింక నొకటి
కాదనుచు లక్ష్మణుఁడు చెప్పెఁ ♦ గాదె మున్ను ౨౩ 1160

క. [1]ఆవచన మట్లె యైనది, యేవధియించిన సురారి ♦ యితఁ డాతండే
యా వీఁడు నాగళస్వన, మేవిధమున నుండునట్లు ♦ లే బిగ్గరగాన్. ౨౪

క. అయ్యో! యోసీతా! యని, యయ్యో! యోలక్ష్మణా! య♦టంచును నార్తిన్
గుయ్యిడుచుఁ బ్రాణపంచక, మియ్యెడ విడనాడె నందు ♦ నిది వినఁబడినన్.

చ. జనకజ యెంతచింతిలునొ ♦ సారభుజుండగు లక్ష్మణుండునుం
బెనుదురవస్థ నెట్లు గని ♦ భీతిలునో యని చింతసేయు రా
మునకు భయంబుచే నపుడు ♦ పొల్చెను గగ్గురుపాటు చాల; నం
త నతఁడు మాయలేఁడియగు ♦ దానవుఁ జంపుట యార్తనాదము
న్వినుటయు నెంచి యిట్లగుట ♦ భీతివిషాదనిదానమంచెదన్. ౨౬ 1163

క. తలపోసె నంత నతనికిఁ, గలిగె మహాభయము పిదప ♦ త్వాపతి వేఱొ
[2]క్కలలితమృగంబు శరమున, నిలఁబడఁగానేసి మాంస♦మెల్లం గొనుచున్.

క. త్వరపడుచు జనస్థానము, నరయుచుఁ దనపర్ణశాల ♦ కరిగెడు త్రోవం
బరికించి తదభిముఖుఁడై, యరిగెను దత్తఱము మనసు♦నందుం దోఁపన్. ౨౮

నలుబదినాలుగవ సర్గము సంపూర్ణము.

---

## ౪౫ - వ సర్గము.

లక్ష్మణుని రామునొద్దకుం బొమ్మని సీత పురికొల్పుట.

క. పెనిమిటి కంఠరవంబున, కనుకూలముగాఁ జెలంగు ♦ నాయార్తరవం
బును విని జనకజ లక్ష్మణుఁ, గని పొమ్మా తెలిసికొనుమ ♦ కాంతునవస్థన్. ౧

క. పరమార్తుండై శ్రీరఘు,వరుఁ డఱచుచు నున్న గళర♦వంబున్ వింటిన్
గరుణాకర! మత్ప్రాణో,త్కరమున్ మది కుదుట నుండఁ ♦ గల్గునె!యింకన్.

క. వనమున నాక్రందించెడు, ననఘుని నీయన్న నిప్పు ♦ డార్తుని గావం
జను నీకున్; బంచాస్యం,బునకున్ జిక్కినవృషంబు ♦ పోలిక నొకఁడే. ౩

చ. దనుజులచేతఁ జిక్కి యటఁ ♦ దన్నొగిఁ గాచెడువారు లేక దీ
నునిగతిఁ గావ నర్థ్యాని ఘు♦నున్ మదిఁ గోరుచునున్న యన్న నొ

---

1 తత్తథా హ్యాభవ చ్చాద్య-అనిమూలము. 2 నిహత్య పృషతం చాన్యం మాంస మాదాయ రాఘవః-అనిమూలము.

యన్యానఁ గరుణించి కావ వడి ♦ నచ్చుటికిం బరుగెత్తవయ్య యం
చనినను రామునాజ్ఞ నతఁ ♦ డచ్చటికేగక యుండె; నంతటన్. ర 1169

*క. తనమాటను విని వనికిం, జనకుండిన మఱఁదిఁ గాంచి ♦ జనకజ క్రోధం
బునఁ బలికె నిట్లు లక్ష్మణ!, వనమున దురవస్థ నిట్లు ♦ వందుకు భ్రాతన్. ర౪

క. పాలింపఁబోవకున్నా, వీలాటి యవస్థయందె ♦ యెంతయు మదిలో
జాలిం బొందఁదగుఁ గద?, యేలోకొ పోకున్న వాఁడ ♦ వి త్తరుణమునన్. ౫౬

[1]తే. కాన నీయన్న కీవు ని♦క్కముగఁ బయికి
మిత్రునివిధంబునం బొల్చి ♦ మిగులఁ గూర్చు
హానిపగిదిగ నున్నావు ♦ కాని, శాత్ర
వుఁడవె; లక్ష్మణ! యింకేమి ♦ పోలుఁ జేయ. ౫౪ 1172

[2]సీ. నాకుఁగా రాముఁడు ♦ నశియింపవలెనని వాంఛింతు వీవు నా♦పైని లోభ
మొంది యున్నాఁడ వ♦ట్లుండుట ననుఁబట్టి యన్నజాడను దెలి♦యంగఁ బోవ
కున్నావు, నిజమిద్ది ♦ యురుతరాపద రామునకు వచ్చులే నీకు ♦ సకలవిధము
లను బ్రియంబనుచు నా♦కును దోఁచుచున్నదిసహజునియందు వా♦త్సల్య మేమి

తే. యైన నీకును లేదు మ♦హాద్యుతియగు
నన్న కాపదగల్గిన ♦ నందుచేతఁ
బోయి రక్షింపకున్నాఁడ; ♦ వీయరణ్య
మందు నినుఁగావ కెటుపోదు ♦ నందు వేమొ. ౭౪ 1173

సీ. నీవు ముఖ్యంబుగా ♦ నీయన్నఁబట్టియే వచ్చినాఁడవు నన్నుఁ ♦ బట్టి కాదు
కద, యట్టి శ్రీరఘు♦కాంతునకే ప్రాణసంశయ మరుదేర ♦ సాధుబుద్ధి
తరువాత నేనిందుఁ ♦ దగ నివసించి చేయఁగఁ దగినట్టి కా♦ర్యంబ దేమి
గలదు? కావున నన్నుఁ ♦ గావ నీవిటనుండ వలసినపని లేదు ♦ ప్రాణవిభునిఁ

* శ్రీరామావతారఫలమగుకథ యిటనుండియే ప్రారంభమయినది. పరమపతివ్రత యగుసీత క్రోధమున లక్ష్మణుఁడు సకలసద్గుణగరిష్ఠుఁడని తెలిసియుండియు ననరానిమాట లనుచున్నది. ఆమె కిది తగునా యని ప్రశ్నింపరాదు. అట్లా భూపుత్రి పలుకకున్న నవతారఫలమే కలుగదు. లోకుల ముప్పు తప్పదు. కాన భగవంతుఁడగు రామచంద్రుఁడే యట్లు మాట్లాడుట కాసాధ్వినిఁ బ్రోత్సహించెనని తెలియవలయు. బాహ్యదృష్టికి రామచంద్రుఁడు మనుష్యునివలె గోచరించినను అంతర దృష్టికి శ్రీనారాయణమూర్తి గావున సర్వకార్యసాక్షిభూతుండగుట నెవరెవరిచే నేయేపనులు చేయింపవలెనో యాయాయికార్యములు వారివలనఁ జేయించుచుండును. కాఁబట్టి సీత పతివ్రతగదా యిట్లు పలుకుట న్యాయమా యనిగాని, ఆమెనోట మహాకవి వాల్మీకి యిట్లు పలికింపవచ్చునాయని గాని సందియ మందరాదు. 1 సౌమిత్రే మిత్రరూపేణ భ్రాతు స్త్వమసి శత్రువత్ - అని మూలము. 2 ఇచ్ఛసి త్వం వినశ్యంతం రామం లక్ష్మణ మత్కృతే, లోభా న్మమకృతే నూనం నానుగచ్ఛసి రాఘవమ్-అనిమూలము.

తే. బాసి యొకక్షణమైన జీ♦వముల నిలుప
నేర; నని పల్కుచుఁ బాష్ప♦వారి దోఁగి
[1]యేడ్చుచుఁ జింకకై వడి ♦ నెంతయు భయ
మున వడంకెడు సీతను ♦ గని యతండు. ౯౪ 1174

క. వినుమా! తల్లీ పన్నగు,లును గంధర్వాది తేయు♦లుఁ రాక్షసులుఁ
దనుజులు మనుజులు నీభ, ర్తను రాము జయింపలేరు ♦ తథ్య మ్మిదిసూ. ౧౦౪

సీ. మంగళరూపిణీ! ♦ మానినీ! వాసవోపముఁడైన శ్రీరామ♦భద్రు ననిని
మార్కొనఁదగువాఁ డ♦మరులలోఁ గాని మానవులలోఁగాని గం♦ధర్వవితతిఁ
గాని, పక్షులలోనఁ ♦ గాని, రాక్షసులలోఁ గాని, పిశాచాళిఁ ♦ గాని, కిన్న
రావళిలోఁ గాని ♦ యుల్లె మృగాళిలోఁ గాని భీకరులగు ♦ దానవులను
తే. గాని యొకఁడైన వెదకినఁ ♦ గలుగఁ డరయ;
యుద్ధమున రాముఁడగు నవ♦ధ్యుండు గాన
నిట్లు పలుకంగ వలదు నీ♦వింక; రాముఁ
డుండ నప్పుడీవని నిన్ను ♦ నొంటి విడిచి. ౧౩ 1176

క. అరుగుటకుఁ దెంపు గలుగదు;, తరుణీమణి! బలముతో ని♦తాంతబలాఢ్యుల్
పరికింపక వచ్చిన రఘు,వరుబల మాపంగరాదు ♦ బవరమునందుఁ. ౧౮ 1177

తే. ఇంత యేటికి దివిజుల ♦ నింద్రుఁగూడి
ముజ్జగంబులు సన్నద్ధ♦ములయి వచ్చి
నిలిచినను రాము నోడింప ♦ నలవిగాదు;
[2]నీమనంబూఱడిలుఁగాక ♦ భూమిపుత్త్రి!. ౧౮౪ 1178

క. అడలకుమీ, సంతాపము, విడువుము, మృగవరముఁ జంపి ♦ వే నీప్రాణే
శుఁడు వచ్చుఁ దల్లిరో! యి,ప్పుడు వినఁబడినట్టి స్వరము ♦ పోలఁ దలఁచినఁ.

క. కాదమ్మా! రామునిధ్వని, యేదైత్యుఁడో యొకఁడు మాయ♦యే పన్నుచు నీ
నాదమును జేసె నిశ్చయ;, మేదైత్యుఁడో కాఁడువినుమ♦యిఁక నెఱిఁగింతుఁ.

సీ. అంబుదాదులయందు♦నారోపితములగు ప్రాసాదముఖములు ♦వఱలుచుఁ గడుఁ
జిత్రంబులుగఁ దోఁచుఁ ♦ జెచ్చెఱ నశియించు నట్టిగంధర్వపు♦రాళిభంగి
వ్యామోహమును బుట్టు♦నట్టుగ నలరెడునద్ది మారీచుని ♦ దైనమాయ
యేయగు; [3]నీవు నా♦కిల్లడవై తివి వైదేహి! నన్ను నె♦వ్వరిట నీకు
నిల్లడపెట్టిరో ♦ యిట్లని యందువా మహితాత్ముఁడా రఘు♦మండనుండు
తే. నిన్ను నిల్లడఁగా నుంచె ♦ నన్నుతాంగి, కాన నిన్నిట నే నొంటి♦గానె విడిచి
పోవఁజాలను నిందలి♦పూర్వదివిజు, లందఱుఁ ఖరుఁ జంపిన ♦ దాదిగాఁగ.

---

1 సీతాం మృగవధూ మివ-అనిమూలము. 2 హృదయం నిర్వృతం తేఽస్తు - అనిమూలము.
3 న్యాసభూతాసి వైదేహి న్యస్తామయి మహాత్మనా-అనిమూలము.

క. దనుజుల నందఱను వధించినదానిం గూర్చి మనలఁ ♦ జెఱుపఁదలఁచి తా
రనుదినము విరోధంబును, గొనియున్నారమ్మ! హింస♦కులు వారగుటన్. ౧౮॥

తే. మనల హింసింపఁగోరి యి♦ప్పనికి నెట్లొ
మోసపుచ్చుట కివ్వన♦మునను బలువి
ధములయిన వాక్యములను వ♦దలుచున్న
వారు దీనినిఁ దలఁపోయ♦వలదె తల్లి. ౧౯॥ 1183

క. అనినన్ సంరక్తాక్షుల, జనకజ తగి కుపితయగుచు ♦ సత్యంబునె ప
ల్కినవాని సుమిత్రాసుతుఁ,గని పరుషోక్తులను బల్కెఁ ♦ గళవళపడుచున్.

తే. క్రూర! కులపాంసనా! చేయఁ♦గూడనిపనిఁ
జేయఁబూనితివా, వన♦క్షితిని గొప్ప
వ్యసన మారామునకుఁ గల్గి♦నదియు నీకుఁ
బ్రియమె యని తోఁచుచున్నది♦వ్వేళ నాకు. ౨౦॥ 1185

చ. కనుకనె రామచంద్రునకుఁ ♦ గల్గినకష్టముఁ గాంచియున్ జవం
బునఁ జని కావఁబూనకయె ♦ పోలినరీతిగ నిట్టిమాట లా
య్యన వచియించె దీవు; విన♦వయ్య! కనుంగొన మిత్రునట్లుగాఁ
గనఁబడి దుష్టవృత్తులను ♦ గప్పి చరించుచు దాయలౌచు నొ
ప్పిన మిముబోఁటి క్రూరులకు ♦ వింతయె నీయఘబుద్ధి పుట్టుటల్. ౨౩ 118[illegible]

సీ. మిగుల దుష్టాత్ముఁడ ♦ వగుదువు నీవు నీయంతనో భరతుని ♦ యాజ్ఞవలన
నో నానిమిత్తమై ♦ యొగి నిట్టికపటాకృతినిఁబూని బంధువు♦లను వదలియు
నీవొక్కఁడవె యొక్క♦నిని రాముననుసరించుచు వచ్చుచున్నావు♦సూ సుమిత్ర
తనయా! వనంబున ♦ ననుఁబొందఁ దగునను నిశ్చయమిద్దియు ♦ నీకుఁగాని

తే. భరతునకుఁగాని సిద్ధింప ♦ దరయ నుత్ప
లాభకాంతిని దగి పంక♦జాయతేక్ష
ణములఁ బొలుపొందు [1]రాముని ♦ నాథుఁగా వ
రించి యితరుని నెట్లు కా♦మించుదాన. ౨౪॥ 1187

క. నీయెదుటనె నా ప్రాణము, లీయెడ నే విడుతునయ్య! ♦ యికార్యంబున్
జేయుటకు సందియము లే,దా యాత్మేశ్వరుని బాసి ♦ యవనీస్థలిలోన్. ౨౫॥

తే. ఒక్కక్షణమైన జీవించి♦యుండఁ జుమ్మి
యనుచు గగ్గురుపాటున♦ట్లాడుచున్న
జనకజాఘోరవాక్యముల్ ♦ వినియు నిర్జి
తేంద్రియుండగు సౌమిత్రి ♦ హితముమీఱ. ౨౬ 1189

క. కలఁగక ప్రాంజలియై యిటు, పలికెన్; నే నుత్తరంబు ♦ పలుకంబూనన్

---

1 ఉపసంశ్రిత్య భర్తారం కామయేయం పృథగ్జనమ్-అనిమూలము.

దలఁపఁగ దేవత నాకి,మ్ముల నగుదువు నీవు జనక♦భూపకుమారి!· ౨౮ 1190

[1]చ. అనుచితమై వినంబగని♦యట్లుగఁ బల్కుట స్త్రీలయందుఁ జూ
చిన ధరణీతలంబున వి♦చిత్రముగా దినుమంతయైన; నే
మనుదును నైజమే యగు ని♦దారయ స్త్రీలకునెల్ల మైథిలీ!
కనఁబడుచున్నదిట్టులె జ♦గంబున నంతట నెంచిచూచినన్. ౨౯ 1191

సీ. తరుణులు వినయాది ♦ ధర్మము ల్విడలినవారు చంచలమతు ♦ ల్క్రూరహృదయ
లెట్టిమిత్రులకైన ♦ నట్టె విరోధంబు గల్గింతురో జన♦కన్రృపపుత్రి
వై దేహివయ్యు ని♦బ్భంగిఁ బల్కినపల్కు తప్తనారాచవి♦ధంబుఁ గాఁగ
నాశ్రోత్రయుగ్మంబు♦నకు నున్న దీలాటి పరుషవాక్యంబు నో♦ర్వంగఁజాల

ఆ. న్యాయవాదినైన ♦ నను గని యన్యాయ
ములును బరుషములగు ♦ పలుకులెట్టు
లొక్కరీతిఁ బల్కు♦చున్నావొ సాక్షులై
వనచరులగు దివిజ♦వరులు వీని. ౩౦½ 1192

[2]చ. వినుదురు గాక; యెంతయును ♦ బెద్దయు నన్నయునైన రామునా
జ్ఞను దలఁదాల్చి యున్ననను ♦ సాధుమతిం దలపోయకిట్టు లీ
యనుచితరీతి సందియము ♦ నందితివా యిసిరో! నశింపుమా
వనితలభావమే తగు స్వ♦భావముచేతనె దుష్టమై యిలన్. ౩౨½ 1193

క. చనియెద రాముం డున్నెడ,కు నీకు శుభమౌనుగాక! ♦ [3]కువలయమిత్రా
నన! యోవిశాలనయనా!, వనదేవతలెల్ల నిన్నుఁ ♦ బ్రాభవ మలరన్. ౩౩

క. పరిరక్షింతురుగాక్, తరుణంబున జనకరాజ♦తనయా! యిట భీ
కరములగు నిమిత్తంబు ల,పరిమితములుగాఁ గనంగఁ♦బడియెడు నాచేన్. ౩౪

ఆ. [4]కనుక నేను మరలి ♦ కాననమునినుండి
యన్నతోడఁగూడి ♦ యరుగుదెంచి
పర్ణశాలయందుఁ ♦ బరికింతునో నిన్నుఁ
[గనఁగలేనొ యెఱుఁగఁ ♦ గమలనయన!]. ౩౪½ 1196

చ. అనుచు వచించు లక్ష్మణుని ♦ నార్తిముసుంగుచు నేడ్చుచున్ వచిం
చెను జనకాత్మజాత కడుఁ♦జిమ్మెడు బాష్పజలంబులందొగి
మ్మునుఁగుచు నాతనిం గనుచు ♦ నొక్క భయంకరరీతి నిట్లు రా
ముని నెడఁబాసి నా యసుస♦మూహము నిల్పఁగఁజాల నంతయున్. ౩౫½

1 వాక్య మప్రతిరూపం తు నచిత్రం స్త్రీషు మైథిలి, స్వభావ స్త్వేష నారీణా మేవం లోకేషు దృశ్యతే - అనిమూలము. 2 శృ శ్వో మద్య ప్రణశ్యత్వం యస్త్వామేవం విశంకసే - అనిమూలము. 3 వరానసే విశాలాక్షి యను విశేషణములు రెండు మూలమున నున్నవి. 4 అపి త్వాం సహ రామేణ పశ్యేయం పున రాగతః - అనిమూలము.

సీ. గౌతమీనదిలోన ♦ క్షణమాత్రమునఁ బడి ప్రాణముల్ విడిచెద♦వారిఁబడఁగ
నవకాశముండని ♦ యట్లైన గొంతున కురిఁబోసికొనియెద ♦ నొండె నెత్తు
నుండి క్రిందంబడి♦యోగి మేను విడిచెద నొండెఁ; దీక్ష్ణవిషంబు♦నొకటఁద్రావి
చచ్చెద నొండె వై♦శ్వానరులోనైన నుఱికి మృతిం గాంతు ♦ నొండెఁ గాని
తే. నసువులం దాల్చి జీవింప ♦ నకట! నేను
నాపతిం దక్క నితరుని ♦ నంఘ్రిఁ గల్గు
వ్రేలితోనైన స్పృశియింప ♦ ననుటంచుఁ
బలికి లక్ష్మణు నిందించి ♦ పడఁతి మిగులఁ. ౩౮ 1198

క. మనమున దుఃఖము మించఁగ, వనటం గని యేడ్చుచుఁ స్వ♦భావప్రేమం
బునఁ గరయుగమునఁదనకడు,పును గొట్టుకొనెఁ మహా ర్తిఁ♦బొగులుచు; నంతన్.

సీ. విపులాశ్రులంజాల ♦ వెలయు నాజానకి యార్తయై చూపట్టి ♦ యట్టె యేడ్చు
చుండుటం గని చిత్త ♦ మొయ్యన వికలమై యడలంగ నాసుమి♦త్రాత్మజన్ముఁ
డాదృతి నోదార్చ ♦ నామె యానెపమునఁ గాంతునికడ కేగ♦కయె విలంబ
నము చేయుచున్నవాఁ♦డుమఱఁదియనికోపమందియేమియుఁబల్క♦నయ్యెనవల
ఆ. నతఁడు సీతఁ గాంచి ♦ *యభివందనముసేసి
హస్తయుగము మోడ్చి ♦ యాగ్రహమున
నుంత మ్రొక్కి యామెఁ ♦ జూచుచుఁ బలుమాఱు
లన్నచెంతకరిగె ♦ నార్తుఁడగుచు ౪౦ 1200

నలుబదియైదవ సర్గము సంపూర్ణము.

---

## ౪౬ - వ సర్గము.

రావణుఁడు సన్న్యాసివేషమునఁ బర్ణశాల కరుదెంచుట.

క. రామునితమ్ముఁడు లక్ష్మణుఁ, డామానిని కఠినవాక్కు ♦ లటుపల్కంగా
నేమాత్రము విడిచి చనం, గా మది లేకుండియుఁ ని♦కామత్వరతోఁ. ౧

ఆ. అన్నకొఱకుఁ బయన♦మయ్యె; దశగ్రీవుఁ
డెపుడు తఱి యటంచు ♦ నెదురుచూచు
చుండెఁ గాన నపుడె ♦ యొంటిగా జనకజ
యుంటఁ గాంచి మదిని ♦ నుత్సుకమున. ౨ 1202

సీ. వేగమ సన్న్యాసి♦వేషంబు ధరియించి వైదేహి కడకేగె ♦ వాఁడు మృదుల
కాషాయవస్త్రంబుఁ ♦ గడుఁబూన్కి ధరియించి సొగసైన సిగముడి♦శోభిలంగ
ఛత్రంబునుం బట్టి ♦ చక్కనిపాదుక లనువుగాఁ దొడిగి స♦వ్యాంసతలము
పయిఁ ద్రిదండమునకుఁ ♦ బరమకమండలువును దగిలించి గొ♦బ్బున నిటువలె

* తత స్తు సీతా మభివాద్య లక్ష్మణః కృతాంజలిః కించి దభిప్రణమ్య చ-అని మూలము.

తే. భిక్షువేషంబునను రఘు♦వీరపత్ని, యొద్దకుం బోయె రవిచంద్రు♦ లుండనితఱిఁ
గటికచీఁకటి సంధ్యను ♦ గ్రమ్మినట్లు, లన్నదమ్ములు లేకయు♦న్నట్టితఱిని. ౪

క. బలశాలియైన రావణుఁ, డలరుచు నాపర్ణశాల ♦ కరిగెఁ బిదప మి
క్కిలి క్రూరులైన కుజశనులు, లలచంద్రునిఁ బాసియున్న ♦ యారోహిణినిన్. ౫

చ. కనెడు విధంబునన్ మిగులఁ ♦ గ్రౌర్యము కల్గినరావణుండు భ
ర్తను నెడఁబాసి యున్నవని♦తామణి భిక్షువు నాయశస్వినిన్
గనియె ననర్థముల్ జగతిఁ ♦ గల్గఁగ; భీకరతేజుఁ బాపక
ర్ముని నతనిం గనంగ భయ♦ముం గని యచ్చటివృక్షజాలముల్. ౬ 1205

క. చలియింపనోడె శ్వసనుం, డలరుచు వీవంగమానె; ♦ నతివేగముగా
నిలఁబాఱు గౌతమీనది, ఖలుఁ డాతఁడు రక్తములగు ♦ కనులంజూడన్. ౭

ఆ. భయమునొంది యతనిఁ ♦ బరికించి నిశ్చల
ముగను మెలమెలన న♦రుగ మొదలిడె;
నంత రాముఁడరుగు♦నట్టి తఱిం గని
పెట్టియున్నదనుజుఁ ♦ డట్టె లేచి. ౮ 1207

క. సమయమిదేయని యతిరూ,పమునన్ సీతాసమీప♦పదముం జేరెన్;
సుమతియగు నతఁడు నరవే,షమునన్ జానకిని జూచు ♦ సంతసమలరన్. ౯

చ. పెనిమిటిఁగూర్చి చింతిలెడు ♦ ప్రేయసియొద్దకుఁ జిత్రచెంతకుం
జను శనియట్లు పోయెఁ దృణ♦సంతతి గ్రమ్ముటఁ గూపమెవ్విధిం
గనఁబడకుండునో యటులు ♦ కల్మషచిత్తుఁడె యయ్యుఁ బైకిఁ జ
క్కనిదగు వేషమూని కడు♦ఖ్యాతిని గ్రాలెడు సీతఁ జూచుచున్. ౧౦ 1209

క. నిలుచుండె; మంగళాకృతి, నలరుచుఁ బలువరుస మోవి♦యందము మిగులన్
గులుకన్ బున్నమచందురు,వలె మోముచెలంగఁ బద్మ♦పత్రాక్షియునై. ౧౧

ఉ. పచ్చనిపట్టువస్త్రమును ♦ బాగుగఁ గట్టి ప్రియార్తనాద మ
ట్లచ్చటనుండి కర్ణముల♦యందుఁ జొరంబడ భీతచిత్తయై
హెచ్చుగుచున్న శోకమున ♦ దృష్టులనుండి జలంబు గాఱఁగా
నచ్చటి వార్తలేమొ యని ♦ యారయుచున్ దృణగేహసీమలోన్. ౧౨ 1211

ఆ. కూరుచున్నసీతఁ ♦ గూరిమిఁ గనఁబోయె;, దుష్టచిత్తుఁడై య♦నిష్టుఁడగు
దనుజుఁ డాతఁ డపుడు ♦ దర్పక శరవిద్ధుఁ, డగుచు బ్రహ్మఘోష♦మట్టె చెలఁగ.

చ. వనితయు నొంటి నుండఁగని ♦ వాఁడు మహావినయంబుమీఱ ని
ట్లనిపలుకంగఁబూనె; నపు♦డామెయు లోకములందునున్న యా
వనితలకెల్ల లక్ష్యముగ ♦ భాసిలియున్ బతిఁ బాసియుంటఁ జ
*క్కని కమలంబుసంగతిని ♦ గానని లక్ష్మివలెం గనంగనై. ౧౪ 1213

* పద్మహీనామివశ్రియమ్-అనిమూలము.

మ. తనుకాంతిం జెలువారుచుంటఁ గని యా♦తన్వంగి వర్ణింపఁగా
మనమందెంచి వచింపఁ జొచ్చె నిటు ప్రే♦మన్ స్వర్ణశుభ్రచ్ఛవిం
గని కౌశేయముఁ గట్టినట్టి లలనా! ♦ కంజాభమైనట్టి మో
మును నేత్రంబులు దోఃపదంబు లలరం ♦ బొల్పారుట న్నీవిలన్. ౧౬ 1214

సీ. కమలమాలధరించు ♦ కమలినివలె నున్నదానవు; నీవెవ్వ♦తవు? శుభాస్య !
భూదేవతవొ లేక ♦ పొలుపారు కీర్తివో మంగళదేవివో ♦ మహితకాంతి
కాధారదేవత ♦ యైనట్టి లక్ష్మివో యచ్చరమిన్నవో ♦ యిచ్చవచ్చి
చరియించు భూత్యధి♦ష్ఠానదేవతవొకొ స్వైరచారిణి! రతీ♦సరసిజాక్షి

తే. వో వరారోహ! నీవైన ♦ పావనతర
[1]దంతములు కుందకుట్మల ♦ సంతతివలె
నలగు మొనలఁ జెలంగుచు ♦ నన్నిసమతఁ
గ్రాలి నునుపై సితచ్ఛవిఁ ♦ గ్రాలు నహహ. ౧౭ 1215

క. లలనా! విశాలములు నిర్మలములునై రక్తకాంతి ♦ రాజిలు కొలుకుల్
గలిగి యతినీలతారక, లలరఁగ నీకన్నులొప్పు ♦ నందము లగుచున్. ౧౮

తే. జఘన మెన్న విశాలమై ♦ సారమగుచుఁ
గ్రాలుచున్నది నీతొడల్ ♦ కరికరోప
మములుగా నున్న వింతి! నీ♦మానితస్త
నములు వృత్తములై యున్న♦తములు నగుచు. ౧౯ 1217

సీ. ఒండొంటితో స్పర్ధ ♦ నొరసికొనుచుఁ గడుబరువులై నిక్కు♦టవలన నుంత
కదలుచున్నట్టుగఁ ♦ గన్పట్టుచున్ బృథులోన్నతాస్యములయి ♦ యొప్పి తాళ
ఫలసమానములయి ♦ సులలితమణిహార భూషితమ్ములునయి ♦ పొలుపుగులుకు
చున్నవి; చిరునవ్వు ♦ లొప్పఁగ శుభదంతములు గ్రాల సుందరా♦క్షులు చెలంగ

తే. నన్నకాంతామణీ! ప్రవా♦హోన్నతి నది
తటము హరియించునటు చక్కఁ♦దనము చేత
[2]నామనంబు హరించుచు♦న్నావు నీవు;
నడుము పిడికిటికొలఁదియై ♦ కడుఁ జెలంగు. ౨౦ 1218

క. తలవెండ్రుకలును నీలంబులుగాఁ దనరారె బలిత♦పుంజన్నులునున్
లలితములు సంహతములై, యలరారెడు నిట్టిరూప ♦ మహహా! తనరున్. ౨౧

క. సురగంధర్వులలోఁ గిన్నరతరుణులలోన యక్ష♦నారులలోనన్
ధరణింగల తరుణులలోఁ, బరికింపను బూర్వ మిట్టి♦పడఁతిని నేనున్. ౨౨

తే. జగములందెల్ల వర్ణింపఁ♦దగినరూప
మింతి యీసౌకుమార్య మి♦ట్లింతొ తనరు

---

1 సమా శ్శిఖరిణ స్స్నిగ్ధాః పాండురా దశనా స్తవ - అనిమూలము. 2 మనోహరసి మే కాంతే-అనిమూలము.

వయసు దగ నొప్పు నీవిట్లు ♦ వని వసించు
పద్ధతిం జూడఁ జిత్తవి♦భ్రమము గలిగె. ౨౩ 1221

[1]ఆ. నీకు శుభము గలుగుఁ♦గాక నీ విటనుండఁ, దగదు మరలిపొమ్ము ♦ దనుజులకిది
కామరూపులకును ♦ గడుఘోరచిత్తుల, కునికిపట్టు సుమ్మి ♦ యుత్పలాక్షి. ౨౪

క. సురుచిరగంధములు మనో,హరములు సుసమృద్ధములును ♦ నగు ప్రాసాదో
త్కరముల తుదల న్నివొగిఁ, బురముల నుపవనములందుఁ ♦ బోలు వసింపన్.

చ. నిరుపమమాల్యభోజ్యములు ♦ నిర్మలవస్త్రము లెందుఁజూడ సుం
దరుఁడగు ప్రాణనాథుఁడు ని♦తాంతము నీకును నుండఁగాఁ దగున్
సురుచిరవక్త్రపద్మ! నినుఁ ♦ జూడగ నిర్జరనారియంచు నా
కరయఁగఁ దోఁచుచున్నయది ♦ యాత్మకు నిక్కము చెప్పుమా యిఁకన్. ౨౬

సీ. వనిత! రుద్రులకు సం♦బంధించి యున్నావొ నీవు మరుత్తుల ♦ నిచయమునకుఁ
జేరినదానవో ♦ చెప్పుమా వసువుల కాంతలలోన నొ♦క్కతెవొ యిట్టి
కానకు విబుధులు ♦ గాని గంధర్వులు గాని కిన్నరులును ♦ గాని రారు
దనుజనివాసమై ♦ తగునిది; నీవెట్లు వచ్చితి విచటికి ♦ వారిజాక్షి

తే. మఱియుఁ గోఁతులు సింహముల్ ♦ చిఱుతపులులు
పులులు జింకలు బెబ్బులు ♦ లెలుఁగుబంట్లు
కంకములు సంచరించునో ♦ కంబుకంఠి!
వానిఁ గని భీతి గల్గ దె♦ట్లింగి నీకు. ౨౮ 1225

క. పెనుకాన నిందుఁ దగఁ గ్రొ,వ్వినయేన్గులు భయదములును ♦ విపులబలమునన్
దనరారు; వానివలనన్, గనకున్నా వెట్లు భీతిఁ ♦ గాంతా! చెపుమా. 3౦

సీ. ఎవ్వతెవీవు? పే♦రెయ్యది? యెవ్వరిదానవు? కల్యాణి! ♦ తలఁపు దేనిఁ
బూని వచ్చితి వదే♦భూమినుండి యిటకు? దనుజసేవితము సా♦ధ్వసకరంబు
నగు దండకారణ్య♦మం దొంటిగా నేల చరియించుచున్నావు? ♦ సరగఁ జెపుమ
యనియె; దురాత్ముఁడౌ ♦ దనుజుఁ డిట్లడిగినఁ గర్మంది వేషంబు ♦ బ్రాహ్మణజనిఁ

తే. గాంచి వచ్చిన రావణుఁ ♦ గాంచి యతియె
యని భ్రమించి సమస్తపూ♦జార్హవస్తు
కాండమునవాని కతిథిస♦త్కారములను
జేసె నిటుతొల్త పీఠంబుఁ ♦ జేర్చి యంత. 3౨ 1227

క. యతికిం బాద్యము నొసఁగుచు, నతిశాంతాకృతిని బొల్చు ♦ నాతనితో నో
[2]యతివర! యన్నము సిద్ధమె,హితముగ భుజియింపుఁడనియె ♦ నెంతయు భక్తిన్.

సీ. ధరణీసురాకృతిఁ ♦ దాల్చి కమండలు కాషాయవస్త్రము ♦ ల్గాలిచుండ
వచ్చిన రావణు ♦ నిచ్చలోఁ దనుఁ బట్టుకొనిపోవ నెంచిన ♦ కుటిలు నతని

---

1 రాక్షసానా మయం వాసో ఘోరాణాం కామరూపిణాం-అనిమూలము. 2 అబ్రవీ త్సిద్ధ మి త్యేవ-అనిమూలము. పక్వాన్నం సిద్ధ మి త్యబ్రవీత్-అనివ్యాఖ్య.

నాచారమెఱిఁగిన ♦ యన్వయంబునఁ బుట్టినట్టి సీతకు భుక్తి ♦ ననునయింప
నలవికాదైన నా ♦ లలన బ్రాహ్మణుఁబోలె భుజియింపఁబిలిచెను♦బూని యిట్లు;

తే. బ్రహ్మసురా! యిదె మునులయా♦సనము దీని
యందు నీయిచ్ఛఁగొలఁది నె♦య్యమునఁ గూరు
చుండు మిదె పాద్య మిద్దాని ♦ నొగి గ్రహింపు
మిదియె నీకయి సిద్ధమ♦య్యెఁ దగ భుక్తి. ౩౫ 1229

క. వనమునఁ బుట్టినవస్తువు, లనువుగఁ గొని తెచ్చి భుక్తి ♦ క్రమముగాఁ జే
సినదానఁ బలువిధంబుల, ననుమానము లేకగొనుము ♦ యాఁకలితీఱన్. ౩౬

చ. అని యిటు సిద్ధమయ్యె నిదె ♦ యన్నమటంచు వచించుచున్ మహా
వినయమునం దనుం బిలుచు ♦ విశ్రుతకీర్తిని రామపత్నిఁ జ
క్కనిదగు దృష్టిఁ జూచి ధృతిఁ ♦ గాంచి స్వనాశముఁ గోరుచున్ మనం
బున బలిమిం దగంగఁ గొని♦పోవఁగ నెంచె నెఱుంగకెంతయున్. ౩౭ 1231

చ. వనమున వేఁటకై చనిన ♦ భవ్యతరాంగునిఁ బ్రాణనాథు నా
తనియనుజుం గనుంగొన ని♦తాంతము చూచుచు నెల్లదిక్కులం
దనవిభురాకఁ గోరు వని♦తామణి కామెకు నాయరణ్యమే
కనఁబడెఁగాని రాఘవులు ♦ కన్పడరై రటు లెంతచూచినన్. ౩౮ 1232

నలుబదియాఱవ సర్గము సంపూర్ణము.

---

## ౪౭ - వ సర్గము.

-ఃఃఃఃఃఃఃఃఃః సీత తనవృత్తాంతమును రావణునకుం జెప్పుట. ఃఃఃఃఃఃఃఃఃఃఃఃఃఃఃఃఃఃఃఃఃఃః-

చ. జనకజతన్ హరింపఁగను ♦ స్వాంతమునం దలపోయు రావణుం
డనునయమొప్ప నట్లడుగ ♦ నాయతివేషముఁ బట్టి స్వీయవా
ర్తను వచియింపఁ బూని; మదిఁ ♦ దాను దలంచె నితండు విప్రుఁ డం
దు నతిథి చెప్పకున్నఁ గ్రుధ♦తో శపియించునటంచుఁ జక్కఁగాన్. ౧

తే. [1]ఒకముహూర్తము చింతించి ♦ యిఁకవచింపఁ
దగుననుచు నెంచి పల్కె నో ♦ ధరణిదేవ
వర్య! నేను మహాత్ముఁడై ♦ వఱలు మిథిల
జనపదేశ్వరుఁడౌ జన♦కునకుఁ దనయ. ౨ 1234

క. నాకగు [2]సీతానామము, నీకు శుభంబౌను గాక ♦ నేరామునతిన్
బ్రాకట కీర్తినిదగు ని,క్ష్వాకులయింటన్ వివాహ♦కార్యమువెనుకన్. ౩ 1235

---

1 ఇతి ధ్యాత్వా ముహూర్తంతు-అనిమూలము. ఇట ముహూర్తమనఁగా క్షణకాలము
2 సీతానామాస్మి భద్రంతే-అనిమూలము.

సీ. పండ్రెండువర్షముల్ ♦ బహువిధకామముల్ ప్రాభవమునఁ బొంది ♦ పతినిఁ గూడి
[1]నే నమానుషభోగ ♦ నివహంబులం దమి ననుభవించుచునుంట ♦ నంతటం ద్ర
యోదశవత్సర ♦ మొయ్యనఁ జనుదేర దశరథభూపాల ♦ తల్లజుండు
రాజమంత్రులఁగూడి ♦ రామునకుం దగఁ బట్టాభిషేకోత్స ♦ వంబు సేయ

తే. వలయునని పూని యోజించె ♦ వైభవమున
నట్లు దానిని నెఱవేర్ప ♦ నమరుపంగ
నత్తగారగు కైకేయి ♦ యార్య! తనదు
భర్త నడిగెను వరమును ♦ బట్టుపట్టి. ౬ 1236

సీ. సత్యసంధుని నృప ♦ సత్తము నామామ నాకైక తాఁ జేసి ♦ నట్టి మేలు
నకు గా వశంబు చే ♦ సికొనుచు నాభర్త వనమునకుం బంపఁ ♦ దనతనయుని
భరతునిఁ దగఁ బట్ట ♦ భద్రుని జేయంగ వలయునం చెరీతి ♦ వరములడిగి
యంతటఁ బోనీక ♦ యాత్మేశుతో నిప్పు డిటు సేయకున్నచో ♦ నేభుజింపఁ

తే. గన్నుమూయను నీటిచు ♦ క్కను గ్రహింప
జ్యేష్ఠజున కభిషేకంబు ♦ చేయుదేని
యిపుడె ప్రాణాళి విడిచెద ♦ నిది యథార్థ
మనుచుఁ గైకేయి పల్కంగ ♦ ననునయించి. ౭॥ 1237

క. అనుపమబహుమానప్రదుఁ, డనఘుఁడునగు దశరథేంద్రుఁ ♦ డన్వర్థములై
తనరారు సువర్ణాదుల, ఘనతరవస్తువులనిచ్చి ♦ కరుణామతియై. ౯ 1238

ఆ. ఎంత వేఁడుకొనిన ♦ నినుమంతయైనను, గైక తా గ్రహింపఁ ♦ గాఁ దలంప
దయ్యె; మిగులఁ దేజ ♦ మలరఁగ వెల్గు నా, [2]భర్త కిరువదైదు ♦ వత్సరములు.

ఆ. అవనిఁ బుట్టి నేను ♦ నప్పటికిం బదు, నెనిమిదేండ్ల సంఖ్య ♦ నెసఁగుచుండె;
వినుము రాముఁడనెడు ♦ పేరున నాపతి, సుప్రసిద్ధుఁడగును ♦ జుమ్ము మౌని. ౧౦॥

క. పరిశుద్ధుఁడు గుణవంతుం, డరయఁగ సూనృతవచస్కుఁ ♦ డగు యతివర్యా!
సురుచిరవిశాలనయనుఁడు, నిరతము భూతహితరతుఁడు ♦ నిక్కము సుమ్మీ.

తే. దీర్ఘబాహుఁడు నిరుపమ ♦ దివ్యరూప
మునఁ జెలంగెడువాఁ, డిట్టి ♦ తనయుఁ దండ్రి
కామపీడితుఁ డగుటచేఁ ♦ గైకహితముఁ
జేయఁగాఁగోరి పట్టాభి ♦ షేకమపుడు. ౧౨॥ 1242

---

1 భుంజానా మానుషాన్ భోగాన్ -అనిమూలము. మానుషాన్ భోగాన్-అనియు; అమానుషాన్ భోగాన్-అనియు పదవిభాగము. తెనుఁగున "నే నమానుషభోగనివహంబు" అనుచోట నేన, మానుష-అనియు, నేను అమానుష-అనియు విభజనము చేసినచో నాయర్థద్వయము లభించునని గ్రహింపఁదగు. 2 భర్త అనుచో "భ" అను నక్షరమునుండి తొమ్మిదవ సహస్రమారంభము. మమభర్తా మహాతేజాః-అనిమూలము.

క. బనరింపఁడమ్మె; నుత్సవ,మునకై పితృసన్నిధాన♦మునకుం దమివ
చ్చిన నాభర్తను గైకయుఁ, గని సాహసమూని యిట్లు♦గా వచియించెన్.

సీ. నీజనకుఁడు రాజు ♦ నీకుఁ జెప్పఁగఁదగు పల్కుల వచియింప♦వలయు ననుచు
నాకు నాజ్ఞాపించి♦నాఁడు వానివచింతు విను రాఘవా! రాజ్య♦మును నకంట
కము దీనిభరతున ♦ కమరంగ నీఁదగు నీవుమాత్రము దండ♦కావనమునఁ
బదునాలుగేండ్లు ని♦వాసము సేయఁగా వలయును గావున ♦ బయలువెడలి

తే. యడవి కరుగుము నీతండ్రి ♦ ననృతరూప
పాపముననుండి విడిపింపు ♦ మీపలుకుల
వినినతోడనె యని పల్కెఁ ♦ దనయు మేలుఁ
గోరి కైకేయి యిటుపల్క ♦ నారముఁడు. ౧౫॥ 1244

[1]క. అకుతోభయుండు దృఢనియ, మకలాపుఁడు నోటచేత ♦ మానినితో న
ట్లె కడంగి చేసెదను ద,ప్పక యని యాపల్కురీతి ♦ వనికేతెంచెన్. ౧౬॥

చ. ఇతరుల కిచ్చుఁగాని గ్రహి♦యింపఁడు సత్యమె పల్కుఁగాని సుం
త తగనిపల్కు పల్కఁడు ని♦తాంతదృఢవ్రత మిద్ది బ్రాహ్మణా!
వ్రతమును దీని మానఁ డెటు♦వంటి శ్రమంబులు వచ్చినన్ దృఢ
వ్రతుఁ డిఁకఁ గాకయేమి? విను ♦ రామునితమ్ముఁడు వీర్యశాలియౌ. ౧౭॥

తే. సవతితల్లి కుమారుండు ♦ సమరములను
బగతురం గెల్చువాఁడు న♦వార్యబలుఁడు
లక్ష్మణుం డనుపేరుగ♦లాఁడు రాఘ
వునకుఁ దాను సహాయుఁడై ♦ తనరుచుండు. ౧౮॥ 1247

చ. అనుపమధార్మికుం డగుచు ♦ నట్టి దృఢవ్రతమూని యున్న యా
యనుజుఁడు లక్ష్మణుండు వని ♦ కన్నను నన్నును గూడి రాఁగఁ దా
ధనువును దాల్చి వచ్చె; నృప♦తల్లజుఁడౌ రఘునందనుండు తా
ననిశము ధర్మతత్పరుఁడు ♦ నై విజితేంద్రియుఁడై చెలంగుచున్. ౧౯॥ 1248

క. మునివేషమూనుచున్ జట,లను దాలిచి యనుజుఁడైన ♦ లక్ష్మణుఁడును నే
నును వెంటరాఁగ నీవన,మునకున్ జనుదెంచె విప్ర♦ముఖ్యా! వినుమా. ౨౦॥

క. ఈరీతిఁ గైకహేతువు,గా రాజ్యభ్రష్టులమయి ♦ కడు నిడుమలు చే
కూరిన ముప్పురము మేము గ,భీరంబగు నీవనిం బ్ర♦వేశించి తగన్. ౨౧॥ 1250

[2]క. చరియించుచున్నవారము, సరిలేని ప్రతాపమొప్ప ♦ శ్రమముల్ పాయన్
ధరణీదివిజా! క్షణమీ, ధరణిన్ నివసింపు మిద్ది ♦ తగు నివసింపన్. ౨౨ 1251

తే. వన్యవస్తువులను ♦ వలసినన్నిఁటిఁ గొని
నాప్రియుండు వే వ♦నంబునుండి

---

1 కైకేయీమకుతోభయః - అరిమూలము. 2 సమాశ్వసముహూర్తంతు శక్యం వస్తు మిహాశ్రయా - అనిమూలము.

వచ్చుఁజుమ్ము [తెచ్చుఁ ♦ బందుల జింకల
నుడుములను వధించి ♦ యురుపలలము.] ౨౨౹ 1252

క. నీ విఁక గోత్రాహ్వయముల, భూవిబుధా! చెప్పు దాఁపఁ♦బూనకుమా యి
ట్లీవనమున నొంటరిగా, నీవేల చరించుచుందు ♦ వివుడని పలికెన్. ౨౩౹

క. శ్రీరాముపత్ని జనకజ, యీరీతిఁగఁ బల్క రాక్ష♦సేంద్రుఁడు మిగులన్
భూరిబలుండగు రావణుఁ, డా రమణికి నుత్తరంబు ♦ నత్యుగ్రముగాన్. ౨౪౹

తే. పలికె; సీతా! సురాసురుల్ ♦ పన్నగులును, సర్వలోకులు నెవనికి ♦ జంకువారొ
యట్టి రక్షోగణేశ్వరుం♦డైన రావ,ణాహ్వయుండను నేను బ♦ద్ధాయతాక్షి.

[1]చ. కనకసమానదివ్యతను♦కాంతిని మీఱుచుఁ బట్టుపుట్ట మె
య్యన ధరియించి యొప్పు నిను ♦ నన్నులమిన్నరో! చూచినంత నా
వనితలయందు నిక్కముగ ♦ వాంఛయె కల్గకయున్న దేమియున్
నినునిపు డిష్టదేవతగ ♦ నేను దలంచుచు మోదమందుటన్. ౨౬౹ 1256

తే. యచ్చటచ్చట నుండి నే ♦ నమరఁ బట్టి
తెచ్చిన వధూమణులకెల్లఁ ♦ దెఱవ యెవతె
మేటియో దానికిని నాకు ♦ మించువేడ్క
నధిపురాలివిగమ్ము నీ♦కగు శుభంబు. ౨౭౹ 1257

చ. సరిదధాంతరస్థలిని ♦ క్ష్మాధరమూర్ధమునందు లంకనాఁ
బరఁగుపురీలలామ మతి♦భాసురమై తనరారుచుండు నా
పురమటదానిఁ జుట్టుకొని ♦ పొల్చును సాగర, మందు నన్ను నా
దరమున గూడి నీవు ప్రము♦దాననరాజిని సర్వకాలమున్. ౨౮ 1258

క. జనజవిహారింపంగల, వనుదిన మటుచేయుదేని ♦ యంతట నీవీ
వనమున నిసింప నొల్లవు;, వనితారత్నంబ నాకు ♦ [2]భార్యవె యైనన్. ౨౯౹

తే. ఎల్లయాభరణంబుల ♦ నింపుఁగుల్కు, నట్టి పరిచారికలు నీకు ♦ నైదువేల
వంది పరిచర్యచేయుచు ♦ నుందు రెప్పు, డనిన రావణుపల్కుల ♦ నాలకించి.

క. అనవద్యాంగిను జనకుని, తనయయు నగు సీత యపుడె ♦ దారుణకోపం
బునుగాంచి పలి నిట్లా, దనుజుని లెక్కింప కాత్మ♦ధైర్యస్ఫూర్తిన్. ౩౦౹

క. గురుగిరిరీతి నకంప్యుఁడు, హరిహయసముఁ డబ్ధిరీతి ♦ నక్షోభ్యుండై

---

1 త్వాంతు కాంచనవర్ణాభాం దృష్ట్వా కౌశేయవాసినీం, రతిం స్వకీషు దారేషు నాధిగచ్ఛా మ్యనిందితే-అనిమూలము. వమేష్టదేవతాయా స్త్వదర్శనే నానందపూర్ణోఽహం సర్వతో నిర్వృ తోఽస్మీతి భావః. అని యుక్తేశ్వరతీర్థులు. ఈయభిప్రాయమే పద్యమున సంక్షిప్తము. ఇదిమొ దలు సీతనెత్తుకొనిరావణుఁడుపోవుదాఁకఁగల విశేషార్థములు తీర్థులవారియాశయములే యని తెలియఁ దగు. 2 భార్యా భవసి మే యది-అనిమూలము. భయాకాంత్యా ఆర్యాపూజ్యా భవసీతి సంబంధః- అనితీర్థులు.

పరఁగెడు రాముఁడు నాపతి, నిరత మనువ్రతనుగాఁగ ♦ నేనుందుఁ జుమీ.

[1]సీ. వటభూమిరుహమట్లుఁ ♦ బంధుతతింగూడి సర్వజనులకును ♦ సంతతాశ్ర
యుండయి శుభలక్ష♦ణోపేతుఁడై సత్యసంధుఁడై మఱి యదృ♦ష్టమున వెలసి
వఱలు రాముని కను♦వ్రతనైనదానను; మఱి మహాబాహుఁడు♦మహితవక్షుఁ
డతులితపంచాన♦నాత్యంతగామియు సింహనిభుండు నృ♦సింహుఁడు నగు
రామునికే నను♦వ్రత నైనదానను; బూర్ణచంద్రాస్యంబు ♦ పొలుపుమీఱ
తే. నిర్జితేంద్రియుఁడయి కీర్తి ♦ నెగడి మహిమ
వెలయ నున్నట్టి శ్రీరామ♦విభునికేను
విను మనువ్రతనైన దా♦నను దురాత్మ
యేల యీలాటిపల్కుల ♦ నిచటఁ బలుక. ౩౫ 126

క. దనుజా! నీవన నక్కవు, నను నెవ్విధినైనఁ గనుఁగొ♦నన్ సాధ్యముకా
ని నెలంత నాఁడుసింగం, బన నొప్పినదానిఁ గోర ♦ నగునే తులువా. ౩౬

క. ఖరకరుని ఛాయ పాయని, కరణిన్ బతిఁ బాయనట్టి♦కాంతను నన్నున్
గరముల స్పృశింపనైనం, దరమగునే చాలు నింకఁ ♦ దరలుము పురికిన్.

క. శ్రీరాముని ప్రియసతి ననుఁ, గోరెదవే భాగ్యహీన! ♦ క్షోణి యమపురిన్
జేరఁగలట్టి మనుష్యులు, భూరుహముల హాటకమయ♦ములఁ జూచుగాన్. ౩౮

క. ననుఁ గోరినవాఁడవు కను,కనె యింక సువర్ణతరులఁ ♦ గనఁగలవు సుమీ;
విను మాఁకటఁ దూలుచు జవ,మున ఘూర్ణిలు సింహవక్త్ర♦మునఁ గుకోరల్.

తే. ఆతురంబుగఁ జెలరేఁగు♦నట్టి సర్ప
వదనమున నున్నకోఱలు ♦ పట్టి పెఱుకఁ
గోరుచున్నాఁడ; వుత్తమ♦క్షోణిధరము
మందరముఁ జే గ్రహింపఁగ ♦ మదిఁ దలఁచితె. ౩౯ 1268

చ. అలవియె గానియట్లె యివి ♦ యన్నియు, నన్ను గ్రహించి నీవు పో
జెలఁగెద వంటయున్; మఱియు ♦ శీఘ్రమె చంపెడు కాలకూటమి
మ్ములఁగొని త్రాగి నీదుగృహ♦ముం గనఁగా సుఖరీతిఁ బోవఁగాఁ
దలఁచెదవో దురాత్మ గురు♦దానవ యీయభిలాషమేలరా. ౪౦ 269

సీ. కంటిని సూదితోఁ♦గడుఁబూన్కిఁ దుడుచుకొన్నావునాల్కనుగత్తి♦నాఁకుచున్న
వాఁడవు వచ్చువి♦పత్తు నెఱుంగవు, రామునిపత్నిఁ గో♦రం గదగునె;
కఱకురాతిని గుత్తు♦కకుఁ గట్టుకొని సముద్రము దాఁటగా నీవు ♦ తలఁచినావు
రవిచంద్రులను వేక♦రంబున గ్రహియించి కొనిపోవఁగా మదిఁ ♦ గోరినాఁడ
తే. వెట్టులివ్వి యసాధ్యమో, ♦ యట్టులై రఘు
వరునిపత్నిని నిరసింప ♦ వచ్చుటనఁగ;

---

1 సీత భార్యాశబ్దమునకుఁ బ్రాతీతికార్థమే గ్రహించి యాగ్రహించి పల్కెను. రావణుఁడు తల్లి యనునర్థమును గ్రహించి యానందించు ననుట యిట సారాంశము.

సదమలాచార యగు రామునతి హరింపఁ
దలఁచుచుండుటఁ జూడఁగా ♦ [1]దనుజవత్స!. ౪౩ 1270

ఉ. జ్వాలలమించు ఘోరశిఖి♦వస్త్రములో నిమిడించుకొంచుఁ బోఁ
జాలనె యన్నయట్లిదియు; ♦ సాధ్యముగాదు దురాశయా! కడుఁ
శ్రీలఁ జెలంగు రామునతిఁ ♦ జెందఁగ నెంతు వయోముఖంబుగాఁ
గ్రాలెడు శూలధారపయిఁ ♦ గాల్లిడిపోవఁ దలంచినట్లె నూ. ౪౪ 1271

క. వనిసింహజంబుకములకు, వననిధికిన్ జెలమ కట్లె ♦ వరమగు మద్యం
బునకు మఱి కడుగునీళ్లకుఁ, గన నెంతటి యంతరంబు ♦ కలదో దనుజా.౪౫

ఆ. అంత తారతమ్య ♦ మారామునకు నీకుఁ, గలదు సీసమునకుఁ ♦ గనకమునకుఁ
జందనమునకట్లె ♦ జలపంకమున కేనుఁ,గునకుఁ బిల్లికరయఁ ♦ దనరుచాసి.

క. కలదంతతారతమ్యము, జలజాక్షకులుం డనంగఁ ♦ జను రామునకున్
గలుషాత్ముఁడవగు నీకున్;, బలుమాట లిఁకేల దుష్ట♦వర్తన! నీతోన్. ౪౬

సీ. వాయసంబునకును ♦ వైనతేయునకును నీకుకాకికిని మ♦యూరమునకు
గ్రద్దకు హంసకుఁ ♦ గలభేద మెంతయో యంతభేదము నీకు ♦ నవనిపతికిఁ
గలదు; దేవేంద్రుని♦వలెనొప్పు మహిమచేవఱలు రాముఁడుధను♦ర్బాణములను
గరమునఁదాల్చి యు♦గ్రముగనుండఁగనన్నునపహరించినను బి♦య్యపుశకలము

ఆ. గా భ్రమించి యీఁగ ♦ కడఁగి వజ్రము మ్రింగ
నదియు దానికుక్షి ♦ నఱుగనట్లు
నేను నీవశంబు ♦ గాను జావే నీకుఁ
గలుగఁజేయుదానఁ ♦ గలుషధిషణ!. ౪౭ 1275

చ. అని పరిశుద్ధభావయగు ♦ నాజనకాత్మజ పల్కి భీతిచే
ననిలునిచేఁ గదల్పఁబడి♦నట్టి యరంటినిబోలి యెంతయుం
దనువుపడంకఁ దోఁపనివి♦ధంబున నుండెను ధీరయయ్యు; న
ద్దనుజుఁడు మృత్యుతుల్యమగు ♦ దర్పమునం బొలుపొందుఁ గావునన్. ౪౮

క. జనకజ భీతి వడంకెడు, నని యెఱిఁగి మహాభయంబు ♦ నామెకుఁ గల్గిం
పను బూని స్వకులమును బల,మును బేరు స్వకృత్యములను♦బూనె వచింపన్.

నలువదియేడవ సర్గము సంపూర్ణము.

---

## ౪౮ - వ సర్గము.

-o- రావణుఁడు సీతకు నిజరూపమును గనఁబఱచుట : సీత దూషించుట. -o-

చ. జనకజ యిట్లు చెప్పఁగ ని♦శాచరుఁ డెంతయు నాగ్రహించి యొ
య్యన భ్రుకుటిన్ లలాటమున ♦ నప్పు పొసంగగఁ గ్రూరవాక్కులన్

---

1 దనుజవత్స=ఇది రావణుని సీత లెక్కపెట్టలేదనుభావమును దెలుపునని ప్రయోగింపఁబడినది.

విను వరవర్ణినీ! యలకు♦బేరునకున్ సహజుండ నేను మా
జననులు విశ్రవస్సుతులు ♦ శౌర్యము మీఱెడునాకు నెంతయున్. ౧ 1278

తే. తలలు పది యొప్పు నాకు నన్ ♦ బిలుచువారు
రావణుండని నీకు భ♦ద్రమగుఁ గాక;
మృత్యువును గాంచి జనులెల్ల ♦ మిగుల భీతిఁ
బాఱునట్లు ననుంగాంచి ♦ వడఁకుచుఁ గడు. ౨ 1279

క. సురగంధర్వపిశాచో,త్కరములు గరుడోరగులును ♦ గడుభయ మడరన్
బరుగెత్తుచుంద్రు; మున్నొక, తరుణంబున నాకు సవతి♦తల్లి సుతునకున్. 3

ఆ. కారణాంతరమునఁ ♦ గల్గెను యుద్ధ ము, త్తఱిని గోపమడరఁ ♦ దఱిమినాఁడ
నతని; నంత భీతి ♦ నాకుబేరుం డార్తి, సకలభాగ్యములను ♦ సరగ వదలి. ౪

చ. తనపురమైన లంక, వని♦తామణిరో! విడనాడి వెండికొం
డను శివవాసమంచు నచ♦టన్ భయమేమియు లేదటంచు న
ప్పెనుగిరి నున్నవాఁడు; విను ♦ విశ్రుతలోచన! యిప్డు నేను దే
నిని దమి నెక్కి స్వేచ్ఛమెయి ♦ నింగి సదా చరియించువాఁడనో. ౫ 1282

తే. కామగమనంబు శుభదంబు ♦ కమ్రతరము
నైన యాపుష్పకవిమాన ♦ మతని నేను
వీర్యమున గెల్చి పడసితి; ♦ విబుధు లింద్రుఁ
డాగ్రహముఁ బూనియున్న నా♦యాననముల. ౬ 1283

చ. కనుఁగొని నంతనే భయము ♦ కాఱియపెట్టఁగఁ బాఱిపోదు; రో
జనకజ! నేవసించు క్షితి ♦ శంకితుఁడై పవనుండు వీచు మె
ల్లన రవి తీవ్రరశ్ములఁ జె♦లంగియు శీతకరంబులన్ నిగు
డ్చును భయమొంది నే నిలుచు♦చోటుల నేఁ జరియించుతావులన్. ౭ 1284

సీ. తరువులు స్వీయప♦త్రంబులఁ గదలక యుండఁగాఁ జేసి తా♦రుండుఁ జుమ్ము
నదులు నిశ్చలజీవ♦నములయి యుండును సంభ్రంబునకుఁ బార ♦ సదృశమైన
యాత్రికూటాద్రిపై ♦ నతిభయంకరదనుజాళి పూర్ణంబయి ♦ యమరు లంక
యను శుభపట్టణం ♦ బమరేశునకు నెట్టు లమరావతియొ యట్టు♦లమరియుండు

తే. దానిచుట్టును దగ రజ♦తమయమగుచుఁ
బాండురంబయి ప్రాకార♦వరము వెలయు
హర్మ్యముఖములు హేమమ♦యంబు లగుచుఁ
దనరు వైడూర్యతోరణ♦తతులు చెలఁగు. ౧౧ 1285

చ. కరులు హయంబులున్ రథని♦కాయము నిండి చెలంగ నెప్పుడున్
ధరుణిరో! వాద్యనాదములు ♦ తన్మయతం గనఁజేయుచుండ, నె

త్తరుణమునందుఁ బండు తరు♦తల్లజముల్ పొలుపొందఁగా మనో
హరములు గాఁ గనంబడిన ♦ యౌవనరాజిఁ బురంబు భాసిలున్. ౧౩ 1286

[1]క. నరపతిపుత్త్రీ! నీవా, పురమున ననుఁ గూడి మునము ♦ పొదల వసింపం
గ రతిం బొందినచో మది, స్మరింపకుండుదువు మర్త్య♦మహిళామణులన్. ౧౪

సీ. వరవర్ణినీ! నాదు♦పురమున నివసించి మత్సమర్పితదివ్య♦మనుజభోగ
ములఁ బొందుచుండి, కే♦వలమనుజాకృతి నొప్పు రామునిగతా♦యువును నతని
స్మరియింపకుందువే; ♦ మమ్ము స్మరింతువే; దశరథభూపతి ♦ తన ప్రియసుతు
భరతుని రాజ్యంబుఁ ♦ బాలింపఁగా నిల్పుకొని మందవీర్యుఁడై ♦ తనకు సగ్ర
ఆ. తనయుఁడైన రాము ♦ ధరణిఁ బాలింపంగఁ, దగఁడటంచు వనికిఁ♦దానుబంపె;
భ్రష్టరాజ్యుఁ డగుచుఁ ♦ బరిగతచేతనుఁ, డయిన రాముతోడ ♦ నగున దేమొ.

క. అతనిచరిత్రము శోచ్యం, బతనిం జేపట్టి యాయు♦తాక్షీ! శర్మం
బు తమిం బొందెదవే మో;, దితితనయులకెల్ల నేఁ బ♦తిని లోకములన్. ౧౬

క. స్మరబాణపీడితుఁడనై, పరికాంక్షన్ నేనె యిటకు ♦ వచ్చితి లేమా
సురపతితుల్యుని నన్నున్, నిరాకరింపంగఁదగదు ♦ నీకు నిజముగన్. ౧౭ 1290

తే. చరణపతితుఁ బురూరవు ♦ త్యాపతిం ద్రుఁ
గాలఁదన్ని యూర్వశి వెను♦కనె తదాత్త
చిత్తయై వానిఁబొందఁ గాం♦క్షించినట్లు
రామువలని భయంబున ♦ రమణి నీవు. ౧౮ 1291

క. నను నిటుఁ దిరస్కరించిన, వెనుకం బరితాపపడెదు ♦ వెఱ్ఱినగుచుఁ బొ
మ్మనితిం గనయని చిత్తం,బునఁ; దన్వీ నామపలుకుఁ ♦ బొల్పుగ వినుమా.౧౯

[2]క. అని ప్రేలికే సముం డతఁ, డనఁదగునే మనుజరూపుఁ ♦ డగురాముని నా
తనిఁ గనినను భాగ్యయుతుం,గని యరసి భజింపు మింకఁ♦గనకాంగి! తమిన్.

చ. అనియిటు రావణుండు తమి ♦ నాడినఁ గ్రోధవిఘూర్ణనేత్రయై
జనకజ నిర్జనస్థలిని ♦ శౌర్యఘనుండగు వాని దానవుం
గని పరుషోక్తులం బలికె ♦ గర్వితచిత్త: సమస్తభూతముల్
దనకు నమస్కరింపఁదగు ♦ దైవము నీశ్వరమిత్త్రు దిక్పతిన్. ౨౦ 1294

1 తత్ర త్వం వసతీ సీతే రాజపుత్త్రి మయా సహ, నస్మరిష్యసి నారీణాం మానుషీణాం మనస్వినీ, భుంజానా మానుషాన్ భోగాన్ దివ్యాంశ్చ వరవర్ణిని, నస్మరిష్యసి రామస్య మానుషస్య గతాయుషః - అనిమూలము. ఈశ్లోకములకు మహేశ్వరతీర్థులు వ్రాసిన విశేషార్థము లిటుఁ బద్యద్వయమున సంక్షిప్తములని యెఱుంగవలయు 2 అంగుళ్యా నసమో రామో మమయుద్ధేషు మానుష, తవ భాగ్యేన సంప్రాప్తం భజస్వ వరవర్ణిని - అనిమూలము. దీనికి మహేశ్వరతీర్థులవారు వ్రాసిన విశేషార్థ మీకందపద్యమున గర్భితమని గ్రహింపవలయు.

ఆ. అన్నయనుచుఁ బల్కి ♦ యాతని కెల్లప, కార మీవు చేయఁ♦గాఁ దలఁచితి
వకట! దుష్టబుద్ధి ♦ వతికర్కశుఁడ వజి, తేంద్రియుఁడవు నైన♦యిట్టి నీవు. ౨౧౪

క. దనుజుల కధిపతి వగుటన్, దనుజా! నీదోషమునన ♦ దానవులెల్లన్
గనువారు మృత్యువును వే,గ నిజంబిది; యసురనాథు ♦ కాంతను శచినిన్.

ఆ. అపహరించియైన ♦ నసువులతో నుండ, వచ్చుఁగాని రాము♦భార్య నన్ను
నపహరించినట్టు♦లైన జీవితము ద,క్కదు ప్రపంచమందుఁ ♦ గఱకుదనుజ!.

చ. అనుపమరూపయై తనరు ♦ నాశచి నింక యొనర్చి వజ్రహ
స్తునివలనన్ మృతింగనక ♦ దూరముగాఁ జని చాలకాలమున్
మనఁదగు నన్నుఁబోలు సతి♦మానిని ౦ద యొనర్చి యాసుధం
గొని తగఁ ద్రావియే బ్రదుకఁ♦గోరుట నిష్ఫలమెన్న నీకిఁకన్. ౨౮ 1298

నలుబదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ౪౯ - వ సర్గము.

### సీతాపహరణము.

క. అతులపరాక్రమమునఁ దగు, దితిసుతనాయకుఁడు సీత ♦ తెంపునఁ బల్కన్
మితిలేనికోపమున విని, సతిఁ గని కై, గరముఁ గొట్టి ♦ సంభ్రమ మొప్పన్. ౧

క. కనుఁగొనరానిభయంకర, తనువును ధరియించె; నంతఁ ♦ దా నురల మహీ
తనయంగని పరుషముగా, ననియెన్ మైథిలి! మనంబు ♦ నస్థిర మగుటన్. ౧౪

తే. వెఱ్ఱియై త్రినదాన వీ ♦ విపినమందు
నట్టులాటను నాదువీ♦ర్యమును శౌర్య
మును వచించిన యప్పుడు ♦ వినవె లేక
టంచుఁ దోఁచుచు నున్న దో♦చంచలాక్షి!. ౨ 1301

చ. స్థిరముగ నంబరంబున వ♦సించి కరంబుల రెంటనే వసుం
ధరఁ బయికెత్తఁజాలుదు ని♦తాంతము సంద్రముఁ ద్రావివైతు సం
గరమున మృత్యుదేవతను ♦ గ్రక్కునఁ జంపుదుఁ దీవ్రసాయకో
త్కరమున నడ్డగింతు రవి ♦ త్మీతల మెల్లను జించి చెండుదున్. ౩౪ 1302

క. వినుమా! యున్మత్తా! నే, ననఁగా నిచ్ఛానురూప♦మగు తనువు గ్రహిం
తును గామదుండఁ జుమ్మీ, యనురూపుఁడనైన *భర్త♦నగుదున్ నీకున్. ౪

సీ. అని రావణుఁడు పల్కి♦నంతనే యాతనికన్నులు భానుని♦కరణి వెలిఁగి
యనలునివలె జ్వాల ♦ లటు నిటు వ్యాపింపఁ బింగళవర్ణంబు ♦ వెలయు తుదల
నుగ్రంబులయి క్రుధ ♦ నొగి నెఱ్ఱఁబాఱెను; నరవాహనునిసహో♦దరుఁడురావ
ణాసురుఁ డప్పుడే ♦ యతిసౌమ్యమై యొప్పు భిక్షురూపంబును ♦ విడిచి కాలు

---

* ఇట భర్తయనుచోట నంతటను భృత్యుఁడనియే యర్థమని తీర్థులు.

తే. నాకృతింబోలి భయదమై ♦ యట్టి దుర్ని
రీక్ష్యమగు నిజతనువు ధ♦రించెఁ; జిత్ర
శక్తిసంపన్నుఁడగు రాక్ష♦సప్రభుండు
కోప మగ్గలమయి పయిఁ♦గొనఁగ నపుడు. ౭౪ 1304

తే. భయదరక్తాక్షుఁడై తప్త♦భర్మకుండ
లములు వెలుగొంద, నీలమే♦ఘము కరణిని
వెలయు ఛాయయుఁ దనరంగఁ; ♦ దలలుఁ దదియు
నొప్ప శరచాపములు దాల్చి ♦ యొప్పె నెదుట. ౮౪ 1305

వ. పెనుతనువొప్ప నాదనుజ♦వీరుఁడు భిక్షుతఁ బాసి నైజమా
తనువును దాల్చి కోపమునఁ ♦ దగ్ధయు రక్తములైననేత్రముల్
తనర ఘనాభకాంతి తగ ♦ దారుణమై యరుణంబునొచు నొ
ప్పిన వసనంబుఁ గట్టి కడు♦నింతఁగఁ దోఁచెడు సీతఁ గాంచుచున్. ౯౪ 1306

క. ఈతనువుఁ గాంచియైనను, సీత ననుం బతినిగాఁగఁ ♦ జేపట్టునటం
చాతఁడె నిలుచుండి; మహా,ఖ్యాతిం దగి యసితవాలు♦కాంతము లలరన్. ౧౦

క. ఖరకరురీతిం జూడం, దరంబు గాకుండి వస్త్ర♦తల్లజ మమరన్
వరదివ్యాభరణంబుల, ధరించి యున్నట్టి భూసు♦తం గని పలికెన్. ౧౦౪ 1308

*సీ. లోకత్రయంబునఁ ♦ బ్రాకట యశమొప్పునట్లుగాఁ దగు భర్త ♦ నరయుదేని
సుశ్రోణిరో నీకు ♦ సుఖసంస్థితిం గూర్చునన్ను భర్త గ్రహింపు ♦ మెన్ని; నీకుఁ
జాలకాలమునకు ♦ శ్లాఘ్యుఁడౌ ప్రియుఁడను గా నేను దొరకితిఁ ♦ గాన సంశ
యింపక యంగీక♦రింపు; కళ్యాణిరో యప్రియమే నొక♦యపుడుగాని
చేయను; మనుజుఁగాం♦క్షించిన నీభావమింకమార్పుఁగఁజను♦హితమదియగుఁ;
"బండితమానిని ♦ పరమమూఢేమయి భావశ్ప్రణీయతామ్ ♦ పరిమితాయు

---

* త్రిషు లోకేషు విఖ్యాతం యది భర్తార మిచ్ఛసి, మా మాశ్రయవరారోహే తవాహం సదృశఃపతిః. మాం భజస్వ చిరాయత్వ మహం శ్లాఘ్యః ప్రియ స్తవ, నైవచాహం క్వచి ద్భద్రే కరిష్యే తవ విప్రియం. త్యజ్యతాం మానుషే భావో మయి భావః ప్రణీయతామ్, రాజ్యాచ్చ్యుత మసిద్ధార్థమ్ రామం పరిమితాయుషమ్. కైర్గుణై రనురక్తాసి మూఢే పండితమానిని, యస్త్రీయావచనా ద్రాజ్యం విహాయ ససుహృజ్జనమ్. అస్మి న్వ్యాళానుచరితే వనే వసతి దుర్మతిః-అనిమూలము. ఈశ్లోకములకు మహేశ్వరతీర్థులు వ్రాసిన విశేషార్థము వచ్చునట్లు ప్రాతీతికార్థముతోఁ గలిపిచెప్ప వీలు కానేకాదు. ఏలన: మూఢే పండితమానిని=ఇవి సీతనుగుఱించిన సంబోధనపదములు. వీనిని సప్తమ్యంతములుగా "మూఢేపండితమానిని మయి" యని యన్వయించిరి. అసిద్ధార్థమ్. అశ్చాసౌ సిద్ధార్థశ్చ- అని సమాసమును జెప్పి విష్ణుపరముగా నన్వయించిరి. కాఁబట్టి యిట్టితావుల రెండర్థములు గలుగు నట్లు పద్యము చెప్పుట నావంటిమందమతికి శక్యము గాకపోయినది. కాఁబట్టి యనుకరణముగా నాపదముల నట్లేయుంచి పద్యమల్లుట సరసమని తోఁచినందున నట్లే కావించితి. పాఠకు లీయవిజ్ఞతను మన్నింతురుగాక.

షం రాజ్యవిచ్యుతం ♦ త్వాపాలకకుమారకం త మసిద్ధార్థ♦కం రఘుప్ర
వీరంతు కైర్గుణై ♦ శ్చారుతరం త్వనురక్తాసి" యనునాదు♦రమ్యభావ

తే. మాత్మ నెఱుఁగుము దుర్మతి ♦ యతఁడు కాన
వనితపల్కును బట్టియె ♦ వసుమతిని, సు
హృజ్జనుల విడి వ్యాళసం♦వృతవనంబు
నందు నివసించియున్నవాఁ ♦ డట్టివాని. ౧౫ 1309

తే. రామునిఁ జూచుచుఁ నీవు ♦ రమ్యగాత్రి
సంతసము నొందుచున్నావు ♦ వింతయనుచు
నర్థగాంభీర్యములగు వా♦క్యములు పల్కి;
[1] ప్రియములాడి ప్రియార్హయా ♦ వెలఁది నామె. ౧౬ 1310

[2] క. దనుజుండు సుదుష్టాత్ముఁడు, కనుకనె యీలాటి భావ♦గర్భోక్తుల నె
మ్మినిఁబల్కి యంతఁ గామం,బున మోహితుఁడగుచుఁ జేరఁ♦బోయి తెగువచేఁ.

[3] తే. అంబరంబున బుధుఁ డొగి ♦ హాయిఁ దిరుగు
నట్టి రోహిణిఁ దనతండ్రి ♦ యనుఁగుఁబత్నిఁ
బట్టునట్లుగ సీతఁ దాఁ ♦ బట్టుకొనియెఁ
దనదుమరణంబుఁ దాఁ దెచ్చు కొనఁగఁ దలఁచి. ౧౮ 1312

సీ. తనకుఁగల్గిన శాప♦మును దలంచి యతండు జనకజదేహంబు ♦ తనకుఁ దగుల
కుండ వామకరంబు♦నొయ్యనఁ జాఁచి యాపద్మాక్షివెండ్రుకల్ ♦ పట్టుకొనియె
దక్షిణకరమునఁ ♦ దగినట్టు లూరువుల్ పట్టుకొనియె; నంతఁ ♦ బర్వతంబు
వలెనిక్కి మృత్యువు♦భంగిభీకరుఁడయి భయదదంష్ట్రలు మహా♦బాహువులును

తే. వెలయనొప్పిన దనుజుండు ♦ లలనఁ బట్టు
కొనుచు నుండుటఁ గన్గొని ♦ వనదివిజులు
భయమునఁ గలంగి వేగమ ♦ పాఱిపోయి;
రంత మాయామయంబు ది♦వ్యంబునగుచు. ౧౯ 1313

క. ఖరయుక్తమగుచు భీకర, ఖరనిస్వనమగుచుఁ దప్త♦కనకాంగంబై
పరఁగుచు రావణుస్యందన, మరుదుగఁ గన్పడియెఁ బూర్వ♦మట గుప్తమదా.

చ. దనుజుఁడు భీకరధ్వనిని ♦ దారుణవాక్యములన్ సతీమణిన్
గని బెదరించుచున్ గరుణఁ ♦ గాంచక యూరువు లట్టెపట్టి స్వం

---

1 ప్రియార్హాం ప్రియవాదినీమ్-అనిమూలము. ప్రియములాడి ప్రియార్హయునగు సీతనని అర్థము. 2 అభిగమ్య సుదుష్టాత్మా-అనిమూలము. 3 బుధః ఖే రోహిణీమివ-అనిమూలము. బుధస్స్వమాతరం యథాపూజార్థం గృహ్ణాతి తథా రావణోఽపి సీతాం జగ్రాహ. అని మహేశ్వరతీర్థులు. ఈయర్థమును సూచించుటకై తనతండ్రియనుఁగుఁబత్ని యని తెనుఁగున ననువదింపఁబడియె నని యెఱుంగునది.

దనమును నెక్కఁజేసె; వని♦తామణి యంతట ధర్మనిష్ఠఁ గీ
ర్తిని గని యుండియున్ దనుజ♦ధీరుఁడు తన్ బలిమిన్ గ్రహింపఁగన్. ౨౦

క. వనమున దూరంబుగఁ దన, పనికై పోయిన మహాత్ము♦ బలశాలిని రా
మునిగూర్చి చాలవిలపించెను రామా! యంచు నడలు♦ చిత్తముతోడన్.

సీ. కామార్తుఁడైన యా♦క్రవ్యాదనాథుండు తనపైని ప్రేమ సుం♦తయును లేక
తనతోడ రానొల్ల♦క నితాంతము రథంబుపైఁ బొరలాడుచు♦ ఫణివిభుసుత
వలెనున్న జానకి♦ లలిఁ దొడలంబట్టుకొని యెత్తుకొని రథ♦ముననె బదిల
ముగనుంచియాకాశ కా♦మున కుద్గమించెను; దనుజేంద్రుఁడిబ్భంగిఁ♦ దనను వ్యోమ

తే. మునను దొంగిలికొనిపోవ♦ వనిత భ్రాంత
చిత్తయై యాతురతనొంది♦ మత్తుగొన్న
యట్లు దుఃఖంబు మీఱ ని♦ట్లనుచు నేడ్చె;
నక్కటా! దీర్ఘబాహూ! మ♦హాత్మ! రమ్ము. ౨౩ 1317

క. గురుచిత్త సుప్రసాదక!, వరగుణ! సౌమిత్రి! దనుజ♦వధమున నీభీ
కరదనుజుఁడు క్రుద్ధుండై, యరణ్యమున నొంటి నున్న♦ యబలను నన్నున్.

తే. ఇప్పుడే దొంగిలించి యి♦ ట్లేగుననుచు
నీకుఁ దెలియదె; రాఘవా! ♦ నీవు ధర్మ
మునకుఁగాఁ బ్రాణసుఖముల♦ ధనము విడుచు
నట్టివాఁడవుగద! యిప్పు♦ డిట్టిచోట. ౨౫ 1319

క. దనుజుఁ డధర్మంబున ననుఁ, గొనిపోవుచు నుండఁగఁ గనుఁ♦గొనకున్నావే;
యనఘ! పరంతప! దుర్జను,లను శిక్షించుటయె నీవి♦లాసమ్ముగదా. ౨౬ 1320

ఆ. ఇట్టివాఁడవయ్యు♦ నీలాటిపాపిని, రావణాసురునిని♦ రామ నీవు
శిక్షసేయవేమి? ♦ చెప్పుమా హేతువు?, నౌను! శిక్షయెట్టు♦ లపుడె కలుగు.

సీ. ఓరిదుర్మార్గుఁడా! ♦ యీరీతిఁ బాపంబు నొనరించినట్లైన♦ నురుతరమగు
నిట్టికర్మమునకు♦ నెట్టన ఫలము తోడనె కల్గ దరయఁ బై♦రును ఫలింప
దప్పుడే తగు సమ♦యము వచ్చినన పరిపక్వమౌ సస్య మ♦బ్భంగి నిదియుఁ
బరిపక్వమగుటకుఁ♦ దరుణము హేతువౌ నదియె చేకూరిన♦ నదియుఁ బండు;

ఆ. నట్టి కర్మకర్త♦ వగుదీవు కాలోప, హతమనీషుఁడవయి♦ యఘము నిట్టి
దానిఁజేసితి విటు♦ కానఁ బ్రాణాంతక,రమగు గొప్ప వ్యసన♦ మమరు నీకు.

చ. అరయఁగ ధర్మకాముఁడు మ♦హత్తర కీర్తియుతుండు రాముఁడా
ధరఁ దగునట్టివాని వని♦తామణినౌ నను బల్మిఁబట్టి కా
వరమున నీఁడు దోఁడుకొని♦ బాహుబలంబున నేగుచున్నవాఁ
డురుగతి నింక బంధుతతి♦ నొప్పెడు కైకయు వాంఛితంబు లె
ల్ల రమణఁ దీరఁగా మది వి♦లాసముఁ గాంచెడుఁగాక యక్కటా. ౨౯ 1323

సీ. ఈజనస్థానమం ♦ దెసఁగు వేడుకమీఱఁ గుసుమయుతంబుగఁ ♦ గొమరుమీఱు
కర్ణికారములార! ♦ కడుదీననై మిమ్ముఁ బిలిచి ప్రార్థించెద ♦ ఖలుఁడు రావ
ణాఖ్యుఁడు జానకి ♦ నపహరించుకొనిపోయెదునని చెప్పుఁడీ ♦ యిపుడె రాఘ
వునకు; నెత్తావిపూ♦వులమీఱి శిఖరముల్ వఱల నొప్పెడు ప్రస్ర♦వణమహీధ్ర

తే. వర్యమా! నీకు మ్రొక్కెద ♦ బలిమి సీత
ఘోరదనుజుఁడు తనవెంటఁ ♦ గొనుచుఁ బోవు
చున్నవాఁడని రామున ♦ కున్నరీతిఁ
బల్కుమా శీఘ్రమే మఱు♦వకయె నీవు ౩౧౪ 1324

క. కారండవములు హంసలు, చేరి తమిం గూయుచుండఁ ♦ జెలఁగెడు నీకుఁ
గోరిక గౌతమి! వందన, వార మ్మొనరించుదాన ♦ భక్తిఁ దలిర్పన్. ౩౨ 1325

క. రామునితో గోదావరి!, నీమానిని రావణుండు ♦ నింగిని బలిమిన్
దా మీఱికొనుచుఁ బోయెను, రామా! కాపాడుమనుచు♦రయమునఁ జెపుమా.

క. పలువిధములైన వృక్షం,బులఁదగు నీవనిని గల వి♦బుధులారా! యి
మ్ముల మ్రొక్కెద నపహృతనై, కలఁగుచుఁ జనుచున్నదానఁ♦గదయీ వార్తన్.

క. కరుణమెయిన్ నాభర్తకుఁ, ద్వరఁగాఁ జెప్పుదురుగాక; ♦ వనినిండుఁ దగం
జరియించు మృగపతత్త్రిని, కరజంతువుల మఱుఁగునిటఁ ♦ గడఁకం జూత్తున్.

క. పెనిమిటి కెంతయుఁ బ్రియురాలను బ్రాణాధికను నగుచు ♦ లలినొప్పియు నీ
దనుజునిచేఁ జిక్కితి ననుఁ, గొనిపోవుచు నున్నవాఁడు ♦ క్రూరుం డగుచున్.

ఆ. ఇట్టి నన్నుఁగూర్చి ♦ "యెంతయు వివశయై, జనకతనయ క్రూర♦దనుజుచేత
నపహరింపఁబడియె" నని చెప్పుఁడీ మీర,లిపుడె రాముకడకు ♦ నేగి కాంచి.

తే. అమ్మహాబాహుఁ డతులితా♦యతబలుండు
నాదువృత్తాంతమున్ విన్న♦మీఁద నతఁడు
స్వర్గమున నున్న నంతకా♦పహృతనైనఁ
దెచ్చుకొను నన్ను విక్రమ ♦ మచ్చుపడఁగ. ౩౬౪ 1331

చ. అని యెలుఁగెత్తి యేడ్చి జన♦కాత్మజయుం గరుణంబుగాఁ గడున్
వినఁదగుమాటలం బలికి ♦ విస్తృతదుఃఖముతోడఁ బోవుచున్
గనుఁగొనె నాయతాక్షి యొక♦గృధ్రను వృక్షమునందు నొక్కెడన్;
దనుజునిచేతఁ జిక్కుపడి ♦ తామరసాక్షియు దానిఁ జూచుచున్. ౩౮ 1332

తే. భయముపైకొన వెతచేతఁ ♦ బలుకులెల్ల
వింతగాఁ దోఁప నో యని ♦ పేరుకొనుచు
నార్యవర్యా! జటాయువా! ♦ యాదరమునఁ
గాంచుమా నన్ను శ్రీరాము♦కాంత నిచట. ౩౯ 1333

సీ. ఈపాపకర్ముఁడు ♦ హీనవంశ్యుఁడు వీఁడు కనుఁగొనినంతనె ♦ కరుణపుట్టు
నట్టి నన్నును బల్మి ♦ బట్టి కొంపోయెడు దిక్కులేనట్టి యు♦శివను బోలె;
సత్వవంతుఁడు జయ♦శాలి క్రూరుండును సాయుధహస్తాఘుఁ ♦ డల్పబుద్ధి
యీనిశాచరుఁడగు ♦ నీతని వారింప నీకు శక్యముగాదు ♦ నీవు పోయి;
ఆ. యనురుఁ డితఁడు నన్ను ♦ నపహరించినవార్త
నున్న దున్నయట్లు ♦ లోగిని రాము
లక్ష్మణులకు వేవ♦లయుఁ జెప్పఁగా నంత
యైన విడువకుండ ♦ నార్యవర్య. ౪౧ 1334

నలుబదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

## ౫౦ - వ సర్గము.

జటాయువు రావణునకు హితోపదేశము చేయుట.

చ. ఉరుతరవృక్షశాఖపయి ♦ నొక్కఁడె యించుక నిద్రపోవుచుం
డి రమణి తన్నుఁ బేర్కొనఁగ ♦ నింగిని నుండిన మాటవించు స
త్వరముగ మేలుకాంచి రఘు♦వర్యునిపత్ని విలాపవాక్యముల్
వరుసఁగ నాలకించి సుర♦వైరిని వే గని యంత జానకిన్. ౧ 1335

చ. కనుఁగొని యాజటాయువు ము♦ఖం బతితీక్ష్ణముగాఁ జెలంగఁగా
ఘనగిరికూటతుల్యమగు ♦ కాయము పొంగఁగఁ బక్షినాథుఁ డొ
య్యనఁ దరుశాఖనుండియె మ♦హాత్తరభక్తి రమావిలాసుఁడై
యనుపమమంగళోక్తులను ♦ నాదనుజోత్తముతోడ నిట్లనున్. ౨ 1336

మ. దనుజాధీశపురాణధర్మముల న♦త్యంతంబు నాసక్తి యొ
ప్పినవాఁడన్ మఱి సత్యసంశ్రయుఁడ నా ♦ పేరో జగంబందు నొ
ప్పును జుమ్మీ వినుమీ జటాయువని పెం♦పుం జేవయుం గల్గువాఁ
డను గృధ్రేశుఁడ నాదున్యాయమగుమా♦టల్ సుంత యాలింపుమా. ౩

సీ. సర్వలోకముల కీ♦శ్వరుఁడు నిర్జరనాథ వరుణులతో సరి♦వచ్చువాఁడు
సకలలోకహితుండు ♦ సత్వయుతుండును దశరథభూపాల ♦ తనయుఁ డగును
రాముండు; వినవయ్య ♦ రాక్షసరాజ! నీ వపహరింపఁ దలంచి♦నట్టి యీమె
యాసర్వలోకేశు♦ననుఁగుఁబత్నియె యగు నతులయశస్స్ఫూర్తి♦నలరుఁ జుమ్ము
తే. సీత యనఁ నొప్పు; దనుజేంద్ర! ♦ ఖ్యాతధర్మ
మునను వర్తించు నీవంటి ♦ ఘనుఁడు రాజు
పరులదారల స్పృశియింప ♦ వచ్చునెట్లు?
మఱియు భూపతి నరపతి ♦ మానినులను ౪ 1338

క. పనిఁబూని కావవలయును, మనుజేశుఁడె రాముఁ డన్న ♦ మతి గల్గినచో

వినుము పరునిభార్యఁ దాఁకుట, యనువగునే దానిఁజేయ ♦ నది నీచము యౌా.

ఆ. అట్టినీచబుద్ధి ♦ నవ్వలఁ ద్రోయుము, పండితుండు తనను ♦ బరులు నింద
చేయునట్టిపనులఁ ♦ జేయఁడు నుంతయుఁ, దనదుపత్ని నొరుఁడు ♦ తాఁకకుండ.

క. తానెట్లు కావఁదగునో, పూని పరాంగనలఁ గావఁ ♦ బూనందగు న
ట్లే; నీవును బౌలస్త్యుని, సూనుండవు బాహుశౌర్య♦శోభితుఁడవు సూ. ౭౪

ఆ. శిష్టులైనయట్టి ♦ క్షితిపతుల్ శాస్త్రము
లందుఁ జెప్పఁబడని ♦ యట్టి ధర్మ
మును నధర్మము నట్టి♦యును గామమును వీనిఁ
గోర రెంతమాత్ర ♦ మూరయంగ. ౮౪ 1342

[1]సీ. ఇతరులయందిది ♦ యెట్టులున్నను నినుబోటి రాజుల కిది ♦ బుద్ధిఁ దలఁప
ననుచితంబే యగు ♦ నవనీపతియె ధర్మకామప్రవర్తకుఁ♦డౌ మహిఁ దగ
నర్థంబులకు నిధి ♦ యగు; ధర్మమునకును శుభపాపములకును ♦ క్షోణివిభుఁడె
యాధారనుగు నవ్వి ♦ యాతనిచలననే వర్తించుచుండు న♦వ్వసుమతీంద్రుఁ

తే. గనుచునే ధర్మముఖముల ♦ జనులు తిరుగు
వారు, నరపతియో తన్నుఁ ♦ బట్టి కాక
పోయినను లోకమును బట్టి♦యే యయినను
బాపమును మాని ధర్మముఁ ♦ బడయవలయు. ౯౪ 1343

క. దనుజేంద్ర! విషయలోలతఁ, గని యఘమె స్వభావముగఁ ద♦గం బొల్చిననీ
కును దుష్కృతికి [2]విమానము, నగుపడనియట్లు భాగ్య ♦ మర్థం బెటులౌ.

క. జనినుండి యేస్వభావ మెవనికిఁ వచ్చునో మనోజ్ఞ♦వాక్యంబుల దా
నినిఁ బోఁగొట్టుట కేరీతిని శక్యముగాదు దనుజ ♦ తెల్లమిదియె సూ. ౧౦

తే. సదుపదేశము దుర్మతి ♦ స్వాంతమందుఁ
జాలకాలము నివసింపఁ♦జాల దరయ;
శత్రుభార్యాపహరణ మ♦స్మత్స్వభావ
మనుచుఁ బల్కుదువేని య♦ట్లైన వినుము. ౧౧౪ 1346

చ. అతిబలశాలి ధర్మమతి ♦ యారఘువీరుఁడు నీదురాజ్యసం
తతికినిగాని నీనగర♦తల్లజమై తగు లంకకేని దు
ర్మతి! యపరాధమేమి యణు♦మాత్రము చేయఁడు గాదె శత్రువే
యితఁడనరాని రామునకు ♦ ని ట్లపకార మిదేల చేయఁగఁ. ౧౨౪ 1347

సీ. ఖరవధమే నాకుఁ ♦ గావించినట్టి యపకృతి యందువయేమొ ♦ వనమునందు
మును శూర్పణఖహేతు♦వున జనస్థానమునం దతివృత్తుఁడై ♦ యాఖరుండు;

---

1 రాజాధర్మశ్చ కామశ్చ ద్రవ్యాణాం చోత్తమో నిధిః, ధర్మశ్శుభం వా పాపం వా రాజమూలం ప్రవర్తతే - అనిమూలము. దీనియర్థమే యిట విస్తృతము. 2 విఘానమివ దుష్కృతిః-అని మూలము.

రాము మాఱొక్కని సంగ♦రమున నక్లిష్టకర్మునిచేత మడిసె రా♦ముని యకృత్య
మిందేమి యున్నదో♦యెఱిఁగింపుమా తత్త్వముగలోకనాథుఁడై♦తగినరాము

ఆ. పత్నిఁ బల్మిఁబట్టి ♦ పరుగెత్తుచున్నావె;, విడువు మిపుడె జనక♦విభునితనయ
నశనివృత్రుఁ జంపి♦నట్లతఁడు నిను దృ,గుగ్రవహ్నిఁ గాల్ప ♦ కుండుఁగాక.

క. ఘనవిషఫణివస్త్రాంతం,బునఁ గట్టుకొనియును దాని♦పోలికను గనుం
గొన కున్నావే; కంఠం,బునఁ దగిలిన యమునిపాశ♦ముం గనవు గదా. ౧౮॥

సీ. ఎంతభారము మోయ♦నేమియుఁ బీడలు కలుగవో మోయంగ♦వలయునంతె
యామయంబును బుట్టు♦నట్లు చేయక యేది జీర్ణించునదియె భు♦జింపఁదగిన
యన్నమా; దేనిఁ జే♦యంగఁ గీర్తియుఁగాని ధర్మముగాని నుం♦తయును గల్గ
దో దేహమునకును ♦ ఖేదముమాత్రము గల్గునో యెవ్వఁడా ♦ కార్యమూని
చేయును? మూఢుఁడే ♦ చేయును దానిని; దానవా! నేఁ బుట్టి ♦ తండ్రితాత

తే. లెల్ల నేలుచు వచ్చిన ♦ యీయనూన
గృధ్రరాజ్యముఁ గ్రమముగా ♦ నేలుచుండి
షష్టివర్ష సహస్రముల్ ♦ జరగె నింత
దనుక; నాయుధములు లేవు ♦ వినుము నాకు. ౧౯॥ 1350

క. జరయను నామయమొందిన, దరయఁగ నాయందుఁ బ్రాయ ♦ మలరెడు నీకుం
శరచాపాదులు బహువిధ, పరికరములు దాల్చియున్న♦వాఁడవు దనుజా. ౨౦

తే. కవచధారివి స్యందన♦కలితుఁడవు ని
జంబుగా నిట్టులైన నీ♦జనకతనయఁ
జేకొనుచు క్షేమముగ లంకఁ ♦ జేరఁజాల
విపుడు నినుఁ బోవనీయ నే ♦ నిచటినుండి. ౨౦॥ 1352

సీ. వేదవిదుండైన ♦ విద్వాంసుఁ డొక్కఁడు చక్కఁగన్గొన న్యాయ♦శాస్త్రసిద్ధ
ములయిన యనుమాన♦ముఖముల చేతను జలన మొందింప న♦శక్యమైన
ప్రామాణ్యము గలిగి ♦ వఱలు వేదశ్రుతిఁ బ్రతిపక్షి కన్యప♦రముగ నర్థ
మొనరించి గ్రహియింపఁ♦గ నశక్యమైనట్లు నేను జూచుచు నుండఁ♦గానె నీవు

తే. భూమిపుత్రిక బలవంత♦ముగ గ్రహించి
చనఁగ శక్యముగాదు; రా♦క్షసవరేణ్య!
కడఁగి యుద్ధముచేయు శూ♦రుఁడవె యైన
నట్లు లేకున్నఁ గొంతసే ♦ పాఁగు మిచట. ౨౧ 1353

క. సీతాపతి యరుదెంచును, నాతనిచే మున్న ఖరుఁడు ♦ హతుఁడైనటు నీ
వీతఱి ధరను బఱుండుదు;, వోతులువా! యెవఁడు మున్న♦యుద్ధమునందున్.

క. దనుజుల దైత్యుల వధియిం,చెనొ వల్కలధారి యతఁడె ♦ శీఘ్రముగా ని
న్నని మొనబలియిచ్చుఁ జుమీ;,మను జేంద్రులఁ బిల్వ్రమనుచు♦మాఱుపలికెదో,

సీ. పాఱిపోయెదవేమి ♦ పరమనీచాత్ముఁడా! రాజకుమారులు ♦ రాఘవు లిపు
డివ్వని బహుదూర ♦ మేగి యున్నారు నేనేమి చేయంగల ♦ నింకమీఁద
నచటికిం బోయి యూ♦యన్నదమ్ములఁ దోడుకొని వేగ రాఁజాల♦దనుజ! నీవు
వారిభయంబునఁ ♦ బాఱుదు వింతలో సంశయమే లేదు ♦ జనకజఁ గొని
ఆ. పోవు నిన్ను నేనుఁ ♦ బోనిత్తునే; ప్రాణ,ముల ధరించి నేను ♦ నిలఁ జరింప
లలితకమలపత్ర♦ములఁబోలు కన్నులఁ, దనరు రాముని ప్రియ ♦ వనిత నీవు. ౨౪

క. పరమశుభాకృతి మీఱెడు, తరుణీరత్నము గ్రహించి ♦ తరలంగలవే
సురవైరి! యేమిచేయం, దరమా నీ నుచుఁ బల్కఁ ♦ దలఁచెదవేమో. ౨౫॥

ఉ. జీవితమైన నిచ్చి వన♦సీనుఁ జెలంగెదు రామమూర్తికిన్
బావనచిత్తుఁడై మనుజ♦పాలకుఁడై తగు రాముతండ్రికిన్
జేవఁ దలిర్పఁగాఁ బ్రియము ♦ సేయఁదగున్ గదుఁ బాపచిత్తుఁడా
రావణ! నిల్వు, నిల్వు, చన♦రాదు ముహూర్తము చూడు నన్ననిన్. ౨౬

తే. సంగరాతిథ్య మొసఁగెద ♦ శక్తికొలఁదిఁ
బండు వృంతమునుండి యె♦ప్పగిదిఁ గూలు
రట్లు నిన్నేను బడఁద్రోతు ♦ నవని రథ
ోత్తమమునుండి బలిమిమై ♦ నుగ్రశక్తి. ౨౭ 1359

ఏఁబదియవ సర్గము సంపూర్ణము.

౫౧ - వ సర్గము.

జటాయువు రావణునితోఁ బోరి నేలఁ గూలుట.

క. అనియిట్లు జటాయువు చెప్పిన న్యాయోక్తులను నెల్ల ♦ వినఁగానే య
ద్దనుజుని యిరువదికన్నులు, ధనంజయునిరీతి వెలిఁగెఁ ♦ దగఁ గోపమునన్. ౧

క. దనుజేంద్రుఁడు కోపంబునఁ, గను లరుణంబులుగ నొప్పఁ♦గాఁ దప్తంబౌ
కనకంబునఁ దగు పోఁగులు, తనరన్ దద్వాక్యములకుఁ ♦ దాళఁగలేమిన్. ౨

తే. ఉరవడించెను బక్షీంద్రు ♦ నొకటఁ జంపఁ;
జండవాతోద్ధతాంబుద♦సంఘములాగి
నంబరమున నొండొంటితో ♦ నార్భటించి
తాఁకునట్లుగ వారలి♦ద్దఱును బూన్కి. ౩॥ 1362

తే. [1]ఆయరణ్యానియందు న♦త్యంతభీక
రార్భటుల మారుకొని పోరి ♦ రతితుములము
గాఁగ; నప్పక్షిరాజరా♦క్షసులు యుగ్మ
పక్షసహితంబులగు మాల్య♦వద్గిరులాగి. ౪॥ 1363

---

1 అరణ్యాని=పెద్దయడవి.

క. ఇతరేతరంబు పోరెడు, గతి యుద్ధముసేసి; రంత ♦ గాఢబలుండై
దితితనయరాజు భయదా,కృతి మించుచు వాఁడి మొనల ♦ నెసఁగు శరములన్.

సీ. వైచె గృధ్రేశుని♦పై నవి నాళమాత్రంబులై పరఁగె నం♦తటను మీఱి
యనుపబాణంబుల ♦ నేసె నంతటఁ బోక నంకుశాగ్రశరాళి ♦ నమితవర్ష
మట్లు ప్రయోగించె; ♦ నాగృధ్రరాజును రావణప్రహితశ♦రసముదయము
నరకుసేయక తాను ♦ సంగరమ్మున సహించెను; బలశాలి ప♦క్షిప్రభుండు

తే. వాని దేహంబునంతయు ♦ వాడి నఖర
ములను దగుకాళ్లతో గీఱి ♦ వెలయఁజేసె
వ్రణములను; దరువాత రా♦వణుఁడు క్రుద్ధుఁ
డై పదుంజంపుకాంక్షచే ♦ నార్భటించె. ౭ 1365

క. కాలుని దండాకృతిచే, గ్రాలుచు ఘోరంబులైన ♦ కాండదశకమున్
లీలం గైకొని వీర్యము, చాలఁగ నొప్పంగ నారి ♦ సారించి వెసన్. ౮ 1366

తే. కర్ణములదాఁక లాగి భీ♦కరము లౌచుఁ
జక్కఁగా గుఱి దాఁకంగఁ ♦ జనెడువాని
వైచి యాతని భేదించెఁ ♦ బక్షిరాజు
వానిబాధ సహించి రా♦వణురథమున. ౯ 1367

క. జనకజను బాష్పలోచనఁ, గని దనుజున్ మరలఁ దాఁకి; ♦ కాండయుతధను
స్సును ముక్తామణిభూషిత,మును విఱిచెను గాళ్లఁ దేజ♦ము పొదలుచుండన్.

క. కని రావణుండు కోపం,బున దేహము మఱచి చాప♦మును వేఱొకదా
నిని గొని నూఱుగ వేలుగ, ఘనశరములఁ గురిసెఁ బక్షి♦కాంతునిమీఁదన్.

చ. అనిమొన రావణాసురుని ♦ యమ్ములు తన్నొగిఁ జుట్టుముట్ట వా
నినడుమ గూటిలోఁ దనరు ♦ నీడజముంబలె నాజటాయువొ
ప్పెను; గురుతేజుఁడౌ పతగ♦వీరుఁడు తోడనె తచ్ఛరాళిఁ బ
క్షనియతశక్తిఁ దూల్చి పెను♦గాళ్లను ద్రుంచెఁ దదుగ్రచాపమున్. ౧౨

చ. అనుపమవీర్యుఁడై తనరు ♦ నండజవల్లభుఁ డంతఁబోక య
ద్దనుజుని యుజ్జ్వలత్కవచ♦తల్లజమున్ జ్వలనాభమున్ బలం
బునఁ దనఱెక్కలం జదిపి ♦ భూస్థలిపైఁ బడఁ జిమ్మివైచె; నిం
కను బలవంతుఁడై రణము♦ఖంబున నాతఁడు మచ్చరంబునన్. ౧౩ 1371

తే. కనకకవచంబు లొప్పంగఁ ♦ గమ్రములయి
తగి పిశాచాననంబులు ♦ సొగసుగులుక
వేగవంతములయి గడు ♦ వింతదోఁపఁ
గనఁబడెడువాని ఖరముల ♦ నెనసి చంపె. ౧౪ 1372

క. అరుదగు నొగతో వెలయుచు, వరమై కామగతినొప్పి ♦ వహ్నిసమరుచిం

బరఁగి మణిహేమచక్రో,త్కరమయి తగు తన్మహార♦థంబును ద్రుంచెన్. ౧౮

సీ. పున్నమచంద్రునిఁ ♦ బోలినయట్టి శ్వేతచ్ఛత్రమును గాంతిఁ ♦ దనరు చామ
రముల వానింబట్టు♦రాక్షసులను దుండమున వేగ ధరఁ గూల్చె; ♦ఘనబలుండు
శ్రీమంతుఁడునగు ప♦క్షిస్వామి మరల నాతుండంబుచేతనే ♦ తొందరపడి
రాక్షసేశ్వరుని సా♦రథిశిరంబును గూల్చె; నంత హతస్యంద♦నాశ్వచాప
సారథియై నిర్జ♦రారియు జనకజఁ దా నెత్తుకొని నేల♦పైని దుమికె;

తే. భగ్నవాహనుఁడై యిట్లు ♦ పంక్తికంఠుఁ
డిలను బడుటను భూతంబు♦లెల్లఁ గాంచి
మేలుమేలని పక్షీంద్రుఁ ♦ జాలఁబొగడి
యాత్మలం బూజనల్పె న♦య్యవసరమున. ౨౧ 1374

క. జరచే నలసిన పక్షీ,శ్వరు రావణుఁ డంతఁ గాంచి ♦ సంతసపడి తా
మరలన్ జానకిఁగొని యం,బరమున కపు డుద్గమించెఁ ♦ బక్షీంద్రుండున్. ౨౨

క. ఘన తేజంబునఁ బొల్చెడు, తను జీరికిఁగొనక నమ్మ♦దంబున సీతం
గొనిపోవుచున్న రావణుఁ, గని తాను నెగిరి ♦ కడువడి నతనిన్. ౨౩

ఆ. అడ్డగించి పలికె ♦ నల్పబుద్ధీ! వజ్ర, సన్నిభాంబకముల ♦ సంఘములరఁ
దగినరామచంద్రు ♦ దార నీమెను దను,జాళి చావుకొఱకె ♦ యపహరించి ౨౪

క. కొనిపోవుచున్నవాఁడవు;, దనుజేంద్ర! పిపాసితుం డు♦దకముం దగఁ ద్రా
వినగతి నీదుష్కార్యం, బనువిషముం ద్రాగి తిప్పు ♦ డది మృతికరమా. ౨౫

ఆ. నీవు త్రాగుచున్న ♦ యీవిషంబే నీకు, సచివమిత్రబంధు♦సైన్యసేవ
కాళికెల్ల మృత్యు♦వౌఁ జుమ్ము మానుము, సకలనాశనంబుఁ ♦ జనదు చేయ.

క. ఇలఁ దారుచేయు కార్యం,బులకున్ వెనువెంటను ఫల♦ములు వచ్చునటం
చల మూర్ఖ తెలియఁగఁజాలక, ఖలమతివగు నీవు వొలెఁ♦గడుఁ జెడుదురు సూ.

క. తనుఁ జంపుటకై యెరగ్రు,చ్చిన గాలము మ్రింగి యొటకొ♦చెచ్చెడుఁ జని దా
నిని వీడ లేకయే చ,చ్చిన మత్స్యముభంగి దనుజ♦సింహా! నీవున్. ౨౮ 1381

ఆ. కాలపాశబద్ధ♦గళుఁడవై యుండియు, నెచటికేగిన నది ♦ యచటఁ జేరి
చంపుఁగాని నిన్నుఁ♦జక్కఁగా విడిపోదు;, దనుజ యొక్కపలుకు♦వినుమయింక.

చ. ఇరువురు రామలక్ష్మణు ల♦దెవ్వరినే నెదిరింపరాక యి
ద్ధరఁ దగువారు నీవిచటఁ ♦ దమ్మవమానము నొందఁజేయ నె
వ్వరున క్షమింపఁబూనరిఁకఁ ♦ బట్టి వధింతురు సుమ్ము; భీతి నె
వ్వరు నట లేనికాలమున ♦ వారికిఁ గీడొనరించి తివ్విధిన్. ౩౦ 1383

క. జననిందిత మిప్పని నీ, వొనరించితి విదియె చోరు ♦ లొనరించునదే
విను మిప్పని వీరులు చ,క్కనిదని చేయంగరారు♦గద యెవ్విధినిన్. ౩౧

క. దానవవర! శూరుఁడవే, యైనన్ సంగరమొనర్పు ♦ మటు లేకున్నన్
జానకిపతి యరుదెంచెడుఁ, గాన ముహూర్తంబు నిల్వు ♦ కదనము పొసఁగన్.

క. నీతమ్ముఁడు ఖరదానవుఁ, డేతీరునఁ దెగియె నట్టు ♦ లే నీవును నా
భూతలమున శయనింతువు, చూతము నీబాహుశక్తి ♦ సురగణవైరీ. ౩౦½

క. మరణంబు సమీపించినఁ, బురుషుఁడు స్వవినాశమునకుఁ ♦ బూని యదేక
ర్మరతి మెలంగునొ నీవ,క్కరణిన్ దుష్కార్య మిద్ది ♦ కడఁగితి సేయన్. ౩౧½

చ. మరణము నీదుచెంత నను ♦ మానములేక చెలంగుచున్నది
త్తరుణమునందు; నేపనికి ♦ దారుణపాపఫలంబు యుక్తమై
పరఁగునొ? యట్టికృత్యము నె ♦ వం డొనరించును? లోకనాథుఁడా
[1]సరసిజసూతిగూడ నది ♦ సల్పఁడు సూ భగవంతుఁ డయ్యుఁ దాన్. ౩౨½

చ. అని హితవాక్యము ల్పలికి ♦ యాతఁడు వానిఁ దృణీకరించి చ
య్యనఁ బరుగెత్తుచుంటఁ గని ♦ యాతనివీఁపునవ్వా లె వీర్యమున్
గనఁబడఁబోయి; యంతట ని ♦ కామరుడుద్ధతి వాని నిల్పి చ
క్కనిగతి మావటీఁడు మద ♦ గండగజంబును నెక్కి యా[2]సృణిన్. ౩౪ 1389

క. పరిపరివిధములఁ బొడిచెడు, కరణిన్ రావణునివీఁపు ♦ ఖరనఖరముఖో
త్కరమున నంతట ఱక్కెన్; ద్వరపడి యాపక్షినికర ♦ తల్లజుఁ డంతన్. ౩౪½

తే. తాను నఖపక్షతుండ ని ♦ తాంతసాధ
నుండె యాటను దనఘోర ♦ తుండ మతని
వీఁపుపై నిగుడించుచు ♦ వెంద్రుకలను
నఖములం బీఁకివైచె నెం ♦ తయును బూన్కి. ౩౫½ 1391

చ. దనుజుఁడు మాటిమాటికిని ♦ దన్నిటు లండజనాథుఁ డేఁచఁగాఁ
గని మదిఁ దాళఁజాలక ప్ర ♦ కంపితఘోరతరోష్ఠుఁడౌచు నా
తని మడియింపఁగా మరలి ♦ దారుణకోపము తన్ను ముంపఁగా
జనకజసవ్యపార్శ్వమునఁ ♦ జక్కఁగ నిల్పి బలంబు మీఱఁగాన్. ౩౬ 1392

క. త్వరపడి యఱచేతనె ప,క్షిరాజునుం గొట్టె; వైరి ♦ శిక్షకుఁ డగుచుం
బరఁగెడు జటాయు వంతటఁ, దిరిగి తఱిం గాంచి తనదు ♦ తీవ్రాస్యముచేన్.

క. [3]అలదనుజ సవ్యదశకర,ముల వేగమ చెండివైచె; ♦ ముఖహతిచేఁ జే
తులు దెగి యిల నిటుపడఁగా, మొలిచెన్ మరలం గరౌఘ ♦ ములునూత్నములై.

తే. విషపుజ్వాలలవంక్తితో ♦ విషధరములు
పుట్టలోనుండి వెడలెడు ♦ పోల్కి నాయు

---

1 స్వయంభూ ర్భగవా నపి-అనిమూలము. 2 సృణి=అంకుశము. 3 వామబాహూన్ దశ
తదా వ్యపాహర దరిందమః-అనిమూలము.

ధాళితోఁ గ్రొత్తచేతు లొ♦య్యనఁ జెలంగె;
నంత జానకి విడిచి ద♦శాననుండు. ౪౦ 1395

క. అతిశయమగు కోపంబునఁ, బతత్త్రిఁ బిడికిళ్లఁ గ్రుమ్మి ♦ పాదంబుల ను
ద్ధతిఁ దన్నె; రాక్షసేశ్వర, పతగేశుల కొకముహూర్త♦పర్యంత మటన్. ౪౧

క. దురమయ్యె ఘోరరీతిఁగఁ;, గరముద్ధతి రామచంద్రు♦కార్యార్థం బి
క్కరణి జటాయువు పోరఁగ, సరగున ఖడ్గంబునెత్తి ♦ చండక్రుధ చేన్. ౪౨

చ. దనుజుఁడు వానిపక్షములఁ ♦ దచ్చరణంబులఁ బ్రక్కలన్ జవం
బునఁ దగఁ ద్రుంచె; నిక్కరణి ♦ భూరిభయంకరకర్ముఁడైన య
ద్దనుజవరుండు పక్షముల ♦ దారుణఖడ్గముచేతఁ ద్రుంపఁ జ
య్యన హతుఁడై జటాయు వపు ♦ డల్పతరాసువునై ధరంబడెన్. ౪౩ 1398

సీ. ధరణిపై నిటులు ర♦క్తంబునఁ దోఁగుచుఁ బడియున్న యప్పక్షి♦వరునిఁ గాంచి
తనబంధు వొకఁడు చ♦చ్చినపగిదిని జింత నొందుచు నాతని♦యొద్ది కవని
జాతయుఁ బరుగెత్తె; ♦ సాంద్రనీలాంబుదకాంతిఁ బొల్పారుచుఁ ♦ గడుసితమగు
నురముచేఁ దనరారి ♦ యురువీర్యమున నొప్పి కనుపట్టు నప్పక్షి♦కాంతుఁ డవనిఁ
ద్రెళ్లి శాంతించిన ♦ దీప్తాగ్నిభంగిని దనుజన కచ్చటఁ ♦ గనఁబడియెను;
తే. నంత రావణు నురవడి ♦ నలఁగి యిలను
బండియున్న జటాయువుఁ ♦ బ్రౌఢచంద్ర
బింబసమవక్త్రజనకజ ♦ వెతఁ గనుఁగొని
కౌఁగిటం జేర్చి విలపించెఁ ♦ గరుణ యలర. ౪౪ 1399

ఏఁబదియొకటవ సర్గము సంపూర్ణము.

---

౫౨ - వ సర్గము.

రావణుఁడు సీత నెత్తుకొనిపోవుచుండ నామె సొమ్ములు మొదలగునవి క్రిందఁబడుట.

క. దనుజేంద్రుఁ డల్పజీవితు, ఘనకాయుని ధరణినిబడి ♦ కదలెడువానిన్
గనెఁ బక్షీంద్రుని శ్రీరా,ముని యాశ్రమసన్నికృష్ట♦మున నుండంగన్. ౧

క. దనుజహతుండౌ గృధ్రే,శునిఁ దారాధీశవదన ♦ చూచుచు మిగులన్
మనసుగలంగఁగ నేడ్చెను, గనుఁగవ నీరొలుకుచుండఁ ♦ గా దుఃఖితయై. ౨

క. బలశాలియైన రక్కసుఁ, డలఘుతరంబైన భీక♦రాయుధధారన్
బలువిడిఁ ద్రుంపఁగ ధరణీ,స్థలిపైఁ బడి యుండఁ జూచి ♦ తా విలపించెన్. ౩

సీ. అక్షిసంచలనాదు♦లైన లక్షణముల
గ్రహియించుటయుఁ బత♦గస్వరములు
పింగళిమొదలుగా ♦ వెలయునాదులఁ దెలి
యుటయు నియ్యవియెల్ల ♦ నొక్కరీతి

సుఖదుఃఖముల మను♦ష్యులకు సూచకములు
గా నుండుటయుఁ గానఁ♦గాఁ బడియెడుఁ
బ్రాణేశ నీకు ని♦ప్పట్టునఁ గల్గిన
యీమహావ్యసనంబు ♦ నింక నెఱుఁగ
తే. కున్నవాఁడవె నాకొఱ ♦ కురుతరగతి
నీమృగంబులు నీపక్షు♦లెల్ల నీకుఁ
దెలుపఁ బరుగిడుచున్నవే; ♦ తివిరి నన్నుఁ
గావవచ్చిన యిప్పక్షి♦కాంతుఁ డిపుడు. ౫ 1403

క. నాదురదృష్టవశంబున, నీదైత్యునిచేతఁ బాప♦హృదయునిచేతన్
మేదినిపైఁ గూల్పంబడి;, యేదిక్కును దనకు లేక♦యే యిట రామా. ౬

ఆ. పండియున్నవాఁడు ♦ ప్రాణేశ! రాఘవా!
యోసుమిత్రతనయ! ♦ యుద్యమమున
నిపుడు వచ్చి కాచు♦టెంతయు యుక్తంబు
నను జనకతనయ ♦ వనటఁగుంది. ౭ 1405

క. వినుచున్నవారిముందటఁ, దనుఁ గావుఁడటంచు దీన♦తం బల్కుక్రియన్
వని దూరమునం దగు రా,ముని లక్ష్మణుఁ గూర్చి యేడ్చె♦మునుకొను వగచేన్.

క. సుమమాల్యంబులు భూషణ, సముదాయము నలఁగి కాచు♦జనములు లేన
ట్టి మహిళవలె విలపించెడు, ప్రమదామణి చెంతకరిగె ♦ రావణుఁడు త్వరన్.

చ. చని యమసన్నిభుం డతఁడు ♦ చారులతాకృతి భూమిఁ దొర్లుచున్
ఘనతరుసంతతుల్ దనదు ♦ కౌఁగిట నుండఁగ రాముఁబాసి య
వ్వనమున నొంటిగా నిలిచి ♦ వారక రాఘవ! రామ! యంచు నొ
య్యనఁ బతిఁ జీరుచున్నజన♦కాత్మజచెంతను జేరి యాసతిన్. ౯ 1408

[1]క. వనితా! విడువుము విడువుము, యని పలుభంగులను జెప్పి ♦ యంతముకొఱకే
జనకజ కొప్పును గరముల, దనుజేంద్రుఁడు పట్టుకొనియె ♦ ధైర్యస్ఫూర్తిన్.

సీ. దనుజుఁడు సీత న♦త్తఱి నిట్టులవమానపఱచిన నంతఁ బ్ర♦పంచమెల్ల
సత్వప్రకృతిమాని ♦ సాంద్రాంధకారంబు గ్రమ్మి తోఁచకయుండె; ♦ గాలివీవ
దయ్యె; భాస్కరుఁడును♦నాత్మప్రభంబాసి కనుపట్టె శ్రీమంతుఁ♦డనఘుఁడునగు
[2]బ్రహ్మయు రాక్షసా♦పహృతయై దీనయై జనకజ యుండుటఁ ♦ దనదు దివ్య
తే. దృష్టిచేఁ గాంచి కార్యమ♦య్యెనని పల్కె;
దండకారణ్యవాసులౌ ♦ తపసులెల్ల
దనుజునకు నాశకాలంబు ♦ దాపరించె
ననుముదంబును సీతఁ గై♦కొనుట కాంచి. ౧౩ 1410

1 ముంచముంచేతి బహుశః - అనిమూలము. 2 కృతం కార్య మితి శ్రీమాన్ వ్యాజహార పితామహః -అనిమూలము.

క. కని రంత; రామరామా, యని లక్ష్మణ యనుచుఁ జీరి ♦ యార్తి వగచు సీ
తను జేకొని యంబరమున,కును నెగసెను దనుజవిభుఁ డ♦కుంఠితశక్తిన్. ౧౫

సీ. వరభర్మవర్ణాంగి ♦ నిరుపమ మృదుచిత్ర వరపీతకౌశేయ♦వాసినియును
నయి చెన్నమీఱునా♦యవనీకుమారిక యంబుదంబునఁగాంతి ♦ నలరుమెఱుపు
వలె రావణుని యంక♦తలమున వెలయుచు నతనిచెంగట క్షణ♦మైననుండ
ననుమాటఁ దెల్పెడు ♦ నట్లుండె; నత్తన్వి ధరియించినట్టి పీ♦తవసనంబు

తే. గాలిచేఁ బైకి నెగురఁగఁ ♦ గర్బురేంద్రుఁ
డగ్ని రాఁజిఁ బ్రకాశించు ♦ నద్రిభంగి
నెంతయును వెల్గి సంతాప♦మే కననగు
ననుటఁ దెల్పెడునట్లుండె ♦ నంబరమున. ౧౬ 1412

తే. పరమకల్యాణియగు రామ♦భద్రువనిత
తనువునుండియె తావులు ♦ తనరఁ దామ్ర
వర్ణసరసిజపత్రముల్ ♦ వానియంక
భాగమునఁ జుట్టునప్పుడ ♦ పడియెనంత. ౧౭ 1413

[1] చ. కనకరుచిం దనర్చి దివి ♦ గాలినిఁ జిమ్మిన పట్టుచీర సూ
ర్యనిరుచి నెఱ్ఱఁగాఁ దనరు♦చున్న దినాంతరమేఘ మట్లు వె
ల్గెను నిది రావణాంతమును ♦ లీలగఁ జేయు నటంచుఁ దెల్పిరీ
తిని; వరనాసికంబుగల ♦ దివ్యతరానన మత్తఱిం గడున్. ౧౮ 1414

క. దనుజేంద్రుని యంకస్థల,మునఁ జిక్కి విభుండు లేమి ♦ ముదముఁ గోలుపడుం
డెను దూఁడులేని పంకజ,మును బోలుచు వైరిదుఃఖ♦మును దెల్పక్రియన్.

సీ. [2]సులలాటఫలకమై ♦ సుందరకేశాంత
మై పద్మగర్భాభ♦మై రవంత
యైనఁ గందును బొంద ♦ కచ్ఛతరంబుగాఁ
దనరి నిర్మలసిత♦దంతరాజి
విలసిల్లి మహితమై ♦ విమలమై వెలయునా
యవనిజాస్యము రావ♦ణాంకమొంది
నల్లమబ్బును జెంది ♦ యుల్లసిల్లెడు చంద్రు
భంగిఁ జూపట్టె రా♦వణుని నాశ
మును నెఱుంగఁగఁ జేయు♦చును; మఱియును మంచి
ముక్కుఁ దామ్రోష్ఠముల్ ♦ చక్కనగుచుఁ

1 ఇందు వ్యాఖ్యానాభిప్రాయము సంక్షిప్తము. ఇఁక ముందుఁజెప్పఁబోవు నుత్ప్రేక్షము లన్నియు వ్యాఖ్యానుసారమే వ్రాయఁబడినవని యెఱుంగవలయు. 2 సులలాటం సుకేశాంతం- అని మూలము.

తే. గనకవర్ణము వెలయంగఁ ♦ గంజవైరి
భంగిఁ గనుటకు నింపయి ♦ పరఁగునామె
వక్త్ర మత్తఱి నేడుపు♦వలన బాష్ప
కలితమై యుంటఁ బ్రభవాయఁ ♦ గందియుండె. ౨౩ — 1416

చ. దనుజభయంబునన్ వడఁకు ♦ తచ్ఛుభవక్త్రము రాఘవుండు చెం
తను జెలువారకుండుట ని♦తాంతము కాంతివిహీనమయ్యెఁ జం
ద్రునిశుభబింబ మభ్రమునఁ ♦ దోఁచినచోఁ బగటన్ వికాంతియై
గనఁబడునేగదా యటులు ♦ గానఁగ నయ్యెను జూచువారికిన్. ౨౪ — 1417

సీ. హాటకవర్ణాంగి♦యై తగు జానకి యతినీలదేహుఁడౌ ♦ దనుజునంక
*మున నుండుటను గజం♦బును జేరి యున్నట్టి బంగరుమొలనూలు♦భంగివెలయ
కుండెను; మఱియుఁ ద♦ప్తోజ్జ్వలహాటకవర్ణమై సుచిర♦పంకజాత
గౌరవర్ణముగల్గి ♦ కాంచనాభరణాళిఁ దాల్చిన జానకి ♦ దనుజునంక
తే. తలమునందుండి నీలాంబు♦దంబునందుఁ
దనరు విద్యుల్లతాకృతిఁ ♦ గనఁబడియెను;
భూజపల్లవపీతాంగ♦మునఁ దగు సతి
నీలవర్ణాంగు రాక్షసు♦పాలుఁ జేరి. ౨౫ — 1418

క. కరినడుమునకుం గట్టిన, సుచిరకనకంపుఁగక్ష్య♦చొప్పున వానిన్
గరము వెలయంగఁ జేసెను;, సురవైరియు జనకరాజ♦సుతనంకమునన్. ౨౬

క. ధరియించియుఁ దద్భూషణ, వరఘోషము లొప్పుచుండ ♦ భాసిల్లియు నం
బరమున విద్యుద్గర్జిత, పరియుతనీలాంబుదంబు♦వలె రాజిల్లెన్. ౨౭ — 1420

క. దనుజుఁడు సీతం దొంగిలి,కొనిపోవుచు నుండుతఱిని ♦ గోమలిమూర్ధం
బుననుండి జాఱి పూవులు, వని వర్షముభాతి నచటఁ ♦ బడియెన్ బెలుచన్.

సీ. ఆపుష్పవృష్టియు ♦ నతఁడు పోయెడు నురవడికి నంతటఁ జిమ్మఁ♦బడియు నాతఁ
డతివేగమునఁ జెంత ♦ కరిగిన నాతనిచుట్టును బొడకట్టె ♦ శుభదమగుచు
నత్యున్నతంబగు♦నట్టి మేరువుచుట్టు విమలతారామాల ♦ వెలసి యావ
రించు భంగిని సురా♦రిని బుష్పపంక్తియు నావరించెను జన♦కాత్మజాత
తే. వామచరణంబునుండి యు♦ద్దామరత్న
ఖచితమై విద్యుదాభమై ♦ క్రాలునందె
యూడి మధురస్వరంబుతో ♦ నుర్విఁబడియె;
వైశ్రవణసోదరుండు రా♦వణుఁడు నంత. ౩౨ — 1422

క. సురమార్గంబున రాముని, తరుణి మహోల్కవలె వెలయు♦దానిం గొనుచున్

* మహేశ్వరతీర్థులపాఠము "నీలం గజ మివాశ్రితా" అని దీనిననుసరించియే యిట వ్రాయఁ
బడినదని తెలియఁదగు.

బరుగిడెఁ దేజస్స్ఫూర్తిం, గరము ప్రకాశించుచున్ వ♦గం జనె నతియున్.

చ. అనలునిబోలికాంతిఁ దగు♦నట్టి తదాభరణంబు లప్డు చ
క్కనిధ్వనితోడ భూమిపయిఁ ♦ గ్రస్సన వ్రాలె దివంబునుండి యు
ర్విసిఁబడు తారకాకృతిని; ♦ వింతగ నామెకుచద్వయాంతరం
బునఁదగు మౌక్తికస్రజము ♦ ముగ్ధశశాంకునిరీతిఁ బొల్చుచున్. ౩౪ 1424

ఆ. అట్టి జాఱిపడియె ♦ నాకాశమునుండి, యుర్విఁబడెడు గంగ ♦ యొప్పుఁదోఁప;
నంతఁ బాదపంబు ♦ లాతనియురవడిఁ, గలుగు గాలిచేతఁ ♦ గదలుపఁబడి. ౩౫

[1]క. శిరములఁ గదలించుచుఁ బక్షిరవంబులతోడఁగూడి ♦ సీతను దనుజే
శ్వరుఁ గని భీతిలవలదని, పరిపరిఁ బల్కినటుగానఁ♦బడియె వనమునన్. ౩౬

చ. సరసులు ధ్వస్తపంకరుహ♦సంచయవక్త్రములై భయంబుచేఁ
ద్వరపడుచున్న నక్రఝష♦వాగము నేత్రములై చెలంగ నా
తురమునఁ [2]బ్రాణహీనయనఁ ♦ దోఁచెడు సీతను నెచ్చెలిన్ బలెన్
బరిపరి చూచి దుఃఖపడు♦భంగిఁ గనంబడుచుండె నయ్యెడన్. ౩౭ 1427

తే. వ్యాఘ్రపంచాస్య మృగపరి♦వారములును
బక్షులన్నియు నొకపరి ♦ వచ్చి రోష
మడర ఛాయానుగాములై ♦ యతివవెంటఁ
బరుగువాఱిన వత్తెఱఁ ♦ బలువగలను. ౩౮ 1428

సీ. అద్రులప్పుడు మోము♦లందుఁ గన్నీళ్లు నాజలపూరములు పొంగ♦వెలసి పయికి
నెత్తంబడిన చేతు ♦ లెట్లట్లు శిఖరముల్ కనఁబడ శ్రీరాము♦కాంత నపహ
రించుకొనుచు స్వపు♦రికిఁ బోవుటం గాంచి యేడ్చెడునట్లుగా ♦ నెల్ల యెడలఁ
గానంబడియె; సీతఁ ♦ గైకొనిపోవుటఁ గనుచు శ్రీమంతుఁడౌ ♦ కమలమిత్రుఁ

తే. డెంతయును దీనుఁడై కాంతు♦లెల్లఁ దూలఁ
బాండుమండలుఁడై కాన♦బడియె; సర్వ
భూతములు పిండుగాఁ గూడి ♦ సీత రాము
పత్ని దొంగిలికొనిపోవు ♦ పాపిని గని. ౪౦ 1429

చ. దనుజుఁడు పోయెడుం బురికి ♦ ధాత్రి నిఁకం గన ధర్మసత్యముల్
కనఁబడ వింక నార్జవము ♦ గన్పడ దట్లె కృపావిశేషముల్
గనఁబడ వంచు నేడ్చె; భయ♦కంపితవక్త్రము లొప్పుచుండఁ జ
క్కనిమృగపోతముల్ వగలఁ ♦ గన్నుల నీరు స్రవింప దీనతన్. ౪౧ 1430

క. కలఁగిన చూపులతోఁ దొ,య్యలిఁ గని రోదనముసేసె; ♦ నతిదుఃఖమునన్
గలఁగి ఘనధ్వనినేడ్చుచుఁ, బలువిధముల నోసుమిత్ర♦పట్టీ రమ్మా. ౪౩ 1431

---

1 మాభై రితి విధూతాగ్రా వ్యాజహ్రు రివ పాదపాః-అనిమూలము. 2 గతోచ్ఛ్వాసాః-అనిమూలము. త్యక్తప్రాణాః-అనివ్యాఖ్య.

తే. రాఘవా! వేగరమ్ము ఘో♦రసురవైరి
బలిమిఁ గొనిపోయెడు ననుచు ♦ వాపు వత్ర
రో యనుచు మాటిమాటికి ♦ మూర్ఛఁ గాంచు
చున్నసీతను గని వని♦నున్న సురలు. ౪౪ 1432

క. మేనులు గడగడవడఁకఁగ, జానకిఁ గని యేడ్చి; రంత ♦ సాంద్రాలకసం
తానము చెదరఁగ మోమున, జానగుతిలకంబు మాయ ♦ సాధ్వి వసంకర్.

క. తననాశనమునకే సీతను దెలియక రావణుండు ♦ తా హరియించెఁ
దనబంధువులకు నెడమై, దనవిభుని మఱందిఁ బాసి ♦ ధరణీసుతయున్. ౪౬

తే. చారుదంతవిరాజిత ♦ సరస సుస్మి
తాస్యపంకజశ్రీరాము ♦ నతివ యపుడు
భయవిశేషంబునన్ మేను ♦ వడఁక వక్త్ర
మట్టి వెలవెలనై యుండ ♦ నార్తిఁ గుందె ౪౭॥ 1435

ఏఁబదిరెండవ సర్గము సంపూర్ణము

---

౫౩ - వ సర్గము.

సీత రావణుని నిందించుట.

చ. జనకజ రావణుండు తనుఁ ♦ జయ్యనఁ గైకొని యంబరంబునం
జనుటను గాంచి భీతిఁగని ♦ స్వాంతము దూలఁగనేడ్చె; నంత న
వ్వనితయు శ్రోత్రసంఘములు ♦ బాపురె యంచుఁ దపించునట్లుగా
వనరుచు రోషతామ్రమయి ♦ వక్త్రము గన్పడ భీకరాక్షునిన్. ౧॥ 1436

క. దనుజునిఁ గని యిట్లనియెన్;, విను రావణ! నీచశీల! ♦ విభుఁడు మఱిది యిం
టను లేని తరుణముం గని, వనిత ననుం బలిమిఁ గొనుచుఁ ♦ ద్వరపడి పురికిన్.

క. పరుగెత్తుచున్నవాఁడవు, పురుషుఁడవే లజ్జనీకుఁ ♦ బొడమగ లేదా!
సురవైరీ! దుష్టాత్మా!, హరింపఁగాఁ గోరి నన్ను ♦ నతిభయ మసరన్. ౩॥ 1438

క. మాయామృగరూపంబున, మాయాశ్రమమునకు వచ్చి ♦ మఱియును మోసం
బే యగపఱచుచు నను న,న్యాయంబునఁ దోలఁగఁదీసి♦నాఁడవు నీచా. ౪

సీ. నన్నుఁగావఁగ వచ్చి♦న మహాత్ము గృధ్రేశు
నాతని వృద్ధుని ♦ నని వధించి
నాఁడవుగద శూర♦నాథుఁడవే నీవు
*మెచ్చఁగా వచ్చు నీ♦సచ్చరితము
నతఁడు నామామకు ♦ ననుఁగుమిత్రుఁడు సుమా;
దనుజాధమా! నాము♦మును వచించి

---

* పరమం ఖలు తే వీర్యమ్-అనిమూలము.

నను యుద్ధమున గెల్చి♦నాఁడవుగద నీదు
  శౌర్యంబు పరమమై ♦ జగతివెలయుఁ
ఆ. గాదె, పొగడఁదగిన ♦ ఖ్యాతియే యగునిది
నీచ! యొంటినున్న ♦ నెలఁత నొరుని
భార్యఁ దొంగిలితివి ♦ బాపురే! యిట్టి నీ
చంపుఁగార్యమునకు ♦ స్వాంతమందు. ౫ 1440

క. దనుజా! సిగ్గుంబొందక, ఘనకార్యం బనుచు నెన్నఁ♦గా నేలొకో? లే
దని శంక నొందవింతయు, నిను నీవే శూరుఁడనని ♦ నెమ్మిఁ దలఁచుచున్. ౬

క. అతినింద్యము ధర్మేతర, మతిఘోరము హేయము నగు ♦ నట్టిపని నొన
ర్చితివే యని లోకమునన్, సతతము చెప్పుకొనఁగలరు ♦ జనులెల్లరొగిన్. ౭

క. నను నపహరించుతఱి నే, విన నీవే పొగడుకొనిన ♦ విక్రమబలముల్
దనుజా! యిస్సీ! నాశం,బును గాంచుంగాక వేగ♦ముగ నియ్యదనన్. ౮

క. కులమున కయశం బెంతయు, గలుగంగాఁ జేయుచరిత ♦ కడువడిగా ని
మ్ములఁ జెడుఁగాక; దురాత్మా, బలమునఁ బరుగిడుదు వేని ♦ త్వర నీరీతిన్. ౯

క. ఎవ రేమిచేయ శక్యం,బవు; నీవొకగడియకాల♦మైన నిలువుమా
యవలం బ్రాణంబులఁ బో,దువె, చచ్చియ నీవు తీరు♦దువు కఠినాత్మా. ౧౦

క. ఆ రాజసుతుల కన్నుల, బారింబడి దనుజసైన్య♦వారముతోఁ దం
జేరినను నొకముహూర్తము, నేరవు జీవింప నీవు ♦ నిశ్చయ మిది సూ. ౧౧

చ. వనమునఁ బ్రజ్వలించు గురు♦పావకు స్పర్శముఁ బత్త్రిసైఁపఁజా
లనిగతి రామలక్ష్మణ[1]క♦లంబవితానపుస్పర్శమున్ సహిం
పను క్షణమైనఁ జాల వెటు♦వంటి ప్రయత్నముచేతనైన; నో
దనుజ! భవద్ధితంబు మదిఁ ♦ దాల్మిఁ దలంచుచు జీవితార్థివై. ౧౨ 1447

క. నను విడిచిపెట్టు మయ్యది,యె నీకు హితమౌను జుమ్మి; ♦ యిట నామాటల్
విని నన్ను విడిచిపెట్టక, చనియెదవే నిట్టివార్త ♦ శ్రవణములఁ బడన్. ౧౩

క. నను నవమానించితి వని, మనమున రోషంబు పొంగ ♦ క్ష్మాపాలుఁడు నా
పెనిమిటి తమ్మునితోడన్, నినుఁజంపఁగఁబూనుఁ జుమ్ము ♦ నెక్కొనుపూన్కిన్.

క. ఏమైనను గానీ యని, యీమొండితనంబె విడువ ♦ కీవుండినచో
నేమి మదిం గోరుచు నను, నీమాడ్కిం దెచ్చినావొ ♦ హితమని యదియున్.

తే. వ్యర్థమే గాని నీచాత్మ! ♦ సార్థకంబు, గాద దెబ్బంగినైన, శ♦క్రప్రతిముని
నాదుభర్తను రాముఁ గా♦నకయె వైరి, పాలనిత్తఱి, నించుక ♦ బ్రదికియున్న.

క. చిరకాలము జీవింపం, దరమగునే బ్రదుకను జుమి; ♦ దనుజాధముఁ డా
నరుఁడు మరణంబుతఱిని వి,పరీతకృత్యములు చేయు♦భంగిని నీవున్. ౧౬

---

1 కలంబము=బాణము.

క. హిత మెదియో మే లెదియో, మతి నెఱుఁగవు దాన నీయ♦మంగళకృత్య
ప్రతతి నొనరించువాఁడవు, మృతిఁ గను వారలకు నెల్ల ♦ హితకృత్యంబుల్.

క. మనమున రుచింపకుండును, గనుకనె యి త్తెఱఁగని నిన్నుఁ ♦ [1]గాలునిపాశం
బునకుం జిక్కినకంఠం,బున నుండం జూచుదానఁ ♦ బూర్వాదిత్యా. ౧౯౹

సీ. దశకంఠ! యిదిభయ♦స్థానంబు నీవును భయపడకున్నావు ♦ బలిమి మెఱయఁ
గావున నీకికఁ ♦ జావు సమీపంబుననె యుండుటను వేగ♦మునన మృత్యు
సూచకమ్ములయిన ♦ క్షోణీరుహంబుల [2]స్వర్ణమయంబులఁ ♦ జక్కఁ జూడఁ
గలవని యూహింతుఁ; ♦ గడుఘోరమై రుధిరాభిపూర్ణంబగు♦నట్టి వైత

ఆ. రణిని నది భయంక♦రంబగు నసిపత్త్ర
వనముఁ జూడఁగలవు; ♦ వరుసఁ గాంచఁ
బడుచుఁ గ్రాఁగుచున్న ♦ స్వర్ణపుష్పంబుల
నతిభయంకరముగ ♦ మతికిఁ దోఁచి. ౨౦ 1455

తే. మఱియు వైడూర్యమణిపత్త్ర♦మండలములు
గలిగి యాయసకంటకా♦వలుల నిండి
తీక్ష్ణమయి యొప్పి నరకమే ♦ దినిఁ జెలంగు
శాల్మలినిఁ జూడఁగలవు రా♦క్షస! దురాత్మ. ౨౦౹ 1456

చ. ఫలమిది యెప్పుడో కలుగ♦వచ్చుఁ గదా యటులైనఁగాని యి
మ్ముల సుఖమబ్బెఁ గాదె యని ♦ మూర్ఖ! తలంతువొ యేమొ నిర్ఘృణా
యలమహితాత్ముఁడై రఘుకు♦లాధిపుఁడై తగు రామమూర్తి కి
ట్టు లపకృతిం బొనర్చితి క♦డుం గడుఁ దుచ్ఛపుబుద్ధివౌటచేఁ. ౨౧ 1457

క. కనుక నిఁకం జిరకాలము, మనఁజాలవు; నిన్నుఁ బలిమి♦మైఁ గొని శీఘ్రం
బునఁ బరదేశముఁ జేరెద, నని నను నతఁ డేమిసేయు ♦ నని తలఁతువొకో. ౨౧౹

సీ. విను రావణా! జగ♦ద్వీరుఁడై మహనీయుఁడగు నావిభుండుండ ♦ నవలఁ దీయఁ
గారాక భయదమా♦కాలపాశము గళంబునకుఁ జక్కఁగఁ గట్టు♦కొనినయట్టు
లయ్యెఁ గదా యెందు ♦ నరిగి సుఖింతువు? తమ్ముఁడు లేకయే ♦ తా నెవండు
నిమిషమాత్రంబున ♦ నిర్జరుల్ పొగడంగఁ బదునాల్గు వేవురఁ ♦ బ్రౌఢదనుజు

ఆ. లను మహావనంబు♦ననుఁ జెండివైచెనో, యట్టివీరవర్యుఁ ♦ డఖిలశస్త్ర
వేత్త బలియుఁ డట్టి♦వీరరామునిపత్ని, నపహరించినట్టి ♦ కపటి నిన్ను. ౨౨

క. వరతీక్ష్ణబాణములచేఁ, బొరిపుచ్చక విడుచునా? వి♦భుండని దనుజే
శ్వరు నంకగ యా సీతయుఁ, గరము భయంబూని దుఃఖ♦కలితహృదయయై.

[1] పశ్యామ్యద్య హి కంఠే త్వాం కాలపాశావపాశితమ్ - అనిమూలము. [2] వ్యక్తం హిరణ్మయాన్ హి త్వాం సంపశ్యసి మహీరుహాన్ - అనిమూలము. హిరణ్మయవృక్షదర్శనం మృత్యుచిహ్నమ్-అనివ్యాఖ్య.

క. కరుణముగాఁ బలవించుచుఁ, బరుషోక్తుల పీని మఱియుఁ ♦ బల్కెను, దదనం
తరమున బహుళార్తిం గని, పరిపరిరీతులను దీన♦వదనము తోఁపన్. ౨౫

క. తనదురవస్థం దెల్పెడు, ననూనవాక్యములఁ బల్కి ♦ యంగము వడఁకన్
దనుఁజూచు సీత దీనను, ఘనపాపనిశాచరుండు ♦ గైకొని చనియెన్. ౨౬

ఏఁబదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౫౪ - వ సర్గము.

—సీత తనసొమ్ములను గొంగులో ముడిచి వానరులదగ్గఱ విసరివైచుట.—

క. దనుజుఁడు తన్నుఁ బ్రుచ్చిలి, కొనిపోవుచునుండఁ జనకు♦కూఁతురు వనిలోఁ
దనుఁ గాచువారిఁ గానక, ఘనగిరిశృంగమున నొకటఁ ♦ గనియెం గపులన్. ౧

[1] తే. వారలైదుగు రసదృశ♦బాహుబలులు
కూడియుండఁగఁ గాంచి యా♦కువలయాక్షి
యావరారోహ వీరలు ♦ నావిధంబుఁ
బతికి నొకవేళఁ దెలుపంగ ♦ వచ్చు ననుచు. ౨ 1464

చ. మనమున నెంచి స్వర్ణరుచి♦మానితమౌ తనయుత్తరీయమం
దనుపమ రత్నభూషణము ♦ లల్లన మూటఁగఁ గట్టి వేగ వై
చెను హరిమధ్యభాగమునఁ ♦ జిత్రముగాఁ బడునట్లు; రావణుం
డనుపమభూషణంబులను ♦ నంశుక మొయ్యనఁ జించి సీతయున్. 3 1465

ఆ. [2]మూఁటఁగట్టి మార్గ♦మున వైచినది సీతఁ
గొనుచుఁ బోవు మోద♦మున నెఱుంగఁ
డయ్యెఁ; బింగళాక్షు♦లై తగువారలు
కారు కపులుమాత్ర ♦ మారయుంగ. ౪ 1466

సీ. వానరశ్రేష్ఠులై ♦ వఱలుదు రవ్వీరు రామరామాయను ♦ రవము నిగుడ
విలపించుచున్నట్టి ♦ విపులాక్షి సీతను నిర్నిమేషాక్షుల ♦ నిలిచి చూచు
చుండి; రంతట నేడ్చు♦చున్న సీతంగొని పంపాసరస్సును ♦ వరుసఁ గడచి
రామభద్రుని మహా♦శ్రమమువైపును జూచుచున్నదృష్టి మరల్చి ♦ క్రన్ననఁదన

తే. పురము వైపును జూచుచుఁ ♦ బోయెఁ; దనకు
మరణహేతువుగా నున్న♦తరుణిఁ దీక్ష్ణ
దంష్ట్రయై విషముం గ్రక్కు♦దారుణభుజ
గినివలెం జంకలోఁ గొని ♦ చనియెఁ బ్రీతి. ౬ 1467

క. దనుజుఁడు చాపచ్యుతమౌ, ఘనబాణం బట్లు వేగ ♦ గగనపథమునన్

---

1 ముహూచ యది రామాయ శంసేయు రితి మైథిలీ - అనిమూలము. 2 సంభ్రమాత్తు దశగ్రీవ స్తత్కార్యం నావబుద్ధవాన్ - అనిమూలము.

వనశైలసరిత్సరసులఁ, గనుచును దగ వానిగడచి ♦ కడఁకం జనియెన్. ౮౫

క. వరతిమిరక్రాలయమై, వరుణాలయమెల్ల ద్వీప♦వతులకు సతమున్
శరణము నక్షయమును నౌ, సరిత్పతిని జేరి దాఁటె ♦ సత్వరమంతన్. ౯౫

క. జనకసుతం గొనిపోయెడు, దనుజునిఁగని సంభ్రమమునఁ ♦ బరఁగ లడఁగఁగాఁ
బెనుఫణులు మత్స్యములు లో,నన యుండఁగ సాధ్వసంబు♦నం గంధి తగెన్.

క. చారణులు ఖచరు లత్తఱి, నారావణుఁ గాంచి యీడ♦శాస్యుఁడు తెగునం
చారసి పలికిరి సిద్ధులు, నాయూర్ధిగ నట్లె పలికి ♦ రాతని మృతినిన్. ౧౦౫ 1471

క. దనుజుఁడు రూపముఁ దాల్చిన, తనమృత్యువుగాఁ జెలంగు ♦ తరుణిని గంపం
బును గాంచుదాని నంకం,బునఁ దాలిచి లంకఁజొచ్చెఁ ♦ బొంగెడు కాంక్షన్.

తే. రాజమార్గంబు లెన్నఁగ ♦ రమ్యగతిని
జక్కఁగా నేర్పడంగఁ బెం♦పెక్కుపురిని
జేరి సేవకనిబిడవి♦స్తృతసుకక్ష్య
లను దగం బొల్చు నంతిపు♦రిని ముదమున. ౧౨౫ 1473

సీ. అంతఁ బ్రవేశించె ♦ నప్పుడా దనుజుఁడు మహితశక్తిస్ఫూర్తి ♦ రహిఁ జెలంగు
చున్న స్వయంప్రభ ♦ నొకట బిలంబున మయుఁడుంచినట్టు ల♦మ్మానవతిని
శోకమోహంబుల ♦ స్రుక్కినదానిని [1]నసితలోచన సీత ♦ నసురమాయ
వలె నుండి నిజముగా ♦ నచ్చినయట్టులే కనఁబడి తానగ్నిఁ ♦ గడఁకఁజొచ్చి

తే. యున్నదాని నెఱుంగక ♦ యుంచె నచట;
నంతటఁ బిశాచములరీతి ♦ నతిభయంక
రముగఁ గన్పడుచున్నట్టి ♦ రాక్షసాంగ
నలను గని యీమెఁ బురుషుఁడే ♦ నారియేని. 1474

క. నాయనుమతినిం బొందక, యేయెడలం జూడఁగూడ ♦ దిఁకననుచు వినుం
డీయంగన మౌక్తికసము,దాయంబును రత్నములను ♦ హాటకరాశిన్. ౧౪

తే. అంబరాభరణంబుల ♦ నరసి దేని
నెంతగోరునో నాకు మీ♦రిచ్చునట్లె
యీబిడకు నీయవలయు; నిం ♦ దెవతిగాని
తెలియకయో లేక తెలిసియో ♦ లలన కిచట. ౧౬ 1476

చ వినుఁ డినుమంత యప్రియము ♦ వేడ్క నొనర్చునో దానిప్రాణముల్
చనునని యెన్నఁగాఁదగును ♦ సారసలోచనలార యంచు న

---

1 ఇందలియర్థము తిలకవ్యాఖ్యానుసారమని తెలియునది. మాయారూపైవైషా సీతాయా లంకా మాగతేతి ధ్వనితమ్. ముఖ్యమాతాత్వగ్నిం ప్రవిష్టేతి పూర్వమేవ ధ్వనితమ్, అతఏవ రావణస్య హావనీయోపాజాతా మయాత్వాదేవ రావణస్య తదజ్ఞానమ్-అని తిలకవ్యాఖ్య.

ద్దనుజుఁడు శౌర్యవంతుఁడు ని♦తాంతముదంబున నంత సౌధ మె
య్యన విడనాడి యేమియుఁక ♦ నానాకా కృత్యమటంచు నెంచుచున్. ౧౭

క. దనుజుల మాంసాహారుల, ఘనవీర్యుల నష్టసంఖ్యఁ ♦ గ్రాలెడువారిం
గని యంత మహావీర్యం,బునను వరదానగర్వ♦మున మోహితుఁడై. ౧౮

క. వారల భూరిబలంబును, బౌరుషమును బొగడి పొగడి ♦ పలికెం బ్రీతిన్
మీరలు నానాయుధముల, నారూఢిగఁ బ్రబలి తరలి ♦ యతివేగమునన్. ౧౯

సీ. చనుఁడు పూర్వము జన♦స్థానంబు ఖరునకు నావాసమై యుండె ♦ నద్ది యిపుడు
సన్నివేశంబుల ♦ సంతతి చెడిపోవ శూన్యమై యున్నది; ♦ సొరిది మీర
లచటికిఁ బోయి యం ♦ దసురులు లేమి శూన్యంబుగా నుండుట ♦ నరసి భీతిఁ
గనక దానిం దూర♦మునకుఁ దోలుచు బలపౌరుషంబులఁ గ్రాలు♦వారలౌటఁ

తే. గాపురంబుండుఁ డందు; న♦క్కడను బౌరు
షబలముల నేల మేమొగిఁ ♦ జక్క నాశ్ర
యింపవలెనని పల్కుడు♦రేని నేను
ఖరుని దూషణు ముఖ్యులఁ ♦ గా నొనర్చి ౨౦ 1480

క. పెనుసైన్యమందు నునిచితి, నని ఖరదూషణులతోడ ♦ నయ్యది శ్రీరా
ముని సాయకముల మ్రందెను;, గనుకఁ దదర్థంబె యూర్వఁ♦గారామి మదిన్.

తే. ధైర్యమును మించి నాకుఁ గ్రో♦ధంబు వెలయు
చున్నయది; దాన నేను బో♦కుంట భీతి
వలనఁ గా దవకాశంబు ♦ గలుగ కున్న
దట్టి రామునిపయి వైర ♦ మతిశయిల్ల. ౨౩ 1482

క. దారుణవైరము నిరత ము,దారంబుగ రగిలెడున్ ని♦తాంతము దానిన్
వైరిపయిం దీర్చుకొనం, గోరుచు నున్నాఁడ; వైరిఁ ♦ గూల్పక యున్నన్.

తే. నిద్రపట్టదుగద కంటి♦నిండ నాకు
ఖరముఖుల సంహరించిన ♦ పరుని నేను
జంపుదునయేని పొందుదు ♦ శర్మమెంతొ
బీదకున్ నిధి దొరకిన♦విధము తోఁప. ౨౫ 1484

తే. మీర లందుండి నాదు న♦మిత్రువలని
పోకడలనెల్ల నిశ్చయం♦బుగ నెఱింగి
వానిఁ బంపుచు నుండంగ♦వలయు నాకు;
నప్రమత్తులరై యట ♦ కరుగవలయు. ౨౬ 1485

క. రాముని జంపఁగ యత్నం, బేమాడ్కిన్ సాగుదాని ♦ నే నిరతంబున్
మీనుదులఁ దలఁపఁగాఁ జను, నేమెట్లు ఖరాదివసతి ♦ కేగుదుమనినన్. ౨౭

క. పలుసారు లనిమొనన్ మీ, బలముల నేఁ జూచి యున్న♦వాఁడఁ గనుకనే
నలరు జనస్థానంబున, నిలువగ మిముఁ బంచినాఁడ ♦ నేర్పులు లనుచున్. ౨౮

చ. దనుజు లవశ్యకార్యములఁ ♦ దద్దయుఁ బల్కి ప్రియోక్తులన్ దమున్
వినుతి యొనర్ప రావణుని ♦ విక్రమధుర్యునిఁ గాంచి మ్రొక్కి యా
తనిదగు నాజ్ఞనొంది పుర♦తల్లజమై తగు లంకనుండి యె
వ్వనికిని గానరానిగతి ♦ వర్ధిల నచ్చటికేగి రంతటన్. ౨౯ 1488

తే. రావణుండును శ్రీరాము ♦ రమణిఁ జూచి
సంప్రహృష్టాంతరంగుఁడై ♦ సాధ్విఁ దెచ్చి
దాన రామునితో వైర ♦ మూనినందు
లకును దా వగఁ బూన వ♦లసియు నతఁడు. ౩౦ 1489

క. జ్ఞానము లేనికతంబునఁ, దానెంతయు మోదమందెఁ; ♦ *వద్వైరము లో
లోనన్ మిథ్యయె యని యా, దానవుఁ డెఱుఁగుటనుజాల♦ధైర్యమునఁ దగెన్.

ఏఁబదినాలుగవ సర్గము సంపూర్ణము.

---

౫౫ - వ సర్గము.

రావణుఁడు సీతకుఁ దనవైభవముఁ జూపుట.

క. ఘనబలుల ఘోరదనుజుల, నెనమండ్రను బంపి రాక్ష♦సేశుఁడు విపరీ
తనిజస్వాంతుండౌటను, దననుం గృతకృత్యుఁ గాఁగఁ ♦ దలఁచెం బిదపన్. ౧

క. స్మరబాణపీడితుండై, త్వరపడి యంతిపురిఁ జొచ్చె ♦ వైదేహిని జూ
చురతిని; రాక్షసవనితా, పరివృతయై వగలఁ బొగులు ♦ పడఁతిని గనియెన్. 3

సీ. అశ్రుపూర్ణాస్యయై ♦ యతిదీనయై శోకభారాభిపీడిత♦స్వాంతయగుచు
వాయువేగము తనుఁ ♦ బైకొనఁ గడలిని మునుఁగునౌకనుబోలి; ♦వనటఁగుంది
మృగయూథములఁ బాసి♦మించు శ్వానంబులయంతరంబునఁ జిక్కి ♦నట్టి లేడి
చందంబునన్ స్వశీ♦ర్షము వంచి యున్నట్టి జనకజఁ జేరి యా♦సాధ్వి వనటఁ

తే. గుందుచున్ దీనయై తన♦కున్ సుఖేమి
వలదనుచు నెంతచెప్పిన ♦ బలిమిఁ గొనుచుఁ
బోయి దేవగృహోపమం♦బై యలరెడు
తనదుసౌధంబుఁ జూపె మో♦దమున నతఁడు. ౬ 1493

సీ. కుఱుచలై పొడవులై ♦ నెఱిఁ బొల్చెడు విమాన
ములు కొన్ని యందుఁ జె♦న్నలరుచుండె
స్త్రీసహస్రంబులు ♦ చెలఁగుచుండెను బహు
విధములౌ పక్షులు ♦ వెలయుచుండె

---

* వస్తుతస్తు రావణస్య శ్రీరామేణసహ వైరం లోకదృష్ట్యా అనర్థవత్ప్రతీయమానమపి సీతాహరణద్వారా శ్రీరామహస్తాత్స్వవధస్యేష్టతమత్వా ద్ధార్మేణవైరం ప్రాప్య ముముద ఇతిభావః- అని మహేశ్వరతీర్థులు. దీనిసారమే పద్యోత్తరార్థమునఁ గనఁబడునని తెలియువది.

నానాప్రకారర♦త్నంబులు నొప్పుచుం
డెను దంతములతోడఁ ♦ గనకమునకు
స్ఫటికంబులను వజ్ర♦వైడూర్యములతోడ
రజతంబునను జక్క ♦ రచితములయి
తే. వింతఁగాఁ జూడఁదగి దృష్టి ♦ విమలములయి
యలరు స్తంభంబులందు సొం♦పులఁ గులుకుచు
వెలయుచుండెను, దానవ♦వీరుఁ డట్టి
హర్మ్యమును జూపి సీతతో ♦ నరిగి యొకట. ౮ 1494

క. ఘనదుందుభినిస్వనముల, మనోహరంబై చెలంగి ♦ మంచిసువర్ణం
బున మించు ద్వారమునఁ దగు, కనకపుసోపానమెక్కఁ♦గడువేడ్క మెయిన్.

సీ. అందు దంతపుగవా♦క్షావళి, వెండిగవాక్షంబులును బెక్కు ♦ వఱలుచుండె
నందుమీఁదంబోవ ♦ హాటకజాలావృతములగు ప్రాసాద♦తతులు నలరె
నాగవాక్షములచే ♦ నందు సుధాలిప్తములును రత్నఖచితం♦బులు నయి తగి
చిత్రంబులైన యా♦క్షితితలంబులనెల్లఁ దనయింట జనకజా♦తకును జూపె
తే. భూరితరశోకమునఁ జాలఁ ♦ బొగులు వనిత
కంత నడబావులను భూరు♦హములతోడ
నలరు సరసులఁ జూపె న♦య్యసురరాజు;
పాపమతిగాన దివ్యభ♦వనముఁ జూపి. ౧౨ 1496

క. తనయందుఁ బ్రీతిఁబుట్టం,గను జేయందలఁచి పలికెఁ ♦ గాంతామణిరో
విను పదికోటులు క్రూరులు, దనుజులు భయదాకృతులను♦దనరుదు రెపుడున్.

చ. ఇరువదిరెండుకోట్ల దను♦జేంద్రులు పొల్తురు భీమకర్ములై
పరఁగెడు వారికేన పరి♦పాలకుఁడన్; మఱి బాలవృద్ధులా
సురరిపులన్ దగన్ విడిచి ♦ శూరసహస్రసురారు లొక్కనా
కె రమణసేవకుల్ గల ర♦హీనబలుండను జుమ్ము కామినీ. ౧౩ 1498

క. ఏదేది రాజతంత్రము, నాదై తనరారుదాని ♦ నారీమణిరో
నీదై యుండ నొనర్చెద, నాదగు ప్రాణావళియు న♦నవరత మెన్నన్. ౧౪

తే. నీయధీనమె శతపత్ర♦నేత్ర వినుత
గంగ నీవనఁగా నధి♦కంబె నాదు
ప్రాణములకంటె నగుదు వి♦ప్పలుకు నిజము;
చెప్పువాఁడ మఱొక్కటి ♦ చిత్తగింపు. ౧౫ 1500

*సీ. సంతసంబును గూర్చు ♦ చానరో భార్యవై తనరారు నీవె యం♦తఃపురమునఁ

---

* బహూనాం స్త్రీసహస్రాణాం మమయోఽసౌ పరిగ్రహః, తాసాం త్వ మీశ్వరాసీతే మమ భార్యా భవప్రియే. సాధు కిం తేఽన్యయా బుధ్యా రోచయస్వ వచో మమ, భజస్వ మాభి తప్తస్య ప్రసాదం కర్తు మర్హసి - అనిమూలము. దీనికి మహేశ్వరతీర్థులు జ్ఞానపరమగు నర్థమును

గల పెక్కుమంది కాం♦తలలోన నాభార్య లెవ్వరెవ్వరో వా రి♦కెల్ల నిక్క
మీశ్వరివగుము; నే♦నిపుడు చెప్పినపల్కు గై కొనుమిది రెం యు♦క్తంబు; రాముఁ
డని వేఱుబుద్ధి నీ♦కలరిన ఫలమేమి? సఫలాంతరంగుఁగా ♦ నాథ్వి నన్నుఁ

తే. జేయుమా తీవ్రవాంఛల♦చేఁ దపించు
చున్న నామీఁదనే కృప ♦ యునుపఁదగును
నాపురోత్తమ మీలంక ♦ నారి! వినుము
విఱివి శతయోజనములచే ♦ వెలయుచుండు. ౧౮ 1501

క. జలనిధిపరివేష్టితమై, యలరెడు దీనిఁ సురేంద్రుఁ ♦ డమరాసురులం
గలిసి చనుదెంచినను దొ,య్యలి మార్కొన నలవిగాక ♦ హార్వొందుఁజుమీ.

క. సురయక్షపక్షిగణమును, దరయఁగ వీర్యమున లోక♦మును దెచ్చట నా
సరియగువాఁడు కనంబడఁ,డుగుదోర్బలశాలినగుచు ♦ నొప్పుదుఁ దరుణీ. ౨౦

*సీ. అతివ రాజ్యభ్రష్టుఁ ♦ డగుచు నదీనుఁడై
యురుతాపసుఁడు గతా♦యువును నగుచు
మనుజలక్షణమొంది ♦ మఱి యల్ప తేజసుం
డును నయి తనరు రా♦ముని మదినిడు
కొని యేల దుఃఖంప ♦ వనితామతల్లిరో
బాల్యయౌవనములు ♦ వార్ధకమును
క్షణభంగురము లౌట ♦ సత్యమట్లౌటచే
సతతంబు త్వత్సేవ♦గతి యటంచుఁ
జేయఁగాఁ దగి భర్త♦యే యనుశబ్దంబు
సార్థకమన నొప్పు♦నట్టి నన్ను
గ్రహియింపుమా ప్రీతిఁ ♦ గావుమా యిట "మయా
సహ" యన్న శబ్దార్థ♦సంగతిఁ గని
విహరింపుమా; నాదు ♦ విపులభావంబును
మది సుంత యోజించి ♦ మఱొకమాట
మనమునఁ గీలింపు ♦ మహిళావతంసమా
రామదర్శనకాంక్ష ♦ ప్రజ్ఞయందుఁ

తే. బొడమఁ దహతహపడనేల ♦ పుడమిపట్టి
నీవిభుం డీపురిం గన ♦ రావలయున

---

వ్రాసిరి. భార్యా అభిప్రియే-అని పదము విభజించి మోక్షప్రియమైనతల్లీ భార్యా చిత్రరూపిణీ-
శ్రేష్ఠురాలా యని యర్థము చేసిరి. ఆ యర్థమే యిందుఁ గనుపట్టునని యెఱుంగవలయు.

* ఇది మొదలుకొని మహేశ్వరతీర్థుల యభిప్రాయముగూడఁ బద్యములయం దిమిడియుండు
టను బాఠకులు గ్రహింపఁదగు.

టంచు మదిఁ గోరినన్ ఫలి♦యించుననుట
యబ్బురమె యట్టిశక్తియు ♦ నలరునెట్లు. ౨౩ 1504

చ. అనుపమవేగముం గలుగు♦నట్టి సదాగతిఁ ద్రాళ్లఁ గట్టరా
దనితరసాధ్యదీప్తిగల♦యట్టి ధనంజయు స్వచ్ఛమౌ శిఖన్
గని గ్రహియింపఁగాఁ దరము♦గాదు మదుగ్ర భుజాసురక్షితన్
నిను నిట నుండి శౌర్యమున ♦ నెట్టనఁ గైకొని పోవువానినేఁ
గనుఁగొన మూఁడులోకములఁ ♦ గాంతరొ! యేవిధినైనఁ జూచినన్. ౨౪

క. విను నీవీ లంకాపుర,మున నుండియె గొప్పరాజ్య♦మును దీనిని నె
ల్లను బాలింపుము సతి! యిం,కను మాదృశు లఖిలదేవ♦గణములు మఱియున్.

తే. జంగమస్థావరములు ని♦శ్చయముగాఁగ
సేవకుల మాదు మిఁకమీఁద ♦ నీవు ప్రీతిఁ
జారుతరమగు నభిషేక♦వారిఁ దోఁగి
నన్ను ముదమొందఁ జేయుమా ♦ సన్నుతాంగి! ౨౬ 1507

క. మునుచేసిన దుష్కృతములు, వనవాసముచేతఁ దీఱెఁ ♦ బ్రాకృతధర్మం
బునఁ గనఁదగుఫలమునుగై,కొనుమా సంప్రీతిమీఱఁ♦గువలయనయనా. ౨౭

తే. ఇందు మైథిలి! నే నీకు ♦ నిచ్చు సకల
మాల్యముల దివ్యమగుచు న♦మూల్యమైన
చందనంబును భూషణ♦సమితి నొకట
ననుభవింపుము ననుమోద♦మునను దేల్పి. ౨౮ 1509

సీ. భ్రాతయై తగు నాకు ♦ వైశ్రవణుం డాతనికిఁ బుష్పకవిమాన ♦ మొకటి గలదు
సూర్యప్రకాశమై ♦ సొంపారు సుశ్రోణి! దానిజయించితి ♦ నేను బలిమి
నదియు విశాలమై ♦ యతిరమ్యమై యనుపమమయి తనరారుఁ ♦ బరమమోద
మున నీకొసంగెద ♦ జనకజా! యద్దానిపయి యథాసుఖముగ ♦ వైభవముల
తే. నలరి విహరింపుమా; పంక♦జాభమగుచుఁ
జారుదర్శనమగుచు స్వ♦చ్ఛంబునగుచు
నలరు నీమోము పెనువెతఁ ♦ గలఁగి వెలయ
కున్నదిగదా వరారోహా! ♦ యొప్పు దప్పి. ౩౦ 1510

క. అని రావణుండు పల్కిన, విని వస్త్రాంతమునఁ బూర్ణ♦విధునిభవదనం
బును గప్పుకొనుచు నశ్రువు,లను విడుచుచు నుండె రాము♦లలనయు నంతన్.

చ. దనుజవిభుండు పాపమతి ♦ దత్పరతన్ బతినే దలంచుచున్
వనటఁ గృశించి భూతమొగిఁ ♦ బట్టిన రీతిని జంచలాత్మయై

౨౭ శ్లోకమునకు వ్యాఖ్యాతృద్వయాభిప్రాయ మొకపద్యముననే యున్నది. ౨౮ మొదలు ౩౦ వఱకుఁగల శ్లోకద్వయమునకు నిరువురవ్యాఖ్యాతల యభిప్రాయము నొకపద్యముననే యిమిడింపఁబడినది.

ఘనతరచింతచేతఁ దను♦కాంతియు మాయఁగనున్న జానకిం
గని వచియించె నివ్విధి న♦గాధమనోవిభవంబు పొంగఁగన్. ౩౩౧ 1512

సీ. నిన్ను సేవింపఁ జిం♦తించు నన్నేలిన ధర్మలోపము లేదు ♦ నిర్మలాంగి
యిఁక సిగ్గుపడ నేల? ♦ యీమన యిరువురకును దైవసిద్ధమై ♦ తనరుచున్న
సంబంధ మిద్ది యా♦ర్షంబగు; సుందరతావకచరణముల్ ♦ తలలు సోఁకి
యలఁకువఁ గనునట్లు ♦ లభివాదనము సేసినాఁడను బలుమాఱు♦నాపయినిఁకఁ
తే. గరుణనుంచుము నే నీకు ♦ నరయ దాసుఁ
డనుజుమీ నీకు లోనయి♦తిని స్మరార్తి
నంది నా గౌరవమునకు ♦ ననువుగాని
యిట్టిపల్కులఁ జెప్పితి ♦ నెన్నియేని. ౩౬ 1513

క. ఈరావణుఁ డింతకు మును, పేరమణికినైన నెత్తు ♦ లిడి సోఁక నమ
స్కారము చేసి యెఱుంగఁడు,గా! రమణీ! యనుచు జనక♦కన్యకతోడన్. ౩౭

తే. పలికి కాలునిబారికి ♦ వశుఁడుగాన
నామె నెల్లెనఁ దనదిగా ♦ నపుడు చేసి
కొనఁ దలంచెను దనకుఁ గ♦ల్గినజడతను
గనుఁగొనఁగలేని కారణ♦మున నతండు. ౩౭౧ 1515

ఏఁబదియైదవ సర్గము సంపూర్ణము.

---

౫౬ - వ సర్గము.

సీత రావణుని నిందించుట : రావణుఁడు సీత నశోకమున నుంచుట.

క. వెతఁగుందిన మైథిలి యిటు, దితితనయుఁడు చెప్పఁగ విని ♦ ధీరతతోఁ బర
సతిపరపురుషునితోడన్, జతనంబున మాటలాడఁ ♦ జనదనుటాత్మన్. ౧

క. తలపోసి నడుమఁ దృణమి,మ్ముల నిడి రావణునితోడ ♦ మోమోటమినిం
దలఁగి వచియించె వినుమీ,యిల దశరథభూపచంద్రుఁ ♦ డెసఁగెను ఖ్యాతిన్.

ఆ. ధర్మసేతు వగుచుఁ ♦ దగువాఁడు స్థిరుఁడగు, సత్యసంధుఁ డనఁగ ♦ సతతకీర్తిఁ
గన్నవాఁ డతనికి ♦ గాదిలిపుత్త్రుండు, రాముఁడయ్యె వినుము ♦ రాక్షసేంద్ర. ౨

క. ఆరాముఁడు ధర్మాత్ముం, డాయాథజగద్విశాల♦యశుఁడు కమలప
త్త్రారమ్యాక్షుఁడు గురుభుజుఁ, డారయ దైవతము నాకు ♦ నాతఁడె పతియా.

సీ. అట్టి భర్తను జెట్ట♦పట్టిన తన్వియు నిచ్చఁ జరించునే ♦ యెన్నఁడైన
నట్టి నా ప్రాణేశుఁ ♦ డతికీర్తిఁ గన్న యిక్ష్వాకుకులంబునఁ ♦ గల్గినాఁడు

---

౩౭౧ శ్లోకమున కిరువురువ్యాఖ్యాతల యభిప్రాయము సీసపద్యమున మూఁడుపాదములతోఁ జెప్పఁబడియె.

సింహాసన్నిభ భుజ♦శిఖరముల్ గలవాఁడు గురుతేజుఁడగు సహో♦దరునిఁ గూడి
యాతఁడే యరుదెంచి♦యనిమొన నీప్రాణముల హరియింపంగఁ♦గలఁడుసుమ్ము

ఆ. అట్టివాఁడె యైన ♦ ననిచేయ కూరక
యున్నవాఁ డదేమి♦యో యనఁదువా
యతనియెదుట నన్ను ♦ నట నీవు బలవంత
మున హరించియున్న ♦ దనుజ! యపుడె ౧౯ 1520

క. ఖరుఁబోలె హతుఁడవై సం,గరమున నవ్వనమునందె ♦ కంఠములు తెగన్
ధరణిఁ బరుండితొ యుందువు;, సురవైరులు వీరు బలులు♦శూరులునగుచున్.

క. పరఁగుదురు ఘోరరూప, స్ఫురణంబున నంటి నీవు ♦ భుజగవిషంబా
గరుడునియెడ నిష్ఫలమా, కరణిని వీరలబలాధి♦కంబులు వృథయా. ౨౧ 1522

చ. అరయ గుణచ్యుతంబులగు ♦ హాటకభూషితతీవ్రబాణముల్
తరఁగలు జాహ్నవీతటము ♦ దారుణరీతిఁ గలంచునట్లు భీ
కరమగు నీశరీరమును ♦ గైకొని చీల్చును జుమ్ము రావణా!
సురలకు దానవాళికిని ♦ జూడ నవధ్యుఁడవై చెలంగియున్. ౨౨ 1523

తే. వైరమా రాఘవునకు నీ♦పైఁ బొసంగు
నట్లుగాఁ జేసికొంటి వ♦ట్లాట నీవు
ప్రాణముల నిల్పుకొని యింక ♦ బ్రదుకఁజాల
విద్ది నిశ్చయమగు నసు♦రేశ వినుము. ౨౩ 152 4

క. జీవితశేషదినంబులు, రావణ నీకుండునేని ♦ రాముఁడె వానిన్
జేవం దుద ముట్టించును, భావింపన్ యూపబద్ధ♦పశువున కవనిన్. ౨౪ 1525

తే. బ్రదుకునం దాశ లేనట్లు ♦ బ్రదుకఁజాల, వింక నీవును; రాఘవుం♦డెసఁగురోష
దీప్తచక్షుస్సుచే నిన్ను ♦ దితితనూజ!, కనినచో దగ్ధుఁడ వగుచు ♦ గండడంగి.

క. అవమానము నొందుదువే;, దివమునుండి హిమకిరణుఁ ♦ డెంపునభూమిన్
జవమునఁ బడవైవన్ రా,ఘవుఁ డెంతయు శక్తిచేతఁ ♦ గ్రాలుంజుమ్మీ. ౧౦౪

తే. నాశమొందింపఁ జాలు న♦ర్ణవము నుగ్ర
శక్తి శోషిల్లఁగాఁ జేయఁ♦జాలు నతఁడు
తనప్రియాంగన నిటనుండి ♦ కొని చనఁగలఁ
డనుచుఁ జెప్పఁగవలయునే ♦ దనుజ యింక. ౧౧ 1528

క. నీయాయువు క్షీణించెను, నీయైశ్వర్యంబు తొలఁగె ♦ నీబలమెల్లన్
బోయె నశియించునింకన్, నీయింద్రియములును; నీచ! ♦ నీవు బలిమిమై. ౧౧౪

క. పరవనితాస్పర్శంబున, గురుపాతక మిపుడు తెచ్చు♦కొంటివి దానన్
సిరిఁ గ్రాలు నీదులంకా,పురమును వైధవ్యదుఃఖ♦పూరితమగుఁ జూ. ౧౨

క. వని ననుఁ బతిపార్శ్వస్థల,మున నుండి తొలంగఁదీయఁ♦బోలునె నీక

ప్పని నొనరించితి పీయఘ,ము నీకు సుఖమీయ కధిక♦ముగ దుఃఖ మిడుఁగ.
క. వినుమా దీనుఁడు తాపసి, యని నా ప్రాణేశు నంటి ♦ వాతఁడు దైవం
బును గూడి మహాద్యుతియై, తనరుచు వీర్యమునఁ వెలసి ♦ తా నిర్భయుఁడై.
క. జనరహితమైన యవ్వన,మున నున్నాఁ డతఁడు యుద్ధ♦మున శరవర్షం
బును బరపి నీదు దర్పం,బును బల ముత్సేకవీర్య♦ములఁ బోకార్చుఁ. ౧౫
తే. భూతములకు వినాశంబు ♦ పొదలు దైవ
యత్నమున నష్టు మనుజు లో♦య్యన విధివశ
మొంది కార్యంబులందు దా♦రొందువారు
దనుజకులపాంసనా! ప్రమా♦దంబు మిగుల. ౧౬ 1534
క. నను ని ట్లవమానించితి, గనుకనె యంతః పురంబు ♦ క్రవ్యాదులు నీ
వును బొలియునట్టి కాలము, కననౌను సమీపమందె ♦ కానవు దానిఁ. ౧౭
సీ. యజ్ఞశాలాంతర♦మందు స్రుగాద్యుపకరణయుక్తంబయి ♦ ద్విజసురేంద్ర
మంత్రపూతంబయి♦మహితంబునగు వేదికనుమాలఁ డంప్రేఁదో♦క్కఁగఁగలఁడె
పరమధార్మికుఁడయి ♦ భాసిల్లు శ్రీరాముధర్మపత్ని పతివ్ర♦తయునగు నను
బాపచిత్తుండ వ♦పయశంబు గాంచినవాఁడ వౌ నీవదె♦బ్బంగినైన
తే. దాఁకనేరవు సుమ్ము; ప♦ద్మవనమందు
సంతతము రాజహంసతో ♦ సాంద్రకేళి
నలరు హంసియుఁ దృణమండ♦మందుఁ దిరుగు
నీరుకాకిని జూడంగ ♦ నేర్చునెట్లు. ౨౦ 1536
క. తనువిది జడమైనది దీ,నిని బంధించినను నల్లె ♦ నీకొనరింపం
జను దినినఁ దినఁగాఁ జను, దనుజా! యీతుచ్ఛమైన♦తనువు నసువులఁ. ౨౧
తే. ఎంతమాత్రము రక్షింప ♦ నిద్ది తగదు, నాకు నాలాటిభావంబు ♦ లేకయుండు
గాని నే నపవాదంబు ♦ ద్వైతలమున, నిలుపఁగా నోర్వఁజాలను ♦ నిశ్చయమిది.
చ. అని ధరణీజకోపమున ♦ నాతనితోఁ బరుషోక్తులాడి యిం
కను వచియింప మాని తన♦కాంతుఁ దలంచుచు నుండె; సీతచె
ప్పిన పరుషోక్తిజాలముల ♦ విన్న సురారియు రోమహర్షణం
బునఁ దనువెల్ల నిండ భయ♦ముం గలిగించెడు వాక్కు లొప్పఁగ. ౨౩౪
*సీ. రావణుండు వచించె♦రమణీ! శుచిస్మితా! నీదయఁ గాంచఁ బం♦డ్రెండునెలలు
గాచియుండెద నంత ♦ కాలంబునకునైనఁ గాంక్షఁ దీర్పవయేని ♦ గడఁగి వంట
వాండ్రె, యమ్మఱునాటి ♦ ప్రాతరాశార్థమై యింతవింతలుగాఁగ ♦ నెల్లతనువు
ఛేదింతురని శత్రు♦సూదనుఁ డాతండు పరుషంబుగా నిట్లు ♦ పలికి క్రుద్ధుఁ

* శృణు మైథిలి మద్వాక్యం మాసాన్ ద్వాదశ భామిని, కాలే నానేన నాభ్యేషి యది మాం చారుహాసిని, తత స్త్వాం ప్రాతరాశార్థం సూదాశ్ఛేత్స్యంతి లేశశః - అనిమూలము. దీనికి మహేశ్వరతీర్థులు వ్రాసినయర్థముగూడ నిందే యిమిడింపఁబడుట యెఱుంగఁదగినది.

తే. డగుచు దనుజాంగనలఁ గాంచి ♦ యనియె నిట్లు
పలలరక్తాశనలగుచుఁ ♦ బరుషదర్శ
నలగు నంగనలార! యెం♦తయును బూన్కి
నీవనితసన్నిధిన్ మీర♦లెల్లఁ జేరి. ౨౬ 1540

తే. వేగ దర్పము మాని నా♦వేఁడుకోలు, మదిని నంగీకరించెడు♦మాడ్కిఁ జేయుఁ
డనియె; భీకరదర్శన♦లైన వార, లతని గురువాక్యముననె కృ♦తాంజలులయి.

క. జనకజఁ బరివేష్టించిరి;, దనుజేంద్రుం డతిభయప్ర♦దంబగు దేహం
బున నొప్పి భూమివ్రయ్యలు, గను జేయు తెఱంగుదోఁపఁ ♦ గాఁ జరణములన్.

క. ధరణిని దాటించుచు నా, తరుణులఁ గని యిట్లు పలికెఁ ♦ దరుణిని దీనిన్
ద్వరగా నశోకవనికాం, తరమున నుంపుండు మీర♦తంద్రితమతులై. ౨౯

క. దీనిం బరివేష్టించియె, మానక రక్షింపవలయు ♦ మఱి గూఢముగా;
నీనెలఁత నీయశోకో, ద్యానంబునయందె నిలిపి ♦ యనవరతంబున్. ౩౦ 1544

క. ఘోరమ్ములుగాఁ గన్పడి, చారుతరములైన వాక్య♦సరణుల నెంతో
భూరిభయంబును గనఁగా, మీరలు చేయుచును నొకట ♦ మెలఁకువమీఱన్.

క. తిన్ననిమాటలఁ దేర్చుచు, నన్నుం గైకొను విధంబు♦నం బల్కుచు మీ
రిన్నాతి వనగజాంగన, సన్నుతగతి వశమొనర్చు ♦ సరణిం బూన్కిన్. ౩౧

తే. నాకు లోనైన మెలంగ నె♦న్నటికినైనఁ
జేయుఁడీ యంచు నెట్టనఁ ♦ జెప్పె; నంత
వార లాతనియానతి ♦ వారిజాక్షి
సీతఁగొని యవ్వనంబును ♦ జేరఁజనిరి. ౩౨ 1547

క. అనవరతము ఫలసుమములఁ, దనరారుచు నచటి భూరి♦తరువులు వెలయన్
ఘనముదమునఁ దగి పక్షులు, నినాదములఁ జేయుచుండు ♦ నిరతముఁ దమిచేన్.

చ. జనకజ రాక్షసాంగనల ♦ సంఘము నంతరమందుఁ జిక్కి య
వ్వనమున వ్యాఘ్రిమధ్యమున ♦ వారక చిక్కిన లేడిపోలె నా
త్రిని దనువెల్లఁ దూలఁగ మ♦దిం దురపిల్లుచు నుండె; నిట్టు ల
జ్జనకకుమారి భీరువు వి♦శాలవిషన్నది మున్గి యెంతయున్. ౩౪ 1549

ఆ. పాశబద్ధహారిణి ♦ భంగి రవంతయు, శర్మమొందదయ్యె; ♦ సాధ్వసంబుఁ
గలుగఁ జేయు నేత్ర♦ముల నొప్పు రాక్షస, వనితలెల్ల భయద♦వాక్కులెపుడు.

క. పలుకంగ శర్మమొందక, కలఁగుచు దైవతమునగుచుఁ ♦ గ్రాలెడు పతినిన్
దలఁచుచు నతిభయశోకం, బులు దూలఁగఁ జేయ మూర్ఛఁ♦బొందెన్ మిగులన్.

ఏఁబదియాఱవ సర్గము సంపూర్ణము.

## ౫౭ - వ సర్గము.

రాముఁడు మారీచునిం జంపి వచ్చుచు దుశ్శకునములం గాంచి వగచుట.

చ. వనమున రామచంద్రుఁడును ♦ బాణములన్ మృగరూపుఁడై చరిం
చిన యల కామరూపునిని ♦ జెచ్చెఱఁ జంపి నివాసభూమికిం
జనియెను వేగ; యిట్లతఁడు ♦ జానకిఁ జూడఁగ సత్వరంబుగాఁ
జనుచును వెన్కఁ దా వినియె ♦ సాధ్వసదంబగు నక్కయాఖువున్. ౨ 1552

సీ. మునుపె మారీచుని♦స్వనమున నేమౌనొ యని శంక నొందెను ♦ గనుక రోమ
హర్షణంబగు జంబు♦కారావమును ఘోరమును విని చింతించె♦మనమున నిటు;
జంబుకారావంబు ♦ సరణిని జూడఁగా నేవియో యశుభంబు ♦ లింకఁ గలుగు
నని తోఁచుచున్నది♦యక్కటా! వైదేహి యాకోమలాంగి క్రూ♦రాసురులకుఁ
తే. జిక్కి వారలచేత భ♦క్షింపఁబడక
క్షేమముగ నుండునా మృగా♦కృతినిఁ బూని
తాటకాత్మజుఁ డెట్టులో ♦ తాను నాదు
స్వర మెఱింగి యారీతినే ♦ పలికెఁ గాదె. ౫ 1553

క. అనుజుఁడు దానిన్ వినునే, వనమున జానకిని విడిచి ♦ వచ్చును స్వరమున్
విని సీతయుఁ బొమ్మనునం,తనె తమ్ముఁడు రాఁ గలండు ♦ నను నరయుటకై. ౬

సీ. కాంచనమృగమయి♦కడఁగి మారీచుండు నను నాశ్రమమునుండి♦కొనుచుఁ బోయె
నతిదూరమున కంత ♦ నతఁడు శరాహతుఁ డయి పడి మరల స్వీ♦యదనుజత్వ
మొంది చచ్చుచు నూర♦కుండక క్రూరాత్ముఁ డక్కటా! సౌమిత్రి!♦హతుఁడనైతి
నని నాదు నిస్వన♦మట్లుగాఁ బల్కె నికార్కరణముననను రా♦క్షసులు చేరి
తే. జనకజను జంపఁగాఁ దగు♦ననుచుఁ గోరి
యున్నవారనుటొప్పు నీ♦యూహ నిక్క
మగు జనస్థానమున నున్న ♦ యందువలన
దనుజులకు నాకుఁ బగయుఁ గ♦ల్గెను మిగులఁగ. ౭ 1555

క. జనశూన్యమగు మహావన,మునఁ దగు మైథిలియు మోద♦ముం గూర్చెడు నా
యనుజుండును క్షేమంబును, గనుచుందురొ లేక వారు ♦ కష్టము గనిరో. ౮

క. కనఁబడుచున్నవి దుష్టశ, కునములు బహురీతులగుచు ♦ ఘోరంబులుగా
నని రాముఁడు చింతించుచు, వని నటగోమాయుగురుర♦వంబును వినుచున్. ౯

క. హరిణాకృతి మారీచుం, డురుగతిచే నాశ్రమంబు♦నుండి కడఁగి భీ
కరవనమునకుం దెచ్చుట, నరసి మదిన్ సంశయంబు♦నందుచుఁ ద్వరగాన్ ౧౦

క. చనుదెంచె జనస్థానం,బున నున్న స్వకీయవాస♦మును గూర్చి; వనం
బునఁగల మృగపక్షిగణం,బును మనమున దైన్యమొదవ♦భూరితరార్తిన్. ౧౧

తే దీనుఁడై మాన్యుఁడౌ నృప♦సూనుచుట్టు
నవ్యగతిమీఱఁ దిరుగుచు ♦ సాధ్వసంబు

గలుగఁ జేయుచుఁ గూసె; న♦బ్బలుమగండు
దారి నతిఘోరశకునవి♦తానముఁ గని. ౧౨ 1560

క. త్వరగ నమనుదితో నాశ్రమ, మరయుచు నాదారిఁబట్టి ♦ యరుగం జొచ్చెన్
[1]గురుకటి రాజిలు సీతను, నిరుపమబలు లక్ష్మణుఘను♦నెమ్మిఁ దలఁచుచున్. ౧౩

క. తనయాశ్రమంబు గనఁగాఁ, జనుదెంచుచు నుండెఁ; దనదు♦చాయ తఱుగఁగాఁ
దనయొద్ద కరుగుదెంచెడు, ననుజుని లక్ష్మణునిఁ గనియె; ♦ నాలక్ష్మణుఁడున్. ౧౪

తే. [2]దీనుఁడై దుఃఖమొందుచుఁ ♦ దాను బోలె
దీనుఁడై దుఃఖమొందుచుఁ ♦ దిరిగి వచ్చు
చున్న యన్నను జేరె; సి♦ట్లొప్పుదప్పి
వచ్చుచున్నట్టి యారామ♦భద్రుఁ డంత. ౧౫ 1563

చ. జనరహితంబు క్రూరదను♦జవ్రజసేవిత మూర్తికంబు నౌ
వనమున జానకిన్ విడిచి ♦ వచ్చిన లక్ష్మణుఁ గాంచి యిట్టులో
[3]ప్పనిపనిఁ జేసితందులకు ♦ బాగుగ నిందయొనర్చి; నంత న
[4]య్యనుజునిసవ్యహస్తమును ♦ నాకృతిమీఱ గ్రహించి రాముఁడున్. ౧౬

క. మొదటం బరుషంబుగ నా, పిదపన్ మధురముగ నార్తి ♦ విస్తృతిఁ గనఁగా
మదిఁ దాపమ్మునఁ బల్కెను, నిదితగునే యకట నిన్ను ♦ నేనుంచు నిఁకన్. ౧౭

క. అనుజా! లక్ష్మణ! నీవట, జనకజ నొంటిగను విడిచి ♦ సత్వరముగ న
న్గనవచ్చితివే యిస్సీ!, యనఁదగుపనిఁ జేసినాఁడ ♦ వరయక మదిలోన్. ౧౮

క. మనకిందు క్షేమముగుఁగద;, విను సౌమిత్రీ! వీర! యిచటఁ ♦ బెక్కులు నాకున్
గనఁబడుచున్నవి దుష్టశకునములె పలుమాఱు నాదు♦కోరిక లడఁగన్. ౧౯

క. వీనిం గనఁగాఁ దమ్ముఁడ, జానకి నేభంగినైన ♦ సాంద్రాటవిలోఁ
బూని చరించు దురాత్ములు, దానవులే యపహరించి ♦ తమనెలవులకున్. ౧౯

క. గొనిపోయి యుందురొండేన్, దినివేసియొ యుందురొండెఁ ♦ దృప్తిఁగ నని నా
కును దోఁచెడి నిస్సంశయ, మనియును సమ్మకముగలై ♦ ననుజా! యిచటన్. ౨౦

సీ. జనకుని ప్రియపుత్త్రి! ♦ వనితాశిరోమణి బ్రదికి క్షేమమ్ముగాఁ ♦ బరఁగుచుంట
మనము చూతుముగద! ♦ మనుజవరేణ్య! జింకలగుంపు మఱి జం♦బుకంబుపక్షి

1 సతు సీతాం వరారోహామ్-అనిమూలము 2 విషణ్ణ స్సువిషణ్ణేన దుఃఖితో దుఃఖభాగినా-అనిమూ. 3 సంజగర్హేఽథ తం భ్రాతా - అనిమూ. 4 గృహీత్వా చ కరం సవ్యం లక్ష్మణం రఘునందనః-అనిమూ. అనఁగా లక్ష్మణుని యెడమచేయిని బట్టుకొని యాద్భృతిమీఱ నిట్లు పలికెనని భావము. ఇటఁ గొందఱు నవనాగరికులు "ఇప్పటివలె కరము కరమునఁ బెనుచు నాచారము పూర్వమునఁ గలదనియుఁ గ్రొత్తయాచార మిదిగా"దనియుఁ బలుకుచుందురు. సవ్యహస్త మనఁగా: ఎడమచేయి యని వారికిఁ దోఁచలేదేమో. రామునికుడిచేతికి నెదురుగావచ్చు లక్ష్మణుని యెడమచేయి సరిగా నుండినదని గ్రహింపఁదగును.

గణములు సూర్యప్ర♦కాశితదిఙ్ముఖంబుగ భయంకరముగ ♦ భూరిరవము
లొగినొనర్చుచున్న;♦వోమహాబాహు! యాసృపాత్మజకుఁ క్షే మ♦ములపుచుండుఁ
ఆ. గాదె? మున్నుమృగము♦గాఁదోఁచినట్టియా, దానవుండు నేను ♦ దను వెనుకొని
వచ్చుటరసి మోస♦పుచ్చిదూరముగొని,పోయెఁ జాలశ్రమముఁ♦ బొందినేను. ౨౩
క. చిక్కఁడు మృగ మిఁకనని యే, నొక్కశరం బేసినాఁడ ♦ నుగ్రశరహతిఁ
బొక్కిమృతినొందుచు నెవాఁ, డక్కట! దనుజత్వమొందె♦నాతురుఁ డగుచున్.
చ. జనకజఁగూర్చి నామనము ♦ సాధ్వసమందెడి సవ్యనేత్ర మొ
య్యనఁ జలియించుచున్నది ప్రి♦యానుజ! జానకి దానవాళిచే
త నపహరింపఁగాఁబడెనొ ♦ తా మృతినొందెనొ మార్గమందుఁ దో
డ్కొని చనఁబోవుచున్నదియొ ♦ దూరముగా నట లేదు, సంశయం
బనునది లేదు దీనికని ♦ యార్తిని రాముఁడు పల్కె వెండియున్. ౨౪½ 1572

ఏఁబదియేడవ సర్గము సంపూర్ణము.

---

## ౫౮ - వ సర్గము.

రాముఁడు శోకమున విలపించుట.

తే. దాశరథి యంత జనరహి♦తమగు వనిని
జానకిని డించి వచ్చిన♦వాని విన్న
నైన లక్ష్మణుఁ గాంచి, ధ♦ర్మానువర్తి
యగుచు నిట్లనిపల్కె మ♦హార్తిఁ గనుచు. ౧ 1573
క. అనుజా! భయదాటవికేఁ, జనఁదలఁపఁగ నన్నుఁ బాయఁ♦జాలక నాతో
డనె వచ్చినదే యాసీ,తనుడించియె వచ్చితివె ని♦తాంతజవమునన్. ౧½ 1574
క. ఆసీత యెచటనున్నది?, యీవనమయమునందు రాజ్య♦మెల్లను బోవం
గా సకలహీనుఁడనై యే, వేసరి దీనుండనగుచు ♦ విపులాటవిలోన్. ౨½ 1575
క. చరియించుచుండ నాతో, సరిగా దుఃఖములఁబొంది ♦ సతతము దోడై
చరియించు నాపతివ్రత, *సురుచిరతనుమధ్యమాభి♦శోభిత యెందో. ౩ 1576
తే. ఎవ్వతను బాసి క్షణమైన ♦ నేను బ్రదుక
నొల్లనో వీర! ప్రాణాళి♦కెల్లఁ దోడు
గాఁ జెలంగెడు నా ప్రియ♦కాంత దేవ
కన్యఁబోలినసతి యెందుఁ ♦ గ్రాలు నిపుడు. ౪ 1577
క. కనకచ్ఛాయఁ జెలంగెడు, తనువున శోభిల్లు జనక♦తనయయె లేదే
మనుజపతిత్వము సురపా, లనతను నేనొల్లఁజుమ్ము ♦ లక్ష్మణ! యింకన్. ౫ 1578
సీ. ప్రాణాళికంటెను ♦ బరమప్రియంబుగాఁ దగు నా ప్రియాంగన ♦ తనదు ప్రాణ
ములఁగూడి యాశ్రమ♦మున నున్నదే గదా? యిట్టిసీతను బాసి♦నట్టులైన

---

* కృశా దుఃఖసహాయా మే వైదేహీ తనుమధ్యమా-అనిమా.

నిపుడె చత్తునుగాన ♦ నీఁక వనవాసవ్రతముఁ బదునాల్గేండ్లు ♦ తగువిధమున
జరపకపోదును ♦ సాధుమతీ! యీవ్రతము మిథ్యగాదుగ♦వ! తలఁపంగ;

తే. జానకి నశింప దానితో ♦ నేనుఁ జావ
నీ వయోధ్యకుఁ బోయిన ♦ నిన్నుఁ గాంచి
[1]కైక తనకోర్కి యీడేఱఁ♦గా సుఖించు
చుండునే గద? లక్ష్మణ! ♦ యొక్కరీతి. ౭ 1579

క. తనయుఁడనగు నేమృతిఁబొం,దిననెంతయు వగలఁబొగిలి ♦ దీనతతో నా
జనని సుతరాజ్యములతోఁ, దనరెడు కైకేయిఁ గొల్వ ♦ దగినదియె కదా. ౮

క. జానకి బ్రదికియె యుండిన, నే నాశ్రమమునకు వత్తు ♦ నిటనుండి తగన్
మానిని సువృత్త యాసతి, తానే మృతినొందెనేని ♦ తప్పక చత్తున్. ౯ 1581

క. నేనాశ్రమసీమకు రాఁ,గానే చిఱునవ్వుతోఁ బ♦గాఁ బల్కుచు నా
జానకి యెదురుగ రాదే, నేనపుడె నశింతు నుండ♦నేర్తునె యిలలోన్. ౧౦

క. అనుజా! లక్ష్మణ! జానకి, వనమున మనయాశ్రమమునఁ ♦ బ్రాణంబులతో
డను గలదా లేదా? లే,క నీవును బరాకు నొందఁ♦గాఁ గని యసురుల్. ౧౧

క. వనటం గుందెడు జానకిఁ, బనివడి తినివైచిరా? జ♦వమునఁ బలుకుమా
జనకజసుకుమారియుఁ బసి, తనమునఁ దగి దుఃఖమునఁ గఁ♦దానెఱుఁగదు సూ.

తే. మద్వియోగంబునకుఁ దన♦మునము గుందఁ
దల్లడిలుచుండు నిజమిది; ♦ దానవుం డ
తండు కపటియు దుష్టచి♦త్తుండు నగుట
నక్కటా! లక్ష్మణా! యంచు ♦ నఱచె దాన. ౧౨ 1585

క. నీవంటి శూరునకునున్, భావంబునఁ దోఁచె భూరి♦భయము; సహజ! త
ద్దావమము నాగళరవము,ల్లే వఱలుట దానివినఁగ♦నే నీవు వెసన్. ౧౩ 1586

క. చనుదెంచితివా! నిస్వన,మును సీతయు వినియె యుండు ♦ మునుకొను భీతిన్
నినుఁ బంపియుండుఁ గావున, ననుఁజూడఁగ నిపుడు వచ్చి♦నాఁడ విచటికిన్.

క. ఇది యిట్లే యయియుండును, గద యని శంకించువాఁడఁ; ♦ గాననమున నా
సుదతిని విడిచియె వచ్చితి, విదె గాన నకృత్యమెంతొ ♦ యెల్లవిధములన్. ౧౪

క. ఒనరించినాఁడ విప్పుడు, దనుజులు ఘాతుకులు సర్వ♦థా గావున నే
మనపైఁ బగఁ దీర్చుకొనం,గను దలఁచుచునుండఁగ నవ♦కాశమొసఁగితే. ౧౫

చ. ఖరునివధించినందులకుఁ ♦ గా మిగులన్ వగఁ బూని రాక్షసుల్
నిరతము మాంసముం దినఁగ ♦ నెమ్మదులం దలపోయుచుంద్రు భీ

---

1 కచ్చిత్సకామా సుఖితా కైకేయీ సా భవిష్యతి-అనిమూలము. సకామే త్యనేన రామస్య హృదయే కైకేయీ స్వవినాశార్థమేవ వనం ప్రేషితవతీతి సచాప త్తతే తదిదానీం సంప్రమత్తకుపి. తానాం భావజ్ఞానం దృష్టమితి న్యాయేన వ్యక్తీకృతమ్-అని గోవిందరాజులు.

కరులును నొంట వారలటఁ ♦ గాంతను జంపియొయుండ్రు సంశయం
బరసినలేదు; వైరినివ♦హాంతక! నే నిపు డెల్లభంగులన్. ౧౬ 1590

[1]ఆ. మునిఁగినాఁడ దుఃఖ♦ములలోన నింకేమి, చేయఁగలను నేను ♦ నీయపార
వ్యసనములను మునుఁగ♦వలయునంచని విధి, యున్నదనితలంచు♦చున్నవాఁడ.

క. అనియిట్లు వరారోహను, జనకసుతం దలఁచుకొనుచు ♦ సరగున ననుజా
తునిఁగూడి జనస్థానం, బునకుం బోయెను; నితాంత♦మును దుఃఖితుఁడై. ౧౮

సీ. అంతవీరుండగు ♦ నారాముఁ డెంతయు నార్తరూపుండగు ♦ ననుజునింద
చేయుచు నాఁకలి♦చేతను దప్పిచే నిట్టూర్పు లెసఁగంగ ♦ నిజముఖంబు
శుష్కమై కాంతిచే ♦ శోభిల్లకెంతయు వెలవెలఁబాఱఁగా ♦ వెసఁ జనిచని
తనయాశ్రమంబు చెం♦తకుఁ బోయి యట సీతఁ గానక లోనికిఁ♦బూని యరిగి

తే. యందునన్ సీతఁగానక ♦ యామెతిరుగు
స్థలములకు నేగి కేళికా♦స్థలమున నిది
యిట్టి దది యట్టి దనుచును ♦ నట్టె మేను
గగురుపొడువంగఁ జాల దుః♦ఖంబు నొందె. ౨౦ 1593

ఏఁబదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

౫౯ - వ సర్గము.

రాముఁడు లక్ష్మణుని రాకకుం గారణ మడుగుట. లక్ష్మణుఁ డాసంగతిని రామునకుం జెప్పుట.

తే. [2]అంత రఘునందనుండును ♦ స్వాశ్రమంబు
నుండి చనుదెంచి యార్తుఁడై ♦ యొప్పుదప్పి
యున్న లక్ష్మణుఁ బ్రోవలో ♦ నొకటఁ గాంచి
మరల నీరీతి నడిగె నె♦మ్మనము కలఁగ. ౧ 1594

తే. నీవు గాపున్నవాఁడ విం♦కేవిధమున
హానిలేదను విశ్వాస♦మూని నేను
గాంత నట డించిరాఁగ న♦య్యింతివిడిచి
యెందుకిట వచ్చినాఁడవో ♦ యెఱుఁగఁ జెపుమ. ౨ 1595

చ. వనమున జానకిన్ వదలి ♦ వచ్చిన నిన్నిటఁ గాంచినంతనే
జనకజకేమొ కీడొదవె ♦ నక్కమునందని జంకునొంది నా
మనము నిజంబుగా వెతల ♦ మూఁడుచునున్నది; లక్ష్మణా! వనం
బున ధరణీజనున్ విడిచి ♦ పొక్కుచు వచ్చెదు నిన్ను దప్పులన్. ౩ 1596

---

1 కిన్విదానీం కరిష్యామి శంకే ప్రాప్తవ్య మీదృశమ్-అనిమూలము. 2 అథ విస్తారేణామార్గ మధ్యకృతాం కథామాహ-అని మహేశ్వరతీర్థులు. రామలక్ష్మణుల సమాగమవృత్తకథను విశేషించి యిటఁ జెప్పుచున్నాఁడు.

క. కనినంతనె సవ్యభుజం, బును సవ్యాక్షియును హృదయ♦ముఁ గూడ వ్యథం
గని యదరుచు నున్నవి; నా, విని శుభలక్షణుఁడతండు♦వెతలఁగలఁగుచున్. ౪½

క. తనుఁగూర్చి రాముఁ డిట్లు త,గనిపని చేసితివె యనెడు ♦ గాఢోక్తిని నిం
కను దుఃఖితుఁడై దుఃఖం,బునఁ గూలెడు నన్నతోడఁ♦బొగులుచుఁ బలికెన్. ౫

క. జానకి నేనై స్వేచ్ఛగఁ, గాననమున నొంటి విడిచి ♦ కడు నవివేకం
బూని యిటువచ్చినాఁడం, గానుజమీ యుగ్రవాజ్ఞి♦కాయము మిగులన్. ౫½

తే. పలికె యామెయె త్వరపెట్ట ♦ వచ్చినాఁడఁ
ద్వత్సమీపంబునకు; నల♦దానవుండు
నటవి హా లక్ష్మణా! యని ♦ యకట సీత!
యనియు రక్షింపుమా యని♦యును గడువడి. ౬½ 1600

క. రామా! నీగళరవమున, నేమాడ్కిఁ వెడలుశబ్ద ♦ మెల్లవిధములఁ
ఆమాడ్కి నఱచె నాస్వన, మామానిని చెవులసోఁకె ♦ నది విని నంతన్. ౭

సీ. నీయందు నలరారు ♦ స్నేహంబునఁ భయవిహ్వలయై చాల ♦ వెతలఁ గుంది
యేడ్చుచుఁ బొమ్ముపొ♦మ్మిపుడె నీయన్నను గావఁగా ననిపల్కె; ♦ నావిధమునఁ
బలుమాఱు నన్నుఁ బో♦వలయు నంచీరీతి బలవంతపెట్ట నీ♦బలముఖముల
యందు నాకుంగల ♦ యతిశయవిశ్వాసమునుబట్టి యిట్లంటి ♦ జనని! లోక

తే. మందు రామునకుఁ భయ ♦ మావహిల్లఁ
గా నొనర్పఁగఁజాలు రా♦క్షసుని నేను
గానవే లేదు నిర్వృతిఁ ♦ గాంచు మింక
నిద్ది రాముని గళరవ ♦ మేటికగును?. ౯½ 1602

క. దనుజుం డెవఁడో యీరీ,తిని మనకు భయంబు గల్గు♦తీరున నఱచెఁ;
జననీ! రాముఁడు దివిజుల,కును గల భయమాపి కాచుఁ ♦ గోరికమీఱఁ. ౧౦½

క. సీతా! రక్షింపుమ యని, యీతీరున నీచమగుచు ♦ నెందును హేయం
బై తగు నీపలుకెవ్విధి, నాతఁడు వచియించు నమ్మ♦కమ్మా యంటిన్. ౧౧ 1604

తే. ఎందుకోగాని దానవుఁ ♦ డెవఁడొ నాస
హోదరుని కంఠనాదము ♦ ట్లొప్పు ధ్వనిని
గావుమా కావుమా యని ♦ యీవిధమున
నఱచెనేగాని వేఱు లే♦దమ్మ యంటి. ౧౨ 1605

క. ననుఁగావు లక్ష్మణా! యిపు, డనిచెప్పిన మాటధ్వనియు ♦ నరయఁగ వేఱై
వినఁబడినది కావున రా, మునిస్వరమే కాదు శంకఁ ♦ బూనకు మింకన్. ౧౨½

క. మనమునఁ జింతిలవల దొ,ప్పనివనితలు చింతనొందు♦భంగిని; జాలఁ
వనటఁ బొందకుతల్లీ', ననుఁబంపుటకై మనంబు♦నం ద్వరయేలా. ౧౩ 1607

సీ. నెమ్మదినుండుమా ♦ యమ్మరో యనిలోన రాముజయించు ప♦రాక్రమంబు
గలపూరుషుఁడు ముజ్జ♦గములలో నెచ్చట మును పుట్టినది లేదిఁ♦కనుజనింపఁ

బోఁడు దేవేంద్రుని ♦ ముందిడుకొని దేవతలు పైకివచ్చిన♦గెలువఁజాల
రని మొన; నని యంటి♦నంత నామాటల కాసీత పరిమోహి♦తాత్మయగుచు
తే. నంతఁ గన్నీరు విడుచుచుఁ ♦ బలికె నిట్లు
దారుణంబుగ ననుఁజూచి ♦ తగనిరీతి:
నన్ను నశియింప ననుఁబొందు ♦ నాశ నీకుఁ
బుట్టె నెంతయుఁ బాపపు♦బుద్ధివలన. ౧౬ 1608

క. మనమున నీపాపాశయ,మును నుంపందగునె కాని ♦ ముసుకొని ననుఁ గై
కొనలేవు సుమ్ము; భీతిం, గని రాముం డిట్టులఱవఁ♦గా నీకొఱకై. ౧౭ 1609

చ. వినియును నన్నుఁ గావఁజను ♦ వృత్తిని బూనక యున్నవాఁడ వి
ప్పుని గనఁదోఁచెడిన్ భరతు♦పంపున నేమియొ దుష్టబుద్ధిచే
వని సమయంబుఁ గాంచి క్రుధ♦భ్రాతను జంపఁగ వచ్చినాఁడ విం
క నొకటిగాదు: శత్రుఁడవు ♦ గాని హితుండవుగావు లక్ష్మణా. ౧౮ 1610

తే. కపటవేషంబుఁ గైకొని ♦ కావకీవు, నాదుప్రాణేశు వెనువెంట ♦ నన్నుఁ గోరి
వచ్చినాఁడవుకాన నా♦భర్తయందు,నంతరముచూచుచున్నాఁడ♦వకట!సతము.

సీ. ఆయవకాశ మి♦య్యెడనునఁ జిక్కెను గాఁబట్టి రామునిఁ ♦ గావఁబోవ
కున్నవాఁడ వటంచు ♦ నొక్కరీతిని బల్కఁ [1]ద్వరపడి కనులెఱ్ఱఁ♦బాఱఁ గోప
మున నోష్ఠములు కంప♦మును బొందనాశ్రమమునుండినిన్నుఁ జూ♦చనిటవచ్చి
నాఁడ నంచు సుమిత్ర♦నందనుఁ డాడంగసంతాపమోహిత♦స్వాంతుఁడగుచుఁ
తే. దమ్మునింజూచి సౌమ్య! భూ♦తనయ విడిచి
నీవు వచ్చుట దగదు సూ ♦ నేను దనుజు
లను నివారింప శక్తుండ ♦ నని యెఱిఁగియు
వనిత క్రోధోక్తులాడంగ ♦ వచ్చితి వయొ!. ౨౧ 1612

క. జనకసుత డించి ననుఁ గన, వసికిట నీవరుగుదేరఁ ♦ బరితోషము నా
కును గల్లలేదు; [2]స్త్రీయనఁ, గనె యవివేకంబు సహజ♦కర్మముగాదే. ౨౨

తే. ఎఱుఁగవే యింతమాత్ర మ♦య్యింతియందు
మీఁదఁ గోపంబు నొందెను ♦ గాదె యట్టి
దేమొ పరుషంబుగాఁ బల్క ♦ నీవు దాని
విడిచి వచ్చితివే ఘోర♦విపినసీమ. ౨౩ 1614

క. వనితయుఁ బొమ్మని పల్కఁగఁ, జనుదెంచుట యుక్తమగునె ♦ సహజా! వానిన్
వినిరోర్చుకొనందగున, [3]ప్పుని సాధ్యముగాక యున్న ♦ వనమం దొకచోన్.

---

1 ఏవముక్తో హి వైదేహ్యా సంరబ్ధో రక్తలోచనః, క్రోధాత్ప్రస్ఫురమాణోష్ఠ ఆశ్రమాదభినిర్గతః-అనిమూలము. 2 స్త్రియా ఇత్యవివేకసంభావనా సూచకమ్-అనివ్యాఖ్య. 3 కథంచి వసహనే బహిరాగత్యాంతర్హితో భూత్వా తత్పాలనం కర్తవ్యమ్-అనివ్యాఖ్య.

క. కనఁబడనిచోట నిలిచి యె,ననివలన న్ బాధలేని♦భంగిని గావం
జనుఁ గాని పొమ్మనం డెప్పనఁ గ్రోధవశంబు నొందఁ ♦ బోలునె చెపుమా.

సీ. దానిచే నాయాజ్ఞ ♦ దాఁటితివే యన్నివిధములఁ జూచిన ♦ విడువరాని
యపనీతినీమీఁద♦నలముకొన్నదిసుమా! మృగరూపమునుదాల్చి♦యెవఁడునన్ను
వంచించి యటనుండి ♦ వరుసఁగ దవ్వులఁ గొని తెచ్చెనో యల♦క్రూరదనుజుఁ
డిదె నాశరంబుల ♦ మృతిఁగని ధరణిపైఁ బడియున్నవాఁ డేను ♦ గడిఁదిచాప

తే మందు లీలఁగ బాణమ్ము ♦ నలవరించి
లాగి యవలీల నేయఁ గ♦లంబతాడి
తుఁడయి మృగరూప మొయ్యన ♦ విడిచి వాఁడు
దనుజుఁడయ్యెను కేయూర♦ధారియగుచు. ౨౬ 1617

క. శర మంగమ్మున నాటఁగఁ, బరమార్తిని నాదుగళర♦వముఁ గైకొని ని
ర్జరవైరి దూరసంశ్రవ, మరయం బరుషమును నైన ♦ యార్తధ్వనితోన్.

ఆ. అఱచినాఁడు దాని ♦ నాలించి వెతఁగుంది
దానితత్త్వ మరయఁ ♦ దలఁప కొంటి
సీతవిడిచి నన్నుఁ ♦ బ్రీతి గావఁగ నిట
[1]వచ్చినాఁడ వేమి ♦ పల్కువాఁడ. ౨౭ 1619

ఏఁబదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౬౦ - వ సర్గము.

పర్ణశాలయందు సీతం గానక రాముఁడు దుఃఖించుట.

సీ. అట్లు రాముఁడు తన♦యాశ్రమసీమకు వచ్చుచుండంగఁ ద♦ద్వామనయన
మునఁ గ్రిందిఱెప్పయుఁ♦గనెఁ జంచలత్వమ్మునదకయునటఁదొట్రు♦పడియెఁగంప
ముదయించె; నామహా♦త్ముఁడుపలుమాఱులు దుర్నిమిత్తములిట్లు♦తోఁపఁగాంచి
సీత యాశ్రమమున♦క్షేమమ్ముగా నుండునా యని తలఁచె ని♦ట్లా యనుంగుఁ

తే. బత్నిఁ జూడఁగవలెనని ♦ త్వరపడుచునె
జవమునం బోయి శూన్యవా♦సంబుఁ గాంచి
యాతఁ డుద్విగ్నమానసుం ♦ డయ్యెనంత
నెగురుచున్నట్లు నంగంబు♦లెల్లఁ ద్రిప్పి 3 1620

క. అందందు మున్ను జనకుని, నందన యున్నట్టిచోట్లు ♦ నైజభ్రాంతిం
గుందుచుఁ గలయంజూచెను, నెందును దనవనితలేమి ♦ కెంతయు నార్తిన్ .౪

తే. వగచె నప్పుడు రాముని♦వసతి మంచు, కాఱున న్ సిరిమాలిన ♦ కమలవనము
పోల్కిఁ గనుపట్టె; నందలి♦భూరుహాముల, యందుహీనస్వరంబుల♦నళిగణంబు.

---

1 ఏమిపల్కువాఁడ=ఇది మీఁదియభిప్రాయమును బోషించును గాన నెక్కువఁగాఁ జేర్పఁబడినదని తెలియవలయు.

క. ధ్వనిచేయుచుండ నేఁడ్చెడు, ననుటకుఁ దగినట్టులుండె ♦ నందలివృక్షా
ళిని బూవులు మ్లానత్వము, గనియెన్ మృగపక్షులెల్లఁ ♦ గాఱియ నొందెన్.
క. సిరి దూలి పెంపు విడి యే,వరుసను దగనట్టులుండు ♦ వాసముఁ గనియెన్
నిరతము వసించు వననిర్జరులెల్లం బాఱిపోవఁ ♦ బాడుగనుండెన్. ౬ 1624

[1]సీ. జానకి యతిరూప♦దానవుకొఱకుఁగాఁ దెచ్చి వైచుటచేత ♦ నచ్చటచట
దర్భలు నజినంబు♦ధరణిపైఁ బడియుండెదనుజుఁడామెను బట్టు♦కొనుతఱిఁబెనఁ
గొనుచు మున్యాసనం♦బును జాపనుం బట్టుకొనుటచే నల్లడ♦లను నవిపడి
యుండె; నిట్టులుదోఁచు♦చున్నతౄణోట్యటజంబును గాంచి విలపించె♦భూరిశోక
తే తప్తుఁడై సీత భీరువు ♦ దనుజగణము
వలన దొంగిలికొనిపోవఁ ♦ బడెనొ మృతిని
గాంచెనో లేక తానుగాఁ ♦ గానరాక
యున్నదో తినఁబడినదో ♦ యుగ్రభంగి. ౭ 1625

తే. అట్లు లేక వేడుకకుఁగా ♦ నతివ తానె
మఱుఁగి యున్నదొ భయపడి ♦ మాన్యచరిత
గూఢముగ వనికేతానె ♦ కోర్కెఁ జనెనొ
యెఱుఁగఁజాలక యున్నాఁడ ♦ నిపుడు నేను. ౮ 1626

చ. సుమములఁ గోయఁబోయెనొకొ ♦ శుభ్రఫలంబులఁ దేఁగఁబోయెనో
కమలనికాయపూర్ణమయి ♦ క్రాలు సరస్సున స్నానమాడఁగా
మమతచెలంగఁ బోయెనొకొ ♦ మానిని నీళ్లకు నేటికేగెనో
రమణ నటంచు నేడ్చె రఘు♦రాముఁడు తాపము వెల్లిముంపఁగన్. ౯ 1627

చ. వనమున నెంతకష్టపడి ♦ వారిజనేత్రను గాంచఁబోయినన్
గనఁబడదయ్యె; శోకమునఁ ♦ గన్నులు రెండును నెఱ్ఱఁబాఱ న
య్యనఘుఁడు వెఱ్ఱివానివలె ♦ నాన్యథచేఁ గననయ్యె నయ్యెడన్
జనిచని యాశ్రమస్థలుల ♦ సర్వవిధంబులఁ గాంచి యార్తుఁడై. ౧౦ 1628

[2]సీ. ఒకచెట్టునుండి వే♦ఱొకభూరుహమునకు నొకకొండనుండి వే♦ఱొక్కగిరికి
నొకనదినుండి వే♦ఱొకద్వీపవతికిని బఱుగెత్తుచున్ వెతఁ♦బడుచు నేడ్చు
చును శోకపంకోగ్ర♦ఘనసాగరమ్మున మునిఁగె నొక్కొకవృక్ష♦ముకడ కరిగి
యోకదంబమ! నాప్రి♦యాంగన సీతనాఁబరఁగు నొక్కర్తుక ♦ వనమునందుఁ
తే. గంటివా భూమితనయకుఁ ♦ గడిమి పూవు
లందు నత్యధికప్రీతి ♦ యలరుఁ గాన

1 విప్రకీర్ణాజినకుశమ్......భవిష్యతి-అనిమూలము. దీనివ్యాఖ్యానాభిప్రాయ మిసీసపద్యమునఁ జెప్పఁబడినది 2 శోకరక్తేక్షణ శ్శోకాత్ - అనుశ్లోకమునకు మహేశ్వరతీర్థులయభిప్రాయమిట సంక్షిప్తమని యెఱుంగఁదగు.

వచ్చియుండును నీచెంత ♦ కిచ్చ దనరఁ
గనుఁగొనియొ యుండవచ్చు న♦కాంత నీవు. ౧౧ 1629

క. జనకసుతఁ ద్ఛుభ్రాననఁ, గనియుండిన నెఱుఁగఁ జెపుము ♦ కాంతకిసలయా
భనిజాంగిని గౌశేయంబును గట్టినదాని బిల్వ♦భూజమ! కనవా. ౧౨ 1630

తే. నీఫలంబులఁబోలిన ♦ నెఱికుచముల
వఱలు సీతను గనియున్నఁ ♦ బలుకుమెచట
నున్నదో; మద్విపృక్షమా! ♦ సన్నుతా[illegible]రి
తయగు భూజాత నీపై ము♦దంబు [illegible]ది. ౧౩ 1631

సీ. కాన నీచెంత కా♦కామినివచ్చియె యుండును గనుక నీ♦వుగ్రశోనయు
వార్తను జెప్పుమా ♦ భయశీలురాఁగు జనకకుమారి యి♦చ్ఛ్వాసమునందు
జీవించియున్నదా ♦ జీవములంబాసిపోయెనా కకుభాఖ్య♦భూరుహామిది
పల్లవకుసుమసం♦భరితమై యలరెడుఁ దనవంటి యూరువుల్ ♦ తనరవెలయు

తే. సీతవృత్తాంతముం దెలి♦సికొనియుండ,వచ్చు; నీతిలకాహ్వయ♦పాదపంబు
భ్రమరగీతంబులను జాలఁ♦బరిఢవిల్లుచున్నయది వృక్షరాజమై♦యొప్పునిదియె.

క. తిలకప్రియయా నాసతి, తిలకంబిది యానుగానఁ ♦ దెలిసియె యుండం
గలదీ వృక్షమునకు నా,లలనావృత్తాంత మిమ్ము♦లఁ జెప్పఁదగుఁ. ౧౬ 1633

సీ. ఓయశోకమ, శోక ♦ మేయెడలం గల్గకుండంగఁ జేయుదు ♦ వుర్వినీవు
కాన శోకాగ్నిని ♦ గ్రాఁగెడు మదిగలనన్నుఁ బ్రియాదర్శ♦నమున దుఃఖ
హీనుఁగాఁ జేయుమా ♦ యిప్పుడే; యోతాళవృక్షమా పరిపక్వ♦విమలతాళ
ఫలకుచయుగు నాదు♦లలన నీవెండైనఁ గనియున్నచో నీకుఁ ♦ గరుణయించు

తే. కైన నాయందుఁ గల్గిన ♦ నానితంబ
సుందరి నివాసమును నాకుఁ ♦ జూపుమా త
గంగ; నోజంబువృక్షమా ♦ కాంత జంబు
ఫలములంబోలు మేనునఁ ♦ బరిఢవిల్లు. ౧౮ 1634

క. కావున నీచిహ్నంబున, నావెలఁదిని జూచియున్న ♦ నఱమఱ లేకే
నీవిపుడు నాకుఁ దెల్పుము, యేవిధమున నీవనమున ♦ నెందున్నదియో. ౧౯

సీ. ఓకర్ణికారమా! ♦ యొప్పైనపూవుల నయ్యారె! సొగసుగ ♦ నలరుచున్న
దానవు సాధ్వియా ♦ తరుణి నాప్రేయసి నీపుష్పముల పైని ♦ నెమ్మిగలది
గాన నీచెంతకుఁ ♦ గడువేడ్క వచ్చియె యుండును నీవాత♦లోదరిఁ గని
యుండినఁ జెప్పుమా ♦ యొకమాఱు నాకని ప్రతివృక్షమున కేగి ♦ పడఁతినడిగె

తే. నామహాయశుఁ డీరీతి ♦ నామ్రనీప
ములు మహాసాలములఁ బన♦సలఁ గురవక
ఖదిరదాడిమానసనము♦ఖములకడకు
నరిగి యడుగుచు నడుగుచు ♦ నాతురమున. ౨౧ 1636

తే. మల్లికా కేతకీగుల్మ♦మాధవీసు
చంపకంబుల కడ కేగి ♦ జానకీవి
ధమును వేడుచుఁ జిత్తవి♦భ్రమముగల్గు
వానివలె సంచరించుచుఁ ♦ గానఁబడియె. ౨౨ 1637

క. వని రాముఁడు మరలన్ మృగ,మును గని హరిణంబ! వృక్ష♦ములివి పలుకవే
మని యడిగినను హరిణన,యనను న్నాపత్ని నీవ♦నాంతరసీమన్. ౨౨౹ 1638

క. కనియుందువు మృగనేత్రయె, గనుక న్నాభార్య హరిణ♦గణములతో నుం
డును దానివార్తఁ దెల్పుము, వనగజరాజంబ నాదు♦భార్యను గనవా. ౨౩

క. కరికరతుల్యోరువు నా, తరుణీమణి చిహ్నమిద్ది ♦ తగు నీవెఱుఁగన్
గరుణం జెప్పుము చూచినఁ, దరక్షువా! నీకుఁ దెలియఁ♦దగు నాసతియున్.

చ. సురుచిరచంద్రబింబముఖ♦శోభిత నాప్రియురాలు తద్విధం
బరయఁదలంచి నేనడుగ ♦ నంగనచందము నీమృగాళి దు
ర్భరభయమంది చెప్ప దిఁక ♦ రాజమృగంబవు నీవు భీతి యే
సరణిని లేదు నీకు గురు♦శౌర్యయుతుండవుగానఁ జెప్పుమా. ౨౪ 1641

తే. ప్రేయసీ! యేలపరుగిడ ♦ విమలపద్మ
నయన! దూరమునం జూచి♦నాఁడ నిన్నుఁ
జెట్లచాటునఁ గన్పడ ♦ కిట్లు నిలిచి
యేల నాతోడ మాటాడ♦వే సుగాత్రి!. ౨౫ 1642

క. నిలునిలుము వరారోహా!, గలుగదు నాపైని నీకుఁ ♦ గరుణ యిపుడు న
వ్వులమాట లాడుదానవు, చెలియా యిపు డిట్లుపేక్ష♦చేత నను నిటన్. ౨౬

తే. ఏలయాడించుచున్నావు? ♦ బాల! నీవు
వేగ పరుగిడుచున్న నీ♦పీతవర్ణ
మైన కౌశేయవస్త్రమి♦వనుచుఁ దెలిపెఁ
గాన నినుఁగంటి మోదంబుఁ ♦ గంటి నుంత. ౨౭౹ 1644

క. నాయందు సౌహృదము నీ, కోయింతీ! కల్గునేని ♦ యుండుమ యచ్చోఁ;
బాయక చారుస్మితయా, నాయనుఁగుంబత్ని యీవ♦నంబున లేదే. 1645

తే. నిశ్చయం బిది యెవ్వరో ♦ నెలఁతఁ జంపి
యుందు రటు లేక యీవని ♦ నుండునేని
గష్టములఁ గుంది నేనుండఁ ♦ గానరాక
న న్నుపేక్షించియుండునా ♦ యన్నుమిన్న. ౨౯ 1646

క. నే నింటలేని యప్పుడు, దానవులే మాంసమందు ♦ దమిఁ గల్గినవా
రై నెలఁత యవయవమ్ములఁ, బూనిక విభజించి తినిరి♦పో యిది నిజమా. ౩౦

క. సురుచిరదంతోష్ఠంబై, యురుదగు కుండలములొప్ప ♦ నలనాసిక య

చ్చెరువుగ వెలయఁగ రాకా,సరసిజరిపుభంగిఁ దనరు ♦ సతిమోమచటన్.

క. దనుజులు మ్రింగఁగఁ దేజం,బును బాసి యడంగియుండుఁ♦బో; చంపకపు
ష్పనిభచ్ఛాయ వెలుంగన్, ఘనకంఠాభరణవితతి ♦ గ్రాలుచు నుండన్. ౩౧

సీ. సుకుమారమై మఱి ♦ శుభలక్షణంబయి తగు సీతకంఠంబు ♦ తరుణి యెద్ది
చుండఁగాఁ గ్రవ్యాదు♦లొగిఁదినియుందురు; దనుజులుభక్షింతు♦రనుభయమున
విక్షిప్యమాణమై ♦ వేపమానాగ్రమై పల్లవకోమల♦త్వము చెలంగఁ
గంకణాంగదములఁ♦గ్రాలుచు నలరారు పొలతి బాహుద్వయం♦బునుదనుజులు
తే. తినియె యుందురు; రక్కసుల్ ♦ తినుటకొఱకె
బాల నొంటిగ విడిచి నే ♦ వనికి నేగి
నట్టులయ్యెనె యక్కటా ♦ సార్థవాహు
లొంటి విడువఁగ బహుబంధు♦యుక్తయయ్యె. ౩౩ 1650

క. ఏకాకియైన యొకసతి, భీకరమృగభక్షిత యగు ♦ విధమున వనిలో
నాకాంత దనుజభక్షిత, యై కూలెన్ లేకయున్న ♦ నగపడదొక్కో. ౩౪

క. అనుజాత! మహాబాహూ!, జనకజ నెందైనఁ జూడఁ♦జాలితివా భూ
తనయా! కల్యాణీ! యే,వనికిం బోయితివె యకట! ♦ పలుకవె నాతోన్. ౩౫

చ. అని పలుమాఱు పల్కుచు ని♦జాంగనఁ బేర్కొని యెద్చుచున్ జవం
బున నొకకాననుండి వగఁ ♦ బూని మఱొక్కవనంబుఁ జేరఁగాఁ
జనుచును దానుఁ జూచినది ♦ సాధ్వియె యంచు భ్రమించుచున్ వనం
బున నొకచోట భూతనయ♦పోలిక నున్న లతాదులన్ దగన్. ౩౬ 1653

క. కని యాగుఱుతుల బలిమిని, జనకజ యని భ్రమయుచున్ ని♦జప్రియవెదకం
జనుచు మఱొక్కవనస్థల,మున నత్తునిరీతి భ్రాంతి ♦ మునిఁగియె యుండెన్.

సీ. అస్వస్థుఁడై రాముఁ ♦ డట వనంబుల నదులను నిర్ఝరముల శై♦లముల భూరి
కాననములఁ దవ్వరఁ ♦ గనుచును దిరుగును నట విపులంబగు ♦ నతిభయంక
రారణ్యమును బొంది ♦ యందెల్లతావులఁ బలుమాఱు తిరుగుచు♦భార్యఁగాన
కడలుచు నింక నా♦పడఁతి గన్పడునను నాశయే తోఁపమి ♦ నార్తిఁ గుంది
తే. మరలఁ బ్రియురాలి వెదుకఁ శ్ర♦మమ్ముఁ గొనుచుఁ
దమ్మునిం గూడి యిట్టట్టు ♦ తరుణిజాడఁ
గనుఁగొనంబూనె మదినెంతొ ♦ కలఁతనూని
తమ్మునిం జూచి యడుగుచుఁ ♦ దత్తఱమున. ౩౭ 1655

అఱువదియవ సర్గము సంపూర్ణము.

## ౬౧ - వ సర్గము.

~ రాముఁడు విలపింప లక్ష్మణుఁ డోదార్చుట. ~

ఉ. జానకి లేమిఁ బాడువడి ♦ సర్వవిధంబుల శూన్యమైన య
శ్కానసమందిరంబుఁ గని ♦ క్ష్మాపతిపుత్త్రుఁడు సాసనంబులం
గానక యుందు నందుఁ బడి ♦ కాంతిఁ దొలంగియె యప్పుడుండ న
వ్వానినిఁ గాంచి యెచ్చటను ♦ భార్యను గానక దుఃఖితాత్ముఁడై. ౧॥ 1656

తే. కంఠమెత్తి సీతా! యని ♦ కడురవంబు
గలుగ నఱచుచు నార్తిని ♦ [1]గరములెత్తి
పిసికికొనుచును లక్ష్మణా! ♦ వెలఁది యెందు
నున్న దిటనుండి యెచటికి ♦ నువిద యేగె. ౨॥ 1657

ఆ. ఎవ్వఁ డపహరించె? ♦ నెవ్వఁడు భక్షించెఁ?, జెప్పవయ్య! యిపుడు ♦ సీత! నీవు
తరువుమఱుఁగునందు ♦ దాఁగి నన్నెఱుఁగంగఁ, జాలవైతి వనుచు♦లీలఁబలుక.

క. తలపోయుదువో మది న,వ్వ్వలాట లికఁ జాలుఁజాలుఁ ♦ బొగిలెద నార్తిన్
లలనా యిచటికి రమ్మా, పొలఁతీ! సౌమ్యస్వభావ ♦ పూజ్యా! యిచటన్. ౪

క. చిరకాలము లాలించుట, కరమనురాగమున జంకు♦గనకయె నీయా
దరమునకుం బాత్రములగు, హరిణశిశువు లిప్డు నిన్ను ♦ నాశ్రమమందున్. ౫

క. కనుఁగొన కెంతయు నార్తిన్, గనుదమ్ములనుండి నీరు ♦ గాఱఁగ నిన్నే
మనమునఁ దలంచుచున్నవి;, యనుజా! బ్రదుకంగఁజాల ♦ నంగన లేమిన్. ౬॥

ఆ. జనకజాపహరణ♦జనితమహాదుఃఖ,మున నె నేనుఁ జావ ♦ నను సురపురి
తండ్రి దశరథుండు ♦ ధరణీశ్వరుఁడు చూడఁ, గలఁడు నిశ్చయమిది♦పలుకు లేల.

సీ. నేనాజ్ఞ చేయఁగా ♦ నానతిచొప్పునఁ బదునాల్గువర్షముల్ ♦ వని వసింతు
నని శపథము పల్కి ♦యాకాలమెల్లను బూర్తియౌటకు మును♦ముందె యిచటి
కెట్లువచ్చితివి నీ ♦ విచ్చఁ జరించెడువాఁడ వసత్యంబు ♦ పలుకువాఁడ
వార్యుండవే కా వ♦నార్యుండవే యౌదు వని నన్ను బరలోక♦మునను దండ్రి

తే. కాంచి చీచీ యటంచు ని♦క్కముగ నింద
చేయునే లక్ష్మణా! యేమి♦సేయువాఁడ;
[2]సుందరనితంబమధ్యమ♦శోభితాంగి
జనకజా! యీవనంబున ♦ వనరు నన్ను. ౮ 1663

క. పరవశునిన్ దుఃఖార్తుని, బరిభగ్నమనోరథున్ వి♦భంగమతిని న
న్నరయక దీనునిఁ గపటా, చరణుని సిరి విడుచునట్లు ♦ సాధ్వి వీవున్. ౧౦

---

1 ప్రగృహ్య రుచిరౌ భుజౌ-అనిమూలము. భుజప్రహాణం శోకకృతవికారవిశేషః-అని వ్యాఖ్య. 2 క్వ గచ్ఛసి వరారోహే మాముత్సృజ్య సుమధ్యమే-అనిమూలము.

తే. ఎచటి కే పోవుచున్నా వ♦హీనదుఃఖ
మునను గుండెడు ననుడించి ♦ చనఁగవలదు;
నిన్ను విడిచి నిమేషమే♦ని మనఁజాలఁ
బ్రాణములఁ బాయువాఁడనో ♦ పద్మనయన. ౧౪ 1665

క. అని విలపించుచు సీతం, గనఁగాఁ ద్వరపడుచు మిగులఁ♦గందుచు దుఃఖం
బున నేడ్చుచు నుండియు సీ,తను గానం డయ్యె నట న♦తం డచ్చోటన్. ౧౫

క. గురుపంకనిమగ్నంబగు, కరివలె జానకిని గాన♦క యె; దుఃఖసరి
ద్వరమున మునుంగు శ్రీరఘు, వరుఁగని లక్ష్మణుఁడు తాను♦వ్యథలంబడియున్.

చ. అతని హితంబె కోరుచు మ♦హామతి దీర్ఘభుజా! నితాంతమున్
వెతలఁ గనంగ నేల? యిఁక ♦ విక్రమ మొప్పఁగ నన్నుఁగూడి యా
క్షితిసుతఁ గాంచుయత్నమును ♦ జేయుము కానన మిద్దియున్ గుహా
ప్రతిమలతాగృహంబులను ♦ భాసిలుఁ గావున నెందునుండనో. ౧౮ 1668

మ. వనసంచారము చేయుప్రీతి యలరన్ ♦ వాఃపూర కేళీతతుల్
దనరన్ జానకియుండుఁగాన వనికిం ♦ దాఁబోయియో లేక చ
క్కనిపుష్పంబుల నొప్పు పద్మవనముం ♦ గానంగనో పోయియుం
డును; లేకున్నను స్నానకృత్యమునకై ♦ నూత్నోచ్చయమం బొప్పఁగన్. ౧౯

తే. మీనవంజుళ సేవితం ♦ బైననదికిఁ
బోయియుండును వనమున ♦ నేయెడలనొ
నవ్వులాటకుఁగా భూత♦నయ క్షణంబు
డాఁగియుండును గానఁ గ♦డంగి మనము. ౧౬ 1670

క. వెదకుదమో పురుషవరా, సుదతి మనల భీతిచేత ♦ స్రుక్కింపఁగఁ గో
ర్కి దగంగనొ మనశక్తిన్, మది నెఱుఁగఁగఁదలఁచియో వి♦మనుజస్థలిలోన్.

క. వని నొకట దాఁగియుండును, గనుకన్ శ్రీమంతుఁడా! ని♦కామము ధాత్రీ
తనయన్ వెదుకఁ బ్రయత్నం, బును జేయుద మింకశీఘ్ర♦మునఁగడువూన్కిన్.

సీ. నీకిష్టముండిన ♦ నీకాననంబెల్ల జానకియుండెడు ♦ స్థలము నెఱుఁగ
వెదకుదమో రామ!♦మది దుఃఖమూనకు; మనుచు స్నేహంబున♦ననుజుఁడాడ
విని యుక్తమే యిది ♦ యని మదినెంచుచు లక్ష్మణుతోఁగూడి ♦ లలన వెదుకఁ
బూనె; నద్దశరథ♦సూను లిద్దఱు నంత వననదీగిరిసరో♦వరములందు

తే. నెల్లతావుల వెదకుచు ♦ నుల్లమడల
నందుఁ గల ప్రస్రవణగిరి ♦ నలరు సాను
వులను గుహలను శిఖరావ♦ళులను వెదకి
సీతఁగానక దుఃఖంబుఁ ♦ జెంది రవల. ౨౧ 1673

చ. గిరివరమందు నందు బరి♦కించి తలోదరి గానరామికిన్
బరిపరిఁ బొక్కి రాఘవుఁడు ♦ పల్కెను లక్ష్మణుఁ గాంచి తమ్ముఁడా

[1]ధరవరమందు నెల్లెడలఁ ♦ దాల్మినిఁ జూచితిఁగాని యాశుభాం
గి! రమణి గానరా దొకటఁ ♦ గీడు పొసంగియెయుండు సీతకున్. ౨౫౹ 1674

చ. అనవిని దండకాటవిని ♦ నంతటనుం బరికించుచుర్ మనం
బునఁ గడు దుఃఖమొంది రఘు♦పుంగవు నన్నను దీప్తతేజనుం
గని యిటుపల్కె లక్ష్మణుఁడు; ♦ కాంచనచేలుఁడు పూర్వ మాబలిన్
దనుజునిఁ గట్టి యీధరణిఁ ♦ దాఁ గొనినట్టుల నీవు జానకిన్
గొని చనినట్టివాని ననిఁ♦గూల్చి సతిం గొనఁజాలు దెంతయున్ ౨౬౹ 1675

తే. ఓమహాప్రాజ్ఞ! నిక్కమై ♦ యొప్పునిదియు
ననుచు సౌహార్దమొప్పంగ ♦ ననుజుఁ డనిన
వినియు దుఃఖాభిహతచిత్త♦మున నతండు
పలికె దైన్యముతోఁప ని♦ట్టులని యపుడు. ౨౭౹ 1676

సీ. వనినిందుఁబూచిన ♦ వారిజములు గలసరసుల; బహుళకం♦దరము లొప్పు
నిర్ఝరంబులు దగ ♦ నెఱినొప్పు నీగిరినంతట వెదకితి ♦ మింతినాదు
ప్రాణాధికను జూడ♦వచ్చునన్నట్టి యాశనుగాని గానరా ♦ దనుజ నాకు
ననుచు రాముండు సీ♦తాపహరణదుఃఖకర్శితుఁడై యేడ్చి ♦ కడువగలను

తే. గలఁగుటన్ మూర్ఛ మునిఁగెను ♦ క్షణము; తాప
మంది యంగాళి కృశియింప ♦ డెందమందు
సంజ్ఞ నశియింపఁ జేష్టలు ♦ చాలఁ దూల
నాతురుండయి దుఃఖార్తుఁ♦డై యతండు. ౨౮౹ 1677

తే. వేఁడినిట్టూర్పులను బుచ్చి ♦ విహ్వలమతి
యగుచుఁ జదికిలఁబడియెఁ బ♦ద్మాయతాక్షుఁ
డైన రాఘవుఁ డూర్పుల ♦ నట్లు పుచ్చి
బాష్పగద్గదుఁడై దుఃఖ♦పరవశుఁ డయి. ౨౯౹ 1678

క. అయ్యో! ప్రియురాలా! యని, నెయ్యమ్మునఁ బలికి యేడ్చె; ♦ నిర్మలమతివై
[2]యెయ్యెడలబంధుహితమునె,యొయ్యనఁవలఁచుచునుబుద్ధి♦యొప్పవెలయఁగన్.

తే. ధర్మవేత్తయునగు సుమి♦త్రాసుతుండు
ప్రశ్రితాంజలియయి బహు♦భంగులన్ వి
నయము పొలుపొందుచుండ న♦న్నను హితోక్తు
లను దగంబల్కి యూఱడి♦ల్లఁగను జేసె. ౩౧ 1680

క. [3]అనుజుఁడు చెప్పిన యాసాం,త్వనవచనము లట్టె త్రోసి ♦ భార్యను జూడం
గను లేమికి మరలన్ మర,లను రోదన మొకటఁ జేసె♦లక్ష్మణుఁ గనుచున్. ౩౨

అఱువదియొకటవ సర్గము సంపూర్ణము.

---

1 ధరవరమందు=పర్వతశ్రేష్ఠమునందు. 2 లక్ష్మణః ప్రియబాంధవః-అనిమా. 3 అనాదృత్య తు తద్వాక్యమ్ లక్ష్మణోష్ఠపుటాచ్యుతమ్-అనిమా.

## ౬౨ - వ సర్గము.

రాముఁడు సీతనుగూర్చి మరల విలపించుట.

చ. జనకజ గాన కవ్విరహ♦సంతతతాపవిత ప్తచిత్తుఁడై
[1]వనరుహలోచనుండు గురు♦బాహుఁడు ధర్మవిదు త్తముండు స
జ్జనపరిరక్షకుండు రఘు♦స త్తముఁ డెంతయు నా ర్తి నేడ్చె; న
వ్వనితను జూడకున్న స్మర♦బాణవశంగతుఁ డౌట నెంతయున్. ౧ 1682

క. దారను గనుచున్నట్లే, భూరివిలాపాశ్రయమునఁ ♦ బొందూనక గం
భీరతఁ బాసిన వాక్కుల, శ్రీరాముం డిట్లు పల్కె; ♦ ప్రేయసి! సీతా! ౨ 1683

సీ. [2]పూవులపైఁ బ్రేమఁ ♦ బూనియుందువు నీవు పుష్పితాశోకాఖ్య♦భూజశాఖ
లను నీదు మృదుదేహ♦మును నాకు దుఃఖమ్ము వృద్ధిచేయుచు నేల♦యిట్లు గప్పు
కొనుచున్నదానవు; ♦ కనినాఁడ నినుఁ గదా యాచ్ఛాదనంబేల? ♦ యువనిపుత్రి!
కదళీకాకాండసం♦కాశోరువులు నీకుఁ గలవు వానిని నీవు ♦ కదళికాంత

తే. రమున దాఁచిన నవిరెండు ♦ రమణి! నాకుఁ
గనఁబడుచునున్నవే; చక్కఁ♦గా మఱుంగుఁ
జేసికొన నేర; విదె పరి♦హాసమునకుఁ
గర్ణికారవనంబునఁ ♦ గడఁగి నీవు. ౩ 1684

క. చరియించుచున్నదానవు, తరుణీ! పరిహాసమిద్ది ♦ తగ బాధను నా
కు రయంబునఁ గల్గించెదుఁ, బరిహాసం బేల? చాలుఁ ♦ బద్మాక్షీ యిఁకన్. ౪

క. ధరణిసుతా! ప్రాణప్రియ, వరయఁగ నాకీవుగాదె ♦ యట్లౌట నిఁకం
బరిహాసమేల చేసెదు, తరుణీ! శ్రమమొందినాఁడఁ ♦ ద్వద్విరహమునన్. ౫

తే. అట్టి నాకిట్టి పరిహాస ♦ మంతయింపు
గాఁ జెలంగక యున్న ది♦క్కాలమందు
సీత! పరిహాస మిది విశే♦షించి యాశ్ర
మములయం దప్రశ స్తమౌ ♦ మదిఁ దలంప. ౬ 1687

క. పరిహాసప్రియశీలవు, తరుణీ! నీవౌట నిపుడు ♦ తగ నెఱిఁగితిఁ జూ
నురుచిరవిశాలనయనా, పరికింపఁగఁ బర్ణశాల ♦ త్వద్విరహమునన్. ౭ 1688

సీ శూన్యమైయున్నది♦చ్చోటికి నిఁకరమ్ము; దనుజులు లక్ష్మణా! ♦ ధరణిపుత్రి
భక్షించియుందు ర♦పహరించుకొనిపోయి యైననుందురు నిశ్చ♦యంబె యిద్ది
కాకున్న నేనెంత♦గా విలపించిన సీత రాక యుపేక్షఁ ♦ జెందియున్న
దే యిట్టులుండునా; ♦యీమృగయూధముల్ కన్నీరువిడుచుచుం♦గలఁతనొంది

1 ఈపద్యమందుఁ జేర్కొనినవిశేషణములన్నియు మూలానుసారములే యని యెఱుంగఁదగు.

2 ఈపద్యమందలి భావములన్నియు గోవిందరాజుల యభిప్రాయానుసరణములే యని తెలియవలయు.

తే. యుండుటం జూడ జానకి ♦ నుగ్రదనుజు
లెవరొ భక్షించిరని తోఁచె ♦ నిట్లె యయ్యె
ననుచు నివి చెప్పుచున్నట్లు ♦ లగపడియెడి;
యక్కటా! ప్రేయసీ! సాధ్వి! ♦ యువనితనయ. ౧౦ 1689

క. వరవర్ణిని పూజ్యమతీ, యరణ్యమున నీవు నాశ♦మందుటచే నా
[1]పురమునఁ గైకేయియు సత్వరముగ నానేసకామ♦ధన్యమతియునౌ. ౧౦½

చ. జనకజఁ గూడివచ్చి యిట ♦ జానకి పోవఁగ నొంటిగాఁ బురం
బునకును బోయి శూన్యము ♦ పొంకమువాసిన సౌధమెట్లు చూ
త్తును; నను వీర్యహీనుఁడని ♦ దుష్టుఁడటంచు దయావిహీనుఁడం
చును జను లాడువారుగద; ♦ క్షోణితనూజ తొలంగిపోవఁగన్. ౧౨ 1691

తే. బ్రదికియుండఁగనోప నా♦భార్యఁ బాసి
కాన నాకాతరత్వము ♦ కడుఁ బ్రకాశ
మయ్యెఁగాదే యరణ్యంబు♦నందు నుండు
పనిని నెఱవేర్చి నేఁ బుర♦మునకుఁ బోవ. ౧౨½ 1692

క. జనకుఁడు మిథిలేశుఁడు వే, చనుదెంచి ననుం గుశల మడుగుతఱిన్
గనువాఁడ నెట్లు తన్ముఖ, మును జనకుఁడు తనదు కూర్మి♦పుత్త్రిక సీతన్. ౧౩½

క. కనుఁగొనక సీత లేకయె, చనుదెంచిన నన్నుఁ జూచి ♦ స్వదుహితపై నె
య్యను స్నేహంబున మూర్ఛన్, మునుఁగుఁగదా దుఃఖపూర♦మున మున్నుటచేన్.

తే. నిశ్చయంబిది భరతుండు ♦ నెమ్మినేల, భవ్యరీతిగ నొప్పిన ♦ పత్తనమున
కేను బోనోప సీతయె ♦ లేనియెడల, స్వర్గమున్ శూన్యమేయగుఁ♦ బల్కులేల.

చ వని నను లక్ష్మణా! విడిచి ♦ భవ్యతమంబగు నయ్యయోధ్యకున్
జనుము మహీజఁ బాసి మనఁ♦జాల నదెవ్విధినైన; నీవు ప
త్తనమున కేగి యుబ్భరతుఁ ♦ దత్పరతం బిగియారఁ గౌఁగిటం
గొని మదుదీరితంబనుచుఁ ♦ గోరికఁ బల్కుమ తప్పకుండఁగన్. ౧౬ 1696

క. అనుమతి నిచ్చెన్ రాముం, డనఘా! పాలింపు మింక ♦ నవనిం దమితో
నని చెప్పి నాయనుజ్ఞన్, జనసులకున్ వందనములు♦నలుపు ముగురకున్. ౧౭½

ఆ. చెప్పినట్లు నీవు ♦ చేయువాఁడవు కాన, సత్ప్రయత్నమునను ♦ జనని నెమ్మిఁ
గాచుచుండవలయుఁ ♦ గడుశత్రుకర్శనా, సీతయిట్లు వని న♦శించు టెల్ల. ౧౮½

క. జననికిఁ గౌసల్యకు నీ, వనుమానము లేక చెప్ప♦వగు నని యేడ్చెన్;
[2]వనజాక్షి సుకేశిని సీతను గానక వనిని వెదకి ♦ దైన్యముతోఁ బన్. ౨౦½

క. ఘనుఁడగు రాముం డేడ్వం, గని లక్ష్మణుఁ డంత భీతిఁ ♦ గని మోము కలం
కను బొంద నాతురుండై, [3]మనమున వ్యథమిగులుచుండ♦ మ్రాన్పడియుండెన్.

అఱువది రెండవ సర్గము సంపూర్ణము.

1 హాసకామా త్వయా దేవీ కైకేయీ సా భవిష్యతి-అని మూ. 2 తథా వినా సుకేశ్యా-అని మూ. 3 భృశ మాతురో బభూవ-అనిమూ.

## ౬౩ - వ సర్గము.

—రాముఁడు మరల విలపించుట.—

*చ. నరపతిపుత్త్రుఁ డాతఁడు మ♦నంబునఁ బ్రేయసినిం దలంపఁగాఁ
బరఁగెడు మోహముల్ జనకు♦పట్టిని బాయుటచేతఁ గల్గుదు
స్తరమగు దుఃఖముల్ దనను ♦ జాలఁగ బాధయొనర్చుచుండ సో
దరునకు ఖేదముల్ మది ని♦తాంతముఁ బుట్టఁగఁ జేయుచుల్ వనిన్. ౧ 1701

ఆ. ఆర్తరూపుఁడగుచు ♦ నత్యంతఖేదమ్ము, మరలఁబొందె శోక ♦ మురుతరముగ
నంది స్రుక్కుచున్న ♦ యాలక్ష్మణునిఁ జూచి, దారశోక మధిక♦తరముగాఁగ.

సీ. రాముఁ డాశోకపా♦రావారమున మున్గి వ్యసనానురూపమౌ ♦ పలుకులొప్ప
వేఁడినిట్టూర్పులు ♦ విడుచుచు నేడ్చుచు దుఃఖవాక్యంబుల♦తో సహోద
రునిఁ గని యిటుపల్కె; ♦ వినవయ్య లక్ష్మణా! పాపకృత్యములు నా♦వలెనొనర్చి
నట్టివాఁ డింకొకఁ ♦ డవనిలో నేఁదప్ప నుండఁడంచుఁ దలంచు♦చున్నవాఁడ
తే. వరుసశోకంబు వెంటనే ♦ వచ్చి శోక
మస్మదీయహృదంతర ♦ మల్లె మనసుఁ
గడఁగి భేదించుచున్నది ♦ కదలకుండఁ
బాదుకొనుచున్నదేమని ♦ పలుకువాఁడ. ౩ 1703

క. తొలిజన్మంబున నేఁ గా, వలయు ననుచుఁ గోరికోరి ♦ పాపపుఁగార్యం
బులు పెక్కు చేసినాఁడను, దొలఁగక దుఃఖములవెంట ♦ దుఃఖము లిచటన్.

క. కనఁబడుచున్నవి నిజమిది, యనుజా! తత్పాపఫలమె ♦ యగు నిప్పుడు దా
నినె యనుభవించుకాలము, చనుదెంచెల్ వినుము దుఃఖ♦సంతతిరీతిన్. ౫

తే. రాజ్యనాశము బంధువా♦రములవీడి
వచ్చుటయుఁ, దండ్రిమరణంబు ♦ వఱలు జనని
విడిచివచ్చుట యివియెల్లఁ ♦ గడఁగి వరుసఁ
దలఁచుకొన నిండఁజేసె వ్య♦థావితతిని. ౬ 1706

క. జనశూన్యవనికి వచ్చి య,వనిజం గనుఁగొనుచు నవయ♦వంబుల కష్టం
బును గనుచు నట్టి దుఃఖం,బును మఱచియెయుంటి; నిపుడు♦భూసుతనిందుల్.

సీ. ఎడఁబాసితిని గాన♦వడిఁ గాష్ఠములనుండి యగ్నిహోత్త్రుఁడుమండు♦నట్లు మరల
నాదుఃఖ మతితీవ్ర♦మై ప్రజ్వరిల్లెను; భీరువు నార్యయుఁ ♦ బ్రియయునైన
నాభార్య బలిమిని ♦ నభమునఁ గొనిపోవఁ బలవించుచుం బెను♦భయమువలన
వికృతస్వరంబుగా ♦ విలపించియుండును మిక్కుటంబుగఁ దన♦మేలగు స్వర

---

* కామేన శోకేన చ పీడ్యమానః-అనిమూ. ఇష్టవియోగజ శ్శోకః, కామజం చిత్తవివశ
త్వం మోహః-అనివ్యాఖ్య.

తే. మంతరింపఁగ నిశ్చయం ♦ బౌనిదియును;
[1]గన్నులకు విందు చేయుచుఁ ♦ గన్నురక్త
చందనమునకుఁ దగినవై ♦ సతము వృత్త
ములయి తనరు ప్రియాకుచ♦మ్ము లివు డకట. ౬ 1708

క. దనుజుఁడు తినుటకుఁ ద్రెంపఁగ, ఘనశోణితపంకమందుఁ ♦ గడుమున్గుచుఁ బెం
పును బాసి యొప్పకుండును, వినుమా! నిజమిద్ది; దైవ♦విధి యిటులున్నే. ౭

చ. అనయము తీయనై మదికి ♦ హర్షము నింపుచు మెత్తనైన వా
క్యనికరమొప్పఁ గేశభర ♦ మందముగాఁ బరికుంచితంబుగాఁ
గనఁబడ వెల్గు భూసుతము♦ఖం బివు డాసురవైరి దావశం
బునఁ దగియుంట రాహుముఖ♦ముం దగఁ జొచ్చిన చంద్రరీతిఁగన్. ౮

క. ఏమాత్రము భాసిల్లదు, సౌమిత్రీ! నిశ్చయమిది; ♦ సతతము నన్నే
వేమాఱు ముట్టఁగోరు మ, ఱేమానవు ముట్టఁ దలఁప ♦ దైత్యజినైనన్. ౯

ఆ అట్టి సాధ్వికంఠ ♦ మనయము హారాళి, నలగు నట్టిదాని ♦ నసురు లివుడు
విజనవనమునందు ♦ విఱిచి రక్తంబులఁ, ద్రావియుందురే ము♦దంబు మీఱ.

క. జనశూన్యాటవి నేనుం, గనఁబడమిని దనుజగణము ♦ కడువడిఁ జౌర్యం
బునఁ దనుఁ గొనిపోవఁగఁ జక్కనివిపులాక్షులను విచ్చి ♦ కనుచున్ ద్రోవన్.

సీ. [2]క్రొంచపిట్టవలెనె ♦ యంచితధ్వనిమీఱ విలపించియుండునే; ♦వినుమ! యనుజ!
గొప్పస్వభావమ్ముఁ ♦ గూడి కాంతస్మితయై తనరారు నా♦సీత యీ వి
జనవనాస్థలంబున ♦ మును నీశిలాతలంబున నన్నుఁగూడి దా♦పుననె గూరు
చుండి నవ్వులుచాల♦నొప్పఁగానినుఁజూచి హాస్యోక్తులనుమీర♦లాత్మఁదలఁచు
కొన్నది చేయఁగఁ ♦ గోరుదురాశక్తి కలవార లనునిట్టి ♦ కమ్రవాక్య

ఆ. ములను జెప్పుచుండె; ♦ నిలఁగల నదుల గోదావరియె వరిష్ఠ♦యై వఱలెడు
దానియందు భూమి♦తనయకు సంప్రీతి, కలదు పోయియున్నె ♦ కాంత నదికి.

క. అనితలఁచెద నను విడిచియె, వనిత యెవ్వడు గాని యొంటి♦వరనదికిం బో
యినదే లేదు కదా కావున నట్లు తలంపరాదు ♦ బుద్ధిని నేనున్. ౧౩ 1715

చ. సరసిజవక్త్ర పంకజవి♦శాలసునేత్ర ధరిత్రిపుత్త్రి యా
సరసిజముల్ గ్రహింప నొక♦చందమునం జనియుండునేమొ య
క్కరణిఁ దలంపరాదు ననుఁ♦గామిని యెప్పుడుకాని వాసి యా
సరసిజసంగ్రహార్థమయి ♦ శైవలినీస్థలి కేగ లేదుగా. ౧౪ 1716

చ. వనమిది పూచియున్న బహు♦పావనవృక్షము లొప్పుచుండఁ జ
క్కనిపలుపక్షిగుంపులొగిఁ ♦ గ్రాలుచు నుండఁగ నొప్పుచున్న దీ

---

1 తా లోహితస్య ప్రియదర్శనస్య సదోచితా వృత్తమచందనస్య, వృత్తౌ స్తనౌ శోణితపంక దిగ్ధౌ-అనిమూలము. 2 అస్మిన్ మయా సార్థ ముదారశీలా...బహువాక్యజాలమ్-అనిమూలము. దీనికి గోవిందరాజులు వ్రాసిన యర్థమంతయు నిట సంక్షిప్తమని యెఱుంగవలయు.

వనమున కేఁగియుండునొకో ♦ పల్కుఁగ నిట్టు లయుక్త మింతి భీ
తిని దగియుండు నొంటి వస♦తిన్ క్షణమైనను నుండ భీతిలున్. ౧౫ 1717

సీ. ఆదిత్యుఁడా! లోక♦మం దేమి జరగుచు నున్నదో యేమికా♦నున్నదో యది
యంతయు నెఱుఁగుదు ♦ వంతియె కాక లోకులు చేయుపుణ్యాఘ♦ములకు సాక్షి
వౌదువు; నాసాధ్వి♦యరిగె నెక్కడి? కెవ్వరైన హింసించిరా♦యనిశ మొక్క
శోకమే నాపాలు ♦ నాకిఁక సీతవార్తలఁ జెప్పుమా జగ♦త్ప్రాణ! నీకు

తే. సకలలోకంబులందును ♦ జరుగువార్త
లెవ్వియైన నెఱుంగనౌ ♦ నెపుడుగాని
నీకుఁ దెలియనివార్తయే ♦ లేకయుండు
సాధుకులభవ యాసీత ♦ చనినతెఱఁగు. ౧౬ 1718

తే. ఎఱుఁగఁజెప్పుమ దానిని ♦ నెవ్వరైన
బలిమిమైఁ గొనిపోయిరో ♦ లలనతాన
మృతిని బొందెనొ యేదారి♦నేని గలదొ
యనుచు విలపించుచున్ రాముఁ ♦ డడుగుచుండె. ౧౭ 1719

క. విలపించి శోకవశుఁడై, కలవిలపాటొంది మూర్ఛఁ♦గాంచిన రాముం
గలఁగుచుఁ గని లక్ష్మణుఁ డి,మ్ముల ధైర్యము గల్గి న్యాయ♦మును బూనితగన్.

క. అప్పటికిం దగువార్తల, నొప్పుగ నిట్లనుచుఁ బల్కె ♦ నోరామా! నీ
విప్పుడు శోకము విడువుము, గొప్పగ ధైర్యమును దెచ్చు♦కొనుమా యింకన్.

క. రమణిని వెదకఁగ నుత్సాహము గైకొనుమా, ధరిత్రి♦యందును నుత్సా
హముగల మనుష్యు లతికష్టముచే సాధింపఁదగిన ♦ చక్కనిపనులన్ ౧౮

క. సులభమ్ముగ సాధించుచుఁ, గలఁగని మదిఁ గ్రాలువారు♦గద యని యిట్లు
జ్జ్వలశౌర్యుఁడైన లక్ష్మణుఁ, డలఘుప్రక్రమము మీఱ ♦ నట్లు పలికినన్. ౧౯॥

[1] తే. ఆర్తుఁడై రాఘవుఁడు వాని ♦ నాత్మఁగొనక
ధైర్యమును బాఱఁదోలి ని♦తాంతదుఃఖ
మున మునింగెను దనశక్తిఁ ♦ గని యితరులు
భ్రాంతినొందక యుండఁగా♦వలయు ననుచు. ౨౦ 1724

అఱువదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౬౪ - వ సర్గము.

రామలక్ష్మణులు వెదకుచుఁ ద్రోవలోఁ గనఁబడిన గుఱుతులచే సీత కొనిపోవఁబడెనని యెఱుంగుట.

క. దీనుండై శ్రీరాముఁడు, దీనోక్తుల ననుజుఁ గాంచి ♦ తెప్పున నిటుఁ బెం
పూనిన గోదావరిలో, జానకి కలదేమొ యరసి ♦ చక్కఁగరమ్మా. ౧ 1725

---

1 ఈభాగమును మహేశ్వరతీర్థులు ఇతరపురాణమునుండి యుదహరించినప్రమాణములు. తద్భాష్యము తెనిఁగించుటలో నవసరమని వ్రాయఁబడలేదని పాఠకులు గ్రహింపవలయును.

క. సరసీరుహాములఁ గోయఁగ, సరసిజముఖి యరిగియుండుఁ ♦ జనుసందులకే
యరిగినదేమో గోదా,వరికిం జని చూచిరమ్ము ♦ త్వరఁగా ననియెన్. ౧½ 1726

క. అరివీరనిషూదనుఁడై, పరఁగెడు సౌమిత్రి రాము♦పల్కులఁ గొని స
త్వరగతిఁ జని యాగోదా,వరిలోఁ గలరేవులందు ♦ వరుస వెదకుచున్. ౨½

క. చనుదెంచి రామచంద్రున, కనియెన్ దీర్థములయందు ♦ నగపడలే దా
మెను బిలిచినాఁడ నాని,స్వన మామెకు వినఁగఁబడిన♦జాడ నెఱుఁగఁ జూ. ౩½

క. జనకజ క్లేశవినాశిని, యనుమానములేక యెచటి♦ కరిగెనొ యానా
ధ్వినిగూడి యున్న దేశం,బును దెలియక యున్నవాఁడ ♦ బుధనుతచరిత్రా. ౪½

చ. అనియనుజుండు చెప్ప విని ♦ యారఘురాముఁడు తాపమోహముం
గనుటను దీనుఁడై యపుడు ♦ గౌతమిలో వెదుకంగఁ దానె వే
చనియె; నదీవతంసమును ♦ జయ్యనఁ జెంతను గాంచి యెచ్చటన్
జనకజ యున్నదంచడిగె; ♦ సాంద్రవనంబున నున్నసత్వముల్. ౬ 1730

ఆ. చంపఁదగిన రాక్ష♦సప్రభుఁడా రావ,ణుండు బలిమి సీత♦నుం గొనిచనె
ననుచుఁ జెప్పవయ్యె ♦ నట్లె గోదావరి, పలుకదయ్యె సీత♦వార్త నపుడు. ౭

సీ. రాముఁ డీరీతిగా ♦ రమణికై శోకింప నానది యతనితోఁ ♦ దానుగా నె
చెప్పకుండుటెగాక♦యప్పుడా భూతముల్ మాకుఁగాఁ జెప్పుమా♦మానిని తెఱఁ
గని యెంతపురికొల్పి♦నను జెప్పదయ్యె; నానది రావణుని భీష♦ణమగు తనువు
నాదురాత్మునివగు ♦ నతిదుష్టకర్మంబులను జూచి తలఁచి నె♦మ్మనమునందు

తే. భయమునొందిన దగుటచేఁ ♦ బలుకదయ్యె
సీతచనినట్టిరీతిని; ♦ నాతఁడసతిఁ
గానమికిఁ జాల స్రుక్కుచు ♦ నానది తన
కేమియుం జెప్పకుండుట ♦ నెంచి యతఁడు. ౮½ 1732

క. జనకజఁ గనుఁగొనువిషయం,బున మదిని నిరాశుఁ డగుచుఁ♦బొక్కుచు ననుజుం
గని పల్కె నిట్లు; సౌమ్యా!, వినుమీ గౌతమియు నెంత ♦ వేఁడిన నాకున్.

క. బదులిడకున్నది నేనిఁక, ముదితం దిగవిడిచి జనక♦భూపతిఁ గాన
ల్కఁ దగంగని యప్రియముగ, మదిఁ దూలఁగనేమియనుదు♦మానినివార్తన్.

తే. నేను రాజ్యము వోవ నీ♦కాన వన్య
వస్తువులఁ దిని మిక్కిలి ♦ వంతఁ గుందు
చుండ నాసీత నావ్యథఁ ♦ జెందుచుండుఁ
గాదె యాలేమ యిప్పు డె♦క్కడికి నేగె?. ౧౨½ 1735

క. నిరతసునహాయబంధూ,త్కరమును విడనాడి జనక♦కన్యను గనుచుం
డు రమణియుఁ గానఁబడ ది,త్తరుణంబున నిద్ర నెవ్వి♦ధంబునఁ గనుదున్.౧౩

తే. నిద్రపట్టని నాకు నీ♦నిశలు చాల, దీర్ఘములె యానటంచు మ♦దిం దలంతుఁ

గనఁబడునయేని సీత య♦క్కాంతఁగూడి, యిచటి మందాకినీనది♦నివ్వనులను.

తే. ఇందుఁగల ప్రస్రవణగిరి♦యందు స్వేచ్ఛ
నేను విహరింతునే? మృగ♦నిచయ మిద్ది
యోమహావీర్య! ననుఁ జూచు♦చున్న దిప్డు
పెక్కుసారులు జానకి♦విధము నాకు. ౧౫ 1738

క. తెలుపంగఁ బూనియున్నట్టులె [1]యింగితములవలనఁ గ♦దుర్ నిజముగనే
తెలియర్ వచ్చెడు ననుచుర్, బలుకుచు నరపుంగవుండు ♦ వానిం గనియెర్.

తే. బాష్పసంరుద్ధదృష్టుల ♦ వానిఁజూచి
సీత యెక్కడనున్నదో ♦ చెప్పుఁడ నాకు
ననుచుఁ బ్రశ్నించె నివ్విధి ♦ నడుగ నవ్వి
యన్నియుం దోడనే లేచి ♦ యామ్యదిశను. ౧౭ 1740

క. కనుఁగొనుచు నభస్స్థలమును, గనుచు న దేపథమునందుఁ ♦ గాంతబలిమిమై
దనుజునిచే నపహృతయై, చనియెనొ యాత్రోవఁబట్టి ♦ సత్వరగతులర్. ౧౮

క. పరుగెత్తుచు శ్రీరామునిఁ, బరికించుచునుండె, నెట్టి ♦ పథమున నవి యం
బరమును దక్షిణభూమిని, బరికించుచు నట్లె పోవ ♦ వాంఛించుటచేర్. ౧౯

[2]తే. వానిచేష్టలవలన న♦వ్వానిభావ
ములను లక్ష్మణుఁ డెఱిఁగెను ♦ బుద్ధిసహితు
గన్నవాఁడొట మృగములు ♦ గనఁబఱచిన
చేష్టలను బట్టి మాటలు ♦ చెప్పినట్లె. ౨౦ 1743

క. తలపోసి యింగితంబుల,వలన నభిప్రాయమెల్లఁ ♦ బరికించి మదిం
దెలిసికొని యాత్రితోనే, పలికెర్ జ్యేష్ఠుఁగని దీన♦వాక్కు లలరఁగర్. ౨౧

క. దేవా! జానకి యెందని, నీవడుగఁగ నీమృగములు ♦ నింగిం గనుచుర్
వేవేగ లేచి యామ్యది,శావసుధం జూపఁజొచ్చెఁ ♦ జక్కఁగ మనకుర్. ౨౨

ఆ. కనుక మనము వేగ ♦ కదలి నైరృతిదిక్కుఁ, బట్టి చక్కఁజనుద ♦ మట్టులైన
సీతఁ గాంచువార్తఁ ♦ జెవిసోఁకవచ్చును, గాకయున్న నార్యఁ ♦ గనఁగనగును.

క. అనవిని యాశ్రీమంతుఁడు, చనుదము వేగంబె యనుచు ♦ సహజునితోడం
జనియెర్ భూమినిజక్కఁగఁ, గనుచుర్ దక్షిణముఁబట్టి ♦ కాంతాకాంక్షర్.

క. ఆయన్నదమ్ము లిద్దఱు, నాయడవిం గష్టరీతు ♦ లన్నియుఁ దమలో
వేయివిధంబుల ననుకొను, చాయాసము లెక్కచేయ ♦ కరుగుచు నొకచోర్.

క. ధరణిపయి రాలియుండిన, తరుణి ధరించినసుమాళిఁ ♦ దగఁ గని రంతర్
ధరపయి వృష్టివిధంబునఁ, దొరఁగిన యాపూలఁగాంచి ♦ తోరఁపువగతోర్.

---

1 వక్తుకామా ఇవ హి మే ఇంగితా న్యుపలక్షయే - అని మూలము. 2 తేషాం వచనసర్వస్వం లక్షయామాస చేంగితమ్ - అని మూలము.

క. వీరుండౌ రఘువంశప,యోరాశి విధుండు తనస♦హోదరు వగఁ గ
న్నీరును నించెడువానిఁ, దా రయమునఁ గాంచి పల్కెఁ ♦ దమ్ముఁడ! కంటే.

సీ. ఈపుష్పములగుఱు ♦ తేనెఱుంగుదు నేనె కాన పేనింగోసి ♦ కాంతకొసఁగ
నా లేమకొప్పున ♦ నవ్వానిధరియించె; నాప్రియంబును గోరి ♦ నళినమిత్రుఁ
డనిలుఁడు మిగుల వి♦ఖ్యాతి మించినభూమి వాఁడనీయక చిమ్మి♦వైన కెంతొ
యూదృతిఁ దాల్చుచు ♦ నరసి రక్షించుచు నున్నారని తలంచు♦చున్నవాఁడ

తే. ననుచుఁ బురుషర్షభుండగు ♦ నామహాను
భావుఁ డాధార్మికుఁడు మహా♦బాహుఁ డైన
యనుజునకుఁ జెప్పి ప్రస్రవ♦ణాద్రిఁ గాంచి
పలికె నోక్షితిభృద్వర్య! ♦ వనమునందు. ౨౮ 1751

చ. నను విడనాడి కుందు లల♦నామణి యోర్తుక సుందరాంగము
దనరఁగఁ బోవుచుండఁ గని♦నాడవె యంచనఁ బర్వతంబు రా
మునకొగి నుత్తరంబిడక ♦ ముందువలెం జెలువారుచుండె; నా
తనివిధమెల్లఁ గాంచి రణ♦దర్పుఁడు రాముఁడు క్రోధయుక్తుఁడై. ౩౧ 1752

క. హరి క్షుద్రజంతువును భీ,కరముగ నదలించునట్లు ♦ క్ష్మాధరమును గా
వరమును గాంచినదానిఁ, గర మదలించుచును బల్కె ♦ గ్రావమ! యింకన్.

క. విను నీసానువులను నేఁ, దునుమాడక మును పె నాదు♦తొయ్యలి హేమా
భను హేమప్రతిమను నా,కును జూపుము లేకయున్నఁ ♦ గ్రొవ్వడఁగింతున్.

సీ. అని రాఘవుఁడు పల్క ♦ నాయద్రి విని ప్రతిధ్వనిచేత జనకపు♦త్రినిగుఱించి
చెప్పినట్లేయుండె ♦ శ్రీరఘుపతి తాను పల్కినమాటల ♦ బదులుపల్కి
తన్ననాదృతిఁజేసె ♦ నన్న యూహానుగాంచి యుండుటచేతనా♦యుర్వితనయఁ
జూపకయేపోయెఁ;♦గోపంబునన్ రాముఁ డాపర్వతముఁ గాంచి♦యనియె నాదు

తే. బాణశిఖిఁ గాల్చి నిన్నిప్డు ♦ భస్మరూపుఁ
జేయువాఁడను బిదప ని♦స్తృణమహీజ
పల్లవుండవె యగుదు వె♦వ్వరును నిన్నుఁ
గొలువకుందురు సూ యని ♦ పలికి మరల. ౩౩ 1755

శా. తారేశాననయై సుపూజ్యయగుసీ♦తం జెప్పకేయుండినన్
సారాస్త్రంబుల శోషిలంగ నది నే ♦ శౌర్యంబునన్ జేయుదున్
శూరా! లక్ష్మణ! యంచుఁ బల్కి రుషతోఁ ♦ జూడ్కుల్ విజృంభింప వి
స్ఫారజ్వాలలఁ గాల్పఁ జూచుగతి నొ♦ప్పం గ్రాలుచున్నంతలోన్. ౩౫ 1756

చ. దనుజుని భూరిపాదములు ♦ తద్గతభీతిని రామునాశ్రమం
బున కరుగంగఁగోరి యల♦పుణ్యజనుండును వెంటనంటిరాఁ
గని పలుచోట్లకుం దరుమఁ♦గాఁబడి పాఱిన సీతపాదముల్
గనఁబడెఁ బైకి నుబ్బినటు; ♦ గాంతపదంబులఁ గాంచి రాముఁడున్. ౩౬

క. దనుజునిపాదంబులనుం, గని భగ్నధనుస్సుఁ దూణ♦కంబుల మఱియు
య్యనఁ బెక్కు-రీతులన్ విఱిగినరథమును గాంచి దుఃఖ♦కీర్ణహృదయుఁడై.

తే. ప్రియసహోదరుఁగాంచి యీ♦విధము చూడు
లక్ష్మణా! సీతవౌ సొమ్ము♦లను వెలుంగు
కనకబిందువు లిందు రా♦లినవి వివిధ
మాల్యములు రాలియున్న వి♦మ్మహినిగంటె. ౩౯ 1759

సీ. కనకబిందువులవ♦లెను మించి చిత్రంబు లౌరక్తబిందువు♦లందు నిందు
భూమినంతటఁ గ్రమ్మి♦ పొడకట్టుచున్నవి కనుమా, సహోదరా!♦కామరూపు
లగురాక్షసులు సీత♦యంగంబు ఛేదించి ఛేదించి వారలు♦ చెఱిసగముగఁ
బంచుకొనియొ లేక♦భక్షించిరో యుందు రన్నాతికొఱకు నా♦యసురులిరువు

ఆ. రిట వివాదమాడి♦ యెంతొభయంకర,మైన యని నొనర్చి;♦ రమలమౌక్తి
కమణిమయము తప్త♦కనకభూషితమునై, ధరణి విఱిగిపడిన♦ ధను వెవరిదో.

క. పెనువిల్లిది యెవ్వరిదో, కను సౌమ్యా! తరుణరవిని♦కాశము వరకాం
చనమయమును వైదూర్యమ,ణినికరఖచితమ్మునగుచు♦ నెగడుకవచమ్మున్. ౪౪

తే. ఇద్ది యెవ్వరిదో భూమి♦ నిచటఁ ద్రెళ్లి
యున్నదిదె నూఱుకమ్ముల♦ నొప్పి దివ్య
మాలికాంచితమౌ ఛత్ర♦మహితదండ
మల్లె శతధావిభగ్నమై♦ యవనిఁ గొరఁగె. ౪౫ 1762

క. కనుమా యిది యెవ్వనిదో, కనకతనుత్రాణములను♦ గ్రాలి పిశాచా
ననములఁ దగి భయదాకృతు,లనొప్పు ఖరవాహనము లి♦లన్ నిహతములై.

క. ఇవిగో యిందున్నవియే, యివి యెవ్వనివగునో? కాంతి♦నెసఁగుచు దీప్తా
గ్నివలెన్ ధగధగలాడెడు, [1]ప్రవిదారణకేతనమిదె♦ పడియున్నదిలన్. ౪౭

క. ఇది యపవిద్ధంబయ్యెం,గద సాంగ్రామికరథంబు♦ కడుభగ్నంబై
యిదె కూలియున్న దిచ్చట, నిది యెవ్వరిదో వచింపు♦ మిప్పుడు సహజా. ౪౯

సీ. కనకాంచితములయి♦కాఁడి యంతవిశాలములయియొప్పెడి బాణ♦ములివెయెల్ల
తావులఁ బడియున్న♦వే విశ్వభయదకర్ముని వగునో యివ్వి♦ యనుజకనుమ
శరపూర్ణములగు ని♦షంగముల్ రెండును విధ్వస్తములగుచుఁ♦బృథ్విఁబడియెఁ
గనుము పగ్గంబుల♦ మునికోలఁ గైధరియించి మృతుండయి♦ యిలనుబడిన

తే. యీతఁ డెవ్వనిసారథి♦యో తలంపఁ
బురుషకుంజర! యోసౌమ్య♦ యిరువురమణి
కుండలోష్ణీషములనొప్పి♦ కూలియున్న
[2]చామరగ్రాహులను నిట♦ సరగఁ గనుము. ౫౦ 1766

1 సమరధ్వజః-అనిమూలము. 2 చామరగ్రాహిణౌ సౌమ్య సోష్ణీషమణికుండలౌ-అనిమూలము.

క. వీరెవ్వనివారో; యీ, దారియు నొకరాక్షసునిదె ♦ తథ్యమ్మిది యా
ఘోరసురారులపై మును, వైరము నాకుదిని లేదు ♦ వారియపకృతుల్. ౧౦౪

ఆ. ఇంతవఱకు నోర్చి♦యేయుంటి నావైర,మిపుడు శతగుణముగ ♦ నెసఁగెఁ జుమ్ము
కాన వారియసుని♦కాయముఁ దుదముట్టఁ, జేయువాఁడఁ జూడఁ ♦ జెల్లు నీకు.

తే. జనకపుత్త్రిఁ దపస్విని ♦ సంతతోగ్ర
హృదయులై కామరూపులై ♦ పోదలు దనుజు
లపహరించిరొ చంపిరొ ♦ యాశఁ దినిరొ
యుందు; రీయుగ్రకానన♦మందు సీత. ౧౨ 1169

క. దనుజులచే నపహృతయై, చనుచుండఁగ నాపదలను ♦ జనులం బ్రోచున్
ఘనధర్మ మందు రదియై,నను గావం దలఁపదయ్యె ♦ నాసతి నకటా. ౧౩౪

క. దనుజులు తినిరో బలిమిం, గొని చనిరో సీతనుండఁ ♦ గూరిమి నీకనా
కును గూర్పఁజాలుదురొ యే, దనుజారులు లక్ష్మణా! య♦థావిధిఁ జెపుమా.

క. ప్రియమును జేయం గోరిక,యె యమర్త్యులకుండునేని ♦ యింతిం గాపా
డియె యుందురుగా; యోనా,ప్రియసోదర! వినుము లోక♦వితతులశక్తిన్.

సీ. సృజియించు నంతవాఁ♦డే యైనశూరుండె
యైనను వాఁడు ద♦యాళువైన
నతనిసామర్థ్యమ్ము ♦ నరయమి భూతాళి
యవమానముం గల్గు♦నట్లుచేయు
నివి స్వభావమె యగు; ♦ నే లోకహితమందు
నాసక్తిఁ గలవాఁడ ♦ నగుటచేత
మృదుచిత్తుఁడనె యయి ♦ సదయుండనై దాంతుఁ
డనె యయియుండుటఁ ♦ గని యమరులు

తే. వీర్యహీనునిగా నన్ను ♦ విశ్వసించు
చున్నవారిది నిశ్చయ ♦ మోసుమిత్ర
తనయ! నన్నొగిఁ జెందిన ♦ వినయముఖను
గుణములున్ దోషములె యయ్యె ♦ గణనసేయ. ౧౬ 1773

క. దనుజులకును భూతాళికి, వినాశమునకే మదీయ♦వితతగుణంబ
య్యెను దోషముగా నిప్పుడు;,గనుకన్ దయవిడిచి క్రోధ♦కలితుఁడ నగుదున్.

చ. ఖరకరుఁ డున్నతుండయియుఁ ♦ గంజవిరోధి మరీచులన్ భయం
కరగతి స్వీయకాంతులను ♦ గాటముగా నుపసంహరించి యొ
క్కరణి వెలుంగు నట్టులె నా♦కామము నాదగు తేజమున్ గుణో
త్కరము నడంగఁ ద్రొక్కుచుఁ ద♦గం జెలువారెడు నుజ్జ్వలంబుగాన్. ౧౮౪

సీ. యక్షగంధర్వదై♦త్యపిశాచకిన్నరమనుజులలో నెవ్వ♦రును సుఖంబు
గాంచరు సుమ్ము ల♦క్ష్మణ! యస్త్రబాణముల్ నిగిడించి వేవేగ ♦ జగమునెల్లఁ

గప్పెదఁ జూడు; జ♦గత్త్రయవాసుల కెవ్వరికింగాని ♦ యింకమీఁద
సంచారమే లేని ♦ సరణి నొనర్చెద గ్రహగణచారంబు ♦ గలుగకుండఁ
తే. జేసి శశధరునిం గప్పి ♦ శిఖిని వాయు,వును నశింపఁగఁ జేసి, సూ♦ర్యునిని విరుచి
గా నొనర్చి, మహీధర♦కాండవిశిఖ,ములను ఖండించి సరసుల♦జలమునడఁచి.

క. తరువుల లతలఁ గుల్మో,త్కరముల నశియింపఁ జేసి ♦ కంధిమహిమ ని
ర్భరశక్తి నాపి లోకో,త్కరమును నాశంబు నొందఁ♦గాఁ జేయుదుఁ జూ. ౬౨

క. కనుఁగొను మిప్పుడు దివిజులు, జనకజకుశలమునను౦డ ♦ సరగున నాకిం
కను నీయకున్నవారు గ,ద నేను ఘటికాద్వయమున ♦ దారుణరీతిన్. ౬౩

ఆ. పౌరుషంబుఁ జూప ♦ వారలు చూడంగఁ,గలరు; సహజ! కార్ము♦కగుణవరము
నుండి విడువఁబడిన ♦ యుగ్రబాణౌఘ మా,కసము నెల్లఁ జక్కఁ ♦ గప్పివైవ.

క. విను భూతౌఘం బంబర,మునకుం దప్పించుకొనఁగ ♦ మునుకొని యెగురం
గనుజాలవు; సౌమిత్రీ!, ఘనతర మచ్ఛరవితాన♦కంబులచేతన్. ౬౪ 1780

సీ. బాధింపఁబడి మృగ♦పక్షులు సంభ్రాంతములయి తక్కినవెల్లఁ ♦ గలఁతఁ జెంది
తమతమమర్యాద ♦ దప్పి నశింపఁగాఁ గలవు చూడుము; జన♦కజకుగాను
ననివార్యశరముల ♦ నాకర్ణముగ విలు దివిచి ప్రయోగించి ♦ తెంపుమీఱ
బ్రహ్మాండమును గోణ♦పపిశాచహీనమ్ముగా నొనర్చెద నిప్డు ♦ కడఁగి రోష

తే. మునను నేను బ్రయోగింప ♦ ఘనజవమునఁ
జాల దూరంబు పోవంగఁ ♦ జాలు నాదు
బాణములబల్మి నిర్జర♦వరులు పూనిక్కఁ
జూడఁగలరిదె లక్ష్మణా! ♦ చోద్యమంది. ౬౫ 1781

మ. విను నా క్రోధవశంబునం ద్రిజగముల్ ♦ పెంపేదికూలంగ దే
వనికాయం బసురుల్ పిశాచదితిజ♦వ్రాతంబు చూపట్ట కో
య్యన నాశంబును గాంచు; నా త్రిదశదై♦త్యావాసముల్ భీతికృ
ద్దనుజావాసము యక్షలోకము మద♦స్త్రస్తోమపాతంబునన్. ౬౬ 1782

సీ. శకలీకృతంబులై ♦ చయ్యన నశియించుఁగాని శిష్టంబులై ♦ గానఁబడవు;
సౌమిత్రి! వినుము ని♦ర్జరులు జానకి యపహృతయైన నృత్యువు ♦ నింటనున్నఁ
గాని యామెను దెచ్చి ♦ మానుగ నాకొసంగక యున్న నిప్డె ♦ కలకుసాయ
కముల నీలోకజా♦లమును మేరలు దప్పునట్లు గావించెద; ♦ నదియు నెట్టి

తే. గతిని బొందిననైనను ♦ గాంత నాకొ
సంగ కాదిత్యు లుండిన ♦ జంగమముల
స్థావరంబుల నిప్డు ము♦జ్జగములందుఁ
గల్గువానిని ద్రుంచెదఁ♦గాని విడువ. ౬౭ 1783

చ. అని వచియించి శత్రునగ♦రాంతకుఁడా రఘురాముఁ డాగ్రహం
బునఁ గనులెఱ్ఱఁబాఱ ధను♦వుఁ గొని ఘోరసుదీప్తసాయకం
బును భుజగాకృతిన్ మిగులఁ ♦ బోలినదాని గ్రహించి కార్ముకం
బునఁ దగఁ గూర్చి క్రోధమున ♦ మున్గుచు లక్ష్మణుఁ దేరిచూచుచున్. ౨౭

తే. ప్రళయకాలధనంజయు♦భంగిఁ బలికె
సకలభూతంబులందును ♦ జరయు మృత్యు
వట్లె కాల మదృష్టము ♦ నాపఁజాల
కుండునో యట్లె నేను గృ♦ద్ధుండనైన. ౨౮ 1785

క. నను వారింపఁగ నెవ్వరి,కిని సాధ్యముగాదు; సుదతిఁ ♦ గృత్రిమరహితన్
జనకప్రియపుత్రిక న,య్యనిందితను మున్నువోలె ♦ నలరెడు సాధ్విన్. ౨౯

ఆ సురలు తోడితెచ్చి ♦ త్వరగ నాకీయర, యేని మనుజపన్న♦గేంద్రదివిజ
గణముతోడ నెల్ల ♦ గంధర్వయుతముగ, శైలయుక్తి జగము ♦ లీలఁ గూల్తు.

అఱువదినాల్గవ సర్గము సంపూర్ణము.

---

## ౬౫ - వ సర్గము.

లక్ష్మణుఁడు రామచంద్రు నాశ్వాసించుట.

సీ. సీతాపహరణక♦ర్శితు లయకాలాగ్నికరణి జగన్నాశ♦కరణయత్ను
సజ్యచాపముఁ బలు♦సారులు వీక్షించువాని నిట్టూర్పులు ♦ వరుస విడుచు
వాని యుగాంత మం♦దైనరుద్రునిభంగి జగమును దహియింపఁ ♦ జాలువాని
నిదివఱకెన్నఁడే ♦ నిట్టులుండని మహాభయదాకృతిం దాల్చి ♦ పరమకోప

తే. మడర నిలుచున్న శ్రీరాము ♦ నంతఁ గాంచి
తనముఖం బెండఁ గేల్మోడ్చి ♦ తగినవాక్య
ములను లక్ష్మణుఁ డిట్లను; ♦ ముందు నీవు
దాంతుఁడవు సర్వభూతహి♦తరతమతివి. ౧ 1788

క. విను నీస్వభావ మతిమృదు, వని చెప్పఁగ నొప్పుచుండు ♦ నట్టిండవు నై
తనరియు నిప్పుడు కోపం,బునఁ జిక్కుచు నీస్వభావ♦మును విడఁజను నే. ౨

చ. సరసిజమిత్రునందుఁ బ్రభ; ♦ చంద్రునియందును గాంతి వాతమం
దురుగతి భూమియందు క్షమ ♦ యెుక్కటొక్కకభూతమం దొగిన్
నిరతము నిల్చియుండుఁగద ♦ నిశ్చలరీతిని నివ్వియన్నియున్
బరినుతమా యశస్సును భ♦వన్నియతంబులు సుమ్ము రాఘవా. ౩ 1790

సీ. ఒక్కరథం బిందు ♦ నుగ్రరణంబున శకలంబులై యున్న♦జాడఁ గాన
నయ్యెడిఁ గాన నీ ♦ కరయఁగ నొక్కఁడే యపరాధమును జేసె♦ననుటఁ దెలిసె

నొక్కనితప్పునఁ ♦ దక్కిన యనపకారకములై తగు లోక♦నికరములను
నశియింపఁగా జేయ♦న్యాయమే యాయాయుధంబులతోడమఱియుద్ధ♦మునకుఁ దగిన

తే. పరికరంబులతోడను ♦ ధరణి విఱిగి
పడిన యీయాయుధరథమి దె♦వ్వనిదొ యెవఁడు
విఱిచెనో యిది యేలొకో ♦ విపులముగను
దెలియకున్నాఁడ నేనును ♦ దీని తెఱఁగు. ౯౪ 1791

క. ఖురనేమిక్షతమై యీ, ధరణి యసృగ్బిందువులను ♦ దడిసి మహాభీ
కరముగ నుండెడు నిట మును, దురమయ్యెనటంచు మదిఁ♦దోఁచెడి రామా.

తే. వాగ్విశారద! యిందలి ♦ ప్రధనమొక్క
రథికునిదిగానె యున్నది; ♦ రథికయుగము
నకును జరగనె లేదని ♦ ప్రకటముగనె
కానవయ్యెడి గొప్పదా ♦ సేన యిందు. ౮ 1793

క. చరియించినట్లు వారల, చరణంబులజాడ యిచటి ♦ క్ష్మాస్థలిఁ గనరా
దరయఁగ నొక్కనికై నీ, వురుజగములఁ ద్రుంపఁబూను ♦ టుచితం బగునే.

క. మనుజేశులు తగు దండన, మునె యొనరించుచును శాంత♦మునుమార్దవమున్
గనియుందురుగద నీవో, యనిశము భూతాళికెల్ల ♦ నాశ్రయుఁడవు సూ. ౯౪

ఆ. పరపరమగతివి రామ! ♦ పరఁగెడు నిట్టినీ
భార్య నాశమొంద♦వలయు ననుచు
నెవఁడు తలచు! మఱియు ♦ నవ మొనరింప దీ
క్షితుఁడుఁగాఁ జెలంగు ♦ క్షితిసురునకు. ౧౦౪ 1796

సీ. యజ్ఞప్రవర్తకు ♦ లపకారమును జేయ యజ్ఞంబు చెడుటయు ♦ నంతఁ బోక
తమకపకారంబు ♦ తప్పక కలుగునం చనుభయంబునఁ జేయ♦రట్లె రక్ష
కుఁడవైన నీకును ♦ గూడ నద్యుదధులు పర్వతంబులు దేవ♦పతులు మఱియు
గంధర్వదానవుల్ ♦ కడుఁ దారె చెడుదుమన్ భయమునసుంత య♦పకృతిఁ జేయఁ

తే. జాల రోభూమిపాలక! ♦ సాధుమునులు
సాయపడ నన్నుఁగూడి వి♦స్ఫారచాప
ధారివై జానకీదేవి ♦ బలిమిఁగొనుచుఁ
జనినవానిని వెదుకంగఁ ♦ జనుట యొప్పు. ౧౩ 1797

క. వనశైలసాగరంబుల, ఘనభయదగుహౌఘములను ♦ గంజవనముల౯
జనకజ నదుల౯ వెదకుద,ము నిర్జరపదంబులందుఁ ♦ బూనిక మీఱ౯. ౧౩౪

తే. అట్లె గంధర్వలోకంబు♦లందుఁ గూడఁ, దన్వతీమణి దొంగిలి ♦ పాఱినట్టి
యధముఁడెవ్వఁడొ చిక్కిన♦యంతదనుక, వెదకుదముపట్టుదలఁబూని♦విశ్వమెల్ల.

క. కోసలదేశాధిపతీ!, యాసుమనసులెల్లఁ గూడి ♦ యువనీపుత్త్రి౯
వే సామోపాయంబున, నీసమ్మతి నూనరేని ♦ యొంతయుఁ బూన్క౯. ౧౫

క. దండోపాయము హితమయి, యుండంగన యప్పు డద్ది ♦ యొప్పఁగ జేయన్
భండనభీమా! రామా!, ఖండితశివచాప! నీకె ♦ కలదన్ భువిలోన్. ౧౯౹

ఆ. సామశీలవినయ ♦ సరణుల జనకజ, దొరకకుండు నేని ♦ సురపతి కులి
శమున కుద్ది యగుచు ♦ శాతకుంభాంచిత, శరవితతిని గాల్పు ♦ జగముల నన.

అఱువదియైదవ సర్గము సంపూర్ణము

---

౬౬ - వ సర్గము.

లక్ష్మణుఁడు రామునకుఁ గర్తవ్యముఁ దెలుపుట.

క. ఆరీతిని శోకంబున, నారాముఁడు పొగిలి పొగిలి ♦ యాతురుఁడగుచున్
భూరివిమోహంబునఁ బడి, ధీరత విడనాడి యేడ్చె ♦ దీనుని పగిదిన్. ౧ 1803

క. మనమునఁ దగు స్థైర్యము విడి,చి నితాంతము సీతగుఱిచి ♦ చింతించెడు రా
ముని నొక్కముహూర్తమ్మున, ననువుగఁ దా నూఱడించి ♦ యాలక్ష్మణుఁడున్.

క. చరణములఁ బట్టుకొని రఘు,వరుఁ గని యిటుపల్కె భూమి ♦ పతి దశరథుఁడున్
నిరతవ్రతములు బహుళా, ధ్వరములు గావించి సుగుణ ♦ వరునిన్ ఘనునిన్.

క. సురలెల్లను సుధఁ బడసిన, కరణి న్నినుఁ గనియె; రాజ ♦ కాంతుఁ డతఁడు నీ
వరగుణముల బద్ధుండై, విరహమునకుఁ దాళలేక ♦ విబుధత నొందెన్. ౩౹

ఆ. భరతువలన విన్న ♦ భంగిని నేఁ జెప్పి,నాఁడ; నాకకుత్స్థ ♦ నాథవంశ
జనితుఁడవగు నీవు ♦ సత్త్వయుతుండవ, ప్రాకృతుఁడవు రాను ♦ భద్ర వినుము.

ఆ. ఇపుడు గల్గినట్టి ♦ యీదుఃఖమును నీవె
యోర్వఁజాలవేని ♦ యుర్వి నల్ప
బలుఁడు క్షుద్రుఁ డెవ్వఁ ♦ డలఘుదుఃఖము నోర్వఁ
గలఁడొ? యెఱుఁగఁజాల ♦ నలఘుశౌర్య!. ౫ 1808

చ పురుషవరేణ్య! నీవె యిటు ♦ భూరివిపత్తునఁ గల్గు దుఃఖవి
స్ఫురణమునం దపించి నరి ♦ పోల్పఁగరాని స్వపౌరుషంబునం
బరిపరిలోకజాలముల ♦ భస్మముచేయుదువేని దాన దు
ర్భరమగు పీడనొంది నర ♦ వార మదెక్కడి కేగఁజాలునో. ౬ 1809

క. వినుమెందు నిర్వృతిం దగఁ, గనువారు మనుష్యు లిట్లు ♦ గా నర్థాన
ర్థనికరములఁ బొందుట లో,కనైజమగుఁ గాని క్రొత్తఁ ♦ గా గాదు సుమా. ౭౹

*సీ. నహుషపుత్త్రుండయి ♦ నరవిభూత్తముఁడగు నాయయాతియు నన ♦ యంబువలన
స్వర్గంబు నొందియు ♦ శతక్రాగ్రహమునకుఁ బాత్రుఁడై యటనుండి ♦ భ్రష్టుఁడగుచు

---

* సహి స్వర్గగతోపి ఇంద్రేణానుయాకలుషేణ భవద్గాత్రి క్వే కోవా శ్రేష్ఠ ఇతిపృష్టస్సత్య వాదిత్వాహమే వేత్యుక్త్వా నింద్రేణాత్మశ్లాఘిత్వం నస్వర్గార్హ ఇతి పాతిత ఇతి-గోవిందరాజులు. గీసీపాఠ గేస ౧౬౩ట సూచితము.

నార్తినొందెనుగా; మ♦హర్షియెవ్వఁడో మనపితకు నెవ్వఁడుపురో♦హితుఁడో యట్టి
క్షితిసురేజ్యునకు వ♦సిష్ఠునకుం బుట్టినట్టి శతాత్మజు ♦ లనుపమాన

ఆ. కౌశికాగ్రహమునఁ ♦ గంది యొక్కదినంబు
నందె కూలి; రక్షై ♦ యఖిలజగము
లకును దల్లి హరికి ♦ లలన యెవ్వతో లోక
వంద్యయైన యట్టి ♦ వసుమతికిని. ౯ 1811

క. [1]చలనము కనఁబడుచున్నది, యలఘుగుణా! సత్యశపథ! ♦ యాధృతి నీవే
తెలియంజెప్పితివి గదా, పలికితి నమ్మాట నీవు ♦ పల్కినరీతిన్. ౧౦ 1812

సీ. ధర్మప్రవర్తకుల్ ♦ ధరణియం దెవ్వరో కాలవిభాగాది♦కారణముల
జగముల నెవ్వరు ♦ చక్కఁగ వర్తింపఁ జేయుచుందురో జగ♦త్సిద్ధనేత్రు
లెవ్వరో జగమెల్ల ♦ నెవ్వరియందున నెలకొనియున్నదో ♦ యలఘుబలుల
కాచంద్రసూర్యుల ♦ కపుడష్ట గ్రహణము గలుగుచున్నది వేడె ♦ పలుకులేల?

తే. సర్వభూతాదిదేహియా ♦ స్వామియెట్లు
మదిని సంకల్పమును జేయు ♦ మహిమవెలయు
[2]నట్టి మాంధాత లోనగు ♦ నలఘుభూత
ములును దానిని మీఱంగఁ ♦ గలవె రామ. ౧౧ 1813

చ. సురపతిముఖ్యులౌ దివిజ♦శూరులయందు నయానయంబులై
పరఁగు సుఖాసుఖంబులొగిఁ ♦ బర్వుచు నుండునటంచు విందుమో
పురుషవరేణ్య! కాన వగఁ♦బొందఁగ నర్హముగాదు నీకు; ని
ద్ధరణిని వీరుఁడం చనఘ♦తల్లజుఁ డంచుఁ బ్రసిద్ధిఁ గాంచితో. ౧౨ 1814

క. [3]జనకజ నశియించినను౯, దనుజాహృతయైనను౯ ని♦తాంతము తుద్రుం
డనఁబడు నరుచందంబున, వనటం బొందంగఁదగదు ♦ వరగుణసాంద్రా. ౧౩

తే. సత్యదర్శనులై మహా♦శాంతమూని, ఘోరకష్టంబులందును ♦ గుందకుండు
నట్టి నీవంటివార ల♦త్యంతకష్ట, ములును గల్గినను౯ దుఃఖ♦మున మునుఁగరు.

క. ఘనబుద్ధి శుభాశుభములఁ, గనుఁగొనుమా మనుజసింహ ♦ కష్టంబిది నీ
కును నేలవచ్చెనో నీ, మనమున యోజింపవయ్య ♦ మానితనియతిన్. ౧౪

---

1 భూమే శ్చలనం కదాచి దితిశేషః-అని మహేశ్వరతీర్థులు. దీనిచే నొకానొకప్పుడు భూకంపము గలుగునని సూచితము. భూకంపాదులు గణితగమ్యములు కావనియు, నవి యుత్పాతములనియు మనపూర్వులు సిద్ధాంతము చేసిరి. కాని యీకాలములో తెలియకపోయినను దెలిసినట్లు నటించు పండితమ్మన్యులవలె నటించువారుగారని యెఱుంగుటయే విధి. 2 సుమహాంత్యపిభూతాని-అనిమూలము. సుమహాంతి భూతాని=మాంధాతృనళప్రభృతిమహాజనా అపి-అని వ్యాఖ్య. ఇట లోనగు నలఘుభూతములని యమహద్వాచకము గాఁ బ్రయోగించుటః మనుష్యజాతి యనునర్థము ప్రధానముగా భావించి యని యెఱుంగవలయు. 3 నష్టాయా మపి వైదేహ్యాం హృతాయామపి చానఘ, శోచితుం నార్హసే వీర యథాన్యః ప్రాకృత స్తథా-అని మూలము.

తే. ప్రాజ్ఞు లప్పటికిందగు ♦ ప్రజ్ఞవలనఁ
గలుగనున్న శుభాశుభం♦బులను దెలిసి
కొనుదు; రింతకుమున్న చే♦సినశుభాశు
భములయిన కర్మముల గుణా♦ఘములనెల్ల. ౧౮౧౮ 1818

క. కనులను జూడ నశక్యము, విను మయ్యవి చేసినట్టి ♦ విధ మిది యనియుఁ
గన శక్యముగాదు ఫలము, లనుబట్టియె తెలియనగు ని♦లాస్థలి వానిన్. ౧౮౧౯

సీ. మునుచేయకున్నచోఁ♦దనరవు ఫలములు తొలిజన్మమునఁ జేయఁ♦గలుగుటనె త
గంగఁ దత్ఫలము లి♦క్కాలంబునం బొందవలసి యున్నవి గాన ♦ వగవనేల?
మును రామ! నీవె నా♦కును వీనిని బహుభంగులన్ దెల్పినవాఁడ వి♦ట్టి
సర్వజ్ఞుఁడవగు నీ♦కుర్వి నెవ్వండిఁక బోధింపఁగలఁడు? వి♦బుధగురుండు

తే. నైన బోధింపఁజాలునే ♦ యసదృశమగు
నీదుబుద్ధి మహాప్రాజ్ఞ! ♦ నిర్జరులకు
నైనఁ గలుగంగఁజాలునే; ♦ యైన నిప్డు
[1]నీదుజ్ఞానము దుఃఖాబ్ధి♦నిన్ మునింగె. ౧౮౨౦ 1820

క. కనుకన్ దానిన్ నేనుస్, మునుపటివలెఁ బ్రజ్వరిల్లి ♦ పొలయఁగ జేయం
గను బూనినాఁడ నింతియె;, మనువంశవరేణ్య! దివిజ♦మండలినెల్లన్. 1821

ఆ. సాత్త్వికం బటంచు, ♦ దైత్యాసురముఖ్యులా
మనుజలోకనిలయు♦లను గృహార్హు
లనుగ నెఱుఁగు జగము♦లను మాపఁజాలు నీ
విక్రమంబుఁ గనుము ♦ విమల ధిషణ! ౧౮౨౨ 1822

క. సురముఖ్యులందు నింకన్, బరాక్రమముఁ జూపుటరయ ♦ బాగెటులని నీ
వరమతిఁ దోఁచును నిఁక నీ, [2]పరులెవరొ ప్రయత్నపడుమ ♦ వారింజంపన్.

క. మనుజవరా! సర్వధ్వంసనమునఁ దగు లాభ మేమి ♦ సమకూడున్? బా
పునివైరి నెఱిఁగి వానిన్, వినాశమును బొందఁజేయు♦వృత్తిఁ దగుఁ జుమీ.

అఱువదియాఱవ సర్గము సంపూర్ణము.

---

## ౬౭ - వ సర్గము.

రాముఁడు జటాయువుం గని శోకించుట.

క. అని తమ్ముఁడు లక్ష్మణుఁ డో, య్యన సారతరంబుగాఁ ♦ నవుడాడినమా
టను సారగ్రాహియెగా,వున జ్యేష్ఠుండైన రాఘ♦వుఁడు గైకొనియెన్. ౧

తే. అమ్మహాబాహుఁడౌ రాముఁ ♦ [3]డాత్మకోప
మడఁచుకొని చిత్రమైన శ♦రాసనంబుఁ

---

1 శోకేనాభిప్రసుప్తం తే జ్ఞానమ్-అనిమూలము. 2 ఇక్ష్వాకువృషభావేక్ష్య యతస్వద్విష తాం వధే-అనిమూలము. 3 ప్రవృత్తం కోప మాత్మనః-అనిమూలము.

బట్టి లక్ష్మణుతోఁ బల్కె ♦ వత్స! యింక
నేమిచేయుద మెచ్చటి ♦ కేగుద మిఁక. ౨౹ 1826

ఉ. జానకి నేయుపాయమునఁ ♦ జక్కఁగఁ జూడఁగలాము యిమ్మహా
కాననమందు నెన్నమని ♦ కాంతనుగూర్చి మహార్తి నొందుచున్
దీనతనొందు రాఘవు న♦తిస్థిరబుద్ధి సుమిత్రపట్టి పెం
పూనిన దృష్టిఁజూచి వగ♦నొందియు నిట్లనిపల్కె; రాఘవా. ౩౹ 1827

క. కాననమిదె సుమ్ము జన,స్థానం బన నొప్పు బహువి♦ధద్రుమవల్లీ
మానితము దీనియందే, దానవనికరములు తిరుగుఁ ♦ దగు నిటు వెదుకన్. ౪౹

సీ. పర్వతదుర్గమ♦భాగముల్ పాషాణసంధులు భిన్నపా♦షాణభాగ
ములు బహువిధమృగ♦ముల నిండిభయదంబులగుగుహాలునుమఱి♦యమలకిన్న
రావాసములు బహు♦శాయతగంధర్వభవనముల్ గలవిందు ♦ వానినెల్ల
ననుఁ గూడి వెదకఁద♦గును నీకుఁ బురుషవృషభ! నిన్నుఁ బోలిన♦సాధుబుద్ధి

తే. యుతులు సుమహాత్ములౌ వార ♦ లురుసమీర
వేగములకు మహీధర♦వితతి గదల
నట్లు లాపదలకుఁ జంచ♦లాత్మకులును
గారు రామా! యటంచు ల♦క్ష్మణుఁడు పలుక. ౫౹ 1829

ఉ. జానకి కానరామికి నె♦సంగెడుకోపముతోడఁ దమ్ముఁ డెం
తో నయమొప్పఁ బల్క విని ♦ యుగ్రతరంబగు కర్తివాతియ
మ్మూని శరాసనంబున మ♦హోగ్రముగాఁ గడుఁగూర్చి వేగ యా
కాననమంతయుం దిరిగెఁ ♦ గాంతను జూచెడువేడ్కఁ దమ్ముతోన్. ౬౹ 1830

చ. వనమున నొక్కచో నతఁడు ♦ పర్వతకూటముభంగి నెత్తుటన్
దనువు మునుంగ భూమిఁ బడి ♦ తద్దయు నార్తినిఁ బొందియున్న ప
క్షినికరనాథు నుత్తమునిఁ ♦ గేవలపీడితునిన్ జటాయువుం
గనియె; గిరీంద్రశృంగమనఁ♦గాఁ దగునాతనిఁ గాంచి యుగ్రుఁడై. ౧౦ 1831

చ. అనుజునిఁ గాంచి యిట్లనియె ♦ నాజనకాత్మజ వీనిచేతనే
తినఁబడియుండు నిశ్చయము; ♦ దృప్తుఁడు దైత్యుఁడు గృధ్రరూపముం
గొని యిట నున్నవాఁ డిది త♦గున్ జలజాయతనేత్ర జానకిన్
దిని సుఖరీతి నిందుఁ దమిఁ♦దీరఁ జెలంగెడువాఁడు లక్ష్మణా!. ౧౧౹ 1832

క. విను మిప్పు డజిహ్మగములు, గనదాస్యము లుగ్రములగు ♦ కాండంబుల వీ
నిని జంపెద నని పలుకుచు, ఘనతరకోపమున తూరని♦కాళశరంబున్. ౧౨౹

క. ధనువున సంధించి మహా, వననిధిపర్యంతమైన♦వసుధన్ వడఁకం
గను జేయునటు జటాయువుఁ, గనుచుం బరుగిడియెఁ; బక్షి♦కాంతుం డంతన్,

సీ. దీనుఁడౌ దశరథ♦సూనుని వీక్షించి ఫేనరక్తంబులు ♦ వెడలఁ గ్రక్కు
చును దీనవాక్యంబు♦లను బల్కెఁ; నోయియాయుష్మంతుఁడాయిట♦నోషధివలె
నెవ్వతె వెదకుచు ♦ నిందువచ్చితివో యాసాధ్వి నాయసువుల ♦ సమదవృత్తుఁ
డైన రావణుఁడు తాఁ ♦ బూని హరించెను మీరలిద్దఱు లేని♦కారణమున
తే. బలము మిగులంగఁ గలిగిన ♦ యలసురారి
యవనిజాతను గొనిపోవ ♦ నరసి చూచి
నాఁడ నపహృతయయిపోవు ♦ నాతిఁ గాంచి
యామె కెదురుగఁబోయి క♦య్యమున దనుజ. ౧౫ 1835

క. నిలిపి యిటం దద్రథమును, బలుశకలంబులుగఁ జేసి ♦ వానిని ధరణీ
స్థలికిం దిగునటు చేసితిఁ, గలనన్ నే విఱిచినట్టి♦కార్ముక మిదిగో. ౧౬ 1836

క. నే విఱిచినకవచం బిది, యావానిదె యనికిఁ దగిన♦యరదం బిదిగో
నే విఱువఁ బుడమిఁబడినది, రావణునిదె సుమ్ము యుద్ధ♦రథ మోరామా. ౧౭

క. నాపక్షస్పర్శంబున, నీపగిదిం బడినయాతఁ♦డే సారథియా
నాపాపాత్ముం డలసిన, నాపక్షంబులను గ్రుధను ♦ నఱికెం గత్తిన్. ౧౮ 1838

క. పక్షచ్ఛేదంబున నే, నీక్షితిఁ బడియుండఁ జూచి ♦ యింతిం గొని యా
రక్షోనాథుఁడు నింగికి, నాక్షణమే యెగిరిపోయె; ♦ నాతఁడు నన్నున్. ౧౯

క. మునుపే వధియించెం గా,వున నీవున్ మరల నన్నుఁ ♦ బొలియింపకుమా
యన నప్డు జటాయువు సీ,తనుగూర్చి వచించినట్టి ♦ తత్ప్రియవార్తన్. ౨౦

క. వినినంత బాష్పపూర్ణా, ననుఁడై ద్విగుణీకృతార్తి ♦ నాతిశిన్నై పొం
దెను; నంత గృధ్రరాజును, దనివారఁగఁ గౌఁగిలించి ♦ తద్ధనువరమున్. ౨౧

క. ధరణిం బడవైచి వగం, బరవశుఁడై మూర్ఛమున్గె ♦ వసుధంబడి సో
దరుఁడును దానును విలపిం,చిరి; రాముం డంత నొంటిఁ ♦ జిక్కి యటవిలోన్.

[1]సీ. వల్లువెల్లను నల్లి♦బిల్లిగ నల్లుట నెవరును బోరాని♦యిఱుకుదారిఁ
గరుణతోఁ దోడ్పడఁ♦గాఁ దగు మహనీయు లొక్కరైనను లేక♦యుగ్రదనుజు
మారొక్కనిహతుఁడయి♦మహిఁబడియతికష్టముననను నిట్టూర్పుగ♦ములనువిడుచు
చున్నజటాయువు♦నొగిఁగాంచి రాముండు పెనుదుఃఖమునలక్ష్మ♦ణునిఁగనుఁగొని
తే. పలికె రాజ్యముపోయెను ♦ వననివాస
మయ్యె, సీతయుఁ జనియె, ద్వి♦జాధిపుఁడు ని
[2]హతుఁడె యయ్యె దౌర్భాగ్య మి♦య్యది మదీయ
మగ్నినైనను గాల్చునే ♦ యక్కటకట. ౨౩ 1843

---

1 ఏక మేకాయనే దుర్గే-అనిమూలము. దుర్గే = లతాకంటకసంకీర్ణతయా కేనాపి ప్రవేష్టు మశక్యే-అనివ్యాఖ్య. 2 ఈదృశీయం మమాలక్ష్మీ ర్నిర్దహే దపి పావకమ్-అనిమూలము.

క. వినుమీ తాపము పోవ భు,వనపూర్ణమహాబ్ధిలోనఁ ♦ బడితినయేనిన్
వనరాశియు దౌర్భాగ్యం,బున నే తా నెండిపోవుఁ♦బో నిజ మిదియా. ౨౫

క. పెనుదుఃఖము లనువలలన్, బనివడి చిక్కితిని నీయు♦భవ్యుండగు న
న్నును మించిన నిర్భాగ్యుఁడు, కనరాఁడు చరాచరములు ♦ గలజగమందున్.

క. జనకునిమిత్రుండగు నీ, ఘనమూర్తి ద్విజోత్తముండు ♦ కానన్ ముదిమిన్
గనియును నాదురదృష్టం,బున హతుఁడై యున్నవాఁడు ♦ భూస్థలి నకటా. ౨౭

చ. అని పలుభంగులం బలికి ♦ యాతఁడు తమ్మునితో జటాయువున్
జనకునియందుఁ జూపఁదగు ♦ చక్కనిమైత్రిని జూపుచుం గరం
బునఁ దడవెన్; స్వపక్షములు ♦ పోవఁగ నెత్తుటదోఁగి భూస్థలం
బునఁ బడియున్నగృధ్రవిభుఁ ♦ బొక్కుచుఁ గౌఁగిటఁజేర్చి యంతటన్. ౨౮

తే. నాకుఁ బ్రాణసమానయా ♦ నాతి యెచట
నున్నదో చెప్పుమా యని ♦ యురుతరమగు
దుఃఖమునఁ బల్కుచున్ మాట♦తోనపడియె
భూతలంబున రఘువంశ♦భూషణుండు. ౨౯ 1848

అఱువదియేడవ సర్గము సంపూర్ణము.

## ౬౮ - వ సర్గము.

—జటాయువునకు రాముం డగ్నిసంస్కారాదులను జేయుట.—

క. శ్రీరాముఁడు భయదుండగు, నారావణుఖడ్గధార ♦ నవనిఁబడినయా
కారుణికిని బక్షీంద్రునిఁ, [1]గూరిమిఁ గని మైత్రి నెఱపు ♦ కూర్చు ననుజుతోన్.

క. [2]ఈపక్షీంద్రుఁడు నిజముగ, నాపనికై పూని యనిమొ♦నన్ సురరిపుచే
నాపాపాత్మునిచే హతుఁ,డై పడి విడువంగరాని♦యసువుల నిచటన్. ౧౪ 1850

ఆ. విడువనున్నవాఁ డి♦పుడు; లక్ష్మణా! వీని, తనువునందు నిదిగో ♦ కనఁబడియెడు
నల్పమైన ప్రాణ♦మందున నితఁ డల్ప, మౌనస్వరమున బాధ♦నంది యిపుడు. ౨౫

చ. కనఁబడుచున్నవాఁడు వెతఁ♦గాంచినయట్లును విహ్వలించురీ
తిని నని పల్కి పక్షివర! ♦ తెల్పుము వాక్యము చెప్పశక్తి నీ
తనువున నుండెనేని వని♦తామణివార్త శుభంబు నీకగున్
దనుజుఁడు నిన్నుఁ జంపినవి♦ధంబును జెప్పుము మెల్లమెల్లఁగన్. ౮ 1852

క. జనకజ నేటికి దొంగిలి,కొనిపోయెన్ రావణుండు ♦ కోమలి బలిమిన్
గొనిపోవునంత యపకృతి, నొనరించితినేమి యతని ♦ కుగ్రత నేనున్. ౫ 1853

---

1 సౌమిత్రిం మిత్రసంపన్నమ్ - అనిమూలము. 2 ప్రాణాం స్త్యక్ష్యతి దుస్త్యజాన్-అని మూలము.

క. పతగోత్తమ శశిబింబము, గతి నింపగుసీతనెమ్మొ♦గం బప్పుడదే
గతినుండె? నేమిచెప్పెను, సతి యాకాలమునఁ జెప్పుమ ♦ సరగుఁ నాకున్. ౬

సీ. [1]తండ్రి! యాతనివీర్య♦తత్త్వ మెట్టిది? వానియాకార మెట్టిది? ♦ యతనికర్మ
జాల మెట్టిది? తద్వ♦సతి యెందునుండును? నడుగుచున్నాఁడ నా ♦ కవ్విధంబుఁ
జెప్పుమా; యని దీన♦చిత్తుఁడై యెప్పుడు పలవించుచున్నభూ♦పవరురాముఁ
గని జటాయువుగళ♦స్వనమెంతొ హీనమై వినఁబడఁబల్కెను ♦ వినుము రామ;

తే. దనుజపతి రావణుఁడు మాయఁ♦గొనుచుఁ బెద్ద
గాలి మబ్బులఁ బుట్టించి ♦ లీల నంధ
కారమును గ్రమ్మఁజేసి యా♦కాశమార్గ
మునను సీతను దొంగిలి♦కొని చనియెను. ౯ 1855

క. విను మేను బడలియుండం, గని నాపక్షద్వయము దె♦గన్ నఱికి వెసన్
దనుజుండు నాయనా! సీతను జేకొని పూన్కిఁ జనియె ♦ దక్షిణదిశకున్. ౧౦

సీ. నాప్రాణములు మర♦ణంపువేదనఁ గుంది తత్తఱపడియెడి ♦ నిత్తరుణము
నందె నాదృష్టియు ♦ నందెడిభ్రాంతిని [2]వట్టివేళ్లను జేయఁ♦బడిన యగ్ర
ములుగలబంగారు♦భూరుహంబులు మృతికాలంబుఁ దెలుపుచుఁ♦గనఁబడియెడి;
నే ముహూర్తమ్మున ♦ నింతిని దనుజుఁడు కొనిపోయె నాలగ్న♦మున వినష్ట

తే. విత్త మతివేగముగఁ దన♦విభుని జేరు;
విందమని యాముహూర్తము ♦ పిల్వఁబడును
నతని కీరీతి తెలియ ద♦క్లాట మరల
సీతనుం బొందుదువు తండ్రి ♦ సిద్ధమిద్ది. ౧౨ 1857

చ. దనుజవిభుండు రావణుఁడు ♦ తన్వి హరించి తొలంగిపోయినం
తనె బ్రదుకంగనేర్చునొకొ ♦ తానును గాలముమ్రింగినట్టి మ
త్స్యనికరమట్లు నాశనము♦నందును వేగమె; సీతఁగూర్చి నీ
మనమునఁ జింతనొందకుము ♦ మానధనా! యని వానిఁగూల్చుచున్. ౧౪

చ. తరుణినిబొంది యట్టిప్రమ♦దామణితో విహరింతు వీవు భూ
వర యని తెల్వి దప్పకయె ♦ పల్కెను పక్షివరుండు నత్తఱిన్
మరణము జేరువన్ మెలఁగ ♦ మాటలు రాకయె నోటినుండి నె
త్తురుపలలంబుతోఁ దొరఁగెఁ ♦ దోడనె పక్షివరుండు పూన్కితోన్. ౧౫

తే. విశ్రవసునకు నాదైత్య♦పీసుఁ డౌర
సుండు వైశ్రవణునకుఁ ద♦మ్ముం డటంచు
నింతమాత్రమె పల్కి యా♦మృత్యుబాధ
నేమియును బల్కఁజాలక ♦ రాముఁ గనుచు. ౧౬ 1860

1 క్వచాస్య భవనం తాత - అనిమూ. 2 పశ్యామి వృక్షాన్ సౌవర్ణా నుశీరకృతమూర్ధజాన్ - అనిమూ.

తే. [1]దుర్లభములగు ప్రాణత♦తులను విడిచెఁ;
గరయుగము మోడ్చి యాపక్షి♦కాంత! చెపుము
చెపుము యని రాఘవుఁడు వేఁడు♦నపుడె యతని
యసువు లంగము విడి యేగె ♦ నంబరమున. ౧౯ 1861

సీ. పతగేంద్రుఁ డప్పుడు ♦ మృతిబాధచేఁ దలధరనుంచి తనదుపా♦దములు సాఁచి
తనువును విదులుచు♦చును సీతకృపచేత నింతకాలము భరి♦యించియుండి
నట్టి ప్రాణమ్ముల ♦ నప్పుడె వదలి భూమినిఁ బడియుండెను ♦ దనశిరంబు
వాల్చుటచే నెట్టఁ♦బాఱిన కన్నులు గలిగి మృతుండయి ♦ యిలనుబడిన
తే. పర్వతాకారు నాపక్షి♦పతిజటాయు
వును గనుంగొని చాల వ♦గను బొగులుచుఁ
దమ్మునింగని యిటువల్కె ♦ దనుజవాస
మైన యీదండకారణ్య♦మందు నితఁడు ౨౦ 1862

క. [2]అనుజా! బహువత్సరములు, మనమునకుఁ హాయిగాఁ గ్ర♦మంబున నుండెన్
గనుమా యిచటనె మృతినిం, గనియెన్ బహువత్సరముల♦కాలము బ్రదికెన్.
ఆ. ఇంతవయసు గలిగి ♦ యింతకాలము శుభ,వృద్ధినుండి యిప్పు ♦ డితఁడు గూడ
చచ్చి నేలమీఁద ♦ శయనించియున్నాఁడు, [3]కాల మెవ్వరికిని ♦ గడవరాదు.
క. కను మీజటాయు వాసీ,తను గాచు మహోపకార♦తత్పరుఁడై వే
చని బలవంతుండగు న, ద్దనుజునిచే నిహతుఁ డగుచు ♦ ధరణింబడియెన్. ౨౨
తే. తండ్రితాతలనుండియుఁ ♦ దమకులమున
కంతరము లేక వచ్చెడు ♦ నధికమైన
గృధ్రరాజ్యంబు విడిచి నా♦కే యుపకృతిఁ
జేయఁగాఁబూని యాపక్షి ♦ చెందె మృతిని. ౨౩ 1866

[4]తే. పక్షిమృగజాతులందును ♦ బరమధార్మి
కులు శరణ్యులు మఱియు శూ♦రులును నైన
సాధువులు భూమి నెల్లెడ ♦ సహజ! కానఁ
బడుచు నున్నారుగద పరో♦పకృతిఁ జేయ. ౨౪ 1867

క. ప్రమదాహరణజమగుదుః, ఖము సౌమ్య! జటాయు మృతిని ♦ గల్గెడునీదుః
ఖమువలె దుస్సహముగ నా, దునుదికి నిటఁ దోఁపలేదు ♦ ధూర్తయమనిభా.
సీ. నాపనికనియె యీ♦నయగుణసాంద్రుండు పొలిసెఁగా; శ్రీమంతుఁ♦ డలఘుకీర్తి
మంతుఁడౌ దశరథ♦క్ష్మాపతి యెట్టులో యీపక్షినాథుఁ డ♦ట్లే సుపూజ్యుఁ

---

1 ఇత్యుక్త్వా దుర్లభాన్ ప్రాణాన్-అనిమూ. 2 బహూని రక్షసాం వాసే వర్షాణి వసతా సుఖమ్, అనేన దండకారణ్యే విశీర్ణమిహ పక్షిణా-అనిమూ 3 కాలోహి దురతిక్రమః-అనిమూ. 4 సర్వత్ర ఖలు దృశ్యంతే సాధవో ధర్మచారిణః, శూరా శ్శరణ్యా స్సౌమిత్రే తిర్యగ్యోనిగతే ష్వపి=అనిమూ

డగు మాన్యుఁడగు నాకు; ♦ ననుజా! జవంబునఁ గాష్ఠంబులం దెమ్ము; ♦ కడఁగి వాని
మథియించి యిప్పుడె ♦ మహితాగ్నిహోత్రుని సేకరించి మహాత్ము ♦ నాకుఁగానె
తే. మరణమొందిన యీగృధ్ర ♦ వరున కిచట
నగ్నిసంస్కార మొనరింప ♦ నాత్మఁ గోరు
వాఁడ; రౌద్రసురారిచేఁ ♦ బడినయితనిఁ
బక్షినాథునిఁ జితిఁ జేర్చి ♦ పరమభక్తి. ౩౦ 1869

[1]సీ. దహనము చేయఁగా ♦ దలఁచెద; నోమహాసత్త్వ! గృధ్రేశ్వర! ♦ సాధుచిత్త!
సతతము క్రత్వనుష్ఠానమందాసక్తి గలగృహస్థులకు లో ♦ కమదియేదో
పంచాగ్నులకు మధ్య ♦ భాగంబునన్ సదా తపము మహాభక్తి ♦ తనరఁ జేయు
నయమార్గమూను వా ♦ నప్రస్థునకు నేది కనఁదగు లోకమో ♦ కానకేగ
వలయు నందుండి మ ♦ రలుచు రానేగూడ దని చెప్పఁబడినట్టి ♦ యతుల, కట్లె
భూభోగముల నెల్లఁ ♦ బోవిడిచిన నైష్ఠికులకు, నేలోకమో ♦ కోర్కి మీఱఁ
నయ్యనుత్తమము ల ♦ త్యంతసుఖాస్పదములు నగు నాలోక ♦ ములను నీవు
మత్సంస్కృతుండవై ♦ మదనుజ్ఞనుం బొందిపొందుమా యనిపల్కె ♦ భూరిధర్మ
తే. చిత్తుఁడా రాఘవుం డిట్లు ♦ చెప్పి పక్షి
పతిని దీపనార్థంబయి ♦ పరఁగుచితిని
జేర్చి దుఃఖితుఁడై ప్రియ ♦ స్వీయబంధు
వునువలెన్ దహియించెఁ జ ♦ క్కనివిధిగతి. ౩౧ 1870

క. తరువాత వీర్యయుతుఁడయి, పరఁగెడు రాముండు వేగ ♦ వనమునకు సహో
దరుతోడ నరిగి పెనుకే, సరి మృగములఁ బక్షికొఱకుఁ ♦ జంపి యొకభువిన్.

తే. పిండదానము చేసెడు ♦ వేడ్క దర్భ
లను విధిం బఱచెను; మఱి ♦ యనఘచిత్తుఁ
డమలయశుఁ డామృగంబుల ♦ నచటఁ గోసి
పలలములఁ దీసి పిండాకృ ♦ తులుగఁ జేసి. 33 1872

[2]క. హరితంబగు శాద్వలమయ, ధరణిం బక్షీంద్రునకు ని ♦ తాంతము తృప్తిం
బరమాదరము నొసంగం,గ రాముఁ డవ్వాని నొసఁగె ♦ గౌరవ మలరన్.

---

1 యాగతి ర్యజ్ఞశీలానా మాహితాగ్నేశ్చ యాగతిః, అపరావర్తినాం యాచ యాచ భూమిప్రదాయినాం, మయా త్వం స మనుజ్ఞాతో గచ్ఛ లోకా ననుత్తమాన్, గృధ్రరాజమహాసత్త్వ సంస్కృతశ్చ మయా వ్రజ-అనిమూలము. దీనికి వ్యాఖ్యాతలు పెంచిపెంచి యర్థమును వ్రాసిరి. దానిసారమే యిటఁ గనవచ్చును. పశుపక్ష్యాదులకుఁ గర్మము చేయు నధికారము లేకుండినను నాయాజ్ఞచే సకలమహోత్తమకర్మములను జేసినవారికిం గల్గుపుణ్యలోకంబులం బొందుమని శ్రీరామమూర్తి తనసర్వేశ్వరత్వమును దెలిపె ననుట దీనినుండి పాఠకులు గ్రహింపవలయును.
2 రమ్యే హారితశాద్వలే-అనిమూలము.

తే. మరణ మొందినవారికి ♦ ధరణిసురులు
స్వర్గదంబని జపియించు ♦ సముధికపితృ
దేవతాకముగాఁ దగు ♦ దివ్యమంత్ర
మును జటాయువునకుఁగ రా♦ముఁడు జపించె. ౩౪ 1874

క. నరవరసుతు లాయిరువురు, తరువాతన్ గౌతమికిని ♦ దగఁ జని పక్షీ
శ్వరునకు జలతర్పణము నొ,నరించి రెంతయును దమ మ♦నము లడలంగన్.

సీ. రామలక్ష్మణులు శా♦స్త్రంబునఁ జెప్పంగఁ బడినరీతిని బక్షి♦పతినిగూర్చి
గోదావరీ నదిఁ ♦ గ్రుంకి తర్పణములఁ గావించి; రతఁడును ♦ గ్రద్దయయ్యు
నతిభక్తుఁ డౌటచే ♦ నత్యంతపరిశుద్ధుఁడై వైదికంబుగ ♦ నలరుకర్మ
మునకుఁ బాత్రుండయ్యె; ♦ జనకసుతానిమిత్తమయి యుద్ధముచేసి♦దనుజుచేత

తే. మడిసెఁ గాన దుష్కరమని ♦ మహిఁ జెలంగు
కర్మమును జేసి సత్కీర్తిఁ ♦ గాంచె మఱి మ
హర్షిసముఁడగు రాఘవుం ♦ డట్లు ప్రీతి
నగ్నిసంస్కారముఖముల ♦ నాచరింప. ౩౫ 1816

క. ఆబలమున నాక్షణమే, యాబలిముఖ్యులును బొంద♦నట్టి పదంబుం
దాఁ బొందెఁ; ద్రిదశనాథులు, గాఁ బొల్చిన విష్ణుశక్ర♦కల్పులు సహాజుల్.

తే. పతగమునకుఁ బిండోదక♦ప్రముఖకార్య
ములు నొనర్చుచు నాతని♦పలుకు నమ్మి
యంత సీతను వెదకుట ♦ కాత్మనిలిపి
వనమునకుఁ బోయి రెంతయు ♦ వనటఁ గుంది. ౩౬ 1878

అఱువదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

౬౯ - వ సర్గము.

అయోముఖిని విరూపనుగాఁ జేయుట.

క. జలతర్పణములు పక్షికి, సలిపి సహోదరులు వారు ♦ సరగున సీతం
గలయన్ వెదకుచుఁ జనిరి, మ్ములఁ [1]దక్షిణపశ్చిమముగఁ ♦ బొలిచెడు దిశకున్.

క. శరచాపఖడ్గములనున్, ధరియించి సురారిదెసకుఁ ♦ దరలి చనుచు నె
వ్వరు నడువనిత్రోవను బో,యిరి పిదపన్ భూరిబలస♦మృద్ధులు వారల్. ౨

సీ. తరుగుల్మసంవేష్టి♦తంబయి లతలచే నావృతంబయి యున్న♦యమ్మహాట
విని దాఁటిపోయి రా♦వన మెల్లతావులఁ జన నశక్యంబయి ♦ కన భయంక
రంబయి వెలసెఘో♦రంబులౌ వ్యాళముల్ సింహంబులును నందుఁ♦జెలఁగుచుండె
మిగుల భీమంబుగాఁ ♦ దగుదాని గడచిన తరువాత వారు ని♦తాంత తేజు

---

1 పశ్చిమాం జగ్మతు ర్దిశమ్-అనిమూలము. పశ్చిమాం దక్షిణపశ్చిమా మిత్యర్థః-అనివ్యాఖ్య.

తే. లాజనస్థానమును దాఁటి ♦ యవల మూఁడు
క్రోశములు పోయి యందొక ♦ గూఢవనముఁ
గ్రౌంచనామంబుఁ జొచ్చిరి ♦ కడుఁ గగమ్య
మగుచు నొప్పెను వనమది ♦ యందువారు. ౫ 1881

క. వనితాపహృతికి స్రుక్కుచు, వనటం బొందుచును బోయి ♦ పలువన్నెలచేఁ
దనరు జలదౌఘమట్టులు, కనఁబడి సంతుష్టమైన ♦ కరణిఁ బొలుచుచున్. ౫½

క. నానాపక్షిగణంబుల, నానామృగసర్పతతిపి ♦ నద్ధంబయి పెం
పూనిన యవ్వనమంతయు, జానుగ భాసిల్లె నందు ♦ క్ష్మాపతితనయుల్. ౬½

క. జనకజఁ జూడంగోరుచు, వనమంతట వెదకి వెదకి ♦ వనితంగన క
వ్వనమును దాఁటి మతంగుం, డనుమునియాశ్రమమునందు ♦ నరుగుచు నంతన్.

తే. తూర్పుగా మూఁడుకోసుల ♦ దూర మరిగి
యాశ్రమక్రౌంచవనముల ♦ యంతరమున
భయదముగఁ గానఁబడు నొక ♦ వనముఁ గాంచి
రది భయంకరమృగపత ♦ గాళిఁ గూడి. ౮½ 1885

క. పలువిధసత్వంబులతోఁ, జెలఁగుచుఁ జొరరానియట్టి ♦ క్షితిరుహములతో
వెలయుచునుండెను దానం, గలయన్ వెదకుచును వారు ♦ క్ష్మాస్థలి నొకచోన్.

సీ. పాతాళలోకంబు ♦ భంగిని లోఁతైన
గుహఁ గాంచి రయ్యది ♦ గొప్పతిమిర
మునఁ గప్పఁబడి యెప్డు ♦ కనరాకయుండు; న
ప్పురుషవరేణ్యులా ♦ భూస్థలంబుఁ
గనఁబోయి దానిచెం ♦ తను బృహత్కాయంబు
వికృతాస్యమును గల ♦ యొకసురారి
వనితను జూచి రా ♦ దనుజాంగనయు నల్ప
సత్వులకెంతయు ♦ సాధ్వసంబు

తే. గలుగఁ జేయుచు నేవను ♦ గల్గఁ జేయు
నట్టిరూపంబునం బొల్చి ♦ యధికరౌద్ర
నయనములతోడఁ దీక్ష్ణదం ♦ తములతోడ
లంబమానోదరముతోడ ♦ లలిఁ జెలఁగుచు ౧౨ 1887

క. తనువెత్తుగాఁ గనంబడఁ, గను జర్మము బిఱుసువాఱఁ ♦ గా భీమమృగా
ళిని దినుచు వికటయై విరి, సినవెంట్రుక లొప్ప వెలసి ♦ క్షితి నటనుండెన్. ౧౨½

క. సోదరు లిద్దరు గుహయం, దాదైత్యాంగనను గాంచి ♦ రది గని వారిన్
గాదిలియన్నకు ముందట, నే దగఁ జను లక్ష్మణునిని ♦ నెదుటం గనియెన్. ౧౩½

క. మనమిద్దఱము రమింతము, చను దెమ్మని లక్ష్మణునిని ♦ సరగునఁ బట్టెన్
వనిత యది మఱియు నాతనిఁ, దనివారఁగఁ గౌఁగిలించి ♦ తమి నిట్లనియెన్,

తే. నే నయోముఖి యనఁబడు♦దాన నీకు
నిట లభించితి నీవు నా♦కిటఁ బ్రియుఁడవు
దొరకితివి నాయకా! వీర♦వర! యలరుచు
బ్రదికియుండినదనుక నై♦భవము మీఱ. ౧౫ 1891

చ. ధరశిఖరంబులందుఁ బ్రమ♦దంబున శైవలినీవతంసకాం
తరముల వెల్గుచున్న సిక♦తాస్థలమండలమందు నన్ను నా
దరమునఁ గూడి సంతతము ♦ దర్పకకేళులఁ దేలుచుండు మి
ట్లురుగఁగనేల యన్నదను♦జాంగనపల్కులు నాలకించుచున్. ౧౬ 1892

క. అరిసూదనుఁడు సుమిత్రా,వరపుత్త్రుఁడు కుపితుఁడగుచు ♦ భాసిలుఖడ్గం
బు రయమున నెత్తియొక్కటఁ, దరుణీశ్రుతినాసికలను♦ స్తనములఁ ద్రెంచెన్.

ఆ. శ్రవణనాసికలొగి ♦ సరగున ఖండింపఁ, బడినయంత భయద♦వపువు గ్రాల
దనుజనారి వికృత♦నినదంబుచేయుచు, వచ్చినట్టిదారిఁ ♦ బట్టిపోయె. ౧౮ 1894

చ. ఇరువురు సోదరుల్ వనిత ♦ యేగినయంతనె శౌర్యనూని భీ
కరముగ నవ్వనంబునకుఁ ♦ గాంతకునై చన దుర్నిమిత్తముల్
వరుసఁ గనంబడెన్ శుచిత♦భాసిలఁ దేజము సొంపుమీఱఁగా
నిరుపమసత్త్వమున్ వెలయ ♦ నిర్మలశీలము చెల్వమీఱఁగాఁ
బరఁగు సుమిత్త్రనందనుఁడు ♦ భ్రాతను భాసురతేజుఁ గాంచుచున్. ౧౯

చ. కరములుమోడ్చి యిట్లనియెఁ ♦ గారణమేమొ యెఱుంగ నవ్యమా
కరము చలించుచున్నయది ♦ గాఢతరంబుగ నామనంబు ని
ర్భరమగుకంపమును గనియె ♦ వారక పెక్కులు దుర్నిమిత్తముల్
కరము భయంకరంబులుగఁ ♦ గన్పడుచున్నవి మీఁదమీఁదఁగాన్. ౨౦ 1896

క. కావున నార్యా! వేగమ, నీవాయత్తపడియుండు ♦ నేఁ జెప్పినయ
ట్లీవు హితంబుగఁ జేయుము, భావింపఁగ దుర్నిమిత్త♦పటల మిది యిఁకన్.

ఆ. భయము నాకె కల్గ♦వచ్చునటంచును
దెలుపుచున్నయది; యి♦టులనె మిగుల
[1]భయముఁగొలుపుచున్న♦పక్షి పంచులక మి
య్యది ధ్వనించుచుంట ♦ నరయ మనకు. ౨౨ 1898

క. అని జయము కలుగునని చక్రనిరీతిని దెల్పునట్లు♦గాఁ గన్పడెడిన్
వినుమా యనె; వారిరువురు, వనినందుఁ బరాక్రమమున ♦ వనితవెదకుచున్.

క. చనుచుండ నంత నట నా, వనమును భంజించునట్లు ♦ పర్వెఁ బెనురవం
బనిలుండు నభమునంతటఁ, బెనుగతి వ్యాపించునట్టి♦విధమున నచటన్. ౨౪

క. వనమునఁ గల్గినధ్వని యది,యును నభమును నిండఁజేయు♦నోజం జెలఁగెన్;
నినదం బది యెచ్చటిదో, యని తెలియఁగఁ గోరి రాముఁ ♦ డనుజాన్వితుఁడై.

1 పేషపంచులకో నామ పక్షీ పరమదారుణః-అనిమూలము.

—కబంధదర్శనము.—

చ. చని యొకగుల్మమందున వి♦శాలతరంబగు వక్షమొప్పఁగాఁ
బెనుతను వుగ్రరీతిఁ దగ ♦ వింతఁగఁదోఁచు నిశాచరుం గనేఁ
గనుఁగొనినంత సోదరులు ♦ క్రన్నన ముందట నున్నయాదురా
త్మునికడకేగి; రాతఁడును ♦ ధూర్తతఁ గంఠశిరోవిహీనుఁడై. ౨౮౹ 1902

తే. పొడవుగా నిక్కి నోరును ♦ గడుపునందె
యలరఁగా మొండెమట్లుగ ♦ నమరియుండె;
మఱియుఁ దీక్ష్ణములైన రో♦మములు గలిగి
భూరిభూధరమట్లుగాఁ ♦ బొలిచి యతఁడు. ౨౯౹ 1903

సీ. నీలమేఘమువలెఁ ♦ గ్రాలుచు రౌద్రుఁడై యుఱుమునాఁదగుస్వర♦మొప్పవెలసె
వక్షమ్మునందున్న♦వదనంబున న్నేత్ర మొక్కటి కనఁబడె ♦ నుగ్రదహను
శిఖవలెమండుచుఁ ♦ జెలఁగుచుఁ బెనుఱెప్పగలిగిపింగచ్ఛాయ ♦ నెలయ విఱివి
నిడుపును నయి మఱి ♦ వడిగలచూపులు పర్వఁజేయుచు నది ♦ వఱలుచుండెఁ;

తే. బెద్దదంష్ట్రలు వెలయంగఁ ♦ బెదవులవడి
నాకుచుండెను, దద్వద♦నంబు విఱివి
యయి కనంబడుచుండె; నా♦యసురుఁ డెల్ల
భయదభల్లూకసింహద్వి♦పములఁ దినుచు. ౩౦౹ 1904

తే. మృగములం దమి నములుచు ♦ మిగుల భీతి
దములు నామడనిడివిగా ♦ నమరు రెండు
హస్తముల ద్రిప్పుచుఁ బెద్ద♦వైన యెలుఁగు
బంట్లఁ బక్షివితతులను ♦ బహుమృగముల. ౩౧౹ 1905

తే మఱియు మృగయూథపముల న♦మర గ్రహించి
చెంతకుఁ లాగికొనుచు భ♦క్షించుచుఁ దన
మదికి నిష్టములేనివా♦నిఁ దగ విడిచి
పెట్టుచుండెను నించుక ♦ వెఱపులేక. ౩౨ 1906

క. దనుజుం డిటుచేయుచుఁ జెం,తను జేరఁగ మార్గదేశము♦నఁ వచ్చిన యా
యనఘుల సోదరులం గొనఁ, దనలావున నడ్డగించి ♦ దారిని నిలిచెఁ. ౩౨౹

తే. రామలక్ష్మణు లాఘోర♦రాక్షసాంతి
కమున నొకక్రోశమాత్రము♦గాఁ జని యట
దారుణాకృతి భీమాస్య ♦ దారుణాక్షు
బాహుమర్దితమృగునిఁ గ♦బంధుఁ గనిరి. ౩౩౹ 1908

క. తనురీతిఁ బట్టిచూడఁగ, దనుజునకుం దలయె లేక ♦ దారుణరీతిం
గనఁబడ మొండెమె కలదని, మనములకుం దోఁచె; నంత♦మనుజాశనుఁడుఁ.

చ. కరములు దీర్ఘరూపములఁ ♦ గ్రాలును గావున వానిఁ జాఁచి యా
యిరువుర రామలక్ష్మణుల ♦ నెంతయు బల్మిని నొక్కరీతిఁగా
వగున నడంచి పట్టుకొనె; ♦ వారలు ఖడ్గము లొప్పుచుండ భీ
కరదృఢచాపముల్ వెలయ ♦ గాఢతరోజ్జ్వలతేజ మొప్పఁగన్. ౩౬౹ 1910

క. తనువులు రాజిల్లఁగ బల,మున మిక్కిలి యొప్పియున్ బ్ర♦భూతబలమునం
దనరు కబంధుఁడు కరముల, ఘనబలమున నొక్కి యీడ్వఁ♦గాఁ బరవశులై.

తే. చేయునది లేక యుండి; శా♦స్థిరబలుండు
శూరుఁ డగు రాముఁ డెంతయు ♦ ధీరతఁ గని
వ్యథను బొందక యే యుండె ♦ బాలుఁ డౌట
నాసుమిత్రాత్మజుఁడు మాత్ర ♦ మపుడు మిగుల. ౩౭౹ 1912

తే. ధైర్యమును బూనకుండుటఁ ♦ దత్తఱిల్లె;
నంతట విషణ్ణుఁడై రాఘు♦వానుజుండు
రామునిం గని పల్కె; వీ♦రవర! నేను
దనుజునకుఁ జిక్కి పరవశ♦త్వమును గంటి. ౩౯ 1913

క. కనుమా యిట నను వదలుము, నిను విడిపించుకొనుమింక ♦ నీవీభూతం
బునకు న్నను బలి యిడి యీ,దనుజుని వంచించి యొటకొ♦త్వరఁ బరుగిడుమా.

తే. శర్మముగఁ బొమ్ము; వేగమే ♦ జనకతనయఁ
గాంచఁగలవని నే నెంతుఁ ♦ గానఁ బొమ్ము;
జనకపై తానుమహంబగు ♦ క్ష్మాతలంబుఁ
[1]బడసి పాలించుచున్ స్మృతి♦పథమునందు. ౪౦౹ 1915

క. నను నెప్పుడు మఱువకుమా, యనుచున్ సౌమిత్రి పలుక ♦ నగ్రజుఁ డతనిం
గని యిట్లనియెన్ వీరా!,మనమున భయమొందవలదు♦మహిమ తొలఁగఁగన్.

క. నీవంటివాఁడు ధైర్యం, బేవిషయంబునను విడిచి ♦ యిట్లు విషాదం
బేవరునఁ బొందఁడే యనె, నీవిధమునఁ బలుకుచుండ ♦ నింతటిలోనన్. ౪౧౹

సీ. క్రూరుఁడౌ రాక్షస♦కుంజరుండు కబంధుఁ డాయన్నదమ్ముల ♦ నపుడు గాంచి
యంబుదధ్వని మీఱు♦నట్టి పేరెలుఁగునఁ బ్రశ్నించె మీరలె♦వ్వరొ యిరువురు
వితతఖడ్గంబుల ♦ విపులశరాసనంబులఁ దాల్చి వృషభంబు♦మూఁపులట్టి
యొగుభుజంబులు గల్గి ♦ యీభయంకరకాననస్థలంబును జేరి ♦ నాకు భక్ష్య

తే. భూతులై తిరి, మీరు చె♦ప్పుఁ డిట మీకు
నేమిపనియున్న? దిచ్చటి♦ కేలవచ్చి
తిరి? క్షుధార్తుఁడనై యిటఁ ♦ దిరుగుచున్న
నాక్షుధం దీర్పఁగావచ్చి♦నారొ యేమొ. ౪౪౹ 1918

---

1 తత్ర మాం రాఘరాజ్యస్థః స్మర్తు మర్హసి సర్వదా-అనిమూ,

క. శరచాపఖడ్గధరులయి, యురుదుగఁ గన్పడుచు, వాఁడి♦వగు శృంగములం
బరఁగు వృషభములటులమీ, రిరువురు నగియున్నవార ♦ లిఁక నెల్లెడన్. ౪౫

క. నానోటం బడిపోతిరి, కానన్ మీ ప్రాణపంచ♦కము నక్కటయే
కానఁగ దుర్లభమే యని, దానవుఁ డాదుష్టబుద్ధి ♦ తగఁ బల్కుటయున్. ౪౬

[1]క. విని రాముఁడు నోరెండఁగ, ననుజునితో నిట్టులనియె ♦ నవితథశౌర్యా!
వినురాజ్యచ్యుతి మొదలగు, ననిష్టములు మీఁదమీఁద ♦ నలయింపంగన్. ౪౭

క. శ్రమపడుచు నింతకును నా, ప్రమదాతిలకమును మనము ♦ పడయఁగలేమై
తిమి మనకు నిట్టితఱిఁ బ్రాణములంగొను కష్టమిది త♦నంతన వచ్చెన్. ౪౮

[2]చ. పురుషవరేణ్య! లోకమున ♦ భూతగణంబులయందుఁ గాలమే
పరఁగును వీర్యమంతమయి ♦ బాగుగ నెన్నఁగ దాని కడ్డమే
ధరణిని లేదు; చూడు మిదె ♦ దర్పబలంబుల సాటిలేక ని
ర్భరశరచాపము ల్వెలయ ♦ భాసిలు నిన్నును నన్ను నిత్తఱిన్. ౪౯ 1923

తే. కాల మియ్యది వ్యసనాళిఁ ♦ గష్టపెట్టి
మోహపెట్టెడుగాదె త♦మ్ముండ! కాన
సర్వవిధభూతవితతివి♦షయమునందుఁ
[3]గాలమును మించినది యేది ♦ కానరాదు. ౫౦ 1924

సీ. అనిమొనశూరులు ♦ నతిబలవంతులు న స్త్రవిద్యావిదు ♦ లతిదృఢాంగు
లును నగువారును ♦ ఘనవిధిగతిమీఱఁ గాలంబురాఁగ సై♦కతపుసేతు
వునుబోలి నశియింతు♦రనిపల్కె; దృఢసత్యవిక్రముండయి లస♦ద్వితతకీర్తి
మంతుఁడై పౌరుష♦వంతుఁడై తగు రాముఁ డతిపౌరుషమ్మున ♦ నలరు లక్ష్మ
తే. ణుండు దీనుఁడుగా నప్పు ♦ డుండుటఁ గని
తనదుబుద్ధిని దా ధైర్య♦మున నె స్థిరతఁ
గాంచి దీనతఁబొందక ♦ క్రాలునట్లు
చేసికొని మీఁదికార్యంబుఁ ♦ జేయఁదలఁచె. ౫౧ 1925

అఱువదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

## ౭౦ - వ సర్గము.

రామలక్ష్మణులు కబంధుని హస్తములను ఖండించుట.

క. ఘనబాహుపాశములచేఁ, బెనచి తగం బట్టుకొనఁగఁ ♦ బృథ్వీశసుతుల్
తనుఁజూచుచు నయ్యిరువురు, తనచెంగట నూరకుంటఁ ♦ దగఁగని యంతన్. ౧

1 ముక్తేన పరిశుష్యతా-అనిమూలము. 2 కాలస్య సుమహ ద్వీర్యం సర్వభూతేషు లక్ష్మణ-అనిమూలము. 3 నాతిభారోஸ్తి దైవస్య సర్వభూతేషు లక్ష్మణ-అనిమూలము.

క. దనుజుం డతఁ డిట్లనియెన్, మనుజేశకుమారులార! ♦ మానుగ మిము నా
కును దైవం బాహారము, గను జూపెఁ, క్షుధార్తు నన్నుఁ ♦ గనుచున్ మీరల్.

క. మతి దప్పి యున్నవారే, మృతిఁబొందక యున్నవార ♦ లేలొకొ, మీ ప్రా
ణతతి యిఁకం దక్కుట యే, గతినైనన్ లేదనుచును ♦ గర్వము మీఱన్. ౨

తే. ఆకబంధుఁడు పల్కిన ♦ నాలకించి
యార్తినొందియుఁ దుదకు ధై ♦ ర్యంబునొంది
పౌరుషముఁ జూపనెంచి య ♦ ప్పటికిఁ దగిన
యట్లు హితముగ సౌమిత్రి ♦ యనియె; రామ. 3 1929

క. నిను నను నిఁక శీఘ్రంబున, దనుజాధముఁ డితఁడు మ్రింగుఁ ♦ దప్పక కానన్
జెనుబాహువులను రెంటిని, బనివడి నఱకుదము వేగ ♦ వరఖడ్గములన్. ౪ 1930

సీ. పెద్దదేహము గల్గి ♦ భీషణుండయి వీఁడు బాహువిక్రమమున ♦ వఱలి లోక
మంతయుఁ దనవశ ♦ మందె యుండంజేసికొనుటయే గాక యీ ♦ మనలఁగూడ
వధియింపఁగోరెడు ♦ వసుమతీశ్వర! విను [1]మశ్వమేధమునకు ♦ నంతరంబు
నుండి యవ్వలికిని ♦ నొప్పఁగఁ గొనిపోవఁ బడినట్టిపశువులఁ ♦ బట్టి చంపఁ

ఆ. దగనియట్లు మనకు ♦ దర్పంబునన్ బదు, లేమిచేయలేని ♦ యిట్టివారిఁ
జంపరాదు రాజ ♦ సత్తమా! యనిపల్క, వారలిర్వురిట్లు ♦ పలుకుకొనఁగ. ౬

క. విని కుపితుఁడై కబంధుఁడు, తనవదనము విప్పి వేగ ♦ దాశరథుల మ్రిం
గను దలఁచి లాగుకొనియెన్, ఘనబాహువు లట్టె సాఁచి ♦ గర్వము మీఱన్.

తే. దేశకాలవిధానముల్ ♦ తెలిసినట్టి
వారు గావున హృష్టులై ♦ వార లతని
బాహువుల నంసదేశంబు ♦ వఱకు ఖడ్గ
ధారలన్ ద్రుంచి రారఘూ ♦ త్తముఁడు మిగిలి. ౮ 1933

క. తనశక్తి మెఱసి యడ్డం, బన లేకయె కుడిబుజంబు ♦ నవలీలగఁ ద్రెం
చెను వీరుఁడు లక్ష్మణుఁ డా,దనుజునిదా సవ్యకరముఁ ♦ దా ఖండించెన్. ౯

ఆ. అమ్మహాబాహుఁ డవ్విధి ♦ హస్తయుగము
తెగుటచేఁ బెద్దయెలుఁగున ♦ దిశలు భూమి
యంబరము మాఱుమ్రోగంగ ♦ నంబుదంబు
వలెను నఱచుచు నేలపైఁ ♦ బడియె నంత. 1935

చ. దనుజుఁడు రక్తపూరమునఁ ♦ దద్దయు మున్గుచు హస్తయుగ్మమున్
దునిమినవారి దీనుఁడయి ♦ తోడనె బాగుగఁ జూచి వారి ని

---

1 క్రతుమధ్యోపనీతానాం పశూనామివ రాఘవ-అనిమూలము. అశ్వమేధక్రతా వుపనీతానా మారణ్యపశూనాం వధః కుత్సితఏవ-అనివ్యాఖ్య. క్రతుబాహ్యానాం క్రత్వనంగభూతానా మితి యావత్-అని మహేశ్వరతీర్థులు.

ట్లని యడిగెద మదీయగురు♦హస్తములం దెగ వ్రేసినట్టి మీ
రన నెవరో వచింపుఁడని ♦ యాదనుజేశ్వరుఁ డిట్లు పల్కఁగన్. ౧౧ 1936

క. విలసితశుభలక్షణముల, వెలయు సుమిత్రాత్మజుండు ♦ వివిపించెను రా
ములచరిత మిట్టు లితం, డలఘుత రేక్ష్వాకువంశ్యుఁ♦డై సత్కీర్తిన్. ౧౨

క. కని మించిన దశరథునకుఁ, దనయుఁడు శ్రీరాముఁడని యి♦తనిజనులెల్లన్
మనమలరఁ బిలుతు రే నీ,తనితమ్ముఁడ లక్ష్మణాఖ్యుఁ ♦ దనరెడివాఁడన్. ౧౩

క. అనియెఱుఁగుము; దనుజా! ని,ర్జనవనమున దేవశక్తి♦శాలియయిన యీ
ఘనుఁడుండ నితనిభార్యను, దనుజుం డొకఁ డపహరించి ♦ తరలి చనంగన్.

సీ. ఇరువుర మామె నే ♦ యిందందు వెదకుచు నిచటఁ జేరితిమి నీ♦వెవఁడ విందు
[1]తలయు జంఘలు లేక ♦ యల కబంధమువలె వక్షస్స్థలంబున ♦ భాసురాస్య
మమర నివ్వనమున♦యందుఁ బొర్లాడెద వేలయంచని రాఘ♦వేంద్రునను జుఁ
డడిగినఁ బూర్వ మ♦య్యసురేంద్రుఁ డాడిన పల్కుల స్మరియించి ♦ పరమసమ్మ

తే. దమున శాపంబుతీరు కా♦లముగదా యి
దనుచుఁ బల్కెను; మీకును ♦ స్వాగతంబు
పురుషవరులార! మిమ్ము నా♦పూర్వపుణ్య
వశమునం గంటి మీరు నా♦భాగ్యమున నె. ౧౬ 1940

క. కరయుగమును ఖండించితి, రరసియె యంసములదాఁక; ♦ నవినయమున నే
పరఁగెను నాకు విరూపము, పురుషోత్తములార! వినుఁడు ♦ పూర్వపువార్తన్.

డెబ్బదియవ సర్గము సంపూర్ణము.

## ౭౧ - వ సర్గము.

### కబంధుని పూర్వవృత్తాంతము.

క. ఓ రామ! మహాబాహూ!, సారబలా! శౌర్యసార! ♦ చంద్రేంద్రులకున్
సారసబాంధవునకు వలె,[2]నే రమ్యమచింత్యమునయి ♦ యీత్రిజగములన్. ౧

తే. విశ్రుతంబగురూపంబు ♦ వెలసియుండె
మున్ను నాకు; రఘూత్తమా♦ముగ్ధరూప
మమరునేఁ బూర్వమీరీతి ♦ నఖిలలోక
భయదవిపులాంగమును దాల్చి ♦ వనములందు. ౨ 1943

క. తిరుగుచు వనవసతుల నా, పరమర్షుల నిందునందు ♦ భయపెట్టుచు నే
గరువముననుంటి; నొకతఱి, నరణ్యమున బహువిధంబు♦లగు మూలములన్.

తే. సేకరించుకొనన్ స్థూల♦శిరుఁడు నాఁగ
మునివరుం డొక్కఁ డరుదేర ♦ ముని గ్రహించి

1 భగ్నజంఘో విచేష్టసే-అనిమూలము. 2 త్రిషు లోకేషు విశ్రుతమ్-అనిమూలము.

నట్టివాని దొంగిలి నేను ♦ నతని నిట్టి
తనువుఁ బూని తిరస్కార♦మును నొనర్ప ౩ 1945

చ. మునిపతి కోపమూని తన♦ముందటనున్న ననుఁ గని మహోగ్రభీ
తిని గలిగించు శాపమునఁ ♦ దెప్పున దగ్ధము చేయనెంచి న
న్గని యిటుపల్కెఁ గ్రూరము ని♦కామము హేయము నైనరూపమే
యనిశము నీకు నియ్యదియె ♦ యయ్యెడుఁగాక యటన్న నేనునుఁ గా. ౮౫ 1946

క. మునిపతిఁ గని యిటు వేఁడితి, ననఘా! యవమతినిఁ జేసి ♦ యద్దానికిఁ బొం
దిన యీశాపమునకుఁ దుద, ననుగ్రహము చేయుమలయు ♦ నార్యా యనుచున్.

సీ. ప్రార్థింపఁగా ముని♦పల్కె రాముండెప్డు విజనాటవిని నీదు♦వితతబాహు
వులఁ ద్రుంచి నిన్ను ను♦జ్వలనున కాహుతి సేయునో యప్పుడు ♦ చిత్రమైన
నీశుభరూపమ్ము ♦ నెమ్మిఁ బొందంగలవనియు; నీఘోరత♦రాకృతి యెటు
వచ్చె నీకందువా♦పల్కెద వినవయ్య [2]దనువంశజుఁడయి శ్రీ♦యనఁగఁబరఁగు
తే. వానికేఁ బుత్రకుఁడఁజుమ్ము ♦ మౌనిశాప
మునను గల్గిన యీఘోర♦తనువె కాక
పరఁగె నిట్టికబంధరూ♦పము మహేంద్రు
కోపమున యుద్ధభూమి నా♦పాపమునను. ౭౫ 1948

క. సురపతితో మార్కొను నిర్భరశక్తియు నాకు నెట్లు ♦ ప్రాప్తించెనొ య
త్తరుణమునఁ దెల్పెదన్ విను, పరమముని ప్రాప్తశాప♦వశమున నేనున్. ౯

క. ఘోరాకారమును గని బలారాతి మదన్వయారి ♦ యగుట నతనివే
ఘోరరణంబున నొంపఁగ, సారసజనిగురిచి తపము ♦ సల్పితి నంతన్. ౯౧

క. ఉగ్రతపంబున మోదస,మగ్రుని గావింప విధియు ♦ నమితాయువు నా
యుగ్రతపఃఫలముగ నిడె, నాగ్రహచారంబువలన ♦ నాకుం బిదపన్. ౯౫

తే. కలిగె నజ్ఞానగర్వముల్ ♦ బలరిపుండు
నన్నిఁ కేమియొనర్చెడు ♦ నన్నయూహ
మదినిఁ బొంద వెసం జని ♦ మాఱుకొంటి
నతని నంతట నింద్రుఁడ♦త్యాగ్రహమున. ౯౫ 1952

క. శతపర్వముల నెసంగుచుఁ, బ్రతిలేక చెలంగుచున్న ♦ వజ్రాయుధ ము
ద్ధతి వైవఁ దొడలు తలయును, జతనమునం గుక్షినురము ♦ సరగునఁ జొచ్చెన్.

సీ. అంతఁ గబంధుఁడ♦నై యేను జంపుమా యని యెంత వేఁడిన ♦ నమరవిభుఁడు
నిన్నుఁ జంపను బ్రహ్మ♦యన్నయమ్మాటయే సత్యమగుంగాక ♦ సంతత మన

* శ్రియా విరాజితం పుత్రం దనో స్త్వం విద్ధి లక్ష్మణ-అనిమూలము. దనోః దనువంశజస్య శ్రియః శ్రీనామ్నః పుత్రం విద్ధి- శ్లో. దనుర్నామ శ్రియః పుత్ర శ్శాపా ద్రాక్షసతాం గతః-ఇతి కిష్కింధాకాండే వక్ష్యమాణత్వాత్-అని మహేశ్వరతీర్థులు.

వజ్రాయుధనిహతి ♦ బడలితిఁ దొడలును దలయు భగ్నములయ్యె ♦ లలితవదన
మల్లె యయ్యెను గాన ♦ నాహార మింకనాకు నెట్లుచిక్కును నేనిఁ ♦ కెట్లుచాల
తే. కాల మాహారమే లేక ♦ గడపనేర్తు
ననుచు వేఁడితి నామాట ♦ నాలకించి
యోజనాయతబాహువు ♦ లొసఁగె నాకుఁ
గఠినదంష్ట్రాస్య మొనరించెఁ ♦ గడుపునందె. ౧౩॥ 1954

క. ఆనేను దీర్ఘబాహులఁ, గాననమున నిందుఁ దిరుగు ♦ కరిసింహములన్
నానామృగములఁ బులులన్, నానాదిగ్గతుల నీడ్చి ♦ నమలుచు నుందున్.

క. పురుహూతుఁ డప్పు డిట్లనె, నరణ్యమున నెపుడు లక్ష్మ♦ణాన్వితుఁడయి భూ
వరమణియగు శ్రీరాముం, డరుదెంచి త్వదీయవితత♦హస్తముల నరిన్. ౧౪

క. నఱకునొ యప్పుడు స్వర్గము, నెఱిఁ జేరంగలవటంచు ♦ నెమ్మిఁ బలికె ని
వ్వెఱఁ గాంచి యంతనే నీ, కఱకువనిం జొచ్చినాఁడ ♦ క్ష్మావిభువర్యా. ౧౫

ఆ. ఇట్టి వికృతవేష ♦ మేను బొంది వనంబు
నందు నిందు నేది ♦ యగపడు మది
దానిఁ బట్టుకొనియొఁ ♦ దమిమీఱఁ దినఁదగు
ననుచుఁ దలఁచుచుందు ♦ ననవరతము. ౧౬॥ 1958

సీ. మౌనివాక్యము నమ్మి ♦ కాననమున నిందుఁ దప్పక శ్రీరాముఁ ♦ డెప్పుడొయొక
తఱిఁ జిక్కఁగలఁడని ♦ తలఁచుచు నుందును దీని లెక్కించుచు ♦ నేనిటఁ గడు
నీచమౌ తనువు దీ♦నిం బాయుటకు నెంచి దొరకినదానినిఁ ♦ గరము పట్టి
తినుచుందు నిష్టమై ♦ తనరుట నిట్లున్నవాఁడ; నీవా రఘు♦వరుఁడవె యగు
తే. దువు; శుభంబగుఁగాక నీ♦కు వసుధేశ
యిట్టులేటికి నమ్మితి ♦ వీనటంచుఁ
దలఁతువేమొ ననుం జంప ♦ నలవిగాదు
మఱియొకని కంచు నిజముగ ♦ మౌని పలికె. ౧౭॥ 1959

క. మీరిద్దఱు హుతవహసం,స్కారము చేసితిరయేని ♦ గడఁగి యవల నో
పూరుషసింహా! చక్కఁగ, నారసి మతిచేతఁ జేయ♦నగు సాయంబున్. ౧౮

క. ఒనరింతు నంతియే కా,క నేను మిత్రునిని గూడఁ ♦ గరముపదేశం
బును జేయువాఁడ మీకని, దనువంశ్యుఁడు పలుక నంత ♦ ధర్మాత్ముండున్.

క. తనతమ్ముఁడు వినుచుండం, గనె దానిం జూచి పలికెఁ; ♦ గాననమున నిం
దును గల్గు జనస్థానం, బుననుండి మఱొక్కయెడకుఁ ♦ బోతిమి మేమున్.

చ. ఇరువుర మింటలేనితఱి ♦ నెంచి దురాత్ముఁడు రావణుండు ను
స్థిరయశమొప్పు నాసతిని ♦ దెంపున గైకొనిపోయె నట్టిని

ర్జరరిపుపేరుమాత్ర మొక♦చక్రనిమిత్రునినుండి వింటి మా
పరునిస్వరూప మాతనిప్ర♦భావము వాసము నెంతమాత్రముం. ౨౩ 1963

క. వినలేదు మేము; దుఃఖం,బునఁ బొక్కుచు దిక్కులేక ♦ పొరిపొరి నిందం
దును దిరుగుచున్నవారము, వినుము పరోపకృతిఁబూని ♦ వెలయుదుమునుమా.

తే. ఇట్టి మాయందుఁ గృపయుంచు♦టే హితంబు
చాలదినముల క్రిందట ♦ సామజములు
విఱుచుటం జక్కనెండిన ♦ పృథుమహీజ
శాఖలం దెచ్చి యొకచోట ♦ శ్వభ్రమొండు. ౨౪ 1965

క. లోఁతుఁగఁ ద్రవ్వి విధిం దగ, నీతనువు దహించెద మొగి; ♦ నీకు నిజముగా
సీతాప్రవృత్తి తెలిసిన, నే తెఱఁగున నెవ్వఁడెచటి ♦ కింతిం గొనుచుం. ౨౫

క. చనియెనొ తెలియంజెప్పుము, వనితావృత్తాంతమీవు ♦ వదలక చెప్పం
జనుదాన నాకు శుభమా;, [1]ఘనమూర్తి! యట్టిశుభము ♦ గావింపు మనం.

క. దనువంశ్యుఁడౌ కబంధుఁడు, విని వాక్యైపుణిమఁ దనరు ♦ విపులేశునితో
డను మాటలాడఁ జతురుఁడు, గనుకం సరసోక్తు లలరఁ♦గా నిట్లనియెం.

చ. జనవర! దివ్యమై తనరు ♦ జ్ఞానము నాకిపుడేమిలేదు కా
వున మిథిలేంద్రుపుత్రికయుఁ ♦ బోయినజాడ నెఱుంగఁజాల నా
తనువు దహింపుఁ డంతటను ♦ దత్త్వశరీరము గాంచి మీకు న
జ్జనకజఁ జక్కఁగా నెఱుఁగఁ♦జాలినవాని నెఱుంగఁజెప్పెదం. ౨౮ 1969

ఆ. కాల్పఁబడకమున్న ♦ కాంతను హరియించి
నట్టి పృథులవీర్యు ♦ నసురుఁ దెలిసి
కొనఁ దరంబుగాదు ♦ క్షోణీంద్ర! శాపదో
షమున నంతరించె ♦ జ్ఞానమహిమ. ౨౯ 1970

క. విను మస్మత్కృతపాపం,బున నే యిటు లోకనింద్య♦ముగ నొప్పెడు నీ
తనువును బొందితి రామా, [2]వనజాప్తుఁడు శ్రాంతములగు♦వాహనములతోం.

ఆ. అస్తమయము నొంద ♦ నరుగకమును పెనం
బల్లమందు నునిచి ♦ వహ్నిదగ్ధుఁ
జేయుఁ డవల నేను ♦ సీతహరించిన
దనుజు నెఱుఁగఁజాలు ♦ ఘను వచింతు. ౩౧ 1972

ఆ. న్యాయయుక్తమైన ♦ నడవడి గలవాఁ డ,తండు కాన నీవ♦తనిని మిత్రుఁ
గాఁ దలంపవలయుఁ ♦ గడుఁబరాక్రమశాలి,యతఁడు గాన నీకు♦నతిముదమున.

క. అనుపమసాహాయ్యంబును, బొనరుచుఁజూ; యాతఁడెఱుఁగఁ♦బోలనిస్థలముల్

1 కురు కల్యాణ మత్యర్థమ్-అనిమూలము. 2 కింతు యావన్నయాత్యస్తం సవితా శ్రాంత వాహనః-అనిమూలము.

కనఁబడవీ లోకత్రయు, మున నాతఁడు మున్ను తిరిగె ♦ ముల్లోకములన్. 33

క. తనయన్నతో విరోధం,బునుగొని యెల్లెడఁ జరించెఁ ♦ బోల నతండా
దనుజుని నెఱుంగుఁజు మ్మా,తనితోడన్ మైత్రి సేయఁ ♦ దగు నీకనఘా. 33౫

డెబ్బదియొకటవ సర్గము సంపూర్ణము.

---

## ౭౨ - వ సర్గము.

కబంధుఁడు నిజరూపము నొంది తగినమిత్రుని రామునకుఁ జెప్పుట.

క. అనుచుఁ గబంధుం డాడిన, విని యావీరోత్తములు సు♦విస్తృతమగా త
త్తనువు గిరిప్రదరంబున, కనువుగఁ దోడ్తెచ్చి చేర్చి ♦ రద్దానిఁ దగన్. ౧

క. అనలున కాహుతి చేసిరి;, దనుజుని దేహమును నాల్గు♦తట్టులఁ గాలం
గను మండుపెద్దకొఱవులఁ, గొనిచితి నంతటను రగులు♦కొనఁ జేయంగన్. ౧౫

ఆ. లక్ష్మణుండు చేసె ♦ లలి నది యంతటఁ, జక్కఁగా జ్వలింప♦సాగె; దనుజ
మూర్తి యపుడు నేతి♦ముద్దవలెం దగి,యున్నమెదడు మిగుల ♦ నున్నకతన. ౨౫

చ. [1]అనలుఁడు మెల్లమెల్లఁగను ♦ నాతనిదేహముఁ గాల్చె నమ్మహో
దనుజుఁడు భూరిబాహుబల♦దర్పితుఁ డాచితినుండి లేచి పా
వనతరమాల్యవస్త్రముల ♦ భాసిలి ధూమవిహీనవహ్ని నాఁ
దనరుచు సుందరాకృతిని ♦ దద్దయుఁ జూడ్కులకింపుఁ బెంపుచున్. ౪ 1919

చ. వెలయుచు లేచె నెంతయును ♦ వెల్గుచు నచ్ఛవిభానురాంబరం
బుల ధరియించి యంతటను ♦ భూషణముల్ వెలయంగ హృష్టుఁడై
యలరుచు నందునుండి జవ♦మారఁగఁ బైకెగసెన్; గబంధుఁడు
జ్జ్వలమయి హంసయుక్తమయి ♦ సాంద్రయశంబున మించుచున్న ని
ర్మలమగు వ్యోమయానమున ♦ రాజిలి దిక్కుల వెల్గఁజేయుచున్. ౬ 1980

క. తన రారుచు నాకాశం,బుననుండియె రాముఁ గాంచి ♦ ముదమునఁ బలికెన్
జనకజ యేగతి దొరకునొ, విను రామా యావిధంబు ♦ వివరింతు నిఁకన్. ౭

సీ. పడుపాయములు నాఁగ♦సంధివిగ్రహయానములునాసనద్వైధ♦ములునసమాశ్ర
యము నివ్వి చెలఁగు; క్షు♦మాధిపులో రామ!యవ్వానిఁబట్టియే♦యాత్మకృత్య
ములఁ జక్కపెట్టుచు ♦ నిల నేలుచుందు; రుపాయమ్ములను నేమి♦పనిగల దివు
డని యందువా విన♦వయ్య యింకన్ దురవస్థ నొందినవాఁడు ♦ నృనిభునొకనిఁ

---

1 మేదసా పచ్యమానస్య మందం దహతి పావకః. అనిమూలము.

తే. గూడికొని యంత సాధించు♦కొనును గార్య;
మట్లె రాఘవ! నీవు భా♦ర్యాపహరణ
రూపదురవస్థ నొందుచు ♦ నీపగిదిని
నార్తి నొందినవాఁడ వ♦ట్లాట విపుడు. ౮౪ 1982

క. అనుజునితోడ మహార్తిం, గని యున్నా విట్టినీవు ♦ కడు నిడుమలనుం
గని యున్నవాని సఖునిగ, నొనరుచుకొనవలయు నట్టు ♦ లొనరుపకున్నన్. ౯౪

ఆ. కార్యసిద్ధి నీకుఁ ♦ గల్గునంచని యెంత, మాత్రమేని నాదు♦మదికిఁ దోఁప
కున్నయది సుమిత్ర; ♦ యొకఁ నట్టివానిని, జెప్పువాఁడ నింకఁ ♦ జిత్తగింపు.

క. కలఁ డొక్క వానరుఁడు ని, స్తులరూపుం డొక్కచోట ♦ సుగ్రీవుఁ డనం
జెలఁగునతం డింతకుమును, పల శక్రాత్మజుఁడు వాలి♦యను వానరుచేన్. ౧౧

ఆ. వెడలఁగొట్టఁబడియె ♦ గడుఁగోపమున; వాలి
యతనియగ్రజుండె ♦ యగునుజుమ్ము
బలయుతుండు వీరుఁ ♦ డలఘుసాహసుఁడు సు
గ్రీవుఁ డతఁడు చాలఁ ♦ గీడు నొంది. ౧౧౪ 1986

సీ. పంపాసరోవర♦ప్రాంతంబునన్ వెల్గు ఋశ్యమూకాఖ్యగి♦రిన్ వసించు
చున్నాఁడు శాఖామృ♦గోత్తముల్ నల్వురు సేవింప;వీరుఁడై ♦చెలఁగుఁ గాంతి
మంతుఁడు తేజస్వి ♦ మతిమంతుఁ డతిధైర్యవంతుఁడు వినయసం♦పన్నుఁడధికుఁ
డనవరతము సత్య♦మునె పల్కునాతఁడు దక్షుఁడు ప్రౌఢుఁడు ♦ దర్పబలయు

తే. తుఁడు మహాత్తరకాంతియు♦తుఁడును నగును
భ్రాతయగు వాలి రాజ్యకా♦రణముఁ బూని
యతనిబలశాలిఁ బురినుండి ♦ యవలికేగఁ
దఱుము నీవలె దురవస్థఁ ♦ దత్తఱిలుచు. ౧౨ 1987

క. గిరి నివసించుచు నున్నాఁ, డరయఁగ నీకతఁడు మిత్ర♦మగుఁ జుము; రామా!
తరుణిన్ వెదకుటకును నీ, కురుహితమును గూర్చుటకును ♦ నొప్పు నతండున్.

తే. తోడు మిత్రుండు గాఁగల♦వాఁడు కాన
[1]వంతఁ గుందకు మదిని నే♦వరున నేది
కావలసియుండునో యట్లె ♦ కార్యమగును
గాని దానిని మార్పంగఁ ♦ గాదెవరికి. ౧౩౪ 1989

క. కాలము దాఁటగ నెవ్వరు, చాలరు శ్రీరాము! నీవు ♦ సరగునఁ బయనం
బై లలితగిరీంద్రంబునఁ, గ్రాలెడు సుగ్రీవుకడకుఁ ♦ గడువడిఁ బొమ్మా. ౧౬

1 భవితవ్యం హి యచ్చాపి న తచ్ఛక్య మిహాన్యథా-అనిమూ.

సీ. ఇటనుండి యరిగి య♦ద్రీంద్రంబునందున్నసుగ్రీవుఁ జేరి మీ♦శుభచరిత్ర
ములకు దోషంబేమి♦కలుగకుండుటకునై జ్వలియించుహుతవహు♦సన్నిధిని న
తండె సాక్షిగ నీక♦తనితోడ సఖ్యము చేసికొనుము వానిఁ♦జిత్తమందు
వానరమని యవ♦మానింపరాదు సూ; వానరేశుఁడు చాల♦బలముగలుగు
తే. వాఁడు చేసినమేల్ మఱు♦వనిమహాత్ముఁ
డతఁడు మఱి కామరూపియూ♦నార్యవర్య!
యాపదలఁ జిక్కి యితరస♦హాయమును ద
నంగఁగోరుచు నున్నాఁడు♦గాన నింక. ౧౮ 1991

క. మీరిరువు రిప్పు డాతఁడు, గోరినకార్యంబుఁ జక్కఁ♦గూర్పఁగలరుగా
దే; రామ యతఁడు కార్యము, తీరిననుం దీరకున్నఁ♦దీరుచు హితముల్.

ఆ. ఋక్షరజుని కాతఁ♦డౌ క్షేత్రజుఁడు రవి
కౌరసుండు వాలి♦వైర మూని
తఱుమ భయమునొంది♦తత్తఱిల్లుచుఁ బంప
చెంతనున్నవాఁడు♦శ్రీరఘుపతి!. ౨౦ 1993

క. వినవయ్య! ఋశ్యమూకం,బునఁ గాపురమున్నవాఁడు♦పో నీవు జనం
బునఁబోయి వనచరునితో, ధనంజయునిసాక్షి యాయు♦ధముసాక్షిగనున్.

క. శపథంబు చేసికొని యా, కపినాథునితోడ మైత్రిఁ♦గావింపు; మను
ష్యవలలమును దినురక్కసు, లెపుడుండెడుచోటులన్ని♦యతఁడెఱుఁగుఁ జుమీ.

క. తనబుద్ధికౌశలంబున, దనుజస్థానములనెల్లఁ♦దానే యెఱుఁగున్;
వనజాప్తుఁ డెంతదనుకన్, దనకాంతులఁ బర్వఁజేయు♦ధరణీస్థలిపై. ౨౩

తే. అంతవఱకును నీలోక♦మందు నాతఁ, డెఱుఁగనట్టిప్రదేశము♦లెన్నలేవు;
వానరులతోడఁ గూడి ప♦ర్వతవరముల, నదులదుర్గమగుహాల నం♦తటను వెదకి.

చ. జనకజ యున్నతావుఁ గనఁ♦జాలును జుమ్మతఁ; డెంతయేని ని
న్ననుఁగొన కార్తిఁగుందు జన♦కప్రియపుత్రిని గాంచి రాఁగఁ బం
పును బృథుకాయులై పుడమిఁ♦బొల్చెడువానరులన్ సమస్తభూ
వనగిరియుక్తదిక్కులకు;♦వానరు లాతనియాజ్ఞఁ బూనుచున్. ౨౫ 1998

తే. రావణునియింట నిర్మల♦భావమలర, నున్నయట్టివరారోహ♦నున్నతాంగిఁ
గాంచి వత్తురు; వానర♦కాంతుఁ డతఁడు, నీప్రియాంగనపతిభక్తి♦నిరతసీత.

క. విను మేరువు శిఖరాగ్రం,బునఁగాని ఫణీంద్రలోక♦మునఁగాని వసిం
చిన నేగి చంపి దనుజుల, జనకజ నీకొసఁగఁగలఁడు♦నరగున మరలన్. ౨౭

డెబ్బదిరెండవ సర్గము సంపూర్ణము.

## ౭౩ - వ సర్గము.

కబంధుఁడు రామునకుఁ ద్రోవచూపి పోవుట.

సీ. కార్యతత్త్వజ్ఞుఁడై ♦ క్రాలుకబంధుండు జనకజఁ జూడఁగాఁ ♦ జాలునట్టి
మార్గముం దెలిసి రా♦మశశాంకునకు నిట్టు లర్థయుక్తంబుగ ♦ ననియె మరల;
నిదె పశ్చిమంబున ♦ నింపగు నేరేళ్లు పనసప్రియాళువుల్ ♦ ప్లక్షవటము
లశ్వత్థకర్ణికా♦రామ్రతిందుకములు పొన్నలు చంద్రలు ♦ బొట్టుగులును
గానుగల్ మఱి యశో♦కములును గరవీరములు కదంబము *లగ్ని♦ముఖ్య, రక్త
తే. చందనంబులు వేఁపలు ♦ సరసనీల
వర్ణయుక్తంబులై చూడ ♦ భవ్యములగు
నయ్యశోకంబు లెంతయు ♦ నందముగను
గ్రాలుచున్నవి చూడు రా♦ఘవ ముదమున. ౪౫ 2001

క. ఘనశుభమార్గం బిదియే, చనునప్పుడు మీర లాకు♦జంబుల నెలమిం
గొని యెక్కిగాని బలమును, గనఁబఱచుచుఁ ద్రుంచికాని ♦ కమ్రఫలములన్.

తే. అమృతతుల్యంబు లగువాని ♦ నాశతీఱఁ
దినుచుఁ బోవంగలరు రామ! ♦ వనము దాని
దాఁటినంతటఁ బుష్పిత♦తరువరమయి
నందనారామతుల్యమై ♦ యందమగుచు. ౬ 2003

క. ఉత్తరకురుదేశమునాఁ, జిత్తమునకు నింపుఁ బెంపఁ ♦ జేయువనము ద
ళ్కొత్తెడు వేఱొక్కటి యట;, నెత్తఱినే నచటి తరువు♦లెల్ల ననిశమున్. ౬౫

సీ. సర్వకామఫలప్ర♦జంబులై మధువును గుఱియుచునుండు నె♦క్కుడఁగ; ధనదు
నుద్యానమునఁబోలె♦నొగి బుతుషట్కంబు వెలయుచునుండును♦వృక్షతతులు
భూరిశాఖలమీఱి ♦ సారఫలంబుల భారంబునన్ వంగి ♦ వారిదముల
వలెఁ బర్వతంబుల♦వలె నెల్లతావుల వఱలుచునుండు నీ♦భ్రాత యితఁడు
ఆ. వాని నెక్కికాని ♦ వసుధపైఁ బడఁద్రోసి
కాని యమృతకల్ప♦మైన ఫలని
కరముఁ గోసి నీకుఁ ♦ గడుఁబ్రీతి నీయఁగాఁ
గలఁడు; రామ! మీర ♦ లెలమి మిగుల. ౯౫ 2005

క. వనినుండి వనికిఁ బర్వత,మునుండి పర్వతమునకును ♦ బోవుచు మిగులం
గనఁదగిన యాస్థలమ్ములఁ, గనుచు నటం బోయిపోయి ♦ కడుదూరమునన్.

* అగ్నిముఖ్యము=జీడిచెట్టు.

తే. పంప యనుపుష్కరిణికిఁ బో♦వంగఁగలరు;
మొరపరాలందుఁ జెలువారు ♦ దరులు చక్క
వెలయుచుండును [1]రేవులు ♦ లలితములయి
హెచ్చుతగ్గులు లేకయె ♦ యెసఁగుచుండు. ౧౧ 2007

క. విను మందుఁ బాఁచియుండదు, వనజోత్పలనికర మెంతొ ♦ బాగుగనుండున్
దనరారు సైకతము చక్కనిదిగ [2]హంసప్లవములు ♦ క్రౌంచకురరముల్. ౧౨

క. ఇంపగు నినదంబులచే, సొంపావహిలంగఁ దిరుగు♦చున్ గ్రీడించున్
బంపాపుష్కరిణిన్ నుతి, యింపం గలరే సుపర్వ♦లేని రఘువరా. ౧౩ 2009

చ. సురుచిరపక్షులవ్వి జల♦శుభ్రతలంబుల స్వేచ్ఛనెప్డు సం
చరణము చేయుచున్ ముదము ♦ చాలఁగఁ గాంచి వధంబనంగ నె
క్కరణియొ తామెఱుంగమిని ♦ గాంచవు మత్స్యలనుండి భీతి; నా
గురుతరపక్షివారము ర♦ఘుప్రవరా! [3]ఘృతపిండతుల్యముల్. ౧౪ 2010

క. ఇరువురు భక్షింపంగల, రరయుచు లక్ష్మణుఁడు పంప♦యందు బలమునం
బరఁగుచు బహువిధ[4]కంటక,విరహితములు నగుచు నెప్డు♦వెలయుఝషములన్.

సీ. చొఱమీాలనడములం♦చుం బరంగిన మీాలబాణములం జంపి ♦ త్వక్ప్రలాళ
ములఁ బుచ్చి యాయసం♦బులగుసాధనములఁ గ్రుచ్చిపక్వముచేసి♦కూర్మితోడ
[5]భక్తితోడను భుజిం♦పం బెట్టఁగలవాఁడు నీవు యథేచ్ఛము♦నెఱి భుజించు
చుండఁగా నీతఁడు ♦ నొగిఁ బుష్పసంచయంబులపయి వ్యాపించి ♦ నళినవాస
తే. నలుగుబాళింపఁ బాపవి♦నాశకమయి, నాతిశీతలమయి రోగ♦భీతి నడఁచి
స్వచ్ఛరౌప్యస్ఫటికముల ♦ ట్లలరుచున్న, పంపజలమును సరసిజ♦పత్త్రములను.

క. కొనివచ్చి యీయఁగలఁ; డో, మనుజేంద్రా! స్థూలములయి ♦ శైలాభృద్గుహాలం
దును శయనించుచుఁ దిరుగుచు, వనముల వృషభములరీతి ♦ ధ్వనులలరంగన్.

ఆ. సుందరంబు లయిన♦పందులు జలపాన
మునకుఁ బంప కెలమిఁ ♦ గనుచు రాఁగఁ
గాంచఁగలవు! స్వేచ్ఛఁ♦గా నీవు సాయాహ్న
మందుఁ దిరుగుచుండి ♦ యాతరువులు. ౧౯ 2014

---

1 సమతీర్థా మశైవలామ్ - అనిమూలము. సమతీర్థాం = సమానతొరప్రదేశాం-అని వ్యాఖ్య.
2 తత్రహంసాః ప్లవాః క్రౌంచాః-అనిమూలము. ప్లవాః మండూకాః హంసభేదాః-అనివ్యాఖ్య.
3 ఘృతపిండోపమాన్ స్థూలాన్-అనిమూలము. 4 కంటకవిరహితములు = ముండ్లులేక మున్న
గా నున్నచేఁపలు. 5 తవ భక్త్యా సమాయుక్తో లక్ష్మణః-అనిమూలము.

క. విరిసిన పుష్పచయంబుల, ధరియింపఁగ వానిఁజూడఁ ♦ దత్పుష్కరిణీ
నిరుపమశీతలజలములఁ, బరికింపఁగ దుఃఖముడఁగు ♦ భద్రము గలుగున్. ౨౦

క. తిలకముల నక్తమాలక, ములఁ బుష్పసుశోభితముల ♦ ముగ్ధసరసిజం
బుల మఱియు వివిధపుష్పం, బుల నుత్పలములను జూడఁ♦బోవుదు వెతలున్.

క. విను రామ! యచటిపూవులఁ, దనివారఁగఁ గోసి తాల్పఁ♦దగువాఁడెవఁడున్
గనఁబడఁడు [1]వాఁడ వవి యు,ర్విని రాలవు క్రొత్తపూల♦విధమున నుండున్.

సీ. అచట మతంగమ♦హర్షికి శిష్యులౌ మునిసత్తములు సమా♦ధిని గనుచును
దగువారలుండి రా♦తాపసుల్ గురునిమిత్తము వన్యవస్తువి♦తతిని గొనుచుఁ
జను నప్డు తద్భార♦మున శ్రమమొందంగఁ దద్దేహములనుండి ♦ ధరణిఁబడిన
స్వేదబిందువులెల్ల ♦ విమలతపోబలంబున నప్పుడయ్యెను ♦ బుష్పములుగ
తే. వాయువశమున బిందువుల్ ♦ పాదపములఁ
బడి సుమంబులుగానయి ♦ వారిమహిమ
చేత నశియింపకున్నవి; ♦ క్షితిని బాసి
వారు సురపురి కరిగిరి ♦ శ్రీరఘువర!. ౨౪ 2018

క. విను వారలపరిచారిక, యును జిరజీవినియు నియత♦యును నయి మహిమన్
దనరారు శబరి యనుసతి, కనఁబడియెడు నందు నీకుఁ ♦ గమ్రగుణాఢ్యా. ౨౫

క. గురుసేవాధర్మంబున, నిరతము సంసక్తిగలిగి ♦ నెఱిఁ దగునదియున్
సురపతిసము భూతాళికిఁ, బరివంద్యుని నిన్నుఁ గాంచి ♦ స్వర్గముఁ జేరున్.

క. ఓరఘువర! యాపంపా, తీరమునం బశ్చిమంపుఁ♦దెరువునఁ జను దే
వారయముఁ గల వుత్తమమై, యేరికిఁ గనఁబడక యున్న ♦ యింతియుటజమున్.

క. వని నందు బుశ్యమూకం, బనుపర్వతమందు బహువి♦ధాయతగజముల్
దనరెడు నాద్విరదము లా, వనమును జొరఁజాల వెట్టి♦భంగిని నైనన్. ౨౮

చ. వనము మతంగశక్తివిభ♦వంబునఁ గల్పితమయ్యెఁ గాన న
వ్వనిఁ జొరఁజాల వేనుఁగులు ♦ వాసవునందనసన్నిభంబుగాఁ
దనరుచు నిర్జరోపవన♦ధర్మములం దగి పెక్కుపక్షులొ
ప్ప నెగడు నావనంబునను ♦ బాయుచు దుఃఖము హాయిఁ గాంచుచున్. ౩౦

క. నీవుండఁగలవు రామా;, యావని విహరింపఁగలవు ♦ హర్షంబున నీ

---

1 నచలై ర్మ్లానతాం యాంతి-అనిమూలము.

¹తావర! పంపకు ముందటఁ, బావనమౌ ఋశ్యమూక♦పర్వత మలరున్. ౩౦½

ఆ. అందు భూరుహంబు ♦ లమలపుష్పంబుల
నలరుచుండు; మఱియు ♦ ²హస్తిశిశువు
లరసి కాచుచుంట ♦ నారోహణమునకు
మిగులఁ గష్ట మద్ది ♦ మేదినీశ. ౩౧ 2025

సీ. పూర్వకాలంబున ♦ భువననిర్మాతయౌ బ్రహ్మయు నీదివ్య♦పర్వతవర
మొక్క హేతువుఁ బట్టి ♦ యుర్విఁ బ్రఖ్యాతినిఁ గాంచునంచును దావ♦చించె నద్ది
యేదందువా? విను ♦ మెవ్వఁ డయ్యద్రిశిఖరముపై నిదురించు♦కాలమందు
ధనము నెద్దానిఁ బొం♦దినయట్లు కలఁగాంచు దానిని మేల్కొన్న♦తరుణమందుఁ

ఆ. దప్పకుండఁ బొందు ♦ నప్పర్వతంబున
మఱొకమహిమగలదు ♦ మానవేంద్ర!
యఘయుతుండు విషము♦మైనయాచారంబు
గలుగునాతఁ డెక్కఁ♦గాఁ దగండు. ౩౩ 2026

క. పాపిష్ఠుఁడు విషమంబయి, యేపగిదిన్ మెచ్చుకొనఁగ ♦ నే దగక ధరన్
గాపురుషహితముగాఁ దగి, చూపట్టెడు నాచరణము ♦ శోభనమనుచున్. ౩౩½

తే. ఎవఁ డనుష్ఠించునో యాతఁ ♦ డీయిరువురు
దాని నెక్కినవారి ని♦ద్రగనునప్డు
దానవులు పట్టి వధియింత్రు; ♦ జానకీశ!
మానివనమునఁ గల ద్విప♦మండలంబు ౩౪ 2028

క. పంపాసరసునఁ దమిఁ గ్రీ, డింపం బర్వతము నచ్చ♦టికిఁ జేరువయై
పెంపారుట నాధ్వని యట, నింపుగ వినఁబడుచునుండు ♦ నెల్లెడ రామా. ౩౫

క. జలధరవర్ణంబులఁ దగి, బలవంతములైన యచటి♦వారణములు మా
ర్మలయుచు నన్యోన్యహతిం, గలఁగుచు రక్తమ్ము ధార♦గాఁ గాఱంగన్. ౩౫½

తే. వేఱువేఱుగఁ బోవుచు ♦ విహారణంబు
సలుపుచుండును నావన♦స్థలులఁ దిరుగు;
నాగజంబులు పంపయం ♦ దమలమగుచు
నవ్యయము శీతమును నగు ♦ నప్పు లాని. ౩౬½ 2031

---

1 ఋశ్యమూక శ్చ పంపాయాః పురస్తా త్పుష్పితద్రుమః. అనిమూలము. 2 శిశునాగాభి రక్షితః-అనిమూలము.

క. వనముల కేగు సుఖంబుగఁ; గనఁబడు ఋక్షతతి వ్యాఘ్ర♦గణమును *నీలం
బునుబోలి కాంతినొప్పుచు, ననయము జయశీలము నగు ♦ నారురుగణమున్.

చ. కనుఁగొన శోకమున్ వదలి ♦ కాంతువు శర్మము; రామ! యాగిరిన్
బెనుశిలచేతఁ గప్పఁబడి ♦ పెద్దదిగా గుహయొండు వెల్గు నె
వ్వనికిని నందుఁ జొచ్చుటది ♦ భారము; దానికిఁ దూర్పువాకిటన్
గనఁబడుచుండెడిన్ హ్రద మ♦ఖండఫలద్రుమతీరభూమియై. ౩౯ 2033

తే. మృగగణంబులు పెల్లుగ ♦ మెలఁగుచుండ
శీతలోదక మెంతయుఁ ♦ జెలువు గులుక
నొప్పుచుండును మడుఁగది ♦ యురుతరమయి
యాగుహన్ వానరచతుష్క ♦ మాశ్రయింప. ౪౦ 2034

క. ఉన్నాఁడొగి సుగ్రీవుం, డున్నతగిరిశృంగమందు ♦ నొకవేళ సతం
దన్నలుగురతోఁ దిరుగును, గ్రన్నన నీవేగు మనియెఁ ♦ గమ్రోక్తులతోన్.

సీ. బలశాలియైన క♦బంధుఁ డిట్లా రామలక్ష్మణులకుఁ జెప్పి ♦ లలితపుష్ప
మాలికాయుతుఁడయి♦ మార్తండునింబోలి వెలుఁగుచు శ్రీరామ♦విభుననుజ్ఞఁ
గొన నాకసంబునఁ ♦ గొంత నిల్చి వెలింగె; రామలక్ష్మణులంత ♦ నామహాట
వినిఁ గాంచఁ బయనమై ♦ వియదంతరంబున నున్నమహాభాగు♦నురుకృపాఢ్యు

తే. నాకబంధు సమీపించి ♦ యరుగవచ్చు, నింక నీవని; రప్పుడా ♦ యిరువురఁ గని
కార్యసిద్ధ్యర్థమై మీరు ♦ గదలుఁ డనుచు, బలికి ప్రీతిననుజ్ఞ వా♦రలునొసంగ.

క. అరుగందలఁచి కబంధుం, డురుదివ్యాకృతిని మిగుల ♦ నొంది తనురుచిన్
సరసిజమిత్రునిఁ బోలుచు, సురపథమునఁ గొంతయరిగి ♦ సుగ్రీవునితోన్. ౪౧

తే. మైత్రిఁ దప్పకసేయుమా ♦ మానవేంద్ర
యనుచు రామునిఁగాంచి యా♦యద్రికరుగఁ
దగినమార్గంబుఁ జూపి యో♦ధన్యచిత్త!
సఖ్యమును జేయుమనిచెప్పె ♦ సరసరీతి. ౪౨ 3038

డెబ్బదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

* నీలకోమలకప్రభాన్, రురూనపేతాపజయాన్-అనిమూలము. నీలకోమలకప్రభాన్= నీలరత్నవన్నోజ్జ్వలప్రభాన్-అనివ్యాఖ్య.

## ౭౪ - వ సర్గము.

రామలక్ష్మణులు శబరిని జూడఁబోవుట.

చ. ధరణివరాత్మజన్ము లటఁ ♦ దాను కబంధుఁడు మూపుఁ బ్రోవ స
త్వరముగఁ బశ్చిమంపుదెసఁ ♦ బట్టియె పంపను గూర్చిపోయి; రా
ధరణిధరంబులం బెరసి ♦ తద్దయుఁ దేనియఁబోలె నొప్పు నుం
దరఫలరాజితో నెనఁగు ♦ తద్వనవృక్షగణంబుఁ జూచుచున్. ౧ 2039

ఉ. వాలిసహోదరుం గనెడు ♦ వాంఛయె పైకొనఁబోయి; రంత నా
శైలములందుఁ బోవుచును ♦ జయ్యనఁ బంపకుఁ బశ్చిమంబునన్
వ్రాలినభూతి నొప్పుకట ♦ వర్యముచేరి యటం బ్రియామనుం
జాలశ్రమంబునం గడపి ♦ చయ్యన లేచి యొకింత దవ్వునన్. ౩౪ 2040

ఆ. శబరి యాశ్రమంబుఁ ♦ జక్కఁగ నొప్పెడు
దానిఁ గాంచి వృక్ష♦తతులు నిండ
వెలయుచుండ మిగుల ♦ వింతగఁ దగుదానిఁ
గనుచుఁ బోయి శబరిఁ ♦ గాంచి రంత. ౫ 2041

సీ. యోగసిద్ధింబొంది ♦ యున్నయాశబరియు వారలఁ గని లేచి ♦ భక్తిమీఱ
నంజలి ఘటియించి ♦ యా రాముపాదారవిందములకు మ్రొక్కి ♦ *వేడ్కబుద్ధి
విభవంబు మించఁగ ♦ వెలయులక్ష్మణునకు నభివాదనముసేసి ♦ యర్ఘ్యపాద్య
ములను నాచమనీయ♦మును యథావిధి నిచ్చె; నంత వ్రతంబుల ♦ నాచరించు
తే. చున్నసన్న్యాసిని శబరి ♦ నొక్కరీతిఁ
గాంచి రాముండు పల్కె ని♦కాము మోద
మలరుచుండఁ దపస్విని ♦ యఖిలనియమ
విఘ్నములను జయించితి♦వి గద నీవు. ౭౫ 2042

క. నీతపము వృద్ధినొందుచుఁ, జేతోముద మలరుచుండఁ ♦ జేసెదుఁగాదే
యాతతకోపాహారము, వేతఱి బాధింపకుండ ♦ నే గడుఁబూన్కిన్. ౮ 2043

ఆ. నిగ్రహించుకొంటి♦వా గ్రమంబున సువ్ర
తములఁ జేసినావె ♦ తన్వి! లలిత
భాషిణీ! మనంబు ♦ భవ్యసుఖమ్మున
నలరుచుండుఁగాదె ♦ యనవరతము. ౯౫ 2044

క. గురుశుశ్రూషయు సఫలతఁ, బరఁగుంగదయనుచు నడిగె;♦భవ్యనుతియు యో

---

* లక్ష్మణస్య చ ధీమతః-అనిమూలము.

గరతపస్వాంతయు సిద్ధయు, నిరతము సిద్ధాభినుతుల ♦ నెగడుచు భక్తిన్. ౯½

తే. పూర్ణముగ నుండుమనమునఁ ♦ బొలుచుచున్న
శబరి రామునిముందట ♦ సంతసమున
నిలిచి రాముండు తన్నిట్లు ♦ పలుక మరలఁ
బలికె; రాఘవ నినుఁజూడఁ ♦ గలిగెఁ గాన. ౧౦ 2046

[1]సీ. నాతపస్సు ఫలించె ♦ నాయొనర్చినతపంబంతయు సఫలమై ♦ యలరె నిపుడు
గురువులు నాచేతఁ ♦ బరిపూజితులెమైరి పురుషకుంజర! దేవ♦పుంజమందు
నుత్తముఁ డగువిష్ణు ♦ వి త్తఱి నీవౌట నిన్నుఁ బూజించుట ♦ నెఱనుదీయ
జన్మ మియ్యదనున ♦ సఫలమైనది బ్రహ్మపదము సిద్ధింపఁగ♦లదు మహాత్మ!
తే. శత్రుసూదన! నీదగు♦సౌమ్యవీక్ష
ణమునఁ బరిశుద్ధనై తిని ♦ నము తావ
కప్రసాదమునఁ దగ న♦క్షయములైన
లోకములఁ బొందెదనుసర్వ♦లోకవినుత. ౧౩ 2047

క. నీయాచార్యులతోడుత, నే యేలోకాపోవవైతి ♦ వీనని యనుదో
నాయాచార్యులు మత్సే, వాయత్తులు చిత్రకూట♦మం దీవు తగన్. ౧౩½

తే. వాసమొనరింపవచ్చిన♦యాసమయము
నందె యతులప్రకాశంబు♦నంది వెలయు
వ్యోమయానంబులను నెక్కి ♦ యుద్గమించి
రిచటనుండి దివంబున ♦ కెలమి మిగుల. ౧౪ 2049

తే. బహుళధర్మజ్ఞులయి మహా♦భాగులైన
యామహార్షులు ననుఁ గాంచి ♦ యనిరి; రాముఁ
డింతిరో నినుఁజూడఁగ ♦ నెంతో పావ
నమగు నీయాశ్రమమునకు ♦ నమలకరుణ. ౧౫ 2050

సీ. రాఁగలం డప్పుడా ♦ రాముని లక్ష్మణు నతిథిసత్కృతులను ♦ నాశ్రమంబు
నందుండునట్లు చే♦యంగనౌ నీవంత నామహాత్ముని రాము ♦ నమరపూజ్యుఁ
గనుఁగొని నిరుపమ ♦ మనఁబడులోకాళి నొందఁగాఁ గలవని ♦ యొప్పఁబలికి
చనిరి; పూరుషసింహా! ♦ విను నేను నీకొఱకై పంపరయొడ్డుల ♦ నలరుచున్న
ఫలమూలములు నింకఁ ♦ గల వన్యవస్తువులను వానిమాధుర్య♦మును దగంగ
ఆ. ననుభవమున నెఱిఁగి ♦ యాసక్తిఁ బదిలంబు
గాఁగ నుంచినాను ♦ నాఁగ; ధర్మ

[1] అద్య ప్రాప్తా తపస్సిద్ధి స్తవ సందర్శనాన్మయా, అద్య మే సఫలం తప్తమ్-అనిమూలము.

మతి రఘుప్రవీరుఁ ♦ డలిప విజ్ఞానము
నకును వెలియెగాక ♦ ప్రకటమతిని. ౧౮ 2051

క. తనరారుచుండుటం దగఁ, గనుఁగొని యిట్లనియె; నేను ♦ గానఁ గబంధుం
డనువానివలన మహిమం,బునఁదగు నీగురునిశక్తిఁ ♦ బోలఁగ వింటిన్. ౧౮౹

క. దానిం బ్రత్యక్షంబునఁ, గానం గోరెదను జూపఁ♦గా నీవు మతిం
బూనినఁ జూచెద ననఁగా, నా నెలఁతయు రామునోట ♦ నప్పలుకిటులే. ౧౯౹

తే. వెడలినంతనె వారిక♦ప్పుడు మహావ
నమును నంతయుఁ జూపె; నె♦య్యమున నంత
రామునిం గాంచి పలికె నా♦రమణి, రామ
ఘనజలదమట్లు నల్లఁగాఁ ♦ గానఁబడుచు. ౨౦ 2054

క. మృగపక్షిసమాకులమై, పొగడొందంబడెడుదీనిఁ ♦ బొలుపుగఁ గనుమా
సొగసుగఁ దగు నీకానన,ము గణింపంబడు మతంగ♦మునివనమనుచున్. ౨౧

తే. మంత్రవన్మానిమంత్రస♦మ్మానితమగు
యజ్ఞమును నాగురూత్తము ♦ లమలధిషణు
లిచ్చటం జేసియున్నార; ♦ లివిగో దేవ
పూజకుందగు స్థానముల్ ♦ పూజ్యములయి. ౨౨ 2056

ఆ. పశ్చిమంపుదెసను ♦ బరఁగు మిట్టఁగఁజూడ
వయ్య! నేను మిగుల ♦ నాదరమున
సేవసేయుచున్న ♦ నావరమానులు
[1]శ్రమవికంపహస్త♦జలజములను. ౨౨౹ 2057

క. వీనిం బూజలఁ దన్పిరి;, భూనాథా! వారితపము ♦ పొలుపున నవి యా
మానులు చనినను నిప్పటి, కైనను బ్రతిలేనికాంతి ♦ నఖిలహరితముల్. ౨౩౹

క. తమకాంతి వెలయఁ జేయుచు, విమలములై కానఁబడెడు♦వేడ్కం గనుమా
యమలవ్రతముల నుపవా, సములను గడునలసి పోవ ♦ శక్తియొలేమిన్. ౨౪౹

క. గురువులు మనసునఁ దలఁపన్, సరిత్పతుల సప్తకంబు ♦ సరగునఁ దానే
పరుగెత్తి వచ్చియున్నది, సరసిజమిత్రాన్వవాయ♦జలధిశశాంకా. ౨౫ 2060

క. కనుమా సప్తాబ్ధులలో, మునింగి వృక్షములమీఁద ♦ మునులాఱఁగ వై
చినవల్కలములు వారల, తనుసంగతివలన నింత♦దనుకను నక్లేం. ౨౫౹ 2061

తే. ఎండకున్నవి చూడుమా ♦ యిదిగో వారు
సురలఁ బూజింప నుత్పల♦సుమము లితర

---

1 శ్రమా దుద్వేపిభిః కరైః-అనిమూలము.

పుష్పములు చేర్చికట్టిన ♦ పూలదండ
లిప్పటికి వాఁడకున్నవో ♦ యినకులేశ. ౨౭ 2062

చ. వనమును దీనినంతయును ♦ బాగుగఁ గంటివి దేవసన్నుతా
వినఁదగుదానినంతయును ♦ వింటివి దేహము దీనినింక నీ
యనుమతిఁగాంచి వే విడువ ♦ నాత్మను గోరెద; నాశ్రమంబిదే
మునులదొ నేను నెట్టిముని♦ముఖ్యులసేవలొనర్చుచుంటినో. ౨౮ 2063

ఆ. ఆత్మవేత్తలైన ♦ యామానివర్యుల
చెంతకరుగఁదలఁతుఁ ♦ జిత్తమందు
ననుచు ధర్మయుక్త♦మును సమంచితమునై
శబరివాక్యము విని ♦ స్వాంతమందు. ౨౯ 2064

ఆ. మాయయేమిలేక ♦ మానిని పల్కుటా
శ్చర్యమనుచు నెంచి ♦ సంతసమ్ముఁ
గాంచె రాముఁ డనుజ♦కలితుఁడై యంతట
సంశ్రితవ్రతయగు ♦ శబరిఁ గాంచి. ౩౦ 2065

క. పలికెను రాముం డిట్లని, ఫలసితభక్త్యతిశయమున ♦ విధిగా ననుఁ బూ
జలఁ దన్పితి విఁక నీమదిఁ, గలచోటికిఁ బొమ్ము హాయి♦గా నోశ్రమణీ. ౩౧ 2066

సీ. అనిరాముఁడాడిన ♦ నంతట జడలను దాలిచి వల్కల♦ధారణమ్ము
గావించి యజినముల్ ♦ గైకొనియున్న యావృద్ధనారీమణి ♦ యెలమి రాము
ననుమతిఁగొని, యట ♦ నాముహూర్తమునందె జీర్ణశరీరంబు ♦ క్షితిని విడువఁ
దలఁచి యగ్నిని వేల్చి ♦ తదవసరంబున జ్వలియించుచున్నట్టి ♦ జాతవేద

తే. సునివలెఁ దివ్యమౌదేహ♦మును ధరించి
దివ్యలోకము నొందెను; ♦ దివ్యభూష
ణాళి ధరియించి దివ్యమా♦ల్యముల గంధ
మునఁ జెలంగుచు దివ్యవ♦సనముఁ గట్టి. ౩౩ 2067

క. కనుఁగొనఁగాఁ దగి విద్యుత్తును బోలి ప్రదేశమద్ది ♦ తోడనె వెలుఁగం
గను బొలిచె; నంత శబరియు, ఘనపుణ్యాత్ములగు మౌని♦కాంతులు వారల్.

ఆ. విహరణంబుసేయు ♦ విమలసంస్థానంబుఁ
దా సమాధియోగ♦భాసమాన
మహిమఁ జూఱఁగొనియె ♦ మానిని శ్రీరామ
భక్తిపరత మౌని♦భక్తినిరతి. ౩౫ 2069

డెబ్బదినాలుగవ సర్గము సంపూర్ణము.

## ౭౫ - వ సర్గము.

రామలక్ష్మణులు పంపాసరస్సునకుం బోవుట.

క. తన తేజంబున వెలుఁగుచు, వనితామణి శబరి దేవ♦వాసాప్తంబై
తనరారు లోకమునకుం, జనినంతనె యనుజుతోడ ♦ క్ష్మాపతి మదిలోన్. ౧

క. చింతించె; ధర్మమతి య,త్యంతమహాత్ము లగువారని♦తల్లజుల మహో
దంతంబుఁ దలఁచి యేక,స్వాంతుఁడు హితవాదియునగు ♦ సహజునిఁ గనుచున్.

సీ. పలికె నిట్లని సౌమ్య! ♦ పరమాద్భుతములగు
పుష్పఫలాదులు ♦ పొదల నఖిల
తీర్థసమాగమ♦దివ్యదర్శనములు
వెలయ నాశ్చర్యంబుఁ ♦ గొలుపుచున్న
యీయాత్మవిదులదై ♦ యెసఁగునాశ్రమమును
గంటి మీయది మృగ♦గణము పులులు
విశ్వాసమును బొంది ♦ వేడుక విహరింప
బహువిధవిహగముల్ ♦ పరఁగుచుండఁ

ఆ. జెన్నుమీఱుచున్న ♦ దెన్నదానివిభూతి
సాగరౌఘరూప♦చారుతీర్థ
ములను నిందు శాస్త్ర♦మునఁ జెప్పినట్టులే
మునిఁగితిమి ప్రియంబు♦గను విధిగను. ౪ 2072

క. పితృతర్పణ మొనరించితి, మతిశయశుభమలకు నింక ♦ నాయీయశుభ
ప్రతతి నశించెను లక్ష్మణ!, కృతకృత్యంబైనయట్ల ♦ హృదయంబలరెన్. ౫

క. నరకుంజర! విను మిత్రని, కరలాభాదికము తోఁపఁ♦గాఁ జొచ్చె మదిం
గరము జవంబున రమ్మా, పరికింపం బ్రియము నొసఁగు♦పంపకు నింకన్. ౬

క. చనవలయు ఋశ్యమూకం, బను శైలము దానిచెంత ♦ నలరెడు నందే
వనజాప్తపుత్త్రుఁడును ధ,ర్మనిరతుఁడౌ కపిసమూహ♦రాజు వసించున్. ౭ 2075

క. అగ్రజువలని భయమ్మున, సుగ్రీవుఁడు కపిసమూహ♦శూరచతుష్కం
బుగ్రాకృతి వెలయంగ స,మగ్రప్రేమమునఁ గొలువ ♦ ననిశంబుండున్. ౮

క. వానరవృషభునినాతనిఁ, గానం ద్వరపడెడు మదియుఁ ♦ గావలయుఁగదా
జానకి వెదకెడుపని యా,వానరపతివలన ననుచుఁ ♦ బలుకఁగఁ బిదపన్. ౯

సీ. ధీరుఁడౌ రాముఁడీ♦తీరునఁజెప్ప లక్ష్మణుఁ డాతనిం జూచి ♦ సరగ మనము
పంపాసరస్సు ని♦లింపవర్ణితమును గనఁగఁబోవుదము నా♦మనముఁగూడఁ

ద్వేషపడియెడునని ♦ పలికె; నంతట నరిసూదనుండగు రామ♦మేదినీశుఁ
రనుజునిఁగూడి యా♦యాశ్రమంబుననుండి వెడలి పంపకుఁబోయె ♦ వేడుకలర

తే. నంతరాముఁ డుదారజ♦నాళిసేవి
తమయి నానామహీజల♦తాప్రకీర్ణ
మగుచుఁ బానీయజలపూర్ణ ♦ మగుచు నలరు
పంపఁ గనుఁగొనె దూరభూ♦భాగమందు. ౧౧౪ 2078

సీ రక్తపద్మంబుల ♦ రక్తసౌగంధికంబుల నెఱ్ఱనై తెల్ల♦గలువగములఁ
దెల్లనై, కువలయ♦దీప్తుల నల్లనై, బహువర్ణచిత్రకం♦బళమురీతిఁ
బలువన్నె లొప్పారి ♦ వెలయుచు నుండె; నాపంపను దూరభూ♦భాగమందె
కని దానిచెంతనే ♦ క్రాలునుతంగసరస్సునాఁ దనరారు ♦ హ్రదమునందు

తే. స్నానమును జేసె నుత్పల♦సరసిజముల
నరుణపంకజకువలయా♦ద్యమలసుమవి
తతిని జెన్నారి కుసుమితా♦యతరసాల
వనములందగు పంపను ♦ గనియె మఱియు. ౧౧౫ 2079

సీ. బర్హినాదప్రతి♦ధ్వనితమై తిలకముల్ దానిమ్మచెట్లును ♦ దంతధావ
నములేఱుమద్దులు♦సుమయుక్తకరవీరములునుబున్నాగముల్♦ముదముఁగూర్చు
మాలతీకుందగు♦ల్మములు వటద్రుమములు నిచుళాశోక♦ములును సప్త
పర్ణముల్ కేతక♦పాదపంబులు పూవుగురివిందలును మఱి ♦ తరువులెన్నొ

ఆ. తను నలంకరింపఁ ♦ దగుభూషణంబుల
వెలయు నొక్క రమణి♦విధముతోఁప
నలరు పంపఁ గాంచి ♦ యారామలక్ష్మణుల్
దానిచుట్టునున్న♦తరునికరము. ౧౧౬ 2080

క. కనుచుఁ దానిం జేరిన, వనముం గని; రద్ది పూల♦వరుసలచేతన్
గననై విపులద్రుమమై, తనరారుచునుండెఁ గిర♦తతులెల్లెడలన్. ౧౧౭ 2081

తే. పలుకుచుండెఁ గోయష్టిక♦ములు నెమిళ్లు
బెగ్గురులు నింకనుం బెక్కు♦విధములైన
పక్షులుం గూయుచుండె; గో♦ప్పకును దగిన
*వనముఁ గని తత్తఱిలకయె ♦ వారు వేగ. ౧౧౮ 2082

క. హెచ్చరికలతోఁ బోయిర, దెచ్చటఁ బంపాసరస్స♦హీనజలములన్
ముచ్చటఁ గొలుపుచుఁ జల్లఁగ, నచ్చరలకుఁ బ్రీతిఁగొలుపు♦నట్టులె యమరున్.

---

* తతో జగ్మతు రవ్యగ్రౌ - అనిమూలము.

సీ. అచ్చటి కేగి [రం♦ డవనీజరత్నముల్ తిలకపున్నాగవ♦కుళకుజములు
మఱియు నశోకద్రు♦మంబులు చెలఁగంగ] నానాపత్త్రిస్వ♦నంబు లోలయ
హార్షదమై యుండ ♦ నద్దానిఁ గాంచిరి రాముఁ డంతట వృక్ష♦రాజి వెలసి
సరసులఁ జెలువాఱి♦పరఁగు భూమినిఁ గాంచి కామాభితప్తుఁడై ♦కడుజవమునఁ

తే. బంపకేగెను నది పుష్ప♦వారవితత
వనములను సాలచంపక♦వ్రజములను ద
గంగఁ గ్రాలుచు షట్పదౌ♦ఘములు మూఁగి
యుండ సిరులొప్ప నతులప్ర♦భోజ్జ్వలమయి. ౨౨౹ 2084

తే. స్వచ్ఛమై స్ఫటికంబునాఁ ♦ బరఁగునీట
నొప్పుచుఁ మృదువాలుక ♦ యొప్పుగులుకఁ
బద్మసౌగంధికంబులు ♦ పర్వి యలర
నందమైయుండఁ గాంచి పం♦పాహ్వయమును ౨౩౹ 2085

క. ఋతవిక్రముఁడౌ రాముం, డతులమనీషం జెలంగు ♦ ననుజునితో ని
ట్లు తగం బల్కెను; ధాతు,ప్రతతి నలంకృతము పుణ్య♦పర్వత మిచటన్. ౨౪౹

క. వరపుష్పితపాదపమై, యరుదుగఁ దా ఋశ్యమూక ♦ మను పేరున భా
సురరూప మలరఁ గలదని, పరమస్వాంతంబుఁ దగఁ గ♦బంధుఁడు పలికెన్. ౨౫

సీ. ఇట ఋక్షరజుఁడన ♦ నెసఁగుచుమహామతి వానరుతనయుఁ డ♦వక్రవిక్ర
మాఢ్యుఁడు సుగ్రీవుఁ♦డనువాఁ డువసియించుఁబురుషకుంజర!నీవు♦పొమ్ము వాన
రేంద్రునిచెంత కం♦చిరీతిఁ బల్కుచు; సత్యవిక్రముఁడగు ♦ సహజు మరలఁ
గాంచి యిట్లనియెను;♦క్ష్మారాజ్యమెల్లను బోఁగొట్టుకొని దైన్య♦పూర్ణుఁడనయి

ఆ. జనకజాతఁ జూచు♦కొని వానిమఱచియొ
యుంటి నట్టిసీత ♦ జంటఁ బాసి
యసువులెట్లు నిలుప♦నగు లక్ష్మణా! యిఁక
ననియె నిట్లు మన్మ♦థార్తినొంది. ౨౭ 2088

క. ఘనతరశోకంబునఁ దన, తనువెల్లన్ వడఁకుచుండఁ ♦ దాఁ బలికెడువా
క్యనిచయము వినెడులక్ష్మణుఁ, గని చెప్పి మనోజ్ఞమగుచుఁ ♦ గనఁబడుదానిన్.

చ. సరసును బంపనాఁగ ముని♦సన్నుతిఁ గాంచినదానిఁ జూడఁగా
నరిగెను స్నానమాడ; వితఁ♦తావనినుండియె వచ్చి చాల భీ
కరపథ మొప్పఁగా జలము ♦ కన్పడనట్టి కబంధకాననం
బరుదుగ దాఁటి కాననము ♦ లందముగాఁ దగుపక్షివారముల్. ౨౯౹ 2090

తే. వెలయుచుండంగఁ జూడంగ ♦ లలితమగుచు
శీతలాంభస్సులన్ మించి ♦ చెలఁగి భద్ర
దాయకంబగు పంపాఖ్యఁ ♦ దగుసరస్సుఁ
గాంచె రాముఁడు కొంతదుః♦ఖము తొలంగ. 30

డెబ్బదియైదవ సర్గము సంపూర్ణము.

---

శా. ఓంకారప్రియరూప, యోగనిరతో♦ద్యోగ్రైకసమ్మోదకృ
చ్ఛంకాలేశవిహీనభాసురపదా, ♦ శక్రాదిసంస్తుత్యము
క్త్యంకానుత్తమనామ, నిర్జితరతీ♦శాదిత్యరూపప్రభా,
పంకేజాసనముఖ్యపూజితలస♦త్పాదాంబుజాతద్వయా.

సీ. ఇది మహీసురకుల♦విదితకాశ్యపమానిగోత్ర, జాపస్తంబ♦సూత్ర, శ్రీత్రి
పురసుందరీవర♦కరుణాత్తసంస్కృతాంధ్రకవిత్వవైభవ, ♦ ప్రథితకీర్తి
జనమంచివంశాబ్ధి♦చంద్రసుబ్రహ్మణ్యవిబుధవర్యసుపుత్ర, ♦ వినుతిపాత్ర
పండితగురుభక్త♦తాండవకృష్ణాపరాభిధేయార్యజ♦నాళిభజన
తే. నిరతశేషాద్రిశర్మప్ర♦ణీతమైన
యాంధ్రరామాయణమునఁ బా♦పాటవీహా
రణధనంజయమైన య♦రణ్యకాండ
మనని నాచంద్రరవితార♦మై చెలంగు.

ఆరణ్యకాండము సంపూర్ణము.

శ్రీ. శ్రీ. శ్రీ.

---

శ్రీ ర స్తు.

# ఆంధ్ర శ్రీమద్రామాయణము

## కిష్కింధాకాండము - ౧-వ సర్గము.

క. శ్రీమన్మంగళరూపా, కామితవరదానదక్ష ♦ కమ్రాలాపా
సామశ్రుతిహితనామా ప్రేమాస్పదహృదయధామ ♦ శ్రీక[illegible]రామా. 1

క. వినవయ్యా కృతినాథా, వనరుహమిత్రాన్వవాయ ♦ వార్ధిశశాంకా
జనహితకృత్యా! యవ్వలి, ఘనకథ వినుపింతు భక్తి♦కలితుఁడ నగుచున్. 2

### పంపాసరోవరవర్ణనము.

*చ. అనుజునితోడ రామవిభుఁ ♦ డందుఁ జెలంగెడు పంప కేఁగి దా
న నెఱసియున్న తామరల ♦ నల్లనిగల్వల జెళ్కు చేఁపలం
గని తగవానితో సమతఁ♦గాంచిన సీతముఖాక్షిదృష్టులా
య్యన మదిఁ దోఁప నింద్రియము ♦ లాకులతం గన నేడ్చె నెంతయున్. ౧ 3

చ. సరసును దానిఁ గాంచఁగనె ♦ సంతస మొక్కటఁ గల్గ దానిచే
ధరణిపతీంద్రియంబులును ♦ దద్దయుఁ గంపమునొందె; సంతతం
దరుణిఁ దలంచి యాతఁడును ♦ దర్పకవశ్యుఁడునై సహోదరున్
బరమమనీషుఁ గాంచి యిటు ♦ పల్కెను లక్ష్మణ! పంపయెంతయున్. ౨ 4

క. కననౌ వైదూర్యమువలెఁ, గనదచ్ఛజలంబు వెలయఁ♦గాఁ జక్కఁగఁ బూ
చినపద్మము లుత్పలములు, తనరున్ వన్నెనిడ వివిధ♦తరువులు దరులన్. ౩ 5

క. తనరారఁగ రాణించెడు; ననుజా! పంపాతటంబు♦నం దడవియుఁ జ
క్కనివిధమునఁ గనఁబడియెడుఁ, గనుమా! యవ్విపినతరుని♦కాయము బెడఁగై.

ఆ. అతివిశాలశాఖ ♦ లలరార శిఖరాభి, వృతమహాద్రివోలె ♦ నెసఁగుచున్న
యది; పురంబు వెడలి♦యాభరతుండు నా, కరణిఁ గష్టపడెడుఁ♦గాయటంచు.

క. జనకజపరాపహృతయై, చనియెఁ గదా యనియు, నాదు♦స్వాంతము దుఃఖం
బునఁ బొక్కుచుండ మాధవుఁ, డనుకంపన్ విడిచి యిట్టు♦లార్తిఁ గనుననున్

* పురుషకారేయాణామపీష్టజనవియోగినాం కామోద్దీపకదర్శనేన చిత్తవిభ్రమో భవతీతి సూచనాయ పంపావర్ణనముఖేన రామస్య చిత్తవిభ్రమం దర్శయితు ముపక్రమతే-అని టీకాశిరో మణిభావము. అట్లే యీకిష్కింధాకాండమున రాముని విరహవ్యథయు, సుగ్రీవసఖ్యము, వాలివధాదులు, సీతాన్వేషణప్రయత్నము వర్ణింపఁబడునని యెఱుంగవలయు.

సీ. పీడించునటులున్న ♦ దోషక; దుఃఖించునట్టి నాకుంగూడ ♦ నతివిచిత్ర
కాననోపేతమై; ♦ కమనీయబహుపుష్పపరివృతమై శీత♦పయసు వెలయు
మంగళాకృతిమీఱి ♦ మానితరీతి నీ పంపయు రమ్యమై ♦ పరఁగుచున్న
[1]యది; యిందుఁ బెనుఫణు♦లట్టిసర్పంబులు చరియించుచున్నను♦సరసిజములు
ఆ. నిండనుంట మదికి ♦ నెమ్మిని బుట్టించి
కాననగుచుఁ గ్రాలుఁ ♦ గమ్రపక్షు
లట్టి మృగము లిందు ♦ వ్యాపించియున్నవి;
నలుపు పసిమి మిగుల ♦ వెలయుచుండ. ౯ 9

క. అరుదైన శాద్వలము లివి, తరునికరమునుండి సుమవి♦తతి రాలి తగం
బరఁగుటఁ గంబళముపయిం, గరము పఱచినట్లు వెలయుఁ♦గాదే సహజా!. ౧౦

చ. తరువులయగ్రముల్ సుమవి♦తానసమృద్ధిని గాంచి యొప్పె సుం
దరకుసుమాగ్రశోభితల♦తల్ తరుపుంజము నావరించి సో
దర! కనవయ్యె నింపుగ ము♦దంబున వచ్చె వసంతకాల మీ
తరుణమునందు హాయిగ స♦దాగతి వీచెడు మెల్లమెల్లఁగన్. ౧౧ 11

క. మనసిజతాపము హెచ్చఁగఁ, గనఁబడియెడు; వాసనలును ♦ గడువ్యాపించెన్
గనుమా! తరువులు సుమఫల, ఘనతం బొల్పారెఁ జుమ్ము ♦ గనవై యిచటన్.

క. జలముల వర్షించెడు [2]మబ్బులవలెఁ బుష్పములఁ బొల్చి ♦ పూవులవానన్
జెలఁగి కురిపించు నీవన, ములరూపుం జూడవయ్య! ♦ ముద్దులకుఱ్ఱా!. ౧౩ 13

సీ. రమణీయములయిన ♦ ప్రస్తరములయందు వివిధకానన లస♦ద్వృక్షవితతి
వాయువేగంబున ♦ బాగుగఁ గదలుచు ధరణిపై నెల్లెడఁ ♦ దగినపుష్ప
ములఁ జల్లుచున్న ద♦నిలవశంబునఁగొన్ని పుడమిపైఁబడియును♦బూవులొక్క
కొన్నియుఁ బడుచును ♦ గొన్నివృక్షములందె నిలిచియు నున్నవి♦నలుఁగడలను
తే. వాయువీపుష్పములతోడ ♦ వరుసఁ గేళి
సల్పునట్లుగఁ గన్పడుః ♦ శ్వసనుఁడు సుమ
వితతిచే నిండియున్నట్టి ♦ వృక్షశాఖ
లను గదల్చుచు నుండ మె♦ల్లగను దేంట్లు. ౧౪ 14

క. సుమముల చోటులనుండియె, తమిమీఱఁగ లేచి యా స♦దాగతి నెంతో
సుమహితనాదంబుల గానముచేసెడు; వాయువట్లె ♦ నైజమహిమచేన్. ౧౫

సీ. నర్తకగాయక♦వర్తనమును గను వానివలెన్ వృక్ష♦వారములను
నాడించుటకుఁ బూని ♦ యామదకోకిలధ్వనిగానములను బ♦ర్వఁగ నొనర్చు
చును గిరిగుహానుండి♦సారిది వచ్చెడుఁజూడు [3]మనిలుఁడెంతయువీచి♦యలమహీజ

---

1 సర్పవ్యాళానుచరితా-అనిమూలము. సర్పాః బహుఫణాః తదన్యేవ్యాళాః - అనివ్యాఖ్య.
2 వనానాం పుష్పశాలినాం, సృజతాం పుష్పవర్షాణి-అనిమూలము. 3 అమీసంసక్తశాఖాగ్రా గ్రథితా ఇవ పాదపాః-అనిమూలము,

శాఖలఁ గదలింప ♦ సంసక్తసకలశాఖలఁ బాదపంబులు ♦ గలయఁగ్రుచ్చఁ

ఆ. బడిన హారమట్లు ♦ పరికింపనయ్యెఁ జూ
యిదిగో వాయువిద్ధి ♦ యెంతోసుఖము
గాఁగ సోఁకుచు నోగిఁ ♦ గప్రమలయగంధ
శీతలమున మిగులఁ ♦ జెలఁగి చెలఁగి. ౧౬॥ 16

క. ఘనపరిమళములఁ బూన్కిం, గొనివచ్చుచు శ్రమముఁ బాఁప♦గోరి ప్రభావం
బును గనఁబఱచుచు వీచెడు, ననుజా! యీపంపసొంపు ♦ నగునె నుతింపన్.

క. తేనియవాసనలం దగు, కాననములయందు వృక్ష♦గణము శ్వసనుఁడే
పూనికఁ గదల్ప భృంగ, స్వానమ్మునఁ గూయుచున్న ♦ వైఖరి వెలసెన్. ౧౭

తే. పర్వతంబులు తమసాను♦పటలి రాల
మొలిచి పుష్పవ్రజంబులఁ ♦ బొలిచి రమ్య
ములుగఁ దగుచెట్ల శిఖరముల్ ♦ మొనసి గలిసి
కొనఁగ నలరారుచున్న వో♦యనుజ! కనుమ!. ౧౮ 19

సీ. క్షితిజంబు లివి తమ♦శిఖరములందుఁ బూవులు గ్రమ్ముకొన గాలి♦వలనఁ గదలు
చును నగ్రములఁ దేంట్లు ♦ సొంపుగా మునరుట [1]నల్లనితలగుడ్డ ♦ లుల్లసిల్లఁ
గట్టి శిరస్సును ♦ గదలించుచుం బాడుచున్నగాయకువలె ♦ నొప్పుమెఱయు
చున్నవి; చక్కఁగా ♦ నుపరిభాగంబునఁ బుష్పించి యింపుగాఁ ♦ బొలుచు కర్ణి

తే. కారములు స్వర్ణభూషణ♦కలితు లగుచు
విమలపీతాంబరముఁ గట్టి ♦ వెలయు నరుల
వలెను నాలుగుప్రక్కల ♦ లలితరీతిఁ
గానఁబడుచున్న వీవనిఁ ♦ గనుమ! యనుజ!. ౨౧ 20

క. ఈమధుకాలంబున నో, సౌమిత్రీ! బహుపతత్రి♦సరసధ్వను లు
ద్దామగతిన్ వినఁబడుటన్, భూమిజ విడియున్ననాకు ♦ భూరితరార్తుల్. ౨౨

క. పరుసఁగ వృద్ధింగాంచెడు, స్మరుఁడును శోకైకపరవ♦శస్వాంతు ననున్
నిరతముఁ దపింపఁజేసెడుఁ, బరభృతము ముదంబునొంది♦పలుకుచు మిగులన్.

[2]క. నను మచ్చరించి పిల్చెడు, నని తోఁచెడుకరణి నుల్ల♦ముందుబ్బుచుఁ గొం
కును బాసి పిల్చుచున్నది;, మనోజ్ఞవననిర్ఝరమున ♦ మదనార్తు ననున్. ౨౩౪

ఆ. నీరుకోడి యిద్ది ♦ భూరిరవంబును, బర్వఁజేయుచుఁ దగఁ ♦ బ్రమదమునను
మిగులఁ గష్టపెట్టఁ ♦ దగియున్నదిప్పుడు;, జనకజాత పర్ణ♦శాల మున్ను. ౨౫

---

1 అమీ మధుకరోత్తంసాః ప్రగీతా ఇవ పాశపాః=అనిమూలము. పుష్పావృతశిఖోపరి నీలో
ష్ణీషధారిణ స్సగీతికం నృత్యంత ఇవ భాంతీత్యర్థః - అనివ్యాఖ్య. దీనియర్థమే పద్యమునవుండుట
తెలియునది. 2 హృష్టః ప్రవదమానశ్చ మామాహ్వయతి కోకిలః-అనిమూ.

క. ఈనీరుకోడిధ్వనివిని, మానసమునఁ బ్రియముఁ బొంది ♦ మన్మథకేళిన్
జానుగ ననుఁ దేల్చెఁగదా, తానై ననుఁ బిల్చి పలువి♦ధంబుల ననుజా!. ౨౬

సీ. పలువిధంబులఁ జిత్ర♦ములగు పరాగంబు లిట్లు నానాధ్వను ♦ లెసఁగఁజేయు
చును వృక్షగుల్మము♦లను దీఁగెలను నెల్లతావుల వ్రాలెను ♦ నీవు చూడు;
మాఁడుపిట్టలు [1]పురు♦షాండజాశ్లేషము లంది స్వపక్షము ల♦ర్థాప్రియునినె
పొందితిపీవని ♦ పొగడఁగా భృంగరాజధ్వనులకు సంత♦సంబు నొంది
తే. విమలరతికూజితంబుల ♦ వెలయఁజేయు, చున్న వోలక్ష్మణా! చూడ♦వన్న; నీరు
కోళ్లకూతలచే మగ♦కోకిలముల, ధ్వనులచే నీమహీజముల్ ♦ ఘనతమీఱు.

క. ధ్వనిచేయుచున్నరీతిం, గనుపట్టుచు మన్మథార్తి ♦ గలుగంజేయం
గను జాలియున్న వియ్యెడ;, ననుజాతా! యీవసంత ♦ మగ్నియె సుమ్మా!.

సీ. ఈవసంతాగ్నికి ♦ నెఱ్ఱనిచిగురుటాకులు, పుష్పగుచ్ఛాలగు ♦ త్రియంగారము, మళిని
నాదమే యగ్నిని♦నాదమౌఁ బల్లవములె మంటలగు నిట్టి♦జ్వలనుఁడు నను
దహియింపఁగలఁడు ని♦తాంతసూక్ష్మములగుపక్ష్మము లొప్పఁగాఁ ♦ బరఁగనున్న
కన్నులు గలిగి సొ♦గసుగాఁ జెలంగు కేశములొప్ప మధురభా♦షణము లలర
తే. [2]నున్నయాజానకిని జూడ♦కున్ననాకు
బ్రదుకుతో నేవిధమున లా♦భంబు గలదు;
రమ్యకాంతారమగుచుఁ బ♦రభృతనికర
నిస్వనాయతసీమమై ♦ నెగడు మధువు. ౩౦౹ 28

క. అనుజా! నాప్రియురాలికి, ననుపమమోదంబు గూర్చు♦నట్టిది సుమ్మీ!
వినుమీ! దుఃఖాగ్నిస్మరా, ర్తిని గల్గి వసంతముగుణ♦దీప్తిం బెరిగెన్. ౩౧౹ 29

క. కనుకనె యిఁక శీఘ్రముగా, [3]ననుఁ గాల్పంగలదు, భూత♦నయ నద్దానిం
గనఁజాలక రుచిరమహీ, జనికర మిద్దానిఁ జూడఁ♦జాలిననాకున్. ౩౨౹ 30

క. స్మరతాపం బిది హెచ్చుగఁ, బెరుఁగంగల దామహీజ ♦ వెసఁ గనఁబడమిన్
నిరతము స్వేదము నార్చుచు, స్మరకేళ్యాయాసమడఁచు ♦ మధువెల్లెడలన్.

క. సురుచిరసుమరూపంబున, నరుదుగఁ గన్పడుట నాదు♦నార్తియు వృద్ధిం
బొరయుచునున్నది; ప్రియసోదర! యీవనిఁ బొలయు మధుస♦దాగతిఁ గంటే.

క. హరిణాక్షీచింతాదుఃఖరతిం దగఁ జిక్కిననుఁ ♦ గరుణయె లేకే
నిరతము తపింపఁజేసెడుఁ, దరుణీమణి విరహమెంతో ♦ దారుణము సుమీ. ౩౪

తే. ఇందునందు మయూరంబు ♦ లివ్వి స్వీయ
పక్షములు పవనాహతిఁ ♦ బైకినెగురు
నట్లు చిమ్మఁగ స్ఫటికమ♦యంబు లగుగ
వాక్షములరీతి నొప్పు వై♦భవముమీఱు. ౩౫౹ 34

1 పురుషాండజాశ్లేషము = మగపిట్టలకౌఁగిలింతను. 2 అపశ్యన్ మే సౌమిత్రే జీవితే నాస్తి ప్రయోజనమ్-అనిమూలము. 3 అపశ్యత స్తాం దయితాం-అనిమూలము.

సీ. ఆడుచు నెంతయు ♦ నలరారుచున్నవి నలుదట్ల నాఁడునె♦మిళులు చుట్టు
కొన నీమయూరంబు♦లును మదమూర్ఛితములునయి మన్మథా♦ర్తులనుగుందు
చున్నట్టి నాకు మ♦హోగ్రతాపంబును గలుగఁజేయుచునున్న ♦ వలుకఁబూని;
గిరిసానువుల సహో♦దర నర్తనముచేయు తనప్రియ నెమిలిని♦గనుచు నదియె
ఆ. యాఁడునెమలి మోద♦మందుచు రతికినై, భర్తఁ బిలువఁగోరి ♦ పరిసరమున
నాడుచున్న; దదియు ♦ నాత్మగుచిరపక్షములను విప్పి యలరు♦మోముతోడ.

క. పరిహాసం బొనరించెదు, కరణిఁ దనప్రియను గూర్చి ♦ కడుఁ దమి మదిలో
నరుగం గోరుచునున్నది, యరణ్యమున నాఁడునెమిలి ♦ ననురుఁడు క్రుద్ధచేఁ.

ఆ. అపహరించి బలిమి ♦ నరుగంగ లేదు నిశ్చయము కాన నీభు♦జంగభుక్కు
తనదు కాంతతోడఁ ♦ దనివితీఱఁగ రమ్య, వనములందు నాట్య♦మును సలిపెడు.

ఉ. మానిని చెంత లేక మధు♦మాసమునందు మనోహరంబలౌ
కాననసీమలందుఁ దగఁ ♦ గాపురముండుట నాకు దుస్సహం
బౌ నిఁక లక్ష్మణా! జగతి♦యందు నరుండు ప్రతీపదర్శినిం
జానుగ వెంబడించుటయు ♦ సాజము చూడుమ యిట్టు లీదెసఁ. ౪౦ 38

క. తనకుం దానై కామం, బున నీశిఖినియును బ్రియుని ♦ ముందట రతికే
ళిని సల్ప డాసెఁ బక్షపక్షినికరములయందుఁ గూడ ♦ స్త్రీలకుఁ దమియుఁ.

తే. కలిగియున్నది చూడుమా ♦ కాంతలకును
నిట్టి రాగంబుఁ బుట్టించు♦నట్టి శక్తి
గలుగు నీమధువై భవం♦బులను బొగడఁ
దరమె యేరికినైన సో♦దర! తలంపు. ౪౧౹ 40

చ. సురుచిరనేత్ర నాసతియు ♦ సొంపగు నీమధుమాసమందు ని
ర్జరరిపుఁ జెగడెంచి తను ♦ శౌర్యమునఁ హరియింపకున్న న
త్వరముగ నన్నెదుర్కొనఁగ ♦ వచ్చుఁగదా మధుమాసమందు ని
ట్లరుదుగఁ బూలజొంపముల ♦ నందము గాంచియు నీయరణ్యముల్. ౪౩ 41

క. అనుజా! నాకేమాత్రం, బును బ్రీతిని గల్గఁజేయ♦వు గదా నీపు
ష్పనికరము నిష్ఫలముగాఁ, గనఁబడియెడి నాదుమదికిఁ ♦ గామిని లేమిఁ. ౪౩౹

సీ. భూరుహంబులయందుఁ ♦ బొలుచు నీపుష్పాలు మిక్కిలి కాంతిచే ♦ నక్కజముగఁ
గనఁబడి యింపుగాఁ ♦ దనరారుచుండియు మనకు నిష్ఫలములై ♦ మదికిఁదోఁచు
చుండుటఁ దుమ్మెద♦పిండుతోఁగూడ వ్యర్థమ్ముగా రాలెడు♦ధాత్రిమీఁదఁ
బక్షులు నాకు ద♦ర్పకభూరితాపంబుఁ గలిగింప గుమిఁగూడఁ♦గాఁ బరస్ప
తే. రముఁ బిలుచుకొనుచున్న చం♦దమునఁ దమిని
హాయిగా ధ్వనిచేయుచు ♦ నలరుచున్న
వెందు నాప్రియురాలుండు ♦ నందుఁగూడ
నీమధువు చెలరేఁగిన ♦ నింతియు నట. ౪౬ 43

క. పరవశమ్మై నావలెనే, పరితాపము నొందుఁ జుమ్ము; ♦ పక్షతిని గొంపో
యి రహస్యస్థలినేయుం, తురు గావున నచట నీమ♦ధువు పొలయదుసూ!. ౪౪

తే. నిశ్చయం బిదియైన నా♦నీరజాక్షి
నన్ను విడనాడి యెట్లుండు ♦ నైజరీతి
మధువు చెలరేఁగియున్న న♦మ్మానవతియు
సుకటి యింకేమిచేయు? న♦సురులు మిగుల. ౪౫ 45

క. తను బాధించుచునుండఁగ, మనమునఁగుందుచునె యుండు♦మధురముగ నెముం
దొనరం బల్కుచు శ్యామయు, వనజాక్షియునైన సీత ♦ వనటం గనుచున్.

క. ననుఁ జూడలేమి మధువును, గని సైపఁగలేమి ననుని♦కాయము విడుచున్
వినుమా! నిశ్చయమిది; యా, జనకమహీజానితనయ ♦ సాధ్వియె యగుటన్.

చ. నను నెడఁబాసియుంట నిఁక ♦ నన్గన కుల్లము దల్లడిల్ల నే
యనువున నైనఁ దా బ్రదుక ♦ దచ్చటనంచు దృఢంబుగా మనం
బున నిటఁ దోఁచుచున్నయది; ♦ పొందుగ నాపయిఁ బూర్ణమైనప్రే
మను మది నిల్పి యున్న దల♦మానిని సత్యముగాఁగ నేనునున్. ౪౮ 48

క. జనకజ నెల్లవిధంబుల, ననురాగము మీఱఁ జూతు ♦ ననవరత మ్మీ
యనిలుఁడు పూవులతావులఁ, గొనియింపుగఁదాఁకిచలువఁ♦గూర్చుచునున్నన్.

క. నాకుం జూడఁగ హుతవహు, నాకృతిగా నున్నవాఁడు; ♦ హాయిగ మును నే
నాకాంతఁ గూడియుండఁగ, నాకెయ్యది హాయియా మ♦నంబున కనుచున్.

తే. తలఁచుచుందునో యిట్టియా♦మలయవాయు
విపుడు సీతను విడుచుట ♦ నెంతో యార్తిఁ
బెంచుచున్నది; సీతను ♦ విడువకున్న
తఱిని నే కాకి యంబర♦తలము నొంది. ౫౧ 51

క. బిఱుసుగ నాపరిసరమున, నఱచుచు సీతావిరహము ♦ నటఁ దెల్పెనో యి
త్తఱి నదియె తరుణిఁ బాయఁగ, నెఱివృక్షాగ్రమునయందు♦నిల్చిముదమునన్.

క. ధ్వనిచేయుచు నుబ్బుచు నా, వనితాసంయోగమును ధ్రు♦వంబుగఁ దెల్పన్
విను మీ కాకియె యప్పుడు, జనకజ నెడఁబాపె నిపుడు ♦ చానసికటమున్.

సీ. ననుఁ జేర్పఁగలదు సూ! ♦ విను లక్ష్మణా! వనమందు నగ్రంబుల ♦ నమలరీతిఁ
బుష్పించియున్న యీ♦భూరుహంబులపయిఁ బక్షులు మధురశ♦బ్దములుచేయు
చున్నవి చూడుమా ♦ యురుమన్మథార్తిని నాధ్వని గల్గించె ♦ ననుజ! షట్ప
దమిది వాయువుచేఁ గ♦దల్పఁగఁబడినయీ తిలకమంజరినెక్కి♦దృప్తమగుచుఁ

తే. గదలుచున్నట్టి తనప్రియ♦కాంతనుబలె;
సహజముగఁ గాముకులయిన ♦ జనులకార్తిఁ

గల్గఁజేసెడు నీయశో♦కంబు గాలి
కాఁకుగుమినుండి వెలుపలి ♦ కరుగుదెంచి. ౫౪ 54

క. చలియించెడు నెఱ్ఱనివృా, ఫులగుత్తుల "నిన్నుఁ జంపఁ♦బూని మదనుఁ డు
జ్జ్వలబాణములను వీనిని, వెలయించెను నిందు ననుచు ♦ బెదరించు క్రియన్.

క. కనఁబడుచున్నది;" లక్ష్మణ!, ఘనసురుచుయుక్తాప్రములివి ♦ కాయము నిండం
దనరారు దివ్యచందన, మును బూసి విలాసగర్వ♦ములుగల మదులన్. ౫౬

క. తిరిగెడు కాముకులట్టులు, పరికింపఁగనయ్యె; నిచటి♦పంపాఖ్యసరో
వరతీరంబున నరుదగు, వరణ్యములయందుఁ గిన్న♦రావళి యొలమిన్. ౫౭ 57

క. అందందు సంచరించెడు, సుందరగతి మీఱునట్లు ♦ చూడుము! యనుజా!
డెందము నలరించుచు నీ, సుందరపద్మములు తావి♦సొంపలరంగన్. ౫౮ 58

[1]క. జలముల నెల్లెడఁ గన్పడు, నలలందుం దోఁచుచున్న ♦ యాబాలార్కుల్
వలె వెలయుచున్న వరుదుగ, నలుదెసలం జూడవయ్య ♦ నరశార్దూలా!. ౫౯

క. అమలజలంబులఁ దగి పద్మముల సితోత్పలము లొప్పఁ ♦ దగు హల్లకముల్
కమనీయములై రాజిలఁ,గ మరాళగళంబులొప్పఁ ♦ గారండవముల్. ౬౦ 60

క. తనరారఁగ నీపంపయుఁ, గన వర్ణింపంగఁ దగుచుఁ ♦ గ్రాలెడుఁ గంటే!
తనజలములఁ బ్రతిబింబించిన బాలార్కులను బోలి ♦ చెలఁగుచు నళులన్.

తే. కేసరంబులయందు మూ♦గి వెలయంగ
నలరు సరసిజములు నెల్లె♦డలను గలుగ
ముద్దుగాఁ జూడఁబడియెడు ♦ మోదమలరెఁ
బంప యిది చక్రవాకాఖ్య♦పక్షులొప్ప ౬౨ 62

సీ. కట్టుపుట్టమువలెఁ ♦ గడుఁజిత్రవనములు తనతీరములయందుఁ ♦ గనఁబడంగ
జలపానమునకయి ♦ చనుదెంచుగజముల నితరమృగాళుల ♦ నెంతొ యుల్ల
సిల్లుచున్నది; సర♦సీజముల్ నిర్మలజలముల వాయువ♦శమున వచ్చు
నలలు గొట్టుచునుండ ♦ నమ్మునికోలచేతను గొట్టఁబడినట్టి ♦ మనుజురీతిఁ

తే. దగియెయున్నది; పద్మప♦త్రములరీతి
నాయతాక్షులు వెలయంగ ♦ నబ్జములను
నెపుడు గోరుచునుండు నా♦యింతిఁ గాన
కిటు బ్రదికియుంట రుచియింప ♦ దించుకేని. ౬౩ 63

శా. ఔరా! కామునివక్రమార్గమిటులే ♦ యానే మనోజ్ఞాంగి నెం
తో రమ్యంబుగ మాటలాడునతి నెం♦తో దూరభూమిస్థితిన్
గ్రూరాచారవశాంగియై మరల నా♦కుం బొందరాకున్న నా
నారీరత్నము నాతలంపునకు వి♦న్నాణంబుగాఁ దెచ్చెడిన్ ౬౪ 64

---

1 జలే తరుణసూర్యవత్ -అనిమా. ప్రతితరంగం ప్రతిఫలితబాలసూర్యవత్ -అనివ్యాఖ్య.

క. కుసుమితవృక్షములం, దగు వసంతమిది నన్ను మరల ♦ బాధింపదయే
ని సమధికకష్టమున నీ, యసమస్మరతాప మెట్టు♦లైన సహింతున్. ౬౮॥ 65

క. జనకజ నాతోఁగూడన్, వనినున్నపు డేపదార్థ♦వారము బెడఁగై
కనఁబడెనో యవియే యిట, వనితామణి లేమిఁ దోఁచె ♦ బాధకములుగాన్.

తే. పద్మకోశపలాశముల్ ♦ పరఁగఁ జూచి
నంతనే నాదుచూడ్కి తే♦నంతసీత
నయనపత్త్రములకు సమా♦నమని తలఁచు
చున్నదే చూడు లక్ష్మణా! ♦ యుద్యమమున. ౨౦॥ 67

సీ. [1]సరసిజకేసర♦సంస్పృష్టమగుచు వృక్షాంతరనిస్సృతం ♦ బగుచు సీత
నిశ్వాసమువలెనె ♦ నిరతమనోహరం బగుచు నీవాయువో♦య్యనఁ జరించు
చున్నది; లక్ష్మణా! ♦ యొప్పు నీపంపకు దక్షిణపార్శ్వసం♦స్థగిరిసాను
వునఁ బూచియున్నయా♦ఘనకర్ణికారలతను సొంపుఁగూర్చెడు♦దానిఁ గనుము

తే. ధాతుపుంజవిభూషిత♦ధరణిధరమ
హేంద్రమిది వేగముగ వాయు ♦ వెనఁగి వీవ
దానితాఁకున లేచి విం♦తగఁ గనఁబడు
రజము విడుచుచునున్నది ♦ రమణమిగుల. ౨౩॥ 68

క. గిరిసానువులను గింశుక, తరువులు మిగులంగఁ బూచి ♦ దళములు లేకే
సురుచిరములుగా నెల్లెడఁ, బరికింపఁగ నై చెలంగు ♦ బాగుగఁ గనుమా!.

సీసమాలిక:—

వానిచేఁ బర్వత♦సానువుల్ పెక్కగుజ్వాలలు గలయట్లు ♦ వఱలుచున్న;
వీపంపతీరంబు♦నే యాశ్రయించుచు మకరందధారల♦మానితంబు
లయి మాలతులు మల్లె ♦ లల్లె గన్నేరులు పుష్పించియున్న వీ♦పొల్కె మొగలి
భూరుహంబులు సింధు♦వారముల్ వాసంతికలు కుంద గుల్మముల్ ♦గంధపూర్ణ
మాగధీగుల్మముల్ ♦ మఱియుఁగానుగుచెట్లుపొగడలిప్ప,లశోక♦భూరుహములు
చంపకతిలకముల్ ♦ సొంపగునాగవృక్షమ్ములు నీపవృ♦క్షములు వరణ
ములును ఖర్జూరముల్ ♦ లలితపద్మకములు నలరు నీలాశోక♦ములును వెలయు
చున్నవి; శైలశృం♦గోర్వుల సింహకేసరముల పింజర♦చ్ఛాయ గలిగి [యు
యలరులొద్దుగువృక్ష♦ములును బూచినయట్టి యూడుగుల్గోరింట ♦ లొప్పుమెఱ
పూర్ణకములు నింబ♦భూజమ్ము లామ్రపాటలకోవిదారముల్ ♦ వెలయుచున్న

---

1 పద్మకేసరసంస్పృష్టో వృక్షాంతరవినిస్సృతః, నిశ్వాసఇవ సీతాయా వాతివాయు ర్మనోహ రః-అనిమూ. దీనికి గోవిందరాజు లౌచిత్యమును జూపుచు ప్రాసినవిశేషార్థము లిందాపదములే వాడు టచే నిమిడియున్నవని యెఱుంగవలయు.

వల్లి నారింజవృ♦క్షావళియర్జున కేతకోద్దాలక♦ఖ్యాతభూజ
ములు, శిరీషద్రుమ♦ములు శింశుపంబులు చంద్రలు పర్వత♦సానువులను
గనఁబడుచున్నవి ♦ వినుము బూరుగులు ర క్తకురవక పలాశ♦తరువులు మఱి
తినిశ చందనములు ♦ దివ్యతమాలముల్ స్పందనములు కానఁ♦బడుచునున్న
వనుజ! చక్కఁగను బూ♦చినవియుఁబుష్పితాగ్రములునునైనతీఁ♦గలొగిఁదమ్ము
నల్లుకొనఁగ సిరి ♦ యుల్లసిల్లఁగ నొప్పు బహుభూరుహముల నీ♦పంపదరిని

తే. గనుము పవమానవిక్షిప్త♦కమ్రశాఖ,లలర స్పృశియింప ననుకూల♦మైనయట్టు
లమరినట్టి యీచెట్లను ♦ నాత్మవిభుని, మదపతులయిన పతులట్లు♦మంజులతలు.

క. అనిశము సమాశ్రయించియె, తనరారుచునున్న విట స♦దాగతి వృక్షం
బుననుండి వృక్షమునకున్, వనినుండి వనంబునకును ♦ వైభవ మలరన్. ౧౭౪

ఆ. కొండనుండి మఱొక♦కొండకుఁ దిరుగుచుఁ, గ్రమ్రరసములాని ♦ కడఁగి తృప్తి
నందినట్టి వాని♦చందమునన్ మంద,ముగనె వీచుచున్న♦ది గనుఁగొనుము.

చ. తరువులు కొన్ని పత్పనుమ♦తానముతోఁ దగి పుష్పగంధస
త్పరిమళ మొప్పనున్నయవి ♦ పాదపముల్ మఱికొన్ని మొగ్గలే
యరుదుగ నంతటన్ వెలయ ♦ శ్యామలవర్ణముతోఁ జెలంగి సో
దర! కననొచుచున్నవి మ♦దంబునఁ జూడుము వీనిసొరులన్. ౧౭౬ 73

క. ఇదియగు రమణీయతరం, బిది రసవంతమయి యొప్పు ♦ నిది వికసితమం
చుదితసుమరాగమునఁ దు,మ్మెద మత్తిలి పూలయందె ♦ మెలఁకువ మీఱన్.

తే. వ్రాలుచున్నది దేనిని ♦ వదలఁజాల;
కిదియు నిటు మకరందాశ ♦ యెసఁగ నొక్క
తరువునన్ వ్రాలి యించుక♦తడవు గడపి
మరలనెగయుచు వేఱొక్క♦తరువుకడకు. ౧౭౮ 75

క. చని వ్రాలుచు నీతటగతి, వనవృక్షములందు నెలమి ♦ వ్రాలుచు మఱియుం
జనుచున్ వ్రాలుచునున్నది; వినుమీ భూమిపయి పుష్ప♦వితతులు మిగులన్.

సీ. అతిసుకుమారంబు ♦ లగుటఁ దమంతనే రాలియుండుట నిది ♦ రమ్యశయ్య
లను వేసినట్టి రీ♦తిని హాయిగా శయనింపఁగాఁ దగ నమ♦రింపఁబడియెఁ;
బర్వతశృంగాళి♦పయి వింతవింతవన్నెలుగల సత్సుమ♦నిచయమిందు
నందుఁ దమంతనే ♦ యవనిపయిన్ రాలఁ గొన్ని పచ్చఁగ మఱి♦కొన్ని యెఱ్ఱ

తే. గను జెలంగుట నిట్టికాం♦తిని వెలసెడు
శయ్య లేర్పడియున్నవి ♦ సరసధిషణ!
యీవసంతర్తువున నెల్ల ♦ వృక్షములకుఁ
బుష్పజంబగు సౌభాగ్య♦పుంజ మిదియె. ౧౮౦ 77

క. కనఁబడుచున్నది చూడుము!, ఘనతరమగు నీవసంత♦కాలంబున వృ

క్షునికరములు సంఘర్షణముఁ నవలెఁ బుష్పించి భ్రమర♦ముల ఝంకృతులన్.

[1] తే. మీరు మావలెఁ బుష్పింప♦లేరటంచుఁ
బూని యితరేతంబుఁ జె♦ప్పుకొనుచున్న
యట్లు నిండుగఁ బూచిన♦యాసుమాళి
గూడి పెంపారుచున్నవి ♦ చూడవయ్య!. ౯౨ 79

క. కారండవ మియ్యది తన, నారీమణిఁ గూడి [2]సుభువ♦నంబులలోనం
జేరి విహరించుచున్నది, మారవికారంబు నాకు ♦ మఱియుం గలుగన్. ౯౩ 80

[3]క. ఈపంపవంటి సురుచిర, రూపము మందాకినికిని ♦ రూఢంబగునే
నాపట్టునఁ గ్రమ్రగుణం,బై పరఁగునటన్న ఖ్యాతి♦కర్హమది యగున్. ౯౪ 81

క. జానకి పరాపహృతయే, యైనంతనె యేమి? సాధ్వి ♦ యాబేల యిటన్
గానంబడునే మరలన్, దానిం దమిఁ గూడి యిచటఁ ♦ దగ నందఱమున్. ౯౫

క. నివసించియుందుమే; నే, దివమును మదిలోన మంచి♦ది యనుచుఁ దలఁపన్
భువినున్న నయోధ్యను నిం,క వలఁతునే! [4]రఘుకులాగ్ర♦గణ్యా! యనుజా!.

చ. అతిరమణీయశాద్వలము♦లందు మహీసుతఁ గూడి హాయిగా
రతి యొనరింతునేని స్వపు♦రంబున నుండఁగ నోచనైతి నా
వితతవిచారమే మదికి ♦ వింతగఁ దోఁపదు శక్రవైభవం
బతిశయమైనదానిఁ గొను♦నాశయుఁ గల్గదు నాకు లక్ష్మణా!. ౯౬ 84

చ. వనమున నిందు భవ్యసుమ♦వారముతో వరపత్రసంక్తితోఁ
గనఁబడుచున్న యీతరుని♦కాయము కాంతను బాసియున్న నా
మనమును వెఱ్ఱియెత్తునటు ♦ మానక చేయుచునున్న; దిచ్చటం
గనుము సుశీతవారిఁ దగి ♦ కంజయుతంబుగ నున్న పంపనున్. ౯౮ 85

సీ. చక్రవాకశ్రేణి ♦ సాధుకారండవప్లవములు క్రౌంచముల్ ♦ పరఁగుచున్న
వీపంపదరులను ♦ మృగవరాహంబులు కలయఁ గ్రుమ్మరుచును ♦ గానఁబడెడు;
నెన్నియో పక్షులు ♦ హితముగ ధ్వనియించుచుండఁగా నీపంప♦యొప్పుమెఱయు
చున్నది; చంద్రని♦భోజ్జ్వలాస్యము గల్గి ప్రౌఢయై పద్మని♦భంబులైన

తే. కన్ను లలరారఁదగిన నా♦కాంతఁ దలఁచు
కొనుచునున్నాఁడ నిట్టినా♦కును మనోజ్ఞ
నిస్వనములను జేయునీ♦నిఖిలపక్షు
లరసి కామము హెచ్చించు♦నట్టు లలరు. ౧౦౦ 86

క. గిరిసానువులను మృగములు, తరుణులతోఁ గూడి కేళిఁ ♦ దమి సల్పెడునే

---

1 ఆహ్వయంతఇ వాన్యోన్యం నగా షట్పదనాదితాః - అనిమూలము. 2 విగాహ్య సలిలం శుభమ్-అనిమూలము. 3 మందాకిన్యాస్తత్ప్రసిద్ధరూపం ఏవం మనోహరం యది భవేత్ - అని మహేశ్వరతీర్థులు. 4 నాయోధ్యాయై రఘూత్తమ-అనిమూలము.

*హరిణకిశోరాక్షిని సుం,దరిఁ బాసి కృశించువాఁడ ♦ ధైర్యము దూలన్.

తే. మృగములను బక్షులను గూడి ♦ మెలఁగుచుంట
నందములు గాఁగ నున్న యా ♦ యద్రిశిఖల
యందు నందంద చరియించు ♦ నఖిలమృగము
లార్తి నింపుచునున్న వీ ♦ యాత్మ కిపుడు. ౧౦౨ 88

క. నేనా ప్రేయసిఁ జూతున, యే నప్పటికిన్ శుభంబు ♦ లెసఁగు న్నాకున్;
మానిని సురుచిరమధ్యను, జానకి నను గూడి దివ్య ♦ సరసున నిందున్. ౧౦౩॥

క. తనరారు మందమారుత, మును హాయిగఁ బొందు నేని ♦ ముదము దలిర్పం
గను నేను బ్రదుకుదును గా, యనుజా! శోకము నడంచి ♦ యఖిలశుభదమై.

క. సరసిజహల్లకగంధో,త్కరములు వెలయంగఁ బంప ♦ కడఁ దగు వనులం
బరఁగుచుఁ బొలయు సమీరముఁ, దరుణులతోఁ గూడియున్న ♦ ధన్యు లెసఁతముగ్.

తే. అనుభవింతురు మించు ప్రా ♦ యంబు పద్మ
దళవిశాలాక్షముల్ తగు ♦ తేన్వి నన్ను
విడిచి తనప్రాణముల నల్లె ♦ విడువఁజాల
కెట్లు నిల్పుకొనంజాలి ♦ యిల బ్రదుకునొ!. ౧౦౫॥ 92

క. జనపుంజములరు సభలో, జనకోర్వీనాయకుండు ♦ సత్యవచనుఁ డో
య్యన సీత సేమ మడుగన్, విని యేమని యుత్తరంబు ♦ వినిపింతు నికన్.

చ. వనముల కేగుమంచు నృప ♦ వర్యుఁడు తండ్రియె యాజ్ఞ చేయ నేఁ
జనఁ దలఁపంగ నిట్టినను ♦ సంతతభాగ్యవిహీనుఁ గూడి యా
జనకజ సత్పథంబు గొని ♦ చయ్యన వచ్చెఁ గదా సుమిత్రనం
దన యలతన్వి యెందిపుడు ♦ తాను వసించెడినో వచింపుమా!. ౧౦౬॥ 94

తే. వికలహృదయు రాజ్యభ్రష్టు ♦ సకలహీను
నన్నుఁ దమిఁ గూడి వచ్చిన ♦ నన్నుతాంగిఁ
బాసి కృపణుఁడనై యసు ♦ పంచకమ్ము
నిలుపుకొనియుండ నేనెట్లు ♦ నేర్తు నింక. ౧౦౮॥ 95

క. సురుచిరపక్ష్మాక్షంబై, వరగంధము వెలయఁగా శు ♦ భం బవ్రణమై
నిరుపమము నా తదాస్యముఁ, బరికింపక నామనంబు ♦ పరమార్తిఁ గనున్.

సీ. సహజసుస్మితమవ ♦ సరమును బట్టి వచ్చిన హాస్యమలరఁ దీ ♦ యనయి, గుణము
గలిగి హితంబు న ♦ తులమును నగు సీత పలుకుల నే విన ♦ గలనొ యెపుడు;
ప్రాయము తనరు నా ♦ ప్రేయసి తా దుఃఖమును వనమునఁ బొంది ♦ యును స్మరార్తిఁ
గనుచున్న నన్నును ♦ గాంచి తానును దుఃఖవిరహితయైనట్లు ♦ విమలసమ్మ

---

* మాం పునర్మృగశాబాక్షీ-అని మూలము.

తే. దమును బొందినయట్లు ని♦తాంతసరస
వాక్యములు పల్కి సంతోష♦వార్ధిఁ దేలఁ
గా ననుం జేయు; లక్ష్మణా! ♦ నేనయోధ్య
కరుగ మతివిభవంబున ♦ నలరుతల్లి. ౧౧౨ 97

[1]చ. ననుఁ గని కోడలెక్కడ? మ♦నస్విని యాజనకాత్మజాత య
వ్వనమున నెట్టులుండెనని ♦ వారక ప్రశ్నమొనర్ప నేమిప
ల్కనుగలనో? ప్రియానుజ యిఁ♦కం జని నీవును భ్రాతృవత్సలుం
మనభరతుం గనుంగొనుము ♦ మానిని సీతనుబాసి నే నిఁకన్. ౧౧౩ 98

క. జీవింపఁజాలనని యా, భూవిభుఁ డపుడెచ్చ నిటు వి♦భుండు ననాథుం
డేవిధమున విలపించునొ, యావిధమున నేడ్వ నమ్మ♦హాత్ముని నన్నన్. ౧౧౪

చ. కనుఁగొని లక్ష్మణుండు ప్రతి♦గానక యుక్తమునైనవాక్యముం
దనరఁగ నిట్లుపల్కె; జన♦నాథ మనంబున ధైర్యమూను నీ
కనుపమమంగళంబు లిపు♦డయ్యెడుఁగాక వగం గృశింపఁగాఁ
జనునె త్యజింపు దానినిఁకఁ ♦ జక్కఁగ ధర్మవిదుల్ భవాదృశుల్. ౧౧౫ 100

క. మనములు మందతఁగనఁగాఁ, గనఁజాలదు స్నేహము నధి♦కముగా నునుపన్
వెనుకన్ వియోగ మలవడఁ, గను దుఃఖము గలుగు నను జ♦గద్వాక్యంబున్.

క. స్మరియించి ప్రియజనులయం,దు రయంబున స్నేహమింకఁ♦దొలఁగింపుముభూ
వర! యధికస్నేహంబున, వరుసం దడిసినదిధైన ♦ వత్తియుఁ గాలున్. ౧౧౬

క. బలిసద్మమ్మున కేగిన, నలఘుతరంబైన యెట్టి♦యనవనికిఁ జనినన్
ఖలుఁడగు రావణుఁడేమో, యిల నుండఁడు ప్రాణయుక్తి ♦ నిఁక శ్రీరామా!.

క. ఆపాపమతి దశాస్యుం, డెపట్టున నున్నవాఁడొ ♦ యెఱుఁగందగు నా
భూపుత్రి నీయువలె నీ, నోపఁడయేఁ జావవలయు ♦ నొగి మనచేతన్. ౧౧౮

క. జనకజఁ జేకొని యసురుఁడు, చని యదితి యనూనకుక్షి♦నరఁగునఁ దాఁ జొ
చ్చిన నచటఁ గూడ జానకి, మనకీయఁడయేని నేను ♦ మహిమ వధింతున్.

తే. భద్రదంబగు స్వాస్థ్యంబుఁ ♦ బడయవయ్య!
[2]కృపణయగు బుద్ధి విడువుమా ♦ యెపుడు ధైర్య
మూనకే యత్నమును జేయఁ♦కుండువారి
కించుకయుఁ గార్యసంసిద్ధి♦యే కలుగదు. ౧౨౦ 106

సీ. ఆర్య! యుత్సాహమే ♦ యతిబలవంతమా నద్దానిమించిన♦యట్టి బలము
ధరలేదు రామ! యు♦త్సాహము గలవాని కెన్న దుర్లభమైన ♦ దేదిలేదు
పురుషు లుత్సాహంబుఁ ♦ బూనినవారలు కార్యంబులందు నే♦కష్టమూన
రల్లాట మనమిపు ♦ డట్టి యుత్సాహంబుఁ బూనుదుమేని యా♦భూమిపుత్రి

1 కథం చాతిమనస్వినీమ్-అనిమూలము. 2 త్యజ్యతాం కృపణామతిః-అనిమూలము.

తే. మరలఁ బొందంగఁగలము మ♦న్మథప్రవృత్తి
నిట్టిదాని జయింపుమా ♦ యుగ్రమనోవ్య
థను జవంబున వెనుకకుఁ ♦ దఱిమి వేయు
మార్య! సుకృతాత్మ మఱియు మ♦హాత్మ! నిన్ను. ౧౨౩ 107

క. నీవే యిటువలెఁ జెదరఁ? యున్నా వే! యని మందలించె; ♦ నైజవిభూతిన్
బోవిడిచి వగల మతిచెడి, యీవిధమునఁ గుందియున్న♦యారాఘవుఁడున్.

క. అనుజుం డిటు బోధింపం, దనశోకము మోహమును ని♦తాంతము విడిచెన్
మనమున ధైర్యముఁ బొందెను;, జనపతియు నచింత్యశౌర్య♦నాయకుండంతన్.

[1]క. సురుచిరమై చంచలద్రుమ, మిరుపారెడువలియనగుచు నొప్పు ♦ మిగులం దగునా
సరసును బంపాహ్వయము నెచ్చరికను దప్పక యతండు ♦ సరగున గడచెన్.

చ. అనుజునితో మహాత్ముఁ డగు♦నారఘువీరుఁడు కాననంబు దా
నిని గనుఁగొంచుఁ గందరవి♦నిర్మలనిర్ఝరపంక్తి నెల్లెడం
గనుచును బ్రాన్కమై వెదకి ♦ కాంతను గానక చిత్తమందుఁ బై
కొను వగ పెంపునన్ బొగిలి ♦ కుందుచుఁ బోయెను దీనుఁడై తగన్. ౧౨౬

సీ. మదదంతిలలితగ♦మనుఁడయి యవ్యగ్రచిత్తుఁడై రాఘవా♦యత్తుఁ డగుచు
నప్రమత్తుండు నగు♦నాలక్ష్మణుఁడు రాము [2]ధర్మవాక్యములబో♦ధముల నేన
దశకంఠుఁ జంపుదుఁ ♦ దప్పకయని తనబలమును దెల్పుచు ♦ నలరునట్లు
చేయుచుఁ జనుచున్న ♦ శ్రీరాముఁ రక్షించుచుండె; నంతట బల♦మొప్పుచుండ

తే. వానరేంద్రుఁడు సుగ్రీవుఁ ♦ డానగంబు
చెంతఁ దనయన్నయగు వాలి♦చేతఁ జంపఁ
బడుదు ననుభీతిఁ జరియించుఁ ♦ బంపచెంత
నొక్కదినమునఁ దిరుగుచు♦నుండి యతఁడు. ౧౨౭ 112

చ. కనుఁగొన నద్భుతాకృతులఁ ♦ గ్రాలెడురాజకుమారవర్యులన్
గనుఁగొని భీతినొంది యటఁ ♦ గార్యముతోఁచక యట్టె మ్రాన్పడెన్;
వనగజమందగామి యగు♦వాఁడు మహాత్ముఁడు పంపచెంత నొ
య్యనఁ జరియించు రాఘవుల♦నంతటఁ గాంచి విషాద మొందుచున్. ౧౨౮

తే. చింత పెనఁగొన భీతిని♦జెంది తద్భ
రమున మునిఁగెను; వానిమి♦త్రములు వాన
రులును దేజోవిభూతిచే ♦ వెలయురాఘ
వులను గని వాలి పంప పీ♦రలు నిచటికి. ౧౩౦ 114

1 రామః పంపాం సురుచిరాం రమ్యపారిప్లవద్రుమామ్ - అనిమూలము. పారిప్లవద్రుమాం= చంచలద్రుమాం-అనివ్యాఖ్య. 2 పరకు ధర్మేణ బలేనచైవ - అనిమూలము. సంస్తంభరామస్థితోంత ఇత్యాదిరాజనీతిరూపప్రకథనేన తత్రాప్యేనం హనిష్యామిత్యాది స్వబలకథనేన చేత్యర్థః- అనివ్యాఖ్య.

తే. మునులవేషము లూని వ♦చ్చినటు లెఱిఁగి
దిగులుపడి పావనము ముని♦దేవవాన
రోగ్యమును శర్కరమునై ♦ యొప్పి నడుమ
వానరులు నుండు నుటజంబు♦లోనికరిగి. ౧౩౦౪ 115

ఒకటవ సర్గము సంపూర్ణము.

---

౨ - వ సర్గము.

రామలక్ష్మణులకడకు హనుమంతుని సుగ్రీవుఁడు పంపుట.

క. మునిపర్ణశాల దాఁగిరి, యనుపమరూపముల నుత్త♦మాయుధములఁ దా
ల్చినవీరుల రాఘవులను, గని సుగ్రీవుండు మదిని ♦ గాంచెన్ శంకన్. ౧ 116

ఉ. వానరపుంగవుం డతఁడు ♦ వారలఁ జూచి భయార్తిఁ జెందుచున్
మానసధైర్యమెల్లఁ జెడ ♦ మ్రాన్పడి యంతట సర్వదిక్కులన్
దా నొగిఁ జూచుచున్ గడువ్య♦థం గని యొక్కస్థలంబునందుఁ గా
లూనుచు నిల్వఁడయ్యె మఱి♦యున్ బలసారుల వారినిప్పరన్. ౨ 117

క. కనినంతనె కపివర్యుని, మనసొకచో నిల్వదయ్యె ♦ మఱియును భీతి
ల్లినవాఁడు గాన దుఃఖం,బునఁ బరవశచిత్తుఁడయ్యె ♦ ముగ్ధుండౌటన్. ౩ 118

సీ. రాజధర్మంబుల ♦ నోజనెఱింగినవాఁడౌట నతఁడు నా♦వసుధనిల్చి
యుండంగవచ్చునో ♦ యురు వేగమునఁ బాఱవలయునో యిం దేద♦వశ్యమనుచు
గురులాఘవంబుల ♦ సరగునఁ దనమంత్రులనుగూడి యోజించి♦మనమునందు
నతిశయంబుగ భయ♦మందెను వానరపతి; యంత వారలఁ ♦ బరమరూపు
తే. లను గనుచుఁ జాలఁగా భయ♦మునను మంత్రి
గణముతో నిట్లు పల్కె; ని♦క్కడకు వచ్చి
నట్టివీరలు నాయన్న ♦ యనుప వచ్చి
నారు చారులు నిజమిది ♦ వీరలిటకు. ౪ 119

క. మునివేష మనెడువ్యాజం,బున వల్కలములను గట్టి ♦ మొనసి తిరుగుచున్
వనమీదుర్గమమును మెల్లనఁ జొచ్చిరి నన్నుఁ జంప ♦ లలితాకృతులన్. ౫

క. అనవిని యాతనిమంత్రులు, ఘనచాపమ్ములను దాల్చి ♦ కనఁబడువారిం
గని రాజవచనమే హితమని యెన్నుచు నచటినుండి ♦ యవ్వల నొకచోన్.

తే. ఉత్తమంబగు నొకమహీ♦ధ్రోరుశృంగ
మునకుఁ బోయిరి; వారలు ♦ మొనసి వేగ
యెల్లదిక్కులకుం బాఱి ♦ యెల్లరొక్క
చోట మరలను జేరి యా♦శుగతి మాని. ౭ 122

క. వానరపతి సుగ్రీవుని,తో నందఱుఁ గూరుచుండి ♦ తోరపుభక్తిన్

జానుగ సేవించిరి మఱి, వానరులును బెదరి కూడి ♦ భయమును గనుచున్. ౧౦

సీ. ఈపర్వతమునుండి ♦ యాపర్వతమునకు నెగురుచు ఘూత్కార♦శృంగములను బట్టఁ
గంపింపఁ జేయుచు♦ నగ్రమున గానంబు లాకంపోలెడు గుబురులఁ గూడి ♦ యున్న భయము
బఱగెత్తియున్న యా♦వానరేంద్రునిఁ గూడుకొని; కంపితఘన బల♦ములఁ దెలంగు
వానరులందఱు ♦ వరుసగా నెగురుచు ఘూత్కారంబులఁ బుష్ప♦హాహాహూముల

తే. విఱిచి శాఖాంశ నంతట ♦ వృక్షచయము
దాఁట్లు వైచుచు మార్గాల♦తతుల మృగము
లను బులులు లోనగు మృగంబు♦లను భయంబు
నందఁ జేయుచుఁ బోయిరి ♦ త్వాస్తులగుచు. ౧౧ 124

చ. వనచరమంత్రు లందఱును ♦ బర్వతవర్యము చుట్టుఁబట్టులం
దును వడి సంచరించి వెత♦తో మరలం జనుదెంచి యద్రి ది
క్కునుచును జేరి సూర్యసుతు♦నంతటఁ గూడి కరాళిమోడ్చి యా
తని కడ నుండి నాటక స♦మాగతిపుత్రుఁడు వాక్యనైపుణిన్. ౧౨ 125

క. తనయన్నయేమొ కిల్బిష, మొనరించినవాఁడటంచు ♦ నురుభీతిని గుం
దినవాని వానరేంద్రునిఁ, గని యిట్లనిపల్కె; నయము ♦ గడలుకొనంగన్.

తే. వాలికయి సంభ్రమము మీఱ ♦ వదలవలయు
నద్రి యిది ఋశ్యమూకాహ్వ♦యంబు గాని
మఱొకపర్వతమే కాదు ♦ మనకు వాలి
వలన నిట నించుకంతయు ♦ భయములేదు ౧౪ 127

క. హరిపుంగవా! శతక్రతు, వరపుత్రుఁడె యిట్టులిటకు ♦ వచ్చెననెదో యె
వ్వరిఁ గాంచి దిగులుపడి యి,క్కరణిని బాఱెదవొ క్రూర♦కర్ముఁడు ఖలుఁడున్.

క. ఐనట్టి వాలిగుఱుతులు, నే నిటఁ గనఁజాల; సౌమ్య! ♦ నీయిల్లాలిన్
దానై బలిమింగొనిన [1]మహానీచునివలన భయము♦నందెదో యిచటన్.

తే. అట్టి దుష్టాత్ముఁడైన నీ♦యన్న వాలి
గుఱుతు లిటలేవు భయమునఁ ♦ గుందవలదు
భయము కలుగునటంచు నా♦స్వాంతమునకుఁ
గానఁబడలేదు నుంతయుఁ ♦ గారణంబు. ౧౬ 130

[2]చ. చలకనిబుద్ధిగల్గి బహు♦శుభ్రముగాఁ దలపోసి నెమ్మదిన్
గలఁగని యట్లు చేసికొనఁ♦గాఁ దగుశక్తియె లేక యిట్టు లా
కులతను గాంచె దార! కపి♦కుంజర! నీకగువానరత్వ మి
మ్ములఁ దెలియంగనయ్యె; నిఁక ♦ ముందును బుద్ధియు జ్ఞానముం దగన్. ౧౭

---

1 పూర్వజా త్వాపకర్తృణః-అనిమూలము. 2 అహో శాఖామృగత్వం తే వ్యక్తమేవ ప్లవంగమ-అనిమూలము.

క. ఇతరుల భావంబుల నిం,గితములచేఁ జక్క నెఱిఁగి ♦ కృతకార్యుఁడవై
హితముం గనుమా భ్రాత, ప్రతతిని మతివిభవ మెసఁగ ♦ రాజెటులేలున్.

[1]చ. అని హనుమంతుఁ డాడెడు శు♦భాధికవాక్యము లాలకించి యా
తనివచనాళికం బెశుభ♦దంబగువాక్తతి పొల్పుమీఱ ని
ట్లనియెను వాయుసూనుఁగని ♦ యాయతబాహువు లొప్పుచుండఁగా
వనజసమాననేత్రములు ♦ భాసిలఁ జాపశరాసిధారులై. ౧౯ 133

చ. సురనుతులట్లుగా వెలయు♦శూరుల వీరలఁ జూచినంత నె
వ్వరికి భయంబు పుట్టదొకొ? ♦ బాగుగఁ జెప్పుము; వాలివచ్చెనం
చురుభయమొందలే దతఁడె ♦ యొప్పెడువీరల నన్నుఁ గూల్ప ని
త్తరుణమునందుఁ బంపెనని ♦ తాల్పెద శంక మదాత్మ, నోసఖా!. ౨౦ 134

తే. ఇట్టి పురుషులు వాలికి ♦ నెట్లు దొరకి
రనియెదవొ యెమొ? రాజుల ♦ కవనిఁ బెక్కు
మంది మిత్రులుందురుగాన ♦ క్ష్మాపతులవి
షయమునందుంచరాదు వి♦శ్వాసమెపుడు. ౨౧ 135

సీ. మనుజుఁడు తనమీఁదఁ ♦ దనవైరులెల్లెనఁ బగఁదీర్చుకొనుటకై ♦ పరమగూఢ
వృత్తులఁ గొని దరి♦యింతురంచు నెఱింగి యట్టివారిని గని♦పెట్టి తెలిసి
కొనఁదగు; వారల♦తని నెట్లొ నమ్మించి తారు నమ్మకయుండి ♦ తఱినివేచి
ప్రహరింతు; రావాలి ♦ వలసినకార్యముల్ నెఱవేర్చుపనియందు♦నేర్పు దూర
తే. దృష్టియును జాలఁగల్గు బు♦ద్ధిగలవాఁడు;
బహువిధోపాయములుచేసి ♦ పగతుర నృపు
లెట్టులేఁ జంపఁగా మది♦నెంతు రట్టి
లోట మనుజులు వారినె♦ల్లెనఁగాని. ౨౨ 136

[2]తే. దీనవేషంబులం దాల్చి ♦ తెలియవలయు
వారిభావంబులను; గపి♦వర్య! నీవు
సర్వసామాన్యమైన వే♦షమునఁ బోయి
యెఱుఁగవలయును దద్విధ ♦ మెట్టులనిన. ౨౩ 137

సీసమాలిక.—

భావసూచకతను ♦ వ్యాపారములనెల్లఁ బరికించి మఱియు స♦ర్వాని భేద
ములను బట్టియు సౌమ్య♦ము లసౌమ్యములగు నాకారములను నుఱి♦వారిభాష
ణములను వారల ♦ నయము చక్క నెఱుంగవలయు; హర్యుత్తమా!♦వారిభావ
మును గుర్తెఱుంగుము ♦ మనసుల వారికిఁ జెడుతలంపున్నఁ ద♦చ్చింతపోవ

---

1 తత శ్చుభతరం వాక్యమ్-అనిమూలము. 2 తే జ్ఞేయాః ప్రాకృతై ర్నరైః-అనిమూలము. తే ప్రాకృతైః దీనవేషధారిభిః-అనివ్యాఖ్య.

నెన్నిమాటలు పల్క ♦ నింపగు నటుపల్కి సమ్యక్ప్రవర్తించి ♦ నాకు మిగుల
ననుకూలముగ నుండు♦నట్లొనరించుచుఁ దరువాత చాపముల్ ♦ దాల్చియుచటి
కేతేరఁ బనిమీకు ♦ నేమని ప్రశ్నింప నవ్వారిచిత్తంబు♦లందు నాదు
భావంబు గన్పడు♦నేవారి నావారిఁ గా నొనరించి నా♦కొనను హేతు

తే. వేమి? యని ప్రశ్నచేసియే ♦ యెఱిఁగికొనుము
వారిమాటలచేతను ♦ వారు దుష్టు
లో మహాత్ములో యెఱుఁగంగ♦నొప్పు ననిన
బవనసూనుఁడు సుగ్రీవు♦పల్కులు విని. ౨౭ 138

చ. తన నటకేగుమా యనుచుఁ ♦ దత్ప్రకృతం బ్రభు వాజ్ఞ చేయ ని
ష్పనియును మంచిదేయనుచు ♦ భావమునం దలపోసి పోవనెం
చెను నలరామలక్ష్మణులు ♦ చేరినచోటికి; శత్రుభీముఁడై
తనదరిఁ జేరరానియటు ♦ దారుణరూపము నొందియున్న య
ర్కనిసుతునాజ్ఞఁ జేయఁగను ♦ గోరి మహాత్ముఁడు వాయుసూనుఁడున్. ౨౮

తే. పతిని గొనియాడి నీవన్న♦పలుకునట్లె
చేయువాఁడను దప్పక ♦ చిత్తమలర
[1]ననుచు విన్నపమును జేసి ♦ యరిగె రాముఁ
డతిబలుఁడు లక్ష్మణుం డున్న♦యవని కపుడు. ౨౯ 140

రెండవ సర్గము సంపూర్ణము.

---

## 3 - వ సర్గము.

—రామలక్ష్మణులతో హనుమంతుఁడు సంభాషించుట.—

తే. అమ్మహాత్ముఁడు సుగ్రీవుఁ ♦ డట్లు పలుక
నతనిభావ మెఱింగి యా♦హనుమ ఋశ్య
మూకమునుండి రాఘవు♦లేకడఁ గల
[2]రచటికెగురుచుఁ బోయె న♦ద్యమమలరఁగ. ౧ 141

చ. అనిలతనూజుఁ డాహనుమ ♦ యంతట [3]వంచనచేయుబుద్ధితోఁ
దనకపిరూపమున్ వదలి ♦ తా యతిరూపము నొంది యప్పుడో
య్యన రఘువీరు లున్నయెడ ♦ కర్మిలిఁ బోయి [4]నమస్కరించి స
ద్వినయము మీఱ శ్లక్ష్ణుఁడయి ♦ వేడుక నించెడుపల్కు పల్కి వా
రిని దగినట్లుగాఁ బొగడు♦కీర్తిని మోదమునందఁ జేయుచున్. ౨ 142

---

1 యత్ర రామోఽతిబలశ్చ లక్ష్మణః-అనిమూ. 2 ఋశ్యమూకాత్తు పుప్లువే యత్ర రాఘవౌ-అనిమూ. 3 శఠబుద్ధితయా కపిః-అనిమూ. 4 హనుమాన్ రూపమేవాస్య మహిమానం వ్యాచష్ట ఇతిన్యాయేన తయోర్దర్శనమాత్రేణైవ తౌ సుగ్రీవవిరోధినిరసనే క్షమా వితి జ్ఞాత్వా గృహీతవేషాంతరస్య స్వచారత్వం ప్రకటయితుం ప్రణామేతి నవిరోధః-అనివ్యాఖ్య.

క. వీరవరుండై తగు న, మ్మారుతసూనుండు శాస్త్ర♦మర్యాదను వే
వారలను సత్యశౌర్యుల, గౌరవమునఁ బూజఁదన్ని ♦ కడుభక్తిమెయిన్. ౮౪

సీ. మధురతరంబులౌ ♦ మాటలనిటుపల్కె మృగగణంబుల మఱి♦యెల్లవనచ
రములను వెఱపించు♦చు, సుహితపంపాసరః ప్రాంతభూరుహ♦రాజిఁ గనుచు
స్తుతిపాత్రరూపముల్ ♦ శోభిల్ల రాజర్షులట్లు సువర్ష్వల♦యట్లు తనరి
సంశ్రితవ్రతులయి ♦ సాధుతపస్వివేషములను దాల్చి ఘో♦రమగునిట్టి

తే. వనమునకు వచ్చితిరదెట్లు! ♦ వల్గుసలిల, ములఁ జెలంగెడునీపంప ♦ వెలుఁగునట్లు
భవ్య తేజంబులం జేసి♦పరమమాని, వేషములఁ దాల్చియున్నారు♦వినెదఁ జెపుఁడు.

చ. నిరుపమధైర్యయుక్తులయి ♦ నిద్దపుబంగరుఛాయతోడ సుం
దరతనువుల్ చెలంగియును ♦ నారను నేసిన చీరలొప్పఁగా
వరభుజులై విచిత్రనిజ♦వర్ష్మములం గని యిందునున్న భా
సురమృగపక్షులుల్ వడఁకఁ ♦ జూడ్కులు సింహమురీతి నొప్పఁగన్. 145

క. వనసంచరణజఖేదం, బున నిట్టూర్పును చెలంగఁ ♦ బొల్చుచు సింహం
బును మించిన శౌర్యము బల, మును దగ నున్నారు చిత్ర♦ముగఁ జూడఁగనై.

చ. హరిహయచాపసన్నిభము♦లై తగు చాపములన్ ధరించుచున్
బరజనహంతలై ద్యుతిని ♦ భాసిలుచున్ ఘనరూపయుక్తులై
వరవృషభంబులట్లు తగు♦వర్ణితచారుగతుల్ చెలంగఁగాఁ
గరికరతుల్యబాహువులు ♦ గ్రాలఁగఁ దేజము లొప్పసూపఁగన్. ౯౪ 147

క. విలసిల్లు మీరలెవ్వరు?, తెలుపుఁడు మీదివ్యదేహ♦దీప్తుల నీశై
లలలామము చిత్రంబుగ, వెలుఁగుచు నున్నయది క్రొత్త♦విధమునఁ జూడన్.

సీ. అమరసన్నిభశౌర్య ♦ మలరార వీరులై సరసిజేక్షణములు ♦ వరుసఁ దనర
జటలఁ దాలిచి పర♦స్మరతుల్యసౌందర్యములఁ దగి దైవిక♦ముగను స్వేచ్ఛ
ధరణికి వచ్చిన♦తరణిశశాంకులవలె నొప్పుచున్ వక్ష♦ములు విశాల [గుల
ములయి పొల్పఁగ సింగ♦ములకుఁ బోలెన్ స్కంధములువిశాలమ్ములై ♦పొలయమి
సుత్సాహములఁ దగి ♦ యురుమదవృషభంబులట్లు దేవతలట్టి ♦ యాకృతులను

తే. దాల్చినమనుష్యవీరులై ♦ తనరుమీరు
సకలరాజన్యలక్షణ♦సహితులగుట
మనుజపతితకుఁ దగియు నీ♦వనమునకు న
దేలవచ్చితిరో చెప్పుఁ ♦ డిపుడు నాకు. ౧౩౪ 149

తే. ఆయతములు సువృత్తము♦లయి పరిఘము
లను దగం బోలి వరభూష♦లకును భూష
లగుచు నొప్పారుభుజముల ♦ నమలభూష
ణములనేల కైసేయరో ♦ నాకుఁ జెపుఁడ. ౧౮౪ 150

చ. అరయఁగ మీరలిద్ద్వఱు మ♦హాంబుధి వేష్టితమై సువర్ణభూ
ధరవరవింధ్యశైలములఁ ♦ దద్దయు రాజిలు భూస్థలంబు సుం
దరముగ నేల నర్హులని ♦ నాకును దోఁచెడు; సుందరమ్ములై
పరమవిచిత్రరీతిఁ గని ♦ బంగరుపూఁతల వింతగుల్కుచున్. ౧౬ 151

క. విలసిల్లు నీధనుర్వర, ములు హేమవిభూషితములఁ ♦ బోలుచు శచీనా
థులలితవజ్రములట్టుల, నలరారుచునున్న వివి మ♦హారుచిరములై. ౧౭ 152

తే. బుసలుకొట్టెడు దుర్భర♦భుజగముల వి
ధమునఁ బ్రాణాంతకరములై ♦ తనరఘోర
నిశితబాణవ్రజంబుల ♦ నిండి చూడ
నందముగ నొప్పుచున్నవి♦యంపపొదలు. ౧౮ 153

ఆ. మిగులఁ బొడవు నిడివి ♦ తగ మృదుభర్మతో, పనమునం జెలంగి ♦ పన్నగములు
కుబుసము వొలంగి ♦ కొమరారుకీతి నీ, ఖడ్గములు నితాంత♦కాంతి నలరు.

[1]క. నేనిట్లు మాటిమాటికి, మీనామచరిత్రములను ♦ మించెడువేడ్కన్
బూని యడిగినన్ బదులే, మో నాకున్ మీరు చెప్ప♦కున్నారింకన్. ౧౯ 155

క. వినుఁడీ ధర్మయుతంబగు, మనమున వీరత్వమునను ♦ మహిసుగ్రీవుం
డనువాఁడు ఘనుఁడు కపిగణ,మునకున్నాథుండు నగుచుఁ♦బొలుచున్ మిగులన్.

తే. అన్న వంచించి తఱుమఁగా ♦ నవని దుఃఖ
పరవశుండయి కుందుచుఁ ♦ దిరుగుచున్న
వాఁడు వానరవరులకుఁ ♦ బ్రభువు మహిత
చిత్తుఁడునునైన సుగ్రీవుఁ ♦ డి త్తఱి నను. ౨౦॥ 157

క. మీయొద్దకుఁ బంపఁగ నే, నీయెడకున్ వచ్చినాఁడ ♦ నిపుడు హనుమనా
నాయాహ్వయంబు పరఁగును, వేయేల మహాత్ములార! ♦ [2]వినుఁడె కపిఁ జూ!.

క. మీతో సఖ్యముచేయఁగ, నీతఱి ధర్మాత్ముఁడగు క♦పీంద్రుఁడు మిగులన్
జేతమునఁ గోరెడున్ నను, నాతనిమంత్రిగ నెఱుంగుఁ ♦ డనిలాత్మజుఁగన్.

సీ. సన్న్యాసినై తివే♦చందాననని యన్న సుగ్రీవునకుఁ జాల♦శుభముఁ బ్రియముఁ
జేయఁగాఁగోరి యీ♦మాయరూపముఁ దాల్చి యీపర్వతమునుండి♦యిచటికేను
వచ్చితి; నే నన్న♦వలసినచోటికిఁ [3]బోఁజాలుదును వలం♦పునకుఁ దగిన
యట్టి రూపమునెత్త ♦ నర్హుఁడననిమీరలెఱుఁగుఁడీ! యని [4]పల్కి♦బెట్టాతదివ్

తే. ధము నెఱింగిన మారుత♦తనయుఁ డెలమి
వాగ్విదుత్తములగు రఘు♦వరులతోడ

1 ఏవంమాం పరిభాషంతం కస్మాద్వై నాభిభాషథః - అనిమూ. 2 హనుమాన్నామ వానరః- అనిమూ. 3 కామగం కామరూపిణం-అనిమూ. 4 వాక్యకుశలః పునర్నోవాచ కించన-అనిమూ.

నిట్లుగాఁబల్కి యవ్వల ♦ నేమిపలుక
కూరకుండె; నప్పలుకుల ♦ నొనర వినుచు. ౨౮ 160

క. శ్రీమంతుఁడైన యారఘు, రాముఁడు మోమునను మిగుల ♦ రంజిలుతమిచే
సౌమిత్రిఁ బొర్కొనఁగతుఁ గని, యీమాడ్కిం బల్కె ననుజ! ♦ యీతనిఁ గంటే.

[1]క. ఈతఁడు మహాత్ముఁడౌ కపి, నేతకు సచివుండు మఱి ♦ నేఁగోరెడు వి
ఖ్యాతుఁడు సుగ్రీవుం డిపు, డీతనిరూపమునవచ్చె ♦ నిచటికిఁ దానే. ౨౯ 162

చ. అరిగణసూదనా! కపిగ♦ణాధిపుమంత్రియు వాక్యవేత్తయుం
బరమహితుండునై తనరు ♦ వానరు నీతని స్నేహయుక్తు నా
దరమునఁ గాంచి మార్దవయు♦తంబగు వాక్కతి మాటలాడుమీ
నిరుపమమూర్తి యెంతయును ♦ నిర్మలచిత్తుఁడటంచుఁ దోఁచెడిన్. ౨౭ 163

[2]సీ. అనుజ! ఋగ్వేదంబు♦నను శిక్షితుఁడుగాక విపులమై తగు యజు♦ర్వేదమందు
ధారణమును జేయఁ♦దగక, సామమ్మును దెలియకయున్నవాఁ ♦ డిల నిటువలె
భాషింపనేరఁడు ♦ బహువాక్యములఁ బల్కెనను నితండొకస్థలం♦బునను దగని
యట్లపశబ్దంబు ♦ ననువదింపఁడు గాన వ్యాకరణముఁ బెక్కు♦వారము లితఁ
తే. డెంతొపూనికతోఁ బఠి♦యించె నిజము
వక్త్రదృగ్భ్రూలలాటముల్ ♦ వరుస నితర
ములగు నవయవములు విక్రి♦తులను గనక
పలుకుతఱి స్వచ్ఛమగురీతి ♦ నలరెఁ గంటె. ౩౦ 164

సీ. శబ్దవిస్తృతిలేక ♦ సందిగ్ధపదవర్ణములేక కుటిలమై ♦ తగక వేగ
[3]మునుబొంద కురమున♦జనియించిమంద్రమై గళమున జననంబు♦గాంచిమధ్య
మమయి యొప్పెడి యిది ♦ మధ్యమస్వరమున నీతనివాక్య మి♦ట్లెసఁగుచున్న
దీతఁడు మఱియు వ్యా♦కృతిశాస్త్రసంస్కారమున శబ్దసంశుద్ధి♦తనరఁ బదము
లొగి వ్యక్తముగపఱి♦యునువర్ణములుస్పష్టముగనొప్పఁగను వేగ♦ముగనుగాని
తే. కుటిలముగఁ గాని లేక త♦క్కునగుణముల
నలరి మనసునకుం బ్రీతి ♦ చెలఁగ మధుర
ముగను బొల్పారఁగా వాక్య♦మును వచించు
చున్నవాఁ డిద్దిచూడ నా♦కొప్పె ముదము. ౩౨ 165

[4]సీ. ఉత్తమాంగంబున ♦ నురమున గళమునఁ దగునుదాత్తానుదా♦త్తస్వరితము
లనుగూడి చిత్రమై ♦ తనరారు నీతనిపలుకుల వినినఁ జం♦పంగఁ గత్తి

---

1 తమేవ కాంక్షమాణస్య మమాంతిక ముపాగతః-అనిమూ. 2 నానృగ్వేదవినీతస్య-అను శ్లోకవ్యాఖ్యానభాగ మిందు సంక్షిప్తమని యెఱుంగవలయు. 3 ఉరస్థం కంఠగం వాక్యం వర్తతే మధ్యమే స్వరే, సంస్కారక్రమసంపన్నా మద్రుతా మవిలంబితాం, ఉచ్చారయంతి కల్యాణీం వాచం హృదయహారిణీం - అనిమూ. 4 అనయా చిత్రయా వాచా త్రిస్థానవ్యంజనస్థయా, కస్య నారాధ్యతే చిత్త ముద్యతాసేరరేరపి-అనిమూ. దీనివ్యాఖ్యానాభిప్రాయ మిట విస్తృతమని తెలి యఁదగు.

నెత్తినపగవానికేని చిత్తము సంతసము గాంచునన నెట్టిజనునిమదికి
సంతోషమలరదు? సరసమానస! విను మనల నుతించురీతిని నె మనల

తే. వంశగోత్రాదు లడిగినవాఁడె యిట్టి, శక్తియుక్తుఁడు దూత యేక్ష్మాపతికిని
దూతగాకుండునో యట్టిభూతలపతి, కెట్లు సిద్ధించుఁ గార్యంబులెల్ల! ననుజ!.

క. విను మిట్టి సుగుణనికరం,బును గూడి సమస్తకార్యముల సాధింపం
గను శక్తి గలుగుదూత ల,వనిపతి కెవ్వాని కుండుభాగ్యము గలదో. ౩౪

క. అతనికిఁ గార్యములన్నియు, క్షతిలేక క్రమంబుఁగనక సరగున దూత
ప్రతతి సుసాధితములు నై, క్షితిసిద్ధిం బొందు ననుచుఁ జెప్పెఁ గరుణన్. ౩౫

చ. అని రఘురాముఁ డాడ విని యాకపినాథునిమంత్రి వాగ్విదుం
గని తనవాక్యకౌశలము గ్రాలఁగ నిట్లనిపల్కెఁ; బండితా!
విను మహనీయుఁడైన కపివీరుని సాధుగుణంబులెల్ల మా
కును దెలియంగనయ్యెఁ గపికుంజరు నాతనినే ముదంబునన్. ౩౬ 169

తే. వెదకుచున్నార మియ్యెడ విమలచిత్త!
యిపుడు నీప్రభునాజ్ఞచే నేమిపల్కి
నాఁడవో మేము నీచెప్పిన విధముగనె
చేయువారము మఱియొకచింతలేక. ౩౭ 170

చ. అనియెను వాయుసూనుఁ డపుడారఘువీరుని సాధువాక్యముల్
విని మది హృష్టుఁడై ప్లవగవీరుని వాలిని నోర్వవచ్చు నిం
కని మది నిశ్చయించి యెటులైనను వారలతోడ సూర్యపు
త్రునకును మైత్రిఁ గూర్చుటకుఁ దోరపువేడుకఁ గోరె నాత్మలోన్. ౩౮ 171

మూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౪ - వ సర్గము

లక్ష్మణుఁడు తమవృత్తాంతమును హనుమతోఁ జెప్పుట.

క. హనుమంతుఁ డంతమృదువుగఁ, దనయన్నయనుజ్ఞరీతిఁ దమిఁ బలికినయా
తనిమాటల విని సుగ్రీ,వుని సఖ్యముగోరె రాఘవుండని వినుటన్. ౧ 172

క. మనమునఁ బ్రమోద మందుచుఁ, దనవిభునిం గూర్చి యిట్లుతలఁచెమదిని;నా
జనపతితో శ్రీరాముఁడు, పని గలిగియె వచ్చినాఁడు బాగుగఁ గానన్. ౧

సీ. మహనీయుఁడైనట్టి మార్తండసుతునకు మరల రాజ్యప్రాప్తి మానితగతి
లభియింపఁగలదట్లు లలిరాజ్యలాభకృత్యంబును నొనఁగూడినట్టిదయ్యె;
ననుచు హృష్టుండయి యాప్లవం*గర్షభుం డగుహానుమంతుఁ డప్రాత్మవాగ్వి
శారదత్వము మీఱ జనపతి శ్రీరాముఁ గని పల్కె నీవు తమ్మునిని గూడి

---

* 'గ' యను యక్షరము గాయత్రీదశమాక్షరము.

తే. భయదమై వ్యాళమృగసమ♦వాయమైన, దండకారణ్యమునకు ను♦ద్దండరీతిఁ
బరఁగు పంపాసరోవర♦ప్రాంత కాన, నాభిమండితమైన యీ♦యవనికిపుడు. ౪

తే. ఏల వచ్చితివనియోఁ; గ♦పీంద్రుఁ డిట్టు
లడుగ లక్ష్మణుఁ డాలించి ♦ యపుడు రాముఁ
డుత్తరము చెప్పుమనఁగ దా♦నుదయమున
దశరథాత్మజుఁ గూర్చి యెం♦తయును బలికె. ౫ 175

క. కలఁడిల దశరథుఁడను ని,ర్మలదీప్తియుతుండు ధర్మ♦సహితుండును రా
జులలోన మేటి; యాతం, డలయక ధర్మమునఁ బ్రజల ♦ నందఱఁ దమిచేఁ. 

క. పరిపాలించెను నిరతం, బరయుచు వర్ణములు నాల్గు ♦ హర్షమునొందన్
[1]ధరలేఁడు ద్వేషి యతనికి, నొరుపై ద్వేషంబతనికి ♦ నుండ దదెపుడున్. ౬

చ. అతఁడు సమస్తభూతముల♦యందుఁ బితామహునట్లు శ్రేష్ఠుఁడై
క్షితిఁ జెలువారె దక్షిణలఁ♦జెప్పినయట్టు లొసంగి పెక్కు స
త్క్రతువులఁ జేసె; నీతఁ డల♦రాజునకుం దొలిపుత్త్రుఁడయ్యెఁ జు
మ్మితనిని రాముఁడందు రు జను♦లెల్ల శరణ్యుఁడు భూతకోటికిన్. ౮ 178

చ. జనకునియాజ్ఞ యొప్పు కొన♦సాగఁగఁ జేయుచు నుండువీరుఁడై
తనరుఁ; దదాత్మజావళి ని♦తాంతముఁ దా గుణవంతుఁడై తగున్
ఘనతరరాజలక్షణని♦కాయయుతుండును రాజసంపదం
గని యలరారుచుండు నొక♦కారణమూని యితండు నాత్మలోన్. ౯ 179

తే. తనదురాజ్యంబు విడనాడి ♦ వనమునందు
వాసమును జేయుటకుఁగాను ♦ వచ్చె నన్నుఁ
గలిసి యిచ్చటికిని; మహా♦కాంతినిధిని
భాస్కరుని సంజయందుఁ ద♦ద్భార్య ఛాయ. ౧౦ 180

క. విడువక యె వెంబడించెడు, వడువున గురుతేజు, నితని♦వశగతచిత్తన్
విడువక యె భార్యసీతయుఁ, గడునిడుముల నిడఁగఁజాలు ♦ కానకు వచ్చెన్. ౧౧

సీ. తమ్ముఁడ నేను నీ♦తనికి లక్ష్మణుఁడని నన్నుఁ బిల్తురు [2]విన♦వన్న; రాముఁ
డితరులు తనకు నే♦యే మేలుచేసిన దానిని హెచ్చుగాఁ ♦ దలఁచుచుండు
వాఁడు,సుఖార్హుఁడై ♦శ్వర్యసంపన్నుఁడౌ;సర్వభూతహితకృ♦త్స్వాంతయుతుఁడు
విభవహీనుండయి ♦ విపినంబునందుండ వచ్చుచుండఁగ గుణ♦వశుఁడ నగుచు

తే. నితనికిన్ దాసుఁడనయి నే♦నిచటికేగు
దెంచితిని; గానుయాపియా ♦ దితిజుఁ డొకఁడు

---

1 నద్వేష్టా విద్యతే తస్య సచ నద్వేష్టి కంచన-అనిమూలము. 2 వినవన్న-అనుచో 'అన్న' యనునది లక్ష్మణునకు హనుమయందుఁగల సౌభ్రాతృత్వమును దెలుపునని ప్రయోగింపఁబడినదని యెఱింగి క్షమింపఁదగు.

వనములకు మే మిరువురము ♦ చనిన యుష్పు
డితనిభార్యను దొంగిలె ♦ నెఱుఁగ మతని. ౧౩ 182

క. దనువంశోత్పన్నుఁడు శ్రీ, [1]యనువాని సుతుండు దితికి ♦ నాత్మజుకరణిం
దనరారువాఁడు శాపం,బున రాక్షసభావమూని ♦ పొలిచెన్ వనిలోన్. ౧౪

క. అతఁ డొగి సుగ్రీవుఁ గపి, ప్రతతికి నాథుఁడని శక్తి♦రాజితుఁ డనుచున్
హితముగఁ జెప్పెను; మఱియూ, దితిజాకృతి నున్నయతఁడు♦తివిరియిటులనెన్.

క. "సీపత్ని నపహరించిన, యాపాపమనీషునిన్ మ♦హావీర్యమునం
జేపట్టిన సుగ్రీవుం, జే పలుకంగలఁడు తెలిసి ♦ హితముగ మీకున్." ౧౫

చ. అని వచియించి యాదనుకు♦లాత్మజుఁడా సురవైరిరూప మొ
య్యన విడనాడి దివ్యసుగు♦ణంగముతోడ వెలుంగుచున్ సుఖం
బున సురపత్తనంబునకుఁ ♦ బోయెను; నన్మదునంతమున్ వినం
గను మదిఁగోరి నీవడుగఁ♦గా వినిపించితి సర్వవృత్తమున్. ౧౬ 186

క. నేనును శ్రీరాఘవుఁడును, వానరపతి శరణుఁబొంద ♦ వచ్చితి మిటకున్;
భూనాథుఁ డేమహాత్ముఁడు, తానొగి నర్థులకు వివిధ♦ధనము లొసఁగియున్.

క. అనుపమయశమును బొందియు, మును లోకాధిపతిగాఁగఁ ♦ బొలిచియు సుగ్రీ
వునిఁ దనకున్ నాథునిగాఁ, గను గోరుచునున్నవాఁడుఁ♦గా యియ్యెడనన్.

[2]తే. ఎవనిజనకుండు దశరథో♦ర్వీశుఁడు మును
దాశరణ్యుఁడు ధర్మవ♦త్సలుఁడు నగుచు
నుండెనో తత్సుతుఁడు శర♦ణ్యుండు రాఘ
వుఁడిట సుగ్రీవుశరణంబుఁ ♦ బొందినాఁడు. ౧౯ 189

ఆ. మున్ను సకలలోక♦మునకుఁ బ్రాపుఁడు రక్ష
కుఁడయి ధర్మమతిని ♦ గొమరు మీఱు
నట్టి రాఘవుఁడు మ♦దగ్రజుం డిప్డు సు
గ్రీవు శరణమొందె ♦ నీవిధమున. ౨౦ 190

సీ. ఎవఁడు ప్రసన్నాత్ముఁ♦డై యెవనిప్రజ లందఱు వరపురు♦షార్థములను
బొంది ప్రసన్నులై ♦ పొల్తురో యట్టిశ్రీరాముఁడు వానర♦రాజు సుప్ర
సాదముఁ గోరెడు; ♦ ధాత్రీతలమందున్న యెల్లపార్థివులను ♦ నెవఁడు సకల
విధముల నుపచార♦భేదములను గౌరవించుచుండెనో యట్టి♦విశ్వపతికి

ఆ. దశరథునకు జ్యేష్ఠ♦తనయుఁడై భువనత్ర,యమునఖ్యాతిఁ గాంచి♦యలరురాముఁ
[3]డిపుడు కపికులమున♦కేపతియైన సు,గ్రీవు శరణమొందె ♦ నీవిధమున. ౨౩

---

1 దనుర్నామదితేః పుత్రః-అనిమూలము. పుత్రః=పుత్రప్రాయః-అనివ్యాఖ్య. 2 తస్యపుత్ర శ్శరణ్యశ్చ సుగ్రీవం శరణంగతః-అనిమూలము. 3 సుగ్రీవం వానరేంద్రం తు రామ శ్శరణ మాగతః-అనిమూలము.

తే. శోకపరతంత్రుఁడై యిట్లు ♦ శోకపీడి
తుఁడయి శరణంబు సొచ్చిన ♦ పుడమివిభుని
యందు హరియూధపతియగు ♦ నర్కపుత్రుఁ
డాకృతిం జూపవలయు నీ♦యుదనునందు. ౨౪ 192

చ. అనియిటు సాశ్రునేత్రుఁడయి ♦ యన్నను గూరిచి జాలిపుట్టఁగా
ననుపమరీతిఁ బల్కునృపు ♦ నాత్మజు లక్ష్మణుఁగాంచి యిట్లనెన్
హనుమయు వాక్యపాండితియు ♦ నచ్చుపడన్; మతిమంతులై యమ
ర్షను విడనాడి చిత్తము వ♦శంబున నుండఁజెలంగు మిమ్ములన్. ౨౫ 193

[1]క. తానై వెదకుచు వచ్చియె, వానరపతి ప్రేమఁ జూడ♦వలయున్ మీరే
కానఁగ వచ్చితి రిదియే, వానరపతిపూర్వభాగ్య♦వైఖరి చుండీ!. ౨౬ 194

చ. అతఁడును భ్రాతయైన యమ♦రాధిపపుత్రునితో విరోధ ము
ద్ధతిఁ గొని వాలియున్ బలిమిఁ ♦ దారను గైకొని కానకేగ, ను
న్నతవిభవంబు పోవఁగ నొ♦నర్పఁగ వంచితుఁడై స్వరాజ్యవి
చ్యుతిఁ గనియున్నవాఁ డిచట ♦ నొక్కవిధంబునఁ గాలమేగఁగన్. ౨౭ 195

చ. వనజహితాత్మజుండు పరి♦వారజనంబుల మమ్ముఁగూడి సీ
తను వెదుకంగ సాయము ని♦తాంతము చేయఁగలండు మీకు నం
[2]చనియె; మనోజ్ఞవాక్యముల ♦ నాహనుమంతుఁడు పల్కి రామునిన్
గని మరలన్ వచించెఁ గపి♦కాంతునియొద్దకుఁ బోవ మొయ్యనన్. ౨౯ 196

సీ. అనుచుండునట్టి యా♦హనుమంతునిన్ ధర్మపరుఁడైన లక్ష్మణుఁ♦డురుముదమున
న్యాయరీతిని బూజ ♦ నలరించురామున కిట్లనియెను నార్య ♦ హృష్టుఁడగుచు
నీవా యుపుత్రకుఁ ♦ డిటు యథార్థంబుగఁ బల్కుచునున్నాఁడు ♦ వానరేంద్రుఁ
డును మనవలనను ♦ బనిగలవాఁడయి యే వేచియున్నవాఁ ♦ డిట్టులౌట

తే. నీవు కృతకృత్యుఁడవె యింక ♦ నేవిధమున
నైనఁ; బవమానపుత్రుఁ డ♦త్యంతవీరుఁ
డితఁడును [3]బ్రసన్నముఖకాంతి ♦ నెసఁగి హృష్టుఁ
డగుచు మాటాడుచున్నవాఁ ♦ డట్టులౌట. ౩౨ 197

క. అనృతము వచియింపఁడు సు,మ్మనియె; మహాప్రాజ్ఞుఁడైన ♦ యాహనుమంతుం
డును వీరుల రాఘవులను, గొని సుగ్రీవునిఁ గనంగ ♦ గొబ్బునఁ బోయెన్.

క. హనుమంతుఁ డంత మస్కరి, తనువును విడనాడి కీశ♦తనువొంది జవం
బున నావీరుల వీఁపున, నునుచుకొనుచుఁ బాఱె రాజు♦నొద్దకుఁ బ్రీతిన్. ౩౪

---

1 ద్రష్టవ్యా వానరేంద్రేణ దిష్ట్యా దర్శన మాగతౌ - అనిమూలము. 2 శ్లక్ష్ణం మధురయా గిరా-అనిమూలము. దీనికి మనోజ్ఞవాక్యముల అని తెనిఁగింపఁబడినది. 3 ప్రసన్నముఖవర్ణశ్చ వ్యక్తం హృష్టశ్చ భాషతే-అనిమూలము.

చ. నిరుపమదేవతానికర♦నిత్యవరప్రతిలబ్ధకీర్తియై
యురుతరవిక్రమంబు చెలు♦వొందఁగ వానరవీరవర్యుఁడై
పరఁగి శుభాత్మకుండగుచు ♦ భాసిలుహానుమంతుఁ డాత్మ, వా
నరపతికార్యముల్ వెలసె ♦ న్యాయముగా నని సంప్రహృష్టుఁడై
గిరిపతిపైకిఁ బోయె నుపు♦కీర్తులతోఁ దగువారితోఁ దమిన్. ౩౫ 200

నాల్గవ సర్గము సంపూర్ణము.

---

## ౫ - వ సర్గము.

రామసుగ్రీవసమాగమము.

ఆ. హనుమ ఋష్యమూక♦మునసుండి తత్ప్రదే, శాంతరస్థమైన ♦ యట్టి మలయ
గిరికిఁ బోయి కీశ♦వరునకు నావీర, వరులఁ జూపి యిట్లు ♦ వలికె నెలమి. ౧

క. అనితరసాధ్యపరాక్రమ, ఘనుఁడు మహాప్రాజ్ఞుఁడునయి ♦ గ్రాలెడు రాముం
డనుజుండగు లక్ష్మణుతోఁ, జనుదెంచెను నేను వేఁడ ♦ సంతసములరన్. ౧½ 202

ఆ. సత్యవిక్రముండు ♦ సహజదయాళువు
నైన రాముఁ డితఁడు ♦ మానవేంద్రుఁ
డైన దశరథునకు ♦ నాత్మజుఁ డిక్ష్వాకు
వంశభవుఁడు ధర్మ♦వశగతమతి. ౨½ 203

చ. జనకునియాజ్ఞఁ దీర్పఁ గల♦సద్వ్రతుఁ డిట్టిమహాత్ముఁడైన యా
యనఘుఁడు రామమూర్తి నియ♦మాన్వితుఁడై వనసీమనుండ నీ
తనిసతి రావణాసురుఁడు ♦ దౌష్ట్యము మీఱఁగ దొంగిలించెఁ గా
వున శరణంబు చొచ్చె నిను ♦ భూపతిసూనుఁ డితండు చయ్యనన్. ౪ 204

సీ. అంచితరాజసూ♦యాశ్వమేధాధ్వరముల నగ్నికిం దృప్తిఁ ♦ గలుగఁజేసి
లక్షసంఖ్యలగోవు♦లను దక్షిణలనిచ్చి తపమును సత్యంబు ♦ దప్పకుండ
ధరణిఁ బాలించిన ♦ దశరథునకు మహాత్మునకుఁ దనూజుఁడై ♦ యనఘుఁడైన
యితఁడు స్త్రీకారణకునై ♦యిప్పుడునిన్నును శరణుచొచ్చినవాఁడు;♦సరసమతులు

తే. వీరు శ్రీరామలక్ష్మణుల్ ♦ వీరవర్య
నీదుసఖ్యంబు గోరుచు ♦ నిన్నుఁ జూడ
వచ్చియున్నారు పూజ్యులై ♦ వఱలు వీరిఁ
[1]గైకొనుచుఁ బూజసేయుమా ♦ కరుణమెఱయ. ౭ 205

చ. అని హనుమంతుఁ డాడ విని ♦ యాత్మను సంతసమంది యెంతయున్
మనమున నేఁచుతాపమును ♦ మాని రఘూత్తమునుండి గల్గు న
ప్పెనుభయమున్ దగన్ విడిచె ♦ వేగమ యాప్లవగేశ్వరుండు తా

---

1 ప్రతిగృహ్యార్చయ స్వైతౌ పూజనీయతమౌ వుభౌ-అనిమూ.

[1]మనుజనిరూప ♦ మొంది హనుమంతునితోఁ దమిఁ బల్కె నివ్విధిన్. ౮ 206

క. వారలఁ దోడ్కొని రమ్మిఁక, భూరిమనస్తాపమెల్లఁ ♦ బోయెననిన నా
మారుతిఁ దోడ్తెచ్చెను రఘు, వీరుల నచ్చటికిఁ; గిశ ♦ వీరుం డంతన్. ౯ 207

చ. కనులకు విందుఁగూర్చుచును ♦ గన్పడురూపముతోడ రామునిం
గనుఁగొని యిట్లుపల్కె రఘు ♦ కాంత! సమస్తములైన ధర్మముల్
ఘనముగ నేర్చి శౌర్యమునఁ ♦ గ్రాలుచు భూతములందు నెంతయుం
గనికరముంచి యొప్పుతమ ♦ ఖ్యాతిని వింటిని వేడ్కమీఱఁగన్. ౯ 208

క. తమగుణములెల్ల నాకీ, సమీరనందనుఁడు చెప్పె ♦ క్ష్మాపాలక! చి
త్తము సమ్మోదరసాయ, త్తముగా భాసిల్లె; మిగుల ♦ ధన్యుఁడనైతిన్. ౧౦

సీ. వానరుఁడనగు నా ♦ తోనీవు చెలిమి చేయంగఁ గోరితి విది ♦ యరయ నాకె
సత్కారమును మనో ♦ జ్ఞమగులాభంబును నగుచున్న; దింక స ♦ ఖ్యంబు నీకు
నభిమతంబే నిదె ♦ హస్తముచాఁచితిఁ గరమున గ్రహియింపు ♦ కరుణమెఱయ
సఖ్యమియ్యది యెట్టి ♦ సరణిని మీఱరాకుండు నాపద్ధతి ♦ నూగి నూనప్పు;

తే. మనుచు సుగ్రీవుఁడెంతయు ♦ నాదరమునఁ
బలుక దానిని విన్నంతఁ ♦ బరమహర్ష
మంది యాతనికరమును ♦ నాత్మకరము
చేత గ్రహియించె [2]నీమైత్రి ♦ స్థిరమటంచు. ౧౩ 210

క. అమలమతి రాఘవుఁడు సఖ్యముఁ బూని కపీంద్రు నతని ♦ నతిదృఢముగ మో
దమునం గౌఁగిటఁజేర్చెను; సమిత్రసూనుఁడు శ్వసను ♦ నాత్మజుఁ డంతన్.

సీ. రామలక్ష్మణులను ♦ రయమునఁ దోడ్కొని యరిగినపిమ్మట ♦ యతితనువును
వదలి స్వీయాకృతి ♦ భాసిలి [3]యరణులౌ జమ్మికొమ్మలనుండి ♦ జ్వలను బుట్టు
నట్లుగఁ జేసి; దీ ♦ ప్తాగ్నిని దానినిఁ బూలచేఁ జక్కఁగఁ ♦ బూజచేసి
సమ్మోదరసభర ♦ స్వాంతుఁడై యమ్మగ్ని వారలనడుమను ♦ వసుధ నునిచె;

తే. నంత రాముఁడు సుగ్రీవుఁ ♦ డాదరములఁ
జేతులం బట్టుకొని జ్వల ♦ ద్భిక్షికిఁ దమిఁ బ్ర
దక్షిణముచేసి యాయగ్ని ♦ సాక్షిగాఁగ
స్నేహమొనరించి రాత్మలు ♦ చెలఁగుచుండ. ౧౬ 212

---

1 హనుమద్వచనశ్రవణానంతరమేవ సుగ్రీవస్య మానుషరూపపరిగ్రహాభిధానాత్ హనుమాన్ రామలక్ష్మణౌ స్థలాంతరే నివేశ్య తయో రాగమనం సుగ్రీవాయనివేదితవాన్ ఇత్యవగమ్యతే- అని మహేశ్వరతీర్థులు. సుగ్రీవుఁడు హనుమంతునిపల్కు విన్నతోడనే మనుష్యరూపమును గ్రహించెనని యిట చెప్పఁబడినది. అనుటచే హనుమ రామలక్ష్మణులను వేఱొకచోటనుంచి వారిరాకను సుగ్రీవునకుం జెప్పెనని దీనిచే దెలియవచ్చుచున్నదని తెలియవలయును 2 స్థిరమటంచు=అనునది ప్రకృతార్థదార్ఢ్యార్థము ప్రయోగింపఁబడినదని మన్నింపవలయు. 3 కాష్ఠయో స్స్వేనరూపేణ- అనిమూ. కాష్ఠయోః అరణిభూతశమీకాష్ఠయోః-అనివ్యాఖ్య.

క. రాముఁడు సుగ్రీవుం డను, ప్రేమ వలికెంగ నంత ♦ వినువు గడనియు
ద్దామములగు దృష్టులతో, నేమియుఁ జూచినను [1]తృప్తి ♦ నే గన రంతన్. ౧౭

క. వానరపతి రామునితో, భూనాయక ప్రియసఖత్వ♦మును బూనితివే
కానన్ నీసుఖదుఃఖములే నావియు ననుచుఁ బలికె ♦ యుఁ గనుతుఁ డడలన్.

ఆ. పర్ణబహుళమగుచు ♦ భవ్యపుష్పాన్విత
మగుచు వలరుచున్న♦యట్టి మద్ది
కొమ్మ విఱిచి పఱచు♦కొని రాముఁ డును దాను
నందుఁ గూరుచుండి ♦ రంత హనుమ. ౧౯ 215

క. పరమముదంబునఁ బుష్పో,త్కరమునఁ దగు చందనాఖ్య♦తరుశాఖను దె
చ్చి రయమున లక్ష్మణున కిడెఁ, దరుచరవిభుఁ డంత సమ్మ♦దం బలరారన్. ౨౦

క. కనుయుగ్మము బాష్పోదక,మున మున్గఁగ మృదువు మధుర♦ముగు నగువాక్యం
బున నిట్లనియెను రాముం, గని రామ! మదగ్రజుండు ♦ కఠినాత్ముండై. ౨౧

క. నను మోసపుచ్చి నాభా,ర్యను బలిమిం గొనియె నేను ♦ నతనిభయమునన్
మనము గలంగఁగ దుర్గమ, వనమున నిందున్నవాఁడఁ ♦ [2]పౌరుషమూఱన్.

చ వినుమిటు లన్న నన్నుఁ గడు♦భీతునిగా నొనరించి వంచనం
గొని వగఁబూని భార్యఁ గయి♦కొంటను నే భయమంది నామనం
బును స్థిరతం దగన్ విడువ ♦ భూరివనంబున నిందునున్నవాఁ
డను మహనీయవిక్రమ! క♦డంక ననున్ దయఁ గావఁగాఁ దగున్. ౨౩ 219

తే. అన్నభయమునఁ గుందెడు♦నట్టి నాకు
నభయ మొసఁగుము, కాకుత్స్థ! ♦ యమలకరుణ!
భీతి లేకుండునట్లు గా♦వింపవలయు
ననిన సుగ్రీవుమాటల ♦ నాలకించి. ౨౪ 220

క. నిరుపమతేజము ధర్మము, వరభూషలుగఁ దగ ధర్మ♦వత్సలుఁ డగుచున్
బరఁగు రఘురాముఁ [3]డిప్పని, భరమే యనునట్లు నవ్వి ♦ పలికె నతనితోన్.

క. విను మైత్రికిఁ బ్రత్యుపకృతి, యొనరించుట ఫలమటంచు ♦ నో కపివర! నా
కును దెలిసియె యున్నది కా,వున నీభార్యాపహర్తఁ ♦ బొలియింతు నికన్.

చ. ఘనతరమామకప్రదర♦కాండము మోఘము సూర్యసన్నిభం
బును మఱి కంకపత్రయుత♦మున్ నిశితాశనితుల్యమున్ శితా
గ్రనికరమున్ సుపర్వము స♦ఖండము నౌచు సరోషసర్పసం
క్తిని సరిపోలి వేగమున ♦ వృప్తుఁ గువృత్తుని వాలి నేఁచెడున్. ౨౭ 223

---

1 న తృప్తి ముపజగ్మతుః-అనిమూలము. 2 పౌరుషమూఱన్=అనునది యర్థపుష్టిని సమయానుగుణ్యముగ నిటు నిచ్చునుగాన నధికముగఁ జేర్పఁబడినదని యెఱుంగఁదగు. 3 ప్రహసన్నివ-అని మూలము. కియన్మాత్ర మేతదితి హసిత్వా-అని వ్యాఖ్య.

క. అలయక వాలిపయిం బఱఁగఁ, విడ్వఁడె వాలి క్రూర♦కాలాహినిభం
బులయిన మచ్ఛరములచే, నిలఁ బర్వతమట్లు ద్రెళ్లు ♦ నింకం గనుమా!. ౨౯

చ. అని రఘువీరుఁ డెంతయును ♦ నాత్మహితంబుగఁ జెప్పినట్టివా
క్యనిచయ మాలకించి కపి♦కాంతుఁడు చాలముదంబు నొంది యి
ట్లనియెను; గొప్పగా రఘువ♦రాన్వయవార్ధిశశాంక! రామ! నీ
యనుపమసత్కటాక్షమున ♦ నందెఁ బ్రేయసి రాజ్యముఁ దగన్. ౩౦ 225

ఆ. కాన నీవు నన్నుఁ ♦ గారణంబె లేక
వైరమూని చంపు♦వాంఛఁ బూని
యున్న వాలిఁ జంపు ♦ నుద్యమ మొనరింప
వయ్య మనుజసింహ! ♦ యాశుగతిని. ౩౧ 226

తే. అనియె నంతట వారు స♦ఖ్యంబుచేయు
సమయమునఁ బంకజస్వర్ణ♦జాతదేవ
నులను బోలిన [1]సీతేంద్ర♦సూను రావ
ణాసురుల వామనయనంబు ♦ లదరె నొకట. ౩౨ 227

ఐదవ సర్గము సంపూర్ణము.

---

౬ - వ సర్గము.

రాముని కార్యము నెఱవేర్చెదనని సుగ్రీవుఁడు ప్రతిజ్ఞచేయుట.

క. మరలన్ సుగ్రీవుఁడు రఘు, వరునిం గని ప్రీతుఁడగుచుఁ ♦ బలికెన్ భూమీ
శ్వర నామంత్రియు మంత్రీ, శ్వరుఁడును నగు నీహనుమయ ♦ బరవస మలరన్. ౧

క. జనరహితమైన యీవనమునకున్ నీవేల వాస♦మును జేయంగాఁ
జను దెంచితివో తెల్పెను;, జననుత! నీ వనుజఁగూడి ♦ జనకాజ్ఞఁ దగన్. ౨

క. వనమున వసియించినతఱి, దనుజుం డారావణుండు ♦ తఱివేచి గృహం
బున నీవు మతివిభూతిం, గను లక్ష్మణుఁడుండ నట్టి♦కాలమునందున్. ౩ 230

తే. పద్మముచున్నట్టి నీసతి ♦ నృపతివర్యుఁ
డైన జనకుని సత్పుత్రి ♦ నపహరించి
యడ్డపడిన జటాయువు ♦ నని వధించి
సీతఁ గొనిపోయి తనపురిఁ ♦ జేరె రామ!. ౪ 231

క. తరుణీవియోగదుఃఖము, త్వరగా నిను వదలిపోవు; ♦ దనుజులు వేదో
త్కరమును హరింపఁ బూనిక, హరి మత్స్యాకృతిని దెచ్చి♦నట్లుగ నేనున్. ౫

చ. జనకజఁ దెచ్చియిచ్చెదను; ♦ సాధ్వి యధోభువనంబునన్ నభం
బున మఱియెందునుండినను ♦ బూనిక నేఁగొనివచ్చి యిచ్చెదన్

---

1 సీతాకపీంద్రక్షణదాచరాణామ్-అనిమూలము.

విను మఱిభీమ! తప్పదిది ♦ వేయివిధంబుల నాదువాక్యమం
చని తలపోయవయ్య; గర♦ళాన్వితభక్ష్యము దిన్నయట్లుగన్. ౬ 233

[1]క. నీరమణి నపహరించి సు,రారులు దేవతలు శతమ♦ఖాదులు నైనన్
భూరిబలంబున జీర్ణము, గా రమణిని జేసికొనఁగఁ ♦ గల రే! [2]సుభుజా!. ౭ 234

[3]సీ. గురుభుజా! వెతలను ♦ గుందకు మవ్వాని వదలుమా తెచ్చియి♦చ్చెదను సీతఁ
గ్రూరకర్ముండును ♦ గుమతియునౌ రావణాసురుం డామెను ♦ నార్తఁ బట్టి
కొనిపోవుచుండఁగా ♦ వనటచే రామ రామా! యని యోలక్ష్మ♦ణా! యటంచు
వికృతస్వరంబున ♦ వింతగ నఱచుచు నేడ్చుచు నాభుజ♦గేంద్రకన్య
తే. వలెనె దనుజుని తొడపైన ♦ నలజడిఁ గను
చున్నసాధ్విని గంటి నా♦యువిదయె జన
కాత్మజ యనుచు నూహచే ♦ నరయుచున్న
వాఁడ; సంశయమేల? యా♦పడఁతి సీత. ౮ 235

సుగ్రీవుఁడు సీతయాభరణములఁ జూపుట.

చ. నలుగురు వానరోత్తములు ♦ నన్గొలువన్ మహీభృత్తటంబునం
దనరుచునున్న నన్నుఁ గని ♦ యాబిడయుం దనయుత్తరీయ మి
మ్ముల విడఁదీసి యాభరణ♦ముల్ దగ సందున గట్టి వైచెని
య్యిలఁ బడ వానిఁ దీసికొని ♦ యే మిటఁ జక్కఁగ నుంచినాము సూ!. ౯

క. వానిం దెచ్చెద రామా!, నేనే యవ్వానిఁ జూచి ♦ నీవ వెవరివో
జానుగ గుఱుతింపుమనం, గా నాతని సువిహితోక్తి♦కాండము వినుచున్.

క. అతనిం గని పల్కెను రఘు,పతి యోసుగ్రీవ! మిత్ర! ♦ పరమాభరణ
ప్రతతిని వే తెప్పింపుము!, హితముగ నేఁ గనెద జాగిఁ♦కేల యటన్నన్.

క. విని సుగ్రీవుం డాతని, కిని బ్రియమును జేయఁగోరి ♦ కృతవేగుండై
చని కొండ[4]గహనగుహఁజొ,చ్చెను నంతట వెదకి వాని ♦ శీఘ్రమ తెచ్చెన్.

తే. ఉత్తరీయంబు శుభములై ♦ యొప్పు గుల్కు
నాభరణములఁ గొనివచ్చి ♦ యంత నివిగొ
కనుఁగొనుమ యని చూపె రా♦మునకు వాని;
నంత నవ్వానిఁ గైకొని ♦ యార్తినొంది. ౧౩ 240

క. హిమరుద్ధచంద్రువలె బా,ష్పములన్ మోమెల్లఁ గప్పఁ♦బడఁగాఁ బొగిలెన్;
గ్రమముగ సతిపైఁ గలస్నే,హమునం బొంగెడు మహత్త♦రాశ్రుజలములన్.

క. మనసెల్లఁ గలఁగుచుండం, [5]గనో ప్రియా! యంచు నేడ్చి♦క్రమముగ ధైర్యం

---

1 నేంద్రైః స్సురాసురైః-అనిమూలము. 2 తవభార్యా మహాబాహో-అనిమూలము. 3 త్యజ శోకం మహాబాహో-అనిమూలము. 4 గహనాం గుహాం-అనిమూలము. 5 హా ప్రియేతిరుదన్-అని మూలము.

బును వీడి నేలపైఁ బడి,యెను; నిస్తులములగువాని♦నెల్లం గనుచున్. ౧౭ 212

క. వనటం గుందుచు వానిన్, దనచెమ్మున నిడికొనుచు ని♦తాంతము బలిమిన్
దను నావంగా రోషం,బున బుసకొట్టెడు బిలస్థ♦భుజగముభంగిన్. ౧౭౫ 243

తే. మిగుల నిట్టూర్పులం బుచ్చి ♦ మించువగల
బాష్పధార లవిచ్ఛిన్న♦భంగి దొరఁగఁ
[1] పార్శ్వమున నున్నలక్ష్మణుఁ ♦ బాఱఁజూచి
దీనముగ నేడ్వసాగె న♦తం దలంచి. ౧౫౪ 244

చ. దనుజుఁడు సీతఁ బట్టుకొని ♦ తాఁ బురికేఁగఁగ నుత్తరీయమున్
గనదురురత్నభూషణని♦కాయము దేహమునుండి దీసి యా
జనకజ భూమివైచె సహ♦జన్మ! కనుంగొనుమా! దశాస్యుఁ డా
య్యనఁ దనుఁగొంచుఁ బోవునపు ♦ డాభరణంబుల శాద్వలస్థలిన్. ౨౦ 245

తే. పాఱవైచియెయుండు ధ్రు♦వంబు కాన
నెంతమాత్రము నలఁగక♦యే మునుపటి
వలెనె యున్నవటన్న న♦ప్పలుకుల విని
యతనితో లక్ష్మణుం డిట్టు♦లనియె నార్తి. ౨౧ 246

[2]క. కానం గేయూరంబులఁ, గానను కుండలయుగంబుఁ ♦ గాంతామణియా
జానకినూపురములనే, నేనెఱుఁగుదు మ్రొక్కుచుంట ♦ నిత్యము రామా!.

క. అనవిని సుగ్రీవున కి, ట్లనియెన్ రాముండు దీనుఁ♦డై రౌద్రుండై
దనుజుఁడు మత్ప్రాణప్రియ, వనితామణి జనకపుత్రి ♦ బలిమిం గొనుచున్.

ఆ. ఎచటి కేగుచుండె ♦ నిటనున్న నీవును
గాంచినావొ చెప్పుమ ♦ కపివరేణ్య!
ఘనతమవ్యసనముఁ ♦ గలిగించినట్టి యా
దనుజుఁ డెందునుండు ♦ దానిఁ జెప్పుమ!. ౨౪ 249

క. వానినిమిత్తమునన్ నే, దానవులను నెల్లఁ జంపఁ♦దలఁచితి నింకన్
జానకి హరించి యాతఁడు, మానని కోపంబు నాదు♦మదిఁ గల్గించెన్. ౨౫

క. కనుకం దన ప్రాణాంతం,బునకై యమునింటిద్వార♦మును బూనికతో
డను దానె తెఱచుకొనియెన్;, వనాంతరమునుండి ప్రాణ♦వల్లభ సీతన్. ౨౬

ఆ. బలిమిమెఱయఁ గొనుచుఁ ♦ బాఱినవైరి
యాసురారి యెందు ♦ నధివసించు

---

1 సౌమిత్రిం వీక్ష్య పార్శ్వతః, పరిదేవయితుం దీనం రామ స్సముపచక్రమే-అనిమూలము.
2 నాహం జానామి కేయూరే నాహం జానామి కుండలే, నూపురే త్వభిజానామి నిత్యం పాదాభివందనాత్-అనిమూలము.

నింకఁ జెపుము! వాని ♦ నిప్పుడె యమపుర
మునకుఁ బంపువాఁడ ♦ ననియె నంత. ౫౨ 252

ఆఱవ సర్గము సంపూర్ణము.

---

## ౭ - వ సర్గము.

రాముఁడు వాలిని జంపెదనని సుగ్రీవునితోఁ బల్కుట.

క. ఈరీతిగ నార్తుండై, శ్రీరాముఁడు పలుకఁ గపివ♦రేణ్యుఁడు వగచే
ధారగ బాష్పము లురలం,గా రయమున మాటరామిఁ ♦ గడుదీనుండై. ౧

చ. కరములు మోడ్చి బాష్పములు ♦ కాఱఁగనున్న మహీశుఁ గాంచి యో
[1]తరణికులాబ్ధిశీతకర! ♦ ధన్యమతీ వినవయ్య నీవమై
పరఁగుకులంబునం గలిసి ♦ భామను బల్మిహరించినట్టి యా
పరమకుబుద్ధిరాక్షసుఁడు ♦ పాపుఁడు వాసము చేయు దేశముల్. ౨ 254

[2]తే. అతని సామర్థ్యశౌర్యవం♦శాదు లెవ్వి
యును నెఱుంగఁగ నోప నే♦నోగి నరేంద్ర
వా! నితాంతము శోకంబు ♦ మానవయ్య!
సత్యముగఁ జేయువాఁడ నే ♦ శపథ మిపుడు. ౩ 255

[3]చ. జనకజ నీవు పొందుటకుఁ ♦ జాలినయంత ప్రయత్నమేను నిం
కను నొనరింతుఁ బౌరుషము ♦ గ్రాలఁగ బంధుయుతంబుగాఁగ న
ద్దనుజుని రావణాసురుని ♦ దప్పక చంపి ముదంబునొంది నీ
వును దనరార యత్నమును ♦ బూనెదఁ జేయఁగ సత్వరంబుగాన్. ౪ 256

క. దీనత్వ మీవిధంబునఁ, బూనిన దే చాలు: సహజ♦ముగ నీకాత్మన్
గానంబడు ధైర్యంబును, మానక స్మరియింపు మింక ♦ మహితవిచారా!. ౫

క. నినుబోఁటికి లాఘవమిది, కొనుటయె సరికాదు నాకుఁ♦గూడ నితరుఁ డం
గనఁ గైకొనుటను గలిగిన, ఘనమా వ్యసనంబు మిగులఁ ♦ గలిగెం గాదే.

---

1 పౌష్కృతేయస్య వా కులమ్-అని మూలము. 2 సుగ్రీవుఁడు రావణాసురుని గుఱించి తనకే దియుఁ దెలియదనుట స్వకార్యము తొలుదొలుత నిర్వర్తించుకొనుట కని వ్యాఖ్యాతల ముఖ్యాశయము. అదియే సమంజసము. అనృతదోషము లేదు. లంకాదులు చెప్పినచో నిప్పుడే పయనమై పోవుదమని రాముఁ డనుననియు, నప్పుడు తా నంగీకరింపక తప్పదనియు, దానిచేఁ దనసహాయము రామమూర్తికిఁ జక్కఁగాఁ జేయునవకాశము రాజ్యము తనకు లేనందున లేకుండుననియు సుగ్రీవుని తాత్పర్యము. తొలుతఁ దనకార్యసిద్ధియైనచోఁ నప్పుడు నందఱిని బిలుచుకొని తానై యీగొప్పకార్యమును సాధించెనన్న ఖ్యాతిని బొందుకోర్కి సుగ్రీవునకుఁ గలదనుటయు సమంజసమని యెఱుంగందగు. 3 ఇందుఁ బ్రయత్నమేను జేయుదునని రెండుపర్యాయములు చెప్పుట మూలానుసారమే యని యెఱుంగందగు.

క. ఐనను నీవలె దుఃఖముఁ, బూనంగా లేదు ధైర్య♦మును నేవిడువం
గానెంచ లేదు; ప్రాకృత, వానరుఁడను నైననేను ♦ భార్యకొఱకుఁగాన్. ౬౪

ఆ. ఆర్తినొంద కిట్టు ♦ లద్రినున్నాఁడనే
యిఁక మహాత్ముఁడవగు ♦ నీవు గురువు
లను దగంగఁ గొలిచి ♦ ఘనశిక్షలం దేఱి
యున్నధీరుఁడవు స♦మున్నతుఁడవు. ౭ 260

క. వగవఁగరాదని నేఁజెప్పఁగవలెనే; యశ్రువులను ♦ బరమధృతిని ని
ల్పఁగఁదగు సత్త్వయుతులకును, దగుధైర్యము దానివిడువఁ ♦ దగునే నీకున్.

సీ. ధృతిమంతుఁడైనవాఁ ♦ డెంతదుఃఖముగాని ధననాశనముగాని ♦ తనయసువుల
కంతముచేయు భ♦యంబునుగాని కల్గినను స్వబుద్ధిచే♦తనె తగంగఁ
గృత్యమా! యిద్ది య♦కృత్యమా?యనియెంచిపరితాపమొందఁడె♦వ్వండుబాలి
శుఁడయి దీనత్వ మె♦ప్పుడు పొందుచుండునో యాతఁడు బరువెక్కి♦నట్టియోడ

తే. జలముల మునుంగునట్లుగఁ ♦ గలవిలపడి
శోకమున మున్గు; నిదిగో నే♦నీకుఁ గరయు
గంబు మోడ్చితిఁ బ్రేమచేఁ ♦ గడఁగి నిన్నుఁ
గలఁతనుండి మరల్చెదఁ ♦ గా దితరము. ౧౦౪ 262

క. పౌరుషము నాశ్రయింపుము, శ్రీరామా! శోకమునకుఁ ♦ జిత్తంబున నీ
వారయక యంతరంబిడఁ, గారా; దెవరైనను♦ వ♦గం బూనుదురో. ౧౧ 263

క. వారికి సుఖమబ్బదు సూ!, వారల తేజము క్షయించు ♦ భవ్యమతీ! యో
శ్రీరఘువర! శోకంబును, నీరమ్యమనంబునందు ♦ నెఱి విడువఁ దగున్. ౧౨

సీ. రాజేంద్ర! శోకభ♦రంబును గనువాని కనుసంశయముగూడ ♦ నమరుఁజుమ్ము
కావున నీవు శో♦కంబునువదలుమాదృఢధైర్యమునెయాశ్ర♦యింపుమ! యిఁక
మిత్రుఁడనై నేను ♦ మేలు నీకుం జెప్పుచున్నాఁడఁగాని యిం♦కొక్కరీతి
దేశికువలె నుప♦దేశము చేయలే దిట్టి నాదగుమైత్రి♦నేని గార

ఆ. వించియైన నీవు ♦ విడువుము శోకంబు
ననుచు మధురవాక్కు♦లను గపీంద్రుఁ
డూఱడింప రాముఁ ♦ డొయ్యన వస్త్రాంత
మునను బాష్పపూర్ణ♦ముఖముఁ బూన్కి. ౧౫ 265

ఆ. తుడుచుకొనియె రాఘ♦వుఁడు; నంత సుగ్రీవు
పలుకుగముల ధైర్య ♦ ములవడుటను
గూర్మిఁ గౌఁగిలించు♦కొని కపీశ్వరునితోఁ
బలికె నిట్లు మధుర♦భంగి మీఱ. ౧౬ 266

[1]క. అనుపమమిత్రము క్షేమం, బును గోరెడునట్టివాఁడు ♦ పూని యదేమే

1 కర్తవ్యం యద్వయస్యేన స్నిగ్ధేన చ హితేన చ-అనిమూలము.

మొనరింపవలయునో య, ట్లనుకూలము యుక్తమునగు ♦ సత్కార్యంబుల్.
క. సరిగ నొనరించితివి; వా, నరపాలక! మిత్రవర్య ♦ నను జక్కఁగ నీ
వరసి యిటు తేర్చ సహజ, స్థిరధైర్యము నొందినాఁడ ♦ శ్రీ తిరమై నెచటన్. ౧౭౪
ఆ. నిన్నుఁబోలు బంధు ♦ వెన్న విశేషించి, యాప్తవత్సలుఁడు ♦ నిటు లభింప
టనఁగ దుర్లభంబె ♦ యగుఁజుమీ; యిఁకనేమి, యన్న సీతవెంట ♦ యున్న దనుచు.
క. దనుజుఁడు దురాత్ముఁ డతిభీ,తిని గల్గం జేయునట్టి ♦ శత్రుఁడు వాఁడెం
దును నివసించునో యది యెఱుం, గనుఁగొ నెడుప్రయత్నమింకఁ ♦ గావింపఁదగున్.
క. నే నే మొనరుపఁదగునో, దానిన్ విశ్వాసముంచి ♦ త్వరగాఁ జెపుమా
వానరనాథా! వినుమా, మానితమా క్షేత్రమందు ♦ మహి వృష్టిపడిన్.
తే. సర్వము ఫలించునట్లుగ ♦ సకలకార్య
ములును నీకోర్కి కనురూప♦ములుగ మిగుల
సిద్ధినొందును నాయందుఁ; ♦ జెప్పవయ్య
యిప్పుడభిమానమున నేనె ♦ యిట్లునీకు. ౨౦౪ 272
క. [1]పలికితిఁగద యో వానర, తిలకా! యిప్పల్కు నీమ♦దిది సత్యముగాఁ
దలఁపుము; నే నిదివఱకుం, బలికినదే లే దసత్య♦వాక్కుల నెపుడున్. ౨౨ 273
ఆ. ఇంకముందుఁ జెప్ప♦నెంచను; నే వాలిఁ
జంపువాఁడ ననుచు ♦ సత్యశపథ
మును నొనర్చువాఁడ ♦ ననియె; నంతటఁ గపి
వరుఁడు వానిమంత్రి♦వరులు గపులు. ౨౨౪ 274
[2]చ. అనుపమరామవాక్యమును ♦ నందును దచ్ఛపథంబుఁ జక్కఁగా
విని ముదమొంది రిట్లు వృద్ధి♦వీపతి వానరనాథు లొంటి నె
మ్మనములు ప్రీతినొందఁ దగు♦మైత్రినిఁ గూడి పరస్పరంబు నొ
య్యన సుఖదుఃఖముల్ వగపు♦లాడుఁగఁ బల్కుకొనంగ నంతటన్. ౨౮ 275
తే. ఎఱుకగల్గిన సుగ్రీవుఁ ♦ డిటు మహాను
భావుఁడై పూరుషేజ్యుఁడై ♦ పరఁగురాముఁ
డిట్లు పల్కఁగ విని తన♦హృదయమందుఁ
గార్య మొనఁగూడినట్లు త♦గం దలంచె. ౨౯ 276

ఏడవ సర్గము సంపూర్ణము.

---

## ౮ - వ సర్గము.

సుగ్రీవుఁడు రామునితోఁ దనవృత్తాంతమును జెప్పుట.

చ. తననుది నిట్టులెంచుచు ము♦దంబున లక్ష్మణుముందటన్ మహా

---

1 అనృతం నోక్తపూర్వం మే నచ వక్ష్యే కదాచన.-అనిమా. 2 రాఘవస్య వచ శ్రుత్వా ప్రతిజ్ఞాతం విశేషతః-అనిమా.

త్ముని రఘురాముఁ గాంచి మదిఁ ♦ దోరప్రభ క్తి చెలంగ నిట్లుగా
ననియెఁ; నృపార్హ శౌర్యముఖ♦హారిగుణోన్నతిఁ గాంచినట్టినీ
వును జెలికాఁడవైతి విఁకఁ ♦ బోలఁ గృతార్థుఁడనైతి నో ప్రభూ!. ౧½ 277

క. సకలవిధంబుల సురకరు,ణకుఁ బాత్రుఁడనైతి నిజము ♦ నాఁబోటికి నో
యకలంకమతీ! విను తా,వకమగు సాయమున దేవ♦వరరాజ్యంబుల్. ౨½

క. పొందంగ నలవియొకదా, సందియమా! యింకనాకు ♦ స్వప్రభుతలభిం
పంపగ; రఘువంశజనిం, బొందిన యొకశూరనికర♦ముఖ్యుం డిచటన్. ౩½

ఆ. అగ్నిసాక్షికముగ ♦ ననుఁగుసఖుండయి, మించెఁ గాన నేను ♦ మిత్రబంధు
తతికిఁ బూజ్యుఁడనయి ♦ తనరితి నే నీకుఁ, దగినసఖుఁడ ననుచుఁ♦దవ్వన్మనమున.

క. మెలమెల్లనఁ డెలిసికొనం, గలవీవే నాదనుగుణ♦కాండము నేనే
పలుకసమర్థుఁడగా నో, యిలాధిపా! తెలియనా న♦దే నీమదిలోన్. ౭ 281

సీ. చెప్పినమాటను ♦ జెల్లించుకొను మహాత్ములగు నీయట్టివా♦రలకుఁ గల్గు
ప్రీతి యాత్మజ్ఞాన♦వేత్తలకుం గల్గునట్టి ధైర్యమువలె ♦ నతిశయముగ
నిశ్చలాకృతిఁ బూని ♦ నిల్చుచు సాధువు లగువారు రజతంబు ♦ హాటకంబు
వస్త్రాభరణములు ♦ వరుస నొండొకలవి యవిభక్తము లనియె♦యాత్మలందుఁ

తే. దలఁతురేగాని యొండుగాఁ ♦ దలఁపరు సుము;
ధని దరిద్రుఁడు దుఃఖి య♦త్యంతము సుఖి
దోషి నిర్దోషి యిందు మి♦త్రుం డదెట్టి
వాఁడె యైనను వాఁడెయాఁ ♦ బరమగతియు. ౮ 282

చ. తనకు సమానుఁడౌసఖునిఁ ♦ దారు గనుంగొని రేని సజ్జనుల్
ధనము సుఖంబునుం దనువుఁ ♦ దప్పక వానికినై త్యజింతు రం
చనియెను; బుద్ధిమంతుఁడయి ♦ యచ్ఛవుఁగాంతిని నింద్రతుల్యుఁడై
తనరు సుమిత్రపట్టి వినఁ ♦ దా రఘురాముఁడు వానరేశ్వరున్. ౯½ 283

ఆ ప్రియము పలుకు నక్క♦పిం గని నీవన్న, పలుకు సత్యమనియె ♦ నెలమి నంతఁ
గపివరుండు జనక♦కన్యభూషణములఁ, గనినయంతనుండి ♦ యినకులుండు. ౧౦

క. బలమునఁ దగు లక్ష్మణుఁడును, నిలువంబడియుంటఁ గాంచి ♦ నిర్మలతరుశా
ఖలకై నాలుగుప్రక్కల, వెలయించెన్ స్వీయదృష్టి ♦ వింతగ నంతన్. ౧౧

[1] చ. హరిపతి చెంత సాధుకుసు♦మాఢ్యము పల్లవసాంద్రముల్ మనో
హరదళసంచయాల్పమును ♦ నై భ్రమరావళిశోభితంబునై
పరఁగు మహీజముం గనియె ♦ భవ్యముగాఁ దగు దానియందు సుం
దరకుసుమాఢ్యశాఖ నొక♦దానిని వే గ్రహియించి దానిపై. ౧౨½ 286

---

1 ఆస్తీర్యేతి పునరాసనప్రదానకథనేన అచంపరేమ్య ర్వృత్తాంత ఇత్యవగమ్యతే-అని వ్యాఖ్య.

తే. తాను రాముఁడుఁ గూర్చుండెఁ ♦ దగినయట్లు
వారు కూర్చుండుటం గని ♦ వాయుసుతుఁడు
వినయమున లక్ష్మణుం డందు♦నను వసింప
మని మహోత్కృష్టమహీజశా♦ఖను గ్రహించి. ౨౮ 287

క. ఘనమతిఁ గూర్చుండం జేసెను గుసుమఫలాన్వితాగ్ర♦శిఖరమ్మున నం
దును సుఖముగఁ గూర్చుండిన, వననిధిగంభీరు రాము♦భద్రుఁ బ్రసన్నున్. ౧౨

క. కని సుగ్రీవుఁడు మధురం,బును మృదువును నైన వాక్య♦మున సంతోషం
బునఁ బల్కులు తొట్రిల నిట్లనియెన్ వంచించి నన్ను ♦ నన్నయు బలిమిన్.

ఆ. దార నపహరింప ♦ భూరిదుఃఖంబును, గనుచు భయము చేత ♦ మనను గలఁగఁ
బర్వతమున నిందుఁ ♦ బడి చరియించుచు, నున్నవాఁడ రామ! ♦ యొక్కఁ డిప్పి.

క. నను మోసపుచ్చి వైరం,బును నాతోఁ గొనుచు వాలి♦పొలుచుట భీతిం
గొని యుద్భ్రాంతంబగు నా,మనమున దోఁచక యెయిట్లు♦మ్రాన్పడియుండన్.

క. లోకంబుల కభయంబును, నో కాకుత్స్థా! యొసంగు♦చున్నాఁడవు నీ
వీకరణి వాలిభయమున, నీకూటమునందు నున్న ♦ యీదీను నరున్. ౧౯

క. కరుణించి యనాథునిఁ ద,త్పరతం గాపాడవలయు ♦ ధర్మ విది సఖుం
బరికించి కాచు టన నిర్భరతేజము గల్గి ధర్మ♦పక్షుండఁ డగుచున్. ౧౯ 293

ఆ. ధర్మవేత్త యగుచుఁ ♦ దగు రాముఁ డమ్మాట, లాలకించి మరల ♦ నడుగ నేల
యప్పుడాడినట్టి ♦ యప్పల్కు చాలదే!, యనుచు సుస్మితమున ♦ ననియె నిట్లు.

క. వినుమా! యుపకారంబును, నొనరుచుటయె ఫలము మైత్రి♦కొగి నపకారం
బును జేయుట యరిలక్షణ, మనఘా! యటుకాన నిన్ను ♦ ననుజుని నుగుణున్.

సీ. బాధించి నీభార్యఁ ♦ బలిమి మీఱ హరించినట్టి వాలిని నిప్పు ♦ డని వధింతు;
భయద తేజంబున ♦ బహుజవంబునఁ గూడి *శరవణంబునఁ బుట్టి ♦ స్వర్ణభూషి
తములయి కంకప♦త్ర ప్రతిచ్ఛన్నంబు లయి యింద్రవజ్రంబు ♦ ననుకరించు
నవియయి పర్వమ్ము ♦ లందమ్ముగాఁ దగఁ గఠినతరంబులై ♦ క్రాలి రోష

ఆ. యుక్తసర్పములన ♦ నొప్పారుచున్న నా
సాయకంబు లివిగో; ♦ న్యాయమెడలి
యన్నపేరనున్న ♦ యదిఁ గృతకిల్బిషు
వాలి నింక జంపు♦వాఁడఁ జుమ్ము. ౨౩ 296

చ. వినుమిఁక వాలి నావిశిఖ♦బృందహతుండయి భిన్నపర్వతం
బన ధరఁగూలఁగాఁ గలఁడు ♦ హర్షము మీఱఁగఁ జూతుగాక; నా
విని కపినాయకుండు రఘు♦వీరుని హర్షమునొంది మేలు మే
లని కొనియాడి రామ యిటు♦లార్తిని బొందితి శోకబాధచేన్. ౨౪ 297

* కార్తికేయవనోద్భూతా శ్శరా హేమవిభూషితాః-అనిమూలము.

క. అరయఁగ శోకార్తులకుం, బరగతివన నీవెకావె ♦ పరమాప్తుఁడనై
పరఁగుట నే నివ్విధి నీ, పరిసరమున మొఱ్ఱవెట్టు♦వాఁడం జుమ్మీ!. ౨౬ 298

క. కరమునఁ గరమిడి వైశ్వా,నరసాక్షిగ సఖ్యమీవు ♦ నాతోఁ జేయం
గరుణించితి వట్లాటన్, నరయంగా నతిశయుఁడవె ♦ యసువులకంటెన్. ౨౭

తే. సత్యసాక్షిగ వచియింతు ♦ క్ష్మాపతీంద్ర!
సఖుఁడ వగుటను జెప్పెద ♦ నతత మంత
రంగమును దుఃఖ మధికత♦రంబు గాఁగఁ
గాల్చుచున్నది యింకేమి♦గలదు పలుక. ౨౮ 300

మ. అని యీమాత్రము పల్కి బాష్పజలరు♦ద్ధాక్షుండునై కంటినీ
టను డగ్గుత్తికనొంది యుక్తముగ మా♦టల్ రామిచే గట్టిగాఁ
దనదుఃఖమ్మును బల్కనేరక నితాం♦తస్ఫారదుఃఖాంబుధిన్
మునిఁగెన్; జయ్యన నాతఁ డశ్రుసలిలం♦బున్ ధైర్యవేగంబునన్. ౨౯ 301

తే. ఆపగాపూరమట్టు లో♦న్యమ్యన వెలువడు
దాని రామునిసన్నిధిఁ ♦ దాఁ గపీంద్రుఁ
డడఁచుకొనె; నిట్లు తేజస్వి♦యైనయాతఁ
డట్లు కన్నీటి నాపి శు♦భాక్షియుగము. ౩౦ 302

తే. తుడుచుకొనుచు నిట్టూర్పుల♦తోడ రాముఁ
గాంచి యిట్లని పల్కె ని♦కామబలము
పరఁగు నవ్వాలియువరాజ♦పదమునుండి
నన్నుఁ దొలఁగించి తిట్టి క్ర♦న్ననఁ దఱిమెను. ౩౧ 303

క. అంతటఁ బోవక మఱి నా,కాంతను బ్రాణాధికను ద♦గన్ హరియించెన్
బంతంబున నాదుసుహృ,త్సంతానముఁ జెఱనుబెట్టె ♦ సాహసమలరన్. ౩౨

క. కనికరము లేక దుర్బు,ద్ధిని నన్నుం జంపఁదలఁచి ♦ తెగువఁ బ్రయత్నా
ళిని జేసినాఁడు వాఁడం,పిన వానరతతిని జముని♦పీటికనిపితిన్. ౩౩ 305

క. నిను వాలి పంపెనను శం,కనె నిన్నుం జూచినపుడు ♦ కడు భీతిలి చెం
తను జేరను నే రానై,తిని భయకారణములే మ♦దిం దోఁచినచోన్. ౩౪ 306

క. జనులెల్లను భయపడుదురు, హనుమంతుం డీతఁడాది♦యైనకపులె నా
కును సాయపడెడువా రిం,క నెవ్వరును లేరు వెదకి♦కనిన వసుధలోన్. ౩౫

ఉ. వీరల సాయముం గొనియె ♦ వీరవరా! యెటువంటికష్టముల్
చేరిననైన దేహమున ♦ జీవములన్ నిలుపంగఁజాలితిన్
భూరిబలాఢ్యు లీఘనక♦పుల్ సతతంబును నెయ్యముంచి నన్
గారవ మొప్పఁ గాచుచుఁ ద♦గన్ ననుఁ గూడి చరించువా రొగిన్!. ౩౬

సీ. ఎచటికి నేఁబోవ♦నెంచిన వినుము గూడవత్తువు నేనుఁ ♦ గూరుచున్న
స్థలమున నుండుదు ♦ త్ర్యాపాలచంద్రమా! బహుభాషణముల నీ♦పరిసరమునఁ
బలుకంగనేల క్లే♦శంబుగఁ జెప్పెద విశ్రుతమైనట్టి ♦ విక్రమమునఁ
బలలి నాకన్నయగు ♦ వాలి నాశత్రువౌ, నతఁడు నశించిన♦యపుడు నాదు

తే. శోకమెల్లను వే నశిం♦చును; సుఖంబు
జీవితంబును నతఁడు న♦శింపఁగలుగ
నలయు నేకాని వేఱొక♦భంగిఁ గలుగ
విధియె సంక్షేపకథన మో♦యినకులేశ!. ౩౯ 309

క. శోకార్తుండం గావున, నీకడ నేఁ జెప్పుకొంటి ♦ నేటి కనిన దుః
ఖాకులుఁడైనను సుఖముం, జేకూరినవాఁడనైన ♦ జెలికాఁడె తగన్. ౩౯½

తే. మిత్రునకు దిక్కు; నా విని ♦ మిహిరవంశ
రత్న మాతనితోఁ బల్కెఁ ♦ [1] క్రతుభుగీశ్వ
రాత్మజుం డగువాలి నీ ♦ కన్నగాదె
యతనికిని నీకు వైరమె ♦ట్లమరెనొక్కొ. ౪౦½ 311

క. వినఁగోరెద వాస్తవవా,ర్తను; వైరంబునకు ముందుఁ ♦ దగుకారణముల్
విని పగ బలీయమా! యిం,[2]కను బగకారణమె హెచ్చు♦గాఁ గనఁబడునా!.

చ. అని మదినెంచి యంబలిబ♦లాబలముల్ పరికించి తప్పనీ
వొనరిచినట్టి దల్పమయి ♦ యొప్పని వైరమె పెద్దదైన నా
తని వధియింతుఁ; గారణమె ♦ దారుణమై పగస్వల్పమైన నా
తనికిని నీకు సఖ్యమును ♦ దప్పక కూర్చి సుఖంబుగల్గున
ట్లొనరుతు నీకు నిశ్చయమె ♦ యొడకచెప్పుము దీర్త్తుఁ గోరికన్. ౪౨ 313

[3]సీ. అవమాన మిట్లు నీ♦కాతఁడు నమకూర్చె నని విన్నయంత నా♦కధికకోప
మట్టె వర్షాకాల♦మందు జలప్రవాహంబుతీరున హృద♦యంబునెల్లఁ
జలియింపఁజేయుచు ♦ సంచరించెడి నేను ధనువెక్కుపెట్టినం♦తనె యతండు
మరణించు నవల శో♦కరతిని బొందక యుండఁగాఁ దగునట్లు ♦ లుండఁగలవె
యటులైన సుగ్రీవ! ♦ యంతటివిశ్వాసమును బూని చెప్పు మ♦ల్లనవచింతు

1 క్రతుభుగీశ్వరాత్మజుండు=ఇంద్రపుత్రుఁడు. 2 సుఖంహి కారణం శ్రుత్వా వైరస్య తవ వానర, ఆనంతర్యం విధాస్యామి సంప్రధార్య బలాబలమ్.-అనిమూలము. స్వల్పాపరాధే ప్రబల వైరం తేన కృతంచేత్ తమవశ్యమేవ హత్వా తవ సుఖం విధాస్యామి. అనల్పాపరాధే స్వల్పవైరంచే త్సమాధానముఖేన సుఖం విధాస్యామీతి భావః-అనివ్యాఖ్య. ఈభావము శ్లోకార్థమునందు ముఖ్యముగాన నీపద్యపాదము హైపద్యము వ్రాసి వివరింపఁబడినదని తెలియఁదగు. 3 సార్థశ్లోకద్వయమున కీసీసపద్యము వ్రాయఁబడినది. మూలార్థము విస్తరించి వ్రాయఁబడక యున్నదున్నట్లే వ్రాయఁబడినదని యెఱుంగఁదగు.

తే. నందువో యేమొ నేను ఘో♦రాంబకంబు
వదలుటయు నీదుశత్రు వ♦వనిఁ బడుటయు
నేకకాలికములె యని ♦ యెంచవయ్య
యని మహాత్ముఁడు రాముఁ డి♦ట్లాడుటయును. ౨౭౪ 314

[1]చ. తరణిసుతుండు మంత్రులును ♦ దద్దయు హర్షము నొంది రంత భా
స్కరజని మోమునందున ని♦కామముగంబలరార వాలితో
జరగిన వైరముం దెలుప ♦ స్వాంతమునందుఁ దలంచి రామభూ
వరుఁ గని యిట్లుపల్కె నొక♦భంగిని దాఁపకచెప్ప నిచ్ఛతోఁ. ౨౭౮ 315

ఎనిమిదవ సర్గము సంపూర్ణము.

---

౯ - వ సర్గము.

వాలి తనకుఁ జేసిన యపకారము రామునితో సుగ్రీవుఁడు చెప్పుట.

చ. అరిజనకాలరుద్రుఁడగు♦నట్టి మదగ్రజు వాలినెంతో యా
దరమునఁ జూచుచుండె మును ♦ తండ్రియు నేనును నట్లె జ్యేష్ఠసో
దరుఁడని పెద్దచేయుచును ♦ తద్దయు గారవముంచియుంటి; న
త్తరుణమునన్ మృతింగనియెఁ ♦ దండ్రియు సంతట మంత్రు లందఱున్. ౧౫

తే. జ్యేష్ఠుఁడని వాలిఁ బట్టాభి♦షిక్తుఁ జేసి
రికపీశతకున్; వాలి ♦ యెంతొ నీతిఁ
దండ్రితాతలనుండి యెం♦తయు నెసంగు
కీశరాజ్యముఁ బాలించె ♦ నీశుఁ డగుచు. ౨౫ 317

క. ఘనరాజ్యం బతఁడేల న,తని కేనును సేవకుని వి♦ధంబున నెపుడున్
గనఁబడుచుంటిని; దుందుభి, యనువానికి జ్యేష్ఠపుత్రుఁ♦డై యూరుండై. 3౫

క. తనరుచు మాయావి యనన్, దనుజుం డొకఁడుండె నట్టి♦దానవుతోడన్
[2]జనియించె స్త్రీనిమిత్తం, బున వైరము వాలికిం బ్ర♦భూతం బగుచున్. ౪

క. జగమెఱిఁగిన వృత్తాంతం, బగునిది; మాయావి యాతఁ ♦ డాగ్రహమును ని
ల్పఁగలేక యందఱును ని,ద్రఁ గాంచుతఱి నగము రేయి♦తఱి వచ్చి తగన్.

సీ. అలరు కిష్కింధాము♦హాద్వారమును జేరి సంరంభ మొప్పార ♦ సమరమునకు
వాలిని బిల్చుచుఁ ♦ బరుషగర్జనముల నొనరించె; నిదురించు♦చున్న వాలి

---

1 సార్ధశ్లోకమందు "ప్రహర్ష మతులం లేభే, ప్రహృష్టవదనః" అని యుండుటంబట్టి యీయర్థమే "తద్దయు హర్షము, మోమునందున నికామముదంబు" అని వ్రాయఁబడినది. 2 తేన తస్య మహద్వైరం స్త్రీకృతం విశ్రుతం పురా-అనిమూలము. విశ్రుతం పురా అనునర్థమే "జగమెఱిఁగినవృత్తాంతంబగు" నని తెనిఁగింపఁబడియె.

వాని భయంకర♦నాదము విని యోర్వ కపుడె వేగమ్మున ♦ వతనిమీఁది
[1]కరిగె; స్త్రీలును నేను ♦ వలదనియంబున నెంతవారించిన ♦ నంతనిలువ

ఆ. కాగ్రహమున వాని ♦ ననుసరించి యంత
బయలువెడలి యతుల♦బలము మెఱయ
నర్దగించుచుమ్ము ♦ ననతలికిం ద్రోసి
యనికి నేగె; నెయ్య♦మునను నేను. ౮ 321

చ. అరి వధియింప నొంటిఁ జను♦నాతని వెంబడిఁ బోవ; నంత నా
శరుఁ డొగి వాలి దూరమునఁ ♦ జయ్యన వచ్చెడునన్నుఁ గాంచి యా
తురుఁడయి భీతిఁ బాఱ వడి♦తో భయమంది, యతండు పాఱ మే
మిరువుర మంతకంటె వడి ♦ నేగితి మాతని వెంబడించుచున్. ౯ 322

క. వనజారి తోఁచుచుండెను, గనుకన్ మార్గంబు చక్కఁ♦గాఁ గనఁబడియెన్;
దనుజుం డిలఁ దృణపిహితం,బును దుర్గమమునగు వివర♦మును భీకరమున్. ౧౧

చ. కనుఁగొని దానిఁ జూఱెను వ♦గం జని వాకిట మేముఁ జేర, న
ద్దనుజుఁడు దానిలోఁ జనుటఁ ♦ దప్పక చూచినవాలి రోషమూ
ర్తిని గొని యింద్రియంబు లొక♦రీతిఁ జలింపఁగ నన్నుఁ గాంచి యి
ట్లనియెఁ బ్రియానుజా! బిలము♦నందుఁ జొరంబడి నేను శత్రువున్. ౧౨ 324

తే. శీఘ్రముగ నే వధించి వ♦చ్చెదను నంత
దనుక సుసమాహితుండవై ♦ కనుచు నిందు
ద్వారమున నుండుమా! యని ♦ వలుక నేను
నప్పరంతపుఁ గూడియే ♦ యరుగఁదలఁచి. ౧౩ 325

క. బ్రతిమాలుకొంటి నైనను, నతఁడందుల కిష్టపడక ♦ యాత్మాంఘ్రులపై
జతనమున నొట్టువిడి యుగ్రతఁ దూఱె మహాబిలంబు ♦ దనుజుం జంపన్. ౧౪

ఆ. అమ్మహాబిలంబు ♦ నాతఁడు చొచ్చిన, యవల నొక్కవర్ష ♦ మల్లె నిండె;
నంతదనుక నేను ♦ నాబిలద్వారమం, దొచ్చియుంటి నెట్లొ ♦ యుద్యమమున.

సీ. వర్షమెల్లను నాకు ♦ వాలి కన్పడమిని స్నేహంబునం దగఁ ♦ జిత్తమందు [దు
సంభ్రమం బుదయింప♦సాగె; నన్నయుఁ గానఁబడఁడయ్యెఁ గానవా♦స్వాంతమం
నతఁడు మృత్యువు నొందె♦ననుశంక యుదయించె నాబిలంబుననుండి♦యంతఁ జాల
కాలంబునకు ఫేన♦కలితమై యెఱ్ఱనిరక్తము వెల్వడె ♦ రామచంద్ర!

ఆ. దానిఁ జూచి వగలఁ ♦ దత్తఱిల్లితి నేను;
[2]ననురు లఱచుచున్న♦యట్టి ధ్వనియు

---

1 వార్యమాణ స్తత స్త్రీభి ర్మయాచ ప్రణతాత్మనా-అనిమూలము. 2 నర్దతా మసురాణాం చ ధ్వని ర్మే శ్రోత్ర మాగతః, నిర స్తస్య చ సంగ్రామే క్రోశతో నిస్వనో గురోః-అనిమూలము.

ననిఁ బరాజయంబు♦నంది నాయన్నయు
నఱచుధ్వనియు వినఁగ♦నయ్యె నంత. ౧౮ 328

క. అరయుము మిత్రమ! నేనీ, మరణాంకంబులను జూచి ♦ మాయన్న యనిన్
మరణించె నంచుఁ దలఁచుచు, ధరణీధ్రసమానశిలను ♦ దద్ద్వారంబున్. ౧౯

ఉ. గట్టిగ మూసి దుఃఖమును ♦ గాంచుచు నార్తినిగుంది యన్న క
ప్పట్టునఁ దర్పణంబిడి జ♦వంబున నింటికి వచ్చినాఁడ నే
నెట్టులు దాఁచినన్ సచివు♦లెల్లను యత్నముమీఱ వాలియున్
గిట్టినవార్తలం దెలిసి ♦ ఖేదమునొంది యనంతరంబునన్. ౨౦ 330

[1] తే. మంత్రులెల్లను గూడి స♦మ్మతిని నన్నుఁ
బట్టభద్రుని జేసి ర♦వ్వలను న్యాయ
ముననె రాజ్యంబు నేలుచుం♦డ నట వాలి
శత్రువగు నసురోత్తముఁ ♦ జంపి పూన్కి. ౨౧ 331

క. చనుదెంచెను గిష్కింధకుఁ, గనుఁగొనె నన్నుఁ బట్టభద్రు♦గా వాలియు దా
ననె కుపితుండై మిగులం, గనులెఱ్ఱంబాఱ మంత్రి♦గణమును నన్నున్. ౨౨

ఆ. గట్టివైచి నన్నుఁ ♦ గాంచి రోషంబునఁ, బరుషవాక్యములను♦బల్కె; నేనుఁ
[2]ప్రకృతిబలము గలిగి ♦ వఱలుటఁ బాపిష్ఠు, నతని నిగ్రహింప♦ననువుపడియు.

క. అన్నయను గౌరవంబున, నన్నున్ బాధించినను మ♦నం బాతనినిన్
గ్రన్ననఁ ద్రోపాడఁగలే, కున్నందున నూరకుంటి ♦ నో శ్రీరామా!. ౨౩ 331

చ. అరి వధియించి వాలియు మ♦హాత్ముఁడు పట్టణమొందువేళ నే
నరిగి నమస్కరించితిని ♦ న్యాయముచొప్పున గౌరవించుచున్
గరము ప్రసన్నబుద్ధి నను♦గాంచి యతండును నాశిషంబులం
బొరి నొనరింపఁడయ్యె; మదిఁ ♦ బొంగుచు నే మరలన్ బ్రియంబునన్. ౨౪

తే. అతనియడుగులపైఁ గిరీ♦టాన్వితముగ
శిరము సోఁక నమస్కరిం♦చితిని నైన
వాలి నాపైనఁ గోపంబు ♦ వదలి సుప్ర
సన్నమతి గాఁడు శ్రీరఘు♦క్ష్మాపతీంద్ర!. ౨౫ 336

తొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౧౦ - వ సర్గము.

సుగ్రీవుఁడు వేఁడుకొన్నను వాలి యతని నిగ్రహించుట.

సీ. అంత వాలియుఁ గ్రోధ♦మచ్చె పైకొన సత్వరముగ వచ్చుటఁ గాంచి♦రామ! నే న
తని ముదితునిఁ జేయఁ♦దలఁచి యిట్లంటిని బ్రార్థనాపూర్వక♦భణితు లలర

---

1 సమ్మతై రభిషేచితః-అనిమా. 2 నిగ్రహేపి సమర్థస్య తం పాపంప్రతి రాఘవ-అనిమా.
ప్రకృతిబలసంపన్నత్వా దితిభావః-అనివ్యాఖ్య.

నాయదృష్టమున దా♦నవు వైరి వధియించి క్షేమంబుగాఁగ వ♦చ్చితివి నీవ
నాథుల మోదమం♦దం జేయువాఁడవు నే ననాథుండనే ♦ కాన నాకు

తే. నొక్కఁడవె నీవు తలఁపఁగ ♦ దిక్కు గాదె
శతశలాకలు దగఁ బూర్ణ♦చంద్రుఁ డుదయ
మందినట్లు వెలుంగుచు ♦ నమలమగు సి
తాతపత్రము నిద్దాని ♦ నన్న నీకు. ౩౭ 337

క. నేనెత్తి పట్టుకొనియెద;, మానుగ వింజామరలఁ బ్ర♦మద మొప్పఁగ నీ
కేనే వీచెదఁ గొనుమా!, త్వానాథ! బిలంబునందె♦కంబున నేనున్. ౩ 338

క. కనిపెట్టి యుంటి వత్సర, మనంతరము రక్తపూర ♦ మద్దారిన్ వ
చ్చెను నీవు గానఁబడమిన్, గొనకొని యార్తుండనగుచుఁ ♦ గుందితినార్యా!.

క. మనసు వగం గంపింపం, గ నింద్రియములెల్ల వ్యథను ♦ గాంచఁగ నట నీ
కును గన్పడినవిధంబున, ఘనగిరిశిఖరమున బిలముఁ ♦ గప్పితి నంతన్. ౪౧

క. స్థలమున నటనుండక వే, తలంగి వచ్చి పురిఁ జొచ్చి ♦ తద్దుఃఖమునన్
గలఁగుచునుండఁగ మంత్రులు, కలఁగెడుననుఁ జూచిశోక♦కలితులు నగుచున్.

క. ధరణీరాజ్యము చెడు ని, ట్లురుదుఃఖమునన్ మునుంగ ♦ నొప్పునె! విడువన్
ధరణి నని యెంచుచుం జేసిరి నాకభిషేక మేనుఁ ♦ జేకొంటిఁ బ్రభూ!. ౬౧

ఆ. కోరలేదు నేనుఁ ♦ గుందుచునే యుంటిఁ
దప్పయైన నిద్ది ♦ తమి క్షమింప
వలయుఁ బూజ్యుఁడవును ♦ బ్రభువవు నీవె నే
మున్నువలెనె భక్తి ♦ నిన్నుఁ గొలుతు. ౭ 343

క. యువరాజ నగుదు; నిన్నున్, సవినయముగఁ గొలుతు నీ య♦సన్నిధి నేనే
యవనిం బాలించితి; నీ, [1]యవనియు నిల్లడఁగ నున్న♦దని యెంచి మదిన్.

ఆ. సచివపౌరనగర♦సహితమౌ రాజ్యంబు, దీని నింతదనుక ♦ నే నకంట
కముగఁ గాచినాఁడఁ ♦ గ్రక్కున నీయది, యప్పగించువాఁడ♦నధికభక్తి. ౯

క. అరిసూదన! సౌమ్యా! యో, ధరణీశ్వర! నాపయిం గ్రు♦ధం బూనకు నా
శిరము స్పృశింపంగ నమస్కరణము గావించి కరయు♦గము మోడ్చి యిదే.

క. నినుఁ బ్రార్థించెద; మంత్రులు, [2]ననుఁ బౌరులఁ గూడి యీరాజ♦నపద మనాథం
బనుమాటను దొలఁగింపఁగఁ, గొనకొని బలవంతముగనె ♦ కూర్చిరి నృపుగన్.

చ. అనియిటు స్నేహభావమున ♦ నన్నునుఁ గూర్చి నయంబు మీఱ నే
మనవి యొనర్చినం గినుక♦మై నతఁ డెంతయు నన్న దల్చి "సీ"

1 న్యాసభూత మిదం రాజ్యమ్-అనిమూలము. 2 పౌరాన్యదేశజనైరయా-అనిమూలము. దేశస్య రాజహీనత్వాపనిన్నయేత్యర్థః-అనివ్యాఖ్య.

యని వచియించి చెప్పఁదగ♦నట్టి విధంబున మాటలాడి పౌ
రనికరముల్ స్వసమ్మతుల ♦ రాఘవ! మంత్రులఁ గూర్చి యంతటన్. ౧౪

క. విను రామ! సుహృన్మధ్యం, బున నన్నుం గూర్చి మంత్రి♦పురజనబృందం
బున కిట్లని చెప్పెను; న, ద్దనుజుఁడు మాయావి క్రూర♦ధర్మముఁగొనుచున్.

సీ. ఒకనాఁటిరాత్రిని ♦ యుద్ధంబునకు నన్నుఁ బిలిచినవార్తయుఁ ♦ దెలిసినదియె
కాదె! మీకెల్ల న♦క్కఱకు రాక్షసుఁ డిట్లు ననుఁ బిల్వఁ బురినుండి♦చనితినేను
నంతట దారుణుం♦డైన నాతమ్ముండు వీఁడును జనుదెంచె ♦ వెంటనంటి
బలమున మించునా♦పలలాశనుఁడు రాత్రి నేను బుఱ్ఱొక్కఁడు♦తానుఁ బిల్వ

తే. వచ్చుటం జూచి పాఱెను ♦ భయము మిగుల
మేము నవ్వానివెంటనె ♦ మిగులు పూన్కిఁ
బరుగువాఱితి మాతఁ డి♦ట్టులఁ గాంచి
పెనుబిలమ్మును బూన్కిఁ జొ♦చ్చెను జవమున. ౧౬ 350

చ. దనుజుఁడు ఘోరమై చొరఁగ ♦ దారుణమైన బిలంబుఁ జొచ్చుటం
గనుఁగొని నేనుఁ గ్రూరమతి♦గాఁగఁ గనంబడు వీని దమ్మునిం
గని యిటులంటి; నీయసుర♦కాంతునిఁ జంపక యిందునుండి ప
త్తనమున కేగఁజాల విను ♦ దానవునిం బొలియించి నేనునున్. ౧౭ 351

క. చనుదెంచునంతవఱకో, యనుజా! సుషిరంపుద్వార♦మందీవును గా
చి నిలువుమా! యని చెప్పితి, ననుజుం డాద్వారసీమ♦యం దెచ్చరికన్. ౧౮

ఆ. కాచియుండుననుచుఁ ♦ గడునెంచియే నేను
జొరఁగరాని బిలముఁ ♦ జొచ్చి దనుజు
నరయుచుండ నంత ♦ నబ్దమొక్కఁడు చనె
నట భయంకరుఁడగు ♦ నతనిఁ గంటి. ౧౯ 353

క. శ్రమమేమియు లేకయె యుద్ధమునం దద్బంధుజనులఁ ♦ దగఁ జంపితి; రం
ధ్రమున నట నాదునుద్ధతి, శమియింపఁగరామి నతఁడు ♦ శబ్దించె వెతన్.

ఆ. వానినోటినుండి ♦ భయకర క్తప్రవాహమ్ము వెడలె దాన ♦ నాబిలంబు
నిండియుండె నందు ♦ నిర్వసాధ్యము గాక, యుండె నేను నంత♦నుద్యమమున.

క. పౌరుషవంతుని దుందుభి, గారాబుకుమారు నతనిఁ ♦ గాలునిగేహ
ద్వారమున కనిపి సుషిర, ద్వారము వెలువడఁగ నెంచ ♦ ద్వారముఖమునన్.

క. శిలయొకటి యడ్డమై యిమ్ముల నుండుట ద్వారభాగ♦ము గనఁబడమి రా
నలవియె గామిన్ నేనుం, *బిలిచితి సుగ్రీవ! యనుచుఁ ♦ బేర్కొని యితనిన్.

తే. ఎన్నిమాఱులు పిలిచిన ♦ నేమి మాఱు
పలుకె లేకుండెఁ గాన నే ♦ నలవి గాని

---

* విక్రోశమానస్య తు మే సుగ్రీవేతి పునఃపునః - అని మూలము.

నగలఁ బొగులుచు బలిమిమైఁ ♦ బొడనిపాతిఁ
బెక్కుసారుల కాశిల♦యుక్కు సణఁచి. ౨౩ 358

క. పగులంగొట్టితి నంతటి, బిగువగు నాశిలను ద్రోసి ♦ వెలుపలి దేశం
బుఁ గని యథాపూర్వంబుగ, నగుడి యిటం జేరినాఁడ ♦ నత్యుత్కృతముగన్.

క. క్రూరుండగు సుగ్రీవుం, డీరాజ్యముఁ గోరి యున్న♦యే యనుమైత్రిన్
గోరక బిలమున నుండియె, నే రాకుండఁగ నెలె నంచు ♦ నేర్పున బిలమున్. ౨౫

[1]చ. ఘనశిలఁ గప్పివచ్చెనని ♦ కాఱులు పల్కి తదంతరంబునన్
నను నిసుమంతయేనియు మ♦నంబున సంశయమూన కప్పుడే
తనపురి నుండఁగూడదని ♦ తప్పు కనుంగొన కొక్కగుడ్డతోఁ
జనుమని పాఱఁదోలె; గుణ♦సాంద్ర! రఘూత్తమ! యేమిచెప్పుదున్. ౨౬

ఉ. అంతట నూరకుండక భ♦యార్తుని నన్నును లెస్స తన్ని నా
కాంతనుగూడఁ గైకొనియెఁ ♦ గావున నాతని భీతినొందియే
యంతట నీధరాస్థలిని ♦ సర్ణవకాననరాజినెల్ల న
త్యంతజవంబునం దిరిగి ♦ యంగనపోవుట కాత్మఁ గుందుచున్. ౨౭ 362

ఆ. కారణాంతరమున ♦ త్మాధరమియ్యది, వాలి కెక్కరామి ♦ భయము మాని
యిందున్నవాఁడ ♦ వృత్తాంత మీవైర, కారణంబు రామ! ♦ భూరితరము.

క. ఐనను సర్వముఁ జెప్పితి, నేనే యపరాధలేశ♦మేఁ జేయకయే
మానని యీవ్యథ నొందితిఁ, [2]గానంగాఁ దగును నీకుఁ ♦ గరుణామూర్తీ!.

సీ. సర్వలోకములకు ♦ శాశ్వతాభయము నొసంగువాఁడవు శూర♦సత్తముఁడవు
వాలిభయంబున ♦ వగనొందునాకు నాతని నిగ్రహించి నే ♦ యనుపమకృప
నభయదానము చేయ♦నగునని ప్రార్థింప ధర్మజ్ఞుఁడును శూర♦తల్లజుండు
నగురాముఁ డమ్మాట ♦ లాలకించి మొగంబునందు సుస్మితమొప్ప♦నక్కపివరుఁ

ఆ. గనుచు ధర్మయుక్త ♦ మనుపమమునగు వా
క్యంబు పల్కె నిట్లు; ♦ లర్కనిభము
లై యమోఘములయి ♦ యతితీక్ష్ణములగు నీ
మచ్ఛిలీముఖములు ♦ మహితగతులు. ౩౧ 365

క. అతిశయజవమునఁ బరుగిడి, యతిదుర్వృత్తుఁడగు నీదు♦నగ్రజుపై ను
గ్రతమీఱం బడఁగల; వృద్ధతుఁడును బాపమతి దుష్ట♦తం దగునతఁడున్.

క. అనుజుఁడ వగునీభార్యను, గొనిన మహాద్రోహి వాలి ♦ క్రూరుఁడు నాకం
టను బడకుండినవఱకే, [3]తనపెద్దలపేరు చెఱుపఁ♦దగు నతఁడుండున్. 33

---

1 నిర్వాసయామాస తదా వాలీ విగతసాధ్వసః-అనిమూలము. ఇట సాధ్వసశబ్దమునకు సంశయార్థము చెప్పవలయును. 2 వ్యసనం పశ్య రాఘవ - అనిమూలము. 3 వాలీ చారిత్రదూషకః-అనిమూలము.

సీ. ఆర్తుఁడు దుఃఖముఁ బట్టి ♦ యనుమానమును జేయ ఘనశోకసాగరం♦బునను నీవు
మునిఁగినాఁడవటంచుఁ ♦ గనుఁగొనుచున్నాఁడఁ దరియింపఁ జేసెదఁ ♦ ద్వరగ నిన్నుఁ
బుష్కలాభీష్టంబుఁ ♦ బొందుదు వీ వింక నని రాఘవుండు కృ♦పాయతమతి
తనకు హితంబుగాఁ ♦ దగ వచియించినపల్కులు విని కీశ♦పతి మహామ

ఆ. దంబునొంది రాము♦ధరణీశచంద్రుఁ డా
డినయమోఘవాక్య♦మునకు నలరి
యతని సన్నుతించె ♦ నాత్మకార్యము కొన
సాగు నన్నవాంఛ ♦ స్వాంత మలర. ౩౫ 368

పదియవ సర్గము సంపూర్ణము.

---

## ౧౧ - వ సర్గము.

సుగ్రీవుఁడు వాలిపరాక్రమమును రామున కెఱిఁగించుట.

క. జనపతి హర్షము పౌరుష,మును వృద్ధిం జేయువాక్య♦మును బల్కఁగ న
వ్వనచరపతి విని కైమోడ్పున రామునిఁ బూజచేసి ♦ పొగడం దొడఁగెన్. ౧

మ. ప్రళయార్కప్రతిమానతేజ మలరన్ ♦ భాసిల్లుచు న్నీవు ప్ర
జ్జ్వలితంబుల్ పరమర్మభేదనపటు♦త్వంబుల్ సుతీక్ష్ణాగ్రముల్
పలురూపంబులు నైనబాణములఁ గో♦పం బూనువేనిన్ జగం
బులనెల్లన్ దహియింతు సంశయము నా♦బుద్ధిం దొలంగెన్ విభూ!. ౨ 370

తే. వాలిబలశౌర్యవీర్యంబు♦లోలి ధైర్య
మును యథారీతి నేఁ జెప్ప ♦ మునుకొని విని
యవలఁ జేయఁగఁ దగినకా♦ర్యమును జేయు
బ్రాహ్మమను ముహూర్తమ్మున ♦ వాలి లేచి. ౩ 371

సీ. సప్తాశ్వుఁ డుదయించు♦సమయంబునకుముందె సంధ్యనుపాసింప♦సాంద్రభక్తిఁ
బశ్చిమాంబుధినుండి ♦ ప్రాక్సముద్రమునకు యామ్యవారిధినుండి♦యట్లె యుత్త
రాబ్ధికి నిట్లు కా♦సంతయు శ్రమమొంద కరుగుచునుండు వీ♦ర్యమునఁ బొలిచి
పర్వతాగ్రములెక్కి ♦ పరమపర్వతశిఖరాళిఁ గందుకముల♦యట్లు జనము

ఆ. తగఁగ నెగురవేసి ♦ తనహస్తమున వానిఁ
బట్టుకొనును; దనదు♦బలము నెఱప
వనములందు సార♦వంతంబులౌ వివి
ధద్రుమముల విఱుచుఁ ♦ దనకరముల ౪ 372

చ. అతిశయవీర్యమొప్ప మహి♦షాకృతిఁ దాలిచియుండు నొక్కచో
దితిజుఁడు దుందుభిప్రకట♦వృత్తసమాఖ్యుఁడు వెండికొండతోఁ

ప్రతియగు కాయ మొప్పెసఁగు♦వాఁడు సహస్రగజోగ్రపౌరుషం
బు తనరవెల్లు; నిల్లితఁడు ♦ భూరిశరీరము గల్గి యుగ్రుఁడై. ౭ 373

ఆ. కుసుతి యతఁడు పౌరు♦షమున గర్వించుచు
వరము లందియుంట♦వలన నొకలు
మఱచి యెక్కినాఁడు ♦ నెఱి సరిత్పతికడ
కరిగె నాక్రమింప ♦ నతనిఁ జూచి. ౮ 374

క. అసదుగఁ దరంగములతో, గురుతరరత్నములతోడఁ ♦ గొమరారెడు సా
గరపతి! నాకీవె సంగరమొసఁగుమ యనుచు నడిగె♦గర్వము పొంగన్.

క. జనవర! ధర్మాత్ముండును, ఘనబలుఁడౌ సాగరుండు ♦ కడుపడి మీఱన్
మనుజాకృతి లేచుచు దను, జునిఁ గాలవశంగతాత్ముఁ ♦ జూచి యిటులనెన్.

చ. కలహవిశారదుండవయి ♦ క్రాలెడు నీకును యుద్ధభిక్ష నీ
వలసినయంత శక్తిగల♦వాఁడనె? నే నన నెంతవాఁడ? ని
మ్ముల రణభిక్ష నీకొసఁగఁ♦బోలినవాని వచింతుఁ జక్కఁగా
[1]వలయు వినంగ; గొప్పవన♦భాగమునన్ గిరిరాజు భాసిలున్. ౧౧ 377

క. మునిజనశరణ్యుఁ డెంతయు, విను శంకరునకును మామ ♦ విశ్రుతనామం
బున హిమవంతుం డన నొ, ప్పును గుహలును నిర్ఝరములు♦పొలుచున తనిపై.

సీ. బహుకందరమ్ములఁ ♦ బాషాణసంధుల నలరారు నయ్యద్రి ♦ యతఁడు నీకు
సంగరంబునయందు ♦ సాటిలేనట్టితృప్తిని జేయఁగలఁడు నా♦విని సురారి
పతి సముద్రుని మది ♦ భయకంపితునిగాఁగఁ దలఁచిధనుర్విముక్త♦తమగు శరము
వలె హిమభూధర♦వనమున కరిగెను; నంత దుందుభి యందు ♦ దంతినివహ

తే. మంత పెద్దవి యగుచు న♦త్యంతసితరు
చులను నొప్పెడుపాషాణ♦ములను నిచ్చ
కొలఁదిఁ గొమ్ముల నెగఁజిమ్మి ♦ కోయటంచు
నార్చె; నయ్యద్రి శ్వేతాంబు♦దాకృతిఁగొని. ౧౪ 379

క. కనుఁగొనఁ బ్రీతిం గొల్పెడు, తనువున సౌమ్యుండు నగుచుఁ ♦ దనశిఖరమునం
దె నిలిచి వానిం గని యి,ట్లనె దుందుభి! ధర్మగుణయు♦తాత్మా! వీరా!. ౧౬

క. ననుఁ గ్లేశము నొందింపం, జన దేనో యుద్ధవిహిత♦సత్త్వుఁడఁగా నో
దనుజేంద్రా! నాయందున్, మునిజనము వసించు యుద్ధ♦మున కెటు లనువౌ.

చ. అని యిటు బుద్ధిమంతుఁడగు ♦ నాగిరినాథుఁడు పల్కువాక్యముల్
విని క్రుధఁ గన్నులెఱ్ఱవడ ♦ విక్రమమొప్పఁగఁబల్కె సంగరం
బున కగుశక్తి చాలకయె ♦ పోయిన నీకును బోవ్పఁగాక న

1 శైలరాజో మహారణ్యే-అనిమూ.

న్గని భయమొంది యివ్విధము♦గా వచియింతువుగాక భూధరా!. ౧౮౪ 382

మ. నిను నొప్పింపనుగాని సంగరము నే♦నేఁ జేయఁ గాంక్షింతుఁ గా
వున నాతో నని చేయఁజాలుదునుసీ ♦ బుద్ధిన్ విచారించి చె
ప్పినఁ జాలుం జనువాఁడ నంచనిన భూ♦భృద్వర్యుఁ డాలించి యి
[1]ట్లను ధర్మాత్ముఁడు వాగ్విశారదుఁడు నై ♦ హార్దంబుమటన్ వానితోన్. ౧౮౫

ఆ. ఇంతదనుక నెవ్వ♦రేని చెప్పనియట్టి, వాక్యమును దలంచి ♦ పరమకోప
మంకురింప దాన♦వాధీశ. యాలింపు, భూతలంబునందుఁ ♦ బొలుపుఁగాంచి.

క. సరిలేని ప్రభలనెంతేయుఁ, బరఁగెడు కిష్కింధయందు ♦ వానరపుఁడై
సురపతిసమవిక్రముఁడై, నిరుపమమగు ప్రజ్ఞయలర ♦ నెగడుచు ఘనుఁడై. ౨౦

క. శ్రీమంతుండగు వాలియు, నామోదం బలర నుండు ♦ ననఘుం డతఁడెం
తే మహితప్రజ్ఞను ను, ద్దామరణప్రక్రమమునఁ ♦ దనరారుట చేన్. ౨౧ 386

క. సురనాథుఁడు నముచికి సం,గరభిక్ష నొసంగినట్లు♦గా వాలియు నీ
కురుముదమున ద్వంద్వాహవ,ము రయంబున నిచ్చు నరుగు♦ము దనుజనాథా!.

చ. అని యొనరించు నిచ్చ మది♦యందును నీకుఁ జెలంగునేని వే
చను మన వాలిసన్నిధికి ♦ సంతత మాతఁడు దుష్ప్రధర్షణుం
డని మొనశూరుఁడై మెలఁగు; ♦ నంచు వచించిన నాలకించి యిం
తనియునరానికోపమున ♦ నప్పుడె దుందుభి సంగరేచ్ఛ చేన్. ౨౩ 388

సీ. వాలి సంరక్షింప ♦ వఱలు కిష్కింధకుఁ జనియెను మహిషాకృ♦తిని ధరించి
తీక్ష్ణశృంగంబుల ♦ తీరు భయావహం బై యొప్ప వర్షర్తు♦వందు నింగి
జలపూర్ణమగు నీల♦జలదంబువలె వెల్గి యతులబలంబున ♦ నతఁడు వాలి
పురము ద్వారంబున ♦ భూస్థలి వడఁకంగ భేరిచండంబున ♦ భీషణరవ

ఆ. మాచరింపఁ జేసి ♦ యంతికవృక్షాళి, విఱిచి ఖురఖురములఁ ♦ బృథ్విఁ బగులఁ
జేసి ద్వారములను ♦ శృంగంబులం జెండి, మదగజంబురీతి ♦ మసలుచుండె. ౨౪

క. అంతఃపురగతుఁడగు కపి, కాంతుం డాధ్వనిని విని ని♦కామామర్షా
క్రాంతస్వాంతుండై తన, కాంతలతో వెడలె [2]భగణకలిత♦శశివలెన్. ౨౫ 390

[2]చ. వనచరవానరాధిపతి ♦ వాలి స్ఫుటాక్షరముల్ పదంబులొ
ప్ప నతని దుందుభిం గనుచుఁ ♦ బల్కె మితంబుగ నోయిదుందుభీ!
ఘనబలశాలివీవు ననుఁ ♦ గాంచినవాఁడవె మున్ను నేను నిన్
విననె యెఱుంగనే యిపుడు ♦ విక్రమమొప్పఁగ నీవు పొంగుచున్. ౨౬ 391

తే. కారణంబేమొ నాపుర♦ద్వారమందు, నడ్డముగ నిల్చి యార్చెద ♦ వాత్మజీవి
తమును గాపాడుకొనుము ని♦ త్తఱిని ననుచు, ధీవిశారదుఁడగు కపి♦భూవిభుండు.

---

1 శ్రుత్వా వాక్యవిశారదః, అనుక్తపూర్వం ధర్మాత్మా-అనిమూ. 2 తారాభిరివ చంద్రమాః-అనిమూ. భగణములు = నక్షత్రపంక్తులు. 3 హరీణా మీశ్వరో వాలీ సర్వేషాం వనచారిణామ్-అనిమూ. వనచారిణాం ఫల్లూకానామ్-అనివ్యాఖ్య.

చ. పలికిన నాలకించి క్రుధ ♦ నెఱ్ఱని నేత్రము లెఱ్ఱవాఱి నా
ఖలదనుజుండు పల్కెఁ గపి♦కాంత! పరాక్రమసార! వింత కాం
తలు నిలువంగ నిట్లనుట ♦ ధర్మమె? వీరముతేల? చాలు ని
మ్ముల రణభిక్ష నాకొసఁగు ♦ ముందఱ నవ్విల నీబలంబునన్. ౩౨ 393

తే. తెలిసికొనియొకఁ గాదేని ♦ దీర్ఘరోష
మూపుకొని యీరాత్రి యామయా♦మ్యంతమందు
గడపువాఁడను; మదనభో♦గములకెల్ల
నవధి నిశ్చయ నేనుడ♦యంబుదనుక. ౩౩ 394

సీ. స్వేచ్ఛఁగా విహరింపు ♦ మింతులతోఁగూడి సకలవానరుల కీ♦శ్వరుఁడవీవు
కాన బంధువులను ♦ కౌఁగిటఁ జేరిచి యంత్యకాలమున నీ♦యంగఁ దగిన
వస్తుజాలంబెల్ల ♦ వారికివారికిఁ దగినట్టులిచ్చి బు♦త్త్రతతిఁ గలిసి
యించుక సేవుండు ♦ మీపురంబెల్లను జక్కఁగఁ గనుఁగొను ♦ మొక్కమాఱు
తే. నిన్నుఁబోలు వేఱొక్కని ♦ నృపునిఁ జేయు
కాంతలంగూడి విహరింపు ♦ కడుముదమున
నవల నీదర్ప మడఁగింతు; ♦ నని నెవండు
మత్తుఁ బరికరహీనుఁ బ్ర♦మత్తునుప్తు. ౩౪ 395

క. నీవున్నట్లే యెవ్వం, డే వరవర్ణినుల నడుమ ♦ నెసఁగుతమిని బెం
పానహిలన్ మైఁ దెలియక, తావజిలునో వానిఁ జంపు♦ధర్మము తూలన్.

ఆ. వాఁడు భూరిమహాత్ముఁ ♦ బోడిమి చేసిన, యఘము నొందుననిన;♦నంత వాలి
తార లోనుగాఁగఁ ♦ దనకాంతలను నంతి, పురికిఁ బంపి దనుజ♦పుంగవు నటు.

క. కనుఁగొని కోపంబునఁ దిన్నని నవ్వునఁ బలికె దనుజ♦నాయక! యుద్ధం
బున భయరహితుఁడవేనిన్, నను గెలుచుము మత్తునిగ మ♦దంబున నింకన్.

*తే. మదమిదియె చేయఁబోవుస♦మరమునకును
వీరపానంబటంచు నో♦భూరిదనుజ!
తలఁపుమని పల్కి మిగులు క్రో♦ధమున నంత
దనకు మును తండ్రియొసఁగిన♦కనకమాల. ౩౮ 399

క. త్వరఁగా భుజశిఖరాంతర, సరసికిఁ బోఁ గ్రోచికొనుచు ♦ సరభసముగ సం
గరమునకున్ వెడలెను; న, త్తరుణముననె వాలి భూమి♦ధరనము దనుజున్.

మ. ఘనశృంగంబులఁ బట్టి యార్చుచు నినుం ♦ గ్రవ్యాద! పోనిత్తునే
యనుచుం ద్రిప్పి మహీస్థలింబడఁగ శౌ♦ర్యంబొప్పఁగాఁ దన్నె సిం
హనినాదం బడరించె భూపతితుఁడౌ ♦ నాదైత్యశ్రోత్రద్వయం
బున రక్తంబు స్రవించె నంతట జ ముం♦బుం గోసువా రిపువున్. ౪౧ 401

* మదోఽయం సంప్రహారేస్మిన్ వీరపానం సమర్థ్యతామ్-ఆనిమూలము.

క. తలపడి రాగ్రహమున నిస్తులయుద్ధము భయదరీతి ♦ దోఁప జరగె; న
బ్బలరిపుశౌర్యుఁడు వాలియుఁ, బలుముష్టిప్రహారములను ♦ బాషాణములన్.

సీ. జానుఘాతముల వృ♦క్షంబులఁ బోరాడె; నిట్టు లిద్దఱు విజ♦యేచ్ఛ లెసఁగఁ
బెనఁగుచుండఁగఁ గ్రమం♦బున సురరిపుబల మంతకంతకుఁగార్శ్య♦మందె వాలి
బలము వృద్ధింబొందె; ♦ బవరంబునన్ బలశౌర్యధైర్యంబులు ♦ సమరయత్న
ములు తగ్గిపోవ వాఁ ♦ డలసియుండుటఁ జూచి వానిఁ బైకెత్తి య♦వ్వాలి నేలఁ

ఆ. బడఁగవేసి కొట్టెఁ ♦ బ్రాణహారంబైన
యట్టియుద్ధమందు ♦ నతులకాయుఁ
డైనదనుజుఁ డంగ♦మంతయు నలఁగుచుఁ
[1]బిండియైనఁ జచ్చెఁ ♦ బృథ్విఁ బడుచు. ౪౦౩ 403

చ. ఘనబలుఁడైనవాలి మృతిఁ ♦ గాంచి ధరంబడియున్నవానిదా
తనువును గేలనెత్తి తన♦దర్పము పొంగఁగ నూఁచియూఁచి యో
జనమున నేలపైఁ బడఁగ ♦ సత్వరమొప్పఁగఁ జిమ్మివైచె; నా
దనుజుఁడు చిమ్మఁగాఁ బడుచు ♦ దారుణరక్తము చిమ్ముచుండఁగాన్. ౪౦౪ 404

ఆ. దూరభూమిఁ బడియె ♦ దుందుభివదనంబు
నుండి [2]నల్లచుక్క ♦ లొగి మతంగ
మౌనియాశ్రమమున ♦ మారుతవశమునఁ
బడియె; నంత మౌని♦వరుఁడు ఘనుఁడు. ౪౦౫ 405

చ. తనయుటజంబునం బడిన♦తద్రుధిరాయతబిందుసంతతిం
గని క్రుధనొంది యాచెడుగుఁ♦గార్యము చేసిన యాతఁ డెవ్వఁడో?
యని మది నూహచేసి యిటు ♦ లారయ కిత్తఱి నల్లచుక్కలన్
మునినగు నాపయిం బడఁగ ♦ మూర్ఖతఁ జేసిన దుష్టుఁ డెవ్వఁడో?. ౪౦౬

తే. దుస్స్వభావుఁడు మఱియును ♦ దుష్టబుద్ధి
యవశచిత్తుఁ డతఁడెవ్వఁ ♦ డగునొ యనుచుఁ
బలికి మునిపుంగవుఁడును ♦ వెలికి వచ్చి
భువిని బడియున్నవానిని ♦ భూధరాంగు. ౪౦౭ 407

క. దనుజుని దుందుభినాముని, ఘనమహిషాకృతిని బ్రీతిఁ ♦ గాంచినవానిన్
గని మౌని తపోదృష్టి న,తనిఁ జంపినవాఁడు కీశ♦తతిపతి యనుచున్. ౪౦౮

క. మనమున నెంచుచు నట్లా, దనుజుని నెగఁజిమ్మినట్టి ♦ దర్పాంధునిపై
న నొకట గురుతరశాపం, బును వైవఁగఁ దలఁచి యిట్లు ♦ మునిపతి పలికెన్.

సీ. ఎవనిచే నే వసి♦యించినయీతపోవనమెల్ల రుధిరబిం♦దునికరముల
నపవిత్రముగను జే♦యంబడి యిట్లయ్యె వృక్షమ్ము లియ్యవి ♦ విఱుగునట్లు

---

1 పపాత చ మహాకాయః క్షితౌ పంచత్వ మాగతః- అనిమూలము. 2 నల్లచుక్కలు=రక్త బిందువులు.

దనుజకళేబరం♦బును జిమ్మఁబడియెనో యాతఁడివ్వనిఁ జేర ♦ నచ్చఁడెట్టు
లిఁకనగుఁ? జొచ్చున♦యేని చచ్చును దుష్టబుద్ధియగు వాలియు♦భూమిమీఁద

ఆ. యోజనంబు దూర ♦ మొక్కనాఁడేనియుఁ
జొరఁగరాదు పూన్కిఁ ♦ జొచ్చెనేని
బ్రదుకఁడతఁడు సత్య♦వాక్య మియ్యది; నుణి
యతనిసచివు లీవ♦నాంతరమున. ౪౧౦ 410

*క. ఎవరున్నారో వారలు, జనమునఁ బోవంగవలయుఁ ♦ జక్కఁగ నీమా
టవిని సుఖంబుగ వేగం,బ వనము నిర్దానివిడిచి ♦ యరుగం దగుఁజూ! ౪౧౧

చ. తనయునిభంగి నీవనముఁ ♦ దద్దయుఁ బెంచుచునున్నవాఁడఁ బ
త్రనికరముల్ చిగుళ్లు ఫల♦రాజిని మూలములన్ గృశింపఁజే
య నిలిచిరేని యీకపుల ♦ నాతనివారల నేశపింతు నిం
కను దినమొండొసంగితిని ♦ గాలము వారలు వెళ్లిపోవఁగన్. ౪౧౨ 412

ఆ. ఇట్టి గడువుమీఱి ♦ యెవ్వఁడైనను లేవు
నాదుకంటఁబడున♦యేఁ దగ నతఁ
డవనిధరము నగుచు ♦ నచలుఁడై బహుసహ
స్రాబ్దములు వసింప ♦ నగును జుమ్ము!. ౪౧౩ 413

క. అని మునిశాపం బిచ్చిన, విని వారలు వనమునుండి ♦ వెడలి శచీనా
థునిపుత్త్రుకడకుఁ బోయినఁ, గని వాలియు వారితోడఁ ♦ గడఁగి యిటులనెన్.

క. వనచరులార! మతంగుని, వనమున గాపున్నమీరు ♦ వచ్చుటకేమో
గనరాదు హేతువిట న, న్గనవచ్చుట కేమిగలదొ? ♦ కారణమనుచున్. ౪౧౫

తే. మఱియు నిట్లనె వానర♦మండలమున
కెల్ల క్షేమమె గద! యన ♦ నెల్లకపులు
కనకమాలను దాల్చిన♦కపివరునకు
దనుజమరణంబు మొదలు మ♦తంగమౌని. ౪౧౬ 416

తే. శాపమొసఁగిన దనుక న♦చ్చుట జరగిన
వార్తలను దమరాకకు ♦ వలయుహేతు
వును సమగ్రమముగాఁ జెప్ప ♦ విని యతండు
మౌనిసన్నిధికేగి బ్ర♦హ్మమునిఁ గాంచి. ౪౧౭ 417

చ. కరములు మోడ్చి శాపమిది ♦ క్షమ్మఁ జేయవె యంచు వేఁడె; న
ప్పరమమునీంద్రుఁ డాతనిని ♦ భవ్యమతిం దలపోయ కే గృహాం

* యేచాపి సచివా స్తస్య సంశ్రితా మామకం వనం, నచ తై రిహ వస్తవ్యం శ్రుత్వా యాంతు యథాసుఖమ్-అనిమూలము. అపరాధులైనను సుగ్రీవాదులను గంధించుట నిటు మంచి రాదని మునిభావము.

తరమున కేగె; వాలియును ♦ దద్గురుశాపముపొందక కింక నె
వ్వరుసను దీఅపడం జెతెంగి ♦ పల్కక విహ్వాలుండై చనెం బురికిన్. ౬౩ 418

క. జననాథా! యకార్యకరణమున వాలియు శాపభీతిం ♦ బొందుట శైలం
బును దీని ఋశ్యమూకం, బును జొరనొల్లండు చూడం♦బూనండు మదిలోన్.

చ. వనమున నిండం జొచ్చుటకు ♦ వాలికి సాధ్యముగామి నెంచి మం
త్రినికరయుక్తి నేనును సు♦దింగలచింతను బాసి స్వేచ్ఛ నీ
వనిం జరియించుచుండు; బల♦పౌరుషముల్ దగ వాలి పేచినై
చిన యలదానవాంగమదె ♦ చెంతనె కన్పడు శుష్కభూతమై. ౬౪ 420

చ. ఎముకలుమాత్రమే మిగిలి ♦ యెన్నంగ భూధరకూటతుల్యమై
శుమం బడియున్న దల్లదిగో! ♦ కన్గొనుమా! యివె సప్తసాలవృ
క్షములు మహోన్నతంబులయి ♦ శాఖలు మిక్కిలి నిండియుండ నిం
పమరంగ నున్న విందు నమ♦రాధిపపుత్రకుం డొక్కవృక్షమున్. ౬౫ 421

[1] తే. పటుబలంబునం జీలిచి ♦ బాణమొండు
దానిపత్రములెల్లను ♦ దగ నశింప,
వెడలి వేఱొండుతరువును ♦ వేగనాటు
కొనంగ, నాగండిలోపలం ♦ గ్రుచ్చంగలుగు. ౬౬ 422

క. మనుజేంద్ర! వాలిశౌర్యం, బన నిటు లసమాన మగుచు ♦ నలరును దానిన్
బనిపూని చెప్పితిని నా,తని నెట్లు వధింపంగలవో? ♦ దర్పబలములన్. ౬౭ 423

చ. అని వచియించు సూర్యసుతు ♦ నప్పుడు లక్ష్మణుం డట్టెచూచి యి
ట్లనియె స్మితంబు పొంగ; మను♦జాధిపుం డెప్పునిం జేయ వాలి నీ
ఘనుండు వధింపంజాలు నను♦గాఢపునమ్మిక నీకుం గల్గునో
యనఘ! వచింపుమన్న నతం♦డాతని కిట్లను; మున్ను వాలియున్. ౬౮ 424

[2] సీ. ఈసాలతరువుల ♦ నేడింటియందొక్కతరువును మును చీల్చి ♦ దానియందు
శరమును నాటి యా♦శరమును లాగి యాగండినే వేఱొక్క♦గాఢబాణ
మును నాటి యాశరం♦బును గూడందీసి యీవిధమునం బలుసార్లు♦విక్రమమున
నొనరించి రంధ్రంబు ♦ లొప్పునట్లుగం జేసి యున్నాండు గాన నీ♦యన్న వీని

---

1 యత్రైకం ఘటతే వాలీ నిష్పత్రయితు మోజసా-అనిమూలము. యత్ర యేషు సాలేషు ఏకంసాలం నిష్పత్రయితుం నిర్గతశరపత్రం కర్తుం ఘటతే సమర్థో భవతీతి. ఏకంసాలం భిత్వా శరో నిష్పత్రం యథా నిర్గచ్ఛతి తథా వేద్ధుం సమర్థ ఇత్యర్థః-అనితీర్థులు. ఏకంసాలం భిత్వా శరో నిష్పత్రం యథా తథా వృక్షాంతరాసక్తమూలం గచ్ఛతి తథావేద్ధుం సమర్థ ఇత్యర్థః-అని గోవిందరాజులు. ఈ యర్థమే యిటం గనంబడునని యెఱుంగనగు. 2 ఈపద్యార్థమే యీయధ్యాయమున నలువదియేడవశ్లోకమునం జెప్పంబడినది. మరల నిటంజెప్పుట విస్తరించునభిప్రాయముచేతనేగాని పునరుక్తము గాదని యెఱుంగవలయు.

తే. యందు నొకదాని నొక్కటి♦వ్రాంబకమునఁ
జీల్చునేని, మృతుండయి ♦ క్షితిని బొంది
యున్న దుందుభియస్థుల ♦ నొక్కపాద
మునను నెత్తి పరాక్రమం♦బును జెలంగ. ౨౧½ 425

క. అమరఁగ ద్విశతధనుర్దూరమునకుఁ జని పడువిధమున ♦ రహిఁ జిమ్మునయే
సుమహితరఘువరగురుశౌర్యముఁ గని నాయన్న చచ్చె♦నని నేఁ దలఁతున్.

తే. అనుచు వచియించి సుగ్రీవుఁ ♦ డంతఁ గొంత
[1]దనుక ధ్యానించి మరల ర♦క్తసమరేఖ
లక్షిచివరల నగపడ ♦ నలరు రాము
ఘనునిఁ గాకుత్స్థకులమణిఁ ♦ గాంచి పలికె. ౨౩ 427

[2]సీ. వాలి శూరుఁడు బల♦వంతుల వధియించియున్నాఁడు బలవిక్ర♦మోగ్రుఁ డతఁడు
బలవంతుఁడగు నింత♦నరికి నెన్నండెట్టిసంగరంబులఁ బరా♦జయము నొంద
కలదును, సురలకు♦నైనఁ జేయఁగరాని కర్మంబుల నతండు ♦ ఘనతరముగఁ
గావించియున్నాఁడు ♦ గానంబడెడు నవ్వి వాని నన్నిఁటి నెంచి ♦ యేను భీతిఁ

తే. బర్వతము దీనిఁ జేరితిఁ ♦ బరుల కెపుడు
గెలువరాకయు మార్కొని ♦ నిలువరాక
యలరు వాలి నమర్షణు ♦ నక్కపీంద్రుఁ
దలఁచియే నేను విడువంగఁ ♦ దలఁప దీని. ౨౬ 428

క. అనురక్తులైన యీపావని ముఖసచివాళిఁ గూడి ♦ వనమున నిందే
నును జంకును గొంకును గను,చు నెదిరుగుచున్నవాఁడఁ♦జూ! రఘురామా!.

క. నిను శ్లాఘనీయు సన్మిత్రునిఁ బొందితి నేమిగొఱఁత ♦ నోఁపదిఁక విభూ!
ఘనమిత్రవత్సలా! యో, మనుజర్షభ హిమనగంబు♦మాడ్కిని నిన్నున్. ౨౮

తే. ఆశ్రయించితి; బలశాలి♦వైననాదు
దుష్టసోదరుబలము నా♦దుమదికెల్లఁ
దెలియు; [3]నీవీర్యమన్ననో ♦ తెలిసినదియె
కాదు సంగరముల నేను ♦ గానఁ గాన. ౨౯ 431

క. మును వాలియొనర్చిన కార్యనిచయ మతిభీషణంబ ♦ యగుటన్ దానిం
గొని భయము గల్గి నేని, ట్లనినాఁడంగాని నీకు ♦ నాత్మచలనమున్. ౨౯½ 432

[4]క. కలిగింపవలయు ననియును, బలుకుల నవమతిని జేయ♦వలయుననియు భీ

---

1 రామం రక్తాంతలోచనమ్, ధ్యాత్వా ముహూర్తమ్ - అనిమూలము. 2 శూరశ్చ శూరఘాతీచ ప్రఖ్యాతబలపౌరుషః, బలవాన్-అనిమూలము. ఇందలి విశేషణములు పద్యమునఁ గలవు. 3 అప్రత్యక్షం తు మే వీర్యం సమరే తవ రాఘవ-అనిమూలము. 4 నఖల్వహం త్వాం తులయే నావమన్యే నభీషయే-అనిమూలము.

తిలఁ జేయవలయుననియును, బలుకుట లేదనుచుఁ దలఁప♦వలయు మహాత్మా.

సీ. ఏకరూపంబుగ ♦ నెసఁగు నీపల్కులు ధైర్యంబు బుద్ధియుఁ ♦ దనువిలాస
మును భస్మసంవృతిఁ ♦ గను నగ్నిపోలికఁ దవ్వఁగు తేజంబు ♦ వరుసఁ దెలుపు
చున్నవి చక్కఁగా ♦ నో రాఘవా!; యని పలికినఁ బ్రభువయి ♦ పరమసత్వ
హృదయుఁడౌ రఘువీరుఁ ♦ డిట్లనిపల్కె సుస్మితమొప్ప సుగ్రీవు♦చింత మాన్ప;

తే. ననఘ ! [1]నీకు మాశౌర్యంబు♦నందు నమ్మ
కమ్ము లేదేని నేను సం♦గరమునందుఁ
దగినప్రత్యయమును నీకుఁ ♦ దత్పరమతి
నగుచుఁ గలుగంగఁ జేసెద ♦ ననుచు నతని. ౮౩ 434

క. మన మూఱడిలం జేయుచు, దనుజకళేబరము లీలఁ ♦ దనదగుపాదం
బును గదలింపక యే బొ, ట్టనవ్రేలనె యెత్తి వే క♦డంగి బలమునన్. ౮౮ 435

ఆ. ఊఁచియూఁచియట్టె ♦ యోజనదశకంబు, నంతదూరమేగు♦నట్లు చిమ్మె;
నంతఁ గపివరుండు ♦ నసురకాయ మ్మెండి, యల్పమగుటఁ గాల♦నతఁడు చిమ్మ.

క. కనుఁగొని మరల నతనితో, ననుజుఁడు వినుచుండ నిట్టు♦లనియె; సఖా! యీ
తనువు మును రక్తసిక్తం,బును నవ్యము మాంసయుక్త♦మును నయియుండన్.

ఆ. విసరివైచె వాలి ♦ విను మిప్పు డది యెండి
విగతమాంసమగుచుఁ ♦ దగఁ దృణంబు
[2]భంగి నుండ విసరి♦వైచితి వావాలి
మిగుల నలసియుండి ♦ మించుబలిమి. ౮౭ 438

క. తనకాలం జిమ్మెను నీ, వన సంతోషమునఁగూడి ♦ పాదాంగుష్ఠం
బున నెగఁజిమ్మితి విందునఁ, గనజాల నీబలంబె ♦ ఘనమో? కాదో?. ౮౮

క. ఇరువురబలముల తెఱఁగుల, వరుస న్నేనిర్ణయింప♦వలనుపడదు; భూ
వర! యార్ద్రము శుష్కంబనఁ, బరఁగెడు కారణమెయొక్క♦పరితలఁచిన చోన్.

తే. తారతమ్యము గలదిగాఁ ♦ దనరుఁ గాన
మీబలంబులయం దేది ♦ మించు నేది
తగ్గు నద్దాని నెఱుఁగ నిం♦తకును గాన
ముందు గలిగినసందియ♦ము విడ కుండు. ౮౯ 441

చ. శరమొకఁ డంది యిప్పు డొక♦సాలమహీరుహమున్ బలంబునన్
ధరణిఁబడంగ నేయుము ని♦తాంతము నాకు బలాబలంబు లీ
తరుణమునందుఁ దేటపడు♦దంతికరాయతమైన యీధను
ర్వరమును నెక్కుపెట్టి రఘు♦రామ! భవద్బల మొప్పునట్లుగన్. ౯౦ 442

---

1 యది నప్రత్యయోస్మాసు-అనిమూలము. అస్మచ్ఛబ్దము ప్రయోగించుటంబట్టి యిట "మా శౌర్య మ్మ"ని తెనిఁగింపఁబడినదని యెఱుంగునది. 2 పరిశ్రాంతేన మత్తేన భ్రామితాం మే వాలినా తదా-అనిమూ.

మ. శ్రుతిపర్యంతము లాగి భూరిశరముల్ ♦ యూథంబుగా వైవుమా:
క్షితినాథేంద్రకుమార! నీవిట్టు ప్రయో♦గింపంగ సాహించు న
ద్భుతమా బాణము సాలవృక్షమును వే ♦ ధాత్రిం బడంజేయున
ప్రతిమంబౌటను సంశయంబు గలదే ♦ భావింప నేమాత్రముల్. ౯౧౪ 443

సీ. మరల నెందులకు న♦మ్మకము పుట్టింపఁగంచని యెంచవలదు మ♦హాత్మ! నాకు
సంతోషమునకె యీ♦సారి ప్రార్థించితి నినుఁ బరీక్షింపఁగ ♦ నేఁ దలంచి
కాదు; నిశ్చయమిది ♦ కడుఁ బూన్కి నిట్లని యొట్టుపెట్టెద నీకు ♦ నుర్వియందుఁ
గాంతిదాతులయందుఁ ♦ గమలమిత్త్రుండును నద్రివర్యముల హి♦మాద్రి వాల్గు

తే. కాళ్లజంతువులందు సిం♦గంబుమేటి
యైనవిధమున విక్రమ ♦ మలరునరుల
యందు నీవె వరిష్ఠుండ ♦ వగుదు వనుచుఁ
బలికెఁ దనపూన్కి నెఱవేర్పఁ ♦ దలఁచి యంత. ౯౨ 444

పదునొకండవ సర్గము సంపూర్ణము.

---

## ౧౨ - వ సర్గము.

### రాముఁడు సప్తసాలముల భేదించుట.

క. గురుతేజుఁడు రాముఁడు కపి, వరుపల్కుల నాలకించి ♦ ప్రత్యయము హృదం
తరమున నతనికిఁ గల్గఁగ, శరాసనము కై గ్రహించె ♦ సరభస మొప్పన్. ౧

తే. మానదుండగు రఘుకుల♦మండనుండు
ఘోరసాయక మొక్కండు ♦ కూర్చి చాప
మందు జ్యానాదమున దిక్కు♦లద్రువ సాల
వృక్షమును లక్ష్యముగఁ జేసి ♦ యేసె దాని. ౨ 446

క. బలవంతుఁడైన రాముం, డలసాలము నొక్కదాని ♦ నరసి ప్రయోగిం
ప లలితకనకాంచితమా, బలుసాయక మద్ది వేగ ♦ పరుగిడి లీలన్. ౩౪ 447

సీ. ఏడుసాలంబుల ♦ నిలఁ ద్రెళ్ల భేదించి యాకొండ నెత్తమ్ము♦నందుఁ దూఱి
ధరణిఁ జొచ్చెను; నిట్లు ♦ ధాత్రిభేదించిన యాబాణ మతివేగ ♦ మలరుచున్న
యది గాన క్షణమున♦నందుండి యరుదెంచిమునుపటివలెఁ దూణ♦మునను జొచ్చె;
వానరపతి రఘు♦వరుబాణజవమున నేడుసాలంబు లి♦ట్లిలను బడుటఁ

తే. గాంచి గురువిస్మయంబును ♦ గాంచె; నంతఁ
బరమసంతుష్టుఁడై కపి♦ప్రభువు రాఘ
వునకుఁ జేమోడ్చిఁ గేలించి ♦ తనశిరంబు
[1]ధరణిసోఁక ఁ వ్రేలాడు నా♦భరణములను. ౬ 448

---

1 ప్రలంబీకృతభూషణః-అనిమూలము.

క. అరుదెంచుచు భక్తి నమ,స్కరణము గావించె; నట్టి♦కార్యమునకు హ
ర్షరతిం గని ధర్మజ్ఞుఁడు, పరసర్వాస్త్రవిదుఁడగుచు ♦ వఱలెడు రాము౯. ౪౯

తే. శూరుఁడటు నిలుచుండఁగఁ ♦ జూచి యిట్లు
పలికెఁ బురుషర్షభా! దేవ♦వరులతోడ
వాసవుం డెత్తివచ్చినఁ ♦ బ్రథనమందు
బాణములఁ గూల్పఁ దగుదువు ♦ వాలి యెంత. ౫ 450

క. శరమున నొక్కట సాలో, త్కరమును బర్వతము భూమిఁ ♦ గడులీలను ని
ర్భరశక్తి౯ భేదించితి, వరయఁగ నీయెదుట నెవ్వఁ♦డని నిల్చు నిఁక౯. ౬ 451

క. పురుహూతసలిలపతులకు, సరియగు నిను సుహృదుఁ బొందఁ♦జాలితిఁ గాన౯
ద్వరగా నావెతదీఱెను, నిరుపమసంప్రీతి యెసఁగె ♦ నిక్కము రామా!. ౧౦

క. విను తోఁబుట్టువు రూపం,బునఁ దగు నావైరి నింద్ర♦పుత్త్రుని నిపుడే
యనఘా చంపుముకైమోడ్పునఁ గొనుమిదె యనుచు వగలఁ♦బొగులుచుఁ బలుక౯.

క. వినియంత మహాప్రాజ్ఞుం, డనఘుం డగు రామచంద్రుఁ ♦ డనుజహితముగాఁ
దనమిత్త్రు రవిసుతు౯ జ,య్యనఁ గౌఁగిటఁ జేర్చి యిట్టు♦లనియెం బ్రీతి౯. ౧౩

సీ. ఇక్కడనుండియే ♦ యిపుడె కిష్కింధకుఁ జనుదము ముందు వే♦చనుము నీవు
చని సహోదరు నేఁచు♦శతముఖనందను వాలిని బిల్వుమా ♦ బవరమునకు
ననియె; నంతట వార♦లందఱు కిష్కింధ కతిజవంబునఁ బోయి♦యందునొక్క
గహనవనంబున ♦ క్ష్మారుహాంతరమునఁ గనఁబడకుండి; రం♦త నినపుత్త్రుఁ

తే. డంబరము గట్టిగాఁగ మ♦ధ్యమునఁ జుట్టి
పౌరుషమ్మున వాలిఁ బి♦ల్వంగఁ గడుర
వమున నంబర మొయ్యనఁ ♦ బగులునట్లు
భయదముగ నార్చె; నట మహా♦బలుఁడు వాలి. 455

చ. అనుజుని ఘోరరావమును ♦ నంతటఁ గ్రోధము మీఱుచుండఁగా
విని జవమొప్ప నాత్మపురి ♦ వెల్వడి వచ్చెను జెంతనే మృతిం
గనఁదగు కారణంబునను ♦ గంజహితుండెటు లస్తశైల మె
య్యన విడివచ్చులాగున మ♦హత్తరసంగరకాంక్ష పొంగఁగ౯. ౧౬ 456

### వాలి సుగ్రీవుల మొదటియుద్ధము.

క. అంతట దివి కుజబుధు,లత్యంతము పోరాడునట్టు ♦ లవ్వాలియు ని
శ్చింతమతియైన ఛాయా,కాంతునిపుత్త్రుండు పోరఁ♦గాఁ దొడఁగి రని౯. ౧౭

స్రగ్ధర. భ్రాతృద్వంద్వంబు తీవ్ర♦ప్రబలతరరుష౯ ♦ బౌరుషం బొప్పఁ బూన్కిం
జేతస్సుల్ పెంపుమీఱ౯ ♦ శితపవిసమముష్టిప్రచారంబు లొప్ప౯
భీతిం గల్పించు మేలౌ ♦ పిడుగులవలెనే ♦ వీరతం దెల్పనౌ కై
ఘాతంబుల్ ప్రాలఁగా సం♦గరము నొనరిచె౯ ♦ గర్వముం బూని మించ౯.

చ. కని యట రాఘవుండు కర♦కంజమునన్ విలుఁ దాల్చి, వీరులై
తనరెడువార లిద్దఱు ని♦తాంతము నశ్విసమానరూపులై
కనఁబడ వీఁడు సూర్యజుఁడు ♦ కాఁదగుఁదోఁదగు నింద్రజుం డటం
చును గుఱుతింపఁజాలమిని ♦ జూచుచునుండెను గృత్యమెంచుచున్. ౧౯

ఆ. అంతెకాని పగఱ ♦ ననువుల నెడఁబాపు, శరము విడువఁడయ్యె ♦ సంశయమున
నిట్లు శంకనొంది ♦ యిట రాఘవుం డుండ, నచట సూర్యతనయుఁ♦డన్నచేత.

క. పలుభంగుల భంగముఁ గని, యిలఁ దనకున్ రక్షకుఁడగు ♦ నినకులజుని నేఁ
దలఁపక చూడక తనదగు, నెలవునకుం బాఱె; మేను ♦ నెత్తుటఁ దడియన్.

సీ. అలసి దెబ్బలచేత ♦ నంగమెల్లను వాయఁ దనవెంటవాలి క్రో♦ధమునఁ దఱుము
కొనిరా మతంగుని♦వనమును జొచ్చెను; దేజంబు నిండారఁ ♦ దేజరిల్లు
వాలియు మునిశాప♦భయమున కలుకుచుఁ దమ్ముఁ డెవ్వనిఁ జేరఁ ♦ దాను నోరి
తప్పించుకొంటి వీ♦తరుణమునన్ మృతినుండి యంచని పల్కి ♦ యూరికేఁగె;

ఆ. నంత రాఘవుండు ♦ ననుజుండు హనుమంతుఁ, డాతురమున వెంట♦నరుగుదేరఁ
గపివరుండు చనిన♦కడకె పోయిరి సుమి,త్రాత్మజుండు రాముఁ ♦ డరుగుదేర.

క. కని సుగ్రీవుఁడు సిగ్గును, గని నేలం గనుచు దీన♦కరణిం బలికెన్;
విను రామా! నీవిక్రమ,మును నాకుం జూపి యుద్ధ♦మున కవ్వాలిన్. ౨౫

క. పిలువుము! యని నాతోడం, బలికి ననున్ వాలిచేతఁ ♦ బలుభంగులుగా
నిలఁబడఁ గొట్టించితివే, పలుకుము నీవేమిచేయ ♦ పాంపించితివో!. ౨౬ 464

క. నినుఁ బ్రతిమాలినయప్పుడె, యని వాలిని నేను జంప♦నని సత్యముగాఁ
గనె చెప్పియుండఁదగుఁగద, చనకుందును గాదె యట్లు ♦ సలిపియె యున్నన్.

సీ. అనుచు మహాత్ముఁ డా♦యార్కియుఁ గరుణముగా దీనవాక్కులఁ♦గలఁగుమదిని
బల్కుచుండఁగ రఘు♦వర్యుఁ డాతనితోడఁ బలికె నిట్లని: కపి♦వర్య! వినుము
బాణమ్ము నేనట ♦ వదలనికారణంబును జెప్పెదను రోష♦మును విడువుము
గమనవేషప్రమా♦ణముల నలంకారమున నీవు వాలియుఁ♦గనఁగ నొక్క

తే. భంగి నున్నార లిరువుర ♦ వాని యెఱుఁగఁ
జాలనట్లుగ; వర్చస్సు ♦ స్వరము చూడ్కి
విక్రమము వాక్కు నని యెడ♦వీనియందు
భేదమింతయు నగపడ♦లేదు నాకు. ౩౧ 466

క. కనుకనె మీయిద్దఱకును, ననువు లోకవిధంబుగానె ♦ తనరుట మిగులం
గని నేను మోసపోతిని, విను మిక్కారణముచేత ♦ విశిఖముఁ గొనియున్. ౩౫

సీ. మనకు నిద్దఱకును ♦ మైత్రియటుండఁగా మూలఘాతమెయగు ♦ నోలినట్లు
కాకుండుఁ గాకని ♦ భీకరంబై మహావేగవంతంబయి ♦ విమతనాశ

---

* క్రోధశ్చ వ్యపనీయతామ్-అనిమూలము.

కరమయి ప్రాణాంత♦కరమును నగుబాణమును బ్రయోగింపఁగఁ ♦ బూనన్నైతి
నింతియకాని యిం♦కేమియు లేదు సూ! హరివర్య! నాదగు ♦ నజ్ఞతను ద

తే. గంగ లాఘవమునను నీ♦సంగరమున, నేదియే నీకు నాపద ♦ యించుకేని
సంభవించునయేని నీ♦జగమునందు, [1]నాదుబాల్యముమాఢ్యము♦పైఁదగులదె.

క. విను మెవని కభయదానం,బును జేసితి మతని మృతిని♦బొందించుట యిం
తనరానిపాపమని సజ్జనులందురు; నే నితండు ♦ జనకాత్మజయున్. ౩౫ 469

క. అనయమ్ము నీయధీనుల, మని యెఱుఁగుము కాన నిందు ♦ హరివర! మాక
న్నను నీవె శరణ మటుకా,వున మరలం బోయి వాస♦వుని సుతుతోడన్. ౩౬

చ. అని యొనరింపు నాపయిని ♦ నాత్మను సంశయ ముంపఁబోకు; నా
తని నొకసాయకంబుననె ♦ ధాత్రిపయిం బొరలాడఁ జేసెదన్
గను మొకరీతి నిత్తఱినె ♦ క్రమ్మఱఁ జేసెదు యుద్ధమందు ని
న్ననునటు లెద్దియే గుఱుతు♦గా ధరియింపుము వానరేశ్వరా!. ౩౭ 471

క. అనుజా! సౌమిత్రీ! చెం,తనె పూచిన రమ్యమగు ల♦తన్ గజపుష్పిన్
గొని యీమహాత్ముకంఠం,బున వేయుము! విజయ మబ్బుఁ♦బో యద్దానన్.

చ. అనవిని లక్ష్మణుం డవుడె ♦ యద్రితటంబునఁ బుట్టి చక్కఁబూ
చిన గజపుష్పికం బెఱికి ♦ సిద్ధము మేలని తద్గళంబునం
దునిచెను తానిచే సిరుల ♦ నొప్పెడు నారవిసూనుఁ డాలతన్
దనగళమందుఁ దాల్చి రవి♦తారలమాలిక యావరింప నె
ట్లనువుగ వెల్గు నప్పగిది ♦ నప్పుడు భాసిలెఁ జూడ నొప్పుచున్. ౪౧ 473

తే. దాన సాంధ్యాంబుదము క్రౌంచ♦తతి వెలింగి
నట్లు మేను ప్రకాశింప ♦ నారఘువరు
పల్కులం జిత్తధైర్యము ♦ వఱల నతని
వెనుకఁ దాఁ బోయెఁ గిష్కింధ♦కును జవమున. ౪౨ 474

పండ్రెండవ సర్గము సంపూర్ణము.

---

## ౧౩ - వ సర్గము.

ద్వితీయయుద్ధమునకై రామాదులు కిష్కింధ కరుగుట.

క. సురపతిసుతపాలితమగు, పురికిం ధర్మాత్ముఁడగుచుఁ ♦ బొలుచు రఘువరుం
డురుగతిఁ బోయెను వానర, వరుఁడుం దనవెంట రాఁగ ♦ బలశౌర్యములన్. ౧

చ. కనకవిభూషితంబయిన ♦ కార్ముకవర్యముఁ గేలనంది సూ
[2]ర్యునివలెఁ దేజరిల్లుచును ♦ యుద్ధమునన్ జయమీయఁజాలు బా

---

1 మాఢ్యంచ మమబాల్యంచ ఖ్యాపితం స్యాద్ధరీశ్వర - అనిమూలము. 2 గృహీత్వా ధను
ష్పాధకాన్-అనిమూలము.

ణాసిచయముఁ గ్రహించి రఘునాథుఁడు పోవఁగ సమ్మహాత్మ్యముం
దనుపమకాంతుఁ డైనతన నాత్మజుఁ డాతని వెంటనంటుచున్. ౭౬ 476

క. బలశాలి లక్ష్మణుఁడు న,త్యుజ్జ్వలతేజుఁడు వెడలె; దంత బలుపిడుగై
వెలయు హనుమంతుఁ డల్లే, నలనీలులు వానరాధినాథుం డరుగన్. ౭౭

క. గురుతేజుఁడు నగుతారుఁడు, పరమప్రమదమున రామభద్రుని వెనుకన్
నిరుపమవిక్రమములఁ బోయిరి; [1]వారలు పూలగుత్తు లెసఁగు తరువులన్.

చ. కనుఁగొనుచున్ బ్రసన్నతరకాండములై జలరాశిఁ బొందఁ బెం
పునఁ దగునత్తరంగిణుల భూరిగృహంబులరీతి నొప్పుచుం
గనఁబడుకందరంబులను ధార్ధరసంగతిని భూధ్రరంధ్రరా
జిని దనుయంతనేర్పడిన చిత్రగుహాళిని గూటసంతతిన్. ౭౯ 479

సీ. కనుఁగొన నింపుగాఁ గ్రాలుగుహావిశేషంబుల గాంచుచుఁ జనిరి; మఱియు
వైడూర్యములవలె వఱలుపత్త్రంబులఁ గొమరొందు యాకోశకుట్మలముల
నలరుపద్మంబుల నందంబుఁగుల్కెడు సలిలపూర్ణతటాకసముదయములఁ
గారండవంబుల సారసంబుల హంస జలకుక్కుటంబులఁ జక్రవాక

తే. ములను బహువిధజలపత్త్రులను గూయు
వానిఁ గాంచుచుఁ బోయిరి వారు మఱియు;
లేఁతపచ్చిక మేయుచు భీతిలేక
వనములందెల్లఁ దిరుగుచు వఱలువాని. ౮౦ 480

క. నిలువంబడి యిచ్ఛాగతి, నలుఁగడలం జూచెడుహరిణంబులఁ గనుచున్
జెలఁగుచుఁ జనుచున్ మఱియును,బలమునభీతిదములగుచు భయరహితములై.

సీ. వనతటాకములకు వైరులై శుక్లదంతవిభూషితంబులై తటములెల్లఁ [గు
గూలునట్లుగ స్వేచ్ఛఁ గోరాడుచునుముదంబులమీఱి యొంటిగాఁ బొలిచితిరు
చును శైలతటములఁ గనుఁగొని డాయుచు జంగమాద్రులవలె జలదములవి
ధంబున నొప్పుచు ధరణిపరాగంబునను బ్రుంగియున్నట్టి వనగజముల

తే. వనచరములగు నన్యమృగనికరముల
నంబరంబునఁ దిరుగువిహంగమములఁ
గనుచుఁ ద్వరపడిపోయి; రాకపివరేణ్యు
వెంట హనుమన్ముఖులు మహావిక్రమములు. ౮౨ 482

క. చనుచున్నతఱిని దశరథ, తనయుఁడు తరుపుంజముల నితాంతము బెడఁగై
కనఁబడువనముం గని యి, ట్లనియెన్ సుగ్రీవుతోడ నాశ్చర్యమునన్. ౮౩

చ. ఘనతతినావిశాలమయి కమ్రతరంబయి యగ్రభాగమం
దనుపమరీతిఁగా నరటు లందముగాఁ గనుపట్ట వెల్గునీ

---

1 పుష్పభారావలంబినః-అనిమూలము.

వనమిది మేఘ మభ్రమున ♦ భాసిలునట్లు వెలుంగుచున్న దీ
వనముతెఱంగు నే వినఁగ ♦ వాంఛను గాంచితి మిత్రమా! యిఁకన్. ౧౮౪

క. కోరిక దీనిం దీర్పుము, నేరుపునన్ వానరేంద్ర! ♦ నీవిపుడన్నన్,
శ్రీరామువాక్యమును విని, తా రయమునఁ జనుచుఁ బలికెఁ ♦ దద్వనవార్తన్.

సీ. ఇది యొకయాశ్రమ ♦ మిది విశాలంబయి శ్రమములఁ బోఁగొట్టఁ♦జాలియుండు
నుద్యానవనముల ♦ నొప్పుచు సుస్వాదుమూలఫలోదకం♦బులఁ జెలంగు;
*మును సప్తజను లను♦మును లేఁడుగురు నియతవ్రతంబులఁ దమ♦తలలఁ గ్రిందు
గా నిల్పి నియతంబు♦గా జలంబులనుండి తపముచేయుచు నుంద్రు♦తన్మునులిట

తే. సప్తరాత్రములకు నొక్క♦సారి ప్రాన్కి
వాయు వాహారముగఁ గొని ♦ వరుస సప్త
శతశరత్తులు తపమును ♦ సల్పి తనుయు
తులయి స్వర్గమునొంది రో♦యలఘుశౌర్య!. ౧౯ 486

చ. వినుమిటు సుప్రభావముని♦విసుల యాశ్రమ మిద్ది భూమిరు
ట్ఘనతరసాల మొప్పు సుర♦కాంతుఁడు దేవతలెత్తివచ్చినన్
దను నెదిరింపరానిగతి ♦ ధాత్రిఁ జెలంగును; బక్షిజాలముల్
వనమున నున్నయన్యమృగ♦వారములోనికిఁ బోవకుండెడున్. ౨౦౹ 487

ఆ. ఏవియేనిదెలియ ♦ కివ్వనంబును జొచ్చు
మరలిరావు సుమ్ము ♦ మ్రందునందె
యాశ్రమమున నిందు ♦ నాడు నచ్చరల యా
భరణరవములు వినఁ♦బడును రామ. ౨౧౹ 488

క. అమలాత్మరగీతధ్వను, లమలతరస్వాదువాద్య♦హారిధ్వనులే
సమయమునను వినఁగాఁబడు, సుమహితగంధంబు వెలయుఁ♦జుమ్ము రఘువరా!.

క. త్రేతాగ్నులు భాసిలు నిట, నేతపుణమునందునైన ♦ నిందులకుఁ దగన్
హేతువుగా నీధూమము, నీతరువుల కొసలనల్లి ♦ యిదె కనఁబడెడిన్. ౨౨౹

ఆ ఇది కపోతదేహ ♦ మెట్టులో యట్లెట్టి
నగుచుఁ గానఁబడెడు ♦ నతినిబిడము
గాఁగ; వృక్షము లివి ♦ కడు ధూమసంసక్త
శీర్షములయి యెపుడు ♦ చెలఁగుచుంట. ౨౩౹ 491

క. ఘనతతిచేఁ గప్పంబడి, కనఁబడువై దూర్యగిరుల♦కై వడి నివిగో
తనరారెడు ధర్మాత్మా, యనుజుఁడు నీవును దమిం బ్ర♦యతచిత్తులరై. ౨౪౹

చ. మనముల నెద్దియే ఫలము ♦ మానక గోరుచు వందనంబు ల
మ్మునులగుఱించి చేయుఁ డల♦ముఖ్యమునీంద్రులు భావితాత్మలౌ

* అత్రసప్తజనా నామ మునయ స్సంశ్రితవ్రతాః-అనిమూలము.

టను నెవ రమ్మహాత్ములయె♦కర్ దమి భక్తియు నష్టలంగ వం
దనములు చేయువారొ యల♦ధన్యుల యంగములందు రాఘవా!. ౨౫.

తే. వ్యాధిమొదలగుబాధ లె♦వ్వైన నించు
కంతయును నంటఁజాలవు; ♦ సంతసమున
వందనము చేయుమా! యన ♦ భక్తి నంత
ననుజునిం గూడి రాఘవుఁ ♦ డాదరమున. ౨౬. 494

క. అనఘాత్ములైన యలమునిఁ, వనజాప్తులఁ గూర్చి మదిని ♦ వారిమహిమముల్
గనుచున్ వందనమిడెఁ గర,వనజంబుల మోడ్చి; యంతఁ ♦ బార్థివసుతియున్.

చ. అనుజుఁడు వానరేంద్ర పవ♦నాత్మజముఖ్యులు వెంటరాఁగఁబో
యెను బరమప్రమోదమున ♦ నెంతయుఁ జిత్తము పల్లవింప, న
మ్మునుల వనంబునుండి జవ♦మంద దగ దూరముపోయి యింద్రనం
దనపరిపాలితంబగుచుఁ ♦ దార్కొనరాక చెలంగుదానినిన్. ౨౭. 496

క. పురవర మనఁబడుదానిన్, వరమహిమను నొప్పుదాని ♦ భవ్యమనముల్
బరికించి రెల్ల రంతటఁ, ద్వరపడి రాముండు నతని♦తమ్ముఁడు పూన్కిన్, ౨౮.

చ. వనజహితాత్మజుండు మఱి ♦ వానరులున్ సరిలేని తేజముల్
గనఁబడశస్త్రముల్ గొనుచుఁ ♦ గ్రాలెడు శత్రువధార్థ మింద్రనం
దనపరమప్రతాపమునఁ ♦ దద్దయుఁ బాలితమైన పత్తనం
బును గని యేకకాలమునఁ ♦ బోయిరి చేరఁగఁ బూన్కి మీఱఁగన్. ౩౦ 498

పదమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౧౪ - వ సర్గము.

రాముఁడు సుగ్రీవుని భయము పోవునట్లు పల్కుట.

చ. చనియిటు వారలందఱును ♦ శక్రసుతుప్రియపాలితంబుగాఁ
దనరు పురంబుఁజేరి యటఁ ♦ దమ్మెవరైనను జూడకుండ నొ
ప్పినవనమందు దట్టమగు♦వృక్షసమూహముచెంతనుండి; రా
వనములయందుఁ బ్రీతిపగ ♦ భవ్యగళుండగు నర్కజుం డొగిన్. ౧. 499

క. వనమున నాలుగుదెసలం, దనచూడ్కి నిగుడ్చి తగఁ గ్రు♦ధం బూనెను నం
త నతఁడు హనుమత్ప్రముఖులు, వనచరులెల్లరును జుట్టు ♦ బలసి కొలువఁగన్.

సీ. అనిలవేగపురస్స♦రాయతమేఘమ ట్లభ్రము భేదించు♦నట్లు సింహ
నాదమొనర్చు చ♦న్నను యుద్ధమును జేయ వెడలి రమ్మనిపూన్కిఁ♦బిలిచె;నంత
బాలార్కతుల్యుఁడై ♦ భాసిల్లి దృప్తసింహాగతి యై తగినట్టి ♦ యర్కజుండు
కార్యదక్షుండగు ♦ క్ష్మాపతి శ్రీరాముఁ గని పల్కె; వాలిన♦గరమునకును

తే. వచ్చితిమినుమ్ము హరిబృంద♦వాగురముల
భయదమై తప్తమగుభవ్య♦భర్మతోర
ణాంచితంబయి ధ్వజముల♦యంత్రములను
దట్టమై యున్న దియ్యది ♦ దస్యుహారము. ౫॥ 501

క. మును నీవు వాలిఁ జంపుదు, నని శపథ మొనర్చితివి మ♦హావీరా! చ
క్కనికాలము లతనువలెఁ, మునుపటిశపథమును జేయు♦ము ఫలయుతముగఁ.

చ. అనవిని ధర్మచిత్తుఁడగు ♦ నయ్యరిసూదనుఁ డారఘూత్వహుం
డినజునిఁ గాంచి యిట్లనియె ♦ నిప్పుడె యీగజపుష్పియఁ లతఁ
ఘనుఁడగులక్ష్మణుండు నినుఁ ♦ గన్గొనఁగాఁ బెకలించితెచ్చి వై
చెనుగద! నీగళమ్మునను ♦ శీఘ్రమ నిన్గుఱుతింప నో నిఁకఁ. ౮॥ 503

సీ. వీరోత్తమా! నీవు ♦ విమలకంఠంబున గజపుష్పిలతను జ♦క్కఁగ ధరించి
[1]యాకాశమునఁ దార♦కాయతమాలికా విపరీతసూర్యుని♦విధముగాఁగ
భాసిల్లుచున్నావు ♦ బాగుగ సుగ్రీవ! వాలివలన నీకుఁ ♦ బ్రాప్తమైన
భయమును నీయందు ♦ వాలికిఁ గల్గిన వైరము నేనిప్డు ♦ బవరమందు

తే. నొక్కశరమునఁ దీర్తు స♦హోదరాక్ష
తిని జెలంగెడు నీశత్రు♦వును మదక్షి
గోచరునిఁ జేయు మప్పుడే ♦ కూలి యతఁడు
పాంసువేష్టితుఁ డగుఁజుమ్ము ♦ వనమున నిట. ౧౧॥ 504

చ. వనమున నిందు నాయెదుట ♦ వాలి కనంబడి ప్రాణయుక్తుఁడై
చనునటు సంభవించినను ♦ సత్వరమే యరుదెంచి దోషినా
ననుఁ దగ నిందచేయు హరి♦నందనుఁ డాతఁడు ప్రాణయుక్తిఁ బ
త్తనమున కేగకుండిన ని♦తాంత మదోషిగ నన్నునెంచి నే
మనకుము; సప్తసాలముల ♦ నప్పుడు నేనొకబాణమేసియే. ౧౨॥ 505

తే. చీల్చినది నీకుఁ బ్రత్యక్ష♦సిద్ధమెకద!, యబ్బలంబుననే వాలి ♦ నని వధించి
నాఁడనే యంచుఁ దెలిసికొ♦నం దగుఁ జుము, కష్ట మెట్టిది వచ్చినఁ♦గాని నేను.

[2]చ. అనృతము పూర్వమెట్టిసమ♦యంబున నైనను ధర్మలోపభీ
తిని బలుకంగలే దిఁకను ♦ దెంపునఁ బల్కను జుమ్ము భూమిమొ
ల్చిన నవసస్యముం దమిని ♦ జిష్ణుఁడు వర్షముచే ఫలింపఁజే
యునటుల నాప్రతిజ్ఞ నిపు ♦ డుగ్రపరాక్రమ మొప్పుచుండఁగాఁ. ౧౫॥ 507

---

1 ఇట "విపరీత ఇ వాకాశే సూర్యో నక్షత్రమాలయా-అని మూలము. ఇందలి యర్థవిశేషములన్నియు విపరీతపదమునుండి యేర్పడినవిగా నెఱుంగునది. 2 అనృతం నోక్తపూర్వం మే-అనియూ. ఈ రామోక్తియే రామాయణమునుండి నిరంతరము స్మరించి నేర్చుకొనఁదగినది. శ్రీరామున్పుత్తము సర్వోత్తమ మనుట కిదియే ప్రధానము.

క. ఫలవంతముఁ గావింతు వ, కలుషా! సంభ్రమము; నీశ♦ధాత్రీవర! యి
మ్ముల నాకాంచనమాలిని, బిలువఁగ నేలాటికిన్వీరి ♦ వే యొనరింపన్. ౧౬

క. ఆవాలి వచ్చునో యా, రావము గావింపు మిఁక న♦రాతిభయదుఁడై
యేవేళల విజయఫలం, బావహిలన్ జలము వెలయ ♦ నతఁ డొప్పుఁగదా.

చ. అనియన మోదనుందు మును ♦ నాతనినీవును మాఱుకొంటి నం
దున నతఁ డాగ్రహంబునను ♦ దోడనె నీస్వన మాలకించినం
తనె పయికేఁగుదెంచు; విను ♦ ధాత్రిని శూరులు శత్రుధర్షణం
బును సమరంబునం గొనరు ♦ వో; నుఱి స్వీయపరాక్రమంబు నె
మ్మనమున నెక్కుడంచుఁ బలు♦మాఱు తలంతురు వారలింకనన్. ౧౮ 510

చ. వనితలచెంగటన్ మెలఁగు♦వారలెవ్వైన సహింపలేరు; నా
[1]విని కనకంబుభంగిగను ♦ బింగళవర్ణము పెంపుమీఱఁ గీ
శనిచయనాయకుండును వి♦శాలరవంబున నభ్రముం బగు
ల్పను దలపోయునట్లఱచె; ♦ ధ్వానమదుజ్జ్వలమై చెలంగఁగన్. ౧౯ 511

సీ. నృపతియాజ్ఞయె లేమి ♦ నేమిఁడి యనువారు లేకుండుటను భీతి♦లేక పరపు
రుషులెల్ల స్వేచ్ఛఁ ది♦రుగుచుఁ గులస్త్రీల నెఱికురులను లాగు♦తఱిని వారు
పోదగుస్థలికిని ♦ బోలేక యాకులపడునట్లు సుగ్రీవు♦ధ్వనికి గోవు
లెల్లను బెదరుచు ♦ నుల్లము లుత్కఁబడ ముఖకాంతిచన దుఃఖ♦మునఁ గలంగె

తే. ననిసి భగ్నాంగములయిన ♦ హాయములట్లు
మృగములెల్లను వే పరు♦గెత్తఁజాల
[2]వయ్యె గతపుణ్యపూరుషు ♦ లంబరమున
నుండి పడునట్లు పతగంబు ♦ లుర్విఁ బడియె. ౨౦ 512

చ. అనిలవిచంచలోర్మియగు ♦ నబ్ధివిధంబున నార్చి విక్రముం
బున నురుతేజమొప్ప స్వన♦ముం బొనరింపఁగ నేర్పుకాఁడె కా
వున జలదవ్రజంబులటు ♦ భూరిరవంబున నెల్లరుం భయం
బును గనునట్లు చేసి రవి♦పుత్త్రుఁడు పొల్చెను సంతనంబునన్. ౨౧ 513

పదునాల్గవ సర్గము సంపూర్ణము.

---

1 సుగ్రీవో హేమపింగళః-అనిమూలము. 2 క్షీణపుణ్యా ఇవ గ్రహాః-అనిమూలము. ఇట గ్రహశబ్దమునకుఁ బూరుషులని యర్థము చెప్పవలయు. గ్రహములు కొంతకాలము నభంబునుండి భూపతితు లగుట యసంభవము గావునను, పుణ్యము క్షీణింపఁగాఁ బ్రాణులు భూపతితులగుట ప్రత్యక్ష మగుటయుఁ గారణములుగా నీయర్థము సుసంగతమే.

## ౧౫ - వ సర్గము.

—వాలి యుద్ధమునకుఁ బోవఁ బ్రయత్నింపఁ దార హితము చెప్పుట.—

చ. అనుజుఁడు ధైర్యమొప్ప నటు♦లార్చిన యాపెనునాదముల్ ముదం
బునఁ దనకాంతలం గలిసి ♦ పొల్చెడునంతిపురంబునందు నుం
డినయలవాలి యప్పుడు క♦డిందిమగంటిమిఁ బొల్చువాఁడుగా
వున సహియింపలేక విని ♦ భూతలముల్ వడకించు నాధ్వనిన్. ౧ 514

క. వినినంతనె యొకసారిగ, ననంగమదమెల్లఁబోయె ♦ నతిశయకోపం
బును గాంచె నతనిమది; యంత నతఁడుకోపమునఁదనదు♦నయనములొకటన్.

తే. ఎఱ్ఱఁబాఱఁగ సంధ్యయం ♦ దెట్టియాత
పము చెలంగునొ యట్టిదై ♦ పరఁగుకాంతి
తనువునన్ మించ నప్పుడ♦తండు రాహు
వట్టె గ్రసియింపనున్నట్టి ♦ యర్కురీతి. 3 516

సీ. కాంతిహీనుండయ్యెఁ ♦ గడుఁగ్రోధమునవాలిదంష్ట్రికరాళుఁడై ♦తగ జ్వలించు
నగ్నివిధంబున ♦ నంగము వెలయంగ మదగజోత్పాటిత♦మంజుపంక
జములతోడను మృణా♦ళములతోడనునొప్పుహ్రదమట్లువెలసె;ని♦ట్లనుజరవము
శూరునకెంతయు ♦ నోరువరాకుండుఁ గావున వాలి వే♦గమున భూమిఁ

ఆ. బగులఁ గొట్టురీతిఁ ♦ బదముల నిడుచు యు
ద్ధమున కేగుచుండెఁ ♦ దార యపుడు
భయమునొంది త్వరగఁ ♦ బరుగిడి నెమ్మి న
తనిని గౌఁగిలించు♦కొని దృఢముగ. ౪ 517

క. మదిఁ గలసౌహృదమటు ల, య్యదనునఁ గన్పడఁగ ముందు ♦ నధికశుభంబే
పొదలఁగఁ జేసెడుపల్కుల, మదిరాక్షియుఁ బల్కె నిట్లు;♦మహితోత్సాహా!.

[1]క. వినుము నదీవేగమువలె, ననివార్యంబగుచు వృద్ధి♦యగునీక్రోధం
బును వేకువ శయనస్థల,మునుండి లేచుచును భుక్త♦ముల్ బూమాలన్. 2

ఆ. విసరివైచునట్లు ♦ విడువుమా; నిశ్శంక,ముగను; ననుజుతోడఁ ♦ దగసమరము
జేయఁగోర్కె నీకుఁ ♦ జిత్తమునం గల,దేని రేపు పోరు ♦ మిపుడు వలదు.

ఉ. వీరుఁడవౌట నీవిటుల ♦ విక్రమమొప్పఁగ రేపుయుద్ధముల్
గోరికఁజేయ లాఘవము ♦ గొబ్బునరాదు త్వదీయవైరికిన్
[2]గౌరవ మబ్బఁబోదు త్వర♦గా నిపుడేగుట నామనంబునం
దారయ మేలటంచు నిసు♦మంతయుఁ దోఁపఁగలేదు నాయకా!. ౮ 521

క. వలదని నేఁ జెప్పుటకుం, గలకారణమెల్ల వినుము ♦ కపివీరుఁడు నిన్
గలహమ్మునకున్ బూర్వము, పిలిచెను గద నీవు నపుడె ♦ పృథుకోపమునన్.

---

1 శయనాదుత్థితః కాల్యం త్యజ భుక్తామివ స్రజమ్-అనిమూ. 2 సహసా తవ నిష్క్రామో మమ తావన్న రోచతే-అనిమూ.

చ. వెలువడి యాతనిం గనుచు ♦ విక్రమమొప్పుచు నుండ నీవొగిం
దలపడి సంగరంబున ని♦తాంతము పైఁబడి శస్త్రి తోల దె
బ్బలు దిని దిక్కులం గనుచుఁ ♦ బాఱె నతం డిటు నిన్నుఁ జేరి యి
మ్ములఁ బెనుపీడనొంది యట ♦ ముష్టిహతుల్ తనువొవ్వఁజేయఁగన్. ౧౦

చ. చనియెనుగాదె యట్టికపి♦సత్తముఁడే మరలన్ జవంబునన్
నిను నని చేయఁగాఁ బిలువ ♦ నెమ్మిని వచ్చినజాడఁ జూడ నా
తనికి మహాసహాయము ని♦తాంతము గల్గెనొ యేమొ? యంచు నా
మనమున శంక గల్గెడిని ♦ మానక యింకొకమాటఁ జెప్పెదన్. ౧౧ 524

సీ. అతనినాదం బేను ♦ నాలకింపఁగఁ దోఁచె నతనిదర్పము ప్రయ♦త్నాతిశయము
ధ్వనియు నాటోపంబు ♦ దలపోయ నొకగొప్పకారణంబుండక♦గలుగఁదనుచు,
నిపుడిటవచ్చుట ♦ నెంచఁగా నాయకా! యతఁ డసహాయుఁడై ♦యరుగుదెంచె
నని తలంపఁగరాదు ♦ తనకు నమ్మికపుట్టునట్టి సహాయుమే ♦ యాశ్రయించి

ఆ. యున్నవాఁడు గాన ♦ నురుగర్జనములిట్లు, చేయుచున్నవాఁడు ♦ చెవుమ యెట్లు
పెనుసహాయ మతని♦కిని గల్గెనని నీకు, నెట్లు తెలిసెనందు♦వేమొ నీవు. ౧౩

క. ఆతఁడు స్వభావనిపుణుఁడు, చేతోగరిమంబు గలిగి ♦ చెలఁగును గానన్
ఈతఁడెసహాయబలమును, ఖ్యాతంబని నమ్మకుండ ♦ నతఁడెటువచ్చున్. ౧౪

క. ఊరక మదినూహించుచు, వీరా! యిటు పల్కలేదు ♦ వినుమా! మునుపే
యారసి కొడు కంగదుఁడే, కోరి ననుం గాంచి చెప్పెఁ ♦ గొంకక నేనున్.

క. వినియున్నదాన నీకున్, గన మేలొనఁగూర్చునదియుఁ ♦ గాన వచింతున్
మనపుత్త్రుం డీయంగదుఁ, డనయము చనినట్లె తా వి♦హారముచేయన్. ౧౫

క. వనమధ్యమునకుఁ జని వచ్చెను నచ్చట నాప్తులగుచుఁ ♦ జెలఁగెడుచారుల్
వినిపించినవార్తల నా,కును జెప్పెను విను; మయోధ్య♦కుం బ్రభు వగుచున్.

చ. నిరుపమశౌర్యసారుఁడయి ♦ నిర్జితశత్రువునైన భూమిభృ
ద్వరునకుఁ బుత్త్రులిద్దఱును ♦ బాహుపరాక్రమయుక్తులౌచు సం
గరమున నోటమిం గనక ♦ గ్రాలెడువారలు రామలక్ష్మణుల్
వరయశులై ప్రసిద్ధిఁగని ♦ వారలు పొల్తురు సాటిలేకయే. ౧౬ 530

సీ. ఇక్ష్వాకుకులమున ♦ నిరువురు పుట్టినవారు దురానదుల్ ♦ భాస్కరాత్మ
జునకుసాయముచేయఁ♦గనుఋశ్యమూకాద్రికరుదెంచినారఁట♦యందురాముఁ
డిప్డు నీతమ్మున♦కే సహాయముచేయువాఁడట, యాతఁ డీ♦వఱకె దనుజ
వరుల వధించుచుఁ ♦ బ్రఖ్యాతిఁ గన్నవాఁ డాయోధనమ్ముల♦యం దతండు

*తే. కర్కశుండయి పరబల♦కాండనాశ
నము నొనర్చి యుగాంతధ♦వంజయువలె

* రామః పరబలా మర్దీ యుగాంతాగ్నిరి వోత్థితః-అనిమూలము.

నప్రతిహతుండుగాఁ బొల్చి ♦ యనుపమాన
శౌర్యసాహసములఁ గన్న♦చతురుఁ డంట. ౨౧ 531

[1]సీ. విను మమ్మహాత్ముండు ♦ ఘనశాంతులై నట్టి సాధువర్యులకెల్ల ♦ సాంద్రవిమల
తరమగుచ్ఛాయ సం♦తతమిచ్చి తాపమ్ము నడఁచి పొల్చెడునివా♦సార్హమైన
వృక్షంబుపోలిక ♦ వెలయు, దయాళు వాపన్నుల కెల్లను ♦ బరమగతియు
సంశ్రయంబార్తులౌ♦జనులకెల్లను యశోముఖ్యభాజనముసు♦మ్ము; మఱియతఁడు
శాస్త్రజన్యంబగు ♦ జ్ఞానము లౌకికజ్ఞానము గలయట్టి♦చతురుఁ డట్టి
జనకునాజ్ఞను శిర♦సావహించి యొనర్చుభక్తుండు హిమధామ♦పర్వతంబు
ధాతువులకువలె ♦ ఖ్యాతగుణంబులకెల్ల నాకరమయి ♦ యొసఁగువాఁడు
కావుననే [2]యనీ♦కములందు దుర్జయుండై యప్రమేయుఁడై ♦ యలరు నమ్మ
ఆ. హాత్ముతోడ నించు♦కంతయుఁ బగ మన
కేల? తగదు మనకు; ♦ నింక నొక్క
పలుకుఁ జెప్పెదు శూర! ♦ పరికించి యొకదోష
మేని నీకుఁ బూన్ప ♦ నెంచనుగద!. ౨౨ 532

క. విను నీకుఁ హితమెద్దియొ, గని దాని వచింతు నేను ♦ గావున దానిన్
విని యట్లె యాచరింపుము, [3]వనజహితాత్మజుని వీర♦వర! వేగముగన్. ౨౩
తే. యౌవరాజ్యమందు ♦ నభిషేక మొనరింపు, బలము గలుగునట్టి♦యలసహాజుని
తోడ యుద్ధమీవు ♦ తొందఱపడి తల, పెట్టుకొనకు మిదియె ♦ ప్రియము నీకు.
క. జనపతి యగురామునితోఁ,డను సఖ్యము చేయుటయుఁ ద♦డయక యొ సుగ్రీ
వునితో వైరముదూర,మ్మునఁ దోలుచు మిత్రభావ♦మును బొందుటయున్.౨౪
ఆ. నీకు యుక్తమనుచు ♦ నాకుఁ దోఁచుచునున్న
దలసహోదరుండు ♦ చెలిమి లాల
నమునఁ దన్పఁదగిన♦ప్రముఖుఁడౌ కద; యాతఁ
డద్రినున్నఁ బురము♦నందు నున్న. ౨౫ 536
క. మనమునఁ దలఁపుము బంధువ,గునెకద యన్యుం డదెటు ల♦గున్ నీకును నా
తనివంటిబంధు విల నెం,దును గనఁబడఁ డింక నొకఁడు ♦ ధూతపరజనా. ౨౬
చ. ధనము నొసంగి గౌరవము ♦ తప్పక చేయుచు నీయనంతరం
బున రవిసూను రెండవవి♦భుం దగఁ జేయుము నీకు బంధువై
యనుజుఁడు పొల్చుఁగాదె యటు♦లౌట విరోధము మాని మిత్రుఁగాఁ
గ నతనినెంచి పార్శ్వమునఁ ♦ గాపుగ నుండెడునట్లు చేయుమా. ౨౭ 538
ఆ. ఇప్పు డింతకంటె ♦ నెన్నఁగా వేఱొక్క, గతియె నీకు లేదు ♦ గాన నతని

---

1 ఈసీసమాలిక వ్యాఖ్యానార్థప్రకారము వ్రాయఁబడినదని యెఱుంగునది. 2 అనీకము లందు=యుద్ధములందు. 3 వనజహితాత్మజుని=సుగ్రీవుని.

నఖుని గాఁగఁ జేయు♦శౌర్యసారా! నాకుఁ, బ్రియముచేయ నీకు♦వేడ్క యేని.

సీ. హితముఁ గోరుదును నీ♦కేనని నన్నును దలఁచితివేని యు♦త్నమున నేను
ప్రార్థించినందున ♦ భవదీయహితమునె గలిగించు నావగు♦పలుకు దీనిఁ
బాటించి యారీతిఁ ♦ బంతమువిడనాడి కార్యమొనర్పు; మా♦గ్రహము వదలి
సుప్రసన్నుఁడవయి♦శుభతరవాక్యమువినవయ్య! క్రుద్ధుఁబూను♦టనఁగఁదగదు

ఆ. శక్రతుల్యుఁడగుచు ♦ శౌర్యసారుండైన
కోసలాధినాథు♦కొడుకుతోడ
విగ్రహంబు చేయ ♦ వేడ్క నొందుట నీకుఁ
దగదు శాంతమూనఁ ♦ దగుదు వీవు. ౩౦ 540

చ. అని యిటు తార నాథునకు ♦ హర్షము చేయఁగఁ జాలువాక్యముల్
మనమున నెంచి యట్టితతి ♦ మున్నన తోఁపఁగఁబల్కెఁ గాదె నా
తనిమది మృత్యుసంగతము ♦ తత్సమయంబున నౌట నంత నా
తని కలపథ్యవాక్కులు హి♦తంబులుగా వినరాకపోయెఁ జూ!. ౩౧ 541

పదునైదవ సర్గము సంపూర్ణము.

---

## ౧౬ - వ సర్గము.

—వాలి తారకు సమాధానము చెప్పి యుద్ధమునకు బయలువెడలుట.—

క. తారాధీశనిభానన, తార హితంబట్లు చెప్పఁ ♦ దా వాలియు నా
దార నదలించి యిట్లనెఁ, జారుముఖీ! యార్భటించు♦సహజుని వీనిన్. ౧ 542

తే. మీఁదుమిక్కిలి శత్రువై ♦ మించువాని
నెట్లు సైరింతు సంరంభ ♦ మెట్టులోర్తు;
భీరువవుగాన నెఱుఁగవు ♦ శూరులయి యు
ధర్షితులయి యప్రతిహత♦దర్పు లగుచు. ౨ 543

చ. చెలఁగెడువారి ధిక్కృతిని ♦ జేయుదురే నెవరేని దాని ని
మ్ముల సహియించు టెట్లు? మృతిఁ ♦ బొందుటయే యగు మేలు నాకును
గలహమునందుఁ బ్రీతిగద! ♦ కావున హీనగళుండు వీఁడు నన్
గలహముచేయ రమ్మనుచు ♦ గర్జిలుచుండఁగ వీనిశౌర్యముల్. ౩ 544

క. కని యెట్టులోర్చియుందును;, వనితా! రాముండు నన్ను ♦ బాధించునటం
చును ఖేదమొందకుము ధర్మనిశ్చయుఁడు కృతము నెఱుఁగు♦మహితుఁడతఁడున్.

క. కనుకనె యేయపరాధం, బును జేయనినాకుఁ బాప♦మును బొందెడునే
పనినైనఁ జేయఁగలఁడే, వనజాక్షీ! మరలు మింక ♦ వనితలతోడన్. ౪ 546

చ. చనుమని పల్కుచుండ ననుఁ ♦ జానరో! యింకను వెంబడించి వ
చ్చినఫలమేమి? నావయిని ♦ జెందినసౌహృదభక్తులం దగం

గనఁబడఁ జేసితి విదియ ♦ కాదె ముదంబును గూర్చు; నాదుత
[1]మ్మునికడ కేగి నేను రణ ♦ ముం బొనరించెద సంభ్రమంబు నీ
వును విడనాడు మాతనిని ♦ బోరునఁ గ్రొవ్వడఁగింతుఁ జంపఁజా!. ౭ 547

సీ. ద్వంద్వయుద్ధంబుసం ♦ దడిలోనఁ బ్రాణముల్ తీయకుండఁగఁ బోరు ♦ తెఱఁగ దెట్లొ
యనకుమా, సంగరం ♦ బున వానిప్రాణముల్ తీయకుండఁగఁగాచు ♦ తీవ్రశక్తి
గలవాఁడఁ గాన వృ ♦ క్షంబుల ముష్టిప్రహారంబులను నొచ్చు ♦ నట్లు చేయఁ
బేడితుండయి పోవు ♦ వేగ యాదుర్మార్గరతచిత్తుఁ డని నాదు ♦ వతులగర్వ

తే. మును బ్రయత్నంబు సహియింపఁ ♦ గను గలండె
తరుణి! యుక్తంబుఁ దెలిపి యెం ♦ తయు సహాయ
మును నొనర్చితి స్నేహంబుఁ ♦ గనఁబఱచితి
వింక నాప్రాణములతోడు ♦ పంకజాక్షి!. ౯ 548

క. చనుమా! నేవిజయంబును, [2]గనున ట్లాశిషములిచ్చి ♦ కదలుము నేనా
యనుజుని సుగ్రీవుని నని, మొన గెల్చియె మరలివత్తు ♦ ముదమునఁ బురికిన్.

[3]క. అనవిని ప్రియవాదిని యా, వనితామణి తార యంత ♦ స్వపరవిషయమం
దున మోమోటము గలదియె, గనుకన్ బదులేమిపల్క ♦ కయె ప్రాణేశున్.

వాలి సుగ్రీవుల రెండవసంగరము.

[4]క. తనివారఁగ నాలింగన, మును జేసికొనుచును మంద ♦ ముగ నేడ్చుచు నా
తనికిఁ బ్రదక్షిణ మొనరిచి, తనవిభునకు స్వస్త్యయనము ♦ తగఁ గలుగుటకై.

క. తనకున్ వచింపఁదగుమం, త్రనికరమున జయముగోరి ♦ తద్దయుఁ బూన్కిన్
బనిదాని నొనర్చుచు వగ, [5]వున నేమియుఁ దోఁపకేడు ♦ వున నంతిపురిన్. ౧౨

క. తరుణులతోఁ జొచ్చెను ని, వ్వరుసన్ దారయును దోడి ♦ వనితలతోఁ బో
వ రయంబున నావాలియు, నురుతరకోపమును బొంది ♦ యుగ్రఫణివలెన్.

తే. దీర్ఘనిశ్శ్వాసములతోడఁ ♦ దెంపుమెఱయ
నగరముననుండి వెడలెను; ♦ నైజమహిత
తేజుఁ డురుకోపి యగువాలి ♦ తీవ్రనినద
మడర నిట్టూర్పు లొలయఁగ ♦ నరిఁ గనంగ. ౧౩౪ 554

క. నలుదెసలం బరికించుచుఁ, బలుభంగుల నెంచుచుఁ గపి ♦ వరుఁ డాతఁడు శ్రీ
విలసిల్ల హేమపింగళు, జ్వలదనలాభుని వనీక ♦ సంసిద్ధుఁ బరున్. ౧౪౪ 555

[6]తే. వలువ గట్టిగ బిగియించి ♦ వఱలువానిఁ
గనియె గురుకోపుఁడౌ వాలి ♦ క్రాలుశౌర్య

1 దర్పమాత్రం వినేష్యామి నచ ప్రాణై ర్విమోక్ష్యతే-అనిమూలము. 2 నివర్తస్వజయేనచ-అనిమూ. జయాశిషా-అని పాఠాంతరము. జయాశిషం కృత్వా నివర్త స్వేత్యర్థః-అని తీర్థులు. 3 వాలినం ప్రియవాదినీ-అనిమూ. 4 చకార రుదతీ మందమ్-అనిమూ. 5 ప్రవిష్టా శోకమోహితా-అనిమూ. 6 సుసంవీత మవష్టబ్ధమ్-అనిమూ. వాససానుష్ఠుపరిపీతమ్-అనివ్యాఖ్య.

మునను నిలిచిన సుగ్రీవుఁ ♦ గని వసనముఁ
దాను గట్టిగ బిగియించి ♦ పూనె ననికి. ౧౬ 556

చ. అనుపమవీర్యయుక్తుఁ డగు ♦ నాకపినాథుఁడు వాలి యంబరం
బును బిగియించి కట్టి యనిఁ ♦ బూనినయుత్సవ మొప్ప ముష్టిఁ గై
కొని యనుజాతుపై కరిగెఁ; ♦ గ్రోధము పొంగఁగ సూర్యపుత్రుఁ డా
యన్నఁ దనముష్టి నెత్తుకొని ♦ యాతుర మొప్పఁగ వేడ్క మీఱఁగన్. ౧౭౹

తే. కనకమాలిక ధరియించి ♦ క్రాలువాలి
పైకిఁ బోయెను; వాలికో ♦ పమున నరుణ
నయనుఁడై తనపైకి ర ♦ ణంబు చేయ
నిపుణుఁడై వేగమున వచ్చుఁ ♦ దపనజుఁ గని. ౧౮౹ 558

చ. అనుజునియుద్యమంబునకు ♦ నాత్మ సహింపక యిట్టుపల్కె; ము
ష్టిని గనుమోరి యియ్యదియె ♦ చేరిచి వ్రేళ్లను బాన్కి మీఱ దీ
నిని బిగియించి పట్టుకొని ♦ నిల్చినవాఁడను జుమ్ము దీనితో
నిను జవమొప్ప గ్రుద్దగనె ♦ నీయసువుల్ గొనిపోవు వేగమే. ౨౦ 559

చ. మరుదధినాథుపుత్రుఁ డిటు ♦ మాటల నొవ్వఁగఁ జేయ సూర్యజుం
డురుతరకోపమొప్ప నిదె ♦ యుద్ధతి నాఘనముష్టి వేగ నీ
శిరమున వ్రాలి ప్రాణములఁ ♦ జేకొని పోవును జూడు దుర్మతీ!
త్వరపడ నేల యంచనియె ♦ వాలియుఁ బైకొన సూర్యపుత్రునిన్. ౨౧౹ 560

క. పిడికిట వేగము మీఱఁగఁ, బొడువఁగ సుగ్రీవుఁ డుగ్ర ♦ భూరిక్రుధచేఁ
గడువడి నఱుకాచు నత్తఱి, నొడలంతయు రక్తతటిని ♦ నొగి మునుఁగంగన్.

క. సెలయేళ్లఁ గూడుశైలము, వలె నొప్పి యతండు మిగుల ♦ త్వరఁగామూలం
బులతోడి సాలవృక్షము, బలమునఁ బెకలించి వీచి ♦ వైచెం గడఁకన్. ౨౩

తే. వజ్రమున గొప్పకొండను ♦ బగులఁగొట్టి
నట్టు లద్దానిచే వాలి ♦ యవయవముల
విఱిగిపడునట్లు కొట్టెఁ; నా ♦ వ్రేటున కతఁ
డంగ విహ్వలతం బొంది ♦ యార్తుఁ డగుచు. ౨౩౹ 563

క. గురుభారసంయుతంబయి, పరఁగెడువర్తకుల నావ ♦ భంగిఁ జలించెన్
గురుభీమశౌర్యబలులై, గరుడునియంతటిజవంబు ♦ గలిగి యసములై. ౨౪౹

చ. అతిభయదాకృతుల్ దనర ♦ నాసహజన్ములు పూర్ణిమానిశా
పతిదిననాయకుల్ బలెను ♦ బైకొని; రంతట శత్రుహంతలై
క్షితిఁ దగువార లిద్దఱును ♦ ఛిద్రములన్ వెదకంగఁ జొచ్చిరే
పుతగఁ బరస్పరంబు బల ♦ పూర్ణుఁడు శౌర్యయుతుండు వాలియున్. 565

క. వరుసగ బలయుక్తుండై, పరఁగె మహావీర్యుఁ డైన ♦ భానుసుతుండున్

బరిపూర్ణబలము తగ్గుటఁ, బరాక్రమవిహీనుఁ డయ్యె ♦ వాలియు నంతన్.

క. తనదర్పంబున సుగ్రీ, వునిదర్పము నడఁపఁ జ్యుతిని ♦ బొందినదర్పం
బున సుగ్రీవుఁడు శౌర్యం,బునఁ దగ్గియు నత్యమర్ష♦మున లాఘవమున్. ౨౮

[1]క. కనఁబఱచె; నంత వారలు, ఘనభూజము లందుకొనుచుఁ ♦ గ్రాలెడుశాఖల్
గొనుచుం గొసలం గైకొను, చును దృప్తిం బొందక మఱి ♦ శుంభద్బలులై.

సీ. వజ్రకోటిసమాన♦వరనఖంబుల ముష్టిఘాతంబులను జాను♦ఘాతములను
గాళ్లఁజేతుల నెంతొ ♦ క్రౌర్యంబునం గొట్టుకొనుచువృత్రుండును♦దనుజవైరి
యగునింద్రుఁడున్ వలె ♦ నతిభయంకరముగ నని చేసి; రావన♦మునఁ జరించు
వానరు లాయిద్ద ♦ ఱూనినక్రుద్ధ రక్తసిక్తాంగులై ధ్వని♦చేయుమేఘ
తే. ములవలెనె యితరేతర♦మును భయంక
రార్భటుల నదలించుచు ♦ నని నొనర్చి;
రంత రాముఁడు వానర♦కాంతుఁ డినజుఁ
డాత్మబలమున క్షీణించి ♦ యన్న యెదుట, ౩౦ 569

క. నిలువఁగఁజాలక నలుదిక్కుల నాత్మాశయము తెలుపఁ♦గోరుచుఁ జూడం
గ లలిం గనె రాముం డు,జ్జ్వలతేజుఁడు వీరుఁ డంత ♦ వానరపతినిన్. ౩౧

తే. ఆర్తునిం గాంచి యింద్రజు ♦ నడరి చంపఁ
దగినశరమేదియో యని ♦ తలఁచె మదిని;
బిదప ఘోరవిషార్తప♦ర్పీకరంబు
వలె వెలింగెడు నతిఘోర♦బాణమొండు. ౩౨ 571

చ. ధనువునఁ గూర్చి జ్యాలతికఁ ♦ దద్దయు మ్రోయఁగఁజేసి కాలుఁ డో
య్యనఁ దనకాలచక్రమును ♦ నార్భటి మీఱఁగ లాగుమాడ్కి నా
ధనువును శ్రోత్రరంధ్రమును ♦ దాఁకఁగ నీడ్చెను దానిఘోషమున్
విని పతగేంద్రముల్ మిగుల ♦ భీతిని బొంది మహార్తిఁ గుందుచున్. ౩౩

ఆ. ప్రళయకాలరవము ♦ వినినట్లు తోఁచక
పఱచె మృగగణంబు ♦ భయమునొంది
దెసలకేగె నంత ♦ వెస రాముఁ డాశర
మట్టె విడువ బాణ ♦ మతిజవమున. ౩౪ 573

చ. కులిశముఖంగి మండుచును ♦ గోయని యార్చుచుఁ జంచలాకృతిన్
వెలుఁగుచు వాలివక్షమున ♦ వేగమ చొచ్చెను; భూరితేజుఁడై
బలమున విక్రమంబునను ♦ భాసిలు నాకపికుంజరుండు ని
[2]స్తులశరవేగఘాతమునఁ ♦ దోడనె భూస్థలిఁ ద్రెళ్లె నార్తుఁడై. ౩౫ 574

---

1 వృక్షైః స్సశాఖైః స్సశిఖై ర్వజ్రకోటినిభై ర్నఖైః-అనిమూ. 2 వేగే నాభిహతో వాలీ నిపపాత మహీతలే-అనిమూ.

సీ. కాంతివిహీనుఁడై ♦ కపివరేణ్యుఁడు స్పృహఁదప్పి యాశ్వయుజమం ♦ దొప్పుపూర్ణి
మను నుత్సవాంతంబు ♦ నను నిలఁ ద్రోయఁగఁ బడెడుసింద్రధ్వజ ♦ మొడలిపుడమిఁ
బడునట్లు నేలపైఁ ♦ బడియె; నిట్లారాముఁ డాపురుషోత్తముం ♦ డంత్యకాల
మున నీశ్వరుం డాత్మ ♦ ముఖమునుండి ధూమాయతాగ్నిఁ గ్రక్కు ♦ నట్లువిలయ

తే. కాలమృత్యుసమంబయి ♦ కనకరూప్య
భూషితంబయి పగతురఁ ♦ బొలియఁజేయఁ
జాలి మెఱయుచు నున్నట్టి ♦ శరము వాలి
పైన వైచెను; బిదప నా ♦ వానరపతి. ౩౭ 575

చ. అనిఁ దనువెల్ల రక్తమయ ♦ మై పసఁగుందుటఁ దెల్విదప్పి పు
ష్పనికరమండితం బగుచు ♦ భాసిలునట్టి యశోకభూరుహం
బనిలునితాఁకునం బడెడు ♦ నట్లుగ నుత్సవమైనమీఁద గొ
బ్బునఁ బడునింద్రకేతనము ♦ పోల్కిని భూమిని వ్రాలె నార్తుఁడై. ౩౮ 576

పదునాఱవ సర్గము సంపూర్ణము.

---

౧౭ - వ సర్గము.

వాలి రాముని దూఱుట.

చ. అనిమొనఁ బౌరుషంబు గల ♦ యాకపినాథుఁడు రామబాణతా
డనమున ఖిన్నుఁడై ధరఁ గ ♦ టంకను ద్రెళ్లఁగఁ గొట్టఁగూలుశా
ఖిని దుఃఖించుచుర్ బడియెఁ ♦ గేవలతప్తసువర్ణభూషణా
ళిని ధరియించి చెల్వునను ♦ లీలఁగఁ గ్రాలుమహేంద్రజుం డటన్. ౧ 577

ఆ. ముక్తరశ్మి యగుచుఁ ♦ బుడమినిబడు శక్ర
ధ్వజమురీతి నవయ ♦ వములు ధరణిఁ
దాఁకునట్లు పడియె ♦ నాకపిగణపతి
నవనిపైనఁ బడిన ♦ యంతలోన. ౨ 578

క. వనజారిలేని యాకస, మును బోలుచు భూమి తేజ ♦ మును బాసెను; భూ
మిని బడినయమ్మహాత్ముని, తనువును గాంతియును బ్రాణ ♦ తతిశౌర్యంబుల్. ౩

క. విడువఁగఁజాలక యెప్పటి, వడువున నలరారుచుండె ♦ వజ్రంబులచేఁ
గడువెలయుచు నింద్రుం డొక, పుడొసంగిన స్వర్ణమాల ♦ పొదలుచు శక్తిన్.

క. హరినాథునితనువును ని,ర్భరతేజము ప్రాణములును ♦ బాయకయుండం
గ రహిఁ నొనర్చెను వానర,వరుఁ డావీరుండు దేవ ♦ వరుఁ డనుకంపన్. ౫

క. తన కిచ్చియున్నయాకాం,చనమాలను దాల్చియుంట ♦ సంధ్యారాగం
బున నంతట నావృతమా, ఘనమట్లుగఁ జూడనొప్పెఁ ♦ గడునందముగన్. ౬

సీ. నేలపైఁ గూలిన♦వాలిదేహంబును గాంచనమాలయుఁ ♦ గాయఘాతి
యగురాముశరమును♦ననుమూఁడువెలయుచునుండుటంజూచుట♦నురుతరమగు
నతని తేజము త్రివి♦ధాకృతులను జేయఁబడినయట్లు వెలింగెఁ ♦ గడిఁదిబాణ
మయ్యది తనచేత ♦ నంతంబునొందిన వారికెల్లను దాను ♦ స్వర్గమార్గ
తే. మును గలుగఁజేయు రాముని♦ధనువునుండి
విడువఁబడుటకు మహితుఁడై ♦ వీరుఁడైన
యాశతక్రతుపుత్త్రున ♦ కవుడు పరమ
గతిని నసదృశమా దానిఁ ♦ గలుగఁజేసె. ౮ 583

చ. అని నిటు నేలఁ గూలి సెగ♦యాఱినయగ్నివలెన్ వెలుంగుచున్
ఘనశర మేసెనంచు నల♦కమ్రుశరంబును వైచినట్టివీ
రుని నుతియించి యిట్లు తను ♦ రూక్షశరంబునఁ గొట్టినట్టి యా
తని దెలియంగ నల్గడలఁ ♦ దా మెలమెల్లనఁ జూడ్కిఁ ద్రిప్పుచున్. ౯ 584

క. సురలోకంబున నుండియొ, ధరణికిఁ బుణ్యము నశింపఁ ♦ దా దిగుభూమీ
శ్వరుఁ డగుయయాతికరణిన్, బరఁగుచుఁ బ్రళయంబునందుఁ♦బరమేశ్వరుచేన్.

సీ. పుడమికిఁ ద్రోయఁగాఁ ♦ బడినసూర్యునివలె; గ్రాలుచు నింద్రుని♦కరణి ననిని
మార్కొనరాక య♦మరనాథువలె దుస్సహుఁడయివిశాలబా♦హుండునగుచు
హరికిఁబోలె విశాల♦మైనవక్షము గ్రాల మోమువెలుంగ ను♦ద్దామకపిల
నయనముల్ చెలువార ♦ నైజపౌరుషమొప్ప ధరణిపైఁ బడియును♦దత్తకనక
తే. మాలి యగువాలినిన్ రాజ♦మండనుండు
గాంచి లక్ష్మణుఁడును దాను ♦ గడువడిగ న
తనిసమీపంబునకుఁ బోయె ♦ వినయమొప్ప
వాలి యాబలయుక్తులఁ ♦ బార్థివులను. ౧౨౪ 586

చ. కని పరుషంబు ధర్మము ద♦గం గనుచుం దగునట్టు లొప్పఁగా
ననియెను నీవు రాట్సుతుఁడ ♦ వౌదువు ఖ్యాతిని గన్నవాఁడ వు
ర్విని మహనీయవంశమున ♦ విశ్రుతికెక్క జనించినావు శా
స్త్రనికరమందుఁ బ్రీతిఁగల♦సాధుమనస్కుఁడ వెన్నిచూచినన్. ౧౩౪ 587

చ. బలవిభవంబునం జెలఁగు♦వాఁడవు తేజము గల్గువాఁడ వి
ష్ముల సకలవ్రతంబులను ♦ బొందుగఁ జేసినవాఁడ విప్పు డీ
కలహమునందు మార్కొనను♦గా నిను వేఱొకవైరితోడ నా
బలమును జూపి సంగరము ♦ బాగుగఁజేయుచు నుండునంతటన్. ౧౮౪ 588

తే. నాదువక్షంబునందు బా♦ణంబుఁ దగుల
నేసితివిగా; పరాఙ్ముఖు ♦ నిట్లు చంపి

యేమి ప్రఖ్యాతి నొందితి ♦ యిచట నీవు
*కరుణ నెఱిఁగినవాఁడు భూ♦వరుఁడు ఘనుఁడు. ౧౬ 589

సీ. ప్రజలహితంబునె ♦ బాగుగ నొనరింప నయఁగలవాఁడు మ♦హోత్సాహమును జ
యించినవాఁడును ♦ దృఢతరవ్రతుఁడును సమయజ్ఞుఁడగు రామ♦చంద్రుఁ డనుచు
సకలభూతంబులు ♦ సంతసంబున నీ యశముఁ బాడుచున్నవి ♦ శమము దమము
క్షమ ధర్మములు మఱి ♦ సత్యపరాక్రమంబులు నపరాధుల ♦ బొంగడంగ

తే. వర్ణమగు దండనము నివి ♦ యవనిపతుల
గుణములందురు రాజ! స♦ద్గుణము లివ్వి
యెల్ల నీయందు నుండుట ♦ నెఱిఁగి నీదు
సత్కులప్రభవంబును ♦ సమతఁ దలఁచి. ౧౮ 590

చ. అని కరుడెంచుచుండఁగఁ బ్రి♦యాంగన తారయుఁ బోవనేలయం
చని హితముల్ వచించినను ♦ నవ్వి మనంబున లెక్క చేయకే
యనుజునితోడఁ బోరఁగ భ♦యంబన లేకయె వచ్చినాఁడ ని
న్గననితఱిన్ మఱొక్కరుని ♦ గాంచుచు యుద్ధమొనర్చుచుం బరా
కున నిటులున్నయప్పుడును; ♦ క్షోణివిభుం డగురాముఁ డీయనిన్. ౧౯ 591

క. నను నేమిచేయఁడని మన, మునఁ దలఁచియె యుంటి నైజ♦మును భవదీయం
బును గంటి నిపుడు; రామా!, వినిహతమతి వీవు ధర్మ♦విరహితుఁడవు నా!.

ఆ. ధర్మచిహ్న మొకటి ♦ ధరియించి కుత్సితా
చారుఁడవయి తృణము ♦ సాంద్రముగను
బైని గప్పనొప్పు ♦ బావివిధంబున
నున్నవాఁడ విట్టి ♦ నిన్ను నేను. ౨౧ 593

క. తెలియంగనైతి; సజ్జను, వలె వేషముఁ దాల్చి వాని♦వ్యాజంబున నీ
కలరూపు తెలియకుండఁగ, బలిమిం జేసికొని ఛన్న♦పావకుమాడ్కిన్. ౨౧౪

క. కనఁబడెదునిన్నుఁ బాపాత్ముని నెఱుఁగకపోతి దేశ♦మునఁ బట్టణమం
దును నీకు నేమి యపకృతి,యును జేయఁగలేదు నుంత♦యును నే నెపుడున్.

క. నిను నే నవమానంబును, గనఁజేసినదియును లేదు♦గద; వనమునఁ బం
డ్లను మూలంబులఁ దినుచున్, వనిఁ దిరుగుచు నుండునట్టి♦వానరు నన్నున్.

క. నిను మాఱొక్కని సంగరమును, నొనరుప కున్నట్టివాని ♦ నొరునిం గనువా
నిని బాప మొందెఱుంగని, నను నేటికిఁ జంపి తివుడు ♦ నరవర! యిచటన్.

ఆ. ధర్మ మభినయించు♦దారుణకపటంబు, నీకు నైజమగుట ♦ నేఁడు కానఁ
బడియె నిచట; నృపుని♦వంశసంభవమొంది, చదువు నేర్చినట్టి♦జనుఁ డెవండు.

* రామః కరుణవేదీ చ-అనియూ.

సీ. ధర్మవేషంబునఁ ♦ దన్ను నాచ్ఛాదించుకొని మది సంశయం♦బును దగంగ
విడనాడి క్రూరమై ♦ కడునింద్య మగునట్టి పాపకర్మ మొనర్పఁ♦బాలుపడును?
రాజకులంబున ♦ రాఘవా! నీవును జనియించితివి ధర్మ♦మును నొనర్చు
వాఁడవంచుఁ బ్రసిద్ధి ♦ వఱలితి విట్లుండియును నభవ్యుండవ♦య్యును బరులను
వంచింప నీరీతి ♦ భవ్యరూపంబున నేలచరించెద ♦ విట్లు నీవు
ఆ సామదానములును ♦ క్షమయు ధర్మంబును
సత్యధైర్యములును ♦ శౌర్యమట్లె
తప్పుఁ జేయువారి♦దండించు చుంటయు
రాజగుణములండ్రు ♦ రామ! యివ్వి. ౨౭ 599

క. వినుమా! ఫలమూలంబులఁ, దినుచుఁ గాననములందుఁ ♦ దిరుగుచుఁ గాలం
బునుగడపుమృగములము మే,మనయంబిది ప్రకృతిమాకు♦నని యెఱుఁగఁదగున్.

క. పురుషుఁడవు రాజవగుదువు, ధరణియుఁ దపనీయము రజ♦తము నను మూఁడే
దురమునకుఁ గారణములో, ధరణీశా! వీనియందుఁ ♦ దమిఁ గల్గినదో. ౨౮½

క. వనమున నిచ్చట దొరకెడు, ననుపమఫలరాశియందు ♦ నధికాశయు నీ
కును గల్గినదో చెపుమా, యనుగ్రహము నీతి యివ్వి ♦ యార్యనృపులకున్.

*సీ. ఆచరింపఁగఁ దగు♦నట్టిధర్మంబులౌ నవి నీతినిగ్రహ ♦ మనెడునివ్వి
దుష్టమహీశుల ♦ కిష్టధర్మంబులౌ నిల నిట్లు భూపవృ♦త్తులను వేఱు
వేఱుగా నున్నయ♦వియెగాని యొండొంటిఁగలిసియుండంగ లే♦దిలనని యెఱుఁ
గంగనౌఁ దనస్వేచ్ఛ♦గా నయానయములనటునిగ్రహానుగ్ర♦హములఁ జేయఁ
ఆ. దగదు కాన నృపులు ♦ తమయిచ్చమెయిఁ బ్రవ,ర్తింపరాదు;నీదు♦రీతి తెలిసెఁ
గామమే ప్రధాన ♦ మోమహీశా! నీకు, గౌరవమును నీవు ♦ గోర వెపుడు. ౩౦

క. కోపస్వభావుఁడవు మఱి, భూపాలక! క్రమము తప్పి ♦ పొందుగఁ జేయం
జూపట్టుదాని వదలుచుఁ, గాపురుషులరీతి వేఱు♦కార్య మొనరుపన్. ౩౦½

క. తలఁతువు గావున రామా!, యలరాజులవృత్తి స్థైర్య♦మందక నీయం
దాలయుచు వ్యత్యస్తంబై, చెలఁగుచు నున్నయది యిట్లు ♦ చేయందగునే.

క. ధనువును శరములఁ గొని యి,చ్చను బోవుచు వేటపైని ♦ సంతసమున దే
నినినైనఁ జంపుచున్నా, వనయము ధర్మమున శ్రద్ధ♦యలరదు నీకున్. ౩౧½

చ. పరధన మిద్ది కూడదను♦పద్ధతి నీమతియందు లేదు గా
వరమున నింద్రియాళి చను♦భంగిని స్వేచ్ఛఁగఁ బోవుచుందు వో
ధరణిప! కానఁ గామమునఁ ♦ దప్పఁగరానివ్యవస్థ లేదు భీ
కరశర మేసి యెట్టి యప♦కారముచేయని నన్ను వానరున్. ౩౨½ 607

---

* నయశ్చ వినయశ్చోభౌ నిగ్రహానుగ్రహావపి, రాజవృత్తిరసంకీర్ణా ననృపాః కామవృత్తయః-అనిమూ. దీనివ్యాఖ్యానార్థ మిట విస్తృతమని యెఱుంగవలయు.

క. పరిమార్చితి కాకుత్స్థా!, పరమునుగుప్తతముగాఁగఁ ♦ బరఁగుపనిఁ ని
ట్లరయక యొనరిచి యిఁక న,త్పురుషులకు నేమిపలుకఁ♦బోలుఁ బలుచితో.

*సీ. రాజహంతయు మఱి ♦ బ్రాహ్మణహంతయు గోహత్యచేసిన♦కుమతి చోరుఁ
డెల్లప్పుడును బ్రాణ♦హింసయే కోరెడునతఁడు నాస్తికుఁడును ♦ నన్నుకంటె
ముందు పెండ్లాడిన♦మూర్ఖుఁడు వీరెల్ల నరకంబునకుఁ బోవు♦దురు; మఱియును
సఖునిఁ జంపినవాఁడు♦చాడిచెప్పెడువాఁడు గురుతల్పగుఁడు లుబ్ధ♦కుండు వీరు

తే. పాపమతు లొందుజగములఁ ♦ బరమనీచ
ములను బొందుదు; రనుమాన♦ము గనలేదు;
వేఁట యనునాట మావంటి♦పృథ్వీపతుల
కరయసహజమె యఘ మిను♦మంత లేదు. ౩౫ 609

క. ననునేటికి నిందించెద, వనఁబోకుమా యేమొ ధర్మ♦ము దాపర్తిం
గని వఱలుభవాదృశు లగు, జనులకు నాకుత్సితంపుఁ♦జర్య మిది తగదా. ౩౫౹

ఆ. జింకచర్మమువలెఁ ♦ బొంకముగా ధరి
యింపఁ దగదు మఱియు ♦ నీమదీయ
ములగు రోమజాల♦ములు పట్టువలెఁ బవి
త్రములు గావు నాదు♦నెముకగమియు. ౩౬౹ 611

సీ. దంత్యస్థివలెఁ బవి♦త్రత నొందకుండును మామకాంగభవమా ♦ మాంసమట్లె
భక్ష్యంబు గాదుగా ♦ పంచనఖంబులౌ మృగములలోపల ♦ మించునేఁదు
పంది, యడవిముండ్ల♦పందియు నుడుమును శశకకూర్మంబు లి♦సంఖ్యగలవి
మాత్రమే బ్రాహ్మణ♦క్ష్మానాథవైశ్యుల కర్హముల్ భక్షింప ♦ నన్యపంచ

తే. నఖమృగంబు లభక్ష్యముల్ ♦ నరపతిసుత
పండితులు మామకాంగభ♦వంబులైన
యస్థిచర్మములను దాఁక ♦ రట్లె మాంస
మును గ్రహింపరు నుమ్మిది ♦ జనవిదితమె. ౩౭౹ 612

క. తినఁదగనిపంచనఖమృగ, జనిఁ గాంచిన నేను నిట్లు ♦ చంపఁబడితి; నే
నునువాఁడను సర్వం బెఱిఁగినతారయు హితతరంబుఁ ♦ గీర్త్యము నగుచున్.

ఆ. సత్యమైనవాక్య♦సముదయమున నాకుఁ
దెలిపె మోహమునను ♦ దెఱవమాట
దాఁటి మృత్యువశముఁ ♦ దగ నందితిని గటా!
యేమివగచిన నిఁక ♦ నేమిఫలము?. ౩౮ 614

సీ. శీలసంపన్నయౌ♦చెలువ ధూర్తుండగుపతి గల్గియుండియు ♦ భర్తలేని
యట్టులే యగునట్లు ♦ లవనియధర్మాత్మ నినుఁ బతిగాఁ బొందియును ♦ ననాథ

* రాజహా బ్రహ్మహా గోఘ్నశ్చోరః ప్రాణివధే రతః, నాస్తికః పరివేత్తాచ సర్వే నిరయ
గామినః-అనిమూలము.

యేయగు, నితరుల ♦ కెల్లగూఢంబుగ నపకృతిఁ గావించు♦నట్టివాఁడ
వింతె కాదు శఠుండ ♦ వీవు క్షుద్రుండవు మిథ్యావినయమును ♦ మేలుగాఁగ

ఆ. నభినయించువాఁడ ♦ వఘరూపుఁడవుగాన
మహితచిత్తుఁ డగుచు ♦ క్ష్మాపతివరుఁ
డై నదశరథునకు ♦ నాత్మజుం డవదెట్లు
లైతివో యెఱుంగ♦నయ్య! నేను. ౮౧ 615

చ. తనదగుకట్టుత్రాడుల ను♦దాత్తబలంబునఁ ద్రెంచివైచి ధ
ర్మనిరతిఁ బాసి యంకుశము ♦ మానుగ లక్ష్యముచేయ కెవ్వరై
నను గనరాఁగ వారలను ♦ నాశముచేయుచు హస్తిపోల్కిన
ట్లనువగు సచ్చరిత్రమును ♦ నారయకే యపరాధియౌ జనుం
గని తగుశిక్షచేయఁదగుఁ♦గా యనుపెద్దల ధర్మమార్గముం
గొనకయె ధర్మమార్గమున♦కుం దగ లోఁబడ కిట్లు నన్ను ని
వ్వనచరునిన్ వధించితి వ♦భవ్య మయుక్తము నొచ్చుఁ బెద్దలా
జనులకు నిందితంబయిన♦సాహసకార్యము చేసి నీవిఁకన్. ౮౨ 616

తే. సజ్జనులతోడఁ గలియుట ♦ సంభవించు,నేని వారలతో నీయ♦కృత్య మేను
జేసినాఁడ నటంచని ♦ చెప్పవలసి, యుండ నేమనిచెప్పెదు ♦ వోయి కుమతి!.

తే. అనపకారులమైన మా♦యందు నీవు, గనఁబఱచినట్టి యీపరా♦క్రమము నీకు
నపకృతిం జేసినట్టిదై♦త్యాధిపతుల,యందుఁ జూపఁగఁగాన మో♦యవనినాథ.

క. నాముందట నిలువంబడి, రామా! నాతోడ సంగ♦రముచేసితివే
నామహితబలముచేఁ దగి, యామిత్రాత్మజునిఁ గనుదు ♦ వది తప్పెగదా!. ౮౩

*క. కనఁబడుచు నీవు సంగర,మును నాతోఁ జేయుదేని ♦ భూపా! నాచెం
తను జేర నశక్యమె నూ;, విను పానవశంగతుఁడయి ♦ విస్మృతిఁ గనుచున్.

క. నిదురించువాని భుజగం, బది నిది యని కఱచిచంపు♦న ట్లీవు నను
బొదచాటున నిల్చి కనం,గఁ దగక వధియించితివి ప♦గంగొని రామా!. ౮౪

సీ. తొలుదొల్త నాసీత ♦ నిలనెల్ల వెదకి యీయవలెనంచని నన్నె ♦ యడిగియున్న
నేనొక్కదినమున ♦ నెలఁత నెచ్చటనున్నఁ దెచ్చి నీసన్నిధి ♦ నిచ్చియుందు
నేకదా; నీయాజ్ఞ♦నేఁ జేయుభాగ్యము కలుగకయేపోయెఁ♦గా యటన్న
యాశయమ్మును దెల్పు♦నట్టు లింకను బల్కె; నినజునకే ప్రియ♦మెన్ని చేయఁ
దలఁచి రావణునివ♦ధమునకుఁ గద నన్నుఁ జంపితి వీవు నా♦సాయమడిగి
యుందువే నాతని♦యుద్ధంబునం జంపి త్రాడుకంఠంబునఁ ♦ దగిలిచికొని
యీడిచి తెచ్చి నీ ♦ కిచ్చియేయుందునే నీయాజ్ఞయేమైన ♦ నేను మున్ను
మధుకైటభులు భుజ♦మహితబలంబునఁ బాతాళమునవె క♦న్పడకయుండు

* వరప్రదానా దాభిముఖ్యేన నయుద్ధకరణమ్-అని మహేశ్వరతీర్థులు.

రీతిని నుఱిచిన ♦ శ్వేతాశ్వేతు యనుహాసమొందినయట్టి ♦ శ్రుతిని బలిమి
హాయవదనుండు నా ♦ యసురుల నోర్చి తెచ్చినయట్లు దనుజుండు ♦ సీత జలధి
జలమధ్యమున మఱె ♦ చ్చటనైన నునిచిన సాధించి తెచ్చి యొ ♦ సంగి యుందు;
రాజ్యమందున్నట్టి ♦ రవిసుతు నేటికి వెసలఁగొట్టితి వని ♦ తనయ కతఁడు
తన్నడుగంగ దాఁ ♦ దలఁచునేమోయని తాను త్తరం బీయఁ ♦ దలఁచినట్టి
పల్కులురాఁగ ని ♦ ప్పగిది మఱియుఁబల్కె నేనుమృత్యువును బొం ♦ దినయపత్య
నతఁడు కీశాధిప ♦ త్యంబు పూనుట తగు ననుఁ జంపిరాజ్యంబు ♦ ననతఁడొందఁ
దగుఁ; గాని యొకరితో ♦ దారుణకలహంబుఁ జేయుచుండఁగధర్మ ♦ చింతమాని
యిట్లధర్మమున న ♦ హీనాంబకమున నన్ బడవేయుటయు నిది ♦ పాడిగాదు
నిరపరాధిని వాలి ♦ నేనేల చంపితి నని రాఘవుఁడు చింత ♦ నందు ననుచుఁ
దలపోసి పల్కెడు ♦ పలుకుల నిట్లను బుట్టినవాఁడెల్లఁ ♦ బొలియుటనఁగ
సహజమే కావున ♦ జనులిట్లు కాలముచేనైన మరణంబుఁ ♦ జెందుటనఁగ

ఆ. సహజ మగుచునుండఁ ♦ జనునద్ది యట్లుండుఁ
గాక; నీవు నాకుఁ ♦ గానఁబడక
నను వధించినది యిఁ ♦ కను నీకు యుక్తంబె
యనుచుఁ దోఁచు నేని ♦ యందుల కిట. ౫౦౪ 622

క. పలుకుము నదుత్తరంబో, యిలేశసుత! యనుచు వాలి ♦ యిల్లస్త్రహతిన్
బొలియింపఁజాలు వేదనఁ, గలఁగుచు మహాత్ముఁ డతఁడు ♦ కడుఁబెడితుండై.

ఆ. అంతకంటె మిగుల ♦ నధికంబుగాఁ బల్క
వదన మెండ నంత ♦ భానుమూర్తి
పగిది వెలుఁగుచున్న ♦ పరమాత్ము రామునిఁ
గనుచు నూరకుండె ♦ మన మడలఁగ. ౫౭ 623

పదునేడవ సర్గము సంపూర్ణము.

---

## ౧౮ - వ సర్గము.

వాలిప్రశ్నములకు రాముఁడు తగిన యుత్తర మిచ్చుట.

చ. శరహతుఁడై మనస్థ్సితియుఁ ♦ జాలఁగఁ బోవఁగ వాలి రామభూ
వరు వినయంబు ధర్మమును ♦ భావముఁ గల్గి హితంబునై తగం
బరుషమునైనవాక్యతతిఁ ♦ బల్కెను; రాముఁడు నిష్ప్రభుండుగాఁ
బరఁగుదివాకరుండువలె ♦ వారిని బాసినయబ్దరీతిగన్. ౧౪ 625

సీ. ఉపశాంతుఁ డగునగ్ని ♦ యొప్పుననిష్ప్రభుండగుచు నిశ్చేష్టుఁడై ♦ యమలకాంతిఁ
బాసియుండిన హరీ ♦ శ్వరుఁ గని ధర్మార్థగుణయుక్తమై నీతిఁ ♦ గొమరుమీఱు

వాక్యమొప్పఁగ నిట్లు ♦ పల్కెను జక్కఁగా ధర్మముఁ గాను మ♦ర్థంబు లౌకి
కాచారములఁ దెలి♦యక విరుద్ధంబుగాఁ జరియించియుండి య♦జ్ఞానమువల
తే. నను నదోషు నిందించెద ♦ వనయరీతి, సౌమ్య! బుద్ధిసంపన్ను లా♦చారవేత్త
లయినవృద్ధుల నడిగి ధ♦ర్మాదికములఁ, ‡దెలియకే కపిచపలత♦వలన నిట్లు. ౪౫

క. నను నిందింపఁగఁబూనితి, వనకానన శైలయు క్త♦వసుధ యిది తగఁగ
ఘనులయి యిక్ష్వాకుకులం, బునఁ బుట్టినన్నృపులదగుచుఁ♦బొలుపారుఁజుమీ!. ౫

క. మనుజుల మృగపక్షిగణం, బును గాచుట తప్పు గల్గఁ ♦ బూనిక శిక్షం
గనఁజేయుటయును వారల, కనయము దగియుండునట్టి ♦ యధికారములే. ౬

చ. ధరణిని దాని ధర్మమతి ♦ తథ్యవచస్కుఁడు సాధుమార్గత
త్పరుఁడును నైనయాభరత♦పార్థివుఁ డేలెడునాతఁ డెన్నఁగా
నిరతము ధర్మకామముల ♦ నిశ్చయభావము నర్థతత్త్వముఁ
వరమతిచే నెఱుంగునర♦వర్యుఁడు సుమ్ము కపిప్రజాధిపా. ౬౫ 629

తే. నిగ్రహానుగ్రహంబుల♦నియతి నెఱిఁగి
పాలనము చేయుచున్నాఁడు ♦ భవ్యనీతి
దండనము లివ్విరెండు స♦త్యంబు శాస్త్ర
విహితమౌ విక్రమంబు నే♦వీరునందు. ౭౫ 630

క. స్థిరముగ నిల్చి చెలంగునొ, ధరణీశుఁడు భరతుఁ డతఁడు ♦ తగినపగిదిఁగా
నరయునొ దేశము కాలము, సరిగా నిపుడతఁడె సుమ్ము ♦ క్ష్మాపతి, వాలీ!. ౮

సీ. ఆభరతుండు నృ♦పార్హధర్మంబును ననుసరించి యొసంగి♦నట్టియాజ్ఞ
వహియించి మేము మా♦వలె నితరమహీశు లీభూమి నంతట ♦ నిట్లు ధర్మ
వృద్ధిని మదిఁగోరి ♦ యిద్ధధర్మంబునఁ జరియించుచున్నాము; ♦ నరపతివరుఁ
డయి ధర్మవత్సలుం ♦ డయినయాభరతుండు ధర్మాభిరతిఁగని ♦ ధరణనెల్లఁ
తే. బాలనము చేయుచుండ నె♦వ్వండు ధర్మ
హాని సేయంగలండు? మే♦మందఱము స్వ
ధర్మనిరతులమయి భూమి♦ధవునియాజ్ఞ
ముందు నిడుకొని కానన♦ములఁ దిరుగుచు. ౧౦౫ 632

చ. తనదగుధర్మమార్గమును ♦ దప్పి చరించెడువాని నర్హదం
డనమును బొందఁజేయుచు వ♦నంబున నిచ్చట నున్నవార మో
వనచర! ధర్మమార్గమును ♦ బాసినవాఁడవు నీవు చేయుకా
ర్యనిచయముం గనుంగొనిన♦నైనను నిందను బొందువాఁడవే. ౧౧౫ 633

క. కామవ్యాపారమె నీ, కౌముఖ్యము కాన భూధ♦వార్హపథమునం
దేమాత్ర ముండలే దను, నీమాట యథార్థము సుమి! ♦ యిది తగునొక్కో.

‡ సౌమ్య వానరచాపల్యాత్-అనిమూ.

[1]క. తనుగన్నతండ్రి యన్నయుఁ, దనకుఁ విద్యయు నొసంగి ♦ ధన్యునిఁగాఁ జే
సినవాఁడు గురుఁడు మువ్వురు, జనకులు సుమి శాస్త్రవిహిత♦సరణి యిదియు మా.

తే. ధర్మమునఁ జరియింపఁగఁ ♦ దలఁచువార
లిట్లు భావింపవలయు ♦ ధర్మేచ్ఛయున్న
ననుజ పుత్రులు సుగుణాళి ♦ నలరుశిష్యుఁ
డీముగురు పుత్రులనుచునే ♦ యెన్నవలయు. ౧౨ 636

క. వానర! ధర్మము సూక్ష్మం, బై నెగడు నతీంద్రియంబె ♦ యగు నెవ్వరికిన్
గానన్ సుజనులకును నది, కానంగ నసాధ్య మగుచుఁ ♦ గ్రాలును జుమ్మీ!.

క. నినుఁబోఁటికెట్లు తెలియును?, విను! భూతవ్రజమునందు ♦ వెలయుమనములం
దును నిండియుండి సకలం,బును నాపరమాత్మ యొకఁడె ♦ పోలం దెలియున్.

తే. శుభము నశుభంబు నెఱుఁగు నా♦శుభతముండు
వినుము జనుమాంధుఁ డాత్మతు♦ల్యనరులఁ గొని
మంతనము చేయునట్లు దు♦ర్మాన్వితులైన
చపలకపులను గూడి చం♦చలుఁడ వీవు. ౧౪ 639

క. ఎంతగ నాలోచించిన, నంతయు నెఱుఁగంగఁదగునె ♦ శుభమార్గము; నే
నింతకు మును శిష్యానుజ, సంతతులను బుత్రులనుమఁ ♦ జాటితిఁ గాదే. ౧౬

తే. దానిభావమె స్పష్టమై ♦ తనరునట్లు
చెప్పువాఁడ రోషంబున ♦ నిప్పటివలె
నన్ను నిందింపఁదగదు వా♦నర! మనంబు
నందుఁ దలపోయుమా! తెలి♦యంగనగును. ౧౭ 641

క. నినునేటికిఁ జంపితినో, వినవయ్యా! కారణంబు ♦ వివరింతు సనా
తనధర్మము విడిచియె యను,జునిభార్యను బొందెదీ వ♦శుభమార్గమిదా. ౧౮

క. నినుఁ జంపుట కిదె కారణ, మని తలఁపుము; రవితనూజుఁ ♦ డనుజాతుఁడుగా
వునఁ బుత్రతుల్యుఁడగు నా,తనిపత్నియుఁ గోడలగును ♦ దలఁపఁగ నీకున్.

క. వనచర! మహాత్ముఁడగు నీ, యనుజుఁడు జీవించియుండ ♦ నఘనంబగు ని
ప్పనికిం జొరఁబడి కామం, బున నాతనివనిత రుమను ♦ బొందితివి కటా!. ౧౯

తే. ధర్మమార్గంబు విడనాడి ♦ తలఁచినట్టు
లెల్ల వర్తించుచును వాన♦రేంద్ర! యనుజు
పత్నితోడ సుఖించె ది♦ప్పాపమునకె
శిక్ష యిది నీకు నాచేతఁ ♦ జేయఁబడియె ౨౦ 645

---

1 జ్యేష్ఠో భ్రాతా పితా చైవ యశ్చ విద్యాం ప్రయచ్ఛతి, త్రయ స్తే పితరో జ్ఞేయా ధర్మే చ పథి హి వర్తినః-అనిమా.

సీ. శిక్షదీనికి నీవు ♦ చేయవచ్చునుగాని వధియింపనేలని ♦ పలికెదవా కపీ?
కపియూథనాథ! లో♦కవిరుద్ధమైనట్టి యాచారమును బూని ♦ యర్హమైన
యాచారమును మాని ♦ యమలధర్మమునకు వ్యతిరేకముగ నున్న♦యతనిశిక్ష
సేయంగఁ దగుఁగాని ♦ చిత్తమునందెన్న నింతకన్నను నిగ్ర♦హింపవే ఱు

ఆ. పాయమనఁగ లేదు ♦ పరమభూధవకుల, మందుఁ బుట్టినాఁడ ♦ నట్టులౌట
నీవొనర్చినట్టి♦నిరయదమౌ పాప,మునకు శిక్షచేసి♦తిని దగినటు. ౨౧॥ 646

[1]క. తనయ సహోదరి యనుజుని, వనితను గామాతురత నె♦వండు గలియునో
విను మతనిఁ జంపుటయె చ,క్కనిశిక్ష యటంచుఁ బల్కుఁ♦గా స్మృతులెల్లన్.

చ. భరతుఁడు రాజు మే మతని♦వారము పార్థివునాజ్ఞచేయు నా
దరమును గన్నవారము స్వ♦తంత్రము మా కిసుమంత లేదు నీ
వరయక ధర్మమార్గము న♦హంకృతి మీఱితి విట్టు నిన్ను నే
కరణి నుపేక్షచేయనగుఁ? ♦ గావున శిక్షయొనర్పఁగాఁబడెన్. ౨౩॥ 648

చ. ధరణివుఁ డౌటచే గురు వ♦తండగుఁ బ్రాజ్ఞుఁడుగాన ధర్మమా
ర్గరతిని వీడకుండఁగఁ ద♦గం బ్రజలం గనిపెట్టి యుండున
బ్భరతుఁడు స్వేచ్ఛఁగాఁ దిరుగు♦వారల శిక్షయొనర్చు కృత్యమం
దరసి సహస్రనేత్రుఁడయి ♦ యందఱిఁ గాంచుచునుండు వానరా!. ౨౪॥

చ. క్షితిపతి నాజ్ఞ నేవిధిగఁ ♦ జేకొని మేమును ధర్మమార్గవి
చ్యుతిఁ గను త్వత్సమానుల మ♦హోద్యమ మొప్పఁగ శిక్షచేయునా
దృతి గలవారమై వసుఁ♦నెల్లఁ జరించుచు నున్నవార మ
ప్రతియని చెప్పఁగాఁ దగిన♦పాప మొనర్చితి వీవు వానరా!. ౨౫॥ 650

సీ. వినుము! సుగ్రీవున♦కును నాకుఁ గలమైత్రి సౌమిత్రికిని నాకు ♦ సఖ్యమెట్లు
దృఢతమమో యట్టి♦ దేయగు దారకై రాజ్యముకొఱకు మి♦త్రత్వమలరె
నతఁడు నాక్షేమము♦నందె యాసక్తుఁడై యున్నాఁడు గావున ♦ నూరకుండ
వచ్చునే నేనును ♦ బ్రతినచేసితి వానరులసన్నిధిని నిన్నుఁ ♦ గలనఁ గూల్తు

తే. ననియుఁ గావున నాబోఁటి♦మనుజుఁ డెట్టు
లాడి తప్పఁగవచ్చు? న♦ట్లౌట నిన్ని
కారణంబుల ధర్మయు♦క్తముగ శిక్ష
చేసినాఁడను దగినట్లు ♦ బాసఁ గావ. ౨౬ 651

క. అనుజునిభార్యను బలిమిని, గొనినట్టిమహాఘమునకుఁ ♦ గొదువపడనిశి
క్షను బొందినాఁడ విది తగు, నని నీవంగీకరింప♦నగు నిద్దానిన్. ౨౭॥ 652

క. కనుక న్నిను శిక్షించుట, యనునది యేరీతినైన ♦ నరసినధర్మం

---

1 ఔరసీం భగినీం వాపి భార్యాం వా ప్యనుజస్యయః, ప్రచరేత నరః కామా త్తస్య దండో వధ స్మృతః-అనిమూ.

బనఁదగునుగాని యక్రమ,మని చెప్పఁగరాదటంచు ♦ నెఱయుము మదిలోన్.

¹క. వినుమా! ధర్మంబున నీ చక్కనిగతిఁ బాలించుచున్న ♦ నాదిలిసఖుఁ డున్
దనమిత్త్రునిశత్త్రువు దొరకిన నిరసింపంగవలయుఁ ♦ గీశవరేణ్యా!. ౨౯ 654

క. నీవా ధర్మమునే గొన్న,దే! వానర! నిన్ను నిగ్ర ♦ హించిన కార్యం
బీవాచరించినయఘమునఁ, గావలసినదే యటంచుఁ ♦ గడఁకఁ దలఁపనో. ౩౦

క. మును మనువు సదాచారం,బును గూర్చియె రెండుశ్లోక ♦ ముల వివరించెన్
ఘనధర్మనిపుణు లవ్వా,నిని గైకొనియున్నవారు ♦ నేమును వానిన్. ౩౧ 656

క. పరికించియె తత్ప్రీతిగ, వసునం బనిచేసినాఁడ ♦ వానిఁ దెలిపెదన్
"నరు లఘము చేయువారలు, ధరణీశ్వర శిక్షనొందఁ ♦ దగుదురయేనిన్. ౩౨

చ. మును పొనరించినట్టియఘ ♦ ముల్ నశియింపఁగఁ బుణ్యవంతులౌ
జనులవిధంబునం దనరి ♦ స్వర్గమునందుదు; రాన్నృపుండు శి
క్షను గనునట్లుచేసినను ♦ జక్కఁగ వానికి శిక్షచేయకే
చనుఁడని పంపినన్ జనుఁడు ♦ చౌర్యసమార్జితపాపహీనుఁడౌ. ౩౨ 658

క. నరవరుఁడుమాత్ర మాతనిఁ, బరికింపక వదలినందు ♦ వలనన్ దాఁ ద
స్కరుపాపమొందు" నని మను,పరికీర్తితధర్మము లివి ♦ ప్రథితము లుర్విన్. ౩౩

సీ. ఉరుతరపాప మిం ♦ ట్లొనరించినట్లీవు మును శ్రమణుం డఘ ♦ ము నొనరించె
నత్తఱి మర్త్యుల ♦ యందుదయించినయాఢ్యుఁడౌ మాంధాత ♦ యతని కతిభ
యంకరశిక్షనొ ♦ య్యన విధించెను నృపు లేమఱియున్నప్డు ♦ డితరు లఘము
లను జేసియున్నారు ♦ జనపాలు రంతట నప్రమత్తులు నౌచు ♦ నర్హశిక్ష

తే. లను విధింతురు వానిచే ♦ త నఘమద్ది, యంతరించు నిప్పటికిని ♦ నవని నట్లు
జరగుచున్నది; వానర ♦ నామజేంద్ర!, కాన నిందులకయి తాప ♦ మూనవలదు.

క. వనచర! పరితాపంబును, గనినన్ ఫలమేమి గలదిఁ ♦ కంజాలును నీ
కొనరింపఁబడినశిక్షయు, విను ధర్మము ననుసరించి ♦ విధియింపఁబడెన్. ౩౫

²క. మేమును స్వతంత్రులమునుం, గామునుమా, శాస్త్రములకుఁ ♦ గలకాలము లో
నై మెలఁగుచుండువారము;, భూమీశులమయ్యు స్వేచ్ఛఁ ♦ బూనము వినుమా!.

³క. వనచర! వీరా! కారణ,మును వేఱొకదాని వివర ♦ ముగఁ జెప్పెద నీ
కును నదియు హేతుయుక్తము,గనుండుఁ గావునను జక్కఁ ♦ గా నద్దానిన్.

---

1 వయస్యస్యాపి కర్తవ్యం ధర్మమేవానుపశ్యతః-అనిమూలము. శత్రుః ధర్మమేవాను పశ్యతో వయస్యస్యాపి స్వమిత్రశత్రునిరసనం కర్తవ్యమ్ - అని వ్యాఖ్య. 2 నవయం స్వవశే స్థితాః-అనిమూలము. స్వవశే స్థితాః, శాస్త్రవశ్యా ఇత్యర్థః-అని వ్యాఖ్య. ఈపద్యచతుర్థపాదము సందర్భానుసారము స్పష్టార్థప్రతిపాదనమని వ్రాయఁబడినది. 3 కారణం హరిపుంగవ. యచ్ఛ్రుత్వా హేతుమద్వీర-అనిమూలము.

క. వినుమీవు విడువఁ గోపం,బును నాపైఁ బూనకుండు♦వు ననున్ యమునిం
టిని జూడఁబంపుదు ననుచు, మును పల్కితి,దాఁగియుండి♦ మ్రుచ్చువిధమునన్.

క. ననుఁ జంపినాఁడ వంటివి, వనచర! నీవిట్టు లన్న♦వాక్కుల కస్మ
న్మనమునఁ బరితాపము లే,దని, కోపము కల్గదనుచు ♦ నాత్మ నెఱుఁగుమా!.

సీ. మనుజులు పొదలయం♦దును డాఁగియుండియో
కనఁబడుచుండియో ♦ వనులనుండి
బహువిధమృగముల ♦ వలలు పన్నియొ పాశ
ములు వైచియో, మోస♦ము లగు పెక్కు
వ్యాపారములచేతఁ ♦ బట్టుచు నున్నారు;
మఱియు మాంసార్థులౌ ♦ మానవులొగిఁ
బరుగెత్తుచున్నను ♦ భయపడియున్నను
బాధించువార లె♦వ్వరును లేరు

తే. గదయటంచు భయంబేమి ♦ గనకయున్న
నేమఱియెయున్న మత్తత ♦ నెఱుఁగకున్నఁ
జంపుచున్నారు మృగములఁ ♦ దెంపుఁబూని
దీన నేదోషలేశంబు ♦ గానఁబడదు. ౪౦ 666

క. విను ధర్మకౌశలంబునఁ, దనరెడు రాజర్షులును ని♦తాంతముదమునన్
వనములకు వేఁటలాడఁగఁ, జనుచున్నారిద్ది జగతి ♦ సాజము కాదే!. ౪౦½ 667

క. నీవన శాఖామృగమవు, కావున మృగగణమునందుఁ ♦ గలుపఁదగుదు వో
యీ వానర! నాతోడను, నీవని యొనరించు చెదుట ♦ నిలిచియె యున్నన్.

క. అని చేయకున్న ఖేదం, బనునది యూహింపనేల ♦ యనుజునితో నీ
వని చేయుచుండ బాణం,బునఁ జంపితి దీననేల ♦ పొగిలెద వింకన్. ౪౧½

తే. వానరేశ్వర! శుభము, జీ♦వనము, దుర్ల
భముగుధర్మంబు, రాజులే ♦ ప్రజలకెల్లఁ
గలుగఁజేయుచు నుందు రిం♦దులకు సంశ
యంబు లే దెంతమాత్రమే ♦ నాత్మఁగనిన. ౪౨½ 670

క. సురలే భూస్థలమున నర, శరీరములఁ దాల్చి ధర్మ♦సంరక్షణత
త్పరులై నరపాలకులై, తిరుగుదు రబ్లాటచే క్షి♦తిపతుల వాలీ!. ౪౩ 671

సీ. అప్రియంబులు పల్క ♦ నర్హ మేమాత్రముగాదు నిందింపఁగ♦రాదు హింస
చేయ రాదట్లె యా♦క్షేపింపరాదు నీవన్న ధర్మమ్ము ర♦వంతయైనఁ
దెలియకయుండి కే♦వలము రోషముఁ బూని తండ్రి తాతలనుండి ♦ తప్పకుండ
వచ్చుధర్మంబును ♦ వదలకయున్నట్టినన్ను దూషించెద ♦ విన్నిసారు

ఆ. లనియె; రాముఁడిట్టు ♦ లాడినపల్కును, సార్థకంబుచేయ ♦ నతనిఁ జంపి

ధర్మమార్గముల స♦త్తని కుపదేశింప, వాలి వానినెల్ల ♦ నాలకించి. ౪౨ 672

చ. మనమున ధర్మహాపము స♦మంబుగఁ దోఁచుటఁ దన్నుఁ జంపున
ప్పని హితమే యటంచెఱిఁగి ♦ పార్థివపుంగవునందు దోషమే
గనఁబడదంచు నెంచి యటు ♦ గర్వమునన్ రఘురాము నిందసే
సిన యవివేకముం దలఁచి ♦ చింతిలి చేతులు మోడ్చి యంతటన్. ౪౩ 673

క. పరమాత్ముఁడైన శ్రీరఘు,వరుఁ గాంచి మనంబునందు ♦ భక్తితనర నో
పురుషోత్తమా! ననుం గని, కరుణన్ నీవన్నవాక్య♦గణమది హితమా. ౪౪

క. ఆపల్కులెల్ల సత్యము,తే పరికింపంగ శంక♦యే లే దనఘా!
భూపా! ధర్మపథంబది, యేపగిదిం గనిన సూక్ష్మ♦మే యగుఁ జుమ్మా!. ౪౫

ఆ. గొప్పవిషయమందుఁ ♦ గొంకక యల్పుండు
బదులు చెప్పఁబూను♦పని యహితము
సర్వవిదుఁడ వీవు ♦ సర్వహీనుండను
నేను బదులు చెప్ప ♦ నేర్తు నెట్లు?. ౪౬ 676

చ. తెలివియొలేక యుక్తముగఁ ♦ దెంపున నాడిననాదుమాటలం
గలఁగక నాదుదోషమును ♦ గాదిలిప్రేమఁ బ్రమాద మంచు లోఁ
దలఁచి క్షమింపఁగావలయుఁ ♦ దత్త్వవిదుండవు సర్వధర్మముల్
తెలిసినవాఁడ వెంతయును ♦ దీనులఁ బ్రోచెడువాఁడ వోవిభూ. ౪౭ 677

చ. జనులకు మేలుచేయుటకె ♦ సంతతముం దలపోయువాఁడ వా
య్యన సకలార్థముల్ గనిన♦యట్టిమహాత్ముఁడ వెన్న నీవు దం
డనమిది దానికారణము♦నందగుపాప మిదంచునెంచు న
ప్పని భవదీయబుద్ధి యొక♦భంగిని గాంచి ప్రసన్నమై తగున్. ౪౮ 678

సీ. ధర్మజ్ఞ! రామ! క♦ర్తవ్యంబు చేసినవాఁడఁగాను నొనర్ప♦వలనుపడని
యక్రమమును జేసి♦నట్టివాఁడను గాన ధర్మయుక్తంబుగాఁ ♦ దగినయట్టి
పల్కున "నీదుపా♦పమ్ముల క్షమియించితి" నటంచుఁ బల్కు మీ♦దీను నన్నుఁ
గాపాడుమా! మృతిఁ ♦ గాంచితినని నన్నుఁ గూర్చి శోకింపను ♦ గోమలాంగి

ఆ. యైన తారఁగూర్చి ♦ యఖిలబంధువులను,గూర్చి వగవఁగాని ♦ గుణగరిష్ఠుఁ
డగుచు హాటకాంగ♦దాభిరాముండగు, నంగదునిగుఱించి ♦ యడలువాఁడ.

చ. జనివొడ మింతదాఁక సుత♦సత్తముఁడాతఁడు లాలితుండుగాఁ
దనరినవాఁడు గావునఁ బి♦త న్ననుఁ గానక దీనుఁడై మనం
బున వగనొంది కార్శ్యమును ♦ బొందఁగలండు తటాకమెట్లు పీ
తనిఖిలవారియై కృశతఁ ♦ దాఁ గనునట్టులె శ్రీరఘూత్తమా!. ౫౦ 680

క. ఏమియుఁ దెలియనిబాలుఁడు, రామా! తారాత్మజుఁడు ని♦రంతర మతనిన్
గోమునఁ బెంచితి నొకఁడే, యామహితబలుండు నాకు♦నాత్మజుఁడు సుమీ!.

క. కరుణను వానిని నీవును, బరమాత్మా! కావ వలయు ♦ భాస్కరసుతు నా
వరసుతు నిరువుర సమమతిఁ, బరికింపుము యొక్క రీతిఁ ♦ బార్థివముఖ్యా!. ౫౩½

క. కృత్యాకృత్యంబులలో, నిత్యము తప్పేమియున్న ♦ నీవేగద యే
వ్యత్యయ మెన్నక గావఁగ, నత్యయమొందింపనైన ♦ నధిపతి వింకన్. ౫౪

తే. భరతలక్ష్మణులందు నో♦పార్థివేంద్ర!
యెట్టిప్రీతియుఁ గలదో యి♦యిర్వురందు
నట్టిప్రీతియె యుంచుమా! ♦ యనవరతము
తార యేదోష మెఱుఁగని♦తన్వి యయ్యు. ౫౫½ 684

క. నానెలఁతగాన దానం, గానందగు దోషమున ని♦కాముము వ్యథలం
బూనినతారను భాస్కర,సూనుం డవమతిని జేయఁ♦జూడకయుండన్. ౫౬

తే. కట్టుదిట్టము చేయుమా! ♦ క్ష్మాతలేంద్ర!
నీయనుగ్రహమొందుచు ♦ నీకు లోను
గాఁ బ్రవర్తిల్లుచున్ భవ♦త్కృపచిత్త
మునకుఁ దగినట్లులుండునే ♦ ననిశమేను. ౫౬½ 686

క. ధరణిం బాలింపందగు, నురుశక్తిం గాంచియుండు ♦ నొకజగమేకా
దరయఁగ సురరాజ్యము, నా,కరస్థముగఁ జేసికొనఁగఁ ♦ గలుగుదు రామా!.

సీ. అటులైననేల నా♦యనుకంపనొందక యిట్లొనర్చితి వను♦దేని నాకు
నీవలనన్ మృతి ♦ నేవిధినైనను బొంచఁగాఁదగుననను♦బుద్ధి గలదు
గావున నాసాధ్వి ♦ కడఁగి వారించిన ననుజనితోడ ద్వం♦ద్వాహవంబు
చేయఁగా వచ్చితి ♦ నీయెడకని యిట్లు హరినాయకుఁడు విన♦యమునఁ బల్కి

ఆ. యూరకుండె; నంత ♦ నురుతరజ్ఞానంబు, గలిగి పలుకుచున్న♦కపివరుఁ గని
ధర్మతత్త్వమెల్లఁ ♦ దగినట్లు *సామసం,పన్నవాక్కులలరఁ ♦ బలికె నృపతి.

చ. తనయునిపాలనంబున వ్య♦థం గనఁబోకుము సుంతయేని మే
మనయముఁ బూని చేయఁదగ♦నట్టియఘావహమైనకృత్యముం
బొనరిచినారమంచును మ♦ముం దలపోయుచుఁ జింతనొందఁగాఁ
జనదు భవత్కృతాఘమును ♦ స్వాంతమునందుఁ దలంచి వానరా!. ౬౧ 689

తే. చింతనొందకు నీవొన♦ర్చినయఘమును
బట్టి ప్రాచితమును శిక్ష♦వలన మేము
నీకును విధించినారము ♦ నిశ్చయముగ
ధర్మమే యది యని మదిఁ ♦ దలఁచినాము. ౬౧½ 690

సీ. ధరణీశుఁ డెవ్వఁడు ♦ దండింపఁదగువాని దండించునో మఱి ♦ దండ్యుఁడెవఁడు
దండితుండగునో యి♦ద్దఱు వారు దండన మొనరించుటను శిక్ష♦ననుభవించు

* సామసంపన్నయా వాచా-అనిమూలము,

టను సమకృత్యంబు♦లను నెఱవేర్చుటఁ బాపంబునన్ బాధఁ ♦ బడయ రెవ్వరుఁ,
గాన శాస్త్రోక్తప్ర♦కారమే నీవును దండనంబును బొంది ♦ దాన విగత

తే. పాపజాలుండవై ధర్మ♦పరుఁడ వగుచు
నైజరూపంబునుం బొంది♦నాఁడ విపుడు
వనచరోత్తమ! మదిఁగల♦భయవిమోహ
శోకముల నెల్ల వదలుదు♦గాక యింక. ౬౨ 691

[1]క. ప్రారబ్ధకర్మరూపము, గా రాజిలు విధిని మీఱఁ♦గా శక్యంబే
యేరీతినైన నీకున్, బ్రారబ్ధము దాఁటరాదు ♦ బ్రహ్మకునైనన్. ౬౩ 692

చ. వనచర! యంగదుండు పితృ♦భక్తిని నీయెడఁ గల్గి యింతదాఁ
క నెటులు దాను వర్తిలెనొ ♦ కంజహితాత్మజు నందునట్టి క్రీ
తిని యిడి తత్ప్రియుండయి య♦దీనతవర్తిలు నన్నుఁ దండ్రిగాఁ
గనుచు మదీయవత్సలతఁ ♦ గాంచి సుఖించెడుఁ గాక యెప్పుడున్. ౬౪ 693

చ. అని యిటు ధర్మమార్గరతుఁ♦డై మహితాత్ముఁడునై రణావనిన్
దనుజులఁ ద్రుంచు మేటియగు ♦ ధారణినాథుఁడు చక్కఁగా వచిం
చినమధురోక్తుల న్విను చుఁ ♦ జిత్తము జ్ఞానపదాగ్రమొంద ని
ట్లనియెను యుక్తమై తనర ♦ నాకపినాథుఁడు భక్తియుక్తుఁడై. ౬౫ 694

[2]చ. అతిభయదప్రతాప, దివి♦జాధిపతుల్య, భవచ్ఛరాభిపీ
డితుఁడనుగాన నిన్నును గ♦ణింపక ప్రజ్ఞయె లేమి దూఱితిన్
క్షితిపవరేణ్య! దీని మదిఁ ♦ జేర్పక సైపుము నీమనంబునం
దతిశయమైనప్రేమ చెలు♦వారెడుఁ గావుత నాపయిం దగన్. ౬౬ 695

పదునెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

౧౯ - వ సర్గము.

వాలి మృతుండగుట - తార వాలికడకు వచ్చుట.

చ. నరపతిబాణఘాతము మ♦నంబుఁ బగుల్పఁగ నేలపైని దా
నొరఁగినయక్కపీశ్వరుఁడు ♦ యుక్తిచెలంగఁగఁ జెప్పినట్టియా
ధరణిపువాక్యముల్ విని ని♦తాంతము నన్ను క్షమింపు మంచు వి
స్వరమునఁ బల్కి యేమియును ♦ బల్కక యూరకయుండె నంతటన్. ౧ 696

మ. మును సుగ్రీవుఁడు వైచినట్టియుపలం♦బుల్ దేహముం జీల్ప వృ
క్షనికాయాహతిఁ జాలనొచ్చి రఘుభూ♦కాంతాంబకస్ఫారవే

---

1 త్వయా విధానం హర్యగ్ర్య-అని మూ. విధానం విధిః ప్రారబ్ధం కర్మేతి యావత్-అని వ్యాఖ్య. 2 ఇదం మహేంద్రోపమభీమవిక్రమ-అని మూ.

దనచేఁ జిత్తముఁ దూల నింద్రసుతుఁ; డం♦తన్ మృత్యువుం బొందుచోఁ
ఘనమూర్ఛన్ మునిఁగెన్ రఘూత్తము శరా♦ఘాతంబునన్ భూమిపై. ౨।

చ. వనచరనాయకుండు వడి ♦ స్వర్గము నొందె నటంచు నక్కపీ
శుసినతి తార తా వినియె ♦ శూరుఁడు నీపతి రాముచేతఁ దా
నని మొనఁ జంపఁగాఁబడియె ♦ నంచొగి నప్రియమై భయంకరం
బును నగుమాట వే వినుచుఁ ♦ బొక్కుచు భీతిలి యాత్మజన్ముతోన్. ౩। 698

తే. పలువిధములగు కక్ష్యలఁ ♦ బర్వతగుహా
వలెను జెల్వారు కిష్కింధ ♦ లలన వెడలి
వచ్చె నంగదు సేవించు♦వనచరేంద్రు
లతిభయంకరవిక్రము ♦ లైనవారు. ౪। 699

చ. ధనువును దాల్చియున్ననృప♦తల్లజు రామునిఁ గాంచినంతనే
పెనుభయమంది వే చనిరి ♦ వెన్కకు; మేటిమృగంబు చావఁగాఁ
గనినమృగాళి వ్యూహమును ♦ గ్రన్ననఁ బాసి భయంబు పైకొనం
గను జనుసట్లు వాలి మృతిఁ ♦ గాంచఁగ భీతిలి పాఱిపోవు న
వ్వనచరులన్ భయాతురుల ♦ వారిజలోచన చూచెఁ ద్రోవలోన్. ౫ 700

సీ. పగఁ గుంది నృపునకు♦భయపడి తద్బాణములు వెంట నంటఁగాఁ♦గలఁగి పాఱు
చున్నవారో యన ♦ నురుజవమునఁ బాఱుచున్నవారలఁ జూచి♦యువిద పొగిలి
వారికిట్లని పల్కె ♦ వనచరులార! రౌద్రాకారుఁడై తమ్ముఁ♦డై నరవిజుఁ
డన్నను, వాలిరా♦జ్యంబుఁ జేకొనుటకై రామునిచేత దూ♦రంబు చనెడు

తే. భయదబాణము వేయఁగఁ ♦ బంచి మృతినిఁ
బొందఁగాఁ జేసె మీకెన్న♦భూమి లేదు
గాదె భయమేల మీకింకఁ ♦ గానమీర
లెవని యనుచరులో యక్క♦పీంద్రు వాలి. ౬। 701

క. విడనాడి దిక్కుమాలిన, వడువున భయమొంది యేల♦పాఱుచు నున్నా
రుడుగుఁడు చెప్పుఁడటంచని, యడిగెను; దగఁ గామరూపు♦లగు నాకపులన్.

చ. వనచరనాథుపత్ని యిటు♦వల్కిన మాటల నాలకించి యి
ట్లనిరి సయుక్తికంబగుచు ♦ నప్పటికిన్ హితమైనయట్లు; నీ
తనయుఁడు జీవయుక్తుఁడయి ♦ తండ్రిక్రియం దగియున్నవాఁడు కా
వున నిఁక వెన్కకేగు సుఖ♦భూతుని నంగదుఁ బుత్రరత్నమున్. ౧౦। 703

క. కాపాడుకొనుము రఘువరు, రూపంబున యముఁడు వచ్చి ♦ రూక్షతరబలో
ద్దీపకునిఁ జంపి కైకొని, వే పోవుచు నున్నవాఁడు ♦ విబుధనగరికిన్. ౧౧ 704

క. అనుజుఁడు వైచినతరువులఁ, బెనుపాషాణముల వాలి ♦ విక్రమమొప్పం
గను బోవఁద్రోచి శ్రీరాముని వజ్రసమానబాణ♦ముల నిహతుండై. ౧౨

ఆ. పడినవాఁడు, దివిజ♦పతిసముండగు వాలి, పడినఁ బురముచుండి ♦ వెడలి వచ్చి
నట్టి యీభటాళి ♦ యంతయు భయమునఁ, బాఱుచున్న దిప్పుడ♦స్వవృత్తికేఁగ.

క. నగరమహాద్వారంబును, బిగియించి దృఢంబుగాఁగ ♦ విక్రమమునఁ గా
వఁగవలయు నంగదుని రా,జుగ నభిషేకింపవలయు ♦ శుభలగ్నమునన్. ౧౩½

క. నరపతిపదమును నంగదుఁ,డు రహిన్ వహియింపఁగాఁ గ♦డుం బ్రీతిని వా
నరులెల్లఁ గొల్చియుండఁగ,లరు గావున నిట్లుచేయు ♦ బలనామణికో!. ౧౪

క. ఓరుచిరానన! తారా!, యీరీతిం జేయవేని ♦ నీపురినుండం
గోరము సుమ్మీ! యిప్పుడ, వైరులు కపులెల్లఁ బురికి ♦ వచ్చి కడంకన్. ౧౪½

క. మనవసతులు తప్పం ద, క్కినదుర్గంబులను నెల్లఁ ♦ గినుకమెఱయఁ గై
కొనుదురు; చేకొనఁగా నే, మనియందునయేని వాలి ♦ యాగ్రహాయుతుఁడై.

సీ. వనచరులను గొంద♦ఱను బురివెడలించె మును వారిలోఁగొంద♦ఱనయమాత్య
భార్యల నెడఁబాసి♦వందురువారును మఱికొంద ఱితరుల♦మహిళలను స్వ
భార్యలుగా నెంచి ♦ వారిఁ గైకొనియుండువారును వారికై ♦ వాంఛనొందు
వారును జ్ఞాతులౌ ♦ భాస్కరపుత్త్రాదులును రాఁగ వారి♦వలన మనకును

ఆ. సతతసాధ్వసంబు ♦ సమకూడుచునె యుండు, ననిరి; వారలిట్లు♦తనకుఁ బలుక
నంతరం బొసంగ ♦ నయ్యల్పబుద్ధుల, పలుకు లాలకించి ♦ వెలఁది యంత.

క. సుచిరహాసము తోఁపఁగ, బరికించి స్వబుద్ధివైభ♦వమునకు సరిగాఁ
బరమజ్ఞానముతో వన,చరులార! వినుండు నాదు♦స్వాంతేప్సంబున్. ౧౮ 712

చ. వనచరసింహుఁడై యతుల♦భాగ్యము పొల్పెసలార నొప్పు నిం
ద్రునితనయుండు నాప్రియుఁడె ♦ ధూర్తహతుండయి పోవుచుండ నిం
కను సుతుఁడేల? రాజ్యమనఁ♦గా నిఁక నేమిటి? కీశరీరముం
గనినఫలం బిఁకేల? రఘు♦కాంతునిబాణము సోఁకినందునన్. ౧౯½ 713

చ. ధరణిఁ బరుండియున్నమహి♦తప్రియుచిత్తుని పాదయుగ్మసం
కరుహసమీప మేను గనఁ♦గా వడినేగెద; నంచుఁ బల్కి దు
ర్భరతరశోకవేగమునఁ ♦ బాఱుచు నేడ్చుచుఁ గంది యంతటన్
శిరము నురంబు నొక్కుమొగి ♦ జేతులతో నవిరామఘంగగన్. ౨౦ 714

*తే. మోఁదుకొనుచును బోయె నా♦మేదినిఁ గన;
నట్లు పఱుగునఁ బోయి మా♦యావిముఖ్య
దనుజవరులయుద్ధంబులఁ ♦ దమకు నపజ
యంబె యెఱుఁగనివారల ♦ నడచి మించి. ౨౧ 715

సీ. అనిమొన శతమఖుఁ ♦ డతులవజ్రము వైచు పోలికఁ బర్వతం♦బులను వైచు
శూరుఁడై వాతముల్ ♦ సొరిది నొక్కటఁ జేరి నంతటి వేగము ♦ నన్ని మేఘ

* హంతారం దానవేంద్రాణాం సమరే ష్వనివర్తినామ్-అనిమా.

ముల పెనుగర్జిత♦ములకు సమానమౌ ధ్వనియును శతమఖ♦పౌరుషసమ
పౌరుషంబును గల్గి ♦ వఱలి యొక్క విధంబు గాఁగ వర్షించి ని♦కామవిరతిఁ
[1]తే. జెందినట్టి మేఘమువలె ♦ నొంది శాంతి
నఱచువారలలోఁ జక్క ♦ నఱచుశక్తి
గలిగి శూరుఁడునయి శూర♦కల్పితాంబ
కమున హతుఁడయి యిలఁబడి ♦ క్రాలువాలి. ౧౩ 716

క. తనపతిని దారఁ గాంచెను, ఘనుఁడాతఁడు మఱియుఁ బలల♦ఖండమునం దా
[2]శను బూని సింహహతమౌ, ఘనపంచాస్యంబురీతిఁ ♦ గనఁబడుచుండెన్.

సీ. శౌర్యాదిసద్గుణ♦సంపత్తిచేఁ బూజ్యుఁ డయ్యును సోదరు ♦ నతివఁ గొనిన
యఘమున శ్రీరాము ♦ నంబకహతుఁడయి యుండుట సర్వలో♦కోత్తరమయి
యర్చనీయంబయి ♦ యమలధ్వజాలంకృతంబయి విశ్రమా♦ర్థంబు వెలయు
వేదికాన్వితమయి ♦ విషధరవాసకారణమున గరుడప♦రాక్రమమున
తే. నున్మథిత మగుచైత్యమ ♦ ట్లుర్వినుండె;
నంతఁ దారయుఁ బతిచెంత ♦ నాయతధను
వూని నిలుచున్న రాముని ♦ వానియనుజుఁ
దనవిభుని సోదరునిని గాం♦చెను సరగున. ౧౪ 718

చ. వనితయు నంత భర్తృరిపు♦వర్గము దాఁటి జవంబు మీఱఁగాఁ
జని రణసీమఁ జంపఁబడి ♦ క్ష్మాస్థలిపైఁ బడియున్న ప్రాణనా
థునిః గని చెంతకేగి వగ♦తోఁ గని చచ్చె నటం చెఱింగి మూ
ర్ఛను మునిఁగెన్ మహాతురత ♦ క్ష్మాస్థలిపైఁ బడియెన్ శవాకృతిన్. ౧౫
[3]ఆ తరుణి నిదురనొంది ♦ తగ మేలుకొనినట్టు, లపుడు లేచి పతిని ♦ నార్యపుత్ర!
యనుచు జీరి యేడ్చె;♦[4]నంతట మృత్యుపా,శములఁ గట్టఁబడిన♦స్వప్రియుఁ గని.

చ. పెనురవమొప్ప నేడ్చె నిటు ♦ భీరువు శారికవోలె నేడ్చుచున్
దనపతిఁ బిల్చుచున్నయల♦తారను నచ్చట కేగుదెంచి వే
జనకునిఁ గాంచి దీనుఁడయి ♦ సత్త్వముఁ బాసినయంగదుం గనుం
గొని రవిసూనుఁ డాత్మఁగల♦కోపముఁ బాసి [5]విషాదమొందెఁ దాన్. ౧౬

పందొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

1 వర్షంతం వర్షతాం భీమం-అనిమూ. 2 శార్దూలే నామిష స్యార్థే మృగరాజం హతం యథా-అనిమూ. శార్దూలేన సింహేన-అని వ్యాఖ్య. శార్దూలశబ్దమునకు వైజయంతినిఘంటువున సింహమర్థమని యున్నది. 3 సుప్త్వేవ పున రుత్థాయ-అనిమూ. 4 సందితం మృత్యుదామభిః - అనిమూ. 5 విషాద మగమ త్కష్టం దృష్ట్వా చాంగద మాగతమ్-అనిమూ. ఇట "నాత్మఁగలకోపముఁ బాసి" యనునది మూలమున లేనిది. ఐన నిది పద్యార్థమును జక్కఁగాఁ బోషించును గాన నిట నుండఁదగినదేయని యొఱుంగునది.

## ౨౦ - వ సర్గము.

తారా విలాపము.

క. తారాధీశాననయా, తారయు శ్రీరామదివ్య♦ధనుర్ముక్తశరా యొం
తోరయమున విడువంబడి, ఘోరంబయి యంతకంబుఁ♦గూర్చినదియునై.

క. పరఁగెడుశరమున హతుఁడై, ధరణిం బడియున్నవిభునిఁ♦దాఁ గని మిగులం
బరిసరము చేరి పైఁబడి, తరుణియు బాహువులఁ జాఁపి♦తమిమీఱంగన్. ౧

ఆ. కౌఁగిలించుకొనియెఁ♦గరిభంగిఁ బొల్చుచు, వజ్రతుల్యుఁడైన♦వాసవేంద్రు
శరసమాభిహతునిఁ♦బరశువిచ్ఛేదిత, మూలవృక్షమట్లు♦నేలఁగూలి. ౨ 724

క. తనతోఁ బలుకకయుండిన, వనచరపతిఁ గాంచి తార♦పరమాతురయై
వనటం దూలుచు శోకిం,చెను వీరాగ్రణివి ప్లవగ♦జిష్ణుఁడవుగదా. ౩ 725

చ. అనిమొన నీదువిక్రమ మ♦హార్యము గాదె తలంప నాయకా!
మనమున నేని నప్పు నొక♦మాఱును జేసియెఱుంగ దీననై
కనఁబడునన్నుఁ జూచి పలు♦కం దలపోయవిదేల? యిప్పుడో
వనచరనాథ! శార్దృశులు ♦ పార్థివసత్తము లిట్లు భూస్థలిన్. ౪ 726

క. శయనింపరు సూ! నీవిటు, శయనించు టయుక్త మింకఁ♦జాలును లెమ్మా
శయనోత్తమమున నీవిఁక, శయనింపుము భూమినుండఁ♦జనునే నాథా!. ౫

తే. నీకు నాకన్న భూమియే♦నెమ్మిఁగూర్చు
కాంతయాఁ గద; రాజేంద్ర! ♦ గతవిచేత
నుండవయ్యును నవయశ♦మండలిధరఁ
గౌఁగిటం జేర్చియున్నావు♦గదలకుండ. ౬ 728

సీ. వీరోత్తమా! నీవు♦భూరితావకధర్మమాహాత్మ్యమున స్వర్గ♦మార్గమందుఁ
గిష్కింధవలెఁ బరి♦కీర్తనీయంబగు మఱియొకనగరంబు♦నెఱిఁ దగంగ
నిర్మించుకొనినట్లు♦నిశ్చయంబుగఁ దెలియంగవచ్చెడుఁ గాన♦నవలఁ జనఁగఁ
దలఁచితి వీవు ని♦ర్మలరీతిఁ బొల్చుచు మధుగంధముల మీఱు♦మహితవనము

తే. లందు మముఁగూడి తగునను♦యంబులందు
సలుపుచుండిన కేళుల♦నమయఁ జేసి
తివిగదా!; హరియూథప♦తివి బలాఢ్యుఁ
డవుగదా! యిట్టినీవు త♦నువును వదల. ౭ 729

క. నేనివు డానందంబును, గానను మఱియొక్కతఱిని♦గానీ నిన్నుం
గానఁ జనునన్న యాశయు, మానసమున లేదుగాదె♦మహితవిచారా!. ౮

క. కనుకన్ దుఃఖమహార్ణవమున మునిఁగితి; నీవు బాణ♦మున నిహతుఁడవై
కనుమూసి ధరణిఁగూలఁగఁ, గనులంజూచియును నాదు♦కఠినహృదయమున్.

క. వగపెల్లన వేయిగ నిదె, పగులక యున్నయది కానఁ ♦ బాషాణంబే
యగునని చెప్పంజను నో, యగధైర్యా! యనుజభార్య♦యగు రుమ నీవున్.

తే. అపహరించితి వాతని ♦ నతికఠినతఁ, బురము వెడలంగ నడచితి ♦ వరయ దాని
ఫలమె నీకును నిప్పుడు♦గలిగెఁగాదె?, వనచరేశ్వర! నీహిత♦మును దలఁచుచు.

క. హితములు వల్కితి నప్పుడు, హితభాషిణి నంచు నెఱుఁగ♦కే నను నీ వ
జ్ఞత దూషించితివిగదా!, మతిమంతా! వీరలభ్య♦మంజులపదముల్. ౧౨ 734

క. కరగతము చేసికొంటివి, సురపురి యౌవనవిలాస♦శుభరూపములన్
స్మరతంత్రంబులనేర్పునఁ, బరఁగినయచ్చరల మదులఁ ♦ బ్రమథించెదువా!. ౧౩

[1]చ. ఒరులకుఁ జిక్కనట్టి మహి♦మోన్నతి మించినవాని నిన్ను ని
ర్భరబలసంపదన్ వివశు ♦ వారకచేయుచు నంతఁబోక స్వో
దరవశమొందఁ జేసినది ♦ తావకజీవితమృత్యురూపమై
పరఁగినకాలమే సుము! ధ్రు♦వంబిది యెవ్విధినైనఁ జూచినన్. ౧౪ 736

క. మును దుఃఖమే యెఱుంగక, మనమున సంతోషములర ♦ మనుదాననె య
య్యెను వైధవ్యంబున దీ,ననౌచు వగనొందఁగలను ♦ నాథా! యింకన్. ౧౫

సీ. వీరుఁడై మతిసుకు♦మారుఁడై సుఖమొందనర్హుఁడై యున్నయీ♦యంగదుండు
నీచేతఁ బ్రీతిచే ♦ నిత్యోపలాలితుం డగుచుండు నిఁకమీఁద ♦ నవనిఁ బిన్న
తండ్రి సుగ్రీవుండు ♦ దారుణక్రోధాభిమూర్ఛితుండయి క్రూర♦ముగఁ గనంగ
నేదేశమందునో♦యేమియుఁ దోఁపక నశియించుఁగాదె? యో♦నాథ! యనుచుఁ

తే. బలికి వచ్చినయంగదు ♦ లలనచూచి
ధర్మవత్సలు నినుఁగన్న♦తండ్రి దర్శ
[2]నీయు నిప్పుడె చూడుమా ♦ నాయనా! యిఁ
కను జనకుఁ జూడ నెవ్విధిఁ ♦ గాదు నిజము. ౧౬ 738

[3]చ. అని పతిఁ గాంచి దూరగత♦మానగరంబున కేగ నీవు వాం
ఛను గొనియున్నవాఁడవు వి♦శాలభుజా! సుతరత్నముం గరం
బునఁ దెమలించి మస్తకము ♦ మూర్కొని యూఱడిలంగఁ బల్కు మిం
కను వచియింపఁగాఁ దగిన♦క్రమమృదూక్తులఁ జెప్పుమా! దయన్. ౧౭ 739

---

1 కాలో నిస్సంశయో నూనం జీవితాంతకర స్తవ, బలాద్యే నావపన్నోసి సుగ్రీవ స్యావశో వశం-అనిమూలము. 2 దుర్లభం దర్శనం వత్స తవ తస్య భవిష్యతి - అనిమూలము. ఎవ్విధిఁగాదు నిజము-అనుదానిని రసపుష్టిచేయఁగలదనుతలంపున హెచ్చుగాఁ జేర్పఁబడినది. 3 సా సమాసాద్య భర్తారం పరిష్వజత భామినీ, ఇషు ణాభిహతం దృష్ట్వా వాలినం కుంజరోపమం-అనుశ్లోక మధిక పాఠముగా నిటఁ జేర్పఁబడినది. ఇది ప్రకృతార్థబాధకమని గోవిందరాజమహేశతీర్థులు వ్యాఖ్య చేయక వదలిరి. నేను నట్లే వదలితినని తెలియందగు.

సీ. అనపరాధిని నన్ను ♦ ననిసేయువానిని జంపి రాముఁడు జన♦సమ్మతముగు
వీరకార్యముచేసె ♦ నా రాఘవుఁడు కపివుత్త్రుని యెదుటఁ దాఁ ♦ బూనినట్టి
శపథంబు నెఱవేర్చె ♦ నరక బుణంబును బాపికొనఁడయ్యె ♦ నీసమయము
నందనిపల్కి య♦ర్కాత్మజుఁ గని యిదే సుగ్రీవ! నీవైరి♦శుభచరితుఁడు
తే. నీకు నన్న హతుండయ్యె ♦ నీదుకోర్కె
లను నికం దీర్చుకొమ్ము రు♦మను గ్రహింపఁ
గలవు నిష్కంటకంబగు ♦ కపులరాజ్య
మే దిగులు లేక హాయిగా ♦ నేలుమింక. ౨౦ 740

క. అనిపలికి మరల వాలిం, గని వానరనాథ యిట్లు♦గా శేష్ఠుఁడున
న్ననుకంపఁ బిలిచి పల్కెల, ననునయ మొందంగఁ జేయ ♦ వదియే మొకట్రా.

క. కనుమా యిదె నీభార్యలు, వనటం గుందుచును నిటకు ♦ వచ్చినవా శ్రీ
వనితలఁ బెక్కం క్రను నా,క్కనిముసమైనను గనంద♦గదె ప్రాణేశా!. ౨౧

క. అని తారయేడ్వఁగా విని, వనచరపతిభార్యలెల్ల ♦ వగఁ గుందుచు నా
తనిసుతు నంగదు కీనుని, గని కౌఁగిటఁ జేర్చుకొనుచుఁ ♦ గడుదైన్యమునన్.

క. విలపించి రిట్లు తారము,పలుగాఁ గలవారలెల్లఁ ♦ దపనీయమహో
జ్జ్వలచార్వంగద! శౌర్యను,విలాసబాహూ! మహాత్మ ♦ విమతహర! యిదే.

చ. తనయుని నంగదు న్విడిచి ♦ తద్దయు దూరమునందు నున్నదే
శనివసతిన్ మదిం గొనుచుఁ ♦ జాల శరత్తులు కాపురంబుచే
యను జననేలపోయెదు! ప్రి♦యాత్మజు సద్గుణజాలమందు నీ
కును సరివచ్చువాని విడి ♦ గొబ్బునఁ బోవుట యుక్త మెట్లగున్. ౨౩ 745

[1]చ. మనమున కింపుఁ గూర్పఁ దగు♦మంజులరూపము గల్గునో ప్రియా
తనయుని నంగదాఖ్యు నను ♦ దారుణకీర్తిని వీడి దూరమా
జనపదమందునుండుటకు ♦ స్వాంతమునం దొగి నిశ్చయించి పో
వను బయనంబు చేసితివె ♦ పల్కుము యే మపరాధ మేము చే
సినయది యున్నదో కరుణఁ ♦ జేకొని కావుము నైపు దానినిన్. ౨౪ 746

చ. అనితరశక్తి! దీర్ఘభుజ ♦ యాత్మ నెఱుంగక యప్రియంబు దే
వినయినఁ జేసియున్న నిట ♦ నీపదయుగ్మముసోఁక నాశిరం
బును దమిఁ వంచి మ్రొక్కెదను ♦ భూరితరంబగుతప్పయైన దా
నిని క్షమియింపఁగావలయు ♦ [2]నేర్పన నిట్టిదె కాదె నాయకా!. ౨౫ 747

---

1 ఇటఁ బైపద్యార్థమే మరలఁ జాలభాగము చెప్పఁబడినది. ఇది మూలానుసారమే కాని స్వకల్పితము గాదని యెఱుంగవలయు. 2 నేర్పననిట్టిదె కాదె-అనునది రసపోషకమని చెప్పఁబడినది.

తే. అనుచు విలపించె నిట్లనిం♦ద్యాంగియైన
తార వానరకాంతలు ♦ దైన్యమొంది
యేడ్చుచుండిరి; తార క♦పీశుఁ డున్న
కడనె ప్రాయోపవేశంబుఁ ♦ బూననెంచె. ౨౮ 748

ఇరువదియవ సర్గము సంపూర్ణము.

---

## ౨౧ - వ సర్గము.

### హనుమంతుఁడు తార నోదార్చుట.

చ. తనపతిపాదపద్మముల♦దాపున భూమిని ద్రెళ్లి యంబరం
బును విడనాడి భూమిఁ బడి ♦ భూతి దొరంగినతారవోలె నొ
ప్పినయల తారదగ్గరకు ♦ వెళ్లి హరివ్రజముఖ్యుఁడై నయా
హనుమ వచించె దుఃఖమును ♦ నార్పెడుపల్కుల మెల్లమెల్లనన్. ౧ 749

[1]సీ. ప్రతిప్రాణియును స్వక♦ర్మములవాసనలను బట్టి జ్ఞానాజ్ఞాన♦భవములయిన
యట్టిశుభాశుభా♦త్యాయతకర్మములకును ఫలంబులై ♦ ప్రకటములగు
సుఖదుఃఖములఁ బొందు♦చుం బుట్టుచును జచ్చుచుండునుగాని మ♦ఱొక్కరీతి
నితరునిచే మంచి♦యేఁ జెడ్డయేనియుఁ గలుగదు తానె యాఁ ♦ గారణంబు

ఆ. ఎట్టికర్మమున న♦దెట్టిలోకము నేనుఁ
బొందఁగలనొ యనుచుఁ ♦ బొగులవలసి
యున్నదాన వీవె ♦ యొగి నినుఁ గూర్చియే
యిట్టిసీవితరుని ♦ నెవనిఁగూర్చి. ౨। 750

[2]క. వనితా! శోకించెద వీ,వును దీనతనొందియుండు♦వుగదా మఱి దీ
నుని నెవనిగాంచి జాలిం, గనియెదవో చెపుమ వగకుఁ ♦ గారణ మిచటన్. ౨౪

క. తనువిది బుద్బుదతుల్యము, వనజాక్షీ! యందఱట్టి♦వరునను దమవా
తనవులఁ దగియుండురుగా,వున నెవ్వనిఁ జూచి వగను ♦ బొందనెవనికొ. 3

క. కొమరుఁడు నీకుండుట సహ,గమనము చేయంగరాదు♦గా యంగదునిన్
మమతం బోషింపందగుఁ, బ్రమదా! యిఁకముందుఁ జేయ♦వలసినహితముల్.

చ. మనమున నెంచఁగాఁదగును; ♦ మానిని పాండితిఁ గన్నదానవై
తనరుదుగాదె భూతసము♦దాయగతాగతముల్ స్థిరత్వముం
గననివెయాట తెల్లమగుఁ♦గాదె శుభంబగుప్రేతకృత్యమున్
బొనరుపఁగాఁదగున్ వగను ♦ బొందుచు నేడ్చుట మానఁగాఁదగున్. ౫ 754

---

[1] ఇది మూలవిరుద్ధము కాదు. మూలమున సంగ్రహముగ నున్నయర్థ మిట విస్తృతమని మాత్రము గ్రహించి మన్నింపఁదగు. [2] శోచ్యాశోచసి కిం శోచ్యం దీనం దీనానుకంపసే-అనిమూలము.

సీ. హరిసహస్రములకు ♦ నయుతశంకుల కర్బుదములకు సమముగా ♦ నమరియున్న
కపులకు భాగముల్ ♦ కల్పించి మనుగడ గలుగఁ జేయుచునున్న ♦ యుగ్రమహాత్ముఁ
డీవాలి మరణించె ♦ నిప్పుడు తాఁ జేసికొన్న పుణ్యఫలాళి ♦ ననుభవింపఁ
బోయియుండఁగ నీవు ♦ పొగులుట తగదింక శాస్త్రములం జక్కఁ ♦ జదివి వాని

ఆ. తత్త్వముల నెఱింగి ♦ తగ సామదానక్ష,మాదులందు నడచు ♦ మహితధర్మ
మును జయించినట్టి ♦ మనుజులకుం దగు, పుణ్యలోకములకుఁ ♦ బోయె వాలి.

చ. కనుకనె యాతనిం గుఱిచి ♦ కామిని! వగ నొందరాదు నీ
తనయున కీకపీశసము ♦ దాయమునంతటి కీవె దిక్కుగా
వునఁ గపిభర్తృరాజ్యములు ♦ పొందుగ నీవను దిక్కు గల్గియే
తనరుచునుండు నీవగను ♦ దగ్గియుఁ బాపుము పీడ మెల్లనన్. ౨౫ 756

ఆ. నీదుసాయమునను ♦ నీసుతుఁ డంగదుం
డీకపీంద్రరాజ్య ♦ మిప్పు డేలుఁ
గాక యెందుకొఱకుఁ ♦ గా సంతతియుఁ గనఁ
బడినదయ్యెఁ జేయ ♦ వలయు నేదొ. ౨౬ 757

ఆ. అట్టి యౌర్ధ్వదైహి ♦ కామలకృత్యంబు,లను యథోక్తములుగఁ ♦ దనయుచేత
వాలికిప్డు చేయఁ ♦ బడునట్లు చేయుమిా, యిపుడు చేయఁదగిన ♦ దిదియె సుమ్మ.

క. వనచరపతి సంస్కారము, గనఁ జేయుము రాజ్యమందు ♦ క్ష్మాపతిగా నీ
తనయుని నభిషేకింపుము, వనితా! సింహాసనమునఁ ♦ బరఁగుకుమారున్. ౧౦౫

క. కనుఁగొనినప్పుడు శాంతిం, గనఁ గల్గుదు వీవటంచుఁ ♦ గాంతమనము శాం
తిని గనఁ బల్కెను దారవి,భుని దుఃఖముచేత మిగులఁ ♦ బొగులుచు నంతన్.

క. హనుమంతునివాక్యములన్, విని పలికెన్ దనదుమాట ♦ వినఁగాఁ గాంక్షిం
చి నిలిచినయతనితో నా, తనిమాటల కుత్తరముగఁ ♦ దగినవిధమునన్. ౧౨

చ. తనయులు సద్గుణాఢ్యులు శ♦తంబులు నంగదతుల్యు లొక్కప్ర
క్కను, హితుఁడై పరాక్రమము ♦ గ్రాలెడుమేటియు నైన యిమ్మహా
ఘనుని సుఖాలయంబయిన ♦ కౌఁగిలి యొక్క దెసం జెలంగ నా
కును బతి కౌఁగిలింతయె త♦గున్ సతతం బధికంబుగాఁ గపీ. ౧౩ 762

సీ. పతికి సంస్కారంబుఁ ♦ బాటించి యంగదు నభిషిక్తుఁ గాఁ జేయు ♦ మంటివీవు
కార్యములన్ వీనిఁ ♦ గడఁగి చేయుటకు స్వాతంత్ర్యము గలిగిన ♦ దానఁ గాను
వాలికిఁ బిదప స♦ర్వంబును నెఱవేర్పఁ బినతండ్రి సుగ్రీవుఁ ♦ డనఘుఁ డర్హుఁ
డగు హరిసత్తమా! ♦ యంగదువిషయమై యోజింప నర్హత ♦ నొందుదాన

తే. నేనుగాఁ దలపోసితి ♦ వీనియతిని
గైకొనన్ రాదు కొమరునిఁ ♦ గాచుపనికిఁ

[1]దండ్రియే యప్పుడగుఁ గాని♦తల్లి బంధు
వెంతమాత్రము గాదని ♦ యెఱుఁగవలయు. ౧౯ 763

చ. తనపగవానికే యెదురు ♦ తానయిపోరి శరీర ముర్వి నీ
యనిమొనవీడి వీరశయ♦నాదరుఁడై పడియున్న యామహా
త్మునిశయనం బె నాకు నగుఁ ♦ దోఁపదు నావిభునాశ్రయంబుక
న్నను నిహమందుఁ బైనను గ♦నంగను నెక్కువ యొండు మారుతీ!. ౧౭ 764

ఇరువదియొకటవ సర్గము సంపూర్ణము.

---

౨౨ - వ సర్గము.

వాలి తెలివినొంది కర్తవ్యముఁ దెలుపుట.

క. చనుచున్నప్రాణపంచక, మున వాలియు నూర్పుగములఁ ♦ బుచ్చుచు మెలమె
ల్లన నాలుగుదిక్కులనుం,గనుచుఁ దొలుదొల్తననుజుఁ♦గనెఁ దనయయుతున్.

చ. వనచరకుంజరుండయిన♦వాలి జయంబును గాంచియున్నయా
యనుజునిఁ జూచి యెంతయును ♦ వ్యక్తములౌపలుకుల్ తగంగ ని
ట్లనియెను స్నేహయుక్తముగ ♦ నల్లనఁ జెంతకుఁ బిల్చి; తమ్ముఁడా!
నిను వనభూమికిన్ దఱిమి ♦ నీసతిఁ గైకొని నిర్భయంబుగన్. ౨౫ 766

తే. పాపమొనరించితినని నా♦పై నఘంబు
నెన్నకుము, భావికాలమం ♦ దిట్టిఫలము
గలుగవలసియె యున్నది ♦ గాన నాదు
బుద్ధి కీమోహ ముదయించి ♦ పూన్కి మెఱయ. 3 767

క. బలమలర లాఁగి కృత్యం, బుల నాచే నిట్టివానిఁ ♦ బొందుగఁ జేయిం
చె లలి నటంచుం దెలియుము, పలుకొక్కటి వినుము వత్స !♦బరవస మలరన్.

క. మనకిర్వురకున్ రాజ్యం,బున గల్గెడుసుఖము తోఁడఁ♦బుట్టుల కుండం
గనగు హితంబును నొక్కట, దనరం గూడదని తలఁచె ♦ దైవం బనుచున్.

[2]చ. మనమున నెంతు దైవగతి ♦ మానదు తప్పక యుల్లెరంగను నేఁ
జనియెద నిప్పుడే యమును♦సద్మముఁ జేరఁగ నీవు చక్క నీ
వనచరరాజ్యముం గొనుచుఁ ♦ బాలనచేయుము ప్రాణరాజ్యముల్
ఘనతరసంపదల్ భువిని♦గల్గిన నాదగునచ్ఛకీర్తియున్. ౯౫ 770

క. నను వదలి పోవుచున్నవి;, వనచరనాథా! తగం బ్ర♦పంచము విడువం
గను దగు నీసమయంబున, ననుమానము లేక చెప్పు♦నట్టి మదుక్తుల్. ౭౫

---

1 పితాహి బంధుః పుత్రస్య నమాతా హరిసత్తమ-అనిమూ. 2 మా షు వ్యదైవ్యా గచ్ఛంతం విద్ధి వై వస్వతక్షయమ్-అనిమూ. క్షయ మనఁగా గృహము.

ఆ. అనుసరించియుల్లె ♦ యొనరింపఁ గష్టము,గాఁగఁ గానఁబడినఁ ♦ గాదనకయె
వానిఁ జేసితేని ♦ వలయు నియంగదుఁ, డనయము సుఖవృద్ధి ♦ నంది వెరిగె. ౮

క. వినుమా! సుఖములు కష్టం, బనయంబగు, వయసునందు ♦ నడరిన బాల్యం
బనవచ్చుఁగాని బుద్ధిం,గన బాలుఁడు గాఁడు వీఁడు ♦ ప్రాప్తలి నిపుణా. ౯

తే. బాష్పపూర్ణాస్యఁడై యడె ♦ పడియె యున్న
వాఁడు వానిని జూడుమా ♦ వీఁడు నాకుఁ
బ్రాణములకంటెఁ బ్రియుఁడయి ♦ వఱలు నీవు
కన్నకొడుకని వీనిఁ ♦ గావవలయు. ౧౦ 774

సీ. నేనేగుచున్నాఁడఁ ♦ గానఁ దంత్రి యొలేనికొఱఁతచే నితఁడు ♦ గుంది కుంద
నన్నివిధంబుల ♦ నరసి వీనిం గావవలయు నోవనచర ♦ వర్య, వీని
కేఁకమీఁద నాపలె ♦ నేమిగోరినవాని నెల్లనిచ్చుచు దాత ♦ వెల్లవేళలఁ
బోఁదోలి కాపాడఁ ♦ బూనుచుకుఁడవు భయములు గల్గన ♦ భయము నొసఁగు

ఆ. వాఁడ వీవెకాక ♦ వసుధ మఱెవ్వఁడు, గలఁడు? శ్రీయుతుఁడయి ♦ క్రాలుతార
కొమరుఁ డితఁడు విక్ర ♦ మమున నీసాటియై, దనుజులనువధించు ♦ తఱినిబూని.

క. నీముందునిలువఁగాఁ గలఁ, డీసుత్పుతుఁ డంగదాఖ్యుఁ ♦ డెన్నఁగ నీవు ను
ద్దామవయస్కుఁడ వైన, భీమాయతబలుఁడ వగుచుఁ ♦ బెంపారుఁజుమీ.

క. అతిజవనంతుఁడు గావున, నితఁ డనిమొన విక్రమంబు ♦ నే నెఱుపుచు ను
ద్ధతిమీఱఁ దనకుఁ దగుకృ,త్యతతులఁ గావింపఁగలఁడు ♦ హరికులనాథా!. ౧౨

సీ. వినుము సుషేణుని ♦ తనయ యీతార సూక్ష్మార్థనిశ్చయముల ♦ యందు భావి
వివిధాపదలయందు ♦ సువిహితబుద్ధియై తనరుఁ జుమ్మా! యీసాని ♦ తంబిని యొక
యాశయంబును జెప్ప ♦ నదియట్లయగుఁగానిమార్పునొందదు గాన ♦ మాన కీమె
చెప్పినయట్టులే ♦ చేయఁగా వలయును సంశయమొందఁగాఁ ♦ జనదు నీవు

తే. రామకార్యమునందుమా ♦ త్రము విశంక
నొందకప్పుడె పూనిక ♦ నొనపుపఁదగుఁ
జేయవేని యధర్మంబు ♦ చేకురుటయె
కాక యవమానితుండయి ♦ కరుణవీడి. ౧౪ 775

క. నినుఁ జంపుఁ జుమ్ము రాముఁడు, వనచర! దేవేంద్రదత్త ♦ భర్మాంచితమా
లను దీని నిపుడె కొనుమా, ఘన తేజఃకలితమగుచుఁ ♦ గ్రాలెడునిదియుణ్.

క. నే మృతినొందిన నవ్వేల, నీమాలిక యసమకాంతి ♦ హీనతఁ గనుఁ జూ
నే మృతినొందకమునుపే, తామరసనఖాత్మజన్మ ♦ తగఁ గైకొనుమా!. ౧౬

చ. అనియిటు వాలిపల్కుటయు ♦ నయ్యనసూనుఁడు భ్రాతృసౌహృదం
బునఁ బ్రమదంబు వీడి వగఁ ♦ బొంది తమోగ్రసితాబ్జబింబ మ

ట్లనుదితకాంతివక్త్రుఁడయి ♦ యూ ర్తిని గుందె; నచంతరంబ య
[1]వ్వనచరనాథునాజ్ఞ గత♦వైరుఁడు గావున సూర్యపుత్త్రుఁడుఁ. ౧౭౪ 781

చ. అనుమతుఁడై సువర్ణమయ♦మై తగుమాలికఁ దా గ్రహించె వే
వనచరరాజు వాలి తన♦ధర్మమయంబగు నైంద్రమాల న
య్యనుజున కిచ్చి మృత్యుముఖ♦మందుఁ జొరంబడనున్నయట్టిఁడా
తనకుఁ బురస్థలి న్నిలిచి ♦ తద్దయుఁ దూలెడుపుత్త్రు నంగదుఁ. ౧౯ 782

[2]చ. కనుఁగొని పల్కె స్నేహమునఁ ♦ గాలము దేశమెఱింగి యప్రియం
బును బ్రియముం దలంచుకొని ♦ భూపతి పల్కినయేని యప్రియం
బును బ్రియమట్లు లోర్చుకొని ♦ వ్వానిక దుఃఖమునందు శర్మముఁ
ఘనతరశర్మమందును వ♦గఁ సహియించుచుఁ బిన్నతండ్రి కే
యనిశము లోనుగాఁ దిరుగు ♦ మర్భక! నే మృతి నొంద నవ్వలఁ. ౨౦ 783

క. ఆయతబాహూ! నే నో, నాయన! దన్పితినో లాల♦నముల నటులనే
నాయనుజుఁడు సుగ్రీవుఁడు, నాయట్లే నిన్ను లాల♦నంబులఁ దనుపుఁ. ౨౦౪

[3]క. కనుక న్నాయెడలను నీ, వనయము వర్తించినట్లె ♦ యాతనియెడలఁ
దనువెల్లఁ గన్నులుగ నా, తనయా! వర్తింపుచుండఁ ♦ దగు నేమఱకే. ౨౧

క. అరిసూదన! సుగ్రీవుని, యరిసంగతినున్నపురుషు ♦ నరయు మితని కే
పురుషుఁడు శత్రువో యతనిఁ, బరికింపుము చేరఁబోకు ♦ వారల నెపుడుఁ.

తే. నీకుఁ బ్రభువగుసుగ్రీవు ♦ నిఖిలకార్య
ములను నాసక్తి గలిగియొ ♦ వలయుఁ జేయ
నింద్రియములకు లోఁబడ♦కేమెలఁగుము
పతికి నాజ్ఞానువర్తివై ♦ పరఁగు మింక. ౨౨ 787

క. అతిమైత్రియు నప్రణయము, క్షితి దోషతమంబులనుచుఁ ♦ జిత్తమునఁ దలం
చి తగఁ వానిఁ వదలుము, [4]సుత! మధ్యమతఁ మెలంగు♦శుభగుణనిలయా!

వాలి పరలోకమున కేగుట.

చ. అని వచియించి యంతట న♦హార్యశరోత్తమపీడితాత్ముఁడై
కనులకుఁ జీఁకటుల్ గలుగఁ♦గా దశనంబులు పైకి వచ్చి భీ
తిని గలిగించునట్లమరఁ ♦ దెప్పునఁ బ్రాణములం ద్యజించె; నం
త నచటివానరోత్తములు ♦ తన్మృతికై విలపించి రొక్కటఁ. ౨౮౪ 789

---

1 తద్వాలివచనాచ్ఛాంతః - అనిమూలము. 2 దేశకాలౌ భజస్వాద్య క్షమమాణః ప్రియాప్రియే, సుఖదుఃఖసహః కాలే సుగ్రీవవశగో భవ-అనిమూలము దీనియర్థమే పద్యమున నిట విస్తృతము. 3 తనువెల్లఁ గన్నులుగ-అనునది జాగరూకత యనునర్థము నిచ్చును. 4 తస్మాదంతరదృగ్భవ-అనిమూలము. మధ్యమభావ మవలంబ స్వేత్యర్థః-అని వ్యాఖ్య.

క. వనచరులకు హరియూథపు, లనాథముగ జేసి యిట్టు ♦ లని; రిత్తఱి నే
వనచరనాథుఁడు మృతిఁగనఁ,గ నగర మిది శూన్యమైన ♦ కరణిఁ దనరెనే. ౨౫ 790

తే. పర్వతోద్యానకానన ♦ పటలమెల్ల
శూన్యముగ నయ్యె వానర ♦ శూరుఁ డితఁడు
హతుఁడయిన వానరోత్తము ♦ లమలకాంతి
హీనులుగ నైరి చెప్ప నిం ♦ కేమిగలదు ౨౬ 791

చ. వనచరనాయకుండు గతి ♦ వైభవమొప్పఁగఁ బోవుచుండ నా
తని గతివేగఘాతమున ♦ దారుణకాననముల్ వనంబులో
య్యన సుమయుక్తి నామహీతు ♦ నాకృతిమీఱఁగ వెంబడించు నే
ఘనుఁ డెవఁ డిప్పుడట్టిదగు ♦ కార్యముఁ జేయఁగఁ జాలు నక్కటా! ౨౭ 792

సీ. ఆయతభుజుఁడు మ ♦ హాత్ముడా గోలభగంధర్వతోడ నీ ♦ ఘనుఁడు వాలి
దశపంచవర్షముల్ ♦ దారుణయుద్ధంబు గావించె సందులే ♦ కయె చెలంగె
నది రేయిపగలను ♦ నట్టిభేదము లేక, తగనంత షోడశా ♦ బ్దమున నతని
వధియించె దుష్టుఁడౌ ♦ వైరి నివ్విధిఁ జంపి దంష్ట్రాకరాళవ ♦ క్త్రంబు చెలఁగ

ఆ. మాకు నభయమిచ్చె ♦ నీకడిందిబలుండు, బవరమందుఁ జంపఁ ♦ బడియె నెట్టు
[1]లిప్పుడనుచు నేడ్చి ♦ రెల్ల; రప్పుడు సింహ, మున్నగోప్పువనిని ♦ నుగ్రభంగి.

క. గోపతి వధింపఁబడఁగా, గోపటలము భీతినొంది ♦ కుందుపగిది గా
నాపాకవైరితనయుం, డీపగిది వధింపఁబడఁగ ♦ నెల్లకపివరుల్. ౩౦ 794

[2]తే. రాముఁ డున్నవనంబున ♦ నేమియేని
సుఖముఁ గానక మిక్కిలి ♦ సుక్కి రంతఁ
దార మృతుఁడయియున్న భ ♦ ర్తముఖమట్టె
కనుచు దుఃఖార్ణవంబున ♦ మునిఁగి యపుడు. ౩౧ 795

క. తరుసంగతిఁ గనులత యా, తరువొగి ఛేదింపఁబడఁగఁ ♦ దా క్షితిఁబడు న
ట్లురవడి వాలిని గౌఁగిటఁ, గరము నమిం జేర్చుకొనుచు ♦ క్ష్మాస్థలిఁ బడియెన్.

ఇరువది రెండవ సర్గము సంపూర్ణము.

---

## ౨౩ - వ సర్గము.

వాలి మృతిం గని తార విలపించుట.

క. వనితామణి యంతట న,వ్వనచరవరుఁడై నవాలి ♦ వదనముఁ దమి మూ
ర్కొని యాలోకము విడిచియె, చనినట్టిపతిం దలంచి ♦ సరగ వచించెన్. ౧

[3]క. వీరా! నాపలుకుల్ విన, కీరీతిని గ్రావయుక్తి ♦ నెంతోకఠినమౌ
ధారణి నిట ననమస్థలి, ఘోరగతిఁ బరుండినావె ♦ కూడున నీకున్. ౨ 798

---

1 వనేచరా స్సింహయుతే మహావనే యథాహి గావో నిహతే గవాంపతౌ-అనిమూ. 2 నిం హస్థానీయో రామః-అని వ్యాఖ్య. 3 ఉపలోపచితే వీర సుదుఃఖే వసుధాతలే-అనిమూ.

క. వనచరులుఁ హరియూథపు, లనాథముగ నేక్షి యిట్టు ♦ లని; రిత్తఱి నే
వనచరనాథుఁడు మృతిఁగనఁగ నగర మిది శూన్యమైన ♦ కరణిఁ దనరెనే. ౨౯౪

తే. పర్వతోద్యానకానన ♦ పటలమెల్ల
శూన్యముగ నయ్యె వానర ♦ శూరుఁ డితఁడు
హతుఁడయిన వానరోత్తము ♦ లమలకాంతి
హీనులుగ నైరి చెప్ప నిం ♦ కేమిగలదు ౨౯౫ 791

చ. వనచరనాయకుండు గతి ♦ వైభవమొప్పఁగఁ బోవుచుండ నా
తని గతివేగఘాతమున ♦ దారుణకాననముల్ వనంబు లో
య్యన సుమయుక్తి నామహితు ♦ నాదృతిమీఱఁగ వెంబడించు నే
ఘనుఁ డెవఁ డిప్పుడట్టిదగు ♦ కార్యముఁ జేయఁగఁ జాలు నక్కటా! ౨౬ 792

సీ. ఆయతభుజుఁడు మ ♦ హాత్ముఁడా గోలభగంధపర్వతోద నీ ♦ ఘనుఁడు వాలి
దశపంచవర్షముల్ ♦ దారుణయుద్ధంబు గావించె సందులే ♦ కయె చెలంగి
నది రేయిపగలను ♦ నట్టిభేదము లేక, తగనంత షోడశా ♦ బ్దమున నతని
వధియించె దుష్టుఁడో ♦ వైరి నిర్విధిఁ జంపి దంష్ట్రాకరాళవ ♦ క్త్రంబు చెలఁగ

ఆ. మాకు నభయమిచ్చి ♦ నీకడిందిబలుండు, బవరమందుఁ జంపఁ ♦ బడియె నెట్టు
[1]లిప్పుడనుచు నేడ్చి ♦ రెల్ల; రప్పుడు సింహ, మున్నగొప్పవనిని ♦ నుగ్రభంగి.

క. గోపతి వధింపఁబడఁగా, గోపటలము భీతినొంది ♦ కుందుపగిది గా
నాపాకవైరితనయుం, డీపగిది వధింపఁబడఁగ ♦ నెల్లకపివరుల్. ౩౦ 794

[2]తే. రాముఁ డున్నవనంబున ♦ నేమియేని
సుఖముఁ గానక మిక్కిలి ♦ సుక్కి రంతఁ
దార మృతుఁడయియున్న భ ♦ ర్తముఖమట్టె
కనుచు దుఃఖార్ణవంబున ♦ మునిఁగి యపుడు. ౩౧ 795

క. తరుసంగతిఁ గనులతయా, తరువొగి ఛేదింపఁబడఁగఁ ♦ దా క్షితిఁబడు న
ట్లురవడి వాలిని గౌఁగిటఁ, గరము నమిం జేర్చుకొనుచు ♦ క్ష్మాస్థలిఁ బడియెన్.
ఇరువదిరెండవ సర్గము సంపూర్ణము.

---

౨౩ - వ సర్గము.

వాలి మృతిం గని తార విలపించుట.

క. వనితామణి యంతట న,న్వనచరవరుఁడైన వాలి ♦ వదనముఁ దమి మూ
ర్కొని యీలోకము విడిచియె, చనినట్టిపతిం దలంచి ♦ నరగ వచించెన్. ౧

[3]క. వీరా! నాపలుకుల్ విన, కీరీతిని గ్రావయుక్తి ♦ నెంతోకఠినమా
ధారణి నిట ననమస్థలి, ఘోరగతిఁ బరుండినావె ♦ కూడున నీకున్. ౨ 796

---

1 వనేచరా స్సింహయుతే మహా వనే యథాహి గావో నిహతే గవాంపతౌ-అనిమూ. 2 సిం హస్థానీయో రామః-అని వ్యాఖ్య. 3 ఉపలోపచితే వీర సుదుఃఖే వసుధాస్థలే-అనిమూ.

[1]చ. వనచరనాథ! నీకుఁ బ్రియ♦భామిని భూమియొయంట నిక్క మా
నునుఁగని మాటలాడక య♦నంతను గౌఁగిటఁజేర్చి పండియుం
టను గనుఁగొన్నఁ దోఁచె నిటు ♦ నన్నును మీఱియె భూమి కూర్మి నిం
గనియెను; వీరవర్యుఁడవు ♦ త్వత్స్థలి సాహసిక ప్రియుండవై
తనరుదు వీవు నిన్న ననిఁ ♦ దాఁకి పరాజయమందినట్టి యీ
యినజుని కిట్లు చిక్కితివె ♦ యీతఁడె యిప్పుడు విక్రమాఢ్యుఁ డ
య్యెనె విధికృత్య మిద్ది యిఁక ♦ నేమనవచ్చును దీనినోర! నీ
ఘనబలు భల్లవానరని♦కాయము గొల్చుచు నున్నదెంతయున్. ౪౹ 799

ఉ. వీరలరోదనధ్వనుల, ♦ వీతగతిన్ వగనొందునంగద
స్ఫారవిలాపనాదమును ♦ సాధ్వినినై తగు నాదురోదనం
బారసి చక్కఁగా విని య♦హార్యబలాఢ్య! మహాత్మ! లేవకీ
ధారుణిపైఁ బరుండు టిది ♦ ధర్మమె! యేమన నేర్తు నిన్నిఁకన్. ౫౹ 800

చ. మునుపరులన్ వధించి చల♦ముం దగ నెందుఁ బరుండఁజేసి తో
వనచరనాథ! శౌర్యగుణ♦భాసుర యిప్పుడు వీరశయ్య దా
నినె బవరంబునందు మృతి♦నింగని పొందితివీవు సంగరం
బున ననురక్తినిన్ మిగులఁ ♦ బొందెద వీ వటుగాన నీకనిన్. ౬ 801

చ. మరణము సంభవించినది ♦ మాన్య! భవద్బలమున్ గుయుద్ధమం
దరయక వెల్లడింప వటు♦లౌట మహాపరిశుద్ధమయ్యె స
త్పరినుతిఁ గాంచె నీకులము ♦ బాహుబలాఢ్య! సమీకసమ్మదా
గురుతరమానదా! సతిని♦గూడనె తోడ్కొనిపోవ కేగతిన్. ౭౹ 802

[2]తే. నను ననాథను నొక్కదా♦నినిటు డించి
పోయితివె పండితుండఁక ♦ భూమియందుఁ
గన్య శూరున కీరాదు♦గద! యిదేల
యనిన శూరునకున్ భార్య♦నైననేను. ౮ 803

క. గతభర్తృకనై చెడితిన్, క్షితి నిటు గనవయ్య యింకఁ ♦ జెడియెంగద వి
చ్యుతి లేదనఁదగు మానము, సతమగు నాభర్తృసేవ ♦ సమసియెపోయెన్. ౯

ఆ. వితతమై గభీర ♦ మతిదురంతమునయి, వెలయు దుఃఖజలధి♦విగతి నగుచు
మునిఁగితిని; నిజేశు♦నిను మృతునిం గనుఁగొనియు నాహృదయము♦కుందికంది.

క. శతలేశంబులుగా నీ, క్షితిపైఁ బడకున్నదేమొ ♦ కేవల మిది [3]గ్రా
వతతి ప్రసారమౌఁ గద, హితుఁడు స్వభావముననాకు♦నెంతయుఁ బ్రియుఁడున్.

తే. ప్రాణనాథుఁడు ననిమొన ♦ బాహుశౌర్య
మునఁ దగినవాఁడు శూరుండు♦ను నగునితఁడు

1 మర్త్తః ప్రియతరానూనం వానరేంద్ర మహీతవ-అనిమూ. 2 శూరాయ నప్రదాతవ్యా
కన్యా ఖలు విపశ్చితా-అనిమూ. 3 అశ్మసార మియం నూనమ్-అనిమూ.

మరణముం గాంచెఁగా యిఁకే ♦ను తావ రిలను
గలిగియున్నను నాకేమి♦కలదు సుఖము. ౧౨ 807

చ. పెనిమిటి పోయినంత నల♦భీరువు పుత్త్రులు గల్గినట్టిదై
ధనముఖసంపదల్ వెలయఁ ♦ దద్దయు నొప్పినదానిఁ గాంచియే
యనుదురు పండితుల్ విధవ♦యా నిది యంచు మహాత్మ! వీర! నీ
తనువుననుండియే పడిన♦దారుణరక్తము చూడు నీక్షలిక. ౧౩ 808

సీ. శయనించి యుండుటఁ ♦ జక్కఁగాఁ గాంచిన నిల యత్తుకంబోలి ♦ యెఱ్ఱనైన
పఱుపుగల్గినయట్టి ♦ పడకనై శయనించినట్లు యున్నది; వానరా♦ధినాథ
ధూళిశోణితముల ♦ దోఁగిన నీదేహమును మత్కరంబుల ♦ ననునయమునఁ
గౌఁగిలింపఁగఁజాల♦కయె యున్నదానను జూచుచుండుటను భా♦స్కరతనూజ

తే. నకును నీకును విద్వేష♦ణము పొసంగ
బాణ మొక్కటి శ్రీరఘు♦వరుఁడు వాపె
భయము సుగ్రీవునకుఁ గాన ♦ వసుధ నిప్పు
డర్కతనయుండు కృతకృత్యుఁ ♦ డయ్యెనయ్య. ౧౪ 809

చ. సురపురికిప్డుపోవ వర! ♦ శూర! భవత్ప్రియరంభకృత్యముల్
జరపుటకైనఁ జాలక వి♦శాలభవద్వరవక్షమందు ని
ర్భరముగ నాటియున్న రఘు♦రామశరంబిపుడప్డగింపఁ ద
త్పరతను జూచుచుల్ నిలిచి ♦ దారుణశోకము నొందితిం గటా. ౧౫ 810

చ. అని పలవించుచుండె సతి ♦ యప్పుడు నీలుఁడు శైలగహ్వరం
బున నొగి దాఁగి దీప్తమగు♦భోగిని లాగువిధంబునన్ గపీ
శుని తనువందు నాటినవి♦శుద్ధశరంబును లాగివైచె న
ప్పుని నొనరించునప్డు డల♦బాణఘనద్యుతి చెన్నుమీఱుచుల్. ౧౬ 811

క. దినకరునినుండి వెడలుచుఁ,జని యస్తగిరీంద్రశిఖర♦నరణి నిరోధం
బును గనురవిదీప్తివిధం,బునఁ గ్రాలెను వాలి దేహ♦మున నెల్లెడలన్. ౧౭

చ. దినకరపుత్త్రుతో నినిని ♦ దెంపునఁ జేసినయప్డు రాముఁడే
సినశితనాంబకంబునను ♦ జెందిన*యాప్రణపంక్తినుండి తె
ప్పున బహురక్తధారలొగి ♦ భూమిని బొందెను దామ్రగైరికా
ళిని గలయంగ నెఱ్ఱనయి ♦ లీలను శైలమునుండి యొక్కరీ
తిని బడునీటిధార లటు♦తీవ్రముగాఁ గనుపట్టుచుండఁగన్. ౧౮ 813

చ. శరహతుఁడై పరాగమునఁ ♦ జక్కనియంగములెల్ల మున్గఁగా
ధరఁబడియున్నభర్తఁ గని ♦ తారయు నశ్రుజలంబుచేత వా

* ప్రాణేభ్యస్తస్య సర్వేశః-అనిమూలము. ఇట బహువచనము యుద్ధమున సుగ్రీవకృతవ్రణబోధకమని యెఱుంగునది.

నరపతి దేహధూళియుఁ జ♦నంగడి గెన్; మఱి తాను బ్రుంగి భూ
వరశరమర్దితుండయిన♦భర్తను శోణితసిక్తదేహునిన్. ౨౧ 814

క. కని తార పింగళాక్షునిఁ, దనయుని నంగదునిఁ బిల్చి ♦ తనయా! భీతిం
గనఁజేయుచుఁ గడపటిదా, జనకుని యవసానకష్ట♦సంతతిఁ గనుమా!. ౨౨

తే. పాపకర్మమువలననే ♦ ప్రభవమైన
వైరమిప్పుడు తుదిఁ గాంచె ♦ వనచరేంద్రుఁ
డగుచు మానదుఁ డగుచు బా♦లార్కునుదయ
మట్లు వెలసెడు దేహంబు ♦ నలకుచుండె. ౨౩ 816

[1]క. తనసాటిలేక వెలసెడు, జనకునకున్ ధర్మరాజ♦సద్మమునకున్
జనువానికి మ్రొక్కుము ప్రియ,తనయా! యని పల్కె నిట్లు ♦ తల్లి వచింపన్.

ఆ. భక్తి తనర లేచి ♦ బలిసి వట్రువులయి
యలరుభుజములెత్తి ♦ యంగదుండ
నేను దండ్రి! యనుచు ♦ నిజనామమును జెప్పి
తండ్రిపాదములకు ♦ దండ మిడియె. ౨౪ 818

చ. తనపతిఁ గాంచి తారయు ని♦తాంతము దుఃఖముపొంగఁ బల్కె నీ
తనయుఁడు మ్రొక్కె మున్వలె ము♦దంబున నోప్రియపుత్ర! దీర్ఘమై
తనరెడునాయువుం గనుము ♦ ధారణి వర్ధిలుమంచుఁ బల్కవే
మొ! నిను మృత్యు న్విచేతనుని ♦ నుజ్జ్వలపౌరుషశాలి నిత్తఱిన్. ౨౫ 819

[2]క. తనయుఁడు నేనునుగొల్చుచుఁ,గనుచున్నామపుడెవృషముఁ♦గడురయమొప్పం
గను సింహము చంపఁగ నా,వును దూడయుఁ గొల్చురీతిఁ♦బొగులుచునాథా!.

సీ. అనియనునధ్వరం♦బును నీవిట యజించి భూపతిశరజలం♦బునను నవభృ
థాహ్వయస్నానంబు♦నాచరించితె భార్యనగునన్నుఁ బాసియే♦మయ్య!తగునె?
వాసవుం డనిమొనఁ ♦ బరమసంతుష్టుఁడై దయచేసినట్టి యా♦తప్తకనక
మాల నీయొమ్మున ♦ నేల యిప్పుడు నాకుఁ గనఁబడకున్న దో♦కపికులేంద్ర!

తే. మానదా! సూర్యుఁడెప్పుడు ♦ తాను జుట్టు
దిరుగుచుండుట నతనికాం♦తియు సుమేరు
పర్వతంబును వదలని♦భంగి నీవు
చచ్చినను రాజ్యలక్ష్మియుఁ ♦ జనఁదలఁపదు. ౨౭ 821

చ. వనచరనాథ! నాదుహిత♦వాక్యముఁ గైకొన కీవు వచ్చి తీ
పని తగదంచు నిన్ను నిలు♦పందగుశక్తియు నాకు లేకపో

1 ప్రయాంతం యమసాదనమ్-అనిమూలము. 2 సింహేన నిహతం సద్యో గౌః సవత్సేవ గోవృషమ్-అనిమూలము.

యెను, రణభూమిఁ నీవిచట ♦ నిర్విఘ్నఁగాఁ బడియుండఁ జచ్చితిం
దనయునితోడ రాజ్యరమ ♦ తా నపుఁ బాసిపోయె ని క్కెటికిన్. 822

ఇరువదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౨౪ - వ సర్గము.

సుగ్రీవుఁడును తార శ్రీరామునిఁ బ్రార్థించుట.

చ. అనివిలపింప వాల్యనుజుఁ ♦ డాయతబాహుబలుండు బాష్పపూ
ర్ణనయనుడై భరింపఁగను♦రాని విశేషరుదు:ఖసాగరం
బునను మునింగియున్న సతిఁ ♦ బోలఁగఁ గాంచి మనోజ్ఞులేనిక్రీ
తిని దనయన్న భూస్థలిని ♦ వ్రాల్చఁగనేయఁగఁ బంచిరంమనన్. ౧ 823

క. కరము తపించెను; మఱి వన,చరరా జతఁ డాత్మబుద్ధి♦చాతుర్యమునన్
బరఁగెడుఁగావున మోహమున, విరతియొఁటే కన్నీజలము ♦ వెలికింబొటన్. ౧౻

ఉ. తారను గాంచి యాక్షణము ♦ తానును భ్రాతృవధోత్థదు:ఖకం
భీరజలాబ్ధిమగ్నుఁడయి ♦ భృత్యులు వెంటనె రాఁగ మెల్లఁగా
శ్రీరఘువీరుసన్నిధిని ♦ జేరెను చాపము చేతఁబట్టి దు
ర్వారఫణీంద్రతుల్యగురు♦బాణము లొప్పఁగఁ జారుకీర్తియై. ౨౻ 825

ఆ. ఉత్తముండు నగుచు ♦ నురుశుభలక్షణ,కలితతనుఁడు నగుచుఁ ♦ గ్రాలురాముఁ
గాంచి పలికె భూమి♦కాంత! నీచేసిన, ప్రతినయట్లు కార్య ♦ మతిశయముగ.

క. ఒనరిచినాఁడవు, ప్రతిఫల, మునగు మహారాజ్యమునుపద♦మును బొందఁగ న
న్నును జేసినాఁడ విప్పుడు, మనుజేంద్రా! నాకు భోగ♦మండలమందున్. ౩౻

క. జీవితమందును మానస, మేవిధముననైన నిష్ట♦మేపొందదు నూ!
యీ వెలఁది పట్టమహిషియె, గావునఁ బూజ్యయగునట్టి♦కాంత యుపుడిటన్.

తే. ఏడ్చుచున్నది పురిఁగల♦యెల్లవారు
వగలఁ బొగులుచు నున్నారు ♦ వాలి యగ్ర
జన్ముఁడిట హతుఁడయ్యెను ♦ జనకుమృతికి
నంగదుండు జీవించునా ♦ యనుచుఁ దోఁచె. ౪౻ 829

క. ఇవియన్నియు నిట్లుండఁగ, భువిపై రాజ్యంబు నేలఁ ♦ బూనదు మది రో
రవివంశతిలక! యిటువో, కువిభూ! నిష్కారణముగఁ ♦ గ్రోధముఁ గొనుచున్.

[1]చ. నను పురినుండకుండఁగనె ♦ నాదునహోదరుఁడే యొనర్చెనం
చును గ్రుద్ధుఁ బూనినందునను ♦ ఘోరత మీఱఁగ నీచవాక్కులన్

---

1 క్రోధా దపన్నా దతివి ప్రుద్ధా దాభ్రితు ర్వధో మేఽనుమతః పురస్తాత్ - అనిమూ. దీనికి వ్యాఖ్యలో నున్నయర్థ మిట విహితమని తెలియునది.

నను బలుకంగ నోర్వకయు ♦ నన్నును వెంటనె వచ్చి త్రోలుటన్
మనము సహింపకుండుటను ♦ మాన్యుని నన్నువధించుకృత్యముల్. ౫   831

క. మనమునకున్ సమ్మతముగఁ, గనఁబడుచునెయుండె నీవు ♦ కడఁగి వధింపన్
గనినంతనుండి తీవ్రము, గను మనము తపింపఁజొచ్చెఁ ♦ గాకుత్థ్సపతీ. ౬ 832

సీ. పరితాప మెంతయు ♦ బాధించుచున్న దేవిధంబుననైన ♦ నింక నాదు
జాతికిఁ దగువృత్తి ♦ శైలోత్తమంబగు నలఋశ్యమూకంబు♦నందు బ్రదికి
యున్నంతకాలమే ♦ యుండుటయే శ్రేయముగఁ దోఁచుచున్నదీ♦యగసుధైర్యు
వాలివధించి యా♦స్వర్గము లభియించిననుఁ గీర్తి లేమిఁ గో♦రను మనమున

తే. మనుజనాయక! యీమతి♦మంతుఁ డీను
హాత్ముఁ డీవాలి ననుఁగాంచి ♦ యనుజ! నిన్నుఁ
జంప నాకిష్టమే లేదు ♦ సరగ నిచ్చ
వచ్చినట్లుగఁ జనుమని ♦ ముచ్చటించె. ౭   833

చ. పలుకది యామహాత్మునికె ♦ బాగుగ నున్నది దుష్టబుద్ధినై
చెలఁగెడునాకు నిట్లతనిఁ ♦ జిత్రముగా మృతినొందఁజేయుటే
యిలఁ దగియున్న; దన్న వధి♦యించుటచే లభియించురాజ్యమే
తలఁపఁగ నెక్కువో పిదప ♦ దాపరమావగయే ఘనంబొకో?. ౮   834

చ. అనితలపోయకే యనుజుఁ♦డై తగువాఁడెవఁడైన సద్గుణా
ఢ్యునిఁ దనయన్నఁ జంపుటకు ♦ నుర్విని గోరునె యొక్కకామమే
తనమది నెన్నకొంచు గుణ♦ధాముఁడు గావున వాలిస్వీయమా
ఘనమహిమంబు దాఁటకయె ♦ క్రౌర్యముఁ బూనక న న్వధింపఁగన్. ౯

తే. తలఁపఁడయ్యెను; దుర్మతిఁ ♦ దగినవాఁడఁ
గాన మర్యాదనే మీఱి ♦ కడఁగి యన్న
ప్రాణములఁ దీయునంతటి♦పనికిఁ బూని
తినిగదా! నేను యుద్ధంబు♦నను బెనంగ. ౧౦   836

సీ. తరుశాఖలను గొట్టి ♦ దారుణభంగి నేబాధలనొందుచుఁ ♦ బలుతరముగ
నార్తనాదముచేయ ♦ నరసి నన్నుం గాంచి యాఅడిలంబల్కి ♦ యుద్ధమిట్లు
చేయఁగ మరల నీ♦వేయెడలను రాఁగ వలదంచుఁ బల్కెను ♦ లలితమైన
భ్రాతృత్వ మార్యస్వ♦భావంబుధర్మంబుఁ దలఁచియాతఁడుచంపఁ♦దలఁపఁడయ్యె

తే. నేను క్రోధంబు కామంబు ♦ వానరత్వ
మూని యన్యాయముగ భ్రాతృ♦ముఖ్యు నిట్లు
పాలియఁ జేసితి నరపాల♦పుంగవ! మును
విశ్వరూపునిఁ జంపి త్రి♦విష్టపపతి. ౧౧   837

క. ఘనపాపమొందిన ట్లన్నను నేఁ జంపించి సజ్జ♦నవ్రజముల మ

న్నను గాంచక చింతింపం, గనురానిది యగుచుఁ గోరఁగాఁ దగ దెవ్వఁడున్.

క. తన నేమాత్రము యోగ్యం, బును గానిదియైన పాప♦మును బొందితి నో
యనఘా! యింద్రుఁడు వరముల, ననుకంప నొసంగు నన్న♦యాశ గలుగుటన్.

తే. అతనిపాపము భూమియు ♦ నంబువులును
దరువులును గాంతలును గ్రహిం♦చి రిఁక నేనొ
వనచరుఁడమాత్రమే గను♦కను మదీయ
పాపము నెవండు గ్రహియింప ♦ వాంఛనొందు. ౧౩ 840

చ. ఇనకులవర్య! ధర్మపరి♦హీనము వంశవినాశకంబు నొ
ప్పనిదగుపాపకార్యమును ♦ బాగనిచేసితిఁ గాన నేను నిం
కను బ్రజలెల్లఁ జేయునృప♦గౌరవమొందఁగ యౌవరాజ్యమున్
గొనఁదగ నేల? రాజ్యమున♦కున్ దగ నంచు వచింప నీయొకన్. ౧౪ 841

ఆ. సుజనగర్హితంబు ♦ క్షుద్రంబు లోకాప,కృతము నైనయఘము ♦ నేను జేసి
నాఁడ వర్షజీవ♦నప్రవాహము పల్లమునకుఁ బాఱినట్లు♦గను రఘువర!. ౧౫

క. ఘనశోక మిద్ది నను బొం,దెను మత్తద్విరద మేటి♦తీరంబుల నే
వునఁ జిమ్మివైచునట్టులె, వినుమా! శ్రీరామచంద్ర! ♦ విశ్రుతకీర్తీ!. ౧౬ 843

*సీ. అన్నను జంపుట ♦ యనునదియే తను పృష్ఠభాగము వాల♦మేయయి, తగ,
నన్నకు సంతాప ♦ మున్నతంబుగఁ గల్గునట్లు చేయుటయె హ♦స్తాక్షిశీర్ష
ములయియొప్పఁగఁ బాప♦ముమహాద్విరదమయి నన్ను నేహింసించు♦చున్నదిపుడు
జ్ఞానబలమున శో♦కంబు నడంపుమా యనుదువేమో నీవు ♦ మనుజతిలక!

తే. యగ్నియందు వివర్ణత ♦ నందు కనక, మెట్లు కాచుతఱిని మల♦మే తను నిను
మంతయంటకయుండఁ ద♦న్నవలకనుపు,నట్టులే సాధువృత్తమే♦మైనమదిని.

తే. కలిగియుండిన నది తనుఁ ♦ గలిసియున్న
యీమహాపాపమునకుఁ దా♦నేనసహింపఁ
జాలకయ పాఱిపోవును; ♦ జనకమృతికి
నంగదుఁడు వీఁడు పరితాప ♦ మందుచుండ. ౧౭ 845

క. కనుఁగొని గురుతరమగు బల,మునఁ దగు నీకపిసమూహ♦ముఖ్యులు నగమే
చనఁగా మిగిలినప్రాణము,ల నున్నవారనుచుఁ దోఁచె ♦ లలితగుణాఢ్యా!. ౧౮

క. వినుమిద్ది మన్నిమిత్తము,గనె సాగెను వీర! యీ♦జగంబున సుజనుల్
జనకుండు చెప్పినట్లే,పనినైన నొనర్చువానిఁ ♦ బరమగుణాఢ్యున్. ౧౯ 847

చ. తనయుని నశ్రమంబుగనె ♦ తప్పక పొందఁగ వచ్చుఁగాని యీ
యనఘుని నంగదోషముని ♦ నాత్మజుగా ధరఁ బొంద దుర్లభం

---

* సోదర్యగాత్రాపరగాత్రవాల స్సంతాపహస్తాక్షిశిరో విషాణః, ఏనోమయో మా మభి హంతి హస్తీ దృప్తో నదీకూలమివ ప్రవృద్ధః-అనిమూలము.

బనియె వచింపనొ; జనప♦దాళికి నెచ్చటికేనిపోయినన్
నినసహజన్మసన్నిధియుఁ ♦ దాఁ గన శక్యముగాదు రాఘవా!. ౨౦ 848

క. తనయుం డీతఁడు జీవించినఁ దద్రక్షణముఁ దాను ♦ జేయఁగ జీవిం
చునొ యేమొ తార, వీరా!, తనయుఁడె జీవింపఁడేని ♦ దద్దుఃఖమునన్. ౨౦॥

క. జీవించియుండదనియే, వావిరిఁ దలపోయువాఁడ ♦ వసుధేశా! ని
ట్లీవిధిఁ బాపమొనర్చిన, నే వాలిని దత్తనూజు ♦ నెయ్యముచేశన్. ౨౧॥ 850

క. తనియంజేయఁగ మంఘుద,హనుఁ జొత్తును వనచరేంద్రు♦లందఱు వీరల్
మనుజేంద్రా సీయానతిఁ, జని సీతను వెదుకఁగలరు, ♦ సర్వస్థలులన్. ౨౨ 851

చ. మనుజవిభూ! స్వశక్తిమహి♦మంబున నొప్పినవాఁడవౌటనేఁ
గనుఁగొనరానిలోకమునఁ ♦ గాపురముండఁగఁబోయినన్ స్వశ
క్తినిఁ గొని సర్వకార్యములఁ ♦ దృప్తిగఁ జేసికొనంగనేర్తు వి
ట్లనుపమపాపకార్యముల ♦ నారయ కే నొనరించి తెంపునన్. ౨౨॥ 852

ఆ. కులమునెల్లఁ జంపు♦కొని ప్రాణయుతుఁడనై
త్సుండఁదగక యిట్టు♦లున్ననేను
నగ్నిఁ జొరఁగ రామ! ♦ యానతి నిమ్ము; నాఁ
బరుల నడఁచు రాజ♦వరుఁ డతండు. ౨౩ 853

చ. వనచరనాథుఁ డార్తుఁడయి ♦ పల్కుటఁ దా విని బాష్పపూరమొ
య్యనఁ బ్రవహింప నేమియును ♦ నప్పుడు తోఁపమి నూరకుండెఁ; నొ
క్కనిముస మంత భూమివలె ♦ గాఢతరక్షమనందువాఁడు లో
కనిచయరక్షకుండు రఘు♦కాంతుఁడు తన్గను వాలిపత్నినిన్. ౨౪॥ 854

తే. వ్యసనమగ్నను నేడ్చెడు♦వామనయనఁ
గాంచి తద్దుఃఖమును దీర్పఁ♦గాఁ దలంచి
యామెచెంతకుఁ బోయె న♦య్యదనునందుఁ
జారునేత్రయు సద్బుద్ధి♦శాలినియయి. ౨౫ 855

చ. అలరెడుతార కీశపతి♦యా తనజీవితనాథు వాలి ని
మ్ములఁ దమిఁ గౌఁగిలించుకొని ♦ భూమిపయింబడియుండ నంత మం
త్రులు రఘురామురాకఁ గని ♦ తొయ్యలి నావృతి లేపి రామెయున్
బలువిడి దుఃఖభారమున ♦ భర్తను గౌఁగిటఁ జేర్చి యేడ్చుచున్. ౨౬ 856

ఆ. వదలలేక మంత్రి♦వారము బలవంత,ముగను లేవనెత్తి ♦ తగదిదంచు
నవలికిఁ గొనిరాఁగ ♦ నపుడామె శరచాప,ములను దాల్చి తేజ♦మున రవివలె.

క. భాసిల్లు రామచంద్రునిఁ, దా సరగునఁ గాంచె; నాసు♦దతి బాలమృగో
ద్భాసురనయనయు రాజ,శ్రీసంయుతు రాజచిహ్న♦సేవితదేహున్. ౨౭॥ 858

సీ. చాపనేత్రంబులు ♦ సరసంబులై క్రొత్త నిడిదఁజికెన్నఁదే ♦ నెఱుఁగఁగట్టి
కనుఁగొనఁజనకట్టి ♦ కమనీయరూపునిఁ బురుషోత్తమునిఁ గాంచి ♦ పొలుపుమీఱు
నితఁడె కాకుత్స్థుఁడౌ ♦ నెవ్వఁగా నని యొఱింగినదయ్యెఁ; దార్తయగా ♦ నతిశయంత
వ్యసనాభిపన్నయై ♦ కలుమారు మూర్ఛను బొందుచు నిండ్రుననిఁ ♦ బోలియొదరి
ఆ. కే నసాధ్యుఁ డగుచు ♦ మానితరూపుఁడై, పరఁగు రామచంద్రు ♦ పరిసరమున
కరిగె జవముమీఱ; ♦ పతిశోకభరమున, సన్నుఁదా నెఱుఁగక ♦ తనదుపతిని.

క. శరమొక్కటి గుఱితప్పక, మరణము నొందించినట్టి ♦ త్వాపతినట దా
పరిసరముఁ జేరి రాముని, బహుమము లాడంగఁదలఁచి ♦ పరముదిమహితుఁ.

[1]సీ. కలుషముల్ తొలఁగుటఁ ♦ గడుచిత్తశుద్ధియు వెలయంగ నిల్లని ♦ పలికెనుతుల;
నప్రమేయుండ వీ ♦ వరయ సాధారణజనులకే మునులకే ♦ శక్రముఖ్య
సురపతులాదియగా ♦ పురుషోత్తములకేని నినుఁబొందనలవిగా ♦ దనఘ! నాథ!
విజితేంద్రియుఁడవయి ♦ వెలయుచునుందు వుత్తమధార్మికుఁడ వనం ♦ తవరకీర్తి
ఆ. పతినమర్థుఁడవు మ ♦ హాత్ముఁడ వవనితో, సమతఁగాంచునట్టి ♦ క్షమను గలిగి
యరుణనయనుఁడవయి ♦ యలరారుచుందువు, నిన్నుఁ బొగడ నెల్లు ♦ నేత్తరామ!.

క. శరచాపపాణివై ని, ర్భరభీమబలంబు వెలయ ♦ రాజనయమహో
త్కరము తగఁ దనరారుదు, వరయఁగ నీగుణములెల్ల ♦ నంతజేయందుఁ.
క. కనఁబడఁజాలవు మానవ, తనుసంపద విడిచి దివ్య ♦ తనుసౌభాగ్యం
బును గూడియున్నవాఁడవు, విను రామా! బాణమొకఁడు ♦ విడిచి జవమునఁ.
క. నాపతి ననిఁ జంపితి కద, యాపటుశర మేసి నన్ను ♦ నబలమరణముఁ
వే పొందఁజేయు మృతనయి, నాపతిఁ గన వఱుగుదాన ♦ నయగుణనిలయా!.
క. ధీరా! నీవీపనిచే, నారమణు రమింపఁజేయు ♦ నాపతి నేనే
చేరకయుండిన శర్మము, నేరీతిగఁ గాంచుఁ గాన ♦ నేయుము నన్నుఁ. 33 865
చ. సరసిజపత్రనేత్రుఁ డగు ♦ శక్రతనూజుఁడు స్వర్గమందు న
చ్చరలనుగూడి యుండు నరుఁ ♦ జక్కఁగఁ గానఁడయేని వింతగా
[2]నరుణములైన పూవులశి ♦ ఖాగ్రములన్ ధరియించి చిత్రమై
పరఁగ నలంకరించుకొని ♦ భాసిలువారలఁ గూడకుండుఁ జూ!. 3౪ 866

---

1 త్వమప్రమేయ శ్చ దురాసద శ్చ జితేంద్రియ శ్చోత్తమధార్మికశ్చ. అక్షయ్యకీర్తి శ్చ విచక్షణ శ్చ క్షితిక్షమావాన్ క్షతజోపమాక్షః-అనిమూ. దీనికి గోవిందరాజులు పెద్దవ్యాఖ్యవ్రాసిరి. అవి శబ్దములపైఁ బన్నినయూహలు. ఆశబ్దములే యిందుపయోగింపఁబడినవి కాన నాయర్థములు దీనినుండి తేలును ఒక్కయుదాహరణము చూపెద. అప్రమేయః-వేదాహమిత్యుపక్రమ్య మహాంతకఇత్తావేదేతి వేదైరప్యపరిచ్ఛేద్యః త్వమప్రమేయః, శరచాపధరోపి త్వం శంఖచక్రధరోపి-ఇట్టివి. అన్నియు నిట్లే యని గ్రహింపనగును. 2 ఉచ్చావచతామ్రచూడాః-అనిమూ. వివిధతామ్రకుసుమైః కృతశేఖరాః-అనివ్యాఖ్య.

క. వీరా! యీగిరివరమున, నారూఢములై మనోహ♦రాకృతులను జె
ల్వారెడుతటముల జనకమ, హీరమణకుమారిఁ బాసి ♦ యెట్లు వగతువో.

తే. అక్లె వాలియు స్వర్గంబు ♦ నందియు నట
నేను లేనందునన్ వగ♦నూని చాల
వెలవెలంబోవుచుండును; ♦ బృథ్విఁ దరుణ
పురుషుఁ డాత్మాంగనం బాసి ♦ పొగులు ననుచు. ౩౫ 868

క. తెలియుదు వీవాదుఃఖం, బులఁ బొందినవాఁడవుగద ♦ భూపా! కానన్
బలమున ననుఁ జంపుము నే, నలయుచుఁ జన నతఁడు దుఃఖ♦మందకయుండున్.

సీ. ఓమహాత్మా! నీవు ♦ సీమంతినిం జంప నఘమని తలఁతువో ♦ యది యయుక్త
మీతారయుఁ దదాత్మ♦యేయని తలఁచి నన్ జంపుమా! వనితను ♦ జంపినట్టి
యఘము నిన్నంటక♦యడఁగును,మనుజేంద్ర! శాస్త్రప్రయోగముల్ ♦సకలవేద
సిద్ధాంతములు తగఁ ♦ జెలువ భర్తకు నాత్మ యేకాని వేఱుకా♦దేయటంచుఁ
దెలుపుచున్నవి నను ♦ విలయమొందించుట వాలివధంబులో♦పలనె చేరుఁ

ఆ. గాన నీకు నన్నుఁ ♦ గొంతను జంపినఁ, గలుగునఘము నుంత ♦ గలుగకుండు
[1]మఱియుఁబుణ్యమబ్బు♦మహి దారదానము,మించుదానమున్న♦దంచుబుధులు.

క. తెలియఁగ లే దీవఱకును, నిలాధిపా! మేము సుఖము ♦ నేపొందుటచేఁ
గలిగెడుపుణ్యముకాకే, తలఁప న్నాప్రాణవిభుప♦దంబును నన్నున్. ౩౮ 871

క. కనుఁగొనఁజేయుటచే ధర్మనిరతినిం జక్కఁగలిగి ♦ మహి దానిని బా
లనముం జేయుట గననో, వినుమీ దానమున నీవు ♦ వీరవరేణ్యా!. ౩౯ 872

తే. ధర్మలోపభయంబు సుం♦తయును గాంచ
విద్ది నిశ్చయమగు నన్ను ♦ నిట్లు పతికి
దాన మొసఁగుట వాలివ♦ధంబువలనఁ
గలుగఁదగు వీరహత్యయుఁ ♦ గలుగకుండు. ౪౦ 873

క. విను మే నార్త ననాథను, బెనిమిటికడనుండి యిపుడు ♦ వేఱుపడితిఁ గా
వునఁ జంపఁదగును నన్నున్, [2]మనుజేంద్రా! మత్తగజగ♦మనుఁడై మఱియున్.

ఉ. ఉత్తమహేమమాల మహి♦మోన్నతిఁ గ్రాలఁగఁ దాల్చి కీశసం
ఘోత్తముఁడై తనర్చెడుగు♦ణోత్తరు వాలిని బాసి భూమిపై
నుత్తలమందుచున్ నిలువ♦నోపను బ్రాణముల న్వరించి నే
నిత్తఱిఁ జచ్చుటే నిజ మ♦హీనగుణా! రఘువంశభూషణా!. ౪౨ 875

చ. అని యిటు తారపల్కు విని ♦ యాధరణీశుఁడు రామచంద్రుఁ డా
వనితను నూఱడించి హిత♦వాక్యము నిట్లనిపల్కె మెల్లఁగా;

1 దారదానము-భార్యాదానము. 2 మాతంగవిలాసగామినా-అనిమూ.

విను మిఁక వీరపత్నివయి ♦ విశ్రుతిఁ గాంచితివీవు కీర్తిశం
బును విడనాడుదాన వని ♦ పొక్కుచుఁ బల్కుట యుక్తమెల్లగన్. ౨౧ 876

సీ. ఈలోకమంతయు ♦ హేమగర్భునిచేత నిర్మింపఁబడియుండు ♦ నిశ్చితంబ
కద! యాతఁడే ప్రాణి♦గణమున కెల్ల సుఖంబును దుఃఖంబుఁ ♦ గలుగఁజేసి
నాఁడని యెల్లవా♦రాడుదు రా బ్రహ్మ విధియించినట్టి యా♦విధిని మీఱఁ
గారాదు మూఁడులో♦కములకు నంతయు నావిధికిని లోన♦యై మెలంగుఁ

తే. గాన దుఃఖింపకుండుమా! ♦ కాంత! యిపుడు
తలఁచినవలెనె సుఖమును సం♦తసము నొందఁ
గలవు నీపుత్రరత్న మం♦గదుఁడు యౌవ
రాజ్యమును బొందఁగలవాఁడు ♦ రాజవదన. ౨౨ 877

చ. వనచరనాయకుండయిన ♦ వాలి హతుండగుటెల్ల నా విధిం
చెను మునుపే విరించి యది ♦ చేకురె దానికిఁ జింతనొందినన్
వనితరొ! యేమిలాభమె భ♦వత్పతికృత్యముల్ తగు సంస్కరణంబు లె
ప్పుడిపని యిట్లు చేయుమ ♦ భర్తకునై వగ మానుమా! యికన్. ౨౩ 878

క. అని యిట్లు సుప్రభాషం,బున రాజులు రామచంద్ర♦మూర్తి హితోక్తుల్
తనుఁగూర్చి పలుక వీరని, వనితామణి యూఱటఁ దాల్చె♦నాత్మహితమునన్.

¹ తే. తనరి పరవీరహంతయౌ♦మనుజుఁడు రాముఁ
డంచుఁ జక్కనిరూపంబు ♦ మించుచుండ
నాలుఁకిలి యేడ్పుటను మాని ♦ యూరకుండె
నంత శోకార్తులైనట్టి ♦ యక్కపులును. ౨౫ 880

ఇరువదినాల్గవ సర్గము సంపూర్ణము.

---

౨౫ - వ సర్గము.

-వాలికి సంస్కారము చేయుట.-

క. హరిపతితనయు నంగదుఁ, దురుశోకమతియైన యట్టి♦తార నిజసహో
దరు నూఱడిలంజేయుచు, దురంతశోకమునఁ దానుఁ♦దోఁగుచుఁ బలికెన్. ౧

తే. ఎంతదుఃఖమునం దపి♦యించినప్పుడు
నకును దానను మంచియె♦న్నటికిఁ గలుగ
దిపు డనంతరమౌ కృత్య♦మేమొ నడుపఁ
దగిన దద్దానిఁ జేయుఁడు ♦ తడయకింక. ౨ 882

1 సువేషరూపా-అనియూ. స్వాంకారము క్తశకేరత్యక్షః-అనివ్యాఖ్య.

[1]సీ. శస్త్రిరు విడుచుట ♦ కలదు లోకాచార మందు మీరును దాని♦నాచరించి
నారుగదా చాలు ♦ మీర లవ్వాలికిఁ బారలౌకికకృత్య♦పటలిఁ జేయఁ
గడఁగుఁ డెట్టితఱిని ♦ గర్మము విహితమో యాకాలమందె చే♦యఁదగుఁగాని
కాలము తప్పినఁ ♦ గర్మము చేసియు నుపయోగముండక♦యుండు నీశ్వ
తే. రాజ్ఞమీఱుచుఁ దానె యే♦దైనఁ జేయ
నలవిగాకుండు నీశుఁడే ♦ యఖిలలోక
కారణము కార్యములకెల్ల ♦ నారయ నతఁ
డగును సహకారిసాధన ♦ మనవరతము. ౩౪ 883

తే. మించి భూతావళుల నియ♦మించునతఁడె
యీశ్వరుని మీఱునట్టి దే♦దేని లేదు
కార్యమున కెట్టిదానికేఁ ♦ గర్త యెవఁడు
గాని కాఁడు నియోక్తయుఁ ♦ గాఁడు తాను. ౪౪ 884

క. వినుఁ డీస్వభావముననే, యనఁగాఁ గాలానుగతమె ♦ యయి లోకము తా
ననిశము వర్తించెడుఁ గా,వునఁ గాలమె గతియు సర్వ♦భూముల కెపుడున్. ౫

సీ. కాలస్వరూపుఁడై ♦ క్రాలునీశుఁడు కాలమును దాను మీఱఁ డ♦తనికి నాశ
మే లేదు ప్రతిబంధ♦మే లేకయుండుస్వభావంబునే పొంది ♦ వఱలుచుండుఁ
గాని తాఁ జేసిన♦కట్టుదిట్టంబులఁ దాను మీఱకయుండుఁ ♦ దనకు బంధు
భావమే లేకుంటఁ ♦ బక్షపాతమె లేక యలరారుచుండు న♦య్యనఘునకును
తే. హేతువే లేదు శౌర్యము♦యీ్యాశు గెలువఁ
జాలునది లేదు గావున ♦ శౌర్యమతని
కనవసరమయి యుండు, మి♦త్రాళి జ్ఞాతి
యనెడుసంబంధమే లేక ♦ యాతఁడొప్పు. ౬౪ 886

తే. కాన సర్వంబునకుఁ దానుఁ ♦ గారణుఁడయి
పురుషునకుఁ బరతంత్రుఁ డె♦ప్పొల్కుఁగాక
యుండు శ్రేయస్సుఁ గనఁజాలి♦యుండు బుద్ధి
గలుగువాఁ డంతయును గాల♦గతియె యనుచు. ౭ 887

క. తలఁపంజను నేకార్యం, బులఁజేసిన శోకమొందఁ♦బూనక మనకున్
గలుగంజేయు హితంబే, పలుమరు భగవంతుఁడనుచు ♦ భావింపఁదగున్. ౮౪

తే. ధర్మ మర్థకామంబులు ♦ తలఁపఁ గాల
కృతమయినయట్టి మర్యాద ♦ నతిశయింప
కల్లె కలుగుచునుండుఁ గి♦శాధిపుఁడగు
వాలి నాబాణమున నిలఁ ♦ గూలి యిపుడు. ౯౪ 889

---

1 కాలా ద్విహితాత్ కాలా దుత్తరం ఉత్తరస్మిన్ కాలే కించిత్కర్మ కిమపి కర్మ ఉపాసి తు మనుష్ఠాతుం నశక్యం-అని మహేశ్వరతీర్థులు. ఈభావమే యిటఁ జేర్పఁబడినది.

సీ. ప్రాచిత మొందుటఁ ♦ బాసివిచ్యుతుఁడయి తాఁ జేసి యున్నట్టి ♦ ధర్మమునకు
అర్థకామములకు ♦ నర్హకాలకృతంబులకు ఫలంబగు సురా♦లయమునొంద
నిచటనుండియె పోయె ♦ హితబుద్ధియగు వాలి విహితకర్మమ్ముల ♦ విడువకుండఁ
జేయుట లక్ష్యంబు ♦ చేయక ప్రాణాళి నని మొనరించుట ♦ నతఁడు స్వర్గ
తే. మునువశగతముగాఁ జేసి♦కొనియె వనచ,రాధిపుండేనియతిని దా♦నాశ్రయించె
నదియె మిక్కిలి శ్రేష్ఠమై ♦ యమరుఁ గానఁ, బరితపించిన దేహాలు ♦ వలదు దింక.

క. చేయంగాఁ దగుకృత్యముఁ, జేయంగాఁ బూనుఁ డింకఁ ♦ జెప్పుఁ డనని యా
న్యాయవిదుం డగుదశరథసుతు, యాయఁ దనుఁదఁ బలికె నంత ♦ నాలక్ష్మణుఁ డున్.

క. వగపెల్లిన మతివిభ్రమము గనుచు నిలుచున్న కీశ♦ముఖ్యుని దవిప్ర
త్రుఁ గనుచు వినయంబున నో, యగచరనాథా! జవమున ♦ నన్నిటఁ భర్త్రికిన్.

తే. పారలౌకికకృత్యముల్ ♦ దగఁ జేయు
మీవు తారాంగదులఁ గూడి ♦ యాకపీంద్రు
నకు మహితాశనసంస్కార ♦ మకలుషముగ
నొనరుచుటకయి కాష్ఠంబు ♦ లొగినిఁ గూర్పు. ౧౩ 893

క. వనచరులఁ బిల్చి యిఁక జం,దనముఖకాష్ఠముల శుష్క♦తరుభవముల నె
ల్లనుఁ గూర్పవలయునని యా,జ్ఞను జేయుము; దీనచేత♦నమునఁ జనకునిన్. ౧౪

క. కని దుఃఖించెడునంగదు, మనమున నూఱడిలఁ బల్కి ♦ మఱియిఁకఁ దఱియా
టను దండ్రికి సంస్కారము, నొనరుప నాల్కోలుపు నగరి♦మొగి నీయదియై.

క. రక్షింపఁ గోరుచుండుట, నీక్షణమాదిగను దాని♦కేవిధమున యో
గక్షేమములను గూర్పఁగ, నా క్షతి లేకుండ వాని♦నగుఁ గూర్పంగన్. ౧౫

క. బాలిశువలె దుఃఖించుట, మేలౌనే యంగదుండు ♦ మేలగు సుమమా
లాళిని బహువస్త్రంబులఁ, దైలాజ్యంబుల సుగంధ♦తతుల న్మఱియున్. ౧౬

క. ఎప్పుడు కావలసినయటు, లొప్పినవస్తువుల నెల్ల ♦ నొగిఁ దెచ్చుంగా;
కిప్పుడు [1]తారా! వేగమె, యప్పురమున కేగి శిబిక ♦ నిటఁ జేర్పు మిఁకన్.

క. త్వరపడుట గుణయుతంబై, పరఁగుచు యుక్తంబునగుచుఁ♦బ్రకృతవుఁబనియం
దరయ విశేషించియె యు,త్తరుణమునన్ గుణము గల్గి ♦ తగుఁ గపివర్యా!.

క. బలవంతులును సమర్థులు, బలశాలిని వానరాధి♦పతినిన్ మోయం
గలవానరులను సన్నద్ధులఁ గావింపుమని పల్కెఁ ♦ దోంపుత్రద్ధన్. ౧౮ 900

క. అరిహంతయగు సుమిత్రా,వరపుత్రుం డిట్లు పల్కి ♦ భ్రాతృసమీప
స్థిరుఁ జేరె; నంత లక్ష్మణుఁ, బరికించి తదీయవాక్య♦భంగిం జేయన్. ౧౯ 901

చ. మనమునఁ దొట్రుపాటుఁ గని ♦ మాటను జేయఁగఁ బూని తారుఁ డో
య్యన నగరంబుఁ జేరె శిబి♦కానయనత్వరఁ బూని; యంతఁ ద

---

1 తారా-అనునో నిట "తారుఁ" డనువానరుఁ డర్థము.

యయ్యన నతఁడేగుదెంచె శిబి♦కాన్వితుఁడై వరవిక్రమంబునుం
గనినకపీంద్రు లాశిబికఁ ♦ గ్రన్నన మోయుచుఁ దెచ్చి రంతటన్. ౨౦౪ 902

సీ. భద్రాసనంబున ♦ భవ్యమై స్యందనభంగిగా నయ్యది ♦ పరఁగుచుండెఁ
గృత్రిమపక్షులం ♦ దెల్లెడఁ జిత్రింపఁబడియుండెఁ దరువుల♦భంగి నున్న
చిత్రశిల్పములుండెఁ ♦ జిత్రపదాతులవలె నున్నప్రతిమలు ♦ బహువిధముల
నందందుఁ దగియుండె ♦ నాకాశమునఁ బోవుసిద్ధవిమానాళి ♦ చెలువుతోఁపఁ
తే. జిన్నవియుఁ బెద్దవియు నయి ♦ చిత్రములగు
చున్నయట్టిగవాక్షంబు ♦ లొప్పుచుండె
సంధిబంధంబు లెల్లెడఁ ♦ జక్క నమరు
పంగఁబడియుండె నయ్యది ♦ బాగుమెఱయ. ౨౩ 903

క. సురశిల్పి తనచమత్కృతి, సరిగా నంతయును జూపి ♦ చారుతరముగా
నరసి యొనర్చె విశాల, స్ఫురణంబునఁ జెలువుమీఱి ♦ శోభిలుచుండన్. ౨౩౪

[1]క. తరునిర్మితకేళీభూ,ధరములు వెలయుంగఁ జారు♦తంతగుపనిచేఁ
బరినుతిఁ గాంచుచు దివ్యా,భరణములును హారములును ♦ బ్రబలుచు నుండన్.

ఆ. చిత్రమాలికలును ♦ జెలఁగుచుండఁగఁ గృత్రి
మమ్ములయిన గుహలు ♦ మఱియుఁ గాన
నములు వెలయుచుండ ♦ సుమహితరక్తచం
దనపుఁబూత లమరఁ ♦ గనుఁగొనఁ దగి. ౨౫ 906

సీ. పుష్పౌఘములు నిండఁ ♦ బొల్పారుచుండంగ బాలసూర్యునివలె ♦ భాసిలునరు
ణాంబుజమాలిక ♦ లందందుఁ గ్రాలంగ, వెలయుచున్నశి♦బికను దానిఁ
గనుఁగొని రాఘవుం ♦ డనుజునితోఁ బల్కె: నిఁక వేగముగ వాలి♦నెత్తి శిబిక
యందుంచి ప్రేతకా♦ర్యంబుల సాగింపఁ దగునట్లు చేయుమా ♦ తడవుచేయ
తే. కనిమె; నంతట సుగ్రీవుఁ ♦ డన్నకొఱకు
నేడ్చుచును నంగదునితోడ ♦ నెట్లొ వాలి
నెత్తి యాశిబికను జేర్చె ♦ నెల్లవనచ
రాళికధిపతియై తగు♦నాతఁ డంత. ౨౬ 907

చ. మరణము నొందినట్టికపి♦ముండను వాలిని నందుఁ జేర్చి యం
బరములఁ బుష్పమాలికల ♦ భవ్యతరంబగు భూషణావళిం
బరఁగఁగఁ జేసి కీశసమ♦వాయముఁ గాంచి వచించె నిట్లు; వా
నరపతియై మహాత్ముఁడయి ♦ నాదుసహోదరుఁ డైనవాలికిన్. ౨౭ 908

క. కావింపుఁ డుత్తరక్రియ, లేవిధమున శాస్త్రరీతి ♦ యేర్పడియెనో మీ
రావిధమున నని యాజ్ఞం, గావించె ననంతరంబ ♦ కపు లాయాజ్ఞన్. ౨౭౪

---

1 దారుపర్వతకోపేతామ్-అనిమూలము.

క. శిరసావహించి రతోష్కృష్టకృదమును వెదజల్లుచుఁ ద♦గన్ ముందఱఁ బో
యిరి వెంట శిబికఁ గొనుచును, దరువాత నృపాలకులును ♦ దగుదీక్ష నడచన్. ౩౧

ఆ. శాస్త్రమునకుఁ దగిన♦శంకర నుత్తరక్రియ, లేవిధముఁ బూర్ణ ♦ సేయు కేక
కొఱఁతలేకయుండఁ ♦ గోరి సుగ్రీవుఁడు, లక్ష్మణునకు నొసఁగె ♦ చింత; నచట. ౩౨

క. తారయు మొదలగువనచర, వీరులు సంగమునఁ గూడి ♦ విలపించుచు న
వ్వీరునకు బంధులగుటను, గోరికఁ బడఁగంగఁ జనిరి ♦ కుందుచు నంతన్. ౩౩

క. వారికి వశవర్తినులై, మారితులయి వనచరాళి ♦ మందమందగు నా
కారమునకు నార్తలగు నార్భటవు లెల్లరును వీర! ♦ వీరా! యనుచున్. ౩౪

తే. వాలిఁ జేకొనుచుం గడు♦వగలఁ బొగులు
చును జనంబున వేగిరి ♦ వనచరేంద్రు
పత్నులగు తారలోనగు♦పడఁతులెల్లఁ
గరుణపుట్టఁగ నేడ్చుచు ♦ గదలి చనిరి. ౩౫ 914

క. వనమధ్యమమున నచ్చట, వనటుం గుందుచును నేడ్చు♦వానరకాంతా
ఘనరోదనరవమున నా,వనగిరు లన్నియును నేడ్చు♦భంగిగ నుండెన్. ౩౬ 915

క. గిరిశైవలినికిఁ జెంతను, బరిశ్ర్త్న జలంబునగుచు ♦ భాసిలుపులినాం
తరమున నేకాంతముగాఁ, బరికింపఁ దగినచోట ♦ వానరులెల్లన్. ౩౭ 916

చ. వనటఁ గృశించుచున్ జితిని ♦ వాలికిఁ జేర్చిరి వాహకుల్ కపుల్
చని తమమూఁపులందుఁ దగి ♦ చారుతరంబగుయానమట్టె దిం
చినఁ గపులెల్ల దుఃఖమును ♦ జెందుచు నాస్థలమందు నిల్చి; రం
త నవుడు తార యానమునఁ ♦ దద్దయు నిద్దురవొందినట్లుగన్. ౩౮ 917

తే. పండుకొనియున్న తనప్రియ♦భర్తఁ గాంచి
యతనిశిర మంకమునఁ జేర్చి ♦ యతివిషాద
మడర నిట్లని విలపించె ♦ హా కపీంద్ర!
హా మహారాజ! మత్ప్రియ! ♦ హా సుపూజ్య!. ౩౯ 918

తే. దీర్ఘబాహూ! ననుం గన్ను ♦ తెఱచి చూడ
వేల! యిటుశోకమునఁ గంది ♦ యేడ్చుచున్న
నీప్రియాంగన నన్నుఁ గ♦న్నెత్తియైనఁ
జూడకున్నా విదేమొకో! ♦ చోద్యమయ్యె. ౪౦ 919

చ. వనచరనాయకా! మృతిని ♦ బాణవిధిం గనియున్న నీముఖం
బును గన జీవముం గనిన♦పోలిక నస్తమయార్కవర్ణమై
తనరెడునంతనంబునను ♦ ధర్ముఁడె రాఘవురూపమొంది యి
వ్వనమున కేగుదెంచి యొక♦బాణము వైచి కఠోరరీతిఁగన్. ౪౧ 920

తే. మమ్ము విధవలఁ జేయుచు ♦ మిమ్ము వెంటఁ
గొనుచుఁ బోవుచు నున్నాఁడు ♦ వనచరేంద్ర!
సంతతము నీకుఁ బ్రియులయి ♦ చారుగాత్ర
లైన యీవానరస్త్రీలు ♦ మాననివగ. ౯౩ 921

క. చరణగతుల్ మీఱఁగ వచ్చిరిగాదే! తెలియదే? ♦ శీతాంశునిభ
గర మందస్మైన మోములఁ, బఱఁగెడువీరెల్ల నీకు ♦ వల్లభ లెగదా?. ౯౩౪ 922

క. వీరిట్లు నిన్నుఁ గాంచెదు, కోరికలన్ నడచివచ్చి ♦ కుందుచునుండన్
వీరా! యూరకయుండెద, వే? రాజా! సహజుఁడైన ♦ యీసుగ్రీవున్. ౯౯౪

చ. కనుఁగొనవేలొకో? సచివ♦కాంతులు తారముఖుల్ పురంబునం
గనఁదగుపెద్దలందఱును ♦ గానఁగవచ్చి నినున్ మహాత్ముఁ బ్రీ
తిని నలుదిక్కులం గొలిచి ♦ దీనతనుండుటఁ జూడవయ్య శ
త్రునిచయసూదనా! కపులఁ ♦ దోరపువేడుకఁ గొల్చువారలన్. ౯౬౪ 924

తే. వారివారికిఁ దగినట్లు ♦ పలికి సెలవొ, సంగి పనుపుము వీరల; ♦ సమ్మదమున
నంత నెల్లర మిచ్చమై ♦ నతులమదన, కేళులన్ విహరింతమీ♦క్షితితలముల.

చ. అనియిటు భర్తృశోకమున ♦ నాతురయై తపియించుచున్న తా
రను గపికాంత లావనచ♦రప్రభుసన్నిధినుండి లేపి శో
కనిరతచిత్తలై యవలి♦త్న్యాస్థలిఁ జేర్చిరి; వాలిసూనుఁ డా
ర్తిని సకలేంద్రియంబు లతి♦దీనములై తగనేడ్చుచుం గడున్. ౯౦ 926

[1]చ. తనదుపితృవ్యుఁ గూడుకొని ♦ తండ్రిఁ జితిన్ శయనింపఁజేసె; న
జ్జనకునికంత నంగదుఁడు ♦ శాస్త్రవిధింగొని వ్యాకులేంద్రియుం
డునునయి యగ్నినిచ్చుచుఁ గ♦డున్ వగమీఱఁగ నప్రదక్షిణం
బును నొనరించె నాకపులు ♦ పొక్కుచు నట్లు మహేంద్రసూనునిన్. ౯౯౪

తే. దహనసంస్కృతుఁ జేసి యు♦దకము లిడఁగ
శీతలాంభోయుతంబయి ♦ శివదమగుచు.
నొప్పు నేటికిఁ జని; రంత ♦ నొగి వనచరు
లర్కసూనునిఁ దారను ♦ నాశ్రయించి. ౧౧ 928

క. అంగదు మున్నిడుకొని హే,మాంగదుఁడగువాలికెంతొ♦యార్తిఁబొగులుచున్
[2]దుంగాజలములఁ దర్పణ,ముం గావించిరి; రఘూత్త♦ముఁడు వారివలెన్.

క. తానును దుఃఖించుచు రవి, సూనునిచే దేవరాజ♦సూనునికటశా
స్త్రానుసరణముగఁ జేయం, గానౌ కృత్యములఁ జరపెఁ ♦ గడుశ్రద్ధమెయిన్.

---

1 సోపసవ్యం చకార హ-అనియూ. 2 తుంగాజలములన్=తుంగానదీసలిలములచే.

[1]చ. అనుపమపౌరుషంబు తెగ♦ఖ్యాతి చెలంగఁగఁ బ్రజ్వలత్కృశా
నునివిధంబునం దనరి♦వారతరంబుగఁ దేజమొప్పు రా
ముని శరముగ్ధి ప్రాణములఁ ♦ బోవఁగఁ జేయఁగఁ బట్టినట్టియ
ప్పౌనచరసంఘనాథునకు ♦ వాలికిఁ గర్మము లాచరించి త
మ్ముని కడ నున్నరాముఁ గనఁ♦బోయెను సూర్యసుతుండు చయ్యనన్. ౯౩౧

ఇరువదియైదవ సర్గము సంపూర్ణము.

---

## ౨౬ - వ సర్గము.

సుగ్రీవపట్టాభిషేకమహోత్సవము.

తే. ఉత్తరక్రియ లావాలి ♦ కొప్పఁ జేసి
స్నాన మొనరిచి యార్ద్రవ♦స్త్రములతోడ
వగలఁ బొగులుచు సుగ్రీవుఁ ♦ డగముచెంత
నుండ సేవించి రానచి♦వోత్తము లొగి. ౧ 932

సీ. అక్లిష్టకారి మ♦హాబాహుఁడై తగు రామునొద్దకు వాన♦రప్రభుండు
వాయు నందనుఁడని♦ బ్రహ్మచెంతను ఋషులట్లు చేతులు మోడ్చి♦యతిశయముగ
భక్తినిల్చిరి; స్వర్ణ♦పర్వతాభుఁడు బాలవనజబాంధవనిభ♦వక్త్రుఁ డనిల మలరఁ
తనయుఁ డాహనుమ యం♦కటఁ బ్రాంజలియయి రామున కిట్లువల్కెను♦వినయ
తే. ప్రభువతంసమ! మీయను♦గ్రహముచేతఁ
బొందరానిదియై కుల♦పూర్వలబ్ధ
మైన యీగొప్పకపిరాజ్య ♦ మర్కతనయుఁ
డిపుడు పొందెను, గావున ♦ నింక నితఁడు. ౨ 933

క. భవదనుమతి నొంది శుభం,బు విభవదక్షుంబునైన ♦ పుర మొంది స్వకీ
యవిభూతి మెఱయ సఖిబాం,ధవయుతుఁడై కృత్యములను♦దగఁ జేయంగన్.

సీ. బహువిధగంధద్రవ్య♦వారముచేత నోషధులచేతను యథా♦శాస్త్రరీతి
నభిషిక్తుఁడై భక్తి ♦ యలరఁగా నిను విశేషించి మాల్యమ్ముల♦చేత రత్న
ములచేత నర్చింపఁ♦గలఁడు; మీరిటనుండి కిష్కింధకున్ వచ్చి ♦ కీశవితతి
కానంద మలరంగ ♦ నర్కజుఁ బట్టాభిషిక్తునిఁ జేయుఁడీ ♦ శ్రీసమృద్ధి
తే. ననినఁ బరవీరహంతయు ♦ నమలబుద్ధి
వైభవంబును గనువాఁడు ♦ శ్రీభరితుఁడు

---

1 తతస్తు తం వాలిన మగ్ర్యపౌరుషం ప్రకాశ మిక్ష్వాకువరేషుణా హతం, ప్రదీప్య దీప్తాగ్నిసమౌజసం తదా సలక్ష్మణం రామ ముపేయివాన్ హరిః-అని మూ. దీనియర్థ మే యిట వివరించుటచేఁ బంచపాదిగా నైనది యెఱుంగునది.

నైన రాముఁడు పల్కె వా♦క్యములఁ గోవి
దుండు గావున; సౌమ్య! వి♦ధూతపాప!. ౮ 935

చ జనకునియాజ్ఞ నెల్లపుడు ♦ సల్పఁగఁ బూనినవాఁడనౌట నా
తనిదగుమాటరీతిఁ బుర♦తల్లజమందును గ్రామమందు నే
పనిని జతుర్దశాబ్దములు ♦ పావనిరో! చొరరాదు మీరలీ
వనచరనాథు వీరవరు ♦ భాస్కరపుత్త్రుని సంతసంబునన్. ౯ 936

తే. సంపదలచేతఁ బూర్ణమై ♦ చారురీతి
నలరు కిష్కింధఁ జేరిచి ♦ యతిజవమునఁ
బట్టభద్రునిఁ జేయుఁడు ♦ వైభవమున
విధిగ ననిపల్కి కపిసంఘు♦వీరుఁ గాంచి. ౧౦ 937

[1]తే. చక్కఁగా వృత్తములనెల్ల ♦ స్వాంతమందు
నెఱిఁగిన మహానుభావుఁడై ♦ యెసఁగు రాముఁ
డతిబలుండయి వృత్తజ్ఞుఁ♦డైనసూర్య
తనయునకుఁ బల్కె వీర! యా♦తారతనయు. ౧౧ 938

ఆ. యౌవరాజ్యమందు ♦ నభిషిక్తునిం జేయు, మితఁడు సుమ్ము నీకు♦జ్యేష్ఠుఁడైన
వాలి కగ్రసుతుఁడు ♦ బలపరాక్రమముల, నీకు సాటి యగుచు♦నెగడువాఁడు.

ఆ. ఇతఁ డదీనచిత్తుఁ ♦ డీయౌవరాజ్యము
నకును దగినవాఁడు ♦ ప్రకటశక్తి
వానకాలమిదియె ♦ వచ్చె నం దిది తొలి
నెలయె శ్రావణాఖ్య ♦ నెగడుఁ జుమ్ము. ౧౩ 940

[2]క. విను మాషాఢము మొదలుగఁ, దనరున్ మాసములు నాల్గు ♦ ధరవార్షికనం
జ్ఞను గాన నిందు యుద్ధం, బునకున్ యత్నంబుచేయఁ♦బోలదు సుమ్మీ. ౧౪

క. పురమునకున్ శుభదంబున, కరుగుము సౌమిత్రితోడ ♦ నద్రిని నిటనే
జరపెద నీకాలము భూ,ధరగుహాలివి రమ్యములు ని♦తాంతము సౌమ్యా!.

తే. అతివిశాలమ్ములయి తగి♦నంత గాలి, గలిగియున్నవి వీనిచెం♦గట జలములు
సద్మకైరవములును బెం♦పఁబడినట్లు, గ్రాలుచున్నవి వాసయో♦గ్య మిట నాకు.

క. విను కార్తికమ్ము వచ్చిన, దనుజేశ్వరువధముకొఱకుఁ ♦ దగుయత్నమొన
[3]ర్పను జను సౌమ్యా! నీవిఁకఁ, జనుమా! నగరమున కిద్ది♦సమయము మనకున్.

---

1 వృత్తజ్ఞో వృత్తసంపన్నమ్-అనిమూ 2 ప్రవృత్తా సౌమ్య చత్వారో మాసా వార్షికసంజ్ఞితాః-అని మూ. వార్షికసంజ్ఞితా శ్చత్వారో మాసా ఇతి. ఆశ్వయుజాషాఢాభ్యాం చతుష్ట్వమితి జ్ఞేయమ్. ఛత్త్రిన్యాయాత్ వర్షముఖత్వా ద్వర్షానంతరకాలత్వా చ్చ చత్వారోపి యుద్ధయోగ్యా నభవంతి-అని గోవిందరాజులు. 3 ఏష న స్సమయ సౌమ్య-అని మూ. సమయ స్సంకేతః-అని వ్యాఖ్య. మనకిద్దఱి కిదియే మాటపట్టు. అని యర్థము.

క. వనచరరాజ్యంబున కెల్లను నీవే యధిపతివయి ♦ యలిమిగతిం బా
లన మొనరుప నభిషేకం, బును గైకొని మిత్రతతికి ♦ ముద మొసఁగుపుమా!.

చ. అని రఘురాముఁ డాజ్ఞయిడ ♦ నారవినూనుఁడు రామువాసతిం
గొని చని వాలిపాలితపు♦రంబుకు సైన్యమునైన సత్త్వరం
బున దమిఁ జొచ్చి తద్విభవ♦ముం గని మెచ్చుచునుండ వానరే
శునిఁ బురిఁ జొచ్చువానిఁ గని ♦ పౌరకపీశసహస్రముల్ తగన్. ౧౮ 946

తే. అతనితోడఁ బ్రవేశించి ♦ యాదరమున
వందనము సల్పి చుట్టును ♦ బలసి కొలిచి;
రంతఁ బౌరులు కీశసం♦ఘాధినాథుఁ
డైన సుగ్రీవు దర్శించి ♦ యతని చెంత. ౧౯ 947

చ. శిరములు సోఁక భూమిఁ బడి ♦ చెచ్చెఱ మ్రొక్కి సమాహితాత్ములై
ధరణిపుఁ డయ్యె నేఁటికని ♦ తాను ముదంబునఁ గ్రాలిరంత; న
వ్వరజనసంతతిం గరుణఁ ♦ బోలఁగ నెత్తి కృపారసోక్తులన్
గర మలరంగఁ జేసి యటఁ ♦ దారకు దుఃఖము వాపు కోరికన్. ౨౦ 948

క. తనవశము చేసికొనుటకుఁ, జనియెను వే వాలియుండు♦సౌధంబునకున్;
వనచరపతియు మహాబల, మునఁ గ్రాలుచుఁ బోయి రాఁగ ♦ ముఖ్యప్రకృతుల్.

క. సురపతిని నిర్జరులువలెఁ, బరమానందమునఁ బట్ట♦భద్రుని గాఁ జే
సిరి వానరు లత్తఱిఁ దెచ్చిరి శ్వేతచ్ఛత్రవరముఁ ♦ జెల్వమరంగన్. ౨౨

చ. కనకమయంబుగా నదియుఁ ♦ గ్రాలెను దత్తనువర్ణదండముల్
తనర యశస్సునించెడు వి♦ధంబున మించుచుఁ దెల్లనై చెలం
గిన వరచామరద్వయముఁ ♦ గృత్రిమ మింతయు లేని రత్నపం
క్తిని వరబీజసంతతిని ♦ దివ్యతరౌషధులన్ గ్రమంబుగన్. ౨౩ 951

సీ. క్షీరముల్ గల్గిన ♦ చెట్లచిగుళ్లను సాధుసుమంబుల ♦ సంతసంబు
నింపు శ్వేతాంబర♦నిచయంబు శ్వేతాంగరాగంబు వాసనల్ ♦ రాజిలఁ దగు
కుసుమమాలికలను ♦ *గుతలంబునం దగు తామరలను సుగం♦ధవరచంద
నంబును మఱియు నా♦నావిధపరిమళ ద్రవ్యంబులను హరి♦ద్రాసమన్వి

తే. తాక్షతల సూక్ష్మధాన్యంబు ♦ నమలఘృతము
మధువుఁ బెరుగును వ్యాఘ్రచ♦ర్మమును వనవ
రాహచర్మమునం జేయ ♦ రంగుఁగులుకు
పాదరక్షలఁ దెచ్చి ర♦ప్పట్టునందు. ౨౬ 952

సీ. షోడశకన్యలు ♦ సొంపు చెలంగ మైపూఁతయు మనఃశిలఁ ♦ బొందుపఱచి
నట్టి గోరోచన ♦ మచటికిఁ దెచ్చిరి; సంతసంబున మంత్రి♦సమితి నెఱిఁగి

* మెట్టదామర

నట్టివానరవరు ♦ లప్పుడు యాజనార్థము పిలిపించిన♦బ్రాహ్మణో త్త
ములకు రత్నంబుల ♦ లలితవస్త్రంబుల బహువిధసురుచిర♦భక్ష్యముల నొ

తే. సంగి సంతుష్టులం జేసి ♦ జాతవేద
సుని జ్వలింపఁగఁ జేయుచుఁ ♦ జుట్టు కుశల
వెలయఁగాఁజేసి శాస్త్రోక్త♦విధిని నర్హ
కాలమున వేల్చిరి హవిస్సుఁ ♦ గమ్రతరము. ౨౯ 953

క. కనకాంఘ్రులబెడఁగై మఱి, ఘనాస్తరణసంవృతంబు♦గాఁ గ్రాలెడునా
సనమున నాసుగ్రీవుని, నునిచిరి దివ్యాసనమది ♦ యొప్పెన్మిగులన్. ౩౦ 954

తే. వివిధమాల్యాభిమండిత♦విమలసౌధ
శిఖరమునఁ బైని బేర్కొన్న♦చిత్రపదము
నందు సుగ్రీవుఁ బ్రాఙ్ముఖు ♦ నమలమంత్ర
ములను గూర్చుండఁబెట్టి న♦దులనదముల. ౩౧ 955

క. వరతీర్థంబుల ఘననా,గరములఁ జెలువారుజలముఁ ♦ గలశంబులతోఁ
బరమాదరమునఁ దెప్పిం,చిరి పిదపన్ దానినెల్లఁ ♦ జేర్చి యొకటిగాన్. ౩౨

క. కనకమయకుంభముల నుం,చినపిదప ముహూర్తమందుఁ ♦ జెలఁగుచు శాస్త్రం
బునఁ గనఁబడునట్లుగ సూ,త్రనిచయములఁ జెప్పినట్టి♦క్రమమునఁ బూన్కిన్.

సీ. గజుఁడుగవాక్షుండు♦గవయుండు శరభుండుమైంద,ద్వివిద,గంధ♦మాదనులును
హనుమంతుఁడును నలుం♦డాజాంబవంతుండు సుప్రసన్నంబయి♦సుపరిమళము
గలుగునాజలము మం♦గళకరవృషశృంగములతోడ హాటక♦కలశనిచయ
ములతోడఁ దమినెత్తి♦మును వసువులు సహస్రాక్షుఁడై తగినట్టి♦యమరపతికి

తే. నలరి యభిషేక మొనరించి♦నట్లు వనచ
రేంద్రునకు నభిషేకంబు ♦ నెసఁగఁజేసి;
రంత నప్పనికాఁగ మ♦హాత్ములైన
వనచరేంద్రులు గుమిఁగూడి ♦ ఘనముదముల. ౩౬ 956

క. పలికిరి జయజయశబ్దం,బుల, సుగ్రీవుండు రాఘ♦వునియాజ్ఞను ని
ష్ఠులఁ జేయనెంచి యంగదుఁ, బిలిచి తమిం గౌఁగిలించి ♦ విధియుక్తముగన్.

ఆ. యౌవరాజ్యపదము♦నందుఁ బట్టముఁ గట్టె;, నంత నంగదునకు ♦ నప్పదంబు
గలుగఁజూచి *కరుణ♦గలుగువానరులు సు,గ్రీవుఁ బొగడిరిదియె♦భావ్యకమని.

క. ఆరీతిని శుభకార్యము, గారవమున జరగుచుండఁ♦గా నచ్చటియ
వ్వారలు ప్రీతిం దనరుచు, శ్రీరాము మహాత్ము నతని ♦ చిన్నిసహజునిన్. ౩౯

క. పలుసారులు నుతియించిరి, విలసిల్లు మహోత్సవమిటు ♦ వెలయఁగ మోదం
బులఁ బొంగుజనులు గ్రాలఁగ, నిలేశచిహ్నములు గలుగు ♦ నెల్లధ్వజంబుల్.

* సానుక్రోశాః ప్లవంగమాః - అనిమూలము.

తే. వెలయుచుండఁ బతాకలు ♦ గలయఁ గ్రాల
వేడుకల మించుచుండెను ♦ బృథ్వికిఁ గు
హం జెలంగు కిష్కింధయు ♦ నప్పుడు మిగుల
నంత వీర్యవంతుండగు ♦ నాకపిపతి. ౪౦ 963

[1]చ. ఘనతరచిత్తుఁడైన రఘు♦కాంతుని చెంతకు నేఁగి యుత్సవం
బును వివరించి చెప్పి తన♦పొందు మదిం దగఁ గోరుచున్న భా
ర్యను రుమఁ గూడి యా త్రిదశ♦రాజ్యము పాకనిషూదనుండు పొం
దినగతిఁ గీశరాజ్యము మ♦దిం గలప్రీతిని బొందె నంతటన్. ౪౧ 964

ఇరువదియాఱవ సర్గము సంపూర్ణము.

---

౨౭ - వ సర్గము.

రామలక్ష్మణులు గుహయందు నివాసము చేయుట.

క. వనచరపతి యాకీతిని, దనరాజ్యపదంబు నొంది ♦ తమిఁ గిష్కింధన్
గొని యుండఁ జేర రాముం, డనుజనితోఁ బ్రస్రవణము♦హాగిరికేగెన్. ౧ 965

సీ. శార్దూలమృగగణ♦సంఘుష్టమై సింహభయదనాదంబులు ♦ పరఁగుచుండ
వెలసి నానాగుల్మ♦వితతిలతాపుంజగూఢమై బహువిధ♦కుజసమన్వి
తంబయి భల్లూక♦తతి వానరశ్రేణి [2]నిచయమై గోపుచ్ఛ♦నిచయ, మూష
కాంతకయుతమయి ♦ యంబుదాకృతినున్న నల్లనిశిలలచే ♦ నల్లసిల్లి

తే. నిర్మలజలాశ్రయంబయి ♦ నెగడుచున్న
ప్రస్రవణశైలశృంగైక♦భాగమందుఁ
[3]బొడవు వెడలుపు తగనున్న ♦ భూరిగుహను
గాపురముగా గ్రహించె రా♦ఘవుఁడు కోర్కి. ౪ 966

క. అనఘుఁడు శాంతుఁడు నగు నా, జనపతి గీశేశుతోడ ♦ సమయమ్మును దా
నొనరుచుకొని; యాపిదపన్, వినయంబునఁ దనరి సిరికి ♦ వృద్ధికరుండై. ౫ 967

[4]క. తనపయి భక్తియుఁ గూర్మియుఁ, గని వెలయు సుమిత్రకొడుకుఁ♦గని యక్కాలం
బునకుం దగినట్లుగ ని, ట్లని యెన్ బహ్వర్థములగు♦నట్లుగ నొకటన్. ౬ 968

క. అరిగణనిషూదనా! యీ, ధరణీధరగుహా విశాల♦తం దగుచు మనో
హారమై యుక్తశ్వసనా, కరమై తగియున్న దట్లు♦గావున నిందున్. ౭ 969

[5]క. ఈవర్షరాత్రముల నిం, దే వాసము చేయుదము మ♦హీపకుమారా!
గ్రావోత్తమశృంగంబిది, పావన మున్నతము నగుచు ♦ భవ్యము నయ్యెన్. ౮

---

1 నివేద్య రామాయ తదా మహాత్మనే-అనిమూలము. 2 మార్జారైశ్చ నిషేవితమ్-అని మూ. 3 మహతీ మాయతాం గుహామ్-అనిమూలము. 4 కాలయుక్తం మహావ్యాక్యమ్-అని మూ. కాలయుక్తం తత్కాలోచితమ్-అని వ్యాఖ్య. 5 సౌమిత్రే వర్షరాత్ర మరిందమ-అని మూ.

సీ. ఎఱ్ఱనై నల్లనై ♦ యిందుఁ బాషాణముల్ శోభిల్లుచున్నవి ♦ సొగసుఁ దనర
బహువిధధాతువుల్ ♦ భాసిల్లుచున్నవి గుహలును సెలయేళ్లుఁ ♦ గొమరుమిగుల
నున్నవి పలురీతు ♦ లొప్ప వృక్షాళియుఁ గాంతచిత్రలతాని ♦ కాయమొప్పు
చున్నది బహువిహ ♦ గోత్తమధ్వానముల్ వినఁబడుచున్నవి ♦ విమలకేకి
తే. రవము లొప్పుచునున్నవి ♦ రమ్యవికచ
మాలతీకుందగుల్మముల్ ♦ మఱియు సింధు
వారకురవకములు సర్జ ♦ భూరుహములు
మద్దులల్లై కదంబముల్ ♦ మలయు నిందు. ౧౦ 971

క. నరవరనందన! యల్లదె, సరోవరము వికచరమ్య ♦ సరసిజయుతమై
పరఁగుచు నీదినములలోఁ, బరికింపఁగ మనగుహకును ♦ బరిసరమందున్. ౧౦

తే. వెలయునట్లుగ వ్యాపింపఁ ♦ గలదు సుమ్ము
ప్రాగుదగ్భాగమందును ♦ బల్లమైన
ధరణి నీగుహ తనరుచు ♦ ద్వారభాగ
మందు నైరృతి యొప్పఁగ ♦ నమరియుంట. ౧౧ 973

తే. ఈశుదెసనుండి వచ్చెడు ♦ వృష్టిలోనఁ
బడకయుండుఁ బశ్చిమమగు ♦ భాగ మున్న
తం బగుటచేతఁ దూర్పువా ♦ తమ్ము చొరక
శర్మదాయకమై యుండు ♦ సౌమ్య! యిద్ది. ౧౨ 974

క. కనుమా! యీగుహవాకిటఁ, గనఁబడు నీశిలయు సమము ♦ గాఁ దగి శుభమై
నునుపయి వెడలుపునయి విరి, సిన కాటుకరాశివలెనె ♦ చెన్నగుఁ జుమ్మీ!. ౧౩

చ. కనుమిదె యుత్తరక్షితిని ♦ గన్పడునీశిఖరంబు రమ్యమై
తనరెడు లేచినట్టి జల ♦ దంబుక్రియన్ మఱి భిన్నమై చెలం
గిన రుచిరాంజనంబువలెఁ ♦ గేవలచిత్రముగాఁ గనంబడున్,
గనఁబడునల్లై యామ్యదిశఁ ♦ [1]గామవారక్షితిభృత్సమానమై. ౧౪ 976

క. నానాధాతువిభూషిత, మై నాయన! మఱియొకండు ♦ హరిశిఖరమున్
గానంబగు శ్వేతంబగు, దాని; న్మఱి యీగుహకును ♦ దగుఁదూర్పుదెసన్. ౧౫

ఆ. అటఁ ద్రికూటనుండు ♦ నలరు జాహ్నవివలెఁ
బాఱుచున్నయీశు ♦ భనదిఁ జూడు
మిది యకర్దమముగ ♦ నెసఁగుచుఁ దూర్పుగాఁ
బాఱుచున్నదెంతొ ♦ భవ్యరీతి. ౧౬ 978

సీ. తాలతమాలప ♦ ద్మకములు నతిముక్తచంపకతిలకముల్ ♦ సరళములును
వఱలు నశోకముల్ ♦ వానీరతిమిశముల్ వకుళకేతకములు ♦ ప్రకటములగు

1 కామవారక్షితిభృత్సమానమై=కైలాసగిరితుల్యమై.

చంద్రలు హింతాల♦సంఘముల్ లొద్దుగుల్ నీపవేత్రకవృక్ష♦నిచయముల్లె
కృతమాలకంబులు ♦ వితతశాఖలచేత నొప్ప శోభిల్లుచు ♦ నున్నదిద్దె
తే. తటమునం గలబహువిధ♦తరువరములఁ, గలిసి యుండుటచే నిది ♦ లలితవస్త్ర
భూషణమ్ముల శోభిల్లు ♦ పొలఁతివోలె, నెంతయును బొల్చుచున్నది♦హీనధైర్య.

క. పతగంబులు గుంపులుగా, శతసంఖ్యలు గూడి వితత♦చారురవంబుల్
సతతము చేయఁగ నీగుహ, యతిశయమోదముల నెలఁగ ♦ నలరెడుఁ గంటే!.

క. జక్కవ లొండొంటిని బెన్మక్కువమీఱంగఁ గలిసి ♦ మధురధ్వనులన్
గ్రిక్కిఱియఁ జేయుచున్నవి, దిక్కులఁ గనుఁగొనుము వాని♦ తెఱఁగు శుభగుణా!.

తే. హంససారసనికురుంబ ♦ మలర రమ్య
ములగు సైకతభూములు ♦ వెలయుచుంట
నిద్ది భూషణరమ్యమై ♦ యింపుగులుక
నవ్వు నారీమణింబోలి ♦ నివ్వటిల్లె. ౨౧ 982

తే. ఒకట నీలోత్పలములు వే♦ఱొక్కచోట
నెఱ్ఱగలువలు మఱొకట ♦ నెసఁగి తెల్ల
గలువ లింకొకచోట ని♦కామరమ్య
కుముదకుట్మలములు గల్గ ♦ నమరుఁ గంటె. ౨౨ 983

సీ. జలపక్షిశతములు ♦ వెలయ బర్హిక్రౌంచనినదముల్ విలసిల్ల ♦ మునిసమూహ
సేవితంబు నగుట♦చేత నీనదియెంతొ రమణీయమగుచున్న ♦ దమలచిత్త!
చందనభూరుహ♦సముదయమిదె చాలుగా మాలికను దమిఁ ♦ గట్టినట్లు
వెలయు నర్జునవృక్ష♦వితతి మనస్సున నూహించి యొకమాఱె ♦ యుర్విఁ బుట్టఁ
తే. జేసిన ట్లొప్పుచున్నది ♦ చిత్రమిద్ది
యరినిషూదన! యీదేశ ♦ మతిమనోజ్ఞ
మౌట ముదమునఁ జక్కఁగా ♦ నార్య! కేళి
చేయఁగావచ్చుఁ గాన వ♦సింత మిందు. ౨౩ 984

క. విను! రాజతనయ! చిత్రవ, ననిచయ మగుచున్న కీశ♦నాథపురముచెం
తనె యుండఁగలదు గావున, మనమీరమ్యస్థలమున ♦ మమత చెలంగన్. ౨౪

సీ. నివసింత మోశూర♦నికరాగ్రణీ! యదె గీతవాదిత్రవి♦ఖ్యాతరవము
లల్లె మృదంగాళి ♦ యాడంబరంబులతోడ ధ్వనించుకోఁ♦తులరవములు
వినవచ్చుచున్నవి ♦ విజయశీలా! వానరేశుఁడు సుగ్రీవుఁ ♦ డెలమిఁ దనదు
పత్నిని రాజ్యంబు♦బహుసంపదలఁ బొంది స్వసుహృద్వృతుండయి♦సంతసంబు
తే. నొందియున్నాఁడు, నిజమని ♦ యొప్పఁ బలికి
కనఁగ నందముగానున్న ♦ ఘనగుహాలను

గుంజపుంజంబులను జాలఁ ♦ గూడి యున్న
యద్గిరింగల గుహాయందు ♦ ననుజుఁగూడి. ౨౯ 985

క. నివసించి యుండె; నా ప్రస్రవణగిరీంద్రంబు మిగుల ♦ ద్రవ్యంబులతో
డ వఱలుచుఁ సుఖకంబయి, యవనిం జెల్వారుచుండు♦నట్టి గిరిపయిన్. ౩౦

[1]చ. అనుజునితోడ నారఘుకు♦లాబ్ధిశశాంకుఁడు వాసమొప్పఁజే
సినను మహీకుమారికయుఁ ♦ జెంతను లేమియె కాక యెవ్వఁడో
దనుజుఁడు దొంగిలించుకొని ♦ తాఁ జనుటం దనప్రాణరాజికం
టెను ఘనమైన యామెదగు♦కీవిని బల్మఱు నెంచుచుండుటన్. ౩౦౹ 988

తే. అతని కావంతయైనను ♦ నందు సుఖము
నొదవదయ్యెను; బ్రాగద్రి ♦ నుదయమందు
చంద్రునిం గాంచి మిగులంగ ♦ సంతపించు
చుంట రాత్రుల నిద్రను ♦ నొందఁడయ్యె. ౩౦౹ 989

చ. జనకజఁ దాఁ దలంచుకొని ♦ స్వాంతమునం గనుపట్టుచున్నచిం
తను గడునశ్రుపూరము లు♦దాత్తమనస్సును జంచలింపఁజే
య నిరతదుఃఖభాగుఁడయి ♦ యారఘురాముఁడు కుందఁ గాంచి యా
తనికి సమానమౌ వగను ♦ దాఁ గనియుఁ సహజుండు రామునిన్. ౩౨౹ 990

తే. ఊఱడించుచు నిట్లను ♦ నోమహాత్మ
వీర! నీవిట్లు వగఁ గుందు ♦ టారయంగ
[2]యుక్తమా నెట్లు? దుఃఖించు♦చున్నవాని
కెల్లపనులును జెడునని ♦ యెఱుఁగుదుగద!. ౩౪ 991

క. ధరనీవె పురుషకారము, పరఁగం గార్యములు చేయు♦వాఁడవుగా శ్రీ
కర! దైవపరాయణుఁడవు, పరమాస్తికుఁడవు స్వధర్మ♦పరుఁడవు తలఁపన్.

క. నిరతప్రయత్నములఁ దత్పరుఁడవు నీవిట్లు చాల ♦ వగఁ గుంది మన
స్థిరతం బొందకయున్నన్, బరునెవ్వనిఁ గాని యోర్వఁ ♦ బ్రాభతఁ గనుదే?.

తే. అందును విశేషముగఁ గప♦టాత్మ దనుజు
నని వధింపఁగఁ జాలవే ♦ కనుక శోక
మును దొలంగఁగఁ జేయుమా! ♦ మునుకొని స్థిర
తను గ్రహింపుము వ్యవసాయ♦మును నొనర్పు. ౩౬౹ 994

క. దనుజునిఁ బరివారముతో, నని నిర్మూలమును జేయు ♦ మతిపౌరుషమొ
ప్ప నితాంతము సాగరగిరి, వనయుతభూమండలమును ♦ బాహుబలమునన్.

క. తలక్రిందు చేయఁజాలుదు;, వల రావణుఁ జంపుటెంత ♦ యనఘా! యిదె యి

---

1 హృతాం హి భార్యాం స్మరతః ప్రాణేభ్యోపి గరీయసీమ్ - అనిమూ. 2 శోచతో వ్యవసీదంతి సర్వార్థావిదితం హి తే-అనిమూ.

మ్ములవర్షాకాలము వచ్చె లలి శరత్కాల మెప్పుడు ♦ చేరునో యిలపై. ౩౯

క. అని దానికెదురు చూడుము, తనుజుని రావణుని సంతేఁ ♦ దద్వంశవ్రుల౯
గొనకొని యాతని తనయుల, ఘనసైన్యముతోడఁ జంపఁ♦గల వీవు విభూ!.

ఆ. నిపుణు గప్పినట్టి ♦ నిప్పుడు కీర్తాహా, తులను సంపఁ జేయఁ ♦ గలుగుకీర్తి
నిదురవోవునట్లు ♦ నీపరాక్రమమున, మేలుకొలుపువాఁడ ♦ మేలినుదుల. ౪౦

క. అని హితము శుభమునగుకీర్తిని బల్కిన లక్ష్మణోక్తిఁ ♦ బ్రీతిగ విని దా
నిని గైకొని సమ్మతియై, యనయము నెయ్యమున నలరు ♦ ననుజున కనియె౯.

క. అనురక్తియు స్నేహము హిత, మును గోరుచు సత్యశౌర్య♦మున నొప్పెడువాఁ
డనఁదగిన పల్కులన్నియు, ననఘా! చెప్పితివి నాకు ♦ నాదర మొప్ప౯. ౪౧

ఆ. అఖిలకార్యములకు ♦ నంతక మగుకోక
మిపుడె దీనిఁ బాయ ♦ నెంచినాఁడ
వదలినాఁడఁ జుమ్ము ♦ పతిలేని తేజంబు
విక్రమావహంబు ♦ వెలయఁగొంటి. ౪౩ 1001

క. అనుజా! నీవాక్యముచొప్పున నిందు శరత్సమయము ♦ పొలయఁగ నదులె
ల్లను విమలములై యొప్పఁగ, వనచరపతికరుణ నొందు♦వఱకుందు నిట౯.౪౪

క. వీరుఁ డగువాఁడు తనకుప, కార మ్మొనరించినట్టి ♦ ఘనులకు మేలు౯
గారవమున నొనరించును, నాకీతిం గాక చేసి♦నట్టి యుపకృతి౯. ౪౫ 1003

తే. మఱచి ప్రత్యుపకార మ♦మ్మనుజునకును
జేయకుండినచో శాంత♦చిత్తుల మది
నొచ్చువారలు దూషింత్రు ♦ సచ్చరితులు
నింద చేయుదురనియైన ♦ నెఱి రవిజుఁడు. ౪౬ 1004

క. మనకుపకారము చేయును, ఘనపదమును బొందినాఁడు ♦ గావున ననియె౯;
విని రామువాక్యమంతట, వినయంబునఁ గై మొగుడ్చి ♦ విస్తృతభక్తి౯. 1005

సీ. సౌమిత్రి శ్రీరఘు♦సత్తముపల్కును గారవించుచుఁ జేయఁ♦గా ననువగు
కార్యమును దలంచి ♦ కడుశుభంబగుతనమతము వెల్లడియయి ♦ హితమగుగతి
నభిరామదర్శనుం ♦ డైన రామునిఁ గాంచి పలికె; నవ్వనచర♦పతియు నీదు
వాంఛితంబును దీర్చు♦వాఁడ నేనన్నయప్పలుకును దప్పక ♦ త్వరపడి తన

తే. యత్నమును జేయఁ బగతుర ♦ నడఁప ధైర్య
మూని నీవు శరత్కాల ♦ మొగిఁ గనఁబడు
నంతదనుకఁ బ్రావృట్కాల♦మందుఁ గలుగు
తాపమును నోర్చి యుండుమా ♦ భూపవర్య!. ౪౭ 1006

క. మనమునఁ గలపృథుకోపం,బు నడఁచుకొని యాశరత్తు♦భూమిఁ బొలయుదాఁ
కను నోర్చియుండుమా, యొ,య్యన నీమానవములు నాలు ♦ గతిధైర్యమున౯,

క. మృగరాజసేవ్య మగునీ, యగమున శత్రువులఁ జంపు♦యత్నంబునఁ దెం
పుఁగను మహోత్సాహంబును, దగ నొనరించుచు నితాంత♦ధైర్యస్ఫూర్తిన్.

ఇరువదియేడవ సర్గము సంపూర్ణము.

---

౨౮ - వ సర్గము.

రాముఁడు వర్షర్తువును వర్ణించుట.

క. శ్రీరాముం డీరీతిగ, నారసమున నొకట నవ్వ♦నచరేశునినా
ధీరుని వధించి రవిజున, కారాజ్య మొసంగి ప్రీతి ♦ నభిషేకంబున్. ౧ 1009

[1]చ. ఒనరిచి మాల్యవంతమన ♦ నొప్పగిరిన్ వసియించి లక్ష్మణుం
గనుఁగొని యిట్లుపల్కెఁ గపి♦కాంతుఁడు స్వస్థలమందు నుండఁగా
మనమిట నుండఁగా నియతి♦మై సమయంబును జేసికొన్నయ
ట్లనువగు వానకాలమిదె ♦ యల్లన వచ్చెను జూడు లక్ష్మణా!. ౨ 1010

క. గిరితుల్యములై మేఘో,త్కరములు వ్యోమమున నిండఁ ♦ గ్రమ్ముకొనియె; న
క్కిరణిం జూడుము మఱి యం,బరతరుణీమణియు రవిగ♦భస్తులవలనన్. ౩౹

సీ. సాగరాంతస్థర♦సంబును ద్రావి యూర్జము మొదలాషాఢ♦ము మహిఁ దనరు
నందాఁకఁ గల్గిన♦యా నవమాసముల్ గర్భంబుఁ దాల్చి యి♦క్కాలమందు
సకలరసంబుల ♦ కకలంకకారణ మగుజలంబును దాను ♦ సొగసుగులుకఁ
బ్రసవించుచున్నది ♦ పర్వతప్రాంతమునందు వ్యాపించిన♦యంబుదమ్ము

తే. లనెడు సోపానముల నెక్కి ♦ యాకసమున
కరిగి కుటజార్జునోత్ఫుల్ల♦హారికుసుమ
[2]మాలికలచే దివాకర♦మండలాంత
రస్థునారాయణుని సమ♦ర్చనముచేయ. ౪ 1012

క. మనకిట శక్యంబగుఁ జూ!, ఘనసంధ్యారాగనిబిడ♦కలితములయి యె
ఱ్ఱనిచాయ యొప్పఁగాఁ దె,ల్లనిచాయయు నగ్రతలము♦లన్ జెలువారన్. ౫౹

తే. జలముచేఁ గొంతతడిగ నె♦సంగి మేఘ
ములు వియత్తలమున నెల్ల ♦ వెలయుచుంటఁ
దెల్ల[3]వస్త్రంబు వ్రణమున♦కెల్లఁ గట్టి
నట్టులున్నది కంటివే ♦ యంబరమున. ౬ 1014

తే. మందమారుతనిశ్వాస♦మండితంబు
సందెయను చందనమ్మున ♦ సాంద్రమగుచు

---

1 వసన్ మాల్యవతః పృష్ఠే-అనిమూలము. పూర్వం ప్రస్రవణాఖ్యాతయోక్తస్య గిరేః - అని వ్యాఖ్య. 2 మాలాభిరలంకర్తుం దివాకరమ్ - అని మూలము. అస్తత్కులగురుభూతసూర్యమధ్యే సదాధ్యేయం విష్ణుమ్-అని వ్యాఖ్య. 3 స్నిగ్ధరక్తపటచ్ఛేదైర్బద్ధవ్రణ మివాంబరమ్-అనిమూలము.

క. నరపతు లొనరింపక నిల్చిరి దేశాంతరములందు ♦ వెలయుజనులు పో
దురు స్వస్వదేశములకున్, గరము ప్రశాంతంబునగుచుఁ ♦ గాలంబొప్పెన్.

క. మానససరోవరంబున, మానససంతృప్తిమీఱ ♦ సుమతవసింపన్
గా నిశ్చయించి హంసలు, జానుగఁ బయనంబు చేసె ♦ సహజా! కంటే?. ౧౬

ఆ. ప్రియలతోడఁగూడి ♦ వెలసెను జక్రవా
కములు మిగుల వర్ష♦గాఢసలిల
ములను ద్రోవలెల్లఁ ♦ బొంకంబు చెడియుంట
[1]బండ్లు మొదలగునవి♦బయటఁ జనవు. ౧౭ 1024

సీ. ఆకాశ మందందు ♦ నంబుధరవ్యాప్త మౌట నొక్కొకచోట♦నరయఁ దెలియఁ
బడుచు నొక్కొకచోటఁ ♦ గడునదృశ్యంబయి యున్నదికావున♦నొక్కచోటఁ
బర్వతంబులు నడ్డ♦పడఁ గానరాకయు నితరస్థలంబుల ♦ నెఱుకపడుచు
శాంతమై తగు మహా♦సాగరప్రతిమమై వెలయుచున్నది కంటె? ♦ విమలసర్జ

ఆ. కుసుమములు కదంబ♦కుసుమముల్ వ్యాపింప, నద్రిధాతుతామ్ర ♦ మైననవ్య
సలిలమొప్ప బర్హి♦సంతతకేకార, వములు వెలయ నిర్ఝ♦రములు వేగ. ౧౮

తే. పాఱుచున్నవి స్వారస్య♦పరిణతములు
షట్పదాభంబులును నగు♦జంబుఫలము
లను భుజింతురు మిక్కిలి ♦ మనుజు లిపుడు;
సరసబహువర్ణయుక్తసం♦స్తవ్యములయి. ౧౯ 1026

క. పరిపక్వమ్ములుగాఁ దగి, మరుదవధూతమ్ములు నగు ♦ మామిడిపండ్లీ
ధరణిం బడుచున్నవి; నిర్భరవిద్యుద్ధ్వజములెల్ల ♦ భాసిలుచుండన్. ౨౦ 1027

సీ. నబలాకమాలికా♦జాలంబులై గిరిశిఖరాకృతిం దగి ♦ చెలఁగుమేఘ
ములు మదదంతీంద్ర♦ములు కేతనము లొప్ప హారము ల్వెలయంగ♦నద్రిశిఖర
తనువులు మిన్నంద ♦ ననిచేయుచున్నట్లు పెనునాద మడరెడు♦స్తనిత మొప్పఁ
జేయుచున్నవి; కంటె? ♦ చిత్రవనంబులు వర్షోదకంబుల♦వలన వఱలు

తే. శాద్వలము లొప్పఁగా బర్హి♦సాధునృత్య
మలర వర్షించుమేఘముల్ ♦ వెలయుచుండఁ
గ నపరాహ్ణంబులందుఁ జ♦క్కఁగఁ బ్రకాశ
మందుచున్నవి చూడుమా! ♦ యనుజ! యిందు. ౨౧ 1028

చ. జలదగణంబు కొక్కెరల♦సంఘముఁ గూడి యపారమైన యా
జలభరమున్ వహించుటను ♦ శ్యామధరపంక్తుల నెక్కువేళ ని
మ్ముల గురుగర్భభారమున ♦ ముగ్ధలు మూలుగునట్టు లార్చుచుం
గలఁగుచుఁ గొండనెత్తములఁ ♦ గ్రందుగ నిల్చుచుఁ బోవు మెల్లఁగన్. ౨౨

1 యానానిమార్గేషు నసంపతంతి-అనిమూ. యానాని శకటరథాదీని-అనివ్యాఖ్య.

చ. ఘనములఁ గోరుచున్ మిగుల ♦ గర్భము నొందుటకై ఘనాళిఁ జెం
ద నచటికేఁగుదెంచి ప్రమ♦దంబున మీఱి బలాకపంక్తి ఖం
బునఁ దగ వ్రేలవేయఁబడి ♦ భూమిసమీరణపుష్పదామసుందరం బవం
బునఁ జలియించుచున్ వెలయు♦పుల్లసితాంబుజమాల నాఁ దగెన్. ౨౬

సీ. ధరణియంతయును నా♦తతశాద్వలము మించనడుమనడుమను♦నవ్యములగు
నాఁక క్రిమికులము ♦ సంకలంబుగాఁగఁ జిత్రింపఁగాఁ బడియుంట ♦ దివ్యమైన
లత్తుకరసముచే ♦ లలిమీఱ నంచుల నలిమి మిగులఁ జి♦త్రాక్షరములుగ
వ్రాయఁగఁబడి శుక♦ప్రభనొప్పు కంబళిపుట్టంబుఁ గట్టిన♦పొలఁతివోలెఁ

ఆ. నలరుచున్న దిప్పు ♦ డాచక్రధరుని, యోగనిద్రఁ బొందు♦చున్న దయ్యె
యాపగయును గంధి♦నతివేగమునఁబొందు,చున్న దెంతొ మోద♦మొప్పమంద.

క. ఘనముల బలాకపొందెడు, వనితలు కామాతురముగ ♦ ప్రాణేశుల నొ
య్యనఁ బొందుదురు; కేకులు, వనముల నృత్యంబు చేయఁ ♦ బ్రారంభించెన్.

క. కనుమా! నీపద్రుమములు, ఘనశాఖాంతములఁ జక్కఁ♦గాఁ బూచిన వ
ల్లన నాఁబోతులు గోవులఁ, గని కామాతురము నొందఁ♦గాఁ గల్గెఁ జుమీ!.

క. ధరణియు బహువిధసస్యో,త్కరముల రమణీయముగను ♦ గనుపట్టెడు సో
దర! యానదులెల్లను సత్వరముగఁ బ్రవహింపఁదొడఁగె ♦ బరవసములరన్.

క. ఘనములు వర్షించెడుమద,మునఁ దగు దంతీంద్రములును ♦ మునుకొని ఘీంకా
రనినాదంబులఁ జేసెడు, వనములు విలసిల్లెడుం బ్ర♦భావము తోడన్. ౨౭

క. వనితామణులం బాసిన, మనుజులు వారలఁ దలంచి ♦ మదిఁ గలఁగుచుఁ జిం
తను బూనియున్నవారికిఁ, గనుఁగొనఁగ నెమిల్లు నాడఁ♦గాఁ జొచ్చె నిటన్.

క. వనచరులెల్లరును సుఖం,బును గనుచున్నారు నూర్య♦పుత్త్రుఁడు రాజ్యం
బును బొందుట; వర్షమునకు, మునువే వ్యాప్తంబులైన ♦ భూరిమదకరుల్. ౨౮

సీ. మొగిలిపూవులతావు♦లఁ గడు మూర్కొని మఱి
యును మోదమందుచు ♦ వనమునఁగల
సెలయేళ్లయందును ♦ జలములు పైనుండి
యిలపయిఁ బడుటచేఁ ♦ గలుగుశబ్ద
మునకుఁ గలంగుచు ♦ వనమయూరాళితో
నటు చుచున్నవి: కదం♦బావనీజ
సుమగతమధువును ♦ సొరిదిఁ ద్రావుచు నష్ట
మదమునొందుచు వృష్టి♦ని దడియుటను

తే. వాని విడనాడి శాఖల ♦ వ్రాలి యామ
దమును మెలమెల్లనన్ మట్టు♦దములు విడుచు
చున్న; వవె బొగ్గుపొడికుప్ప♦లో యనునటు
నల్లనై రసపూర్ణత ♦ యుల్లసిల్ల. ౨౯

క. ఫలనిబిడములై యెంతయు, విలసిలు జంబూద్రుమముల ♦ విస్తృతశాఖల్
చెలఁగెడుషట్పదయుక్తం,బులు నయినవిధంబు దోఁపఁ ♦ బొల్పారెడుఁ జూ!.

చ. ఘనములు విద్యుదోఘమునఁ ♦ గ్రాలుచుఁ జాలగభీరనిస్వనం
బును వెలయించుచున్ మిగులఁ ♦ బొల్చుటఁ గేతనసంయుతంబులై
ఘననినదంబుఁ జేయుచు ని♦కామము యుద్ధముచేయనున్నదం
తినికరమట్లుగా వెలసె ♦ దేవపథంబునఁ జూడు లక్ష్మణా!. ౩౧౪ 1040

[1]చ. ధరణిధరాటవీస్థలికిఁ ♦ దాఁ బయనంబయి త్రోవనేగు చం
బరమున మేఘగర్జనము ♦ పర్వ వినంబడ మత్తదంతి భీ
కరరిపుదంతినాదమును♦గా మది సందియమంది పోరుసే
యురమణ వెన్కకుం దిరిగె ♦ నుద్ధతి మీఱఁగఁ జూడు లక్ష్మణా!. ౩౨౪ 1041

సీ. ఒక్కచోటను షట్ప♦దోద్గానముఖరితంబులుగ, నొక్కెడ నెమి♦ళులమనోజ్ఞ
నృత్తసాంద్రములుగ ♦ నెఱి నొక్కయెడ భూరిగజమదధారాభి♦కలితములుగ
నివ్వనభాగమ్ము ♦ లెన్నెన్నొ విషయంబులకు నాటపట్టులై ♦ ప్రకటశోభ
నందుచున్నవి; కదం♦బార్జునసర్జకందళపుష్పసాంద్రమై ♦ యలరుక్రొత్త
[2]ఆ. యెఱ్ఱనీరు వెలయ ♦ నెల్లచోఁ గేకిను,త్తారవముల నర్త♦నాతిశయము
లను జెలంగుచుండు♦టను గను నాపాన,భూమిసామ్యమొంది♦పొలిచెనహహ.

చ. అనుజ! విచిత్రవర్ణముల ♦ నందముగాఁ గనుపట్టుపక్షముల్
తనరఁగ నొప్పుచాతకప♦తత్త్రులు దాహము పెల్లునన్ ముదం
బున నలవృష్టిదైవమయి ♦ పొల్చిన యింద్రుఁ డొసంగ నంబరం
బును విడనాడి పత్రపుట♦పూగమునం బడి ముత్తియంబునాఁ
దనరు వినిర్మలోదకముఁ ♦ ద్రావుచునున్నవి తృప్తిమీఱఁగన్. ౩౫౪ 1043

తే. భ్రమరఝంకారమే తంత్రి♦స్వనముగాఁగఁ
బ్లవగనాదమె కంఠతా♦ళంబుగాఁగ
జలదరవమె మృదంగని♦స్వనముగాఁగ
నలరుచున్నది సంగీత ♦ మడవులందు ౩౬౪ 1044

సీ. క్రేలాడుబర్హముల్ ♦ విమలాభరణములు
గా నొప్పు నెమిళులొ♦క్కయెడఁ గొన్ని
యాడుచుండఁగఁ గొన్ని ♦ యలరుచుఁ గూయంగఁ
గొన్ని వృక్షంబుల♦కొనలయందుఁ

---

1 మార్గానుగశ్శైలవనానుసారీ సంప్రస్థితో మేఘరవం నిశమ్య, యుద్ధాభికామః ప్రతినాగశంకీ మత్తో గజేంద్రః ప్రతి సన్నివృత్తః-అనిమూలము. 2 కదంబసర్జార్జునకందలాఢ్యా వనాంత భూమి ర్నవవారిపూర్ణా, మయూరమత్తాభిరుతప్రనృత్తై రాపానభూమిప్రతిమావిభాతి-అని మూలము. దీనియర్థమే యీసీసపద్యమున విస్తృతము.

ధరములు పల్లవాదుల ని♦తాంతము చూడఁగ నొప్పుమీఱెడున్
ధరణిపులెల్ల యుద్ధములఁ ♦ దారొనరింపఁగ మానియున్నవా
రరుదుగ నిర్జరాధిపతి ♦ యంబుదపంక్తిని గూడి యాడెడున్ ౨౩ 1050

చ. జలదము లంబరస్థలి వి♦శాలముగాఁ దగి సాగరంబు లి
మ్ముల ధ్వనిచేయఁ దన్నినద♦మున్ వడిఁ జిమ్మెడు నార్భటిన్ దగన్
జలములధార లెల్లయెడ ♦ సంతతముం గలుగంగ భూరివృ
ష్టుల నదులుం దటాకసర♦సుల్ నడబావులు భూమియున్ జలం
బులను మునుంగఁజేసి తమ♦పొంకము చూపెడుఁ జూడు లక్ష్మణా!. ౨౪

క. నిరతము పెనువర్షమ్ములె, యురవడిగాఁ బృథ్విఁ గురియు♦చున్నవి కడుభీ
కరనాద మడర వీచెడుఁ, గరువలి నదులెల్ల నీటఁ ♦ గ్రాలుచు మిగులన్. ౨౫

తే. తటములెల్లను దెగిపోవ ♦ దారులెల్లఁ, దప్పి వెల్లువల న్మించి ♦ యొప్పుగులుక
వేగ ప్రవహించుచున్నవి ♦ విశ్వమెల్ల, నావరించెడుకోరిక ♦ లతిశయిల్ల. ౨౫

క. ఘనజలకుంభంబులచే, మనుజులు నభిషేకము నెడు ♦ మహామునఁ దమ్ముం
దనుపన్ రాజులు తమల,క్ష్మిని జూపెడునట్లు భూరి♦శిఖరులు మిగులన్. ౨౬

తే. అమరనాయకుఁ డొసఁగంగ ♦ ననిలనిహతి
[1]జలదజలకుంభములచేత ♦ సంతతాభి
షిక్తములు నయి నైర్మల్య♦యుక్తమైన
యాత్మరూపముఁ జూపెడు ♦ నద్భుతముగ. ౨౬ 1055

సీ. మేఘంబులెల్లను ♦ మించి పర్వుటచేత నాకాశమునఁ దార♦కాళిఁగాని
పగలు సూర్యుఁడుగాని ♦ భాసిల్లుటయె లేదునవవర్ష ధారల ♦ భువియుఁ గ్రమ్ము
కొనఁబడియెడు, మఱి♦యనుగాఢతమమెల్లఁబూతవూసినయట్లు♦పొదలుచుంట
దిక్కులు తెలియరా ♦ కొక్కరీతిగనున్న; వత్యున్నతములగు ♦ నద్రిశిఖర
ములు వర్షసలిలధా♦రలఁ దెల్లనై గురుమానవిస్తృతుల స♦మతఁ జెలంగు

తే. నట్టి నిర్ఝరములఁ గూడి ♦ యమలమౌక్తి
కమణి హారాళి వ్రేలాడఁ♦గాఁ జెలంగి
నట్టు లలరారుచున్న వీ♦యవని నెల్ల
తావులం గంటివే! సుమి♦త్రాతనూజ!. ౨౭ 1056

చ. పెనుధరణీధరాళిపయిఁ ♦ బెంపగునిర్ఝరముల్ శిలావ్రజం
బునఁ బడి వేగమెల్లఁ జెడ ♦ భూరిమయూరనినాదయుక్తి నిం
పునఁ దగు కందరప్రతతిఁ ♦ బొందుతఱిన్ వరమౌక్తికవ్రజం
బునఁ దగుహారముల్ చెదరి♦పోయి ధరంబడునట్టు లొప్పెడున్. ౨౮ 1057

---

1 ఘనాంబుకుంభై రభిషిచ్యమానాః-అని మూ.

సీ. పర్వతంబులయందు ♦ బహువేగమునఁ బాఱు విపులనిర్ఝరములు ♦ వెలయుకొండ
శిఖరాంతికంబులఁ ♦ జెలఁగి స్వచ్ఛములుగ నొకరించుచున్నట్టి పాఱు ♦ చునుమనోజ్ఞ
మౌక్తికహారాళి ♦ మాడ్కిఁ గ్రిందికిఁ బడుచుఁ బె న్గుహాలకు ♦ నశిఖభాగ
ములయందుఁ గ్రాలెడు; ♦ లలినాకసముపుండి దెసలనెల్లెడఁబలు ♦ దెఱఁగులఁబడు

తే. సలిలధారలు సురత కే ♦ ళులను గాఁగి
లింతలను దెగిపడు సుర ♦ కాంతలవగు
హారమౌక్తికవితతులో ♦ యనఁగ నొప్పి
యున్న వెల్లెడలను జూడ ♦ వన్న యనుజ!. ౫౧ 1058

[1]క. పతగములు గూండ్లఁ జేరుట, శతపత్త్రము లెల్లయెడల ♦ సంకోచంబే
గతిగాఁగ నుంట మాలతి, లత పూయుట భాస్కరా స్త ♦ లక్షణ మనుచున్.

క. తెలియంబడియెడు ధరణీశుల రణయాత్ర లాగి నిల్చె ♦ శూరభటగణం
బిల దండయాత్రజరప బ,యలు వెడలిన దచటనుండి ♦ యల్లన మరలెన్. ౫౩

ఆ. జలము లద్దుపడుట ♦ సాంపరాయికమున
కనువులేమి వైర ♦ ముడఁగెఁ; ద్రోవ
లందు జలములుంట ♦ నదో యిదో యని తెలి
యమిని నొక్కరీతి ♦ నమరె భువిని. ౫౪ 1061

తే. భాద్రపదమాసమందు స ♦ ద్బ్రాహ్మణు లాగి
సామవేదముఁ జదువంగఁ ♦ జనుసమయము
సహజ! సంప్రాప్తమయ్యె నీ ♦ సమయమందు
హస్తనక్షత్ర ములరారె ♦ నర్హరీతి. ౫౫ 1062

సీ. కోసలాధీశుఁడ ♦ గు భరతుం డీవృష్టికాలము వేళ్లో ♦ పకరణములను
నితరవస్తువులను ♦ నెబ్భంగినైనను సంగ్రహించుటయుఁ గ ♦ ష్టంబె కాన
నాషాఢపూర్ణిమ ♦ యల్లన రాకుండ మునుపె యన్నియుఁగూర్చు ♦ కొనినమస్త
వస్తుధనంబుల ♦ వరుసఁగా గ్రహియించియాపూర్ణిమను మహ ♦ తాంగముగనె

తే. స్వీకరించియె యుండు; నే ♦ నేకడకో జ
వంబునం బోయివచ్చినఁ ♦ బౌరు లయ్యె
యోధ్యలో నన్నుఁ గాంచి య ♦ త్యుత్సుకయముగఁ
గలకలము చేయునట్టు లి ♦ క్కాలమందు. ౫౬ 1063

క. పెనువృష్టిచేత నెల్లెడ, ఘనజలసంభరితమగుచుఁ ♦ గ్రాలుసరయు వా
ప్పిన నీటివేగమున నొ,య్యన వృద్ధిం గాంచుచుండు ♦ ననుజ! నిజముగన్.

క. అరి గెల్చి భార్యఁ గైకొని, గురురాజ్యపదంబు నొంది ♦ కోరికలెల్లన్
గరము ఫలించుట నిత్తఱి, వరసుఖములఁ బొందుచున్న ♦ వాఁడు రవిజుఁడున్.

---

1 నిలీయమానై ర్విహగై ర్నిమీలద్భిశ్చ పంకజైః, వికసంత్యా చ మాలత్యా గతో౽స్తం జ్ఞాయతే రవిః-అనిమూ.

క. అనుజా! నేనో సద్భార్యను నిం గోల్పోయి రాజ్య♦మంతయుఁ బోవన్
వనితాపహారకుని వైరిని గెల్వక యిట్టులుండు♦రీతిఁ దలఁచినన్, ౫౮ 1066

ఆ. తడిసినట్టియేటి♦తటమువలెం గృశి, యించుచున్నవాఁడ ♦ నిప్డు శోక
మధికమగుచు నున్న ♦ దనుజ! యీవృష్టిని, మయము చాలదుర్గ♦మమ్ము సుమ్ము.

క. దనుజుం డగురావణుఁడో, ఘనశత్రువు వీనిమాఁటి♦గడచు, టశక్యం
బని నాకుఁ దోఁచుచున్నది, కనఁగా నరపతుల కిపుడు ♦ గా దని చేయన్. ౬౧

క. మార్గంబు లిపుడు మిక్కిలి, దుర్గమములు రాక్షసేంద్రు♦తో నిప్పుడె నే
దోర్గర్వంబున మార్కొని, దుర్గమమగులంకఁ గడఁక♦తో నశియింపన్. ౬౦౪

[1]ఆ. చేయువాఁడ నిపుడె; ♦ సీతఁ దెచ్చుప్రయత్న
మును నొనర్చువాఁడ ♦ నని రవిసుతుఁ
డెంత వేఁడుకొనిన ♦ నించుకయైనను
సరియె యిదని పలుకఁ ♦ జాలనైతి. ౬౦౪ 1070

[2]చ. వనచరరాజు కష్టముల♦పాలయి నేఁటికి భార్యనొందె నీ
మనపనియన్న నొప్పది స♦మస్తవిధంబుల నొప్పయత్నమున్
బనివడి చేసినట్లయిన ♦ భద్రము లబ్బును గాని లేనిచోఁ
బని ఫలియింప దట్లగుటఁ ♦ బల్కుట మానితి నాత్మకృత్యమున్. ౬౧౪ 1071

ఆ. వృష్టికాలమందు ♦ విశ్రాంతిఁ గొని యాతఁ, డటశరత్సమయము♦నందుఁ దెలిసి
నేను జేసినట్టి ♦ నిఖిలోపకారముల్, [3]గార్యములను జేయఁ♦గలఁడు నిజము.

క. కనుక శరత్సమయము వ, చ్చినదనుక న్నేను వగలఁ ♦ జెందియు నదులున్
వనచరపతియుఁ బ్రసన్నతఁ, గనుదాఁకం గాచియుందుఁ ♦ గమ్రశుభగుణా!

క. వీరుఁడు పురుషుఁడు తనకుప, కార మ్మొనరించునట్టి ♦ ఘనచిత్తులకున్
నేరుపునం దాఁ బ్రత్యుప, కారము చేయును ధ్రువంబు♦గాఁ బూనికతోన్.

క. కృత మెఱుఁగక తాఁ బ్రత్యుప, కృతి సేయనివానియందు ♦ నిలఁగల బుధసం
తతిచిత్తము నొచ్చును స, [4]ద్గతి తప్పును దీనినెఱుఁగుఁ ♦ గపికులపతియున్.

చ. అనవిని లక్ష్మణుండు తగ ♦ నంజలిఁ బట్టి తదీయవాక్యమున్
బనివడి గారవించుచు శు♦భంబగు స్వాశయ మచ్ఛరీతిగాఁ
[5]గనఁబడునట్లు మోదమును ♦ గల్గఁగఁ జేయు మనోహరాంగు రా
మునిఁ గని యిట్లుపల్కెఁ గపి♦ముఖ్యుఁడు సూర్యసుతుండు పూనికన్. ౬౫౪

---

1 ప్రణతే చైవ సుగ్రీవే న మయా కించి దీరితమ్-అని మూ. 2 ఆత్మకార్యగరీయ స్త్వా ద్వక్తుం నేచ్ఛామి వానరమ్-అనిమూ. 3 వేత్స్యతే నాత్రసంశయః-అని మూ. నాత్రసంశయః అనునర్థమునే నిజము అనుపదము బోధించును. 4 సుగ్రీవో ప్యేవంవిధత్వా త్ప్రత్యుపకారం కరో తీతిభావః-అని వ్యాఖ్య. 5 ఉవాచ రామం స్వభిరామదర్శనమ్-అనిమూ.

చ. తనవచియించినట్లు శ్వరి♦తంబుగ నీకగుకోర్కి యంతయుం
జనివడి చేసితేఱు; రిపు♦వారము జెందుఁ బ్రతాపమూని నీ
వును సమయాభిలాషివయి ♦ పోలఁగ నీఘనవృష్టికాల మె
య్యన సహియించి యుండు మెటు♦లైనను భాస్కరవంశదీపకా. ౬౬॥ 1077

ఇరువదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

౨౯ - వ సర్గము.

—రామకార్యము చేయఁదగునని హనుమ సుగ్రీవునకుఁ జెప్పుట—

సీ. విగతవలాహక♦విద్యుల్లతౌఘంబు విమలంబు సారస♦విహగనినద
సంఘుష్ట, మతిమనో♦జ్ఞ స్ఫారచంద్రికాసమున లేపనమును ♦ జారుతరము
నయి యాకసంబెల్ల ♦ నలరారుచుండెను; భాస్కరతనయుండు ♦ వైరిహరణ
కృత్యంబు నెఱవేర్చి ♦ క్షితిపదంబును బొంది ధర్మార్థసంగ్రహా♦తత్పరత్వ
మును మాని సకలార్థ♦ములఁ బొంది భోగైకసాధనములగు చం♦చత్సువర్ణ
ముఖ్యవస్తువులను ♦ ముదమునఁ బొందుచుఁ దన ప్రియురాలైన రు♦మను మనంబు
నందు నితాంతము ♦ నాసక్తిఁ గోరెడుతారను దమిమీఱఁ ♦ దానుగూడి
కాముకమార్గంబు♦నే మదిఁ గనఁజేసి దానియందాసక్తి ♦ నూని యెవుడు
ఆ. వనితలందె తనదు♦వాంఛ మీఱఁగనుండె, ధనసమృద్ధిమిగుల♦మనమునందుఁ
గొఱఁతలేక శతమ♦ఖుఁడు నందనమునందు, నచ్చరలను గూడి♦యలరునట్లు.

క. తనకుం బగలును రేయును, వనితాసంగతియె యా శు♦భంబను తలఁపుం
గొని విహరించుచు రాజ్యపుఁ, బనులెల్లను మంత్రులపయి ♦ నైచి యథేచ్ఛన్.

*తే. మంత్రులేమి యొనర్చిన ♦ మాఱుపలుక
కాత్మరాజ్యంబునకు క్షేమ ♦ మలరుచున్న
దో యనియు, లేదో యనియుఁ దా ♦ నూహచేయ
కతనువీడితుఁడయియుండె ♦ నర్కసుతుఁడు. ౩॥ 1080

చ. హనుమయుఁ గాలధర్మము ♦ నారయువాఁ డపు డర్కజుం డొన
ర్పను దగియున్నకార్యమును ♦ బాగుగఁ గాంచి యతండు కామతం
త్రనిరతచిత్తుఁడౌటఁ గని ♦ ధర్మముగా దిటులుంటనంచు నె
మ్మనమున నిశ్చయించుకొని ♦ మంజులవాక్పటుఁడు కావునన్. ౪॥ 1081

తే. వాక్యములరీతి నెఱిఁగిన♦వానరేంద్రు
పరిసరంబున కేగి మ♦ధురతమంబు

---

* మంత్రిణా మన వేక్షకమ్-అని మూలము.

లగుచు యుక్తియుక్తంబులు ♦ నగుచు మదికి
నింపు గలుగంగఁ జేయుచు ♦ హితము గుచు. ౭ 1082

క. అలరెడు గభీరవాక్యం,బుల నతనిఁ బ్రసన్నుఁ జేసి ♦ భూరిస్నేహం
బలరారఁ బ్రేమ నగ సు,మ్ములఁ దనవాక్యంబునందు ♦ ముదము గలుగుటన్.

క. మనమున నెఱింగి నిశ్చయ,మును జేసికొనుచును దత్త్వ♦మును బథ్యంబున్
గొని మాడఁదగినదియు నీ,తిని సామము నొక్కరీతిఁ ♦ దెల్పెడునదియున్. ౮

తే. ధర్మకలితంబు నర్థసం♦దర్భ మలరు
నదియు నగు వాక్యమును బల్కి ♦ హరికులేశ్వ
రునికడం జేరి తనపాండి♦తిని గనంగఁ
జేయుచున్ భాస్కరాత్మజ! ♦ క్షితిపుకరుణ ౯ 1085

క. ధరణీరాజ్యముఁ బడసితి, వురుయశమును గంటి వట్లె ♦ యుత్తమవంశా
చరణక్రమాగతమ్మగు, సిరినిం బొందితివి వృద్ధిఁ♦జేసితి దానిన్. ౯ 1086

క. వనచరనాథా! యిఁక మి,త్రనివహమున్ గారవించి ♦ తత్కృత్యంబున్
మనసారఁ జేయఁగాఁ దగు,పనియే మిగిలినది దానిఁ ♦ బాటింపఁదగున్. ౯౪

తే. ఎవఁడు మిత్రులఁ గూర్పంగ ♦ నెంచి యట్టి
కాలముల లక్షణంబులఁ ♦ గడు నెఱింగి
వారియెడఁ బరతంత్రుఁడై ♦ వఱలునో భువి
నతనిరాజ్యయశఃప్రతా♦పాదికములు. ౧౦౪ 1088

క. నిరతము వృద్ధింబొందును;, ధరణీశుని కెవని కెన్న♦ ధనసైన్యములున్
వరమిత్రు లాత్మరాజ్యముఁ, బరస్పరము మైత్రిగలిగ ♦ వర్ధిల్లెడునో. ౧౧ 1089

క. అతఁడు మహారాజ్యమునకుఁ, బతియగు, నక్కారణమున ♦ భవ్యాచార
స్థితిఁ గాంచి చారువృత్తము, సతతము చెలువారుచున్న♦చతురుఁడ వౌటన్.

తే. ప్రతిన చేసినచొప్పునఁ ♦ బరమమిత్ర
కార్యమును సార్థకంబగు♦కరణిఁ జేయు
మెవఁడు తనకార్యజాలంబు♦నెల్ల వదలి
సంతతోత్సాహియై కడు♦సంభ్రమమున. ౧౩ 1091

తే. మిత్రకార్యంబులనె పూన్కి ♦ మిగులఁ జేయు
చుండునో వానికాపద ♦ లొందవెపుడు;
సఖులకృత్యంబుల నెవండు ♦ సరిగఁ గాల
మునకుఁ దప్పక చేయఁడో ♦ మనుజుఁ డతఁడు. ౧౪ 1092

క. ఘనకార్యములను జేసియు, నొనరింపనివాఁడె యగును ♦ నొగి మిత్రులవా
పను లెల్లను నెఱవేఱవు, కనుకం జేసియు నసార్థ♦కంబె యగుఁ జుమీ!. ౧౫

క. అరిసూదన! వీరా యి,త్తరుణంబున మనకు మిగులఁ ♦ దగినసఖుఁడు భూ

సమరదైత్యగంధర్వులు ♦ యక్షవాయు, గణములతనికిభయమును♦గల్గఁజేయ
తే. శక్తిగలవారు గాఁడిక ♦ సంతతంబు, నీచతం డగురక్కసుల్ ♦ నృపతి కతని
కెంతమాత్రము? చెప్పంగ♦నేల వారి, నట్లు గావున ఘనశక్తి ♦ కవనిపతికి. ౨౫
క. మును నీకుఁ బ్రియమొనర్చిన, ఘనునకు రామునకుఁ బ్రీతి♦గాఁ దత్కార్యం
బును సర్వవిధములం జే,యను జనుఁ; గపినాథ! యుష్మ♦దాజ్ఞయెయైనన్.
*మ. ధరఁ బాతాళమునందు నీటఁ బయినం ♦ దర్వాత నాకాశమం
దరయంగా నిఁక నెందునైనఁ జనలే♦నట్లొప్పుచోట్లున్నవే
చరియింపంగలఁ డెవ్వఁడైనఁ గపియు♦స్మత్సైన్యమం దోహరీ
శ్వర! పుణ్యాత్ములు నప్రధృష్యులును నో♦చంచత్కపీశుల్ తగన్. ౨౬॥ 1107
తే. కోట్యధికసంఖ్యగలరు నీ♦కున్ వశంగ
తులుగ నేపనిచేయంగ♦వలెనో నీకు
నెట్టికార్యంబునం బూన ♦ నిపుడు తగునో
యాజ్ఞ చేయుము; జరగుకా♦ర్యం బటన్న. ౨౮ 1108
చ. హనుమయుఁ గాలవేత్తయయి ♦ యాదరమొప్ప హితంబు నిట్లు చె
ప్పిన విని సత్త్వయుక్తుఁడయి ♦ పెంపెసలారఁగ నొప్పు సూర్యజుం
డనఘుఁడు మిత్రకార్యహిత♦మంతయుఁ దీర్పఁగనో నటంచు బు
ద్ధిని గొని యిష్టుఁడై తనకుఁ ♦ దృప్తిగఁ గార్యము చేయువానరున్. ౨౯॥
తే. నలునిఁగని యెల్లదిక్కుల ♦ నిలిచియున్న
సైన్యమును వేగ రావించి ♦ చక్కఁగూర్ప
వలయునని యాజ్ఞచేయంగఁ ♦ దలఁచి పలికె
సైన్యనాయక! వనచర♦సముదయములు. 3౦ 1110
సీ. యూథపాలకులయి ♦ యొప్పువానరులును సైన్యయుక్తంబుగ ♦ సరగ నిటకు
వచ్చి చేరెడునట్లు ♦ వారకచేయుమా, యత్నంబునం బూని ♦ యలరి శీఘ్ర
గమనంబు చెలువారఁ♦గా నొప్పు సైన్యపర్యంతపాలకులగు♦నట్టి కపులు
తమతమసేనలఁ ♦ ద్వరితంబుగాఁ గొనివత్తురు గాక యా♦యత్తమడర
తే. నస్మదీయాజ్ఞ నీచెంత ♦ నమరియున్న
సైన్యమును నీవె కనుఁగొని ♦ సపరికరము
గాఁగ రావింపు నేఁడాది♦గాఁగఁ బంచ
దశనిశల కవ్వల నెవండు ♦ తరలి యిటకు. 33 1111
తే. వచ్చి చేరకయుండునో ♦ వాని కంత
కరమయిన దండమేచేయఁ ♦ గాఁ బడుఁ జుమి!
సందియమె లేదు దీనికి ♦ స్వామియాజ్ఞఁ
బూని నీ వంగదునితోడఁ ♦ బోయి వేగ. 33॥ 1112

---

* గతి ర్నో పరిచాంబరే-అనిమూ.

చ. వనచరపంక్తిఁ జేరఁజని ♦ భల్లుకవర్యుఁడు జాంబవంతుఁ డు
న్నతెలవుఁ జేరి శాసనము ♦ నాయది వారికిఁ జెప్పిరమ్ము వే
యని హరిపుంగవుండు తే♦నట్లు వ్యవస్థను జేసి యంతఁ బో
యెను దనసౌధసీమకు న♦భీష్టసుఖంబులఁ బొందుకోరికన్. ౩౮ 1113

ఇరువదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౩౦ - వ సర్గము.

శరదృతుసమాగమము - రాముఁడు సుగ్రీవునిపై నాగ్రహించుట.

క. వనచరనాథుఁడు కిష్కింధను జేరఁగ నంత నిచట ♦ దాశరథియు వృ
ష్టిని గలకాలంబెల్లను, దనవేదనచేతఁ గుంది ♦ తత్తఱపడుచున్. ౧ 1114

ఆ. ఎట్లో గడిపి యంత ♦ నెల్లమేఘంబులు, చనఁగ విమలమయి గ♦గనతలంబు
పాండురమయి వెలయ ♦ భవ్యమై విమలమై, యిందుమండలంబు♦ నెసఁగుచుండ.

సీ. చంద్రికాలేపనా♦చ్ఛంబయి శారదరాత్రియుఁ గన నభి♦రామమగుచుఁ
దనరఁగాఁ గామవృ♦త్తంబున సుగ్రీవుఁ డఖిలసుఖంబుల ♦ ననుభవించు
చుంటయు; జనకజ♦యుపశోకములఁ గుందుచును జెంతలేకుంట♦ యునునియమిత
కాలంబు మెల్లన ♦ గడచుటయును నాత్మఁ దలపోసి యప్పు డనం♦తమగుశోక

ఆ. మొంది మూర్ఛనొందె ♦ నొకముహూర్తమునకు
మరలఁ దెలివినొందె ♦ మతివిభవము
గలరఘూత్తముండు ♦ కాంత మనస్సున
నున్ననామె గుఱిచి ♦ యొక్కరీతి. ౪ 1116

క. తలపోయసాగె; నారఘుకులదీపకుఁ డచట శిఖరి♦కూటంబున ని
స్తులహేమధాతుమయమునఁ, గలఁగినమదిఁ గూరుచుండి ♦ గగనతలంబున్.

క. శారదమున స్వచ్ఛంబయి, చారుతరం బగుచు వెలయు ♦ స్వాంతమునందున్
గోరికఁ బ్రేయసిఁ దలఁచెను, ధారాధరములు తటిద్వి♦తానము లేమిన్. ౫

*క. సురమార్గము నిర్మలమై, వరసారసవిహగనినద♦వరఘుష్టంబై
పరఁగ న్విలపించెను రఘువరుఁ డార్తుండగుచు నార్త♦వాక్యంబులతోన్. ౬

చ. మునుపిట నాశ్రమంబునఁ బ్ర♦మోదము హొంగఁగ సారసారవం
బనఁదగు కంఠనాదమున ♦ నాజనకప్రియపుత్రి యుండి యిం
పును గలిగించు బెగ్గురుల ♦ హొల్పగునాదములన్ రమించుచుం
డును గద యిప్డు దైత్యులు క♦ఠన్ భయపెట్టఁగ నెట్టులున్నదో. ౭ 1120

సీ. బంగారుపూవుల♦భంగి రంగారుచుఁ బూచిన వేగిస♦పూలఁ గాంచి
యాబాలికామణి ♦ యాసక్తి ననుఁగాంచి కనఁబడకున్న నె♦క్కరణి మోద

---

* విలలాపార్తయాగిరా. అనిమూ.

మును బొందఁజాలు;? నా♦యనవద్యసర్వాంగి కలభాషిణి ధరిత్రీ♦కన్య సీత
కలహంస మృదురవ♦ములకు మేలొ్కనుగద యిపుడెట్లు మేలొ్కను?♦నెల్లవేళ

తే. లందు సహచరములగు నె♦య్యంపుఁజక్ర
వాకములపల్కులన్ విని ♦ వనిత నన్నుఁ
గానఁగాఁ గోరి పుండరీ♦కవిపులాక్షి
నాదురాకను జూచునే ♦ యాదరమున. ౯౪ 1121

క. ఇపుడెట్లు ప్రాణములఁ దన, వపువున ధరియించి దనుజ♦వసతిని నుండున్?
విపినమున నిందు భూమిజ, యిపు డామృగశాబనయన♦యింపు గులుకఁగన్.

క. పరిసరమున లేకుండుట, సరసుల బావులను వనుల ♦ శైవలినులఁ గ్రు
మ్మరుచున్న నాకు సౌఖ్యము, పరికించిననైనఁ గానఁ♦బడదు కటకటా!. ౧౧

క. స్మరుఁడెంతయును శరద్గుణ, నిరంతరుఁడు నన్నుఁబాసి ♦ నెలఁత యలరునం
చురుసౌకుమార్యమున నొ,ప్పురసుః శి యనుచుం దలంచి ♦ పొంగెడుకాంక్షన్.

క. వనితామణి ప్రాణాత్యయ,ము నొందువఱ కార్తిజలధి ♦ మునుఁగన్ బాధిం
చునొ యేమొ? విడువఁ డతఁ డ,ప్పుని చేయక; నిర్దయుండు♦ప్రద్యుమ్నుఁడునూ!

చ. అనియిటు రామచంద్రుఁ డను♦రాధిపుఁగూఱిచి చాతకంబు నీ
టిని గొనఁగోరి యేడ్చుగతి ♦ తీవిని బాసి మహీకుమారి సీ
తను దలపోసి యేడ్చె; సత♦తంబును లక్ష్మి చెలంగనున్నయా
తనియనుజుండు లక్ష్మణుఁడు ♦ తద్గిరిసానువులన్ ఫలార్థియై ౧౩౪ 1126

తే. కుటిలమార్గంబులన్ బండ్లు ♦ కోయఁ దిరిగి
రమ్యసానుతటంబుల ♦ రయమువీఱ
ఫలములం గోసికొనివచ్చి ♦ భవ్యమూర్తి
నన్నయగురామునిం గాంచె ♦ నద్రిపయిని. ౧౮ 1127

క. కరుణాంతరంగుఁడగు రఘు, వరసహజుం డట్లు పగల ♦ భరియింపఁగలే
క రమణిఁ దలఁచుచు నిర్జన, ధరభాగమ్మున నొకండె ♦ దారుణపీడన్. ౧౮౪

క. పరిపీడితుఁడగుచుఁ గళ్ళె, బరముపయిన్ స్మృతియె లేక ♦ పగఁగుందెడు శ్రీ
వరుఁ గాంచి తానునెంతయుఁ, బరితాపమునొంది దైన్య♦పరతంత్రుండై. ౧౫

సీ. పలికె నిట్లని; యార్య♦పరమధార్మిక! విను మేకాలమున మన♦స్సెంతొ దిటవు
గా నుండఁదగునొ యా♦కాలమందే కామవశమునఁ జిక్కనఁ ♦ బౌరుషంబు
వదలిన నుత్సాహ♦పరతమానిన నేమిఫలము? కార్యము చేయు♦పట్టుదలను
బూనుట స్థిరమగు♦బుద్ధిని గొనుటయుఁ గాలానుసారియై ♦ క్రాలుధైర్య

తే. మును నుపాయము నొందుట ♦ మనకు సాయ
పడెడుసుగ్రీవముఖులను ♦ బటుబలాఢ్య

లను గ్రహించుట దేవత♦లను బ్రియమున
వేఁడుటయు నిష్ట సాధన♦నీతి గాఁగ. ౧౫ 1130

క. మనమున గ్రహించి కార్యం, బును నీ చేయుమనుకొనుము వి♦భూ! ఘనసత్త్వ!
మనుజేంద్ర! శత్రునాశను, జనకజ దక్కించుకొనఁగఁ♦జాలఁ డొకఁడు నూ!.

క. కరమున నగ్నిజ్వాలలు, వరవీరా. కట్టుకొని యె♦వండయిన ని
ర్భరవహ్నిశిఖలఁ గాలక, ధరణి న్నిలువంగఁగలఁడె ♦ దర్పసముగ్రా. ౧౭ 1132

చ. అనియిటు లక్ష్మణుం డనఘుఁ డాదరముం గని హితమై స్వభావజం
బునుగయి ప్రస్తుతస్థితికి ♦ భూరిసుఖాకరమై మహీశ నీ
తిని దగఁ గూడి సాంత్వనము ♦ స్ఫూర్తిని నిచ్చుచు ధర్మయుక్తమై
తనరుచు నర్థవంతమయి ♦ శ్రద్ధయు నొప్పెడువాక్య మెన్ని చె
ప్పిన శుభలక్షణుం డనుజుఁ ♦ బ్రీతినిఁ గాంచి మహీశుఁ డిట్లనున్. ౧౮ 1133

చ. అనఘ! కుమార! నీవనిన♦దంతయు నిశ్చయమౌను గార్యముల్
మనమున నెంచి దానికి స♦మానుపదైర్యము నొంది సంశయం
బును గనకుండఁ జూచుకొనఁ♦బోలును నొప్పగ సాహసంబునుం
గొనఁదగు నిర్వ్యపేక్ష మనము ♦ గోరినదుర్ఘటికార్యమారయన్. ౧౯ 1134

క. జనకసుతాప్రాప్తిని గనఁ, గను జేసి ఫలించునా త♦గంగా నని నె
మ్మనమున నెన్నఁగఁ దగిన దె, యని యప్పుడు ఫుల్లపంక♦జాక్షిని సీతన్. ౨౦

*క. తలపోసి వగల నొరెం,స లక్ష్మణుం గాంచి పలికె; ♦ నముచిరిపుం డి
మ్ముల భూమికిఁ గావలసిన, యలఘుతరసువృష్టిఁ గురిసి ♦ యలరిచి తృప్తిన్.

తే. సస్యములఁ బండఁజేసి వే ♦ స్వహితకృత్య
మిట్టు లొనరిచి తాఁ గృత♦కృత్యుఁ డయ్యె;
స్నిగ్ధగంభీరఘోషంబు ♦ చెలఁగ శిఖరి
తరువులపయిని బోవుచుఁ ♦ దత్పరతను. ౨౨ 1137

సీ. జలములవర్షించి ♦ శ్రమము నొందినయట్టు లున్నవి; మఱియు నీ♦లోత్పలముల
పత్త్రములంబోలి ♦ పరఁగు మేఘంబులు శ్యామీకృతదశది♦శలయి తవరి
శాంతవేగములయి ♦ సాంద్రమదంబును వీడిన నాగేంద్ర♦బృందమట్టు
లున్నవి; సౌమ్య! య♦త్యుగ్రయవృష్టిసౌదామినీ వాతము లనిలగ♦ర్జంబు లగుచు

తే. నర్జునకుటజసాధువు♦ష్పాళిపరిమ
ళముల నింపయి యధిక వే♦గమున వీచి
యిపుడు నిలిచిన; వి త్తఱి ♦ నేనుఁగులయు
జలదశిఖినిర్ఝరములయు ♦ స్వనము నుడిగె. ౨౩ 1138

* ముఖేన పరిశుష్యతా-అనిమూలము.

చ. ధరములు మేఘదత్తజల♦ధారలనిర్మలరీతి నొప్పి సుం
దరబహువర్ణసానువులు ♦ తద్దయుఁ బొల్పెసలారఁగా మనో
హరతిరచిత్రదీప్తులను ♦ నారయఁగా వరకుంకుమాదిస
త్పరిమళయుక్తిఁ గన్నగతి ♦ భాసిలుచున్నవి; చూడు! లక్ష్మణా!. ౨౭ 1139

[1] తే. నవ్యసంగమమునయందు ♦ నాతులెల్ల
లజ్జపెంపున మెల్లమె♦ల్లఁగ జఘనము
లను వెలికిఁ బుచ్చునట్లుగ ♦ [2]ధునులు పులిన
ముల శరత్కాలమునను బ♦యలుపఱచెడు. ౨౮ 1140

చ. శరదయు స్వీయమై పరఁగు♦సంపద సప్తపత్రశాఖలన్
అరుణశశాంకతారకల ♦ యచ్ఛమరీచులయందు మత్తకుం
జరసువిలాసమందు నిటు♦చాల విభాగముచేసి వ్యాప్తిచేఁ
బరఁగుచునున్న దెంతయును ♦ భవ్యతమంబుగ నేత్రపర్వమై. ౨౯ 1141

సీ. అరుణుని ప్రాథమి♦కాయతకాంతులఁ జక్కఁగాఁ బూచిన♦సరసులందు
బహువర్ణరమణీయ♦పంకజాశ్రయమునఁ జిత్రకాంతులచేతఁ ♦ జెలఁగి యీ శ
రద్గుణమునఁ గల్గి ♦ రంజిల్లులక్ష్మియు నలరారుచున్నది ♦ యధికమగుచు;
నేడాకులరఁటుల ♦ నెసఁగుఁబుష్పంబుల పరిమళమును బొంది ♦ భ్రమరపంక్తి
తే. యలరి పాడుచు వెంటరా ♦ నడవులందుఁ
బవనుఁ డెంతయుఁ బ్రసరించు♦వాఁడు గాన
మదగజంబులకెల్లను ♦ మఱియు దర్ప
వృద్ధినిం జేయుచున్నాఁడు ♦ నిచ్చతనర. ౩౧ 1142

చ. సురుచిరపక్షము ల్మిగుల ♦ శోభిలఁగా మిథునంబులౌట నొం
డొరులకు నాభిముఖ్యముగ ♦ నొప్పుచుఁ బంకజరేణువు ల్కళే
బరములనిండ హంసమ♦వాయము జక్కువలున్ సరఃప్రియం
బరుదుగఁ గల్గియున్నయవి ♦ యేటి మహానదులందు హాయిగాఁ
బరఁగెడుసైకతస్థలుల ♦ బాగుగఁ గేళియొనర్చెడుం జుమీ!. ౩౨ 1143

చ. సరసిజవాస మత్తకరి♦సంతతియందు మదించియున్న గో
వరములయందు స్వచ్ఛతర♦వారిఁ జెలంగెడు సత్సరిత్పంక్తిలో
త్కరమున నీశర త్తలరు♦కాలమున న్మిగుల న్విభక్తమై
నిరుపమకాంతిమై వెలసె ♦ నెమ్మి చెలంగఁగ నో ప్రియానుజా! 33 1144

చ. ఘనములఁ బాసి శుభ్రముగఁ ♦ గన్పడువ్యోమముఁ గాంచి కాననం
బున నెమిళుల్ స్వబర్హములఁ ♦ బొంకముగాఁ దగుభూషణంబులన్
గొనకొని విప్పమాని తమ♦కోమలులం దనురక్తిమాని కాం

1 నవ్యసంగమసవ్రీడా జఘనానీవ యోషితామ్-అనిమూలము. 2 ధునులు=నదులు

తిని విడనాడి యుత్సుక♦తిం దగఁ బాయుచు ధ్యానమునందుఁ బెం
పును గనుచున్నవానివలెఁ ♦ బొల్చెడువార్షము మాలి యెంతయుక్. 38

సీసమాలిక:—

సరోజలవాసన ♦ బ్బలయంగ గొప్పవై పుష్పగుచ్ఛంబుల ♦ భారిభార
మునను శాఖాగ్రము ♦ ల్లొనకొని వంగఁగ బంగరుచాయయు ♦ రంగుమీఱఁ
గన్నులపండువు♦గానున్న వేగిసవృక్షము ల్వికసించు ♦ వెలయుచుంట
దీపమ్ము లుంచిన♦ తెఱఁగున నున్న; సప్తచ్ఛద ద్విపేంద్రమ్ములు ♦ పూవులుచున్న
యేడాకులరఁటుల ♦ నెసఁగుఁబూవులవాసనలకు మదంబులు ♦ చెలఁగి కటిత
టముల భేదింప న♦ట్టిమదమున న్నైషయూనక్తి పౌరుషుం బ్రి♦యాన్వితమ్ము
లయి సరోవరముల♦యందు వనంబులయందును విహరింప ♦ నగుచుండి
గతులు మందంబులు♦గాఁగఁ బోవుచున్న; వాకాశము నిరభ్ర♦మైతనరుచుఁ
జక్కఁగాఁ దుడిచిన ♦ శస్త్రవర్ణంబును గాంచుచున్నది, నిమ్న♦గాజలప్ర
వాహ మడఁగినది ♦ వాయువు ల్కహ్లారశీతలమ్ము లగుచుఁ ♦ జెలఁగి వీచు
చున్నవి, దిక్కులు ♦ సోదరా! తమములు విచ్చి పోవుటఁ జాల ♦ విమలములయి
కనఁబడుచున్నవి; ♦ త్స్థానస్థలమంతయు రవిరశ్మిసోఁకి బు♦రద లడంగ
స్థూలరేణువులుగాఁ♦దోఁచుదుమ్మును గొంతగల్గియున్నది, మహీ♦కాంతులకును
నితరేతరము చాల ♦ నెక్కువపగయు ననూయయుఁ గలవారి♦కీయదనున
దండయాత్రలు సల్పఁ♦దగు, దాని కీకాల మనుకూలమై యున్న♦దరయనిపుడు
కామరాగనీశర♦ద్గుణవర్ధితాంగసౌష్ఠవకాంతులొప్ప వృ♦షభములెల్ల
బలిసియుఁబొంనుసం♦కలితాంగములునగమదమునవొండొంటి♦మార్కొనంగ
బూని యావులమధ్య♦మున కేగి యార్చుచు నున్నవి,వనములం♦దొగిఁగరిణులు
కామంబు గొని తమ♦కదుపులతోఁగూడి యనురాగభరమున ♦ నతిశయించి
మదమెంతొ యధికమై♦పొదలంగ మందగమనమునఁజనుచున్న♦పెనిమిటులను
వెంబడించియె ప్రీతి♦విలసిల్లఁ జనుచున్న; వరయ మయూరంబు♦లాయతాభ
రణములైనట్టి బ♦ర్హములెల్లఁ దూలంగ నేకుల దరులకు ♦ నేగ నచట
నలరుచున్నట్టి యా♦హంసలు దమ్మును బెదరించునట్లుగ ♦ వింతగులుకఁ
గూయంగ మదమును♦గోల్పోయి దీనములై పోవుచున్న; వి♦య్యదనునందు;
మదభిన్నకటములై ♦ మలయుగజేంద్రముల్ ఘనరవంబులు మీఱఁ♦గానరన్ను
లను జొచ్చి జక్కవ♦లను గన్నెల్లను భయపెట్టుచుక్ ఫుల్ల♦పంకజాత
ముల భూషితములగు♦కొలఁకుల శోభిల్లఁ జేయుచు జలములఁ ♦ జిమ్మిచిమ్మి
త్రాగుచున్నవి వికస♦ర్దమములై సైకతస్థలులు చెన్నార ని♦ర్మలజలములు
విలసిల్ల నాలమం♦దలు పొల్పుమీఱఁగా గంభీరజలనాద♦కలితములయి
యొప్పారునదులందు♦నొగినంచలును సారసపతత్రులను సంత♦సమునఁ జొచ్చు

చున్నవి; నదుల య♦త్యుద్ధతజలపూరరవములు సెలయేళ్ల♦రవములనై
ఘనతరానిలభూరి♦నినదము లెన్నిమిళుల కేకారవంబులు ♦ ప్రాకటంబు
లగుకప్పకూతలు ♦ నడఁగిన వియ్యెడ; వానకాలమురాఁగ ♦ వారిధరము
లార్భటింపంగ బ♦యల్లఁ దిరుగలేక యెందొవసించుచు ♦ నెంతొచిక్కి
తనువులు కృశియింప ♦ దమపెంపు నశియింప నాఁకలిబాధయు ♦ నతిశయింప
ఘోరవిషంబులు ♦ భూరినాదంబులు బహువర్ణములు గల♦పాములెల్ల
బిలముల వెలువడి ♦ మెలమెల్లనఁ సంచరించుచున్నవి చూడు ♦ మంచితముగ;
నతిశయంబుగ వెల్గు♦నబ్జకరంబులు ప్రసరించి తారకా♦పటలమెల్లఁ
గనఁబడ సాంధ్యరా♦గము తానె యారార! యాకసంబుగ నుండి♦యప్టై తీసి
పోవుచున్నది; నిశా♦భూపాలమృదువక్త్రమై, తారకాసమూ♦హములె వికసి
తాక్షులు వెలయంగ♦నమలమౌ జ్యోత్స్నాంశుకప్రావరణము ద♦గంగరాత్రి
శశివదనంబును ♦ జక్కనికన్నులు శ్వేతాంబరము గప్పి ♦ చెలఁగుఁ జెలువ
వలె నొప్పుచున్నది ♦ చెలువంపుబెగ్గురుపక్షులు చక్కఁగాఁ ♦ బండినట్టి
వరిగింజలను మెక్కి♦నిరుపమోత్సాహంబు గనుచు బారులుగట్టి♦ఘనజవమున
గ్రథితమాలిక యట్లు ♦ గాలికి నెగురునో యట్టులాకాశము♦నందు నెగురు
చున్నవి; లోఁతుగా ♦ నొప్పుహ్రదంబునఁ దెల్లనియొకయంచ ♦ యుల్లసిల్లి
నిదురింపుచుండఁ గు♦ముదములు వెలయంగ నందలి తెలినీర ♦ మంబుదములు
కనఁబడకుండంగఁ ♦ గడురమ్యమై పూర్ణశశిఁగూడి తారకా♦సముదయములఁ
గ్రాలెడురాత్రి నా♦కాశంబువలె నొప్పుచున్నది; గుంపుగ ♦ నొప్పుహంస
కాండమే మొలనూలు♦గా వికసించినయంబుజోత్పలములె ♦ యమలపుష్ప
హారంబులుగ నొప్పు♦నట్టిబావులు భూషణాళిచేఁ బూలచే ♦ నలరు నుత్త
మాంగనలవలెఁ జె♦న్నలరుచున్నవి; ప్రొద్దుననె గోపికలుపెరు♦గునుజిలుకఁగఁ
గలుగుచప్పుళ్లు, నా♦వులు దూడలకుగాను ధ్వనిచేయునంబార♦వములు,వృషభ
ఘననాదములు, వేణు♦నినదమ్ములనుగూడి ప్రాతస్సమయమున ♦ వఱలువాయు
వున నెక్కువయి యంత♦టను దగ వ్యాపించియొండొంటితోఁ జేరి♦యొక్కరీతి
వృద్ధినొందుచునున్న ♦ వీయెడ; నిమ్నగాతటములు మృదుమారు♦తమునఁ నలరు
చును గ్రొత్తపూలచే♦తను విలసిల్లుచు ధౌతకౌశేయవ♦స్త్రములరీతి
నలరు తెల్లుపొదల ♦ నావృతములయి తెల్లనిపట్టువుట్టంబు ♦ తనరనున్న
వనితల జంఘల♦వలె నొప్పుచున్నవి; వనులనడ్డములేక ♦ పరుగులిడుచు
మధుపానమును జేసి ♦ మత్తిల్లి ధూర్తంబులై ప్రియలంగూడి♦యబ్జములయు
బంధూకమృదులపు♦ష్పములయుఁబుప్పొళ్లఁ బొరలాడిపచ్చఁగాఁ♦బొలుచువన్నె
గలుగఁ దుమ్మెదలొగి ♦ గాలివాసనలకై దానివెంటఁదగిలియె ♦ తారు పోవు
చున్నవి; శుభ్రమౌ♦నుదకముల్ వికసితకుముదముల్ క్రౌంచస్వ♦నములుపక్వ
శాలిసస్యమ్ములు ♦ లీలఁ గ్రాలెడుగాలి యతివిమలంబగు♦నబ్జబింబ

తే. మిన్నియెల్లను వర్షర్తు ♦ వేగి యిపుడు
వచ్చెఁ జుమ్ము శరత్తని ♦ పలుకుచున్న
యట్లు తెల్పెడు; మఱియు నీ♦యుదన మీన
వితతియే మొలనూళ్లగా ♦ వెలయునదులు. ౪౨ 1146

క. అనురక్తి నిశలఁ గాంతుల, ఘనకేళులఁ దేలి యుదయ♦కాలంబున మె
ల్లనిగతులఁ బోవుసుందర, వనితలగతి మందగతులఁ ♦ బాఱెడుఁ గంటె ౪౪

చ. కనుమవె చక్రవాకముల♦కాండము లొప్పఁగఁ బాఁచి గల్గి చ
క్కనిదగు తెల్లుగప్పుకొనఁ♦గా నలరారు నదీముఖంబు లో
య్యనఁదగు రోచనంబు చెలు♦వారఁగఁ బత్రవిలాసయుక్తిమైఁ
దనరి దుకూలసంవృతిని ♦ దద్దయు రాజిలు స్త్రీలమోమునాఁ
గనదురుకాంతిచే వెలయు ♦ గాదిలితమ్ముఁడ! సద్గుణాకరా! ౪౬ 1148

తే. నల్లగోరంటపూవుల ♦ నుల్ల సులరఁ, జేయు వేగినపూవులఁ ♦ జిత్రితమ్ము
లగుచుఁగ్రొవ్వినమత్పద♦హారిఝంకృతులనువెలసెడుపనభాగ♦ములన్నుఁ గనుండు.

చ. శరములఁ జాపముం గొనుచు ♦ సాధ్వసరీతిగ మాఱులేక యే
తిరుగుచునున్నవాఁడు, సుమ♦తీ! జలదంబులు మంచివృష్టిచే
ధరఁగల మానవప్రతతిఁ ♦ దద్దయు సంతసిలంగఁ జేయుచున్
సరసులనుం దటాకముల ♦ శైవలినీనికరంబునిండ న
త్వరముగఁ జేసి సస్యములఁ ♦ బండఁగఁ జేసి నభంబు వీడెఁ జూ!. ౪౮ 1150

క. సలిలాశయములు నిర్మలములగు జలంబులను వెలసి ♦ ముదమునఁ గ్రౌంచం
బుల కూజితములచేతం, జెలఁగుచు జక్కువలపిండు♦చేతం దనరున్. ౪౯ 1151

తే. సప్తపర్ణంబులును, వేగి♦సములు దేవ
కాంచనంబులు మఱియుఁ బ్రేం♦కణపుఁజెట్లు
మంకెనలు సానువులయందు ♦ మంచిపూలఁ
గానఁబడుచున్నయవి సౌమ్య! ♦ కంటె వాని. ౫౦ 1152

క. కనుమా! లక్ష్మణ! పులినావనులన్ జక్కవలు హంస♦పక్షులు మఱి క్రౌం
చనికాయము సారసములు, దనివారెడు కేళినుండుఁ ♦ దమకెదుపులతోన్ ౫౧

క. నరపతిపుత్త్రా! సౌమ్యా!, పరస్పరజిగీషువులయి ♦ పైపై వైరం
బరయుచునుండు నృపాలోత్కర మనికై యుద్యమించు ♦ తరుణము వచ్చెన్.

చ. అని నొనరింపఁగాఁ దొలిప్ర♦యాణము రాజులుచేయుకాల మొ
య్యనఁ జనుదెంచె నిప్పుడు నృ♦పాత్మజ! సూర్యతనూజుఁడన్ననో
కనఁబడఁ డట్టియత్నమును ♦ గాని యొనర్చిన జాడ లేదు; సీ
తను గన కార్తిఁ గుందుచు ని♦తాంతము నేడ్చెదునాకుఁ జూడఁగన్. ౫౪

తే. వానకాలంపుమాసముల్ ♦ వరగుణాఢ్య
నాల్గునూఱేండ్లుగా నాగి♦నయవి; జనక
తనయ యది, చక్రవాకి భ♦ర్తయగుచక్ర
వాకమును వెంబడించెడు♦పగిది తోఁప. ౧౪ 1156

క. తనప్రాణేశ్వరు వెంబడి, చనుదెంచెను నుపవనంబు ♦ సంతసమునఁ జూ
డను బోవురీతి దండక,వనమున కినుమంతయేని ♦ వనటఁ గనక యే. ౧౫ 1157

క. అనుజా! హృతరాజ్యుఁడనై, జనకజనుం బాసి శోక♦సంతప్తుఁడనై
స్వనగరవిచ్యుతి నెంతయుఁ, గను నాపై రవిజునకును ♦ గల్గదు దయయుఁ.

మ. వినుమా. సౌమ్య! పరంతపా! కుమతి, పృ♦థ్వీపాలుఁ డానూర్యజుం
డు ననాథుఁ హృతరాజ్యు, దూరగృహు దీ♦నుం గాముకుఁ భీతునిఁ
దనుజేంద్రాపహృతాంగనుం గనఁగఁ జి♦త్తంబందు భావించుచుఁ
దనునే రక్షకుగాఁ దలంచి తనచెం♦తం జేరి నల్లించుచుఁ. ౧౭ 1159

తే. ఇన్నియు మనంబునం దిడి ♦ నన్ను నాద
రింప కవమానితుం జేసె ♦ రీతి యిద్ది
యొప్పునే! లక్ష్మణా! శర♦త్తోగిని రాఁగ
సీత వెదకంగఁ బంపుదుఁ ♦ గోఁతులనని. ౧౮ 1160

క. సమయంబుఁ జేసికొని దు,ష్టమతియుఁ గావునను దాని♦సరణి మఱచి కా
ర్యముతీఱె నాకిఁ కేమని, సమదుండై తెలియఁడు నను ♦ స్వాంతమునందుఁ.

క. చనుమా! కిష్కింధకు నీ, వనిశము గ్రామ్యసుఖములనె ♦ యాసించెడు మూ
ర్ఖుని సుగ్రీవునిఁ గని నే, ననినట్లుగ నిట్టులనుమ ♦ యాతనితోడఁ. ౨౦ 1162

సీ. "తనకు మున్నుపకార♦మును జేసి తన్నును శరణుచొచ్చియుఁదన♦సాయమున నె
కార్యముఁ ఫలియింపఁ♦గాఁ జేసికొనఁగోరి యున్నవారల కెవ్వఁ♦డుర్విఁగార్య
మును దీర్చియిచ్చెద ♦ నని ప్రతిజ్ఞను జేసి యాశఁ గల్పించి ని♦రర్థకంబు
గా దానిఁ జేయునో♦కపటి యాతఁడె పురుషాధముండగు నెవ్వఁ♦డైనఁగాని

తే. మంచిదో చెడ్డదో తన♦మాట తప్ప
కుండ సత్యముగాఁ దీర్చు♦నో యతండు
పురుషరత్నంబు వీరుండు ♦ పూజ్యుఁడునగు;
నెవరు మిత్రులవలన స్వ♦కృత్య మెల్ల. ౨౧ 1163

చ. ఒనరుచుకొంచు మేలుగని ♦ *స్వోపకృతుల్ తమకార్యమించుకై
నను గొనసాగమిం బొగుల ♦ నైజహితంబును జేయమాని వా
రిని గనకుందురో గుణద♦రిద్రులు వారలు మృత్యువొందఁగాఁ
దినవు తదీయమాంసము మ♦దిం గడురోయుచు మాంసభుక్తతుల్." ౨౩

* స్వోపకృతుల్ = తమకుపకృతి చేసినవారు.

చ. అనివచియింపు మేను సమ♦రాంగణమందు సువర్ణపృష్ఠమౌ
ధనువును లాగునప్పుడు ని♦తాంతతటిల్ప్రతతిం బోలుదానిగా
ఘనశరహాసముం గనఁగఁ ♦ గాంతుఁ సహింతుఁసనేమొ! *తీవ్రరు
క్తనయుఁడు నిశ్చయించెది; క్రు♦ధంగని నేసును యుద్ధభూమిలోన్. ౭౮ 1165

క. ధనువును లాగఁగ జ్యాలత, ఘనభీకరఘోషమును ఘ♦నగ వజ్రమహా
ధ్వనిసమమును మరలన్ రవి,తనయుఁడు వినఁదలఁచెనేమొ?♦తనమదిగలఁగన్.

క. నరవరపుత్రా! వీరా!, గురుసాలద్రుమగణంబుఁ ♦ గూల్చుట వాలిన్
దురమునఁ జంపుటచే నా, పరాక్రమము నెఱిఁగి సూర్య♦పట్టి మనమునన్.

తే. నీవు పెనుప్రాపుగా నుంట ♦ నెఱి నెఱింగి
యును బ్రతిజ్ఞను దప్పిన ♦ నను వధించు
రాముఁ డంచును దా విచా♦రమును బూన
కున్నవాఁడేమొకో? చెప్పు♦మన్న యనుజ. ౭౯ 1168

చ. పరపురభంజనా! యమర♦పాలకపుత్రుని జంపి సఖ్యముం
గరమునఁ జేయిపెట్టి తమిఁ ♦ గ్రాల నొనర్చుటయన్న యిట్టికా
ర్యరతికిఁ బూనుటెందులకొ? ♦ యావిధ మిప్పుడు తాఁ గృతార్థుఁడై
సరసిజమిత్రపుత్రుఁ డిట ♦ స్వాంతమునందు నెఱుంగఁ డక్కటా!. ౮౦ 1169

క. వనచరపతి వర్షర్తువు, చనినంతనె వత్తుననుచు ♦ సత్యము వచియిం
చెనుగాని నాల్గునెలలుగ, వనితా కేళులను దేలి ♦ వారనితృప్తిన్. ౮౧ 1170

తే. ప్రతిన తప్పుట నెఱుఁగఁడు ♦ బంధుసచివ
సంయుతుండయి త్రాగి యి♦చ్ఛావిహార
కలితుఁ డయ్యెనుగాని శో♦కమునఁ దప్త
మనసులం గుందు మనలను ♦ గనఁడు కరుణ. ౮౨ 1171

క. కనుకన్ వత్స! మహాబల!, చనుమా! కిష్కింధ కీవు ♦ నరగునఁ జని నా
ఘనరోషహాసమును నా,తనికిం దెల్పుచు మదుక్తిఁ ♦ దగ నిట్లనుమా ౮౩

క. "వినుమా! సుగ్రీవా! నా,ఘనశరహతుఁ డౌచు వాలి ♦ కడువడి మీాఱన్
జనెనో యేమార్గంబున, వినాశమును బొంద దదియు ♦ వివృతమయి తగున్.

చ. కనుకనె యగ్నిసాక్షికము♦గా నొనరించినసఖ్యముం బ్రతి
జ్ఞను మఱువంగఁబోకు, మటు♦కాక ప్రతిజ్ఞను దప్పి వాలియే
గినగతిఁ బట్టిపోకు; మనిఁ ♦ గేవల మొక్కని వాలినే శరం
బునఁ బడవేసినాఁడ మును ♦ పూనిక నిప్పుడు నేను నిన్ననిన్. ౮౫ 1174

తే. సత్యవాక్యము వదలుట ♦ శరమువైచి
బంధుయుతముగ వధియింతుఁ ♦ బౌరుషమున;"

* తీవ్రరుక్తనయుఁడు=సూర్యపుత్రుఁడగుసుగ్రీవుఁడు.

నని వచింపుము పురుషవ♦ర్యా! మఱియును
గార్యరీతిని బట్టి యి♦క్కాలమునకు. ౧౨॥ 1175

క. హితమగు నేయేవాక్యము, మతివిభవము తోఁపఁ బలుకు ♦ మఱి సమయజ్ఞా
[1]గతి మీఱరాదు, త్వరపడు,ము తగం జని వానరాఘు♦ముఖ్యునితోడన్. ౧౩

చ. వనచరనాథ! నాకొఱకు ♦ వారక చేసెదనంచు నీవొన
ర్చినప్రతినన్ దృఢంబుగను ♦ జేయుట శాశ్వతధర్మమం చొగిం
గనుఁగొని సత్యమార్గమునఁ ♦ గార్య మొనర్పుము; చేయకున్న నే
ననిమొన వైచుబాణముల ♦ నార్తిని బొందుచుఁ గూలి వాలిని. ౧౩॥ 1177

ఆ. ఇపుడె చూడఁగలవు ♦ తపనపుత్రునిలోక,మొంది యట్టిగతిని ♦ బొందఁబోకు;
మని వచింపుమనుచు ♦ నాడినరాముని, నతివివృద్ధకోపు ♦ నన్నుఁగాంచి. ౧౪॥

క. దీనుండై పలవింపఁగ, మానసమునఁ జింతనొంది ♦ మనుజేంద్రునిస
త్పూనుఁడు లక్ష్మణుఁ డుగ్రత,వానరపతియందుఁ దాల్చె♦బహుళాగ్రహమున్.

ముప్పదియవ సర్గము సంపూర్ణము.

---

## ౩౧ - వ సర్గము.

లక్ష్మణుఁడు కోపముతో వచ్చుచున్నాఁడని యంగదుఁడు సుగ్రీవునకుం దెల్పుట.

సీ. నర[2]దేవపుత్రుండు ♦ సురసంఘపూజితుం డైనరాఘవుఁ డిట్టు ♦ లతిశయమగు
కామంబుచేఁ బీడఁ♦గాంచి దీనుండయి శోకాభిపన్నుఁడై ♦ సోక్క తీవ్ర
కోపంబుఁ దాల్చి వి♦గూఢసత్త్వుండయి యుండుటఁ గనుఁగొని ♦ యుగ్రతేజుఁ
డగులక్ష్మణుం డప్పు ♦ డన్నతో నిట్లను; మిత్రసమానమై ♦ మెలఁగుచున్న

తే. కష్టసుఖములు తానును ♦ గాంచియుంట
సజ్జనాచారమగుదాని♦పజ్జ నతఁడు
నిలిచి యుండఁడు రాముతో ♦ నెమ్మిగనుట
వలనఁగద కపిరాజ్యము ♦ వచ్చెననుచు. ౧॥ 1180

క. వనితాసమాగమాదు ల,తనికృపచేఁ గల్గె ననెడు♦తలఁపుఁ గనఁడు నూ;
మనయం దనుకూలముగా, దనవర్తన ముంచి నడువఁ♦దగు ననుబుద్ధిన్. ౨

తే. తాను బూనఁడు గావున ♦ వానికింక
వానరేశ్వరరాజ్యము ♦ వైభవంబు
దక్క దోవీర! మఱిలే క♦తండు తుచ్ఛ
సౌఖ్యములఁ బొంది నీవు రా♦జ్యం బొసఁగుట. ౩॥ 1182

---

1 త్వరకాలవ్యతిక్రమః-అనిమూలము. 2 "దే" యను యక్షరము గాయత్రియం దేకాదశాక్షరము.

క. వనితను నిప్పించుటయుఁ, గనఁజాలఁడు నీదుకృపకుఁ♦గాఁ బ్రత్యుపకా
రనిరతి బొంకంబగునని, యును దలఁపఁడు గాన నిప్పు♦డాగి నాచేతన్. ౨౫

క. హాతుఁడై తనయన్నను నా, శతమఖసుతుఁ జూచుఁగాక; ♦ త్యాగాధర్మ్యం బీ
కృతమెఱుఁగని దుర్గుణునకు, మతిఁ గరుణను నీయరాదు ♦ మాటలిఁ కేలా. ౩౦

క. సముదీర్ణభూరిరుషన్, గము నే భరియింపఁజాలఁ ♦ గావుననే స
త్యము దప్పిన సుగ్రీవుని, యముపాలికిఁ బుత్తు వాలి♦యాత్మజుఁ డిపుడే. ౩౫

చ. వనచరవీరులం గలిసి ♦ వారిజలోచన సీత జాడనుం
గనుఁగొన నేగుఁగాక; యని ♦ క్రన్ననఁ బల్కిన శత్రుహాంతయై
ఘనకరుణాకరుండనఁగఁ ♦ గ్రాలెడురాముఁడు తమ్ముఁడట్లుగా
వని నొనరింపఁ దీవ్రతర♦మా క్రుధఁబూనుచు సజ్యచాపుఁడై. ౪౫ 1186

[1]ఉ. తానొనరింపఁబోవుపని ♦ దారుణరీతిని బల్కి పోవఁగా
మానసమందు నెంచి యన♦మానపరాక్రమ మొప్పుచున్న యా
మానితు లక్ష్మణుం గనుచు ♦ మంగళదాయకసామవాక్యముల్
తానిటుపల్కె రాఘవుఁడు ♦ తమ్ముఁడ! త్వద్విధవీరుఁ డిద్ధరన్. ౫౦ 1187

తే. ఎవ్వఁడైనను జూడుమా! ♦ యిట్టిమిత్ర
వధసమాగతపాపంబు ♦ వార కొనరఁ
జేయనెంచునె! యివ్విధిఁ ♦ జేసి యఘముఁ
బొందుట తటస్థపడినయ♦ప్పుడు హితమతి. ౫౫ 1188

ఆ. తనవివేకమహిమ ♦ దానిని దొలఁగించు, కొనునొ యట్టివీర♦కుంజరుండె
పురుషసత్తముఁడగుఁ ♦ బూజ్యవృత్తిని గల్గు, నీవె యిట్టిపనికిఁ ♦ బోవరాదు.

క. మును చేసిన యానఖ్యం, బును జక్కఁగ ననుసరించి ♦ ముంగటిప్రీతిన్
వనచరపతిపై నునుపుము;, వనజాప్తునితుతుఁడు తనదు♦పనిఁ దరుణమునన్. ౬౦

క. ఒనరింపఁడు కావున నా, తనితోఁ బరుషోక్తులాడఁ ♦ దలఁపక సామం
బును హితమునైన వాక్తతి, మనమునఁ గ్రుధమాని పలుకు♦మహితవిచారా!.

[2]క. అనియిట్లు లగ్రజుఁనిచే, నను శిష్టార్థుఁడయి పోయె ♦ నాకిష్కింధన్
గనుఁగొనఁ బరవీరనమూ, హనిరాకరణోగ్రశౌర్యుఁ ♦ డగులక్ష్మణుఁడున్. ౯

క. పురిఁ జేరి శుభమనీషుఁడు, నిరుపమమతివైభవుండు ♦ నిర్మలగుణుఁడున్
బరమాప్తుఁడు నై తగు నా, స్థిరశౌర్యుఁడు కోపముడిగి ♦ స్థిరతరశాంతిన్. ౧౦౦

క. వనచరనాథుని సౌధం, బున కేగెను; బ్రళయకాల♦మున యముఁడనఁగాఁ
దనరారు లక్ష్మణుఁడు శత్రునిచాపముఁ బోలి శైల♦కూటాభంబై. ౧౦౫

---

1 ఉవాచ రామః పరవీరహంతా స్వవేక్షితం సానునయంచ వాక్యమ్-అనిమూ. పరవీరహంతా-అనుదానియర్థము లోపలిపద్యమునఁ జెప్పఁబడినది 2 ప్రవివేశ పురీం వీరో లక్ష్మణః పరవీరహా, అనిమూ.

క. కనఁబడుచాపము దాలిచి, ఘనసానువు లొప్పుచుండఁ♦గాఁ దగు శైలం
బును మందరమును బోలుచుఁ, గనఁబడియెను జూచువారు♦గడుభయమందన్.

[1]సీ. మతియందు నాబృహ♦స్పతితుల్యుఁడౌ సుమిత్రాత్మజుం డగ్రజు♦నాజ్ఞయందు
నించుకేనియు మీఱ♦కే యొనరించెడువాఁడయి కపినాథు♦తోడఁ దాను
జెప్పఁగాఁ దగి రాముఁ ♦ డప్పుడు చెప్పినమాటల వానికి ♦ మరలఁ గిశ
వుఁడు చెప్పు నుత్తరం♦బుఁ దగఁ దానునువానికొనరనీఁదగినప్ర♦త్యుత్తరంబుఁ

ఆ. దలఁచుకొనుచుఁ బోయె; ♦ నలరామునకుఁ గామ
మునను గ్రోధమునను ♦ జననమంది
నట్టికోపవహ్ని ♦ యపుడు తన్ బైకొన
ననిలుభంగిఁ గుపితుఁ ♦ డగుచుఁ జనియె. ౧౩ 1196

ఆ. అతఁడు మఱియు దారి ♦ కడ్డముగా నున్న, మద్దితాటుల నిను♦మద్దిచెట్ల
నితరవృక్షములను ♦ వితతబాహువులను, ద్రోసి కొండకొనలఁ♦ద్రోసిమఱియు

చ. పలువిధవృక్షజాతులను ♦ బాడొనరించుచుఁ గాళ్లచేతఁ బెన్
శిలలను నుగ్గొనర్చుచును ♦ జెచ్చెఱఁ బోవుగజంబురీతి నా
కులమతియౌచు నాత్రమునఁ ♦ గోపమునం దనయగ్రపాద మి
మ్ముల నొకకొంతదూరమునఁ ♦ బోవఁగఁ జిమ్ముచుఁ బెక్కురీతులన్. ౧౪ 1198

తే. కార్యవశమునఁ జేసి వే♦గముగఁ బోయె;
నిట్టు లిక్ష్వాకుకులసింహుఁ ♦ డేగి శైల
మధ్యభాగంబునన్ దుర్గ♦మంబు నగుచు
వానరబలాన్వితంబయి ♦ వఱలుదాని. ౧౫ 1199

క. హరిగణరాజమహాపుర, వరమును గనుఁగొనియె; నంత ♦ వనచరపతిపైఁ
బరఁగెడురోషమునం బ్ర,స్ఫురమాణోష్ఠుఁడయి యప్డు ♦ పురబాహ్యమునన్.

క. చరియించువారలన్ భీ,కరరూపులఁ గిశవరులఁ ♦ గనియెన్; వారున్
బురబాహ్యస్థలిఁ దిరుగుచుఁ, గరిపతిరూపములఁ బోలి ♦ క్రాలుచు నంతన్.

చ. పురుషవరేణ్యు లక్ష్మణుని ♦ బోలఁగఁ గాంచి యితండు శత్రువౌ
నరయఁగ నంచు నెంచి యట ♦ నగ్గిరిమధ్యతలంబునందు భూ
ధరఘనశృంగముల్ తరువి♦తానము నూఱులసంఖ్యగొంచు సం
గరమున కాయితంబయిరి; ♦ కారణ మేమియులేక వానరుల్. ౧౮ 1202

తే. ఆయుధంబులఁ గైకొను ♦ టరసి కోప
మినుమడింపఁగ లక్ష్మణుఁ ♦ డింధనములు
మిగులఁ గలయగ్నిహోత్రుఁడు ♦ మించునట్లు
ప్రజ్వలించెను; నంతఁ గో♦పమున నతఁడు. ౧౯ 1203

1 ఈపద్యమున మూలార్థమే వ్యాఖ్యాభిప్రాయమున వివృతమని తెలియునది.

చ. ఘనయశుఁడైన లక్ష్మణుఁ డ♦ఖండరుషావిలనేత్రయుగ్ముఁడై
వనచరనాయకాత్మజుఁడు ♦ వచ్చుటఁ దాఁ గని వత్స! యల్లరా
మునియనుజుండు శాత్రవస♦మూహాయముండు సుమిత్రసూనుఁ డా
య్యన నిదె వచ్చినాఁ డనుచు ♦ నాకపినాథునితోడఁ జెప్పుమా!. ౩౩ 1214

క. రామునకుం గలవ్యసనము, చే మదితపియింప ద్వార♦సీమ నిలిచియే
సౌమిత్రి యున్నవాఁ డని, నామాటల నిట్లు తెలుపు ♦ నగచరపతికిన్. ౩౩½

తే. అతనిమాటలయందు నీ♦కభిమతంబు, గలిగెనేని నతనిచెం♦గటికి నీవు
చనుటయో నీదుసన్నిధి♦కిని నతనిని, వచ్చునట్లొనరించుటో ♦ భవ్యరీతి. ౩౪

క. మనమున కెయ్యది యుక్తం, బని తోఁచునొ యట్లుచేయు♦మని యీవాక్యం
బును జెప్పి యరిందమ వత్స! నీవు వేగంబ రమ్ము ♦ తడయకు మచటన్. ౩౪½

చ. అనియిటు లక్ష్మణుండు క్రుధ♦నాడినమాటల నాలకించి వే
చని పయికొన్నశోకమున ♦ స్వాంతము దూలఁగఁ బిన్నతండ్రినిం
గని యిదె లక్ష్మణుం డలుకఁ ♦ గందుమనంబున వచ్చియున్నవాఁ
డని వచియించె; నంతట బ♦లాధికుఁ డంగదుఁ డాత్మ దూలఁగన్. ౩౫½ 1218

తే. లక్ష్మణునివాక్యములకు ను♦ల్లమునఁ జింత
వొడమ సంభ్రాంతుఁడై తెల్లఁ♦బోవు మోము
తోడ వేచని భక్తితోఁ ♦ గూడి యతని
చరణముల కట్టె మ్రొక్కుచు ♦ జనని కెరఁగి. ౩౬ 1219

క. పినతల్లియైన రుమ పద, వనజములకు నట్లె మ్రొక్కి ♦ వచ్చినపనిఁ దె
ల్పెను బూనగ్రుచ్చినట్టుగ;, వనచరపతి నిద్రమబ్బు♦వలన న్మఱియున్. ౩౬½

ఆ. మద్యపానజనిత♦మదమువలనను మై, మఱచియుంటవలన ♦ మరులుగొనుచు
బుద్ధి చెడుటవలనఁ ♦ బూనిననిద్రను, వనలకుండె నంత ♦ వానరులట. ౩౭½

చ. అనఘుని లక్ష్మణుం గని భ♦యాతురులై క్రుధ నూని యున్నయా
తనిని బ్రసన్నుఁ జేయుటకుఁ ♦ దారు కిలార్భటు లొప్పఁజేసి; రం
*త నతఁడు గొప్పప్రోదినిభ♦ంబున నడ్డము లేక వచ్చుటం
గని గుమిఁగూడి యొక్కమొగి♦గా ఘననాదము పెల్లురేఁగఁగన్. ౪౦ 1222

తే. అశనివజ్రంబులను బోని♦యట్టి సింహ
నాదమును జేసి రతనిచెం♦తను గపీంద్రుఁ
డాధ్వనికి మత్తుచేతఁ దా♦ మ్రాతుఁడగుచు
వ్యాకులస్రగ్విభూషణుం ♦ డగుచు బెదరి ౪౧½ 1223

ఆ. మేలుకొనియె; నంత ♦ మిగుల మంత్రాలోచ
నమున నేర్పుగలిగి ♦ నయమతులయి

* తే మహౌఘనిభం దృష్ట్వా-అనిమూలము. మహాప్రవాహతుల్యమ్-అని వ్యాఖ్య.

## ౩౨ - వ సర్గము.

హనుమ సుగ్రీవునకు హితము చెప్పుట.

క. అనవిని మతిమంతుండగు, వనచరపతి పుత్రమంత్రి ♦ వాక్యవిశతుల్
విని లక్ష్మణుండు కుపితుం, డని యెఱిఁగి వసించియున్న ♦ యాసనము దిగెన్. ౧

తే. మంత్రకుశలుఁడు గావున ♦ మంత్రవేత్త
లగుచు మంత్రంబులందె య♦త్యంతనిష్ఠ
గలిగి గురులాఘవంబులఁ ♦ దెలియఁజాలు
మంత్రులం గాంచి యిట్లని ♦ మాటలాడె. ౨ 1234

చ. పరుషములాడలేదు గరు♦వంబునఁ దప్పి సుమంతయేని యే
నరయుక చేయలేదు క్రుధ ♦ నందగనేలొకొ లక్ష్మణుండు దా
శరథిసహోదరుం డనుచు ♦ స్వాంతమునం దలపోయువాఁడ; నం
తరముల సర్వదా వెదకఁ ♦ దత్పరులైన మదీయశత్రువుల్. ౩౹ 1235

క. నిరతము దురాత్ములౌటం, దరుణం బిదె యనుచు దోష♦తతుల న్నాయం
దరసినదైనను గానం, దరంబుగానట్టివాని ♦ దాశరథికినిన్. ౪ 1236

క. తెలియంజెప్పియె యుందురు;, తలపోయుఁడు ముందుముందె ♦ తగ నీవిషయం
బుల బుద్ధినైపుణంబుల, గొలఁదిన్ సక్రమముగాఁగఁ ♦ గ్రుధకారణమున్. ౪౹

తే. దానికెయ్యది పరిహార♦మూని చేయఁ
దగునొ మనమిప్పు డివియెల్లఁ ♦ దథ్యముగను
దెలిసికొనఁదగు; లక్ష్మణు♦వలనఁ గాని
రామువలననుగాని నా♦కేమిదైన. ౫౹ 1238

క. కలుగునొ భయమని నే నా,కులపాటొందంగలేదు ♦ కుందును దానన్
గలుగదు రవంతభయమును;, జెలికాఁడగువాఁ డహేతు♦సిద్ధాగ్రహమున్. ౬

ఆ. కలిగి యున్నయెడలఁ ♦ గలుగకయుండునే, యెట్టివారికైన ♦ నెదను సంభ్ర
మంబు; మిత్రునొకని ♦ మహిని సంపాదించు, టధికసులభమైన♦యట్టిపనియె.

క. ఆమైత్రిని రక్షించుట, యేమాత్రము దుష్కరమగు ♦ నెన్న హృదయముల్
భూమి నొకరీతి నుండక, వేమఱు చపలంబు లగుచు ♦ వింతగ నుండున్. ౬౹

సీ. కాన నొక్కించుక ♦ యైన వైషమ్యంబు గలిగిన నయ్యది ♦ విలయ మొందు;
మహితాత్ముఁడగు రఘు♦మండనుం డనురక్తి నాకుఁ గావించిన♦ప్రాకటోప
కారమునకుఁ బ్రతీ♦కారము చేయంగ శక్యమేగాదు ని♦శ్చయము నేను
నీహేతువునకయి ♦ యే భీతినొందెద; నని చెప్పవనచరే♦శుని పలుకుల

తే. విని హరీంద్రుఁడు హనుమంతుఁ ♦ డనియె సచివ
మధ్యమంబునఁ దనయూహ ♦ మండితంబు

గాఁగ; నప్రమత్తుఁడవయి యుప♦కారకర్త
యైనరాముని నీయట్టి♦యనఘుఁ డెప్పుడు. ౯ 1242

క. మనమున మఱువక యుండుట, యనఘా యిది యుచితమంచు నైన♦నాశ్చర్యము గా
దు నృపా! ప్రకటించెద నా, జనపతి రాముండు నాశ్వ♦సనము నొందకయే. ౧౦

తే. త్వత్ప్రియార్థము శక్రుని♦వంటి శౌర్య,వంతు వాలిఁ జంపెఁ గీ♦ర్తై సమస్త
విధములం బ్రణయంబున ♦ చింతసేయ, మూఁడి త్రిజగన్నుతుని నెపు♦డాదరింపు మిటు.

క. నీయెడ్డకుఁ బుత్తెంచెను, నేయనుమానంబులేక ద♦హీనగుణాఢ్యా!
యోయగచరనాథా! విను, మీయాపదఁ గాలవిదుల♦కీవ తెలిసి నూ!. ౧౩

క. ఐనఁ బ్రమత్తుఁడవగుటన్, గానవు కాలంబుఁ జక్కఁ♦గాఁ జూచుచుఁ జెం
పూనిన సప్తచ్ఛదసం,తానంబున శ్యామమగుచుఁ ♦ దగువిధవమునన్. ౧౪

సీ. అలరు శరత్సమ♦యంబు వచ్చినయది నభమున మేఘసం♦తతి నశించె
నిర్మలకాంతుల♦నెగడెఁ దారాగ్రహంబులు దిక్కులును విది♦క్కులు నదులును
సరసులుఁ జాలఁ బ్ర♦సన్నములై యున్న వోహరిప్రంగవా! ♦ యుద్ధమునకు
యత్నము సేయంగ ♦ నగు తఱివచ్చెను దెలియకున్నావు; సం♦తృప్తిఁ బొంది

తే. యున్ననిన్నుఁ బ్రమత్తుగా ♦ నెన్ని లక్ష్మ
ణుండు వచ్చినవాఁడు గ♦మ్యంగొన నిను
స్పష్టమిది, యార్తుఁడై వ్యాత్త♦భార్యుఁ డగుచు
రాముఁ డమ్మహానీయుఁ డ♦రాతియముఁడు. ౧౫ 1247

క. పురుషాంతరమునఁ బంపిన, పరుషోక్తుల నీవు సైప♦వలయుం జుమ్మీ!
గురుతరమగు నపకార మొ,నరిచితి వీ వప్పటివచ♦నము దప్పుట చేన్. ౧౬

తే. కాన నంజలిఁ గీలించి ♦ మాననీయు
నతనిని బ్రసన్నునిగఁ జేయు♦నంతకంటెఁ
దగిన ప్రాచిత మొక్కటి ♦ యగపడదిఁక;
[1]హీనకృత్యము చేయుట ♦ యెట్లనఘ!. ౧౭ 1249

సీ. అవనిపాలనియుక్తు♦లైన మంత్రులు పతికెంతయు హితము నే♦యెపుడు ప్రీతి
బోధింప వలయుఁ గా♦వున నే నిపుడు భీతి వదలి తోఁచినరీతి ♦ వదరినాఁడఁ
జాపము కైఁదాల్చి ♦ భూపతి క్రుద్ధుండై యైనచో గంధర్వ♦లమరు లనుర
లమరఁ బొల్చెడు జగం♦బంతయుఁ దనవశంబయియుండునట్లు చే♦యంగఁగలఁడు

[2] తే. వనచరేశ్వర! యెవఁడు కో♦పంబు నొందు
నప్పుడు ప్రసన్నుగాఁ జేయ ♦ నర్హుఁ డగునో
యట్టిమహనీయుఁ గోపంబు ♦ నందఁ జేయ
రాదు; పూర్వోపకారస్మ♦రణమువలన. ౧౮ 1250

---

1 ఈపాదము వ్యాఖ్యయందున్న యర్థాంతరమునఁ జెప్పఁగు 2 నపక్షమః కోపయితుం యః ప్రసాద్యః పున స్త్వయా - అనిమూలము.

క. ధరణిం గృతజ్ఞుం డనఁగాఁ, బరఁగెడువాఁ డట్టివానిఁ ♦ బరికించి క్రుధం
దవ్వరపడువానిఁగఁ జేయం, గరాదు; వానరవిభూ! త♦గ నీవెలమిగా. ౨౦

క. తనయునితో బంధులతోఁ, జని యాతనిపాదములను ♦ స్వశిరము సోఁకం
గ నమస్కారము చేయుము;, పెనిమిటిఁ శమందు భార్య ♦ ప్రియ మలరారన్.

క. ఉండెడుగతిఁ దర్వశమున, నుండుము నీప్రతినఁ దప్ప♦కుండుము విద్వ
న్మండలము మెచ్చఁ దీర్పుము, దండితరిపువార! సూర్య♦తనయా! వినుమా!.

క. రామునివాక్యము గానీ, రామానుజవాక్యమైన ♦ రాజా! మదిలో
నేమాత్రమైన మీఱం,గా మంచిదిగాదు భూప♦కాంతుం డగుచున్. ౨౧౪

తే. శక్రవర్చనుఁడౌ రఘు♦సత్తమునియు
నతనియనుజునియును మహా♦స్త్రాళిబలము
మానుషంబగుబలమును ♦ మదిని నీకె
తెలిసియేయున్నయదిగద ♦ తృప్తిమీఱ. ౨౨ 1255

ముప్పదిరెండవ సర్గము సంపూర్ణము.

---

33 - వ సర్గము

అంతఃపురమున లక్ష్మణుని తార ప్రసన్నునిఁ జేయుట.

చ. అనిపలుకంగ నంతట స♦హస్రకరాత్మజుఁ డంగదాహ్వయుం
దనయునిఁ బంప రాఘవుని♦తమ్ముఁడు రామునిశాసనంబునన్
జని భయదంబుగాఁ దగి కి♦శాలగుహాకృతి నున్నయప్పురం
బును దవ్వరఁ జొచ్చె; ద్వారమునఁ ♦ బొల్చిరి భూరిబలుల్ మహాత్మనుల్. ౧౪

క. ఆవనచరు లాలక్ష్మణు, వావిరిఁ గని ప్రాంజలులయి ♦ భక్తి నిలిచి ర
ట్లావిధిఁ గ్రుద్ధుండై రఘు, భూవరపతిసోదరుండు ♦ పొంగెడు క్రుధచేన్. ౨

క. నిట్టూర్పులఁ బుచ్చుచుఁ బద, ఘట్టనముల ధరణి యద్రువఁ♦గా రాఁగని యా
దిట్టరిఁ గని భయపడి వా, రట్టె నిలిచి రతనిచెంత ♦ కరుగగ లేమిన్. 3 1258

సీసమాలిక:—

శ్రీమంతుఁడైన యా♦క్షితిపపుత్త్రుం డప్డు రత్ననిర్మితమయి ♦ రత్నమయము
లైన యంగళ్లతో ♦ నతిరమణీయమై పుష్పితకానన♦పుంజ మగుచు
భూరికందరమును ♦ బోలి చెన్నారెడు కిష్కింధఁ గాంచెఁ గ్రి♦క్కిరిసి యందు
*హర్మ్యసౌధంబులు ♦ నలరారుచుండెను విపణివీథులు చాల ♦ వెలసియుండె;
సర్వకామంబుల ♦ సతతంబుఁ దీర్చెడు ఫలవృక్షములు పుష్ప♦భారరమ్య
ములగు భూరుహములు ♦ విలసిల్లుచుండెను; దేవగంధర్వత♦తికి జనించి

---

* హర్మ్యప్రాసాదసంబాధామ్-అనిమూలము.

నట్టివారగుటచే ♦ నాత్మకాంతాసనములఁ గూర్చుంబులఁ ♦ బోలుచువారు
దివ్యమాల్యాంబర♦భవ్యభూషలు ప్రియసత్కృతులను ధరము♦నప్పుటనలు

తే. లునగు వానర లందందుఁ ♦ గనఁబడెఁ బొ
సంగమై యుండెఁ; జందనం♦బగరు పుష్ప
పద్మనామవిలేపన♦భవ్యవస్తు
వులు సువాసన లీయంగఁ ♦ బొలిచెఁ బురము. ౬. 1259

సీసమాలిక:—

మైరేయనామక♦మద్యంబులయు మధూకాహ్వయములగుమ♦ద్యములయు ఘన
వాసనల్ ప్రోవలఁ ♦ బరిణమింపుచునుండె, విమలజలంబుల ♦ వెలయుశైల
నదులెల్లఁ గ్రాలంగఁ ♦ బొదలుచుండెను నట్టిపురమును జూచె; నం♦గదుఁడు సుమిత్ర
తనయుఁ డంతట నంగ♦దునియు మైందద్వివిదులయు గవయగవా♦క్షులయు శరభ
గజులయు సంపాతి ♦ కపిదియు నల్ల విద్యున్మాలి పింబా♦హులయు మఱియు
సూర్యాక్ష, కేసరి♦శతబలి సుబాహులయు మహాత్ముఁడౌ నలునియు♦నల్ల కుముద
జాంబవద్వానర♦సత్తములయు సుషేణునియుఁ, దారునియు నీ♦లునియు నంత
దధివక్త్రునియు సునే♦త్ర సుపాటలులయు గేహంబులఁ గాంచె; మ♦హాత్ములగుచుఁ
గపిముఖ్యులును నయి ♦ క్రాలెడువీరికి రాజమార్గంబుల ♦ రమ్యములయి
యతులసారములయి♦యందంబులును నగు నాలయంబులు చెలు♦వారుచుండ
నతఁడు గనుంగొనె ♦ నయ్యవి పాండురజలదంబులట్లు ప్ర♦శస్తిఁ గాంచి
భవ్యమాలికలను ♦ భాసిల్లి ధనధాన్యనిబిడంబులయి, తను♦నీమణిప్ర
కీర్ణంబులయియుండెఁ; ♦ గిష్కింధనడుమను బాండురప్రాకార♦వలయితమయి
యితరదురాపమై ♦ యింద్రసౌధాభమై రమ్యమై తగు కపి♦రాజసౌధ
మును గాంచె నయ్యది ♦ ఘనతరకైలాసశిఖరాభములు గాఁగఁ♦జెలఁగుచున్న
ప్రాసాదశిఖరముల్ ♦ భాసిల్లుచుండంగఁ దెల్లనై వెలయుచు ♦ నుల్లములరఁ
జేయుచునుండెఁ; గాం♦క్షితముల నీఁజాలు ఫలపుష్పవృక్షముల్ ♦ పరఁగుచుండ
నందమై కనఁబడి ♦ యంతె మాత్రమె కాక యమరేంద్రుఁ డిచ్చిన♦యట్టివృక్ష
ములు నీరులోనఁగు మఁ♦బొలిచి నీలాబ్దంబులను బోలికొనుచుంబు♦లనుఫలములఁ
గ్రాలి శీతచ్ఛాయ ♦ గలిగి రమ్యములయి భాసిల్ల నాసౌధ♦వరము వెలయు
చుండెను; బలముల ♦ నొప్పి శస్త్రంబులఁ గరములఁ దాలిచి ♦ కపులు దాని
ద్వారంబుఁ గాచుచుఁ♦ దనరారుచుండిరి; మఱియు నయ్యదిదివ్య♦మాల్యములను
భాసిల్లుచుం దప్త♦ధర్మతోరణమున నలరారుచుండె మ♦హాబలుఁడగు
లక్ష్మణుం డాతఁడే ♦ లలితమై తగు కపివరుని సౌధంబు న♦వార్యమాణుఁ

తే. డగుచు సూర్యుఁడు జలదంబు♦నందుఁ జొచ్చు
కరణి నందుఁ బ్రవేశించె; ♦ నరగఁ గక్ష్య

లేదు గడచుచు సౌమిత్రి ♦ గూఢి యందు
నున్న జనసంఘములఁ గాంచు ♦ చురుజవమున. ౧౮ 1260

క. సంతతధర్మాత్ముఁ డతం, డంతట సంరక్షితమయి ♦ యరుదుగఁ గననౌ
నంతఃపురమును గాంచెను;, వింతగ నాసౌధమందు ♦ వెలయు స్థలములన్.

తే. హైమరాజతశయనంబు ♦ లనుపమాన
ములగు పఱపులుపఱచిన ♦ సులలితాస్త
రణము లెన్నెన్నొ మిక్కిలి ♦ రాజిలంగ
సౌధమది యద్భుతాకృతి ♦ జానుమీఱె. ౧౯ 1262

చ. త్వరపడి లోనఁ జొచ్చుచునె ♦ భవ్యనినాదముతోఁ జెలంగుచుం
గరమరుదైనవీణియలు ♦ క్రమగతుల్ దగ మీటుచు న్మనో
హరమగుతాళముల్ శ్రుతియు ♦ నంజముగా వినసొంటచే సమా
క్షరపదగీతము ల్వెలయఁ♦గా నదియుంటఁ గడుం బ్రియంబుగాఁ
బరఁగుచు వీనులం బడియెఁ ♦ బావనగీతము శ్రోత్రపాత్రమై. ౨౦ 1263

చ. వరబలుఁడైన లక్ష్మణుఁడు ♦ వానరరాజనికేతనంబునన్
సురుచిరవేషభూషలను ♦ శోభిలుచుం దగ రూపయౌవన
స్ఫురణము నంది చెన్నెసఁగు♦సుందరులం బలుమందిఁ గాంచె; భూ
వరనుతుఁడంత సాధుతమ♦వంశమునన్ జనియించి మించుచున్. ౨౧ 1264

[1]ఆ. చిత్రమాల్యములను ♦ సిగలనిండ ధరించి
మేటిభూషణముల ♦ మించి పండ్లఁ
గొనుటయందు మఱియుఁ ♦ గుసుమాళిఁ గట్టుట
యందు నేర్పు గలుగు ♦ నతివలఁ గనె. ౨౨ 1265

క. ధనధాన్యాదులఁ దృప్తిం, గని తమతమపనులయందుఁ ♦ గడు జాగ్రతనుం
గని వరభూషణధరులై, తనరెడు రాజానుచరులఁ ♦ దగ నటఁ గాంచెన్. ౨౩

క. సిరివెలయు లక్ష్మణుఁడు నూ, పురములకూజితము ముదముఁ ♦ బొందించెడు శ్రీ
కరకాంచీనాదంబును, బరిపరి విని [2]లజ్జ నొందెఁ ♦ బ్రాజ్ఞుఁడు కానన్. ౨౪

క. విని యాభరణస్వనముల, వనచరపతి సౌఖ్యవార్ధిఁ ♦ బరఁగుచు నున్నాఁ
డని యెఱిఁగి రోషవేగం, బున జ్యానినదంబు దెసల ♦ మ్రోగంజేసెన్. ౨౫

సీ. అమ్మహాబాహుఁ డ♦య్యదనున రామశోకసమన్వితుండయి ♦ కరము శీల
మున నపకృష్టుఁడై ♦ వనితలుండెడుస్థలమునకుఁ బోరాదని ♦ మనమునందుఁ
దలపోసి యేకాంత♦ధరణీస్థలంబున నుండె నంతటఁ గపీం♦ద్రుండు త్వరగ
నాచాపటంకృతి ♦ నరసి లక్ష్మణురాక యెఱిఁగి భీతింగొని ♦ నెఱిఁ దగు తన

---

1 ఫలమాల్యకృతవ్యగ్రాః-అనిమూ. 2 సౌమిత్రి ర్లజ్జితోఽభవత్-అనిమూ.

తే. యుత్తమాసనమున నుండి ♦ యత్తఱిఁ బ్లి
చలనముం గాంచె; నంతటఁ ♦ గలఁచె నిట్లు
పూర్వమంగదుఁ డన్నట్టి ♦ పోల్కి భ్రాతృ
వత్సలుండగు సౌమిత్రి ♦ వచ్చె నిదిగొ. ౩౫ 1269

క. తెలఁపంగ నుత్తమంబిది, కలదే చేయంగఁ గాక ♦ కార్యం బిఁక ని
మ్ములు నని యనుకొనుచుం గపి,కులపతి యంగదుఁ డనుచు ♦ కలఁచుచు ముందే.

తే. లక్ష్మణుని రాక వేగతు♦ల వ్వచింపఁ, దెలిసికొనఁదియో గాక ♦ కీర్తిశాల
తింజెలినిస్వనంబునఁ ♦ దత్తనుండు, తెలిసికొని నోటఁ బడితేక ♦ కలఁగె నతఁడు.

చ. హరికులపుంగవుం డపుడు ♦ యుక్తకరాజుఁడు భీతిచేతఁ దొం
దరపడుచుం బ్రమాదము ని♦తాంతము వీడి సమీపమందు ను
న్నరమణిఁ దారఁ గాంచి వచ♦నంబు హితంబుగ నొప్పఁ బల్కెఁ; నో
సరసిజనేత్ర! లక్ష్మణుని ♦ స్వాంతము నైజమృదుత్వమై తగున్. ౩౭ 1272

ఉ. కారణమేమొ కోపయుతుఁ ♦ గాంచి యతం డిట వచ్చినాఁడుగా
యారయ నేమి తోఁచెడిని ♦ నాత్మకు నీకు; నరిందితాంగి! యా
శ్రీ రఘురాము తమ్మునకుఁ ♦ జిత్తమునందు నకారణంబుగాఁ
జేరదు కోప మేయడన ♦ శ్రేష్ఠుఁడు పూరుషులందు నాతఁడౌ. ౩౮ 1273

క. ఏమైన నప్రియంబును, రామానుజుకట్లు నే వి♦రహితజ్ఞుఁడనై
యేమఱి చేసితయున్నే, నీమదికిం దోఁచె నొక్కొ! ♦ నీరజనయనా!. 33 1274

క. దీనిని బ్వరపడి నీవే, మానసమున నరసి చెప్పు ♦ మంజులచిత్తా!
వే నీవె పోయి యాతని, మానుగఁ గనుఁగొనుట నిపుడు ♦ మంచిది సుమ్మీ!.

చ. కనుఁగొని సామవాక్యములఁ ♦ గామిని! యాతనిను ప్రసన్నుఁగా
నొనరుపు; నిన్నుఁ జూడఁగనె ♦ యుక్తగతి వీడి ప్రసన్నచిత్తుఁడై
మనమునఁ గోపము న్మఱచు ♦ మానినులందు మహాత్ము లెత్తఱిం
గనరు మహోగ్రభావంబు నటు♦గావున వే చనుమా! మదర్థమై. ౩౪ 1276

సీ. తొలుదొల్త నీవేగి ♦ యల లక్ష్మణునితోడ సామవాక్యము లాడఁ♦జనును దాని
వలన నాతని ప్రియ♦స్వాంత మింద్రియములు సుప్రసన్నము లగు♦శోభనాంగి
కమలపత్త్రాక్షుని ♦ క్ష్మాపతిపుత్త్రుని శత్రుహంతను గనఁ♦జాలువాఁడ;
నని నాతారయు ♦ నడుగులు దతివడఁ దొట్రిలుచుండఁ ♦ బానమదము
వలన నేత్రములు వి♦హ్వలములై యొప్పంగఁ గాంచీగుణంబును ♦ గనకసూత్ర

తే. మును గ్రమంబున బ్రేలాడ ♦ మనసిజసుఖ
కేళిచిహ్నము లొప్పంగ ♦ లీల వినమి
తాంగయష్టికయయి రాఘు♦వానుజన్ము
చెంత కరిగెను; భయమునఁ ♦ జిత్తమదర. ౩౯ 1277

చ. మనుజపతీంద్రపుత్రుఁడయి ♦ మానితచిత్తుఁడు నోట లక్ష్మణుం
డనుగతభోగచిహ్నముల ♦ నల్లనవచ్చిన వానరేంద్రభా
ర్యను గని మోమువాంచి యిత♦రాంగన సన్నిధియౌటఁ గోపముం
గొనక, తదీయచిహ్నములఁ ♦ గొంచెమెయైనను జూడ కచ్చటన్. 36½ 1278

తే. తా నుదాసీనుఁడై యుండెఁ; ♦ దరుణి కేళి
చిహ్నములతోడఁ దాను వ♦చ్చియును మద్య
పానమదమున లజ్జను ♦ వదలి యతని
దృష్టితనరాకచేఁ గడుఁ♦దేట యగుట. 38 1279

చ. మునుమును సాంత్వనోక్తులఁ బ్ర♦మోదము శాంతము నంటఁజేయుచున్
ఘనతరమైత్రిచేఁ గడుఁ బ్ర♦గల్భమునై విపులార్థయుక్తమై
కనఁబడుమాట యొప్పఁ బలు♦కం దగఁ బూనె; నరేంద్రపుత్ర! నీ
కు నిపుడు కోపమూనుటకుఁ ♦ గూడినకారణమేదొ తెల్పుమా!. 40½ 1280

క. నీమాట నెవఁడుమీఱెను, దామున్దును వెనుకఁగనక ♦ తగ నెవ్వం డు
ద్దామవిశుష్కమహీరుహ, మై మించెడు నడవిలోన ♦ నతితీవ్రముగన్. 41

తే. మండుదావాగ్నికడకు న♦ఖండరీతిఁ
బోవఁగలఁడని పల్కి నా♦పూవుబోడి
*సాంత్వపూర్వముగాఁగ ని♦శ్శంకఁ బ్రణయ
దర్శితార్థంబుగాఁ బల్కె ♦ దాశరథియు. 41½ 1282

క. విని తారఁ జూచి యిట్లను, ననితా! పతిహితమునందె ♦ వర్తిల్లెదుగా
వునఁ బని యిదియని యెఱుఁగవు, వనచరపతి నీదుభర్త ♦ వైభవములరన్.

తే. కామవృత్తంబునందు ని♦కామమెలమి
తనరఁగా లుప్తధర్మార్థ♦తతియయి యిపు
డున్నవాఁ డిద్ది తెలియక ♦ యున్నదాన
వేమొ? తారా! భవత్పతి ♦ యించుకేని. 42½ 1284

క. తలపోయఁడు రాజ్యార్థం,బుల దుఃఖపరాయణత్వ♦మునఁ గుందు మమున్
గలనైనం దలపోయం, డెలమిన్ సామాత్యుఁడగుచు ♦ నెల్లప్పుడు తాన్. 43

క. తనబంధుజనంబులతో, మనమలరఁగఁ బానమునె స♦మస్తవిధములం
దనకుం బరమార్థవమా, వని సేవించుచుఁ జెలంగు ♦ నతిగర్వమునన్. 43½

చ. వనచరనాయకుండు గరు♦వంబున జానకిఁ జూడనంపు న
ప్పనికయి నాల్గుమాసములు ♦ పంతముమీఱఁ బ్రతిజ్ఞసేసి యొ
య్యన నవి దాఁటిపోయినను ♦ నాత్మ నెఱుంగకయున్నవాఁడు నూ;
వనితరో! యర్థధర్మముల♦పద్ధతి సిద్ధిని గోరియున్నచోన్. 44½ 1287

---

* మహార్థం పరిసాంత్వపూర్వమ్-అనిమూలము.

ఆ. ఇట్లు మదుపకార ♦ మెలమిఁ జేయుచునుంట, మెచ్చి ప్రకటముగను ♦ మిగుల నర్థ
ధర్మకామములను ♦ దమయంత నెఱిఁగించుఁ, దనకు నెవ్వఁడుపకృ ♦ తిని నొనర్చు.

క. వానికిఁ బ్రత్యుపకారము, మానక చేయుటను దాను ♦ మానినవాఁడెం
పూనినధర్మమునకుఁ గడుఁ, గానఁ గుఱి లోపమవనిఁ ♦ గాంతామణి! ౨౮

[1]సీ. ప్రత్యుపకారము ♦ పరమధర్మంబగు టరయక తాను జే♦యునెడలను
గుణవంతుఁడగునట్టి ♦ కూరిమిమిత్రుండు నశియించినప్పుడు ♦ నాకు మిగుల
నర్థకామంబులు ♦ నల్లన లోపించు ధర్మంబునందు స♦త్యంబునందు
స్థిరనిష్ఠ గలిగిన♦చెలికాఁడు ధర్మార్థములకు మూలంబయి ♦ యలరుచుంట

తే. వానికంటెను నెక్కుఁడౌఁ ♦ గానఁబట్టి, సఖుని విడనాడినాఁడు కీ♦శపతి గాన
నితని కర్థంబు కామంబు ♦ నిల్చె ధర్మ,మును నశించును నిక్క మో♦జనకతనయ!

తే. కార్యతత్త్వజ్ఞురాలవు ♦ గాన నీవు
ప్రకృతకార్యంబునందు నె♦ప్పుడిది మేము
చేయవలయునో యోచనఁ ♦ జెప్ప నేర్తు
వీవె తలపోసి చెప్పుమా! ♦ యింకమీఁద. ౨౯ 1291

మ. అని ధర్మార్థయుతంబు నైజముగనే ♦ యత్యంతమాధుర్యముం
గన న్యాయంబునునైన లక్ష్మణునివా♦క్యం బట్టె యాలించి త
మ్ముని రాముం డనుపంగ హేతువును వే ♦ బుద్ధిస్థిరత్వంబునం
గని విశ్వాసము పుట్టునట్లు పలికెం ♦ గాంతోక్తి సౌమిత్రితోన్. ౨౯ 1292

క. భూపకుమారా! వీరా!, నాపతి కామార్తుఁడయి మ♦నస్స్థైర్యంబున్
జూపట్టమి నుండుటచేఁ, గోపం బూనంగ నిపుడు ♦ గూడదు నీకున్. ౩౦

క. అతికోపము స్వజనునియం, దితరునిపై నెట్టులట్టు ♦ లిపు డుంపఁగనె
ట్లు తగున్?; మఱియును నాపతి, సతతము మీకార్యములనె ♦ సాధింపంగన్.

క. మనమున నాసక్తుండై, కనుఁగొనుచున్నాఁడు దాని♦క్రమముల నోరిఁ గా
వునఁ గామవశుండయి యు,న్న నా ప్రమాదముల నోర్వ♦న్యాయము మీకున్.

[2]సీ. వినుము రాజకుమార! ♦ వీర్యాదిగుణముల మిన్నయై తగువాఁడు♦మిగులహీన
సత్త్వుఁడౌ వానిపై ♦ సాధ్వసం బొనఁగూర్చు కోపంబుఁ బొందఁద♦గునె తలంప
సత్త్వావరుద్ధుఁడై ♦ శాంతియున్ దపమున కాకరంబైన మ♦హాపురుషుఁడు
నీవంటివాఁడు కో♦పావేశవశుఁడగు నెవ్వఁడు "నాకోప♦మే యెఱింగి

ఆ. దాని నాప నీవు ♦ పూనితి వేకాని, యయ్యమర్షమునకు ♦ నాకరంబు
లైనకారణముల ♦ నరయవుగా మది, ననకు" భూరినత్వ! ♦ యార్యవర్య!. ౩౯

---

1 అప్రతికుర్వతః, అర్థలోపశ్చ మిత్రస్య నాశే సుఃఖతో మహాన్, మిత్రం హ్యర్థగుణశ్రేష్ఠం సత్యధర్మపరాయణమ్, తద్ద్వయంతు పరిత్యక్తం నతు ధర్మే వ్యవస్థితమ్.-అనిమూ. దీనియర్థమే యిట వివృతమని యెఱుఁగునది. 2 మూలార్థము వ్యాఖ్యాభిప్రాయముతో నిట వివృతము.

చ. హరికులపుంగవుండయిన ♦ యర్కతనూజునకెంతొ మిత్రుఁడై
పరఁగు రఘుక్షితీశు మదిఁ ♦ బర్విన కోపము తత్స్వరూపముం
బరిపరి నేనెఱుంగుదును ♦ వానరనాథుఁడు సీతజాడ నె
క్కరణినినైనఁ గన్గొనఁగఁ ♦ గల్గినకోఁతులఁ బంపకీగతిన్. ౫౨ 1297

తే. వ్యర్థముగఁ బుచ్చెఁ గాలంబు ♦ నందువలనఁ
గల్గెఁ గోపమటంచుఁ ద♦త్కారణంబు
నెఱుఁగుదును; నీవు మాకుగా ♦ నేమహోప
కృతిని గావించినాఁడవో ♦ యే నెఱుఁగుదు. ౫౩ 1298

క. దానికిఁ బ్రతికృతిగా నే, మే నొనరింపంగఁదగునొ ♦ యెఱుఁగుదు దానిన్
మానవతిలకా! వినుమా!, మేనం బుట్టుచుఁ దగంగ ♦ మించుచుఁ గడఁకన్.

చ. తనరెడు కామవేదనకుఁ ♦ దాళఁగ రామియు నేనెఱుంగుదున్
మనసిజునార్తిచేతఁ గపి♦మండనుఁ డిప్పుడు సర్వకాల మే
వనితలఁ గూడియుండెడినొ ♦ వారినెఱుంగుదు; 'నీవు కోపముం
గనుటను జూడ మావలెనె ♦ కామవిహారములందు జ్ఞానముం
డినయటు తోఁపలేదు మది ♦ నీకు మహాత్మక! యాలకింపుమా!. ౫౮ 1300

సీ. కామతంత్రజ్ఞాన♦కలితుఁడనైనచో ద్వేషించియుండ ఏ♦తీరున ధరఁ
గామలోలునకును ♦ గాలము దేశము ధర్మార్థములు లే వ♦తండు వానిఁ
గనఁడు సుమా! శత్రు♦గణకాలరూప! నాచెంతనె యుండుచుఁ ♦ జిత్తమందుఁ
గామవృత్తంబునె ♦ కాంచుచు దానిచే సిగ్గనలేక ని♦శ్చింతనున్న

తే. నీసహోదరుఁ గపిరాజు ♦ నెమ్మిమీఱ
సైపుమా! ధర్మతపసులఁ ♦ జాల నాచ
రించు పరమర్షులే కామ♦సంచలితహృ
దయులునై కామినుల నెప్డు ♦ దగిలియుంద్రు. ౫౬ 1301

క. ఎప్పుడును నైజంబుగనే, చపలుండయి రాజునయిన ♦ సప్తాశ్వసుతుం
డపరిమితకామవృత్త, వ్యపగతచిత్తుఁడగుటేమి ♦ యాశ్చర్యమిఁకన్. ౫౭

చ. అని యిటు లప్రమేయుఁడగు ♦ నాతనితోడ మహార్థమైనవా
క్యనిచయ మాడి వే మరల ♦ క్ష్మాపతిపుత్రునిఁ గాంచి లీలఁగా
ననియెను; భావగర్వమున ♦ నంగముఁ దూలఁగ భర్తకున్ హితం
బును గలిగించునట్లు నర♦పుంగవ! సూర్యసుతుండు పూనికన్. ౫౯ 1303

తే. కామపరతంత్రుఁడయ్యు మీ♦కార్యసాధ
నవిషయంబున సత్ప్రియ♦త్నమును మున్నె

---

న కామతంత్రే తవబుద్ధి రస్తి త్వం వై యథా మన్యువశం ప్రపన్నః.-అనియూ.

చేసి వానరులకు నాజ్ఞ ♦ చేసినాఁడు
పటుపరాక్రమశాలురౌ ♦ ప్లవగవరులు. ౫౯ 1304

తే. కామరూపులు నానావి♦ధనివసతులు, నియుతకోటుల సంఖ్యల ♦ నెన్నమీఱ
వచ్చియున్నారు; లోపలి ♦ కిప్పుడమ్మ, రాణివాసమునకుఁ బోవ♦రాదటంచు.

చ. మనమున నెన్నిరీతులను ♦ మన్నన మీఱఁగఁ బ్రోచుకొంచు మీ
యనుపమనాథుఁ డర్థము ♦ నంతయుఁ దెల్పితి రిద్ది న్యాయమై
నను మనకున్న సఖ్యము మ♦నంబున నెన్నుచు మిత్రదారలం
గనుట యఘంబుగా దనుట ♦ గాదిలి ప్రేమఁ దలంపుమా విభూ. ౬౧ 1306

క. అనియె నరిందముఁ డగు నా, ఘనభుజుఁ డాలక్ష్మణుండు ♦ కాంతామణి ర
మ్మని పిలుచుట శ్రీరాముఁ, డని త్వరపెట్టుటను బోవఁ ♦ బ్రమదం బలరన్.

చ. చని యటఁ దప్తభర్మమయ♦చారువరాస్తరణాభిశోభితా
సనమునఁ గూరుచుండి తెగఁ ♦ దండనరీచునిఁ బోలియున్న య
వ్వనచరనాథుఁ గాంచె; నవ♦భవ్యవరాభరణంబు లొప్పఁగ
త్యనుపమరత్నచిత్రితప♦టాంగదముల్ పొలుపారుచుండఁగన్. ౬౩ 1308

చ. అరుదగురూపమొప్ప నతఁ♦డాయతకీర్తియుఁ జెన్నుమీఱ నం
బరములు మాల్యముల్ రుచిర♦భాయుతి నెంతయు వెల్గుచుండ ని
ర్జరపతివోలె దుర్జయుఁడు ♦ చారుతరాభరణాలిమాల్యవి
స్ఫురదసమానగాత్రలయి ♦ శోభిలు స్త్రీతతి సంయుతుండునై
పరఁగుచు నుండఁ గాంచె, రఘు♦వర్యసహోదరుఁ డంత నాతనిన్. ౬౪ 1309

క. వనితాసంగతి నుండిన, వనచరపతిఁ గాంచి కోప♦భరమున మిగులం
గనులెఱ్ఱఁబాఱఁగా ధ, న్వని బోలి భయంకరస్వ♦రూపుం డయ్యెన్. ౬౫

చ. నిరుపమహేమవర్ణుఁడయి ♦ నెమ్మి రుమం దగఁ గౌఁగిలించుకొం
చరుదయి దివ్యమైన వర♦మాసనమున్ దురపెట్టుఁడై మనో
హరసువిశాలనేత్రుఁడయి ♦ యారవిపుత్రకుఁ డాయతాక్షుఁడై
పరఁగు రఘూత్తమానుజుని ♦ బాణశరాసనహస్తుఁ గాంచెఁ దాన్. ౬౬

ముప్పదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౩౪ - వ సర్గము.

లక్ష్మణుఁడు సుగ్రీవునకు రాము నానతి నెఱిఁగించుట.

ఆ. అంతిపురముఁ జొచ్చి ♦ యప్రతిహతగతి, వచ్చియున్న పురుష♦వర్యు రాము
ననుజుఁ గాంచి వనచ♦రాధీశుఁ డెంతయు, వ్యథితచిత్తుఁడయ్యె ♦ నంతలోన. ౧

సీ. అన్నకుఁ గలిగిన ♦ యధికవ్యసనమునఁ బరితపించుచుఁ గోప♦పరవశుఁడయి
*నిశ్శ్వసమానుఁడై ♦ నిజతేజమునఁ బ్రజ్వలించెడులక్ష్మణుఁ ♦ గాంచి యుత్త

* క్రుద్ధం నిశ్శ్వసమానం తం - అనిమూలము.

సుగ్రీవుఁ డెంతయు ♦ శోభిల్లు కనకాసనమునుండి యుఁకి యిం♦ద్రధ్వజంబు
వలె నిలుచుండె; న♦భంబున సంపూర్ణశశి యుదయింప న♦క్షత్రగణము
తే. లతనివెంటనె యుదయించు♦నట్లు లినజుఁ
డాసనమునుండి లేవఁగ ♦ నతనివెంట
రుమయు మొదలుగఁ గల్గు భీ♦రువులు లేచి;
రంత మధుపానమదమున ♦ నర్కజుండు. ౧ 1313

క. కనులెఱ్ఱఁబాఱ సంపద, తనరారఁ గృతాంజలియయి ♦ దాశరథి నెదు
ర్కొని గురుకల్పద్రుమభం,గిని నిలుచుండెను మనంబు ♦ కీడ్పడుచుండన్. ౨

క. వనితాసమూహమధ్యము,మున రుమతోఁ గూడి భగణ♦ముల యంతరమం
దున నున్నచంద్రువలె నొ,ప్పిన సుగ్రీవుఁ గని యంతఁ ♦ బెనుకోపమునన్. ౩

క. పలికెన్ లక్ష్మణుఁ డిట్లని, బలవంతుఁడు సత్కులమునఁ ♦ బ్రభవిల్లి మహా
ర్తులయెడఁ గరుణచెలంగఁగ,నలరుచు విజితేంద్రియుండు♦నయి కృతవిదుఁడై.

క. ఋతవచనుండయి పొల్చెడు, క్షితిపతి పూజ్యుండు సుమ్ము ♦ స్థిరపై నేభూ
పతి ధర్మేతరమార్గ,స్థితుఁడై యుపకర్తలైన ♦ చెలికాండ్రకుగాన్. ౫ 1317

క. అనృతప్రతిజ్ఞ సేయునొ, మనుజేంద్రుని కతని కన్న♦మఱి పాపిష్ఠుం
డనఁదగినవాఁడు మేదిని, గనరాఁ డొకగుఱ్ఱమునకుఁ♦గా నెవఁడైనన్. ౬ 1318

చ. అనృతము పల్కనేని యతఁ ♦ డశ్వశతంబు వధింపఁగల్గు నా
ఘనతరదోషమొందును నిఁ♦కన్ ధర గోవిషయంబునందు నే
మనుజుఁ డసత్యమాడునొ క్ర♦మంబున ధేనుసహస్రము న్వధిం
చినయఘమొందు, నేనరుఁడు ♦ చిత్తమునందుఁ దలంప కొయ్యనన్. ౭

క. నరువిషయంబున ననృతము, పరఁగించునొ యాత్మహత్య ♦ స్వజనహననమున్
నిరతిం జేసినపాపము, నరుఁడాతఁడు గాంచు; రాము♦నకు సుగ్రీవా!. ౮ 1320

క. అనృతప్రతిజ్ఞ సేసినఁ, గననౌ పాపమును జెప్పఁ♦గాఁ దరమానే;
వనచరనాథా! మును తన, పని నొనరించుకొని మిత్ర♦పటలికి మరలన్. ౯

తే. మాటచొప్పున వారిన♦మ్మతముఁ దీర్ప
కుండునో యట్టిమనుజుఁడె ♦ యుర్విలోఁ గృ
తఘ్నుఁ డనఁబడు సర్వభూ♦తములు వానిఁ
జంపఁగావచ్చు దోషలే♦శంబు లేదు. ౧౦ 1322

క. మును స్వాయంభువమను వో, వనచరనాథా! కృతఘ్ను♦వారక కని లో
కనిచయపూజిత మగుచుం, దనరెడు నీశ్లోకమును గ్రం♦థం బరయించెన్. ౧౧

*సీ. వినుము పఠించెద ♦ మనువు జెప్పినశ్లోకమును నేను; "బ్రహ్మహ♦త్య నొనరించి
నట్టివానికిని, మ♦ద్యంబుఁ ద్రాగినవాని కక్లై స్వర్ణంబును ♦ నపహరించి

* శ్లోకార్థ మీసీసపద్యమున విస్తృతమని యెఱుంగవలయు.

క. తనపతిని గూర్చి పలుకఁగ, విని తారాధిపనిభాస్య ♦ వినయవతియునై
తనరాఁగ తారయిట్లనె; ననఘా! యిటుచెప్పరాదు ♦ హరికులపతినిన్. ౧
క. నాపెనిమిటి యీతీరున, నీపరుషోక్తులకు నర్హుఁ♦డే గాఁడుసుమీ
యోపురుషతిలక! యందును, నీపగిది భవాదృశోక్తి ♦ కెట్లర్హుఁడగున్. ౨
*క. వనచరపతి సుగ్రీవుం, డనఘ! కృతఘ్నుండు శఠుఁడు ♦ నతిదారుణుఁడున్
అనృతకథుండును గుటిలుం, డును గాఁడు మహాత్మ! వీఁడు♦ను కపిపతి మదిన్.
క. తనకు రఘురాముఁ డితరుల, కును జేయఁగరానిమేలు ♦ కోరికయుద్ధం
బునఁ జేసిన దేమాత్రం, బును మఱచఁగలేదు; రామ♦మూర్తికరుణచేన్. ౪
తే. కీర్తి శాశ్వతమైన యీ♦కీశరాజ్య
మును బరంతప! రుమను న♦న్నును దగంగఁ
బొందెఁ; బూర్వము బహుదుఃఖ♦ములను గడిచి
యున్నవాఁడౌట నిప్పు డ♦భ్యున్నతముగ. ౫। 1338
క. అలవడినయట్టి సౌఖ్యం, బులవలన న్మేనకాఖ్యఁ ♦ బొందె తనతపం
బుల మఱచిన కౌశికముని, వలెఁ గాలము ప్రాప్తమైన♦పథ మెఱుఁగఁడు సూ!.
మ. మును ధర్మాత్ముఁడు కౌశికుండు స్మరస♦మ్మోహంబున న్మేనకా
ఖ్యను గామించి దశాబ్దముల్ పగలుగా ♦ నాత్మం దలంచెంగదా?
ఘనతేజంబునఁ బొల్చు నాఘనుఁడె తాఁ ♦ గాలజ్ఞులం దగ్రుఁడై
య్యును గామంబునఁ బ్రాప్తకాలమును దా♦నూహింపఁడయ్యెం జుమీ!. ౭
తే. అతనిగతి యిట్టులుండంగ ♦ నన్యుని విష
యమునఁ జెప్పంగవలెనె! యో♦యనఘ! యితఁడు
చాలకాలము శ్రమముల ♦ నోలిఁ బొంది
దేహధర్మములం జిక్కి ♦ తృప్తిఁ గనక. ౮। 1341
క. స్మరతాపచంచలతఁ గని, నిరతం బున్నాఁడు గాన ♦ నీవీతనిదా
గురుతరమగు నీతప్పును, బరికింపక సైపవలయు ♦ భవ్యమనీషా!. ౯ 1342
క. వినుమో తండ్రీ! యీతని, వినిశ్చితార్థంబు నీవు ♦ విదితంబుగ ని
ద్దని తెలియక ప్రాకృతుఁడగు, జనునివలెన్ రోష మొందఁ♦జనదు మహాత్మా!.
చ. పురుషవరేణ్య! సత్వయుతిఁ ♦ బొల్చి భవాదృశులై మహాత్ములౌ
పురుషులు కారణంబులను ♦ బోలఁ దలంపక సత్వరంబుగా
వరమతి నేఁచు నాగ్రహము♦బారికిఁ జిక్కరు; ధర్మవేత్తవై
పరఁగుదు వీవు నేను నిను ♦ భర్తృహితంబును గోరి వేఁడెదన్. ౧౧। 1344
క. పనిపూని సుప్రసన్నుని, గను జేయఁదలంచుదాన ♦ గాఢక్రోధం
బునఁ గల్గిన సంరంభం, బును దీనిన్ విడువవయ్య ♦ మ్రొక్కెద నీకున్. ౧౨

* నైవానృతకథో వీరః-అనిమా.

చ. తన ప్రియమిత్రుఁడౌ దశర♦థప్రియనందను ప్రీతికై సుమన్
ననుఁ గపిరాజ్యము న్విడిచి♦నంబుగ ధాన్యము విత్తము న్పురం
బును గలిగించు నస్త్రగణ♦ము న్విడనాఁడు నటంచు నామనం
బునఁ బొడకట్టుచున్నయది ♦ పూన్కి. రణంబున రావణాసురున్. ౧౪ 1346

చ. అనిహతవిక్రమంబు తగు♦నట్లు వధించి మహీజతోడ రా
మునిఁ దగఁ గూర్పఁ గాఁగలఁడు ♦ మోదముతో ప్రియపత్ని రోహిణిం
గని జతగూడు చంద్రుగతి ♦ క్ష్మాపతి పోయిగ నుండు నింక సీ
తను దవిఁ గూడి; కోపమునఁ దగు♦దానవనాథుని కత్తిరంబునన్. ౧౫ 1347

సీ. అట శతకోటిస♦హస్రము ల్పృథ్వీజ యుతముల్ సైన్య మ♦య్యసురనాథు
కుఁ గలండు నిదిగాక ♦ దనుజవీరశతంబు లక్షల సన్నాహుల స♦హస్రములును
విఖ్యాతిగుచుండు ♦ వీరితో వారెల్లఁ గాముకావ్యులు వారిఁ ♦ గలన నోర్వఁ
దరముగా దేరికి ♦ దనుజవీరుల వారిఁ జంపక సీతను ♦ కార్యమున గ్ర

తే. హించుకొని పోయినట్టి లం♦కేశుఁ జంప
నలవియేగాదు; తద్దను♦జుల రణమునఁ
జంప శక్యంబుగాదు ల♦క్ష్మణ! మఱియును
నిస్సహాయత సినజుఁడు ♦ నిలిచి యనని. ౧౬ 1348

క. క్రూరక్రియుఁడౌ దానవ, వీరుని రావణుని విగత♦వీర్యునిఁ జేయం
గారాదు, దనుజవార్తల, వీరుండగు వాలి నాకు ♦ వివరించెఁ దమిన్. ౧౭

చ. హరికులపుంగవుండయిన ♦ యామహితాత్ముఁడు వాలి రాక్షసే
శ్వరువిషయంబులం దెలియ♦వాఁడగుటన్ మునుమున్ను నాకు నా
దరమున నిట్లు చెప్పె మును; ♦ దానవువార్తల నేనెఱుంగ నే
వరునను వింటినో యటుల ♦ వారక చెప్పెద నాలకింపుమా!. ౧౮ 1350

క. మీకు సహాయము చేయుట, కై కదనము సేయఁ బెక్కు♦కపులను బ్లవగా
నీకాధిపతులఁ దోడ్కొని, యీకిష్కింధకును రాఁగ ♦ నెందఱో వీరుల్. ౧౯

తే. పరపఁబడి యున్నవారు త♦పనతనూజుఁ
డితఁడు శౌర్యాధికులయి య♦హీనబలులు
నయినవానరవీరుల ♦ యాగమనముఁ
జూచుచుండుట రామునిఁ ♦ జూడరాఁడు. ౨౦ 1352

తే. రామకార్యంబు తీరుప♦రానికార
ణమిది యోలక్ష్మణా మున్నె ♦ కుమనుత వెద
కంగఁ బంపుటకై ప్లవ♦గబలమెల్లఁ
బంచదశరాత్రములకు లో♦పలనె యిటకు. ౨౧ 1353

క. తప్పక రాఁదగుననియును, దప్పినచో మరణశిక్ష ♦ దప్పదనియు ని

ట్లొప్పుగ నేర్పఱచెను నా, చొప్పున రావలయు నేఁడె ♦ శుంభత్ప్లవగుల్.

సీ. అరిసూదనా! జన్మలి ♦ తాంగులౌ ప్లవగులకోటులు మఱివేయి ♦ కోటు లెలుఁగు
బంట్లు గోలాంగూల ♦ వరములు వందలకొలఁది నిప్పుడె వచ్చి ♦ కొలువఁగలరు;
నినుఁ గానవా గ్రహం ♦ బును మా నుమావానరాధిపు ప్రియభార్య ♦ లందఱు భవ
దీయవక్త్రముఁ జూచి ♦ తెంపున వాలిని జంపినభయమును ♦ స్వాంతములను

తే. ననుభవించినవారలె ♦ యాట శంక
నొందుచుం గ్రుధ రక్తమ ♦ ట్లొప్పు నీదు
కనులఁ గాంచుచు శాంతినే ♦ గనకయున్న
వారు గావునఁ గాపాడ ♦ వలయు వీరి. ౨౩ 1355

ముప్పదియైదవ సర్గము సంపూర్ణము.

---

## ౩౬ - వ సర్గము.

లక్ష్మణుఁడు సుగ్రీవునితో సరసముగ మాటలాడుట.

చ. అని యిటు తారయెంతొ విన ♦ యంబున ధర్మహితంబుగా వచిం
చినవచనంబుల న్వినుచుఁ ♦ జిత్తము సాజముగానె మార్దవం
బును హితమై చెలంగుటను ♦ బొందుగ వానికి సంతసించి మో
మున స్మిత మంకురింపఁ గృపఁ ♦ బూని ప్రసన్నత నొందె నంతటన్. ౧ 1356

క. తనసతిపల్కులకా తఁడు, మనమున నలరుటయుఁ గీశ ♦ మండనుఁ డట నా
తనివలనిభీతిఁ జలిచేఁ, దనువకకం జేయుచున్న ♦ తడివస్త్రంబున్. ౨ 1357

ఆ. వదలునట్టు మాని ♦ మది సంతసించె; న, వ్వానరేంద్రుఁ డంత ♦ స్వగళమందు
భోగదంబుఁ జిత్ర ♦ మునగు దివ్యకుసుమ, మాలికను ద్యజించి ♦ మమత వదలె.

చ. వనచరనాయకుం డయిన ♦ భాస్కరపుత్త్రుఁడు భీమసత్త్వుఁడై
కనఁబడులక్ష్మణుం గుఱిచి ♦ గాఢముదంబు చెలంగునట్లుగా
వినయము తోఁపఁ బల్కెఁ; బృథి ♦ వీపతిపుత్త్రక! నన్నుఁ బాసి పో
యిన సిరి కీర్తియున్ స్థిరత ♦ నెంతయుఁ బొల్చెడు కీశరాజ్యమున్. ౪ 1359

చ. మరల భవత్సహోదరు న ♦ మానుషభవ్యదయన్ లభించె; భీ
కరరిపుసూదనా! స్వకృత ♦ కార్యమునం బలుకీర్తిఁ గన్న య
ప్పురుషవరేణ్యుఁడైన రఘు ♦ పుంగవుఁ డింద్రజు నొంచునట్టు నే
ను రమణ నొందఁజూపిన య ♦ నూనపరాక్రము మెన్న శక్యమే?. ౫ 1360

క. దానికిఁ బ్రత్యుపకారం, బేనరుఁ డొనరింపఁగలఁ డ ♦ హీనజవమునన్
దానవుఁ జంపి మహీశుఁడు, జానకినిం బొందఁగలఁడు ♦ స్వబలమువలనన్. ౬

క. నేనును సహాయమాత్రం, బే నిలిచెద నంతెకాని ♦ యేఁ జేయంగా
నౌనే? కార్యము; శైలం, బానింగిని దాఁకు భూరు ♦ హాము లే డిలయున్. ౭

క. రామునియొకబాణంబున, నేమాత్రంబేని నిల్వ♦కే చెడిపోఁ గదా
యామాన్యుని కితరుండా, పామరునాహాయ్యమేమి♦పని నోనఁగూర్పన్. ౮

చ. ధనువును మ్రోయఁజేయఁగనె ♦ తత్క్షణికిన్ గురుశైలయుక్త మే
దినియె వడంకె నట్టిగురు♦ఘోరనకం బనియె మొకల్లతో
మనుజవరేణ్య! వైరియగు♦ముత్తనువాని వానిసైన్యముల్
ఘనతరశక్తిఁ జంపుటకుఁ ♦ గా రఘునాథుఁడు ముందు పోవఁగన్. ౯ 1364

సీ. అతనివెంటనె పోవ ♦ నర్హులమే మేము విశ్వాసమునఁగాని ♦ విపులమైత్రి
వలననుగాని యే♦నరునసైనను మిత్రమిూఁజివర్తించిన ♦ మీకు సేవ
కుఁడ నౌట నాయందు ♦ గుణ్యసాధ్యముల్ కల్గిన నవ్వానిఁ ♦ గరుణ నైన
వలయును, భూమినె♦వ్వఁడుగాని తప్పుఁ జేయనివాఁడు లేఁడు సు♦మ్మనుచువనచ

తే. రేశుఁ డీరీతిఁ జెప్పఁగ ♦ హృష్టుఁడగుచు
దాశరథి యాతనిం గాంచి ♦ దయ వచించె;
నాథుఁడవయి విశేషవి♦నయము గల్గి
యున్నవాఁడవు గాన నా♦యన్న యెన్న. ౧౦ 1365

తే. అన్నిటఁగన సనాథుఁడే ♦ యయ్యెఁ జుమ్ము
నీప్రభావము శౌచము ♦ నియతి నెన్న
నుత్తమోత్తమకపిరాజ్య♦మొంది దీని
సిరిని బొంద నర్హుండవె ♦ హరికులేశ!. ౧౧ 1366

క. నీవే సహాయపడఁగా, నోవనచరనాథ! వేగ ♦ యుద్ధంబున నా
రావణముఖ్యుల రిపులన్, శ్రీవరుఁ డతివిక్రముఁ డగు♦సీతాపతియున్. ౧౨

క. నుఱుమాడఁగలఁడు నీసికి, నఱిమరయే లేదు; భాస్క♦రాత్మజ! నీవి
త్తఱిఁ జెప్పినవాక్యము ధర, వఱలెడు ధర్మాళి నెఱిఁగి ♦ భవ్యాత్ముండై.

క. కృతవిదుఁడై యుద్ధంబుల, నతిశౌర్యము మీఱ వెనుక♦నంజ యుడనియ
ప్రతిముండు చెప్పఁదగినది, హితమైనదిగాఁ దెలంగె ♦ నిది సత్యముగన్. ౧౪

క. వనచరసత్తమ! నినురాముని దప్పు మఱొక్కవీరు ♦ భూమిని శక్తిం
దనరి స్వదోషములను నొప్పినవానిం జెప్పనగునె ♦ వెదకి కనినచోన్. ౧౫

క. బలవిక్రమముల రాముని, వలెఁ జెలఁగుదు వీవు దేవ♦వశ్యులు నిను మా
కెలమి సహాయునిగా నిమ్ముల నిచ్చిరి లేకయున్నఁ ♦ బొందఁగ నెటులౌ. ౧౬

క. త్వరపడి యిటనుండి కపీశ్వర! నాతోఁగూడ నీవు ♦ వచ్చి స్వభార్యా
హరణమునఁ గర్శితుండగు, పరమాప్త వయస్యు రామ♦భద్రుని మిగులన్.

చ. సరసవచస్థితిం దనిపి ♦ చయ్యన నూఱడిలంగఁ జేయుమా
నిరతము దుఃఖభారమున ♦ నిండి వచించిన రామువాక్యముల్

పరిపరి యాలకించుటను ♦ స్వాంతము దూలుట నేను నిన్ను ని
వ్వరుసఁగ దారుణోక్తులను ♦ బల్కితి వాని క్షమింపఁగాఁదగుర్. ౨౦ 1373

ముప్పదియాఱవ సర్గము సంపూర్ణము.

---

## 32 - వ సర్గము.

సుగ్రీవుఁడు వానరుల రావించుట.

క. ఈమాడ్కి మహాత్ముండగు, సౌమిత్రి వచింపఁ గీశ♦సత్తముఁ డంతర్
సామీరిని బార్శ్వస్థితుఁ, డా మంత్రిని గాంచి పలికె ♦ సాదరభణితిర్. ౧

సీసమాలిక:—

హిమవచ్ఛిఖరిని మ♦హేంద్రవింధ్యాద్రులఁ గైలాసశైలశి♦ఖరమునందు
సితశిఖరంబయి ♦ చెలఁగు మందరమున నీవైదుశిఖరుల ♦ నెసఁగువారిఁ,
బడమరదిక్కునఁ ♦ బాథోధితీరంబునను బాలసూర్యవ♦ర్ణముల వెలుఁగు
చుండు పర్వతముల ♦ నుండువారిని, మఱి సంధ్యాభ్రతుల్యమై♦సప్తహాయుఁడు
పొడనూపునుదయాఖ్య♦భూమీధ్రమునఁ బద్మతాళవనంబునఁ ♦ దనరుచున్న
హరిపుంగవుల, నల్లై ♦ యంజనాంబుదతుల్యకాంతులై కుంజర♦కాండతుల్య
తేజసులయి యప్ర♦తిమపరాక్రములయి యంజనాద్రివసించు♦నట్టి ప్లవగ
వరులను; మేరుభూ♦ధరపార్శ్వముల మనశ్శిలలచేఁ దగిన గు♦హలవసించు
కనకతుల్యప్రభా♦కలితవానరులను ధూమ్రపర్వతమునఁ ♦ దోఁచువారిఁ;
దరుణభాస్కరతుల్య♦తనుకాంతి యలరార మైరేయమనఁబడు♦మద్యమును ము
దంబునఁ ద్రాగుచు ♦ దారుణవేగంబు గలిగి మహారుణా♦ఖ్యగిరి నున్న
వానరులను; రమ్య♦వాసన ల్వొలయంగఁ దగు మహావనములఁ ♦ దనరుచున్న
ప్లవగవర్యుల ముని♦పటలివాసంబులౌ రమ్యస్థలంబుల ♦ రంజిలుచును
వసియించు వనచర♦వరులను మఱియును బుడమి నందందును ♦ బొదలుచున్న
కపుల నందఱిని వే♦గంబున రప్పింపు; సామాద్యుపాయముల్ ♦ చతురరీతిఁ
బన్ని వానరులఁ బి♦ల్వంగ సమర్థులౌ కపులఁ బంపుము; నే ము♦నుపు మహాజ

తే. వులగు దూతలఁ బంపితిఁ ♦ గలిసికొనుచు
వారిఁ ద్వరపెట్టి వానర♦వరులఁ బిలుచు
కొనుచు రాఁగను బెక్కండ్రఁ♦గోఁతులఁ ద్వర
జనెడివారిని బంపుమా ♦ శ్వసనతనయ!. ౧౦ 1375

క. కామసుఖాసక్తులునై, సోమరులయి యున్నకపుల ♦ శుంభద్గతిచే
నేమఱక యందఱిని వే, వే మామకశాసనమును ♦ వినిపించి తగర్. ౧౧

తే. తోడుకొని రమ్ము నాయాజ్ఞఁ ♦ ద్రోచి యెవఁడు
పదిదినంబుల కిటరాఁడొ ♦ పరఁగ వాని

దుష్టమతి రాజశాసన♦దూషకుఁ డని
చంపవలయును నినుసంత ♦ క్షమఁ దలఁపక. ౧౩ 1377

ఆ. శతసహస్రకోటి♦సంఖ్యలుగా నిట, నున్నవానరసమస్త ♦ లోకములు
వెదలి కపులనెల్ల ♦ వేగమ తోడ్కొని, వచ్చుటకయి చనఁగ♦వలయు దెసల.

క. ఘనములవలె నద్రులవలెఁ, గనుపట్టుచు భయదరూప♦కలితులగుచు ను
న్ననిఖిలకపివర్యులు నా, పనుపున నిటనుండి గగన♦భాగము నెల్లన్. ౧౩౪

క. క్రమ్మెదువారిం బోలుచు, నిమ్మహిఁ గన నగుచు వేగ ♦ యెల్లదిశలకున్
సమ్మదమునఁ జని భూభా,గమ్మున వానరులచోట్ల ♦ గలయ వెదకుచున్. ౧౮౪

ఆ. వారలుండుచోట్ల ♦ వారకెఱింగి, వారలోటఁ బోయి ♦ వనచరులను
బిలుచుకొనియిటకును ♦ వేగవత్తురుగాక, నాదుశాసనమున ♦ నయగుణాఢ్య.

చ. అనియిటు పల్కు సూర్యసుతు♦నాజ్ఞను వాయుకుమారుఁ డంజనా
తనయుఁడు తెన్నుగా విని ని♦తాంతపరాక్రమవంతులైన యా
వనచరపంక్తి దిక్కులకుఁ ♦ బంపెను; వారును రాజునానతిన్
గని పతగాళి తారకలు ♦ గ్రాలు నభంబునఁ బోయి రప్పుడే. ౧౭ 1382

క. జలరాశిద్వీపంబుల, నిలాధరములందు వనుల♦నెల్ల సరసులం
గలయం గ్రుమ్మరి వారం, దలరెడు కోఁతులకు రాజు♦నాజ్ఞఁ దెలుపుచున్.

క. శ్రీరాముని కార్యార్థము, చేరం జనవలయుఁ బిరికి♦శీఘ్రమ యని య
వ్వీరులు తెల్పఁగ వానర, భూరమణుఁడు ప్రళయమృత్యు♦వున కీడనుచున్.

క. వనచరులంతఱు రాజా,జ్ఞను వినినంతనె భయంబు ♦ చాల గదురఁగాఁ
జనుదెంచి; రంత రాముని, గనికయి శ్రీరాముఁడున్న♦పర్వతమునకున్. ౧౯౪

క. అంజనగిరినుండియె యప్రు, డంజనసంకాశతనువు ♦ లలరుచు నుండం
గం జనుదెంచిరి శౌర్యం,బుం జవమునుగల త్రికోటి♦ముఖ్యవనచరుల్. ౨౦

చ. నరసిజబాంధవుండు తన♦ఛాయ యడంగఁగ నస్తమించునే
ధరవర మట్టియస్తగిరి♦తల్లజసీమలనుండి తప్తభా
స్వరకనకాంగముల్ గలుగు♦వానరులున్ దశకోటిసంఖ్యచే
గరము జవంబు మీఱ నృపుఁ♦గానఁగ వెల్వడి రాతురంబునన్. ౨౧ 1387

తే. సింహకేసరవర్ణమ్ము ♦ చెలఁగ వెండి
కొండశిఖరంబులను నుండి ♦ దండికపులు
వేయికోటులు వచ్చిరా♦వేళ మఱియు
మూలఫలముల భక్షించి ♦ క్రాలుకపులు. ౨౨౪ 1388

క. హిమవత్పర్వతవనతులు, గమనజవం బొప్పుచుండఁ♦గా వచ్చిరి భూ
పమహితశాసనమున నీ,క్రమముల దశలక్షకోట్లు ♦ కడుమోదమునన్. ౨౩

తే. వింధ్యపర్వతమునుండి ♦ భీమకర్ము, లతిభయంకరరూపులు ♦ నైనకపులు
వేగమున వచ్చి రచటికి ♦ వేయికోట్లు, వారికాంతు లంగారక♦వర్ణములగు. ౨౪

క. క్షీరాబ్ధితీరవాసులు, నాహూతతమాలవనము♦నందుండు కపుల్
సారతరనారికేళా,హారులుగాఁ దద్వనమున ♦ నలరువనచరుల్. ౨౫ 1391

క. అరుదెంచిరి వేగమ వన,చరు లవ్వారల గణింప ♦ శక్యముగా దా
సరసిజసూతికినైనను;, నరణ్యములనుండి గిరిగు♦హలనుండి వెసన్. ౨౬

తే. నదులనుండియు వచ్చె వా♦నరగణంబు
దినకరుని మ్రింగఁబూనిన♦తెఱఁగు దోఁప;
వానరులఁ బిల్వ నీలుచేఁ ♦ బంపఁబడిన
మొనటికపివర్యు లతిజవ♦మునను బోయి. ౨౭ 1393

క. సుమహితవృక్షౌఘంబౌ, హిమవత్పర్వతముఁ గాంచి ♦ రెల్లసురల కెం
తో ముదంబును గూర్చుచు ది,వ్యమురమ్యమునౌ మఖంబు♦హారదైవతముల్.

క. గిరియందందు న్మనుపాక, తరుణమున నొనర్పఁబడియెఁ ♦ దద్యజ్ఞంబే
ధరణిం జేయఁగఁబడియెనొ, కరము పవిత్రమగు నచటి♦త్యాస్థలమందున్. ౨౯

సీ. హోమకాలమ్మున ♦ నుర్వి జాఱిపడిన యాజ్యాదులవలన ♦ నట జనించి
యమృతమువలె రుచు♦లలరఁగఁదగియున్న ఫలమూలములఁజూచి♦రెలమితనర;
నాఫలంబులను మూ♦లాదుల నొకమాఱు భక్షించు నెవ్వఁ డ♦వ్వల నొకనెల
పర్యంత మాఁకటి♦బాధనొందక తృప్తిఁ గనుచుండు; నాకపి♦కాంతు లచటి

తే. ఫలములను మూలముల దివ్య♦ముల గ్రహించి
రక్లై దివ్యౌషధులఁ గూడ ♦ నతిముదమునఁ
సంగ్రహించిరి ఫలముల ♦ సంతతంబుఁ
దినెడువారౌట; నంత న♦వ్వనచరులొగి. 3౦ 1396

క. సరసిజబంధావ్తత్మజునకుఁ, గరము ప్రియంబంచు నందుఁ♦గల ఫలమూలో
త్కరములు సురభిసుమంబులు, పరికించి గ్రహించి వేగ ♦ వచ్చిరి పురికిన్. 3౨

చ. వనచరవీరులందఱును ♦ వానరసంఘమునెల్లఁ బిల్చి య
వ్వనచరపంక్తికంటె వెస ♦ వచ్చిరి ముందె గపీశునొద్దకున్
అనిలజవంబు మీఱఁ జను♦నట్టి స్వభావము గల్గువారు కా
వున నలవానరుల్ రవిభ♦వుండలరారు పురంబు నాదృతిన్. 33 1398

తే. లక్ష్మణుం డున్నయట్టి కా♦లంబునందె
వచ్చి చేరిరి; వారు ది♦వ్యంబులైన
ఫలములను మూలముల నోష♦ధులను గొన్క
గా సమర్పించి పల్కి రి♦క్కరణిఁ బతికి. 3౪ 1399

చ. పరుగిడి చూడ్కికింపగుచు ♦ భవ్యతరంబగు నాకృతి న్మనో
హరమగు శిల్పముల్ తనరు♦నట్టి ఘనంబగుపల్లకిం గరం
బరుదుగఁ దెచ్చి; రంతఁ బ్లవ♦గాధిపుఁ డయ్యది రాఁగఁ గాంచి భూ
వరుఁగని లక్ష్మణా! శిబిక ♦ వైళమె యెక్కుము పోదమంచనన్. ౧౦౪ 1409

చ. కనకమయంబు తీవ్రరుచి♦కల్పమునై పృథుకాయులైనయ
వ్వనచరపంక్తివాహ్యమును ♦ భాసురమై తగుదానినిన్ జవం
బునఁ బ్లవగేంద్రుతోడ రఘు♦పుంగవసోదరుఁ డెక్కె; నంతటన్
దనతలపైఁ జెలంగుచు సి♦తద్యుతిఁ బొల్చెడు ఛత్ర మొప్పఁగన్. ౧౨ 1410

సీ. చారుతరశ్వేత♦చామరము ల్వీవ శంఖభేరీమహా♦స్వనములొప్పఁ
బ్లవగపుంగవులు కై♦వారమ్ము లొగిఁ జేయ నుత్తమరాజ్యసం♦పత్తిఁగూడి
కపిపతి వెడలె; భీ♦కరతేజులై శస్త్రహస్తులై శతసంఖ్య ♦ నగచరేంద్రు
లిరుగెలంకులఁ గొల్చి♦యింపారఁ బలుకంగ రాముండు వసియించు♦రమ్యశైల

తే. తటమునకుఁ బోయె; రాఘవుం ♦ డటవసింపఁ
బావనంబయి మించు భూ♦భాగపరిస
రమును జేరి మహాతేజుఁ♦డు మురమొప్ప
శిబిక లక్ష్మణుతోఁ దిగె ♦ శీఘ్రగతిని. ౧౦౬ 1411

క. వనచరపతి యిటు శ్రీరా,ముని సన్నిధి కేగి హస్త♦ముల జోడించెన్
వనజసఖాత్మజుఁ డట్లుం,డ నిఖిలకపులెత్తి రట్లె ♦ నైజకరములన్. ౧౦౭ 1412

చ. సరసిజకుట్మలంబులను ♦ జారుతరంబగు సత్తటాకమె
క్కరణిఁ జెలంగునట్లు కర♦కంజములెత్తిన కీశసైన్యమున్
గురుతరముం గనుంగొనుచుఁ ♦ గుందుతొలంగఁగ నారఘుక్షితీ
శ్వరకులవార్ధిచంద్రుఁ డట ♦ వానరనాథునిఁ గాంచెఁ బ్రీతితోన్. ౧౦౮ 1413

చ. వనచరనాథుఁ డంత రఘు♦వర్యునిపాదములందు మస్తకం
బు నునిచి మ్రొక్క రాఘవుఁడు ♦ మోదమునన్ బహుమానయుక్తిచే
తను దగ లేవనెత్తి తన♦దగ్గరఁ జేరిచికొంచుఁ గౌఁగిటం
దనుపుచుఁ గూరుచుండుమని ♦ ధర్మమనం బలరారఁ బల్కెఁ దాన్. ౧౯

క. తనయానతి నంతట న,వ్వనచరపతి గూరుచుండె ♦ వసుధపయిని; నం
త నతనిఁ గని రాముం డి,ట్లనియె న్వనచరవరేణ్య! ♦ యాదృతి వినుమా!.

తే. ధర్మ మర్థకామంబులు ♦ తగినయట్లు
గాఁగ విభజించి యాయాయి♦కాలములను
దానిదానిసేవించునో ♦ ధరణి నతఁడె
రాజనం దగువాఁడు వీ♦ర! రవిపుత్ర!. ౨౦౪ 1416

తే. గొందఱు పరార్ధసంఖ్యల♦కోఁతులను ద
గంగఁ దోడ్కొని విక్రమ♦కలితులగుచు
వచ్చుచున్నారు; రాజేంద్ర! ♦ వాసవాభ
శౌర్యముల నొప్పి మామక♦శాసనమున. ౩౧ 1424

తే. మేరుమందరసంకాశు♦లై రఘుపతి
వింధ్యమేరువులందు నే♦వెఱపులేక
కాపురంబుండువారు నీ♦కార్యమునకుఁ
గాను వచ్చుచునున్నారు ♦ కదలి యిటకు. ౩౨ 1425

చ. దనుజపతిన్ సబాంధవుని ♦ దారుణసంగరమందుఁ జంపి సీ
తను దమకున్ సమర్పణము ♦ తా నొనరింపఁగలట్టి ధైర్యముం
గనెడు కపీశ్వరు ల్చెలఁగి ♦ గాఢరయంబున వచ్చుచున్నవా
రన మతిమంతుఁడౌ రఘుకు♦లాధిపుఁడుం దనశాసనంబునన్. ౩౩ 1426

[1]క. హరిపతిచేసినయత్నం, బరుదుగఁ గని మోదమంది ♦ వ్యాకోచమనో
హరనీలోత్పల నిభసుం, దరదర్శనుఁ డగుచుఁ బొల్చెఁ ♦ దద్దయుఁ గాంతిన్.

ముప్పదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ౩౯ - వ సర్గము.

### వానరసైన్యములు గూడుట.

చ. కరములు మోడ్చి యిక్కరణిఁ ♦ గా వినయంబునఁ బల్కుచున్న కీ
శరమణు బాహుయుగ్మమును ♦ జాఁచి మహామతి ధార్మికుండునై
పరఁగు రఘూత్తముండు తమిఁ ♦ బట్టఁగఁ జాలక కౌఁగిలించి యి
క్కరణి వచించె; దేవగణ♦కాంతుఁడు వృష్టిని గల్గఁజేసినన్. ౧ 1428

తే. భాస్కరుఁడు చీఁకటులు పోవఁ ♦ బ్రజలకాంతిఁ
బర్వఁ జేసిన నది తత్స్వ♦భావ మగుటఁ
జిత్రమేమాత్రమును గాదు ♦ శీతరశ్మి
రశ్మితతిఁ జేయు భూమిని♦ర్మలముగాఁగ. ౨ 1429

క. అతని కిది సహజమగుటన్, క్షితిఁ జిత్రముగాదు మదిని ♦ గృతమెఱుఁగుచు మి
త్రతతికిఁ బ్రత్యుపకృతి స,న్మతిని భవాదృశులు సేయ ♦ మైకొనుట గనన్. ౩

ఆ. సహజకర్మ మగుట ♦ మహిఁ జిత్ర మనరాదు
సౌమ్య! మిత్రులకు నె♦సంగు వేడ్క
నుపకృతులను జేయు ♦ టొకవింతగాదు నీ
వెపుడు ప్రియములాడి ♦ యెల్లరకును. ౪ 1431

1 ప్రబుద్ధనీలోత్పలతుల్యదర్శనః-అనిమూ.

క. మనమలకు కార్యములఁ జేయుచు నెప్పు డెవండు చేయు ♦ నాతండు దెలియుమన్;
విను ప్రియమిత్రా. నాయం, బును జేయుచు నితం డుండు ♦ బూనికమెఱయన్.

క. అరివర్గంబును నే సంగరమున నిర్జించెదను; ♦ గరుణ చెలంగ ను
స్థిరసుకీర్తివయి మిత్రత్వముఁ, బురస్కరించుకొని వ్యాప్య♦మును నాశికతోన్.

క. ఒనరింపందగుదువు; మును పు నిర్జరేంద్రుని మోస♦పుచ్చి శచిం బులో
ముని యనుమతిని గైకొని, మనమునఁ గనకున్నయట్టి ♦ మహ్మసనాడ్రిన్.

సీ. అపహరించెను నను♦ష్లోముఁ; డాకితేఁగా రాక్షసనాథుఁడు ♦ రావణుండు
నన్ను వంచించి జా♦నకియొంటినుండంగఁ గొనిపోయెఁ దనపాప్ర♦కారముష్ట్రు
శచి ననుష్లోముండు ♦ సరగున హరియింప నింద్రుల కనుమతి ♦ నొందియున్న
శచితండ్రి నతిద్రృప్తు ♦ సన్మార్గహీనుని నాపులోముని నమ♦రాధిపుండు

తే. చంపినట్లుగ నేనును ♦ సంగరమున
శితశరంబుల దనుజుని ♦ శీఘ్రముననె
సంహరించెద; ననుచున్న ♦ సమయమందె
గగనమునఁ దీవ్రమగు సూర్య♦కాంతిఁ గప్పి. ౨౪ 1435

క. పెనుధూళి రేఁగె; దానన్, గనఁబడకేయుండె దిశలు ♦ కానఁదభూమీ
ధ్రనిచయయుతభూమియునో, య్యనఁగంపము నొందె మిగుల♦ నంతటఁ బలుచన్.

క. గిరివరతుల్యాకారులు, గురుబలు లతితీక్ష్ణములగు ♦ కోఱలచే భీ
కరముగఁ గన్పడువారలు, కరము కుదుగ నున్నయట్టి ♦ కపులు ధరిత్రిన్. ౧౦

ఆ. క్రమ్మి వచ్చి నిలిచి ♦ రమ్మహాత్ముల, సంఖ్య నిర్ణయింపఁ ♦ జాలకుండె;
నంతక్షణములోనె ♦ హరియూథపులు శత, కోటిపరిచరులను♦గూడి వేగ.

సీసమాలిక:—

కామరూపులు మహో♦గ్రబలులునై వాయుజలదసమాన ని♦స్వనము లొప్పఁ
బర్వతభవులునై ♦ వలినుల తీరంబులందుఁ బుట్టుకగల♦యట్టివారు
సాగరతీరసం♦జనితులునయి వనచరులయి యున్నవా♦నరులు వచ్చి
ధరణి నాచ్ఛాదించి ♦ దారుణాకారముల్ వెలయ నిల్చిరి; గురు♦వీర్య మలర
శతబలియను వన♦చరపతి సిరి గుల్క మేరుపర్వతవాసు♦లై రయంబు
గలిగి బాలార్కుని♦కాంతిసమానవర్ణంబులు తనరఁ జం♦ద్రసమగౌర
కాంతులు వెలయంగఁ ♦ గన్రపంజకేసరచ్ఛాయ లొప్ప సి♦తచ్ఛవు లాగి
మెఱయఁ బౌరుషమున ♦ మించుచుఁ బొల్చెడు పదికోట్ల వానర♦వరులఁగూడి
కనఁబడియెను; మేరు♦వును బోలు దేహంబు గ్రాల వీర్యంబును ♦ గలిగి తార
జనకుఁడైన సుషేణుఁ♦డును బదికోట్లు పెక్కులు గల్గు కపిసైన్య♦ములనుగూడి
చనుదెంచి కన్పడె; ♦ వనచరపతికి మామయు రుమకెన్నఁ దం♦డ్రియునగు బల
శాలి తారుఁడు కపి♦సైన్యముల్ శతకోట్లు సేవింపఁగా వచ్చి♦చేరె; మఱియు

సరసిజకేసర♦సంకాశుఁడయి బాలభానువక్త్రుఁడయి ♦ వానరాధి
పతియయి బుద్ధివై♦భవమునఁ దగి సిరి యలర కేసరియును♦నాహ్వయమునఁ
దనరుచు హనుమునకుఁ ♦ దండ్రియై తగు వానరాధీశుఁ డచ్చటి ♦ కరుగుదెంచెఁ
బెక్కుసహస్రక♦పివరసేనలఁ గూడి యలరి గోలాంగూల♦ములకు రాజు
భీమవిక్రమమున ♦ వెలయువాఁడును నగునట్టి గవాక్షాహ్వయుఁ♦డపుడు వేయి
కోట్ల వానరసేనఁ ♦ గూడి వచ్చెను శత్రుహంతయగు ధూమ్రుఁ డ♦త్యంతభీమ
వేగులౌ భల్లూక♦వీరుల ద్విసహస్రకోటుల నెంతయుఁ ♦ గూడి వచ్చె;
వనచరసంఘాధి♦పతి మహావీర్యసంపన్నుఁడై తనరు నా♦పనసుఁ డద్రి
వరతుల్యులై భయం♦కరరూపులై తగు నగచరకోటిత్ర♦యంబుఁ గూడి
వచ్చెను; గాటుక♦వలె నల్లనైన భీమాకృతిఁగల నీలుఁ ♦ డనుకపిపతి
పదికోట్లకపులు గొ♦ల్వఁగ వచ్చె; మేరుపర్వతసన్నిభుండయి ♦ వితతశౌర్య
బలుఁడయి యొప్పు గ♦వయుఁడను హరిపతి పంచకోటికపులఁ ♦ బ్రౌఢబలులఁ
గలిసివచ్చెను; మఱి ♦ బలవంతుఁడగు దరీముఖుఁడుకోటిసహస్ర♦ముఖ్యకపులు
తనతోడ రాఁగ వ♦చ్చెను; నశ్విపుత్రులై యాయతబలులయి ♦ యలరుచున్న
మైందద్వివిదులను ♦ మహితవానరు లిర్వు రొగిఁ గోటికోట్లు త♦న్నుఁగొలువంగ
వచ్చి చేరెను; మహా♦బలవీర్యతేజముల్ గలగజుఁడనువాఁడు♦కపులుమూఁడు
కోటులు తన్నొగిఁ ♦ గొలిచి రావచ్చెను; వర తేజుఁడౌ జాంబ♦వంతుఁ డనెడు
భల్లూకపతియును ♦ బదికోట్లసేనతో వచ్చి సుగ్రీవుని ♦ పరిసరమున
నిలిచె; శౌర్యంబునఁ ♦ జెలఁగి బలంబునఁ దనరు రుమణ్వంతుఁ ♦ డను కపిపతి
శతకోటి వనచర♦సత్తములం గూడి జవమున సుగ్రీవు♦సన్నిధికిని
వచ్చెఁ గోటిసహస్ర♦వనచరుల్ లక్షకోటులు కపుల్ తన్నును ♦ గొలువ గంధ
మాదనుండును వచ్చె♦మఱియును బితృతుల్యబలపరాక్రమములఁ♦బరఁగునంగ
దుఁడు యువరాజును ♦ గడఁగి సహస్రపద్మములును శంఖశ♦తములు కపులు
తనుఁ గొల్వవచ్చె;నం♦తటఁ దారకాకాంతి గలిగి భీకరపరా♦క్రమము వెలయఁ
దారుసకును బ్రియా♦త్మజుఁడునౌ తారుండు పంచకోటిహరులు ♦ బలసికొలువ
వచ్చి దూరంబున ♦ వనచరపతికిని బొడకట్టె; వీరుఁడై ♦ పొలిచి పదునొ
కండుకోట్ల ప్లవంగ♦కాంతుల కధిపుఁడై తగు నింద్రజానుఁ డ♦య్యగచరులను
గలిసివచ్చెను; బాల♦కమలాప్తసన్నిభుం డగురంభుఁ డయుతస♦హస్రశతస
మాగచరులఁ గూడి ♦ యరుగుదెంచెను; వీరుఁడై బలసంపన్నుఁ♦డై చెలంగు
దుర్ముఖుండను కపీం♦ద్రుఁడు రెండుకోట్లవానరులను గూడి తా♦నరుగుదెంచె
గైలాసశిఖరంబు♦కరణి నాకారంబు భయదవిక్రమమును ♦ భాసిలంగ
నలరు వానరవర్యు♦లతిముదంబున వేయికోట్లుగొల్వఁగఁ గపి♦కుంజరుఁ డగు
హనుమంతుఁ డచ్చట ♦ నవ్వానరేంద్రుని పరిసరమునఁ బొల్చెఁ; ♦ బరమవీర్య
సంపన్నుఁడై బల♦శాలియై తగునళుఁ డగచరుల్ శతకోటు ♦ లావరింప

దనుజులతోడ దైత్యులవి♦తానముతోడను దుల్యమై తన
ర్చిన బలశౌర్యసారములఁ ♦ జెందిన యూథపతుల్ మహాప్రభూ!. ౫॥ 1441

తే. శౌర్యసారుల బహువేగ♦సహితులను వ,నచరవీరులఁ గూడియు♦న్నారు; వీరు
మున్నొనర్చినకృత్యముల్ ♦ సన్నుతింపఁ,దగిన వన్నియుఁ జాల శ♦స్తంబు లగుట.

సీ. బలవంతులును శ్రమం♦బుల మీఱువారును శౌర్యకృత్యములయ♦శంబుఁగన్న
వారును, వ్యవసాయ♦పరులునై యున్నారు బహువిధపర్వత♦వారిభూమి
చరులు నాకింకర♦సత్తముల్ కోటులకొలఁదిగాఁ జనుదెంచి ♦ కూడియున్న
వారు; శ్రీరఘురామ!♦వీరు నాయాజ్ఞలో మెలఁగుచుందురు గురు♦వులకు నేమి

తే పనులు వలయునొ వానినె♦ప్పగిదినైనఁ
జేయఁజూచుచు నుందురు ♦ శీఘ్రముగనె;
వీరిఁ జూడుము! నాయూథ♦వీరు లిపుడు
భయదవిక్రమవనచర♦పటలిఁ గూడి. ౬॥ 1443

క. చనుదెంచిరి కావున నె,ప్పని యిప్పటి కుచితమనుచు ♦ బాగుగ మీనె
మ్మనమునకుం దోఁచునొ దా,నిని జేయఁగ నానతిమ్ము ♦ నృపకులతిలకా!. ౭

క. ఇదియంతయు నీసైన్యం,బెదిచెప్పినఁ జేయఁబూను ♦ నిఁక నీయిష్టం
బొదవునొ యప్పని యంద,య్యది యాజ్ఞాపింపఁదగు, మ♦హాత్మా! రామా!.

క. ఈవానరు లొనరింపం,గా వలసిన కార్యమేను ♦ గలరూపున నే
వావిరి నెఱుఁగుదు నైనను, నీవే యానతినొసంగు ♦ నృపగణపూజ్యా!. ౮

చ. అనియిటు పల్కుచున్న ప్లవ♦గాధిపునిం దమి మీఱుచుండఁగాఁ
దనకరముల్ నిగుడ్చి గుణ♦ధాముఁడు రాముఁడు గౌఁగిలించుకొం
చుననియె నిట్లు, ప్రాజ్ఞవర! ♦ సూనృతవాక్యరతా! *ధరిత్రిలో
జనకజ యున్నదో? యముని♦సద్మము చేరెనొ? నేనెఱుంగనొ. ౯॥ 1447

క. దనుజేంద్రుఁడు రావణుఁడే, జనపదమున నున్నవాఁడొ ♦ చక్కఁగ నేనా
జనపద మెఱుఁగందగు వీ,నినెఱింగినపిదప నేను ♦ నినుఁ గూడి తగన్. ౧౦

క. ఒనరింపఁదగిన కృత్యం,బును జక్కఁగ లోఁ దలంచి ♦ వూనెదఁ జేయం
గను; వానరేంద్ర! నేను మ,దనుజుఁడు నీకృత్యవిషయ♦మై యుంచుకయున్.

క. అనుమతి నిడువారముగా, మనఘా! యీకార్యమునకు ♦ నధికారివి నీ
వె నియామకుఁడవె నీవే, వనచరనాథా! మదీయ♦భావము నెల్లన్ ౧౧॥ 1450

ఆ. ఎఱిఁగి నీవె యాజ్ఞ ♦ యీఁదగు నాకార్య,మెవ్విధంబొ దాని♦నెల్ల నెఱుఁగఁ
జాలుదీవు సుమ్ము! ♦ సంశయంబె లేదు, సహజునటు, ద్వితీయ♦సఖుఁడవు గద!.

తే. శౌర్యసంపన్నుఁడవు ప్రాజ్ఞ♦సత్తముఁడవు
కాలవిదుఁడవు నాహిత♦కార్యముల నె

---

* జ్ఞాయతాం మమవై దేహీ యది జీవతి వా నవా-అనిమూలము.

చేయఁ జూతువు కృతకృత్యసం♦సిద్ధి నెఱుఁగఁ
గలవు మఱి యర్థవేత్తవ♦గలుగుమతివి. ౧౪ 1452

. అని రాముఁడు పల్కఁగ నా, వనచరపతి రాఘవుం డ♦భాసురమతి యా
తనిసహాజుఁడు వినుచుండఁ,గను బర్వతములు నెలయు ♦ కాయము వారిన్.

క. ఘనతుల్యనినాదుండై, వనచరపతి యురుము నొప్పు♦వానిం గనుచున్
గని పల్కె; దేశకాలముల నెఱిఁగి తమ్ముఁ గ్రసీతుఁ♦డం డెల్లముగన్. ౧౬ 1454

క. మనమున నెన్నుచుఁ గార్యం,బు నకార్యము నిశ్చయించి ♦ భూరిబలమునం
గనుపట్టి వేగముల నొ,ప్పిన లక్షప్లవంగవరులు ♦ నెంటఁ దగఁగన్. ౧౭ 1455

ఆ. సోమసూర్యవంశ♦జులగు వానరులతోఁ, గలిసి శైలపికవ♦కాననముల
వెలయు తూర్పుదెసకు♦ వేగంబ చను మందు,నదుల గిరిశిఖరవ♦నముల యందు.

క. జనకజ యుండెడితావును, దనుజాధముఁ డుండు నట్టి♦స్థలమును మీరల్
వనిఁ బూని వెదకి చూడుఁడు;, మనోహరంబైనయట్టి ♦ మందాకినినిన్. ౧౯

క. సరయువుఁ గౌశికి యమునా,తరంగిణిని దాని చెంతఁ♦దగు పర్వతమున్
గర మొప్పైన సరస్వతి, వరసింధు తుల్యోదకముల ♦ భాసిలుదానిన్. ౨౦

తే. పావనంబుగఁ జూపట్టు♦భవ్యనదిని
శోణభద్రాఖ్యనదమును ♦ శుభతరమగు
నట్టి మహియను దేశంబు ♦ నద్రికాన
నములఁ దగు కాలమహి యన ♦ నమరుదాని. ౨౧ 1459

తే. బ్రహ్మమాల, విదేహరా♦ష్ట్రముల, మాళ
వములఁ గోసలములఁ ♦ గాశి నములకీర్తి
నలరుచున్న మహాగ్రామ♦ములఁ దగు మగ
ధములనుం బుండ్రవంగాహ్వ♦యముల నెల్ల. ౨౨ 1460

ఆ. కోశకారనృపతి♦కుంజరులకు రాజ,ధాని యైన పురముఁ ♦ దగ రజతము
నకును నాకరమగు ♦ ప్రకటభూమినిఁ గాంచి, యచటిస్థలములెల్ల♦వరసి యరసి.

క. రాముని ప్రియభార్యను, సా,ధ్వీమణి దశరథునిస్నుషను ♦ వెదకుఁడు సీతన్
మీమీ నేర్పులు తగఁగా, నామాట ఫలించునటులొ♦నర్పం దచటన్. ౨౪

క. జలనిధిమధ్యస్థలములఁ, గలపర్వతములను, మఱి న♦గరముల నెల్లన్
లలితాయతమందరగిరిఁ, గలశిఖరంబులను భీతి♦కరులగు మనుజుల్. ౨౫ 1463

సీ. ఆశ్రయించియె యుందు♦రందుఁ గొందఱు కర్ణహీనులు మఱికొంద♦ఱన్ని చూడఁ
బెదవులయందును ♦ విస్తృతకర్ణముల్ గలవారు కొంద ఱు♦గ్రతరలోహ
మయముఖుల్ కొందఱు♦మనుజులు జవమునఁ జనువారలయ్యును♦జరణ మొకటి
గలవారు మఱికొంద ♦ ఱెలమిని మనుజుల భక్షించి యక్షయుల్♦బలము గల్గు

ఆ. వారు నగుచు నుంద్రు; ♦ వీరుగాక మఱియుఁ, గర్ణచూడులగుచుఁ♦గనకరుచిర

తనువు లలరఁ జూడఁ ♦ దగియున్నయట్టి కి,రాతులున్నవారు ♦ భీతిదులయి. ౨౭

ఆ. పక్వరహితమాంస♦భక్షకులయి ద్వీప,ముల వసించి సలిల♦ముల యడుగున
సంచరింపఁజాలి ♦ సగము మనుష్య దే,హంబు సగము వ్యాఘ్ర♦మట్టు లమర.

క. అతిభయదాకృతు లొప్పఁగ, క్షితిని గిరాతులు తగఁ జ♦రింతురు మీరు
ద్ధతి వారిగృహములందుఁ, క్షితితనయన్ వెదకవలయుఁ ♦ జిత్తనిపుణతన్.

క. పనివడి జంబూద్వీపం,బున నీగతి వెదకి యెగిరి ♦ పోఁదగినవి తె
ప్పను దాఁటి పోవఁదగినవి,యును నగు ద్వీపములు పెక్కు♦లున్నవి సుండీ!.

సీ. మీర లచ్చటికేగి ♦ మించెడు శ్రద్ధచే నన్నల రత్నము♦యంబు నగుచు
సప్తరాజ్యవిభాగ♦సమధికంబయి తగునట్టి యవద్వీప♦మందుఁ దనరుఁ
గాన నచ్చటికేగి ♦ కలయంగ వెదకి యచ్చటనుండి పయనమై ♦ జాతరూప
మయములౌ గనులచే ♦ మండితంబయి యొప్పునట్టి సువర్ణరూ♦ప్యకమనంగఁ

తే. బరఁగు ద్వీపమ్మునకుఁ బొందు ♦ నరగ మీర
లాయవద్వీపమును దాఁటి ♦ నమరదనుజ
సేవితంబయి యభ్రంబు ♦ శృంగముల స్పృ
శించు నగమొండు గలదందు ♦ శిశిరమనఁగ. ౩౦ 1468

క. దానింగని వెదకుండట, జానకి నాద్వీపముల నె♦సంగు గిరులనుం
గాననముల దుర్గములను, నానిర్ఝరములను గీర్తి ♦ నలరెడు సాధ్విన్. ౩౧

చ. జలనిధి నిట్లు దాఁటి చని ♦ సత్వర మవ్వలియొడ్డుఁ జేరి సి
ద్ధులు మఱి చారణుల్ గొలువఁ ♦ దోయము రక్తముగాఁ జెలంగ ని
మ్ముల జనమొప్ప లోఁతునయి ♦ ముఖ్యమునై తగు శోణభద్రమం
చిలఁదగు నానదంబుకడ ♦ కేగి యటం దగు రేవులం దొగిన్. ౩౨ 1470

[1]చ. వనములయందు నెల్లెడల ♦ వారిజనేత్రను జానకీసతిన్
దనుజుని రావణాసురుని ♦ దత్పరత న్వెదకుండు, ప్లక్షమం
చు నెగడు ద్వీపమందుఁ గల♦సుందరనిష్కుటజాలమందుఁ జ
క్కనిగిరిజప్రవాహములఁ ♦ గమ్రదరీయుతపర్వతావళిన్. ౩౪ 1471

క. వనములయందును రావణు, జనకజనున్ వెదకుఁ డంతఁ ♦ జటులోర్మిమయం
బును మరుదుద్ధూతంబును, ఘననిస్వనయుతము నగుచుఁ ♦ గ్రాలెడు కంధిన్.

క. కని దాని భయదతటములఁ, గనఁబడు ద్వీపములనెల్లఁ ♦ గలయవెదకఁగాఁ
జను,నయ్యిక్షుసముద్రం,బున గురుతనువుల్ చెలంగ ♦ భుజగర్వములన్. ౩౬

క. తనరుచుఁ జిరకాలముగా, ఘనమగు క్షుద్బాధపొలయఁ♦గాఁ దగు నసురుల్
వనజజని వరముఁ గాంచుట, [2]వనిశము ఛాయల గ్రహించి♦యమ్మూలమునన్.

1 మార్గితవ్యా దరీ మంతః పర్వతాశ్చ వనానిచ-అనిమూలము. 2 తత్రాసురామహాకాయా శ్ఛాయాం గృహ్ణంతి నిత్యశః-అనిమూలము.

ఆ. దానియంతరమున ♦ మానితవాసనల్
వెలయు కుసుమములను ♦ విలసిలెడు మ
హామహీజవితతు ♦ లలరు నయ్యపి రాజ
తములు; తత్తరువులు ♦ తనరుచుండ. ౮౪ 1483

క. గిరియొండు ఋషభమనఁగాఁ, బరఁగును దద్గానియందు ♦ భర్మమయను కే
సరములతోఁ దగు రాజత, సరసిజములతోఁ జెలంగు ♦ సరసు గననగున్.

తే. రాజహంసలు చెలరేఁగి ♦ రమణఁ గ్రీడ
సలుపుచుండంగ నొప్పునా♦సరసు జగతి
యందును సుదర్శనంబన ♦ ఖ్యాతిఁ గాంచి
యలరు; నమరులు కిన్నరుల్ ♦ యక్షవరులు. ౮౫ 1485

క. చారణులు నప్సరస్త్రీన, వారముతోఁ గూడి యందు ♦ వారిక్రీడల్
చారుతరంబుగ సలుప న, వారితగతి వచ్చుచుంద్రు ♦ వైభవములతోన్. ౮౬

చ. వనచరులార! క్షీరమయ♦వారిధి దాఁటినమీఁద మీరు భూ
తనిచయభీతిదంబగుచుఁ ♦ దా జలరాసులకెల్ల మిన్నయై
కనఁబడు శుద్ధవారిగల♦కంధి; యటం దగు నౌర్వకోపసం
జనితము నశ్వవక్త్రము వి♦శాలమునౌ బడబాగ్నినాఁగ నొ
ప్పిన గురుతేజ మాజలధి♦భీమజలంబుల దాగియుండెడున్. ౮౭ 1487

క. గురుతరతత్తేజమునకుఁ, జరాచరములెల్ల మిగుల ♦ జవమునఁ దగు సా
గరజలమును బ్రళయంబునఁ, గర మింధన మగునటంద్రు ♦ కాలజ్ఞు లిలన్.

తే. అందు నివసించు జంతువు ♦ లతులబలప
రాక్రమోపేతములు నయ్యు ♦ నయ్యుదగ్ర
తేజమును గాంచి యోర్వక ♦ తీవ్రభీతి
నఱచుచుండుట వినఁబడు ♦ ననవరతము. ౮౮ 1489

సీ. ఆశుద్ధజలకంధి ♦ కవలఁ ద్రయోదశయోజనదూరమం ♦ దొప్పునుర్వి
జాతరూపశిలాఖ్య♦సాంద్రకీర్తిం గన్న కనకాద్రి యొక్కండు ♦ గలదు, గొప్ప
యాకార మొప్పంగ ♦ నగచరులార! యాయద్రిశృంగంబున ♦ నమృతకిరణ
సంకాశమై ఫుల్ల♦సరసిజపత్రవిశాలాక్షు మసితవ♦స్త్రధరము నయి

తే. వేయిశిరములు తగ భూత♦వితతి మ్రొక్కు
లిడఁగ నలరుచు భూస్థల♦మెల్ల మోయు
చును ననంతాహ్వయమున ఖ్యా♦తిని జెలంగు
నాదిశేషువుఁ గనఁగల ♦ రచట మీరు. ౯౨ 1490

క. కనకమయతాలతరు వా, తని కేతన మది శిరస్త్రి♦తయమునఁ దగి చ
క్కనివేదిక యొప్పంగాఁ, దనరెడు నాపర్వతాగ్ర♦తలమున బెడఁగై. ౯౩

తే. తూర్పుదిక్కున కెల్లగాఁ ♦ దోఁచునట్లు
నిల్పె రాకేతనంబును ♦ నిర్జరేంద్రు;
డాస్థలంబున కవ్వల ♦ హాటకమయ
మైన యుదయాద్రి శ్రీయుక్త♦మయి చెలంగు. ౫౨ 1492

చ. కనకవికారమై మిగులఁ ♦ గాంతిఁ జెలంగుచు దానియగ్ర మొ
య్యన శతయోజనోన్నతము♦నై వరవేదికతోడఁ గూడి పా
వనదివమున్ స్పృశించుచును ♦ భాసిలుచుండును నందుఁ దాలవృ
క్షనిచయముల్ తమాలములు ♦ నాలకుజంబులు కర్ణికారముల్. ౫౩ 1493

క. కనకాకృతులై సూర్యుని, తనువట్లు చెలంగి సుమవి♦తానంబులతోఁ
గనఁబడుచుండును, మఱి యో, జనవిస్తృతి గల్గి శిఖర♦సత్తమ మలరున్.

క. అది దశయోజనసమమగు, చుఁ దగు మహోన్నతినిఁ జాల ♦ శోభిలి జాంబూ
నదమయమై స్థిరమై పెం,పుదగన్ సౌమనస మనఁగఁ ♦ బొలుచుం జుండీ.

చ. పురుషవరుండు విష్ణువటఁ ♦ బూర్వము దానవనేతనుండి యు
ర్వరను బదత్రయాకృతిని ♦ బ్రార్థనముం దగఁ జేసి పుచ్చుకొం
చు రమణఁ గొల్చునట్టి తఱి♦సొంపగు నాతొలిపాద మస్మహీ
ధరమున నొప్పు శృంగమునఁ ♦ దానునిచెన్ మఱి మేరువందునన్. ౫౬

తే. ఉనిచె రెండవయడుగు నా♦యురుతరాద్రి
వర్యమగు మేరు వలరు సా♦వర్ణి మేరు
వనెడు పేరున స్వర్ణాద్రి ♦ కది సమాన
మనుచుఁ జెప్పుదు రద్దాని ♦ నార్యులెల్ల. ౫౭ 1497

చ. ఖరకరుఁ డస్తమించి తన♦గాఢమరీచులలో నిమిడ్చి కొం
చు రయము మీఱి జంబువన♦శోభిలు ద్వీపము నుత్తరంబునన్
దిరిగి ప్రదక్షిణంబుగ న♦తిస్థిరమై మఱి యున్నతంబునై
పరఁగుచునున్న యీశిఖర♦భాగముఁ జేరియె కన్పడుం దగన్. ౫౮ 1498

క. సౌమనసశిఖరమున నట, భూమీనురులై తపంబు ♦ భూరితరముగాఁ
దా మించ సూర్యవర్ణులు, నౌ మానులు వాలఖిల్యు ♦ లనఁబడువారల్. ౫౯

తే. మఱియు వైఖానసులు కాంతి♦మండితులుగఁ
గానఁబడుదురు; వనచర♦కాంతులార!
యుదయగిరికిని జెంతనె ♦ యొప్పు ద్వీప
మది సుదర్శననామకం♦బై చెలంగు. ౬౦ 1500

ఆ. సకలజంతుసృష్టి ♦ సంతతుల్ విషయంబు
లను గ్రహించుకాంతిఁ ♦ గనునో దేని

పరిసరమున నట్టి♦భాసురరవి తేజ
మలరుచుండు ద్వీప ♦ మటఁ గననగు. ౬౧ 1501

తే. అది సుదర్శనమనెడు వి♦ఖ్యాతి నొందు
నుదయగిరికూటములయందు ♦ నొగి గుహలను
వనములను రావణాసురు♦జనకతనయ
వెదకుఁ డెల్లెడ మీరలు ♦ విసుగు లేక. ౬౨ 1502

క. కనకోదయగిరి తేజము, ఘన తేజుండైన సూర్య♦కాంతియు నొండొం
టిని గూడియుంటఁ దొలిసం,ధ్య నెగడు రక్తచ్ఛవి న్ని♦తాంతము వెడఁగై.

సీ. దిక్కిది మున్ను మే♦దినికి లోకమునకు నాదిసుద్వారమై ♦ యమరునట్టు
లబ్జమిత్రున కుద♦యస్థానముగ నిర్మితంబౌట నీపేరఁ ♦ దనరుచుండు;
నుదయాద్రిపృష్ఠభా♦గోర్విని గలనిర్ఝరములను గుహలను ♦ రావణాఖ్యు
జానకి వెదకుండు ♦ సర్వస్థలంబుల; నయ్యుదయాద్రికి ♦ నవలిభాగ

తే. మంతు రవిచంద్రసంచార ♦ మరయ లేదు
గాన గాఢాంధకారంబు♦గాఁగ నుంట
నమరులే యుంద్రు కనుకనె ♦ యన్యులకది
యప్రవేశ్యముగానుండు ♦ నతిభయదము. ౬౬ 1504

క. వనచరులారా! నేఁజె,ప్పని పర్వతగుహలయందు ♦ వనముల నన్నిం
టను సీతను వెదకుఁడు చ,య్యన; నియ్యవె వనచరులకు ♦ నగు నరుగంగన్.

తే. అవలిభాగమునకు సూర్యుఁ ♦ డరుగఁడౌట
గ్రామనగరాదిపరిమితిఁ ♦ గనకయుండుఁ
గాన నెఱుఁగము; మీరును ♦ గడఁక నుదయ
పర్వతము దాఁకఁ బోయి నే♦ర్పుఱితసమున. ౬౮ 1506

క. జనకజ యుండెడు తావును, దనుజుని వాసస్థలంబుఁ ♦ దగఁ గని మాసం
బును నిండక మునుపే రాఁ,జను; నెలనిండినను రాక ♦ నమదస్ఫూర్తిన్.

ఆ. మసలువాఁడు నిజము ♦ మరణశిక్షకును న,ర్హుఁడగు; సీతఁ గాంచి♦యొక్కరీతిఁ
గార్యసిద్ధినొంది ♦ కడువడి మరలుండు, వనచరేంద్రులార! ♦ పౌరుషమున. ౭౦

చ. వననిచయాభిమండితము ♦ వాసవప్రీతికిఁ బాత్రమైన తూ
ర్పున నిపుణంబుగా వెదకి ♦ భూపతినాయకుఁడైన రాముభా
ర్యను బృథివీతనూజఁ గను♦నట్టి యదృష్టముఁ గాంతురేని మీ
రనుపమసౌఖ్యముం గనుదు ♦ రచ్చటనుండియె వచ్చివంతటన్. ౭౧ 1509

నలువదియవ సర్గము సంపూర్ణము.

## ౪౧ - వ సర్గము.

దక్షిణదిశకు హనుమదాదుల నంపుట.

క. వనజాప్తతనయుఁ డివ్విధి, ఘనతరవానరబలంబుఁ ♦ గపు లెల్లఁ దూ
ర్పునకుం బంపి యనంతర,మున [1]నఖిలక్షితుల ప్లవగ♦ముఖ్యుల ఘనులన్.

క. పనిచెను దక్షిణమునకుఁ గొ,య్యనఁ బావకసుతుండు నీలుఁ♦డగు నాకపి రా
జనుపమశక్తిఁ జెలంగిన, యనిలాత్మజుఁడైన వీరు ♦ హనుమంతు ఘనున్. ౧

సీ. అతిబలశాలియై ♦ యబ్జయోనితనూజుఁ డగుజాంబవంతుని ♦ నాసుహోత్రు
నట్లె [2]శరారి, వి♦ఖ్యాతుని శరగుల్ము గజ, గవాక్ష, సుషేణ♦గవయ, వృషభు
లను, మైందు, మఱి ద్వివి♦దుని, విజయుని, గంధమాదను వహ్నిసు♦తాఖ్యులైన
యట్టియుల్కాముఖుఁ ♦ డన నసంగుండనఁ బరఁగెడు వాని, ని♦ష్ఠురపరాక్ర

తే. మమున వేగంబునన్ మించు ♦ మహితబలుల
నంగదాదులఁ బోవంగ ♦ నాజ్ఞ నొసఁగి
దక్షిణాశకు; శూరవి♦తాన మతిజ
వముగఁ బోవంగఁ దగువాని♦ వలచి యెంచి. ౫ 1512

క. తనకుం గలసేనలలో, ఘనమిది యే యనుచుఁ జెప్పఁ♦గాఁ దగువానిం
బనిచెను వారికి ముందుగఁ, జనఁగాఁ దగునంచు బుద్ధి♦చాతుర్యమునన్. ౬

క. ప్లవగేశుఁడు వారికి నట, జనమున దుర్గమపుఁ జోట్లఁ ♦ జక్కఁగ నీక్షి
తి వివరణముగను దెల్పెను;, సువిమలబుద్ధిప్రభావ♦శోభితుఁ డగుచున్. ౭ 1514

క. శిరముల వేయింటను బహు,తరుసరములఁ దీఁగెలను ని♦తాంతము బెడఁగై
ధరనొప్పు వింధ్యభూధర,వరమును గని వెదకుఁ డందు ♦ వనచరులారా!. ౮

చ. ఉరగనిషేవితంబగుచు ♦ నుగ్రతరాకృతి దుర్గమంబుగాఁ
బరఁగెడునర్మదానదిని; ♦ భవ్యతరంబగు గౌతమీనదిన్
సరి తన కుర్వి లేకయె యొ♦సంగెడు కృష్ణను బూజ్యమై భయం
కరఫణిసేవితంబునయి ♦ క్రాలెడు నావరదాతరంగిణిన్. ౯ 1516

తే. ఉత్కలను మేఖలానది ♦ నొగి దశార్ణ
జనపదంబునఁ గల నగ♦రనిచయముల
నశ్వవంతంబనంగ వి♦ఖ్యాతి నొందు
నయ్యవంతిని వెదకుఁడీ ♦ యతనుదమున. ౧౦ 1517

సీ. సరసవిదర్భదే♦శంబుల, ఋషిక దేశంబుల, మఱి మాహి♦షకము లనఁగ
నలరు దేశంబుల ♦ నట్లె వంగ, కళింగ, కౌశికముల నెల్ల♦కడల మఱియుఁ

---

1 వానరా నఖిలక్షితాన్-అని మూలము. పరాక్రమమునఁ బేరుగన్నవారు. 2 సుహోత్రంచ శరారించ-అనిమూలము.

బర్వతకందర♦వారతరంగిణీపరివృతదండకా♦వనమునందుఁ
దనరుగోదావరీ♦తటముల వెదకుఁడీ*యాంధ్రపుండ్రములఁ బొం♦డ్యములఁ జోళ

తే. జనపదంబులఁ గేరళ♦జనపదముల
నెల్లెడల కేగి చూడుఁడీ ♦ యెల్లధాతు
వులఁ జెలంగుచు సిరులను ♦ గులుకుచుఁ దగు
నట్టి సహ్యాద్రికిని మీర ♦ లరుగఁదగును. ౧౩ 1518

క. అతిచిత్రశిఖరములఁ బుష్పితకాననములను మఱియుఁ ♦ బృథుచందనవృ
క్షతతుల నాసహ్యాద్రియు, మితిలేనివిభూతి తనర ♦ మించుచు నుండున్. ౧౪

ఆ. వెదకుఁ డందు; నచట ♦ విమలజలంబుల, వెలసి భద్రదమయి ♦ విబుధవేశ్య
లలరుచుండ నొప్పు♦నట్టి కావేరిని, గాంచఁగలరు; పిదపఁ ♦ గదలి యరుగ.

చ. మలయగిరీంద్రశృంగమున ♦ మానితతేజుని భాస్కరోపమో
జ్జ్వలుని నగస్త్యమానికుల♦వర్యునిఁ జూడఁగలారు; మీర లి
మ్ముల మహనీయుఁడైన ముని♦ముఖ్యుని దర్శనలబ్ధభాగ్యులై
చెలఁగి తదీయభూరికృపఁ ♦ జెంది యతం డనుపంగ నవ్వలన్. ౧౫ 1521

క. చనిచని గ్రాహాక్రాంతం,బును శైవలినీవతంస♦మునునయి చెలువం
బున నొప్పు తామ్రపర్ణిని, వనచరులారా! తరింప♦వలయుం జుండీ! ౧౬ 1522

చ. సురుచిరచందనౌఘపరి♦శోభితసుస్థలముల్ తగ న్సనో
హారతను వొప్పఁగాఁ బ్రియుని♦యంతికముం దమిఁ బొందు ప్రౌఢనుం
దరినలెఁ దామ్రపర్ణి నిజ♦నాథు సముద్రుని బొందుచున్న; దో
వరకపులార! యానదిని ♦ బాసి యొకించుక దూరమేగినన్. ౧౭ 1523

తే. పాండ్యభూనాయకేంద్రుని♦ద్వారమందుఁ
గనకమయమును దివ్యము♦క్తామణిగణ
భూషితము నగ్గమునునయి ♦ పొలుచుచున్న
యాకవాటముఁ గనఁగల ♦ రక్షిఫలము. ౧౮ 1524

సీ. అవల సాగర మొంది ♦ యద్దాని దాఁటంగఁ దగినప్రయత్నంబుఁ♦దగును జేయ
నంబురాశ్యంతర♦మందు నగస్త్యనిక్షిప్తమై తరుతతిఁ ♦ జెలఁగి పర్వ
తోత్తమంబును నాఁగ♦నొప్పు మహేంద్రాద్రికలదది సిరులను♦గులుకుచుండుఁ
జిత్రద్రుమంబులఁ ♦ జిత్రలతాదులఁ దగి హేమమయమయి ♦ తా మహార్ణ

---

* తథైవాంధ్రాంశ్చ పుండ్రాంశ్చ చోళా న్పాండ్యా న్సకేరళాన్-అనిమూలము. రామాయణకాలమున కాంధ్రదేశ మున్నట్లు స్పష్టమగుచున్నది. ఆంధ్రభాష యిటీవలఁ బుట్టింపఁబడిన దనుదుర్వాదము నిది త్రోసి వైవఁగలదు మనుస్మృతియందును ఆంధ్రజనులనుశబ్దము గలదు. శ్రీమద్రామాయణ మిటీవల ననఁగా క్రీస్తుశకమున నత్యల్పకాలముక్రిందటఁ బుట్టినదను కువివాదమునకు తూష్ణీంభావమే బదులుగా నగునని యెన్నుట మంచిది.

ఆ. వంబు నానియుండు ♦ వాసవుం డమరయు,క్త ప్రక్షిప్త మనుగ ♦ కామితీన
మావృతంబుఁ జారి ♦ జానకి సిద్ధాన్వితంబునోట నాస్త్రఁ ♦ గలఁచి దాని. ౨౨

క. ప్రతిపర్వంబున మునిసం, తతితోడం గూడి జలధిఁ ♦ దోనజలములం
దతిముదమున మున్గఁగఁ గో,రి తగం జనుదెంచు నుభగ ♦ రీతిం గనఁగన్.

ఆ. జలధినడుమ ద్వీప ♦ సత్తముం బిన్నలి, తీరమందు నరత ♦ తికి నమ్ము
మగుచు యోజనశత ♦ మాయతి దగ దీ, ప్తమయితనర్చుచుండు ♦ నందు మీరు.

క. జనకజ వెదకుఁడు ద్వీపం, బున నందితరస్థలములఁ ♦ బోవఁగాంచి యటం
జని చూచినంతకంటెను, ఘనమగు యత్నమున వెదకఁ ♦ గాఁ దగు సీతన్.

*చ. వినుఁడది దుష్టబుద్ధియయి ♦ వృత్రరిపుప్రతిమాన తేజుఁడై
దనుజవరేణ్యుఁడై మనకుఁ ♦ దప్పక వధ్యుఁడునైన రావణా
ఖ్యునకు నివాసభూమియయి ♦ యొప్పుచునుండును దాని కుత్తరం
బున నట యామ్యసీరధికిఁ ♦ బోల్పగు మధ్యమభాగమందునన్. ౨౮ 1529

తే. కలదు రాక్షసి యొకతె యం ♦ గారకాఖ్య
యద్ది జంతూత్కరముల ఛా ♦ యలను బట్టి
వానినిన్ లాగుకొని దినుఁ ♦ వనచరేంద్రు
లార! యాద్వీపమందెల్ల ♦ మీరు వెదకి. ౨౯ 1530

క. కలదిట లేదని నిశ్చయ, కలితాంతఃకరణులగుచు ♦ ఘన తేజంబై
యలరెడు రాముని పత్నిని, గలయన్ వెదకుండు శంక ♦ గడచను వలతున్.

సీ. అంత లంకాద్వీప ♦ మవలీల దాఁటి నూ శతయోజనమ్ములు ♦ చని కడలిని
సిద్ధచారణసంఘ ♦ సేవితంబయి సంపదలు గుల్క రెండు ప్ర ♦ క్కలను సూర్య
చంద్రసంకాశను ♦ చ్ఛాయలు తగ సాగరాంబువేష్టితమయి ♦ యతివిశాల
శృంగసంవృతమయి ♦ చెలఁగి యుంబరమును రాపాడుచున్నక ♦ రణి నలరుచుఁ

ఆ. బుష్పితకమనంగ ♦ భూధరం బొకఁడుండు
దక్షిణాయనమున ♦ దానఁ గనక
శిఖరమందు రవియుఁ ♦ జెందియుండును వెండి
శిఖరమందు శశియుఁ ♦ జెలఁగుచుండు. ౩౦ 1532

క. క్రూరులు కృతఘ్ననాస్తికు, లారయ్యనగేంద్ర మరసి ♦ యద్దాని గనం
గా లేరు, తలలు సోఁకఁగ, మీరా నగమునకు మ్రొక్కి ♦ మిథిలేశసుతన్.

క. కనుఁగొనుఁడీ! దుర్ధర్షులు, కనుకన్ బర్వతము దానిఁ ♦ గడచి యవల యో

* ఇంతకుముందు రావణుఁడు రావణాసురునివాస మెందుఁ గలదని ప్రశ్నించు సుగ్రీవుఁడు నాకుఁ దెలియదనెను. ఇపుడు హనుమదాదుల కిట్లు లంకావృత్తాంతం జెప్పె ననుప్రశ్నమునకు స్థలమునఁ నే సమాధానము వ్రాయఁబడియెను గాన నాస్థలమునం గుదానిం జూచునది.

జనములు పదునాల్గు చనర్, గనఁబడు నొకపర్వతంబు ♦ ఘనశృంగములన్.
క. దానిం గనుఁగొన దుర్గమ, మైనట్టి పథంబులందు ♦ నరుగంవగు నో
వానరులారా! యాగిరి, దా నామము సూర్యవంత♦మన విస్తృతమా. ౩౨౪
చ. జనకజ నచ్చటన్ వెదకి ♦ చయ్యనఁ బోవఁగ వైద్యుతంబునా
వినుతిని గన్న పర్వతము ♦ వింతగఁ గన్పడుఁ; గాంక్షితంబులం
గనఁదగు సత్ఫలంబులను ♦ గ్రాలుచు వృక్షము లొప్పు నెప్పుడున్
మనమున కింపుగాఁ జెలఁగి ♦ క్ష్మాధరమయ్యది యొప్పెడుంజుఁడీ!. ౩౩౪ 1536
చ. ధరఁశిధరేంద్రమందు నటఁ ♦ దద్గుల కే తగియున్న యాఫలో
త్కరముల మూలసంతతిఁ ద♦గం దిని చక్కని తేనె లాని యా
గిరిపతి దాఁటి వే యవలి♦కిం జనుఁ; డందును దృష్టిచిత్తని
ర్భరముదమిచ్చు కుంజరధ♦రాధర మొక్కఁడు గానవచ్చెడున్. ౩౫ 1537
క. సురశిల్పి యగస్త్యనకా, ధరమందే యోజనాయ♦తము హైమము సుం
దరరత్నభూషితమునై, యరయఁగ దశయోజనోచ్ఛ్రి♦యంబునఁ దగుచున్.
క. సిరులలర న్నిర్మించెను;, సురుచిరభవనంబు; నచట ♦ సొంపయి కాకో
దరములకుఁ బుట్టినిల్లగు, పురమది భోగవతి యనఁగఁ ♦ బొదలుం జుండీ!. ౩౭
ఆ. అతివిశాలకక్ష్య ♦ లలరఁగ నంతటఁ, గానఁబడుచు శత్రు♦గణమునకు న
భేద్య మగుచు ఘోర♦విషముల నతితీక్ష్ణ, దంష్ట్రలమర నొప్పి ♦ దర్ప మలర.
క. కనదురుదేహంబుల నొ,ప్పినపన్నగవితతిచేత ♦ వింతగ నేవే
ళను గావఁబడుచు నుండును;, వినుఁడట వాసుకియు నలరు♦విషధరపతియై.
తే. ప్రాజ్ఞవర్యుఁ డతండు; త♦త్పత్తనమున
నంతటను రాముపత్నిని ♦ నరయవలయు
దానిచెంత రహస్యను♦స్థలము లలరు
వానియందంతటం జూడ♦వలయుఁ దిరిగి. ౩౯౪ 1542
క. చనుఁ డవ్వల ఋషభాహ్వయ, మునఁ దగుపర్వతము రత్న♦ములఁదగి చెన్నం
గని వృషభాకృతి నొప్పుచుఁ, గనుపట్టును; దానియందె ♦ కపివరులారా!.
తే. దివ్యచందనవృక్షముల్ ♦ దీటులేక
యలరు గోరోచనపుఁ జాయ ♦ నందుఁ గొన్ని
పద్మదళకాంతిఁ గొన్ని హ♦వ్యవహురీతిఁ
గా హరిశ్యామరీతిఁగాఁ ♦ గ్రాలుఁ గొన్ని. ౪౧౪ 1544
క. వనచరులారా! యాచం,దనరాశి నొకప్పుడేని ♦ తమిచే ముట్టం
గనురాదు భయదరూపం,బునఁ దగు గంధర్వవితతి ♦ పూనిక దానిన్. ౪౨
సీ. కాచుచుండును నట్టి♦గంధర్వు లవ్వారు రోహితులనఁబడి ♦ రూఢికెక్కు
చుందురు; శైలూషుఁ ♦ డుగ్రతేజుండైన గ్రామణియును శిగ్రు♦నామధేయుఁ

రొక్కని మ్రొక్కి పల్కె నుఱియును, ఘన తేజుని శూరకేశ♦గణపరివృతునిన్.

తే. ఇంద్రతుల్యద్యుతిని దగి ♦ నెసఁగువాని, బుద్ధివిక్రమసంపన్ను ♦ నిద్ధమూర్తి
వైనతేయసమానప్ర♦భావిశేషు, నమ్మరీచ్యగ్రపుత్రుని ♦ నగచరేంద్రు. 3 1556

క. ఆతనియనుజాతుల వి,ఖ్యాతుల మారీచనామ ♦ మందినవారిన్
బ్రీతిని గని పడమరకును, సీతంగనఁ బంపఁదలఁచి ♦ చెలఁగుచు ననియెన్. ౪

క. వనచరులార! సుషేణుని, ఘనబలు ముఖ్యుని దలంచి ♦ గదలి కపిగణం
బును నియుతద్వయమును గొని,చని జానకి వెదకవలయు ♦ సర్వస్థలులన్. ౫

సీ. వనచరులార! వే ♦ చని సురాష్ట్రంబుల బాహ్లికంబుల నతి♦భయదములగు
శూరదేశంబుల ♦ సొరిది సమృద్ధిచేఁ దగి రమణీయంబు ♦ లగు జనపద
ముల విశాలపురాళిఁ ♦ గలయంగ వెదకుచుఁ బున్నాగవనమును ♦ బొగడచెట్లు
విరిగిచెట్లును గల్గి ♦ వెలయుకుక్షిఖ్యాతజనపదంబును మఱి♦యును గడంకఁ

తే. గేతకసమూహవనముల ♦ సీత వెదుక
వలయుఁ బడమరదిక్కుగా ♦ బాఱునదుల
శీతలజలంబులను గల్గి ♦ చెలఁగువానిఁ
బావనంబులఁ దాపస♦వనవితతుల. ౬ 1559

క. వనముల నుదుర్గమంబుల, ఘనగిరులను వెదకుఁ డవలఁ ♦ గడఁగి మరుధరి
త్రిని గండోపలముల భూ,ధ్రనికరవృతి దుర్గమముగఁ ♦ దగు పడమరనున్. ౭

క. కలయన్ వెదకుచుఁ బశ్చిమ, జలనిధిదరిఁ జేరి తిముల♦సంతతినక్రం
బులఁ గూడి కలఁతఁ బెట్టఁగ, నలవియె గాకుండ నలరు ♦ నద్దానిఁ దగన్.

క. కనఁగలరు మీరు మీసరి, జనులగు వానరులు ప్రీతి ♦ సంధిల్లఁగ నం
దు నలరు కేతకిషండం,బునను దమాలాటవులను ♦ బొల్పమరంగన్. ౧౦

తే. నారికేళవనంబులఁ ♦ గోరికోరి, విహరణము సల్పఁగల రందు ♦ విపులజలధి
వేలయొద్దునఁ దగు పర్వ♦తాళులందు, వనములందును సీతను ♦ గనఁగఁదగును.

క. దనుజేంద్రు రావణాసురుఁ, గనఁదగు నందుండునేమొ ♦ కడుఁబూనిక; నం
దును వెదకి యవ్వలం జని,*చని మురచీపట్టణమును ♦ జటిపురవరమున్. ౧౩

సీ. అవల నొప్పులఁ గుల్కు♦నట్టి యవంతిని నంగలోపాహ్వయ ♦ మట్లలక్షి
తంబనువనమును ♦ ధరణినందు విశాలములగు రాష్ట్రంబుల ♦ ముఖ్యపత్త
నములను వెదకుఁడు ♦ విమలచిత్తను సీత; సింధునదంబు తా♦సింధువందు
సంగమించెడునట్టి ♦ స్థలమునఁ బర్వత మతివిశాలోన్నతు ♦ లమర నాఱు

తే. శృంగములు చెన్నుమీరంగఁ ♦ జెలఁగుచున్న
తరువరంబులచే హేమ♦గిరి యనంగ
ఖ్యాతిఁ గాంచినయది మీకుఁ ♦ గానఁబడును;
భవ్యతత్సానువుల సింహ♦పటల మలరు. ౧౫ 1565

---

* మురచీపత్తనంచైవ రమ్యంచైవ జటీపురమ్-అనిమూలము.

క. దానికిఁ బశ్చిమంబులు గల, యానెలవున నుండి తమము♦హాటకమునఁ బెం
పూనిన శిఖరంబులఁ, జేనుఁగులను బట్టుకొని మహా♦హీనజనములన్. ౧౬

క. చని యాత్రికకోటులనుం, గనిచికొనుచు స్వేచ్ఛఁ దిరుగు♦చుండు; నటులముల్
అనిశము వెలసెడు నాస్థలముననున్న మహాకిరంద్ర♦ములు బలుమారున్. ౧౭

క. గిరిశృంగంబుల నెలసెడు, కరులను సంశ్లిష్ట మిడి♦కా సర్వముతన్
జరియించుచు నటులములవలె, విశాలమున్ జేయుచునట♦విహరించుఁ గడున్.

తే. నుదముచేఁ గన్నుగానక ♦ మలయు నవ్వి
తద్ధరాధరశృంగంబు ♦ తత్తకనక
మయముగా నొప్పి చిత్రద్రు♦మములఁ దనరి
యంబరముఁ దాఁకియుండు న♦య్యద్రి మీఁద. ౧౯ 1569

చ. విలసితకామరూపములఁ ♦ బృథ్వితెనా జను జాగరూకులై
కలయఁగ సంచరించి వెస♦కొంజను; నద్రముసందుఁ గొంత్రక
వ్వలయక పోవ నందుఁ గన♦కాంచితమై శతయోజనంబునై
యలవియె గాకమూడ రుచి♦నందిన వెలింగెడుకొండ కానరా. ౧౯ 1570

తే. పారియాత్రమనంగ న♦ప్పర్వతంబు
చెలఁగుఁ జూడంగలరు దాని♦శిఖరవరము
పైని బేర్కొనినట్లుగా ♦ వెలయుదాని
యందు బలవంతులయి యగ్ని♦యట్లలరుచు. ౨౦ 1571

క. అతిభయదాకృతు లలరఁగ, సతతంబును గామరూప♦సరణి నలరుచున్
బ్రతిలేకయె గంధర్వులు, వితతంబగు మహిమ నుంద్రు ♦ వేడుక లలరన్.

క. ఇరువదినాలుగుకోటులు, పరఁగెడు నవ్వారిసంఖ్య ♦ వారలు శుచిభా
కర తేజంబుల వేలుగ, గిరిశృంగమునందు నుంద్రు ♦ కేవలశక్తిన్. ౨౨ 1573

సీ. భయదరూపులునగు ♦ వానరుల్ మీరును వారిచెంతకును బో♦వంగఁ దగదు
తత్ప్రత్యఫలములఁ ♦ దమిఁ గాంచి కోయంగఁ బూనంగరా దించు♦కేని వాని
వారు చూడఁగ మహా♦వీరులు బలయుతుల్ శూరులు గావున ♦ నెక్కెన
నెదిరింపరాకయే ♦ యెసఁగుచుందురు మఱి యందున్నఫలముల♦నచటి మూల

ఆ. ములను గాచుచుంద్రు ♦ మూలఫలంబుల
గొనఁగ నాశమీరు ♦ గనక సీత
వెదకవలయు నచటఁ ♦ దదుపగతభయంబు
నైజకపితఁ బూని♦నం బొసఁగదు ౨౪ 1574

క. జలధి మఱికొంతయేగఁగ, విలసితవైడూర్యకాంతి ♦ వెలయఁగ వజ్రం
బులవలె నతికఠినంబై, పొలుపగు తరులతల మిగులు ♦ భూధ్రమ్మందున్. ౨౫

తే. వజ్రపర్వతమనునది ♦ వఱలుచుండు:
సంపదలఁ జెన్నుమీఱి యో♦జనశతోన్న

తిని వెలుంగుచునుండు నో♦వనచరేంద్రు
లార! యద్దానిగుహలలో ♦ మీరు పూన్కి. ౨౬ 1576

క. జనకజ వెదకఁగావలయుఁ;, గనుచును నీరీతి లవణ♦కంధిని బోవం
గను దానిచతుర్థాంశం, బున నొప్పును జక్రవంత♦ము సిరులు గులుకన్.

సీ. విశ్వకర్మయు నట ♦ వేయియంగంబుల మించుచక్రంబు ని♦ర్మించె మున్న
తత్పర్వతమునందె♦ దనుజాంతకుఁడు మును సురదైత్యులకగు సం♦గరమునందుఁ
బురుషోత్తమాకృతిఁ♦బొదలి చక్రముతన్ను నరయుచుఁ బ్రోవహ♦యాస్యుఁడనఁగ
నొప్పుదానవుఁ జంపి ♦ యుగ్రచక్రంబును గొనియెను; మఱిపంచ♦జనుని జంపి
ఆ. వాని యస్థియగుచు ♦ భాసిలు శంఖంబుఁ, బాంచజన్యమనఁగఁ ♦ బరఁగుదాని
సంగ్రహించె నట్టి♦శైలంబునం గల, సానువులను గుహల ♦ జనకతనయ.

క. దనుజేంద్రుని వెదకంగాఁ, జను; నఱువదియోజనముల ♦ సరణి నవల శ్రీ
ఘనమై సువర్ణమయశృం,గనికరమున వెలయుచున్న♦క్ష్మాధర మలరున్. ౨౯

ఆ. అది యగాధమైన ♦ యంబుధిలోన వ,రాహపర్వతమన ♦ రాజిలు నట
భర్మరూపమైన ♦ ప్రాగ్జ్యోతిషంబను, పురము గలదు తన్న♦గరమునందె. ౩౦

*క. నరకాహ్వయమున దుష్టా, సురుఁ డొకఁడు వసించుచుండు;♦క్షోణీధరమునం
దరయ విచిత్రప్రస్థో, త్కరమునఁ బెనుగుహలయందుఁ ♦ గాంతను దనుజున్.

క. వెదకన్ గావలయును దానికిఁ, బిదపన్ వేఱొండుకొండ ♦ విలసిలుఁ దద్భా
ధ్రదయితుని గుహలయంతర,ము దగన్ సౌవర్ణమగుచు ♦ మోదంబొసఁగన్.

తే. దానిభాగములెల్లను ♦ దప్తకనక
మయములై యుండు నిర్ఝర♦మహితధార
లలర నొప్పును దద్గిరి♦యందు గజవ
రాహసింహములుం బులుల్ ♦ రవముచేసి. ౩౩ 1583

క. ప్రతిరవమును విని గర్వో, ద్ధతి నెప్పుడు నఱచుచుండు ♦ దానికిఁ దారే
ప్రతిశబ్దంబుగఁ దత్ప,ర్వతమున శ్యామాశ్వుఁ డగుచు ♦ రహిం సిరు లలరన్.

క. సురపతియభిషేకము ని,ర్జరతతిచేఁ జేయఁబడియె ♦ రమ్యగిరియు ని
ద్ధరమేఘవంతమనఁగాఁ, బరఁగును; హరిపాలితమగు ♦ పర్వతవరమున్. ౩౫

ఆ. దాఁటి యవల బాల♦తరణివర్ణములయి, యంతటను బ్రకాశ♦మంది కనక

---

* తత్ర ప్రాగ్జ్యోతిషం నామ జాతరూపమయం పురం, యస్మిన్ వసతి దుష్టాత్మా నరకో నామ దానవః-అని మూ. ప్రాగ్జ్యోతిషపురమున నరకదానవుఁడు కలఁడని యీశ్లోకమున నుండుటం గాంచి కొందఱు పండితమ్మన్యులు రామాయణ మిటీవల రచింపఁబడినదని వాదించుచున్నారు. నరకదానవులు పెక్కుమంది గలరనియుఁ గృష్ణద్వేషి యగునరకాసురుఁడు భూపుత్రుఁడనియు వారెఱుఁగరు కాఁబోలు. పాప మిట్లు తెలివితక్కువను వెల్లడించుకొనుటకన్న నూరకుండుట మేలు.

తరువులను మనోజ్ఞ♦తమపుష్పయుక్తములను జెలంగు కొండ♦యను గదుండు.

సీ. అఱువదివేలసం♦ఖ్యల నొప్పు నయ్యవి: వానిమధ్యమునందు ♦ బర్వతవర
మయిన సావర్ణిమే♦ర్వాహ్వయపర్వత మలరారు నదియు సూర్యప్ర♦సాదమున
దానికి వరమిచ్చి ♦ తగఁ బల్కె; నాకృపచే నీయందుఁ ♦ గల సమస్త
తరుశిలాదులు సదా♦తపనీయమయము లగుచు నీయందు♦లలి వసింప

తే. దేవగంధర్వదానవుల్ ♦ దివ్యరుచుల
రక్తవర్ణులుగా నయి ♦ రమ్యభక్తి
కళల నొప్పారుచుండెఁగాఁ ♦ గాత; సతత
మనుచు వరమిచ్చె; నా శైల♦మునను జేరి. ౪౦ 1587

క. అనిలులు విశ్వేదేవత,లును వస్వష్టకము సమరు♦లున్ సగ సాయం
తనమున నప్పర్వతవర,మునఁ జేరి గాంచుచును వారు♦ మ్రొక్కుదు రెలమిన్.

క. హరిదశ్వుఁడు తత్పూజల, నరసం గైకొనుచు నస్త♦పర్వతమునకున్
స్వైరఁ జని భూతాళికగో,చరుఁ డగు; నావర్ణిమేరు♦శైలమ్మునకున్. ౪౨ 1589

తే. అస్తగిరికిని నంతర ♦ మరయఁగ బది
యోజనములుండు నద్దాని ♦ నొక్కగడియ
కాలమున దాఁటి భానుండు ♦ కడు రయమున
నస్తశిఖరంబుఁ జేరు; న♦య్యద్రియందు. ౪౩ 1590

క. కలదొండు శిఖరమందుం, గల దద్దానిపయి విశ్వ♦కర్మరచితమై
జలజాతమిత్రసన్నిభ,ము లలితమును నైన భవన♦ము మహితముగుచున్. ౪౪

క. దానికిఁ జుట్టును సౌధవి, తానము చెలువారు: బహువి♦హగపత్త్రులచేఁ
గానఁబడుతరువరము ల, ద్దానికి నలుప్రక్కలను ని♦తాంతం బలరున్. ౪౫

చ. వినుఁడది పాశహస్తుఁడయి ♦ విశ్రుతకీర్తియునైన పాశి యుం
డు నిలయు; మస్తశైలము గ♦డుం బొలుపారెడు మేరుభూధ్రముం
గనియెడు మధ్యభాగమునఁ ♦ గర్బురరూపముగాఁ జెలంగుచున్
గన దశకూటయుక్తమయి ♦ క్రాలుచు భవ్యసువేదికావృతం
బును నగు తాళవృక్ష మటఁ ♦ బొల్చును దర్శనయోగ్యమై తగన్. ౪౬ 1593

తే. ధర్మవేత్తయు స్వతపఃప్ర♦భావపూజి
తుఁడు శతానందునకు సమా♦నుఁడునునైన
మేరుసావర్ణి యనుపేర ♦ మించునాతఁ
డలరు సావర్ణిమేరుమ♦హాద్రియందు. ౪౭ 1594

క. అందుఁగల దుర్గమస్థలు, లందున్ సరసులను నదుల♦యందును మీరల్
పొందుగ జానకిని న్వెద,కం దగు రావణుని శ్రద్ధ♦గా శౌర్యములన్. ౪౮

చ. ఖరకరురీతిఁగా మిగులఁ ♦ గ్రాలెడు నామునికెంతొ భక్తి మీ
శిరములు నేలసోఁక హితసిద్ధిని గోరుచు మ్రొక్కి జానకీ
తరుణి ప్రవృత్తినెల్లను నితాంతము ప్రశ్న మొనర్పుఁ డాదివా
కరుఁడు త్రియామపోయిన జగంబునఁ గప్పడి స్వప్రభావళిన్. ౫౯  1596

ఆ. ఉదయపర్వతంబు ♦ మొదలుగ నస్తాద్రి, వఱకుఁ గలుగుభూమి♦భాగమందు
నంధకారమణఁచి ♦ యస్తాద్రినిం జేరు;, వనచరేంద్రులార! ♦ వినుఁడు మీరు.

తే. నేను జెప్పినదనుకనే ♦ వానరులకు
నరుగ శక్యము మీఁదటి♦యవని రవియుఁ
గానరామిని జీకట్లు ♦ గ్రమ్మి యేమి
తెలియకుంటను *మాకును ♦ దెలియ దవల. ౬౧  1598

చ. ఖరకరుఁ డస్తమించు గిరి♦కాంతుని దాఁకను బోయి మీర లా
సురరిపుఁ డున్నతావు రఘు♦శూరునిపత్ని వసించుచోటు వే
యరయుచు నొక్కమాసమున ♦ కందఱు చేరుఁడు వచ్చియిందు; నె
వ్వరుసను హద్దుదాఁటకుఁడు ♦ వధ్యుఁడె యానటు దాఁటునేనియున్. ౬౨

క. నామామ యీసుషేణుఁడు, తామహి శూరుండు మిమ్ముఁ ♦ దమిఁగూడియె శ్రీ
రామునిపత్నిని వెదకం, గా మైకొనె రాఁగ మీరు ♦ కడుయత్నమునన్. ౬౩

క. అతఁడు వచించినపనులన్, హితములెయని యాలకించి ♦ యెల్లరు విని యా
గతివర్తింపుఁడు గురుభుజుఁ, డితఁడు గురుండగును శ్వశురుఁ ♦ డిద్ధబలుఁడునౌ.

క. మీరును సంగరములలో, శూరులు కార్యంబు లిట్టి♦చొప్పునఁ జేయం
గా రహిఁ దనరు నటంచని, ధీరతనియమంబుఁ జేయు ♦ ధీయుతులుగదా.

ఆ నియమ మిట్లుచేసి ♦ నిశ్చయచిత్తంబు,లను బడమర మీరు ♦ జనకతనయ
దనుజు వెదకవలయు; ♦ దారుణతేజుఁడౌ, రామునుదతి సుగుణ♦రమ్య సీత.

క. కనియే వచ్చిన రాముఁడు, మనకొనరిచినట్టి మేలు ♦ మఱువక ప్రతిఁజే
సినవారము కృతకృత్యుల, మును నగుదుము వేయివచన♦ముల నింకేలా!.

సీ. నేను జెప్పినదె కా♦కీనిమిత్తంబయి యేకార్యమేనియు ♦ హితము గల్గె
నేని దానినిగూడఁ ♦ బూనిక దేశకాలార్థముల్ యోజించి ♦ యాచరింపుఁ;
డెన్నిచందములనే ♦ నిల గన్నపుత్రిని గనఁదగునని పల్కె ♦ విని కపీంద్రు
నిపుణవాక్యంబులఁ ♦ గపులు సుషేణాదు లాతనియాజ్ఞల ♦ నాదరించి

ఆ. యతనిసెలవునొంది ♦ యతిజవమున వరుణాభిపాలితమగు♦నట్టి దెసకుఁ
జనిరి జనకపుత్రిఁ ♦ గని వచ్చుకోరిక, లాత్మలందుఁ బొదల ♦ నతిజవమున. ౬౮

నలువదిరెండవ సర్గము సంపూర్ణము.

---

* నజానీమ స్తతఃపరమ్-అనిమూ.

సీ. ఉత్తరదిక్కునం♦దొప్పు మ్లేచ్ఛులదేశములు, పులిందాహ్వయం♦బులును శూర
సేనదేశంబులు ♦ మాననీయములగు [1]ప్రస్థలదేశముల్ ♦ భరతదేశ
ములు,యామ్యకురుదేశ♦ములు,మద్రదేశముల్ కాంభోజయవన,శ♦కజనపదము
లారట్టబాహ్లీక♦పౌరవదేశముల్ చక్కనిఋషికదే♦శములు టంక
తే. ణములు, [2]చీన,విహారదే♦శములు పరమ
చీనదేశంబులును మఱి ♦ చిత్రములగు
దరదదేశమ్ములును గల ♦ వరసి యందు
హిమగిరీంద్రంబునకు మీర♦లేగి యచట. ౧౩ 1614

క. జనకజఁ జక్కఁగ వెదకుఁడు, కనుఁగొనఁదగు లోధ్రభూజ♦గణయుతమై పొ
ల్చినవనములఁ బద్మకముల, ఘనమ్ములగు దేవదారు♦కాననములనున్. ౧౩½

క. తిరుగుచు సీతను రావణు, నరయుఁడు; గంధర్వులమరు ♦ లర్చించెడు భా
సురసోమాశ్రమసీమకు, నరుగుఁడు తర్వాత మీర ♦ లందుండి వెసన్. ౧౪½

క. ఘనసానుయుక్తకాళం, బనుపర్వతమునకు నేగుఁ ♦ డాకాళాద్రిన్
గనుపట్టు కోనలన్ గుహ,లను జక్కఁగ వెదకవలయు ♦ లలనామణినిన్. ౧౫½

క. కనకనిధిప్రతిభాసుర,మును భూరితరంబనగుచుఁ ♦ బొల్చెడుకాళా
ద్రిని దాఁటి సుదర్శన మనఁ,గ నొప్పు భూధరముఁ గాంచఁ♦గాఁ దగు నంతన్.

క నిరతము పతగాలయమై, పరఁగెడు దేవసఖమనెడు ♦ పర్వత మదియున్
వరతరుభూషితమయి సుం,దరపక్షిగణావృతమయి ♦ తనరుం జుండీ!. ౧౮

ఆ. దాని కాననముల ♦ దరుల నిర్ఝరముల, జనకతనయ దనుజఁ ♦ జక్క వెదకి
దానిగడచి యట శ♦తసమయోజనములు, [3]విరివిగలిగి శూన్య♦వృత్తియగుచు.

క. కనఁబడు నొకభూభాగము, కనరాఁదటఁ బర్వతములు♦గాని నదులు వృ
క్షనికరములుగాని గనుం,గొనఁబడ వేజంతువులును ♦ క్షోణిని నచటన్. ౨౦

చ. కనుఁగొన రోమహర్షణము♦గా భయదంబుగ నొప్పునట్టి య
వ్వనమును వేగ దాఁటి చని ♦ పాండురమై యలరారువెండికొం
డను గనినంత సంతస మ♦నంతముగాఁ గలుగంగ నోపు; దా
ననలరు యక్షరాజభవ♦నంబు సితాభ్రమురీతిఁ జక్కనై. ౨౧½ 1622

చ. కనకపరిష్కృతంబగుచుఁ ♦ గ్రాలుచు దివ్యముగాఁగ విశ్వక
ర్మనిరతిఁ జేయ నొప్పి మహి♦మంబునఁ జెన్నగు; నందుఁ గల్వలున్
వనజములుం జెలంగ నతి♦వైభవమొప్ప సరస్సు గన్పడున్
గనుఁగొన సంతసం బిడుచుఁ ♦ గాంక్షితదానచణంబునై తగన్. ౨౨½ 1623

చ. అదియె మానస మనెడు నా♦హ్వయము చేతఁ
బరఁగు నంచలుఁ గారండ♦వములు నందు

---

[1] ప్రస్థలాన్ భరతాం శ్చైవ-అనిమూలము. . [2] చీనాన్ పరమచీనాం శ్చ - అనిమూలము.
[3] సర్వసత్త్వవివర్జితమ్-అనిమూలము.

నిండియుండును త్రిదశుల♦నెలంతలెల్లఁ
గుంపులుగఁ గూడి యద్దానిఁ ♦ గొల్చుచుంద్రు. ౨౩ 1624

తే. అట్టికైలాసమందు శ్రీ ♦ యలకయుండ
విశ్రవణునకుఁ బుత్రుఁడై ♦ వెలసి సర్వ
భూతవందితుఁడై యక్ష♦పూగపతియు
నైన ధనదుఁడు పొల్చి వి♦హారకలన. ౨౪ 1625

క. ఆకైలాసంబున శశి, నీకాశ ప్రాంతశైల♦నికరంబులలోఁ
బ్రాకటకందరములలో, భూకన్యను రావణునిని ♦ బోలుగ వెదకఁడీ. ౨౫ 1626

క. తరువాతఁ గ్రౌంచనగమున, కరిగి యటుగ గుహుఁడు శక్తి ♦ నలరించినచో
కరదుర్గమబిలమందుం, బరాకు లేకుండఁ బోవ♦వలయుం జూండీ. ౨౬ 1627

క. వనచరులారా! యాబిలముచు జొచ్చుట కష్టతరము ♦ మునులందుఁ గనుం
గొనఁబడుదురు రవితేజులు, ఘనమతులును దేవసంఘ♦కల్పితపూజ్యుల్.

క. సురరూపులు వార లటుగ, నిరతము నివసించువారు; ♦ నిస్తరసంఘా
దరణార్థమైన యాగిరిఁ, బరికించుచు నితరగుహా ♦ వసానువులన్. ౨౮

తే. శిఖరములయందుఁ గోనల♦చెంత మఱి ని
తంబములయందు నయ్యాయి♦స్థలములందు
జనకజను మీరు వెదకంగఁ ♦ జనుడు; క్రౌంచ
మందు ముఖ్యశిఖరమును ♦ నరసి యవల. ౨౯ 1630

సీ. తరురహితంబుగాఁ ♦ దనరు కామాద్రిని బతగాలయంబయి ♦ పరిఢవిల్లు
మానసాద్రిని జూడఁ♦గానగు నద్ది సామాన్యులై తగునట్టి ♦ మానవులకె
కాక, యనుత్తరరా♦క్షసులకు దానవులకుఁ గూడఁ జొరరాక ♦ సకలజంతు
భయదంబుగానుండు ♦ భవ్యసాన్వాదికస్థలములయందెల్ల ♦ జనకతనయ
తే. వెదకుఁ డద్దాని మీఱిన♦పిదప నందుఁ
గానవచ్చు మైనాకంబు ♦ దానియందు
మయుఁడు తనకొఱకై దివ్యమా ♦ మందిరంబు
దానె నిర్మించుకొనియుండుఁ ♦ దత్పరమతి. ౩౦ 1631

ఆ. దానికందరముల ♦ సానునితంబాదికములయందు ఘోట♦కముఖములను
దనరు ప్రమదలుండు♦స్థలములఁ జక్కఁగాఁ, దిరిగి వెదకవలయు ♦ ధరణితనయ.

క. చనినంత దానిమీఱుచుఁ, గనఁబడు నాశ్రమము సిద్ధ♦సంఘాశ్రయమం
దును వైఖానసు లనఁబడు, మునులును వాలఖిల్య♦మునులును నతముల్.

ఆ. అలరుచుందురు సిద్ధులై; ♦ యమ్మహాత్ము
లాత్మతపమునఁ బాపాళి ♦ నణఁచి సఫల

---

* దేవైరప్యర్చితాః సమ్యక్ దేవరూపా మహాత్మయః-అనిమూలము.

నియతులై యుంద్రు; గావున ♦ నెమ్మి మీరు
మ్రొక్కి వినయంబునను వారి♦మ్రోల నిలిచి. ౩౪ 1634

క. జనకజదగువృత్తాంతం,బును దప్పక యడుగవలయు; ♦ భూరిమయములౌ
వనజంబుల నలరుచు నిం,పును గూర్చు సరస్సొకండు ♦ పొదలును ఘనమై.

క. తరుణార్కనిభములై శుభ,చరణంబుల నొప్పు హంస♦సంచయములు నా
సరసునఁ దగు వైఖానస,సరస్సు నా నద్ది ధాత్రి ♦ జనసుతిఁ గాంచున్. ౩౬

క. నరవాహనుకంతేంద్రము, కరేణుగణమెల్లఁ గొలువఁ♦గాఁ దమితో నా
సరసునను సార్వభౌమ,స్ఫురదురువిఖ్యాతినంది ♦ సొంపుగఁ దిరుగున్. ౩౭

సీ. దానికవ్వలఁ జంద్ర♦తరణుల సంచార మఖిలర్క్షచారంబు ♦ నందకుండ
నలరు నాకాశమం♦దభ్రముల్ తిరుగవు నిశ్శబ్దమై యది ♦ నెగడుచుండు
సిద్ధతపస్కులై ♦ యిద్ధతేజస్కులై యమరసమానులై ♦ యలరు మానులట వసింతురుగాన ♦ నవ్వారితను కాంతులను భానుకిరణంబు♦లనువలెఁ బ్రభ

ఆ. వెలయుచుండు; నట్టి ♦ విమలప్రదేశంబు, దాఁటి చనిన నవలి♦స్థలమునందు
జాను మీఱుచుండు ♦ శైలోదమనునది, దానిమానితద్వి♦తటములందు. ౩౮

క. తనరుం గీచకవేణువు, లనయంబుఁ బరస్పర మవి ♦ యంటుకొనుచుఁ జ
క్కనివయి దట్టంబుగనుం,డును గావున సిద్ధులుం గ♦డుం బూనికతోన్. ౩౯

తే. వానిమీఁదుగఁ బోవుచు ♦ వచ్చుచుండు
దురు; పవిత్రమనస్కుల ♦ కురుతరసుఖ
వసతులై యుండు కురుదేశ♦వరము *లుత్త
రాదిపదయుక్తములయి పెం♦పలర వెలయు. ౪౦ 1640

క. ఘనపుణ్యమ్ములు చేసిన, మనుజులు తత్ఫలముఁ బొంద ♦ మహినందు జనిం
గనుదురు గావున నాక్షితి, కనకాంబురుహంబులెల్లఁ ♦ గడురమ్యములై.

తే. తనర నీలవైడూర్యర♦త్నములపోల్కి
ఛాయనొప్పెడు పద్మినుల్ ♦ చాలవెలయ
జలసమృద్ధములౌ మహా♦శైవలినులు
వేనవేలుగఁ బ్రవహింప ♦ వెలయుచుండు. ౪౨ 1642

క. అరుణోత్పలములచే బం,గరు కల్వలచేత మిగులఁ ♦ గ్రాలి తరుణభా
స్కరవర్ణోత్పలములచేఁ, బరఁగుచుఁ దత్సరసులెల్ల ♦ భాసిలుచుండున్. ౪౩

సీ. అభిరామనీలర♦త్నాంచితపత్రముల్ కనకకేసరములు ♦ గడువిచిత్ర
ములుగఁ గన్పడ నల్ల♦గలువలనొప్పారు కొలఁకులెల్లెడలను ♦ వెలయు నందు;
నందలినదులలో ♦ ననమానములగు ముత్యంబు లనర్ఘర♦త్నంబు లల్లె

* ఉత్తరాః కురవ స్తత్ర - అని మూలము. ఉత్తరాదిపదయుక్తములయి=ఉత్తరపద మాది యందుఁ గలవియై.

ట్లురుతరతేజముల్ వెలయ ♦ నొప్పిన పర్వతరాజకాంతిచే
నిరతము భాసమానమగు ♦ నెమ్మిని దానిఁ గనుండు పూర్విక౯ై. ౫౭॥ 1655

చ. వినుఁ డట విశ్వరూపుఁడగు ♦ విష్ణువు సుద్రగణైకయుక్తుఁడై
తనరు సదాశివుండు విబు ♦ ధప్రజనాయకుఁడైన బ్రహ్మయున్
అనిశము బ్రహ్మమానియుతు ♦ లై వసియింతురు; మీకు నెల్ల నా
జనపదసీమదాఁటి చన ♦ శక్యముగాదు శ్రమంబు నొందినన్. ౫౮ 1656

ఆ. కాన నుత్తరమునఁ ♦ గలదేశమున కేగ, వలదు; భూరిశక్తి ♦ వైభవంబు
గలుగు దానవాదు ♦ లలరి యవ్వలఁ జనఁ, గలరు గమనశక్తి ♦ కలితులగుచు.

[1]క. గిరియది దుర్గమమగు నిర్జరులకునుం గూక; దానిఁ ♦ జయ్యనఁ గని స
త్వరగతి మరలుఁడు మీరును, హరులకు నింద్రాదిఁ జనఁగ ♦ నర్హము నుండీ!.

తే. అవలిదేశ మభాస్కరం ♦ బంధకార
బంధురంబయి నగరముల్ ♦ పత్తనాదు
లనెడు మర్యాదలేకుండు ♦ టను దెలియదు
మాకునుంగూడఁ గావున ♦ మీకునట్లె. ౬౧॥ 1659

చ. వనచరులార! మీకిపుడు ♦ బాగుగ నే నెఱిఁగించినట్టిచో
ట్లను బనిపూని చూడుఁడీ! యి ♦ లాసుత నే నటఁ దెల్పనట్టిచో
ట్లు నెగడునేని వానిని గ ♦ డుం దమిమీఱఁగ బుద్ధివైభవం
బున నరయుండు; కీశగణ ♦ పుంగవులార! తలంప మీరొగిన్. ౬౨॥ 1660

[2]క. అనిలానలోపములు గా,వునఁ జక్కఁగ రాముపత్ని ♦ భూసుత వెదకం
జను నాకార్యము సాధిం,చినచో శ్రీరామునకును ♦ జిత్తంబలరున్. ౬౩

క. మనమున నంతకు మించిన, యనుపమమోదంబు నాకు ♦ ననిశము గలుగున్
వనచరులారా! కార్యం,బున సఫలత నొందినన్ బ్ర ♦ భూతముదములన్.

తే. బంధువులతోడ మీరు నా ♦ వలన రమ్య
తరములౌ గౌరవములంది ♦ పరరహితులు
నగుచుఁ బ్రియురాండ్రఁగూడి కృ ♦ తార్థులగుచు
ధరఁ జరింపఁగఁగలరు సం ♦ తతము స్వేచ్ఛ. ౬౪॥ 1663

నలువదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

1 ఏతావద్వానరై శ్శక్యం గంతుం వానరపుంగవాః-అనిమూ. హరులు=కోఁతులు. 2 కృతం భవిష్య త్యనిలానలోపమాః-అనిమూ.

## ౪౪ - వ సర్గము.

రాముఁడు హనుమంతున కంగుళీయ మొసఁగుట.

[1]క. హరిపతియు విశేషించియు, మరుదాత్మజునకును సుగుణ◆మందునుఁ గ్రౌ
వరుఁడై నరాముఁ డెఱుఁగు, గురుతరకార్యప్రసాధకము ◆ గాఁ దలఁచె నయో. ౧

ఆ. అతనియందె యునిచి ◆ యాతఁడె తత్కార్య
మెల్లఁ దీర్చుననుచు ◆ నెదను నమ్మి;
గాన నఖిలకీశ◆కాంతుఁ డాసుగ్రీవుఁ
డధికహర్షమొంది ◆ యతులశౌర్య. ౨ 1665

క. అనిలాత్మజ నాహనుమను, గని పల్కెన్; వనచరేంద్రు ◆ కరుఁగ నజాతి
యనిఖిలశత్రుయుతంబగు; ననంతపథముఁగాని జలధి◆నావృత మగుమున్. ౩

[2]సీ. ఆలంబమే లేని ◆ యాకాశమునఁగాని వాతచక్రంబున ◆ వఱలుమున్న
యంబరంబునఁగాని ◆ యధికతేజస్కులైనట్టి సురులుండెడు స్వర్గ◆మందుఁగాని
తిర్యగ్గణంబులు ◆ తిరుగఁజాలనియట్టి జలములలోఁగాని ◆ లలితగతిని
సంచరింపఁగలావు; ◆ మించెదు సురగంధర్వాహిమర్త్య ◆ నరజగములు

తే. జలధిభూధరవేష్టిత◆సకలజగము
లరయఁగా నీ వెఱింగిన ◆ వగును జుమ్ము
జనగతులు లాఘవంబు తే◆జంబు నెప్పుఁ
డయిన నీతండ్రి వలె నీకు ◆ నలరుచుండు. ౪ 1667

క. పనివడి వెదకినఁ దేజం, బున నిను మించంగఁజాలు ◆ భూతమెదియునున్
గనరాదు జగతి సమతం, గనునదియును గానరాదు◆గా కపివర్యా.. ౫

క. కనుకన్ జానకి యెక్కి, యు, మనకున్ లభియించునట్టి◆మార్గము నీవే
కని కార్యము నెఱవేర్పం, జను; నీతిని బండితుఁడవు ◆ సకలజగములన్. ౬

తే. బలము బుద్ధియునుం బ్రతా◆పంబు దేశ
కాలముల ననువర్తించు ◆ గాఢశక్తి
యనునయంబివి యెల్ల నీ◆యందునున్న
యట్టి లితపులయందుండ ◆ వనిని నెందు. ౭ 1670

చ. అని కపినాయకుండు పవ◆నాత్మజునందు సమస్తకార్యముం
బనివడి పెట్టుటప్పు డటు ◆ పల్కినవాక్కులచే నెఱింగి తా
మనమునఁ గార్యభారము స◆మానుపశక్తిఁ దెలంగు నాంజనే
యునిపయి నున్నదిం చరసి ◆ యొప్పుగ నిల్లిన నెంచె రాముఁడున్. ౮ 1671

---

1 ఈయధ్యాయమున నిశ్చితప్రయాణకార్యానంతరకార్యరూపమగు వంశుయుక్తప్రదానము చెప్పఁబడుచున్నది. దక్షిణదిగ్గమనమునకు నియుక్తులగు నాయకులలో నగ్రగణ్యుఁడు హనుమంతుఁ డౌట నాతఁడే కార్యమును సాధింపఁగలఁ డనునమ్మకముచే నాయనిలాత్మజునిచేతికి ముద్రిక నిచ్చుచున్నాఁడని యెఱుఁగఁ దగుదు. 2 నభూమౌ నాంతరిక్షే వా నాంబరే నామరాలయే-అనియూ. ఇట నంతరిక్షాదిశబ్దములు యథాక్రమము వ్యాఖ్యాతృప్రతిపాదితమే యని యెఱుంగవలయు.

చ. తరణికుమారుఁ డీహనుమ ♦ తప్పక కార్యము చేసితీఱు నం
చురుతరనిశ్చితార్థుఁడయి ♦ యుండెడుఁ బావని చేయఁజాలు న
క్కరణినినైనఁ జేయఁదగు♦కార్యముఁ బూర్వ మనేకకార్యముల్
సరిగ నొనర్చియుంటయును ♦ సర్వజనంబు లెఱింగిరే కదా!. ౯॥ 1672

చ. కనుకనె వానరేశ్వరుఁడు ♦ గైకొని యీతని గారవించెడున్
హనుమ ప్రయాణమై చనిన♦యప్పుని సిద్ధిని బొంది తీఱు నం
చనుపమచిత్తమున దరసె; ♦ నంతట నమ్మహనీయతేజుఁడై
తనరురఘూత్తముండు ప్రమ♦దంబున యత్నమొనర్చు నాతనిన్. ౧౦॥ 1673

చ. అనిలతనూజువిశ్రుతిని ♦ నాదృతి మీఱఁగఁ గాంచి యంతటన్
మనమున నింద్రియంబులు స♦మస్తవిధంబుల హర్ష మొందఁగాఁ
దనను గృతార్థయత్నునిగఁ ♦ దద్దయు నెంచుచుఁ బ్రీతుఁడై మహీ
తనయకు నానవాలుగ ని♦తాంతము ముద్దులుగూర్చు నుంగ్రమున్. ౧౧॥

*క. తననామము ముద్రింపం, గను బడి బలుకాంతిమీఱి ♦ కాంతకు మదిలో
న నెఱుఁగఁదగు నద్దానిని, హనుమంతున కొసఁగి పల్కె ♦ నాదృతి మీఱన్.

సీ. ఆనవా లిద్దాని ♦ నాజనకాత్మజ హరివర్య! కనుఁగొని ♦ యాత్మలోన
ననుమానభయముల ♦ నంచక నాచెంతనుండి వచ్చితివని ♦ యొప్పమీఱఁ
గను నిన్ను; నీబలం♦బును వ్యవసాయంబు విక్రమంబును నేను ♦ వినఁగనిపుడు
సుగ్రీవుఁ డొసఁగిన ♦ శుభదసందేశంబుఁ గార్యంబు ఫలియింపఁ♦గలదటంచుఁ

తే. జెప్పుచున్నట్టు లున్నవి; ♦ శ్రీకరంబు
లగుచునని పల్కె; నంత న♦య్యంగుళీయ
కమును గైకొని తనమస్త♦కమ్ముఁ జేర్చి
కరములన్ మోడ్చి శ్రీరాము♦చరణములకు. ౧౩॥ 1676

క. మరుదాత్మజుండు మ్రొక్కుచు, నరుగం బూనెం; బరాక్ర♦మాధికుఁ డాతం
డురుతరవానరసైన్యము, కరమనురాగమున బలిసి ♦ కదలఁగ నంతన్. ౧౪॥

క. ఘనములులేని వియత్తల,మునఁ దనమండలము స్వచ్ఛ♦ముగఁ దగ నక్ష
త్రనికరశోభితుఁడగు చంద్రునిభంగి వెలింగె; రఘువ♦రుండును మరలన్. ౧౫

చ. అనిలతనూజ! నీవును మ♦హాబలశాలివి సింహవిక్రమం
బునకు సమానమై పరఁగు♦భూరిపరాక్రమ మొప్పువాఁడవై
తనరుదు వట్టిలౌట నిటఁ ♦ దావకభూరిబలంబు నమ్మితిన్

---

* దదౌ తస్య తతః ప్రీత స్స్వనామాంకోపశోభితమ్-అనిమా. రామాయణకాలమున నక్షరములు లేవు. కంఠపాఠము చేయుటయేగాని పుస్తకసామగ్రి ధరణిలేదన్న దుర్వాద మీశ్లోకమున నెగిరిపోవునని తెలియఁదగు.

వినుతించుకొనుచును ♦ విపులసింహధ్వను లొనరించుచును స్వేచ్ఛ♦గను జెలంగి
పరుగులెత్తుచు విక్ర♦తరవము లొనరించుచును బోయి; రంతట♦ఘనబలమునఁ

తే. బలికె నొక్కఁడు రావణుఁ ♦ డలుకపూని
యనికి వచ్చినఁ జంపెద ♦ నతని నేనె
యనుచు; నేరావణునిఁ జంపి ♦ జనకతనయ
శ్రమమునం గంపమొందెడు ♦ సాధ్వి నిటకు. ౧౧ 1689

క. కొనివచ్చెద నిప్పుడె మీ, రనుమానము లేక నిలువుఁ ♦ డంచును నిట నం
చని యొకఁడు పలికె; నేనే, జనకజఁ గొనివచ్చెదన్ ర♦సాతలసీమన్. ౧౨

ఆ. వసతి చేసియున్న ♦ బలమున ననిపల్కె
నొకఁడు; భూరుహముల ♦ నొక్కరీతిఁ
ద్రుంచివైతు నేను ♦ దొర్లింతుఁ గొండల
నేను ననుచు నొకఁడు ♦ పూని పలికె. ౧౩ 1691

చ. ధరణిఁ బగుల్తు నేననుచు ♦ ధైర్యము మీఱఁగఁ బల్కె నొక్కఁ; డే
నరిగి సముద్రము ల్గలఁత♦నంద నొనర్చెదనంచు నొక్కఁడుం
గరము ప్రగల్భవాక్యములను ♦ గాఢరవంబునఁ బల్కె; నంత నొ
క్కరుఁడనె నొక్కయోజనము ♦ గ్రన్నన దాఁటెద శక్తియొప్పఁగన్. ౧౪

క. శతయోజనములు దాఁటెద, శతయోజన మెంత నాకు ♦ సమధికదూరం
బతిజవమున దాఁటెద నే, నితరులు పొగడంగ ననిరి ♦ యెంతయుఁ బూన్కిన్.

చ. ధరణిని సాగరంబులను ♦ ధాత్రిధరంబులఁ గాననంబులన్
ధరణికిఁ గ్రిందిలోకమునఁ ♦ దద్దయు శక్తిని నడ్డులేక సం
చరణము చేయఁగాఁగలను ♦ శౌర్యము మీఱఁగనంచుఁ బల్కె నొ
క్కరుఁ; డవు డివ్విధంబున న♦ఖండబలంబుల వానరుల్ కపీ
శ్వరుఁడు వినంగఁ బల్కిరి వి♦భంగపరాక్రమయుక్తులై తగన్. ౧౬ 1694

నలువదియైదవ సర్గము సంపూర్ణము

---

౪౬ - వ సర్గము.

సుగ్రీవుఁడు భూమండలజ్ఞానము తనకుఁ గల్గినరీతి రామునితోఁ జెప్పుట.

చ. వనచరముఖ్యు లిట్లరుగ ♦ భాస్కరపుత్రునిఁ గాంచి రాముఁ డి
ట్లనియెను క్షోణిమండలము♦నంతయు నెట్టు లెఱింగితీవు నా
విని కపివర్యుఁ డంత రఘు♦వీరునకుం బ్రణమిల్లి యివ్విధం
బున వచియించె; నో పురుష♦పుంగవ! సర్వమెఱుంగఁ జెప్పెదన్. ౧ 1695

తే. ఆలకింపుము దుందుభి♦యనెడు దనుజ
వరుఁడు మహిషాకృతిని దాల్చి ♦ వచ్చి వాలి
ననికిఁ బిల్వఁగ వాలి యా♦తనిని మలయ
పర్వతగుహాకుఁ దఱిమె; దో♦ర్బలము మెఱయ. ౩ 1696

చ. దనుజుఁడు నబ్బిలంబుఁ జొఱఁ ♦ దానును వాని వధించుకొఱ్ఱకేఁ
జనియెను లోని; కంత నను♦జన్ము వినీతుని నన్ను ద్వారసీ
మ నునిచెఁ గాపుగా; నవల ♦ మామకసోదరుఁ డబ్దపూర్తియై
నను నటనుండి రాకయె పె♦నంగుచు నుండెను దానవేంద్రుతోఁ. ౪ 1697

క. బిలమంత రక్తపూరం, బులతోఁ డఁ నిండె దానిఁ ♦ బొడఁగని నేనుం
గలవిలపాటచ్చెరువును, బొలయుట మదిలోనఁ గాంచి♦పుంగవున కనిఁ. ౫

ఆ. ఏమిసంభవించె♦నో? మాయరక్కసు, చేత నచుచు వగలఁ ♦ జెంది వినముఁ
దిన్నవానిపగిది ♦ దీనుఁడనైతి నా, యన్న జెగిమోఁ గలన ♦ నన్నబుద్ధి. ౬

క. కలిగె న్నాకంతట; నా, బలశాలి సురారి యందె ♦ పడియుండంగా
వలయును రాఁజాలక యి,మ్ముల మృతిఁగన వలయునన్న♦బుద్ధిని నేనుఁ. ౭

తే. ఆమహాద్వారమునఁ గొండ♦యంత గండ
శిలనమర్చియె గప్పితిఁ ♦ జిత్తమందు
వాలిజీవితమందాశ ♦ వదలి పురికి
వచ్చి తారను రుమను గొ♦ప్పదగు సిరిని. ౮ 1701

క. పరమమగు రాజ్యపదమును, బరిగ్రహించితిని సచివ♦వర్యయుతుఁడనై
పురివసియించితి విగత, జ్వరుండనయి; యంత దనుజ♦స త్తము నదిలోఁ.

క. తనశక్తిఁ జంపి వాలియు, జనుదెంచెను; నేను నంత ♦ సాధ్వసమున నె
మ్మనమున వడఁకఁగ గౌరవ, మునరాజ్యము నొసఁగితిఁ బ్ర♦భూతనయమునఁ.

చ. అతఁడును దుష్టబుద్ధిఁగొని ♦ యాగ్రహమూని ప్రచండశౌర్య ము
ద్ధతియును గ్రాల నింద్రియవి♦తానములెల్లఁ గలంగ నన్నుఁ బం
చతఁ గనఁజేయఁగాఁ దలఁపఁ♦బాఱితి మంత్రులతోడఁగూడి వే
యతఁడును గోపమూని నను ♦ నారయుచుం జనుదెంచెఁ జంపఁగఁ. ౧౧

ఆ. వాలి సాధ్వసంబు♦వలన మంత్రులఁ గూడి, బహువిధంబులైన ♦ వనతటినుల
నగరములను గనుచు ♦ బెగడొంది పాఱితి;, ధరణినెల్ల గ్రొమ్మ♦రంబురీతి.

తే. అద్దముంబోలెఁ గొఱవి చ♦క్రాకృతిగతిఁ
గంటి నేనును వాలియు ♦ వెంటనంటి
వచ్చుచుండంగ వడివడిఁ ♦ బరుగువాఱి
తూర్పునకుఁ బోయి బహువిధ♦ద్రుమవితతుల. ౧౩ 1706

క. ధరణీధరముల నదులను, సరస్సులను గంటి; నట వి♦శాలంబగుచుం

బరఁగుచు గైరికధాతూ, త్కరమండితమైన యుదయ♦ధరణీధరముౕ. ౧౪½

క. అనిశం బప్సరసలచే,తను సేవింపంగఁబడుచుఁ ♦ దద్దయు బెడఁగై
కనఁబడు క్షీరసముద్రముఁ, గనినాఁడను; బ్రాక్కునుండి ♦ కడువేగమునౕ.

ఆ. మరలివచ్చుచుండ ♦ మాయన్న నావెంట
నంటి తఱుమ మరలి ♦ యచటినుండి
వింధ్యశైలవృక్ష♦వితతిసంవ్యాప్తమై
చందనద్రుమాళి♦సాంద్రమగుచు. ౧౬½ 1709

క. తనరారు దక్షిణాశకుఁ, జనఁగాఁ బరుగెత్తినాఁడ ♦ సరగున నందుం
గనుపట్టు వృక్షగిరినదు,లను గాంచుచుఁ బోవ నన్న♦లఘువిక్రముఁడై. ౧౭½

క. మాయన్నతఱిమె నేనును, గాయము చేష్టలను దక్కఁ♦గాఁ బడమరకుౕ
బోయితి నటఁగల తరుసము,దాయము గిరిదేశములను ♦ దగ నస్త్రాద్రిౕ. ౧౯

క. కని యందె యున్ననన్నును, గనలుచు మాయన్న తఱుమఁ♦గా నుత్తరది
క్కునకుం బోయితి నచటితు,హినగిరిమేరుక్షమాధ♦రేంద్రంబులనుౕ. ౨౦

క. ఉత్తరజలనిధిఁ గంటిౕ, జిత్తము పొగులంగ నెచటఁ ♦ జేరిన నతఁడా
యత్తమతియాచుఁ దఱుమఁగ, నెత్తఱి శరణంబులేక♦యే నుండంగౕ. ౨౦½

తే. బుద్ధిసంపన్నుఁడౌ వాయు♦పుత్త్రుఁ డిట్లు
పలికె ననుఁజూచి; కపిరాజ! ♦ యలమతంగ
మౌని యీయాశ్రమంబుల ♦ మండలమును
జూర్చి హరిపతియా వాలిఁ ♦ గోపమూని. ౨౧½ 1714

క. మును శపియించెను గాదే, వనచరనాథా! యదిప్డు ♦ బాగుగ నానె
మ్మనమునఁ దోఁచినయది; యా, మునిశాపమువలన నుటజ♦మునువాలిత్రగౕ.

క. చొచ్చినయెడ నాతనితల, యచ్చుగ శతశకలములుగ ♦ నవనిఁబడుఁగదా
యచ్చట సుఖముగ నుండుద, మిచ్చుగ నుద్విగ్నులమయి ♦ యెల్లరమింకౕ.

చ. అనవిని యోరఘుప్రవర! ♦ యంతట నేనును బుశ్యమూకముం
గనఁ జనుదెంచినాఁడఁ గపి♦కాంతుఁడు వాలి మతంగమౌనిభీ
తిని నిట రాకయుండెను; క్షి♦తిప్రవరా! రఘువంశభూషణా!
విను మపుడేను నివ్విధిని ♦ విశ్వము నంతయుఁ గన్నులారఁగౕ. ౨౪½ 1717

క. కనినాఁడ నంతటౕ వచి,వనికరమును గూడి మౌని♦వర్యుని శాపం
బున వాలి చొరఁగ నేరని, ఘనగిరి నిద్దానిఁ జేరఁ ♦ గలిగితిఁ దండ్రీ!. ౨౫

నలువదియాఱవ సర్గము సంపూర్ణము.

## ౪౭ - వ సర్గము.

[illegible]

చ. వనచరనాథు నానతిని ♦ వారిజనేత్రను జూడఁగోరి వ
వ్వనచరులెల్ల దిక్కులకుఁ ♦ బంపము లాడుచు వేగఁబోయి యం
త నదుల పట్టణమ్ముల ల♦తాభవనంబుల నెన్నిచేసి పో
ట్లను నగరంబులం దటిను♦లం జొరరాని మహీరుహంబులన్. ౧  1719

క. గిరులను సీతాదేవిని, బరికించుచుఁ గీశసంఘ♦పతియాజ్ఞను వా
నరయూథపులెల్లను భూ,ధరవనకాననములెల్లఁ ♦ దగ వెదకి యటన్. ౨  1720

*చ. జనకజఁ గాంచుకార్యమునఁ ♦ జాలఁ బ్రయత్నము సల్పియే దినం
బునఁ బగలంతయున్ వెదకి ♦ భూమిని రాత్రియందు నొక్కచో
టను గుమిగూడుచుండిరి, మృ♦గంబగు విక్రమ మొప్పుచుండ న
వ్వనచరు లానెలంగలది♦నంబుల సీతను నెల్లతావులన్. ౩  1721

ఆ. వెదకి రాత్రులందు ♦ వివిధకుసుమఫల,ములను నెలయుబ్బ♦ములను జేరి
యందుఁ బండుకొనుచు ♦ నవ్వల నరుగుచుఁ, గాంచి కాంచి సీతఁ ♦ గానలేక.

సీ. పయనంబు చేసిన♦పగలు మొదలుకొని నెల నిండునంతకు ♦ నిలువు నింగి
వెదకి నిరాశులై ♦ విభునియొద్దకు వచ్చి వృత్తాంత మెఱిఁగించి ♦ వేగ మాల్య
వంతమన్ శైలంబు♦చెంతకుఁ బోయిరి; బలశాలి వినతుఁడన్ ♦ ప్లవగవిభుఁడు
సచివులతోఁ గూడి ♦ తన్నృపతిచెప్పినవిధముఁ బ్రాగ్దిక్కు ♦ వెదకి సీతఁ

ఆ. గాన కరుగుదెంచెఁ ♦ గపిపతి శతబలి
యుత్తరమున వెదకి ♦ యుర్విపుత్త్రిఁ
గాన కరుగుదెంచెఁ ♦ గపిసైన్యములఁ గూడి;
యంత నానుషేణుఁ ♦ డధికబలుఁడు. ౫  1723

క. వనచరులఁ గూడి పడమర, గనుఁగొని మాసంబు నిండఁ♦గా సేనలతోఁ
జనుదెంచె నధిపుచెంతకు, జనకజనుం గానకుండ ♦ స్వాంతము దూలన్. ౬

ఆ. వారలెల్లఁ బ్రస్ర♦వణపర్వతంబున, రాముఁ గూడినకపి♦రాజునొద్ద
కరుగుదెంచి మ్రొక్కి ♦ యణఁకువ నిట్లని, రఖిలగిరులఁ గాన♦నాటవులను.

క. జనపదముల నదులను న,వ్వననిధితీరముల నెల్ల♦ భంగుల సీతాం
బను వెదకితి మీవు వచిం,చిన గుహలన్ వెదకితిమి వి♦చిత్రగతులతోన్ ౧౧

సీ. తీఁగజొంపమ్ముల♦తోఁ గూడిన మహాత్తరములగు గుల్మంబు♦ల మఱి దుర్గ
మప్రదేశంబుల ♦ మనుజులు చొరరాక విషమంబులైన బృ♦హత్స్థలంబు
లను పూన్కి వెదకితి ♦ మనితరసాధ్య ప్రమాణదేహమ్ముల ♦ మలయుచున్న
ప్రాణులఁ గనుమను♦రావణుఁడో? కాఁడో? యని వెదకుచు మృతి ♦ నందఁ జేసి

* విచిత్య దివసం సర్వే-అని మూలము.

తే. తిమి, మహాబలయుక్తి వం♦శమున హనుమ,జననిఁ గాంచినవాఁడు సు♦సత్త్వశాలి
జనకసుతయున్న దెసకుఁ దా♦జనినవాఁడు,గాన సీతను గాంచి రాఁ♦గలఁడతండె

నలువదియేడవ సర్గము సంపూర్ణము.

---

## ౪౮ - వ సర్గము.

హనుమదాదులు దక్షిణమున సీతను వెదకుట.

క. అనిచెప్పి రంత; శ్వసనుని, తనయుఁడు తారాంగదాది♦దర్పోజ్జ్వలకీ
శనిచయయుతుఁడై దక్షిణ,మునకుం జని వానరౌఘ♦ముఖ్యు ననుమతిన్. ౧

క. ధరణీస్థలముల వెదకం, బరమానరుఁ డయ్యె; నతఁడు ♦ వనచరవీరో
త్కరములతో బహుదూర, మ్మరిగి యటన్ వింధ్యగిరిగు♦హలగహనములన్. ౨

ఆ. పర్వతాగ్రములను ♦ బహుదుర్గమస్థలం,బులను భూరివృక్ష♦ములఁ గొలఁకులఁ
జాలుగాఁ జెలంగు♦క్ష్మారుహప్రతతుల, ఘనతరువుల వెలయు ♦ క్ష్మాధరముల. ౩

క. జనకజ వెదకిరి; వీర్యం,బునఁ దగు నక్కపులు యామ్య♦మున నెల్లెడలం
గనినను జనకనరేంద్రుని, తనయయుఁ గనరాకపోయె ♦ ధారణి నెందున్. ౪

చ. ఫలముల మూలపర్ణముల ♦ భక్షణముం దమిమీఱఁ జేయుచున్
బలము చెలంగఁ బట్టుదల ♦ వర్ధిలుచుండఁగ దుష్ప్రధర్షులై
యిలసుత నట్టె చూచుచు న♦హీనజవంబునఁ బోవుచున్ మహీ
స్థలముల నందునందును ని♦తాంతము కష్టముపోవ నిల్చుచున్. ౫ 1732

సీ. చనుచుండి రావింధ్య♦శైలప్రదేశంబు బహుగుహావళులును ♦ గహనములును
గలయది కాన న♦క్కడఁ బరికించుట కష్టతరంబగు ♦ క్ష్మాస్థలమది
జనశూన్యమగుచు ని♦ర్జలమయి గహనమై కనఁగ గగుర్పాటు ♦ గలుగఁజేయు
చును నొప్పు; వనచర♦శూరులందఱు దాని విడిచియట్టివె యగు♦విపినములను

తే. వెదకి మిక్కిలి యలసట ♦ గదురఁ గుంది
యట్టి చొరరాని మఱియొక♦యడవి నెందు
భయము నొందనివారౌట ♦ బరవసమునఁ
జొచ్చి; రా దేశమునఁ దరు♦స్తోమమెల్ల. ౬ 1733

క. ఫలరహితంబయి పుష్పం,బులు లేకయె పర్ణహీన♦ముగ నొప్పును నం
దలినదులు సర్వకాలము, జలహీనము లగుచునుండు♦సైకత మొప్పన్. ౭

క. మూలమ్ములు లభియించుట, చాలఁగఁ గష్టంబు మహిష♦సామజమృగశా
ర్దూలము లుండవు పక్షుల,జాలము గనరాదు, వన్య♦జంతువు లెవియున్. ౮

క. కనరావు లలితతరువులు, కనఁబడ వోషధులు లతలు♦గాని పొదలునున్
గనఁబడ వందలి సరసులు, ననిశము స్థలములకునెల్ల ♦ నాకరములగున్. ౧౦

తే. మెట్టదామర లవ్వియు ♦ మిగులఁ బూచి
వాసనలు నెల్లచోఁ బర్వఁ ♦ బక్షములును
జక్కఁగాఁ నొప్పు సాధుకృ♦త్యంబులగుచు
నుండుఁ దుమ్మెదలెల్ల నం♦దుండ వెప్పుడు. ౧౧ 1737

చ. మునిపతి కండునామకుఁడు ♦ ఘోరతపోధనుఁ డుగ్రకోపి మా
ననిచయసత్తముం డొకఁడు ♦ నిల్చి యటం దపమాచరించు న
య్యనఘుఁడు సూనృతవ్రతుఁ డ♦హార్యమహత్తరసత్ప్రభావుఁడై
తనయుఁ డదీయపుత్త్రకుఁడు ♦ తద్వనమం దొకనాఁడు స్వేచ్ఛగాన్. ౧౨

క. తిరుగుచుఁ బదాఱుసంవత్సరముల ప్రాయమున నొప్పి ♦ దైవగతిన్ వే
మరణించెఁ బుత్త్రమృతి క, య్యరణ్యమునఁ గోపమూని ♦ యమ్మునిపతియున్.

చ. నిరతము ధర్మచిత్తుఁడయి ♦ నిర్భరయోగము నూను నాతఁ డా
తరుణమునన్ శపించెను ప♦తత్త్రులకేని మృగాళికేని యె
వ్వరికిని గాని యయ్యడవి ♦ వాసముచేయ నశక్యమై వసుం
ధరఁ దగునంచుఁ గ్రోధమునఁ ♦ దాళఁగలేకయె సత్వరంబుగన్; ౧౪ 1740

చ. వనచరవీరు లందఱును ♦ బర్వతమందు గుహావళిం దగన్
జనతతి శూన్యమై తగు వి♦శాలవనంబుల నెల్ల పుట్టుచో
ట్లను బలుపూన్కిమై వెదకి ♦ లక్ష్మిసమానను సీతఁ గానమిన్
మనములఁ గుందుచున్ సతము ♦ మర్కటనాథహితైషు లాటచేన్. ౧౫

ఆ. తిరిగి తిరిగి చాల ♦ దీనతఁ గని మఱి, యెల్లచోట్ల వెదకి ♦ యెందు సీత
నపహరించినట్టి ♦ యలరావణునిఁ గాని, క్షోణితనయఁ గాని ♦ చూడరైరి.

చ. వనచరులంత ధైర్యమున ♦ వారనిపూన్కి లతాళిగుల్మముల్
ఘనభయదంబులై వెలయ♦గాఁ గనుపట్టు మఱొక్కభాగముం
గని యటఁ జొచ్చి క్రూరతర♦కర్ము సురౌఘవిరోధి నిర్భయున్
దనుజుని నొక్కనిం గనిరి ♦ ధాత్రిధరంబన నొప్పువానినిన్. ౧౭ 1743

క. పెనుభీతి గలుగఁజేసెడు, దనుజుని నాతనినిఁ జూచి ♦ దట్టులఁ దగఁ గ
ట్టి నిలిచి రందఱు యుద్ధం, బున కాతఁడు పర్వతములఁ ♦ బోలినకవులన్. ౧౮

క. కని బల మలరఁగ నిట్లని, యొను జచ్చితి రిదిగో మీర♦లెల్ల ననియె; న
ద్దనుజుం డంతటఁ గ్రోధం, బునఁ బిడికిలి పట్టుకొనుచుఁ♦బోయెఁబయిఁ బడన్.

క. దనుజుఁడు పైఁ బడవచ్చుటఁ, గని వాలిజుఁ డంగదుండు ♦ కఱకుదనుజు నా
తని రావణుఁగాఁ దలఁచుచుఁ, దనకరతలమునను జఱచె ♦ దర్పము పొంగన్.

క. సురవైరి యాతఁ డంగద, కరతలహతుఁడౌచు రక్త♦కణములు నోటం
గరము వెడలంగ నిలఁబడి, ధరణీధర ముర్విఁ బడువి♦ధంబున నంతన్. ౨౧

చ. దనుజుఁడు మృత్యువుం గనిన ♦ దర్పజయంబులఁ జెన్నుమీఱున
వ్వనచరు లాతఁడే దనుజ♦వర్యుఁడు రావణుఁడౌనటంచు న
జ్జనకజ యందెయుండునని ♦ సంతస మందుచు నాగుహాంగణం
బునఁ బలుభంగులన్ వెదకఁ ♦ బూనిరి కాంక్షలు పెంపుమీఱఁగన్. ౨౭

చ. వనమున నెల్లెడన్ వెదకి ♦ వారక తద్గిరిచెంతనున్న యిం
కనొకభయంకరాద్రిగుహఁ ♦ గాంచి తదంతరమందుఁ జొచ్చి; యం
దును గలయంగఁ జూచినను ♦ దోయరుహానన సీత యుండమిన్
వనటలఁ గుంది స్వాంతములఁ ♦ బాయనిదీనత నిర్జనస్థలం
బున నొకచోటఁ జేరి రురు♦భూరుహమూలమునందు నందఱున్. ౨౮ 1749

నలువదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ౪౯ - వ సర్గము.

హనుమంతుఁడు పెక్కుచోట్ల వెదకుట.

[1]చ. వనచరనాథపుత్త్రుఁడును ♦ ప్రాజ్ఞుఁడునై తగు నంగదుండు చ
య్యన వనరాజిలో వెదకి ♦ యంగము శ్రాంతిని బొంద సంకటన్
వనచరులం గనుంగొనుచు ♦ వారల నూఱడఁ జెందఁ జేసి యి
ట్లనియె; వనంబులన్ గిరుల ♦ నల్లె నదీతటసీమలం దొగిన్. ౧౫ 1750

సీ. దుర్గమగహనమం♦దును బిలంబులఁ గొండగుహాలను జనకుని♦కూర్మితనయఁ
జక్కఁగ వెదకితి; ♦ మిక్కడ నక్కడ జానకిగాని, యా♦సాధ్విదివిజ
కన్యకఁ బోలుచ♦క్కనిరాజపుత్త్రిని హరియించినట్టి య♦య్యసురఁగాని
కనరాకపోయిరి; ♦ కాలంబు చాలఁగాఁ గడచె; సుగ్రీవుఁడో ♦ కఠినశాస
తే. నుఁడుగదా శ్రద్ధఁబూని మీ♦రుడుగకెల్ల
తావులం దగ వెదకుఁడు; ♦ [2]తంద్రిఁగాని
శోకమునుగాని పొందక ♦ సొరిది పైనఁ
బడెడు నిద్రను బొందక ♦ పుడమితనయ. ౪౫ 1751

క. కనఁదగువెరవున వెదకం, జను; విసుకుం గనమి మదిని ♦ స్థైర్యము గనియుం
ట నిరతముత్సాహంబును, గనుటయు నివి కార్యసిద్ధిఁ ♦ గలుగంజేయున్. ౫౫

క. అని పెద్దలు వచియించిరి;, కనుకనె యిటు పల్కినాఁడఁ ♦ గడుదుర్గమమౌ
వనమున నిటవెదకుం డో, వనచరులారా! బలాభి♦వర్ధితు లగుచున్. ౬ 1753

తే. అలసటల మాని మరల న♦య్యడవి నెల్లఁ
గార్య మొనరించుచుండఁ ద♦త్కార్యఫల మ

---

1 సమాశ్వస్య శనైర్వచః-అనియూ. 2 తంద్రి=అలసట.

మును మొదటనుండి యెల్లెడ♦లను వెదకఁగఁ
బూని తిరిగిరి రాజాజ్ఞఁ ♦ బూని యపుడు. ౨౨ 1762

నలువదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

౫౦ - వ సర్గము.

హనుమదాదులు స్వయంప్రభను జూచుట.

చ హనుమయు వాలిపుత్త్రుఁడగు♦నంగదుఁ దారుని గూడి వింధ్యభూ
ధ్రనిఖిలకందరంబుల ను♦దారవనంబుల జానకీసతిన్
గనుఁగొనువేడ్కతో వెదకె; ♦ గాఢరయంబున సింహముల్ పులుల్
గనఁబడ దుర్గమంబులయి ♦ కన్పడుభాగములన్ శిలావళిన్. ౧½ 1763

*క. పెనుసెలయేళ్లను నదులను, జనకసుతన్ వెదకి యంత ♦ శైలంబునఁ గో
టిని దక్షిణపశ్చిమమును, గననేగిరి నియమితముగ ♦ కాలం బెల్లన్. ౨½ 1764

క. వారికి గడచెను; నచ్చట, ధారణి కాననగుహావి♦తాననిబిడమౌ
టారయఁగ దురన్వేషం, బై రహితజనౌఘమగుచు ♦ నతిభయదంబౌ. ౩½

చ. హనుమయు వానరావళిని ♦ నంతటఁ జేరువనుండ నిల్పి త
ద్వనమున నంచఱంగలిసి ♦ బాగుగ నెల్లెడఁ జూచెఁ దాను నం
త నతనివెంట వింధ్యగిరి ♦ దారుణకందరముఖ్యసీమలన్
గనుఁగొని రా గజుండు కపి♦కాంతుఁడు గాఁ దగు నాగవాతుఁడున్. ౪½

సీ. గవయు, శరభులును ♦ గంధమాదనసుషేణులును మైందద్వివి♦దులును నలుఁడు
జాంబవదంగదుల్ ♦ చారురూపుండగు తారుఁడు శైలవి♦తానయుక్త
ములగు భాగంబులఁ ♦ గలయంగ వెదకుచు యామ్యదిగ్భాగంబు♦లందు వెదకు
చును బోయిగురుబిలం♦బునుగాంచిరొకచోట; క్షుత్పిపాసలఁ జాలఁ♦గుందివార
తే. లలసటలఁజెంది త్రాగ స♦లిలములకయి
తిరుగుచుండఁగ బిల మొండు ♦ పరఁగె నందు
ఋక్షబిలమన మయునిచే ♦ రక్షితంబు
దుర్గమము పృథుతరముగఁ ♦ దోఁచునదియు. ౬ 1767

క. లతలును వృక్షములును సం,గతములుగా దానినిండఁ ♦ గప్పి వెలయును
న్నతములుగఁ గానఁబడియెన్, సతత మ్మందుండి క్రౌంచ♦సారసహంసల్. ౭

ఆ చక్రవాకములును ♦ సలిలంబులం దోఁగి
సరసిజముల రేణు♦సమితితోడ
నరుణములయి వెలయు ♦ నంగములను గల్గి
బయలు వెడలుచుండె ♦ బయలఁ జనఁగ. ౭½ 1769

---

* ఆనేగు స్తస్య శైలస్య కోటిం దక్షిణపశ్చిమామ్-అనిఘూలము.

చ. వనచరపుంగవుల్ సుచిర♦వాసన లొప్పఁగ దుర్గమంబుగాఁ
గనఁబడుచున్న యాబిలముఁ ♦ గాంచి మనంబుల విస్మయంబులం
గనిరి; మహోగ్రతాపములఁ ♦ గాంచి బలంబుల మీఱియున్నవా
రని మొనలైన వానరులు ♦ వన్యమృగావళి నిండియుండఁగన్. ౧౦. 1770

క. బలినిలయ మట్లు మారఁగ, వెలయుచు దుర్గమ్ముగుచు ♦ భీతిని మిగులన్
గలుగంజేయుచుఁ జేరఁగ, వలనుపడని యబ్బిలమును ♦ బహువిధఘోరతలన్.

క. కనియిది పాతాళంబో!, దనుజుల మాయయొ! యటంచుఁ♦దమదములన్ శం
కను బొందుచుఁ బోయిరి చెం,తను జేరఁగ; నంతఁ బవన♦తనయుఁడు మిగులన్.

క. గిరికూటప్రతిమంబగు, శరీరమున గహనవనవి♦సరమార్గములం
బరిచయము గల్గి పొందికఁ, బరఁగినవాఁడౌటఁ బలికె ♦ వనచరుల కటన్.

మ. మనమెల్లన్ శ్రమనాశ నెల్లెడల నా♦ర్తాప్రాప్తిని గాంచు వే
ద్యను శైలవ్రజదుర్గమంబులగు మా♦ర్గస్తోమమెల్లన్ దగన్
ఘనయత్నంబునఁ గాంచినార మెచటం ♦ గంజాతినిం గాన లే
వనటన్ మిక్కిలి బొందినార; మిచటన్ ♦ భాసిల్లు నీసద్గుహన్. ౧౪ 1774

క. మనభాగ్యంబునఁ గంటిమి, కనుఁడీ యిందుండి హంస♦గణవారసముల్
ఘనచక్రక్రౌంచంబులు, [1]వనములలో మునిఁగి వెడలి♦వచ్చెడుఁ జూడీ. ౧౫

చ. తరువులు దీనిద్వారమున ♦ దట్టముగాఁ గడునుందరంబుగాఁ
బరఁగెడు నిశ్చయం బిచట ♦ వారిపరిపూర్ణముగాఁ జెలంగి నుం
డరమగు కూపమొండెను హ్ర♦దంబయినం బరికింపనౌను; నా
హరిహయులెల్ల నట్లు పవ♦నాత్మజుఁ డాడిన నాలకించుచున్. ౧౬ 1776

[2]సీ. దానిఁ జొచ్చిరి మహా♦త్తరమగు బిలమది చంద్రసూర్యులప్రకా♦శంబు లేక
భయదమై గగ్గురు♦పాటుఁ బుట్టించుచు నంధకారావృత♦మై చెలంగఁ
గాంచిరి వారెల్లఁ; ♦ గడఁగి సింహంబులు బహువిధమృగపక్షి♦వారములును
వెడలిరాఁ గాంచుచు ♦ విపులాంధకారావృతంబగు భూరికం♦దరము దానిఁ

తే. జొచ్చి రయ్యెడ వారిచ♦క్షువు లేని
పౌరుషముగాని సుప్రభా♦వంబుగాని
గానఁబడదయ్యె వాయువు♦కైన నాటి
లంధకారంబునం బడి ♦ యటనిచట ౧౭ 1777

క. తిరిగిరి; కపికుంజరు లా, కరణిన్ వేగముగఁ బోయి ♦ కాంచిరి తేజ
స్స్ఫురణమున నొప్పి సుందర, తరమగు దేశమును నొకటఁ ♦ దమకము లలరన్.

క. పలువిధములైన వృక్షం, బులతో దుర్గమముగాఁగఁ ♦ బొలుపారెడు నా

---

1 వనములలో=నీటిలో. 2 నతేషాం సజ్జతే చక్షుర్న తేజో నపరాక్రమః, వాయోరివ గతి స్తేషాం దృష్టి స్తమసి వర్తతే-అనిమూ.

బిలమున నొక్కరినొక్కరు, కలఁగుచుఁ బట్టుకొని యంధకారమునందున్.

తే. యోజనం బొండు చనిరి యత్యుగ్రమగు పి
పాసచేఁ దొట్రుపాటొంది పయసుఁ గోరి
సంజ్ఞ దప్పియు వార లశ్రద్ధఁగొనక
కొంతకాలము చనిరి తత్కుహరమందు. ౨౨ 1780

తే. అలసి సొలసి ముఖంబులయందు దైన్య
మంకురింపఁగ జీవితమందు నాశ
విడిచి యంతటఁ గాంచిరి వెలుఁగు నంత
విగతతిమిరము శుభమునై వెలయుచోట. ౨౩ 1781

క. హరివరులు చేరి యాతివహా, కరణిన్ దీపించు వృక్షగణముల వరక
ర్బురమయముల సాలంబుల, సురపొన్నలఁ దాలముల నశోకతరువులన్.

తే. చంద్రలను నాగకేసరచంపకములఁ
గుసుమితములైన కొండగోఁగులను గాంచి;
రందుఁ జిత్రంబులయి సువర్ణాకృతిఁదగు
పూలగుత్తుల నెట్టచివృక్ష మఱియు. ౨౫ 1783

తే. మంచి శేఖరములను నభ్యంచితంబు
లైన లతలను బొల్పారి హాటకాభ
రణములే పండ్లుగాఁగఁ దరుణరవిరుచు
లవలె వెలుఁగొందుచును సువిలాసములను. ౨౬ 1784

సీసమాలిక:—

రంజిల్లి వైడూర్యరత్నవేదికలచేఁ గ్రాలుచు నిజరూపకాంతి నలరు
రజతవృక్షంబుల రమణఁ గాంచిరి; నీలవైడూర్యవర్ణముల్ వఱలఁ బత్రగ
సహితంబులయి బాల సరసిజబాంధవ సన్నిభభూరికాంచనసరోజ
సంవృతమ్ములయిన సరసిజలతలను స్వర్ణమత్స్యంబుల స్వర్ణకచ్ఛ
పములను నిర్మలాంభస్సుల నలరారు కొలఁకులఁ గనిరి కపులు మఱియును;
గనకగవాక్షముక్తాజాలవిలసితములగు విమానౌఘములను గనక
రజతమయంబుల; రమ్యసువర్ణరజతమయభౌమముల్ చాల వెలయ
వైడూర్యమణులచే భాసిల్లుచున్న గృహంబుల నెల్లెడ హరులు గనిరి;
పుష్పఫలంబులఁ బొదలి ప్రవాళంబులను బోలువృక్షంబులను సువర్ణ
షట్పదంబుల మఱి చారుమధువులను మణికాంచనవిచిత్రమహితశయ్య
లను నాసనంబులఁ గని రుత్తమములగు యానంబులను వారలంతె నచటఁ
గాంచనరాజతకాంస్యపాత్రచయంబులను దివ్యచందనమును నగరువు
లను శుద్ధరుచ్యమూలఫలంబులను, నుత్తమములగు పానకమహితమధువు
లను దివ్యవస్త్రంబులను, జిత్రకంబళములను శ్రేష్ఠాజినంబులను, దీప్త

వనితరో! చారుపుష్పముల ♦ భాసిలి సత్ఫలముల్ చెలంగఁ జ
క్కని పెనువాసనల్ పొలయఁ♦గాఁ బరిశుద్ధములై తనర్చు నీ
కనకమహీరుహంబులు త♦గన్ బ్రభవిల్లెను దేనిశక్తిచేన్. ౯౪ 1792

ఆ. విమలజలములందు ♦ నెలసె నెవ్వని ప్రభా,వమున స్వర్ణపద్మ♦వార మిద్ధి;
కనకమత్స్యములును ♦ గనకకూర్మంబులు, సంచరించెడు నివి ♦ సాధ్వి! యెట్లు.

క. తెలియవు మాకీవిషయం,బులు గావున నివ్వియెట్లు ♦ పొలుచు? స్వశక్తిం
గలిగినవో? మఱి యెవ్వరి, యలఘుతపోబలమువలన ♦ నలరారెడునో?. ౨౪

క. ఉన్నది యున్నట్లుగ నో,సన్నుతచరితా! వచించి ♦ స్వాంతంబులయం
దున్న ఘనసంశయంబులఁ, గ్రన్నన దీర్పుమని పల్కఁ♦గా విని యంతన్.

తే. సర్వభూతహితైషిణి ♦ సాధ్వి ధర్మ
చారిణియునైన యానారి ♦ సకలకపులఁ
గాంచి హనుమంతునిం గూర్చి ♦ కరుణఁ బలికె;
మహితతేజుండు దానవ♦మండనుండు. ౧౦ 1796

ఆ. మాయయందు నేర్పు ♦ మహిఁ బ్రవర్తిల్లఁగా
నలరు మయుఁడు తనమ♦హావిచిత్ర
శక్తినిందునుండి ♦ స్వర్ణవనము దీని
వెలయఁజేసె మఱియు ♦ లలితరీతి. ౧౦౪ 1797

క. కనకమయోత్తమభవనం,బును దీనిం గల్గఁజేసి ♦ పొగడొందినయా
దనుజుండె విశ్వకర్మగ, దనుజులకయి యుండెఁ గపివ♦తంసమ! యతఁడే. ౧౧౪

*సీ. ఈమహావనమున♦నే పెక్కువేలేండ్లు నిలిచి తపోనిష్ఠ ♦ నియతి జరపి
శుక్రప్రణీతమై ♦ శోభిలు శిల్పశాస్త్రంబెల్లఁ దనదగు♦ధనముగాఁగ
బ్రహ్మవలనఁ దగ ♦ వరమును బొందెఁ జూ! యంత మాయాబల♦మలరుచుండ
సకలకామసుఖాళి ♦ సంతృప్తిగాఁ బొంది యిమ్మహావనమున ♦ నెలమినుండి
కొంతకాలము చాలఁ♦గోర్కులు నొందుచు నివసించియుండె; దా♦నవవిభుండు

తే. హేమయను నచ్చరం గాంచి ♦ యింతియందుఁ
గామపరతంత్రుఁడై కూడి ♦ కడు సుఖములఁ
బడయుచుండుటఁ గని జగ♦త్పతి పురంద
రుఁడును వజ్రంబుఁ గొని కోప♦మడరఁ బూన్కి. ౧౮౪ 1799

క. దనుజేంద్రు మయునిఁ గొట్టెను;, జనె నాతం డిచటువాసి ♦ సరసిజజని యీ
కనకవనంబును, గనకభ,వనమును జిరభోగ్యదివ్య♦వస్తుచయంబున్. ౧౯ 1800

ఆ. హేమకొసఁగె; నోక♦పీశ్వర! మేరుసా,వర్ణితనయ నేను ♦ వనమున నిట
నిలిచి హేమవియగు ♦ నిర్మలసౌధాది,కముల నెల్లఁ బూన్కిఁ ♦ గాచుచుందు.

---

* పితామహా ద్వరం లేభే సర్వ మౌశనసం ధనమ్-అనిమూలము.

సంతఁ బెనుఁద్రోవత్రోవ భ♦యంకరోగ్ర
వితతి నిబిడ మహారంబు ♦ విషమమునయి. ౧౪ 1830

క. వరుణునకు నాలయంబై, పరఁగు సముద్రంబుఁ గనిరి ♦ పటుశక్తిమయూ
సురుఁడును దుర్గమములగు ని,ష్కరమహిమం జేసినట్టి♦పర్వతగుహాలోన్. ౧౫

క. వనచరులు వారు దనుకని, తినయున్ వెదకంగఁ గిరి♦ధరణీపతిచే
సిన సమయమైనమాసము, చనియెను; దర్వాతఁ గిరి♦సత్తములెల్లన్. ౧౬

క. అనయము పుష్పితపాదప,వనములఁ దగు వింధ్యశైల♦పాదంబున మె
ల్లనఁ గూరుచుండి చింతిం,చనుగారి; స్వీయకార్య♦పరిణతిఁ గనమిన్. ౧౭

చ. తరువులు పుష్పభారమును ♦ దాఁప భరింపఁగలేకయుండ సుం
దరలతలెన్నొ వంపలుగ ♦ ధాత్రిరుహాంబుల నావరించి య
క్కరణి వసంతచిహ్నములఁ ♦ గ్రాలఁగఁ గాంచి కపీంద్రభీతి యొ
వ్వరునను దప్పుదంచుఁ గపి♦వర్యులు చింతిలి రాకులాత్ములై. ౧౮ 1834

క. వనచరు లంత వసంతము, చనుదేనున్నదని శిశిర♦సమయం బెదియం
చనుచుఁ బరస్పరమును భీ,తిని బ్రశ్నించుచును జక్కఁ ♦ దెలిసికొని యటన్.

క. జనకజను గానకుంటయు, వనచరపతి యిడినగడువు ♦ త్వరగఁ జనుటయున్
గని పడిరి ధరణిపై భయ,మున శౌర్యములెల్లఁ బోవ ♦ బుద్ధులు గలఁగన్.

*క. కరివైరివృషస్కంధుం, డురుపీనభుజుండు వనచ♦రోత్తముఁడునునై
పరఁగి యువరాజు తారా,వరతనయుం డంగదుండు ♦ ప్రాజ్ఞుం డొటన్. ౧౯

క. వనచరవృద్ధుల మిగిలిన, వనచరులన్ మధురతరసు♦వాక్కు లలర మె
ల్లనఁ బల్కి గారవించుచు, వనియెం గృత్యంబు నెంచి ♦ యాదర మొప్పన్.

చ. హరివరులార! సూర్యసుతు♦నానతి నందఱ మిందు జానకిన్
దవ్వరపడి యెల్లతావులను ♦ దత్పరతం గన వచ్చినార, మా
తరుణి వెలంగు పెన్బిలము♦దాపుననుండఁగ మాసమయ్యె భీ
కరగతి దాఁటిపోయెను ద♦గన్ మదులం దది తోఁపలేదొకో!. ౨౧ 1839

సీ. ఆశ్వయుజంబను♦నట్టిమాసము మొదలందఱ మీమాస♦యంబుదనుకఁ
గాలంబు లెక్కిడి ♦ కార్యములకు నియమింపఁగాఁ జడితిమి ♦ తెంపుగల్గు
కపివర్యుఁ డనుపంగఁ ♦ గదలి వచ్చితి మిట నక్కాల మేగ జే♦యంగఁదగిన
పనియెద్ది? యింక; భూ♦పతికిని విశ్వాసపాత్రులై నాగ్రయైక♦పథ మెఱింగి

తే. స్వామిహిత మెప్డు కోరుచు ♦ సర్వకార్య
నిర్వహణచాతురిం దగి ♦ నేర్పులయి
మీర లున్నారు; కార్యంబు ♦ మించకుండ
సఫలముగఁ జేయుటనిని మీ♦శక్తి యరిది. ౨౩ 1840

* పతు సింహావృషస్కంధః-అనిమూలము

చ. అని యువరాజు వాలిసుతుఁ ♦ డాడిన వానరులెల్ల నొక్కరీ
తిని గరుణంబుగా ననిరి; ♦ తీక్ష్ణతరంబగు దుస్స్వభావముం
గను రవిసూనుఁ, డర్కకుల ♦ కాంతుఁడు రాముఁడు కాంతయందుఁ బ్రే
మను గనువాఁడు గావున క్ష ♦ మానుతఁ గానక యెల్లవారముల్. ౩౪ 1853

క. తనచెంతకు రాఁ గని రా,మునకుఁ బ్రియంబుగనె మనల ♦ ముందుగ వధియిం
చును సంశయంబు లే దిఁక, మన మగుపడఁ దగదు కీశ ♦ ముంగను దరికిన్. ౩౫

క. ఎవఁడపరాధ మొనర్చెనొ, యానీతుని కెదుర నాతఁ ♦ డరుగం డగదో
యువరాజ! సీతాదేవి వెదకి యవార్తనెల్ల ♦ విఫలములఁ దగఁగాన్. ౩౫

తే. ఎఱుఁగఁజాలితి మేని క ♦ పీశుఁ డగుచు
వీరుఁడా సూర్యతనయుఁ డే ♦ పేటి కరుగు
డము, మహీసుతవార్తసుం ♦ తయును దెలియ
దేని యిచటనె యసువుల ♦ నెల్ల విడిచి ౩౬ 1856

క. అరుగుదము యమునియింటికిఁ, బరువడి ననిరట్లు చాల ♦ భయమున వ్యథలం
గర మనుభవించు నవ్వన,చరులాడినపల్కులు విని ♦ నాథుతనూజున్. ౩౭

క. వారల కిట్లని చెప్పెను, దారుఁడు వగచుటయుఁ జాలుఁ ♦ దగ నామాటల్
మీరి ప్రవర్తించిన నీబిల, మేరీతిగనైనఁ జొచ్చి ♦ యిందుండ మిఁకన్. ౩౭ 1858

సీ. ఇది మాయచే రచి ♦ యింపఁగాఁ బడినదిగద, యట్టుగాన నొ ♦ క్కరణినైనఁ
జొరఁగరా దెవరికిఁ ♦ దరువులు జలములు భోజ్యపదార్థముల్ ♦ పుణ్యపాన
కద్రవ్యములు చాలఁ ♦ గాఁ గల విందులోఁ గాన వావార్తా మా ♦ కంతరంబు;
శక్ర రాఘవకపి ♦ సత్తములవలని భయ మినుమంతయుఁ ♦ బర్వదిచట;
తే. ననుచు నంగదు పల్కుల ♦ కనుమతించు
నట్లు తారుండు చెప్పిన ♦ యప్పలుకుల
వనచరుల్ విని కార్య మొ ♦ ప్పంగఁ జేయ
హింస గలుగదొ యటుచేయుఁ ♦ డిప్పు డనిరి. ౩౮ 1859

ఏఁబదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౫౪ - వ సర్గము.

హనుమంతుఁ డంగదుని యభిప్రాయము దూలనాడుట.

చ. హనుమయుఁ దారకాధిపని ♦ భాననుఁడై తగు తారుఁడిట్టు ల
వ్వనచరసంఘముం బలుక ♦ వాలిసుతుం డిఁకఁ గీశరాజ్యముం
గొనునని యెంచె; నయ్యనిలు ♦ కూర్మికుమారుఁడు వాలిపుత్రుఁడై
తనరెడు నంగదుం గని ని ♦ తాంతము బుద్ధిఁ దలంచె నివ్విధిన్. ౧ 1860

[1]సీ. శ్రవణశుశ్రూషలు ♦ గ్రహణము,ధారణ మట్లయూహాపోహ♦లర్థమెఱుఁగు
టయును దత్త్వమెఱుంగు♦టయు నను నెనిమిదిగుణములు గల్గి,నా♦ల్గువిధములగు
బలము లనఁబడు♦బాహుమనోబలంబు లుపాయబంధుస♦ద్బలము లలర,
దేశకాలంబుల♦ తెఱఁగెఱుంగుట దార్ఢ్య మెల్లకష్టములస♦హించుటయును
సకలమెఱుంగుట♦సామర్థ్యమునుబూన్కి_యూహాను వెలిఁబుచ్చ♦కుండుటయును

తే. సత్యశౌర్యంబు లితరుల♦శక్తి నెఱుఁగఁ
జాలుటయును, గృతజ్ఞత ♦ శరణుఁ జొచ్చి
నట్టివారలపై జాలి ♦ యాగ్రహమును
గనమి చపలతలేమి నాఁ ♦ గ్రాలు నివ్వి. ౩ 1861

క. పదునాల్గుగుణము లనఁగా, విదితములగు నివ్వి గలిగి ♦ వెలయు ననుచు నెం
చెఁ దనమనమ్మున; రుచిసంపద శశిశుక్లాది వరుసఁ ♦ బ్రబలెడురీతిన్. ౪

క. వసుసం దేజోబలములు, పరాక్రమము పెంపుమీఱఁ ♦ బటుబుద్ధిని నా
గురుతుల్యుఁ డగుచు శౌర్య,స్ఫురణంబునఁ దండ్రియట్లు♦పొలుచుచుమిగులన్.

[2]క. గురునీతి వినెడు శక్రుని, కరణిన్ దారోక్తి వినుచు ♦ త్సారవతి యగునా
సరసిజబాంధవపుత్రునిఁ, బరమార్థము చేయఁబూని ♦ బడలినవానిన్. ౮

తే. సర్వశాస్త్రవిశారదు ♦ శౌర్యసారు
నంగదుం గని పినతండ్రి ♦ కతఁడు వేఱు
పడక యనుకూలుఁ డగురీతిఁ ♦ బలుకఁ దొడఁగె
ననిలసూనుఁడు నీతివ♦చనము లలర. ౫ 1865

క. ధరసామదానభేదము, లరయన్ దండమనఁజాలు♦నట్టి యుపాయో
త్కరమునఁ దృతీయ మనఁగాఁ, బరఁగెడు భేదమునుబూని♦పవనతనయుఁడున్.

క. వనచరులెల్లను నంగదు, ననుసుతమున నాబిలంబు♦నందుఁ జొరఁగఁబూ
నినపని మాన్పను వాక్పటు,తను వానరు లతనిమాటఁ ♦ దలఁప రని మదిన్.

ఆ. నిశ్చయించుకొనుచు ♦ నిల్చి కోపవ్వరూ
పమయి నాల్గవదయి ♦ పరఁగుచున్న
యాయుపాయమూని ♦ యతిభయదములగు
పలుకులను వచించి ♦ వాలిజునకు. ౭ 1868

క. మనమున భయముం గల్గిం,చెను మరలం బల్కె నిట్లు; ♦ చిన్నికుమారా!
యని నీవు తండ్రికంటెను, ఘనుఁడవుగద! తండ్రియట్లె ♦ కపిరాజ్యంబున్. ౭౹

క. సరిగా వహింపఁజాలుదు, వరయన్ గపినాథ! వనచ♦రావళి యొప్పద

2 బుద్ధ్యా హ్యష్టాంగయాయుక్తం చతుర్బలసమన్వితమ్, చతుర్దశగుణం మేనే హనుమా న్వాలిన సుతమ్-అనియూ. దీనివ్యాఖ్యానాభిప్రాయము లిటఁ జెప్పఁబడినవని తెలియఁదగు. 2 శశ్వత్ పక్షే పరిక్రాంతమ్-అనియూ.

స్థిరచిత్తమునఁ జెలంగును, దరుణులఁ బుత్త్రకుల వీడి ♦ త్వత్స్మృతిరీతిన్. ౮॥

క. చరియింప నొల్ల దెంతయుఁ, సరిగా నీయెదుటఁ జెప్పఁ♦జాలదు విను వా
నరరాజు జాంబవంతుఁడు, గురుకపియగు నాసుహోత్త్ర♦కుఁడు నీలుండున్. ౯॥

క. నిను సేవించుచు నుండం, గను జాలరు; నేను నట్లె ♦ గావున సామా
దినిఖిలసదుపాయంబులఁ, గొని దండోపాయమైనఁ ♦ గొని మమ్మేల్లన్. ౧౦॥

క. ఇనతనయుచెంతనుండియె, నినుఁ జేరఁగఁ దీయలేవు ♦ నిశ్చయ మిది సూ!
విను బలహీనునితో బలమున నొప్పు జనుండు వైర♦మును గొనఁ జెల్లున్.

క. అని నీతివేత్త లందు ర,సని బలహీనుండు వగను ♦ బలవంతునితోఁ
గొనుటొప్పదు బలహీనుఁడు, దనుఁ గాచుకొనంగఁ దగుని♦తాంతముకానన్.

క. బలవంతునితోఁ బగఁగొను, టిల నేమాత్త్రంబు గూడ ♦ దివు డాత్మబలం
బులు లేకయున్న నీఘన, బిలమే రక్షకమటంచు ♦ వే తలఁచెదవో. ౧౩॥

సీ. తారుఁడీ బిలమని ♦ గారవంబునఁ జెప్పినట్టి యీగుహాను శ♦రాళిఁగూల్ప
మనలక్ష్మణునకు ధీ♦ఘనునకు లక్ష్యమే యల్పకార్యముగద ♦ యమరపతియు
మును మయనామక♦దనుజుని గూర్చి యీబిలముపయిన్ వజ్ర ♦ మలఘుగతిని
వైచి యల్పమె చేసెఁ♦బసివైరమున ద్వారమునుమాత్రమే తాను♦నొనరఁ జేసెఁ
తే. గాని లక్ష్మణుఁడో యివ్వు ♦ దీనిఁ బత్త్ర
పుటమువలె భీమనాయకం♦బులరు జీల్పఁ
గలఁడు; వజ్రాశనిసమాన♦ములు నసాన
శక్తికంబులు నగునట్టి♦సాయకములు. ౧౪॥ 1876

క. కలవెన్నియో గిరీంద్రం,బులనున్ ఛేదింపఁగలవు: ♦ పూని విరోధం
బల సుగ్రీవునితో నీ, బిలమున నీవుండునట్టి♦వృత్తిఁ గొనినచోన్. ౧౫॥

చ. వనచరులెల్ల నిన్వెలి ♦ వైళము నిశ్చితచిత్త మొప్పఁగాఁ
జనఁగల; రొక్కవేళ విడఁ♦జాలక నిన్నును గూడియుండఁగా
మనముల నెంచిరేని తమ♦మానినులన్ సుతులం దలంచుకొం
చనయముఁ దాపమొందుచును ♦ నాఁకలిబాధలఁ జిక్కి దీనులై. ౧౬॥ 1878

తే. మంచిశయ్యలు లేమి ని♦ద్మహిఁ బరుండ
నేర కంతట వెనుకనె ♦ నిన్ను విడిచి
పోవఁగల; రంత మిత్త్రుల ♦ నీవు పాసి
హితము గోరెదు బంధుల♦నెల్ల వదలి. ౧౭॥ 1879

చ అనిలుని తాఁకునం గదలు♦నట్టి తృణంబునకంటె హీనతం
గని దిగులొంది కుందుదువు; ♦ గాఢరయంబును గల్గి వైరులం
దునుముచు నైపఁజాలనిగ♦తుల్ దగనొప్పెడు లక్ష్మణేషువుల్
నిను వవవృత్తుఁ జంపకయె ♦ నిల్వవు నమ్ము మహేంద్రపౌత్త్రకా!. ౧౮ 1880

క. విను మీవిఁక మాతోడం, జను దెంచి వినీతుఁడవయి ♦ సమధికభక్తిం
గనియున్న సంగదా! యా, యినతనయుఁడు తనకు వెనుక ♦ నేలమి మిగులంగన్.

క. వనచరరాజ్యంబునకున్, నిను నధిపతిఁ జేయఁగాఁడు ♦ నీదు పితృవ్యం
డును ధర్మాత్ముఁడు ప్రీతిని, గనఁ జేయు దృఢవ్రతుండు ♦ గడు శుచియు నగున్.

తే. మఱియు సత్యప్రతిజ్ఞుఁడు ♦ మహితకరుణుఁ
డట్టులౌట నొకప్పుడే ♦ సతఁడు నిన్నుఁ
జంపనొల్లఁడు; వినుము నీ♦జననియందుఁ
బ్రియము గలవాఁడు గోరుఁ ద♦త్ప్రియమె సతము. ౨౧ 1883

చ. వనచరనాథుప్రాణములు ♦ వారక నీజననీవశంబులే
తనయుఁడ వామెకీవె కద ♦ తప్పక రాఁజను నీకు వానరే
శునకును నీవు దక్క తను♦జుల్ మఱి లేరు గదా యెటుంగవే
గనుక విభీతి నీవు చనఁ♦గాఁ దగు నాతనిపాలికి యెడన్. ౨౨ 1984

ఏఁబదినాలుగవ సర్గము సంపూర్ణము.

---

## ౫౫ - వ సర్గము.

అంగదాదులు ప్రాయోపవేశము చేయుట.

తే. వినయయుక్తము ధర్మసం♦హితమునగుచు
స్వామిసత్కారయుక్తమై ♦ శ్వసనతనయ
సంప్రహితమైన యా వాక్య♦జాలము విని
యంగదుం డిట్లు పలికె నా♦హనుమతోడ. ౧ 1885

*సీ. ఆత్మశుద్ధియు స్థైర్య ♦ మానృశంస్యము మనశ్శౌచ మార్దవమును ♦ శౌర్యమట్లె
గాంభీర్యమును గపి♦కాంతునియందు లే వగ్రజుండగు శక్రు♦నాత్మజుండు
బ్రదికియుండంగనే ♦ పట్టమహిషియుఁ దత్ప్రియపత్నియును మఱి ♦ విమలధర్మ
మునఁ జూడఁ దనకును ♦ జననివంటిదియునౌ తారను లోకులు ♦ తలఁచి రోత

తే. గించుకొన స్వీకరించె; న♦చంచలాత్ముఁ
డైన తనయన్న యనిసేయు ♦ నద్రిబిలముఁ
జొచ్చునప్పుడు కావుంచి ♦ హెచ్చరించి
చనిన దానిఁ గప్పెఁ బా♦షాణముననుఁ. ౨ 1886

క. విను మిట్టివాని కెవ్విధ, మునఁ దెలియును ధర్మమార్గ♦ములు, తాను గరం
బును బట్టుకొనుచు సత్యం, బును జేసినయట్టి రాము♦మూర్తి ఘనబలున్. ౩౪

* భ్రాతు ర్జ్యేష్ఠస్య యో భార్యాం జీవతో మహిషీం ప్రియాం, ధర్మేణ మాతరం యస్తు
స్వీకరోతి జుగుప్సితః-అనిమూలమా.

క. తనకుపకారము చేసిన, ఘనకీర్తియుతుఁ మహాత్ముఁ ♦ గపిపతి మఱచెన్;
గనుక నితండు కృతఘ్నుం, డనఁగాఁ దగు నెవనియెడల ♦ ననిలతనూజా!.౫౭ 1888

సీ. "సేనలఁ బిలిపించి ♦ శ్రీరామునందుఁ గృపారసంబును గపి♦పతియుఁ జూపఁ
జేయందువో." విను ♦ మీతఁడు లక్ష్మణుభయమున జనకుని♦పట్టి వెదక
మనలఁ బంపెను వధ♦ర్మభయహేతువునకు భయపడి కాదుగా♦భానుతనయుఁ
డిట్టివాఁడౌటచే ♦ నిఁక ధర్మమాతనియందెట్టులుండునో ♦ యనిలతనయ

తే. యిట్టులు కృతఘ్నుఁ డతిపాపి ♦ స్మృతివిహీనుఁ
డతిచలాత్ముఁడునై నట్టి ♦ యర్కతనయు
నందుఁ దద్వంశజుఁడు జీవి♦తాశగలుగు
జనున కేయార్యునకును వి♦శ్వాస మొదవు. ౭ 1889

క. ఇనజుఁడు సుగుణయుతుండై, నను విగుణుండైన నాత్మ♦నందను రాజ్యం
బుననుంచుఁ గాని శత్రువు,తనయుఁ డనగు నన్ను బ్రదుకఁ♦దలఁచునె చెపుమా.

చ. విను పినతండ్రిబాధలకు ♦ వేసరి నే నపరాధముల్ బొన
ర్పను దగునంచుఁ జేసితిని ♦ వైరము గైకొని యీమహాబలం
బున వసియింత మన్నవిధ♦ముం దగ వెల్లడియయ్యె నేమనం
జనుఁ బ్రభుమంత్రముఖ్యగురు♦శక్తులు నాయెడ లేవు గావునన్. ౮౫ 1891

ఆ. ఇట్టి నే ననాథు♦నట్టులు గిష్కింధ, కరుగువాఁడ నేని ♦ యందు నెట్లు
బ్రదుకఁగలుగువాఁడ ♦ బలహీనుఁడనుగానఁ, గపివరుండు శతుఁడు♦ఘాతుకుండు.

తే. మఱియుఁ గ్రూరుఁడు కాన ధ♦ర్మమును గొనక
రాజ్యకారణమున నన్ను♦రాతి బంధ
నాదుల రహస్యముగ మృతి♦నందఁజేయు:
నురులలోఁ జిక్కి మృత్యువు♦నొందుకంటె. ౧౦ 1893

క. ప్రాయోపవేశమును గొని, యీయెడఁ బ్రాణముల మాను♦టే మేలగు నా
కో యనుచరులారా నా, కీయనుమతి నిచ్చి యిండ్ల♦కేగుఁడు మీరల్. ౧౧

క. వినుఁ డేఁ బ్రతిజ్ఞ చేసెదఁ, జను దేరఁగఁ బూనఁ బురికిఁ ♦ జయ్యన వ్రతముం
గొని యిందె మృతిని బొందెద,*వని నిటఁ జచ్చుటయె మేలు♦వచ్చుటకంటెన్.

సీ. బలవంతులగు రామ♦భద్రలక్ష్మణులను గని నాకుగా మ్రొక్కి♦వినయయుక్తిఁ
గుశలంబు మీరడు♦గుఁడు వానరేంద్రున కభివాదన మొనర్చి ♦ యతనికుశల
మడుగుఁడు పినతండ్రి♦యగురాజు నతఁడగుఁ; బినతల్లియైనరు♦మను బ్రియంబు
గాఁ గనుంగొని యడ♦గందగు నారోగ్యకుశలంబులను నాదు♦మూర్తి జనని

తే. యైన తారను దేర్పుఁడీ ♦ యర్థవచన
ములను, నాతల్లి తానై జ♦ముగ నె పుత్ర

* త్రేతా మరణమేవ మే-ఆనియాలయః.

వాంఛ గలయది ప్రీతియుఁ, ♦ బలుకఁజాల
నామెఁ దలఁచిన జాలి నా♦కలరకున్నె. ౧౭ 1896

క. నను దయమెయిఁ గాంచెడు నా, జననియు నేచింద నిట్లు ♦ చచ్చుట వినినేఁ
దనజీవితముల విడుచును, వినుఁడిది సత్యంబటంచు ♦ వివరించి తగన్. ౧౭½

చ. వనచరవృద్ధులుం గనుచు ♦ వారికి వందన మాచరించి తా
మనము గలంగ నేడ్చుచు కు♦శాస్థలి దర్భలపైఁ బరుండెఁ; ద
య్యనఘుఁడు వాలిసూను డిటు♦లుండుఁ బరుండఁగఁ గాంచి వృద్ధులౌ
వనచరు లన్యులున్ వగచి ♦ పట్టఁగఁ జాలనిచింతలం దగన్. ౧౮½ 1899

ఆ. కనులనుండి బాష్ప♦కణములు వేఁడిగాఁ, గాఱ నేడ్చి రంతఁ; ♦ గపివరేణ్యు
లర్కతనయుఁ దిట్టి యం♦వ్వాలి నుతియించి, చుట్టుముట్టి వాలి♦సుతుని నపుడు.

తే. తాముఁ బ్రాయోపవేశ మా♦తనిని గూడి
చేయఁగా నిశ్చయంబును ♦ జేసికొనిరి;
వారు తన్మత మెఱిఁగి య♦బ్బంగి నొనరు
చుటయె యుత్తమమనుచు నెం♦చుచును వేగ. ౧౯ 1900

క. సలిలంబుల స్పృశియించుచు, బలువిడి నుత్తరతటైక♦భాగంబున ద
ర్భల యామ్యాగ్రంబులుగా, నలరించుచుఁ బ్రాఙ్ముఖముగ♦నందఱుపూనిక్కన్.

తే. వానిపైని బరుండి రి♦బ్బంగిఁ దాము
మరణమొందుట మేలని ♦ మదులనెంచి
యంత రాముండు వనమున ♦ కరుగుదెంచు
టయు దశరథుఁడు మృతిఁ బొందు♦టయును వినవ. ౨౧ 1902

సీ. ఆజనస్థానంబు♦నందు ఖరాదులఁ జంపుటయును నంత ♦ జనకజాప [ముఁ
హారణంబును జటాయు♦వనిఁజచ్చుటయుయుద్ధమున వాలి నొకశర♦మునసౌరా
దంత మొందించుట ♦ యర్కజుపై రాముఁ డాగ్రహించుటయును ♦ నవల సీత
వెదకంగ వానర♦వీరుల సుగ్రీవుఁ డఖిలదిక్కులకును ♦ ననుపుటయును

తే. దమకు రానున్నభయమును ♦ దప్పకుండ
మొదటినుండియు నక్కపి♦ముఖ్యు లచటఁ
జెప్పుకొనుచుండి; రట భూరి♦శిఖరిశిఖర
సమత నొందెడు నక్కపీ♦శ్వరులు నియతి. ౨౩ 1903

చ. వ్యసనములు గల్గఁ జెప్పుచును ♦ త్క్షాస్థలిపైని బరుండి రంతటన్
ఘనములు ఘోరభంగిగను ♦ గర్జనముల్ పొనరించుచాడ్పునన్
జెనురవ ముప్పతిల్లి యట ♦ భీమగిరీశ్వరకందరాంతరా
ళిని బ్రతినాదముల్ గలుగ ♦ లీల నొనర్చెను శోకమాఱుగన్. ౨౩½ 1904

ఏఁబదియైదవ సర్గము సంపూర్ణము.

## ౫౭ - వ సర్గము.

సంపాతి వచ్చుట, వానరుల కలవరము.

*క. వనచరులెల్లను భూధ్రం, బున దగఁ బ్రాయోపవేశ♦మును గొని శయనిం
చిన యచటికి గృధ్రేశ్వరుఁ, డనఁబడు సంపాతి రాఁగ♦ నారంభించెన్. ౧

సీ. చిరకాలజీవియు ♦ శ్రీమంతుఁ డా జటాయువునకు నన్నయు ♦ నుగ్రశౌర్య
బలములు విఖ్యాతిఁ ♦ బడసినవాఁడును నైన సంపాతి విం♦ధ్యాద్రికంద
రమునుండి వెలువడి ♦ ప్రాయోపవిష్టులై యటనున్నకపులను ♦ నంతటఁ గని
సంతుష్టుఁడై యిట్లు ♦ చక్కఁగ వచియించె; జగమున దైవంబు ♦ జనులకెల్ల
తే. క్షేమములఁ గూర్చుచుండును ♦ జిత్తమునకు
ముదము గల్పించు నీభక్ష్య♦మును బహుదిన
ములకు నాకును గల్పించెఁ ♦ జెలఁగి యిద్ది
నాకడకె వచ్చినది తనం♦తన విధిగతి. ౪ 1906

క. వనచరులనెల్ల నొక్కొ, క్కనిగా నేఁ జంపి చంపి ♦ కడుఁ దమిమీఱం
దినియెదనని వానరులం, గని పల్కెను నిట్లు గృధ్ర♦కాంతుఁడు కడఁకన్. ౫

క. తనతిండికొఱకుఁ జేరా,శను గొని యనునట్టి వాక్య♦జాలము వినుచుం
బెనుభీతిఁ బొంది యంగదుఁ, డనియెన్ హనుమంతుతో మ♦హార్తిం గనుచున్.

క. వనచరుల విపత్తికి సూ,ర్యనితనయుఁడు యముఁడు తానె ♦ యుగ్రగృధ్రంబై
చనుదెంచినాఁడు పవనజ, కనుమా! యిచ్చటికి జనక♦కన్య నెపమునన్. ౭

చ. నరపతికార్యముం దగ నొ♦నర్చినవారము గాము వానరే
శ్వరువచనంబుఁ జేయుటకుఁ ♦ జాలినవారము గాము వాయుజా!
త్వరపడి యింతలోనె యిటు♦వంటివిపద్దశ సంభవించె ని
ట్లురవడి వచ్చునంచు మన♦యూహయు సాఁగ లేదుగా కటా!. ౮ 1910

చ. జనకజకుం బ్రియంబు తన♦స్వాంతమునం దమిఁ జేయఁగోరి గృ
ధ్రనృపతి యజ్జటాయువు ని♦తాంతము చేసినకార్యమంతయున్
వినినదియేకదా సతత♦వీరునిభంగిని నెల్లప్రాణులున్
మనవలె రాఘవప్రియము ♦ మానకచేయఁగఁ గోరి యాదృతిన్. ౯ 1911

ఆ. వరలుచున్నవారు ♦ ప్రాణాళిఁ దిర్యక్కు, లట్లె వరలుచున్న ♦ వాత్మజీవ
ములను బ్రాణులెల్లఁ ♦ జెలిమికిఁ గరుణకుఁ, గట్టువడుచు శక్తి ♦ గలిగినట్లు. ౧౦
తే. ఉపకృతిని వేఱు వేఱఁ దా♦రొనరిచెడిని;
ధర్మవేత్త జటాయు వా♦ధరణిపతికిఁ
దాను నుపకారమును జేయఁ ♦ దలఁచి తెగువఁ
దనువు విడుచుచుఁ బ్రియముచే♦సెనుగద తగ. ౧౧ 1913

---

* హారయా గృధ్రరాజ శ్చ తం దేశ ముపచక్రమే-అవిమా.

క. మనమా రాఘవునికై, వనులందుం దిరిగితిరి ♦ ప్రమదముల పై నా
శను మాని యుంటి మా రాఘవ, వనములకుఁ గల్గినాము ♦ సకలకపీంద్రుల్.

క. జనకజయు నింతవఱకును, గనఁబడ దారాముఁడికిఁ ♦ గా దానుకతో
గనిచేసి జటాయువు మృతిఁ, గనియెఁ బడియుక రణంబు ♦ గాఁ దే తెలఁగన్.

[1]క. వనచరములైన జంతువు, లనయము సుగ్రీవుభయము♦నందును గృతఘ్నుని కది తప్పెను సౌఖ్యంబును పరమంబైనగతిని ♦ బొందె జటాయువు నా

తే. అనిజటాయువుహతుఁ డగు♦టా దశరథుఁ, డంత మొందుట, నై దేహి ♦ యపహరింపఁ
బడుట వానరులకు నిట్లు ♦ ప్రాణసంశయంబు గలిగెను సేయుట♦గదఁ బవన!

సీ. రామలక్ష్మణులు ధ♦రాసుతతోఁ గూడి వనమున నుండుట ♦ వాలి రాము
శరమునఁ జెడుటయు ♦ గురుకోపమున రాముఁ డా జనస్థానంబు♦నందు నున్న
[2]యసురుల నెల్లర ♦ నని వధించుటయును నీవికారములు వ♦హించు డా కై
కైకకు వరము లీ♦గల్గుటఁ గల్గెనుగద! యని పల్కి సం♦గమించు మఖ

తే. కరములగు పల్కులను నిట్లు♦గా వచింప
విని మహామతి సంపాతి ♦ మనసు గలఁగ
ధరణిఁ బడియున్న యవ్వన♦చరుల నెల్లఁ
గనుచు దీనుండగుచు నిట్టు♦లనియె నపుడు. ౧౯౧౮ 1918

తే. వాఁడితుండముగల గృధ్ర♦వర్యుఁ డిట్టు
లంగదునిపల్కులను విని ♦ యతులరవము
సెలఁగఁ బ్రాణాధికుండయి ♦ యలరునునుజుఁ
డా జటాయువు హతుఁడయ్యె ♦ ననుచు నిచట. ౧౯ 1919

క. నామనసు కంపమొందఁగ, భీమరవం బారనెవఁడో ♦ వినిపించెడు నిం
దీమాట చెప్పినతఁ డెవ్వఁడో మానితతేజులార! ♦ యెఱుగవలెఁ జెప్పుఁడా. 1920

క. దనుజునకు జటాయువునకు, ననియు జనస్థానభూమి♦యందెట్లుగఁ గ
ల్గెను జాలకాలమునకు మ, దనుజునినామంబు చెవుల♦యందుం బడియెన్. ౨౦౧

క. గిరిదుర్గమస్థలంబునఁ, బరఁగెడు ననుఁ గ్రిందదింప ♦ వాంఛించెద వా
నరులార మిమ్ము; మదనుజుఁ, డురువిక్రమకృత్యములను ♦ బొందెఁ బొగడ్తల్.

తే. మఱియును గుణజ్ఞుఁ డట్టిఁడా ♦ మదనుజాతు
నాహ్వయము చాలదినముల ♦ కార్యులార!

---

1 ముక్తశ్చ సుగ్రీవభయాద్గతశ్చ పరమాం గతిమ్-అనిమూలము. సుగ్రీవస్య వానరేశ్వరత్వేన వానరాణామివ జటాయుషోపి సుగ్రీవనిమిత్తకం భయం సంభవిష్యతీ త్యాశంకా నిరాసాయ ముక్తమితి భావః-అని మహేశ్వరతీర్థులు. ఈభావమే యీపద్యమునఁ జెప్పఁబడినది. 2 కైకేయ్యావరదానేన ఇదం హి వికృతం కృతమ్-అనిమూలము.

మీావంటి విన్నదానికి ♦ మిగుల మోద
మందితిని; గాన నేను మీ♦కృతజ్ఞుఁడగువాఁడ. ౨౨ 1923

క. అతఁడు జనస్థానమున వసతి గావించుకొనియుండు ♦ శౌర్యాధికుఁడై
యతఁడెట్లు చంపఁబడెనో, వితతంబుగ నవ్విధంబు ♦ వివరింపఁదగున్. ౨౩

చ. గురుహితుఁడై నరాధిపుఁడు ♦ కూరిమిఁ గూర్చెడు నగ్రపుత్రుఁడై
పరఁగునొ యేనుహీనునకుఁ ♦ బార్థివతల్లజుఁడైన యాజికిన్
గురుగుణుఁడౌ జటాయువున♦కుం జెలికాఁడ మదెట్లుకల్గె; భా
స్కరకరవహ్నిఁ బక్షములు ♦ కాలుట నే నిపు డిట్టులైనన్. ౨౪ 1925

ఆ. మీారలున్నయెడకుఁ ♦ గోరిన రాఁజాల, నోకపీంద్రులార! ♦ యురుతరకృప
నెట్టికొండనుండి ♦ యెటులై నదింపుఁడీ, యిదియె నాదువాంఛ ♦ యిప్పుడనియె.

ఏఁబదియాఱవ సర్గము సంపూర్ణము

---

౫౭ - వ సర్గము,

సంపాతి వానరులతో మాటలాడుట.

చ. వనచరు లాపతత్రిపతి♦వాక్యము శోకముచేత హీనని
స్వనముగనున్నఁ దమ్ము నొగిఁ ♦ జంపు నతండని శంకనొంది దా
నిని విని నమ్మరైరి; మఱి ♦ నిశ్చలచిత్తము లొప్ప మృత్యువుం
గన నుపవిష్టులౌటఁ బక్షి♦గప్రియవాక్యము నేకరీతిగన్. ౧ 1927

తే. నమ్మకుండుట యేగాక ♦ తమ్ము నెల్లఁ
బతగ మది తినివేయును ♦ బరవసమున
ననుచు భయదంబుగా దానిఁ ♦ గని వచించి
తమయభిప్రాయముల మాన్పఁ ♦ దలఁపరైరి. ౨ 1928

చ. మరణము నొందఁబూని యిట ♦ స్థానస్థలిపైని బరుండినార మి
త్తరుణమునం బతత్రి యిది ♦ తప్పక వే మనలన్ క్షుధార్తిచే
మరణము నొందఁజేయ ననుమానము లేకయె యిష్టసిద్ధిచేఁ
బరఁగినవారమై సఫల♦వాంఛులమౌదు మటంచు నెంచుచున్. ౩ 1929

క. ఒక్కయభిప్రాయమునే, యక్కడ నెల్లరును బొంది; ♦ రవ్వ డంగదుఁ డా
యిక్కకుఁ జని యటనుండియె, గ్రక్కున నాపక్షి దింపి ♦ కడువడిఁ బలికెన్.

*సీ. విక్రమాఢ్యుఁడు కపి♦వీరుఁడునౌ ఋక్షరజుఁడన మాతాత ♦ రహిఁ జెలంగె
ధార్మికుండైన యా♦తనికిని శతకోటిపురుషబలంబునఁ ♦ బొలుచువాలి
సుగ్రీవులను తనూ♦జులు నిద్దఱుండిరి; వారిలో నాతండ్రి ♦ వాలి శూర
కృత్యంబులను ధరఁ ♦ గీర్తిని గాంచె; నయ్యిక్ష్వాకుకులమున ♦ నెనఁగునృపుల

* పుత్రౌ బలావుభౌ - అనిమూలము. ఓఘ మనఁగా మాఱుకోట్లు.

ఆ. యందు నెల్లధరకు ♦ నధిపతియును సుమా
రఘుఁడు శ్రీయుతుండు ♦ రాముఁ డనఁగ
దశరథునకు నగ్ర♦తనయుండు గలఁ డాతఁ
డాదరమున జనకు♦నాజ్ఞఁ బూని. ౭ 1931

క. మనమున ధర్మపథంబును, ననువుగ ధరియించి తమ్ముఁ♦డా లక్ష్మణుఁడున్
జనకజయు వెంటరా వ,చ్చెను వనసీమలకుఁ గా నృ♦పేంద్రుం డనఁగన్. ౮ 1932

తే. అతఁడు విపత్తి జనస్థాన♦మందు రావ
ణాసురుండును బలిమిని ♦ నపహరించి
యాకసంబునఁ గొనిపోవు♦నపుడు రాము
జనకసఖుఁడౌ జటాయువు ♦ సాధుబుద్ధి. ౯ 1933

చ. కనుఁగొని రావణాసురుని ♦ గాఢముగా నెదిరించి స్యందనం
బును బొడిచేసి యాజనక♦పుత్త్రిని నాస్మృతి నిల్పియుంచి తా
నని మొనఁ జ్రాంతినొంది జని♦నంతట రావణుచేతఁ జచ్చె; న
ద్దనుజుఁడు శౌర్యగర్వమున ♦ నాతని జంపెను దోర్బలంబునన్. ౧౦ 1934

క. ఆరామునిచే నట సం,స్కారమ్మును గాంచి పొగడఁ♦గాఁ బడు ముక్తిం
గోరికఁ బొందెను నంతట, శ్రీరాముఁడు నాపితృవ్యుఁ ♦ జెలికాఁడమునన్.

క. తనవశము చేసికొని నా, జనకుండగు వాలిఁ జంపె ♦ సచివులతో భా
నునిసూనుఁడు నిరతము నా, జనకునితో వైరముఁ గొని ♦ సకలవిధములన్.

తే. కాచియుండెనుగాన రా♦ఘవుఁడు వాలిఁ
జంపి సుగ్రీవుఁ బ్లవగరా♦జ్యమున కెల్ల
నధిపతిగ నభిషేకించె ♦ నర్కజుండు
కపులరాజ్యంబు గాంచి రా♦ఘవునివలన. ౧౩ 1937

క. వనచరపంక్తికి రాజయి, తనరుచునున్నాఁడు మేము♦తనియాజ్ఞనె రా
మునికార్యమునకె యరుగుచు, వనముఖముల నెల్ల వెదకి ♦ వదలనివారమ్.

క. తిరిగితిమి రాత్రి భాస్కర, కరములు గనఁబడనిరీతిఁ♦గా జానకి మా
దురదృష్టంబునఁ గన్పడ, దరసిన; మేమెల్ల దండ♦కాటవిఁ బూన్కిన్. ౧౫

ఆ. తిరిగి చూచిచూచి ♦ తెలియకుండుట ధర్మ
చారిణియగు నొక్క♦సాధ్వి నాన్వ
యంప్రభను బిలంబు♦నందుఁ గనుంగొన
నందుఁ జొచ్చినార ♦ మార్యవర్య!. ౧౬ 1940

చ. తనదువిచిత్రశక్తి మయ♦దానవుఁ డాబిలమున్ రచించె మే
ము నచట జానకిం గనెడు♦మోదమునన్ వెదకంగ నంతలో
జనియెను మాన మాస్లవగ♦సత్తముఁ డానతియిచ్చె దేవి మే
మును బ్రభునాజ్ఞఁ జేయుటకుఁ ♦ బూనినవారము గాన నిత్తతిన్. ౧౭

తే. అతని యానతి మీఱకే ♦ యట్టివార, మఱుట నాతనిసన్నిధి ♦ కరుగఁజాల
కతిభయంబునఁ జెప్పుట ♦ యంతెయొండ, నాకు ప్రాయోపవేశ మి ♦ ట్లొందినాము.

తే. రామలక్ష్మణవరచర ♦ రాజలిట్లు
మాయొకం గోరమూఁద మే ♦ మీయుపాయ
మందితిమి పోవ నొక్కఁడే ♦ నచటఁ బ్రదుకఁ
జాల మీ విశ్చయంబు ప ♦ క్షిరథవర్య!. ౯౯ 1943

ఏఁబదియేడవ సర్గము సంపూర్ణము.

---

౫౮-వ సర్గము.

—సంపాతి సీతయున్నచోటు వానరులకుం జెప్పుట.—

క. అనియిటు ప్రాణంబులఁ బాయను సంసిద్ధముగ నున్న ♦ యవ్వానరు లా
డిన దుఃఖవచనముల విని, యనుకంపను దాను దుఃఖ ♦ మందిన మదితోన్.

క. పలికెను బేరెలుఁగున నక్షులనుండి జలంబు గాఱఁ ♦ గోఁతులతో; నో
యలఘుమతులార! యనియెన, బలవంతుండైన యనుర ♦ వలనన్ హతుఁడై.

క. చనియెను ముక్తికి నని మీ, రనుకంప వచించినట్టి ♦ యాపక్షీంద్రుం
డనుజుండు నాకుఁ జండీ!, దనుజుండు జటాయువును గ్రు ♦ ధం జంపె ననన్.

క. వినినప్పటికిని జరచే,శను బక్షవిహీనతను ని ♦ తాంత మశక్తిం
గనినాఁడఁగాన దానిని, మనమున నోర్వంగవలసె ♦ మాటలిఁ కేలా!. ౨ 1947

క. అనుజుని వైరవిమోక్షణ,మును జేయఁగ శక్తిలేదు; ♦ మును వృత్రవధం
బును జరగినప్పు డిరువుర, మనుజులమగు మేము గర్వ ♦ మంది చెలఁగుటన్. 3

తే. ఒండొరుల వేగశక్తుల ♦ నొగిని దెలియఁ
గోరి వేయికరంబులఁ ♦ గ్రూరభంగిఁ
బ్రజ్వలించెడు సూర్యుని ♦ పరిసరమున
కరిగితిమి మండలాకృతి ♦ నాకసమున. ౪ 1949

క. తిరుగుచు విశేషదూరం, బరిగితి మంతటను సూర్యుఁ ♦ డతివేగమ యం
బరమధ్యగతుండౌటన్, గరము తదీయాతపమునఁ ♦ గందినయనుజున్. ౫

క. కని యతని తాపమును దీర్పను దలఁచుచు భ్రాతృమైత్రిఁ ♦ బాటించితి; నా
మన మపుడు పరవశత్వముఁ, గనుటం బక్షముల నతనిఁ ♦ గప్పితిఁ బూన్కిన్.

చ. ఖరకరతీవ్రతాపమునఁ ♦ గాలెను నాదగుపక్షయుగ్మ మీ
ధరశిఖరంబునం బడితి ♦ దారుణబాధను గాంచి యంత ని
ద్ధరణి వసించుచున్ మరలఁ ♦ దమ్మునిఁ జూడ నెఱుంగనైతి నే
క్కరణినిఁ బోవఁజాలమి వ ♦ గం దురపిల్లుచు నిందె యుండితిన్. ౭ 1952

తే. గనుక సీతయె యగు నామె ♦ యని తలంతు
నింక నారాక్షసునివాస ♦ మెఱుకపఱతు
వినుఁడు రావణుఁ డనువాఁడు ♦ విశ్రవసుని
తనయుఁ డగును గుబేరుని♦తమ్ముఁ డతఁడె. ౧౮ 1960

క. నిరతం బాతఁడు లంకా,పురమున వర్తించుచుండుఁ ♦ బోలఁగ వినుఁడీ!
ధరనుండియె శతయోజన, పరిమితదూరమున నబ్ధి♦భాగమునందున్. ౧౯

ఆ. ద్వీపమం దొకటి ♦ నాపట్టునందున, నందమైన లంక ♦ యనుపురంబు
విశ్వకర్మ దాని ♦ వెలయించెఁ; గాంచన, వేదికలను మిగుల ♦ వెలయునట్లు.

క. కనకద్వారంబులు తగు, వనజాప్తులవలె వెలుంగు ♦ ప్రాకారము దా
నిని జుట్టియుండుఁ జక్కఁగ, వనితామణి సీత యట్టి♦పురనగరమునన్. ౨౦

తే. దనుజాంతఃపురంబున ♦ దనుజకాంత
లెల్లఁ జుట్టును గావఁగ ♦ నెపుడొ కట్టి
నట్టివస్త్రంబుతోడ దీ♦నాస్యయగుచు
నున్నదటఁ జూడఁగలరు మీ ♦ రుర్వితనయ. ౨౧ 1964

చ. జలధియుఁ జుట్టుఁ బర్వ దను♦జప్రభువర్తన మొప్పు గుప్తమై
యలరెడు నూఱుయోజనము ♦ లంతటిదూరమునందునున్న య
జ్జలనిధి దాఁటి దక్షిణది♦శం దగు తీరముఁ జేరి లంకలో
పలఁ జొరనప్పుడే యనుర♦పాలకుఁ జూడఁగలార లచ్చటన్. ౨౨ 1965

క. త్వరగా మీరాలంకకె, యరుగం దచ్చటికిఁ బోయి ♦ యవనిజఁ గని వే
మరలి చనుదేరఁగలరని, యరసితి నేదివ్యదృష్టి ♦ నంతయు సరిగన్. ౨౩

సీ. ధాన్యములం దిని ♦ తగుబత్తులును బిచ్చుకలు భూమిపరిసర♦ములనె దివిని
మొదటిమార్గమునఁ దా♦ము తిరుగుచుండునుగాకులుమఱియు*వృ♦క్షఫలములను
దిని మనుపక్షులు ♦ తివిరి దానికిపైని రెండవత్రోవఁ జ♦రించుచుండు
జలవాయసములు క్రౌం♦చమ్ములుకురరముల్ మూఁడవదౌమార్గ♦మునఁజరించు,
శ్యేనమ్ము లాపైని ♦ జెలఁగు త్రోవనఁ బోవు గ్రద్దలై దవదారిఁ ♦ గదలుచుండు

తే. బలము వీర్యంబు రూపయౌ♦వనము లలరఁ
దగినహంసలు పంచమ♦పథంబునఁ జను
వైనతేయంబులో పక్షి♦వారము లొగి
సంచరించును సప్తమ♦సరణియందు. ౨౪ 1967

క. వినతాపుత్రులవంశం, బునఁ బుట్టినవాఁడ, వినత♦పుత్త్రుఁ డపణుఁ డం
చు నెగడు వానికిఁ దనయుఁడఁ, గనుకనె సప్తమపథంబు♦గద మాకెల్లన్.

తే. ఇచటనుండియె రావణు♦నిలతనయను,♦జక్కఁగాఁ జూచుచున్నాఁడ♦సాధులార!

* యే చవృక్షఫలాశినః-అని మూ.

గరుడునకుఁబలె మాకును ♦ గలవు దివ్యదృష్టిబలములు ఘోరకి♦పీంద్రులార!.

క. వినుఁడీ నైసర్గబలం,బున నాహారంబు విస్తృ♦ముననుగ శతయో
జనముల దూరమునఁ గనుఁగొ, జను దృష్టిబలంబు మాకు ♦ సతతము గనఘా.

తే. చరణమూలములను నెర ♦ సంగ్రహించు
వృత్తివిధిచేత విహితమై ♦ వెలయునట్లు
దూరదేశంబులందు నా♦హారమును గ్ర
హించునట్లును మాకు వి♦హితము సుండి. ౩౧ 1971

చ. అతిశయనీచకర్మముల ♦ నర్హములంచు నొనర్చినట్టి మా
దితినుతు రాఘవుం డనిని ♦ తీక్ష్ణశరంబులఁ ద్రుంచునేని నేఁ
బ్రతికృతి నాసహోదరుని ♦ రావణుఁ డిట్లనిఁ జంపినందుకై
హితముగఁ జేసినట్లై యగు ♦ నిప్పుని మీర లొనర్పఁగాఁ దగుఁ. ౩౨ 1972

తే. ఏదియేని యుపాయంబు ♦ నిప్పుడు లవణ
సాగరంబును దాఁట మీ♦స్వాంతములను
దలఁపుఁడీ మీరు జనకసు♦తను గనుఁగొని
యిష్టసిద్ధిని గని పురి♦ కేగఁగలరు. ౩౩ 1973

క. సురపురి కేగిన, తేజస్స్ఫురణంబునఁ బొల్చునట్టి♦సోదరుండగు సో
దరునకుఁ దర్పణ మొనరుతు, శరనిధిచెంతకును జేర్పఁ♦జను నను మీరల్.

ఆ. శౌర్యధుర్యులైన ♦ సకలవానరులంత, దగ్ధపక్షుఁడయి క♦దలనునేర
కున్న గృధ్రరాజు ♦ నుదధిచెంతకుఁ జేర్చి, యతఁడు తర్పణంబు ♦ లాచరింప.

తే. మరల నెప్పటిచోటికి ♦ మమతఁ జేర్చి,
జనకతనయయు దుష్టుఁడౌ ♦ దనుజుఁ డున్న
స్థలము తమకును దెలుపుట♦వలనఁ బరమ
హృష్టులయి కార్యసిద్ధి య♦య్యె ననుకొనిరి. ౩౬ 1976

ఏఁబదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ౫౯ - వ సర్గము.

* సంపాతి జాంబవంతునితో సీతవార్తను దానెఱింగిన విధముఁ జెప్పుట.

క. వనచరు లమృతాస్వాదం,బును బోలిన యతనివాక్య♦మును విని దేహా
ళినిరోమాంచములొప్పఁగ, ఘనహర్షమునొంది; రంతఁ♦గడుఁబూన్కితగన్. ౧

* ఈసర్గము మొదలైదుసర్గములు ప్రక్షిప్తములు ఈవిషయమున గోవిందరాజులు "తత స్తదమృతాస్వాద మిత్యారభ్య పంచసర్గాః ప్రక్షిప్తాః సర్వకోశేష్వదర్శనాత్. తాన్యవాపి కథాసంఘట్టనాత్ పూర్వోక్తార్థవిరోధస్ఫోరకత్వాచ్చ. తథాపి తే వ్యాఖ్యాయంతే" అని వ్రాసిరి. కాన నీయైదుసర్గములు కథాబాధకములు గావని వ్యాఖ్యాతృసమ్మతప్రాయముగాన వీనిం దెనుఁగొనర్చితిమని పాఠకులకుఁ దెలుపుకొనుచున్నాము.

సీ. వనచరేశ్వరుఁడు జాంబ♦వంతుఁడు కపులును దాను వేగంబ ♦ ధరణినుండి
లేచి యాసంపాతిఁ ♦ జూచి యిట్లనిరెక్క; నెందున్నది సీత ♦ యెవ్వఁ డామె
నపహరించెను! నామె♦యునికి దెలుపంగ నెవ్వఁడు సమర్థుండా♦కెఱుఁగఁజెప్పుము
వనచరులకు గతి ♦ యగు నీవె పక్షీంద్ర! వజ్రవేగంబునఁ ♦ బైని బడెడు
ఆ. రాముబాణములను ♦ రాజత్సుమిత్రాత్మ, జప్రయుక్తబాణ♦సాంద్రవిక్ర
మము నెఱుంగలేక ♦ యమితసాహసత నెవ్వఁ, డున్నవాఁ డనంగ♦నూహచెలఁగ.

చ. జనకజవార్తనే యెఱుఁగఁ ♦ జాల ప్రియంబును శ్రద్ధనుంచి త
న్ననుచును బ్రశ్నసేయు కపి♦కాంతులఁ బల్మఱు నాదరించి యి
ట్లనియెను గృధ్రనాథుఁ డెటు ♦ లాజనకాత్మజ రావణుం డప వం
చనఁ గొనిపోవఁగా వినఁగఁ ♦ జాలితినో యెఱుకద్దిచెప్పెనో. ౫౪ 1979
తే. ఇప్పుడాజనకాత్మజ♦యెందునున్న,దో యెఱింగించువాఁడ మీ♦రొగి వినుండు;
చాలయోజనవిస్తృతి♦గ్రాల దుర్గ,మముగ నున్నట్టి యుప్పర్వ♦తమున నేను. ౫౫
క. వడి చాలకాలముగఁ బె, న్పడలిన శౌర్యాసువులను ♦ బలమెడలంగాఁ
గడువృద్ధుఁడనైతిని నేఁ, బడుచున్న యవస్థఁ గాంచి ♦ పతగతిలకుఁడై. ౭౪ 1981
క. తనరెడు సుపార్శ్వుఁడను నా, తనయుం డాహారములను ♦ దఱితప్పక నా
కు నొసంగుచుఁ బోషించుచుఁ, గనుచుండును నన్ను; వినుఁడు♦గంధర్వులకున్.
తే. కామ మతితీక్ష్ణమగు, భుజం♦గములకెల్లఁ
గోప మతితీక్ష్ణముగఁ జెలం♦గును, మృగముల
కగును నెప్పుడు తీక్ష్ణభ♦యంబు, మాకు
క్షుత్తు మిగులంగఁ దీక్ష్ణమ♦గును సతంబు. ౯ 1983
సీ. ఒకనాఁడు క్షుత్తు న♦న్నొకకతి బాధింప నాహారమును గోరి ♦ యధికమైన
యాశతో నేనుండ ♦ నర్కుఁడు క్రుంగినతరువాత మాంస మిం♦తయును లేక
తనయుండు నాచెంత♦కును వచ్చె నేను క్షుద్బాధయు దప్పియు ♦ బడలుపఱుప
వృద్ధభావంబున ♦ నెక్కువకోపంబు గదురుటఁ గొమరుని ♦ గసరినాఁడ;
తే. నతఁడు నాకెప్డు మోదంబు ♦ నధికమావి
ధంబునన్ సంచరించు నా♦ధైర్య మరసి
యాఁకలికి నోర్వలేకుంట ♦ నవుడెఱింగి
కుపితుఁ డగునన్నుఁ బ్రార్థించి ♦ కోప ముడిపి. ౧౧౪ 1984
క. తనవృత్తాంతం బంతయు, ననుమానము లేకయున్న♦యట్లెఱిఁగించెన్
వినుఁ డామాటలఁ దెలిపెద,నను నాయన!యంచుఁబిలిచి ♦ నయముగఁబలికెన్.
చ. అనిశము పోవుసల్లి నమ♦యం బొకయింతయుఁ దప్పకుండ నేఁ
జని వినువీథి నీకెరను ♦ జాలఁగఁ దే మదిఁ గోరి సత్వరం
బున నె మహేంద్రపర్వతము ♦ పొంతకుఁ బోయితి దానిద్వార ము
య్యనఁ గని యావరించి తగు♦నామిషముం గొన నెంచి యుంటిఁ జా! ౧౩

క. జలనిధిసహస్రసంఖ్యల, గోలఁదిని జరియించు జంతు♦కూటంబుల ని
మ్ములఁ బట్టఁగ నేనొకఁడనె, తలవంచి తదీయమా ప♦థంబునఁ బూన్కిన్.

క. అరికట్టి యుంటి; నచ్చట, విరిసిన యంజనచయంబు♦విధమునఁ గాంతుల్
పరఁగంగ నెవ్వఁడో భాస్కరునుదయము వోలె వెలయు♦సాధ్వీశోకతుకన్.

క. గొనిపోవుచుండఁ జూచితి;, విను మే నాహారకాంక్ష ♦ వెలయఁగనుంటం
గనుకనె యాయిద్వరనుం, గనినంతనె వారిఁ బట్టఁ♦గా మదిలోనన్. ౧౬॥

[1]ఆ. నిశ్చయించుకొంటి ♦ నేనంత నాతఁడు, సవినయముగ నన్ను ♦ సామవచన
ములను బల్కి మార్గ♦మును విడువందగు, ననుచు వేఁడె నెయ్య♦ములగునట్లు.

క. హితవచనంబుల వేఁడెడు, నతనిన్ ధర నెవరుగాని ♦ యరయక కొట్టన్
మతిఁ దలఁపరుగద నీచత, క్షితిఁ దగువారలును గూడఁ ♦ జేయరు గాదే!.

తే. ఇంక నావంటివాఁ డట్టు♦లేల చేయుఁ
బురుషుఁ డాతఁడు తన తేజ♦మునఁ బొలుచుచు
నాకసముఁ గ్రిందుపఱుపంగ ♦ నాత్మఁ దలఁచి
నట్టు లంబరమునఁ బాఱె ♦ నంతనన్ను. ౧౭ 1992

క. సురపథమునఁ దిరిగెడునా, వరభూతములెల్ల నెలమి ♦ వచ్చి పలుకులం
గరుణఁదగ గారవించెను, బరమర్షులు నన్నుఁ జూచి ♦ వత్సా! యనుచున్.

తే. పలికి రిట్లని విధిగతి ♦ బ్రదికితీవు
దనుజుఁ డీతఁ డదెట్టులో ♦ తరుణితోడఁ
జనియెఁ గావున శ్వశ్శ్రేయ♦సంబు నీకు
నయ్యె నిస్సంశయంబంచు ♦ నంతలోన. ౧౯ 1994

సీ. పరమశోభనములఁ ♦ బరఁగు సిద్ధులు చెప్ప నతఁడు దానవులకు ♦ నధిపతియగు
రావణుండని యాభ♦రణములు ధరఁబడఁ గౌశేయమును జాఱఁ♦గా వెతలను
గుందుచు, మృదువులౌ ♦ కురులును విరియంగ రామలక్ష్మణులను♦నామములను
బలుమాఱు తలఁచుచుఁ ♦ గలఁగుచు నేడ్చుచు నున్నయాబిడ జన♦కోర్వీపతికిఁ

తే. దనయయును రామచంద్రుని♦తరుణియునగు
సీతయనియును వాఁ డామెఁ ♦ జెఱఁగొని చను
చున్నవాఁడని యెఱిఁగితి ♦ నోమహాత్మ!
ప్రొద్దు వోవుట కగు హేతు ♦ విద్ది సుమ్ము!. ౨౦॥ 1995

[2]క. అని కాలవిదుత్తముఁడగు, తనయుండు సుపార్శ్వుఁ డివ్వి♦ధం బంతయు నా
కు నెఱుంగఁజెప్పె నీవిధ,మును విన్నను రామువిషయ♦మున నాబలమున్.

క. కనఁబఱుప బుద్ధిపొడమదు, వినుఁ డేఁ బతగంబ నగుట ♦ విగతదళములే

---

1 తేన సామ్నా వినీతేన పంథాన మభియాచితః-ఆనిమా. 2 ఏవకాలాత్యయ స్తావ దితి కాలవిదాం వరః-అవిమా.

ఘనబలము నాకుఁ గావునఁ, బని యవి లేకుండఁజేయ♦వల నెట్టులగున్.
క. ముక్కును బుద్ధియు నిప్పుడు, చక్కని గుణవంతములగుఁ ♦ జాలుదు వానిన్
మిక్కిలి సాయమొనర్పఁగ, నెక్కరణిని దానిఁ జేయ♦నేర్తునొ యిచటన్.
తే. అవ్విధంబు నచించెద ♦ నద్ది వినుఁడు
దానికిని మీపరాక్రమ♦మాను బలము
గాని దానిన నని దీర్ప ♦ గావలయును
వాజ్మతులచేత సాయంబు ♦ వలసినంత. ౨౪ 1999
క. ఒనరుతు మీకంకఱకును, మనరామునికార్యమెల్ల ♦ మాయదియే దీ
నను సంశయంబు గలదే, వనచరనాయకులు మిమ్ము ♦ బలశౌర్యములన్.
క. సురలకు నెదిరింపంగాఁ, బరంబుగానట్టివారిఁ ♦ దత్బుద్ధిబల
స్ఫురణమున నొప్పువారిని, నరణ్యముల వెదకఁబంపె ♦ సరసిరుహ మిమ్ముల్.
తే. వాడులై కంకపత్రాళి ♦ వఱలుచున్న
రామలక్ష్మణబాణముల్ ♦ రయముమీఱ
ముజ్జగంబుల రక్షింప ♦ మునుపఁజాలు
దనుజపతి రావణుఁడు తేజ♦మున బలమున. ౨౭ 2002
చ. వెలుఁగుచునున్న మీరలు ప్ర♦సిద్ధపరాక్రమయుక్తులౌట మీ
కిలపయిఁ దీర్పరానిపని ♦ యేదియు లేదటుగాన మీర లు
జ్జ్వలమతులయ్యుఁ గాలమును ♦ వైపయి వ్యర్థము చేయరాదు ని
స్తులమతులౌ భవాదృశులు ♦ సూరులు కార్యము సంఘటిల్లఁగా
నలనులు వోలె నుండక బ♦లాధికులై పనిఁ దీర్తురే కదా!. ౨౮ 2003

ఏఁబదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౬౦ - వ సర్గము

సంపాతి తనవృత్తాంతమును వానరులకుం జెప్పుట.

క. అనుజునకు నుదకదానం,బును నొనరిచి జలములందు ♦ మునిఁగిన సంపా
తిని హరియూధపు లాదరమునఁ బరివేష్టించియుండఁ ♦ బొల్చెడువాంఛన్.
క హరివరులతోడ తనదౌ, పరిసరమునఁ గూరుచున్న♦వాలితనూజున్
బరమాదృతిఁ గని గృధ్రేశ్వరుఁ డిట్లనిపల్కె మాని ♦ వచనమురీతిన్. ౧
చ వనచరదర్శనంబు తన♦వాంఛలఁ దీరుపఁజాలునన్న నె
మ్మనమునఁ గల్గు నమ్మికను ♦ మాన్యుల వారలఁ గాంచి యోమహా
వనచరులార! హెచ్చరిక ♦ బాగుగ మీరు వినుండు నద్దునే
యను జన దేను నెవ్విధి ని♦లాత్మజవార్త నెఱింగినాఁడనో. ౨ 2006
తే. దానిఁజెప్పెద నే యథా♦ర్థముగ మీకు, నర్కరశ్మలచేత నా♦యవయవంబు

తెల్లఁ దపియింపఁగా సొమ్మ♦సిల్లి యిచట, వింధ్యశిఖరమ్మునం జను♦విపినమందు.

క. పెనువగలఁ బడితి; షణ్ణిశ, లను దెల్వింబొంది విహ్వ♦లతఁ గని మూర్ఛం
గనునట్లు పరవశుఁడనై, గనినాఁడను నాల్గుదెసలఁ ♦ గానిమహాద్రిన్. ౪॥

క. దురపిల్లుట నేభాగమొ, ధరయిది యని సుంతయేని ♦ తలఁపఁగలే క
త్తరుణముననుండి యంతట, సరిత్పతిని దత్తటస్థ♦శైలాటవులన్. ౫ 2009

క. సరసుల నదులను మఱి నా,గరతీరముఁ గాంచి యిదియొ♦గాయని తెల్విం
బొరసితి; నిది దక్షిణసా,గరతీరమునందుఁ బక్షి♦గణసంకులమై. ౬॥ 2010

ఆ. పెనుగుహాంతరములు ♦ తనరార శిఖరంబు
లలర వెలయు వింధ్య♦మని యెఱింగి
నిశ్చయించినాఁడ; ♦ నిర్జరపూజిత
మగుచుఁ బావనమగు♦నాశ్రమ మిది. ౭॥ 2011

[1]క. కనఁబడె నుగ్రంబగు తప,మును జేయు నిశాకరుఁ డను♦ముని యొకఁ డుండెన్
వినుఁడో ధర్మమతిం గనుఁ,గొనఁజాలినకీశులార! ♦ కూటమున నిటన్. ౮॥

సీ. ఆముని మరణంబు ♦ నందినతరువాత నొక్కఁడనే యిందు ♦ నున్నవాఁడ
నష్టసహస్రసం♦ఖ్యాబ్దములయ్యె నప్పటినుండి; యంతనే ♦ పరమకష్ట
ములఁబొంది [2]వ్యత్యస్త♦ముగనున్నవింధ్యశిఖరమునుండియె మెల్లఁ ♦ గాదిగియట
వాఁడిచివరలద♦ర్భలుగల యాశ్రమధరణికి వచ్చితి ♦ మరల వెతల;
తే. నట్లు దుఃఖితుఁడనునయి ♦ యప్పు డతనిఁ
జూడఁగాఁ గోరితిని ముని♦సురపతి మును
తమ్ముఁడును నేను బలుమాఱు ♦ దర్శనంబు
చేసి సేవించుచుందుము ♦ చిత్తములర. ౧౧ 2013

చ. మునిపతి యాశ్రమంబునకు ♦ మోదము మీఱఁగ వచ్చినంతఁ జ
క్కనివగు వాసనల్ పొలయఁ♦గాఁ బవమానుఁడు వీచె నందుఁ బు
ష్పనికరహీనమైన విట♦పం బొకఁడైనను లేదు పండ్లచే
ననిశము వ్రాలుచుండును మ♦హాతరువుల్ కనువిందుచేయుచున్. ౧౨ 2014

క. మునినాథుపావనాశ్రమ,మును జేరి మహీజమూల♦మునఁ గ్రిందను స
మ్మునిఁ జూడఁ గోరియుంటిని;, వినుఁ డంతట నతఁడు స్నాన♦విధి సల్పి తగన్.

ఆ. జ్వలితతేజుఁడగుచుఁ ♦ జయ్యన నుత్తర, దిక్కుమోము గాఁగఁ ♦ దేరిచూడ
నలవిగాక చెంత ♦ కరుదేరఁ జూచితి;, బ్రహ్మఁగొలుచు ప్రాణి♦పటల మట్లు. ౧౪

సీ. భల్లూకములు కరుల్ ♦ వ్యాఘ్రసింహంబులు చమరంబులును మహా♦సర్పములును
బలసిచుట్టునుమహానిఁ♦గొలిచియుండునుజుఁడీ! నరనాథుఁ డొగినంతి♦పురముఁ జేర

1 వసతో మమ ధర్మజ్ఞా స్స్వర్గతే తు నిశాకరే-అనిమూ. 2 కృచ్ఛ్రేణ విషమాచ్ఛైలాః-
అనిమూ.

సచివాదులెల్లరు ♦ చనుదల్లు మునిపతి యాశ్రమాంతరమున ♦ కరుగ నవల
నజంతునంతత ♦ యరిగె స్వస్థలముల; నప్పుడాత్మ యుఁ బ్రీతి ♦ యలర నన్నుఁ
ఆ. గాంచి లోనికేగి ♦ యించుకసేపటి, కరుగుదెంచి నెలికి ♦ యడిగెఁ గార్య
మేమటంచు నన్ను; ♦ నీరీతి నుతియును, బలికె నీదువెంట ♦ కలు కమలుట.
క. నీరూపు తెలియకున్నది, నీరెండు పక్షంబు లగ్ని ♦ నెఱిఁ గాలినవే
భూరిపతగేంద్ర! చర్మము, నారయఁగా వ్రణిత మగుచు ♦ నంటము తప్పెన్.
చ. మును గనినాఁడ గృధ్రగణ♦ముఖ్యములై పవమాన వేగముం
గని మఱి కామరూపములఁ ♦ గాంచినసోదరులన్ బతత్త్రులన్
గనుఁగొన నందు జ్యేష్ఠుఁడవు ♦ గావె మహాత్మక? యాజటాయువో
యనుజుఁడు గాఁడె నీకు నను♦జాంగములం గొని మీఱి లిద్దఱున్. ౧౯
క. ననుఁ గని నాపాదములకు, ననూనవిధివందనముల ♦ నలరింతురుగా
విను నీకు వ్యాధిగల్గెనె, తనువున నేదేని నీదు♦తతపక్షంబుల్. ౨౦ 2020
తే. ఎట్లు పడిపోయె నిన్నిటు ♦ లెవ్వరైన
శిక్షచేసిరె? సర్వంబు ♦ చెవుమ' నాకు
నున్న దున్నట్లు సంపాతి ♦ ఖిన్నుఁడవయి
యిట్టు లుండంగనేల? నే♦నెఱుఁగఁదలఁతు. ౨౧ 2021

అఱువదియవ సర్గము సంపూర్ణము.

---

## ౬౧ - వ సర్గము.

సంపాతి తనవృత్తాంతమును నిశాకరమునికిఁ జెప్పుట.

చ. అనవిని దుష్కరంబయి భ♦యంకరమై పెనుసాహసంబుచే
నొనరుపనైన నాచరిత ♦ నుగ్రమయూఖుని వెంబడించి పో
యినయది యాదిగాఁ దెలిసి ♦ యే నొనరించిన కార్య మమ్మహా
ముని కెఱిఁగింపఁబూనితిఁ; బ్ర♦మోదము మీఱఁగ నిట్లు పల్కితిన్. ౧ 2022
సీ. పక్షయుగ్మము గాలి ♦ వ్రణయుక్తమై తనువుండుట సిగ్గుచే ♦ నొక్కరీతి
నింద్రియాళి కలంగి ♦ యొట్టులో యుండుట శ్రమమున మనను ని♦స్సారమగుటఁ
బ్రత్యుత్తరమును జె♦ప్పంగ లేకున్నాఁడ దర్పంబునన్, మేము ♦ తనువులెఱుఁగ
కొండొరులపరాక్ర♦మోద్ధతుల్ తెలియంగఁగాంక్షించియొకటనా♦కాశమునకు
తే. నెగిరినాము జటాయువు ♦ నేను వీర్య
మలరఁ; గైలాసశిఖరంబు♦నందు మునుల
పరిసరంబున "రవియ స్త♦పర్వతమున
కరుగు నంతదనుక మన ♦ మతనివెంట. ౨ 2023
క. చనఁదగునని" పణ మిడుకొని, యనుజుండును నేను నొకట ♦ నంబరమునకున్

ఘనజవము మీఱ నెగిరితి, మనఘా! యప్పు డవనిఁగల్గు ♦ నఖిలనగరముల్.

*క. అరదముచక్రమునట్టులు, పరికింపఁగనయ్యె మాకు ♦ బహుభంగులఁ; నం
తరమునఁ గొన్నిస్థలంబులఁ, బరఁగెడు వాద్యధ్వనులను ♦ బ్రహ్మధ్వనులన్.

క. వినినార; మరుణచేలం,బును దాల్చి యుదాత్తగాన♦మును జేసెడు నిం
దునిభాననలం గొందఱిఁ, గనినారము; మేము నంతఁ ♦ గడు శీఘ్రమునన్.

చ. సురపథమందుఁ బోయి యట ♦ సూర్యునిమార్గముఁ జేరి క్రిందిదా
ధరణిని జూడ మావనము ♦ తద్దయుఁ బచ్చికపట్టు రీతిగాఁ
బరఁగుటఁ గాంచినార, మిలఁ ♦ బర్వతపంక్తులు చిన్నవైన ప్ర
స్తరములభంగిఁ గానఁబడె ♦ త్ర్యాసలిఁ బాఱు నదుల్ నితాంతమున్. ౮½

తే. దారములరీతిఁ గన్పడె ♦ మేరువింధ్య
హిమగిరుల్ మడుగునను న్న ♦ యేనుఁగులవి
ధంబునం గానఁబడినవి; ♦ తత్పథమునఁ
దిరుగుచుండినయప్పు డో♦ధరణిదివిజ!. ౯ 2028

క. అతితీవ్రస్వేదము మా, కతిఖేదముగల్గె మఱి భ♦యంబును బొడమెన్
మతివిభ్రాంతియు నత్తుల, కతిశయతమ మల్లె గల్గు ♦ టానమయమునన్. ౧౦

ఆ. భయదమైన మూర్ఛ♦వచ్చెను నిది యామ్య
మిద్ది పశ్చిమమగు ♦ నిదియె యగ్ని
దా విదిక్కనియును ♦ నాత్మలకుం దోఁప
కుండె నియతమగుచు ♦ నొప్పుజగము. ౧౦½ 2030

క. అనలునిచేఁ గాల్పఁగఁబడి, తనరూప మడంగి ప్రళయ♦తరుణంబున నుం
డినరీతిఁ గానఁబడె నా, మన మప్డు కలంగి మాని♦మండన యంతన్. ౧౧½

తే. చూడ నాధారమైన చ♦క్షుస్సునుండి
వదలి నశియించినట్లయ్యె ♦ వరుస దృష్టి
శక్తియును సన్నగిల్లె నే♦సాంద్రయత్న
మునను జక్షుస్సులన్ మన♦స్సునను గూర్చి. ౧౨ 2032

క. కనుఁగొంటి రవిని శ్రమమున, మునివర్యా! మాకు భాను♦మూర్తియపుడు పృ
థ్వినిఁబోలి ప్రమాణంబునఁ, గనఁబడియె; జటాయువంతఁ ♦ గడుబడలికచేన్.

క. నాతోడం జెప్పకయే, యాతఁడు నాకసమునుండి ♦ యవనింబడఁగా
నాతమ్ముఁ డట్లు పడుటను, జేతోదుఃఖమునఁ గాంచి ♦ శీఘ్రమ నేనున్. ౧౩

క. తనువుం బడవిడిచితిని గ,గనంబునుండియె మునీంద్ర! ♦ గాదిలియనుజ
న్మని నేను బక్షయుగ్మం,బునఁ గప్పుటఁ గాలకుండఁ ♦ బూషునిదీప్తిన్. ౧౪½

* రథచక్రప్రమాణాని నగరాణి పృథక్పృథక్ -అనిమా.

తే. ఆకసమునుండి పడునప్పు ♦ డార్య! నేను
గాలితిఁ బ్రమాదమున నాదు ♦ గావలి యను
జన్ముఁ డాధరఁ బడు జన ♦ స్థానమందుఁ
బడినవాఁడని తెలంచెద ♦ నాంతమందు. ౧౫॥ 2036

తే. దగ్ధపక్షుండనై నేను ♦ ధారుణీధ్ర
మందు నీవింధ్యమునను మూ ♦ ర్ఛాతురముసఁ
బడితి; రెక్కలు గ్రాలె నా ♦ భ్రాత లేఁడు
చెంత రాజ్యశౌర్యంబులు ♦ చెడియెఁ గాన. ౧౬॥ 2037

క. తనువునఁ బ్రాణము లిడుకొని, మనఁజాలను కోర్కిగలదు ♦ మరణమునొందం
గను గాన వింధ్యశిఖరం, బుననుండియె పడుదు మృతిని ♦ బొందెద దానన్.

అఱువదియొకటవ సర్గము సంపూర్ణము.

---

౬౨ - వ సర్గము.

నిశాకరముని సంపాతికి రెక్కలు వచ్చురీతి నెఱింగించుట.

క. అని నే నమ్మునిపతితో, మనవి యొనర్చుచును దుఃఖ ♦ మగ్నుండనై రో
దన మొనరించితి నంతట, మునిపతి యొకక్షణము ధ్యాన ♦ మున నుండి తగన్.

*క. ననుఁ గాంచి యిట్లు పలికెన్, వినుమా! చక్షుర్బలములు ♦ విక్రమమును బ్రా
ణనిచయమును బక్షంబులు, తేజ మారు ప్రపక్షములును ♦ తమకై తారే. ౧॥

తే. మరలఁ గ్రొత్తగఁ గల్గు నే ♦ మాడ్కి మున్ను
వెలయునో యట్లె మును నేను ♦ వింటి భావి
కాలమున గొప్పకార్యంబు ♦ గలుగుననుచు
దానిఁ దపమున నెఱిఁగితి ♦ మాననీయ!. ౨॥ 2041

క. మునివరులవలన వింటిని, వినుమా! యిక్ష్వాకునృపతి ♦ వీరునివంశం
బున దశరథుండు నా నొక, మనుజేంద్రుఁడు గలఁడు తత్త్ర ♦ మాపతి కింకన్.

క. ఘనతేజుఁడు రాముండను, తనయుండు జనింపఁగలఁడు ♦ తండ్రి పనుపఁగా
ననుజునితోడ నరణ్యం, బున కాఋతవిక్రముండు ♦ ముదమున నరుగున్. ౩

క. సురదానవులకుఁ జంపఁగఁ, దరంబు గానట్టివాఁడైన ♦ దనుజేంద్రుఁడు ను
ర్వరరావణుండు నా నిర్భరశౌర్యంబునను మిగులు ♦ వాఁ డవినీతిన్ ౪॥ 2044

సీ. ఆజనస్థానంబు ♦ నందు రాఘవుఁ డుండునపుడు తత్పత్నిఁ దా ♦ నపహరింపఁ
గలఁడు యశస్విని ♦ లలితశీలయునైన నానావిధ భక్ష్యభో ♦ జ్యముల భోగ
సాధనంబులఁ దన్ను ♦ సమధికాశను వాఁడు పొందింపఁజూచిన ♦ భూరిదుఃఖ
మగ్నయౌటను నెంత ♦ మాత్ర మవ్వానిని ననుభవింపకయుండు; ♦ నద్ది యెఱిఁగి

---

* పక్షౌ చ తే ప్రపక్షౌ చ-అనిమూ.

తే. యింద్రుఁ డాప్రీతి దివ్యాన్న ♦ మీఁగలండు
జనకతనయయు సుధఁబోలి ♦ సకలసురుల
కైన లభియింపరాని ది♦వ్యాన్న మద్ది
పుచ్చుకొని యింద్రుఁ డోసఁగుట ♦ బుద్ధి నెఱిఁగి. ౯ 2045

చ. తరుణియు నగ్రభాగమును ♦ దానటఁ గైకొని నాకు నాథుఁడై
ధరణివిభుండునైన గుణ♦ధాముఁడు రాముఁడు నాకుఁ బంది ను
ర్వరమనియుండి తేనియు ధ♦రాస్థలివిడి సురత్వమొందియు
న్నరమణ నన్న మిద్ది క్షితి♦నాథులు వారలఁ జెందెదర్ దగన్. ౧౦ 2046

చ. అని వచియించి భూమిపయి ♦ నన్నము వైచును భక్తి మీఱఁ; నం
త నచట రాఘవుం డనుజ ♦ ధాత్రిసుతల్ వెదకంగఁ బూన్కితో
వనచరులెల్ల రాఁగలరు ♦ వారల కీవును రామపత్నివా
ర్తను దెలుపంగఁ గావలయు; ♦ స్థానము దీనిని మార్పఁబోకుమీ!. ౧౧

తే. పక్షహీనుండవౌట నె♦వ్వరును బోనఁ
గలవు దేశకాలంబుల ♦ గణనసేసి
కొనుచు నీవిందె యుండుము ♦ కోర్కి తీఱఁ
బక్షములు పుట్టఁగలవు భ♦వ్యంబు లగుచు. ౧౨ 2048

క. వినుమో సంపాతీ! నీ,కును బక్షము లిపుడె మరలఁ ♦ గ్రొత్తవియై వ
చ్చునటులు సేయఁగఁగోరను, మనమున నదియేల యనిన ♦ మహి నీవిచటన్.

తే. ఉందువేనియు జగముల ♦ కొక్కరీతి
హితము సలుపంగఁగలవు ♦ పృథ్వీశతనయు
లైన యారాఘవులపని ♦ యరయ నీకు
మాత్రమేకాదు సుమ్ము బ్రా♦హ్మణులకెల్ల. ౧౩ 2050

క. సురలకు మునులకు నిర్జర, వరునకు ముఖ్యముగఁ జేయ♦వలసినదౌ; సో
దరులగు నా రాఘవులను, బరికింపఁగ నాకుఁగలదు ♦ వాంఛ మనమునన్.

క. చిరకాలము ప్రాణంబుల, ధరియింపఁగ నిచ్ఛ లేదు ♦ దానన్ దనువున్
ద్వరపడి విడిచెదనని ముని,వరుఁ డాతఁడు తత్త్వవేత్త ♦ పలికెన్ నాతోన్.

అఱువదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## ౬౩ - వ సర్గము.

సంపాతి పక్షములు రాఁగా వానరులకుఁ గర్తవ్యముఁ జెప్పిపోవుట.

తే. వాగ్వాదులలోన వస్యుఁడౌ ♦ బ్రహ్మమాని
యివ్విమొదలగువాక్యంబు ♦ లెన్నొ పలికి

నన్నుఁ బొగడి యనుజ్ఞను ♦ నాకొసంగి
తాఁ బ్రవేశించెఁ దనతప♦స్స్థాన మంత. 2053

సీ. పర్వతగుహనుండి ♦ ప్రాఁకి నేమెల్లఁగ నీవింధ్యపర్వత ♦ మెక్కి యిచట
నెవ్వఁడువచ్చునో! యని♦యెదురుచూచుచునుంటి, మునివరుమాటల♦మనసునందుఁ
బదిలంబుగా నిల్పి ♦ వనచరులార! నేదేశకాలంబుల ♦ దెలియఁగఁ గనుచు
నిందుగా నూఱేండ్లు ♦ నెఱి గడిపితి నిట నానిశాకరముని ♦ యంతఁ దాను
బరమభక్తిని మహా♦ప్రస్థానమున కేగి స్వర్గంబు నొందె లో♦పల నె నేను

తే. బహువిధవితర్కములు మదిఁ ♦ బన్నుకొనుచు
సంశయము నొంది సంతాప♦జాలములను
గ్రాఁగుచుంటిని; మృతినొందఁ♦గా మనంబు
గలిగినప్పుడెల్ల మునివాక్య♦ములఁ దలంచి. ౮౪ 2054

క. మరణము నొందెదుబుద్ధిని, ద్వరగా విడనాఁడుచుండుఁ; ♦ బక్షంబులు నీ
వరబలము వచ్చునని నే, మరణమ్మును బొందకుండ ♦ మానివిభుఁ డటఁ. ౫

తే. నాకుఁ గల్పించినట్టి ప్రా♦ణములవంటి
యాశ దీప్తాగ్ని తమముల ♦ నణఁచునట్లు
నాదుదుఃఖమ్ము నెల్ల న♦ణఁచుచునుండు;
దుష్టమతియగు రావణు ♦ దోర్బలములు. ౬ 2056

క. నాకుం దెలిసినవై నను, నాకొమరునిఁ జూచి నే జ♦నకజను దనుజుం
బోకార్చి రావ కిట నీ, వేకరణిఁ వచ్చితివని ♦ యెన్నొవిధములఁ. ౬౪

క. అదలించితి నాజనకను, తదుఃఖమును వినియు నన్న♦దమ్ము లిరువురుఁ
ముదిత విడనాడి యుండుట, యుఁ దగ నెఱింగియును దశర♦థోర్వీపతివై. ౭

ఆ. స్నేహ మునిచి సాధ్వి ♦ సీతను విడిపించి, నాకుఁ బ్రియముచేయ♦నాకుమారుఁ
డవుడు నేఁడ యొ్యె ♦ నని గృధ్రపతి వన, చరులతోఁ డఁ బల్కు♦సమయమందు.

ఉ. వారలు చూచుచుండఁగనె ♦ వచ్చెను ఱెక్కలు తొంటిరీతి నా
ధారణిదేవువాక్యమువి♦ధంబున నెట్టనియాఁక లొప్పఁగాఁ
జారునుపక్షముల్ గలుగ ♦ నంతనమెంతయు నొంది గృధ్రభూ
దారుఁడు వానరాళిఁ గని ♦ తా నవు డిట్లని పల్కె వేడుకఁ. ౯౪ 2060

క. అమితప్రభావుఁడౌ నం, యమిమహిమను మరల నాకు ♦ నరుణనికరద
గ్ధములైన పక్షములు వ, చ్చె మహాసంతోష మేను ♦ జెందెదురీతిఁ. ౧౦౪

సీ. వయసున నేనున్న♦యప్పుడు నాకెట్టి బలపరాక్రమములు ♦ పౌరుషంబు
తనరారుచుండెనో ♦ తద్రీతి నయ్యవి కల్గియున్నవి కపి♦కాంతులార
యిప్పుడు వర్వథా ♦ తప్పకయత్నంబు నొనరింపుఁడీ మీర ♦ లుర్వీతనయఁ
గనుఁగొనఁగలరు ఱె♦క్కలు నాకు వచ్చెను గార్యసిద్ధియుఁ గల్గ♦గలదటంచుఁ

తే. ప్రత్యయమ్మును బుట్టించెఁ; బరఁగ నిద్ది
యనుచుఁ బక్షీంద్రుఁ డప్పుడా♦వనచరుండు
గాంచి వచియించి యంతరి♦క్షమునఁ దిరుగఁ
దనదు నూతనపక్షస♦త్త్వం బదెంతొ. ౧౨॥ 2062

క. తెలియంగఁ గోరి యంబర, తలమున కెగిరెను మహీధ్ర♦తలమును విడి యి
మ్ముల నిట్లు గృధ్రనాథుఁడు, పలికిన విని పక్షియుగముఁ ♦ బరికించి తగన్.

తే. అతులసంతోషమును బొంది ♦ యపుడు పౌరు
షమును జూపుచు రాముని ♦ సాధ్విఁ గనెడు
నభ్యుదయకార్యమును బొంద ♦ యత్న మపుడె
చేయఁదలఁచిరి వానరుల్ ♦ చిత్తములను. ౧౪॥ 2064

*చ. అనిలసమానవేగమును ♦ నందినవానరవీరులెల్ల నో
య్యన ఘనవిక్రమంబుఁ గొని ♦ యోజనకాత్మజఁ జూడఁగోరి చ
క్కనియభిజిన్ముహూర్తమును ♦ గానఁగ వేచి యటుండి యద్ది రాఁ
గనె శమనాశ నింక వెద♦కం దగునంచును బోయి రొక్కటన్. ౧౫॥ 2065

అఱువదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

౬౪ - వ సర్గము.

వానరులు సముద్రముచెంత కరుగుట.

క. హరివిక్రమమునఁ బొల్చెడు, హరివీరులు గృధ్రనాథుఁ ♦ డాడినపలుకుల్
పరికించి యెగిరి యంబరు, సురలన్ గుంపుగను గూడి ♦ మహితప్రీతిన్. ౧

క. హరినాదంబు లొనర్చిరి, హరు లాసంపాతిపలికి♦న ట్లాసీతన్
ద్వరగాఁ గనఁదలఁచుచు దుష్టరావణునివాసము గను♦సంతోషమునన్. ౨॥

తే. లంకకుం బోవ మార్గమా ♦ లవణజలధి
కరిగి; రాభీమవిక్రము♦లౌ కపులొగి
నచ్చటికిఁ బోయి గొప్పదై ♦ యలరు లోక
మునకుఁ బ్రతిబింబ మననొప్పు ♦ వనధి నచట. ౩॥ 2068

క. కని రది లోకమునంతయుఁ, దనలోఁ గనఁబడఁగఁజేయు♦దర్పణమువిధం
బుననుండె; మహోత్తరబల,మునఁ దగు నాకపులు సంద్ర♦మును గని యంతన్.

తే. దానియుత్తరతీరంబు ♦ గానఁబోయి
యందు విడిసిరి; వికృతంబు ♦ నగుచు భూరి

* అభిజి దభిముఖాదిశం యయు ర్జనకసుతాపరిమార్గణోన్ముఖాః-అనిమా.

కాయ మలరఁగ వివృతవ♦క్త్రంబు నగుచు
వివిధసత్త్వగణంబందు ♦ వితతగతుల. ౫ 2070

*చ. జలములయందుఁ గ్రీడలను ♦ సల్పుచునుండెను; గొన్నిచోట్ల నా
జలనిధిభంగసంతతుల ♦ జంతుయుతిం దమిఁ గేళిసల్పుచ
ట్లలరుచుఁ గొన్నితావుల మ♦హాత్త్రపను ప్తిని బొందినట్టుగాఁ
జెలఁగుచునుండె నొక్కెడ వి♦చిత్రమహీధ్రసమాంబుపూరముల్. ౬ 2071

క. కనఁబడుచుండె రసాతల, మున నుండెడు దానవాళి♦ముఖ్యులు నొకెడన్
గనఁబడుచుండిరి చూచెదు, జనులకు భయదంబుగాఁగఁ ♦ జను నయ్యబ్ధిన్.

తే. రోమహర్షకరంబును ♦ హూక్షిఁ గాంచి, నట్టిదానిని గాంచి యా♦యంగదాదు
లెంతయు విషణ్ణులై రంత♦ నెసఁగునబ్ధి, నాకసమురీతి దుష్పార♦మై చెలంగ.

క. కనుఁగొని వనచరు లందఱు, మనముల దిగులొంది యేమి ♦ మనకిఁకఁ జేయం
గను దగుకార్య మటంచును, ననుకొని; శాకపిమహేంద్రుఁ♦డంగదుఁడంతన్.

చ. వనచరులామహాజలధి♦వర్యముఁ గాంచినయంత నే భయం
బును గనుఁగొంచి యాఱడిలి ♦ మోదము నొందఁగ హెచ్చరించె; నిం
ద్రునకును బౌత్రుఁడై సుమతి♦తోఁ దగు నంగదుఁ డార్తినుగ్నులన్
వనచరులం గనుంగొనుచుఁ ♦ బల్కెఁ విషాదము మానుఁడంచులన్. ౧౦ 2075

క. ఉనుపఁగరాదది యేక్షితిఁ, బెనుదోషము కుపితమైన ♦ పెనుసర్పము బా
లుని జంపురీతి దుఃఖమె, గనఁజేయును మృతిని, బురుష♦కాంతునినైనన్. ౧౧

క. పురుషుఁడు శౌర్యముఁ జూపెడు, తరుణమున విషాద మెవ్వి♦ధమునఁగలిగె నా
పురుషునిఁ దేజోహీను నొనరించుఁ బురుషార్థసిద్ధి ♦ నరున కతనికిన్. ౧౨

క. కలుగఁగ నేరదు సుఁడి! యని, పలికెన్ దన్నిశయుఁ గడువ ♦ వనచరవంక్తిం
గలిగిన వృద్ధుల నొకచోఁ, గలిపి సముద్రంబు దాఁటు♦కార్య మొనరుపన్.

ఆ. అంగదుండు మరల ♦ నాలోచన మొనర్చె;
నింద్రుఁజుట్టుఁ జేరి ♦ యెట్లు సురలు
వెలయుచుందురట్లు ♦ లలి నంగదునిచుట్టు
గొలిచియున్న ప్లవగ♦కూట మలరె. ౧౪ 2079

ఆ. అంగదుండు పవను♦నాత్మజుండును దప్ప, మఱియెవండు తా స♦మర్థుఁడగును?
భయదరీతిఁ బరఁగు ♦ వనచరసేనను, నిలువరింప నొకటఁ ♦ గలుప జగతి. ౧౫

క. పరమర్దనుఁడై సిరిచేఁ, బరఁగెడు నంగదుఁడు వృద్ధ♦వనచరులయు నా
వారిసేనయు ననుమతిఁ గొని, పరమార్థము లలరునట్టి ♦ పలుకులఁ బలికెన్.

క. గురుతేజుఁ డెవ్వఁ డిందున్, నరినధిపతి దాఁటఁగలఁడు ♦ శత్రువారుండా
వరసిజబాంధవమానుని, ద్వరఁగా సత్యప్రతిజ్ఞుఁ ♦ దతనమ్మోదున్. ౧౭ 2082

* క్వచి త్పుస్తకే త్రైశ్లో జలరాశిభి రావృతమ్-అనిమూ.

క. ఒనరుపఁగలఁ డెవ్వండో, వనచరులారా! యొకండు ♦ వరవీర్యమునన్
వననిధియోజనశతమును, ఘనగతి లంఘించి సాధు♦కార్యము దీనిన్. ౧౬౪

క. ఫలియింపఁ జేసి హరిసేనల కెల్లం బద్మసఖుతనయునివలన నిఁకం
గలుగందగు పెనుభయమును, గలుగఁగ నీకుండఁజేయఁ♦గలుగునొ చెప్పుఁడా.

సీ. ఎవ్వనిమహిమచే ♦ నిఁక మనమెల్లను గార్యసిద్ధిం బొంది ♦ కడుముదమునఁ
బురమునకున్ సుఖం♦బుగఁబోయిమనభార్యలనుబుత్రులగృహము♦లనుగనంగఁ
గల? మదెవ్వని యను♦గ్రహమున సంతోషమందుచు బలశాలు♦రైనరామ
లక్ష్మణసుగ్రీవు♦లను జూడఁ దత్సన్నిధికిఁ బోవఁగలము మ♦తిస్థిరుఁ డగు

తే. నెవ్వఁడేనియు మీయందు ♦ నీజలనిధి
యోజనశతంబు లంఘింప ♦ నోపునేని
యాతఁడిప్పుడె వేగంబ ♦ యభయదక్షి
ణను మహాపుణ్యదంబు మా♦కును నొసఁగుత. ౨౧ 2085

క. అని యంగదుండు పలికిన, విని యందెవ్వఁడును బదులు♦విషయము దేనిం
జనువునఁ బలుకండయ్యెను, వనచరసేన యది బ్రాను♦పడియుండెఁ దగన్.

క. హరిసత్తముఁ డాయంగదుఁ, డురువాగ్గుంభనము లొప్ప ♦ నొగి మరల హరీ
శ్వరులం గని యిట్లనియెన్, వరవిక్రమములను భూరి♦బలమున మీరల్. ౨౩

ఆ. యశముఁ గాంచినారు ♦ హరివరకులమునఁ
బుట్టినారు మిగులఁ ♦ బూజ్యులగుచుఁ
బరఁగినారు కీశ♦వరులార! మీలోన
నెవ్వఁడేని యెప్పు♦డే నదెందు. ౨౪ 2088

క. గతి నడ్డులేనివాఁడెగ,ద తగన్ దూరంబదెంత ♦ దాఁటంగల యు
ద్ధతశక్తిఁ గలదొ యెవనికి, హితముగ వచియింపుఁ డిట్టు♦లేలొకొ? యుండన్.

అఱువదినాలుగవ సర్గము సంపూర్ణము.

---

## ౬౫ - వ సర్గము.

కోఁతులు తమతమసామర్థ్యంబులఁ జెప్పుట.

క. అనియి ట్లంగదుఁ డాడిన, విని వానరసంఘమందు ♦ వీరులునయి యొ
ప్పినయట్టి గజముఖులు తమ,కును గతిఁగల శక్తులను వి♦గూఢముగాఁగన్.

సీ. పలికిరి గజగవా♦క్షులు గవయుండును మఱి శరభుండును ♦ మైందుఁ డట్లె
ద్వివిదుండు ఘనతర♦తీవ్రవిక్రముఁడైన యాగంధమాదనుఁ ♦ డాసుషేణుఁ
డాజాంబవంతుఁడు ♦ నంగదుఁ గనుఁగొని తమశక్తులను జెప్పఁ♦దలఁచి; రందు
గజుఁడు యోజనదశ♦కంబు నేదాఁటఁగాఁ గలనంచుఁ బలికెనా♦గతిగవాక్షుఁ

తే. డిరువదియె యోజనంబుల ♦ నేను దాఁటఁ
గల ననియెను వనచరుఁడు ♦ గని గవయుఁడు
ముప్పదే దాఁట యోజన♦ములను శక్తి
గలుగువాఁడ నటంచని ♦ పలికె నంత. ౪ 2094

క. వనచరపూజ్యుఁడు శరభుం, డనె నలువదియోజనముల♦యంతటిదూరం
బును దాఁట శక్తిగలదని;, యనుపమశౌర్యంబు మీఱ ♦ నలరి ఘనుండై. ౫

క. తనరారు గంధమాదనుఁ, డనె నేఁబదియోజనముల♦యంత నెగురఁ జా
లిన శక్తిగలదు నందియు, మనరాదని; మైందుఁ డప్పు ♦ డక్కపిగణముల్. ౬

క. కనుఁగొని నే నఱువదియో,జనములు లంఘింప మిగులఁ ♦ జాలుదు నని చె
ప్పెను; నంత ద్వివిదుఁ డన నొ,ప్పిన కూరుఁడు డెబ్బదేను♦బృథువేగమునన్.

తే. దాఁటఁ జాలుదుననియె; నం♦తట సుషేణుఁ
డనెడు వనచరకుంజరుఁ ♦ డప్పుడనియె
నొక్కరీతిని నెనుబది♦యోజనములు
దాఁటఁజాలుదునని సమ♦స్తకపు లిట్లు. ౯ 2095

క. పలుకుచునుండఁగ జరచే,త లలిన్ వివిధప్లవంగ♦తతి మించెడు ను
జ్జ్వలమూర్తి జాంబవంతుఁడు, పలికెం దదనుజ్ఞఁగొని ప్ల♦వంగములారా!.

[1]క. మును మాకు గతిపరాక్రమ, మున నతిశయశక్తియుండె ♦ ముసలితనముచే
త నిపుడు జర్ఝరితంబగు, తనువున నున్నారమైనఁ ♦ దత్త్వము వినుఁడీ!. ౧౧

చ. వనచరనాయకుండు రఘు♦వర్యుఁడు చేయఁగఁ బూనియున్న యి
ప్పనిని నుపేక్షసేయుటకు ♦ భావ్యముగాదు వయస్సు పోయి కా
లనియతి ఖేదమైనతఱి ♦ లావున దాఁటఁగ నెంతదూరమీ
తనువున శక్యమౌనొ నిట ♦ దాఁపక మీకెఱిఁగింతు నేనొగిన్. ౧౨౪ 2098

తే. యోజనంబులు తొంబది ♦ యుదధిమీఁదఁ
బోవఁజాలుదు నందియుం♦బు వలదింక
ననుచు మరలను వారలఁ ♦ గని వచించె
వయసునందున్నతఱి నాదు♦వపువునందు. ౧౩౪ 2099

సీ. తనరెడుగతి నమ♦ర్థత యింతమాత్రమే గాదు పూర్వము బలి♦క్రతువునందు
శాశ్వతుండైనట్టి ♦ చక్రి త్రివిక్రముం డయి పదత్రయమున ♦ నఖిలలోక
ములను గొల్చెడుతఱి ♦ వెలసిన యతనియాకారంబునకుఁ జుట్టుఁ ♦ గమ్రశక్తిఁ
దనరఁ బ్రదక్షిణం♦బును జేసినాఁడను వయసున నొరుల కె♦వ్వరికి లేని
తే. యసదృశంబగుగతి శక్తి ♦ యలరుచుండె,నట్టి నేనిప్డు ముదిమిని ♦ నందినాఁడ
బ్లవనమున మందశక్తి నా♦పాలఁబడియె,నిప్పుడేనింతమాత్రమే♦యెగురఁగలను.

1 పూర్వ మస్మాక మప్యాసీ త్కశ్చి ద్గతిపరాక్రమః-అనిమూ.

క. అని తలఁచుచున్నవాఁడను, వినుఁ డీలంఘనముచేత ♦ విపులంబగు నిప్పని నెఱవేఱదుగా యని, వనచరు లెల్లరు వినంగఁ ♦ బలికెఁ గడంకన్. ౧౭

చ. వనచరవర్యుఁ డంగదుఁడు ♦ ప్రాజ్ఞవరుండగు జాంబవంతునిం
గని తదనుజ్ఞఁ బొంది యిఁకఁ ♦ గాఁ దగు కార్యమునందుఁ బూన్కిఁజే
యను దగునట్లుదారమగు ♦ నర్థము గల్గఁగఁ జెప్పె నిట్లుగాఁ
వనదగుశక్తిరీతిఁ బ్రమ♦దం బలరారఁగ నాలకింపుఁడీ. ౧౮ 2102

[1]క. వనచరులారా! శతయోజనములు దాఁటంగఁ దగిన♦శక్తి గలదు నాకునుగాని మరలివచ్చుట, కనువగు లాఘవము గలదొ ♦ యయ్యది లేదో. ౧౯

[2]ఆ. నిశ్చయింపఁజాల ♦ నేను నా విని వాక్య,కుశలుఁడగుచుఁ బ్లవగ♦కుంజరుఁడయి
తనరు జాంబవంతుఁ ♦ డనియె నంగదుఁ జూచి, ప్లవగభల్లనాథ!♦వాలితనయ!.

ఆ. తెలిసినదియె నీకుఁ ♦ గలుగు లంఘనశక్తి, శతమనంగ నేల ♦ సరిగ వేయి
యోజనంబులైన ♦ నురుగతి లంఘించి, మరల రాఁగఁగలవు ♦ మాటలేల.

క. పరిజనులు ప్రభువు నొకపని, కరుగం దగునంచుఁ బంపు ♦ నాచారము లేదరసిన నెందును గావునఁ, బరిజనులము మేము నిన్నుఁ ♦ బంపుట తగునే.

[3]క. వనచరవర్యా! తండ్రీ!, తనజనులను బంపఁ బ్రభువు ♦ తగుఁగాని, స్వభృత్యనికరము తన్నుఁ బంపఁగఁ, జనఁదగు నే యిట్టులెందు ♦ శాస్త్రము గలదే?.

సీ. పరనిషూదన! మాకుఁ♦బ్రభువుగానీవుంట మేమందఱమునిను♦మిగులఁబూన్కిఁ
గాపాడుకొనఁదగు; ♦ క్ష్మాపతిసైనికులకునెల్ల సర్వదా ♦ ప్రకటశక్తిఁ
గాపాడుకొనఁదగు ♦ కన్నవస్తువుగదా? యిది లోకసంస్థితి♦యేయగుఁ జుమి;
కావున నిన్ను ర♦క్ష్యంబగువస్తువవలె నిరంతరము గా♦పాడుకొనుట

తే. మాకు ధర్మ మరిందమా! ♦ యాకరణిని
నీమహాకార్యమునకెల్ల ♦ నీవె మూల
భూతుఁడవు మూలమెట్టులు ♦ భూమిరుహము
నకుఁ బ్రధానమొ యట్టులె ♦ నయగుణాఢ్య. ౨౪ 2108

క. పని కంతకు నెయ్యది చక్కనిమూలమె యట్టిదానిఁ ♦ గాపాడుటయే
ఘనకార్య మిదియె నీతియ,గును గార్యజ్ఞులకు; నిదియ♦గును ధర్మమిలన్.

క. తరువునకు వేఱు చక్కఁగఁ, బరికింపఁగనైనఁగాని ♦ ఫలపుష్పంబుల్
సరిగా నుదయించుటయుం,బెరుఁగుటయును గల్గు; సత్య♦విక్రమ! యెపుడున్.

చ. విను మిఁక నీను కార్యమును ♦ వేయివిధంబుల సిద్ధినొందఁజే
యను మతివిక్రమంబుల న♦యంబున నీవె ప్రధానకారణం

---

[1] ...నివర్తనేతు మే శక్తి స్స్యాన్న వేతి నవిశ్చితా - అనిమూలము. 2 ప్లవగకుంజరుఁడు-ఇటఁ బ్లవగశబ్దము సర్వవనచరవాచకమనిగ్రహింపఁదగు. 3 నహి ప్రేషయితాం తాతస్వామీ - అని మూలము.

బనఁ దగియున్నవాఁడ విది ♦ యంతయు సత్యము నీవె లంకకుం
జనిన మఱెట్లు మాకుఁ గతి ♦ చక్కఁగ నెంచుము కీశనాయకా!. ౨౮ 2111

[1]క. గురుఁడవు గురుపుత్త్రుండవు, పరికింపఁగ నిన్ను నమ్మి ♦ పరమంబగు నీ
గురుకార్యము సాధింపఁగ, నరుదెంచితి మీవు లేక ♦ యది యెట్లలరున్. ౨౯

ఆ. మాకు నెట్లు శక్తి ♦ యీకార్యసాధన
మందుఁ గల్గు; ననియె ♦ ననఘమతియుఁ
బ్రాజ్ఞవర్యుఁడునయి ♦ వఱలు జాంబవం
తుండు శక్రపౌత్త్రు♦తోడ నిట్లు. ౩౦॥ 2113

[2]చ. పలికిన వాలిపుత్త్రకుఁడు ♦ బాగుగ నాతనిఁ జూచి యివ్విధిం
బలికెను లంకకేఁ జనక ♦ వానరుఁ డెవ్వఁడుగాని పోక యీ
స్థలముననున్నచో మరలఁ ♦ జక్కఁగ ముందటియట్లె ప్రాణముల్
వెలువడు నావ్రతంబునె గ♦భీరమతీ! యిపుడూననొంగదా!. ౩౧ 2114

సీ. ధీమంతుఁడగు కపి♦ధీరునియాజ్ఞను బాలింపకయె మాన♦పరిమితమగు
గడువును దప్పి సా♦గరమున కేగిన మనప్రాణములు చూడ ♦ మనవి కావు
గద! యల్లసుగ్రీవుఁ♦డుపయఁ బూనిన నాగ్రహంబుఁ బూనినఁగాని♦యత్యధికమె
యతని యానతిమీఱి ♦ యరుగుదుమేని వినాశనంబగును మ♦నకుఁ దలంప
తే. సర్వవిదుఁడవు కార్య మే♦సరణి మనము
తలఁచినట్లుగఁ గాత యీ♦ తఱిని వేఱు
విధముగా సిద్ధినొందెడు♦విధము నీవె
చక్కఁదలపోయుమా! యని ♦ సాధుమతిని. ౩౨ 2115

క. సురపతిపౌత్త్రుఁడు తన కుత్తరమును జెప్పంగ వీర♦తల్లజుఁడయి వా
నరముఖ్యుఁడైన భల్లుక, వరుఁ డప్పుడు విని వచించెఁ ♦ బ్రౌఢిమ తనరన్. ౩౩

క. వీరా! నీకార్యమునకు, నేరీతిం గొఱఁత గొంచె♦మేఁ గలుగదు నూ!
టారసి యీకార్యంబును, శూరత సాధింపఁ గల్గు ♦ శుభగుణు నొకనిన్.

తే. పంపుచున్నాఁడ నిదిగో యో♦వాలిపుత్త్ర!
యనియె; నంతటఁ బ్లవగాళి♦యందుఁ జూడ
నుత్తముండయి వృద్ధుఁడై ♦ యొప్పు జాంబ
వంతుఁ డచ్చటికపులను ♦ వరుస వదలి. ౩౫॥ 2118

చ. నిరుపమవిక్రమంబునను ♦ నేర్పుఱియై బలసంపదన్ మహా
త్తరుఁడయి ఖేచరాళిని ని♦తాంతము సర్యుఁడు తానెయై మనో

---

1 గురుర్వై గురుపుత్త్రశ్చ-అనిమూ. ఇట గురుశబ్దము ప్రభుపరమని గ్రహింపఁదగు. 2 ప్లవగర్షభ త్వేద మస్మాభిః కార్యం ప్రాయోపవేశనమ్-అనిమూ.

హారముగ నొంటిగాఁ గపుల♦నందఱిఁ బాయుచుఁ గూరుచున్నయా
మరుదధినాథు నాత్మజుని ♦ మానితశీలుని నబ్ధిదాఁటఁగాఁ
బురికొలుపంగఁ బూనె మదిఁ ♦ బొంగెడువేడుక సంబడింపఁగన్. ౩౫ 2119

అఱువదియైదవ సర్గము సంపూర్ణము.

---

## ౬౬ - వ సర్గము.

జాంబవంతుఁడు లంకకుఁగ హనుమంతుని బ్రోత్సాహపఱచుట.

[1]క. హరివరులు పెక్కు వేలుగఁ, బరఁగియు దీనతను బొంది ♦ పలుకకయుంటన్
గర మరసి మారుతింగని, హరిముఖ్యుఁడు జాంబవంతుఁ ♦ డాదృతిఁ బలికెన్.

తే. సర్వశాస్త్రవిశారదా! ♦ శౌర్యసార!, పావనీ! యిట్టు లేకాంత♦పరతఁ గాంచి
పలుకకున్నాఁడవేమి? య♦పారబలము, నను మహాతేజమునను వా♦నరపతికిని.

ఆ. రామలక్ష్మణులకు ♦ నేమాడ్కిఁ జూచిన, సాటి యనుచుఁ జెప్పఁ♦జాలు దీవు
కశ్యపునకు వినత♦కడుపునఁ బుట్టిన, వాఁడు పక్షిరాజు ♦ బలయుతుండు. 3

క. గరుడుఁడు కలఁడాతఁడు సా,గరమునఁగల భూరిభుజగ♦కాండము గ్రహియిం
చి రయము కీర్తియుఁ బ్రబలఁగ, నరుగుచు నుండంగ నేను♦నాకనిఁబూన్కిన్.

క. పలుమాఱులు గనినాఁడను, బల మాతనిపక్షములకుఁ ♦ బ్రబలు నదెంతో
కల దంతనీభుజంబుల, కలఘుగుణా! విక్రమంబు ♦ నధికజవంబున్. ౫

క. ఆతనిజవశౌర్యములకు, నేతఱినేఁ దీసిపోవ ♦ వేమాత్రము; నే
భూతములయందు నీబల, మాతత తేజంబు ధైర్య ♦ మగపడదు నుమీ!. ౬

ఆ. ఇట్టినిన్ను నీవె ♦ యెఱుఁగవా! యేమి? య,చ్చరలలోన రూప♦సంపదలను
బొదలుచున్నయట్టి♦పుంజికస్థల యను, వనిత గలదు లోక♦వారమందు. ౭

క. తనరారె నదియు ఖ్యాతిని, గనదాకృతిదానిసాటి♦కాంతలు లోకం
బున లేరు; శాపవశమున, ఘనమతియా కుంజరునకుఁ ♦ గన్యక యయ్యెన్.

తే. కామరూపిణియై యది ♦ క్ష్మాతలమున
నంజనాఖ్యను వహియించి ♦ యంతఁ గేస
రిని దమిం బెండ్లియాడె నా♦వనిత యిచ్ఛ
వచ్చినట్టి యాకృతిఁ దాల్చి ♦ వఱలుచుండు. ౧౦ 2128

క. వనచరనారియె యయ్యును, ఘనరూపవిశేషమహిమఁ ♦ గాంచెను మఱియా
వనితయు నొకప్పు డాదృతి, మనుజవధూరూప మొంది ♦ మహితాకృతితోన్.

సీ. తనరుచు యౌవనం♦బునఁ బొలుపొందుచు బహువిధమాలికా♦భరణములను
ధరియించి రుచిరవ♦స్త్రంబులఁ దాలిచి ప్రావృషంబుదసన్ని♦భముగ నలరు

1 గతసర్గాంతశ్లోకభావమే యిందుమందుట ప్రాచీనగ్రంథపరిపాటి యని తెలియవలయు.

పర్వతాగ్రంబునఁ ♦ బరమాదరంబున విహరించుచుండె నా♦విపులనేత్ర
యంజన విహరింప ♦ నామె యొఱ్ఱనియంచు గలపట్టుపుట్టంబు ♦ గాలివీవ

[1] తే. నించుక తొలంగె; నంశుక♦మిట్లు తొలఁగ
వృత్తములు సంహతములునై ♦ యొసఁగుదాని
యూరువులఁ బృథులంబులై ♦ యొప్పి యొకటఁ
గలిసికొనియున్న కుచములఁ ♦ గమ్రముఖము. ౧౩॥ 2130

క. కనియెన్ వాయువు మఱి యం,జనను సుశ్రోణి శుభ్ర♦సర్వాంగవిలా
సిని దనుమధ్య యశస్వినిఁ, గని మన్మథమోహితుఁడయి ♦ గాలియు నచటన్.

ఆ. ఆయనిందిత నంజన ♦ నధికమన్మ
థార్తి నంగంబులెల్ల నొ♦య్యనఁ దపింపఁ
జిత్తమెచటికొ చనఁగ నొ♦క్కొత్తునఁ దన
[2]గురుభుజంబులఁ గౌఁగిటఁ ♦ గుదియఁబట్టె. ౧౫॥ 2132

క. తనుఁ గౌఁగిలింపఁగా నం,జన యంత సువృత్తగాన ♦ సంభ్రాంతయునై
యనియె నిదెవ్వఁడు నే నొ,క్కనికే భార్యనయి యుంనఁ♦గా నావ్రతమున్.

క. ఈరీతిఁ జెలువఁబూనెను, నా రమణీవాక్యము విని ♦ నారీమణి! యో
చారుశ్రోణీ! సుందరి!, గారవమున నొక్కపతిని ♦ గనిన నినుఁ దమిన్. ౧౭

క. పాతివ్రత్యంబున వి,ఖ్యాతిని గనియున్నదాని ♦ గాఢాశ్లేషం
బీతఱిఁ జేసితి మనమున, నీతో భోగించినాఁడ ♦ నెలఁతుక! కానన్. ౧౮॥

[3]క. కాన భయం బిసుమంతయుఁ, బూనకు వ్రతభంగమయ్యెఁ ♦ బో నాకనుచున్
జానరొ? తలఁపకు మట్లుగ, నే నిను హింసింపలేదు ♦ నిశ్చయము సుమా!.

సీ. వ్రతభంగ మెంతమా♦త్రంబు గాకుండుటె కాక సన్మతివీర్య♦కలితుఁడైన
తనయుఁడు నీకును ♦ జనియింపఁగలఁ డాతఁ డతులసత్వుండు బ♦లాధికుండు
శౌర్యధుర్యుండు తే♦జశ్శాలియునగుఁ జూ! లంఘనప్లవనంబు♦లను నతండు
నాకు సమానుఁడై ♦ వీకమై నుండంగఁ గలఁడని పవనుండు ♦ పలుక నీదు

తే. జనని సంతుష్టయై కపీ♦శ్వర! ముదమున
నచటఁ బర్వతగుహయందు ♦ వారితిలకుని
నిన్నుఁ బ్రసవించె: జననంబు ♦ నీవు నొంది
బాలుఁడవె యయ్యు నమ్మహా♦వనమునందు. ౨౦॥ 2137

---

1 సదదర్శ తత స్తస్యావృత్తావూరూ సుసంహతౌ, స్తనౌ చ పీనౌ సహితౌ సుజాతం చారు చాననమ్-అనిమా. 2 పతాం భుజాభ్యాం దీర్ఘాభ్యాం పరిష్వజత మారుతః-అనిమా. 3 నత్వాం హింసామి సుశ్రోణి మాభూత్తే సుభగే భయమ్, మనసాస్మి గతో యత్త్వాం పరిష్వజ్య యశస్వినీమ్-అనిమా.

క. సరసిజమిత్రుం డుదయింప రమ్యఫలమని ముదం బలరి ♦ పరమజవమునన్
బరుగెత్తితివి దివంబున, సరగున నద్దానిఁ దివిఁ గ ♦ సంతోషమునన్. ౨౧½

చ. త్వరపడి పెక్కుయోజనశ ♦ తంబులు పోయియు భాస్కరాతప
స్ఫురణము తాఁకునం గవలి ♦ పోల వొకింతయు నేని యో కపీ
శ్వర! యిట నీవు వేగగన ♦ భాగమునం గను మూర మిట్లు రా
గుకుతరకోపవేగమునఁ ♦ గోయని యూఁచుచు నింద్రుఁ డుగ్రుఁడై. ౨౩ 2139

చ. కులిశము వైచె నీపయిని ♦ గోరియొ నీవలనన్ భయంబు లో
కుల కిఁక నేమి గల్గునొ త ♦ గుంగద యూపని యిప్పుడంచు న
య్యలఘుతరాయుధాహతికి ♦ నగ్రిక శైలమునందుఁ జయ్యనం
గలఁగుచు నీవొగిం బడితి ♦ గావున నక్కటనంపువ్రేటునన్. ౨౪ 2140

క. నీవామహానువు విఱిగెను, గావున హనుమంతుఁడనఁగ ♦ ఖ్యాతిగ నామం
బావహిలెంగన నీకును, నీవటు వజ్రాయుధహతి ♦ నెఱి గిరి పడుటన్. ౨౪½

తే. తాఁ బ్రభంజనుఁడనఁగ గం ♦ ధవహుఁడనఁగఁ
బరఁగు వాయువు కని క్రోధ ♦ పరవశుఁడయి
ముజ్జగంబుల నేమాత్ర ♦ మును దనగతి
కలుగకుండ నొనర్చె ని ♦ కామశక్తి. ౨౫½ 2142

క. లోకంబులు కలఁతంగన, లోకస్వాములగు నమరు ♦ లున్ సంభ్రాంతిన్
జీకాకుపడుచుఁ బవను మఱుఁ గోపుని నూఱడించి ♦ యాతనితోడన్. ౨౬½

తే. సత్యవిక్రమ! వత్స! నీ ♦ జనకుఁ డంత
శాంతినొందిన నీకు నా ♦ సరసిజజని
శస్త్రములఁ జావకుండఁగ ♦ సంగరమున
వరమొసంగెను దా నట ♦ వజ్రహతికి. ౨౭½ 2144

సీ. నొవ్వకుండుటఁ గాంచి ♦ యువ్వజ్రి ప్రీతుఁడై యిచ్చవచ్చినయప్పు ♦ డీవు మృతిని
గనునట్లు లుత్తమ ♦ మననొప్పు వరమును దయచేసె; భయవప్ర ♦ తావుఁడవగు
నీవు కేసరియును ♦ నా వానరునకు క్షేత్రజుఁడవు గాలి కౌ ♦ రసుఁడ వతుల
తేజంబునన్ వాయు ♦ దేవున కుద్దివై తగువాఁడ వగుదు; వ ♦ త్స! యలనీవు

తే. వాయుసుతుఁడవుగానఁ బ్ల ♦ వనమునందు
జనకునకు సాటియౌదువు ♦ శక్తిశౌర్య
ములఁ జెలంగుదు రెండవ ♦ మూర్తి యతఁడు
గరుడున కనంగఁ దగుదువు ♦ కపివరేణ్య!. ౩౦ 2145

క. మాకుం బ్రాణము దక్కుట, నీ కష్టముగాఁగ నున్న ♦ దిప్పుడు కానన్
జేకొని మమ్ముం గావుము, నీకరుణయె తెప్ప దుఃఖ♦నీరధిదాఁటన్. ౩౧

క. దనుజాంతకుఁడు త్రివిక్రముఁ, డన ననతాకారంబుఁ దాల్చి♦నప్పుడు భూమీ
ధ్రనిచయవనయుతమగు పృథ్వి నిరువదియొక్కమాఱు ♦ తిరిగితిఁ దండ్రీ!.

క. ఈవిధిఁ బ్రదక్షిణంబును, గావించుచు నోషధుల ♦ గైకొనుటకుఁ బా
రావారమును మథింపఁగ, దేవతలయనుజ్ఞఁ బూని ♦ దివ్యౌషధులన్. ౩౩

తే. ప్రోగుచేసితి వానిని ♦ భూరిజలధి
వైచి చిలుకుటవలనను ♦ వఱలె నమృత
మపుడు మాకుండెఁ జూ! బలం ♦ మధికతరము
హీనశౌర్యుండ నైతి ♦ వృద్ధతఁ గని. ౩౪ 2149

క. విను మాలోపల నీవే, గనుఁగొనఁగా సర్వశక్తి♦కలితుఁడ వటుగా
వున శౌర్యమ్ము బయల్పఱ, ననూనగతి విక్రమింపు ♦ మంజనతనయా!. ౩౫

తే. దాఁటఁగలవారిలోన ను♦త్తముఁడవు గద
హరివరేణ్య! భవద్వీర్య ♦ మాకృతిఁ గన
నీప్లవంగబలంబెల్ల ♦ నెదలఁ గోరు
చున్నయది లెమ్ము లంఘింపు ♦ ముదధి లీల. ౩౬ 2151

క. హనుమంతా! నీకుండు గమనశక్తియు నిఖిలభూత♦మండలమునకుం
గనరాదుగా విషణ్ణుల, వనచరుల నుపేక్షచేయ♦వలదు మహాత్మా. ౩౭ 2152

క. మును విష్ణువు బలియొసఁగిన, ఘనదానము సంగ్రహించి ♦ కడుశౌర్యంబున్
గనఁబడఁ ద్రిపదంబులఁ గొల్చినరీతిని దాఁటవలయుఁ ♦ జెచ్చెఱ నుదధిన్.

క. అనియిట్లు జాంబవంతుఁడు, తనుఁ బ్రేరేపింప వాయు♦తనయుఁడు వేగం
బునఁ బోవలిసైన్యమంతయు,ఘనమోదమునొందఁదనదు♦కాయముఁ బెంచెన్.

అఱువదియాఱవ సర్గము సంపూర్ణము.

---

## ౬౭ - వ సర్గము.

హనుమంతుఁడు వానరుల కుత్సాహమును గల్పించి సముద్రము దాఁటఁ బూనుట.

చ. హనుమయు నూఱుయోజనము ♦ లంబుధి దాఁటఁగ మేనుఁ బెంపఁగాఁ
గని బలవీర్యపూర్ణుఁ గపి♦కాంతుని వానరులెల్లఁ జింత నొ
య్యన విడనాడి యెంతయును ♦ హర్షము నొంది గజేంద్రవైరిని
స్తవములు సేయుచున్ బ్రకట♦బాహాబలు న్నుతియించి రాతనిన్. ౧ 2155

క. మును వామనావతారం, బున ముల్లోకములఁ బూన్కి ♦ మూఁడడుగులచే
తను గొల్వఁబూను విష్ణుని, జనములు గనినట్లు భూరి♦జలధిం దాఁటన్. ౨౺

తే. ఉత్సహించెడుపావని ♦ నురుముదమునఁ
గాంచి యాశ్చర్యసంతోష♦కలితులగుచు
వనచరులు చింత వదలిరి ♦ బలయుతుఁడగు
హనుమ తన్నట్లు వానరుల్ ♦ వినుతిసేయ. ౩౺ 2157

క. తనబల మలరఁగ మోదం,బున వాలము ద్రిప్పుకొనుచుఁ♦బొదలెఁ గ్రమముగా
ఘనకాయ మపురవృద్ధిని;, వనచరవృద్ధు లొగి నుతుల ♦ వఱలంజేయన్. ౪౺

తే. అంతకంతకుఁ దేజ మ♦త్యంతవృద్ధి
నొందఁజేసెడు హనుమంతు ♦ నుగ్రకాయు
ననుపమానంబుగాఁ జూడ♦నయ్యె; నద్రి
గుహాలయందున్న కేసరి ♦ కొర్కి మీఱ. ౫౺ 2159

క. పెరిగి విజృంభించెడుగతి, మరుదాత్మజుఁ డట్టె పెంచె ♦ మానితకాయం
బరుదగునట్లుగ; నివ్విధి, వరుసన్ జృంభించుచున్న♦వాయుజముఖమున్. ౬౺

క. కన వేఁపుడుపాత్రము వలెఁ, గనదుగ్రవిధూమపావ♦కప్రతిమముగాఁ
దనరుట దెల్లంబయ్యెను;, వనచరమధ్యమమునుండి ♦ వాయుజుఁ డంతన్. ౭౺

క. తనువున రోమాంచము లొ,య్యనఁ బర్వఁగ లేచి నిలిచి ♦ యాదృతిమీఱన్
వనచరవృద్ధులకున్ వం,దన మొనరిచి వారిఁ గాంచి ♦ తా నిట్లనియెన్. ౮

చ. జ్వలననిమిత్తమై గమన♦శక్తిని సాటియె లేక యెంతయున్
బలమున మీఱి యింతయని ♦ వర్ణనముం బొనరింపరానిశ
క్తులఁ దగి యాకసంబుననె ♦ కొర్కిఁ జరింపఁగ నేర్చియున్ మహా
బలుఁ డన నొప్పు వాయువొగిఁ ♦ బర్వతకూటములన్ దృణంబుగాన్. ౯

[1]ఆ. విఱిచివైచినాఁడు ♦ వేగము గమనంబు, బలము గల్గునట్టి♦వాయువునకు
నౌరసుండఁ బ్లవన♦మందున నాకెన్న, సముఁడు లేఁడు సర్వ♦జగములందు.

సీ. ఆలస్య మొనరింప ♦ కతిజవంబున మహావి స్తీర్ణమయి భూరి♦విష్ణుపదము
నొరయుచున్నట్లున్న♦యుర్వీధరేంద్రమా మేరువునకుఁ బెక్కు♦సారు లేను
వలగొనిరా నెంతు ♦ బాహువేగంబున సాగరాంబువులను ♦ జల్లి పర్వ
తాళినదీహ్రదా♦యతమైన భూతల మాసముద్రజలంబు♦నందు మునుఁగఁ

తే. జేయఁజాలుదు; జంఘోరు♦చిత్రవేగ
మునకు సంభ్రమ మేమఁగ ♦ ఘనతరంబు
లైన యందలినక్రముల్ ♦ గానఁబడఁగఁ
గలవు సురమార్గమున భూరి♦కాయములను. ౧౦ 2165

1 అరుజ త్పర్వతా గ్రాణి హుతాశనసఖోऽనిలః-అనిమా.

[1]క. పతగాళిసేవితంబగు, ద్యుతలంబున వైనతేయుఁ ♦ డోగి నాహారా
కృతి ఫణులఁ బట్టుకొనఁగా, నతిజవమునఁ దిరుగునట్లు ♦ డాతని నేనున్. ౧౩౪

తే. వేయిపర్యాయములు చుట్టు ♦ వితతకీర్తిఁ
దిరిగి రాఁజాలుదును; దూర్పు ♦ గిరిని భానుఁ
డుదితుఁడై పోవునప్పుడే ♦ నుౘగ నతని
తోడఁ బయనంబుచేసి నే ♦ స్తుత్యజవమున. ౧౪౪ 2167

చ. ఖరకరుఁ డస్తశైలమును ♦ గానఁగఁ బోవకముందె యస్తభూ
ధరమును జేరి నే మరలి ♦ ద్యోతకమూర్తియుఁ బ్రజ్వలించుచం
బరమున మధ్యభాగమునఁ ♦ బాయకయుండ నెదుర్కొనంగ నే
నరుదుగ రాఁగఁ జాలుదు; మ♦హాకపులార! యనంతరంబునన్. ౧౫

తే. ధరణిపయి విశ్రమింపక ♦ తత్సమాన
జవమునన్ మఱియొకసారి ♦ సరసిజాప్తు
నెదురుకొనఁ జాలువాఁడ; నే♦నేవు మీఱ
[2]నంబరస్థితఖేటతా♦రాదికముల. ౧౬ 2169

క. అతివేగంబున మీఱుచు, జలనంబునఁ బోవనేర్తు; ♦ సమధికవేగో
ద్ధతి నెగిరినచో సాగర, మతిశయముగ శోషమొందు♦నట్టు లొనరుతున్. ౧౭

క. ధరణిని ఛేదింతును భూ,ధరములఁ బిండిగ నొనర్తు ♦ దాఁటెదఁ దఱి నా
యురుశక్తి వేగమున సా,గరమును వెనువెంట వెడలఁ♦గాఁ గలదు తరన్. ౧౮

క. జలనిధి దాఁటఁగ నంబర,తలమున కే నెగుర వృక్ష♦తతుల లతలనుం
గల వివిధపుష్పములు రాఁ,గల వెల్లను నాదువెంట ♦ గమనజవమునన్. ౧౯

[3]ఆ. వివిధపుష్పతతులు ♦ వెంటరా నాపథ
మంబరమునఁ దార♦కావృతమగు
స్వాతిపథముఁ బోలి ♦ సాంద్రముగాఁ గను
పట్టఁగలదు వేయి♦పలుకు లేల!. ౧౯౪ 2173

చ. వనచరులార! నే గగన♦భాగమునం ద్వరఁ బోవునప్పుడై
న నెగయునప్పుడైన జల♦నాథుని దక్షిణతీరమందు నొ
య్యన దిగునప్పుడైన నను ♦ నద్భుతరీతిఁగ భూతసంఘముల్
గనఁగల; వేను [4]గొప్పఘన♦కాయముతో జవమొప్పుచుండఁగన్. ౨౦౪ 2174

---

1 వైనతేయ ఇవాహం శక్తః పరిగంతుం సహస్రశః - అనిమూ. 2 ఖేటములు = గ్రహములు.
3 భవిష్యతి హి మే పంథాః స్వాతేః పంథా ఇవాంబరే - అనిమూ. 4 మహామేఘప్రతీకాశమ్-
అనిమూ.

తే. అంబరంబును మ్రింగెడు♦నట్టివాని
భంగి నాకాశతలమెల్ల ♦ వరుస నావ
రించి చనునప్డు మీరును ♦ జంచలించు
చిత్తములఁ జూడఁగలరు ప్ర♦సిద్ధతనువు. ౨౧½ 2175

సీ. జలనిధి దాఁటెడు♦సమయమందున నేను భంజించి జలదాళిఁ ♦ బ్రాఢశక్తిఁ
బర్వతపంక్తుల ♦ వడఁకింతు, జలనిధి క్షోభిల్లఁ జేయుదుఁ ♦ గొంకులేక
గరుడునియందును ♦ గాలియందును దప్ప నాకుఁగలట్టి య♦నంతశక్తి
యితరులయందు లే♦దిద్ది సత్యము; మహావేగంబు గలిగిన♦యాగరుడుఁడు
తే. వాయువును దక్క నంబర♦భాగమందు
నాడుచును బోవు నను వెంట♦నంటి రాఁగఁ
జాలు ప్రాణి మఱెందుండఁ♦జాలదిలను
క్షణములోన నిరాలంబ♦కమగు దివిని. ౨౪½ 2176

క. ఘనరాశినుండి వేగం,బున విద్యుల్లతిక లేచు♦పోలిక నెగురం
గను శక్తి గలదు నాకును;, వననిధి నే దాఁటుతఱిని ♦ వనచరులారా!. ౨౫½

క. మును వామనావతారం,బున బలియు నొసంగినట్టి ♦ మూఁడడుగుల నే
లను నాక్రమించు మధుసూ,దను నాకృతివోలె నాదు♦తను వలరారున్. ౨౬

[1] తే. నాదుబుద్ధికిఁ దోఁచుచు♦న్నయది మనను
చేష్టలం బట్టి తెల్పెడు♦సీత నేను
దప్పకుండఁ గనుంగొందు ♦ దాన మీరు
సంతసం బొందుఁడీ నేను ♦ సరగవత్తు. ౨౭ 2179

[2] క. నే వేగంబున గాలికి, నావినతాత్మజున కుద్ది♦యగువాఁడను జం
డీ! వేగయోజనాయుత,మావిధమున దాఁటఁగలను ♦ మార్గము పొంగన్. ౨౮

క. అని నాకుఁ దోఁచుచున్నది, ఘనవజ్రము దాల్చు దేవ♦గణనాయకునిన్
దనకై తానె జనించిన, వనజాసను విక్రమమున ♦ బవరమునందున్. ౨౮½

ఆ. పాఱఁదోలి నేను ♦ బాయనివ్రాన్కితోఁ
దత్కరములనుండి ♦ తగ నమృతము
వేగ తేఁగలుగుదు ♦ వేయేల లంకను
బెఱికి తేఁగలుగుదు ♦ విక్రమించి. ౨౯½ 2182

క. అని నాతాత్పర్యంబగు, ననియెను; నమితప్రతాప♦ మలరఁగ నిట్లా

1 అహం ద్రక్ష్యామి వైదేహీం ప్రమోదధ్వం ప్లవంగమాః-అనిమా. 2 అయుతం యోజనా
నాంతు గమిష్యామి మే మతిః-అనిమా.

వనచరసత్తముఁ డెంతయు, ఘనభీషణరవము మెఱయఁ♦గాఁ బల్కెంగన్. ౩౧

[1]చ. వనచరులెల్ల విస్మయము ♦ స్థైర్య సంతస మెంతొ పొంగఁగాఁ
గనుఁగొనుచుండి; రాహనుమ ♦ కస్రుతరోక్తుల జ్ఞాతిశోకమున్
జనునటు పల్కఁగా వినుచు ♦ సంతసమొప్పఁగ జాంబవంతుఁ డి
ట్లనియెను గేసరిప్రియత♦రాత్మజ! వీర! సమీరనందనా! ౩౨ 2184

తే. నాయనా! నీదుబంధుని♦కాయవిపుల
దుఃఖమును బూన్కిమీఱఁగాఁ ♦ దొలఁగఁజేసి
తివి; కపీంద్రులు చేరి నీ♦శివముఁ గోరి
కార్యసంసిద్ధికై పూని♦కలఁ జెలంగి. 33 2185

తే. మంగళాశాసనముల స♦భంగకీలిఁ
జేయుచుండంగఁ గలరు నూ! ♦ సిద్ధమౌని
కరుణఁ గపివృద్ధసమ్మతి ♦ గురువులయను
కంప నీసంక్రమును దాఁటు ♦ కడురయమున. ౩౪ 2186

సీ. నీరాకకొఱకు మే♦మీరమ్యతటమున నేకపాదంబున ♦ నిందునుందు
మీవనచరకోటి ♦ యెల్లప్రాణంబులు నీహస్తగతములై ♦ నిలిచియున్న
వనియె; నంతటఁ బవ♦నాత్మజుఁ డవ్వనచరులనెల్లను గాంచి ♦ బరవసమునఁ
బలికె; నే లంఘించు♦పట్టున నాయురవడి భూమి యిది సహిం♦పంగలేదు

తే. భూరిపాషాణవితతిచేఁ ♦ బొలుచు నీమ
హేంద్రగిరి దీని శిఖరంబు♦లెల్ల స్థిరము
లగుచు గొప్పవిగానున్న ♦ వట్లుగాన
నివియె నావేగమును సహి♦యింపఁజాలు. ౩౫ 2187

చ. పలువిధవృక్షసంతతుల ♦ భాసిలి గైరికముఖ్యధాతువుల్
వెలయఁగ నీమహేంద్రగిరి ♦ విస్తృతకూటములందు నేను ను
జ్జ్వలగమనంబునన్ నెఱపఁ♦జాలుదు నేశతయోజనంబులన్
వలువుగ దాఁటఁబోవుతఱి ♦ నాపదఘాతము నివ్వి యోర్చెడున్. ౩౬ 2188

చ. అని వచియించి వాయుసుతుఁ ♦ డాహనుమంతుఁడు వాయుతుల్యుఁడై
తనరెడువాఁడు గాన నరి♦దర్పముఁ జెందు పరాక్రమంబునన్
ఘనగిరి దాని నెక్కె; నది ♦ కాంతబహూజ్జ్వలవృక్షసంఘమై
కనఁబడుచున్ మనోహరమృ♦గవ్రజసేవితశాద్వలంబునై. ౩౭ 2189

---

1 వీర కేసరిణః పుత్ర హనుమ న్మారుతాత్మజ-అనిమా. ఇట హనుమంతుఁ డాత్మశ్లాఘా ప్రకటనము వల్కుట వానరులకుండు ప్రాణసంశయ మడఁగుటకుఁగాని తన్నుఁ దాఁ బొగడు కొనుటం గాదని ప్రాజ్ఞాతు నుగమమే.

చ. లతలును బుష్పముల్ తగ ఫ♦లంబులు పూవులు నెప్పు డొప్ప హ
స్తితతులు సింహముల్ పులులు ♦ చెచ్చెఱ సంతతముం జరింపఁ బ
క్షితతులు క్రొవ్వి కూయఁగఁ బ్ర♦సిద్ధములౌ సెలయేళ్ల వారిసం
తతము ను బాఱుచుండఁగ ని♦తాంతసముచ్ఛ్రితకూటసంతతుల్. ౪౩ 2190

ఆ. వెలయనొప్పునుండె ♦ విశదబలుండయి శక్రతుల్యమైన ♦ విక్రమమున
నలరు నాకపీంద్రుఁ ♦ డా గిరిరాజంబునందు సంచరించె♦నంత నపుడు. ౪౪

క. ధరవరమామహితాత్ముని, గురుపదఘాతములు మిగుల ♦ గుందుచు వరకే
సరిచేతఁ గొట్టఁబడుమద,కరిరాజముభంగి నొప్పె ♦ కళవళపడుచున్. ౪౫

క. హనుమత్పదఘట్టనమునఁ, దనశిఖరంబులు గలంగ ♦ ధరణీధ్రమ్మొ
య్యన జలపూరంబుల విడి,చెను; మృగమాతంగములును ♦ జెందెన్ భీతిన్.

[1]క. పెనువృక్షము లూగెను సుఱి,యును బానమునందు మిగుల♦మద్యమమున నొ
ప్పిన ఫణిగంధర్వులయు,క్కనికరములు భీతినొంది ♦ కడుజవ మలరన్. ౪౬

తే. మఱియు విద్యాధరసమూహ♦మఱిముఱి గిరి
సానువుల విడనాడిరి ♦ సకలపక్షు
లెగురసాగెను, బెనుఫణు♦లెల్లరంధ్ర
ముల విలీనంబులై నిల్చె ♦ కలఁగి యపుడు. ౪౭ 2195

క. గిరికూటంబులు గ్రావో,త్కరములు సంచలనమొందెఁ ♦ గాకోదరముల్
త్వరపడి శ్వభ్రంబులనుండి రహిన్ సగమేగు దెంచి ♦ నిజఫణము లొగిన్. ౪౮

తే ధరణిఁ బఱచి నిట్టూర్పుఁ ♦ దగ విడుచఁగఁ
బర్వతం బప్డు కేతన♦పటలము గల
యట్లు లొప్పెను; మహనీయ♦శైలమాను
లాతురంబునఁ దనుఁబాసి ♦ యరుగుచుండ. 2197

క. ఘనగిరికాంతారంబునఁ, దనతోడిబిడారు విడిచి ♦ త్వరగాఁ బోవం
గను భీతి నొంటిదగు పం,ఘనివలె నపుడొప్పె; హనుమ ♦ తౌరవువేడ్కన్.

[2]చ. జవమునఁ బొల్చి శత్రుతతిఁ ♦ జంపఁగఁజాలెడు పౌరుషంబుతో
నువిమలకీర్తితోఁ జెలఁగు ♦ శూరశిఖామణి కీశవర్యుఁడా
పవనజుఁ డాత్మకృత్యమును ♦ బాగుగఁ జేయఁగఁబూని స్వాంతమం
దు వనధి దాఁట నెంచి మది♦తోఁ గడువేగమ లంకఁజొచ్చెఁ దాఁ
బ్రవిమలచిత్తశుద్ధియును ♦ భాసిలఁగా రఘురామభక్తిమై. ౫౦ 2199

అఱువదియేడవ సర్గము సంపూర్ణము.

---

1 పాదపంస్పర్శకల్ఫై ఇ.-అనిమూ. 2 మనస్సమాధాయ మహానుభావో జగామ లంకాం మన
సా మనస్వీ-అనిమూ.

శా. శ్రుత్యంతప్రజగీయమానమునిరాట్స్తోమప్రమోదావహా
ప్రత్యగ్రూపవిభాసితాత్మవిభవా! రక్షోగణాధ్యక్షధీ
వ్యత్యాసప్రహితప్రకాండఘనవస్త్రాయానగోత్రోత్తమా!
సత్యజ్ఞానమయాత్మనామ! కలుషక్ష్మాధృన్మహేంద్రాయుధా.

సీ. ఇది మహీసురకులవిదితకాశ్యపమానిగోత్రజాపస్తంబసూత్ర శ్రీత్రి
పురసుందరీవరకరుణాత్తసంస్కృతాంధ్రకవిత్వవైభవ ప్రథితకీర్తి
జనమంచివంశాబ్ధిచంద్రసుబ్రహ్మణ్యవిబుధవర్యసుపుత్ర వినుతిపాత్ర
పండితగురుభక్త తాండవకృష్ణాభిధేయార్యజనాళిభజన

తే. నిరతశేషాద్రిశర్మప్రణీతమైన
యాంధ్రరామాయణంబున నధికహితవి
శిష్టశుభకరమైన కిష్కింధకాండ
మవని నాచంద్రరవితారమై చెలంగు.

కిష్కింధాకాండము సంపూర్ణము.

---

శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు.

# ఆంధ్ర శ్రీమద్రామాయణము

## సుందరకాండము - ౧-వ సర్గము.

క. శ్రీనిర్మలగుణధామా, దానవసంతానహరణ ♦ తత్పరకామా
మానీంద్రవినుతనామా, శ్రీనిత్యస్థానమహిమ ♦ శ్రీరఘురామా.

తే. అవధరింపు మహాప్రభూ! ♦ వివిధపూత
వేదవేదాంతసముదయా ♦ వేద్యమైన
నీమహిమఁ దెల్పు చరితంబు ♦ నేవచించు
వాఁడ వాల్మీకిగూఢార్థ ♦ వాక్యసరణి.

### హనుమంతుఁడు సముద్రమును లంఘించుట.

*చ. అనఘుఁడు జాంబవంతుఁ డిటు ♦ లాహనుమంతుని శౌర్యదోర్బలా
దినిఖిలసద్గుణంబుల ను ♦ తించి తగం బురికొల్పఁగా మరు
త్తనయుఁడు శత్రుకర్శనుఁడు ♦ దానవరాజగురావణుండు సీ
తను గొనిపోయి యుంచినప ♦ దంబును, జారణముఖ్యులెల్ల నా
య్యనఁ జరియింపఁగాఁ దగిన ♦ యావినువీథిని బోయి చూడఁగన్. ౧ 1

క. మనమునఁ గోరెను; సాగర,మును దాఁటుట దుష్కరంబు ♦ మునుకొని ప్రత్యూ
హనిచయము గలుగుఁ గావున, ఘనకార్యము దానిఁ జక్కఁ ♦ గాఁ జేయంగన్.

క. తలపోసి యట్టిపనికిన్, వలసినయటు వనచరాళి ♦ వర్యుఁడు గళమున్
దలనుం బైకెత్తి తగన్, నిలుచునపుడు నొప్పె వృషభ ♦ నృపతివిధమునన్. ౨

సీ. మరకతచ్ఛాయలఁ ♦ బరఁగుచు సలిలకల్పంబులై శర్మసం ♦ వర్తినెసఁగు
పచ్చికపట్టుల ♦ బలశాలియును ధీరుఁడైన యాపావని ♦ యఖిలపతగ

---

* ౧-వ పద్యములో రావణ యనుచో వకారము గాయత్రి ద్వాదశవర్ణము. ఈకాండము రామాయణప్రాణతుల్యము. పరోపకారతత్పరుండగు హనుమచ్చరిత్ర మిటఁ దెలుపఁబడును సుందర వస్తుదర్శనముచే నీకాండము సుందరకాండప్రసిద్ధిం గాంచెనని కొందఱు, మఱికొందఱు మఱికొన్ని కారణములను జెప్పుచుందురు. ఏదియెట్లున్నను ఈకాండము పఠనపాఠనాదులచేఁ బేరెన్నికంగన్నది. ఇందుఁ బ్రధానభూతుఁడగు హనుమంతుఁడు సుందరహనుమన్మంత్రాధిదేవత. సకలాభీష్టప్రదాయకుండనుట ముఖ్యము. కాన సుందరమంత్రమున హనుమంతు నుపాసించి యీకాండము పారాయణము చేయఁదగుననుట గ్రహింపఁదగినవిషయము.

ముల నదలించుచుఁ ♦ జెలఁగి వృక్షస్పర్శమున భూజసముదాయ ♦ ములను గ్రిందఁ
బడవైచుచును, మృగ ♦ వ్రాతంబుఁ జెండుచు, బలసిన కేసరి ♦ వడువునఁ, దన

తే. యిచ్ఛవచ్చినవిధమున ♦ నింపుమీఱఁ
దిరిగె; నాగిరివరముపై ♦ దివ్యదేశ
మలరుచుండును నొకచోట ♦ నద్ది నీల
ములుగ, లోహితమాంజిష్ఠ ♦ ములుగఁ దనరి. ౪½ 4

క. సితములు నసితంబులునై, ప్రతిలేక చెలంగి మఱి స్వ ♦ భావంబుగ ను
న్నతిమీఱఁ బుట్టి యతిచిత్రతమంబులు నైన యట్టి ♦ ధాతువితతులన్. ౫ 5

[1]క. చెలువారుఁ; గామరూపంబుల మహితకలాపములను ♦ బొలుపారెడు య
క్షులు కిన్నరగంధర్వులు, సులలితదేవతలఁబోలి ♦ శోభిలునురగుల్. ౫½ 6

క. తిరుగుచు నుండఁగ నొప్పును, గరివరములు స్వేచ్ఛఁ దిరుగఁ ♦ గాఁ జెన్నగు నా
గిరిభాగంబున నాకపివరుఁడు నిలిచి హ్రదమునందు ♦ వారణమువలెన్. ౬½ 7

తే. తాఁ బ్రకాశించె; నంత న ♦ తండు భాను
శక్రపవనచతుర్ముఖ ♦ సకలదేవ
పతులకును, దేవయోనులై ♦ పరఁగు భూత
ములకు నంజలి గావించి ♦ సలిలనాథు. ౭ 8

తే. దాఁటి పయనంబు చేయంగఁ ♦ దలఁచె; నంతఁ
బ్రాఙ్ముఖుండయి స్వజనికా ♦ రణుఁడయి తగు
పవనునకు మ్రొక్కి యిష్టదే ♦ వతల నెంచి
దక్షిణపుదెస కరుగంగఁ ♦ దలఁచి యపుడు. ౭½ 9

క. తనగమనమునకు నీడుగఁ, దనువుం బెంపొందఁ జేసె ♦ దక్షుఁడు గానన్;
వనచరులందఱు గనఁగా, వననిధి దాఁటంగ మదిని ♦ బరవసమలరన్. ౯½ 10

క. కృతనిశ్చయుఁడై శ్రీరఘుపతియభ్యుదయంబుకొఱకుఁ ♦ బర్వంబుల ను
న్నతిఁగాంచు సంద్రమట్లా, యతగాత్రముఁ బెంచె మఱియు ♦ ననిలజుఁ డంతన్.

క. ఇంతయనరానియటుల, త్యంతము దేహమును బెంచి ♦ యర్ణవమును వే
వంతమున దాఁట నెంచుచు, నెంతయుఁ గరపాదములను ♦ నేత్తెఱ గిరిని. ౧౦

[2]తే. అదిమె నయ్యద్రి కపిపీడి ♦ తాంగమగుచు
నొకముహూర్తము చలియించె ♦ నొగిఁ జలింపఁ
బుష్పితాగ్రంబులగు నెల్ల ♦ భూరుహముల
కుసుమములు రాల నప్పుడా ♦ క్షోణిధరము ౧౨ 13

క. మరుచిరపుష్పమయాద్రిం, బురుడించెం దావులెల్లఁ ♦ బొలయఁగఁ బుష్పో
త్కరములు నెల్లెడఁ గప్పఁగ;, వరవీర్యము గల్గు ప్లవగ ♦ వరుఁ డీరీతిన్. ౧౩½

1 అభీక్ష్ణం సహరిచ్ఛరైః-అనిమూలము. 2 ముహూర్తం కపిపీడితః-అనిమూలము.

చ. కరచరణంబులన్ మిగుల ♦ గాటముగా నదుమంగ మత్తకుం
జరముననుండి దానజల♦సాంద్రకణంబులు చిమ్ము రీతి భూ
ధరముననుండి యప్డు జల♦ధారలు వేగ స్రవించె; నిట్టులా
వరబలశాలి యాగిరి న♦వారితశక్తిఁ జలింపఁజేయఁగన్. ౧౫ 15

తే. కాంచనాంజనరజతరే♦ఖలు తదీయ, శిలలనుండియె యెల్లెడఁ ♦ జెలఁగె; నగ్ని
[1]తనదుమధ్యమశిఖలచే♦తఁ బొగలగుమి, వదలునట్లు మనశ్శిలా♦ప్రతతి వెలయ.

క. తనరారి విశాలములౌ, తనపాషాణముల విసరెఁ; ♦ దగ భూధ్రనిపీ
డనమున భయపడి గుహాలం,దున డాఁగిన జంతువితతి ♦ తొందఱపడుచున్.

క. దీనత గనఁబడ వికృత, స్వానంబులు చేసె; నిట్లు ♦ సత్వకృతమహా
స్వానము వికృతముగాఁ దగ, [2]నానినదము భూదిగుపవ♦నావళి నిండెన్. ౧౮

[3]సీ. అర్ధచంద్రాకృతి ♦ నలరు నల్లని రేఖ ఫణములపై నొప్పు ♦ ఫణులు ఘోర
విషమును గ్రక్కుచు ♦ విపులపాషాణమ్ములను నాగ్రహంబును♦గనఁబఱచుచుఁ
గఱువఁగాఁ బెనుశిలల్ ♦ గరళాగ్నికీలలు మండఁగా దాన ను♦ద్దండరీతి
వేయిభాగంబులై ♦ విఫులోర్విఁబడియెను; నప్పర్వతంబున ♦ నహివిషంబు

తే. నడఁపఁజాలిన దివ్యౌష♦ధాళియుండి
యును దదుగ్రవిషంబును ♦ నుపశమింపఁ
జేయఁజాలకపోయెఁ; ద♦చ్ఛిఖరినున్న
తాపసులు దానిచలనంబుఁ ♦ దలఁచి భీతి. ౨౧ 19

క. ధరణిముఖభూతతతితో, ధరణీధరమిద్ది కాల♦దర్పంబున ని
త్తరుణమున శకలములుగా, నురవడి ఛేదింపఁబడెడు♦నో యని మిగులన్. ౨౧

క. వెతలం బొందుచు మీఁదికి, గతిసల్పిరి; దానియందుఁ ♦ గాంతామణులన్
జతగూడి స్వేచ్ఛఁదగు ను,న్నతవిద్యాధరు లది చల♦నముఁ గన నంతన్. ౨౨

ఆ. పానభూమియందె ♦ భర్మమయాసవ,పాత్రములను వదలి ♦ భర్మభుక్తి
పాత్రములను రుచిర♦భర్మనిర్మితములై, తనరు చిన్నచెంబు♦లను మఱియును.

క. పలువిధములైన భక్ష్యం,బుల లేహ్యంబులను మాంస♦ములనున్ వృషభం
బులతోళ్ల నమరుపంబడు, ఫలకంబులఁ బసిఁడిపిడుల ♦ బలుఖడ్గములన్. ౨౪

క. విడనాడి మీఁది కెగసిరి, పడఁతులతోఁగూడి; మఱియుఁ ♦ బద్మాక్షంబుల్
గడుఁ బానంబుల నెఱ్ఱఁగ, నడరన్ హారములఁ దాల్చి ♦ యువుణస్రజముల్.

క. తనువుల శృంగారింపఁగ, ననులేపన మరుణమగుచు ♦ నలరారఁగ ది
గ్గున లేచి పఱచి రంబర,మున నద్రియుఁ జలనమొంద ♦ మునుకొను కినుకన్.

---

1 మధ్యమే నార్చిషా జుష్టః-అనిమూలము. 2 పృథివీం పూరయామాస దిశ శ్చోపవనానిచ-అనిమూలము. 3 వ్యక్తస్వస్తికలక్షణైః - అనిమూలము. స్వస్తికః = ఫణస్థో నీలరేఖావిశేషః- అని వ్యాఖ్య.

* తే. హారనూపుర కేయూర♦పారిహార్య
ములను ధరియించి విస్మయ♦ములఁ జనుచుఁ
జటులనగములను బొదలుచుఁ ♦ జేరి రమణు
లను నభంబున నిలుచుండి ♦ రనుమతులయి. ౨౬ 26

సీ. మునివర్యులంబోలి ♦ ఘనులైన విద్యాధరులు కొంద ఱణిమాది♦లలితసిద్ధి
రూప మహావిద్య ♦ నాపట్టునం గనఁబఱచుచు నతరుల♦ధవ్యరీతిఁ
గలిసి యాకసమున ♦ నిలిచి పర్వతమును గనుచుండి; రంతట ♦ ఘనమతులగు
మునులు చారణసిద్ధు♦లును నిర్మలాంబరతలమున నిలుచుండి ♦ తగ ననిలజు
తే. సర్వవృత్తాంత మెఱిఁగి హృ♦ష్టమతులగుచు
నతనిఁ బొగడి రీలాగున; ♦ నద్రిఁబోలు
నీహనుమ వాయుపుత్రకుఁ ♦ డీతఁ డోట
జవమునం బోల్చఁ గావున ♦ సంతసమున ౨౭ 27

క. ఘనమై మకరాలయమా, వననిధి దాఁటంగఁ గోరు♦వాఁడు; తగన్ రా
మునికొఱకు, రాముక్షేమం,బును గోరెడు కపులకొఱకు ♦ బుద్ధిబలములన్.

తే. దుష్కరంబగుకార్యంబుఁ ♦ దోరపుఁగృషిఁ
జేయఁగాఁ గోరి దుష్పార♦మై యనంత
ఘోరమకరాదినిబిడమై ♦ నారజలము
గాఁగ నొప్పుసంద్రంబును ♦ గడచి యంత. ౩౦ 29

క. సరిగా నవ్వలితీరముఁ, బరికింపం గోరువాఁడు ♦ బలిరే యనుచున్
బరమముదంబునఁ బల్కిరి; పరమర్షులు పల్కినట్టి ♦ పలుకులనంతన్. ౩౦౻ 30

క. విని విద్యాధరవర్యులు, కని రాపర్వతమునందుఁ ♦ గపికాంతుని నిం
తనరానిమహిమచే రా,మునికార్యముఁ దీర్పఁబూంచె ♦ మొనసెడువానిన్.

మ. గిరిసంకాశుఁడు వాయుపుత్రకుఁడు ని♦క్కించెం గడున్ రోమముల్
త్వరగాఁ బోవఁదలంచి దేహము నితాం♦తంబుం జలింపంగఁ జే
సె రహిన్ భీకరనీరదంబువలెఁ జే♦సెన్ భూరిశబ్దంబు సా
గరమున్ దాఁటెడు కౌతుకంబు మెఱయం♦గా వృత్తవాలమున్. ౩౨౻

తే. మిగుల రోమంబులం గూడి ♦ మించుదానిఁ
బక్షినాథుఁడు భూరిస♦ర్పంబుఁ జిమ్ము
నట్టు లాకొండపైఁ బడు♦నట్లు విసరె;
వాలమయ్యది వక్రమై ♦ క్రాలి యపుడు. ౩౩ 33

---

* హారనూపురకేయూరపారిహార్యధరాః స్త్రియః - అనిమూలము. పారిహార్యః వలయః-అని వ్యాఖ్య. అనఁగా కంకణము.

చ. త్వరపడి పోవఁజూచు కపి♦తల్లజు వెన్కను వైనతేయుఁ డా
దరమునఁ బట్టి యంబరప♦థంబునఁ గైకొని పోవుచున్న భీ
కరఫణిరాజునట్లు కనఁ♦గాఁ దగియుండెను; నంత వాయుజుం
డురుతరసాగరంబు పయి♦మోన్నతి దాఁటెను ప్రాక్కుమీఁదఁగన్. ౩౪ 34

క. గురుపరిఘాకృతినెంతయుఁ, బరఁగెడు తన బాహుయుగముఁ ♦ బక్షములయి కన్
సరిగా నూఁదుచుఁ దనువుఁ బ్రసరింపఁజేయుటను నడుము ♦ సన్నగిలంగన్.

క. చరణంబుల ముడుచును న,వ్వరుసన్ భుజయుగము వెలయ ♦ వరకంధర ము
త్తరుణంబునందు ముడిచి య,తరులను భంజించు శౌరి♦ధర్మము మెఱయన్.

తే. బలము సంబరము జయించు ♦ పరమవీర్య
మంతకంతకుఁ బెంపొందు♦నట్లు చేసి
కన్నుగవఁ బైకినెత్తి మా♦ర్గమును దూర
భాగముననుండి చూచుచుఁ ♦ బ్రాభశక్తి. ౩౬½ 37

క. వినువీథి కెగురుటకునై, తన ప్రాణంబులను బిగియఁ ♦ దాఁబట్టి నభం
బును జూచుచుఁ బదములఁ గ్రిం,దనుగట్టిగనూఁది శ్రుతులఁ♦దగముడిచి వెసన్.

క. తనచుట్టునున్న కపులం, గని యక్కపికుంజరుఁడు గ♦కారుబలమునన్
దనరారుచు నిట్లనియెన్, వనచరులారా! రఘుప్ర♦వరుఁ డుగ్రుండై. ౩౮½ 39

క. తనశక్తి బయల్పడ విడి,చిన బాణము జవము మిగులఁ ♦ జెందుచుఁ బవమా
నునివిక్రమమునఁ బోయెదు, ననువున నే దనుజపాలి♦తాయతలంకన్. ౩౯½

క. కనఁగాఁ బోయెద; నచ్చట, జనకజ కనఁబడకయున్న ♦ స్వర్గమునకు నే
ను నిదేవేగంబున నే, చనియెద నచ్చటను జూచు♦శక్తిని గనన్. ౪౦½ 41

చ. దనుజకులేశు రావణుని♦దర్పము పొంగఁగఁ గట్టితెత్తు నో
య్యన నెటులైననేమి శ్రమ♦మందకయే మనకార్యమెల్లఁ జ
య్యన సఫలంబుగాఁ జెలఁగు♦నట్లుగ సీతను గూడఁదెత్తు ని
ప్పుని కొనసాగదే నసుర♦పాలకుతోడను లంక నెంతయున్. ౪౨ 42

ఆ. శక్తిమెఱయఁ బెఱికి ♦ సరగునఁ దెచ్చెద
ననుచుఁ గపివరేణ్యుఁ ♦ డా కపులకుఁ
దెలియఁజెప్పి వేగ ♦ మలరువాఁడౌట ని
ప్పుని యసాధ్యమగునో ♦ యని తలఁపక. ౪౩½ 43

క. తను వైనతేయసమునిగ, మనమునఁ దలపోసి జవ-మ♦మరఁగ నురపథం
బున కెగసె నట్టులెగురఁగ, హనుమద్వేగమున నచటి ♦ యవనీజంబుల్. ౪౪½

తే. వృక్షవిటపంబులం గూడి ♦ సకలభాగ
ములను మీఁదికి నెగసెను; ♦ బలిసియున్న

---

* నికుంచ్య కర్ణౌ హనుమాన్-అనిమూలము.

చీకుఁగొక్కెరపిట్టలు ♦ చెలఁగి కూయఁ
బూవులంబొల్చు పాదపం♦బుల నతండు. ౪౫ 45

క. తనయూరుపలవేగంబునఁ, దనతోఁ దీసికొని రాముఁ ♦ దలఁచుచుఁ బూన్కిం
జనసాగె నిర్మలాంబరమున; నిట్లు తదూరువేగ♦మున వృక్షంబుల్. ౪౬ 46

[1]క. వినువీథి కెగసి యొకక్షణ, మనిలజుతోఁగూడఁ బోయె ♦ నవి దూరముగాఁ
జను బంధువులను దమి సాగనంపఁ జను బంధువులనఁ♦గా నలరారెన్. ౪౭

చ. అనిలజునూరువేగమున ♦ నంబరవీథికిఁ బోయినట్టి భూ
జనికర మల్లె సాలతరు♦సంతతి భూభుజువెంటనంటి వే
చను భటులట్టు లాపవన♦జన్ముని వెంబడిపోయె; నంతఁ జ
క్కనికుసుమాళిచేఁ దగిన♦క్ష్మారుహముల్ తనచుట్టునొప్పఁగన్. ౪౮ 48

తే. వానితోఁగూడియున్న పా♦వనియు సాంద్ర
తరుచయాన్వితమగు పర్వ♦తంబురీతి
నద్భుతాకారుఁడై చూడ ♦ నయ్యె; నట్టు
లనిలజునితోడ నెగసిన ♦ యాతరువుల. ౪౯ 49

సీ. సారవంతంబులౌ ♦ క్ష్మారుహంబులు కొన్ని యతనితోడంగూడి ♦ యరుగఁజాల
కమరేంద్రుపలనిభ♦యంబునఁ బడు పర్వతములరీతిని సము♦ద్రమ్మునందుఁ
బడి మునింగెను; గపీ♦శ్వరుఁడగు హనుమపై నంకురకోరక♦సంకులంబు
లైనపూవులు పెక్కు ♦ లల్లనఁ జల్లినయట్లుండ ఘనతుల్యుఁ♦డైనయతఁడు
తే. వఱలు ఖద్యోతగణముల ♦ భాసిలెడు మ
హాద్రివలె వెల్గెఁ; గొన్నివృ♦క్షాళు లతని
వెంటఁ బైకేగి యాతని♦వేగమునకు
నరిగఁ బోలేక నిల్చి పు♦ష్పముల వదలి. ౫౦ 50

[2]చ. జలనిధినీటిలోఁ బడియెఁ ♦ జక్కనిమిత్రుఁడు దూరభూమికిన్
గలఁగుచుఁ బోవుచుండుతఱి ♦ గ్రామము దాఁటి తటాకముఖ్యసు
స్థలముల దాఁకఁబోయి యట ♦ సత్సఖు నెట్టులో వీడివచ్చుచోఁ
గలిగిన దుఃఖభారమునఁ ♦ గన్నుల నీటికణంబు లుర్విపై
జలజలరాల దుఃఖ మను♦సంద్రమునం బడుమిత్రు రీతిఁగన్. ౫౧ 51

ఆ. అతఁడు కానఁబడియె; ♦ నంత నానావిధ
కుసుమసంతతులు మి♦గుల లఘుత్వ

---

1 ప్రస్థితం దీర్ఘ మధ్వానం స్వబంధుమివ బాంధవాః-అని మూలము. 2 అపశీర్యంత సలిలే నివృత్తాః సుహృదో యథా-అని మూలము. ఉదకాంతాత్ స్నిగ్ధో బంధు మనువ్రజేత్ ఇత్యుక్తేః-అని వ్యాఖ్య. ఈభావమే యిట స్పష్టముగ వ్రాయఁబడినదని యెఱుంగఁదగు.

మొందినట్టివాట ♦ నురుకపితనువాయు
వునను మింటికేగి ♦ వనధిఁబడఁగ. ౫౩ 52

చ. వననిధితారకాశతవి♦భాసురమై తగు నాకసంబురీ
తిని వెలుఁగొందెఁ; జిత్రతర♦దీప్తుల నొప్పెడు పుష్పవార మా
తనిమెయినిండ నుండఁగ న♦తండు తటిద్గణభూషితాంబుదం
బనఁజెలువొందె నింగిని; ద♦దాయతవేగమునన్ సుమౌఘముల్. ౫౪౫ 53

చ. వననిధినీటిలోఁ బడ న♦భంబు మనోహరతారకాయుతిం
గనఁబడునట్టులుండెఁ; ద్వర♦గా నతఁ డాకసమందు విక్రమం
బునఁ బ్రసరింపఁజేయఁబడి ♦ పొల్పగుబాహుయుగంబు [1]కొండకొ
మ్మున వివరంబునుండి కడు♦మోదము మీఱఁగ లేచు పంచశీ
ర్ష నిరతభాసమానఫణి♦రాజయుగంబన నొప్పె నంతటన్. ౫౬ 54

క. వనచరవర్యుం డతిజవమున సంద్రముమీఁద మిగులఁ ♦ బూనిక మెఱయం
జనుసమయంబున భంగా,ఘనిబిడజలరాశిఁ ద్రాగఁ♦గా నెంచు గతిన్. ౫౬౫

క. జలనిధికిం బైని వియత్తలమునఁ జనువేళ నభ్ర♦తలమును ద్రావం
దలఁచెడువానివిధంబునఁ, బొలిచెను; సురమార్గమందుఁ ♦ బోవుతఱిఁ దగన్.

ఆ. హనుమ రెండుకన్ను ♦ లద్రిపయిం దగు
నగ్నియుగముఁబోలి ♦ యలరె; మఱియుఁ
బింగరుచులఁ దగఁ జె♦లంగి గొప్పవియయి
వర్తులవలగు కనులు ♦ భవ్యములయి. ౫౮ 57

తే. అప్పు డుదయించుసూర్యశ♦శాంకులట్లు
వెలిఁగె; నరుణంబుగా నొప్పు ♦ లలితనాసి
కాయుతిని నెఱ్ఱఁబాఱిన ♦ గాలికొడుకు
మొగము సంధ్యార్కమండలం♦బుగఁ జెలంగె. ౬౦౫ 58

క. వినువీథి దాఁటుతఱిఁ బైకినెత్తఁబడినట్టి విగత♦కిల్బిషు వాలం
బనువుగ నింద్రధ్వజ మనఁ, దనరారెన్; మఱియు శుక్ల♦దంష్ట్రుం డగుచున్.

క. ధరణిం బ్రాజ్ఞవరుం డా, మరుదాత్మజుఁ డప్పు డాత్మ♦మండనమగునా
సురుచిరవాలమును ముడిఁచి, [2]యరుగం దద్వాలచక్ర ♦ మప్పు డనిలజున్.

క. పరివేషయుక్తుఁడౌ భాస్కరువిధమున వెల్గఁజేసెఁ; ♦ గాలికొడుకు సుం
దరమయి యంతట నెఱ్ఱఁగఁ, బరఁగెడు లాంగూలమూల♦పరిభాసితుఁడై.

తే. పఱియవాసినది యయి గొ♦ప్పగ నెసంగు
నరుణగైరికమును గూడు ♦ నద్రిరీతి

---

1 పర్వతాగ్రాద్వినిష్క్రాంతౌ పంచాస్యావివ పన్నగౌ-అనిమూలము. 2 లాంగూల చక్రేణ మహాన్-అనిమూలము.

వెలసె; నక్కపిసింహుఁడు ♦ సలిలరాశి
దాఁటుతఱిఁ [1]గశుచుక్యస ♦ దాగతియును. ౬౮ 62

చ. ఘనమటులార్చె; నుత్తరపుఁ ♦ గొమ్మతుదన్ జనియించి వాలయు
క్తివి జెలరేఁగి యభ్రమునఁ ♦ దెంపుతగం బడు నుల్కరీతి నా
వనచరసత్తముండు తన ♦ వాలముతో ననుజేంద్రమృత్యువో
యనఁ గనుపించె; నభ్రచరుఁ ♦ డా రవిలాగునఁ దేజరిల్లుచున్. ౬౯½ 63

క. వితతాకారముతో నున్నత తేజముతోడఁ జను న ♦ నలసఖతనయుం
డు తగన్ మొలకం బ్రాసను, జతనము మీఱంగఁ గట్టు ♦ సమయమునందున్.

క. విరివిగ సాగెడు పురకకి,వరవిధముగ నొప్పె; జలధి ♦ పైఁ గన్పడుసుం
దర దేహముతోఁ గ్రిందను, సరిదధిపతి నీటఁబరఁగు ♦ ఛాయాయుతితోన్. ౭౨

[2]చ. అనిలజుఁ డేగునట్టి సము ♦ ద్రంబున గాలికిఁ బోవుచున్న నా
కను బురుడించె నెల్లరకుఁ; ♦ గంధిని వానరుఁ డెందునెందుఁబో
యెనొ తగ నా ప్రదేశము ల ♦ నెల్లను దద్గతి వేగశక్తిచేఁ
గనఁబడెఁ జిచ్చివానివలెఁ ♦ గంది జలంబులఁ గ్రక్కుచున్ గడున్. ౭౪½

సీ. పర్వతంబులఁబోలు ♦ భంగసంతతులను, వక్షోభవంబగు ♦ వాయువునను
గలగుండువడఁజేసి ♦ గమనవేగంబున దాఁటెడుతఱిని; నా ♦ తనివలనను
జనియించినట్టియు ♦ ప్పెను గాలియును మేఘజనితవాయువును రెం ♦ డును గలియుచు
నతిభయంకరముగ ♦ నానసముద్రమ్ము ధ్వనించెడునట్టు లొం ♦ దించెఁ గలఁత;

[3]ఆ. గొప్పవగుచు మిన్నుఁ ♦ గూర్చి పోయెడు భంగ
ములనతండు మరల ♦ జలధిఁ బదఁగఁ
జేయుచుం జనంగ ♦ క్షితి నాకసము వేఱు
పఱుపఁబూనెననెడు ♦ భంగి దోఁచె. ౭౧½ 64

క. కనకనగమందరాద్రుల, కెనయగుచున్ వేగ మీఁది ♦ కెగసెడు భంగా
ళిని గణనచేయుచున్నటు, లనిలజుఁ డతివేగ మొప్ప ♦ నరిగెం బూన్కిన్.

క. అనిలజుజవమునఁ బైకెగ,సినజలము ఘనాళితోడఁ ♦ జేరి సురపథం
బుననుండ శరత్కాలపు,ఘన మంబరసీమ మెఱయు ♦ గతి గాన్పించెన్. ౭౩½

క. జనులయవయవము లంబర,మును లాగుటవలన స్పష్టముగఁ గన్పడురీ
తిని నక్రతిమిఝషంబులు, ఘనకూర్మము లబ్ధిఁ దోఁచెఁ ♦ గడు జలమేగన్.

క. సురపథమునఁ గపిపుంగవుఁ, డురవడి నేగంగ నబ్ధి ♦ నుండెడు ఫణు లం
బరమున సుపర్ణుఁడే యని, గురుభీతిని బొంది కంది ♦ కుందెం బెలుచన్. ౭౭½

---

1 కక్షాంతరగతో వాయుర్జీమూత ఇవ గర్జతి-అనిమూలము. 2 ససత్పప్యోరువేగేన ప్లోన్నాద ఇవ లక్ష్యతే-అనిమూలము. 3 ప్లుప్లవే కపిశార్దూలో వికిరన్నివ రోదసీ-అనిమూలము.

సీ. పదియోజనములంత♦పరిణాహమునను, ముప్పదియోజనములంత♦గఁ దనరువిరి
విని బెంపు మీఱి వ్యా♦పించిన యాతనిఛాయ సుందరముగ♦జలధియందుఁ
గన్పడి స్వచ్ఛమై ♦ గడువిస్తృతంబయి తగు మేఘమట్లు ని♦తాంత మలరె;
మిగులఁ దేజంబున♦మించుభూరాభ్రకారమున నొప్పునవ్వాయు♦తనయుఁ డట్టు

తే. లభ్రమునందు నిరాలంబ ♦ మైనచోటఁ
బోవునపుడు ఱెక్కలుగల ♦ భూధరంబు
వలెఁ గనంబడె; బలశాలి ♦ వాయుతనయుఁ
డేపథంబునఁ బోయెనో ♦ యేపుమీఱ. ౭౯ 72

క. ఆతనిగతివేగంబున, నాతఱి నామార్గమందు ♦ నబ్ధిజలంబుల్
భూతలమంటగ నచ్చట, లోఁతువడుట *ద్రోణమట్టు♦లు గడలి తనరెన్.

మ. పతగశ్రేణి జవంబునం బఱచున♦భ్రంబందుఁ బక్షీంద్రుఁడో
యితఁడంచున్ బలుకంగనై చనుచు నెం♦తేవేగ మేఘాళి ను
ద్ధతమా వాయువురీతిగాఁ గొనుచు ను♦ద్దామప్రతాపంబునన్
జతనంబొప్పఁగఁ బోయె; నిట్లతనితోఁ ♦ జంచద్గతిన్ మేఘముల్. ౮౦ 74

తే. చనుచు సితరక్తములయిన ♦ ఛాయలొప్ప
నీలమాంజిష్ఠవర్ణముల్ ♦ నెగడ నభ్ర
తలమునం గనుపట్టె; న♦బ్దముల నడుమఁ
జొచ్చుచుం గనఁబడకుండి ♦ హెచ్చినగతి. ౮౧ 75

క. వనచరపుంగవుఁ డంతట, ఘనసంగతిఁ బాసి వెడలి ♦ క్రాలుచు శీతాం
శునిరీతిఁ గానబడియెన్;, ఘనపథమున దాఁటుచుండఁ♦గాఁ గపివరుపై. ౮౩

క. సురదానవగంధర్వులు, పరమప్రమదమునఁ బుష్ప♦వర్షముఁ గురిపిం
చిరి; సూర్యుం డతివేగ, స్ఫురణమునకు మెచ్చి తనదు♦శుంభత్కరముల్.

క. అనిలజునకు సంతాపం, బును గల్గఁగఁ జేయకుండఁ ♦ బొలిచెన్; శ్రీరా
ముని కార్యసిద్ధికోఱక, య్యనిలుఁడు చల్లంగ వీచె ♦ నాతనిపైనన్. ౮౪ 78

క. వినువీథి దాఁటుతఱి ఋషు, లనూనకృప తొంగలింప ♦ నతనిని నెంతో
వినుతించిరి; సురగంధ, ర్వనికరములు దీప్తతేజుఁ ♦ బాడిరి నుతులన్. ౮౫

ఆ. యక్షనాగదివిజ♦రాక్షసపక్షులు, కపివరేణ్యు నతనిఁ ♦ గాంచి యించు
కంతయేని శ్రమము ♦ నందక యుండుట, కలరి నుతులొనర్చి ♦ రచ్చెరువడి.

సీ. వనచరసింహుఁ డీ♦వరుస రామునికార్యమునకయి పూన్కిమై♦ వననిధి నిటు
దాఁటుచుండంగ ను♦దధియు నిక్ష్వాకువంశజులైన సగరభూ♦జానినుతుల
వలన వర్ధిల్లిన♦వాఁడౌటఁ దత్కులగౌరవంబును మదిఁ ♦ గోరి యిట్లు
దలపోసె; రాముని♦యలఘుకార్యముఁ దీర్పఁ గడఁగినవనచర♦కాంతున కిట

* ద్రోణీకృతశ్చ వార్ణవః-అనియూ.

[1] తే. నేను సాహాయ్యమును జేయ ♦ నేని జగతిఁ
బలుక నేర్చినవాఁడెల్ల ♦ బహువిధముల
ననుఁ గృతఘ్నునిగా నెంచి ♦ నయవిదూరుఁ
డ నని నిందింపకుండఁడు ♦ కనలుచుఁ గడు. ౮౧ 81

క. ఇతఁ డిక్ష్వాకుకులంబున, క్షితిఁ గావ జనించినట్టి ♦ శ్రీరామునకున్
హితుఁడగు నట్టిండగు సన్మతి కితనికిఁ దగిన విశ్ర♦మంబుం గలుగన్. ౮౨

క. ఒనరుపఁదగుదును నప్పుడు, వనచరుఁ డీతండు వేగ ♦ వచ్చి శ్రమము వో
వనిలుచు నాపై నంతటఁ, దనమిగిలిన త్రోవఁ జక్క ♦ దాఁటం గలుగున్. ౮౩

చ. అనియిటు సాగరుండు హృద♦యంబున న్యాయముగాఁ దలంచుచుం
దనజలమందు మున్గి గిరి♦తల్లజుఁడై తపనీయకూటముల్
తనరఁ జెలంగు నాతుహిన♦ధామునిపుత్రునిఁ గాంచి ప్రీతి ని
ట్లనియెను; బర్వతోత్తమ! సు♦రాధిపుఁ డద్రులపక్షముల్ తగన్. ౮౪ 84

[2] చ. మును తనవజ్రధారలను ♦ మోమునఁ గ్రోధము నాట్యమాడఁగాఁ
దునుముఁగ నీవు నన్నడిగి ♦ తోడనె నాజలమందు డాఁగఁగా
దనుజుల నయ్యధోభువన♦ధాములపై కిఁక రాకయుండ ని
న్నునిచె శతక్రతుండు పరి♦ఘోన్నతిగా నిట నాఁటనుండియున్. ౮౫ 85

సీ. జాతవీర్యుల దను♦జప్రభులను పైకి రాఁ జూచువారిని ♦ రాకయుండఁ
బలుమాఱు వారికా♦వాసమై తుదలేని పాతాళమునకగు♦ద్వారమందుఁ
బెనురూపమున నీవు ♦ వెలయుచుందువుగదా; మైనాక! నీకెన్న♦మహితశక్తి
మీఁదుగా నడ్డమ్ము♦గాఁ దగఁ గ్రిందుగాఁ బెరుగునట్టిది కడు♦వెలయుఁగాదె
తే. కాన నిన్నాక్కఘనమగు ♦ కార్యమునకుఁ
బర్వతోత్తమ! పురికొల్పు♦వాఁడ లెమ్ము;
వనచరోత్తముఁ డీవాయు♦తనయుఁ డిపుడు
రామకార్యార్థియై సము♦ద్రంబు దాఁట. ౮౬ 86

క. తలపోసి భయదకార్యం, బులకుం బూనె నిదిమాకు ♦ పొలుపారెడుమే
నలరఁగ నీపైఁ బోయెడు, నలఘుతరం బైన ఖతల♦మం దటు కానన్. ౮౭

మ. ఇతఁ డిక్ష్వాకుకులావతంసుఁడగు భూ♦పేంద్రోపకారంబు ను
న్నతశక్తిన్ వెలయంగఁ జేయఁ జనెడున్ ♦ నాకెన్న నిక్ష్వాకుభూ
పతులో పూజ్యులు చాల వృద్ధికరులై ♦ భవ్యాత్ములై యుండువా
రితఁడో నావయి రామకార్యమునకే ♦ యేపారఁగాఁ బోయెడున్. ౮౮ 88

---

1 సర్వాశాచోర్య వివక్షితామ్-అనియూ. సర్వనిందా వాగ్విషయో భవిష్యామిత్యర్థః-అని వ్యాఖ్య. 2 త్వమి హాసురసంఘానాం పాతాళతలవాసినామ్, దేవరాజ్ఞా గిరిశ్రేష్ఠ పరిఘః స్సన్నివేశితః-అనియూ. పాతాళస్థరాక్షసనిరోధార్థం దేవరాజేన మైనాకస్థాపిత ఇత్యవగమ్యతే-అని వ్యాఖ్య.

క. కనుకనె సహాయ మితనికి, నొనరుప నర్హంబు నాకు; ♦ నుర్వీధర! నీ
వును నన్నుఁబట్టి వారల,కును సాయము చేయఁగాఁ ద♦గుదు పస్తాటన్. ౯౮

[1]ఉ. ఇంతియకాదు సుమ్ము మును ♦ పింద్రుఁడు వజ్రము చేతఁ బూని నీ
చెంతకు రాఁగ వాయువును ♦ జెచ్చెఱ నిన్గొనివచ్చి నాదున
భ్యంతరసీమఁ జేర్చెఁ బవ♦నాత్మజుఁ డీతఁడు కాన సాయ మొ
క్కింత యొనర్పుమా కృతము ♦ నెవ్వరుగాని తలంపకుందురే. ౯౮॥ 90

సీ. మాకు సాయముచేయు♦మా కార్యమిదిమించిపోఁగూడదిఁకవిను♦భూధరేంద్ర
కర్తవ్యమాపనిఁ ♦ గడఁగి చేయకయున్న సాధువులకుఁ గ్రుధ♦జనమందు;
జలములనుండి వే ♦ చనుదెమ్ము నీపైనఁ గపిసత్తముఁడు నిల్వఁ♦గాఁ దగునటు
చని నిల్వ మంబర♦స్థలమున నీతండు మనకెన్న నతిథియు ♦ మాననీయుఁ
తే. డగుఁగదా; స్వర్ణకూట! యో♦యమరయక్ష
గరుడగంధర్వసేవితా! ♦ త్వరగ నీవు
నాపనిచినట్లు చేసిన ♦ నీపరోప
కారపరతంత్రుఁ డిప్పు డా♦కాశవీధి. ౯౯ 91

తే. నీపయిని నిల్చి యలసట ♦ వాపుకొనుచు
మిగిలినట్టిదారిని గడ♦వఁగఁగలండు;
(కనుఁగొనుము నీదుపైన న♦క్కపిచనియెడు)
రఘుపతికి సీతపైఁ గల ♦ రాగరసము. ౯౯॥ 92

క. జనకజవనవాసంబును, వనచరపుంగవుఁడు రాఘ♦వప్రియరతుఁడై
చను నితనిపరిశ్రమమును, గనినైనను లేచిరమ్ము ♦ కడువడి తనరన్. ౧౦౦॥

[2]చ. అనియిటు లుప్పుసంద్రము మ♦హాదయమీఱఁగఁ బల్క నంతలోఁ
గనకపుఁగూటముల్ తనర ♦ క్ష్మారుహముల్ లతలున్ జెలంగి రాఁ
గ నతఁడు భూరివేగమును ♦ గైకొని యప్పులనుండి లేచె; న
వ్వనధిజలంబులం గడచి ♦ భాసురతేజుఁడు భాస్కరుండు వ
చ్చునటులు పర్వతోత్తముఁడు ♦ సొంపగురూపముతోఁ దదాజ్ఞచేన్. ౧౦౧॥

చ. కనఁబడె; నీటిలో మునిఁగి ♦ కాయము దృశ్యము గాకయుండనుం
డిన యలపర్వతోత్తమము ♦ నింగిని దాఁకెడునట్టులున్న శృం
గనిచయముం గనంబఱచెఁ; ♦ గాంచనరమ్యములౌచుఁ గిన్నరా
హినికరసేవితంబులయి ♦ యెంతయుఁ గూటము లొప్పుచుండుటన్. ౧౦౨॥

1 వాయుసహాయము మైనాకునకుం గల్గె నన్నగాథ యిట మూలమునఁ జెప్పఁబడలేదుగాని ముందిసర్గమున "తతోఽహం సహసా క్షిప్తః శ్వసనేన మహాత్మనా" అను నూటయిరువదాఱవ శ్లోకమునఁ జెప్పఁబడినదాని నిటఁ జేర్చితిని యెఱుంగఁదగు. 2 విశమ్య లవణాంభసా-అని మూలము.

తే. సూర్యుఁ డుదయించినట్లుగ ♦ సొంపుమీఱి
యొకముహూర్తము జలరాశి♦యుఁ బురికొలుపఁ
గనఁబడియె నంబరంబునఁ; ♦ గమ్రకనక
మయములౌ దానిశృంగముల్ ♦ మంజులగతి. ౧౦౫ 96

క. సురపథమున వ్యాపింపఁగఁ, గరము తదీయప్రభాని♦కాయము తగ నం
బరమునఁ బొలయఁగ నల్లగఁ, బరఁగు నభము స్వర్ణకాంతి♦భాసిల్లెఁ గడున్.

సీ. పవాజకాంతులు గల్గి ♦ శాతకుంభమయంబులైన కూటంబుల ♦ నలరు శైల
సత్తముం డప్పుడు ♦ శతసూర్యసంకాశకాంతుల నొప్పె; న♦క్కరణి లేచి
తనముందుఁ గన్పడు♦ఘనగిరిఁ గని పవనజుఁ డంబురాశి యం♦తరమున నిది
ప్రథమవిఘ్నము యేమొ♦వచ్చె నంచును నిశ్చయించి; విశాలమై♦యెసఁగుదాని

తే. నధికవేగమ్మున నురస్థ♦లాభిఘాత
ముననె మేఘంబుఁ జిమ్ము ప♦వనునిమాడ్కిఁ
బడఁగఁద్రోసె; నతండిట్లు ♦ వచ్చి తన్నుఁ
గ్రిందఁ బడఁద్రోయ నతనిశ♦క్తిని నెఱింగి. ౧౦౯ 98

క. తనువెల్లఁ బొంగ డెందము, ఘనహర్షముచేత నిండఁ♦గా మరల నభం
బునుబొంది ప్రీతుఁడై నెమ్మనమున హర్షంబు పొంగ ♦ మనుజాకృతితోన్.

చ. తనశిఖరంబునన్ నిలిచి ♦ తాఁ బలికెన్ గగనంబునందు నా
ప్పినకపివర్యుతోఁ; బ్లవగ♦వీర! సుదుష్కరకార్యమిద్ది నీ
వొనరిచినాఁడ వింక సుఖ♦మొప్పఁగ నాశిఖరంబులందుఁ దోఁ
చినతఱి నిల్చుచున్ శ్రమము♦చెందక యవ్వలఁ బోవఁగాఁదగున్. ౧౧౨

క. మీరఘువర్యనికులజులు, భూరమణులు జలధి దీనిఁ ♦ బొలువుగ వృద్ధిం
గోరిక నొనరించిరి మును, మారుతి! యటుకాన సాధు♦మతి యలరారన్.

ఆ. అట్టిరామమూర్తి ♦ కత్యంతహితమును
జేయఁబూని యుంట ♦ నీయుదధియు
నెఱిఁగి నిన్ను నిచట ♦ నెలమిఁ బూజింపంగఁ
గోరుచున్నవాఁడు ♦ కూర్మి మెఱయ. ౧౧౩ 102

క. ఉపకారముచేసినఁ బ్రత్యుపకారముఁ జేయఁగవల♦యును వారికి ని
ద్ది పవిత్రమైనధర్మం, బపాంపతియు సూర్యవంశ్యు♦లగు రాజులచేన్. ౧౧౩౹

క. మునుసంవర్ధితుఁ డౌటను, బనివడి యావంశమందుఁ ♦ బ్రభవిల్లిన రా
మునకున్ సూతవుగాఁదగు, ననిలజనకు నీకు నిప్పు ♦ డాతిథ్యంబున్. ౧౧౪

క. ఒనరిచి యీప్రత్యుపకృతి, నొనరించినవానిగఁ దను ♦ నూహించుకొనం
గను దలఁచినాఁడు కావున, వననిధియాతిథ్యమును న♦భక్తికమనుచున్.

క. వనచర ! పరిగ్రహింపు మ,తనినిఁ గ్మన్నింపఁదగు; ని♦శంకను నీకై
నను గని "యోపర్వతమా, వనధిఁ శతయోజనము ల♦వారితశక్తిఁ. ౧౧౫

ఆ. గడచిపోవ నెంచెఁ ♦ గావున నీసాను
తలములందు నిలిచి ♦ తనశ్రమంబు
వాపికొనుచు మరల ♦ వనధి దాఁటుంగాక"
యనుచు గౌరవించి ♦ పనిచె నన్ను. ౧౧౬ 107

చ. కనుకఁ బ్లవంగవర్య! నినుఁ ♦ గానఁగవచ్చిన నాపయిఁ గరం
త నిలిచి యవ్వలం జనుము; ♦ ధాత్రిఁ బ్రసిద్ధినిగాంచి స్వాదుతం
దనరి సువాసనల్ వెలయఁ ♦ దద్దయు రమ్యములై ఫలంబులుఁ
గననగుఁ గందమూలములుఁ ♦ గావున వానిభుజించి చక్కఁగన్. ౧౧౭ 108

సీ. ఆయాసమును బాయు♦నట్లుగ విశ్రాంతి నొంది పోవంజను♦టొప్పు నీకు;
నాతిథ్యమిచ్చెడు ♦ నట్టివారము మేము దానిని గ్రహియింపఁ♦దగుదు నీవు
కాన నీసంబంధ ♦ మూనిదైనను దీనిఁ బాటింపవయ్య, సం♦బంధమిద్ది
త్రిజగత్ప్రసిద్ధమై ♦ తేజరిల్లెడు, మహాగుణులగుసజ్జనుల్ ♦ గోరి దీనిఁ

తే. గైకొనిరి; సంద్రమును దాఁటఁ♦గల్గుశక్తి
జవము నివిరెండుగల కపి♦సముదయమున
నీవు ముఖ్యుండవనుచును ♦ నేఁ దలంచు
వాఁడ; ధర్మజిజ్ఞాసువౌ ♦ వానివలన. ౧౧౮ 109

*క. అతిథియెటువంటివాఁడే, జతనంబుగఁ బూజఁగొనఁగఁ♦జాలు ననఁగ ను
న్నతగుణ! భవాదృశుండగు, నతిథియుఁ బూజార్హుఁడనుట ♦ కనుమానంబే.

క. సురవర్యుఁడు మహాత్ముఁడు, మరుత్తు చెలువారుఁ దత్కు♦మారుఁడవుగదా
త్వరగాఁ జను పనిలో నీ, వరయఁగ నాతనికె సముఁడ ♦ వౌదువుగాదే. ౧౨౦

మ. నినుఁ బూజించిన నాప్రభంజనునినే ♦ నెమ్మిఁ సమారాధనం
బునఁ బ్రీతాత్మునిఁ జేసినట్లె యగు నో♦పుణ్యాత్మ ! ధర్మజ్ఞ ! కా
వున నిఁక దప్పక పూజచేయఁదగు నేఁ♦బూజింప నీతండ్రినిఁ
వినుమా కారణ మొండుచెప్పెదను స♦ద్వృత్తా ! ప్లవంగోత్తమా. ౧౨౨

క. మును కృతయుగమునఁ గొండలు, ఘనతరపక్షములతోడఁ♦గ్రాలుచునుండెఁ
గనుకని గరుడానిలజవ,మున నవి దిక్కులకు నిచ్చఁ♦బోవుచు నుండెఁ. ౧౨౩

చ. మునులును దేవతల్ గలఁగి ♦ భూధరసంఘము లిట్లుపోవుచోఁ
గని యవి మీఁదనేపడునొ ♦ కాఁగలదేమొ యనర్థమంచు భీ
తిని గడుఁబొంది, రట్లె జగ♦తింగల భూతములెల్ల జంకె; నం
త నమరనాయకుండగు శ♦తక్రతు వాగ్రహ మొప్ప చుండఁగఁ. ౧౨౪

---

* అతిథిః కిల పూజార్హః ప్రాకృతోపి విజానతా-అనిమూలము.

క. బలువజ్రధారలం గొం,డలఱెక్కలు వేలకోలఁది ♦ నేర్పునఁ దునిమెన్;
బలరిపుఁ డంతటఁ దీఱని, యలఘుతరాగ్రహముమీఱ ♦ నాపవిఁ గొనుచున్.

చ. ననుఁ గనవచ్చెఁ బక్షములు ♦ నాయవి త్రుంపఁగ; నంతలోన న
య్యనిలుఁడు సన్మతిన్ నను మ♦హాజవ మొప్పఁగ వీచివైచె నీ
వననిధిలోఁ బడంగఁ; గపి♦వర్య! మదున్నతపక్షముల్ విప
త్తునఁ బడకుండ దక్కినటు ♦ తోరపుఁబ్రీతిని నీదుతండ్రియున్. ౧౨౭ 116

క. ననుఁ గాచె; నిట్లుగా నీ, జనకుఁడు మాన్యుఁడగు నాకు ♦ సరసగుణా! త
త్తనయుఁడవగు నిన్నును నే, మనమలరఁగ గారవింతు ♦ మారుతపుత్రా!. ౧౨౭½

క. అనిలునిమూలంబున నీ,కును నాకును శాశ్వతమయి ♦ కోరఁదగినదై
గనుపట్టెడు సంబంధం,బును దీనిన్ సుగుణవంత♦మును దలఁపఁదగున్. ౧౨౮

సీ. ఇట్టిమహాకార్య ♦ మిటఁ దటస్థించెను గాన నీవును దానిఁ ♦ గైకొని మది
సంతృప్తినొంది యా♦సాగరంబునకును నాకును మిగుల సం♦తసముఁ గూర్పఁ
దగుదువు; కానఁ బ్ల♦వగసత్తమా! నీవు నాపైన నిలిచి యు♦న్నతపథశ్ర
మముఁదీర్చుకొనుము,స♦న్మానంబుమీఱ నాయిచ్చుపూజనుగ్రహి♦యింపుకరుణ

తే. నిన్నుఁ గాంచుట సంతృప్తి ♦ నేను బొంది
నాఁడ నని యివ్విధమున మై♦నాకపర్వ
తమ్ము చక్కఁగఁబలుక నా♦తండు పలికెఁ;
బర్వతోత్తమ! నీవన్న♦పల్కులకును. ౧౩౦½ 119

చ. మనమున సంతసిల్లితిని ♦ మంచితనంబున నీవొనర్చు వా
క్యనికరరూపపూజను ని♦కామము నే గ్రహియించినాఁడనే
యని తలపోయు నీవొసఁగి♦నట్టి సపర్యను నేగ్రహింపలే
నని మదిఁ గోపమూనకు మ♦హాత్మ! రఘూత్తముకార్య మిత్తఱిన్. ౧౩౧

[1]క. త్వరఁగాఁ జను లంకకు నని, త్వరపెట్టెడు నన్నుఁజూడు ♦ పగ లేగెడు నే
సురరిపుపురికిం బగ లే, యరుగవలయుఁజుమ్ము జలధి♦యంతరమందున్. ౧౩౧½

తే. నిలువనని నేను మానవాన♦రులయెదుటనె
ప్రతినచేసితి; ననిపల్కి ♦ ప్లవగవర్యుఁ
డానవంబునఁ జిఱునగ ♦ నంకురింపఁ
గరముచేఁ గొండఁ దాఁకి యా♦కాశవీథి. ౧౩౨½ 122

క. ఘనవీర్యంబునఁ ద్వరగాఁ, జనసాగెన్; భూధరేంద్ర♦సాగరములచే
త నధిక గౌరవమునఁ దాఁ,గనుఁగొనఁబడుచున్ స్వకీయ♦కార్యము త్వరఁగన్.

సీ. ఫలియింప వారిదీ♦పనలను బొందుచు వారిపూజల నంది ♦ వాయుతనయుఁ
డాకాశమార్గంబు♦నందు మీఁదికిఁబోయి తనువుల ధరియించి ♦ తనకుఁ గానఁ

1 ఈకా ర్వా ప్వతిష ర్తతే. అనిమాలము.

బడిన సముద్రప♦ర్వతముల విడనాడి వాయుమార్గము చేరి; ♦ వసుస మీఁది
కెగసి మైనాకునిఁ ♦ దగఁ గనుంగొనుచు నిరాలంబమయి శుభ్ర♦మైన గగన
* తే. పథమునం బోవుచుండె; న♦ప్పవనతనయుఁ
డొనరిచినదుష్కరంబయి ♦ యొప్పుచున్న
యాద్వితీయమహాకార్య ♦ మపుడు గాంచి
సిద్ధముని దేవతలు నుతుల్ ♦ చేసి రెలమి. ౧౩౭ 124

క. కనకమయకూటముల మిం,చిన యలమైనాకుఁ డొనరి♦చిన యాకార్యం
బున కచటి దేవతలు నె,మ్మనముల హర్షించి, రయ్యు♦మరపతి యలరెన్. ౧౩౮

చ. సురుచిరబుద్ధివైభవము ♦ శోభిలుచుండఁగ నాశతక్రతుం
డురుధరణీధ్రముం గనుచు ♦ నొయ్యన గద్గదభాషణంబులన్
గర మనురాగమొప్పఁ బలు♦కం దొడఁగెన్ దనయంతనే; మనో
హరతపనీయశృంగ! తుహి♦నాలయపుత్ర! మహాత్మ! నీయెడన్. ౧౩౯-౪ 126

తే. మిగుల సంతోషమందితి♦ని గనుక నీఁక
నభయ మిచ్చెద నీకు సు♦ఖాభివృద్ధు
లలర నుండుము; శతయోజ♦నాయతమగు
నబ్ధిపైఁ బోవుచో భయ♦మందఁ దగియు. ౧౪౦-౪ 127

క. దానిం బాటింపక యే, తానరిగెడు పవనజున కి♦తనికిని సాయం
బూని యొనరించితివి; పెం, పూనిన దాశరథి కీతఁ ♦ డొగి దూత్యంబున్.

ఆ. చేయఁబూని యిట్టి ♦ సింధువుఁ దరియించి, పోవుచున్నవాఁడు; ♦ నీవితనిని
సత్కరించితివి ప్ర♦సన్నుఁడ నైతి నీ, యందు నేను మిగుల ♦ నగగణేంద్ర.

చ. శతమఖుఁ డాసురాధిపతి ♦ సంతసమందుటఁ గాంచి యంతఁ బ
ర్వతపతియుం బ్రహర్షమున ♦ రాజిలి; యావరమున్ గ్రహించి య
భ్రతలమునందె సాధ్వసము ♦ వాసియె నిల్చె; మహాబలాత్మజుం
డతులితమాగతిన్ గిరివ♦రావృతసాగరమున్ క్షణంబునన్. ౧౪౪ 130

తే. దాఁటిపోయెను; సిద్ధగం♦ధర్వదివిజ
మానివరులెల్ల సూర్యుని♦మాడ్కి వెల్గు
నాగమాతను సురస యన్ ♦ నాతిఁ గాంచి
పల్కిరీరీతి; వాయువు♦పట్టి యితఁడు. ౧౪౫ 131

సీ. జలరాశిపయి నిదె ♦ చనుచున్నవాఁ డెంతదవ్వుపోయిన బల♦దర్పములును
హెచ్చుచున్నవి; పర్వ♦తేంద్రునివలె భయంకరమైన రాక్షసా♦కార మీవు
ధరియించి మఱియును ♦ దంష్ట్రికరాళంబుఁ బింగాక్షమునునయి♦వెలయు వక్త్ర
మొప్ప నడ్డంబుగా ♦ వ్యోమమార్గంబున నిలిచి యీహనుమకు♦లలిముహూర్త

* తద్ద్వితీయం హనుమతో దృష్ట్వా కర్మ సుదుష్కరమ్-అనిమూలము.

తే. కాలమంతరాయంబును ♦ గడఁగి చేయు;
మితఁడు నిన్ను జయించునో ♦ యది యశక్య
మని విషాదంబునొందునో ♦ యనియు, నితని
బలపరాక్రమముల్ మును ♦ తెలిసియున్న. ౧౪౭ 132

క. మనమునఁ గలసందేహం, బును మరలం బాపుకొనఁగఁ ♦ బూనితి మటుగా
వున సురసా! చను మనినన్, విని దివిజులవాక్యములను ♦ విబుధసపర్యన్.

క. కరమనురాగంబునఁ దాఁ, బరిగ్రహించి యవు డద్ది ♦ వారిధినడుమన్
[1]బెరఁగి విరూపము వికృతముఁ, బరికింపఁగ సర్వభూత♦భయదము నగుచున్.

క. కనఁబడు రాక్షసరూపం, బును దాలిచి యబ్ధిదాఁటి ♦ పోవునతనిఁ బా
వనిఁ గాంచి యక్షమయి యి, ట్లనియెన్; బ్లవగేంద్ర! నాకు ♦ నాహారముగన్.

క. నిను సురలు చూపి యున్నా, రనితరసాధ్యంపుశక్తి ♦ యలరారెడు నా
కు నిన్ను భక్షించెద నో, వనచర! నానోటఁ జొరుము ♦ త్వరఁగా నింకన్.

చ. అని యలనాగమాతయన ♦ నాహనుమంతుఁడు కేలుమోడ్చి మో
మునఁ బ్రమదంబు పొల్పెసఁగ ♦ [2]ముగ్ధతనూరుచి సొంపుగుల్కఁ ని
ట్లనియెను; సూర్యవంశభవుఁ♦డై తగురాముఁడు లక్ష్మణుండునాఁ
దనరు సహోదరుండు వని♦తాతిలకంబగు సీతయుం దమిన్. ౧౫౨ 137

చ. తనవెనువెంటరాఁ గదలి ♦ తండ్రియనుజ్ఞను బొంది దండకా
వనమున కేగుదెంచె; రఘు♦వర్యుఁడు చిత్రకురంగరూపముం
గొనినసుబాహుసోదరునిఁ ♦ గోరికఁ బట్టెడు కార్యసంగతిన్
దనుజులతో విరోధమును ♦ దాఁ గొన నాతనిభార్య జానకిన్. ౧౫౩ 138

చ. నిరుపమకీర్తి భూమిసుత ♦ నిర్జరవైరిదశాస్యుఁ డెట్టులో
కరుణయె లేక దొంగిలి ని♦కామజవంబునఁ బోయె; జానకీ
వరునియనుజ్ఞ నేనుఁ గొని ♦ వారిజనేత్రను జూడ దూతనై
యరుగుచు నున్నవాఁడ విన♦వమ్మ జగత్పతి రాఘవుండు సూ!. ౧౫౪ 139

తే. అతనిరాజ్యంబున వసించు♦నట్టిదాన
వీవు గావున రామున ♦ కెలమి సాయ
మొనరుపందగు; నట్లుగా♦కున్న నేను
జనకజను లోకబంధువౌ♦ఘనుని రాము. ౧౫౫ 140

క. కని వచ్చి యంత నీమో, మును జొచ్చెద నని ప్రమాణ♦మును జేసెద; నం
చనఁ గామరూపిణిగ నొ, ప్పినసురసయు నిట్లుపల్కెఁ ♦ బ్రమదశ్వసుతున్.

తే. ఎవ్వఁడేనియు నాకడ♦ కేగుదెంచి
మీఱి పోరాదు వరమిట్లు ♦ మించునాకు

---

1 వికృతంచ విరూపంచ-అనిమూ. 2 ప్రహృష్టవదన శ్శ్రీమాన్-అనిమూ. ౧౫౬-వ శ్లోకము తర్వాత నున్నశ్లోకములు కొన్ని ప్రక్షిప్తములు. అసంగతార్థములు కలవి కాన వ్యాఖ్యాతల

సహజము పవనంబుఁ దెలుపఁ బా♦వనియు బుద్ధి
బలము తనరార నొకయుక్తిఁ ♦ బన్నెనొంచి ౧౫౭౹ 142

క. తన కాయంబును గొలఁదిగఁ, గనఁబడ నంగుష్ఠమాత్ర♦కంబుగ నొనరం
గను జేసి; దాని వక్త్రం, బును జొచ్చి నితాంతవేగ♦మున వెలువడియెన్. ౧౫౮౹

ఆ. వెడలివచ్చి యంత ♦ వినువీథి నిలిచి యి
ట్లనియె శక్తివైభ♦వాభిరాముఁ
డగుచు; దక్షపుత్రి! ♦ తగ నీదువక్త్రంబుఁ
జొచ్చి వాఁడఁ గాదె ♦ సురస! యిపుడు. ౧౫౯౹ 144

క. ఇఁక నీకు నమస్కారము, ప్రకటజవం బొప్ప జనకు♦పట్టి నెలయుచో
టికిఁ బోయెద నీవరమును, సకలంకంబయ్యె నిట్టు♦లనిపల్కుటయున్. ౧౬౦

క. హనుమంతు రాహువక్త్రం, బుననుండి విముక్తిఁ గన్న ♦ ముగ్ధశశాంకుం
దనఁ బొల్చి తనదువక్త్రం, బుననుండియె వెల్వడినను♦బుద్ధిఁ గపివరున్. ౧౬౦౹

క. కని సురస నైజరూపం, బును దాలిచి పలికెఁ; బ్లవగ♦పుంగవ! సౌమ్యా!
విను నీపని సంసిద్ధిం, గనఁ జేయఁగఁ జనుము సుఖము♦గా వేగముగన్. ౧౬౧౹

క. జనకజను మహాత్ముండై, తనరెడు రాఘవునితో ము♦దంబుననుండం
గను జేర్పు మనియె; నిట్లా, హనుమంతుఁడు చేసినట్టి ♦ యాకార్యంబున్.

ఆ. కరము దుష్కరమయి ♦ క్రాలు మూఁడవదానిఁ
గని సమస్తభూత♦గణము బాగు
బాగటంచు నతనిఁ ♦ బొగడిఁ గొనియాడె;
నంత వరుణవాస♦మై చెలంగి. ౧౬౩ 149

సీసమాలిక:—

దాఁటంగరాని యు♦దధిని వేగంబున, వినతాతనూజుని♦విధము దోఁప
నంబరంబున దాఁట ♦ నవుడు ప్రయత్నించె; నీటిధారలు మేఘ♦నిచయముక్త
ములయి సోనలు గాఁగ ♦ వెలయుచునుండంగఁ బక్షిసమూహముల్ ♦ పరఁగుచుండఁ
గైశికముఖ్యరా♦గవిశేషగురువులౌ తుంబురునారదుల్ ♦ డంబుమీఱ
సంచరింపఁగ, మఱి ♦ చక్రనియింద్రాయుధంబు చెల్వార, సు♦ద్దామసింహ
దంతిశార్దూలప♦తంగపన్నగవాహనము లెక్కి తిరిగెడు♦నమలమతులు
చటులగతుల్ మీఱఁ ♦ జరియించునట్టి విమానముల్ తనరంగ; ♦ మఱియు నశని
వజ్రసమాఘాత♦వహ్నులు వెలయంగఁ బుణ్యకార్యంబులఁ ♦ బూని చేసి

---

తాత్పర్యము ననుసరించి తెలిఁగింపలేదు. "మధ్యే తం ప్రయాంత మిత్యాదయః కేచన శ్లోకాః ప్రక్షిప్తాః అసంగతాశ్చ. శతయోజనాయతత్వే వానరై ర్లంకావాసిభిశ్చ జ్ఞాతస్స్యా దితి విరోధాత్. తదిమే ప్రక్షిప్తశ్లోకాః" అని గోవిందరాజులు. ఈశ్లోకములకు మహేశ్వరతీర్థులుకూడ వ్యాఖ్య వ్రాయ మానిరి.

స్వర్గంబును జయించి ♦ భాసిలు మహనీయులైన సాధువులెల్ల ♦ ననవరతము
నిండియుండఁగఁబొల్చు ♦ చుండినహో సంపూర్ణద్రవ్యముల్ తద్దయుఁ ♦ దాల్చియున్న
చిత్రభానుండును ♦ జెలఁగుగ్రహంబులు, నక్షత్రములును జం ♦ ద్రప్రభాక
రులుఁ జిన్నతారకా ♦ వళులు భాసిల్లంగ, మునివర్యనాగయ ♦ క్షనికరములు
తనరారుచుండ, గం ♦ ధర్వులు నెలఁగ, విపులమై నాటియుచు ♦ విమలమగుచు
విశ్వావసుసమాఖ్య ♦ వెలయు గంధర్వేశసేవితంబయి తగి ♦ దేవరాజ
గజవిరాజితమయి ♦ క్రాలుచుఁ, జంద్రసూర్యగతిమార్గంబయి ♦ యఖిలశుభద
మయి, బ్రహ్మ నిర్మించి ♦ నట్టి విశాలవితానంబువలెఁ గడు ♦ మాననీయ

తే. మగుచు గంధర్వవిద్యాధ ♦ రాదిసేవి
తము మరున్మార్గమునునయి ♦ తగు నభమున
గరుడునంబోలి పావని ♦ కడురయమునఁ
జనియెఁ దనపూన్కి యెల్ల నొ ♦ య్యన ఫలింప. ౧౭౧ 150

[1]క. నలుఁగడలఁ గానఁబడి తెల్లకలుగల భూధరవరేణ్య ♦ కరణిని ఘనమై
వెలయు నిరాలంబ నభఃస్థలమున లంఘించె హనుమ ♦ శ్వసనజుఁ డంతన్.

ఉ. పావనిఁ జూచి సింహిక య ♦ పారబలోన్నతిఁ గాంచి మించునా
దేవవిరోధివంశజ మ ♦ తిస్థిరతం గని కామరూపముం
జేవయుఁ గల్గునారి యతి ♦ చిత్రముగా నభివృద్ధి నొందుచున్
భావములోఁ దలంచె నిటు; ♦ ప్రాక్సుకృతంబున నిన్నినాళ్లకున్. ౧౭౩॥ 152

తే. దొరకె నాహార; మియ్యబ్ధిఁ ♦ దోఁచెఁ బెద్ద
జంతు విది నాకు నిపుడు వ ♦ శంగతంబ
యయ్యె; నని యెంచి యంతలో ♦ నబ్ధిఁ బొదలు
నతనిఛాయను బలిమిమై ♦ నంటఁబట్టె. ౧౭౪॥ 153

[2]క. తనఛాయ పట్టుపడ నయ్యనిలాత్మజుఁ డిట్లు తలఁచె ♦ నౌరా! విధిచే
తను బ్రతికూలానిలమున, వననిధిఁ జిక్కుపడు నౌక ♦ వలె నేనిచటన్. ౧౭౫॥

క. నిరుపమశౌర్యము చెడ ని, త్తరుణంబునఁ బట్టుపడితిఁ ♦ దటుకున; నని వా
నరతిలకుఁ డట్టె తలఁచుచుఁ, బరిపరి నలుఁగడలఁ గనుచు ♦ వారిధినడుమన్.

తే. జలములందుండి లేచిన ♦ విలయకాల
యమునిఁబోలినసత్వంబు ♦ నపుడు చూచె;
నధికవికృతాననంబగు ♦ నట్టిదానిఁ
గాంచి మారుతి యిట్లు చిం ♦ తించె మదిని. ౧౭౭॥ 156

సీ. అద్భుతదర్శనం ♦ బై మహావీర్యంబు గలిగి మైనీడలఁ ♦ గడఁగి పట్టు
కొనునట్టి యీజంతు ♦ వనె నాకు సుగ్రీవుఁ డెఱిఁగించె నందియ ♦ మేమియుండ;

1 హనుమా న్మారుతాత్మజః-అని మూ. 2 ప్రతికూలేన వాతేన మహానౌరివ సాగరే-అని మూ.

దనిరొంచి మతిమంతుఁ ♦ డౌట నిశ్చయముగ దాని సింహికయని ♦ తానెఱింగి
వృష్టికాలంబున ♦ నెసఁగు మేఘమువలెఁ దన పెనుకాయంబుఁ ♦ దక్షిణాంబ

తే. పెంపు నొందించె; నిట్లు క♦పీశ్వరుండు
శక్తిమీఱఁగఁ బెంచెడు ♦ సరణిఁ జూచి
యదియుఁ బాతాళవివర మ♦ట్లలరు ముఖముఁ
బెంచె; నంతట ఘనరాజి♦విధము తోఁప. ౧౮౦॥ 157

క. పెనునాదం బొనరించుచు, ననిలజుపై కడరె; నంత ♦ నాతఁడు మతిని
ఘనుఁడౌటఁ గాయమాత్రం, బును విస్తృతమునైన పెద్ద♦ముఖమును మఱియున్.

తే. దానిమర్మంబులను గాంచి ♦ తనదు వజ్ర
సన్నిభాంగము మిక్కిలి ♦ సంకుచితము
గాఁగ నొనరించి బలశాలి ♦ గాలికొడుకు
దానివిస్తృతాననముఁ జొచ్చెఁ ♦ దక్షిణాంబ. ౧౮౩ 159

చ. అనిలతనూజుఁ డట్లు దను♦జాంగనవక్త్రముఁ జొచ్చుచుండఁగాఁ
గని రలపూర్ణిమాతిథిని ♦ గాఢరయంబున రాహు వేచి శ
క్తిని దగ మ్రింగుచున్నహిమ♦దీధితిమాడ్కిని సిద్ధచారణుల్;
అనిలజుఁడంత మానసజ♦వాధికవేగము పొల్చుచుండఁగన్. ౧౮౪॥ 160

క. తనతీక్ష్ణనఖంబులచే, దనుజాంగన మర్మములను ♦ దగఁ ద్రెంచి జవం
బునఁ బైకెగసెను వక్త్రం, బును మూయకమున్నె; యిట్లు♦బుద్ధిమహిమచేన్.

సీ. దవ్వునుండి యా♦దానవిమస్తాళిఁ గనుఁగొనుదృష్టిచే♦తను, నితాంత
ధైర్యంబునం బెను♦దాక్షిణ్యమున దాని భేదించి ముందటి♦విధమునఁ దన
తనువును బెంచె; నా♦దనుజాంగనయు హృదయము వ్రయ్యలై బాధ♦యంకురింప
విహ్వలించుచు సరి♦ద్విభుసలిలంబునఁ గూలె; నిట్లాకపి♦కుంజరేంద్రు

తే. వలన మృతిఁ గన్న సింహిక♦వలను చూచి
యాకసంబునఁ దిరుగుభూ♦తాళు లతని
కిట్లుగాఁ జెప్పె; నోప్లవ♦గేంద్ర! యిపుడు
నీవొనర్చినపని సాధ్వ♦సావహంబు. ౧౮౬॥ 162

క. పెనుసత్త్వ మిద్ది నీచే,త నష్టు హతమయ్యె నింక ♦ ధరణిసుతాద
ర్శనరూపమగు నభీష్టం, బును మంగళకరముఁ బొంక♦ముగఁ దీర్పు తగన్.

తే. ధైర్యమును సూక్ష్మదృష్టియుఁ ♦ దత్త్వనిశ్చ
యంబు నొనరింపఁజాలిన♦యట్టి మతియుఁ
గార్యనిర్వహణమున ద♦క్షతయు నీకు
వలె నెవరికుండుఁ గార్యంబు ♦ వాఁడు తీర్చు. ౧౮౯॥ 161

చ. అనియిటు లామహోత్కలి♦హర్షము మీఱఁగఁ దన్ను నెన్నఁగాఁ
దనపనిఁ దీర్పఁ బూని విన♦తాసుతుమాడ్కిని సంబరంబునం
జనియె జవంబుమీఱఁ గపి♦సత్తముఁ; డివ్విధి నంబురాశియో
జనశతమించుకించుక నె♦సంగినశక్తిని దాఁటి యవ్వలన్. ౧౬౧ 165

తే. అలరు దరిఁ జేరె ననిచెప్ప ♦ ననువుపడకు
నట్లుగా దానిచెంతకు ♦ నరిగి నాల్గు
దెసలఁ జూచుచు నచ్చటి♦దివ్యవృక్ష
పంక్తిఁ గాంచెను; బవనుని♦పట్టి వేడ్క. ౧౬౨ 166

చ. జలనిధితీరమందుఁ దన♦సత్త్వము పొంగఁగ వ్రాలుచుండి య
బ్బలుమగఁ డంతఁ జెక్కుతెరు♦వారముఁ గ్రాలఁగనొప్పు ద్వీపమున్
మలచునగంబునందుఁ దగు ♦ మంజుతరోపవనంబులన్ ముదం
బలరఁ గపీశ్వరుండు గనె; ♦ నంతట నంబునిధిన్ గభీరమున్. ౧౬౩ 167

సీ. నాగరతటమున ♦ జలమయభూముల, వానియంకలితరు♦వ్రజము, జలధి
పత్నులౌనదులను ♦ బాగుగఁ జూచుచు నతఁడు మహామేఘ♦మట్టులొప్పి
యాకాశమార్గంబు ♦ నక్షగించెడు తనకాయంబుఁ గని సునా♦క్షమతియాటఁ
దలపోసె నివ్విధిఁ; ♦ దనువృద్ధిని నుదీయజవమును గనుచు రా♦క్షసులు సంత

తే. సంబునన్ననుఁ దెలియఁ గాం♦చఁగనకుండు
రొక్కొ యనియిట్లు తలపోసి ♦ యురుతరమగు
తనువుఁ జిన్నదిగాఁ జేసి♦కొనుచు మోహ
మును త్యజించిన జ్ఞానిరీ♦తిని జెలంగి. ౧౬౪ !68

క. తనతొంటిరూపమును దా, ల్చెను; నివ్విధిఁ దనువు నతఁడు ♦ చిన్నదిగానే
యొనరిచి త్రివిక్రమాకృతిఁ, గొని పాదత్రయము నునిచి ♦ కుతుకంబలరన్.

క. బలిపౌరుషము నడంచుచుఁ, జెలఁగినవామనత నొంది ♦ చిత్రగతుల మిం
చులలితజలజాక్షునివలె, వెలసెను; నిట్లతఁ డనేక♦విధముల మిగులన్. ౧౬౫

క. వయోపనులకుఁ దగినటు, లాయారుచిరాకృతులను ♦ నందుచు రిపులం
బాయనడఁ జేసి జలవిభు, నాయవ్వలితటముచేరి ♦ యాత్మాకృతినిన్. ౧౬౬

క. కనుఁగొని జరగందగునా, పనులను లోలోన లెన్నఁ ♦ బరికించి యతం
డు నిజాకృతిఁ దాల్చెను; నిటు, లనిలజుఁ డురుభూధ్రశిఖర♦మట్లుపొలయుచున్.

సీ. ఆకాశముననుండి ♦ యవనిపై వ్రేలాడునట్లుండి, లంబావ్వా♦యమునఁ బరఁగు
నద్రియందు సమృద్ధ♦మై విచిత్రములగు శిఖరముల్ వేయుంగఁ ♦ జెలఁగి కేత
కోద్దాలనాళికే♦రోర్వీరుహంబులఁ, బాలుపారుకూటమునం ♦ దలరుతనువు
తో వ్రాలె; నిట్లు పా♦థోనిధితీరంబు నొంది యందత్యున్న♦తోగ్రశిఖరి

తే. శృంగమందున్న లంకఁ బ్రే♦క్షించి తనదు
తనువును విదిల్చి మృగపక్షి♦తతి నదల్చి
యందు వ్రాలెను దనశక్తి ♦ యలర; [1]దనుజ
ఫణియుతం బూర్మిమంతమై ♦ పరఁగుజలధి. ౨౦౧ 173

చ అలయక దాఁటి యవ్వలిత♦టావని వ్రాలి మహామహేంద్రుఁను
జ్వలనగరంబుఁబోలె ఘన♦సంపదలం దులదూఁగుచుఁ దగన్
విలసిలు లంకఁ గాంచి మది♦ వేడుకనొంది స్వకీయకృత్యముల్
సులలితరీతిఁ బాటవము♦సొంపునఁ జేయఁగ నెంచె నెమ్మదిన్. ౨౦౨ 174

మొదటి సర్గము సంపూర్ణము.

---

## ౨ - వ సర్గము.

హనుమంతుఁడు సూక్ష్మాకృతి లంకాసమీపమున కరుగుట.

తే. అమ్మహాబలుఁ డివ్విధి ♦ నప్రధృష్య,మైన జలరాశి నవలీల ♦ నధిగమించి
స్వస్థుఁడై యద్రికూటవి♦భాసమాన,మైనలంకను గాంచెను; ♦ హర్షమలర. ౧

[2]చ. తరువులనుండి పుష్పసము♦దాయము పైఁబయి రాలుచుండ వా
నరతిలకుండు గంధవహ♦నందనుఁ డాసుమవృష్టిఁ దోఁగి యా
త్తరుణమునందుఁ బుష్పరచి♦తం బగునాకృతిఁగల్గు కోఁతియ
ట్లరుదుగ నొప్పె; దేహరుచి ♦ యద్భుతవిక్రమముం జెలంగఁగన్. ౨ 176

తే. యోజనశతంబు నవలీల ♦ నొక్కరీతి
దాఁటి నిట్టూర్పువుచ్చ కిం♦తయును శ్రమము
నంద కాత్మను దలఁచె నే♦నైన యోజ
నశతముల దాఁటఁగల నిట్టి♦నాకు నివుడు. ౩ 177

క. శతయోజనమంతటిపరి,మితిగల నీయబ్ధి యెంత? ♦ మేల్మేలని యీ
గతిఁ దలఁచుచు దాఁటంగల, మతివీర్యసమగ్రులుండ ♦ మహిమోన్నతిచేన్.

క. ఘనవీర్యము ప్రథితంబై, తనరఁగ వేగంబ కంధి ♦ దాఁటి దనుజప
త్తనమును గాంచెను; నంతట, ననిలజుఁ డట శాద్వలంబు ♦ లయి నీలములై.

సీ. వెలయుతావులను ని♦ర్మలగంధయుతములౌ వనములఁ బెనుతాలఁ♦గననగువన
ములను మహీరుహం♦బులఁ జెలువారెడుతోఁటల, మఱియును♦ద్రుమనికాయ
శైలంబులఁ, దగఁ బు♦ష్పనికాయశోభితవనపంక్తులను జక్కఁ♦గనుచుఁ దేజ
ముల్లసిల్లఁగఁ గపి♦శ్రేష్ఠుఁ డాతఁడు నానినెల్లను దాఁటి ♦ వనముల, నుప

---

1 దానవపన్నగాయుతం.........మహోర్మిమాలినమ్-అనిమూలము. 2 బభౌ పుష్పమయో యథా-అనిమూలము.

తే. వనములం గాంచుచుఁ శైల♦మున వసించి
పుష్పసందోహము నానగో♦త్తమమునందు
నున్నలంకాపురముఁ గాంచె; ♦ నొగిఁ బ్రసూన
పంక్తులలరంగ నెంతయు ♦ భాసురముగ. ౧౮౦ 180

సీసమాలిక:—

కనఁబడు సరళవృ♦క్షములను గర్ణికారంబుల, ఖర్జూర♦రమ్యతరువు
లను, బ్రియాళంబుల ♦ ఘనముచులిందంబులను, మఱి కుటజంబు♦లను బ్రసిద్ధ
ములగు కేతకవృక్ష♦ములఁ బ్రియంగువులను, గంధపూర్ణములయి ♦ క్రాలు నీప
తరువుల, నేడాఁకు♦లరఁటుల, వేగిసంబుల, దేవకాంచనం♦బులను, బూచి
యలరారు కరవీర♦ముల, మఱియును బుష్పభారమ్మునకు సుంత ♦ వ్రాలి మొగ్గ
లెల్లఁ జెలంగఁ బ♦క్షీంద్రముల్ నిండియుండంగ, వాయువు కడుఁ♦బొంగి వీవ
మస్తకంబులు పలు♦మాఱు కంపింపంగఁ దగు వృక్షముల నితాం♦తము చెలంగి
హంసకారండవా♦ద్యఖిలద్విజాకీర్ణములయి పద్మోత్పలం♦బులు వెలయఁగ
నలరు జలాశయం♦బుల, మనోహరములై వివిధంబులగు వన♦వితతుల, మఱి
సర్వర్తుఫలపుష్ప♦సముదయంబుల నిండియున్న వృక్షంబుల ♦ నొప్పుచున్న
యుద్యానములఁ గాంచె♦నొగి హనుమంతుండు; దనుజాధిపతియును♦ద్దామవీర్య
మలరఁ బాలించు లం♦కాహ్వయపురమును దరిసె, నయ్యది రమ్య♦సరసిజోత్ప
లాలంకృతంబగు ♦ నయ్యగడ్తలఁ గ్రాలి సీతను దెచ్చుటఁ ♦ జేసి రాముఁ
డని చేయువచ్చునో ♦ యని శంకనొందిన రావణుండును, సుఘో♦గ్రంబులైన
చాపంబులను బూని ♦ సర్వస్థలంబులఁ జరియించు దనుజులు ♦ నిరతము దనుఁ
గాపాడుచుండఁగా ♦ నేపారుచును; మఱి కనత్కాంచనవప్ర♦కలితమగుచుఁ
దెల్లనై ప్రౌఢవృత్తై ♦ యుల్లసిల్లుచుఁ జంద్రకవిముఖఖేటసం♦కాశములయి
శరదంబుధరతుల్య♦చారుగేహంబులఁ, గ్రాలువీథులు మించఁ♦గాఁ దనరుచు;
*నట్టాలకశతంబు ♦ లమలపతాకాధ్వజావళుల్, తీఁగెల♦యుట్టిరేకు
లందుఁ జిత్రితములై ♦ హాటకమయములౌ దివ్యతోరణములఁ ♦ దేజరిల్లు

తే. చున్న లంకాపురంబును ♦ నన్నుతిగనఁ
జాలుదానిని రమ్యమా ♦ స్వర్గతుల్య
మును గనుంగొనెఁ బవమాన♦తనయుఁ డంతఁ;
బాండుశుభ్రభవనంబులఁ ♦ బరిఢవిల్లె. ౧౮౧ 181

క. గిరిశిఖరంబున వెలయుచు, సరిలేక తనర్చు లంక ♦ శ్వసనతనయుఁ డం
బరగతపురమునుగాఁ గనెఁ, సురారివరపాలితమయి ♦ సొంపు గులుకుచుఁ.

---

* పతాకాధ్వజమాలినం-అనిమూలము.

తే. విశ్వకర్మ నిర్మింపంగ ♦ విష్ణుపదము
నందుఁ దేలుచునున్నట్టు ♦ లగపడుపురిఁ
గనియె; మఱియును నాలంక ♦ ఘనతరమయి
[1]వప్రసాలమె జఘనమై ♦ వఱలుచుండ. ౨౦ 183

తే. పరిఘయందున్న జలమె వ♦స్త్రమగు నంబ
రముగ వెలయు, శతఘ్ని కా♦సము నయములు
సాలములు కేశముఖములై ♦ క్రాలు బురుజు
లమలకర్ణాభరణములై ♦ యతిశయిల్ల. ౨౧ 184

క. తరుణీమణివలెఁ జెలఁగుచు, వరశిల్పములొప్పఁ జిత్ర♦పాటవమునఁ జే
యు రహిఁ గనిపించెడుపురివలె, నరుదగుచుండంగ దాని ♦ నాతఁడు గాంచెన్.

ఆ. దానియుత్తరమునఁ ♦ దగు ద్వారమును జేరి
మదిని నిట్లు తలఁచె ♦ త్మాకుమారి
నెట్లుగాంతు లంక ♦ నేరీతిఁ జొరనగు?
ననుచు నెంచె; నిట్లు ♦ దనుజపురము. ౨౨ 186

ఉ. భాసురమై సితంబగుచు ♦ భవ్యతమంబయి యొప్పుచుంటఁ గై
లాసపుశృంగమట్లుగఁ జె♦లంగి నభంబును దాఁకుచున్నదో
నాసముదీర్ణ భూరి భవ♦నప్రతతిన్ దివిఁగూర్చి పోవఁగా
నాసఁగొనంగఁ జొలునను ♦ నట్లలరారుచుఁ జూడఁ జోద్యమై. ౨౩ 187

[2]చ. కనుఁగొన భీతినించు ఫణి♦కాండముచేఁ దగు నాగలోకమో
యన బెడిదంపురక్కసుల ♦ నావృతమై, మఱి యెన్నరాక చ
క్కనిగతి నిర్మితంబగుచుఁ ♦ గ్రాలుచు స్పష్టముగా వెలుంగుచున్
గనుఁగొన రమ్యమై సికెకిఁ ♦ గాపురమై తనరారుచుండఁగన్. ౨౪ 188

చ. ధనపతికింతకున్ మునుపు ♦ తావలమై; పెనుదంపలొప్పఁగా
ఘనతరశూలపట్టిస ని♦కాయముల్ ధరియించి భీతికృ
త్తనువుల నొప్పు రాక్షసులు ♦ తన్ననయంబును గాచుచుండ నా
గనికరజుష్టమౌ గుహాగఁ ♦ గన్పడుచున్ రుచులొప్ప మీఱుచున్ ౨౫ 189

తే. భయము గల్గించుచుండఁ బా♦వనియు దానిఁ
గాంచి దానికిఁ జుట్టును ♦ గ్రాలుచున్న
సాగరంబును జూచి రా♦క్షసవిభుండు
భయదశత్రువునై యుంటఁ ♦ బరఁగ నెన్ని. ౨౬ 190

క. హనుమయు మది నిటు తలఁచెన్; వనచరులీ యబ్ధిదాఁటి ♦ వచ్చుట యరుదై
కనఁబడు నెటులో వచ్చిన, ననిసేసి సురౌఘమైన ♦ వప్రతిమంబున్. ౨౭

1 వప్రప్రాకారజఘనామ్-అనిమూలము. 2 అచింత్యాం సుకృతాం స్పష్టామ్-అనిమూ.

క. దీనిఁ జయింప శక్యం, బౌనే యిద్దానిఁ జేర ♦ నరుదెంచినచో
వానరుల కేమిషఃమాఁ;, గానన్ రాక్షుంటె మేలు ♦ గాఁ గనఁబడెడున్. ౨౭

తే. విషమమై దుర్గమంబయి ♦ వెలయుదీనిఁ
బాలనము చేయువాఁడు రా ♦ వణుఁడు గాన
వాలగిరిభూమిఁ దళనాద ♦ సకలకార్య
ముల నొనర్చినయట్టి రా ♦ ముండు గడఁగి. ౨౮ 193

[1]క. చనుదెంచిననైనను ఫల,మును గాంచునె? [2]క్రూరచిత్త ♦ ములఁ దగువారల్
దనుజులు గావున సామం, బున దీనిఁ జొరంగరాదు ♦ పో యెట్లైనన్. ౨౮½

క. ధనవంతులౌట దానం,బున దనుజులు వశ్యులగుటఁ ♦ బోలదు, దర్పం
బునఁ గ్రాలుట భేదంబున, దనుజుల వంచింపరాదు ♦ ధాతకునైనన్. ౨౯ 195

తే. బుద్ధిశౌర్యములన్ వీరు ♦ పోల్చువారు
గాన యుద్ధమ్మొనర్చి ని ♦ కామశక్తి
జయము గొనరాదు; వనచర ♦ సత్తములగు
వనచరచతుష్టయమునకె ♦ వనధి దాఁటి. ౨౯½ 196

సీ. శక్యమౌ నిర్జర ♦ సత్తమపౌత్రుఁడౌ యంగదుండును నీలుఁ ♦ డస్మదధిపుఁ
డైన సుగ్రీవుండు ♦ నేను నీనల్వుర మబ్ధిని లంఘించి ♦ యసురపురిని
జొరఁజాలుదుము మఱి ♦ యొరులకుఁ గాదునూ; యీవిచారంబిపు ♦ డేల నాకు
యుర్విజ జీవించి ♦ యుంటయు లేమియు నెప్పుడు తెలియనౌ ♦ నప్పుడామెఁ

తే. గాంచి యవ్వలఁ జేయనౌ ♦ కార్యమేను
దలఁచెదనటంచు నొకముహూ ♦ ర్తంబు మదిని
జక్కఁ జింతించి యాకపి ♦ సత్తముండు
తద్గిరీంద్రకూటంబునఁ ♦ దగ వసించి. ౩౦½ 197

క. శ్రీరాముని యభ్యుదయమె, కోరికగానుండె; మఱియుఁ ♦ గ్రూరులు దనుజుల్
భూరిబలాఢ్యులు గావున, నేరీతిఁ బ్రమాదపడక ♦ యీపురవరమున్. ౩౧½

క. కాపాడుచున్నవారిపు, డీపురి నీరూపముననె ♦ యేఁ జొచ్చుటకె
ట్లోపుదు శక్యంబెటులౌ;, గాపురుషులు భూరివీర్య ♦ కలితులు కఠినుల్. ౩౩

తే. చండతేజోవిరాజితుల్ ♦ సమధికబల
యుతులు రాక్షసులౌదు; రే ♦ నుర్వితనయ
వెదకువాఁడను గావున ♦ వీరి నేను
వంచన యొనర్పకుండఁ ద ♦ ప్పదు నిజంబు. ౩౪ 200

---

1 ప్రాప్యాపి సుమహాతేజాః కింకరిష్యతి రాఘవః-అనిమూలము. 2 ఇట వ్యాఖ్యానాభిప్రాయము చేర్చి వ్రాయఁబడినదని యెఱుంగునది. కాన "అవకాశో నసాంత్వస్య రాక్షసే ష్వభిగమ్యతే" అనుశ్లోకమున కేవియర్థ మిందుఁగలదని తలంపరాదు.

క. తెలిసియుఁ దెలియనిరూపం, బలరారం దాల్చి గొప్ప♦దగు నీకృత్యం
బెలమిని సాధింపఁగ నే,ను లంక నీరాత్రిఁ జొత్తు♦ను వెరవు మీఱన్. ౩౫

చ. అని యిటులెంచి దేవతల♦కైన నెదుర్పఁగరాక యొప్పులం
కను దిలకించి సీత వెద♦కందగుఫక్కిఁ దలంచి పల్కుఁ డ
దనమదిలోఁ దలంచుచు ని♦తాంతము నూర్పులఁ బుచ్చి యంతటన్;
జనకజ నేయుపాయమున ♦ సాధుభయంకరుఁడై దురాత్ముఁడై. ౩౬ 202

క. తనరారెడు రావణునకుఁ, గనఁబడకుండంగఁ జూడఁ♦గల్గుదు? శ్రీరా
ముని విదితాత్ముని పనియిది, వినాశ మెటులొందకుండు? ♦ విధిగతియెట్లో?.

క. జనకజ నొక్కతె నొరులకుఁ, గనఁబడకుండంగ నే నొ♦కఁడనే చూడం
గను బోనఁగునెట్లు? పని దే,నినినైన మదిం దలంచి ♦ నెఱిఁ జేయఁదగున్. ౩౮

*సీ. సులలితోపాయముల్ ♦ సొరిదిఁ బ్రయోగింప సంచుమించుగ ఫలి♦యించినట్టి
కార్యంబులును, వివే♦కరహితుఁడగు దూతచేతికిం జిక్కినేఁ ♦ జిత్రరీతిఁ
గా నవియును దేశ♦కాలవిరోధంబు నొంది చీకట్లు సూ♦ర్యోదయమున
నశియించునట్లు వి♦నాశంబు నొందును: గార్యమిఁయ్యది యి ద♦కార్య మనుచు

తే. రాజమంత్రులు గూడి ని♦ర్ణయముచేసి
నట్టిసదుపాయములుగూడ ♦ నజ్ఞుఁడైన
దూతనొందిన నవ్వియుఁ ♦ దోడనె చెడి
విభునిసైతము చేయు వి♦వేకరహితు. ౩౯ 205

క. దూతలు పండితమానులు, భూతలపతికార్యములను ♦ బోకార్తురుగా;
యీతఱి లంకం జొచ్చుట, యే తెఱఁగుననొనొ యిప్పు♦డే చొరఁదగునా.

చ. గిరిపయి నిప్పుడుండి నిశఁ ♦ గేవలశక్తిని జొచ్చుటొప్పు నా
పురమును దీని నెట్లు కనఁ♦బోలును? రూపమిదేమహోర్గ్మమై
పరఁగునొ యల్పమాతనువు ♦ బాగొ, రఘూత్తముకార్యరీతి యె
క్కరణి నొనర్పఁగాఁ జెడక ♦ కాఁగలదో యిది యెట్లు సాగునో. ౪౦ 207

తే. ఎట్టు లవివేకియనునా ను ♦ మేను బొంద
కుండఁగలనో, యపారమై ♦ యొప్పు జలధి
దాఁటినాఁడ నిదెట్లు వ్య♦ర్థంబుగాక
యుండునో, యేమిచేయుంగ ♦ నొప్పుగనునొ. ౪౧ 208

క. దనుజులు ననుఁజూచినచో, దనుజేంద్రానర్థకార్య♦తత్పరుఁడగు రా
ముని కార్యమెల్లఁ జెడు, నన్, దనుజులు గుఱుతింపకుండఁ ♦ దగ నిచ్చోటన్.

---

* భూతా శ్చార్థావిపద్యంతే దేశకాలవిరోధితాః, విక్లబం దూత మాసాద్య తమ స్సూర్యోదయే యథా, అర్థానర్థాంతరే బుద్ధి ర్నిశ్చితాపి నశోభతే-అనిమూలము. దీనివ్యాఖ్యానభావ మిటఁ జెప్పఁబడుటచే నీసపద్యము చెప్పవలసివచ్చినదని యెఱుంగునది.

క. మెలఁగుట యాశ్చర్యమే యగు; ఖలుఁడగు రాక్షసునితనువుఁ ♦ గాంచిననైనన్
స్థలమున నిటనుండుటకే, యలవియుఁ గా దన్యరూప ♦ మందిన నగునే. ౨౦౩

సీ. బలవంతులగు రాక్ష♦సులకెఱుంగఁగరాని దేదియులే దంగ♦హీనుఁడైన
వాయువుకూడను ♦ వారికిఁ దెలియక, లంకలోఁ దిరుగఁజా♦లం డటంచుఁ
దలఁచెద; నాకొంటి♦తనువున నిందుండు దునయేని నే విప♦త్తును గనుటయె
గాక నాస్వామిస♦త్కార్యంబునుం జెడుఁ; గాన నాసహజమౌ ♦ కాయ మిప్డు
తే. హ్రస్వముగ నొనరించి శ్రీ♦రాముకార్య
సిద్ధికొఱకుఁ ద్రియామను ♦ జెలఁగి లంక
నేఁ బ్రవేశింతుఁ; జొరఁ దగ♦నిదగు రావ
ణాభిపాలితలంక న♦త్యద్భుతముగ. ౨౦౪ 211

చ. ఒరులకుఁ గానరానియటు ♦ లొప్పెడుశక్తిని రాత్రిఁ జొచ్చి మం
దిరములనెల్లఁ జక్కనిగ♦తిం బరికించి విదేహరాట్సుతం
బరమగుణాన్వితం గనుదు ♦ బాగుగ నంచుఁ దలంచి వీరుఁడౌ
హరితిలకుండు సీతఁ గను♦నాదృతి సూర్యుఁడు గ్రుంకుకాలమున్. ౨౦౫ 212

క. కనిపెట్టియుండె; నంతట, వనజాప్తుఁడు పశ్చిమాబ్ధి ♦ వ్రాలఁగ రాత్రిన్
హనుమయు బిడాలమాత్రము, తనయంగము నొనరఁ జేసి ♦ తాఁ జిత్రముగన్.

చ. కననయి వీర్యయుక్తుఁడయి ♦ క్రాలును గావున నా ప్రదోషమం
దనితరశక్తిఁ బైకెగసి ♦ యద్భుతమై సువిభక్తరాజమా
ర్గనికరమై చెలంగుపురిఁ ♦ గమ్రగతిం జొరఁబూనె లీలమై
ఘనతరసౌధపంక్తుల ని♦కాయము చూడఁగ నైన యపారమై. ౨౦౭ 214

తే. కనకరూప్యమయ స్తంభ♦గణముచేతఁ
గాంచనమయంబులౌ జాల♦కములచేత
నగర మయ్యది గంధర్వ♦నగరమట్లు
తనరె; మేడలంతస్తు లే♦డెనిమిదలర. ౨౦౮ 215

తే. స్ఫటికములచేత దివ్యకాం♦చనముచేత
నలరుతావులు చెలువంబు ♦ గులుక లంక
వెలయుచుండెను; మఱి రాక్ష♦సులగృహములు
దివ్యవైడూర్యరత్నచి♦త్రితము లగుచు. ౨౦౯ 216

క. విలసితముక్తాజాలం,బుల నొప్పు ప్రదేశములను ♦ బొలిచెను; రక్ష
స్సుల గృహతోరణములు పెం,పలరఁగఁ జిత్రంబులగుచు ♦ హైమములగుచున్.

క. దనుజేంద్రుపురము నెల్లెడ,లను వెలుగం జేయుచుండె; ♦ లలనామణి సీ
తను జూడ నుత్సుకుండై, వనచరతిలకుండు హనుమ ♦ భాసురమగుచున్. ౨౧౧

తే. అద్భుతంబగు నాకృతి ♦ నమరి తనదు
మహిమ మింతనిచెప్ప నే♦మాత్రమైనఁ
బరముగాక వెలుఁగుప♦త్తనముఁ గాంచి
సంతసమ్ము విషాదంబు ♦ సమముగఁ దగ. ౨౧౯ 219

సీ. తెల్లనై యత్యున్న♦తిం దగినవిమానజాలముల్ దీపింపఁ, ♦ జారుకనక
జాలతోరణములు ♦ చక్కఁగా వెలయంగఁ, బ్రఖ్యాతి వెలఁగ రా♦వణుభుజాభి
పాలితంబయి మహో♦భయదరాక్షససమావృతమయి చూడఁగ♦నింపునొసఁగు
పురమును గని కపీ♦శ్వరుఁడు మోదము విషాదమునొందె; రేరాజు♦తానుగూడ

తే. నతనికిఁ సాయపడునట్లు ♦ లవుడు తార
కాంతరంబున వెల్గుచు ♦ నాత్మకాంతి
నెల్లెడల వెదఁజల్లుచు ♦ నుల్లసిల్లి
వేలకొలఁదిని గిరణముల్ ♦ వింతమెఱయ. ౨౨౦ 220

క. ప్రాచీముఖమున నెంతయుఁ, దోఁచెను; శంఖములు దమ్మి♦తూండ్లును క్షీరం
బేచాయనుండునట్లుగ, నేచక్కనికాంతిఁ బైకి ♦ నెసఁగెడుచంద్రుఁడ్. ౨౨౧

తే. సరసునం జనుచున్నట్టి ♦ సన్నరాళ -
మట్లు వనచరకుంజరుం ♦ డమలశశిని
గాంచి లంకఁ బ్రవేశించి ♦ కార్యసరణిఁ
దీర్ప మదినెంచె *రామభ♦క్తిని జెలంగి. ౨౨౨ 222

రెండవ సర్గము సంపూర్ణము.

---

## 3 - వ సర్గము.

లంకాధిదేవతను జయించి హనుమ లంకలోఁ బ్రవేశింప ననుమతిని బొందుట

చ. జలనిధిలంఘనాదిగురు♦సాహసకృత్యములెల్లఁ జేసి యు
జ్జ్వలతరసత్త్వమొప్ప మతి♦శాలి మరుత్తనయుండు లంబనా
మలలితభూధరంబున స♦మస్తమహీరుహముల్ నితాంతముగ్
వెలయఁగ వంగియుండుటను ♦ వ్రేలుచునున్న ఘనంబులాగునన్
జెలఁగుచు నున్న శృంగమును ♦ జేరి బలంబును బూని యంతటన్. ౧ 223

క. చారుతరకాననంబుల, వారిని జెలువారి దనుజ♦వరపాలితమై
చేర నశక్యంబగు పురి, మారుతి నిశిఁ జొరఁగఁబూనె ♦ మతిమహిమమునన్.

చ. పురమది శారదాంబుదముఁ ♦ బోలి సుధామయమైన మందిరో
త్కరముల మీఱె, దానవుల ♦ గాఢరవంబులు వారిరాశి ఘో

---

* రామభక్తిని జెలంగి-అనునది హెచ్చుగా నిటఁ జేర్పఁబడుట ప్రకృతార్థవిరుద్ధము గాదని
దోఁచుచుండునది.

కరరవభంగిగా వెలయఁ, ♦ గంధిమరుత్పరిసేవితంబునై
పరఁగుచునుండెఁ; బుష్పభట♦వారమహార్భటు లుల్లసిల్లఁగ౯. ౩ 225

*క. ధననాఘుస్త్రసంబయి, తనరెడు విటపావతివలెఁ ♦ దగి, తోరణపం
క్తిని గ్రాలు మత్తవారణ, ఘనతం జెలువారి రుచులఁ ♦ గ్రాలుచు వెలసె౯.

తే. పాండురద్వారతోరణ♦పటల మలర, సర్పములు సంచరింపఁగ ♦ సతతగుప్త
మైన భోగవతింబోలి ♦ దానవాళి, సంచరణరక్షితంబయి ♦ మించుచుండె. ర౪

సీ. ఉత్పన్నదివ్యగే♦హోత్కరమూలంబునను, విద్యుదుజ్జ్వల♦ఘననికాయ
మంతటఁబర్వఁగా ♦ నమలతారామార్గమునఁ బ్రకాశించుచు♦ననయమొలయు
మందమారుతముల♦మంజులతరమునై యమరావతింబోలి ♦ యలరుచుండెఁ;
గనకమయంబయి ♦ కడువిపులంబయి వెలయు ప్రాకారంబు ♦ గలిగి విమల

తే. కింకిణీజాలరవముఁ ♦ బొంకముగను
గ్రాలు ధ్వజముల శోభిల్లి, ♦ చాల రుచుల
మించు లంకాపురంబును ♦ గాంచి వేగ
దానిప్రాకారమును జేరెఁ ♦ దమి మిగులఁగ. ౭ 228

క. పురమును నాలుగుదెసలం, బరికించి మరుత్సుతుండు ♦ పరమంబగు న
చ్చెరువుం బొందెను; మఱి యుప్పర మష్టాపదకవాట♦పూగాన్వితమై. ౮ 229

తే. అమలవైడూర్యవేదిక ♦ లమర, స్ఫటిక
వజ్రముక్తామణివ్యూహ♦భాసమాన
కుట్టిమంబులు చక్కఁగాఁ ♦ గొమరుమిగులఁ
దప్తహాటకనిర్యూహ♦తతులు వెలయ. ౯ 230

తే. రజతరచితంబు లగుచు ని♦ర్మలము లగుచుఁ
బాండురములగునట్టి పై♦భాగములను
గ్రాలి వైడూర్యసోపాన♦కలిత మగుచు
స్ఫాటికాంతరపాంసువుల్ ♦ భాసిలఁ దగి. ౧౦ 231

సీ. ఆకాశమున కేగు♦నట్టివై శుభములై, తగు చతుశ్శాలలు ♦ మిగులఁ, గ్రౌంచ
పక్షిమయూరర♦వంబులు పొలయంగ, రాయంచ లెల్లెడ ♦ రాజిలంగ
వెలయు బంగరుద్వార♦ములఁ జెన్నుగాంచుచు, వాద్యనిస్వనముల♦భాసురాభ
రణనిస్వనంబుల ♦ రాజిల్లుచు౯ శక్రపురమును బోలి వి♦భూతి మెఱసి

తే. యాకసంబున కెగరెడు♦నట్టులున్న
దివ్యభవనంబులం జక్కఁ ♦ దేజరిల్లి
యున్న లంకాపురంబును ♦ సన్నుతంబుఁ
గాంచి హనుమయు సంతోష♦కలితుఁడయ్యె. ౧౨ 232

---

* యాత్వైవ విటపావతీమ్-అనిమూ.

చ. దనుజవిభుప్రపాలితము ♦ తద్దయు రమ్యము మంగళాకరం
బును నతులంబు సంపదల♦మూలమునై తగు లంకఁ గాంచి యా
యనిలసుతుండు వీర్యయుతుఁ ♦ డాత్మను నిట్లుతలంచె; నౌర! ప
త్తనమిది యాయుధంబులను ♦ దాల్చిన రావణుసేన లెల్లెడన్. ౧౩। 233

క. తనుఁ గావఁగ నొప్పెడుఁ, గనుక మఱెవ్వండుగాని ♦ కడుబలమున నై
నను నెదిరింపంజాలఁడు;, ఘనులగు కుముదాంగదులును ♦ గాని బలమునన్.

తే. కపివరుండౌ సుషేణుండు ♦ గాని మఱియుఁ
గ్రాలు మైందద్వివిదులును ♦ గాని యప్ర
వేశ్యమా దీనిఁ బోరాడి ♦ విక్రమముల
బలసి గెలిచిన గెలువంగ ♦ వచ్చు నొకట. ౧౫ 235

క. బుత్తుండు కేతుమాలుం, దక్షయబలశాలి భాస్క♦రాత్మజుఁడను హా
ర్యక్షవిభుండు కుశధ్వజుఁ, డీమాత్రముగల్గు నేను ♦ నేర్తుఱ దీనిన్. ౧౬ 236

క. గెలువంగవచ్చు ననుచుం, దలఁచుచు ఘనభుజుఁడు శౌర్య♦ధాముండయి శ్రీ
కలితుండగు శ్రీరాముని, యలఘుపరాక్రమము, రాము♦ననుజునిబలమున్.

క. మనమునఁ దలంచి హర్షం, బునుబొందెను; మఱియు దనుజ♦పురమిది యందం
దును జెక్కినరత్నంబుల, ఘనరుచులే మేలిచీరఁ♦గా నొప్పారన్. ౧౮ 238

తే. వస్తువుల నుంచుగేహముల్ ♦ నిస్తులావ
తంసములుగాఁగ, మిగులు యం♦త్రములశాల
లతిఘనస్తనములు గాఁగ ♦ నమరఁ బ్రమద
పోల్కి నొప్పెను భూషణ♦భూషితయయి. ౧౯ 239

క. విలసితమణికాంతులు నిర్మలములుగా నెగడి మంది♦రంబుల తిమిరం
బులఁ బాయఁజేయ నొప్పెడు, నలలంకను దనుజపురము ♦ నాతఁడు కాంచెన్.

చ. కనియిటు లాపురిం జొరఁగఁ ♦ గాంక్షఁ జెలంగెడు నమ్మహాబలున్
వనచరపుంగవున్ ఘనుని ♦ వాయుసుతున్ నిజరూపయుక్తిచేఁ
గనియెను లంక; యి ట్లసుర♦కాంతసుపాలిత యట్లుచొచ్చునా
తనిఁ గని భీతికృద్వదన♦దర్శనయై యటలేచి నిల్చెఁ దాన్. ౨౧ 241

చ. హరివరుమ్రోలఁ గన్పడి మ♦హారవముల్ నిగుడంగ నిట్లనున్
ద్వరపడి; యోవనాలయ! యె♦వండవు నీ విటు లేమికృత్య మి
ప్పరిగలవాఁడవై చొరఁగఁ ♦ బూనితి? వింతయు దాఁపకుండ ని
త్తరుణమునందె చెప్పు *మసు♦ధారణముం దగునంతలోపలన్. ౨౩ 242

తే. వనచరుండవు నీవెల్ల ♦ భాగములను
దనుజనాథుని సుభటు లు♦ద్దామరీతిఁ

* యావత్ప్రాణాధరంతి తే-అనిమూలము.

గాచుచుండు నీలంకను ♦ గడఁగి చొరఁగ
నలవి నీకెప్పటికి నెట్టు ♦ లగుఁ దలంప. ౨౮ 243

చ. అనినఁ దలించుచుం దనదు ♦ నగ్రతలంబున నున్నయట్టి లం
కను గని నీరవయ్యఁ దగు ♦ గాలికుమారుఁడు పల్కె నిట్లు; లో
కనితరో నీవు నన్నిచటఁ ♦ బ్రశ్నమొనర్చినవార్తలెల్ల నీ
కనువుపడంగ నున్నయటు ♦ లాదృతిఁ దెల్పెదఁగాని ముందుగన్. ౨౯ 244

[1]ఆ. వికృతనయనము లిటు ♦ వెలయు నీవెవ్వతె?, వేల ద్వారసీను ♦ నిచటనున్న
దాన? వేల నన్ను ♦ దారుణగతి నడ్డగించి పల్కె దేల ♦ చంచలింప. ౨౬

చ. అనుహానుమంతువాక్యముల ♦ నాపురపాలిని కామరూపముల్
గనఁగలనారి యప్పు విని ♦ క్రమ్మఱ నాతనితోడఁ గ్రుద్ధయై
యనియెఁ గఠోరరీతి; దను♦జాధిపుఁడై మహితాత్ముఁడై జగం
బున వెలుఁగొందు రావణుని ♦ భూరితరాజ్ఞను దాల్తు నెప్పుడున్. ౨౭ 246

క. నను నెదిరింపఁగ నెవ్వరి,కిని సాధ్యముగాదు; నేను ♦ గేవలశక్తిం
గొని యిప్పురిఁ బాలింతును;, నను నెన్నక యీపురంబు♦నం జొచ్చుటకున్.

చ. అలవియె గాదు నీకెటుల ♦ నైనను, నీదగు ప్రాణరాజి ని
మ్ముల నిట నప్పగించి తగఁ ♦ బొందఁగలావు సుషుప్తిఁ జాలఁగాఁ
దులువ ప్లవంగమా యుదధిఁ ♦ దోఁచెడులంక యనంగ నేనె నూ
నలుఁగడలం బురం బిదియు ♦ నాపరిపాలితమై చెలంగెడిన్. ౨౯ 248

క. నావృత్తాంతం బిదియే, నీవడిగినయట్లు నీకు ♦ నేఁ జెప్పితి; నాఁ
బావని యవ్వాక్యంబులఁ, దా విని దానిన్ వధింపఁ♦దగు యత్నమునన్. ౩౦

క. సిరతుండై వేలోకభూ,ధరమువలెన్ నిల్చె; వాయు♦తనయుఁడు కపికుం
జరుఁడంత వికృతతనువునఁ, బరఁగెడు నాతరుణిఁ గాంచి♦బలయుతుఁడగుటన్.

క. తనబుద్ధిబలము వెలయఁగ, ననియె నిటుల; నోసిలంక ♦ సాట్టప్రాకా
రనికరములఁ దోరణములఁ, గనఁగ మనోహరపులంకఁ ♦ గాంచెదు వేడ్కన్.

క. చనుదెంచితి నిచటికి లం,కను జూడఁగవలయు ననెడి ♦ కాంక్ష మిగుల నా
మనమునఁ గల; దిఁక నీపత్తనమునఁ గల యుపవనములఁ ♦ దగువనరాజిన్.

తే. కాననంబుల నంతటఁ ♦ గ్రాలుచున్న
సౌధములఁ జూచుటకె మహా♦శను మనమునఁ
బూని యిటవచ్చినాఁడను; ♦ నే నన విని
కామరూపిణి యైనలం♦కయును మరల. ౩౧ 253

క. వరుసాక్షరముగ నిట్లనె;, సురవైరిగణప్రభుండు ♦ శూరుండగు భీ

1 కిమర్థం చాపి మాం రుధ్వా నిర్భర్త్స్యసి దారుణా-అనిమా.

కరరావణుండు రక్షింప రహింపదగు నీపురము, న♦భవ్యమనీషా. ౩౬ 254

క. నను గెలువకున్నఁ గనుఁగొనఁగ నశక్యము నీకుఁ దుచ్ఛ♦కపి; యనవిని య
వ్వనచరతిలకుఁడు దనుజాంగనతో నిటుపల్కె వినుము ♦ కల్యాణి! తగన్.

క. విను నే నీపురవరమును, గనులారం గాంచి తృప్తిఁ ♦ గని క్రమ్మఱ వ
చ్చినదారిననే పోయెద;, వనవిని యాలంకయుగ్ర భ♦యంకరరీతిన్. ౩౮

క. పెనునాదం బొనరించుచు, వనచరు నఱచేతనే జ♦వంబునఁ జఱచెన్;
వనితాభృశతాడితుఁడై, వనచరతిలకుండు వీర్య♦వంతుఁడు మిగులన్. ౩౯

* తే. అఱచె; నంతటఁ బవనుని♦యాత్మజుండు
వామహస్తాంగుళులనెల్ల ♦ బలిమిఁ బిడికి
లించి యాగ్రహమున మేను ♦ చంచలింపఁ
బొడిచె దానిని బిడికిటఁ ♦ గడురయమున. ౪౦ 258

క. వనిత యిది యుంచుఁ దనమున,మునఁ దోఁచుట గాఢరోష♦ముచు బూనిమృతిం
గనఁ జేయక విడిచెను; న,వ్వనితయు నాదెబ్బచేత ♦ బడలి వివశయై. ౪౧

తే. అవయవంబులు చలియింప ♦ నతివికృతము
గా ముఖంబును గన్నులు ♦ గనఁబడంగ
జవమునన్ భూమిఁబడియెఁ; బ్రా♦జ్ఞవరుఁడైన
హనుమ భూమిని ద్రెళ్లిన♦యతివఁ గాంచి. ౪౨ 260

క. ఘనతర తేజస్వియుఁ గా,వున నిది స్త్రీయాటఁ జంపఁ♦బోల దనుచు దా
నిని గరుణించెను; బిదపన్, దనుజాంగన లంక మిగులఁ ♦ దత్తఱపడుచున్.

క. తడఁబడు నక్షరములతోఁ, గడుభీతిం బొంది యతనిఁ ♦ గాంచి వినయమున్
బెడఁగై యులరఁగఁ బలికెన్;, బుధమి మహాబలుఁడ వీవె♦పో ఘనబాహూ.

సీ. సౌమ్య! కృపాఢ్య! ప్ర♦సన్నుండవగుము, ప్లవంగసత్తమ, గావ♦వలయు నన్ను
ధైర్యవంతులు మహా♦త్తరసత్త్వయుక్తులు, నగువారు వనితల ♦ నంతమొందఁ
జేయరాదను శాస్త్ర♦సిద్ధమౌ నియమంబునను నిల్చియుందువు ♦ కనుక నన్నుఁ
గాపాడు, మిందు న♦గరరూపమునఁ గానఁబడు లంక యిది యేన♦ప్లవగవర్య

తే. యో మహావీర! విక్రమం♦బొప్పు నన్ను
నని జయించితి వీవు; బ్ర♦హ్మయును నాకు
మును పొసంగిన వరదాన♦మును దగంగ
విన్నవింతు యథార్థమై ♦ వెలయు నద్ది. ౪౫ 263

చ. వినఁదగు దానినీవు; మును ♦ విక్రమ మొప్పఁగ రావణుండు పెం
పున దెసలన్ జయించుతఱిఁ ♦ బోలనికృత్యములెన్నొ చేయఁగాఁ

* వనాద సుమహానాదమ్-అనిమాలము.

గనుఁగొని నందిముఖ్యులు ని♦కామము కోపమునన్ శపించి రీ
దనుజానిలంక నాశముగుఁ ♦ దప్పక యిప్పుడె యంచు నంతటన్. ౨౬౪ 264

క. విని నే నాశాపంబును, వనజజుకడ కేగి భక్తిఁ ♦ బ్రార్థించితి నా
కును నాశము లేకుండఁగ, ననుగ్రహింపఁదగునంచు ♦ నంత నజుండున్. 265

చ. ననుఁగని యిట్లుపల్కె విను ♦ నాశము తోడనె లేదుగాని నీ
వ్వనిమొన నెవ్వు వానరుఁ డ♦హార్యబలుం డొకఁ డేగుదెంచి వే
దనదుపరాక్రమంబున ని♦తాంతము నోర్చునొ యంతనుండి యీ
దనుజులకున్ భయం బొలయుఁ ♦ దప్పదు పొమ్మనిచెప్పె బ్రహ్మయున్. ౨౮౪

తే. సౌమ్య నీదర్శనంబున ♦ శతధృతివిహితమగు కాలమువచ్చె; స♦త్య మగునజుని
పల్కు దానికి భంగ మె♦వ్వరునవైనఁ, గలుగ; దవనిజఁ దెచ్చిన♦కారణమున.

క. ఖలుఁడును రాక్షసనాయకుఁ, డలఘుబలుఁడునైన రావ♦ణాసురునకు ని
మ్ములనెల్ల రాక్షసులకున్, గలిగె వినాశనము తీర్పఁ♦గలమె దానిన్. ౨౯౪

చ. కనుకనె రావణాసురుఁ డ♦ఖండబలంబున నేలుచున్నలం
కను దగ దీనినిత్తైచొరఁ♦గాఁ దగు నచ్చట నీవు చేయఁగా
మనమున నిశ్చయించిన స♦మస్తసుకార్యములన్ జవంబు నొ
య్యనఁగొని చేసికొమ్ము; ప్లవ♦గాధిప! యిప్పురి శాపసంతతిన్. ౩౦౪ 269

చ. తనమహిమంబు దూలఁగ ను♦దారబలాఢ్యుఁడు రావణాసురుం
డనయము గావనొప్పునది♦యా నివు డిప్పురి స్వేచ్ఛఁజేరి యా
జనకజ సాధ్వి నిచ్చమెయి ♦ సర్వగృహంబుల నంచరించి యెం
దును దగ నడ్డులేక మదిఁ ♦ దోఁచినయట్లరయంగఁ బూనుమా. ౩౧౪ 270

మూఁడవ సర్గము సంపూర్ణము.

---

౪ - వ సర్గము.

—హనుమ లంకలోనికిం బోయి వెదకుట.—

క. అనిపలికె నంతఁ బవనుని, తనయుఁడు తేజస్వి కీశ♦తల్లజుఁ డటఁ బ
త్తనరూపఁ గామరూపిణి,యనునగు నాలంక శౌర్య♦మొప్పచునుండన్ .౧ 271

[1]క. అనిలోన జయించి జవం,బున నె మహాబాహుఁ డతఁడు ♦ పొందుగ ద్వారం
బునుండి దానిఁ జొరకయె, ఘనమా ప్రాకారమును ద♦గన్ లంఘించెన్.

[2]చ. అరిపురముం జొరం దలఁచు♦నాతఁడు ద్వారమునుండిపోవ న
త్తరుణమునందుఁ గార్యమది ♦ తప్పక పాడగునన్నరీతి న

---

1 అద్వారేణ మహాబాహుః ప్రాకార మభిపుప్లువే-అనిమూలము. 2 వ్యాఖ్యానాభిప్రాయ మిటఁ జెప్పఁబడినది.

ట్లరసి యతండు సాలమును ♦ నాగతి దాఁటి పురప్రవేశముం
గరమనురక్తిఁజేయ మదిఁ ♦ గ్రన్నన నెంచి వినీతబుద్ధియై. ౨ 273

సీ. కపినాధునకు హిత♦కాంక్షియై యుండుట శత్రువినాశసూ♦చకముగాఁగఁ
బ్రప్రథమంబున ♦ వామపాదంబును బగవానితలనుంచు♦పగిది లంక
యందుంచె; నిట్లు ల♦య్యనిలసూనుఁడు సత్వసంపన్నుఁడై రాత్రి♦సమయమందు
మౌక్తికపుష్పసం♦యుక్తమౌ రాజమార్గంబును జొచ్చి చ♦క్కనిది యగుచు
తే. రమ్యమై తగు లంకాపు♦రంబు నెల్లఁ,గలయఁ దిరుగంగసాగె; లం♦కాపురమది
నృత్తగీతాదిసద్వాద్య♦నిస్వనముల, మిగులు నట్టహాసంబుల ♦ మించుచుండె.

సీ. ఐరావతముఁబోలె ♦ నమలమై వజ్రాంకుశనికాశములచేతఁ ♦ జాలఁ గ్రాలి
మగరాలపిండుచే ♦ నిగనిగలాడెడు భవనంబులొప్ప న♦బ్దములఁ గూడి
నట్టియాకాశము♦ట్లందమై భాసిల్లె; మంగళప్రదములై ♦ మహిమఁ గ్రాలు
నసురగేహంబుల ♦ నతిసితాబ్దంబులవలె విచిత్రంబులై ♦ ప్రబలి స్వస్తి
కము వర్ధమానప♦ద్మము లనుపద్ధతులను గూడి కట్టఁబ♦డినమహిత
తే. హార్మ్యములచేత భూషితం♦బగుచు నబ్ద
సంయుతాకాశమట్లు ప్ర♦శస్తిఁ గాంచె;
నట్లు సుగ్రీవహితకరుఁ♦డై రఘూద్వ
హుని సుకార్యము గావించు ♦ నూహ చెలఁగ. ౭౪ 275

[1]క. తనుకాంతి పెంపుమీఱఁగ, ననిలజుఁ డప్పురిఁ దిరుగుచు ♦ నతిచిత్రములై
తనరెడు సుమమాలలఁ జక్కనివిధమున నొప్పులంకఁ ♦ గని హర్షించెన్. ౮

క. వరుసఁగఁ బ్రతిగేహంబుల, కరుగుచు నందందు బహువి♦ధాకారములం
బరఁగుగృహంబులఁ గాంచెను; మరుత్సుతుండందుమించు♦మదమునఁ బ్రమదల్.

[2]సీ. ఉరముకంఠమ్మును ♦ శిరసునాఁబడు మూఁడుస్థానంబులం దగ ♦ జననమొంది
నట్టి మంద్రంబు మ♦ధ్యము తారము లనుస్వరంబులతోఁగూడి ♦ రంజిలునటు
సురలోకమందు న♦చ్చరలట్లు లతిమనోహరముగఁ బాడంగ ♦ నట్టిగాన
మును వీనులారంగ ♦ వినుచు నవ్వలఁ బోయి; ధనవంతులైనట్టి ♦ దనుజవరుల
గృహములందుఁ జరించు♦నింతులకాంచీరవంబుల, నూపుర♦ధ్వనుల, వారు
తే. హర్మ్యసోపానములమీఁద ♦ నలరుచుఁ దగ, సంచరింప జనించెడి♦స్వర్ణనూపు
రాదిరావంబుల, భుజంబు ♦ లప్పళింపఁ,గల్గు నినదంబులను సింహ♦గర్జనముల.

క. వినియెన్; మఱియును జపముల,నొనరుచుతఱి వారుపలుకు♦నురుమంత్రములన్
దనుజగృహంబుల వినియెన్, హనుమ మఱియు వేదపఠన♦మందు నిరతులై.

---

1 తాం చిత్రమాల్యాభరణామ్-అనిమూలము. 2 శుశ్రావ మధురం గీతం త్రిస్థానస్వరభూషితమ్-అనిమూలము. దీని వ్యాఖ్యాభిప్రాయ మిటఁ జేర్చి వ్రాయఁబడినదని యెఱుంగునది.

క. ఘనముగ నఱచెడు నసురుల, దనుజేంద్రుని బొగడుచున్న ♦ దానవులను గాం
చెను; మఱియు రాజమార్గం,బున నిండుగ నిల్చియున్న♦భూరిబలములన్. ౧౩

[1]ఆ. వానినడుమఁ దిరుగు ♦ దానవనాయకు
ననుచరులను గాంచె; ♦ యాగదీక్షి
తులను జడలఁ దాల్చి ♦ వెలయువారిని బోడి
తలలవారిఁ గాంచెఁ ♦ దత్పురమున. ౧౪ 281

సీ. గోచర్మవసనుల ♦ గుడ్డయె లేకున్నవారలఁ, గీడులఁ ♦ బాయఁజేయ
నాయుధాకృతినున్న ♦ యాదర్భముష్టులు గలవారలను, శత్రు♦గణముఁ జంపి
జయము చేకొనుటకు ♦ సాధనంబుగ నగ్నికుండంబులన్ వేల్చు♦చుండువారిఁ;
గూటముద్గరములఁ ♦ గొనియున్నవారిని, దండాయుధంబులఁ ♦ దాల్చువారి
తే. నేకనయనుల మఱియును ♦ నేకకర్ణు
లను గరాళాంగులను, గతు♦లను, బయోధ
రములు వ్రేలాడుచుండువా♦రలను, వక్ర
వక్త్రవిషమాంగులను గాంచె ♦ వామనులను. ౧౫ 282

క. ధనువుల ఖడ్గంబులఁ దా,ల్చినవారి శతఘ్నికలను ♦ జేఁబూనినవా
రిని ముసలంబులఁ బరిఘము,లను దాల్చినవారల నని♦లజుఁ డటఁ గాంచెన్.

తే. చిత్రకవచంబులను దాల్చి♦చెలఁగువారి, బలువు మిక్కిలి లేనివా♦రలనుమిగులఁ
జిక్కకున్నట్టివారల ♦ మిక్కిలి పొడ,వుగను నుండనివారల♦ను గనె నతఁడు.

[2]సీ. మిగుల హ్రస్వాంగులై ♦ తగకున్నవారల, నాతిగౌరాంగుల ♦ నాతికృష్ణ
తనువుల, నెక్కువ♦గను గూను లేనట్టివారి, విరూపుల ♦ బహువిధాకృ
తుల, వామనుల, సురూ♦పుల, మంచివర్చస్సుగలవారి, ధ్వజములఁ♦గ్రాలువార
లను, బతాకంబులఁ ♦ గొనియున్నవారిని, బహువిధాయుధములఁ♦బట్టియున్న
తే. వారిఁ గనుఁగొనె; శక్తుల ♦ భూరుహములఁ
బట్టినక్షేపణుల మఱి♦పాశములను
నశనులను బట్టుకొనియుండు ♦ నసురవరులఁ
గాంచె నందందు నాకపి♦కాంతుఁ డెలమి. ౨౦ 285

క. సుమహారముల సుచందన, సుమహితబహుభూషణముల ♦ సురుచిరతరవే
షములం గ్రాలెడువారలఁ, దమకిష్టం బైనయట్లు ♦ దగువారి నటన్. ౨౧ 286

ఆ. నిశితశూలధరుల ♦ నెఱి వజ్రములఁ దాల్చి,యలరువారి, భూరి♦బలుల, నచటఁ
గాంచె; నంత దనుజ♦కాంతునియాజ్ఞ న,వ్యగ్రు లగుచుఁ బ త్తి♦నాంతరమున.

---

1 దీక్షితాన్ జటిలాన్ ముండాన్ గోజినాంబరవాససః - అనిమూలము. 2 లోపల వామను లను జెప్పి మరల నీపద్యమునఁ జెప్పుట మూలానుసారమేయని యెఱుంగునది.

క. మెలఁకువఁ గాపాడుచు నుజ్జ్వలభంగిం దనరు మూల♦బలభటవరులన్
గలయంగ నియుతసంఖ్యను, నల రెడువారలను గాంచె♦ననిలజుఁ డొకటన్.

క. కనకాంచితమగు తోరణ,మునుగల రావణునిగేహ♦మును గనె నది య
ప్పనుపర్వతమునఁ గూటం, బున స్థాపితమై చెలంగుఁ ♦ బొలుపగుఖ్యాతిన్.

క. తెల్లనిసరసీజంబుల, నుల్లసిలుచునున్న పరిఘ ♦ యొప్పుఁగఁ గనకో
త్ప్రోల్లలితప్రాకారం, బెల్లరుచుల నొప్పు మిగుల ♦ నెనఁగు నసనుమై. ౨౫ 290

క. నిలయుంబది సురలోకము, వలె దివ్యంబగుచు నార♦వంబుల దివ్యం
బులవెలసి వాజిహేషలు, గలిగి మనోజ్ఞాభరణని♦కాయధ్వనులన్. ౨౬ 291

క. నిరతము చెలఁగుచు యానో, త్కరముల వరదముల దివ్య♦కనకవిమానా
శిరహిం దగు హయగజముల, వరదంతచతుష్కలసిత♦వారణములచేన్. ౨౭

తే. పరఁగుచుండును; బలిసిన♦పక్షిమృగవి
తతులచే నొప్పుచుండును ♦ ద్వారమందు
మహితమైయుండు, దానిని ♦ నహము నిశయు
వీర్యవంతులు రాక్షస♦వీరులెల్ల. ౨౮ 293

[1]తే. ఏప్రమాదము నొందక ♦ యేపుమీఱఁ
గాచుచుందురు మఱియును ♦ గమ్రకనక
మునను జంబూనదీస్థలి ♦ జననమొందు
స్వర్ణమున భూషితంబగు ♦ సాలవితతి. ౨౯ 294

క. అరుదుగఁ దనరారఁగ నుం,దరముక్తామణివిభూషి♦తంబయి కాలా
గరుచందనవరములచే, నిరతము దగుదానిఁ జొచ్చె ♦ నెమ్మి హనుమయున్.

నాల్గవ సర్గము సంపూర్ణము.

## ౫ - వ సర్గము.

—హనుమంతుఁడు వెన్నెలలో సీతవెదకి కానక దుఃఖించుట.—

మ. మతిమంతుండగు నాంజనేయుఁడు నభో♦మధ్యస్థలిన్ మెండుగా
ద్యుతిసంఘంబుల నట్టె చల్లుచు మహో♦ద్యోగంబునం బొల్చుచున్
గతిచెల్వొప్పఁగ నాలనుంద మదముం ♦ గ్రాలంగఁ జెల్గాడు ను
ద్ధతమగా శ్వేతవృషంబురీతి శశినిం ♦ దా భాసమానుం గనెన్. ౧ 296

ఉ. శీతకరంబులం బ్రజలఁ ♦ జెందినదుఃఖముఁ దూలఁగొట్టుచున్
భీతిదమౌ సముద్రమును ♦ విష్ణుపదంబును దాఁకునట్లుగా

1 స హేమజాంబూనదచక్రవాళమ్-అనియూ. హేమ, అన్యత్రం జాతం సువర్ణమ్-జాంబూనదమ్, జంబూనద్యాం జాతమ్-అనివ్యాఖ్య.

ఖ్యాతిని బొంగఁజేయుచు, స్వ♦కాంతిని నెల్లెడ విస్తరిల్లునా
భూతములం బ్రకాశమును ♦ బొందఁగఁ జేయుచుఁ జంద్రుఁడంతటన్. ౨

[1]చ. హనుమకుఁ గానవయ్యె; భువి♦యందును మందరపర్వతంబునన్
దనరునొ యే ప్రభాతతి, ని♦తాంతము సద్ధిఁ బ్రదోషమందు నే
ఘనరుచియుండునో, జలజ♦కాండమునన్ సలిలంబులందుఁ జ
క్కనిరుచియెద్దియుండునొ ని♦కామము తద్ధృతిచి పొందెఁ జంద్రుఁడన్. ౩ 298

సీ. వెండిపంజరమున ♦ విలసిల్లు హంసయ ట్లురుతరమందర♦ధర్మగుహఁ జెలు
వారు సింహమురీతి, ♦ నతిచు త్తగజముపైఁ బొలుపారు వీరుని♦పోల్కి, నాక
సంబున విలసిల్లెఁ ♦ జంద్రుఁ డెంతయు; వాఁడిశృంగముల్ గల్గిన♦వృషభమట్టు
లున్నతశృంగంబు ♦ లొప్పు మహాగిరివలెను, దస్తసువర్ణ♦బద్ధశృంగ

తే. విలసితంబగు మదకరి♦విధిఁ బ్రపూర్ణ
శృంగములఁ దేజరిల్లెను ♦ శీతరశ్మి
యంబరమున; వినష్టశీ♦తాంబుతుహిన
పంకుఁడై గురుముఖులఁ బ్ర♦భావితతిని. ౪ 299

ఉ. ఎంతయుఁ గప్పియొప్పు గుది♦యించుటనే మలినంబు లేకయే
వింతగఁ జెన్నుమీఱి, సిత♦విద్యుదుదారసమృద్ధిచేత నే
యెంతయు నిర్మలాంకుఁడయి ♦ యేపున నభ్రమునన్ శశాంకుఁడా
వంతయుఁ గందులేనియటు ♦ లత్తఱిఁ బొల్చెఁ గనంగ నొప్పుచున్. ౬ 300

[2]చ. హరివరమొందు ప్రస్తురత♦లాంతరమొంది వెలుంగునట్లు, కుం
జరము మహారణంబున వి♦శాలరుచిన్ వెలుగొందునట్లు, భూ
వరుఁ డొగి రాజ్యముం గొనుచు ♦ భాసిలుభంగి, నిశాకరుండు న
త్తరుణమునన్ వెలింగె సము♦దారమరీచుల నిండువేడుకన్. ౭ 301

[3]సీ. శశధరుం డుదయించి ♦ చక్కఁగ వెల్గుటఁ జీఁకటుల్ నలుదట్లఁ♦జెదరిపోవ
దనుజపిశాచసం♦తతులు మాంసమ్ముల భక్షించుచుం దగఁ ♦ బరిఢవిల్ల
సంజాతదోషమై ♦ చక్కనివెన్నెల వచ్చుటచేతను ♦ బ్రాణవిభులు
కామినుల్ ప్రీతిచేఁ ♦ గలియంగ నంతకు మును వారిమనసులఁ♦గనఁబడి తగు

తే. ప్రణయకలహాదిదోషముల్ ♦ పాయవెలసి,
స్వర్గమట్లుగ మోదసం♦జనక మగుచు

---

1 యా భాతి లక్ష్మీ ర్భువి మందరస్థా తథా ప్రదోషేషు చ సాగరస్థా, తథైవ తోయేషు చ పుష్కరస్థా బభ్రాజ సా చారు నిశాకరస్థా-అనియూ. 2 శిలాతలం ప్రాప్య యథా మృగేంద్రో మహారణం ప్రాప్య యథా గజేంద్రః, రాజ్యం సమాసాద్య యథా నరేంద్ర స్తథా ప్రకాశో విరరాజ చంద్రః. అనియూ. 3 ఈపద్యము శ్లోకవ్యాఖ్యాభిప్రాయమును జేర్చి వ్రాయఁబడినదని యెఱుంగునది.

నటఁ బ్రదోషము మెల్లగ ♦ నంతరించె;
నంత వీణాదితంత్రిర♦వాళి మిగుల. ౮ 302

క. శ్రుతిమోదావహమై తగెఁ; బతులం దమిఁగూడి సాధు♦వర్తనమున ను
న్నతిఁ గాంచినసతులెల్లను, మతిసుఖముల శయ్యఁ గనిరి ♦ మంజులరీతిన్. ౮౫

క. భూతాదికరాత్రిచర, వ్రాతము రౌద్రాద్భుతాక♦రములగు కృత్యం
బాతతిఁ జేయుచుఁ గ్రీడల, నాతతముగ సల్పసాగె ♦ ననువొందంగన్. ౯

చ. పురమున నందుఁ జాగుతర♦బుద్ధిఁ జెలంగినవాయుసూనుఁ డ
త్తరుణమునన్ సురన్ మిగులఁ ♦ ద్రావుచు విస్మృతిఁ గన్నవారి, నా
దరుసను [1]జేయుచున్నదని ♦ పద్ధతి మాని ప్రమాదమొందుచున్
గరము చరించువారలను ♦ గాంచె గృహంబులలోన నెంతయున్. ౯౫ 305

క. జనవితతి నిండఁగా స్యం, దనములు భద్రద్విపేంద్ర♦తతులు హయము లా
సనములు నిండన్ వెలయఁగ, ఘనవీరశ్రీవిలాస♦కలితము లగుచున్. ౧౦

క. తనరారుగృహంబులఁ గాం,చెను బావని; మఱియు స్వేచ్ఛ♦చే నొండొరులం
గని పరిహాసము లాడెడు, జనులను గర్వోక్తు లాడు♦జనులను మిగులన్. ౧౦౫

సీ. బలిసినగురుబాహా♦వులను నొండొరులపై వైచుచు మదమున ♦ భయదరీతి
నితరేతరంబు న♦హీనరవంబుల బెదరించుచును దమ♦వితతపక్ష
ములను విఱుచుచు, ని♦మ్ముల నవయవములఁ, జెంతనేయున్నట్టి♦స్త్రీలపైన
వైచుచు, నతిచిత్ర♦భంగిని రూపముల్ గైకొనుచును, దృఢ♦కార్ముకములఁ

తే. బట్టుచున్ సంచరించెడి♦వారిఁ గాంచె;
నందుఁ గొందఱు సుందరు ♦ లంగరాగ
ములను మేనుల నలఁదుచు ♦ మెలఁగుచుండి
రింకఁ గొందఱు పూఁబోడు ♦ లెలమి మిగుల. ౧౨౫ 308

క. నిదురంబొందుచు నుండిరి, మదవతు లొకకొంద ఱందు ♦ మానితముఖనం
పదలొప్ప నవ్వుచుండిరి, సుదతులు కొందఱు నమర్ష♦నుక్తిం బలుకుచున్.

తే. పుచ్చుచుండిరి నిట్టూర్పు ♦ లిచ్చవచ్చి
నట్లు; గర్జించుమదకరు♦లలర, మిగులఁ
బూజితులుగాఁగ నొప్పెడు♦బుధులు వెలయ
నగర మయ్యది యత్తఱిఁ ♦ బొగడ నగుచు. ౧౩౫ 310

[2]క. ప్రతివీరులు వొంక రిఁకే, గతియని యూర్పులనుబుచ్చు ♦ గాఢబలమదో

---

1 మత్తప్రమత్తాని సమాకులాని-అనిమూ. ప్రమత్తాః=ప్రస్తుతకార్యవిస్మారిణః-అనివ్యాఖ్య.
2 రరాజ వీరైశ్చ వినిశ్వసద్భిః హ్రాదో భుజంగైరివ నిశ్వసద్భిః-అనిమూ. వినిశ్వసద్భిః యుద్ధ
యోగ్యవీరాలాభాత్-అనివ్యాఖ్య.

ద్ధతులఁగువీరులు వెలయఁగ, క్షితిఁ గెడుఫణివితతులఁ ♦ జెందుమడుగునాఁ.

క. అలరారె; బుద్ధివిభవం,బుల నెసఁగుచు సరసవచన♦ములఁ బాండితియుం
జెలఁగ మహాస్త్రీకులై, జగ,ముల ముఖ్యలునగుచు, వివిధ♦ములగుతనువులన్.

క. తనరారుచు రుచిరాఖ్యలఁ, గనుచుఁ బెనఁగైన దనుజ♦కాంతల నచటం
గనియెం బావని; మఱియును, మనోహరాకృతుల సుగుణ♦మండితులఁ దగన్.

తే. గుణములకు సాటియైనట్లు ♦ గోమువమిగులు
చున్నవ్యవహారములఁ జేయు♦చున్న దనుజ
వధులఁ గొండఱఁ గని యంతఁ ♦ బ్రమదమందె
మఱియుఁ గొండఱ నటఁ బవ♦మానసుతుఁడు. ౧౫ 314

క. తనతుల్యగుణంబులచే, ఘనులై వికృతాకృతులను ♦ గల్గినవారిన్
దనుజులఁగాంచెను; మఱియున్,హనుమయునొకచోట లంక♦యందారాత్రిన్.

చ. సురుచిరభూషణాదులను ♦ సొంపుగఁ దాల్చఁగ నర్హమైన సుం
దరతనువుల్ చెలంగఁ, దను♦నాథులయందు విశుద్ధభావముల్
పరఁగఁ బతివ్రతాత్వమున ♦ భాసిలి పానములందు నాథులం
దురుతరచిత్తముల్ దగుల ♦ నుజ్జ్వలరూపములం జెలంగి యం
బరమునఁ జుక్కలట్లు దగు ♦ వారిజనేత్రలఁ జూచె నాదృతిన్. ౧౭ 316

సీ. సౌందర్యలక్ష్మిం బ్ర♦శస్తిని వహియించి యర్ధరాత్రమున నా♦యకులదృఢత
మాశ్లేషములఁ జిక్కి ♦ యంత లజ్జంగాంచి ప్రమదాబ్ధిమగ్నలై ♦ ప్రసవవితతి
దాఁగినయట్టి ప♦తంగాంగనలవలెఁ జెలువారు దనుజకాం♦తలను జూచెఁ
గొందఱ; మఱియును♦గోరికహర్మ్యంబులందుఁ బ్రియాంకంబు♦లందు సుఖము

తే. గాఁగఁ గూర్చుండి యున్నరా♦క్షసవనితలఁ
గనియె; మఱియును బెండ్లియై ♦ ఘనపతివ్ర
తా సుధర్మముఁ దప్పక ♦ దర్పకశర
విద్ధలై భర్తలందేల్చు ♦ వెలఁదులఁ గనె. ౧౮ 317

క. స్మరకేళీవశత దిగం,బరలై తపనీయరాజి♦వర్ణంబుల నొ
ప్పరమణులం గొందఱఁ గనె, మరుత్తనూజుండు హర్మ్య♦మండనమందున్.

క. కనకరుచిం జెలువారెడు, తనువులఁ దగు సద్వ్రతలను ♦ దరుణుల నచ్చోఁ
గనుఁగొనియె, మనోహరమగు, తనుకాంతిఁ జెలంగి ప్రియులు♦తమ్మెడఁ బాయన్.

క. కలగుందుపడుచుఁ జంద్రుని, వలెఁ దెల్లనిచాయనొప్పు ♦ వరవారిజనే
త్రలఁ గాంచెఁ గొందఱను; నిమ్ములఁ గపివీరుండు సౌధ♦మున నొకచోటన్.

క. స్మరకేళిఁ దేలునాశలఁ, ద్వరఁగాఁ దమప్రియులసన్ని♦ధానమునకు నే
గి రహిన్ రతిఁదేలి మనో,హరరూపముఁ బ్రమదమొప్పు ♦ నభిసారికలన్.

క. కని మఱియు గృహములందున్, మనోజనిభు విభునిఁ గూడి♦స్మరకేళిసుఖం

చిన సుందరనారీమణు,లను గాంచెం గపివరుండు ♦ లంకాపురిలోన్. ౨౧ 322

క. దనుజాంగన యిదియనియును, మనుజాంగన యిద్దియనియు ♦ మదివేర్వేఱన్
గనుటకుఁ జందురు తేజం,బును బోలెడు నంగనాస్య♦ములుఁ దగురీతిన్. ౨౦।

ఆ. వక్రములగు నేత్ర♦పక్ష్మములను గాంచి, తనకు రఘువరుండు ♦ తరుణిసొమ్ము
లవగు గుఱుతులెల్ల ♦ నరసి తెల్పుట నవ్వి,గానవచ్చునేమొ ♦ కనెద ననుచు.

ఆ. మెఱపుగుంపులవలె ♦ మెఱయుచుండెడివారి
యాభరణములను మ♦హాత్ముఁ డతఁడు
కనియె; నిట్టులెంత♦గా వెదకిననైన
సుందరాంగమునను ♦ సొబగుమీఱి. ౨౨ 325

చ. ఘనతరవంశమందు జని ♦ గాంచి మనోజ్ఞలతావిధంబునం
గననగు చారుదేహమునఁ ♦ గ్రాలి యయోనిజయై చెలంగు భూ
తనయను సీతమాత్ర మటఁ ♦ దత్కపివర్యుఁడు గానఁడయ్యె; న
య్యనిలజుఁ డిట్లు శాశ్వతమ♦హత్తరధర్మపథప్రవిష్టయై. ౨౩ 326

చంపకమాలిక:—

తనవిభునిం దలంచుచును ♦ దర్పకమోహమునం గృశించి, రా
మునిఁ గనఁగోరి భర్తృమన♦ముల్ గడునంపద కాలయంబుగాఁ
దనరెడుదానిఁ బొంది, వని♦తామణులందును మేలుబంతియై
ఘనతవహించి; తాపమునఁ ♦ గందుచు, మున్ను రఘుప్రవీరుప్ర
క్కన నలరారునప్డు మణి♦కాంతుల నెంతయు సొంపుమీఱు నా
ఘనపదకంబుమించు తన♦కంఠమునందిపు డాత్మనాథుఁ బా
సినదయి దాన నుష్ణతిలి ♦ చిమ్మెడు నేత్రజలంబు సాంద్రమై
యనయము గన్పడన్, మిగుల ♦ నందముగాఁ గనుఱెప్పలొప్పఁ, జ
క్కనిగళనాదముల్ వెలయఁ♦గా, వని నృత్యముచేయు కేకిరీ
తిని జెలువారి; చక్కనిద్యు♦తిం జెలువొందని చంద్రరేఖనాఁ
దనుకళమాయఁ జిక్కి నత♦తంబును, బంకవిలీనమైన యా
కనకపురేఖలాగున ని♦కామము మాసినయంగమొప్పఁ, జ
క్కనిశరరేఖ గాయమున ♦ గాఢరయంబున నాటియున్నరీ
తిని, మది వేదనం జవికి ♦ తీవ్రతరంబగు దుఃఖభారముం
గని పవనప్రభిన్నమయి ♦ కన్పడు మేఘమురీతిఁ, జంచలా
త్మను గని వాగ్విశారదుఁడు ♦ మానవనాథుఁడునై చెలంగు రా
మునిహృదయంబున న్నిలిపి ♦ మోమును వెల్వెలఁబాఱనున్న సీ
తను వట నెంతకాలము ని♦తాంతము పూన్కిని జూచినం గనుం

గోనెడునదృష్టముం గనక ♦ కోరిక డిందఁగ దుఃఖ మొంది మం
దునివలె నేమియుఁ దుదికిఁ ♦ దోఁచమి మ్రాన్పడియుండె నాతఁడున్. ౨౭

ఐదవ సర్గము సంపూర్ణము.

---

## ౬-వ సర్గము.

హనుమ రావణుఁడున్న సౌధమును బరీక్షించుట.

తే. ఇట్టులతఁడు విమానాళి ♦ నెల్లవెదకి, సీతఁ గానక కుమవఁగ ♦ జెంది కామ
రూపియై లంకయందున ♦ నేపుమీఱఁ, దిరుగసాగెను సీతకై ♦ మరల వేగ.

క. తరణిరుచివెల్గుచక్కని, పరణము లంతటను గల్గ ♦ భాసిలు దనుజే
శ్వరుసౌధమునకు ధైర్య,స్ఫురణంబున మెఱయునతఁడు ♦ పోయె వెదకఁగన్.

క. హరిరక్షితమై తగుపెను,వరణ్యమటు భయదరాక్ష ♦ సావళి గాపా
డ రహిం దగు నాథవనము,హరికుంజరుఁ డొకటఁగాంచి ♦ యలరెన్ మదిలోన్.

తే. సౌధ మయ్యది రౌప్యముల్ ♦ స్వర్ణభూషి
తములు చిత్రములగు బహి ♦ ర్ద్వారములను
జిత్రకక్ష్యల మఱియు రు ♦ చిరములైన
ద్వారముల నొప్పుచుండె నెం ♦ తయును గాంతి. ౪ 331

క. ద్విరదముల నెక్కి యంతటఁ, దిరుగుచుఁ బ్రముఖులగు భూప ♦ తిప్రియబంధుల్
నిరతము హెచ్చరికల సుం,దరమందిరరక్షణమునఁ ♦ దత్పరులగుచున్. ౫ 332

క. వెలయుచునుండిరి, మఱియం, దలరెడుగూరులొగి నరుల ♦ నణఁతురు కష్టం
బులనొందకయుందలిహయ,ము లవధ్యములునురథార్హ ♦ ములునయిమిగులన్.

తే. తనరుచుండును; సుమహిత ♦ దంతరజత
కనకనిర్మితములయి వ్యా ♦ ఘ్రగజవైరి
చర్మములనైన కవచముల్ ♦ చాల వెలయఁ
జిత్రరథములు ధ్వనులొప్పఁ ♦ జెలఁగు నందు. ౬ 334

చ. సురుచిరమందిరం బదియు ♦ సుందరరత్నమయంబు భాసురా
స్తరణసమన్వితంబు వివి ♦ ధస్ఫుటరత్నమహారథోత్కరం
బురుతరభద్రపీఠనివ ♦ హోజ్జ్వల, మున్నతపాత్రరాజిసుం
దరమును నొచుఁ జూడఁదగి ♦ తద్దయు రమ్యమునయ్యె నయ్యెడన్. ౭ 335

సీ. ఎంతయు గొప్పలై ♦ యింపుగాఁ జూడఁగఁ దగియున్నమృగపక్షి ♦ తతులు పెక్కు
వేలు భాసిలుచుండె ♦ విమలరావంబుల, మందిరంబయ్యది ♦ మఱియు నాయు
ధాదిశిక్షలయందు ♦ నాఱితేఱిన బాహ్యపాలకరక్షక ♦ భటులచేత
సంరక్షితంబయి ♦ సౌందర్యమునఁ గ్రాలు కాంతామణులచేతఁ ♦ గలయమెఱయు

తే. చుండె; సంతోషముల నెప్పు♦డొప్పువనిత
లంతటను నిండియుండి రం ♦ దసురవరుల
మందిరంబులు లోపల ♦ సుందరముగ
నలరుచుండెను జూడనై ♦ వెలసె నదియు. ౯ 336

క. సరిదధిపతిఘోషమువలెఁ, జరించు స్త్రీపురుషులవగు ♦ చంచన్మృదులా
భరణస్వనములు మ్రోగుచు, నరుదుగ వినవొచునుండె ♦ నాభవనమునన్.

చ. అనిశము రాజలక్షణము♦లై తగు ఛత్రగణాదులొప్పఁ జం
దనమృదులాగరుస్ఫుటని♦తాంతసువాసన లుల్లసిల్ల సిం
హనివహయుక్తమై యలరు♦నట్టి మహావనమట్టు లొప్పుచున్
ఘనతరభేరికాదిరవ♦కమ్రమునై తనరారు నెంతయున్. ౧౧ 338

తే. శంఖవీణాదివాద్యని♦స్వనము లొప్ప
సంతతము పూజితంబయి ♦ చక్కఁగ నది
పర్వహోమంబులను బోల్చి ♦ సర్వకాల
మసురకృతపూజనంబుల ♦ నమరుచుండు. ౧౨ 339

చ. హనుమయు నిట్లు రాక్షసగ♦ణార్చితమై జలరాశిభంగి ని
స్వనములఁ బోల్చి నిమ్నమయి ♦ భాసురరత్నపరిచ్ఛదంబునై
ఘనమణిసంఘజుష్టమయి ♦ క్రాలు మహామతియైన దానవే
శునివరమందిరంబుఁ గడు♦సూరతఁ గాంచె మనంబు పొంగఁగన్. ౧౩ 340

క. కరిహయరథసంఘంబులఁ, బరఁగుచుఁ బెనురుచుల మిగుల ♦ భాసిలు దనుజే
శ్వరుగృహముఁ గాంచి లంకా,భరణం బిదియేయటంచుఁ ♦ బావనితలఁచెన్.

చ. మనమున నిట్టులెంచి పవ♦మానతనూజుఁడు తద్గృహాంతికం
బున ధరణీసుతన్ వెదకఁ♦బూని చరించె; సురారిగేహముల్
గనుచును బూలతోఁటలను ♦ గాంతగృహంబుల నిర్భయంబుగాఁ
గనుఁగొనసాగె నొక్కమొగిఁ ♦ గా నతివేగమ సూరుఁ డంతటన్. ౧౬ 342

సీసమాలిక:—

దనుజగేహంబులఁ♦దాఁ జూడఁగాఁ బూనుకొని ప్రహస్తునిగేహ♦మునకుఁ బోయి
యటనుండి కదలి మ♦హాపార్శ్వనింటికి దాఁటె; నంతట జల♦దప్రకాశ
మగు కుంభకర్ణగే♦హంబు విభీషణుభవనంబునుం గని ♦ వానరకుల
తిలకుఁ; డవ్వల వేగ ♦ మలర మహోదరునిల్లు, విరూపాక్షు♦నిల్లు వెదకి
యంత విద్యుజ్జిహ్వు♦నాలయంబును, దరువాత విద్యున్మాలి♦భవన మట్లె
వజ్రదంష్ట్రునిదివ్య♦భవనంబు; నమ్మహాతేజుఁడు శుకునిమం♦దిరము, మఱియు
సారణుగేహంబు ♦ సత్వరంబుగ నింద్రజిత్తుమందిరమును; ♦ జెలఁగి జంబు
మాలిసుమాలుల ♦ మంధిరంబులు, రశ్మికేతునిదా దివ్య♦గేహ మవల

సూర్యశత్రుని లస♦చ్ఛుభతమభవనంబు; వజ్రకాయుని వేశ్మ♦వరము నల్లె
హరివరుం డొగిని ధూ♦మ్రాక్షసంపాతులయావాసములను, భ♦యంకరుఁడగు
నట్టివిద్యుద్రూపు ♦ నభిగాము వేశ్మము ఘన,విఘనులని కే♦తనవరముల
శుకనాస, వజ్రుల ♦ శక, వికట, బ్రహ్మకర్ణ, రోమశ, దంష్ట్రి♦ఘనగృహముల;
మఱియు యుద్ధోన్మత్త♦మత్త, ధ్వజగ్రీవ, నాదులగృహముల ♦ ననిలపుత్త్రుఁ
డంతవిద్యుజ్జిహ్వ ♦ లను నామములుగల పెక్కండ్రగృహముల ♦ నుక్కుమీఱ
నింద్రజిహ్వునిదగు♦నిల్లును, హస్తిముఖునినివాసము, గరా♦ళునిగృహంబు
శోణితాక్షుని, పిశా♦చునిగేహముల నొగిఁ బరికించి పరికించి ♦ పవనతనయుఁ

తే. డతులకీర్తియుతుండు మ♦హార్హములగు
నయ్యయిగృహంబులను వైభ♦వాదు లొప్పఁ
బరఁగు నారాక్షసుల, వారి♦పరమసంప
దలను గాంచెను హనుమంతుఁ ♦ డలరి యలరి. ౨౭ 343

క. దనుజులగేహంబుల నెల్లను గలయందిరిగి వెదకె ♦ లలనామణి సీ
తను గాన కవల రావణుని నివాసముఁ జేరఁబోయె ♦ నియతిపవిత్రుఁడున్. ౨౮

[1]చ. సిరి యలరార నాస్థనగ♦సింహుఁడు నల్గడలం జరించుచున్
సురరిపునాయకుం డగుచు ♦ శోభిలు రావణుచెంత నస్త్రము
ద్గరములు శూలశక్తులును ♦ దారుణతోమరముల్ ధరించి భీ
కరముగ నాథుచంక్రమున ♦ గాఢసుషుప్తిని బొందియున్న య
త్తరుణులఁ గొందఱిం గనియె ♦ దారుణనేత్రులఁ గుత్సితాంగలన్. ౨౯ 345

క. దనుజనిగృహరక్షకులై, ఘనబలముల నొప్పు భటులఁ ♦ గనియె; భయదసా
ధనములఁ బెక్కింటిని దాల్చిన దీర్ఘాంగులను దనుజ♦సింహుల మఱియున్.

[2]చ. అరుణములై సితంబులగు♦నట్టి వరాంగము లొప్పఁగా జవ
స్ఫురణము పొల్పుమీఱ నట ♦ శోభిలుగుఱ్ఱములన్; సుజాతియుం
గరమరుదైనరూపమును ♦ గ్రాలఁగఁ జక్కఁగ శిక్షితంబులై
దురమునఁ బాకహృద్గజము♦తోడ నమానము నొంది శత్రురా
ట్కరులనడంచు నేనుఁగులఁ ♦ గాంచె మహాకపిశేఖరుం డొగిన్. ౩౧ 347

తే. పరబలంబులఁ జెండాడు♦పటుత నలరి
దానధారలు గురియు ను♦ద్దామవృష్టి
కరజలదములరీతి ని♦ర్ఝరయుతాద్రి
వలె ధ్వనించుచు నవి శత్రు♦భయదములగు. ౩౨ 348

---

1 శూలముద్గరహస్తాశ్చ శక్తితోమరధారిణీః-అనిమూలము. 2 కులీనాన్ రూపసంపన్నాన్-అనిమూలము.

మ. వరజాంబూనదహేమభూషణములన్ ♦ భాసిల్లి మధ్యాహ్నభా
 స్కరుచండంబునఁ బోల్చి వేలకొలఁదిన్ ♦ గణ్యంబునౌ సైన్యమున్
 హరిపంచాస్యుఁడు రావణానుజుని గే♦హంబందుఁ జూచెన్; గృహాం
 తరమందున్ జతురంతయానముల ను♦ద్యద్భూరిరూపంబులన్. ౩౫ 351

క. అతిచిత్రలతాగృహముల, నతిశయకల్పనల మీఱు♦నట్లుగఁ దగి న
 మ్మతములునగు చిత్రగృహ,ప్రతతులఁ గ్రీడాగృహములఁ ♦ బావని గాంచెన్.

క. దారుమయంబులుగాఁ దగి, చారుతరంబులగు కేళి♦శైలంబులనున్
 మారక్రీడాగృహముల, మారుతి పొడఁగాంచెఁ దనదు♦మానస మలరన్. ౩౬

తే. పగటిపూట వినోదింపఁ ♦ దగినచోటు
 లను, మహాదానవుని గృహం♦బునను జూచె;
 నంత మందరపర్వత ♦ మనఁగనొప్పు
 దివ్యసౌధంబుఁ గనియె న♦దియును మెఱయు. ౩౭ 352

చ. నలుఁగడలన్ ధ్వజంబులను ♦ నవ్యచిరత్నమణివ్రజంబులన్
 వెలయు నిధివ్రజంబులను ♦ వేడుకఁ బెంచిన బర్హిసంచయం
 బులకగు సన్నివేశముల ♦ బుద్ధివిరాజితు లెంతొ నేర్పుతో
 నిలిపినశిల్పజాలముల ♦ నెమ్మిని గొల్పుచు భూతనాథుని
 స్థలమగు వెండికొండవలెఁ ♦ దద్దయు రాజిలుచుండె నయ్యెడన్. ౩౯ 353

తే. రత్నకాంతుల, దానవ♦రాజతేజ
 మునను వెలయుట, నయ్యది ♦ ఘనకరముల
 మెఱయు భాస్కరుకరణిని ♦ మిగిలె రుచుల;
 నంత హరియూథపతి యాగృ♦హమున నొకటి. ౪౦ 354

క. కనకమయంబులు శయనా,సనముల ముఖ్యమగుపాత్ర♦జాలంబును గ
 న్గొనియెను; మఱియాభవనము, దనుజులు మధ్వాసవములఁ ♦ ద్రాగెడు వేళన్.

సీ. తుంపురుల్ చెదరంగ ♦ సొంపుగఁ దడిసియు, మణిభాజనంబుల♦మండితమయి
 భవ్యమై మఱి యసం♦బాధమై, ధనపతిసౌధమట్లు వెలింగి ♦ సాంద్రనూపు
 రనినాదములఁ జాల ♦ రంజిల్లి, కాంచీరవంబుల నిండి, ని♦నద్వనవిభవము
 గలమృదంగనినాద♦ములఁ దాళరవములఁ బ్రతినాదమలరంగ ♦ భవ్యసౌధ

తే. చయము నిండార, స్త్రీరత్న♦శతము వెలయ
 విపులకక్ష్యాంతరంబుల ♦ విమలరీతిఁ
 దనర వెలుఁగొందుచుండె న♦ద్దానిఁ బవన
 తనయుఁ డప్డు ప్రవేశించెఁ ♦ గనెడువేడ్క. ౪౪ 356

ఆఱవ సర్గము సంపూర్ణము.

## ౮ - వ సర్గము.

### హనుమ పుష్పకవిమానమును గాంచుట.

తే. బలయుతుండైన పావని♦భాసురంబు, లైన వైదూర్యరత్నంబు♦లర్హరీతిఁ
బొదిగియున్న మనోజ్ఞక♦ర్బురమయంబు, లైన జాలకములను వి♦హాంగతతుల.

క. తనరుచు వర్షాకాలం,బున విద్యుత్సహితనుగుచుఁ♦బొలుచు తటిద్భ
తిని బాఱుపక్షినిచయం,బును గల్గినఘనములట్లు♦పొలుచుగృహాళిన్. ౧ 358

క. పరికించె మఱియు నామం,దిరములలో ముఖ్యములయి♦దీపించుభయం
కరఖడ్గచాపశంఖము,ల రహిం బొలుపారి ద్యుతివి♦లాసము మెఱయన్. ౧½

ఆ. బహువిధంబులగుచుఁ♦బరఁగుశాలల మనో,హరములై నికేత♦నాళిపైనఁ
జారుతరములైన♦చంద్రశాలల విశా,లముగ మెఱయువాని♦మమతఁ గాంచె.

చ. అమలమణీమయంబులయి♦యర్హములం చొగి దానవాళి య
య్యమరులు పూజచేయఁ దగి♦యద్భుతశిల్పమహాగమంబు చొ
ప్పమరఁగఁ గట్టియున్నవగు♦టారయ దోషవివర్జితంబులై
యమరవిరోధినాయకబ♦లార్జవసంపదుపార్జితంబులై. ౩ ర61

చ. అలరుగృహంబులం గనియె; ♦నవ్వి ప్రయత్నము సొంపుగుల్క ని
మ్ముల రచియింపఁగాఁబడుట♦మున్నవి యన్నియు విశ్వకర్మచే
విలసితరీతిఁ జేయఁబడి♦విశ్రుతిఁ గాంచినవయ్యు నమ్మయుం
డిల సిటుచేసెనో యనఁగ♦నెల్లవిధంబులఁ గానుపించుచున్. ౩½ 3ŏ2

తే. సకలగుణములఁ బ్రఖ్యాతి♦కమవహించి
యుండె వానిని గాంచె స♦య్యురుబలుండు;
నంత నుచ్ఛ్రితమై మేఘ♦మట్లు వెలసి
కనకమయమయి యందము♦గాఁ జెలంగి. ౪½ 363

క. రావణుబలమున కనుగుణ,మై వఱలుచు సాటిలేని♦దయి గృహరత్నం
బై వన్నెకెక్కుపుష్పక, మావిపులగృహంబునందు♦నాతఁడు చూచెన్. ౫

క. ధరణీతలమందు స్వర్గము, కరణిన్ భాభాసురమయి♦కమ్రమణులచేఁ
బరికీర్ణంబై నానా,తరుసుమసంవ్యాప్తమగుటఁ♦దలపోయంగన్. ౫½ 365

క. ప్రసవరజఃకీర్ణంబై, యసమానముగాఁ జెలంగు♦నద్రికరణిఁ బెం
పెసలారుచుండె నయ్యది;, యసదృశవిద్యుత్ప్రిజుష్ట♦మగు ఘనమువలెన్. ౬

క. తరుణీమణిసంయుతమై, పరమము నర్చితమునగుచు♦స్వర్గమునకుఁగా
వరిగెడు సుకృతాత్ములు సం,బరమున వరహంసవితతి♦భాసురగతిచేన్. ౬½

తే. మోయుచుండఁగ నెక్కి సం♦మోదమలరఁ
బోవునట్టి విమానంబు♦పోల్కి మిగులఁ

గాంతిఁ జెన్నారుచుండెఁ; జో♦క్కంపుమణులు
పొదిగియుండుటచేత నా♦పుష్పకంబు. ౭ 368

క. అరుదుగ బహువిధధాతూ, త్కరచిత్రితభూరిభూమి♦ధరశిఖరమునాఁ
బరఁగుచు గ్రహాళిశియుక్తాం, బరమువలెన్ మిగులరుచుల ♦ భవ్యంబగుచున్.

క. పలువిధములైన వన్నెల, విలసిలి ప్రోగుగఁ జెలంగు♦విపులజలదము
ట్టులు మెఱయుచుండె; నచ్చట, నిల పర్వతరాజితోడ ♦ నెసఁగువిధమునన్.

తే. చిత్రరూపంబునం గడుఁ ♦ జెన్నుచూపు
నట్లు లిఖియింపఁబడియుండె, ♦ నద్రులెల్లఁ
దరుతతిం గూడియున్నచం♦దమున వ్రాయఁ
బడి చెలంగుచునుండె, నా♦పాదపములు. ౮½ 371

క. సుమజాలపూర్ణములుగా, నమరుపఁబడియుండె; మఱియు♦నందు మెఱయునా
సుమములు కేసరపత్రగణమునన్ రాజిల్లువిధము♦నం జేయఁబడెన్. ౯ 372

సీ. మఱియును బుష్పవి♦మానంబునందుఁ జిత్తరువునఁ బాండుర♦ధామములును
సత్పుష్పయుక్తపు♦ష్కరములు, కేసరయుక్తపద్మంబులు ♦ నుత్తమంబు
లగుచిత్రవనములుఁ ♦ దగ లిఖంపంబడియుండె: నిక్కరణి ర♦త్నోరుకాంతు
లుల్లసిల్లుచునుండ ♦ నుజ్జ్వలంబై దివ్యభవనంబులన్ మేలు♦బంతి యగుచు

[1] తే. సురుతరంబయి భవ్యమై ♦ యొప్పి పుష్ప
కాహ్వయంబున నలరుమ♦హావిమాన
మును మహాకపి యచ్చటఁ ♦ గనియె; మఱియు
నందు వైదూర్యరత్నాళి ♦ నంచితముగ. ౧౧ 373

తే. రజతమునఁ బగడంబుల ♦ రహిఁ జెలంగ
విరచితములగుపక్షులు ♦ వివిధరత్న
కృతవిచిత్రభుజంగముల్ ♦ హితసుజాతి
కర్ణములగుశుభాంగంబు ♦ లగుహాయములు. ౧౨ 374

క. అలరింపంబడియుండెను;, విలసనశీలంబులగుచు ♦ వెలసెడునావ
క్షులు చక్కనిమోములు ఱెక్కలుసొగసుగఁదనరఁజూడఁ♦గాఁదగియుండున్.

తే. పక్షములపైని స్వర్ణప్ర♦వాళరచిత
పుష్పములు సుందరంబుగాఁ ♦ బొదలుచుండెఁ
జక్కనివిలాసములను బ♦క్షములఁ గుటిల
ముగను ముడుచుకొనుచునుండు♦టఁ గనుఁగొనఁగ. ౧౨½ 376

క. స్మరునకుఁ బ్రత్యక్షంబుగఁ, గరము సహాయంబు చేయఁ♦గాఁ బూనుచు ని
క్కరణిం జెలువొందినవో, పరమాద్భుతముగ వవంగ ♦ భాసిలుచుండెన్.

---

1 మహాకపి స్తత్ర మహావిమానమ్-అనిమా.

[1]సీ. పద్మాకరంబుల ♦ స్వయముగా నభిషేకమునకుఁ బ్రయత్నించి ♦ వనజరాజి
విహరణం బొనరింప ♦ వేడుక నొందుటఁ బద్మకేసరములు ♦ వపువులందు
వ్యాపింప, సురుచిర♦హస్తంబులం గల్వపత్రంబులం గొని ♦ పరఁగుకరులు,
కరికృతంబగు స్నాన♦కార్యంబునం దగి చారుహస్తంబుల ♦ సరసిజములఁ

తే. దాల్చి వెలసెడురమయుఁ జి♦త్తరువునందు
వ్రాయఁబడియుండె; నీరీతి ♦ భవ్యమైన
శుభకరాచలమట్లుగఁ ♦ జూడనైన
యాగృహంబున నంతట ♦ నరసి యరసి. ౧౭॥ 378

చ. దనుజవరుండుగాని వని♦తానివహంబులుగాని యుండుతా
వును గనలేక యచ్చెరువుఁ ♦ బొంది వసంతమునందు మంచివా
సనలు చెలంగఁ జూచుటకుఁ ♦ జారుతరంబగు కందరాళితోఁ
గనఁబడుచున్నకొండవలెఁ ♦ గ్రాలుగృహంబును గాంచి విస్మయం
బును గనె; నమ్మరుత్సుతుఁడు ♦ పూజితమై తగి సుందరంబునై. ౧౮॥ 379

క. దనుజేంద్రభుజాపాలిత, మును నయి తగులంకఁ జొచ్చి ♦ మునుకొని యేవం
కను వెదకిన సత్పూజ్యను, బెనిమిటిసద్గుణసమృద్ధి ♦ విజితాత్మ నతిన్. ౧౯

క. జనకజను జూడఁజాలక, ఘనతరదుఃఖాబ్ధి మునిఁగె; ♦ గాలికొడుకు నె
మ్మనమునఁ బెక్కుతెఱంగుల, గనుపాయంబులను నెంచి♦కుందనిపూన్కిన్.

చ. అనయము నీతిమార్గమునె ♦ యారసి సూక్ష్మపుదృష్టిధైర్యముం
గొని జతనంబు మీఱఁగ న♦కుంఠితరీతిని నెంతచూచినన్
జనకజఁ జూడనేరమికి ♦ న్వాంతము చంచలతం గనంగఁ జి
[2]క్కనివెతనొందె నాప్లవగ♦కాంతుఁడు రామునికింకరుం డొగిన్. ౨౧ 382

ఏడవ సర్గము సంపూర్ణము.

---

## ౮ - వ సర్గము.

హనుమ విమానముం గాంచి పొగడుట.

చ. వనచరవీరుఁ డాభవన♦వర్యమునందు మణివ్రజంబుచే
తను ఘనవజ్రరాజిని ని♦తాంతము చిత్రితమై, ప్రతప్తమౌ
కనకముచేత నిర్మితిని ♦ గాంచిన కృత్రిమపత్రు లొప్పఁగాఁ
గనదురుకాంతివెల్గెడున♦ఖండవిమానముఁ గాంచె వేడుకన్. ౧ 383

తే. దానినిర్మాణవైఖరి♦మానసమున, నిట్టిదని లెక్కపెట్టఁగ ♦ నెట్టివారి

---

1 నియుజ్యమానా స్తు గజా స్సుహస్తా స్సకేసరా శ్చోత్పలపత్రహస్తాః, బభూవ దేవీచ కృతా సుహస్తా లక్ష్మీ స్తథా పద్మిని పద్మహస్తా-అనియూ. 2 అతిదుగఖితం మనః-అనియూ.

కై నశక్యముగాదు, సా♦మ్యమును జూప, నైన సాధ్యముగాదు బ్ర♦హ్మకునుగాని.

క. దానిని నిర్మించెడుతఱి, మానసమున విశ్వకర్మ ♦ మహితం బగుచున్
జానుగఁ గన్పడునిదియా, మానితమని మెచ్చుకొనియె ♦ మాటలిఁ కేలా. ౧౪

*క. సురపథమునఁ బోవవై సుం,దరముగ నలరారుచుండె ♦ దనుజేశునిమం
దిరమున భూమిని దగులక, యరుదుగ నాకాశమందె ♦ యది యలరారెన్.

క. వనరుహమిత్రునిమార్గం,బును జూపెడిచిహ్నమిద్ది♦యో యనిచెప్పం
గను దగునట్లుగ వెలసెను; వినుతింపందగుచు నదియు ♦ వెలసె ఘనముగన్.

సీ. అందలివస్తువే♦దైనఁ బ్రయత్నంబుచేత శ్రమంపడి ♦ చేయఁబడిన
దే కాని యత్నంబు♦లేక నిర్మితమైన దెద్దియు లే దందు ♦ నెందునైనఁ
గనఁబడుతావులు ♦ కమ్రమహారత్నచిత్రితంబులుగానె ♦ చెలఁగుచుండు
దద్విశేషంబులు ♦ తలఁప దేవతలగేహంబులయందైన ♦ నమరియుండ

తే. వందలిసమస్తవస్తువు ♦ లద్భుతముగఁ
గానఁబడుచునెయుండు; ని♦క్కముగ నద్ది
తీవ్రతపమొనరించి యు♦దీప్తశౌర్య
మునఁ జెలంగియు బహుకష్ట♦ములకుఁ జిక్కి. ౩౧ 388

క. దనుజేంద్రార్జితమయియే, తనరారెడుఁగాని సులభ♦తరముగ లభియిం
చిన దేగాదది మఱియును, దనునెక్కిన మాన్యుఁ డెట్టి♦స్థలమును జూడన్. ౩౪

చ. మనమునఁ గోరునో యటకు ♦ మానుగ వేగమ పోవఁజాలి యిం
కను వరగోపురాదిబహు♦కల్పనముల్ చెలువారుచుండు నం
దును గనఁగా నొకొక్కయెడఁ ♦ దుల్యవిశేషము లొప్పుచుండుఁ గా
వున నది యెల్లతావులను ♦ బొంకముగాఁ గనుపట్టు నెంతయున్. ౮ 390

క. తనవిభుచిత్తమెఱింగియు, ఘనజవమున వాయుతుల్య♦గతిమీఱఁగఁ బో
వును వలసినచోటికి దా,నిని వారింపంగ నెవఁడు ♦ నేరఁడు జగతిన్. ౮౪ 391

తే. అది మహాత్ములు పుణ్యాత్ము♦ లతిశయధన
యుతులు కీర్తివిశాలత ♦ నొప్పువారు
నైన నింద్రాదులకు వాస♦మైన స్వర్గ
మట్లు తనరారుచుండు న♦హార్యమగుచు. ౫ 392

సీ. మఱియుఁ బుష్పకమది ♦ మణిముఖవస్తువిశేషంబులం జాలఁ ♦ జెన్నుమీఱు
సన్నివేశంబుల ♦ నున్నతిం గాంచుచు, శిల్పవిశేషముల్ ♦ చెలఁగుచుండఁ
బలువిధంబులుగను ♦ భాసిలిపెక్కులౌ శృంగంబులను వలం♦కృతము నగుచుఁ
గూటగణంబులఁ ♦ గొమరారుపర్వతశృంగంబురీతిని ♦ నెసఁగి రమ్య

* దివం గతం వాయుపథప్రతిష్ఠితం వ్యరాజతాదిత్యపథస్య లక్ష్మవత్ - ఆనిమాలయమ్.

తే. మగుచు శారద శశిబింబ♦మట్లు విమల
మై కనంబడుచుండును ♦ నందుఁ గుండ
లాభిరామాననములు మ♦హాశనములు
వికృతగురులోచనములును ♦ విపులములును. ౬౪ 393

క. గురుగతులున్నైన భూతో,త్కరములు వ్యోమచరులట్లు♦గాఁ బ్రతిమలు సుం
దరవుష్పకమందెల్లెడఁ, గరమొప్పుచునుండె వేలు♦గా మ్రోయుగతిన్. ౭

క. తొలిబుతువునందుఁ బుష్పం,బులవలె రస్యమయి, మధువు ♦ పోలఁపును లీలం
దొలఁగించునవ్విమానము, విలాసముగఁ జూచెఁ బ్లవగ♦వీరుం డచటన్. ౮

ఎనిమిదవ సర్గము సంపూర్ణము.

---

౯ - వ సర్గము.

-- పుష్పకవిమానవర్ణనము. --

క. రావణునకు గృహరత్నం, బై విలసిలు పుష్పకంబు ♦ నంతరమున బా
గై విపుల మాయతమ్మును,నౌ వేశ్మము మఱొకదాని♦హనుమ కనుఁగొనెన్.

తే. అద్ది యోజనమాయత ♦ మర్ధయోజ
నంబు విస్తీర్ణ మలర నా♦నాసహస్ర
సౌధయుతమయి వెలసెను; ♦ శత్రుహంత
యైన యాహనుమయు నట ♦ నాదరమున. ౨ 397

క. జనకజ నాయతలోచనఁ, గను వేడుక వెదకుచున్ ని♦కామము పూన్కిన్
దనుజేంద్రుపుష్పకము త,ప్పనితరసర్వస్థలముల ♦ బాగుగ వెదకెన్. ౩ 398

క. కని రావణానుజాదుల, కనదున్నతగేహములను ♦ గాంతిమెఱయ న
య్యనిలాత్మజన్ముఁ డంతటఁ, జనికాంచె ననుత్తమంపుఁగు ♦ సౌధవరంబున్. ౪

ఆ. మూఁడునాల్గుదంత♦ములు నొప్పుగజములు
నితరములగు ద్విరద♦తతులు పెక్కు
లమరియుండె; మఱియు ♦ నది యసంబాధమై
పాలితమగు శస్త్ర♦భటులచేత. ౫ 400

క. దనుజేశుపత్నులయి తగు, దనుజాంగన లతఁడు మిగుల♦దర్పంబునఁ దె
చ్చినరాజకన్యలందుం, గనఁబడి రాతనికి ముప్తిఁ ♦ గనువారెల్లన్. ౬ 401

సీ. ఆయుధధరులును ♦ నంగనామణులును నందుంట నాగృహ ♦ మపుడు నక్ర
మకరసంకీర్ణమై ♦ మఱియుఁ దిమింగిలములగూడి చిఱుతచేఁ♦పలనుగూడి
ననిలవేగాధూత♦మై సర్పములఁగూడి యున్నసాగరమట్లు ♦ లొప్పెఁ; గిన్న
రేంద్రువం దేలక్ష్మి ♦ హితముగ నుండునో హరివాహనుండగు ♦ నమరనాథు

తే. నందు నేసిచియుండునో ♦ యద్రి రావ
ణాసురుని గేహమందు నె♦య్యమున సతత
మలరుచుండెను; యక్షరా♦జగుకుబేరు
నందు యమువరుణులయందు ♦ నధికలక్ష్మి ౮| 402

క. ఎది యలరారుచునుండునొ, యది దానికి నధికమైన♦యదియును నాయా
యిదనుజుల గృహములందుం, బొదలుచునుండెను సితాంశు♦పూజ్యంబగుచున్.

క. మున్నె వివరించినయా, సన్నుతదనుజాధిరాజ♦సౌధమునకుమున్
మన్ననల కర్హమై నది, నెన్నఁగ వేశ్మోత్కృహార్హ్య♦మిదియునఁ దగుచున్.

[1]క. అలరారుపుష్పకంబను, లలితవిమానంబు మిగుల ♦ లక్ష్మి వెలయఁగా
విలసిలు [2]నిర్వ్యూహాంబులు, గంద్రై యుండెంగ హాయను♦గాంచెన్ దానిన్.

క. వనజాసనునిమిత్తము, మునుపయ్యది దేవలోక♦మున నిర్మితిఁగాం
చెను విశ్వకర్మచేఁ గా,వున దివ్యము రత్నతతి♦భూషిత మగుచున్. ౧౧

చ. కనఁబడుచుండె: యక్షపతి ♦ గాఢతపం బొనరించి బ్రహ్మనె
మ్మనమలరంగఁ జేయుచు వి♦మానము దానిఁబొందె; దానిచే
తనగురుశౌర్యసారమున ♦ దానవనేత కుబేరునొంచి చే
కొనియెను; గొన్నిస్తంభములు ♦ కోనుల హేమమయంబులై తగుః. ౧౪

తే. కొన్నిరాజతములు ♦ కొమరారుచుండు నీ, హేమమృగంబులందు ♦ నమరుపఁబడి
యుండె శిల్పములుగ ♦ నుకుకాంతిచే నది, చెన్నుమీఱుచుండె♦నెన్నగుచు.

క. నిలయోపరిగేహంబులు, విలసనశీలంబులగుచు ♦ వెలసెనుసోపం
బుల మేరుమందరాఖ్యా, చలములు నా నున్నతములుఁ ♦ జారుతరంబుల్.

తే. అంబరంబును నొఱసెడు♦నట్టులమరు
చును గృహంబున కొకతేజ♦మును నొసంగు
చుండె; నది విశ్వకర్మచే ♦ నొప్పుమెఱయ
నిర్మితంబయి శిల్పముల్ ♦ నెఱిమెఱయఁగ. ౧౬ 410

క. జ్వలనార్కులవలె నెంతయు, వెలుగుచుఁ గార్తస్వరమున ♦ విరచితములు ని
ర్మలములు నౌ సోపానం, బులు కేళియరుంగులందుఁ ♦ బొదలుచునుండెన్.

1 తస్యహర్మ్యస్య మధ్యస్థం వేశ్మ చాన్య త్సునిర్మితం. బహునిర్వ్యూహసంకీర్ణం దదర్శ పవనాత్మజః బ్రహ్మణోర్థే కృతం దివ్యం దివి యద్విశ్వకర్మణా. విమానం పుష్పకంనామ సర్వరత్న విభూషితమ్-అనియూ పీనికి గోవిందరాజు లేమోయర్థములు కల్పించి వ్రాసిరి. ప్రకృతోపయుక్తములుగాలేవు. మహేశ్వరతీర్థులు ప్రాతీతికార్థమును సమంజసముగ వ్రాసిరని పెద్దలు చాలమంది చెప్పిరి. ఆయర్థమే యిటఁ జెప్పఁబడినదని యెఱుంగవలయు. 2 నిర్వ్యూహము లనఁగా మత్తవారణములని యర్థము.

సీ. కనకంబుచే స్ఫటి♦కములచేఁ గుడ్యంబుమీఁదుగా శుభరీతి ♦ మించునట్లు
చేయంగఁబడినవై ♦ చెల్వగుల్కడుజాలకములచే వాతాయ♦నములచేత
నామందిరంబు శ♦శ్వత్ప్రసన్నంబై యుండె; క్షీరంబులన్ వేయఁ ♦ జిత్రముగను
వాని నల్లఁగఁ జేయు♦భాసంపదను మించు నింద్రనీలంబుల ♦ నెలమిఁ గూర్చు
తే. సింహళద్వీపమునఁ బుట్టి ♦ చెలఁగుచున్న
యస్మహానీలముల చేత ♦ నరుఁగులెల్ల
నచట నిర్మింపఁబడియుండె; ♦ నద్భుతముగఁ
బగడములచే నమూల్యభ♦వ్యమణివితతి. ౧౬ 412

క. తులలేనిమౌక్తికంబుల, నలుఁగడలం గలములెల్ల ♦ నైజవిభూతిం
జెలఁగుడరీతిని విరచిత, ములునై యలరారుచుండె ♦ మోదం బెసఁగన్. ౧౭

చ. అరుణముగాఁ గనంబడుట ♦ హాటకకాంతిని మించుచున్నసుం
దరతరచందనంబునను ♦ దద్దయు వాసనలొప్పుచుండె, ని
క్కరణిని దీవ్రసూర్యగతి♦గాఁ దనరారుచు గేహపంక్తిమీఁ
ద రహిఁ జెలంగు వార్ష్యసము♦దాయములం జెలువారె నెంతయున్. ౧౮

ఆ. అట్టిపుష్పకాఖ్య ♦ మగువిమానంబును, గపివరేణ్యుఁ డప్డు ♦ గడఁగి యెక్కి;
యంత నచటనుండి ♦ యవ్వాయుజుం డన్న,పానభక్ష్యసంభ♦వంబునగుచు. ౧౯

క. సురుచిరమై గంధరజ, స్స్ఫురితంబయి సూపుఁదాల్చి ♦ శోభిల్లెడు న
మ్మరుదుపమఁ గాంచుగంధముఁ, బరమమ్మును గ్రోలుచుండెఁ ♦ బావనియచటన్.

చ. దనుజవరుండు రావణుఁడు ♦ తన్నిలయంబున నున్నచోటనుం
డి నెగడునట్టిదో యనఁగ ♦ నిర్మలగంధ మదప్డు చక్కఁగాఁ
దనరుచునుండెఁ; గావున స♦దాగతిపుత్రున కామనీషి కో
య్యనఁ బ్రియబంధువున్ మిగులు♦హర్షము మీఱఁగ బంధువెట్లు తె
ల్పునో యటు రావణుండు తగు♦భూమియిదే యని తెల్పునట్లుగన్. ౨౦ 417

క. మనసునకుఁ దోఁచుచుండెను;, హనుమయు నటనుండి తరలి♦యారావణుఁడుం
డినశాలఁ గాంచఁ బోయెను, గనుఁగొనదగి యాయతమయి♦కడుశుభదంబై.

క దనుజేంద్రునిమనసున కిం,పును గూర్చుచు నుత్తమయగు ♦ పొలఁతివిధమునన్
గనఁబడుచు రత్నసోపా, ననికరముల నద్ది సొంపు♦నం దగుచుండెన్. ౨౧

క. కనకమయజాలభూషిత, మునునయి స్ఫాటికములగుచు ♦ మోదంబు నొసం
గను జాలుభూతలంబుల, ఘనమై దంతములు దాఁపఁ♦గాఁ జిత్రముగన్. ౨౨

చ. కనుఁగొననొచు మౌక్తికపుఁ♦గంబములుం బగడంపుస్తంభముల్
కనకపుఁగంబముల్ రజత♦కల్పితముల్ మణినిర్మితంబులో
ప్పును గుమిగూర్చునట్టివిగఁ ♦ బొల్చెడునవ్వియునైన స్తంభముల్
కనఁబడుచుండె నందుఁ; బలు♦కంబము లంతరమందుఁ దోఁపఁగన్. ౨౩ 421

సీ. ఆ స్తంభములమీఁద ♦ నందంబుగాఁ దగునట్లు గండనపట్టె ♦ లమరుపఁబడి
యుండె; నాకంబంబు ♦ లొకకొన్నిసనుములై మిక్కిలిపొడవుగా ♦ మించి చివర
భాగంబులఁ వంగి ♦ పరనుభూషణములఁ గ్రాలుచు నవ్విత♦క్కలవిధమునఁ
దోఁచుచునుంటచే ♦ నేచినగతి స్వర్గమున కుద్గమించులా♦గునను గానఁ
తే. బడుచునుండె; నదులు ♦ పర్వతసాగరంబులు వనంబు లాది♦కంధరిత్రి
లక్షణములచే వె♦లయుచిత్రకంబళ,మందుఁ బఱుపఁబడుచు ♦ నలరుచుండె.

క. నానారాష్ట్రంబులతో, నానాగృహములనుగూడి ♦ నైజవిభూతిఁ
గానఁబడుభూమిరీతిని, జానుగ విస్తీర్ణమగుచు ♦ సాధువిహగముల్. ౨౫॥ 423

క. కొలకొలఁగూయు సుగంధంబులు గుప్పువ నెసఁగ, శ్రేష్ఠ♦ములుగాఁ దగు కం
బళశయ్యల నమరుచు నొప్పులు గుల్కుచునుండె దనుజ♦పుంగవుఁ డందుఁ.

క. నిరతము వసించు నయ్యది, పరమాగరుధూపములను ♦ భాసిలుచుంటఁ
గరము పొగవన్నెచేఁ దగి, యరుదుగఁ గన్పడుచునుండె ♦ నాయతమగుచుఁ.

సీ. ఒక్కచోహంసయ ♦ ట్లొప్పి నిర్మలమయి పాండురవర్ణమై ♦ పరఁగుచుండు
నొకచోట నద్ది పు♦ష్పోపహారంబుల నతిచిత్రవర్ణమై ♦ యమరి శబల
వర్ణమై కల్మాషి♦భంగిఁ జెన్నారుచు, మనసున కామోద♦మును నొసంగు
చును, మోములకునుగాం♦తిని బ్రసాదించుచు, దుఃఖజాలంబులఁ♦దొలఁగఁజేయు
చును, దివ్యమై, లక్ష్మి♦కిని బుట్టినిల్లునాఁ దనరుచుండును; రావ♦ణునినివాస
మగునావిమానంబు ♦ తగ సుఖస్పర్శమౌ వాయువు, కనులకు ♦ భవ్యమోద
మునుగూర్చునాకార♦మును, శ్రోత్రములకు విందౌమృదుగానంబు♦నద్భుతములు
నతిరుచ్యములు నగు♦నట్టి భక్ష్యాదులు, చారుగంధంబును ♦ సారతరము
గల్గియుండుటచేతఁ ♦ గన్నతల్లి కుమారు నింద్రియంబుల కెట్టు ♦ లింపుఁగూర్చు
నట్లు లచ్చటికేగి♦నట్టివారలయింద్రియములకు నైదింటి ♦ కతులతృప్తిఁ
గలిగించుచుండె; నా♦గాలికుమారుండు దానివైఖరిఁ గాంచి ♦ మానసమున
*నచ్చెరువొంది యీ♦యది స్వర్గలోకమో, ప్రబలదేవతలుండు♦పదమొ, లేక
తే. యింద్రుఁడుండుతావొ, ♦ యిది బ్రహ్మలోకమోం
యనుచుఁ దలఁచె; నంతఁ ♦ గనకమయము
లైన స్తంభములను ♦ నలరుదీపంబులఁ
గనియె నచలములుగఁ ♦ గానఁబడఁగ. ౩౦ 426

తే. ధ్యానమొనరించునట్లవి ♦ కాననొచు
ద్యూతమున నోడి యనమతి♦నొంది మ్రాన్పు
పడినజూదరులట్లు చూ♦పట్టుచుండె;
నతఁడు దీపప్రకాశమ♦త్యాయతంబు. ౩౨ 427

* స్వర్గోయం దేవలోకోయ మింద్రస్యేయం పురీథ వేత్-అనిమూలము.

క. దనుజేంద్రుని తేజస్సును, ఘనభూషణరుచులు వెలయఁ ♦ గా నెల్లెడలం
గని మండుచున్నదేమో,యని కలఁచెన్ మనమునందు ♦ నద్భుతపడుచున్.

చ. కలువసనంబులన్ వివిధ ♦ భాసురమాలికలన్ ధరించి యు
జ్జ్వలతరవేషభూషణవి ♦ శాలరుచుల్ పొలయంగ రత్నకం
బళమున నిద్రవోయెడు న ♦ పారవిలాసవిరాజమానకాం
[1]తల నొకవేయిమందిని స ♦ దాగతిసూనుఁడు గాంచె నొక్కెడన్. ౩౩॥ 429

చ. వనితలు వారలందఱును ♦ వారికిఁ గోర్కులఁ గ్రీడసల్పి పా
యనితమి నర్ధరాత్రమున ♦ నాకృతి మద్యముఁ ద్రావి నిద్రచో
క్కునకు వశంగతాత్మలయి ♦ కోర్కులు సిద్ధినిఁబొందకున్న నో
య్యన నిదురించి రయ్యెడను ♦ సందె సుషుప్తిని నాపఁజాలమిన్. ౩౪॥ 430

క. చలియింపకుండ నిద్దురఁ, గలియుటఁ గాంచీగుణాది ♦ క విభూషణముల్
పలుకకయుండెను; నట హం,సలు షట్పదపంక్తివిగత ♦ శబ్దములగుచున్. ౩౫

[2]క. పెనుసారసవనమువిధం,బున విలసిలుచుండెఁ; గనులు ♦ మోడ్చియు, [3]దంతా
ళిని గనఁబఱుపక నిద్రం, గనువారల నెమ్మొగములఁ ♦ గాంచె హనుమయున్.

ఆ. పద్మగంధములను ♦ బరిఢవిల్లుచు నెమ్మొ
గములు వెలసి, పగలు ♦ కంజములవి
ధమున స్ఫుటములగుచుఁ ♦ [4]దామసి రా మోడ్పుఁ
జెందినట్లు తోఁచెఁ ♦ జిత్రరీతి. ౩౮ 433

సీ. శ్రీమంతుఁడైనట్టి ♦ యామరుత్తనయుండు వాలుమోములు ♦ చారుగంధ
ముఖగుణావళిఁబట్టి ♦ ముగ్ధపద్మములతో సరిపోలునని తన ♦ స్వాంతమునకుఁ
దగులఁగా నీవని ♦ తామతల్లులముఖములు పద్మములవలె ♦ వెలయఁ గాన
మత్తషట్పదములు ♦ మకరందమునకయి వికసితపద్మాళి ♦ వేడ్కమీఱ

తే. మాటిమాటికి వ్రాలెడు ♦ మాడ్కి వీని
యందునన్ వ్రాలు నిజమిద్ది ♦ యని తలంచె;
నట్టు లాయున్నమిన్నల ♦ నలరుచున్న
దానవేంద్రునిగేహర ♦ త్నమది యపుడు. ౪౦॥ 434

క. తారాగణసంయుతమౌ, శారదనభమట్లు సుప్ర ♦ సన్నంబగుచున్
దా రాజిలె; రక్షఃపతి, యారావణుఁ డాపడంతు ♦ లాదృతిఁ గొలువన్. ౪౧॥

క. సిరి వెలయఁ దారకాతతి, పరివృతుఁడగు శీతరశ్మి ♦ భంగిన్ మిగులన్
సురుచిరముగఁ జూపట్టెను;, హరికులతిలకుండు హనుమ ♦ యుత్తరుణమునన్.

---

1 సహస్రం వరనారీణామ్-అనిమూలము. 2 పద్మవనం మహత్-అనిమూలము. 3 తాసాం సంవృతదంతాని మీలితాక్షాణి మారుతిః-అనిమూలము. 4 తామసి=రాత్రి, రాన్=రాఁగా - అని యర్థము.

తే. పుణ్యశేషముతోఁ గూడి ♦ భూమిఁ బయిని
నాకసమునుండి పడిన యా ♦ మాయిచుక్క
లన్నియుం గూడి నాయింతు ♦ లై చెలంగె
నేమొ యనియెంచె నాత్మయు ♦ హృదయమునను. ౪౩ 437

క. సురుచిరకాంతియు రూపం, బరుదగు నాభేటిఁ దనము ♦ సదృశోష్పంగా
వరకాంత్యాదులతోడం, బఱఁగెడు తారకలకీ ♦ భాసిలె తేజల్. ౪౪ 438

చ. తరుణులు వారు మద్యమును ♦ ద్రావి యనంతరకృత్యమైన యా
సురతము సల్పుచున్నతఱి ♦ శుభ్రగుణోత్తమవీనహారముం
దరమణిభూషణంబులను ♦ స్థానములన్ విడి తాఱుమాఱుగాఁ
బరఁగ సుషుప్తిఁ జిక్కుపడి ♦ పాన్పులుంతములోప్పఁ జెలంగె దండొగిన్. ౪౫

సీ. విస్రస్తతిలకలై ♦ వెలఁదులు కొందఱు, ఉద్భ్రాంతనూపురలయి ♦ వామనయన
లోకకొందఱ, అందు గ♦ఱోక్క చోఁ బాన్పువిగళితహారలు కొందఱ ♦ఱులలితగురు
ముక్తామణీహార♦ములు తెగి తనువుల నావరింపఁగఁ గొంద♦ఱంబరములు
విడిపోవఁగొందఱు ♦ వెలఁదులు మొలనూలు వదలియుండఁగఁ గొంద♦ఱువగభూమి
తే. పయిని శయనించుచున్ నను ♦ బడలికలోఁగి
నడఁగ, నడుము కట్టువదల్చు ♦ చవనియందుఁ
బొరలఁ జేయింపఁబడు చిన్న ♦ తురగవనిత
లట్లు విలసిల్లుచుండి రా ♦ హర్మ్యమందు. ౪౬ 440

చ. సురుచిరకుండలంబులను ♦ సొంపుగఁ దాల్చినకొంద ఱంగనల్
పరమసుమస్రజంబు లొసఁ ♦ భావజుకేళిఁ దగం దెగంగ సుం
దరముగఁ బూచియున్న వని ♦ తానము ద్రొక్కఁగ నున్నతీఁగల
ట్లురుదుగఁ గానవచ్చె నట; ♦ వష్టురుదాత్మజుదృష్టికెంతయున్. ౪౭ 441

క. తరుణులకుచమధ్యములఁ, బరఁగెడు గురుహారము లట ♦ భానుశశిలస
త్కరములవలెఁ దనరెఁ కుచాం,తరముల శయనించుహంస ♦ తతులన నమరెన్.

క. తరుణులు కొందఱు స్వకుచాం,తరముల వైదూర్యహార ♦ తతులం దాల్చన్
గురుకాదంబపతత్త్రుల, కరణిన్ బొల్పారె నవ్వి ♦ కనులకు విందై. ౪౯ 443

క. కొందఱుతరుణులు దాల్చిన, సుందరతరశాతకుంభ ♦ సూత్రములు సుషు
ప్తిం దవరుచక్రవాకము,లం దగఁ బురుడించె నట వి♦లాసములీలన్. ౫౦

సీ. హంసాదులం బోలు ♦ నట్టిహారంబులు పులినస్థలంబులఁ ♦ బోలుజఘన
ములుగల యాయంగ ♦ నలు, హంసకారండవాకీర్ణములుగను ♦ నలరి చక్ర
వాకశోభితములు ♦ వనపులినంబులు చెలువార నొప్పు న ♦ దులవిధమున
రాజిల్లుచుండి, రా ♦ రమణులు నిదురించియుండి గజ్జెలపిండ ♦ లోఁగిని మొగ్గ
లుగను, హాటకభూష ♦ లు విపులసరసిజములుగ, శృంగారచే ♦ ష్టలు మొసళ్లు

తే. గను, శరీరములందగు♦కాంతి తీర
ములుగ వెలయంగ దివ్యస♦దులను బోలి
యలరుచుండిరి; కొందఱు♦వెలఁదు లందు
మృదువులగు దేహములయందుఁ ♦ బొదలు వేడ్క. ౪౪౫ 445

క. చను మొనలందుం దాల్చిన, ఘనభూషణములు చెలంగెఁ ♦ గాముకులవిధం
బున; నందుఁ గొందఱగునం,గనలముఖంబునను బొదలి ♦ కరమురుదగుచున్.

ఆ. పఱఁగుచున్నయట్టి ♦ భవ్యచేలాంచల,ములు తదాస్యవాయు♦వుల నెగురుచు
వారియాననముల♦పై రయంబునఁ బలు,మాఱు పడుచునుండె♦మంజులముగ.

చ. పలువిధమైనవర్ణతతి ♦ భాసిలు తన్మృదులాంబరాచలం
బులు రుచిరప్రకాశములఁ ♦ బొల్చెడు రావణుపత్నులైన యా
వెలఁదుల వక్త్రమూలముల ♦ వింతఁగ నల్లన నాడుచుం దగం
జలనముఁ గాంచు టెక్కెముల ♦ చందమునం గన నయ్యె నెంతయున్. ౪౪౮

చ. తనరుచులన్ వెలుంగువని♦తామణు లాదృతిఁ దాల్చియున్నయా
ఘనతరకుండలంబులు త♦గన్ మణిరాజిఁ జెలంగుచుంటఁ జ
క్కని [1]యుపధానసన్నిధిని ♦ గ్రాలుచు వారిముఖానిలంబు సోఁ
కున మెలమెల్లనం గదలుఁ ♦ గోమలరశ్ములు చిందులాడఁగన్. ౪౪౯ 449

తే. శర్కరాసవగంధంబు ♦ సహజపరిమ
ళాన్వితము సుఖదంబును ♦ నగుతరుణుల
యాస్యనిశ్వాసమారుతం ♦ బవుడు రావ
ణాసురునిఁ గొల్చుచున్నట్టు ♦ లమరియుండె. ౪౫౦ 450

క. దనుజేంద్రునిభార్యలు చ,క్కనిమద్యముఁ ద్రావి దానఁ ♦ గాంతునివగునా
ననములని శంకనొందుచుఁ, గని తమసవతులను దన్ము♦ఖంబుల నెమ్మిన్. ౪౫౧

క. పలుమఱు నాఘ్రాణించిరి;, విలాసమున నొప్పి మిగుల ♦ వేడుకను సప
త్నులు తమ్ము మూర్కొనంగా, వెలఁదులు సహియించియుంట♦వింతయగాదే.

[2]మ. సవతుల్ మోముల మూర్కొనం గడు సమ♦ర్షం బూనువారయ్యు న
య్యువిదల్ రావణునందు మోహమునఁ దా♦రొప్పారుచుంటన్ నితాం
తవిమోహంబునఁ జిక్కి నాథునకు మో♦దంబంచుఁ దద్వక్త్రముల్
సవిలాసంబుగ మూరుకొంచుఁ బ్రియముల్ ♦ సాధించి రవ్వారికిన్. ౪౫౩

1 ఉపధానపరిసరేషు-అనివ్యాఖ్య. ఉపధానమనఁగా దిండు. 2 అత్యర్థం సక్తమనసో రావణే తావ స్త్రియః, అస్వతంత్రా స్సపత్నీనాం ప్రియమేవాచరం స్తదా-అనిమూ. అస్వతంత్రా రాగాంధాః రావణే అత్యర్థం సక్తమనసః తా స్సపత్నీభి రాఘ్రాతముఖాః ఏవ స్త్రియః తదాఘ్రాణ సంపత్త్యః ప్రియమితి మత్వా సపత్నీనాం ప్రియమేవాచరన్-రాగాంధాః కిం నకుర్వంతీతిభావః-అని మహేశ్వరతీర్థులు. ఈయర్థమే సరసమని పద్యమునఁ జెప్పఁబడెనని గ్రహింపందగు.

చ. అతివలు కొందఱందుఁ గడి♦యంబులచేఁ దనరారుచున్నదో
ర్లతలు, మనోహరాంశుకము♦లన్ దలదిండ్లుగఁ జేసికొంచు నా
దితిసుతనాథుపార్శ్వములఁ ♦ దృప్తిగనే శయనించియుండి; రొ
క్కతరుణి వేడ్క వే ఱొకతు♦కం గదియించి తదీయవక్షమున్. ౬౦౪ 454

సీ. ఉపధానముగఁ జేసి ♦ యురుతరసుఖనిద్ర చేయుచుండెను; గొంద♦ఱాయువతిభు
జంబుమీఁదను స్వశీ♦ర్షంబులనిడి వేడ్క శయనించియుండిరి, ♦ చానయొక తె
కడఁగి యన్యాంగనాం♦కమున నిద్రించెను, దానిదోర్లతలపైఁ ♦ దరుణులుమఱి
కొందఱు తలలుంచు♦కొని శయనించిరి; మఱికొందఱంగనా ♦ మణులు మమత
నితరేతరాంకంబు ♦ లెసఁగుపార్శ్వంబులు కటులు వీఁపులు తల♦గడలుగాఁగ

తే. నూని యవయవముల నొక♦రొకరిపైన
వైచుకొనుచు మదస్నేహ♦వశలయి తగఁ
బండుకొనియుండి; రిట్టు లా♦పడఁతులగుమి
సూత్రసంగ్రథితంబగు♦చొప్పుమీఱ. ౬౦౫ 455

క. కనదురుదోస్సూత్రంబులఁ, బెనుచుకొనుచు భృంగములన♦నెలయుకుచులతోఁ
గనఁబడుచుఁ బండియుండం, గను వారలనేత్రములకుఁ ♦ గమ్రతరముగన్.

తే. దారమునఁ గ్రుచ్చఁబడినమ♦దద్విరేఫ
ములు చెలంగఁగ నొప్పారు♦లలితపుష్ప
హారమట్లుగఁ దగియుండె; ♦ నచట మఱియు
దనుజనాథుని స్త్రీసము♦దాయమెల్ల. ౬౦౭ 457

ఆ. వదనమారుతములు ♦ వ్యాపించుటం బర
స్పరము కుసుమహార♦సమితిగూడు
కొనఁగఁ; జోకముల్లు ♦ కొమరుగఁ బిగిగొన
మూఁపులపయి హస్త♦ములు పెనఁగ. ౬౦౮ 458

సీ. ముంగురుల్ పయిఁబయిఁ♦జెంగుచెంగున లేచిపోలయుచునుండుటఁ♦జొల్చిచూడ
వైశాఖమునఁ బూచి ♦ వాయుసంవ్యాప్తిచేఁ బెనఁగొని మాలాకృ♦తిని జెలంగి
పూవులజొంపముల్ ♦ పొందుగా గుమిగూడి స్కంధంబులపయిఁజ♦క్కంగవల్లు
కొని మెల్ల మెల్లనఁ ♦ గొమరుమీఱఁగఁ బరస్పరము సంసక్తిచేఁ ♦ బరిఢవిల్లు

తే. తీఁగగుంపు తెఱంగున ♦ బాగుమీఱఁ
గ్రాలుచుండెను; వారియం♦గములు సొమ్ము
లంబరంబులు ఘనసుమ♦హారములును
నుచితసంస్థానములయందె ♦ యునుపఁబడియు. ౬౦౯ 459

క. సారసుమాలాకృతి నా, నారీమణు లటఁ బరుండి ♦ నాయకుచెంతన్
గారాముగ నుండుటచే, నారమ్యవిభూషణాదు ♦ లానమయమునన్. ౬౬

క. ఎవ రెవరి వోయి యివ్వని, సువిహితముగఁ దెలియఁబడక ♦ శోభిలుచుండెన్;
దివిజారి మేలుకొన నా, యువిదలఁ జూడంగరాక ♦ నొకమాత్రైనన్. ౬౬౹

క. కనకస్తంభంబులపై, ననుపంబడి వెలుఁగుచుండు ♦ నునుదీపము లా
దనుజారి సుఖసుషుప్తిం, గనఁగా నిశ్చలములగుచుఁ ♦ గలితప్రభలై. ౬౭౹

క. తన రేడునా కాంతల నవు, శనిమేషములగుచుఁ గాంచు♦నట్లుండె; నటన్
దనుజులకన్యలు పితరుల, వనితలు రాజర్షిసంఘ♦భామినులెల్లన్. ౬౮౹ 463

[1] తే. సుతియుగంధర్వరాక్షస♦మానిను లొగి
నా దశగ్రీవుఁ గామించి ♦ యతనిఁ గొలిచి
యుండి రాదృతిఁ దారె; యా♦ యుగ్రదనుజుఁ
డాహవధూమణులం బట్టు ♦ నటుగ లేదు ౬౯ 464

[2] క. వనితలఁ గొంటఁట శౌర్యం, బునఁ గొని తెచ్చెను దదీయ♦ముఖ్యజనులతో
నని గలుగునన్నయాశను, గొనివచ్చెనుగాని కాదు ♦ కోరికవలనన్. ౭౦౹

క. స్మరతాపంబునఁ గొందఱు, గుణములు రూపనవయవంబు ♦ దళుకొత్తంగా
వరియించి రావణాసురు, నిరతము సేవించి రతని ♦ నెమ్మనలిర్వన్. ౭౧ 466

క. అందున్న సుందరులలోఁ, గందర్పశరాళిఁ జిక్కి ♦ క్రవ్యాదవిభున్
డెందమున వలఁచినదితప్పం దక్కన దెవతె లేదు ♦ పరికింపంగన్. ౭౨౹ 467

క. బలవంతంబుగఁ దెచ్చిన, లలనామణి యొకతెగాని ♦ లక్షింపంగాఁ
గలుగదు వారలలోపల, నారావణుసొగసుఁగాంచి ♦ యచ్చెరువడుచున్. ౭౩౹

ఆ. మోహపరవశమున ♦ ముగ్ధ యాతనిఁ గోరి
వచ్చినదియెగాని ♦ వానివీర్య
మునకుఁ జిక్కినట్టి♦వనిత యెవ్వతె లేదు
మఱొకపురుషుఁగోరు♦మగువ లేదు. ౭౪౹ 469

[3] క. దనుజేంద్రుని చెంతను నే, వని తానుణియైనఁ దాను ♦ వలచి తమింజే
రినశతికంటెను బూర్వ మెవనిఁగాని గ్రహించినదియు ♦ వఱుదుమాషన్.

చ. జనకజతప్పఁ దక్కినవి♦నప్రసవాత్ములు వానిఁగోరి యే
యనిశముఁ గొల్చుచుండిరి: త♦దంగనలందుఁ గువంశజాతయా
వనిత యొకర్తుఁగాని, తను♦వైభవహీనయుఁగాని, నేర్పునొం
దనియదిగాని యొక్కతెయుఁ ♦ దద్దయుఁ జూచినఁ గానరాదు మా!. ౭౬౹

ఆ అనుపచారయుక్త ♦ యగు నతీమణిగాని, సత్వహీనయైన ♦ చానగాని
కోరఁదగనియట్టి ♦ కుత్సితరూపయా, వనితగాని లేదు ♦ కనుఁగొనంగ. ౭౭

---

1 రాక్షసానాం చ యాః కన్యా స్తస్య కామవశం గతాః-అనియూ. వశు తేన కామంతుత్వా హృతా ఇత్యర్థః-అనివ్యాఖ్య. 2 ఇట వ్యాఖ్యాభిప్రాయము చెప్పఁబడినది. 3 వచావ్యపత్యా-అనియూ.

సీసమాలిక:—

[1]రఘువంశరత్నమా ♦ రామచంద్రునిసతి యగుసీత, యిందున్న♦యంగన లెటు
రావణునకు భార్య♦లై వఱలుదు రట్లె తానును నగునేని ♦ తలఁప నపుడు
వీనిపుణ్యమె పుణ్య♦మౌనని యాసాధుబుద్ధియౌ మారుత♦పుత్త్రునకును
గపితనుబట్టి యా♦క్షణమునఁ దోఁచెను; మఱియు నీరాక్షసు♦మానిను లెటు
లఖిలసుఖంబుల ♦ నందుచు నున్నారొ యట్లెసీతయు రాఘ♦వాభియుక్త
యగునేని యీరావ♦ణాసురుం డర్హకృత్యంబును జేసిన♦యట్టివాఁడె
యగునని సాధుబు♦ద్ధి గలయాహనుమకుఁ దోఁచెను; మఱియు నీ♦తోయజాక్షి
యీసమంజసగుణ♦యీరాముపత్ని యెట్లపహృతయయ్యెనో ♦ యట్లెయీను
రారి నారీమణు♦లందఱు సుగ్రీవుచే హరింపంబడి ♦ చింతనొందు
దురయేని యప్పుడు ♦ హరివిభునకు మంచిదగునని సాధుబు♦ద్ధి గలహనుమ
కప్పుడు తోఁచె; నీ♦యంగనామణులను నపహరించినయట్లె ♦ యసురనాథుఁ
డీరామపత్నిని ♦ నీసాధుశీలను నపహరించునయేని ♦ యతని కేమి
శుభమబ్బునని లస♦చ్ఛుభబుద్ధియైనట్టి యామరుత్సుతునకు ♦ నపుడు తోఁచె;
నీరాక్షసాధిపు ♦ నింతులఁ గనినట్లు రాఘవుపత్నినే ♦ రమణఁ జూడఁ
జాలుదునేని నా♦జన్మము సఫలమౌనని సాధుబుద్ధికి ♦ నపుడు తోఁచె
నీరాక్షసాంగన ♦ లెట్లు నాకగపడి రట్లెసీతయునైన ♦ నచట రాజ
భయమున నొక్కటఁ ♦ బ్రాయోపవేశంబుచేఁ బ్రాణములఁబాయ♦సిద్ధపడెడు
నంగదాదివనేచ♦రాళికి మరలను జన్మమబ్బినయట్లు ♦ జరగుమంగ
ళంబని తోఁచెనా ♦ లలితబుద్ధికి నప్డు; డీరావణాసురు ♦ నింతులెట్లు
జీవించియున్నారొ ♦ శ్రీరాముపత్నియు జీవించియున్నచో ♦ శ్రీరఘుపతి
కఖిలశుభంబులు ♦ వగునని తోఁచెనా సాధుబుద్ధికి మరు♦జ్జనికి నపుడు;
రాక్షసరాజ! యో♦రావణా! యీకాంత లెట్లు నీభార్యలో ♦ యారఘూత్త
మునిపత్నియగుసీత♦యునగునే నీకును శుభముగల్గునె నీవు ♦ సుతముఖులును
రాముబాణాగ్నిచే ♦ రయమున గ్రందుదు రనిచెప్పఁదగునని ♦ యపుడుతోఁచె;
నీరాక్షసాంగన ♦ లెట్టిసౌందర్యంబు గలవారొ యంతె యా♦యవనితనయ
కుండునా యామె యీ♦యుర్వియం దప్రతిమానలావణ్యంబు ♦ గానఁబడఁగ
నలరుచుండునుగదా♦యటుగాన నిటనుండదని సాధుబుద్ధియౌ♦హనుమ కపుడు
స్ఫురియించె; నంతలో ♦ మరల నాతండు భూజాతసద్గుణముల ♦ జగతి మించు

తే. నట్టిసాధ్వి మహాత్ముఁడై ♦ యలరునితఁడు
బలిమిఁ గొనివచ్చి యిట్టిపా♦పంపుఁగార్య

---

1 బభూవ బుద్ధిస్తు హరీశ్వరస్య-యనుశ్లోకద్వయమునకు వ్యాఖ్యాళిప్రాయముచే వ్రా యఁబడినది.

మొనరిచెఁగదా యటంచు నా♦ర్తిని మునింగి
యక్కటా యంచుఁ జింతించె ♦ నాత్మలోన. ౭౩ 473

తొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౧౦ - వ సర్గము.

అంతఃపురకాంతలం జూచి మందోదరిని సీత యని హనుమ ప్రమాదంబు నొందుట.

క. హనుమయు నట నల్లడలం, గనుచున్ శతమఖునిశయ్య♦కరణి వెలయుచున్
వినుతంబై స్ఫాటికమై, తనరెడుశయనాసనంబుఁ ♦ దాఁ గనుఁగొనియెన్. ౧

చ. ఘనతరరత్నభూషితము♦గా నది నిర్మితమయ్యెఁ; నట్టిశ
య్యను దిగినవ్వు విశ్రమము ♦ నందుటకై బహుమూల్యముల్ మహా
సనములు నందు వేయఁబడి ♦ చాలఁగనొప్పెను నవ్వి దాంతముల్
కనకమయాంగముల్ మిగుల ♦ గాఢమరీచులు నొచు రాజిలున్. ౧½ 475

తే. అవ్వి వైడూర్యఖచితంబు♦లై చెలంగు
చుండెఁ జిత్రాంగములునయి ♦ యొప్పువాని
పైని నాస్తరణంబులు ♦ పఱునఁబడియె;
నందు నొకచో శిరోభాగ♦మందు నతఁడు. ౨ 476

క. మేలగుము త్తెపుసరులను, జాల నలంకృతమునగుచుఁ ♦ జంద్రునివలెనే
భా లసమానంబై తగఁ, గ్రాలుసితచ్ఛత్రవరముఁ ♦ గనుఁగొనె నంతన్. ౩

క. కనకమయంబై శయనా,సన మయ్యది చిత్రభాను♦సదృశప్రభలన్
గనుచును నశోకమాలా, ఘనిబిడమై యుండఁగాంచెఁ ♦ గరువలిసుతుఁడున్.

క. నలుఁగడల నాఁడురూపం,బులుగల మణికృతములైన ♦ బొమ్మలు హస్తం
బుల వింజామరలంగొని, నలలితముగ వీచుచుండె ♦ సతతము మఱియున్. ౪½

*క. పలుభంగుల సత్పరిమళ,ములు గమగమలాడుచుండె ♦ మునుకొని ధూపం
బులు మేలైనవి వేయుట,వలన మనోజ్ఞమయి కానఁ♦బడె నది మఱియున్. ౫

ఆ. దానిమీఁద స్వచ్ఛ♦మైన యాస్తరణాళి, పఱపఁబడియె దాని♦పైన నావి
కాజినంబు మిగుల ♦ నాచ్ఛాదనంబుగాఁ, గప్పఁబడియె నాల్గు♦కడల నందు.

క. సురుచిరవరసుమమాలో,త్కర మలరుచునుండె; నంతఁ ♦ గపివర్యుఁడు సుం
దరమగునాశయ్యపయిన్, ధరాధరముఁబోలి మెఱయు♦తనువమరంగన్. ౬½

తే. విలసదుత్తమకుండలం♦బులు మెఱయఁగ
లోహితాక్షంబులును మహా♦బాహువులును

---

* ఐరధూపేన ధూపితమ్-అనిమూలము.

దనరఁ గాంచనచేలంబుఁ ♦ దాల్చి పరిమ
ళమున మించెడు నెట్టిగం♦ధ మమరంగ. ౭౹ 483

క. సురపథమున విద్యుల్లత, పరికీర్ణంబగుచు సంజఁ♦బరఁగు నపుణభీ
కరమేఘమట్లు కననై, సురుచిరమణిమయకలాప♦శోభితుఁడగుచున్. ౮౹ 484

క. లావణ్యంబునఁ జెలఁగుచు, నేవిధమగురూపముఁగొన ♦ నెంచునో యట్టే
దా వఱలుచుండుశక్తిఁ ద,పోవిభవమువలనఁ బొంది ♦ పూజ్యుండగుచున్. ౯౹

క. తరుగుల్మవనంబులతోఁ, బరఁగుచు నిదురించుచున్న♦వడువునఁ దగు మం
దరపర్వతమట్లొప్పుచు, వరభూషణరాజివెలుఁగ ♦ వైభవములరన్. ౧౦ 486

తే. రాత్రి విహరించి యపు డుప♦రతుఁడు నగుచు
దనుజకన్యల కెంతయుఁ ♦ దా ప్రియుఁడయి
రాక్షసుల కెల్ల సుఖముఁ గూ♦ర్పంగఁజాలి
మద్యములఁ ద్రావి తనిసి యా♦మంచముపయి. ౧౦౹ 487

క. శయనించియున్న రావణు, నయగుణనిధియానమీర♦నందనుఁడు గనెన్
శయనంబద్ధయు భాస్వర, మయి తనరఁగ దానిపైన ♦ నద్భుతరీతిన్. ౧౧ 488

క. పరువడి నిట్టూర్పుల ని,ర్భరముగ వెలిఁబుచ్చుచున్న♦ఫణిచందమునన్
గర ముచ్ఛ్వాసంబుల భీ,కరముగ విడుచుచుఁ బరుండు♦క్రవ్యాదపతిన్. ౧౧।

క. వీరుని నారావణునిం, జేరి మనస్సంశయమును ♦ జెంది యకట! యీ
తీరున రాఁజన్నే కనె,నే రావణువలనభీతి ♦ యిప్పుడు రాదే. ౧౨ 490

క. అని పరమోద్విగ్నుండై, యనిలజుఁ డతిభీతిఁ గన్ను♦మట్టు లవలికిం
జని సోపానమునొందుచుఁ, జని యవ్వల దానినడుమ ♦ సమున్నతమగుచున్.

తే. కనఁబడెడు వేదికను నెక్కి ♦ కమ్రశయ్య
నిద్రవోయెడు దనుజేంద్రు♦నిన్ దశాస్యుఁ
గనియె; నాశయనోత్తమ♦మున నతండు
పవళించుట నన్యులెఱు♦ప్పగిది వచట. ౧౩ 492

తే. చేరకుండుట విజనమై ♦ భూరిగంధ
గజము చొచ్చిన సెలయేటి♦కరణి నుండెఁ;
గాంచనాంగదలలితముల్ ♦ కదునిడుదలు
నైన యురుబాహువులఁ గాంచె ♦ నందతండు. ౧౪౹ 493

సీ. చాఁపంగఁబడి యవ్వి ♦ శక్రధ్వజంబులవలె నొప్పుచుండెను ♦ వాసవునిని
మార్కొని మున్ను స♦మరముచేసెడుతఱి నైరావతము విషా♦ణాగ్రములను
గ్రుమ్మఁగాఁగలిగిన ♦ గొప్పగాయములందుఁ గనఁబడుచుండెఁ;జ♦క్కంగ బలిసి
యున్నయాతనిమూఁపు ♦ లొగిఁ గులిశక్షతులను మించుచుండెను♦వ్వనజనాభు

ఆ. చక్రకృతములైన ♦ సాంద్రవ్రణంబులఁ
జెలఁగుచుండెఁ; గంఠ♦బలము మిగుల
సమములగుచు దేహ♦సంగతములు బలి
ష్ఠములు నగుచు నవ్వి ♦ యనురియుండె. ౧౬౪ 494

క. లలితంబులు శుభలక్షణ, కలితంబులు చారుతరన♦ఖంబులు మఱియున్
బలయుక్తాంగుష్ఠంబులు, సులక్షణాంగుళులు నొచు ♦ శోభిలుచుండెన్. ౧౭

క. కరతలము లొప్పుచుండెన్, సురుచిరబాహువులు మిగుల♦సొంపుగఁ దగుచుం
బరిఘాకారంబులుగాఁ, గరిహ స్తసమానములుగఁ ♦ గనఁబడుచుండెన్. ౧౭౪

తే. మఱియు వృత్తంబులై, యప్డు ♦ మంచముపయిఁ
జాఁపఁగాఁబడి పంచాస్య♦సర్పములటు
లలరి, శశరక్తవిధమున ♦ నమరి, చల్ల
నగుచుఁ బరిమళచందనా♦ఢ్యములు నగుచు. ౧౮౪ 497

చ. పరమవిభూషణంబులను ♦ భాసిలుచున్ వరసుందరీమణీ
కరములచేతఁ జక్కఁ బిసు♦గంబడి యుత్తమవాసనల్ మనో
హరముగ నొప్పఁ, *బన్నగుల ♦ యక్షుల నిర్జరదానవాళి సం
గరమున రోదనంబులఁ ద♦గం బొనరింపఁగఁజేయఁజాలుచున్. ౨౦ 458

తే. మఱియు గంధర్వులన్ భీతి ♦ నెఱిఁగనంగఁ
జేయఁజాలినవై యుండె; ♦ నాయుదనున
మందరాంతరమున సుషు♦ప్తిం దగంగ
నొంది కుపితంబులగు మహా♦హులవిధమున. ౨౦౪ 499

క. ఘనశయ్యఁ జాఁపఁగాఁబడి, కన నున్నతభీతి నొనఁగు♦కరముల రెండిం
టినిగాంచె; భూరిపర్వత, ఘనరాజిలు నాదశాస్యుఁ ♦ డా రావణుఁడున్. ౨౧౪

క. పరిపూర్ణభుజంబులతో, నరుదుగఁ దగి సశిఖరద్వ♦యంబగు పెనుమం
దరపర్వతంబువలె భీ,కరుఁడై యొప్పారఁ గాంచెఁ ♦ గరువలిసుతుఁడున్. ౨౨

చ. దనుజవిభుండు రావణుఁడు ♦ తచ్ఛయనంబున నిద్రవోవ నా
తనిపెనునోటినుండి విసృ♦తంబగు నూర్పులపిండు మద్యముం
గొనుటను వానిలోఁ గలియు♦కోమలదివ్యరసాలపుష్పవా
సనలను బొన్నతావులను ♦ జక్కనివౌ పొగడంపుఁదావులన్. ౨౩ ะ02

క. అరుదుగ మృష్టాన్నంబుల, పరిమళమును దివ్యమద్య♦పరిమళమును మం
దిరమును దానిం బూరిం,చురీతిఁ గనఁబడుచు వెడలె ♦ సురుచిరమగుచున్.

క. ఘనముక్తామణిఖచితము, కనకమయమునైన యతని♦క్రముకుటము మా

---

* యక్షపన్నగగంధర్వదేవదానవరావిణో-అనివహా.

తని కించుకయెడముగ న్నున్నను గాంతుల నీనుచుండె ♦ నైజప్రభలన్. ౨౪

క. వరకుండలముల దానవ, వరువక్త్రము వెలయుచుండె; ♦ బలిసి వెడలు పై
సురుచిరమగు తద్వక్షం, బరుణంబగుచందనమున ♦ ననులిప్తంబై. ౨౫। 505

చ. ఘనతరరత్నహారముల ♦ కాంతి వెలుంగఁ జెలంగుచుండె; నా
దనుజవరుండు క్షౌమము సి♦తంబునునౌ వసనంబుఁ గట్టి ప
చ్చనిమృదులార్హ్యవస్త్రమును ♦ జానుగఁ బైనధరించి యొజ్జనై
కనులు చెలంగఁ జూడఁదగి ♦ క్రాలుచు నుండెను శయ్యపైఁ గడున్. ౨౬

ఆ. మినుపరాశిఁబోలి ♦ మిక్కిలి నల్లనై, యహివిధమున నూర్పు ♦ లమరుచుండ
శయ్యనుండె; నిట్లు ♦ చక్కనిసితశయ్యఁ, బవ్వళించి నిద్రఁ ♦ బరఁగుచుండ.

క. గంగాభవాని దివ్య, భంగజలాభ్యంతరమునఁ ♦ బవళించి సుషు
ప్తిం గనుకుంజరమట్లు చెలంగుచుఁ జూపట్టుచుండె ♦ లలితతనురుచిన్. ౨౮

క. కనకస్తంభచతుష్టయ, మున నలుప్రక్కలను దీప♦ములు తేజరిలం
గను దానిచేత మెఱయుచుఁ, దనయంగము లొప్పిచూపఁ ♦ దగియుండంగన్.

క. తనువున నాభరణంబులు, కనదుద్యద్దీప్తిమెఱయఁ♦గా మెఱుపులపిం
డునుగూడిన మేఘమువలెఁ, గనుపట్టు మహాత్ము దనుజ♦కాంతు దశముఖున్.

తే. అతనిపాదతలంబుల♦యందు నున్న
భార్యలం గాంచె, నక్కపి♦వర్యుఁ డంత;
దనుజనాథునిగృహమున ♦ ఘనమనోజ్ఞ
కుండలంబులఁ దాలిచి ♦ కోమరుమిగుల. ౩౦ 511

చ. కలువలఁజేనిచందమునఁ ♦ గ్రాలు మొగంబులు ముద్దుగుల్క ను
జ్జ్వలమణిభూషణాళిదగ ♦ వాడనిపూవులహారముల్ గదున్
వెలయఁగ నొప్పు నద్దనుజ♦వీరునిపత్నులఁ గీశయూథపుం
డలరుచుఁ గాంచె; నంత నతఁ ♦ డాటలఁ బాటల నేర్పుమీఱఁగన్. ౩౧ 512

చ. దనుజునికౌఁగిలింతలను ♦ దన్మృదులాంకనివేశనంబులం
జనువున నొప్పి యాభరణ♦జాలముఁ దాల్చి పరుండియున్నచ
క్కనియబలాసమూహమును ♦ గాంచెను; నాతరుణీలలామ లొ
య్యన నవరత్నసంఖచిత♦హాటకకుండలముల్ ఘనంబుగన్. ౩౨ 513

తే. అంగదంబులు చెలఁగి క♦ర్ణాంతములను
నంటియుండంగఁ జూడనై ♦ యట సుషుప్తి
నొందుచుండంగఁ గాంచెను; ♦ జందురుని వి
ధముగఁ దగువారి రమ్యవ♦క్త్రములతోడ. ౩౩ 514

క. వారలకుండలములతోఁ, జారుతరం బగువిమాన♦నత్తమ మదియుం
దారాగణయుక్తాభ్రం, బేరీతిగ వెలయునట్టు ♦ లెసఁగుచునుండెన్. ౩౪ 515

క. దనుజేంద్రునితనుమధ్యలు, మనసిజు కేళులను మించు♦మద్యముఁ దమితీ
అను ద్రావి యలసి నిద్దురఁ, గని రాయాస్థలములందుఁ ♦ గడు బడలికలన్. ౩౬

సీ. ఉత్తమకాంత మఱొక్కతె నాట్యవిశారద గావున ♦ సాంద్ర వాస
నాబలంబునఁ దనం♦తన నిద్రయందును నంగహారం బను♦నట్టి యంగ
విక్షేపమున రుచి♦వెలయునంగంబుల నిడుకొని శయనించెఁ; ♦ గడుఁ బ్రియమగు
వీణను గౌఁగిట ♦ వింతగ నిడుకొని పవళించియున్నట్టి ♦ ప్రమద యొకతె

*తే. నదిని దేలుచు దైవయ♦త్నమునఁ దెప్ప
నంటి నాళము మూలము ♦ నాకుఁ గూడి
యున్న తామరతీఁగెయు ♦ ట్లొప్పియుండె;
నసితలోచన యొకతె తా ♦ నాదరమున. ౩౭ 517

క. తనకక్షయందు మడ్డుక, మను వాద్యము నుంచుకొనియె ♦ యందు సుప్తిం
గనుచున్ బ్రేమమునం జం,కను బాలు ధరించినట్టి ♦ కాంతవలెఁ దగెన్. ౩౮

చ. సురుచిరమైన యంగతతి ♦ శోభిలుచుండ ఘనస్తనంబులుం
గరము చెలంగ నొప్పునొక♦కామినియుం బటహంబుఁ బట్టియే
చిరతరసంగతుండయిన ♦ చెలువునిఁ గట్టిగఁ గౌఁగిలించుకొం
చురుముద మందునట్టు లట ♦ నొప్పుచునుండెఁ బరుండి యుండియున్. ౩౯

క. సరసిజపత్రేక్షణ యొక,తరుణియుఁ బ్రియతముని సమ్మ♦దంబునఁ గొని యొం
టరిపాటునఁ గౌఁగిటఁజే,ర్చురమణిఁ గాముకినిబోలి ♦ శుభవంశంబున్. ౪౦

తే. కౌఁగిటం జేర్చుకొనియె ని♦కామనిద్ర
నొందియుండెను; నృత్తంబు♦నందు నేర్పు
గల మఱొక్క వధూమణి ♦ కమ్రతరవి
పంచికం బట్టుకొని నిదు♦రించుచుండె. ౪౧ 521

క. కాంతునితో నిదురించెడు, కాంతారత్నంబుఁబోలి ♦ కనఁబడుచుండెన్;
వింతగ నొకమదలోచన, యెంతయుఁ బృథులంబులగుచు♦నెసఁగి పొడవులై.

ఆ. మృదులములును మఱియు ♦ హృదయప్రమోదదా
యకములునగు తనదు♦హస్తములను
మద్దెలను గ్రహించి ♦ నిద్దురపోయెను;
గందు లేనిసోయ♦గమున నలరి. ౪౨ 523

క. తనుమధ్యమమునఁ జెలఁగెడు, వనితామణియోర్తు మిగుల ♦ వాదనమునఁ దా
ను వలసి మధ్యమదంబునఁ, దనపణవము బాహుపార్శ్వ♦తలమున నొప్పన్.

* మహానదీ ప్రకీర్ణేవ నళినీపోత మాశ్రితా - అనిమూలము. నళినీ=సమూలనాళదళం పద్మజాలకం పోతం యద్వచ్ఛయాగతం ప్లవ మాశ్రితవతీవ - అనివ్యాఖ్య. ఈయభిప్రాయమే పద్యమునఁ జెప్పఁబడినదని యెఱుంగఁదగు.

సీ. శయనించియుండెను; ♦ జక్కనియొకనారి యొకకరంబునఁ బూన్కి ♦ నొక్కడిండి
మమనుగ్రహించుచు ♦ మఱియొకడింకిమమును రెండవకరంబు ♦ నను బ్రియమునఁ
గౌఁగిలించుకొనుచుఁ ♦ గమ్రశయ్యఁబరుండి తరుణుఁడౌ ప్రియునిని ♦ దనకుమారుఁ
గౌఁగిట నిడుకొన్న ♦ కాంతామణియుఁబోలెఁగనుపట్టుచుండెః నొ ♦ క్కకమలాక్షి

తే. తమిని నాడంబర మనువా ♦ ద్యమును హస్త
యుగమునం గట్టిగాఁగొని ♦ యొక్క మోహిని
మద్యమదమున వివశయై ♦ మహితశయ్యఁ
బవ్వళించెను రావణు ♦ పార్శ్వసీమ. ౫౨౫ 525

చ సలిలము నిండియున్నకల ♦ శంబును వేఱొకకాంత నిద్రచే
నలసినదౌట బోరగిలఁ ♦ నట్లుగఁ బైఁ దగఁ ద్రోసికొన్నదై
లలితరసాళిచేఁ దగుజ ♦ లంబునఁ దానును గొంతదోఁగి యా
స్థలమునఁ బవ్వళించుచు వ ♦ సంతమునన్ జలసిక్తమౌచు వ
న్నెలఁ దగుపూలహారమటు ♦ నీటుగఁ గన్పడుచుండె నయ్యెడన్. ౫౨౬ 526

క. సిద్ధురబలమున కోర్వక, ముద్దియ యొక్కర్తు హస్త ♦ మునఁ బాలిండ్లన్
దద్దయు బంగరుగిండుల, కుద్దియనందగినవాని ♦ నొక్క తెఱఁగునన్. ౫౨౭

తే. పట్టుకొని నిద్దురం జెందెఁ ♦ బద్మపత్త్ర
నయనములు పూర్ణశశిసమా ♦ ననము తనరు
వనిత యొకతుక మదమునఁ ♦ దనువు మఱచి
యట్టి వేఱొకసుశ్రోణి ♦ నాదరమున. ౫౨౮ 528

క. తనకౌఁగిట నిడుకొనుచున్, ఘననిద్రాపరతనుండెఁ; ♦ గాముకులను గా
మినులట్లు కొందఱుత్తమ, వనితలు బహుచిత్రములగు ♦ వాద్యములఁదమిన్.

క. స్తనముల నదుముచు నాలింగన మొనరిచికొనుచు సుప్తిఁ ♦ గాంచిరి; యాయం
గనలసమూహములోపల, ఘనమగు నేకాంతశయ్యఁ ♦ గడుఁ దమిమీఱన్.

తే. పవ్వళించినరూపసం ♦ పన్నయైన
యొక్కవనితామతల్లి మం ♦ దోదరినటఁ
గాంచె హనుమంతుఁ; డాతన్వి ♦ యంచితమణి
ఖచితముక్తికభూషణా ♦ కలితయగుచు. ౫౩౧ 531

చ. తనతనుకాంతి నాభవన ♦ తల్లజమున్ వెలుఁగంగఁ జేయుతే
వను గనుపట్టుచున్; గనక ♦ వర్ణము గౌరమునై నచాయయున్
దనువునఁ దోఁప రాక్షసవ ♦ తంసునకుం బ్రియయైనదౌచుఁ జ
క్కనియవరోధనాయకతఁ ♦ గాంచి మనోహరరూప మొప్పఁగన్. ౫౩౨ 532

క. అందు శయనించి యొప్పెడు, మందోదరిఁ గాంచె నచట ♦ మరుదాత్మజుఁ డా

సుందరియుఁ జారుభూషణ, సందోహము వెలయ నున్న♦చందము గనుచున్.

తే. అమ్మహాబాహు వాతన్వి ♦ యతులరూప
సంపదను గాంచి యీమె భూ♦జాతయ యగు
ననుచు నూహించి మించెడు♦హర్షమునను
మనమునం దగునానంద♦మునఁ జెలంగె. ౫౩౪ 534

తే. చప్పటులఁ గొట్టెఁ దనదువు♦చ్ఛంబు ముద్దు
పెట్టుకొనె సంతసంబున ♦ నట్టె సోలె
నాడెఁ బాడెను బరుగిడె ♦ నచటికంబ
ములను బ్రాఁకెను నైజచే♦ష్టలను జూపె. ౫౩౫ 535

పదియవ సర్గము సంపూర్ణము.

---

## ౧౧ - వ సర్గము.

మండోదరిని సీతగాదని హనుమ నిశ్చయించి పానభూమియందు వెదకుట.

క. జనకజయని మందోదరిఁ, దనమది నూహించినట్టి ♦ తగనిమనీషన్
హనుమయు నప్పుడె వదలుచు, మునుపటివలె శాంతచిత్త♦మును దగఁ బొందెన్.

చ. ధరణిజఁ గూర్చి వేఱొకవి♦ధంబగు చింతను నంతఁ బొంది య
త్తరుణి రఘూత్తమున్ వదలి ♦ తద్దయు హాయిగ నిట్టు లిందు ని
ద్దురఁ గన దన్నముం దినదు ♦ తోరపు వేడ్క నలంకరింప ని
క్కరణిఁ దలంప దెట్టిదగుఁ♦గానినురంగొన దాసపెంపునన్. ౨ 537

చ. తనపతికన్న వేఱొకని ♦ దాను బురందరుడైనఁ గైకొనం
గను దలపోయ దాన్నృపతి♦కాంతుఁడు రాముఁడు నిర్జరాళిలోఁ
దనసరివాఁడు లేఁడనుచుఁ ♦ దప్పక చెప్పఁగ నప్పుడేఁగదా
కనుక మహీజగా దిది యెం♦కర్తుక యెవ్వతియో యగుంజుమీ. ౩ 538

క. అని తలఁచి పానభూమికిఁ, జని క్రమ్మరఁ జొచ్చెఁ బూన్కి ♦ శ్వసనతనయుఁ డం
దును గొందఱంగనలు మా,గుని కేళుల నలసి యాటఁబ♦నుండిరి తమిచేన్. ౪

సీ. పాటలుపాడిన♦బడలికలను నటఁ బవ్వళించిరి; యాడి ♦ బడలికూరు
చుండిరి, మద్యము ♦ నొక్క మొగిం ద్రాగి యొడలెల్లమఱచియో♦యుండి; రందు
మురజమృదంగముల్ ♦ వరపీఠములు తలగడలుగాఁ గైకొని ♦ కడుబడలికఁ
బవళించియుండిరి ♦ పరమశయ్యలపైన శయనించి యుండిరి ♦ చానలిట్లు

తే. కొందఱుండిరి; తత్కపి♦కుంజరుఁ డట
రావణునిగాంచె నాతఁడు ♦ రమ్యభూమ

---

* స్వాం ప్రకృతిం కపిశార్దూల-అనియూ.

ణాళిఁ గై చేసికొని తమ♦హారిరూప
ములను నుతియించుకొనుభావ♦ములఁ దనరుచు. ౬॥ 540

క. గీతములకు నర్థము వి,ఖ్యాతిగఁ జెప్పుచును దేశ♦కాలంబులఁ దా
మే తెలిసి వానికిందగు, రీతిని బల్కుచును బ్రియు వి♦రించిరె యనుచున్.

క. వినుతించుచుఁ జెలువారెడు, వనితలవేవురనుగూడి ♦ బాహ్యరతములన్
మనమున కింపుగ బంధా, ళినిజక్క రమించి బహుళ♦లీలాగతులన్. ౭॥ 542

తే. నిద్రపోవుచునుండె; నా ♦ నెలఁతలగుమి
నడుమ దీర్ఘభుజుండు దా♦నవగణేంద్రుఁ
డైనపం క్తిగళుండు గో♦ష్ఠాంతరమునఁ
బొలుచు నావులలోనియా♦బోతురీతి. ౮॥ 543

క. వెలయుచునుండెను; నాచెలు,వలచేఁ బరివృతుఁడు దాన♦వపతి యపుడు కా
నల నాఁడుగజంబుల ని,మ్ములఁగూడిన గజపతివలెఁ ♦ బొలిచెన్ మిగులన్. ౯॥

క. హరిశార్దూలుఁడు దానన,వరుఁడు మహాత్ముఁడునునైన ♦ వాసవరిపుమం
దిరమున వివిధపదార్థో,త్కరమునఁ దగుపానభూమిఁ ♦ గాంచెం గడఁకన్. ౧౦॥

ఆ. మహిషమృగవరాహ♦మాంసంబులను వేఱు
వేఱుభాగములను ♦ విస్తరింపఁ
బడినవాని నొగిని ♦ బానభూమిని గాంచెఁ
బ్లవగవరుఁడు సుగుణ♦భాస్వరుండు. ౧౧ 546

క. పెనుబంగరుపళ్లెరముల, ననచరపంచాస్యుఁ డర్థ♦భక్షితములుగాఁ
గనఁబడు కేకులఁ గోళ్లను, గనియెను నాభూమియందుఁ♦గడుఁబూన్కిమెయిన్.

సీ. వాయుపుత్రుండు సౌ♦వర్చలలవణంబు దధియును జేర్చి త♦ద్దయును నేర్పు
గాఁ బక్వమును జేయఁ♦గాఁ బడియున్నట్టి పందిమాంసంబును ♦ బక్షిజాతి
యందు నొప్పారెడు♦నట్టి వార్ధ్రాణసములమాంసమును, నెమి♦ళులపలలము
శల్యావహ్వయములమాం♦సములను జింకలపలలంబుఁగాంచెను;♦బలువిధములఁ
బక్వమ్ములుగఁ జేయఁ♦బడిన కక్కురపతత్తుల మాంసమల్లె యి♦మ్ములవగంబు

ఆ. తినఁగ మిగిలినట్టి♦ఘనచకోరపుమాంస,ములను, నేకశల్య♦ములపలలముఁ
బక్వమైనమహిష♦పలలము ఛాగమాం,సమును, లేహ్యములన♦చటఁగనుఁగొనె.

క. పలువిధములఁ దగి త్రాగం,గలయట్టిపదార్థములను, ♦ గమ్రతరములున్
బలువిధములు నగుభోజ్యం,బులఁ గాంచెను వేడ్క వాయు♦పుత్త్రుం డంతన్.

తే. శర్కరయు ద్రాక్షమొదలగు♦సరసవస్తు
వులను బులునును లవణాది♦లలితవస్తు

వులను జేర్చిన [1]పాడబ♦ములను వివిధ
భక్ష్యములఁ గాంచె నాతఁ డ♦పానభూమి. ౧౬౫ 550

క. హారంబుల నూపురకే,యూరముల సమూల్యములయి ♦ యొప్పినవానిన్
జారుతరము లపవిద్ధము,లై రహిఁ దగువానిఁ గాంచె ♦ ననిలజుఁ డందున్. ౧౭

తే. పానభాజనములనుండి ♦ పాఱవేయఁ,బడినఫలములు గల్గి పు♦ష్పములు చల్లఁ
బడినదై యున్నయట్టి య♦పానభూమి, కాంతిసంపద యెంతయుఁ♦గల్గియొప్పె.

తే. మిగుల దృఢముగ నందందు ♦ బిగియఁగట్టఁ
బడినసంధులు గల్గిన♦పరశయనము
లాసనంబులు కనకర♦త్నాంచితంబు
[2]లగుట విగతాగ్నియై యుండు♦నట్టు లుండె. ౧౯ 553

సీ. పలువిధంబులగుచుఁ ♦ బలు తెఱంగులఁ బక్వములుగఁ జేయంబడి♦లలితములగు
సంస్కారములచేత ♦ సంస్కరింపంబడి పాకనిపుణతచేఁ ♦ బరఁగు[3]సూదు
లెలమిఁ బక్వముచేయ♦నింపుగులుకుచుఁ బానభూమి వేర్వేఱుగఁ♦బొలుచుచున్న
పలలంబులను, మఱి♦బహుభంగులయి సుధ మథియించునప్పుడు ♦ మహితరీతి
జనియించి తేటగాఁ ♦ గనుపట్టు మద్యంబులను, శర్కరను, మధు♦వునను,బుష్ప
ముల తేనెతోఁ, ఫలం♦బులను జేయంబడునాసవంబులను, సు♦వాసనలకుఁ
గా వేయఁబడువస్తు♦గణచూర్ణములను, నాపావని కాంచెను; ♦ బహువిధముల
నందు వేయంబడి♦నట్టి[4]హారంబుల, స్ఫాటికరాజత♦పాత్రములను

ఆ. స్వర్ణకృతములగుచు ♦ బహుతరాకృతులచే
నలరుపాత్రములను ♦ వెలయుచుండెఁ
బానభూమి యద్ది; ♦ భర్మరూప్యకృతంబు
లైనపాత్రవితతు♦లందుఁ గపిఁక. ౨౩౫ 554

క. పరిపూర్ణముగా నునుపం,గరమనురాగమునఁ జూడఁ♦గాఁదగు మేలౌ
సురఁగాంచె నందు మారుతి;, హిరణ్యమణిపాత్రములను ♦ నింపినసురయున్.

క. శ్వేతాంచత్పాత్రంబుల, నాతతముగ నింపియున్న ♦ యాసవము తగన్
భూతలమున నటు నొప్పఁగ, వాతాత్మజుఁ డాదరమునఁ ♦ బరికించె ధృతిన్.

తే. సగము మద్యముఁ ద్రావంగ ♦ సర్వముఁ దమిఁ
ద్రావఁగా, నించు కేనియుఁ ♦ ద్రాగకుండఁ
గాఁ గనంబడుభాజన♦గణము నందు
నందుఁ బావని కాంచెఁ బ్రి♦యంబుమీఱ. ౨౬ 557

1 పాడబము లనఁగా శర్కరాదివస్తువులతోఁ జేయఁబడిన భక్ష్యవిశేషములని యర్థము. 2 వహ్నిం ప్రదీప్తే వోపలక్ష్యతే-అనిమూలము. 3 సూదులు=వంటవాండ్రు. 4 మాల్యైశ్చ బహుసంస్థితైః-అనిమూలము.

క. ఒకచోఁ బలుభక్ష్యంబుల, నొకచో వేర్వేఱుగాఁగ ♦ నునుపంబడుచున్
బ్రకటములగు మద్యంబుల, నొకచోఁ దిన మిగిలియున్న ♦ యోగిరమందున్.

క. ఒకచో విఱిగినసిండుల, నొకచో నాందోళితముగ ♦ నొప్పుఘటగణం
బొకచోట సమాల్యములై, యకలంకముగాఁగ నొప్పు ♦ నంబుఫలములున్.

క. కనఁబడియె; స్త్రీలశయనా,సనములు పలుభంగులగుచుఁ ♦ జక్కఁగ వెలయున్
వనితామణులు పరస్పర,మును నాశ్లేషణములొప్ప ♦ మునుకొని నిద్రన్. ౨౯

ఆ. అందుఁ బవ్వళించి ♦ యలరుచుండఁగఁ గాంచెఁ
గపివరుండు; మఱియుఁ ♦ గాంత యొకతె
నిద్రపోవుచుండ ♦ నిద్రావశంబునఁ
గానకయె తదంశు ♦ కము మఱొకతె ౨౯॥ 561

క. ధరియించి పవ్వళింపఁగ, వరుసం గన్గొనుచుఁ దిరిగె; ♦ వాయుజుఁ డవుడా
తరుణుల నిట్టూర్పులదా, మరుత్తు సోఁకంగ వారి ♦ మాల్యవసనముల్. ౩౦॥

క. మలయానిలుస్పర్శంబున, వలె మెల్లనఁ గదలుచుండెఁ; ♦ బానధరణి శీ
తలచందనమ్ము మధురం,బులయిన మద్యములు మాల్య ♦ ములు వివిధంబుల్.

సీ. వివిధధూపంబులు ♦ వివిధరసాదులు స్నానమునకు నగు ♦ చందనమ్ము
చికురంబులకు వేయు ♦ సిద్ధధూపంబులు, నలరంగ నందలి ♦ యనిలుఁ డట్టి
వీచుచుండెను; దాన ♦ విమలసత్పరిమళములు ఘ్రాణతర్పణ ♦ ములుగ నందుఁ
జక్కఁగా వ్యాపించె; ♦ సరసిజాక్షులు పుష్పకమునందుఁ గొందఱు ♦ కర్బురాంగ
తే. నలు సితచ్ఛాయలొప్పఁ గొం ♦ దఱును, శ్యామ
వర్ణములఁ బొల్చి కొందఱు ♦ వామనేత్ర
లసితకాంతులు కొందఱు ♦ నమలభర్మ
వర్ణములఁ బొల్చి నిద్రను ♦ బరఁగి రవుడు. ౩౧ 564

క. తరుణులు వారలు నిద్రా,భరమున మన్మథుని కేళి ♦ వలనఁ గలుగుని
ర్భరకష్టంబున నుండుటఁ, బరికింపఁగ వారియవయ ♦ వంబులు రాత్రిన్. ౩౧॥

ఆ. ముడుచుకొనిన పద్మ ♦ ముల తీఁగలట్టులు, చెలఁగుచుండె; నంత ♦ లలితతేజ
మలర వెలయుపవను ♦ నాత్మజుఁడిట్లు స,ర్వంబు వదల కతని ♦ భవన మెల్ల.

క. కలయంజూచెను; నతనికి, నిలాత్మజయుఁ గానరాక ♦ యేయుండెను; నా
లలనల నవు డాహనుమయుఁ, గలయంగన్గొనుచుఁ బరుని ♦ కాంతల నచటన్.

క. కనుటన్ ధర్మము లోపిం,చునె యనుభయమునను వారిఁ ♦ జూడందగునో
కనరాదో యనెడుసంశయ,మునను మదిం జింతమిగులఁ ♦ బూనెం దనలోన్.

ఆ. పరునిరాణివాస ♦ మరసితి నందున్న, తరుణులను సుషుప్తిఁ ♦ దగిలియున్న
వారిఁ గాంచినాఁడ ♦ నీరీతి రాతిరి, ధర్మలోపము నిది ♦ తలఁప నాకు. ౩౨॥

క. కలిగించు; నెప్పుడైన నొ,రులభార్యలఁ జూడవలయు ♦ రూఢిఁగ నని వా
రలవిషయమై మదతులఁ, జలింపఁ జేసినది లేదు ♦ క్షణమాత్రంబున్. ౩౮

చ. పరవనితామణీతతుల ♦ బాగుగఁ గాంచితి నిద్దియొప్పునే
వరమతులాదరింతురె, కృ♦పాపరతంత్రుల కిద్ది న్యాయమై
పరఁగునె యంచు నెంచె; నిటు♦భవ్యయశంబునఁ బొల్చినట్టి యా
మరుదధినాథనందనుని ♦ మానితచిత్తము సుప్రసన్నమై. ౩౯ 571

చ. చలనము లేక కృత్యమును ♦ జానుగఁ జేయఁగనొప్పియుంట ని
మ్ముల నిటు చింతదోఁచె; నిట ♦ ముగ్ధలు రావణుపత్నులెల్ల వి
చ్చలవిడి వేఱుపూరుషుల♦జాడ కనంబడదన్న నమ్మికం
గలవిలపాటు లేకయె సు♦ఖంబుగ నిద్దురఁ బూనియుండఁగన్. ౪౦ 572

క. కనినాఁడ లెన్నగా నై,నను మన్మథవికృతి నామ♦నంబున నుంతై
నను గల్గ లేదుగా కా,వున శుభ మశుభంబుఁ జేయఁ ♦ బూనినయెడలన్. ౪౧

* తే. ఇంద్రియములకు మనసె యా♦హేతువట్టి
మనము చలనంబు నొందక♦యె నిలిచి యిపు
డున్నయది నాకు; నీకాంత♦లున్నచోటు
వదలి వేఱొకచో రఘు♦వరునినతిని. ౪౨ 574

క. కనుఁగొన శక్యం బెటులగు?, వనితలయం దెపుడుగాని ♦ వనితలు చూడం
గనఁబడుదురు కావున సీ,తను వెదకఁగ నిందె నాకుఁ ♦ దగుఁ జక్కంగన్.

క. ఏజంతు వెట్టిజాతికిఁ, దాఁ జేరునొ యందె దానిఁ ♦ దగు వెదకఁగఁ బం
కేజవిలోచన వెదకం,గాఁ జనునే లేళ్లయందుఁ ♦ గననగునె యటన్. ౪౩

క. పరిశుద్ధచిత్తమున నే, వరసితి శుద్ధాంత మెల్ల ♦ నవనిజయో నా
వరదృష్టిఁ దగులకున్నది, పరికించెద నింక ననుచు ♦ వాయుజుఁడంతన్. ౪౪

క. తనశౌర్యమెల్లఁ గన్పడఁ,గ నటన్ గంధర్వదేవ♦కన్యల నురగాం
గనలన్ గనియెను సీతను, గనఁజాలం డయ్యె నందుఁ ♦ గరము వెదకియున్.

క. వీరుండగునాతం డిటు, ధారణిసుతఁ గాన కచటఁ ♦ దగునుత్తమకాం
తారత్నంబుల నితరుల, వారిజనేత్రలను గాంచి ♦ వారలయందున్. ౪౬ 579

చ. వెనుకకు నేగుదెంచి తన♦విక్రమమెల్లఁ గలంగఁ దాను నె
మ్మనమునఁ జింతఁబొంది పరి♦మార్గణదక్షతఁ బూని యత్నముం
గొని యలపానభూమి విడి ♦ క్రూరమహాసురకాంతలుండు తా
వున వెదకంగఁబూనె మదిఁ ♦ బొల్చెడుకౌతుకసంపదున్నతిన్. ౪౭ 580

పదునొకండవ సర్గము సంపూర్ణము.

---

* మనోహి హేతు స్సర్వేషా మింద్రియాణాం ప్రవర్తనే-అనిమాలము.

## ౧౨ - వ సర్గము.

సీతఁ గానక హనుమంతుఁడు విచారించి మరల నంతఃపురమున వెదకుట.

చ. హనుమయు జానకిం గనఁగ ♦ నాకృతిఁ బూని సురేంద్రశత్రునా
దనుజనిగేహమధ్యమగ♦తంబులుగాఁ దనరారుచిత్రగే
హనిచయముల్ లతాగృహము ♦ లట్లె నిశాగృహముల్ గనంగ ద
ర్శనమున నేత్రపర్వము నొ♦సంగెడుసీతను గాన కంతటన్. ౧ 581

క. జానకి రఘునందనుసతి, నేనెంతయుఁ బూన్కి వెదక ♦ నేతెంచితి నీ
దానవుపురమున వెదకితి, నైనను గనరా దదేమొ ♦ యని తనలోనన్. ౨

తే. ఎంతవెదకినఁ గనఁజాల ♦ నింతిఁ గాన
నిజముగాఁ జచ్చియుండు నా♦నిర్జరులకు
నైనఁ జొరరానితావున ♦ దానవేంద్రుఁ
డునుపఁగా నుండునా దుఃఖ♦మొంది కుంది. ౩ 583

క. జనకజపాతివ్రత్యం, బనునగ్ర్యం బగుచుఁ బూజ్య♦ను గుమార్గమునం
దనిశము తత్పరయగుఁ గావున నిందితకర్ముఁ జూచుఁ ♦ బోలుచు దనుజుఁడున్.

క. తనుఁ బట్టి చలముమీఱఁగ, సునిశితఖడ్గమున నఱకఁ ♦ జూర్ణితయై చ
చ్చెను గాఁబోలును గాన నె, కనఁబడకున్నయ దదెన్ని♦గతుల వెదకినన్;. 3

సీ. జనకేశ్వరునిప్రియ♦తనయ, వికారావయవులు, వివర్ణను♦లు వికృతంపు
వేషులు, పొడవులై ♦వికృతములై నయాస్యంబులు, వికృతన♦యనము లలరఁ
గనఁబడురావణు♦వనితలఁ గని భయంబునఁ జచ్చియుండును; ♦ జనకతనయఁ
గానక వైరిపై ♦ గాఢపౌరుషమును నెఱపక, కపులతో ♦ నేను గాల

తే. మును జరించుటలోఁబుచ్చి ♦ వనచరేంద్రు
కడకు నిప్పుడు పోవంగఁ♦గాదు, పోదు
నేని బలవంతుఁడై వాన♦రేంద్రుఁడైన
యినజు నతితీక్ష్ణదండనం♦బును గనుదును. ౬ 586

క. దనుజేంద్రునంతిపురమును, గనినాఁడను వానిపత్ని♦గణముల నెల్లం
గనినాఁడ సాధ్వి జనకజఁ, గనఁజాలను నాశ్రమంబు ♦ కడువ్యర్థమయ్యెన్.

చ. జనకజఁ గాన కేనటకుఁ ♦ జయ్యనఁబోయిన నన్నుఁజూచి యా
వనచరులెల్లఁ గూడుకొని ♦ ప్రశ్నము దేమొనరింతు; రోయిపా
వని! యట కేగి యేపనిని ♦ బాగుగఁ జేసితి వద్దిచెప్పు మా
కని యడుగంగ జానకిని ♦ నచ్చటఁ గాననినేను వారికే
మని తగునుత్తరంబిడుదు ♦ నచ్చటికేగక యుండెయుండినన్. ౮ 588

క. కనిపెట్టియుండి నారామిని నెంచి కపీంద్రులెల్ల ♦ మిక్కిలికష్టం

బున దీక్షఁబూని చత్తురు, ననుఁబంపి మదీయవర్త♦నంబుఁ బొగడుచుఁ దన్. ౮

సీ. అదెవచ్చు నిదెవచ్చు ♦ నని ముచ్చటించెడు వృద్ధుఁడౌ భల్లూక♦విభుఁడువానిఁ
బురికొల్పునావాలి♦పుత్త్రుండు తక్కినవానరు లటకేగి ♦ వచ్చినట్టి
నన్ను నేమేమినిం♦దావాక్యముల నొవ్వఁజేయుదురో; మఱి♦చిత్తమునను
గల్గునుత్సాహమే ♦ కలుములకెల్లను మూలమౌ నద్దియే ♦ ముఖ్యసుఖము

తే. తగినయుత్సాహమే కార్య♦తతుల నెప్డు
నడపుచుండును నది లేక ♦ నడవ దెద్ది
ప్రాణి యేపనిఁజేయునో ♦ పరఁగ దాని
సఫలముగఁ జేయుచుండు ను♦త్సాహ మెపుడు. ౧౦౪ 590

చ. కనుకనె నేను దానిఁ గడఁ♦కన్ మనమందున నాశ్రయించి నీ
తను వెదకంగ యత్నమును ♦ దప్పక చేసెద నింకనున్; మహా
దనుజుఁడు వీఁడు దర్పమునఁ ♦ దద్దయు నొప్పినవాఁడె యైననీ
తనిపరిపాలనంబున ని♦తాంతము నొప్పెడునన్నిభాగముల్. ౧౧౪ 591

[1]క. కలయన్ వెదకెదఁ బానస్థలముల, సుమనందిరములఁ; ♦ జతురక్రీడా
విలసద్గృహములఁ జిత్ర, స్థలముల నిష్కుటగణంబుఁ ♦ దగినవిధమునన్. ౧౨

తే. వెదకినాఁడను బురమున ♦ వెలయువీథు
లను విమానంబులను జూచి♦తిని బ్రయత్న
మూని యట్టైన మరల న♦వ్వాని నెల్ల
వెదకెదనటంచుఁ జింతించి ♦ విసుఁగుమాని. ౧౩౪ 593

సీ. ధరణిసద్మములఁజై♦త్యగృహంబులను,గృహంబులకుఁ జేరువగఁ గ్రి♦ందలకుఁదగిన
యట్లు నిర్మించిన♦యట్టిగృహంబుల, వెదకుచు నాకపి♦వీరుఁ డచటి
యున్నతస్థలముల ♦ నొయ్యన నెక్కుచుఁ, గ్రిందికి దుముకుచుఁ♦గేళిమెఱయఁ
గా నిల్చి చూచుచుఁ,♦గడువడిఁబోవుచుద్వారముల్ తెఱచుచుఁ♦దలుపులఁబడఁ

తే. ద్రోయుచు, గృహాంతరములలోఁ ♦ దూఱుచుఁ గడు
వడిగ వెలుపలఁ జేరుచుఁ ♦ [2]బుడమిలోని
యింద్లలోనికిఁ దిగుచుఁ బై ♦ కేగుదెంచు
చును, సమస్తస్థలంబులఁ ♦ గనియె నిట్లు. ౧౬ 594

[3]క. దనుజేంద్రునియంతఃపురమున నాల్గంగుళములైన ♦ మునుకొని కపిత్రొ
క్కనిచోటుకానరాక,య్యెను బ్రాకారంబునడుమ ♦ నెనఁగుస్థలములన్. ౧౭

---

1 తథాపుష్పగృహాణిచ-అనిమా. 2 ప్రపతన్ నివ్వతం శ్చాపి-అనిమా. బిలగృహాదీని నీచ స్థానాని ప్రథమ మధిరుహ్య తత స్సముద్గచ్ఛన్-అనివ్యాఖ్య. 3 చతురంగుళమాత్రోఽపి నావకాశ స్సవిద్యతే-అనిమా.

ఆ. చైత్యవేదికలను ♦ జారుదీర్ఘికలను
బుష్కరముల నతఁడు ♦ పూన్కిఁ జూచె;
మఱియు నందుఁ గనియె ♦ మారుతసూనుండు
బహువిధవికృతలగు♦వనితలఁ గని. ౧౭ 598

క. వారలలో జనకసుతన్, శ్రీరామునిసాధ్వి లేమిఁ ♦ జింతిల్లెను; నీ
ధారణి సౌందర్యంబున, నేరమణిని బోల్పరాక ♦ యెసఁగెడువారిన్. ౧౮

క. సురుచిరనేత్రల విద్యా, ధరకాంతలఁ గనియుఁగాని ♦ ధరణీజాతన్
బరికింపఁజాలఁడయ్యెన్;, మరుత్సుతుండు శ్రోణిభార ♦ మందగ మనలన్. ౨౦

తే. పూర్ణచంద్రాస్యలం గాంచె ♦ భుజగకన్య
లను సుమధ్యమయైనసీ♦తను గనంగఁ
జాలఁడయ్యెను; దానవే♦శ్వరుఁడు బలిమి
దెచ్చి చెఱనుంచినఫణుల ♦ తెఱవలఁ గనె. ౨౧ 599

క. జనకజమాత్రము గనఁడయ్యెను; దీర్ఘభుజుండు మారు♦తేంద్రాత్మజుఁ డా
తనుమధ్య సీతఁగానక, మనమున దుఃఖించె నితర♦మహిళలఁ గనుచున్. ౨౩

క. వనచరనాథులయత్నం, బును స్వోదధిలంఘనంబుఁ ♦ బోలఁగ వ్యర్థం
బు నగుటఁ దలంచి మరల్, ఘనచింతాకులతఁబొందెఁ♦గరువలిసుతుఁడున్.

తే. అవ్విమానంబు దిగి మనం ♦ బధికచింత
నొంది కలవిలపాటొంద ♦ నొక్కరీతిఁ
గా మనంబునఁ దలపోయఁ ♦ గడఁగె నేవి
ధమున జనకజఁ గానంగఁ ♦ దగునటంచు. ౨౪ 602

పంద్రెండవ సర్గము సంపూర్ణము.

---

## ౧౩ - వ సర్గము.

హనుమంతుఁ డశోకప్రాకారము నెక్కి బహువిధంబులఁ జింతించుట.

తే. అటువిమానంబునుండి యా♦హరివరేణ్యుఁ
డింద్రనీలమయంబయి ♦ యెసఁగుచున్న
యట్టిప్రాకారమును జేరి ♦ యంబుదాంత
రమున విద్యుత్తురీతి వే♦గమును గాంచి. ౧ 603

చ. తనరుచునుండె; రావణుని ♦ ధామమునుండియె సాలమొంది యం
దును రఘురాముపత్ని ఘన♦తోయరుహాక్షిని గాన కాత్మలో
నన తలపోయఁజొచ్చె రఘు♦నాథునకుం బ్రియమాచరింప లం
కను బలుమాఱు వే తిరిగి ♦ కాంచితి నెందును నెంతచూచినన్. ౨ 604

చ. ధరణిజ శోభనాంగి యిలఁ ♦ దద్దయు నొప్పెడుసీత గానరా;
దరసితిఁ బల్వలంబులను ♦ నల్పసరిత్తతులన్ స్రవంతులన్
సరసుల సత్తటాకములఁ ♦ జాల ననూపవనాంతసీమలన్
[1]జొరఁదగనట్టికొండలను ♦ జూచితిఁ బల్మఱుఁ బెక్కుతావులన్. ౮ 605

క. ఇక్కడిధరణిని వెదకితి, నెక్కడనేఁ గానరా ద♦హీనగుణములన్
బెక్కగతులచే ఖ్యాతికి, నెక్కినదశ్మాపుత్రి సీత ♦ యేలొకొ తెలియన్. ౮½

తే. గృధ్రరాజైనసంపాతి ♦ కీర్తిశాలి, పలికె నిందున్నయది రాము♦పత్ని యనుచు
నతనివాక్యంబుచొప్పున ♦ నరసినాఁడఁ, గాని జానకి నాకిటఁ ♦ గానరాదు. ౯½

సీ. దివ్యమైనట్టి వి♦దేహదేశంబున నిర్మలాచారులై ♦ నెగడురాజు
లుండెడుమిథిలయం♦దురుతరకర్మనిరతుఁడైన జనకరా♦జతనయయయి
తా నయోనిజగ ను♦త్పత్తిసి గాంచిన సీతయు నతిదుష్ట♦శీలుఁడైన
రావణుతోడ మి♦త్రతను బాటించునా ? యట్లొలచేయు ?; నా♦యనురుఁ డామెఁ
తే. దీసికొని వేగ యెగిరి యే♦తెంచునపుడు
రామబాణాళి స్మృతిగోచ♦రంబుగాఁగ
భయము చెందెడుతఱి మధ్య♦భాగమందుఁ
బాతమును గాంచెనేమొ యా♦పరమసాధ్వి. ౭½ 608

చ. దనుజుఁడు సిద్ధసేవ్యమయి ♦ దారుణమై తగునభ్రమార్గమం
దు నెలఁతఁ దీసికొంచుఁ జనఁ ♦ దోయరుహాక్షి [2]సుసాధ్వి సంభ్రమం
గని హృదయంబు భీతిఁ గనఁ♦గా నచటం బడియుండునంచు నా
మనమునఁ దోఁచెడిన్; దనుజ♦మండనుఁ డామెను బూన్కిమీఱఁగన్. ౧౦½

చ. ధరఁ బడకుండఁ బట్టుకొని ♦ తాఁ జనువేళ విశాలనేత్ర యా
ధరణిజవానిదోస్తతిని♦తాంతసుదుస్సహపీడచేత ని
ర్భరదనుజోరువేగమునఁ ♦ బ్రాణములన్ విడనాడియుండు నె
వ్వరునను నోర్వరామినని ♦ భావమునందుఁ దలంతుఁ జక్కఁగన్. ౯½ 610

క. జలనిధిదాపుగ నంబరతలమున రావణుఁడు పోవ ♦ ధరణిజ భీతిం
గలఁగుచు వ్రేలాడుచు నా, జలనిధిఁ బడియుండునేమొ ♦ సత్వము దూలన్.

క. కట్టా ! [3]తుద్రనురారియు, నెట్టన బలవంతపెట్ట ♦ నిర్మలశీలం
బట్టి తగం గాపాడఁగఁ, బట్టినతనపట్టువిడని♦వనితామణిపై. ౧౧ 612

చ ఘనమగుకోపమూని తనుఁ ♦ గావఁగ బంధువొకండు లేమి వే
దనలఁ గలంగి దీనయగు♦తన్వి గుటుక్కన మ్రింగినాఁడొ; లే

---

1 దుర్గాశ్చ ధరణీధరాః-ఆదిమూలము. 2 మన్యే పతిత మార్యాయాః-ఆదిమూలము. ఆర్యాశబ్దార్థమే యిట సుసాధ్వి యనుపదము తెలుపును. 3 అహో క్షుద్రేణవానేన-ఆదిమూలము.

క న్నెలఁతలందు మిన్నయగు ♦ క్ష్మాసుతఁ గాంచి సురారిపత్ను లె
ల్లను నతిదుష్టభావలయి ♦ [1]లాలితశీలను దుష్టభావహీ
న్యను నసితేక్షణన్ దిరిరొ ♦ యాసురకృత్యము వెల్లడిల్లఁగన్. ౧౨ 613

క. పరిపూర్ణచంద్రతుల్యము, సరసిజపత్రేక్షణంబు ♦ చారుతరమునై
పరఁగురఘురామువక్త్రము, నిరతము దలపోయుచున్ వి♦నిర్మలమతినై. ౧౩

తే. కృపణయయి సీత ప్రాణముల్ ♦ కెరలి విడిచె
నో, మహీజాత య♦యోధ్యామహాత్మ
రామ, యోలక్ష్మణా, సిరుల్ ♦ రమణఁ గులుకు
నో యయోధ్యాపురంబ, య♦యోధ్య! యటంచు. ౧౪ 615

క. పలుమఱుతలఁచుచు దీనతఁ, బలవించుచు దిక్కులేక ♦ వాసెనొ తనువున్;
లలన, యొకవేళ రావణు, నిలయంబున దుర్గమ మగు♦నెలవున నొకచోన్.

[2]తే. దాఁపఁగాఁబడి పంజర♦స్థమగుశారి
కవలెఁ బలవించుచుండును; ♦ క్ష్మాసుతయయి
జనకపుత్త్రికయయి మహా♦సత్త్వశాలి
యైన రామునిపత్నియై ♦ యశముఁ గాంచి. ౧౬ 617

క. తనుమధ్యయగుచు నలరెడు, వనితామణి యుత్పలాక్షి ♦ వాసవరిపుఁడే
మనినను లోఁబడునే? చిం,తను దీనిం బూననేల! ♦ త్వర నరిగి తగన్. ౧౭

[3]చ. జరిగినవార్తనెల్ల రఘు♦సత్తముచెంతను జెప్పఁగూడదా
కరము విచారమేలయనఁ ♦ గాంతపయిం దమిగల్గురామభూ
వరునకు దాఁపఁగాఁబడెనొ ♦ వార్ధిని దాఁ బడి చచ్చెనో, మహా
విరహముచేతఁ దాళకయె ♦ వే మృతినొందెనొ యీవిధంబులన్. ౧౮ 619

క. జనకజగుఱించి చెప్పం, జన; దాసరసీరుహాక్షి ♦ సాధ్వి యొచటనుం
గనఁబడలేదన మృత్యువుఁ, గనునాతఁడు గాన దోష♦కలితుఁడ నగుదున్.

తే. చెప్పకున్నను స్వామివం♦చించినట్టి
దోషమొందును గనుఁగానఁ ♦ దోఁచ దేమి
చేయవలయునొ, దీనిని ♦ జిత్తమందుఁ
[4]దలఁపఁగ విరుద్ధముగ నివ్వి ♦ వెలయుఁగాదె. ౧౯ 621

క. అనుచుం జింతించెను; బా, వని మఱియు నిదిట్టులుండ ♦ బాగుగ నిపుడే
పనిఁ జేయఁదగును, జేయం, గను సిద్ధింబొందు నెద్ది ♦ కడు వేగముగన్. ౨౦

---

1 అసితేక్షణా. అదుష్టా దుష్టభావాభిః-అనియాలము. 2 జనకస్యసుతా సీతా రామపత్నీ సుమధ్యమా, కథ ముత్పలపత్రాక్షీ-అనిమూ. 3 ఇందలి ప్రథమపాదము వ్యాఖ్యార్థమును బ్రతిపాదించును. 4 విషమం ప్రతిభాతిమే-అనిమూ.

క. అనుసీపకుము గూఁతిచి, తనమది యోజించె నిట్లు; ♦ ధరణీజాతం
గనకయె వనచరపతిప, త్తనమునకుం బోదునేని ♦ తగనటు నాకుఙ్. ౨౦

తే. కలుగుపురుషార్థ మెయ్యది? ♦ కష్టసాధ్య
మైన జలనిధిలంఘన ♦ మసురనగర
మును బ్రవేశించుటయు, దితి♦తనయులఁ దగఁ
గనుటయును నివ్వి వ్యర్థముల్ ♦ గావె తలఁప. ౨౧ 624

చ. పురమున కేగినంతఁ గపి♦పుంగవుఁ డేత్తెఱ నన్నుఁజూచి యే
వరుసఁగ మాటలాడునొకొ ♦ వానరులందఱు నన్నుఁగాంచి యా
తురత నదేమి పల్కుదురొ ♦ తోయరుహాననఁ జూచిరాని నఙ్
[1]వరమతులై నరాఘవులు ♦ పల్కుదురో యెటుః తోఁపదేమియుఙ్. ౨౨

మ. చని కాకుత్స్థుని రాముఁ గాంచి యెచటఙ్ ♦ సాధ్వీం గనంజాలకే
నినుఁజూడం జనుదెంచినాఁడ ననుచుఙ్ ♦ నేనెంతయో యప్రియం
బునుబల్కఙ్ విడనాడుఁ బ్రాణముల; నా♦భూపుత్రినింగూర్చి [2]యిం
తనిభాషింపఁగరాక తీక్ష్ణమయి యా♦త్యంతంబు క్రూరంబునై. ౨౩ 626

తే. పరుషమై యింద్రియాళితా♦పకర మధిక
దారుణంబును నయినమ♦ద్దత్తవాక్య
మును వినుచుఁ బ్రాణములఁ బాయు; ♦ ఘనుఁడు రాముఁ
డిట్లు కష్టంబునొంది తా ♦ మృతిని గనఁగ. ౨౪ 627

క. మనమున నెంచినఁ గని యా,తనియందు భృశానురక్తిఁ ♦ దగ మేధయు నొ
ప్పునెగడులక్ష్మణుఁ డుండఁడు;, తనసోదరులిట్లు పంచ♦తను బ్రాపింపఙ్. ౨౫

చ. విని భరతుండు మృత్యువును ♦ వేగము పొందఁగలండు, మృత్యువాం
దినభరతుం గనుంగొనుచు ♦ దీనత లక్ష్మణుసోదరుండు చ
య్యన మృతినొందఁగాఁగలఁ డ;♦హార్యతరంబగుకష్టమొంది స
త్తనయులు మృత్యువుం గనఁగఁ ♦ దల్లులు ముప్పురు దుఃఖమగ్నమై. ౨౬

చ. పరమపదంబు చేరుట ధ్రు♦వంబు; రఘూత్తముఁ డిట్లు చావఁగా
నిరతము [3]దాఁ గృతజ్ఞుఁడయి ♦ నిత్యము సత్యరతుండునైన వా
నరపతిసూర్యనందనుఁడు ♦ నైజనువాక్యము తప్పిపోయెనం
చురుతరతాపమొంది కను♦నొయ్యన మృత్యువు రాముసెంచుచుఙ్. ౨౭

చ. పెనిమిటి మృత్యువుంగనఁగ ♦ వేదనఁ గుందుచు భర్తృశోక మొ
య్యనఁ దనునొంప దీనయయి ♦ యార్తినిబొంది విమోదయాచుఁ జ

1 తౌవా దశరథాత్మజౌ-అనిమూ. 2 పరుషం దారుణం క్రూరం తీక్ష్ణ మింద్రియతాపనం-అనిమూ. 3 కృతజ్ఞ స్సత్యసంధశ్చ సుగ్రీవః ప్లవగాధిపః-అనిమూ.

య్యన రను యంతమొందుఁ; బతి ♦ యంతము నొందినదాసనే మనం
బున భృశపీడనొంది వగఁ ♦ బూని కృశించుచు నున్నతారయున్. ౩౦ 631

క. వనచరనాథుఁడు మృతినిం, గనఁగాఁ దాఁ జావఁగలదు; ♦ కడుఁ బ్రేమను ద
న్గనుఁదలిదండ్రులచావును, బినతండ్రివినాశనంబు ♦ వే తనునొంపన్. ౩౧ 632

తే. అంగదుండును ధరియింపఁ ♦ జనువులఁ; దమ
ప్రభువు సుగ్రీవుఁ డిటుచావఁ ♦ బరితపించి
దిక్కులేమికి ఖిన్నులై ♦ యుక్కడక్కి
కపులు [1]తమపిడికిళ్లను ♦ గరతలముల. ౩౨ 633

క. శిరములను గొట్టుకొందురు;, పరమయశస్కుఁడగుకీశ♦పతి వానరులన్
నిరతము [2]సాంత్వనములచే, సురియాదల దానములను ♦ మన్నించుటచేన్. ౩౩

ఆ. అతనియందు భక్తి ♦ యధికంబుగాఁగల్గు, వారలాట నట్టి♦వనచరపతి
చావఁ గపులు ప్రాణ♦సంతతి విడువంగఁ,గలరు దుఃఖములను ♦ గళవళించి.

చ. వనచరులింకఁ గానలను ♦ బర్వతసీముల నాలయాదులు
న్న నెలవులందు నెందునయి♦నన్ గుమిగూడి విహారసౌఖ్యముం
గనరు; ప్రభూత్తముండు మృతిఁ♦గాంచినఁ దద్వ్యసనాభిభూతులై
తనయకళత్రమంత్రిసహి♦తంబుగఁ గొండల కేగి యార్తులై. ౩౫ 636

తే. విషమభాగములం జేరి ♦ పృథ్వీధరశి
ఖరతలములెక్కి పడి వాయఁ♦గల రసువుల;
నింకఁ గపులెల్ల, నురిచేత♦ నేని విషము
ద్రావియే నగ్నిఁబడియేని ♦ చావఁగలరు. ౩౬ 637

సీ. ఉపవాసముననొ, యా♦యుధములచేతనో, చచ్చుట నిజము; నే♦జనకతనయఁ
గానకపోయిన ♦ మానగరంబున నెచ్చటఁ జూచిన♦నేని ఘోర
మగురోదనము విన♦నగును, నిక్ష్వాకువంశవినాశనము వన♦చరకులమున
కును నాశనము గల్గు♦నని తోఁచుచున్నది; గనుక ననర్థంబుఁ ♦ గలుగఁజేయు
తే. నేను నిటనుండి పురికిని ♦ బోను నిజము, సీతఁ గానక సుగ్రీవు♦చెంత కరుగఁ
జాల; నేనట కేగ కిచ్చటనె యున్న, ధర్మమతులు మహారథుల్ ♦ దాశరథులు.

[3]చ. జనకజఁ జూచివత్తునని ♦ స్వాంతములందు ఘనాశఁబూని ప్రా
ణనికరమున్ ధరింతురు; మ♦నఃపరిశుద్ధత నొప్పుచున్నయా
వనచరు లోర్చియుందు; రిట ♦ వారిజలోచన సీతఁ జూడకు
న్ననిఁకఁ గరద్వయంబునకు ♦ నాకులభించిన యంత యన్నమున్. ౪౦ 639

---

1 శిరాం స్యభిహనిష్యంతి తలై ర్ముష్టిభిరేవ చ- అనిమూలము 2 సాంత్వే నానుప్రదానేన మానేనచైవ- అనిమూలము. 3 హస్తాదానో ముఖాదానో నియతో వృక్షమూలికః- అనిమూలము. హస్తాదానః=[illegible]తితఫలపర్ణాద్యాశీ- అనివ్యాఖ్య.

తే. నోటఁబడినంతమాత్రము ♦ నూలుకొనుచు
నేభుజించుచుఁ దమి నవ♦నీజమూల
ముల నివాసము చేయుచుఁ ♦ గలఁగని మతి
నియతి మూఁడవయాశ్రమ♦నిరతిఁ గనుచు. ౪౧ 640

క. నివసించెదఁ; గాదేన్,ర్ణవసీములఁ జవుకుపట్ల ♦ రమ్యఫలములున్
సువిమలజలమూలములు గ,లవు గావున నిందు సుస్థ♦లంబున నొకచోన్.

తే. చితిని గావించుకొని సము♦ద్ధతిని [1]నరణి
జముగునగ్నిఁ బ్రవేశించి ♦ జవమున నను
పంచకంబును విడిచెదఁ; ♦ బరమనియతి
నేను బ్రాయోపవేశంబుఁ ♦ బూని పూన్కి. ౪౨ 642

సీ. ఉపవాసమేయుండి ♦ యొప్పగ నాత్మను దనువుననుండి చ♦క్కనివిధమున
విడిచిపుచ్చెద నంత ♦ విగ్రహంబును దీనిఁ గాకులుపులులాది♦గాఁగలయవి
భక్షింపఁగల; విట్టి♦పద్ధతి నాత్మను వదలుట దోషమో♦బ్బంగిఁగాదు
[2]ప్రాయోపవేశంపుఁ♦బద్ధతిఁ జచ్చుట మహనీయులైనట్టి♦మానులనుమ

తే. తించినదియేయటంచుఁ ద♦లంచువాఁడ;
జానకిని జూడకున్న నే♦జలములోన
దుముకి చచ్చెద; [3]నీరాత్రి ♦ తొలుతఁ బత్త
నాధిదేవత గెలుచుట ♦ నతిశుభముగ. ౪౩ 643

క. మనమునకుం దోఁచినయది, జనకజ వెదకంగఁదగిన♦చంద్రికయుంటన్
మనమున కింపై సద్యశ,మును నొసఁగుటయో మాల్య♦మును దాల్చినదై.

క. అనిలతనూజుఁడు పురిఁజొ,చ్చినరాత్రియటంచుఁ గీర్తిఁ ♦ జెందినదై నే
ను నిటన్ జాగరణంబును, గనుటన్ దీర్ఘముగ నిద్ర ♦ కనఁబడుచుఁ గదున్.

తే. పరఁగునీరాత్రి రాముని♦పత్ని నాకు
నగపడకయుంట వ్యర్థమే♦యయ్యె; [4]మృతిని
గనుటకన్నను బ్రదుకుట ♦ కమశుభంబు
గాన నియతుండనై తరు♦గణముక్రింద. ౪౬ 646

క. కాపురమును జేయుచు నేఁ, దాపసినై యుండఁగలను; ♦ దన్వియు నాకుం

---

1 సమిద్ధ మరణీసుతం-అనిమూలము. అరణీసుతం=అరణ్యుత్పన్నమ్ - అనివ్యాఖ్య. అనఁగా నగ్నియని భావము. 2 ఇదం మహర్షిభిర్దృష్టం నిర్యాణ మితి మే మతిః-అనిమూలము. 3 సుజాత మూలా సుభగా కీర్తిమాలా యశస్వినీ, ప్రభగ్నా చిరరాత్రీయం మమసీతా మపశ్యతః-అని మూలము. దీనికి వ్యాఖ్యాతలు వ్రాసిన సమంజసార్థము ననుసరించి యీ మొదలుగుపద్యములు వ్రాయఁబడినవని యెఱుంగవలయు. 4 ఆత్మత్యాగాపేక్షయా తాపసభావఏవ జ్యాయాన్ - అని వ్యాఖ్య.

జూఁపట్టుకున్న నాపురి, కేపో; [1]సంగదుని మఱియు ♦ నితరకపితతిన్. ౪౫ 647

క. కనఁగూడదా యటన్నన్, జనకజ యెందుండునట్టి ♦ జాడ తెలియకే
జనినంత నంగదాదులు, వనచరు లంతమును బొందు ♦ వారు నిజముగన్. 648

క. [2]పురుషుఁడు తా మరణించినఁ, బరఁగును బలుదోషములోగి ♦ బ్రదికియెయున్నన్
దరుణమున నెప్పుడైనను, సురుచిరశుభవితతి మరలఁ ♦ జూడంగలుగున్. ౪౭

క. కనుకన్ ధరించియుండెదఁ, దనువున నసువుల నదెట్టి ♦ తరుణంబుననై
నను శుభము గలిగి తీఱెడు; నని పలుమఱు వేవిధముల ♦ నాత్మ [3]వగచుచున్.

చ. వనచరకుంజరుండయిన ♦ వాయుతనూభవుఁ డెంతచింతచే
సిన దరిఁజేరఁడయ్యె; మఱి ♦ చిత్తమునం దిటులెంచె రావణున్
ఘనబలుఁ బంక్తికంఠు సుర ♦ కల్పునినైన వధించిపుత్తు న
ద్దనుజవరుండు దొంగిలిన ♦ తన్వి విదేహనృపాత్మజాతయున్. ౪౯ 651

క. కనఁబడకపోవుఁగా కతఁ, డొనరించిన యపకృతికిని ♦ నొప్పుగ బదులే
నొనరించినట్లయగుఁగద;, పనియిది సనుకూడ దేని ♦ పౌరుషములరన్. ౫౦

క. ఈరావణుఁ గడలికిఁబైఁ, గా రయమునఁ జెండురీతిఁ ♦ గాఁ ద్రిప్పుచు నే
శ్రీరామున కర్పించెద, [4]నేరీతిం బశువు నగ్ని ♦ కిత్తురో యట్లే. ౫౧ 653

చ. అనియిటు సీతఁ గానక మ ♦ హార్తిని బొందుచు ధ్యానశోకముల్
పెనఁగొనఁ జింతనొందెఁ; బరి ♦ పీడితచిత్తమునందు నెంచె ని
ట్లనిపలుమాఱు సద్యశము ♦ నందినసీతను జూచుదాఁకఁ బ
త్తనమును దీని నే వెదకె ♦ దన్; మఱిగృధ్రవరేణ్యువాక్యమున్. ౫౨ 654

తే. నమ్మి శ్రీరాము నిచటికి ♦ రమ్మటంచుఁ
బిలుచుకొని వచ్చియుండినఁ ♦ బ్రేయసిఁ గన
కందులకు నాగ్రహించుచు ♦ నందఱఁ గపు
లను దహించియె యుండు; నే ♦ ను నిట నియతి. ౫౩ 655

క. నియతాహారుఁడనై యింద్రియనిగ్రహ మొప్ప నుండుఁ ♦ దెంపుమెయిన్ నా
కయి రామాదులు కపిసమ్ముదయ మంతముఁగనకయుండ్రు ♦ తన్విఁగనుదమిన్.

చ. సురుచిరవృక్షముల్ గలయ ♦ శోకవనంబిదె కాననయ్యె నే
నరిగెద దీనిలో వెదక ♦ నారయలే దిటఁ బూర్వ; మిప్డు భ
క్తిరతిని బొందుచిత్తమున ♦ దివ్యమరుద్వసురుద్రకోటిభా
స్కరులను నశ్వి దేవతలఁ ♦ జక్కఁగ నెంచి నమస్కరించుచున్. ౫౫ 657

---

1 ఇది యవతారికయఁ దెలుఁగు. 2 వినాశే బహవో దోషా జీవన్ భద్రాణి పశ్యతి - అని మూలము. 3 వగచుచున్=తలంచుచు. 4 పశుం పశుపతేరివ-అనిమూ. పశుపతేః అగ్నేః పశుమివ- అనివ్యాఖ్య.

చ. దనుజుల కెల్ల శోకము ని♦తాంతము గల్గఁగఁ జేయువాఁడనై
వనమును దీసిఁ జొచ్చెద; స♦వార్యబలంబున విజ్రృంభిఁగుసీ
దనుజులనందఱిన్ గెలిచి ♦ [1]తాపసవర్యునకుం దపఃఫలం
బు నొసఁగునట్లు సూర్యకుల♦ముత్ వెలయించెదు జానకిం దగన్. ౫౭ 658

క. రామునకొసఁగెద; నంచు, ద్ధామంబగు తేజములరు ♦ తద్వాయుసుతుం
డీమాడ్కి నొకముహూర్తము, తా మదిఁ జింతించి వికలి♦తస్వేంద్రియుఁడై.

సీ. వని కేఁగ లేచి స♦మ్యక్కీర్తితో లక్ష్మణసహితుఁడౌ శ్రీరామ♦చంద్రునకును
వందనంబిడె, రాజ♦వరుఁడైన జనకున, కాత్మజయై తగి ♦ యమలశీల
యగు రాముదేవికి ♦ నవనిజ కిడె నమస్కారంబు, యమరుద్ర♦శక్రవాయు
భాస్కర, తారకే♦శ్వరులకుఁ దక్కిన యిమ్మరుద్గణముల ♦ కిదియె మ్రొక్కు;

ఆ. వనచరేశునకిడె ♦ వందనం బని మ్రొక్కి, యవ్వనంబు కొలఁది ♦ నరయఁ గోరి
దెసల నెల్లఁ జూచి ♦ దివ్యమై శుభదమౌ, నవ్వనమున కేఁగ ♦ నాత్మ నెంచి.

క. తరువాతఁ జేయఁదగుపని, నరయుచు మదినెంచె నిట్టు♦లాయనిలజుఁ; డీ
నిరుపమవనమిది రక్షో, వరబహుళం బగుచు [2]రుచిర♦వనసంకులమై. ౬౧

తే. పెక్కుసంస్కారములచేతఁ ♦ జక్కఁ జేయఁ
బడుచు నలరారుచున్న ద♦వశ్యకముగఁ
జూడఁగాఁదగియున్న; దీ♦శుభవనమును
గావ రావణుఁడుంచిన ♦ కర్బురులొగి. ౬౩ 662

చ. వనగతవృక్షసంతతుల ♦ బాగుగఁ గాచుచు నున్నవారు [3]స
ర్వనిహితకాయుఁడైన భగ♦వంతుఁడు వాయువుకూడఁ జాలకం
పనమును గల్గఁజేయకయె ♦ భవ్యగతుల్ దగవీచుచున్నవాఁ;
డనుపమమైన యీవనము♦నందుఁ జొరంబడువాఁడ మెల్లఁగన్. ౬౪ 663

తే. రామునకుఁ గార్యసిద్ధికై ♦ రావణునకుఁ
గన్పడకయుండుటకును నా♦కాయమించు
కంతగాఁ జేసికొంటిని ♦ యత్నమిద్ది
సఫలముగఁ జేయఁగలరు ని♦ర్జరులు మునులు. ౬౫ 664

సీ. భూతనాథుఁడు స్వయం♦భువు భగవంతుఁడు నగు బ్రహ్మదేవుండు♦నమరు, లగ్ని
వాయుదేవుండును♦వజ్రధరుండగు పురుహూతుఁడును, పాశ♦ధరుఁడు, వరుణుఁ
డర్కచంద్రులు, మఱి♦యశ్వి దేవతలును, సకలమరుత్తులు ♦ శంకరుండుఁ
గార్యసిద్ధిని నాకుఁ ♦ గల్గునట్టు లనుగ్రహింతురుగాక; భూ♦తేశుఁడైన

---

1 యథాసిద్ధిం తపస్వినే-అనిమూ. 2 భవిష్యతి వనాకులా, అశోకవనికా-అనిమూ. 3 భగవానపి సర్వాత్మా-అనిమూ.

ఆ. విష్ణుమూర్తి భూత♦విశతియు, మార్గంబు, నందుఁ గానఁబడక ♦ యలరుసురలు
గార్యసిద్ధినాకుఁ ♦ గల్గునట్లానరింపఁ, గలఁతు: నింకఁ బొంకు♦పంతమగుచు.

చ. సురుచిరమైననాసికయు ♦ శోభిలఁగా ననకన్యమాచు సుం
దరశతపత్రపత్రనయ♦నంబులు చెల్వుగ నొప్పు సుస్మితం
బరుదయికానరా, నిరుప♦మాకృతిఁ బొల్చినపూర్ణతారకే
శ్వరువలెఁ గాననై తనరు♦సాధ్వి మొగంబు ప్రియుంబు లేమిఁ గాక. ౬౪

క. కనుఁగొనఁగలనో యెప్పుడు; దనుజేంద్రుఁడు క్రూరకర్మ♦తత్పరుఁడు సదా
ఘనతరచిత్తుఁడు నీచుఁడు, మునిహంతయు దారుణాంగ♦ముఁ గనువాఁడుగా.

క. ఐనను సురుచిరవేషం, బూని బలాత్కారవిధిని ♦ నొప్పునిటిఁ
మానిని దెచ్చెను గావున, జానకిని [1]తపస్విని సు♦సాధ్విని నబలన్ ౬౮

తే. కన్నులు ఫలింప నాదగు♦కార్యమెల్ల
సిద్ధినొందంగ రఘువీరు♦చిత్తమెంతొ
సంతసంబొందఁజాతునో ♦ సాంత నుస్న
దీయ మెప్పుడు శాంతిని ♦ నెట్లు గనునొ. ౬౯ 669

పదుమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౧౪ - వ సర్గము.

హనుమంతుఁ డశోకవనమును జొచ్చుట.

చ. గురుతర తేజుఁడైనకపి♦కుంజరుఁ డిట్లు ముహూర్తమెంచి యు
త్తరుని కురుంబమావనము ♦ దావునకుం జన నిశ్చయించి యా
సురరిపుగేహముఁ వదలి ♦ సొంపగు [2]నవ్వన పాలసీమకుం
ద్వరపడి దాఁటెఁ; నివ్విధి న♦తండు తదున్నతసుస్థలంబునన్. ౧॥ 670

తే. చక్కఁగాఁ గూరుచుండి హ♦ర్షమున నవయు
వాళి యుబ్బి వసంతాది♦యందుఁ బుష్పి
తాగ్రములయి మనోజ్ఞంబు♦లైన సాల
చంప, కాశోక, పున్నాగ ♦ సత్తరువుల. ౨॥ 671

సీ. ఉద్దాలకములను ♦ నుర్వీరుహంబులఁ, [3]కిఁగకానుఁగుల నీ♦తీరున బహు
విధములొ ద్రుమముల ♦ వింతగఁ గాంచెను; జాతవసచ్ఛన్న♦మై తనర్చి
పీరుత్సమూహసం♦వృతిమించి యొప్పెడు త్కోరుహవాటికఁ ♦ జాపముక్త
శరమట్లు వేగంబ ♦ చని యందుఁ జేరెను; జిత్రశాఖాగ్రమై ♦ చెలఁగి కూయు

1 బలాభిభూతా వ్యాబలా తపస్వినీ-అనియూ. 2 ప్రాకారం తస్య వేశ్మనః-అనియూ. ప్రాకారం=అశోకవనికా ప్రాకారం-అనివ్యాఖ్య. 3 కపిముఖానపి-అనియూ. మర్కటి యనునది కపిశబ్దపర్యాయపదము-అనఁగా తిఁగకానుగు చెట్టు.

ఆ. విహగకలకలముల ♦ వింతగఁదోఁచుచుఁ, గనకరజతవర్ణ ♦ కలితతరువు
లెల్ల మొదల నొప్ప ♦ మృగపక్షిసంవృతిఁ, జిత్రమగుచు నదియుఁ ♦ జెన్నుఁగాంచె.

చ. తరువులు చిత్రరీతిగ స ♦ తంబును దోఁచుటచేతఁ జిత్రమై
పరఁగి దినాదియందుఁ దగు ♦ భాస్కరురీతిగ నొప్పి [1]సత్ఫలో
త్కరములఁ బుష్పసంతతులఁ ♦ గ్రాలుననేకమహీరుహాళిచే
నరుదుగ నయ్యశోకవన ♦ మప్పుడు గానఁగనయ్యె నయ్యెడన్. ౬    673

తే. పరభృతంబులు షట్పద ♦ ప్రకరములును
సంతతంబు మదించి రు ♦ చ్యముగఁ గూయ
మత్తబర్హిగణంబులు ♦ మధురరీతిఁ
గూయ బహువిధసద్ద్విజ ♦ కులము లలర ౭    674

క. తనరారు నావనంబును, మనుజులకున్ సంతసంబు ♦ మానక కల్గం
గనుజేయు నవ్వసంతం,బునఁ గనియెన్ మారుతేంద్ర ♦ పుత్త్రుం డచటన్. ౮

క. జనకసుతన్ సుశ్రోణిని, ననిందితన్ వెదకుచుండ ♦ నాతనిస్పర్శం
బున నిద్రించెడుపక్షులు, కనుఁగవలను విప్పి మేలు ♦ కాంచెం దవ్వరఁగాన్. ౯

ఆ పైకి నెగురుచున్న ♦ పక్షుల ఱెక్కల, తాఁకుడులను వృక్ష ♦ తతులు వివిధ
వర్ణములుగఁ బూల ♦ వానను గురిసెను;, నయ్యశోకకాన ♦ నాంతరమున. ౧౦

చ. తరువులనుండి యొక్క మొగిఁ ♦ దద్దయు రాలెడుపుష్పముల్ మనో
హరముగ నంతటం బొలయ ♦ నాహనుమంతుఁడు పుష్పరూపభూ
ధరమటు లొప్పె; వృక్షసము ♦ దాయగతుండయి యెల్లదిక్కులం
బరుగిడు చున్న యాప్లవగ ♦ వర్యునిఁ గాంచి సమస్తభూతముల్. ౧౧    678

క. తలఁచెను వసంతుఁడౌనని; [2]పలాశితతినుండి వివిధ ♦ భంగులుగాఁ బు
వ్వులురాల నచటియవనీ,స్థలి భూషిత యైనప్రమద ♦ చందముఁ గాంచెన్. ౧౩

క. హనుమ బలవంతుఁడౌట న,వనీరుహగణంబునట్టె ♦ బలమున నలుద
ట్లను గదలింపఁగ నవిపూ,లను వృష్టిగఁ గురియఁజేసె ♦ లలితముగ నటన్.

ఆ. పత్త్రశిఖరములును ♦ ఫలసుమంబులు రాల
నాతరువులు జూద ♦ మాడి యోడి
యంబరాభరణము ♦ లన్నియుఁ బోవంగ
నున్న [3]జూదగులటు ♦ లొప్పె నవుడు. ౧౪    681

క. తరువులఁ దరస్వి యగునా, మరుదాత్మజుఁ డటుగదల్ప ♦ మహితసుమఫలో
త్కరభూషితంబు లగునా, తరువుల విడనాడి రాలెఁ ♦ దత్సుమఫలముల్. ౧౫

ఆ. పక్షిగణములెల్లఁ ♦ బరుగెత్తిపోవంగ, సుమఫలంబులెల్ల ♦ క్షోణిరాల

---

1 పుష్పోపగఫలోపగైః-అనిమూ. 2 పలాశితతి=వృక్షసముదాయము. 3 ధూర్తాఇవ పరా
జితాః-అనిమూలము. ధూర్తాః అక్షధూర్తాః-అనివ్యాఖ్య.

స్కంధశిష్టములయి ♦ త్మారుహములు మరుత్కంపితంబు లట్లు♦గాఁ జెలంగి.

క. సేవింప నన ర్హములై, వావిరి గనుపట్టె; హనుమ ♦ వాలకరములన్
జేవను జరణంబులచే, నావిధమున మోఁద భూరు♦హాళి విఱిగినన్. ౧౭౪ 684

సీ. ఆయశోకవనంబు ♦ పాయనిరతిస క్తి విరియఁబాఱిన తల♦వెండ్రుకలును
నాశ్లేషములచేత ♦ నంతటఁ బోయిన యంగరాగంబు, న♦త్యంతపీత
మాటచే శుభదంత♦మట్లు సితచ్ఛాయఁ గనునధరోష్ఠంబు ♦ గలిగి నఖర
దంతక్షతంబులఁ ♦ దగుయువతీమణిభంగిఁ గానంబడె; ♦ వాయువట్టె

ఆ. వృష్టికాలమందు ♦ వింధ్యాద్రిఁ గలమేఘ,జాలములను గలఁచు♦చండమునను
హనుమ యవ్వనంబు♦నందున్నతీఁగజొం,పములఁ బాడుచేసె ♦ బలముమెఱయ.

క. తిరుగుచు నవ్వనమందున, మరుదాత్మజుఁ డపుడు కాంచె ♦ మణిభూములఁ గ
ర్బురరజతమయావనులను;, బరమాంభఃపూర్ణములగు♦ బావుల నవియున్. ౨౧౪

క. నిరుపమమణిసోపానో,త్కరముల నలరారుచుండెఁ; ♦ దద్వాపులయం
దరయఁగ నిసుకగనుండెను, వరమౌక్తికముల్ ప్రవాళ♦వారము బెరఁగై.

సీ. అందందు స్ఫటికమ♦యంబులౌ కుట్టిమములు చెలంగుచునుండె ♦ లలితతత్త
టములందుఁ గనకవ♦ర్ణములొప్పఁ జిత్రమ్ములైనవృక్షములు చె♦ల్వమరనుండె;
నందందు [1]ఫుల్లార♦విందవనంబులు భాసిలె నటఁ జక్ర♦వాకములోగిఁ
గూజితంబులచేతఁ ♦ గోమరుఁగూర్చుచునుండె, నుత్పలవనములం♦దొప్పుచుండె

తే. హంససారసజలకుక్కు♦టారవంబు
లందు వినఁబడుచుండెను ♦ నచట భూరు
హాళి వ్యాపింపఁ బొడవులై ♦ యమృతసలిల
ములను దగి సొంపుగూర్చు [2]న♦దులు కనఁబడు. ౨౫ 688

తే. తీఁగజొంపము లెన్నియో ♦ దివ్యవృక్ష
సుమము లొప్పారఁ జూపట్టు♦చుం గనఁబడెఁ;
బలువిధములగు పొదలెల్లె♦డల నెసంగె
నందుఁ గన్నేరుచెట్లు సొం♦పమరనుండె. ౨౬ 689

చ. అనిలతనూజుఁ డంబుధర♦మట్లు వెలుంగుచు నున్నతంబులై
తనరెడు కూటసంఘములు ♦ తద్దయుఁ జిత్రములై చెలంగఁగా

---

1 ఫుల్లపద్మోత్పలవనా శ్చక్రవాకోపకూజితాః-అనియూ. హనుమ యర్ధరాత్రిసమయమునఁ దిరుగుచుండఁగా పూచినకమలము లెట్లుగనఁబడె నని శంక కలుగవచ్చును. పగలు కమలములు పుష్పించి యస్తమయమున ముడుచుకొనుచు మరల నుదయమున వికసించుచు నెల్లకాలము నుండవు. ఒకటిరెండుసారులు పుష్పించి మరల ముకుళితములుగాక క్రమముగ రాలిపోవునని గ్రహించుట మంచిపద్ధతి. 2 సరిద్భిశ్చ సమంతతః-అనియూ.

ఘనశిఖరంబు లెల్లెడలఁ ♦ గ్రమ్మి కనంబడ గ్రావగేహముల్
వినుతమహీరుహంబులును ♦ వింతఁగ నొప్పఁగ [1]నొక్కకొండ యం
దు నెగడియుండె నయ్యదియుఁ ♦ దోఁచును మృన్మయమాచుఁ జక్కఁగన్.

**తే.** జగతిపర్వతమన నయ్య♦చలము వెలయు;
నాగిరీంద్రమునుండి య♦హార్యరీతిఁ
బాఱుచుండెడు నొకనదిఁ ♦ బావని యటఁ
గనియె; నయ్యది యటనుండి ♦ కడురయమున. ౨౮౪ 691

**క.** ధరణికి దిగుచుండుటఁ గో,పరతిని నాయకునియంక♦భాగమ్మున నుం
డి రయమున దుమికియిలఁబడు,తరుణివలెఁ గానఁబడుచుఁ♦దద్దయుఁ బొలిచెన్.

**క.** జలముల వ్రాలినయగ్రం,బులఁ దగువృక్షముల నద్ది ♦ పొలుచుటచే రా
జిలెఁ గోపమూని ప్రియబం,ధులు వారింపంగ నున్న♦తొయ్యలిరీతిన్. ౩౦

[2]**చ.** ధునియది యద్రినిన్ వదలి ♦ దూరముగా నొకకొంతయేగి వృ
క్షనిబిడశాఖలం జనఁగఁ♦జాలకయే మరలన్ మహీధరం
బునకుఁ జనంగ బంధుజన♦ముల్ క్రుధ మాన్పఁగ సుప్రసన్నయై
తనదుమనోహరున్ మరలఁ ♦ దద్దయుఁ బ్రీతిని బొందునట్టికాం
తను బురుడించె నట్టినదిఁ ♦ దాఁ గనెఁ బావని కోర్కిమీఱఁగన్. ౩౧ 694

**చ.** పవనతనూజుఁ డాగిరికిఁ ♦ బ్రక్కనఁ బెక్కువిధంబులైనప
క్షివితతు లొక్కరీతిఁ దమిఁ ♦ జెంది చెలంగఁగ నున్నయాసరః
ప్రవరములన్; [3]రచింపఁబడి ♦ రమ్యసుశీతలవారిపూర్ణమై
ప్రవిమలరత్నభంగులను ♦ భాసిలు బావినిగాంచె లద్దియున్. ౩౨ 695

**తే.** [4]ముత్తెములదై నయిమకచేఁ ♦ గ్రొత్తరీతిఁ
గనఁబడుచు, భూరిమృగగణ♦కలితమాటఁ
జిత్రముగ నొప్పుచుం జుట్టు♦చిత్రవనవి
తానసాంద్రంబునై చూడఁ♦దగి చెలంగె. ౩౩ 696

**ఆ.** విశ్వకర్మరచిత♦విపులసౌధాళిచేఁ
గృత్రిమాటవులను ♦ గీర్తనీయ
మగుచు నెల్లయెడల ♦ నభిరామమై తగి
యుండె; మఱియు నందు ♦ నొప్పుగులుక. ౩౪ 697

---

1 రమ్యం జగతిపర్వతమ్-అనిమూ. జగతీభూమిః మృదితియావత్. తత్ప్రధానా జగతి పర్వత మిత్యుక్తిః. ప్రాస్వఆర్షః-అనివ్యాఖ్య. 2 వార్యమాణా మివక్రుద్ధాం ప్రమదాం ప్రియ బంధుభిః, పునరావృత్తతోయాంచ దదర్శ సమహాకపిః-అనిమూ. దీనివ్యాఖ్యాభిప్రాయముగూడ నిందు వివిడింపఁబడినది. 3 కృత్రిమాం దీర్ఘికాం చాపి-అనిమూ. కృత్రిమాం క్రియయా నిర్వృత్తాం నిర్మితా మిత్యర్థః-అనివ్యాఖ్య. 4 ముక్తానికరశోభితామ్-అనిమూ.

సీ. నిరతంబు సుమఫల♦నికరశోభితతరువులు సవితానక♦ములుగ మఱియు
సవితర్దికములుగఁ ♦ జారుతరసువర్ణ వేదికాన్వితములు♦గాఁ దనరుచు
నలరారుచుండెఁ; దా♦హనుమంతుఁ డచ్చోట లలితలతాప్రజం♦బులఁ బెనంగి
బహుపర్ణయుతమయి ♦ భాసిల్లుకాంచనశింశుపాతరువుఁ జూ♦చె నది పెక్కు

ఆ. కనకవేదికలను ♦ గ్రాలుచుఁ జూడఁగాఁ, దగినయట్టులుండెఁ; ♦ ధరణిభాగ
ములను నిమ్నదేశ♦ముల సెలయేళ్లను, వహ్నినిభసువర్ణ♦పాదపముల. ౩౮ 698

చ. కనుఁగొనె నాతఁ డప్డు కన♦కద్రుమకాంతుల మేరుభూధ్రకాం
తిని రవి హేమవర్ణముగ ♦ దివ్యముగాఁ గనుపట్టురీతిఁ దాఁ
గనకమరీచులం దగుటఁ ♦ గాంచి [1]సువర్ణతనుండనైతిఁగా
యని తలపోసె; నిట్లు వర♦హాటకభూరుహసంఘయుక్తమై. ౩౯ 699

తే. గాలివీచుటచే నందుఁ ♦ గట్టఁబడిన
యమలబహుకింకిణీనిన♦దాభిరామ
యయి తనర్చినయావని ♦ నచటఁ గాంచి
విస్మయావిష్టహృదయుఁడై ♦ వెలసె నతఁడు. ౪౦ 700

సీ. ఆమహాబాహుఁడా ♦ యనిలజుఁ డచ్చోటఁ బుష్పితాగ్రంబుగాఁ♦బొలిచి,రుచిర
మైనూత్నతరపల్ల ♦వాంకురమై, యాకుజొంపంబులంగూడి ♦ సొంపుమీఱు
నాయశోకంబుఁ దా♦నవుడెక్కి యిట్లనితలఁచె; నిచ్చటనుండి ♦ తనవిభుఁగన
నువ్విళులూరుచు ♦ నురుతరదుఃఖార్తయై యిచ్చఁదిరుగుచు ♦ నాజనకజ

ఆ. యిచట నుండవచ్చు ♦ నేఁ జూచెదను బ్రీతి;, దుష్టబుద్ధియైన ♦ కష్టదనుజుఁ
డేర్పఱచినయట్టి ♦ యీయశోకవనంబు, కడుమనోజ్ఞమగుచుఁ ♦ గానఁబడెడు.

క. వరచందనచంపకముఖ, తరువులసముదాయమిందుఁ ♦ దనరారెడునీ
సరసును గడురమ్యంబై, [2]నిరతము ద్విజసంఘయుక్తి ♦ నెగడెడునహహా. ౪౨ 702

క. [3]జనకజ యీసరసునకుం, జనుదెంచును నిక్కముగనె; ♦ సాధ్వియగు రా
మునిప్రేయసి జానకియుఁ, వనసంచారమున నేర్పు ♦ వర్ధిల్లదగుఁ. ౪౪ 703

[4]క. కనుకనె యీసరసునకుం, జనుదెంచుధ్రువంబు; హారిణ♦శాబాక్షి! మహీ
తనయ విచక్షణగావునఁ, దనప్రియునిగుఱించి వగచి ♦ తత్పరమతియై. ౪౪

1 అమన్యత తదావీరః కాంచనోస్మీతి వానరః-అనిమూలము. 2 ద్విజసంఘనిషేవితా-అని మూలము. ఇచ్చట ద్విజశబ్దమునకుఁ బక్షులనియేయర్థముగాని విప్రులను నర్థముకాదు. ఇందు శ్లేషార్థ మనుక్తము. 3 సా రామా రామమహిషీ రాఘవస్య ప్రియాసతీ, వనసంచారకుశలా నూన మేష్యతి జానకీ-అనిమూలము. ఇందున్న విశేషణములే పద్యమున నున్నవి. 4 ౪౪-వ శ్లోకము మొదలు సీతాపరములగు విశేషణములు పెక్కులు మూలమునవే యున్నవి. నిశ్చయ మనునర్థము నిచ్చు "నూనం, ధ్రువం, నిత్యమ్, సతతం" ఇత్యాదిపదములు ౪౫-వ శ్లోకమునుఁబట్టి మూలమున నున్నవి. అవి యీపద్యములఁ జేర్పఁబడినవని గ్రహించి మన్నించుదురుగాక.

తే. విరహతాపంబు తొలఁగెడు♦విధమెఱింగి
యీవనంబున నొప్పారు ♦ నీసరసున
కరుగుదెంచును దప్పక; ♦ యాసుహీజ
సతతవనవాసనిరతయై ♦ క్షమఁజెలంగు. ౭౦౫ 705

క. వరవనసంచరణంబునఁ, బరిమోదితచిత్తయాటఁ ♦ [1]ప్రాణవిభుని ని
ర్భరదుఃఖంబునఁ బొగులుచు, నరుదెంచును నిటకుఁ దాప♦మార్ప నిజముగన్.

చ. జనకతనూజ రాఘవుని♦సాధ్వి ప్రియవ్రత సీత మున్ను తా
వనచరులెల్ల క్షేమముగ ♦ వర్ధిలుచుందురుగాక యంచు నె
మ్మనమునఁ గోరుచుండును, స♦మస్తవిధంబుల వారితోడనే
వనమువనుండ నెప్పుడును ♦ వాంఛను బూనును నిశ్చయంబుగన్. ౭౦౭ 707

తే. [2]శ్యామ యాసీత సాధ్వి సం♦ధ్యను గొలువఁగ
నాసఁబూనెడుఁగాన ని♦త్యంబు సంధ్య
నెలమిమీఱ నుపాసింప ♦ లలితసలిల
యుక్తయయి యొప్పు నీనది ♦ కుద్యమమున. ౭౦౮ 708

క. చనుదెంచునిజముగా; నీ,వనమతిశుభకరము రాము♦భార్యకుఁ దగియుం
డును, బూర్ణచంద్రవదనం,బునఁ బొల్చెడుసీత ప్రాణ♦ముల నుండినచోన్.

క. అరయఁగ శుభజలములఁ దగు, తరంగిణికి నిటకు వచ్చుఁ ♦ దప్పక; యని యీ
కరణి మహాత్ముండగునా,మరుత్సుతుం డెంచి రామ♦మహిళామణినిన్. ౭౧౧

క. కనుఁగొన నెంచుచుఁ బుష్పిం,చినయావృక్షమున నున్న♦చిత్రదళగణం
బున నొక్కెడ దాఁగి కనుం,గొనియె విశేషముల నెల్లఁ ♦ గూర్మిఁ జెలంగన్.

పదునాలవ సర్గము సంపూర్ణము.

---

## ౧౫ - వ సర్గము.

### హనుమంతుఁడు జానకిని సందర్శించుట.

చ. అనిలజుఁ డందెయుండి జన♦కాత్మజఁ జూడఁగ నాల్గుదిక్కులం
గనుఁగొనుచుం దదీయమగు♦క్ష్మాతలమెల్లను గాంచుచుండె; న
వ్వనము తరువ్రజంబులను ♦ భాసురకల్పలతావ్రజంబులన్
ఘనమయి దివ్యగంధరస♦కమ్రముగాఁ దగి భూషితంబునై. ౧ 712

ఉ. నందనతుల్యమై మృగగ♦ణప్రచురంబయి, భూరిపక్షిరా
డ్బృందమునొప్పు సౌధములు ♦ వింతగు మేడలు నిండియుండ, నా

---

1 రామశోకాభిసంతప్తా-అనిమూలము. తాపమార్ప నిజముగన్ - అనుపదము మూలార్థపోషక
మని చేర్పఁబడినది. 2 శ్యామా ధ్రువ మేష్యతి జానకీ-అనిమూలము.

నంకమొసంగుచున్నపిక♦నాదములం బరిఘూర్ణమానమ ని
ష్యందమరందసాంద్రతర♦హాటకపంకరుహోత్పలంబు లొ
ప్పంగు బావులం జెలఁగి ♦ భవ్యతరాసనజాలహారియై. ౭ 713

తే. ఆస్తరణసంఘ మొప్పంగ ♦ నవనినక్ష
ములును వెలయంగ సర్వర్తు♦వులను దగిన
పుష్పఫలములఁ గూడిన♦భూరుహములఁ
గాంతమై యెంతయుం జూడ ♦ వింతయగుచు. ౮౪ 714

చ. వికసదశోకకాంతులను ♦ వింతగ నప్డు తూర్పుకొండపైఁ
బ్రకటరుచిన్ వెలింగెడుప్ర♦భాకరురీతిగ నొప్పుచున్ మనో
జ్ఞకమయి ప్రజ్వలించునటు ♦ చక్కఁగనుండఁగఁ జూచె నమ్మరు
త్సుకొమరుఁ; డవ్వనంబు త్వర♦తోఁ జని పక్షులు పెక్కుభంగులన్. ౯ 715

సీ. శాఖలపై వ్రాల ♦ సకలపర్ణంబులు వానిచేఁ గప్పంగఁ♦బడుటఁ బత్ర
విరహితశాఖల ♦ వెలయుచున్నట్టివృక్షంబుల నందమై ♦ కానఁబడుచు
నామూలపుష్పప్ర♦జాఢ్యమై నయశోకభూరుహంబులు, పుష్ప♦భారమునను
వంగి భూమిని దాఁకు♦భంగిని గన్పట్టుకొండగోఁగులు, హరి♦కుసుమపూర్ణ

తే. ములగు [1]మోదుగుచెట్లును ♦ వెలయుచుండె
నట్లు పుష్పితవరభూరు♦హములకాంతి
నెల్లయెడల జ్వలించున♦ట్లెసఁగుచుండె
నాస్థలంబెల్ల, నద్దాని ♦ నతఁడు కనియె. ౧౦ 716

తే. చంపకోద్దాల,పున్నాగ♦సప్తపర్ణ
తరువులు విన్పద్ధమూలసం♦తతుల మిగిలి
చక్కఁగాఁ బూచియుండెను; ♦ స్వర్ణనిభము
లగుచుఁ గొన్నియశోకంబు♦లందు వెలసె. ౧౧ 717

క. అనలశిఖాసదృశములై, కనఁబడె నొకకొన్ని, కాటు♦కను నీలములన్
గనుపట్టుచాయఁ గొన్నియు, వినుతింపంబడుచు వేన♦వేలుగఁ బరఁగెన్. ౧౦౪

[2]క. పలువిధములైన యుపవన,ములఁదగు నందనముమాడ్కి ♦ మోదప్రదమై
పొలుచుచుఁ, జైత్రరథంబన, నలరారు కుబేరునుపవ♦నాకృతి బెడఁగై. ౧౧

తే. చిత్రమై సుందరంబు న♦చింత్యమునయి, దివ్యమై కాంతిసంపదఁ ♦ దేజరిల్లి
పుష్పనక్షత్రసముదయం♦బులను బొలిచి,యుంట రెండవనభమన♦నొప్పుమీఱి.

క. సుమరత్నశతంబులఁ జి,త్రముగాఁ దగి పంచమనుగు♦రత్నాకరమ
ట్లమరుచు, నర్వర్తులస,త్సుమమధుగంధాఢ్యవృక్ష♦శోభితమునునై. ౧౩ 721

---

[1] కింశుకైశ్చ సుపుష్పితైః - అనిమాలము. [2] నందనం వివిధోద్యానం-అనిమా. వివిధోద్యానం, నానావిధావాంతరవనవిచిత్రం యన్నందనం ఇంద్రోద్యానం-అనివ్యాఖ్య.

క. పలువిధములైన మృగపక్షులరవముల రమ్యమగుచు ♦ సురుచిరములు పెక్కులునగు సత్పరిమళములు, గలవాయువు పొలయుచుండఁ♦గా భవ్యంబై.

ఆ. రుచిరపరిమళములఁ ♦ బ్రచురతరంబగు, టమలగంధపూర్ణ♦మైనగేంద్ర
మయి ద్వితీయమైన♦యాగంధమాదన, మనఁగ నొప్పుచుండె♦నవ్వనంబు.

[1]చ. వనమును దానినిట్లు కని ♦ వానరపుంగవుఁ డందె కొంతదా
వునఁ గడునున్నతాకృతిని ♦ బొల్చుచుఁ జైత్య మనంగ నొప్పి చ
క్కనిదగు రాజమందిరముఁ ♦ గాంచెను; నయ్యది వేయి స్తంభముల్
తనుధరియించుచుఁ నడుమఁ ♦ దద్దయు రాజిలఁ జూడ నందమై. ౧౫ 724

క. సితమై కైలాసంబను, క్షితిధరమో యనఁగ మిగులఁ ♦ జెన్నగుచుఁ బ్రవా
ళతతి వినిర్మితసోపా,నతతిం దగి తప్తకాంచ♦నపుటరుఁగులచేఁ. ౧౬ 725

సీ. కనులదొంగిలునట్లు♦గాఁ బ్రకాశించుచుఁ, గాంతులనెంతయు ♦ గాఢమగుచు
భవ్యమై, ప్రాంశుభా♦వంబుగల్గుటచేత, నభ్రంబు నొరయున ♦ ట్లగపడుచును
వెలయుచుండెను; గపి♦వీరుఁ డంతట మాసినట్టిచీరంగట్టి ♦ యాతుధాన
వనితావృతయునయి ♦ యనిశోపవాసంబులను జిక్కి దీనయై ♦ వనటఁ గుంది

తే. మాటిమాటికి నిశ్వాస♦మారుతములు
వెడలఁగా శుక్లపక్షాది♦వెలయుచంద్ర
కళవలెం గుందియున్నయో♦క్కసతిఁ గాంచె
నాసతీమణి మిగులఁ గృ♦శాంగి యగుట. ౧౭ 726

క. శ్రమపడకయె గుఱుతింపఁద,రముగాక శరీరకాంతి ♦ రమ్యతమముగా
నమరఁ ధూమపినద్ధాం,గమునం దగుపావకశిఖ♦కరణి వెలయుచుఁ. ౨౦

తే. పచ్చనై మాసియుం గడుఁ ♦ బ్రాఁతదైన
యుత్తరీయము నొకదాని ♦ నుత్తమమును

---

1 సదదర్శా విదూరస్థం చైత్యప్రాసాద ముఛ్రితమ్-అనిమూ. చైత్యప్రాసాదం చైత్యం బుద్ధమందిరం తదాకారం ప్రాసాదమ్-అని గోవిందరాజులు. చైత్యప్రాసాదం-బుద్ధాండాకారప్రాసాదమ్-అని మహేశ్వరతీర్థులు వ్రాసిరి. చైత్యం "చీయతే పాషాణాదినా చైత్యమ్" అని గురుబాలప్రబోధిక. వ్యాఖ్యాతలు దీనికి బుద్ధాలయతుల్యమని వ్రాసిరి. దీనింబట్టి కొందఱు రామాయణరచనాకాలము రెండువేలకుఁ దక్కువసంవత్సరములని నిర్ణయించుచున్నారు. బుద్ధశబ్దము ప్రాచీనము. దానికిఁ బాషండుఁడని యర్థము. కాఁబట్టి మతమును స్థాపించిన బుద్ధునికాల మిట పరిగణనార్హము కాదు. ఈపదమునకుఁ దెనుఁగునఁ "జైత్యమనంగనొప్పి" యని వ్రాయఁబడినది. అనఁగాఁ జైత్యమనుపేర నొప్పుప్రాసాదమనుభావమును మనమున నెలకొల్పి యిట్లు వ్రాసితినని పాఠకు లెఱుంగఁదగు. లేనిపోనిశంకల కెడమిచ్చునట్లుండఁగూడదని యిట్లువ్రాసితి ననుట దీనిసారము. పండితులు క్షమింపఁగలరు.

గట్టె, యిప్పుడె యిలనుండి ♦ పుట్టినట్లు
పంకయుతదేహయై యన♦లంకృతయయి. ౨౦౫ 728

చ సరసిజహీనమా కొలను♦చందమునన్ దగుసొంపులేక, యోఁ
బరపురుషుండు పట్టుకొను♦పాటి యదృష్టముఁ గాంచితింగదా
ధర మననేల యం చెద నిశాంతము లజ్జనుబొంది పై పయిం
బరఁగెడుదుఃఖభారమున ♦ వందురి మ్లానతనొంది దీనయై ౨౧౫ 729

తే. తన్ను నంగారకగ్రహ ♦ మెన్నొగతుల
బాధ నొందింప మిక్కిలి ♦ బడలియున్న
యట్టిరోహిణివలె దాన♦వాధినాథు
వశమునం జిక్కి చింతచే ♦ బడలిబడలి. ౨౨ 730

చ. అనవరతాశ్రుపూర్ణముఖ♦యై యశనంబును మానుకొంటచే
తను కృశియించి దీనయయి ♦ తద్దయు శోకమె ధ్యానమట్టులై
కనఁబడ దుఃఖమేగతిగఁ ♦ గాలముఁ బుచ్చుచు నిష్టమైనయే
జనమునుగాని గానక య♦జస్రము రాక్షసకాంతలం గనుం
గొనుచు, [1]స్వజాతినిన్ వదలి ♦ కుక్కలగుంపులు చుట్టుముట్ట నా
ర్తిని గనునాఁడు లేడివలె ♦ దీనతనొందుచు నీలసర్పరీ
తిని జఘనంబు దాఁకను ద్యు♦తిం గడునీలముగా మనోజ్ఞమై
కనఁబడునేకవేణి తగఁ♦గాఁ గనుపట్టుచు నుండె నెంతయున్. ౨౪౫ 731

తే. ఆమె మఱియు శరత్కాల♦మందు నల్ల
నై నవనపంక్తితోఁ గూడి♦నట్టిభూమి
వలెఁ గనంబడుచుండె; నె♦వ్వరుసనైన
[2]నామె సుఖముల నొందంగ ♦ నర్హయగును. ౨౫ 732

క. ఘనతరదుఃఖంబుల ని, ట్లనయము పొందుటను జాల ♦ నార్తింగనుచుం
డెను మునుదుఃఖములెఱుఁగక, మనుటనిట్ల వగలు గ్రమ్మ♦మ్రాన్పడియుండెన్.

చ. హనుమ విశాలనేత్రముల ♦ నందము గుల్కెడుసాధ్విని కృశిం
చినతనువొప్పు, ధూళులను ♦ జెందుటచే మలినాంగియై కడున్
వనటలఁ గుందునామెఁ గని ♦ వాంఛితమెల్ల ఫలింప నీమెయే
జనకజయంచుఁ దాఁ దలఁచెఁ ♦ [3]జక్కని హేతువు లొప్పియుండుటన్. ౨౬౫

చ. దనుజుఁడు కామరూపి మును ♦ తన్విని దాఁ గొనిపోవుచుండ మా
కనులకు నెట్టిరూపము త♦గం గనుపట్టెనొ యట్టిరూపమే

1 స్వగణేన మృగీం హీనాం శ్వగణాభివృతా మివ-అనిమా. 2 సుఖార్హాం దుఃఖసంతప్తాం వ్యసనానామకోవిదామ్-అనిమా. 3 కారణై రుపపాదిభిః-అనిమా.

కనఁబడుచున్న దీమెకును ♦ గావున సీతయె యీమెయౌనటం
చును దలపోసె; నామెయును ♦ సుందరపూర్ణశశాంకవక్త్రయై. ౨౯ 735

సీ. సొంపగుకనుబొమల్ ♦ సుందరవృత్తపయోధరంబులు గల్గి ♦ యుజ్జ్వలనుగు
తనుకాంతిచే దిగ్వి♦తానంబు వితిమిరమై వెల్గఁ జేయుచు ♦ నసితకేశ
ములును, బింబోష్ఠంబు ♦ లలితమౌతనుమధ్యమము, చారుపాదత♦లములు పద్మ
దళవిశాలాక్షముల్ ♦ తనరార మన్మథురతివోలె నాసీత ♦ రహిఁ జెలంగు

తే. చుండె; సర్వజగంబుల ♦ కొప్పుఁగూర్చు
చును నిశాకరపూర్ణప్ర♦భను దెగడుచు
మిగులఁ గృశియించి యున్నట్టి♦మేనితోడ
ధరణిపయిఁ గూరుచుండి యా♦త్మవిభు నెన్ని. ౩౦ 736

తే. తగిననియమంబుఁ బూనిన♦తాపసివలె
భీతి నిట్టూర్పుగములను ♦ విడుచుచు ఫణి
రాజకన్యయుఁబోలె వి♦రాజమాన
యగుచు దుఃఖపరంపర ♦ నంది యుంది. ౩౧ 737

చ. పరివృతధూమజాల యగు♦పావకుజ్వాలవలెన్ వెలుంగ, క
న్తరుణమునం గృశించి వితతంబగుశోకముచేఁ బెనంగి యా
దరమున రాఘవుం దలఁచి ♦ తన్ను నదృష్టవిహీనగాఁగ వే
వరునలఁ జింతసేయుచును ♦ భాసిలుచుండెను; భూస్థలంబునన్. ౩౨ 738

తే. సంశయార్థము గలస్మృతి♦చందమునను, క్షీణసంపదవలె ఫల♦సిద్ధిలేమి
వమ్మయిన శ్రద్ధరీతిని ♦ భగ్నమైన, యాశవలె విఘ్నమొందు కా♦ర్యఫలమట్లు.

సీ. కలఁతఁజెందినబుద్ధి♦కరణి, ననత్యాపవాదంబుచేఁ బెంపు ♦ వదలినట్టి
కీర్తిచందమున, నా♦క్షితిపతినాథుఁడౌ రాముని జేరఁగ♦రామివ్యథిత
యగుచు, రాక్షసుఁడు త♦న్నపహరించుటచేతఁ జాలఁ గృశించి స్వ♦సత్వమెల్లఁ
గడువడి క్షీణింపఁ♦గా నాల్గుదిక్కుల మృగశాబనేత్రముల్ ♦ మెలఁగఁజేయు

తే. చును సదాశ్రుజలంబుల ♦ సొక్కి నల్లనైన వక్త్రాక్షిపక్ష్మము ♦ లమరియున్న
యప్రసన్నాననంబున ♦ నవిరతముగ, నూర్పుగములను బుచ్చుచు♦నుర్వినుండి.

క. మలపంకముల ధరించుచుఁ, గలఁగినమది దీనయగుచుఁ ♦ గమ్రకలాపం
బులకుం దగియును భూషణములు ముట్టక, పతిని జిత్తమునఁ గనుఁగొనుచున్.

తే. కాలమేఘావృత మగున♦క్షత్రవిభుని
తేజమట్లుండె; నభ్యాస♦మే జరగమి
మఱవఁబడినట్టి సద్విద్య♦మాడ్కిఁ గుంది
యున్నయాసీతఁ బలుమాఱుఁ ♦ గన్నులలర. ౩౬ 742

క. కనుచున్నహనుమమది కీ, వనితామణి యున్నవిధముఁ ♦ బరికింపంగా

జనకజ యగునో కాదో, యనుసందియ మంకురించె ♦ నంత నతండుల్. ౩౮

సీ. వ్యుత్పత్తి తెలియమి ♦ నొకమాట కింకొకయర్థంబు గలుగఁగా ♦ నతఁడు శబ్ద
ములకు వ్యుత్పత్తిని ♦ దెలిసికొన్నపిదప దానియర్థంబును ♦ దాను దెలియు
నట్లు భూషితగాక ♦ యంగము కృశియింప నున్నయాసీతను ♦ నొక్కరీతి
రామోక్తలక్షణ♦రహితగానుండుటఁ బలుమాఱు తలపోసి ♦ పలువిధముల

తే. నెంతొకష్టంబుమీఁద నీ♦యింతి సీత
యేయటంచు నెఱింగె; నీ♦ల్లెఱిఁగి యువ్వి
శాలనేత్ర ననిందిత ♦ త్మానుతఁ గని
యెన్నియోకారణంబుల ♦ నెంచి యతఁడు. ౩౯ 744

క. జనకజయే యగు నిశ్చయ, మని తలఁచెన్; రఘువరేణ్యుఁ ♦ డాదిని సీతాం
గనిచయమున కాభరణము, లను వేనిందెల్పెనో వి♦లాసముమీఱన్. ౪౦

తే. అవ్వియన్నియు సీతచే ♦ నచటిచెట్ల
కొమ్మలకుఁ గట్టఁబడియుంట ♦ గూడఁజూచెఁ;
జారుతరమగు నిర్మాణ♦శక్తి మెఱయఁ
జేయఁబడినకుండలములు ♦ శ్రీప్రదములు. ౪౧ 746

సీ. పొలుచు త్రివర్ణక♦పుష్పనట్లుగఁ జేయఁబడియున్నకర్ణపా♦ర్శ్వములనుంచు
కొనఁదగినట్లుగాఁ ♦ గొమరుగూర్చెడుభూషణములును,మణివిద్రు♦మములవిరచి
తములయి చాలఁ జి♦త్రములగుహస్తాభరణములు, నామెవి♦రహాజమైన
తాపము సోఁకుటఁ ♦ దగ నల్లనై యుండె; నవి యామెయంగము♦లందుఁ జాల

తే. కాలముండుట గుఱుతులు ♦ గల్గఁజేసి
యుండె; నవ్వానిఁ జూచి రా♦ముండు గుఱుతు
లెఱుకపఱచినయ వ్వవి♦యే యటంచు
నాతఁడెంచెను మదిలోన ♦ హర్షమెసఁగ. ౪౩ 747

క. అలఋశ్యమూకమున నీ, వెలఁదియు నేభూషణముల ♦ విడిచెనొ యవి శా
ఖల నిటఁ గనఁబడకున్నవి, యిలవైవనిభూషణములె ♦ యివియు నిజముగన్.

చ. కనకశలాకలాగున ని♦శామము వెల్గుచుఁ బచ్చనై శుభం
బును నగునుత్తరీయమును ♦ భూనుతయుం బడవైవ వృక్షశా
ఖను నది యాశ్రయింపఁ బ్లవ♦గప్రవరుల్ కనినారుకాదె; గ
ల్లనితగమ్రోఁగుచుం బడెడు♦నాభరణంబుల నెల్లవానరుల్. ౪౫ 749

క. ఆముఖ్యభూరిభూషా,స్తోమము నీసాధ్వి మమ్ముఁ ♦ జూచి ధరణిపై
నామాడ్కి వైచె నిదిగో, నీమెశరీరమున నున్న♦యీవవనంబుల్. ౪౬ 750

క. చిరకాలము విడువకయే, ధరియించుటఁ గ్లిష్టమగుచుఁ ♦ దగ మాసియు నా

[1]ధరమున విచ్యుతమగునం,బరమట్టులు రంగుఁ గాంతి ♦ భాసిలునహహా. ౪౮

తే. వనిత యెవ్వతె రాక్షసా♦పహృతయాటఁ
బతికిఁ గనఁబడనిదె యయ్యె ♦ నతఁడు తలఁచు
చుంట నాతనిమనమున ♦ నుండునో [2]క
నకవర్ణాంగి యీమె భూ♦వరునతియగు. ౪౯ 752

సీ. [3]ఆపదలందు న♦య్యబలల రక్షింపఁదగునట్లు నేను జే♦యఁగను జాల
నైతిఁగదా యను♦నట్టికారుణ్యముచేతను, నాశ్రయిం♦చినతరుణిని
గావంగనమయము ♦ గననైతిఁగద యనుసత్స్వభావంబున ♦ సాధ్వి పురుషు
నంగంబునం దర్ధ♦మగునట్టియిల్లాలు కనఁబడకున్నదే♦యనెడుశోక

తే. మునను, మనమున కింపగు♦ముద్దరాలు
కనులఁ బడకున్నదే యను♦కామతాప
మునను నీనాలుగింటిచే♦తను నెవతుకఁ
దలఁచి చింతించుచున్నాఁడొ ♦ యీరఘుపతి. ౫౦ 753

తే. ఆమె యీమెయె యగు; నీమె♦యాకృతియును
నంగములయును మఱియుఁ బ్ర♦త్యంగములయు
సుందరత్వము నెట్టివో ♦ క్షోణిపతికి
నవ్వి యట్టివియేయగు ♦ నరసిచూడ. ౫౧ 754

[4]క. రామున కెట్టితనూరుచి,యో మానిని కీమెకట్టి ♦ దొప్పును గానన్
ఈమహిళామణి తగినది, యామానవనాయకునకు ♦ నతనికి మిగులన్. ౫౨

క. ఈదేవిమనసు చక్కఁగ, శ్రీదయితుండైన రాము♦శీతకరునియం
దే దగిలియున్న దందున,నే దనప్రాణములవిడువ ♦ కీచందమునన్. ౫౩ 756

ఆ. ఒకముహూర్తమైన ♦ నుండఁగల్గెను రాము
మనసు నీమెయందె ♦ యనురతిఁ గనుఁ
గాననేయతండు ♦ క్షణమైన జీవించి
యున్నవాఁడు లేక ♦ యుండఁగలఁడె. ౫౪ 757

[5]చ. జనకజ లేకయుండినను ♦ క్ష్మాపతి దేహముఁ దా ధరించి యిం
కను మనియున్నవాఁడెకద, ♦ కాంతయుఁ దాను స్వతంత్రురాలుగా

---

1 ధరమునన్=పర్వతమునందు. 2 ఇయం కనకవర్ణాంగీ-అనిమూలము. 3 కారుణ్యే నాన్నృశంస్యేన శోకేన మదనేన చ-అనిమూలము కారుణ్యాదిశబ్దములకు వ్యాఖ్యలోనియర్థము ననుసరించియే వ్రాయఁబడినది. 4 రామస్య చ యథారూపం తస్యేయ మసితేక్షణా-అనిమూలము. ఇయ మసితేక్షణా తస్య యోగ్యేతిశేషః-అనివ్యాఖ్య. ఈయర్థమే పద్యమున "తగినదియా" అని చెప్పఁబడినది. 5 దుష్కరం కృతవా న్రామో హీనో యదనయా ప్రభుః, ధారయ త్యాత్మ నో దేహం నశోకే నావసీదతి-అనిమూలము దీనివ్యాఖ్యలో నొక్కొక్క శబ్దమున కొక్కొక్కచమత్కారము చూపఁబడినది. దానిసారమే యీపద్యమునఁ గాననగు.

మిని విడువంగఁజాలదిట ♦ మేనును, రాఘవుఁడున్ స్వతంత్రుఁడ
య్యును దనువున్ద్యజింపకయె ♦ యుంపుట, శోకముచేఁ గృశింపకే
తనువున నుంట నీయవి ని♦తాంతము దుష్కరకార్యముల్ భువిన్. ౫౩ 758

తే. ఇట్టివాని నొనర్చె మ♦ఱెవ్వరిట్లు
చేయఁజాలరు; మత్తకా♦శిని మహీజ
విడిచియే యింతదనుక ను♦ర్వీపతి గురు
బాహుఁ డొక్కముహూర్తమే ♦ బ్రదికినాఁడు. ౫౩౪ 759

క. ఈకార్యము శ్రీరఘువరుఁ, డేకరణిం జేసె నిట్టు ♦ లింకొక్కరుఁడీ
లోకమునఁ జేయఁజాలఁడు, ప్రాకటయశుఁ డిట్టి దుష్క♦రంబగుపనినిన్. ౫౮౪

చ. అనియిటు లాసమీరసుతుఁ ♦ డాజనకాత్మజ సీతఁగాంచి నె
మ్మనమున హర్షమొందుచు ర♦మాపతి యిట్టిసతీమతల్లి కన్
దనప్రియురాలిగాఁ బడసి ♦ ధన్యుఁడె యయ్యె నటంచు నెంతయున్
వినుతి యొనర్చెఁ గృత్రిమము ♦ వీడినచిత్తములోనఁ జక్కఁగన్. ౫౫ 761

పదునైదవ సర్గము సంపూర్ణము.

---

## ౧౬ - వ సర్గము.

హనుమంతుఁడు సీతదుర్దశఁ జింతించుట.

చ. హరికులపుంగవుండు కొని♦యాడఁగ నొప్పినజానకిన్ మనో
హరసుగుణాఢ్యుఁడౌ రఘుకు♦లాభరణంబును సన్నుతించి, వే
మరల విచారసాగరని♦మగ్నుఁడె యయ్యె; ముహూర్తమాత్ర మా
గురుతర తేజుఁడెంచి తన♦కుం గలదుఃఖముఁబట్టి దీనుఁడై. ౧ 762

క. కనుజంటనుండిరాలెడు, ఘనూనబాష్పములఁ గుంది ♦ యవనీజాతన్
మనమున నెన్నుచు దుఃఖం,చెను నివ్విధి; నీసుశీల ♦ సీతనిరతమున్. ౨ 763

ఆ. గురువినీతుఁ డగుచుఁ ♦ బరఁగులక్ష్మణునకుఁ, బూజనీయ యగును ♦ నీజగముల
నరసి కాచునట్టి ♦ యారామునకుఁ బ్రియ, యట్టియీామె ♦ దుఃఖ♦మందు నేని.

క. దురతిక్రమమగుఁ గాల, స్మరయఁగ నిఁక; దేవి యీామె ♦ యత్నముఁ దా నా
తురపడి చేయక శ్రీరఘు,వరువ్యవసాయం బెఱింగి ♦ వర్తించెడుఁజూ. ౩౪ 765

*సీ. తనపతి మృగమని ♦ తలఁచి వెంబడిపోవ మారీచుఁడని బుద్ధి♦మహిమ నెన్ని
నట్టి లక్ష్మణుఁడెట్టి ♦ వ్యవసాయపరుఁడొ తా నెఱిఁగినయది; యిట్టి♦యింతికష్ట
కాలమునందును ♦ గలఁతనొందక వృష్టికాలంబునం గలం♦గని భగీర
థాత్మజయగుగంగ ♦ యట్లున్నయది; తుల్యశీలవయోవృత్త♦సిద్ధినంది

---

* రామస్య వ్యవసాయజ్ఞా- ఇత్యాదిశ్లోకద్వయవ్యాఖ్యానాభిప్రాయము పద్యమునఁ గనఁబడు.

తే. కులమునందును లక్షణ♦ములను దుల్య
మై చెలంగెడుఁగాన నీ♦యంగనకును
దగియె యున్నాఁడు రాముఁ డు♦త్పలదళాక్షి
యీమె తగియున్న దతనికి ♦ నెన్నిచూడ. ౫ 766

చ. అనివిలపించె; నయ్యనిలు♦ నాత్మజుఁ డంత నవీనభర్మకాం
తిని దనరారుచుండ్ బ్రియము♦ దివ్యము లోకులకెల్లఁ గూర్చువ
ద్మను బురుడించుచున్నవని♦తామణి సీతను జూచి నెమ్మనం
బున రఘురామునిం దలఁచి ♦ పోలఁగ నిట్లువచించె నాత్మలోన్. ౬ 767

ఉ. ఈవనితామతల్లికయి ♦ యే బలశాలిని వాలిఁ జంపెఁగా
భూవరుఁ డక్లై శౌర్యమునఁ ♦ బొల్చుకబంధునిఁ గ్రూరరాక్షసున్
రావణతుల్యుఁ జంపె; నమ♦రప్రభుఁ డుద్ధతి శంబరాసురున్
జీవదలిర్పఁ గూల్చినటు ♦ చెచ్చెఱ భీమపరాక్రముఁడ్ భయం
బావహిలంగ సంగరము♦నందు విరాధునిఁ గూల్చెఁ గానలోన్. ౭ 768

సీ. అనలశిఖాతుల్య♦మైన బాణావళిఁ బఱఁగించి శౌర్యంబు♦మెఱయ భీమ
కర్ములౌ దనుజులఁ ♦ గడువిక్రమాఢ్యులఁ బదునాల్గువేవుర ♦ బవరమందు
నాజనస్థానంబు♦నందు వధించెను; విధితాత్ముఁ డగురఘు♦వీరుఁ డీమె
కయి సంగరంబున ♦ ఖరునివధించెను; ద్రిశిరుని గురుతర♦తేజుఁడైన

తే. యట్టిదూషణు వధియించె; ♦ నర్కసుతుఁడు
వాలిపాలితమై దుర్ల♦భంబు లోక
పూజితంబును నగుకపి♦భూరిరాజ్య
మీమె హేతువుఁబట్టియే ♦ యెలమిఁబొందె. ౧౧ 768

చ. వనజదళాయతాక్షులను ♦ భాసిలునీమెకునైకదా జవం
బునుగొనుచున్ నదీనదవి♦భుండయి శ్రీయుతుఁడౌ సముద్రునిన్
బనివడి నేను దాఁటి యిట ♦ వచ్చితి నీపురిఁ జూచినాఁడ; నీ
జనకజకై రఘూత్తముఁడు ♦ సాగరమేఖలయైన మేదినిన్. ౧౨ 770

క. *జగములనెల్లను దలక్రిం,దుగఁజేసిన యుక్తమనుచుఁ ♦ దోఁచెడు నాకున్;
దగ నెన్నిచూడ మది ము,జ్జగముల రాజ్యంబొ రాము♦సాధ్వియె హెచ్చౌ.

క. అని పరిశీలించినచో, జనకజలో రాజ్యమెల్ల ♦ సరిపోలదు సు
మ్ము నిజంబు షోడశాంశం, బునకైనను; నీమెసాధు♦బుద్ధి తనరఁగన్. ౧౪

ఆ. ధర్మశీలుఁడగుచుఁ ♦ దగుమిథిలాధీశు
తనయయగుచు, రాము♦ధర్మపత్ని

* రాజ్యంవా త్రిషులోకేషు-అనుశ్లోకార్థ మిట వర్ణితము.

యగుచుఁ బ్రాణనాథు♦నందు దృఢవ్రత
మలర నొప్పుచున్న♦యది మఱియును. ౧౫ 773

క. సరసిజరేణునిభంబులు, పరుసమ్ములునైన భూమి♦పాంసువులు కరే
బరమున నొప్పఁగ వాలముఖి, పరికృతంబైననేఁ ♦ బగిలిచికొనుచున్. ౧౬

క. జనియించినయామెయె యీ, వనితామణి; యార్యశీల ♦ భానుకులయి చ
క్కనిశౌర్యంబునఁ దగి, యని, ననివార్యంబైన దశర♦థాధిపమణికిన్. ౧౬½

తే. పెద్దకోడలు, కీర్తిని ♦ బెంపుగాంచి
నదియు; విదితాత్ముఁడగుచు ధ♦ర్మాళినెఱఁగి
మేలుమఱువనిరామభూ♦పాలునకుఁ బ్రి
యాంగనయునయ్యె నిట రాక్ష♦సాంగనలకు. ౧౭½ 776

క. చిక్కి కృశించుచునున్నది;, నిక్కముగా భర్తయందు ♦ స్నేహపుబలిమిన్
జక్కనిభోగాళిన్ విడి, యెక్కరణినినైన వాని ♦ నెన్నక మదిలోన్. ౧౮½

క. జనశూన్యమైనకానన, మును జొచ్చెను; మిగుల మధుర♦ముగ నొప్పెడుభు
క్తిని మునుగొనుచుండినద,య్యను వన్యఫలాళిఁ దృప్తి♦నొందుచు సతమున్.

క. పతిశుశ్రూషణరతయై, యతిశయసంతోషమును గృ♦హంబునఁ గనుప
ద్ధతినిటఁ బొందుచునున్నది;, సుతప్తకనకాంగమెంతొ ♦ సొంపునొసఁగుచున్.

క. స్మితముగ్ధభాషిణియు నం,తతసౌఖ్యార్హయునునైన♦ధరణిజ యేదు
ర్గతికిం దగనిదె యయ్యును, నతిశయవేదనల నిందు♦నందెడు నకటా!. ౨౧

క. శీలమునం దనరారుచుఁ, జాలన్ రావణునిచే న♦సాధుపథమునన్
జాలిం బొందఁగఁదగినటు, లీలీలఁ గలంపఁబడెడు ♦ నీసుచరిత్రన్. ౨౧½ 781

ఆ. దప్పిగొన్నవాఁడు ♦ తాఁ జలివందిరిఁ
గాంచునట్లు భూమి♦కాంతుఁ డీమెఁ
గనఁగఁదగును; రాజ్య♦మును గోలుపోయిన
రాజు మరలఁ బొంది ♦ రంజిలుగతి. ౨౨½ 782

క. జనకజ మరలం బొందుచు, ఘనసంతోషమును బొందఁ♦గలఁ డిది నిజ; మీ
వనితయును *గోరఁదగుభో,గనికరములు లేక బంధు♦గణహీనయునై. ౨౩½

క. తననాథునియాగమనం,బును గోరుచు మేనఁ బ్రాణ♦ములు నిల్పిన; దీ
దనుజాంగనలను నిత్తఱిఁ, గనుఁగొనదు, సుపుష్పఫలని♦కాయతరువులన్.

క. పరికింప దన్యమును జూ,చురతిన్ విడనాడి రామ♦శుభరూపమునే
నిరతము దలంచుచున్నది, యరయన్ నిజమిద్ది; స్త్రీల♦కందఱి కవనిన్. ౨౫

---

* కామభోగైః పరిత్యక్తా-అవిమా.

చ. పెనిమిటి సత్కలాపముల ♦ బృందమునందును భూషణంబు కా
వున వరభూషణంబులను ♦ బూనఁగఁ దాఁ దగినట్టి యీమహీ
తనయయు నట్టిభూషణముఁ ♦ దాఁ గనమిన్ వెలుఁగొందకున్న; దీ
జనకజఁ బాసి రాఘవుఁడు ♦ సత్వరమే తనువున్ ద్యజింపఁడో. ౨౬॥ 786

తే. అట్టులయ్యును దనదు దే♦హమును విడువ
కున్నవాఁడె, వగం జిక్క♦కున్నవాఁడె
యిద్ది దుష్కరకార్యమౌ ♦ నితరులెవరు
చేయఁజాలరు పూనిన♦క్షితితలమున. ౨౭ 787

[1]క. శతపత్రనిభేక్షణయు న,సితకేశాంతయును సాధు♦చిత్తయు మతిసం
తతము సుఖార్హయు నగునీ, సతిదుఃఖము నొందియున్న♦సరణిం జూడన్.

[2]క. వనచరమాత్రుఁడ నగునా,కును మది దుఃఖంబు మిగులఁ ♦ గూడెడునకటా!
ఘనతరకృపాళుఁ డగురా,మున కిది కల్గుటయు సహజ♦ముగదా తలఁపన్.

క. ధరవోలె నోర్పుడగఁ బు,ష్కరనేత్రయునైన యీమె♦జానకి మును భూ
వరులైన రామలక్ష్మణు,లరయుచు రక్షింప నొప్పు♦నట్టినతి యిటన్. ౨౮॥

క. తరుమూలతలంబున భీ,కరనేత్రము లొప్పనున్న ♦ క్రవ్యాదవధూ
పరిరక్షితయై యున్నది; కరము విచారంబుఁ గూర్పఁ♦గల దిది తలఁపన్. ౨౯

సీ. జనకతనూజ తు♦హినహతనళినియ ట్లంగశోభయుఁ గుంద ♦ ననవరతము
వ్యసనపరంపర ♦ బాధించుచుండంగ, సహచరరహితయౌ ♦ చక్రవాకి
కరణి రాముఁ బాసి ♦ కడువగ నొందుచు జాలిఁ గొల్పెడునవ♦స్థను గనుచును
వసియించి యున్నదీ♦వనిఁ; బూలపఱపున శాఖాగ్రములు వంగఁ ♦ జార్వశోక
తరువరంబులు, వసం♦తము వచ్చుటం జేసి [3]బహుసహస్రప్రభా♦భాసమానుఁ

ఆ. డగుచు మందరశ్మి ♦ యగుచును బొడచూపి
నట్టిచందమామ ♦ యార్తినీమె
యొందునట్లు చేయు♦చున్నారు; గదయుని
బలయుతుండు వేగ♦వంతుఁ డగుచు. ౩౦॥ 792

క. అనిలతనూజుఁడు నగునా, హనుమయు నీవిషయమిట్టు ♦ లాత్మఁ దలఁచి యీ
వనితయె సీతయటంచును, వినిశ్చయము నొందియుండె ♦ వృక్షమున నటన్.

పదునాఱవ సర్గము సంపూర్ణము.

---

1 ఇమా మసితకేశాంతాం శతపత్రనిభేక్షణామ్ - అనుశ్లోకార్థసార మిందు నిక్షిప్తము.
2 ఈపద్యము గోవిందరాజులయర్థము నుపపాదించుననియు నిదియే శ్లోకార్థసారమనియు గ్రహింపఁ
దగు. 3 హిమవ్యపాయేనచ మందరశ్మి రభ్యుత్థితో నైకసహస్రరశ్మిః-అనిమూ. మందరశ్మిః=మార్యా
పేక్షయా మందకాః చంద్ర ఇతి యావత్-అనివ్యాఖ్య.

## ౧౭ - వ సర్గము.

హనుమంతుఁడు కావలియున్నరాక్షసాంగనలం జూచుట.

ఆ. తెల్లగలువపిండు•తీరున నలరుచు, నిర్మలుం డగువిధుఁడు • నీలనిర్మ
లోదకమున నంచ • యొగిఁ జనుగతినీల, నిర్మలాంబరమున • నీటుగులుక. ౧

క. చనిచని యపరాంశంబును, గనియెన్; నిర్మలకరాళిఁ • గ్రాలుచు దనకాం
తినిజూపుచు సాహాయ్యము, హనుమకుఁ జేయువటు శీత•లాత్మకరములన్. ౧॥

క. మరుదాత్మజాతుపయిని బ్రసరింపఁగాఁ జేసెఁ; బూర్ణ•చంద్రనిభాస్యన్
ధరణిజ నంతట నెక్కువ, బరువున నొకయు మునుంగు•పద్ధతి నీటన్. ౨॥

క. పెనువగల భారమున మున్గినరీతిం జూచె నతఁడు; • నెలఁతను దగఁ జూ
డనుగోరి పరీక్షించుచుఁ, దనుమధ్యకుఁ జెంతఘోర•దర్శన లగుచున్. ౩॥

చ. కనఁబడు రాక్షసాంగనలఁ • గాంచెను, నందొకకంటిరాక్షసాం
గన నొకశ్రోత్ర మొప్పఁదగు•కాంత, విశాలములైనకర్ణముల్
తనదుశిరస్సు గప్పఁగను • దారుణరీతిని నున్నాతినిన్
గనియెను, గర్ణహీనయగు•కామిని నాతఁడు నవ్వనంబునన్. ౪॥ 798

సీ. జలవరాహశ్రోత్ర•సమకర్ణయుత నాతి, నూర్ధ్వముఖంబుగా • నొక్కరీతిఁ
దిరిగి యూర్పులపిండుఁ • దీవ్రగతిం బుచ్చునాసిక నొప్పెడు•నాతి, మిగులఁ
బెద్దది యగుతల • వెలయఁగ నున్నట్టిదానిని, దనుదీర్ఘ•తరగళంబు
గలదానిఁ, దలవెంట్రు•కలె లేనిదానిని, గొంచెపువెంట్రుకల్ • గొనురుమిగుల

తే. నున్నదానిఁ గంబళివలె • నొప్పుకేశ
ములఁ జెలంగెడుదానిని • గళితలంబ
కర్ణనిటలను, వ్రేలాడు•కడుపుదాని
లంబవక్షోజయయి యొప్పు•లలన మఱియు. ౬॥ 799

తే. పెదవివ్రేలాడ నొప్పెడు•భీరువుఁ జుబు
కోష్ఠమునఁ జూడఁగాఁ దగి•యున్నవనిత
వ్రేలుచున్నముఖంబునఁ • గ్రాలు నాతి
వ్రేలుచున్న మోకాళ్లను • వెలయునువిద. ౭ 800

సీ. పొట్టిరక్కసి మఱి • పొడుగుదానిని, గుబ్జ, వికటను, వామనఁ, • బింగలాక్షి
భుగ్నవక్త్రఁ, గరాళ•భూరివికారాస్యఁ గనుఁగొనె; మఱియు నా•కపివరుండు
వికృతవేషంబుల • వెలయువారిని, బింగళచ్ఛాయగల్గిన•లలనలఁ దగ
నల్లనివారల • నుల్లంబు కోపరతిం బొల్పుఁదగునట్టి•తెఱవలఁ, గల

తే. హాభిలాషలఁ దగువారి • నల్లె యినుప
గుదియలన్, గూటముల మఱి • కూటముద్గ

రాదులం దాల్చువారిఁ, గో♦లాస్యలను, మృ
గాస్యల, మహిషవక్త్రల ♦ నచటఁ గనియె. ౯౹ 801

క. పులిమొగములు గొఱ్ఱెలమో,ములు నక్కలమోము లట్టి♦మొగములు గలవా
రల, నమద్ద్విరదాశ్వో,ష్ట్రల నొప్పెడు స్త్రీలఁ, బ్లవగ♦కుంజరుఁడు గనెన్.

క. తల దేహములోపలనే, గలవారల, మఱియు నేక♦కరపాదములం
జెలఁగెడువారల ఖరకర్ణల, నశ్వశ్రోత్రములను ♦ రాజిలువారిన్. ౧౦౹ 803

సీ. గోహస్తికర్ణలఁ ♦ గోఁతిచెవుల్ గలయతివల, ముక్కులే♦నట్టివారి
నతినాసికలను, ది♦ర్యఙ్నాసికల, వికృతము లగునాసలఁ ♦ దనరువారిఁ
గరికరసమనాసి♦కయు గలవారల, భాగభాగమ్మునఁ ♦ బరఁగుచు మఱి
యూర్పుల వెలయించు♦చున్ననాసికలను గలవారి, మఱియును ♦ గరిపదసమ
తే. పాదములు గల్గువారి న♦పారపాద
ములను బొల్పారువారి, గో♦పులవలెఁ దగు
పదములుం గలవారలఁ ♦ బాదములను
గురులుగల్గినరాక్షస♦తరుణులఁ గనె. ౧౨౹ 804

క. అతిమాత్రశిరోగ్రీవల, నతిమాత్రకుచోదరులను ♦ నాచందముగా
నతిమాత్రనేత్రలను న,ట్లతిజిహ్వల, దీర్ఘనఖర♦లగుచెలువలనున్. ౧౩౹ 805

సీ. మేఁకమొగంబుల ♦ మించువారల, గజ, గో, సూకరాస్యల ♦ ఘోటకాన
నల, నుష్ట్రి, ఖరవక్త్ర♦ములఁ దగునట్టి యాదనుజాంగనల, ఘోర♦దర్శనలను
శూలముద్గరభిండి♦వాలశోభితహస్తలను, గలహప్రియ♦లను నమర్ష
గలయట్టి దుస్స్వభా♦వల, ఘోరదంష్ట్రిల, వికృతవక్త్రల,ధూమ్ర♦వివృతకచల
తే. మద్యమును ద్రాగువారల ♦ మద్యమాంస
నిరతచిత్తల, మాంసశో♦ణితనిమగ్న
కాయముల నొప్పువారి, ర♦క్తముపలలము
భోజనముగాఁగఁ దగువారిఁ ♦ బోలఁగనియె. ౧౬౹ 806

క. వనచరతిలకుఁడు గగ్గురు, జనియింపఁగఁ జేయువారి ♦ స్కంధంబులతోఁ
దనరారునాయశోకం,బును నంతట నావరించి ♦ భూసుతకొఱకై. ౧౭ 807

ఆ. కూరుచుండియున్న ♦ క్రూరదానవకాంత
లను దగంగఁ గాంచె; ♦ జనకతనయఁ
గనుట హర్షమునను ♦ గాంతిని బొల్పాఱు
ననిలతనయుఁ డప్పు ♦ డాదరమున. ౧౮౹ 808

క. జనకజ, ననిందితను, దాఁ,గనియె నశోకంబుక్రిందఁ ♦ గాంతిఁ దఱిగి యిం
తనచానిశోకజలనిధి, మునుఁగుచు భూరేణుకలిత♦మూర్ధజ యగుచున్. ౧౯

క. తనపుణ్యమెల్ల క్షీణిం,చిన నాకాశంబునుండి ♦ క్షితిపయిఁ బడుచు

క్కను సరిపోలుచు శీలం,బునఁ గీర్తిని గాంచి తనవి♦భుం గన కార్తిన్. ౨౦

చ. సురుచిరభూషణావళుల ♦ శోభిలు కెంతయుఁ బ్రాణనాథుపైఁ
బరఁగెడు ప్రీతి భక్తు లతి♦భాసురభూషణసంయుతులై తగన్
సురరిపుసన్నిరుద్ధయయి ♦ సొంపును మాని విహారబాంధవో
త్కరయయి హస్తియూథమును ♦ గానక యొంటిగ నుండి కానలోన్. ౨౧

తే. సింహసంరుద్ధయయి చనఁ ♦ జేవలేక
యార్తిఁ గుందెడుద్విరదవ♦ ట్లామెయూడఁ
దగినదై యుండె; శారదా♦భ్రగణపిహిత
చంద్రరేఖవలెం జూడఁ♦జాలి మఱియు. ౨౨ 812

తే. నలుఁగు మొదలగుసంస్కార♦ములు కలుగమి
నందమెల్లను దఱిగి క♦నం దగునటు
లుండఁ దంత్రులు లేమి న♦యుక్తమైన
వల్లకిని బోలి యప్పు భా♦సిల్లుచుండె. ౨౩। 813

[1]చ. పెనిమిటి యండఁబాయకయె ♦ పృథ్వితనూభవ యుండ నర్హయౌ,
దనుజవధూవశంబునను ♦ దా వసియింప నవర్హయౌను, రా
ముని విడనాడి దుఃఖమయ♦ముం గడుదుస్తరణంబు నౌ మహా
వననిధి మున్గ యానుజ♦భామలు చుట్టును ముట్టడింపఁగన్. ౨౪। 814

క. క్రూరగ్రహసంయుక్తం, బౌ రోహిణిసూక్ష్మిఁ జూడ♦నై కుందుచుఁ దా
నారామచుందు నట [2]నును,వారము లేవట్టిదిఁగ♦వలె నప్రభయై. ౨౫ 815

చ. వనమున నంతరాళమున ♦ వారిజలోచన సీత యుండఁగా
హనుమ కనుంగొనెన్; మఱియు ♦ నంబుజకాండము పంకదిగ్ధమ
య్యును సహజంబుగా మిగుల ♦ నొప్పెడులాగునఁ బంకయుక్తతన్
దనతనుభాగముల్ సురుచి♦రం గనకున్నను నైజకాంతిచేఁ
దనరుచు నెంతయున్ నలఁగఁ ♦ దద్దయు మాసినచీరయొప్పఁగన్. ౨౬ 816

తే. హరిణశాబాక్షియై, భర్త♦దైన తేజ
మును దలఁచుకతనఁ దనదైన్య♦మును విడి తన
శీలమే కాఁపుగా నొప్పు ♦ నీలలోచ
నములు పొల్పార దీనాన♦నమునఁ బొదలి. ౨౭ 817

క. కనుపట్టుచున్నసీతను, హనుమంతుఁడు కనియె; నంత ♦ హరిణాక్షిని సీ
తను భీతహరిణకన్యక, యనువున నెల్లెడలఁ జూచు♦నట్టిజనకజన్. ౨౮ 818

క. [3]ఘనతరనిశ్వాసంబుల, వనమునఁ గలవృక్షపల్ల♦వంబుల దహియిం

---

1 సీతాం భర్తృవశే యుక్తామ్-అనిమూలము. 2 రతౌమకుసుమామివ.-అనిమూలము. 3 సంభూతమిమ శోకానామ్-అనిమూలము.

చునటులఁ జూపట్టుచుఁ దను,వునుదాల్చిన వగలగుంపు♦వోలెన్ మఱియున్.

క. చెలరేఁగిన దుఃఖోర్మ్ముల,వలెఁ జూపట్టుచును భూమి♦వలె నోర్పు దగన్
గలిగి సువిభక్తతనువున, వెలయుచు సొమ్ములను గొనక ♦ వింతమెఱయుచున్.

చ. కనఁబడుచున్నసీతఁగని ♦ గాలికుమారుఁ డనంతహర్షముం
గనియెను; నవ్వనంబునను ♦ గామిని నమ్మదిరేక్షణన్ మహీ
తనయను జూచి బాష్పములు ♦ తద్దయు జాఱఁగ [1]రాముఁగూర్చి వం
దనము నొనర్చి; శౌర్యము సి♦తాంతము నొప్పఁగఁ బొల్చునాతఁడున్. ౩౧౪

ఆ. [2]రామలక్ష్మణులకు ♦ నేమంబునన్ మ్రొక్కి
జనకతనయఁ గాంచి ♦ సంతసమున
నాయశోకశాఖ♦లందుఁ గన్పడకుండ
నొదిగియుండె [3]నుపమ ♦ యొప్పుచుండ. ౩౧౫ 822

పదునేడవ సర్గము సంపూర్ణము.

---

## ౧౮ - వ సర్గము.

### రావణుం డశోకవనమునకు వచ్చుట.

[4]చ. హనుమయు నట్లు పుష్పితము ♦ లౌధరణీజము లొప్పనున్నయా
వనమును జూచుచున్ జనక♦వల్లభుపుత్త్రిని జూచుచుండునం
త నిశయు నంతయే మిగిలి ♦ తద్దయు భాగము పోయియుండె; నం
త నపరరాత్రియందున న♦తంపు దళాంతరసీమనుండియే. ౧ 823

సీ. అంగషట్కంబుల ♦ నలరు వేదంబుల నెఱిఁగి యజ్ఞంబుల♦నెల్లఁ దమరె
యితరులచేతఁ జే♦యించు [5]నాబ్రహ్మసురుల వేదనిర్ఘోష♦ములను వినియె;
నంతట శ్రుతిమనో♦హరములౌ మంగళవాద్యనిస్వనములు ♦ ప్రబలుచుండ
వానికి నమ్మహా♦బాహుండు మిక్కిలిబలశాలి యగుదశ♦వదనుఁ డట్టె
మేలుకాంచెను; మఱి♦మిక్కిలిశౌర్యంబుగలరావణుఁడువస్త్ర♦ములును మాల్య

తే. ములును నిద్రావశంబున ♦ నెలవులవిడి
యుండఁ దగువేళ మేల్కాంచి ♦ యుర్వితనయఁ
దలఁచుకొనె; [6]నంత రాక్షస♦తల్లజుండు
జనకసుతయందు మిగులనా♦సక్తిఁ బూని ౨ 824

---

1 నమశ్చక్రే చ రాఘవమ్-అనిమూలము. 2 నమస్కృత్వా సరామాయ లక్ష్మణాయ చ-అని మూలము. 3 ఉపమ యొప్పుచుండ-అనునది మూలార్థానుపోషకము. 4 కించిచ్ఛేషనిశాభవత్-అని మూలము. 5 బ్రహ్మరక్షసామ్-అనిమూలము. బ్రాహ్మణత్వవిశిష్టరాక్షసానామ్-అనివ్యాఖ్య. 6 భృశం నియుక్తస్తస్యాం చ మదనేన మదోత్కటః, న సతం రాక్షసః కామం శశాకాత్మనిగూహితుమ్-అనిమూలము. దీనికి మహేశ్వరతీర్థులు సీతయందు రావణునకు భక్తియేకలదుగాని మోహములేదని

తే. స్మరుఁడు పురికొల్పినంతన ♦ మదవిమోహి
తుఁడయి యాకామతను మన♦స్తోయజమున
నడఁచుకొనఁజాలఁడయ్యె నా ♦ యసురవర్యుఁ
డాభరణజాలములఁ దాల్చి ♦ యతులకాంతి. ౫ 325

క. నిరతము పుష్పఫలంబులఁ, గరముసుదై తగినవృక్ష♦కాండంబులు పు
ష్కరిణులు వెలయఁగ బహువిధ, సుచిరపుష్పోత్కరముల♦సొంపుమగుచున్.

క. అనవరతము మత్తిల్లిన, ఘనవిహగతతిం జెలంగఁ ♦ గడునద్భుతమై
కనఁబడునశోకవనమును, గనువేడుక నొందె మిగులఁ ♦ గానన మదియున్. ౭

తే. కనులమనసును హరియింపఁ♦గాఁ గలవృక
ములను వగఁ గూడియుండు, ని♦ర్మలమణిగణ
కనకమయతోరణంబులఁ ♦ గ్రాలువీథు
లొప్ప బెడగారుచుండె న♦ట్లుపవనము. ౮ 328

క. పలువిధములఁ దగుమృగగణ, ములచే, ధర రాలినఫల♦ములచేఁ దగి మి
క్కిలియుందమైనరీతిని, వెలయఁగ నారావణుండు ♦ వేగమ చొచ్చెన్. ౯ 329

క. సురగంధర్వాంగనలా, పురుహూతుని వెంబడించి ♦ పోయెడురీతిం
దరుణీశతంబు రావణుఁ, దరుగుచు నుండంగ వెంట ♦ నరిగెం ద్వరతోన్. ౧౦

క. తరుణులు కొందఱు కాంచన, కరదీపికలన్ గ్రహించి ♦ కదలిరి మఱి చా
మరములఁ గొందఱు పట్టుకొ,నిరి కొందఱు తాళవృంత♦నికరములఁ దమిన్.

క. ధరియించిరి, మఱికొందఱు, తరుణులు నవభర్మపాత్ర♦తతులన్ జలమున్
బరమశుభదంబుఁగొని పో,యిరి రావణువెంటఁ గొంద♦ఱింతులు పూన్కిన్.

తే. కత్తులను నాసనంబులఁ ♦ గైకొనిచన
జాణ యొక్కతె నవసురా♦సాంద్రరత్న
పాత్రమును గుడిచేతను ♦ బట్టుకొనుచు
నరిగె రావణువెంట నె♦య్యంబుమీఱ. ౧౩ 333

క. తరుణి మఱొక్కతె *పూర్ణాం, బురుహారిప్రభను మించి ♦ పొలుచుచు నవక
ర్బురదండము రాయంచల, కరణి సితంబగు గొడుగుఁ ♦ గైకొని వెనుకన్.

క. చనియెను; నుత్తమలగు నా, తనికాంతలు నిద్రచొక్కు,♦ దద్దయు నురఁ గ్రో
లినకైపు, పొలయ నెట్టని, కనులొప్పఁగ వీరుఁడైన♦కాంతుని వెనుకన్. ౧౫

యర్థమును వ్రాసిరి. ఆయర్థముగూడ నిటఁ దెలుఁగునఁ గనఁబడును. అంతన్ ఆమదవిమోహితుఁడయి, యనియు, అడఁచుకొనఁజాలఁడయ్యెనా? అనియుఁ బదముల విభజించిన నాయర్థమగు. అంతన చాలఁడయ్యెన్ ఆయసురవర్యుఁడు-అని పదవిభాగము చేసిన ప్రాతీతికార్థము స్పష్టమగు.

* పూర్ణాంబురుహారిప్రభము=సంపూర్ణచంద్రకాంతిని. ఇట నంబురుహారిపుశబ్ద మేలయని కవిత చెప్పువాడుకగలవారు ప్రశ్నింపరని నాభావము.

క. ఘనపంక్తి మెఱపుఁదీఁగలు, వెనుకొనుగతిఁ బ్రీతిమీఱ ♦ వెంటఁదగిలి వే
చనిరి; మహాబలుఁడౌ దనుజుని ప్రియపత్నులును నిద్ర ♦ చొక్కు వోలయుటన్.

తే. వ్యత్యయంబుగఁ గేయూర♦హారములను
వైచుకొని యంగరాగంబు ♦ వదలిపోవ
గళితకేశాంతలయి, స్వేద♦కలితములయి
యాస్యములు చెల్వుమీఱ నొ♦య్యారమమర. ౧౮ 837

సీ. మదశేషమునఁ దమ♦మనసులు ఘూర్ణిల్ల, నిదురచేఁ గలఁతయు ♦ గదుర దాన
నెమ్మొగంబులుఁ జాల ♦ నెమ్మెగుల్కఁగ [1]స్వేదమున నంగములనుమ♦ములును వాడఁ
గుసుమమాల్యమ్ము లా♦కులములై జడముడులను వ్యత్యయంబుగఁ♦గనఁబడంగ
భర్తయంజలిగౌర♦వంబునఁ దమిచేత రాక్షసప్రభువగు♦రావణునిని

తే. ననుసరించిరి; వారికి ♦ నాథుఁడైన
యసురవరుఁడు మహాబలుఁ ♦ డతనువశత
నంది జానకియందుఁ బెం♦పొందుప్రీతి
మనమునం దొప్పుచుండ నం♦దుని విధమున. ౧౯ 838

క. మదమున నడకయు నందము,గఁ దనరఁగా వెలసె; నంతఁ ♦ గాంతామణులె
ల్లఁ దమిన్ వచ్చుచునుండఁగఁ, దదీయకాంచీరవంబుఁ ♦ దా వినెఁ గపియున్.

తే. అందియల నాదముల మరు♦దాత్మజుండు
వినియె; నసదృశకార్యుఁడై ♦ విపులబలము
తనర నతిలోకపౌరుషం♦బునఁ జెలఁగుచుఁ
దద్వనద్వారమును జేరు♦దనుజపతిని. ౨౦ 840

చ. కనుఁగొనె వాయునందనుఁడు ♦ కాంచనదీపికలెన్నొ వేలుగా
వనితలు గంధతైలగురు♦వాసనలొప్పుచునుండఁ బట్టి వే
చనఁగఁ దదీయతేజమునఁ ♦ జక్కఁగ రావణుఁ డొప్పి మీన కే
తనమదమద్యగర్వసహి♦తంబులు వంకరలైన నేత్రముల్. ౨౧ 841

తే. ఎఱ్ఱనై యాయతంబులై ♦ యొసఁగుచుండ
ధనువును ద్యజించి వచ్చుప్ర♦త్యక్షమదనుఁ
డనఁగఁ దగియుండె; మఱియు నా♦దనుజవర్యుఁ
డుత్తమంబయి ధూళిలే♦కొప్పుమీఱి. ౨౩ 842

క. [2]సుమథితతక్రపయోరుచు, లమరంగ నిజాంగదముల♦యందుఁ దగులుకొ
న్న మహితవస్త్రమ్ము విలాసము మీఱఁగ లాగుకొనుచుఁ ♦ జనుదేరంగన్.

---

1 స్వేదక్లిష్టాంగకుసుమాః-అనిమా. 2 వస్త్రముత్తమమ్, సలీల మమకర్షంతం విముక్తం వస్త్రమంగదే-అనిమా.

చ. హనుమయుఁ బత్త్రసాంద్రమగు♦నట్టి యొకానొకకొమ్మయందు నే
జనునకుఁ గానరానిదగు♦చందమునన్ మృదుపత్త్రపుష్పముల్
తనువును గప్పియుండ, నల♦దానవుఁ డెంతనె యున్నయట్లుగాఁ
గనుఁగొనసాగె; నిట్లతనిఁ♦గాంచుచు యౌవనరూపసంపదన్. ౨౫ 844

క. అలరారుచున్నతత్పుర, లలనలఁ గనుఁగొనియె; నచటఁ ♦ బ్లవగేంద్రుఁడు కాం
తల వారి సుందరాంగుల, నెలమిం గూడుకొని దాన♦వేశ్వరుఁ డొకటన్.

క. పతగంబులు మృగములు నుద్ధతిశబ్దము లొక్కరీతిఁ ♦ దక్కయుఁ జేయన్
హితముగఁ గన్పడునావని, జతనంబునఁ జొచ్చె; రాక్ష♦సప్రభుఁ డంతన్.

క. సురఁ గ్రోలుట మత్తుండై, నిరుపమచిత్రాభరణవి♦నిర్మలకాంతుల్
పరఁగంగ శంకుకర్ణము, లరుదుగఁ గన్పట్టఁగా మ♦హాబల మమరన్. ౨౮

చ. అనుపమరూపవైఖరుల ♦ నారయఁగా సురసుందరీగణం
బును నిరసించుకామినులఁ ♦ బొల్పుగఁ గూడి యుడుప్రజంబుచే
తను బరివారితుండగు సు♦ధారుచిలాగున నొప్పుచున్ మరు
త్తనయునకుం గనంబడియెఁ ♦ దాను విభాకరతుల్యతేజుఁడై. ౨౯ 848

చ. గురుతరతేజుఁడై నకపి♦కుంజరుఁ డీఘనబాహుఁడే యగున్
సురరిపుఁ డాపులస్త్యునకు ♦ సూనుఁ డటంచుఁ దలంచి మెల్లఁగాఁ
దరువునఁ గ్రిందికొమ్మకును ♦ దా దిగియెన్ మఱియున్ మహాభయం
కరగురుతేజుఁడయ్యు నల♦కర్బురనాథుని భూరికాంతికిన్. ౩౦ 849

ఆ. తగ్గి పత్త్రపిహిత♦తరుశాఖ నొకచోట, దాగియుండె; సంహ♦తస్తనయుగ
నసితశీర్షజాంత♦నావరారోహను, నత్కటాక్షఁ జూడఁ♦జనియె దరికి. ౩౧ 850

పదునెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ౧౯ - వ సర్గము.

సీత రావణుఁ జూచి భయపడుట.

చ. దనుజవరేణ్యుఁ డచ్చటికిఁ ♦ దాఁ జనుదేర ననిందితాంగి యా
జనకజ రూపయౌవనవ♦శంగతదేహుని భూషణాభిరా
ముని నతనిన్ భయంకరుని ♦ ముందట దూరమునుండి వచ్చువా
నిని గనుచుం బ్రవాతమున ♦ నిర్భరరీతి వడంకురంభ నాఁ
జనుతరు వట్లుగా వడఁక♦సాగె భయంబును బొంది యెంతయున్. ౧ 851

క. *వరవర్ణిని యాజనకజ, విరివగుకనుజంట జెలఁగి ♦ విశ్రవసునుతుం
డరుదేరఁ గాంచి తొడల నుదరమును బాహువులచేత ♦ స్తనయుగము వడిన్.

* ఆచ్ఛాద్యోదర మూరుభ్యాం బాహుభ్యాం చ పయోధరౌ-అనిమా.

తే. కన్నుఁగొని యేడ్చుచుం దనుఁ ♦ గాంచువార
లచట లేమికి వగచుచు ♦ నబల కూరు
చుండె; దశవదనుం దప్పు ♦ దుర్వ్రతనయు
రాక్షసీగణసంతత♦రక్షితాంగి. ౩౪ 853

చంపకమాలిక:—

పెనువగఁ గుందుచున్ విపుల♦భీతిని బొందుచు సాగరంబునన్
మునుఁగఁగ నున్ననౌకవిధ♦ముం దలపించుచు, మెత్తలేక య
వ్వనిధరఁ గూరుచుండి, పతి♦భక్తియె సద్వ్రతమై చెలంగ, భూ
మిని నఱుకంగనే పడిన♦మేటిమహీరుహశాఖవోలె, నం
గనిచయమందుఁ గ్రమ్ముకొను ♦ ధూళిరజమే యొకభూషణంబుగాఁ
దనర, విచిత్రరీతిగ ని♦తాంతము చూడఁగ నొచు, రూపముం
గన మణిభూషణార్హయయి ♦ క్రాలియు భూషణముల్ గ్రహింపకే
ఘనతరపంకదిగ్ధయయి ♦ కన్పడుచున్నమృణాళియట్లు కాం
తిని బొలుపొందియున్ మిగుల ♦ దీప్తిని బాసియె యున్నజానకిం
గనుఁగొనె; నామెయున్ మతియు ♦ ధూపతి కేసరి, యాత్మవేత్తయున్
ఘనుఁడునునైన రామపద♦కంజసమీపము చేరఁబోవుశ
క్తిని గనకుంట నెట్లయినఁ ♦ దెంపున నేగఁగ నెంచి యాత్మతోన్. ౬౪ 854

సీ. సంకల్పహయములఁ ♦ జక్కఁగఁ గట్టినమనసను రథముపై ♦ మమత నెక్కి
యాతనిచెంతకు ♦ నరుగుచున్నదివోలె, ధ్యానశోకములకుఁ ♦ దాను జిక్కి
యన్నముం గొనమి న♦త్యంతంబు శుష్కించి యేడ్చుచునొంటిగా♦నెవరుగాని
కాచువారలు లేమిఁ ♦ గడుఁజింతనొందుచు దానియంతంబును ♦ గానక యెద
తే. రామునేయాశ్రయించుట ♦ వ్రతముగాఁగ
నందునదిగాన మంత్రాది♦కోగ్రసాధ
నాళికిం గట్టుపడి నేల ♦ నలముకొనిన
సర్పరాట్కన్యయట్లు చే♦ష్టలను బాసి. ౭౪ 855

ఆ. ధూమకేతువనఁగఁ ♦ దోఁచుగ్రహంబుచే
నావరింపఁబడిన♦యట్టిరోహి
ణివలెఁ బొక్కుచుండె; ♦ నెలఁతమిన్నమఱియు
వృత్తశీలములను ♦ వెలయుచుండి. ౯ 856

తే. *ధర్మమేముఖ్యముగ నొప్పి ♦ నిర్మలమగు
నట్టియాచారయుక్తమై ♦ యలరువంశ

* వృత్తశీలకులే జాతా మాచారవతిధార్మికే, పునస్సంస్కార మాపన్నాం జాతామివ చ దుష్కులే-అని మూ. సత్కులప్రసూతాం దుష్కులోత్థా మిత్యర్థః-అని వ్యాఖ్య.

మందు జన్మించి దుష్కులమందుఁ బెండ్లి
యయి తదన్వయజనితకన్యవలెఁ గుంది. ౧౦ 857

క. రిత్తది యగునపవాదము, హత్తుకొనం దూలినట్టి యశముకరణి, నా
వృత్తివిహీనతఁ గుందిన, యుత్తమవిద్యవలె నొప్పు నొందక మఱియున్. ౧౧

ఆ. సన్నగిలినయట్టి చారుకీర్తినిబోలి, యాదరణము లేని యట్టి శ్రద్ధ
కరణిఁ బూజ జేయఁగాఁ దగువస్తువుల్, లేనిపూజయట్లు కానఁబడుచు. ౧౨

సీ. ప్రతిహతమగునాశపద్ధతి మీఱంగఁ, దగ్గినయట్టియాదాయమువలె
భటులెల్ల నాచరింపనియాజ్ఞవలె, లయకాలజ్వలద్దిశకరణి మఱియు
నపహరింపంబడినట్టి పూజయుఁబోలె, విధ్వస్తపద్మినీవిధమున, వర
వీరులు లేమిని వెలయకుండినసేనవలెఁ, దమోధ్వస్తయౌ ప్రభ తెఱఁగున

తే. జలము లించుకమిగిలినశైవలినివి
ధమున, నపవిత్రసంస్పర్శనమును గన్న
యగ్నివేదికరీతి, శాంతాగ్నిశిఖయుఁ
బోలె నలరారకుండె; నప్పొలఁతి మఱియు. ౧౩ 860

సీసమాలిక:—

స్వర్భానుసంఛన్నచంద్రమండల మొప్పువున్నమ రాతిరిపోల్కి, హస్తి
హస్తపరామృష్టమై యాకులంబూలుఁ జెడిపోవఁ బత్తులు చెదరి భీతిఁ
జెందఁగాఁ దగుసరసీరుహాకరమట్లు లిరుగట్లు తెగ జలమురుగ నెండి
పోయిననదివలె; నాయకునింబాసి తచ్ఛోకమునఁ బీడితయయి కృష్ణ
పక్షనిశాభంగి, భర్తృదుఃఖంబున, సంస్కారములఁ జేయఁజాలమి గత
కాంతియై చూపట్టె; త్యాసుత; మఱియును సుకుమారియై కడుసుందరంబు
లగునవయవములు తగియుండ, రత్నగర్భగృహోచితయునయ్యు నట్టినేల
నుపవిష్టయై, యచిరోద్ధృతంబయి యుష్ణమునకు వాడుచునున్న వనజనాళ
మట్లుచూడందగి; యడవిగృహీతయై స్తంభంబునకు రశ్మిజాలములను
గట్టివేయంబడి కాంతునివిడనాడి, యూర్పులంబుచ్చుచు నుగుతరమగు
వగనొందియున్నట్టి వారణరాడ్వధువట్లు, యత్నములేమి నమలకేశ
సంతతి యేకమై జడగాఁగఁ బొడవుగ నమర, శరత్కాలమందు నీల [నం
వవపంక్తినొప్పుభూమినిబోలి, యుపవాసమున, శోకమునను, జింతను, భయము
జాలక్షీణించి, కార్శ్యమునొంది, దీనయై, తపమెవిత్తముగ, మితముగఁబరఁగు
నాహారమునుగొని యార్తినొందుచు, నంజలినిబట్టి రాముచే దనుజపతికి
నవమానమగుఁగాక యని యిష్టదేవత నర్థించురీతిగా నమరియుండెఁ;

తే. గాచువాఁ డెవ్వఁడైనను గల్గునని
నలుదెసలఁ జూచుచున్ రోదనంబు చేయు

చును, సుపక్ష్మము లొప్ప నే♦త్త్రనికొనలును
గలిగి శుక్లంబులైనట్టి ♦ కనులవెలసి. ౨౫ 861

క. పతిననుసరించుటయె సద్వ్రతముగ, నేనింద లేక ♦ పరఁగుజనకుస
త్సుత కాసఁ గొలుపఁబూనెను, [1]మృతినే రావణుఁడుకోరి ♦ మేటిపలుకులన్.

పందొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౨౦ - వ సర్గము.

### రావణుఁడు సీతను బ్రార్థించుట

[2]క. దనుజుఁడు దీననిరానందను సాధ్విఁ దపస్వినిన్ ము♦దంబున సీతన్
గని సాభిప్రాయములుగ, గనఁబడుమధురోక్తులను స్వ♦కాంక్షల నెల్లన్. ౧

[3]చ. తెలుపఁగఁబూని యిట్లను; స♦తీమణి, హస్తికరోరు, సుందరీ
వలపున నిన్నుఁగొల్వ నిట♦వచ్చిన నన్గని వట్టిభీతిచేఁ
గలఁగుచు సత్పయోధరయు♦గం బుదరంబును గప్పుకొంచు నీ
విలసితరూపమున్ మిగుల♦వింతగఁ గన్పడకుండఁ జేయఁగాఁ
దలఁచెద వేల? భృత్యుఁడను ♦ దాసుఁడఁగా నను నీవెఱుంగవే. ౨ 864

తే. సర్వలోకమనోహరా, ♦ చారులక్ష
ణాఢ్యసర్వాంగశోభితా ♦ యాయతాక్షి
మత్ప్రియవుగాన నినుఁ గొల్వ ♦ మనసుగల్గు
వాఁడ నన్నేలుకొనఁదగు ♦ వాస్తవముగ 3 865

క. నను గారవింపుమా; యిట, మనుజులు మఱి కామరూప♦మండనులగు నా
దనుజులును భీతిదులు క,న్గొన లేరెవ్వరును నేను ♦ గూర్చుభటుఁడఁజూ. ౪

క. కనుకన్ నావలనిభయం,బును వదలుము సీత, నీవు; ♦ పొంద దఘము నా
కును బరదారలఁ గోరుట, వినుమా తత్కారణంబు ♦ వివరింతు నిటన్. ౫ 867

సీ. [4]పరకాంతలను మదిఁ♦బరఁగు కౌతుకమునఁ బొందుటగాని, య♦ప్పొలఁతులబలి
మిని దెచ్చుటయుకాని ♦ దనుజులధర్మము, సందియ మేగల్గ ♦ దిందులకును;
నిది యిట్లగాఁగను♦న్నది; నీవు నన్నిష్ట కామింపకున్నావు♦గాన నేను
నినుస్పృశియింపఁ గా♦వునన నాయెడల నీ కత్యంతమును గాను ♦ మలరుఁ గాక

---

1 ప్రలోభయామాస వధాయ రావణః-అనిమూలము. 2 సతాం పతివ్రతాం దీనాం నిరానందాం తపస్వినీం-అనిమూలము. 3 ఇటనుండి మహేశ్వరతీర్థులవారివిశేషార్థ మీ మొదలగు పద్యముల యం దిమిడియున్నదని యెఱుంగనగు. సీతయందు మాతృభక్తియే రావణునకుం గలదుగాని మోహము రావణునకు వాస్తవముగా లేదని వీరిభావము. 4 ఈపద్యమున విశేషార్థము శబ్దగతమై యిమిడియున్నదని యెఱుంగఁదగు.

తే. యిచ్చవచ్చినరీతి నీ♦విష్టపడిన
నిన్ను సేవింతు; దేవి ! నీ♦వెన్న నాకుఁ
బ్రియముఁ గూర్చెదు దానవు ♦ భీతివదలు
మీఁసుభృత్యుని నమ్ముమా ♦ యింకనీవు. ౬౻ 868

క. విను సత్యముగా నాపై, బ్రణయంబుంపఁదగు నిట్లు ♦ బహుదుఃఖముల౯
గనుచుం గుందకుమా, యో,జనకకుమారీ! ధరిత్రి ♦ శయనించి తగ౯. ౭

ఆ. ఒక్కవేణిగాఁగ ♦ నున్నకురుల్ దాల్చి, చింతమునిఁగి ప్రాఁత♦చీరఁ గట్టి
తగనికాలమందు ♦ వగఁ గూర్చునుపవాస,ముండి పోగిలె దేల ♦ యొప్పువిడ్చి.

చ. జనకకుమారి, నన్నుఁ బరి♦చారకుగాఁగ ననుగ్రహించి చ
క్కనిబహుపుష్పమాలికలఁ ♦ గమ్రశరంబగు చందనంబు నెం
దును సరిలేనియయ్యగురు♦ధూపములు౯, రుచిరాంబరంబుల౯
ఘనతరరత్నభూషణని♦కాయముల౯ దమిఁబొంది స్వేచ్ఛఁగ౯. ౯ 871

క. ఉత్తమపానీయంబులఁ, జిత్తము రంజిల్లఁ ద్రావి ♦ చిత్రశయనముల్
మెత్తనియాస్తరణంబులు, నెత్తఱి నేఁ గోరఁగల్గు♦నింకను వినుమా. ౯౻ 872

ఆ. గీతనృత్తములను ♦ నాతతవాద్యాళిఁ, గాలమొక్కరీతిఁ ♦ గడుపుచుఁ దమి
హాయిగనుము; సుంద♦రాంగి, వనితలందు, మేటివీవ యిట్టి♦పాటు గనుదె.

క. సురుచిరగాత్రంబున నా,భరణంబులఁ జక్కఁగూర్పు♦వలయు౯ నన్ను౯
బరిపరునిగఁ గల్గియు ని,ష్కారణిం గై సేయకుంట ♦ కడునింద్యమునూ. ౧౦

చ. అనుపమరీతిగాఁ బొడము♦నట్టిద యౌవనయౌవనంబు ని
న్ననిశముఁ గొల్వఁగోరు నను♦నాదృతిమీఱఁగ నాశ్రయించె నే
మనఁగల దిద్ది వ్యర్థముగ ♦ నన్వహమే గెడు, వేగపోవునీ
ళ్లను మరలం దరంగిణి ని♦లాస్థలిఁ బొందనియట్లు ప్రాయముం
గనఁదగ దిద్దె సేవలను ♦ గైకొనుమా దయనుంపు నాపయి౯. ౧౨ 875

క. నినురూపంబునఁబోలిన, వనిత ప్రపంచమున నెందుఁ ♦ బరికించిననేఁ
గనరాదు కావున౯ రూ,పనిచయకర్తయగుపద్మ♦భవుఁడును నిన్ను౯. ౧౨౻

క. విరచించి యింకనెవరిని, విరచించుట మాని మిగుల♦విశ్రాంతిని ని
త్తరుణమునఁ బొందె నని నే, నరసెద; వైదేహి! రూప♦యౌవనరతిని౯.౧౩౻

*చ. నినుఁ గని బ్రహ్మదేవుఁడును ♦ నిర్భరమోదము నంది గొల్వ నె
మ్మనమున నెంచు నింకను; ఉమ♦మాస్థలినెవ్వఁడు గోరకుండుఁ?; జ
క్కనిశశిఁబోలువక్త్రమునఁ ♦ గ్రాలుచు శ్రోణిభరంబు మీఱ నొ
ప్పినవనజాక్షిరో ! వినుము ♦ శ్రీతుఁడనై తగునేను నిత్తతి౯. ౧౪౻ 878

* శీతాంశుసదృశాననే, తత్నిం స్తన్మి౯ పృథుశ్రోణి-అనిమాలము.

ఆ. నీదునవయవముల ♦ నేదానిఁ జూచిన, నచటనుండి నేను ♦ నక్షితతిని
ద్రిప్పఁజాల కిట్టి♦తీరున నున్నాఁడ; జనకభూమిపాల♦తనయ నీవు. ౧౭  879

సీ. [1]నాకు భార్యవుగమ్ము ♦ నాయందు నీకుండుపరపురుషుండను♦భ్రాంతి విడువు
పెక్కుతావులనుండి ♦ ప్రీతినేఁదెచ్చినవనితానుతల్లికల్ ♦ పలువురు గల
రవ్వారలకు నెల్ల ♦ నగ్రపూజ్యవుగమ్ము నీకు శుభంబగుఁ♦గాక, నాకు
నీవగ్రభార్యవు ♦ గావలయును; భీతచిత్తా! జగంబుల ♦ నుత్తమబల
ఆ. మేనుజూపి సంగ్ర♦హించినరత్నాళి, భూరిరాజ్య మిదిగో ♦ పొలుచుభక్తి
నీకు నిచ్చినాఁడ ♦ నేను భృత్యుఁడనైతి;, నోవిలాసినీ, మ♦హోద్యమమున.

క. పలువిధములైన నగరం,బులమాలిక లొప్పు వెలయు♦భూమిని నాకుం
గలబలమున నిర్జించితి, నెలఁతా! నీప్రియముగాఁగ ♦ నీ పిత కిత్తుఁ. ౧౯

చ. నను నెదిరించి మార్కొనుసు♦నంబును గల్గినవాని నిజ్జగం
బునఁ గనలేదు, యుద్ధమునఁ ♦ బొల్చెడుమత్ఘనవీర్యమెట్టిదో
కనుఁగొను నాబలంబునకుఁ ♦ గల్గదు సామ్యము; నారిపువ్రజం
బునను సురాసురుల్ బవర♦ముం దగఁజేసి మదీయశక్తికిఁ. ౨౦  882

ఆ. తలఁకి భంగమొంది ♦ ధ్వజములు విఱుగంగ, నెదుట నిలువలేక ♦ యేగి; రిట్టి
తరుణమందు నిచ్ఛ♦తనరఁగా మిగులంగ, భూషణములఁ దాల్చు♦పూవుఁబోఁడి.

క. సురుచిరకాంతులఁ దగునా,భరణములు త్వదంగములను ♦ భాసిలురీతిం
బరమాదరమునఁ జేయుము, పరికింతుసుభూషితమగు ♦ త్వద్దాసీపంబుఁ. ౨౨

క. అనుపమలపనా చక్కం,గను గైచేసికొని స్వేచ్ఛఁ♦గాఁ బొందుము భో
గనికరముఁ, బిఱికిదానా, మనమున కింపుగను గ్రోలు♦మద్యముఁ బూనిక్కఁ.

క. రమియింపుము; నీవారికి, నమితముగా భూమిగాని ♦ యర్థముగానీ
తమిమీఱుచుండ నిమ్మా, ప్రమదా, నను నమ్మి ప్రీతిఁ ♦ బఱపుము నాపై.

క. వలసినయటు నీకార్యం,బులకుఁ ననుఁ బంపుచుండు♦ము; తలోదరి, నా
యెలమిని విహరించెడు నీ, కలరెడుచుట్టములు ప్రీతి ♦ నందుదురు సుమీ.

[2]సీ. శ్రీరాఘవునిగూడి ♦ చెలఁగుచుండెడుదాన సంపదల్ నీకు నొ♦సంగుదాన
నన్నురామునిఁగూర్పు♦మన్నయభిప్రాయమునుబొందెదవొయే మొ♦వినుముఽరమ

---

1 ఈపద్యమునఁగల భార్యాశబ్దమునకు భా, ఆర్యా అని పదవిభాగముచేసిన తల్లీయనునర్థము తేటపడును. ఇదియే మహేశ్వరతీర్థులభావము. ఆరణ్యకాండము ఈవిషయము వ్రాయఁబడుట నిట వివరింపలేదని తెలియనగు. 2 బుద్ధిం మమానుపశ్యత్వమ్ - ఇత్యాది సార్ధశ్లోకద్వయమునకు మహేశ్వరతీర్థులవారివిశేషార్థ మిం దిమిడియున్నదని గ్రహింపఁదగు. ఎట్లన: నిక్షిప్తవిజయుఁడై= స్వతస్సిద్ధజయముగలవాఁడై, అచీరవసనుఁడై=నారచీరగానట్టి వస్త్రధారియై, గతశ్రీవిలాసుండై= పొందఁబడిన శ్రీలక్ష్మీవిలాసము గలవాఁడై, వనచరగోచరుండయి – వనమునఁ గా జలము. తన్నివాసుఁ డవఁగా నారాయణమూర్తియై యనియర్థము తేలును. ప్రాతీతికార్థము స్పష్టమే.

కళ్యాణి! సంపదల్ ♦ కాంక్షింప శాశ్వతసుఖము నేకోరెదఁ; ♦ జూడు మన్మ
దైశ్వర్యమును, జారు♦యశమును; సుందరీ, నిత్యవిజయుఁడై ♦ నెగడి యట్ల
చీరవసనుఁడయి ♦ యీరీతిఁగ నగత్రీవిలాసుండయి ♦ యావిధమున
వనగోచరుండయి ♦ వ్రతియు, స్థండిలశాయియునయి వర్తిల్లురా♦మునిని గూడి
యేమిచేయంగల ♦ వీవు; నే జీవించియుండఁగా రాముఁడో♦యుర్వితనయ
నినుఁ జూడఁజాలఁడు ♦ నిజమిదియనియెంతుఁ; గొక్కరసితముయి♦గొప్పనగుచు

ఆ. నలుపుమేఘపంక్తి ♦ యావరింపఁగఁ బురో,భాగమందునున్న♦పద్మవైరి
కాంతిఁజూడ నలవి♦గానట్లు నాచెంత, నున్ననిన్నుఁ జూడ ♦ నోపునెట్లు. ౨౬॥

చ. సురపతిచేతఁ జిక్కినసు♦సుందరి నారదుమూలకంబుగా
స్ఫురణము లేక హేమకశి♦పుండు గ్రహించినయట్లుగాక నా
కరమునఁ జిక్కియున్ననినుఁ ♦ గ్రమ్మఱ నేమనియుండుదాఁక భూ
వరుఁడు గ్రహింపలేఁడు; విను ♦ [1]భామరొ సుందరసుస్మితాననా. ౨౮॥ 889

తే. చారుదంతవిలాసినీ♦చారునేత్ర
గరుడుఁ డాదృతి సర్పంబుఁ ♦ గడురయమునఁ
దాను హరియించునట్లు చి♦త్తమును నీవె
యపహరించితివిగద యో♦యన్నుమిన్న. ౨౯॥ 890

[2]చ. నలఁగినమంచిపట్టువస♦నంబును దాల్చి, కృశించి భూషణం
బులఁ గయిచేయకున్నతటి ♦ భూమిసుతా! నినుఁ గాంచి నేను భా
ర్యలపయి నాస మానితిని ♦ నంతయు మానితి నింక నిన్నునేఁ
గొలిచెద; జానకీ కొనుము ♦ కూరిమి భృత్యునిగాఁగ నన్నిఁకన్. ౩౦॥ 891

క. అంతఃపురమున లక్షణ, సంతతి నలరారునాదు♦చానలకెల్లన్
గాంతరో! యీశ్వరి వగుమా;, చింతింపక నన్గ్రహింపు♦సేవకునిఁ గృపన్.

తే. అసితకేశాంతరాజితా! ♦ యార్య ముజ్జ,గములలో నుత్తమలగునా♦కాంతలెల్ల
నచ్చరల్ లక్ష్మికింబలె ♦ ననవరతము, నీకుఁ బరిచర్యచేయంగ ♦ నేనొనర్తు.

క. ధనపతిచెంతం గలరత్ననికరముల్ ధనము సుభగి! ♦ నన్నును నేగె
ల్చినలోకంబుల నీవిగఁ, గొని చక్కఁగ ననుభవింపు ♦ కోరినరీతిన్. ౩౩॥

తే. [3]దేవి తపమున బలమునఁ ♦ దీవ్రవిక్ర
మమున ధనమునఁ జారుయ♦శమున నాకు

---

1 చారుస్మితే చారుదతి చారునేత్రే విలాసిని-అనిమూ. 2 ఈపద్యమునందు విశేషార్థము స్పష్టము. 3 పిబ విహర రమస్వ-అనిమూ. మద్యపానముచేయుము విహరింపుము. అనుసీ వెందఁగు మాటలబట్టి మోహము సీతయందు లేదని యెట్లు స్ఫురించునని శంకింపరాదు. 'యదన్నం పురుషో భుంక్తే తదన్నం తస్య దేవతాః' అను ప్రమాణముబట్టి రాక్షసులకు మద్యపానాదులు కలవు గాన నవియన్నియుఁ దమకులదేవతులకు నైవేద్యమొసఁగుట తప్పుగాదు గాన పైయర్థము తోఁచునని గ్రహించుట సమంజసమే.

రాఘవుఁడు సాటియనిచెప్ప♦రాదు; లలన
మద్యమును ద్రావు విహరింపు ♦ మహితరీతి. ౩౮౫ 895

క. వనితా, క్రీడింపుము భో,గనికరముల ననుభవింపు ♦ కావలసినరీ
తిని ధనరాశి నొసంగెదఁ, గొనుమా ధరనొసఁగువాఁడఁ ♦ గోరినరీతిన్. ౩౮౬

క. నాయందుఁ బ్రీతినునుపుము, నీయెడ నాకున్న ప్రీతి ♦ నెఱిఁగి సుఖము నా
కీయెడఁ గూర్పుము నీవిట, గేయంబగురీతిఁ బొదలఁ ♦ గీర్తిన్ వినుచున్. ౩౮౭

సీ. నీబంధువులు తమి ♦ నినుఁగూడి సంతోష మనుభవింతురుగాక; ♦యనవరతము
పుష్పించియున్నట్టి♦భూరుహవ్రాతంబు నిండియుండఁగ నళి♦నికరమట్టె
మూఁగియుండఁగనంద♦ములయిసముద్రతీరముననుండెడుసద్వ♦నములయందుఁ
గనకభూషణమణి♦గణహారభూషితతనువల్లియలరఁగా♦నను సుభృత్యుఁ
తే. గూడి యలరారుచుండుమా ♦ కోర్కిమీఱ
నిన్నుఁ బ్రార్థించువాఁడ నో♦నీరజాక్షి
యేను జెప్పినపలుకుల ♦ నెదఁ దలంచి
కావుమా సంతతంబు సు♦ఖములఁ గనుచు. ౩౮౮ 898

ఇరువదవ సర్గము సంపూర్ణము.

---

## ౨౧ - వ సర్గము.

సీత రావణుమాటలకుఁ దగినరీతి నుత్తరమిచ్చుట.

చ. అనియిటు సాధ్వసంబిడెడు ♦ నాశరనాథుఁడు రావణుండు తె
ల్పినయతినీచవాక్కులను ♦ బృథ్వీతనూభవ యాలకించి యా
ర్తినిగని దీనయై పలికె ♦ దీనముగాఁ గడుమెల్లఁగా; జగం
బునఁ గలకాంతలందు యశ♦ముం జెలువారఁగఁ బొల్చి సాధ్వియై. ౧౫ 899

సీ. పగఁబూని యేడ్చుచు ♦ వణఁకుచు దీనయై పతినెధ్యానించుచుఁ♦బలువిధముల
సహజసుస్మితమున ♦ సమధికపతిభక్తి శక్తిని ధరియించి ♦ స్మరమహార్తిఁ
బొంది వివేకంబు ♦ పోవ నున్నట్టియాతనితోడఁ బ్రత్యక్ష♦మునను తాను
బల్కుట న్యాయమా♦పథముగాకుండుట [1]నొకగడ్డిపోఁచను ♦ నునిచి నడుమ
ఆ. వానితోడఁబల్కె; ♦ దానవా, నీవు నా,వలననుండి మదిమ♦రలుచుకొనుము

---

[1] తృణ మంతరతః కృత్వా ప్రత్యువాచ శుచిస్మితా-అనియూ. ఈశ్లోకార్థమునకుఁ దనిశ్లోకి యందు భావము లెన్నివిధములనో పెంచి వ్రాయఁబడినది. అవి "తృణ మంతరతః కృత్వా" అన్న వాక్యము నాధారముగఁ జేసికొని అట్లుచేయుట యెందులకని ప్రశ్నించుకొనుచు వ్రాయఁబడినవి. కాన నవి యూహించుకొనవచ్చునని యిటఁ జేర్పఁబడలేదనియు, గోవిందరాజమహేశ్వరతీర్థులవారి పూర్థ మిటఁ జేర్పఁబడినదనియు గ్రహింపవలయు.

స్వజనమందు దానిఁ ♦ జక్కఁగాఁ జేర్పుము, [1]కార్యసిద్ధి నీకుఁ ♦ గలుగఁగలదు.

క. పాపమతి మోక్షసిద్ధిని, నేపగిదిం గోరఁదగదొ ♦ యాపునునన్నున్
భూపుత్త్రిఁ గోరఁగాఁదగ, దేపట్టుననైనఁ; గోర ♦ నెటుసిద్ధించున్. ౩౪ 901

క. [2]పావనకులమునఁ బెంపెలి, వై వసుమతిఁ బేరుఁగన్న ♦ యట్టికులమునం
దావిర్భవించి సతినై, యీవిధమున నందితమగు ♦ నీకార్యంబున్. ౫౪ 902

క. ఒనరింపఁదగదుగద నా:, కని కీర్తింగాంచి సాధ్వి ♦ యాజానకి యా
తని లెక్కచేయ కాతఁడు, వెనుకఁగ నుండునటు మోము ♦ వే త్రిప్పి తగన్.

చ. దనుజునిఁ జూర్చియే మరలఁ ♦ దానిటుపల్కెను, నన్యభార్య సా
ధ్విని గనుకన్ సురారి! సుమ ♦ తిం బరికింపుము నీకు భార్యగాఁ
గనఁదగుదానఁగాను; [3]సరి ♦ గాఁదగు సాధుజనైకధర్మమున్
మనమునఁ జక్కఁగాఁదెలియు ♦ మానకుమా నిరతంబు దానినిన్. ౬ 904

క. చరియింపుము సాధువ్రత, పరతం జక్కంగ; దనుజ ♦ పతి! నీసతులే
పరులంబొందిన నీక, త్తరుణంబున నెట్టులుండు ♦ దాని మనసునన్. ౭ 905

తే. ఉనుచుకొని నిన్నె యుపమాన ♦ మని తలఁచుచు
నేయఘంబును బొందనీ ♦ కెట్లు నీదు
పత్నులం గాచికొందువో ♦ పరవనితల
నట్లె రక్షింపవలయు; న ♦ ట్లౌటనీవు. ౭౪ 906

చ. పరవనితారతిన్ వదలి ♦ భార్యలతోనె రమింపు; మింక నే
పురుషుఁడు భార్యలందుఁ దమిఁ ♦ బూనక తృప్తినిగాంచ కెంతయున్
స్మరగురుతాపముం గనుచుఁ ♦ జంచలితేంద్రియుఁడై చలించి యా
వరుసనె గూఢవిప్రియము ♦ పొండితి నొంది పరాంగనారతిం
బరఁగునొ వానిసంపదలు ♦ పాడగు సర్వము పాడగుం జుమీ. ౮౪ 907

సీ. ఇట్టిదుస్స్థితిని నీ ♦ వేరీతిగానైనఁ బొందకుండఁగఁ జేయఁ ♦ బూనువార
లెవ్వరు లేరొకో ♦ యేల లేకుందురు? వారలున్నను నీవు ♦ వారిపథము
ననుసరింపక యున్న ♦ యట్లైనఁ జెడుదు, వీవిపరీతబుద్ధియే ♦ విషయమిట్టు
లని తెల్పుచున్న, దీ ♦ యాశయమెట్లు నీకెఱుఁగంగ నగునని ♦ యెందవో? నీవు
సజ్జనాచారంబు ♦ సల్పక మానుటయే యుద్ది తెల్పెడు; ♦ నింక నీకుఁ
బండితు లాదృతిఁ ♦ బరమహితంబును బలికినరాక్షస ♦ వరులయెడలఁ

---

1 కార్యసిద్ధి నీకుఁ గలుగఁగలదు-ఇదియే సీత రావణునకుఁ జెప్పుబుద్ధి. దానవా స్వభార్యాసక్తి రూపమైనధర్మము ననుష్ఠించుచుండినచో నీకు ముక్తిగలుగును. ప్రకృతము నీవు చేయుచుండు కార్యము నీకు ముప్పును దెచ్చునదియేకాని సత్ఫలప్రదముగాదు. అని. ఈయర్థ మిటఁ దేటపడుటకై ఈ వాక్య మధికముగా నిట చెప్పఁబడినదని సరసవతు లూహించుదురుగాక. 2 కులం సంప్రాప్తయా పుణ్యం కులే మహతి జాతయా-అనిమూ. 3 సాధుసాధువ్రతం చర-అనిమూ.

గపటమైత్రిని బైనఁ ♦ గన్పడఁగాఁ జేసి తన్నాశనం బాత్మఁ♦దలఁచి వారి
పరమవాక్యంబులఁ ♦ బాటింపకుంటివా; యన్యాయపరుఁ డకృ♦తాత్ముఁ డునగు

తే. నతఁడు రాజగునేని రా♦జ్యములు నగర
ములు సమృద్ధములైనను ♦ విలయమొందు
నట్టి రత్నౌఘసంకులం ♦ బైనలంక
యిట్టిఖలు నిన్నుఁ బ్రభువుగా ♦ నిపుడు పొంది. ౧౨ 908

క. నీయొక్కనియపరాధము, నీయెడఁ దానొంది శీఘ్ర♦మేతనకీ ద్రిం
బాయంగఁగలదు; రావణ, యోయసురా, పాపకర్ముఁ ♦ దుర్వ్యవస్థలిలోన్. ౧౩

ఆ. దూరదృష్టి లేక ♦ యూరయ కేతాను, నల్పినట్టిపాప♦సమితి చేతఁ
గొట్టుపడి నశించి ♦ కూలంగఁ బ్రాణులు, సమ్మదంబుఁ గనుదు ♦ రిమ్మహిఁ జుమి.

చ. వినుమిటు పాపకర్ముఁడవు ♦ విచ్యుతధర్ముఁడ వీవు నాశముం
గనుటను గాంచి నీనికృతిఁ ♦ గాంచినవారలు దుష్టబుద్ధికీ
తనికిని [1]మాయదృష్టమునఁ ♦ దప్పక యీవ్యసనంబు గల్గెఁగా
యని వచియింపఁగాఁగలరు ♦ హర్షము పెల్లుగ నోరిరావణా. ౧౪ 911

క. విను నీయంతఃపురమునఁ, గనుపట్టెడు నన్నుమిన్న♦గములకు నెల్లన్
నను నీశ్వరిగాఁజేసిన, ధనమొనఁగిన నెట్టులైన ♦ దానవనాథా. ౧౫ 912

చ. నినుఁ గని యానొందుగతి ♦ నేర్పునఁ జేయఁగ నీకసాధ్యమే,
పనివడి రామచంద్రునెడఁ♦బాయను, సూర్యునివీడి ఛాయ యుం
డనియటు; లట్టిలోకతతి ♦ నాథుని సత్కృతబాహులన్ ముదం
బున నుపధానభూతముగఁ ♦ బొందినదానను గాదె దానవా. ౧౬ 913

తే. ఇట్టినేనెవ్వఁడో యొక♦హీనునిభుజ
మునను దలమోపుదు నదెవ్వి♦ధిని; మనోజ్ఞ
మతియు వేదవ్రతస్నాతుఁ ♦ డతితరాత్మ
వేత్తయునగు భూసురునకు ♦ సత్తపునకు. ౧౭ 914

క. తనయంత యోగవిద్యయు, మనములరఁగ నొప్పి వెలయు♦మాడ్కిని నేనా
ఘనునకు ధాత్రీపతికే, యనుకూలకళత్రమను, సు♦రారీ వినుమా. ౧౮ 915

క. [2]దనుజా, సాధువవగుదువు, వని గజపతిఁ దన్నుఁ బాసి ♦ వనటం గని బం
ధనమునఁ జిక్కిక రేణువు, మనములరఁగఁ గూర్చునట్లు ♦ క్ష్మానాథునకై. ౧౯

క. నిరతము దుఃఖించెడు న, న్నరయుచు నున్నట్టిదశర♦థాత్మజుతోడన్
గరుణించి కూర్పుమా; యీ, పురమును బాలింప నీకు ♦ బుద్ధిగలిగినన్. ౨౦

---

1 దిష్ట్యైతద్వ్యసనం ప్రాప్తో రౌద్ర ఇత్యేవహర్షితాః-అనిమూ. 2 సాధురావణ రామేణ-
అనిమూ.

[1]తే. ఘోరమరణంబు నొందంగఁ ♦ గోరవేని
పురుషతిలకుని శ్రీరఘు♦వరుని మిత్ర
ముగ నొనర్చుకొనుట యిటఁ ♦ దగు; నతండు
సకలధర్మవిదుండును ♦ శౌర్యఘనుఁడు. ౧౯॥ 918

క. శరణాగతవత్సలుఁడును, బరమగుణాఢ్యుఁడునటంచుఁ ♦ బ్రథితుండెకదా
ధర మనఁగోరుదువే నవ్వీరమతితో మైత్రిసలుపు ♦ బ్రదుకుము వంతన్. ౨౦॥

[2]క. నేనును బ్రార్థించెద రఘుసూనుని, శరణాగతులను ♦ సురుచిరకరుణా
మానసమున మన్నించెడు, నానాథుని వేఁడుకొనుము ♦ యసురవరేణ్యా. ౨౧

ఆ. ప్రయతుఁడవయి నన్నుఁ ♦ బ్రియమున నర్పింప
వలయు; నట్లు చేయఁ ♦ గలుగుశుభము
లట్లుగానిచో మ♦హాసూరువలన నీ
కంత మనిని గలుగు♦టరయ నిజము. ౨౨॥ 921

క. సురపతివైచినవజ్రము, కరుణన్ వదలినను వదలుఁ ♦ గాలుండునినున్
జిరకాలము వదలి నను, గరుణన్ వదలును, సురారి ♦ గణవర! దాన్.

క. గరువంబును మదిఁ బూనకు, గురుశౌర్యుఁడు లోకనాయ♦కుఁడు నాపతియున్
గరుణవిడి కుపితుఁడైనన్, దురమున వధియించి తీరు ♦ దుష్టాత్మ నినున్. ౨౩॥

క. సురనాథవిసృష్టభయంకరవజ్రధ్వానమట్లు ♦ కడు వేగమ భీ
కరరఘువరచాపధ్వని, సురవైరీ! వినఁగఁగలవు ♦ శ్రోత్రము లదరన్. ౨౪॥

సీ. శుభపర్వములఁ దగి♦ప్రభ చాల వెలయంగ జ్వలితాన్యములయిన♦సర్పములకు
సాటిచెప్పందగి, ♦ శౌర్యసమగ్రులౌ రామలక్ష్మణశుభ♦నామచిహ్న
ములు వెలయఁగ, నభ్ర♦మునఁబర్వచుంగగుశరములు వేగయీ♦పురమునందుఁ
బడఁగల; వాపటు♦బాణముల్ కంకపత్రంబులఁ జెలఁగుచు ♦ దారుణగతిఁ
తే. బురముపై నాల్గువైపుల ♦ భూతభయద
ములుగఁ బ్రసరించుచున్ రాక్ష♦సులను జెండు
చును క్షణంబున నిండఁగ♦ల్గును; సురారి
రాముఁ డనువైన తేయుండు ♦ రయము మీఱ. ౨౫॥ 925

---

1 మిత్రమౌపయికం కర్తుం రామస్స్థానం పరీప్సతా, వధంచానిచ్ఛతా ఘోరం త్వయాసౌ పురుషర్షభః-అనిమూలము. సీతప్రార్థీరీతిగా రావణునితోఁ బరుషోక్తులాడి యాకఱకక్క సువకు మేలుగలుగునట్టి మార్గమును దెల్పఁగోరి యీవాక్యములను జెప్పుచున్నదని గోవిందరాజులు. దీనిచే మహేశ్వరతీర్థులభావము సరియైనదని పేరొప్పుకొన్నట్లు గ్రహింపవచ్చును. దీనివ్యాఖ్యానసార మీపద్యమునఁ గనఁబడును. 2 త్వం చైనం శరణాగతవత్సలమ్-అనిమూలము. త్వం చేత్యేవేనాహ మపి ప్రసాదయిష్యామీతి సిద్ధమ్-అని గోవిందరాజులు. ఇట్టి యర్థములు వ్యాఖ్యాతలభావములు గ్రహింపక యెట్లు తెలియఁగలవు? వాల్మీకి హృదయమే యిదియని తెలియందగు.

చ. గరుడుఁడు దందశూకముల ♦ గాఢపరాక్రమమొప్పఁ జంపునె
క్కరణిని నట్లు రాక్షసని♦కాయమహాఫణులన్ వధించు; నా
శరములనుండి నిన్ను రఘు♦కాంతుఁడు పొంద నసాధ్యమంటివే
పరముఁడు [1]విష్ణుమూర్తియుఁ ద్రి♦పాదములన్ దనుజాళినుండి ని
ర్భరగతి లక్ష్మిఁ గైకొనిన♦భంగి నరిందముఁడైన రాముఁడున్. ౨౮ 926

క. నీకడనుండియె నన్నుం, బ్రాకటశౌర్యమ్ము మీఱఁ ♦ బడయఁగలఁడునూ;
యోకఠినాత్మా! రావణ, నీకయి యున్నట్టిరాక్ష♦సేంద్రులనెల్లన్. ౨౯ 927

తే. చంపి యాజనస్థానంబు ♦ సమయఁ జేయ
రక్కసుల బలమంతయు ♦ నొక్కక్షణము
లోన మాయంగ నేమాత్ర♦మేని లేని
వాఁడవై దొంగిలించి నన్ ♦ బడసితిగద. ౨౯ 928

క. అరయక యీదుష్కృత్యముఁ, ద్వరపడి చేసితివి; నీచ♦దానవ, నీవా
పురుషవరేణ్యులు వెలుపలి, కరుగంగన్ శూన్యమైన♦యాశ్రమపదమున్. ౩౦

క. పరికించి చొచ్చి తెచ్చితి, తరుణిన్ నను దుష్పథమునఁ; ♦ దత్తరుణమునన్
సురవైరీ! నీ వాసోదరులయు గంధంబునైనఁ ♦ దగ నచ్చోటన్. ౩౧ 930

తే. [2]మూర్ఖునియె యుండువేని యో♦మూర్ఖ! పెద్ద
పులుల వాసనఁ గను కుక్క♦పోల్కి నిలువఁ
జాలకుందువు; బలమునఁ ♦ దూలి భీతి
నందియున్నట్టి నీకు నా♦యవనిపులకు ౩౨ 931

సీ. అని సంభవించిన♦యట్టైన విజయము గలుగుట యేలేదు♦గద; సురపతి
కిని వృత్రునకు మును♦పనిసంభవింపఁగ బాహుద్వయంబునఁ ♦ బరఁగునింద్రుఁ
డాకకరంబున నొప్పు♦చున్న వృత్రునిఁ జంపె, నట్లె రాఘవు లిద్ద♦ఱౌట నీకు
మరణంబు సిద్ధించు;♦నజియు నాప్రాణేశుఁడగు రామచంద్రుండు♦ననుజుఁగూడి

తే. ఖరకరుఁడు స్వల్పజలమును ♦ గరముల గ్రహి
యించునటు నీదుప్రాణాళి ♦ నేపుమీఱ
బాణముల వేగ గ్రహియించుఁ; ♦ బడఁతి నన్ను
బలిమిఁ దెచ్చితి విది నీకుఁ ♦ బాడిగాదు. ౩౩ 932

క. ఉరుభీతిఁ గుబేరునిగిరి, కరిగిన నూర్ధ్వమున నున్న♦యాలోకములం
బరికింపఁబోయినను న,వ్వరుణునిసభ కేగినను జ♦వంబున నిన్నున్. ౩౪ 933

---

1 విష్ణు స్త్రిభిరివ క్రమైః-అనిమూలము. 2 శక్యం సందర్శనే స్థాతుం శునా శార్దూలయో రివ-అనిమూలము. ఇట్లు రావణుని కుక్కతోఁ బోల్చుట సీతకుఁ గలపాతివ్రత్యజనితశక్తి పరనిర్భేద్యవచనమని యెఱుంగనగు.

తే. అశనిపతనంబు పెనుభూరు♦హమును గూల్చు
నట్లు దశరథభూపతి ♦ యగ్రతనయు
సాయకంబులు నిన్నని ♦ సమయఁజేయు
[1]నరుగఁజాల వదెచ్చటి♦కైన నింక. ౩౪ 934

ఇరువదియొకటవ సర్గము సంపూర్ణము

---

## ౨౨ - వ సర్గము.

—సీతారావణులు పరస్పరము కఠినముగ సంభాషించుట.—

క. అనియిట్లు పరుషముగ నా, జనకజ పలుకంగ రాక్ష♦సవిభుఁడు చక్కఁగా
విని ప్రియదర్శన యగుసీ,తను నప్రియముగను జూచి ♦ తా నిట్లనియెన్. ౧

తే. పురుషుఁ డెంతెంత వనితల♦బుజ్జగించు
వశ్యుఁడే యగు నంతంత ♦ వారలకును
బ్రియము లెంతెంతపల్కునో ♦ వెలఁదులకతఁ
డంతఁ బరిభవముం బొందు♦ననుట నిజము. ౨ 936

క. వనితా! నీయెడఁగల్గిన, ఘనకామము తెలివి మెఱయఁ♦గా సారథి దా
రిని దప్పి పాఱునశ్వం,బును లాగెడురీతిఁ గ్రోధ♦మును నణఁచెదుఁజూ. ౩

సీ. ప్రతికూలమైనదై ♦ పరఁగుకామం బదెవ్వరియందుఁ బగులునో ♦ వారు శిక్ష
కర్హులై యుండంగ ♦ నచ్చటఁ గరుణయు, స్నేహము గలుగుచుం♦డెడినిగాదె;
యికారణంబున ♦ నే వనంబున వృథా ప్రవ్రజితుండగు♦రామునందు
నాసక్తిఁబూనిన♦సుందులకే చంప నవమానమొందింప ♦ నర్హవయిన
నినుఁ జంపకున్నాను; ♦ నెలఁతరో నీవేమిపరుషభాషణములు ♦ పల్కినావొ

తే. [2]వానియం దొక్కటొక్కటి ♦ వూని నిన్ను
దారుణముగఁ జంపింపఁగఁ ♦ దగినదగును
గాని సైచితి నీయందుఁ ♦ గరుణఁ బూని
యనుచు దనుజాధిపుఁడు పల్కె ♦ యంతలోన. ౪ 938

క. అనురాగము క్రోధముపెం,పును గాంచఁగ మరల ననియె ♦ భూపుత్రికతో;
వినుమా వరవర్ణిని, నీ,కును నేనిడియున్నగడువు ♦ కొంచెము మిగిలెన్. ౫

క. నెలలందు రెండుమాత్రమె, గలవిఁక నవశిష్ట మంత♦కాలముమాత్రం
బెలమి తగఁ గాచియుంతం, గలవంతకు లోన నెక్కఁ♦గాఁదగుసెజ్జన్. ౬

---

1 రావణుఁడు సీతాదేవితో నందఱకుఁ బరుషములుగాఁ దోఁచునట్లును, తత్త్వమున స్తుతులుగాఁ గనఁబడునట్లు మాటలాడినట్లే శ్రీదేవియగుభూపుత్రియుఁగూడ నట్లే బదులుచెప్పెనని మహేశ్వరతీర్థ లీసంభాషణసారమును దెల్పిరని పాఠకు లీఘట్టమున గ్రహింపఁగలరు. 2 తేషు తేషు వధో యుక్తస్తవ మైథిలి దారుణః-అనిమూలము.

[1]సీ. ఆవల నీకోర్కు ♦ లన్నియు ఫలియింపఁజేయునీపతినొల్ల ♦ కేయిటు తగు
నా సిరి యెట్లు నీ♦కీసమయంబున దక్కు మహోనస♦తల్లజమునఁ
బ్రాతరాశార్థమై ♦ పశువృత్తి వధియించి వండుదు రవ్వేలి♦పనిఁ దలంపు
నాదుకోరికఁ దీర్చి ♦ నాయకుభావించి మృదుశయనంబున ♦ ముదము తనరఁ
తే. బవ్వళింపుము జగదేక♦పతితఁ గాంచు
భర్తవదలకు, నాదగు♦పలుకులెల్ల
నర్థవంతంబులగునని ♦ యాదరమునఁ
గైకొనుము పూజ్యరాజ్యభో♦గములఁ గనుము. ౯ 941

క. అనిసీతను బెదరింపఁగ, దనుజేంద్రునితోడ వచ్చి ♦ తద్విధమెల్లన్
వినియెడుసురగంధర్వాం,గనలెల్లన్ విస్కృతనేత్ర♦కలితలు నగుచున్. ౧౦ 942

క. మనములదుఃఖించిరి; తమ, కనురాగము చెలఁగుచుండ ♦ నాతఁడు భూపు
త్రిని బెదరింపఁగఁ గొందఱు,వనితలు పెదవులను విఱిచి ♦ వగచిరి మఱియున్.

క. కమనన్నుల ముఖసంజ్ఞల, జనకజ నూఱడిలునట్లు ♦ చానలు వగపె
ల్లునఁ గుందువారు కొందఱు, కనఁబఱచిరి న్వాశయములఁ ♦ గళవళపడుచున్.

సీ. అట్లు వారలు తన్ను♦నాశ్వాస మంసఁజేయఁగ సీత యద్దను♦జాధినాథుఁ
బరికించి సౌశీల్య♦బలమున గర్వంబు తనరంగఁ దనకు హి♦తముగు వాక్య
ముసు బల్కె నిట్లని; ♦ వినుమిఁక దానవా, యిచ్చట నీమేలు ♦ నెదఁదలంచి
దానిఁగోరెడుసాధు♦తల్లజం డొకఁడైనఁ గనరాఁడు సాధ్వినొ♦నను నిటుపలు
తే బాముబం బెట్ట నింద్యమై ♦ ప్రబలుదీనిఁ
జేయఁదగదని హితమును ♦ జెప్పి మరలు
వట్లు చేసెడువాఁడు లేఁ ♦ డకట ! నిజము;
ధర్మమతియైన శ్రీరాము♦ధర్మపత్ని. ౧౩౪ 945

క. సురపతికిన్ శచివలె నన,వరతము మోదమును గల్గు♦భంగిని దగుచు
న్నరయక నీవలె జగములఁ, బొరపాటున మదిని గోర♦బూనెడువారల్. ౧౪

క కలుగరు; నీచసురారీ, కొలఁదింగనరానిదగుచు ♦ గూఢంబగుచున్
జెలఁగెడు తేజమ్మున రా,జిలురాముని సతిని నిట్లు ♦ చెప్పితె పలుకుల్. ౧౪౫

తే. ఇట్టిపాపంబు నీవెట♦ కేనిపోయి
యనుభవింపక తప్పించు♦కొనఁగల విఁక ?
వనమునన్ మత్తమాతంగ♦మును శశకము
నని యొనర్పఁగఁగూడ నెట్లమరునో యటు. ౧౫౪ 948

---

1 భర్తారం మా మతిచ్ఛతీం, మమ త్వాం ప్రాతరాశార్థ మారభంతే మహానసే- అనిమూలము. దీనికి మహేశ్వరతీర్థులు వ్రాసినయర్థమంతయు నీసీసపద్యమునఁ జేర్పఁబడినది. ప్రాతీతికార్థము విస్పష్టమని తెలియవలయు. వ్యాఖ్యాతలయభిప్రాయము విస్తృతమనియు నెఱుంగందగు.

క. శ్రీరాఘవుండు నీవును, బోరాడం గూడఁజెప్పఁ♦బోలును జుమ్మీ
యోరావణ! యిప్పుడు నీ, వారాముని మాయ లేడి♦వ్యాజమునఁ దగన్.

ఆ. చాలదూరమేగు♦చందము నొనరించి, నన్నుఁ దెచ్చితివిగ ♦ నెన్నదీని
నిచట నీకు సిగ్గ♦దేలకల్గదో, యిప్పు, డైనరామచంద్రు ♦ నతులకును. ౧౬

క. కనఁబడకున్నావే, యా,తనికంటంబడినఁ దెలియఁ♦దగుఁ దత్తేజం
బును; నీచ, సాధ్వి నన్నుం, గనెదే కామమున నీదు♦కాంతను గాఁగన్. ౧౬½

తే. కృష్ణపింగళవర్ణము ♦ లెసఁగ వికృత
ములును క్రూరములునగుక♦న్నులివె నీవి
యేల తెగి క్రిందఁబడవో? భూ♦పాలమౌళి
యైనదశరథుకోడల♦నై చెలంగి. ౧౭½ 952

క. అనయము ధర్మాత్ముండై, తనరెడు శ్రీరామచంద్రు♦ధర్మప్రియప
త్నిని నిట్టి నన్ను నివ్విధి, ననఁదగని కువాక్యములను ♦ నాడితివిగదా. ౧౮ 953

క. వేల్గా తెగిపడకున్నది, నాలుక నీనోటినుండి: ♦ నానాయకునిన్
ఆలోకవునిటుపల్కుట, నీలీలన్ నన్నుఁ బల్కు♦టీయపకృతులన్. ౧౮½ 954

చ. *మనసున నెంచి భస్మమగు♦మాడ్కి నినున్ వడిఁజేయనౌను; నై
నను నపరాధులౌజనుల ♦ నాడగునాజ్ఞ శపించుమంచు రా
మునిదగునాజ్ఞ లేమిఁ, దప♦ముం దగఁ గాచుకొనంగ నెంచుటన్
నిను నిట నాదు తేజమున ♦ నీఱుగఁ జేయకయున్నదానఁ జూ. ౨౦ 955

సీ. ధీమంతుఁడౌ రామ♦దేవుసన్నిధి నున్ననను దొంగిలింప నీ♦కును నశక్య
మే; నీకుఁ జావునే ♦ యిట్టింగిఁ గూర్పంగఁ దలఁచి ఘటించెను ♦ దైవమిట్లు
సంశయమే లేదు; ♦ శౌర్యంబునం బొల్చి ధననాయకునకు సో♦దరుఁడవగుచు
బలశాలివియునయి ♦ పరఁగెదునీవేల రామునిఁ గడఁగి దూ♦రముగఁ బోవు

తే. నట్టు లొనరించి, తత్పత్ని♦నై ననన్నుఁ
దొంగిలించితి వతఁడును ♦ జెంగటఁ దగు
నవుడు తేవచ్చునేగద; ♦ యనిన వతఁడు
వినుచు వికృతాక్షులను ద్రిప్పి ♦ కనియె సీత. ౨౩ 956

క. అతితరభుజకంధరముల, మితిమీఱినసింహబలము ♦ మేలయి తగుత
ద్గతియును దగఁగా నసితా,బ్జతతిం బురడించు దేహ♦వర్ణము వెలయన్. ౨౮

క. సిరివెలయ నక్షులును భీ,కరజిహ్వాగ్రంబు మండఁ♦గా మకుటాగ్రం
బురుకోపమునఁ జలింపన్, గరము విచిత్రాంగరాగ♦కలితతనుండై. ౨౮½ 958

---

* ఆసందేశాత్తు రామస్య తపస శ్చానుపాలనాత్, న త్వాం కుర్మి దశగ్రీవ భస్మ భస్మార్హ తేజసా - అనియూ. దీనిచే సీతకుఁ గఁపాతివ్రత్యశక్తి స్పష్టము కాఁగలదు.

క. సురుచిరమాల్యంబులనే, ధరియించి విశాలమైన♦తనువలరంగా
నరుణాంబరములఁ దాలిచి, నిరుపమకేయూరహార♦నిచయోజ్జ్వలుఁడై. ౨౫

తే. నీలమణిఖచితంబయి ♦ నీలకాంతి
నలరుమొలనూలుదాలిచి ♦ యమృతసిద్ధి
కహిని గట్టినమంసర♦మట్లు చూడఁ
గఁదగి పరిపూర్ణములయిన ♦ కరయుగమున. ౨౬ 960

క. ధరణీధరమట్టులుండుటఁ, బరికింపఁగ మందరాఖ్య♦పర్వతము మహా
త్తరశిఖరంబుల వెలసిన, కరణిం గనుపట్టి యతఁడు ♦ కరము వెలింగెన్. ౨౭

క. తరుణార్కవర్ణకుండల, ధరుఁడై పూవులు చిగుళ్లు ♦ తగ నెట్లఁగ దా
ల్చి రమణ వెలయ నశోకపుఁ, దరువుల రెండింటిఁ దాల్చి ♦ తగుమందరముల్.

క. సరిపోలి యలంకృతుఁడై, సురభూరుహ మట్లు మిగులఁ ♦ జూడనగుచు సుం
దరతనువొందువసంతుని, కరణి నలంకృతుఁడయియును ♦ గడు భీకరుఁడై.

తే. కాటియందున్నచైత్యవృ♦క్షంబుపగిది
గానఁబడుచును; రాక్షస♦కాంతుఁ డప్డు
క్రోధసంరక్తనయనుఁడై ♦ యాధరిత్రి
తనయఁ జూచుచు శాంత మిం♦తయును లేక. ౨౯ 964

క. *ఉరగమువలె నిట్టూర్పులు, పరిపరివుచ్చుచును నిట్లు ♦ పల్కె; దరిద్రున్
ధరణీశుఁ డనుచు దుర్నయ, పరతను నీవనుసరించి ♦ పాటుపడియెదే. 3౦

క. నానుడుల నెట్లవిందువు, కానీ సంజను స్వకీయ♦కరనికరములన్
భానుఁడు పోఁగొట్టుగతిన్, నేనినుఁ బరిమార్తు ననుచు ♦ నెగడెడుకినుకన్.

క. అరినూదనుఁ డగుదనుజే,శ్వరుఁ డీరీతిగ వచించి ♦ సరగున నతిభీ
కరదర్శనలై తగు నా, శరతరుణులనెల్లఁ గాంచి ♦ సక్రోధుండై. 3౨ 967

సీ. ఏకాక్షిగలదాని ♦ నేకకర్ణముగలదానిని, గర్ణముల్ ♦ తలను జుట్టు
కొనియున్నదానిని ♦ గోకర్ణి, గజకర్ణికను, లంబకర్ణి, న♦కర్ణి మఱియు
హస్తపాదిని, దుర♦గాంఘ్రిని, గోపాదిఁ, బాదచూళిక, నేక♦పాదనయన
ములు గలదానిని, ♦ బలుపాదములు గలదాని, నపాదికఁ ♦ దలయు, మెడయుఁ

తే. బెద్దవిగఁ గల్గుదానిని ♦ బృథుకుచోద
రములు గలదాని, నాస్యనే♦త్రములు మిగుల
వెడలువుగ నుండఁదగుదాని ♦ నిడుదనాల్క
గలనితంబిని, జిహ్వ లే♦క తగుదాని. 3౫ 968

* అనయే నాభిసమ్పన్నమ్-అనిమా. అనయేతిశ్లోకః కేషుచి త్కోశేషు నాస్తీతికృత్వా నవ్యాఖ్యాతః-అవి మహేశ్వరతీర్థులు.

తే. సింహముఖి, గోముఖిని, వనా♦సికను, గోల
వక్త్ర నీమొదలగువారి ♦ వరుసఁ గాంచి
దనుజకామినులార! సీ♦త యిఁకనాకు
వశమగునటులు చేయంగ ♦ వలయు వేగ. ౩౬ 971

క. అనులోమవిలోమములగు, పనులొనరిచియైన, సామ♦పద్ధతి, దానం
బున భేదంబున దండన, ముననైనను బొంగఁదీసి ♦ ముఖమున నాకున్. ౩౭

క. వనితామణిగాఁ జేయుఁడు, దనుజాంగనలార, మీరు ♦ తగ నొక్కటిగాఁ
గనుగూడి వేగ యీపని, నొనరింపుం డనుచు నాజ్ఞ ♦ నుద్ధతిఁ జేసెన్. ౩౮

క. దనుజుఁడు కామక్రోధము, లినుమడిగాఁ బెరుగ రాఘ♦వేశ్వరుపత్నిన్
గని మాటిమాటి కదలిం,చెను భూసుత యెట్టులైనఁ ♦ జిక్కు నటంచున్.

తే. అంతరావణుప్రియపత్ని ♦ యైనధాన్య
మాలిని యనెడురక్కసి ♦ మమత చెలఁగఁ
దాను మందోదరిని గూడి ♦ త్వరఁగ నతని
చెంతకుం బోయి కౌఁగిటఁ ♦ జేర్చి పలికె. ౩౯ 973

క. దనుజేంద్రమహారాజా, ననుఁగూడియె క్రీడసల్పు♦నారి యిది తగున్
మనుజాంగనయు వివర్ణయుఁ, గన దీనయు నౌను, నిట్టి♦కాంత యుచితమే.

చ. దనుజవరేణ్య! త్వద్భుజని♦తాంతబలార్జితదివ్యభోగముల్
తనమది కింపుఁగూర్ప సత♦తంబును బొందఁగ బ్రహ్మవ్రాయమిన్
గనుఁగొనకున్న దీమనుజ♦కామిని నిన్ను నిజంబు; తన్ననో
ప్పనిసతిఁ గోర నంగమున ♦ బాధ జనించుఁబె తత్ఫలంబు నూ. ౪౨ 975

తే. తన్నుఁ గామించునట్టిని♦తంబిని మదిఁ
గోరువానికిఁ బ్రీతి చే♦కూరుననుచు
ధాన్యమాలిని వచియింప ♦ దైత్యుఁ డబ్ధ
తనుఁడు బలశాలి నవ్వుచూ♦ధరణి వదలి. ౪౩ 976

క. అరిగెను ధర వడకించెడు, కరణిని బాదముల నిడుచుఁ ♦ గడువడిని జ్వల
త్సరసిజవర్ణాభంబగు, నిరుపమసౌధమును జొచ్చె ♦ నెలఁతలతోడన్. ౪౫ 977

తే. అమరగంధర్వనాగక♦న్యకలు రావ
ణాసురుం బరివేష్టించి ♦ యతనిదివ్య
హర్మ్యమును జొచ్చి; రిట్లు ధ♦ర్మాభిరతిని
గాంచి దృఢచిత్తయై భయ♦కంపితయయి. ౪౬ 978

క. పలుకక యున్నమహీసుతఁ, గలుషాత్ముఁ డతండు భీతిఁ ♦ గనునట్లు తగం
బలుకుచు స్మరమోహితుఁడై, యల రెడునిజగృహముఁ జేరె♦నతివేగమునన్.

ఇరువదిరెండవ సర్గము సంపూర్ణము.

## ౨౩ - వ సర్గము.

### సీతను రాక్షసస్త్రీలు బెదరించుట.

చ. అరిజనభీకరుం డయిన♦యాదితిజేంద్రుఁడు సీతతోడ ని
క్కరణి వచించి యాదనుజ♦కాంతల కాత్మహితంబుఁ జెప్పి తా
నరిగి నిజావరోధనము♦నందిన; భీమశరీరలైన య
త్తరుణులు సీతచెంతకుఁ గ్రు♦ధం బఱతెంచిరి చుట్టుముట్టగన్. ౨ 980

తే. వారలంతటఁ గ్రోధదు♦ర్వార్యమాన
లగుచు నంగము లెఱుఁగక ♦ యధికపరుష
వాక్యములఁ బల్కి రిట్లని; ♦ వసుధపుత్త్రిఁ
గాంచి సీతా! వరిష్ఠుఁడై ♦ ఖ్యాతిఁ గాంచి. ౩ 981

చ. వినుతపులస్త్యవంశమున ♦ విశ్రుతజన్మము గాంచి ధీరుఁడై
ఘనమహిమాఢ్యచిత్తము త♦గన్ దశకంఠము లొప్పనుండున
ద్దనుజవిభుం బతింగొన నె♦దం దలపోయ వి [1]దెంతకీర్తియో
యని తలపోయవేమి? యని♦రంతట నేకజటాఖ్య క్రుద్ధయై ౪ 982

క. కను లెఱ్ఱఁబాఱ భీతిం, గనఁజేయఁగఁ [2]గరతలంబు♦కరణి నడుముగ
ల్గినయాజానకిఁ బిల్చుచు, ఘనరవమున నిట్లుపల్కెఁ ♦ గడురభసముగన్. ౫

సీ. [3]వట్ప్రజాతులలో ♦ జానకీ! నాల్గవవాఁడు పులస్త్యుండు ♦ బ్రహ్మమాన
సాత్మజుం డతనికి ♦ నతులతేజస్వియై మానసపుత్త్రుఁడై ♦ తాను బ్రహ్మ
సమమైనమహిమచేఁ ♦ జాలనొప్పి మహర్షియైనవిశ్రవసుఁడు ♦ మానితాత్ముఁ
డలరు; విశాలాక్షి! ♦ యతనికిఁ బుత్త్రుఁడే యరిజనరావణుం ♦ డైనరావ

తే. ణాసురుం డితఁడగు, రాక్ష♦సాధినాథుఁ
డైనయితనికి నీవు భా♦ర్య వగుటకును
దగుదు; వోచారుసర్వాంగి ♦ తగుమదుక్తు
లనుగ్రహింపవదేల? యం♦చనియె నంత. ౬ 984

క. హరిజట మార్జారేక్షణ, యురుకోపము నొంది కనుల ♦ నొగిఁ ద్రిప్పుచు నా
ధరణీజను గని పలికెన్;, దరుణీ! యెవ్వఁడు బలంబు ♦ తనరుచునుండన్. ౭

ఉ. ముప్పదిమూఁడుకోట్ల సుర♦ముఖ్యుల దేవపతిన్ జయించెనో
యప్పురుషోత్తమున్ బలిని ♦ నాశరనాథుని భర్తగాఁగ నీ
విప్పటికైనఁ గోరుమని♦యెన్; బ్రఘసాహ్వయ, యంతఁ గ్రోధమ
ట్లొప్ప వదల్చుచుం బలికె ♦ నోతరుణీ! విను వీర్యమొప్పఁగన్. ౧౧ 9౮౬

క. శూరుండై నంగరముల, భీరుత్వము లేక రిపుల ♦ వెనుక కనుపుచున్

1 సీతేన బహుమన్యసే-అనియూ. 2 సీతాం కరతలోదరీమ్ - అనియూ. అతుందిలమధ్యామి
త్యర్థః-అని వ్యాఖ్య. 3 మరీచిరత్ర్యంగిరసౌ పులస్త్యః పులహః క్రతుః-అని ప్రమాణము.

దారాజిలుబలశాలిని, నీరావణు భర్తగాఁగ ♦ నేలపడయవో. ౧౨ 987

చ. నిరుపమవీర్యుఁడైన రజ♦నీచరముఖ్యుఁడు పత్నులందు సుం
దరియయి గౌరవార్హయు ని♦తాంతము ప్రీతికి భాజనంబునై
పరఁగు మయాత్మజన్ సుహిమిఁ ♦ బాసి సతంబును నిన్నె కూడి యా
దరమున నుండఁగాఁగలఁడు ♦ తత్పరనై సుఖియింపుమా తమిన్. ౧౩½ 988

[1] క. వనితాసహస్రజుష్టం,బును నానారత్నకాంతి♦పుంజంబును నై
తనరెడునంతఃపురమును, వనితా! విడనాడి నిన్నె ♦ వదలక యుండున్. ౧౪½

చ. అనివచియించె; నంత వికటా♦హ్వయ, వేఱొకనాతి జానకిం
గని యిటుపల్కె దేవఘణి♦కర్బురముఖ్యుల నాజిలోన నే
ఘనుఁడు జయించెనో [2]గిరిశ♦కల్పుఁడు రావణుఁ డట్టివాఁడు ని
న్గని తమిఁ జెంతఁ జేరెఁగద; ♦ కాంతరొ, క్షుద్రవుగాన నీవిటన్. ౧౬ 990

తే. సర్వసంపత్సమృద్ధుఁడై ♦ సకలదనుజ
విభుఁడు మహాత్ముఁడునునయి ♦ వెలయునట్టి
రావణున కీవు కూర్చెడు♦రమణి వగుట
కేలయొప్పకయున్నావొ ♦ యింతతడవు. ౧౭ 991

క. అనునంతట దుర్ముఖియను, దనుజాంగన! యిట్లుపలికెఁ ♦ దన్వీ! [3]నిడువా
ల్గనులతుదలుదగుదానవు, వినుమా సూర్యుండు భీతివి♦హ్వలుఁ డగుచున్. ౧౮½

తే. ఎవనిపురమున వెఱచునో ♦ యెండఁగాయ
భీతి వాయువు వెఱచునో ♦ బెట్టువీవ
నట్టిరావణునేల చే♦పట్టకున్న
దానవో యింకఁ జెపుము నా♦తలఁపు గనుమ. ౧౯½ 993

సీ. ఎవనికి భయపడి ♦ వృక్షంబులెల్లఁ బూవులవానఁ గురియునో ♦ యలరుజోడి
యెవ్వఁడు గోరిన ♦ నెల్లశైలంబులు జలదముల్ పానార్హ♦జలము నిడుచు
నున్నవో యట్టివీ♦రోత్తముఁ డగునైరృతపతికి నీవేటికి ♦ భార్యవగుట
కనుమానపడియెదు? ♦ వినుము శుచిస్మితా! భామినీ! సత్యమా♦వాక్యమిట్లు
తే. చక్కఁగా నీకుఁ జెప్పితి ♦ నిక్కరణిని, నీవు వర్తింపుమా దాని ♦ నెమ్మిగలుగు
నట్లు వినకుందువేని నీ♦కసువు లుండె,వనుచు నమ్మము ముమ్మాటి♦కాత్మలోన.

ఇరువదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

1 సమృద్ధం స్త్రీసహస్రేణ-అనిమూలము. 2 గిరిశకల్పుఁడు-అనునది సమయోచితముగ రస పోషకమని యధికముగఁ జేర్పఁబడినదని యెఱుంగవలయు. 3 నవాతిష్ఠాయతాపాంగే-అనిమూలము.

## ౨౮ - వ సర్గము.

### రాక్షసాంగనలు బాధింప సీత రోదనము చేయుట.

క. అతివికృతాననలై పరుషత నొప్పుచున్న రాక్షసస్త్రీలు మహీ
సుతఁ జేరి యప్రియములై, యతిపరుషములు నగుపలుకుల నని రిక్కరణిన్.

తే. సర్వభూతమనోజ్ఞమై చాఁపుశయన, యుత్తమై యొప్పునంతఃపురోత్తమమున
నలరుచుండుము, యని కోర నాదరింప, వేల? సీతా! హితోక్తుల నెల్ల నీవు.

సీ. [1]మనుజకులంబున జనియించితివి కాన మనుజుఁడై యున్న రాముఁనకుభార్య
గానుండుటయె హెచ్చుగాఁ దలపోసెద వదియయుక్తం బింక నైన రాఘ
వునినుండి నీచిత్తము మరల్పకొనుటయ ధర్మమా నింక నెత్తరుణమందు
నతనికి దక్కవీ వనుటయు యుక్తమాఁ త్రైలోక్యసంగత ధనము స్వేచ్ఛ

ఆ. ననుభవించు రాక్షసాధీశు భర్తగా, నొంది యెల్లకాల మురుసుఖముల
స్వేచ్ఛఁ బొంది నీవు విహరించుచుండుమా, బేలవగుచు నిట్లు తేలపలుక. ౮

సీ. [2]కందునెద్దానిని బొందనికల్యాణి మనుజతనొందిన వనితనీవు
కనుక రాజ్యభ్రష్టునిని, నసిద్ధార్థుని, విక్లబు, మనుజుని విభునిగాఁగఁ
గోరుచునున్నావు కోరవు రాక్షసపతి నేలొకో యని పలుకురాక్ష
సాంగనాథయదవాక్యంబుల విని పంకజాయతేక్షణసీత యశ్రుపూర్ణ

తే. నయనములతోడ నిట్లను నన్నుఁ గూర్చి
యందఱొక్కటిగాఁ జేరి యఖిలలోక
ములకు ద్వేషింపఁదగిన యిప్పలుకునిట్లు
పల్కుచున్నారు తగునె యిప్పలుకులు విన ౬౪ 998

---

1 మానుషీ మానుషస్యైవ భార్యాత్వం బహుమన్యసే, ప్రత్యాహర మనో రామా న్నత్వం జాతు భవిష్యసి త్రైలోక్యవసుభోక్తారం రావణం రాక్షసేశ్వరమ్, భర్తార ముపసంగమ్య విహరస్వ యథాసుఖమ్-అనియూ. దీనికి మహేశ్వరతీర్థుల వారివ్యాఖ్య ననుసరించి విశేషార్థముగలదు. నీవుమనుష్యావతారమొందితివిగాన మనుష్యావతారమొందినరాముని హెచ్చుగాఁ దలఁచెదవు. అదియుక్తమే. రామునినుండి మదిని మరల్పుట ధర్మముగాదు. నీవు మరల రామునకు భార్యవు గాఁగలవు. అనునదియే విశేషము. ఇది పద్యమున స్పష్టమగు. ఆ యర్థమున అదియు యుక్తము. త్రిప్పుకొనుటయు, ధర్మము, అనుటయు, యుక్తము. అని పదముల విభజించి చదివిన తేటపడఁగలదు. భర్తార మ్మనఁగా భృత్యుని గానని యర్థము. అనఁగా నిట్టిరావణుఁడు భృత్యుఁడుగా నిన్ను సేవించుచుండ శ్రీరాముఁడు వచ్చుదాఁక హాయిగానుండుమా యని దీనిభావము 2 మానుషీ మానుషం తం తు రామ మిచ్ఛసి శోభనే, రాజ్యాద్భ్రష్ట మసిద్ధార్థం విక్లబంత్వ మనిందితే-అనియూ. విక్లబం, దయాళుం, అసిద్ధార్థం, అశ్చాసౌ సిద్ధార్థశ్చ, అసిద్ధార్థః తం సిద్ధసర్వప్రయోజనం విష్ణుమ్-అని తీర్థులు. ఇవి యాపదములనే యుపయోగించినందున స్పష్టములగు.

చ. కలుషమిదంచు మీరొసఁగ ♦ గన్పడకున్న దిదేమి వింతయో
తలఁపఁగ మర్త్యకన్యకయు ♦ దానవనేతకు భార్యయౌట యీ
యిలఁ దగియుండ; దింక నను ♦ నింపుగ మీరు తినుండు కోర్కె యేఁ
బలుకను దీని నే విసను ♦ బాల్పడఁజేయఁగ నీయకార్యముల్. ౮ 999

తే. దీనుఁడైనను రాజ్యవి♦హీనుఁడైన
నెవఁడు నాభర్తయో గురుఁ♦డే యతఁడగు
రవి సువర్చలవోలె నే♦రామునందుఁ
బ్రీతి గల్గియెయుండు నె♦వ్వేళలందు. ౯ 1000

సీ. భాగ్యరేఖను మించి ♦ వనితామతల్లి యౌశచి యింద్రుఁ బ్రేమించు♦చందమునను
నయ్యరుంధతి వసి♦ష్ఠావ్వయమౌనినివలెను; రోహిణి చంద్రు♦భంగి మఱియు
నలరులోపాముద్ర ♦ యామగస్త్యునివలె, వఱలునుకన్య చ్య♦వనునివలెను
సావిత్రి యనుసాధ్వి ♦ సత్యవంతుంబలె, [1]శ్రీమతి కపిలుని♦రీతిగాఁగ
[2]మదయంతి సౌదాసు♦మాడ్కిని, కేశిని సగరరాజేంద్రుని♦చందమునను

తే. గ్రాలుదమయంతి నైషధు♦కరణి నేను
ననఘు నిక్ష్వాకుకులజుని ♦ నామహాత్ము
రామచంద్రుని గొల్చెయె ♦ రంజిలుమది
నుండుదాన నటం చిట్టు♦లొగి వచింప. ౧౩॥ 1001

క. విని జానకివచనంబుల, దనుజాంగనలెల్లఁ గ్రోధ♦తత్పరతమెయిం
దనువులు తెలియమి రావణు, ననుమతి బెదరించుచుండి ♦ రతికఠినముగన్.

తే. శింశుపాభూరుహంబును ♦ జేరి మఱఁగి
యున్నపావని పల్కక ♦ యూరకుండి
జానకిన్ బెదరించు నా♦దానవాంగ
నలపలుకులను వినుచుండెఁ ♦ గలఁగెడుమది. ౧౪॥ 1003

క. జనకజయు భీతిఁ గంపం, బునుబొందఁగఁ జుట్టుముట్టి ♦ భూరిక్రుధ నం
గనలెల్ల నరుణములుగాఁ, గనఁబడి [3]ప్రేలాడునోష్ఠ♦గణములఁ గదఁకన్. ౧౫॥

తే. నాలుకలనాఁకుకొనుచు వి♦నాశపిశున
ములగు గొడ్డండ్రఁ గైకొని ♦ పలికిరిట్లు
రాక్షసాధీశుఁడైనట్టి♦రావణునకు
భార్యగా నుండఁ దగ దిది ♦ పలుకులేల. ౧౬॥ 1005

క. అనిరంత వరానన యా, జనకజ భయదాకృతులను ♦ జరియించెడునా
దనుజాంగనలు తనుం జెల్చన వదలింపంగ నశ్రు♦జలములఁ గేల్. ౧౭ 1006

---

1 కపిలం శ్రీమతీ యథా-అని మూ. 2 సౌదాసం మదయంతీవ-అని మూ. 3 ప్రలంబౌష్ఠ దళ
నచ్ఛదా-అని మూ.

ఆ. తుడుచుకొనుచుఁ బవన♦జుఁడు దాఁగియున్నయా
శింశుపాతరువును ♦ జేరఁజనియె;
నంత నాయతాక్షి ♦ యాసీత రాక్షస
స్త్రీలు చుట్టుముట్టి ♦ చేరి రాఁగ. ౧౮ 1007

చ. తరువును జేరి శోకనదిఁ ♦ దద్దయు మున్గుచునుండె; నంత న
త్తరుణులు దీనవక్త్రయయి ♦ ధైర్యము లేక కృశించి ప్రాఁతయం
బరమును దాల్చియున్నసతిఁ ♦ బల్కులచే బెదరింప సాగి; రం
త రమణిమిన్న భీతికర♦దర్శనయా వినతాఖ్య క్రుద్ధయై ౧౯ 1008

ఆ. వికృతతనువు గ్రాల ♦ వెడఁదయా నుదరంబు, వెలయ నిట్లు పలికె; ♦ [1]వెఱ్ఱిసీత
భర్తయందుఁ గల్గు♦పరమమా స్నేహంబుఁ, గనఁబఱచితి వింత♦దనుకఁ జాలు.

క. విను మో కల్యాణీ! యే, పనినైనను మిక్కుటముగఁ ♦ బాటించినఁ గ
ల్గును దుఃఖమెల్ల యెడలను, గనుకన్ నీవింక మానఁ♦గాఁదగు దానిన్. ౨౧

క. మనుజతకు నర్హమౌభ, క్తిని బతివిషయంబునందుఁ ♦ దెల్పితి వికఁ జా
లును నేను సంతసించితి, [2]దనరును శ్వశ్రేయసంబు ♦ తన్వీ! నీకున్. ౨౨

క. జనకసుతా, నీకున్ హితము, ను జెప్పఁగఁ బూనుదాన ♦ మునుకొని దానిన్
బొనరింపు; మెద్దియనఁగా, దనుజావళి కీశుఁ డగుచు ♦ ధైర్యము వెలయన్.

చ. [3]ఘనతరపౌరుషంబు దగఁ♦గాఁ దనుసౌష్ఠవమొప్ప నింద్రుఁడో
యనఁ జెలువారుచున్ జతురుఁ♦డై సతతంబును ద్యాగశీలుఁడై
కనఁగొనఁ బ్రీతి నింపుచును ♦ గన్నులపండువుచేయుచుం బ్రియం
బునఁ దగు రావణాసురుని ♦ బూన్కి గ్రహింపుము భర్తగా నికన్. ౨౪ 1013

క. మనుజులకు సాజమౌభీ,తిని వదలి మదుక్తి నెఱవు; ♦ తెఱవా! దీనున్
మనుజుని రాముని విడియుట, దనుజేంద్రుని నాశ్రయింపఁ ♦ దగు నీకింకన్.

[4]సీ. కల్యాణి! జానకీ! ♦ కమ్రాంగరాగంబు నలఁది దివ్యాభర♦ణాఢ్యవగుచు
నగ్నికి స్వాహయు ♦ నమరేంద్రునకు శచివలె, రావణాసురు♦నెలమిభర్త

---

1 సీతే పర్యాప్త మేతావత్-అనిమూలము. ఇట వెఱ్ఱి యానునది రసపోషకమని యెఱుంగఁ దగు. 2 పరితుష్టాస్మి భద్రం తే-అనిమూలము. 3 రావణం భజ భర్తారం భర్తారం సర్వరక్షసామ్-అని మూలము. భ్రియతే శుశ్రూషాదినా స్వామిన మితిభర్తా. భృత్యః తమాశ్రయ-అనితీర్థులు. దీనివిశేషార్థమేమన: మనుష్యసహజమగుభయమును మాని నన్నుఁ గాపాడుమని మొఱ్ఱయిడుచు దీనుఁడై యున్నరాక్షసరాజును బ్రియభృత్యునిగాఁ గైకొనుమా యనిసారము. 4 మానుషం కృపణం రామం త్యక్త్వా రావణ మాశ్రయ-ఇత్యాదిసార్థశ్లోకత్రయమునకు విశేషార్థము గలదు. అదియు నిట గోచరమగు. గతాయుషుండనఁగా, పొందఁబడిన యాయుస్సుగలవాఁడని యర్థము. తక్కినవి సుగమము. గరమా=విషము భక్షింతుమని శేషమని తీర్థులు. సాధారణార్థమందు కరము=మిక్కిలి యని. అనఁగా రావణునాశ్రయింపఁబూనవేని విషమును గ్రోలి చత్తుమని భావము.

గాఁగ గ్రహించి భో♦గంబుల లలిఁగాంచి యిప్పటినుండియు ♦ యెల్లలోక
ముల కీశ్వరివిగమ్ము ♦ లలనా, గతాయుష్యుండయి దీనభంగి ను♦న్నట్టిరాము

ఆ. నొందఁగోరుటరయ ♦ యుక్తమే; నేఁజెప్పి
నట్టిపలుకుఁజేయ ♦ నాత్మఁదలఁప
వేని యీక్షణంబె ♦ యేమెల్లభక్షింతు
మెన్ని గరముచూడు ♦ మిది నిజంబు. ౨౭। 1015

క. అనిచెప్పి నంతలోనన, స్తనములు వ్రేలాడుచున్న♦చాన వికటనాఁ
దన రెడునది క్రోధంబునఁ, దనపిడికిలి నెత్తి యార్చి ♦ ధరణిజ కనియెన్. ౨౮।

ఆ. దుష్టమతివి నీవు ♦ తోఁచినట్లప్రియ
వచనములను బెక్కు ♦ పలికి దను జ
గంగఁ గరుణవలనఁ ♦ గడుమృదుమానస
మునను నోర్చుకొనియె ♦ దనుజవిభుఁడు. ౨౯। 1017

క. ఇప్పటికిఁ దగినయట్టులు, చెప్పితిమి హితంబు నీకుఁ ♦ జెలువా, నీవో
యిప్పటికిని వినకున్నా, వొప్పదుసుమి యీపథంబు ♦ నొందుదువు వెతన్.

చ. ఒరులకుఁ జేరరానియటు ♦ లొప్పెడుసాగరయామ్యతీరముం
గరము భయంకరమ్ముఁ గనఁ♦గా నిటు తేఁబడియున్నదానవో
తరుణిరో ఘోరభంగిఁ దగు♦దానవనాథుని సౌధభాగమున్
జొరఁబడియున్నదాన విటు♦చొచ్చుటె కాక మురారియాజ్ఞ చేన్. ౩౦ 1019

క. కారాగారంబున నీ, వీరీతి వసించి మేము ♦ నీవిధిఁ గావం
గా రహితనాథవటుతగి, యేరీతిం బోవఁగలవో ♦ యెఱుఁగుము సుమ్మా. ౩౧।

క. నిను సాక్షాద్వజ్రియువచ్చినఁ గావఁగ లేఁడు; మేలు ♦ చేకుర నేఁ జె
ప్పినమాటను బాటింపుము, కనుగవలన్ నీరువిడువఁ♦గాఁ జాలు నిఁకన్.

క. వదలు మనర్థకశోకముఁ, బొదలుము హర్షమున దనుజ♦పుంగవునందున్
గదియింపుము ప్రీతినని,త్యదైన్యముంగూడ వదలఁ♦దగు నోసీతా. ౩౩।

క. దనుజేంద్రువిషయమై చెప్పినమాటల నోర్చుకొనుము ♦ ప్రియమున నీవో
వనితా విహరింపుము; యౌవనమనఁగ నశాశ్వత మను♦వచన మెఱుఁగవే.

తే. పితికిదానవు జానకీ! ♦ యెఱుఁగుదుగద
వయసు చంచలమని యిట్టి♦వయసు గడచి
పోకముందే సుఖంబులఁ ♦ బొందు, మోము
దిరవిలోచన! రాక్షసా♦ధిపుని చేత. ౩౪ 1024

క. వెలయింపఁ జేయఁగాఁబడు, లలితోద్యానముల సుగిరు♦లన్ దద్వనవం
క్తుల నిచ్చ సంచరింపుము;, చెలువారుచు నేడువేల♦స్త్రీలు సతతమున్.

క. [1]తరుణీ నీవశమున నుం,దురు రాక్షసనాయకుఁడయి ♦ తోరపుశక్తిం
బరఁగెడురావణుభర్తగఁ, బరిగ్రహింపుము మదుక్త♦వచనము సరిగాన్.

ఆ. చేయవేని నిన్నుఁ ♦ జెచ్చెఱ నేనిదె, గదలనీక గుండె♦కాయఁ బెఱికి
తిందుననియె; నొక్క♦ తెఱవ, చండోదరి, యంతఁ గ్రోధవివశ♦యగుచు వేగ.

క. పెనుశూలముఁ ద్రిప్పుచు ని,ట్లనియెను; హరిణాక్షి, నతిభ♦యంబునఁ గంపం
బును బొందఁజేయుకుచములఁ, దనరెడు నీయింతి దనుజ♦తల్లజుఁ డిటకున్.

క. కొనితెచ్చినయప్పుడె నేఁ, గనుటన్ నాకొక్క వాంఛ ♦ గలిగె నదేమో
యనినన్ వినుండు తెల్పెద;, దనుజాంగనలార! [2]యీని♦తంబిని నిచటన్.

సీ. వధియించి కుక్షికి ♦ వరుస దక్షిణభాగమందున్న కాలఖం♦డాఖ్యమైన
మాంసపిండంబును ♦ మఱి దీనికెడమభాగంబున గుల్మాఖ్య♦కమగుమాంస
మును, దానిపైభాగ♦మున నున్నమాంసముఁ, బంకజముకుళంబు♦పగిది నొప్పు
గుండెకాయను, గ్రింద♦నుండుమాంసంబును, బ్రేఁగులఁ, దలను నేఁ♦ బ్రీతిమీఱఁ

ఆ. దినఁగవలయు ననెడు♦తీవ్రవాంఛయె గల
దనియె; నంతఁ బ్రఘస ♦ యనెడునింతి
సీతఁ గాంచి పలికె ♦ నీతఱి నీక్రూరు
రాలికంఠతలము ♦ లీలవోలె. ౪౨ 1030

తే. పిసికివైతము తరువాత ♦ వెసఁజని మన
ప్రభువునకుఁ జచ్చె నాక్రూర♦రమణి యనుచుఁ
జెప్పెదము రాజు నట్లైనఁ ♦ జెలఁగి తినుఁడు
దాని నంచను లే దను♦మాన మిందు. ౪౩ 1031

క. అనియె నజాముఖి యనునొక, దనుజాంగన పలికె నిట్లు ♦ తరుణిని దీనిం
గనికరములేక ఛేదిం,పనగున్ దరువాత దీని♦పలలం బెల్లన్. ౪౩౫ 1032

తే. సమముగాఁ బంచుకొందము ♦ సమముగాఁగఁ
బ్రోగుచేసినమాంసంబుఁ ♦ బొలఁతులార
కలహమాడుట నాకు ని♦క్కముగ నిష్ట
మెంతమాత్రముగాదు మీ♦రింక మీఁద. ౪౪౫ 1033

క. పానీయలేహ్యముల నీ, మానినిమాంసంబుఁ దినుస♦మయమునఁ గూడన్
జానుగ నంజుకొనంగాఁ, బూనుఁడు తెప్పింపుఁ డిటకుఁ ♦ బొందుగ ననియెన్.

ఆ. [3]అంతశూర్పణఖయుఁ ♦ బంతంబుమీఱఁగా
నిట్లుపలికె నీమె ♦ యేమిపల్కె

1 భర్తగ-అనుదానికి భృత్యార్థము లోపల వ్రాయఁబడియేయున్నది 2 ఈనితంబిని-యనఁగా నీసీతను నిందించినయాస్త్రీని అనియర్థమని తీర్థులు. అన్నితావుల నిట్లే యని గ్రహింపఁదగు.
3 శూర్పణఖ-ఇది కావలిగాచుస్త్రీలలో నొకతుక.

నదియె యుక్తమని మ♦దాత్మకుఁ దోఁచెడుఁ
జింతలెల్లఁ దొలఁగఁ♦జేయుసురను. ౭౬ 1035

క. కొనిరండు వేగమిత్తతి, మనుజాంగనదైన రుచిర♦మాంసము దినుచున్
దనివొంది నికుంభిలకును, జని ప్రీతిగ నర్తనంబు♦ సలుపుదమనఁగన్. ౭౭

క. సురకన్యోపమ యగునా, ధరణిజ భయదాకృతులను♦ దాల్చినరక్ష
స్తరుణులు తను బెదరింపఁగ, [1]గురుధైర్యము వదలియేడ్చెఁ♦గుందుచు వంతన్.

ఇరువదినాల్గవ సర్గము సంపూర్ణము.

---

౨౫ - సర్గము.

సీత మిక్కిలి విలపించుట.

[2]క. పరుషంబుగ మిగులభయం,కరముగ వికృతాంగరాజి♦ గలయావనితల్
కరము వచింపఁగ శ్రీరఘు,వరుసతి విలపించెఁ బెక్కు♦భంగుల మిగులన్. ౧

తే. ఆ మనస్విని యగుట సీ♦తయును రాక్ష
సాంగనలు పల్కుమాటల♦ నాలకించి
మిగులభయమొంది యవిరత♦ముగ స్రవించు
బాష్పముల గద్గదములగు♦పలుకు లొప్ప. ౨ 1039

చ. మనుజపురంధ్రి యెప్పటికి♦ మానుషభక్షకుఁ డైనభీతికృ
ద్దనుజున కెంతమాత్రమును♦ దారగఁగాఁ దగ దింక మీరు నే
చ్చను నను జంపి భోజనము♦సల్పుఁడు మీపలుకుల్ వినంగనొ
ల్లను జరియింప నిట్టులని; ♦ లక్షణసంగతి దేవకన్యనాఁ
దనరు ధరాత్మజాత యిటు♦ దానవభర్తయుఁ దన్నదల్పఁగన్. ౩ 1040

క. దనుజాంగనాంతరంబునఁ, దనుఁగాచెడువారు లేక♦ తాఁజిక్కియు నా
ర్తినిబొంది లేశమాత్రం,బును సుఖముం గాంచదయ్యె ♦భూపుత్రి యటన్.

క. వనమున సింహమృగములు, తనుఁజుట్టుకొనంగ బంధు♦తతి లేమిని జిం
తనుగాంచుమృగివిధంబునఁ,[3]దనయంగములందుఁజొచ్చు♦తలఁపుఁగనుచటుల్.

క. ముడుచుకొని భీతిచే వడ,వడ వడఁకుచునుండె; శింశు♦పావృక్షమునం
గడుఁ బెనుచుకొంచుఁ గానం, బడుపూవులదగుసశోక♦వరశాఖఁ దగన్. ౬

చ. కరములఁ బట్టుకొంచు రఘు♦కాంతునిపత్నియు శోకమొప్పఁగాఁ
బరిపరిస్వాంతమెల్ల వగ♦పాలయి తూలఁగ రామమూర్తినిం

1 సీత రామవియోగమునకు దుఃఖించెననుట తీర్థభావము. 2 సీతావిలాపవాక్యార్థస్తు శ్రీరామవియోగేన, ఘోరరాక్షసపరావస్థానేన, విరూపరాక్షసీపరుషభాషణేన, చ వివిధప్రలాపాదిక మితిశ్లేయమ్-అని మహేశ్వరతీర్థులు 3 విశంతీవాంగమార్త్మనః-అనిమూలము.

దరతరరూపముం దలఁచె; ♦ ధాత్రితనూజయు గబ్బిగుబ్బలం
దొరఁగెడుబాష్పధారలను ♦ దోరముగా మునుఁగంగఁ జేయుచున్. ౬౪ 1044

క. రామునినే ధ్యానించుచు, నేమాత్రము వగకుఁ దుదను ♦ హృదయమునఁగనం
గామినియుఁ జాలదయ్యెను;, భీమగతిన్ వీచుగాలి♦విసరున నిలపై. ౭౪ 1045

క. ఒరగెడుకదళివిధంబున, నురుభీతిని వడఁకి యప్పు ♦ డుర్విం బడి యా
తరుణులవలనిభయంబునఁ, గరము వివర్ణాస్య యగుచుఁ ♦ గళవళపడియెన్.౮

ఆ. ఇట్లు కంపమొందు♦నింతిపెన్నాఁటివేణి, కంపమొందుచుంటఁ ♦ గదలుచున్న
సర్పమట్లు చూడఁ♦జాలియొయుండె; నా:ధరణిజయును నూర్పు♦తతులఁ వెడల.

తే. శోకవేగంబునన్ మది ♦ సొంపుదప్పి
యార్తి మున్గుచు బాష్పము ♦ లట్టె కురియఁ
దాను విలపించె; నోరామ ♦ దశరథాత్మ
జాత, యోలక్ష్మణా, సుమి♦త్రాతనూజ. ౧౦౪ 1048

క. ఓయత్తా! కౌసల్యా, యోయత్తా! యోసుమిత్ర ♦ యురుతరదుఃఖం
బీయెడఁ బొందితి ననుచున్, బాయక విలపించి యిట్లు ♦ పలికెన్ దనలోన్.

చ. కరము భయంకరాకృతులు ♦ గన్పడ నిచ్చట నున్నయట్టియా
సురతరుణుల్ ననుం గలఁపఁ♦జొక్కుచు రామునిఁ బాసి యిందు ని
క్కరణి ముహూర్తమైన బ్రదు♦కంగనుజాలితి నక్కటా! యిఁకం
దరుణికిఁగాని పూరుషవ♦తంసున కేని య కాలమందునన్. ౧౨౪ 1050

చ. మరణము రాదటంచు బుధ♦మండను లాడెడులోకవార్త యి
ట్లరయఁగ సత్యమే యగు; మ♦హాంబుధిమధ్యమునందుఁ బూర్ణమా
తరణి సమీరవేగమునఁ ♦ దా నిహతంబయి కూలునట్లు దు
ర్భరమగునార్తినొంది యొక♦భంగిని బుణ్యముఁ జేయనట్టి నే
నురుభయమొంది నాశనము ♦ నొందఁగ నుండెద దిక్కులేకయే. ౧౮ 1051

క. పెనిమిటిని జూడఁజాలక, దనుజాంగనలెల్ల నన్నుఁ ♦ దర్జనముల భీ
తిని గనఁ జేయఁగఁ దోయం,బున హతమగు గట్టువోలెఁ ♦ బొందఁగలమ్మృతిన్.

చ. *సరసిజపత్ర నేత్రు, గురు♦సామజసైరివిలాసగామి స
త్కరుణ చెలంగ నింపుగులు♦కన్ వచియించుచుఁ దాఁ గృతజ్ఞుఁడై
పరఁగెడునాపతిన్ ధరణి♦పాలకు రాముని ధన్యులెల్లఁ జూ
తురు; విదితాత్ముఁడై నన్నృప♦ధూర్జటి రామునిఁబాసి నేనిటన్. ౧౬౪ 1053

తే. భయదవిషమును ద్రావిన♦పడఁతివోలె
బ్రదుకఁజాలను; ఘోరమౌ♦ప్రబల దుఃఖ

* తంపద్మదళపత్రాక్షం సింహవిక్రాంతగామినం, ధన్యాః పశ్యంతి మే నాథం కృతజ్ఞం ప్రియవాదినమ్-అనిమూలము.

మిట్లు పొందుచు నున్నాను ♦ నిందుకెట్టి
పాపమును జేసితినొ పూర్వ♦భవమునందు. ౧౮ 1054

క. పెనువగల ననుభవించుచు, మనియుండఁగఁజాల, నేను ♦ మరణంబును బొం
దనుదగుఁ; [1]గావలిగా నీ, వనుజాంగనలుంట రాము♦దర్శనమెట్లా. ౧౯ 1055

[2]చ. తనమదిఁ దోఁచినట్టితఱిఁ ♦ దప్పక చచ్చుటకున్ స్వశక్తిఁబొం
దనిమనుజత్వ మిస్సిరో, స♦తంబు మఱొక్కరికేను బొంగి యె
ప్పనిగతి నిట్టులుండుటయుఁ ♦ బాపముగాదె యిసీ! యిదెట్టిదో
జని యిటుగల్గె నేయఘము ♦ సల్పితినో విధి యెట్టులున్నదో. ౨౦ 1056

ఇరువదియైదవ సర్గము సంపూర్ణము.

---

## ౨౬ - వ సర్గము.

### సీత చావ నిశ్చయించుట.

[3]క. జనకాత్మజ, యాబాలిక, తనశీర్షము వంచి మోము♦దమ్మిపయిని నిం
డను బాష్పమ్ములు కాఱం,గనిట్లు విలపింపఁదొడఁగెఁ ♦ గడుదీనతచేన్. ౧

సీ. భ్రాంతచిత్తయుఁబోలె ♦ నెంతయునున్మత్త, యనఁగఁ, బ్రమాదంబు♦ననుగలంగి
నట్టులు వినుగుచే ♦ నవనిపైఁ బడి నేలఁ బొరలింపఁబడునాఁడుఁ♦దురగమువలె
విలపించుచుండె నీ♦విధమున; రాముండు చెంతలేనప్పుడే♦చిత్రరూపుఁ
డగురాక్షసుఁడు రావ♦ణాఖ్యుఁడు గట్టిగాఁ బలవింపుచున్ననన్ ♦బలిమిఁబట్టి

ఆ. తెచ్చినాఁడు; నన్ను ♦ నిచ్చటఁ గ్రవ్యాద, వనితలెల్లఁ గాచు♦వారు మిగుల
భయదరీతిఁ గాఁగఁ ♦ బల్కుచు నున్నారు, గాన నేను రాము♦మానవమున ౪

క. తలఁచుకొని యిట్టిదుఃఖం,బులలోఁ బ్రాణాళి నిలుపఁ♦బూనను బ్రదుకం
దలపోయ నింక; నతిశయ,బలుఁడు మహారథుఁడునైన ♦ ప్రాణేశ్వరునిన్. ౪॥

తే. విడిచి యీరాక్షసస్త్రీల ♦ నడుమఁ జిక్కి
యున్ననామేనఁ బ్రాణము ♦ లున్ననేమి
ఫలము ? ధనభూషణములేల ? ♦ బలువెతలకు
హృదయమిది చిక్కి పగులదే ♦ యేమొకాని. ౫॥ 1060

క. కనుక నిది యశ్మసారం, బనిచెప్పఁగ నొప్పునిశ్చ♦యంబిది, మరణం
బును జరయు లేనిదిగనై, ననుండఁదగు [4]లేకయుండి♦నం బగులదొకో. ౬

---

1 రాక్షసీభిశ్చ రక్ష్యంత్యా రామో నాసాద్యతే మయా - అనిమూలము. 2 ధిగస్తు ఖలు మానుష్యం ధిగస్తు పరవశ్యతామ్, నశక్యం యత్పరిత్యక్తు మాత్మచ్ఛందేనజీవితమ్ - అనిమూలము. 3 అధోముఖముఖీ బాలా-అనిమూలము. 4 నదుఃఖే నావశీర్యతే-అనిమూలము.

చ. జనసుతుఁడై నరాధిపుని ♦ సంగతిఁ బాసి ముహూర్తమైననో
ప్పనివిధిఁ బాపపుంబ్రదుకు♦వారకపొందితిఁగాన నిస్సిరో
మనుగడ యస్మదీయమిది ♦ మంచిదియౌనె, [1]యనార్యమేగదా
జననము నా ది దెంతటి య♦సాధువొ యెట్టియయోగ్యురాలనో. ౭ 1062

[2]చ. జలనిధిసీమగాఁ గలుగు♦ధాత్రిస్థలికెల్లఁ బ్రభుండు సాధువా
క్కులఁదగువాఁడు నావిభుఁడు ♦ కోరికలిచ్చెడురామమూర్తి యీ
స్థలమున లేకయుండఁగ వృ♦థాబ్రదుకన్ ఫలమేమి సౌఖ్యముల్
గలుగఁగఁ గోరనేల యవి♦కాల్పనె నే మననేల యింకనున్. ౮ 1063

ఆ. [3]తనువు వదలుదాన ♦ దానవాంగనలార
యింకఁ బగులఁగొట్టుఁ ♦ డీతనువును
దినుఁడు వాంఛయేని ♦ దివిజసమాను నా
ప్రియునిఁ బాసి దుఃఖ♦వితతిదీని. ౯ 1064

క. భరియింపఁజాలనింకన్, జిరమే నపసవ్యపదము♦చేనైన నిశా
చరుని స్పృశింపను సిందుస్వని, మరలం బ్రేమింతు నన్న♦మాట కలుగునే. ౧౦

సీ. క్రూరస్వభావుఁడై ♦ కోరుచు నున్నాఁడు గనుపీఁడు వలదని♦నను వదలఁడు
తెలియఁజాలఁడు తన♦కులమును దనస్వరూపంబును దెలియఁడు♦పలుకునెయిటు
తెలిసియె యున్నచోఁ; ♦ దెలవలారా, నను నఱికిననుం జీల్చి♦నను మదీయ
ములగునంగముల ని♦మ్ముల వేఱువేఱుగా ఖండించినను మఱి♦యందుచున్న
తే. యగ్నిలోవైచి కాల్చిన ♦ ననుసనేను
దలఁప మీరెంత యఱచిన♦ఫలము లేదు;
రామచంద్రుఁడు ఖ్యాతుఁడు ♦ ప్రాజ్ఞుఁడు నుప
కర్తల నెఱుంగువాఁడునై ♦ క్రాలుచుండు. ౧౧ 1066

క. కరుణాన్వితచిత్తుఁడు సుం,దరరూపుఁడు చారువృత్తిఁ ♦ దగువాఁడునునై
పరఁగునలరాముఁ డేలొకొ, [4]నిరనుక్రోశుండు గాఁగ ♦ నెగడెడునకటా. ౧౨

క. ఔనిదినా దౌర్భాగ్యం,బే నేనిటుశంకనొందు ♦ టెన్నఁగఁ దగుఁబో;
తానొక్కఁడేకద జన,స్థానంబున వీర్యమొప్ప ♦ క్షణమాత్రములోన్. ౧౩

క. పదునాల్గువేలదనుజుల, మదమడఁపఁడె యట్టిశౌర్య♦మహితున కిటు రాఁ
గఁదగన్ సంశయమేమో,మదిఁ దెలియఁగఁజాల నెంత♦మాత్రము నేనున్. ౧౪

---

1 ధిక్ త్వా మనార్యా మసతీం యాహం తేన వినాకృతా - అనిమూలము. 2 ఈపద్యమున మూలార్థము విస్తృతమని తెలియఁదగు. 3 ఛిద్యతాం భక్ష్యతాం వాపి శరీరం విసృజా మ్యహమ్- అనిమూలము. 4 సద్వృత్తో నిరనుక్రోశః శంకే మద్భాగ్యసంక్షయాత్ - అనిమూలము నిరనుక్రోశః=నిర్దయుఁడని యర్థము.

తే. [1]అల్పవీర్యము గలరావ♦ణాసురుండు
నష్టుచున్నాఁడు నను రాముఁ♦డతిసమర్థుఁ
డౌనుగద యుద్ధమున వీని♦ నంతమొందఁ
జేయఁగలఁడుగదా యేల♦చేరరాఁడొ. ౧౫ 1070

క. మును దండకావనంబున, దనుజేంద్రుం డావిరాధు♦దర్పంబునఁ జం
పినరాముఁ డేలయిచటికిఁ, జనుదేరక యున్నవాఁడొ ♦ సత్వర మకటా. ౧౬

క. పుర మిద్ది భయదసింధ్వం, తరమునఁ దగి దుష్ప్రధర్ష♦ణంబ యగుచుఁజో
పరికింప [2]రాముబాణో, త్కరమున కడ్డమి యిందుఁ ♦ గలుగదుకాదే. ౧౭

క. కారణ మేమో ననుఁ బ్రియ, దారను రాక్షసుఁడు దొంగ♦తనమునఁ గొనఁగా
భూరిపరాక్రముఁ డయ్యును, నూరకయున్నాఁడు గావ♦కుండఁగ నకటా. ౧౮

ఆ. లక్ష్మణాగ్రజన్ముఁ ♦ డీక్ష్మాస్థలిని నుంట, దెలియఁజాలఁడేమొ ♦ తెలిసియున్న
నతుల తేజమొప్పు♦నాతఁడుగాన నీ, [3]ధర్షణము సహింపఁ♦డలఁచునె మది.

క. నను దనుజుఁడు దొంగిలి తెచ్చినజాడను గాంచి యెవఁడు ♦ చెప్పఁగఁదగునో
ఘనుఁ డాజటాయు వట నీ, దనుజునిచేఁ దెగియెను బ్రవి♦దారణమందున్.

తే. వృద్ధు వతఁడయ్యు నన్ ద్వంద్వ♦యుద్ధమందు
రావణాసురున్ నిల్పి ♦ కావ నన్నుఁ
దలఁచి తనచేతనైనంత♦దనుకఁ గాచి
గొప్పకార్యముఁ జేసె నీ♦క్షోణియందు. ౨౧ 1076

తే. రాముఁడాతఁడె నే నీ ధ♦రాస్థలిఁ గల
దాన నంచు నెఱింగెనేఁ ♦ బూనియిపుడె
కోపమున లోకమున దనుజ♦కులములేక
యుండఁ గావింపఁడే సాయ♦కోత్కరమున. ౨౨ 1077

క. పురమును వీనిన్ బూదిగ, శరములఁ జేయండె; భూరి♦సాగరమును భీ
కరగతి నెండఁగఁజేయఁడె, పరమత్యుగ్రుఁడగుదనుజ♦పతివీని ననిన్. ౨౩ 1078

క. [4]పొలియించి వీనికీర్తిని, నిలలేకుండంగఁ జేయఁ♦డే; యువ్వల నా
వలెనే గతనాయకలా, నెలఁతలు ప్రతిగేహమందు ♦ నిత్యము లంకన్. ౨౪

తే. ఏడ్చుచుండంగఁగలరు నే♦నెంతునేమి
సంశయము లేదటంచు; ల♦క్ష్మణునిగూడి
రాముఁ డీలంక వెదకి యీ♦రాక్షసులను
జంపు; నాసోదరులకు గో♦చరులెరైన. ౨౫ 1080

క. అరివీరులు క్షణమాత్రము, ధరణిం బ్రదుకంగలేరు; ♦ తథ్యము, లంకా

---

1 నిరుద్ధా రావణే నాహమ్-అనిమూ. 2 నతు రాఘవబాణానాం గతిరోధీహ విద్యతే-అనిమూ. 3 ధర్షణం మర్షయిష్యతి-అనిమూ. 4 యథాహమేవం రుదతి-అనిమూ.

పురమిద్ది [1]చితాధూమో, త్కరసంకులమార్గమగుచుఁ ♦ గడు వేగముగన్.

తే. గృద్ధపిండులతోఁ గూడి ♦ రహితవిభవ
మయి శ్మశానమువంటిదె ♦ యగును; వేగ
నామనోరథ మిద్ది సుం♦తయును గొఱఁత
పడకయుండ ఫలించుఁ ద♦ప్పదు నిజంబు. ౨౬౫ 1082

క. మీరెల్లఁ బూనిన దురా,చారంబిది మీకుఁ గీడు ♦ సరగునఁ దగునం
చాహూఢిగఁ దెల్పెదుఁజుఁడీ, యోరాక్షసకాంతలార! ♦ యొకనుడి వినుఁడీ.

క. పురియిద్ది హతప్రభమై, సరగునఁ గూలఁగలదనుచుఁ ♦ జాటించెదునీ
తరుణమున నశుభశకునము, లరయంగా నెన్నియేని ♦ యంగనలారా. ౨౭

క. ఒరులకు నెదిరింపఁగ నె,క్కరణిని సాధ్యంబుగాక ♦ క్రాలెడులంకా
పురమిది పాపాత్ముఁడు క,ర్బురపతి నీచుండు వీఁడు ♦ పొలియఁగ నంతన్. ౨౮

క. పెనిమిటిపోయినయంగన, యనువునఁ దనశోభ పోవ ♦ నడఁగంగల; దిం
కను నాథుఁడై నరావణుఁ, డనిఁ దెగ రాక్షసగణంబు♦లన్నియుఁ దెగఁగన్.

క. పురమిది గతభర్తృకయో, తరుణివలెన్ మంగళప్ర♦దములయి తగు సుం
దరనిరతోత్సవములు లే,క రయంబునఁ గాంతిదూలి ♦ కనఁబడుఁజుండీ. ౩౦

క. [2]ప్రతిగేహమందుఁ బురమునఁ బతులు నశింపంగ మిగుల♦వగలఁబొగులు స్త్రీ
వితతులకంఠధ్వని నా, కతిజవమున వినఁగవచ్చు♦నంగనలారా. ౩౧ 1088

సీ. నిశ్చయంబీమాట; ♦ నిర్మలరక్తాంతనయనుఁడై శూరుఁడై ♦ నాకవిభుని
సమతఁ జెలంగుభూ♦జాని రాముఁడు నేను రావణునింట ని♦ట్లీవిధమున
నుండుట యెఱిఁగెనే ♦ నొక్కక్షణంబున నీపురం బారాఘు♦వేంద్రుతీక్ష్ణ
బాణనిర్దగ్ధమై ♦ బహుళాంధకారాభివృతమయి, కాంతివి♦హీనమగుచు

తే. నిహతదనుజసమూహమై ♦ నిశ్చయముగఁ
బాడుపడియుండఁగలదు; నా♦వాంఛయిద్ది
జరగఁగల దింతలోన నా♦జని యడంగు
చున్నదే యొట్టులనిన న♦త్యుగ్రమతియు. ౩౩౫ 1089

క. క్రూరుఁడు నీచుండును నగు, నీరావణుఁ డేర్పఱచిన♦యానసమయము నా
చేరువనొందెనుగద; పా,పారంభులు రావణాదు ♦ లగునీదనుజుల్. ౩౪౫ 1090

తే. ధర్మహీనులు గానఁ గృ♦త్య మి దకృత్య
మిదియని యెఱుంగలేరు, వీ♦రెన్న నన్నుఁ
జంపుటకు సాహసింతురు ♦ సరగ నీయ
నర్థమిటఁ గల్గవచ్చును ♦ నాకు నకట!. ౩౫ 1091

1 చితాధూమాకులపథా-అనిమా. 2 శ్రోష్యామి నచిరాదేవ దుఃఖార్తానా మిహ ధ్వనిమ్-అనిమా

చ. పలలమె సర్వకాలమును ♦ బాగుగ మెక్కెడువారు ధర్మముఁ
దెలియరు క్రూరరాక్షసులు ♦ తెంపున [1]రావణుఁ డీతఁ డింక స
న్నెలమిని భోజనంబునకు ♦ నేర్పఁ బ్రొక్కటివేళఁ గైకొనం
గలఁడు నిజంబు; రక్తరుచిఁ ♦ గ్రాలెడునేత్రము లొప్పురామునిన్. ౩౬ 1092

క. అనిశముఁ గనులకు విందుగఁ, గనుపట్టెడుప్రాణనాథుఁ ♦ గానక దుఃఖం
బునఁ గుందుదాన నే నా,తనివిడిచి మఱేమిచేయు♦దాన నిఁకఁ గటా. ౩౭

ఆ. విషము నెవ్వఁ డేని ♦ వెస నిపుడిచ్చిన
దానిఁ ద్రాగి [2]యమునిఁ ♦ గానఁబోదుఁ
బతిని విడిచియుంట ♦ పరమదుస్సహము నా
కిపుడె మృతినిబొందు♦టే వరంబు. ౩౮ 1094

ఆ. [3]లక్ష్మణాగ్రజని యి♦లనునిందు జీవించి, యున్నదాననంచు ♦ నన్ను నెఱఁగి
యుండఁడనుచుఁ దోఁచు♦చున్న దెఱింగెనే, వారలూరకుండు♦వారు గారు.

క. ధరణిని నంతట వెదకియొ, పరికింతురు నన్ను; మిగుల♦బలశాలి మహీ
వరుఁ డారాముఁడు [4]నాదగు, పరమార్తిని గుంది భూమి♦పయిఁ దనతనువున్.

ఆ. విడిచి స్వర్గమునకు ♦ వెస నేగియుండును
నిశ్చయమిది; పద్మ♦నేత్రుఁడయిన
మత్ప్రియుఁ మహీశ♦మండను నటఁ గను
పరమమునులు దివిజ♦వరులు మఱియు. ౪౦ 1097

క. వరసిద్ధులు గంధర్వులు, నరయఁగ ధన్యులగువార; ♦ లారాముఁడు భూ
వరుఁడైన మానితుల్యుఁడు, పరమాత్ముఁడుగాన ధర్మ♦పరుఁడై యుండున్.

క. [5]కనుక నకాముండగు నా,తనికిన్ భార్యనగునన్నుఁ ♦ దలఁపఁగఁ బనియే
మనియెంచుదాన; లోకం, బున నొకనిని బ్రియముగల్గి♦పొలువుగ నెపుడున్.

క. [6]కనుచుండిననే ప్రియమా,తనిపై నశియింపకుండుఁ ♦ దగ నాతనినిం
గనకున్నఁ బ్రీతియేచెడుఁ, గనుకన్ నను రామమూర్తి ♦ కానఁడు కాదే.

ఆ. దానఁ బ్రీతిలేక ♦ తగ నన్ను మఱచెనో;
యీతలంపు న్యాయ♦మెట్టులగును!
బాపచిత్తులే యు♦పకృతిని మఱతురు
రాముఁ డేలమఱచు ♦ రమణి నన్ను. ౪౩ 1101

---

1 ధ్రువం మాం ప్రాత రాశార్థే రాక్షసః కల్పయిష్యతి-అనిమూ. 2 క్షిప్రం వైవస్వతం దేవం పశ్యేయం పతినావినా-అనిమూ. 3 జానంతౌ తౌ నకుర్యాతాం-అనిమూ. 4 నూనం మమైవ శోకేన సవీరో లక్ష్మణాగ్రజః, దేవలోక మితో యాత స్త్యక్త్వా దేహం మహీతలే - అనిమూ. 5 ధర్మకామస్య ధీమతః-అనిమూ. ధర్మకామస్య, నతు కామపరస్య-అనివ్యాఖ్య. 6 దృశ్యమానే భవేత్ప్రీతి స్సౌహృదం నా స్త్యపశ్యతః-అనిమూ.

సీ. తొలుదొల్త నాకరిపైఁ ♦ గలిగిన ప్రీతిని మఱువఁడు భూనాథ♦మండనుండు;
భామినినై రామ♦భద్రునిఁ బ్రాణేశు నెడఁబాసి నవయుచు ♦ నిట్టులున్న [తుఁ
దాననే; యఘములే♦మేని చేసితినొక్కొ నాదు దౌర్భాగ్యమో♦నయగుణాయు
డయి, సాధుశీలుఁడై ♦ యత్యంతశుద్ధాత్ముఁడై శూరుఁడై మఱి♦యరినిబర్హ

తే. ణుఁడయి తనరారు రాముని ♦ విడిచి బ్రదికి
యుంటకన్నను మృత్యువు ♦ నొందుటె శుభ
మగును; ఫలమూలభక్షకు♦లై వనమునఁ
దిరుగుపూరుషవరులు సో♦దరులు వారు. ౭౪॥ 1102

క. వగపెల్లున నాయుధముల, దిగవిడిచిరొ యేమొ; దుర్మ♦తియు దనుజేంద్రుం
డగునీరావణుఁ డిలలోఁ,నఁ గడుఁ శూరులగువారి ♦ నరపాలకులన్. ౭౫॥

తే. [1]అన్నదమ్ములఁ గపటంబు ♦ పన్ని చంపి
నాఁడొ యేమో; తలంప నీ♦నాఁటి కిట్లు
కాలపరిణతి గల్గిన♦కారణమున
[2]నట్లు తగియున్న నేను నె♦ల్లైననింక. ౭౬॥ 1104

తే. సర్వవిధముల నాప్రాణ♦సమితి విడువఁ
గోరుచున్నాను, వగలను ♦ గుందియున్న
నాకు నిప్పటికే మర♦ణంబు చెంతఁ
జేరరాకున్నదేమొకో ♦ చిత్రమిద్ది. ౭౭ 1105

క. [3]అతిధీరులు త్యక్తాఘులు, జితచిత్తులు మహితభాగ్య♦సిద్ధులు నగుచు
న్నతమునులకుఁగలుగవుగద,మతిఁదలఁపఁ బ్రియాప్రియములు♦మహినెందైనన్.

తే. కనుక ధన్యాత్ములగుదురు♦గాదె వారు;
[4]ప్రియమువలన దుఃఖముగల్గ♦కయె సుఖంబు
గలుగు నప్రియవస్తువు♦వలన సుఖము
గలుగక భయంబుమాత్రమె ♦ కలుగుచుండు. ౭౯॥ 1107

క. [5]వానిని వదలినయాంఘున, మానులకు నమస్కరింతు ♦ మఱియూహింపన్
నేనోసుఖమునె గోరెడు, దానఁగనుక విదితమతిని ♦ దశరథసుతునిన్. ౮౦

తే. రాముวిడనాడి పాపైక♦రతిఁ జెలంగు
దనుజపతిచేతఁ జిక్కి నే♦మనను గాన

---

1 ఛద్మనాసాదితౌ వీరౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ-అని మూ. 2 సాహ మేవంగతే కాలే-అని మూ. 3 జితాత్మానో మహాభాగా యేషాం న స్తః ప్రియాప్రియే అని మూ. 4 ప్రియాన్నసంభవే ద్దుఃఖ మప్రియా దధికంభయమ్-అని మూ. 5 తాభ్యాం హి యే వియుజ్యంతే నమ స్తేషాం మహాత్మనామ్-అని మూ.

నిపుడె ప్రాణాళి విడిచెద • నిట మహాత్ము
రాముఁ బాసిన బ్రదు కేల•భూమిలోన. ౫౧ 1109

ఇరువదియాఱవ సర్గము సంపూర్ణము.

---

## ౨౭ - వ సర్గము.

త్రిజట తనస్వప్నవృత్తాంతము రాక్షసస్త్రీలకుఁ జెప్పుట.

క. ఘోరాకారలు దితిసుత, నారీమణు లానుహితనయ యిటు పలుకం
గా రావణునకు వేగమె, శ్రీరాముని భార్యచర్యఁ • జెప్పెదుపూన్కిన్. ౧

క. అరిగిరి కోపమునఁ గళే,బరములచే మఱచి రయము • వర్ధిల్లఁగ న
త్తరుణమునఁ గొంద;ఱంతటఁ,గరముభయంకరముగాఁగఁ•గనఁబడుతనుచుల్.

క. జనకసుతయొద్ద కల్లనఁ, జనుదెంచి కఠోరములయి • చాల నసత్యం
బును గల్గఁజేయఁజాలిన, మునుపటిపల్కులనె పల్క • మొదలిడిరి కడున్. ౨

క. [1]విను సీతా, నేఁ డిత్తఱి, ననార్యమగుపాపనిశ్చ•యంబు గలుగ ని
న్నునుబట్టి నీదుమాంసం,బును స్వేచ్ఛఁగ ననుభవింపఁ•బూనుదుమసుమీ. 3

క. దనుజాంగన లీరీతిఁగ, జనకసుతంగూర్చి పలుక • జడమతులగునా
దనుజాంగనలం గనరుచు, ననియెను శయనించియున్న•[2]యా త్రిజట తగన్.

సీ. జరచేతఁ గుందెడు•తరుణి యా త్రిజటయు దుష్టాత్మలార! యీ•తోయజాక్షి
జనకునిముద్దుల•తనయను దశరథుకోడలి సీతను • గూర్మివిడిచి
భక్షింపకుఁడు మిమ్మె•భక్షించుకొనుఁడు సీతకుమాఱుగాఁ; జెప్ప•దానవినుఁడు
దనుజాంతకంబు, నీ•వనితాపతికి విజయంబును సూచించు•నట్టిస్వప్న

ఆ. ము నిపుడేనుగంటి • ఘనభయసంబుగా
రోమహర్షణంబు•గా మదికిని
దోఁచె నద్ది; యనుచు • నాచాన చెప్పఁ గ్రో
ధమున నొడలెఱుఁగని•తరుణులెల్ల. ౬౪ 1115

చ. మనముల భీతినొంది యను•మానము నొందుచు నామెచెంతకుం
జని యిటుపల్కి రామెఁగని; • చానరో! యీనిశి నీవు గన్నయ
ద్దనుజవినాశకంబగుచు • దారుణమై తగునట్టిస్వప్నముం
గనికర మూని చెప్పుము త•గన్ వినఁగోరితిమమ్మ యంచనన్. ౭౪ 1116

---

1 అద్యేదానీం తవానార్యే సకే పాపవినిశ్చయే, రాక్షస్యో భక్షయిష్యంతి మాంస మేతద్యథాతథమ్-అనిమూలము. దీనికి మహేశ్వరతీర్థులుగారి విశేషార్థ మిందు వశివ్యక్తము. పాపవినిశ్చయంబుగలుగన్-అనఁగా ఆత్మహత్యాభిప్రాయము. కొందఱు పాపాంతకరముగల స్త్రీలు నీమాంసమును దినఁగోరుచున్నారని దీనిభావము. 2 త్రిజట విభీషణపుత్రికయని యెఱుంగవలెను.

క. విని తాఁ బ్రాతఃకాలం,బునఁ గన్న కలన్ వచింపఁ ♦ బూని యిటులు చె
ప్పెను వారిఁగాంచి త్రిజటయు;, జనకతనూజావిభుండు ♦ సంతసమలరన్. ౧౩

సీ. శుక్లమాల్యాంబర♦శోభితుండయి లక్ష్మణునితోడఁగూడి యే♦నుఁగులదంత
ములచేత రచితమై ♦ లలితమై తగుపల్లకిని వ్యోమసంచార♦మునఁ జెలంగి
హంససహస్రయు♦క్తాంగమై తగుదానిఁ దాను నధిష్ఠించి ♦ తరలివచ్చె;
జానకి శ్వేతవ♦స్త్రముఁ దాల్చి సాగరపరివృతంబగునొక్క♦పర్వతమ్ము
తే. నెక్కియున్నట్లు చూచితి ♦ నిపుడు కలను;
ఛాయ భాస్కరుఁగూడిన♦చందమునను
సీత శ్రీరామచంద్రునిఁ ♦ జేరియుండె;
రాముఁడా లక్ష్మణునిఁగూడి ♦ రంజిలుమది. ౧౪ 1118

క. దంతచతుష్టయవిలస,ద్దంతీంద్రము శైలనిభముఁ ♦ దానెక్కి తగన్
సంతసమున రాఁ జూచితిఁ, గాంతామణి సీతకడకుఁ ♦ గామినులారా. ౧౫

చ. పురుషవరేణ్యులిద్దఱును ♦ బొల్పగు తెల్లనిహారపంక్తి, నం
బరములఁ దాల్చి తేజములు ♦ భాసిలు సీతను జేరవచ్చి ర;
ట్లరుదగు [1]తన్నగాస్యమున ♦ నారఘుపుంగవుఁ డెక్కియున్నయం
బరగతదంతిస్కంధమున ♦ భామిని యీమెయు నెక్కఁ జెల్వుగన్. ౧౬

చ. [2]పెనిమిటియంకసీమపయిఁ ♦ బెంపలరారఁగనుండి సీత ప
ద్మనయన నిక్కి హస్తమునఁ ♦ దామరసాప్తునిఁ జంద్రుఁ దాఁకుచుం
డనియతిఁగంటి; నంత నర♦నాథకుమారులు వార లీవిశా
లనయనయుం జెలంగుకరి ♦ లంకపయిన్ దివినుండఁజూచితిన్. ౧౭ 1121

క. తెల్లనివృషభాష్టకమున, నుల్లసిలెడురథము నెక్కి ♦ యుర్వీసుతతో
నల్లన నిచటికి వచ్చెను;, సల్లలితాంగమున రామ♦చంద్రుం డంతన్. ౧౮

క. ఘనవీర్య మలరఁ దమ్ముఁడు, జనకజయుం గూడరాఁగ ♦ సరసిజమిత్రుం
డునుబోలెఁ దగినపుష్పక,మును దివ్యము నెక్కి తేజ♦ముల్ వెలయంగన్. ౧౯

తే. ఉత్తరపుదిక్కు గాఁబోయె; ♦ నిత్తెఱఁగున
విష్ణుసమశౌర్యుఁడై కాంతి♦వెలయురాము
నతనితమ్ముని రాముభా♦ర్యయగుసీతఁ
గంటిస్వప్నంబున నిట నో♦కాంతలార. ౨౦ 1124

క. సురపురమును బాపాత్ముల, కరణి మహాతేజుఁడైన♦త్మాపాలునిని
ర్జరులును రాక్షసు లనుచ లి,తరులు జయింపంగలేరు ♦ తథ్యముసుండీ. ౨౧

---

1 ౧౬-వ శ్లోకమున "తన్నగాస్యమున" అనుచో "స్య" అనునది గాయత్రియందుఁ బదు మూఁడవ యక్షరమని తెలియందగు. 2. చంద్రసూర్యౌ మయాదృష్టౌ పాణినా పరిమార్జతీ - అని మూలము.

మ. దనుజేంద్రుం డగురావణాసురుఁడు గా♦త్రంబందుఁ దైలాభిషే
చనమొప్పం గరవీరమాలికను జం♦చద్రక్తవాసస్సుఁ దా
ల్చి నితాంతంబును నూనెఁ బూసికొనుచున్ ♦ జిత్తంబు దూలంగ నా
నెను దాఁ ద్రాగుచు మత్తుఁడై తనరుచున్ ♦ నేలంబరుండంగ నేఁ
గనుఁగొంటిన్; భయదంబుగాఁ గలను నేఁ♦గంటింగదా యిత్తఱిన్. ౨౨

క. అసురారిపుష్పకవిమా,నమునుండి మహీతలంబు♦నం బడి యటకో
ర్షము జుట్టు లేకయే వ,స్త్రము నల్లనిదానిఁ గట్టి ♦ దా నొక స్త్రీచేన్. ౨౨½

తే. ఈడ్వఁబడుచుండఁగాఁ గల ♦ నేనుజూచి
తిని; మఱియు దానవేంద్రుఁడె♦జ్జనిసుమముల
హారములు దాల్చి తైలంబు ♦ నంతఁ ద్రాగు
చును హసించుచుఁ దగ నాడు♦చును గడంగి. ౨౩½ 1123

తే. భ్రాంతచిత్తాకులేంద్రియ♦పటలుఁడగుచు
ఖరసమాయుక్తరథమెక్కి ♦ కదలె; మఱియు
నతఁడు గాడిదనెక్కి యా♦మ్యదిశఁ గూర్చి
త్వరగఁ బోయెను రాక్షస♦తరుణులార. ౨౪½ 1129

క. దనుజేంద్రుఁడు సాధ్వసమునఁ, దనువును దామఱచి గాడి♦దను నెక్కియు నొ
య్యన దానినుండి శీర్షం,బును గ్రిందుగఁ బెట్టి వేగ ♦ భూమిం బడఁగన్.

క. కనుఁగొంటి; నంత వేగం,బున నాతఁడు లేచి భ్రాంతిఁ♦బొందుచుఁ బెనుభీ
తినిగని మదవిహ్వలుఁడై, కనుఁగొన నున్మత్తుఁబోలి ♦ కలవళపడుచున్. ౨౬

తే. వస్త్రమును గట్టుకొనక దు♦ర్వాక్యములను
బల్కుచును వేగ దుర్గంధ♦బహుళమధిక
దారుణము దుస్సహమ్మును ♦ ధ్వాంతమయము
నై నరమలపంకమును నిర♦యాభము దగ. ౨౭ 1132

క. పరికించి యందు మునిఁగెన్, గరము భయంకరముగాఁగఁ♦గనఁబడె వదియున్;
బరమారుణాంబరంబును, ధరించి పంకప్రలిప్త♦తను వమరంగన్. ౨౮ 1133

క. అతిభయదార్భటిగల్గిన, యతివయొకతె నీలదేహ ♦ మమరఁగ రక్షః
పతిమెడకుఁ ద్రాడుతగిలిచి, యతిజవమున నీడ్చుచుండె ♦ యామ్యదిశకుఁ గాన్.

క. మనకుంభకర్ణుఁ డట్టులె, కనఁబడఁగాఁ గంటిని; దశ♦కంఠునినుతు లె
ల్లను దైలలిప్తతనువులఁ, గనఁబడి రీస్వప్నమందుఁ ♦ గామినులారా. ౨౯½

సీ. రావణాసురుఁడు వ♦రాహంబుపై నింద్రజిత్తు నక్రంబుపై ♦ నత్తెఱఁగునఁ
గుంభకర్ణుండును ♦ గొండపోలిక నున్నయుష్ట్రింబుపై నెక్కి ♦ యురుజవమున
యామ్యదిక్కునుగూర్చి♦యరిగి రీముువ్వురు; నంతనంబున విభీ♦షణుఁడుమాత్ర
మతులసితచ్ఛత్ర ♦ మలరంగ, శుక్లమాల్యాంబరంబులఁ దాల్చి ♦ యక్లిశుక్ల

తే. గంధమును బూసికొని సుశోం♦ఖరవములును
భూరిదుందుభినాదముల్ ♦ బోరుకొనఁగ
నృత్తగీతంబులొప్పంగ ♦ నింగిఁ బొలిచి
తాను వల్వురమంత్రులు ♦ తమి చెలంగ. 33 1136

చ. ద్విరదము నెక్కఁగాంచితిని ♦ దివ్యగజం బది నాల్గుదంతముల్
వరఁగ మహీధరంబువలె ♦ భాసిలుచున్, ఘనగర్జితోపమ
స్వరమున నొప్పియుండెఁ నటఁ ♦ జానతరానవమట్ట గ్రోలుచున్
నిరుపమరక్తమాల్యముల ♦ నెమ్మి ధరించి చెలంగువేడుకన్. 3౪ 1137

తే. అరుణవస్త్రంబులంగట్టి ♦ పరమగీత,ములును వాదిత్రనిస్వనం♦బులును దనర
గుంపులుగఁగూడి యున్ననీ♦లింపవైరు,లను దగం జూచితిని మతీ♦వనితలార.

క. సురుచిరమగుపురమిది గో,పురతోరణవితతి గూలఁ ♦ బొలుపగురథకుం
జరవాజియుక్తముగ సా,గరమునఁ బడిపోవ నేను ♦ గంటినిజుండీ. 3౫ 1139

క. దనుజేంద్రసురక్షితమై, తనరెడులంకాపురంబు ♦ తద్దయుశౌర్యం
బుననొప్పి రాముసూతియుఁ,గ నెగడుకపిచేతఁ గాల్పఁ♦గాఁ బొడఁగంటిన్.

తే. దనుజకాంతలు తైలంబుఁ ♦ ద్రావి యట్టె
యాడుచున్ నవ్వుచున్ గొప్ప♦యఱపులు దగ
భస్మపూతముగాఁ గనఁ♦బడెడులంక
యందుఁ జొరఁబడఁగాఁగంటి ♦ నమ్మలార. 3౬ 1141

తే. కుంభకర్ణాదిరాక్షస♦కుంజరు, లరు
ణాంబరంబులు ధరియించి ♦ యట్టిగోమ
యహ్రదంబునఁ బడిపోయి; ♦ రతివలార
చనుఁడు మీరెల్లఁ బోనిచోఁ ♦ జత్తురింక. 3౭ 1142

క. ఈరమణిని వే పొందును, శ్రీరాముఁడు రోష మడరఁ ♦ జెచ్చెఱ నీర
క్షోరాజితోడ మిమ్మున్, ధారుణిఁ బడఁగూల్చు నిద్ది ♦ తప్పదుసుండీ. 3౭

క. వనవాసము చేయంగాఁ, దనువెనుకొనివచ్చినట్టి♦దానిని బ్రియురా
లిని మన్ననచేఁ దగుభా,ర్యనుదిట్టిన భీతినొందు ♦ నటుచేసినను. ౪౦ 1144

శా. తానేమాత్రము నోర్చియుండఁ డీఁకమీఁదఁ♦దంజాలు దుర్వాక్యసం
తానంబుం బలుకంగ, సాంత్వనముల్ ♦ నారీమనంబొప్పున
ట్లోనారీమణులార, పల్కుఁ డభయం♦బోయమ్మ! యీవమ్మ మ
మ్మే నిత్యంబును బ్రోవవమ్మ యని యీ♦యింతిం దగన్ వేఁడనో. ౪౧ 1145

తే. ఇట్లుచేయుట నాకిప్పు ♦ డిష్టముగను
దోఁచుచున్నది; యెవతెయే♦దుఃఖమొంది

యుండుతఱి నిట్టిస్వప్నంబు ♦ నొందు నేని
దుఃఖములనెల్ల వీడి పొం♦దు ఘనముదము. ౪౩ 1146

క. జనకసుత దుఃఖమగ్నమె, కనుక నె యీలాటిమంచి♦కలచే మోదం
బును గాంచఁగలరు; మనమీ, వనితను దిట్టితి మటంచు ♦ వలదు భయపడన్.

ఆ. ఊరకుండరాదు ♦ మీరీమెఁదిట్టినఁ, బ్రార్థనంబు సలుప♦వచ్చు నట్లె
వేఁడుకొన్నఁడు రామ♦విభునిచే ఘోరభ,యంబు గలుగనున్న ♦ దసురతతికి.

క. దనుజాంగనలారా! యీ, జనకజ మీ రెల్లమ్రొక్కి ♦ సరగునఁ బ్రార్థిం
చిన సుప్రసన్నురాలగుఁ, గనుకన్ బతివలన భయము ♦ గలుగకయుండన్.

తే. మిమ్ము నెల్లను గావ నీ♦మె యొసమర్థ,రాలు; సువిశాలనేత్ర యీ♦బాలయందు
నీమెయంగములందు నే♦మేని దుఃఖ, కరములగులక్షణంబులు♦గాని మఱియు.

తే. సుంతయేని విరూపంబుఁ ♦ జూడఁజాల
కున్నదాన; దుఃఖంబుల ♦ నొందఁదగక
దివ్యభోగార్హ యైనయీ♦దేవిమేని
[1]కాంతి సుంతయె మాయుట ♦ కారణముగ. ౪౮ 1151

క. కలిగెను నష్టము లీమెకుఁ, దలఁచెద నేనిట్టులనుచు; ♦ దానవపతి వే
కలనం దెగుటయు విజయం, బి లేశుఁడగు రామమూర్తి ♦ కిటఁ గల్గుటయున్.

క. అనునీసీత యభీష్టము, తనరారెడు వేగ యనుచుఁ ♦ దలఁచెద; దనుజాం
గనలార! స్వప్నమిది యీ, వనితామణి గొప్పప్రియము♦వార్తవినంగన్. ౪౯

తే. కారణంబుగ నున్నది; ♦ కంజపత్ర
మువలె నాయతమైనయీ♦ముద్దరాలి
సవ్యమగునేత్ర మదరుట ♦ చక్కఁగ నిటఁ
గానఁబడుచున్నదిపుడు నా♦కనుల కహహ. ౫౦ 1154

సీ. చతురురాలైనయీ♦సాధ్వీలలామదౌ వామభుజంబు శు♦భస్కురముగ
నించుకగాఁ బుల♦కించుచుఁ దనయంతఁ గంపించుచున్నది; ♦ కరిణిహస్త
సమమయి, యత్యుత్త♦మమగు నీసవ్యోరువట్లె వడంకుచు ♦ నెట్టయెదుట
వచ్చియున్నాఁడు భూ♦వరమౌళి రాఘవుం డనుచు సూచించెడు;♦వనితలార
[2]పింగళపక్షియుఁ ♦ బృథుతరతరుశాఖపయిని గూర్చుండి య♦పారమైన

తే. హర్షమున మాటిమాటికి ♦ నతిమధురము
గాఁగ సాంత్వననినదంబు ♦ గలుగ మంచి

---

1 ఛాయావైగుణ్యమాత్రం తు శంకే దుఃఖ ముపస్థితమ్-అనిమూ. 2 పక్షీచ శాఖానిలయః ప్రహృష్టః పునఃపున శ్చోత్తమసాంత్వవాదీ-అనిమూ. దీనికి గోవిందరాజులు పక్షిశబ్దము వాధారముచేసి చమత్కారముగా వర్ణముస వ్రాసిరి. ఆశబ్దమూలే యిందుదాహరించుట వాభావము గోచరమగునని తెలియందగు తనిశ్లోకిప్రపత్తిమార్గ మిది బోధించునని తాత్పర్యము వ్రాసినది.

బంధువునిరాకఁ దెల్పుచుఁ ♦ బరమహర్ష
మలర మఱిమఱి తెల్పున ♦ ట్లమరె ననియె. ౫౧ 1155

ఇరువదియేడవ సర్గము సంపూర్ణము.

---

## ౨౮ - వ సర్గము.

సీత మిక్కిలి చింతించుట, శుభనిమిత్తములు తోఁచుట.

క. దనుజేంద్రుఁడు రావణుఁడిటు, తనుఁగూర్చి వచించిన యహి♦తపుఁబల్కుల నె
ల్లను విని యాజానకి నె, మ్మనమున దుఃఖార్తి యశర ♦ మఱియు వగచుచుఁ౯.

ఆ. అడవినడుమఁ జిక్కి ♦ నట్టిచక్కనియాఁడు
గజముఁబోలి భయముఁ ♦ గాంచె మిగుల;
భీరువగుచు దనుజ ♦ నారులనడుమను
జిక్కి దనుజవిభుని ♦ చేతనట్లు. ౧ 1157

క. పరుషోక్తులు పలుకంబడి, నరహీనారణ్యసీమ ♦ నడుమవిడువ నా
తురపడుబాలికవలె నా, తరుణీమణి యేడ్చె నంతఁ ♦ దా నిట్లనియె౯. ౨

క. వను బెదరించుచునున్నను, బనివడి నేఁ బ్రాణములను ♦ వదలక పుణ్యం
బును లేనిదాననై క్షణ,మును బ్రదికియె యున్నదాన ♦ ముసుకొనువగల౯.

[1]చ. కనుక నకాలమృత్యువులు ♦ గల్గవటంచు జగంబునందు స
జ్జనులు వచించువాక్య మిది ♦ సత్యమెయయ్యెఁ గటా!; సుఖంబునే
గనని మదీయచిత్తమిది ♦ గాఢనిరంతరదుఃఖపూర్ణము
య్యును గులిశప్రహారమున ♦ నొయ్యనఁ గూలుమహీధరంబుచా
డ్పున నొకవేయిగాఁ బగిలి ♦ పోవక యున్నది దేమి హేతువో. ౪ 1160

ఆ. కనుక నిద్ధిస్థిరమె ♦ కావచ్చు నిజముగ;, నప్రియముగఁ గనఁగ ♦ నైనదనుజుఁ
డెట్టులైననన్ను ♦ మృత్యువునొందించు, నతనిచేతఁ జచ్చు ♦ నంతకంటె ౫

క. నేనై చచ్చుటమేలగుఁ, గానను దోషంబు దీనఁ ♦ గడఁగి యెటులనో
యైనను దేహమువదలక, దానవునే వలచియైనఁ ♦ దనువు నిలుపనా. ౬ 1162

క. [2]అనియన్న, వేదమంత్రం,బును శూద్రున కీయఁదగని ♦ పోలిక భావం
బును దీని రాముసొత్తును, దనుజున కీయంగఁజాలఁ ♦ దగఁ గుత్సితనై ౭

చ. ధరణివిభుండు రామవిభు ♦ తల్లజుఁ డిచ్చటి కార్తిఁ బాపఁగాఁ
ద్వరపడి రాకయున్నసుర ♦ వైరి యపూజ్యుఁడు తీక్ష్ణశస్త్రవి
స్ఫురదురుధారలం గలిసి ♦ శోణిఁబడంగ మదంగరాజి నా

---

[1] నాకాలమృత్యుర్భవతీతి సంతః-ఆవిమూ. [2] ద్విజో మంత్రమివాద్విజాయ-ఆవిమూ.

తురపడి త్రుంచు [1]గర్భమునఁ ♦ దోఁచెడునర్భకు శస్త్రధారివె
జ్జ రయమునఁ మీఱఁగా నడిఁకి ♦ క్షోణిఁ బడంగను జేయులాగునన్. ౬ 1164

సీ. చిరకాలదుఃఖంబుఁ ♦ జెందిననాకింక వధమున కవధిగా ♦ వైరియిడిన
మాసద్వయంబు నే♦ఁట్లో సెల్ల నంతటఁ గలుగనున్నట్టిదుః♦ఖంబు రాజు
నెడ తప్పుచేసి య♦ప్పుడె బద్ధుఁడై నిశాంతమునఁ జంపఁగనున్న ♦తస్కరునకుఁ
గల్గుదుఃఖమువలెఁ ♦ గల్గునుగద కటా!; హా రామ, హా సుమి♦త్రాత్మజాత
హా సుమిత్రా! నన్ను ♦ నాదృతిఁ గన్నట్టిజననీ! రఘూత్తము♦జనని, యల్ప
తే. భాగ్యవతినైననేను న♦పారజలధి
నోరగాలికిఁ జిక్కిన♦యోడవలెనె
యిచట శ్రమమొందుచున్నాను ♦ హీనజనన
మావృత నగుచు దిక్కులే♦నట్టు లకట. ౭ 1165

తే. వృషభసింహద్వయంబును ♦ భీమకులిశ
పాతమున నంతమొందెడు♦రీతి మృగస
మాకృతిం గన్నమారీచుఁ ♦ డనెడుసత్త్వ
మునను నాహేతువున రాజ♦ముఖ్యు లచట. ౮ 1166

క. బలవంతులయ్యు రఘువర్యులు హింసితులయియుందు♦రొగి నిజమిది; యి
మ్ములమృగరూపముఁ దాల్చిన, విలయకరుండే సుఘోర♦విపులాటవిలోన్.

ఆ. అల్పభాగ్యయుక్త ♦ నగునాకు నాసను, గలుగఁజేసియుండుఁ ♦ గాన మూఢ
నగుచు నేను విభుని ♦ నారాము లక్ష్మణు, నచటి కేగుమంటి ♦ నరయలేక.

సీ. సత్యవ్రతా! దీర్ఘ♦చారుబాహూ! విభూ! సంపూర్ణశీతాంశు♦సమముఖా! స
మస్తజీవప్రియా♦మాన్యసుహితకరా రాఘవా! నేనిప్డు ♦ రాక్షసులకుఁ
జిక్కి మృత్యువు నోటఁ ♦ జేరనుండుట యెఱుంగవుగదా; ప్రాణేశ♦కంటెవన్య
దైవము నెఱుఁగని♦దాన, నెవ్వరదేమియన్న నోర్చితి నీదు♦నాదరంబు
తే. గనుదుఁగాక యనుచు ♦ క్షమశయ్యఁ జేసితి, దనుజుఁ జంపఁజాలి♦నను స్వధర్మ
మిద్ది యనుచు నూఱ♦కేయుంటి సాధ్విని, నీగుణంబు లన్ని ♦ యిపుడు నాకు.

క. కృతమెఱుఁగనివానికి నుపకృతిఁ జేసినయట్లు వ్యర్థ♦మేయయ్యెఁగదా;
హితమతి నింతటిదనుకం, బతివగునినుఁ గనమిఁ జిక్కి ♦ వర్ణముమూలన్.

క. నినుఁబాసి మరల నీపాంసుదను గాంచెదవన్నయాశ ♦ తొలఁగ నిచట ది
క్కును గానకున్నదానను, గనుక మదాచరితధర్మ♦కార్య మఫలమే. ౧౩

క. నాయీపాతివ్రత్యం, బీయెడలఁ దలంప వ్యర్థ♦మే; రామా నీ

---

1 గర్భస్థజంతోరివ శల్యకృంతః-అనియూ. శల్యకృంతో నాపితఇవ-అనివ్యాఖ్య. నాపితుఁడన మంగలి. శిశువు వెలుపలికి రాకమునుపే మృతుండు కాఁగా మంగలి కత్తిచే ఛేదించినట్లనియావము. ఇట శస్త్రధారి వెజ్జ అని తెనిఁగింపఁబడినది.

వోయలజనకునియాజ్ఞను, బాయక నియమమునఁ దీర్చి ♦ వ్రతమును సరిగన్.

ఆ. *ఆచరించి పిదప ♦ నటవినుండి యయోధ్య
కరిగి యర్థసిద్ధి ♦ యలర వీత
భయుఁడవగుచు విపుల ♦ వామనేత్రంబులఁ
గ్రాలుపూవుఁబోండ్లఁ ♦ గలిసి స్వేచ్ఛ. ౧౪ 1173

క. అలరుచుఁ గ్రీడలఁ దేలం, గలవని నేఁ దలఁచుదాన; ♦ త్క్షాపాలమణీ
తులలేనిప్రీతి నీపైఁ, గలదాననుగాఁ జెలంగి ♦ కడునార్తిమెయిన్. ౧౫

క. అంతము నొందుటకే నా, స్వాంతము నీయందు నిలిపి ♦ సద్వ్రతముల నే
నెంతయు వ్యర్థముగా నిటు, చింతిలుచున్ సలిపి తుదకు ♦ జీవిత మిచటన్.

ఆ. భాగ్యహీననగుచు ♦ వదలెద నిస్సిరో;, యట్టినేను విషము♦నైనఁ దినుచు
గాని తీవ్రశస్త్ర♦కఠినధారనుగాని, ప్రాణములను వదల♦వలయు నన్న. ౧౬

క. ఈరాక్షసుగృహమున నా, కేరీతివిషంబుఁగాని ♦ యేశస్త్రము నేఁ
గోరినదానినిగానీ, యేరాక్షసుఁ డిచ్చునెనని ♦ నిట వేఁడ నగున్. ౧౭ 1177

చ. అనియిటు లామహీతనయ ♦ యార్తిమెయిన్ విలపించె నెన్నియో
మనమున నూహలొప్ప రఘు♦మాన్యునినే తలపోయుచున్ భయం
బునఁ బరికంపితాంగియయి ♦ మోము విశుష్కముగాఁగ నింపుగాఁ
దనరెడునయ్యశోకము ని♦తాంతసుమావృతమున్ జవంబునన్. ౧౮ 1178

ఆ. చేరి యంత సీత ♦ భూరిశోకంబునఁ, బొగులుచును దలంపు ♦ లగణితముగఁ
గదుర జడను మెడకు ♦ గట్టిగా బంధించి, దీనఁ బ్రాణవితతి ♦ నేను బాసి.

క. అరిగెద యమలోకమునకుఁ, ద్వరగా ననితలఁచె; మార్ద♦వంబున నంగో
త్కరమొప్ప వెలయునాసుం,దరి మరణమునొందఁబూన్కి ♦దగ నచ్చోటన్.

ఆ. అయ్యశోకశాఖ ♦ నంది నిలువఁబడి
యుండె; నపుడు రాము♦నొగి సుమిత్ర
తనయుఁ దలఁచుకొనుచుఁ ♦ దనపవిత్రకులంబు
నెన్నుకొనుచు నట్టు ♦ లున్నసతికి. ౧౯ 1181

తే. విమలశుభగాత్రి కంతట ♦ విపులమంగ
ళాభిసూచనములు ధైర్య♦మలరఁజేయు

* స్త్రీభిస్త్వమన్యే విపులేక్షణాభి స్త్వం రంస్యసే వీతభయః కృతార్థః-అనిమూ. మరలఁ బెక్కుమందిని రాముఁడు వివాహము చేసికొనఁగలఁడనియుఁ, దనకిటఁ జావు కలుగుననియు సీతభావమని గోవిందరాజులతాత్పర్యమని గ్రహింపవలయు. ఇట్లు చెప్పుచు సీతదుఃఖించుట మానవస్త్రీస్వభావమును దెలుపుటకేకాని వేఱుగాదని తీర్థులభావ మనుట యిట సారము.

సవియుఁ బ్రఖ్యాతి నందిన♦యవియు ఫలద
ములును సగుణలక్షణంబులు ♦ చెలఁగె మదిని. ౩౦ 1182

ఇరువదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

౨౯ - వ సర్గము.

సీతకు శుభశకునములు తోఁచుట.

సీ. *ఇట్లు చింతలఁగుంది♦యెంతయుఁ బొగులుచు,నియమవ్రతంబుల♦నిలిచియుంట
నే నిందఁబొందక ♦ యొనఁగుచు, విగతహర్షంబున నున్నట్టి♦జాడఁ గావఁ
బడుచు, సంతతమును ♦ బరిదీనచిత్తయై వర్తించుచున్నయా♦వారిజాక్షి
సంపదగలయట్టి♦జను నుపజీవిను లాశ్రయించెడురీతి ♦ నమలమంగ
ఆ. ళాభిసూచకమ్ము ♦ లగుశకునంబులు, పొందె; శుభముగాఁగఁ ♦ బొలిచి, కుటిల
పక్ష్మకేశరాజి ♦ పరఁగంగఁ గృష్ణవి,శాలశుక్లమగుచు ♦ సరసమగుచు. ౧౹

క. కనఁబడుతరుణీవామన,యన మప్పుడు మీనచలిత ♦ మగుపద్మమురీ
తిని దామ్రమగుచు నదరెను;, గనసుందరమగుచు బలమ♦గ్రాలఁగఁ బెడఁగై.

ఆ. వృత్తమగుచు వెలసి ♦ విమలకృష్ణాగరు, చందనార్ద్రమగుచు ♦ సరసరామ
చారుహస్తయుగళ♦సంశ్లేషణమ్ముల, వఱలుచున్నసీత ♦ వామభుజము. ౨౹

క. అదురుగ వడఁకెను; సితరే,తరమును జక్కంగ నమరి ♦ తగునూరువులన్
గరివరకరసామ్యంబై, పరఁగెడువామోరు వట్టె ♦ వడఁకుచు నచటన్. ౩౹

క. మునుముందె రాముఁ డున్నాఁ, డని తెలుపంజొచ్చె; నంత♦నమలనయనముల్
తనరారి శిఖరములవలెఁ, గనఁబడు పలువరున వెలయఁ♦గాఁ దను వమరన్.

క. పరఁగెడుభూపుత్రికళే,బరమున శుభరీతి నొప్పి ♦ బంగరుచాయన్
సురుచిరమై సుంతరజః, పరిమిళితంబైన వలువ ♦ భావుక మలరన్. ౫౹ 1188

ఆ. ఇంచుకంతజాఱె; ♦ నిట్టులానుభావు
ఫలము నీయఁజాలి ♦ పరఁగునీశు
భకరశకునములను ♦ బహుశాన్యశకునంబు
లను దగంగఁ గాంచి ♦ మనమునందు, ౫౹ 1189

క. తనప్రియుఁడు వచ్చుననువా,ర్తను విన నొవంచు బోధి♦తయగుచుఁ జెనుగా
లిని నెండను దగ శుష్కిం,చినయంకుర మట్టె వాన♦చినుకులు వడఁగన్. ౬

ఆ. పైకి లేచినట్లు ♦ పరమహర్షమునొందెఁ;, బక్వబింబఫలము♦వలెఁ జెలంగు

---

* ఈసర్గాదియందున్న "తథాగతామ్" అనుశ్లోకమునకు గోవిందరాజులు "సర్వం యథావ త్సాక్షాత్కృతవతో మునేరపి' ఇత్యాదివ్యాఖ్యవ్రాయుచు సీతయందు మహిమ నారోపించి మహే శ్వరతీర్థులవారిభావమును బలపఱచిరి.

నధర మొప్పసుంద♦రాకులు చెలువారఁ, గనుబొమలును వెలయఁ♦గాఁ గన నయి,
ఆ. ముంగురులు చెలంగ ♦ ముద్దుగా ఱెప్పలు, వెలయ శుక్లదంత♦వితతి దనర
నలరుసీతవక్త్ర ♦ మారాహువక్త్రసు, ధాంశుబింబమట్లు ♦ లమరెఁ గాంతి. ౭
చ. ఘనతరశోకముఁ వదలి ♦ కామిని యాత్రము మాని హర్షముం
గని చెలువారుమోమున ని♦కామము శుక్లగతత్రియామ చం
ద్రుని పెనుగాంతి రాజిలెడు♦ధోరణి మించును నుండె *నీనిమి
త్తనిచయమే శుభంబొనఁగుఁ ♦ దప్పకయంచును నిశ్చితాత్మయై. ౮ 1193

ఇరువదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౩౦ - వ సర్గము.

హనుమంతుఁడు మొదట రాముని గీర్తింప నిశ్చయించుకొనుట.

క. అనిహతవిక్రముఁ డగు నా, హనుమంతుఁడు జనకతనయ ♦ దావృత్తాంతం
బును ద్రిజటస్వప్నవార్తను, దనుజాంగన లెల్లఁ జేయు♦తర్జనములనుఁ. ౧
చ. వినియె సమస్తముఁ; మఱియు ♦ వేడుక నందనమందునున్న యా
యనిమిమసాధ్విఁ బోలెఁ జెలు♦వందుచు నున్నమహీకుమారికఁ
గనుచు మనంబునం గరుణ♦గ్రాలఁగ నివ్విధిఁ బెక్కురీతులఁ
వనట మునుఁగుచుం దలఁచె; ♦ వానరులెల్లను బెక్కువేలుగఁ. ౨౹౪ 1195
క. అయుతంబులుగాఁ జేరుచు, నియమంబున నెల్లదిశల ♦ నెలఁత నెవతుకఁ
గయికొని పూనిక వెదకెద, రొ యలమహీజాతఁ గంటి ♦ నుర్విని నిచటఁ. ౩
చ అతిశయమా సమాహితము ♦ నంది యమిత్రులశక్తి నెన్నియే
గతులను నన్నునన్య లెఱుఁ♦గం దగనట్టులు గూఢచారినై
క్షితిఁగల పెక్కుతావులను ♦ జేరి కనుంగొనుచుఁ సురారియు
ద్ధతిమెయి నేలు నిప్పురముఁ ♦ దద్దయు వేడుకమీఱఁ జూచితిఁ. ౪ 1197
క. దనుజులవిశేషమును నీ, యనుపమపత్తనమురీతి ♦ నసురేంద్రునిదా
ఘనమైన సుప్రభావం, బును దెలిసినవాఁడనైతిఁ ♦బో యిప్పటికిఁ. ౫ 1198
తే. అప్రమేయప్రభావుఁడై ♦ యఖిలజంతు
వులను గరుణను గాంచుచు ♦ నలరు రాము
పత్నిఁ బతిదర్శనేచ్ఛ నీ♦పడఁతి రాము
వార్త నెఱిఁగించి యూఱడిం♦పఁదగు నాకు. ౬ 1199
సీ. దుఃఖమే యెఱుఁగని♦తోయరుహాక్షిని, మితిలేనిదుఃఖ మీ♦గతిని నిప్పు
డనుభవించుచు దీని♦కంతమే లేదని వగచుచుఁ బూర్ణచం♦ద్రుగతి మోము

* ఈచతుర్థపాదార్థము ప్రాతీతికార్థము నుద్బోధింపఁగానఁ జేర్పఁబడినది.

భాసిల్ల నలరునీ♦పరమసాధ్వి నూఱడిలఁ జేయువాఁడ; నీ♦యిలను శోక
హతచిత్తయైన యీ♦యనఘచారిత్ర నూఱడిల్లఁగఁ జేయ ♦ కురుతరగతి
తే. రామునొద్దకుఁ బోదు నే ♦ నీమెయిఁ జను
టరయఁగా దోషమేయగుఁ; ♦ గరుణ నూఱ
డిలఁగఁ జేయకపోయిన ♦ నలఘుకీర్తి
మంతురాలగునీసాధ్వి ♦ యెంతొ వనట ౯½ 1200

క. తనుఁ గాచుదిక్కు లేమిని, మనమునఁ గలపోసి మేను ♦ మఱచి యసువులన్
దనపూన్కి వదలుఁ; బూర్ణేందునిభానన సుందరఁ గన్నుఁ♦బోయి వెలయఁగన్.

క. కరములు దీర్ఘములై తగ, నిరుపమబలములర నొప్పు♦నృపమణిఁ దనవా
తరుణిం గన లాలసుఁడౌ, పరమాత్ముని నూఱడిల్లు♦భంగి నొనరుతున్. ౧౦

తే. ఇట్లుచేయుట న్యాయమా ♦ నెన్నిచూడ;
రాక్షసస్త్రీలయెదుట నీ♦రామతోడ
మాటలాడుట కార్యమే♦మాడ్కిఁ గాదు,
కార్య మెవ్విధి నొనరుపఁ♦గాఁ దగునొకో. ౧౦½ 1203

క. ఈకష్టమునం జిక్కితి;, నీకడమ త్రియామయందె ♦ యీభూజాతన్
వే కాంచి యూఱడింపక, యీకరణిని నుందునేని ♦ యీమె మృతిఁగనున్.

క. [1]లేదిందుల కనుమానం, బేదైనను; సీతతోడ ♦ నిప్పుడు పలుకం
గాఁ దగదనిపోయినచో, నాదయిత వచించెనేమి ♦ ననుఁగూర్చి తమిన్. ౧౨½

క. అనిరాముం డడిగిన నే,మనియుత్తర మొసఁగువాఁడ; ♦ నతివేగమ నేఁ
జని రాముఁ గాంచి సీతను, గనినాఁడంగాని పలుకఁ♦గా లే దచటన్. ౧౩½

తే. ఆమెయేమియుఁ జెప్పలే ♦ దని వచింతు
నేని కఠినంపుఁజూపులఁ ♦ బూని క్రుధను
నన్నుఁ గాల్చిననుం గాల్చు ♦ మిన్నకుండఁ
డారఘూత్తముఁ; డేనిట్టు ♦ లరిగి వేగ. ౧౪½ 1207

క. మనుజాధిపుకొఱకై నే, వనచరనాథుఁబురికొల్పి ♦ బలములతోఁ దె
చ్చి నను వ్యర్థమెయగు నీ, వనజాక్షియు నంతదనుక ♦ బ్రదుకదు కావున్.

ఆ. అట్టులౌట నిందె ♦ యెట్టులో నేనుండి
కాచుచున్నదనుజ♦కాంతలందు
నంతరంబుఁ గాంచి ♦ యతితాపమునఁ గుందు
సీత నూఱడిలఁగఁ ♦ జేయువాఁడ. ౧౬ 1209

[2]సీ. అతిసూక్ష్మతనుఁడను ♦ నందు విశేషించి వనచరుఁడను, గాన ♦ వనితలెవరు
ననుఁగానఁజాలరు ♦ కనుక మనుష్యులు పలుకునట్లుగ నిత♦ములకుఁ దెలియ

---

1 సర్వథా నాస్తి సందేహః-అనుమానము. 2 వాచం చోదాహరిష్యామి మానుషీ మిహ
సంస్కృతామ్. యదివాచం ప్రదాస్యామి ద్విజాతిరివ సంస్కృతామ్, రావణం మన్యమానా మాం

వట్లు సంస్కృతభాష ♦ నావృతిగ్రహియించిపలికెద; మఱియు నే♦బ్రాహ్మణువలె
సంస్కృతభాషతో ♦ సంభాషణముచేయు ననుఁగని సీత యీ♦వనచరంబు

ఆ. పలుకఁజాల దిట్లు ♦ పరిపరివిధముల
దనుజవరుఁడె పల్కు♦నని భ్రమించి
భయము నొందుఁగాన ♦ వలనుమీఱ మనుష్య
భాష నాశ్రయించి ♦ పలుకఁదగును. ౧౯ 1210

క. వనజాక్షికిఁ బరిచితమగు, మనుష్యభాషనె వచింతు ♦ మహితార్థమునం
దును గల్గునట్లు, సంస్కృత,మునఁ బల్కఁగరాదు కార్య♦ముం జెడుఁదానన్.

ఆ. అట్లుగాక యింక ♦ నెట్లైన నీసాధ్వి
నూఱడింపరాక ♦ యుండు; నేను
వనచరుండ నగుట ♦ మనుజోక్తిఁ బల్కుటఁ
గాంచి యామె మనసు ♦ కలఁకఁబాఱ. ౨౦ 1212

క. మును రాక్షసవేషంబులఁ, గని భయపడియుంట నన్నుఁ ♦ గని మిగులన్ భీ
తినిగాంచు; నంతఁ బొడవగు, కనుబలరెడు నీసుసాధ్వి ♦ కడు వేగమునన్. ౨౧

చ. దనుజునిఁ గామరూపునిగఁ ♦ దానె యెఱుంగునుగాన నన్నిటం
గని భయమంది శబ్దమును ♦ గట్టిగఁజేయును; దానఁ దోడనే
*దనుజులతాంగులెల్ల వివి♦ధస్ఫుటశస్త్రములూని భీతినిం
గనునటు మృత్యువట్లు ననుఁ ♦ గ్రన్ననఁ జంపఁగ వత్తు రొక్కటన్. ౨౨

తే. వికృతముఖు లనఁదగినయీ♦వెలఁదులెల్లఁ
జేరి ననుఁ జుట్టుకొని తమ♦చేతనైన
వట్టు చంపుటకుంగాని ♦ పట్టుకొనఁగఁ
గాని యత్నముచేయుదు ♦ రూని పూన్కి. ౨౩ 1215

సీ. శాఖశాఖల, నల్ప♦శాఖల, నుత్తమభూరుహస్కంధాళిఁ ♦ బూని నేను
నలుదిక్కులను జవ ♦ మలరఁగాఁ బరుగెత్తఁ గని భీతిఁ జంకుదు; ♦ రనిహతగతి
నివ్వనంబునఁ జరి♦యించునారూపంబుఁ గని వికృతాస్యలా♦వనితలెల్ల
భయమున శంకించి♦పరుగెత్తుదురు; మఱిదనుజాంగనలు రావ♦ణునిగృహమునఁ

ఆ. దన్నియుక్తులైన ♦ దనుజులఁ బిలుతురు;
శక్తిశూలముఖ్య♦సాధనములఁ
గరములందుఁ బూని ♦ క్రవ్యాదు లరుదెంచు
వారు చూచువారు ♦ భయము నొంద. ౨౪ 1216

---

సీతా భీతా భవిష్యతి-అనిమూలము. నిశ్చయము చేయుటకై యిట్లు పరిపరివిధములఁ దలపోయుచు న్నాఁడనుట యిటఁగల సారము. * రాక్షసీగణః, నానాప్రహరణో ఘోరః స్సమేయాదంతకోపమః-అనిమూలము.

క. ఉరవడి నరుదెంచుచు సం,గరమునకుం బిలుతురు నను; ♦ క్రవ్యాదులు నన్
బరికించి చుట్టుముట్టుచు, నరుగఁగ నీకుండ బలిమి ♦ నడ్డపడంగన్. ౨౭ 1217

ఉ. వారిబలంబులన్ నఱికి ♦ పౌరుషమూని శ్రమంబుచెంది యు
వ్వారిని మీఱి భూరితర♦వారిధి దాఁటి పరాబ్ధితీరమున్
జేరఁగఁజాలఁ; జెక్కు రతి♦శీఘ్రముగాఁ బనిచేయుదానవుల్
వారిధి నభ్రమార్గమునఁ ♦ బాఱుచు దాఁటెడునప్డు నన్నొగిన్. ౨౮ 1218

ఆ. అంబరమున కెగిరి ♦ యట్టె ననుం బట్టు,గొనుదు, రవుడు జనక♦తనయ కచటి
రామువార్త తెలియ ♦ రాకుండు నేవీరి,చేతఁ జిక్కుపడుదుఁ ♦ జేయ వేమి.

సీ. హింసాభిరుచిగల ♦ యీరాక్షసులు జనకాత్మజ నొకవేళ ♦ నంతమొందఁ
జేసినఁ జేయుదు, ♦ రీసరణినిజూడ రామసుగ్రీవకా♦ర్యంబుచెడును;
బరులకుఁ దెలియని♦పద్ధతి గల్గి, రక్షఃపరివారిత♦త్వాతలంబు
నయి యభివేష్టితం♦బై యెఱుంగఁగరాకయున్నయీస్థలమున ♦ నుర్వీతనయ

తే. యున్న; దని నేను జచ్చిన ♦ నొక్కవేళఁ
బట్టుపడినను శ్రీరామ♦భద్రునకు స
హాయుఁడై *కార్యసాధన♦మందు శక్తి
గలుగువాఁ డెవ్వఁడైన నొ♦క్కండు లేఁడు. ౩౨౪ 1220

చ. అనిమొన నిందు నే మరణ♦మందఁగ నీశతయోజనాయతా
బ్ధిని నెగురంగఁజాలినపవి♦త్రవనేచరుఁ డొక్కఁడేని నా
మనమున నెన్న లేఁడు; పలు♦మంది సురారులు చుట్టుముట్టినన్
ఘనబల మొప్పఁ జంపఁగల♦గాఢపుశక్తి యొసంగునా యెడన్. ౩౮ 1221

క. ఐనను శ్రమముం బొందుదుఁ, గాన మహాబ్ధిం దరించి ♦ గట్టునవతలం
గానంబడుదానిని గనఁ, గానేర ననిశ్చితార్థ♦గతులు బవరముల్. ౩౮౪ 1222

తే. అపజయము గల్గినంగల్గు♦నట్లు సంశ
యాన్వితంబగుకార్యంబు ♦ నరయ నేను
జేయఁ; బ్రాజ్ఞుఁ డదెవ్వఁడు ♦ చేయు సంశ
యాన్వితం బగుకార్యంబు ♦ నరయక మది. ౩౯౪ 1223

సీ. సీతతో నేను భా♦షింపకపోయిన నామెయు దిక్కులే ♦ కంతమొందు
భాషింతునేని యీ♦పగిది మహాఘముల్ సంభవించును నాకు ♦ సత్యమిద్ది;
యవివేకి యగుదూత♦యందుఁ జెందినఫలమందనున్నట్టికా♦ర్యములు దేశ
కాలంబు లెఱిఁగి చ♦క్కఁగఁజేయనందున నా దేశకాలంబు ♦ లరినమంబు

తే. లగును గావున సూర్యోద♦యమునఁ దమము
లడఁగురీతి నశించు; జ♦నాధిపుండు

* నాన్యం పశ్యామి రామస్య సాహాయ్యం కార్యసాధనే-అనిమూలము.

సచివులంగూడి కార్యంబు ♦ చక్కనెంచి
యుక్తమిదియని యొకబుద్ధి♦నూని కడఁక. ౩౭ 1224

తే. నిశ్చయించిన సూరిమా♦ని యగుదూత
దానిఁ జెఱచును; స్వామికృ♦త్యంబు చెడక
యుండురీతిని, నవివేక ♦ మొందకేను
మసలురీతిని, గార్యంబు ♦ పొసఁగునట్లు. ౩౮ 1225

క. కడలిని దాఁటినపని యెవ్వడువున వ్యర్థంబుగాదొ ♦ బాగుగ నక్లే
శడఁబడ కీకార్యంబును, గడఁగి యొనర్పంగవలయుఁ ♦ గా యదియెట్లో.౩౮½

క. నేనెవ్విధిగాఁ బల్కిన, జానకి నాపల్కు వినునొ ♦ సాధ్వసమును దాఁ
బూనకయుండునొ ? యని పవమానాత్మజుఁ డాత్మ నెంచి ♦ మతివిభవమునన్.

క. ఒనరింపఁదగినకృత్యం,బును నిదమిత్థమ్మటంచుఁ ♦ బోలఁదలఁచె; నీ
వనితకుఁ బ్రియబంధువుఁడై, ఘనమతియై కీడుచేయఁ ♦ గడఁగని రాముల్.౪౦

క. మునుమును గీర్తించెద నీ, జనకజ, నాథాత్తమైన♦స్వాంతము గలదా
టను నామాటలకున్ భీ,తినిబొందకయుండు; మఱివి♦దితచిత్తుండై . ౪౧ 1229

తే. ధరణి నిక్ష్వాకుకులజులఁ ♦ దాని మేటి
యైనరాముండు చెప్పిన♦యప్పలుకులు
ధర్మయుక్తంబులును శుభ♦దములు నగుచు
నలరునవ్వాని వినిపింతు ♦ నాదరమున. ౪౧½ 1230

ఆ. మధురతరములైన ♦ మాటల వినిపింతు, రాముసాశయంబు ♦ నీమెకేను
నెట్లుచెప్ప నీమె ♦ యిప్పలుకులవయి, శ్రద్ధయునిచి వినునొ ♦ చారురీతి. ౪౩½

క. ఒనరింతునట్టులే యిపు;, డని యస్మమానీయమూర్తి ♦ హనుమంతుం డా
ఘనతరుశాఖాంతరమునఁ, గనఁజాలనియట్టులుండి ♦ కడు మధురముగన్. ౪౪

క. ధరణిపతియైనరాముని, తరుణీమణిఁ జూచుచున్ ని♦తాంతసుఖదమై
పరఁగుచు నవితథము మనో,హరమగువాగ్భణితి నిట్టు♦లనియెం బ్రీతిన్. ౪౪½

ముప్పదవ సర్గము సంపూర్ణము.

---

## ౩౧ - వ సర్గము.

{ హనుమంతుఁడు సీతకుమాత్రమే వినఁబడునట్లు రామువార్తఁ దెలుప సీత తలయెత్తి యాతనిం గనుట. }

చ. వనచరవర్యుఁ డిట్లు బహు♦భంగుల లోనఁ దలంచి సీతకున్
వినఁబడునట్లు వీనులకు ♦ విందుగఁ దోఁచెడువాక్యయుక్తి ని
ట్లనివినిపించె; స్యందనగ♦జాశ్వవిభూతిఁ దనర్చి పుణ్యశీ
లనియతి మించి నద్యశ విం♦లాస్థలి నొప్పఁగ భూపవర్యుఁడై. ౧½ 1254

క. తనరారు దశరథుండను, జనపతి యొక్కండు గలఁడు ♦ ధర్మమెఱుఁగఁ డా
తని దానకీర్తి యసదృశ, మనిచెప్పుట యతిశయోక్తి ♦ యనరాదెవుడున్. ౩

సీ. సద్గుణంబులను నా♦జనపతి రాజస్థులందు శ్రేష్ఠుండయి ♦ యలరుచుండుఁ
దపమున మునులతోఁ ♦ దానసమానుండగుఁ; జక్రవర్త్యన్వయ♦జాతుఁ డతఁడు
బలమున శతమఖో♦పముఁడగు మఱియహింసారతి యతనికి ♦ సతతమొదవు
నీచభావం బాత♦నికి శత్రువై యుండుఁ; గరుణాన్వితుండయి ♦ క్రాలునతఁడు
తే. సత్యశౌర్యుఁ డిక్ష్వాకువం♦శమున ముఖ్యుఁ
డతులలక్ష్మీయుతుండు స♦దాశ్రితజన
సంపదభివర్ధనుండును ♦ సకలరాజ
లక్షణవ్రజసంతత♦లక్షితుండు. ౪ 1236

క. అనిహతతేజుఁడు రాజేంద్రనిచయమున మేటిసాగ♦రవ్యాప్తమే
దినియందు విశ్రుతుండగు, జనసౌఖ్యకరుండు సుఖియు ♦ శాంతియుతుండున్.

తే. అట్టిదశరథభూజాని ♦ కగ్రతనయుఁ
డిందుబింబాస్యుఁడై రాముఁ ♦ డిలఁ జెలంగు
నాతఁడు విశేషవేత్తయై ♦ యఖిలచాప
ధరులలోఁ దానె మేటియై ♦ పరఁగుచుండు. ౬ 1238

చ. జనకునకుం బ్రియుండు నృప♦సంతతికిం దగుధర్మరాశి పా
లనమున జాగరూకుఁడు వి♦లాసము మీఱఁ బ్రజాళిధర్మమున్
దనదగుధర్మమట్లె సత♦తంబును గాచెడువాఁడు, ప్రీతిజీ
వనిచయధర్మరక్షకుఁడు ♦ వైరిజనాంతకుఁడై చెలంగు; నా
తనిజనకుండు వృద్ధుఁడు స♦తంబును సత్యరతుండు గావునన్. ౭ 1239

తే. ఆడితప్పలేక ♦ యటవికిఁ దనుఁ జను, మనిన వీరుఁడయ్యు ♦ ననుజుఁడు, తన
భార్య వెంటరాఁగ ♦ వనమున కేగెను;, విపినమం దతండు ♦ వేఁటకొఱకు. ౮

చ. తిరుగుచుఁ గామరూపులయి ♦ తీవ్రపరాక్రములైనయానిశా
చరులను బెక్కుమంది నని ♦ జంపెను; దూషణుఁడున్ దురాత్ముఁడౌ
ఖరుఁడును సైన్యయుక్తముగ ♦ క్ష్మాపతిచే హతులైరి: రావణా
సురుఁ డది యాలకించి మదిఁ ♦ జొప్పడురోషము పెల్లునం దగన్. ౯ 1241

తే. దండకాటవి నాజన♦స్థానమెల్లఁ, జెడియెఁగద నేఁటికిక్రూరు♦చేత ననుచుఁ
దగినమాయామృగంబయి ♦ తరలివచ్చి, రాము వంచించి యాతని♦రమణి సీత.

క. గొనిపోయెం; ననిందితయగా, జనకజ వెదకుచును దాను ♦ జని సుగ్రీవుం
డనువానరేంద్రువనమునఁ, గని యాతని మిత్రవరుని♦గా గ్రహియించెన్.

క. తరువాతఁ బరపురంజయుఁ, డురుబలుఁడౌ రామభద్రుఁ ♦ డొయ్యన వాలిన్
బరిమార్చి యతనిరాజ్యము, స్థిరముగ సుగ్రీవువశము♦చేసెం గడిమిన్. ౧౨

సీ. అంత సుగ్రీవుని♦యాజ్ఞచేఁ గామరూపు లగుకోఁతులు వేల♦కొలఁది యెల్ల
దిక్కుల సీతను ♦ దీవ్రశౌర్యంబుల వెదకుచు నున్నారు; ♦ విపులనయన
యగునామెకొఱకె నే♦నడవిని సంపాతిసాధుభాషణముల ♦ సాగరంబు
శతయోజనంబును ♦ జవమున లంఘించి వచ్చితి; నెట్టిస♦న్వపువు, ఛాయ

తే. కాంతిగలదని శ్రీరఘు♦కాంతువలన, నిశ్చయంబుగ వింటినో ♦ నెలఁత నిచట
నవ్విధంబెల్లను గలుగుట ♦ నాధరణిజ, నీమె నేఁ జూచితిని మద♦భీష్ట మలరె.

క. అని యింతమాత్ర మీగతి, వనచరవర్యుండు పలికి ♦ వాక్యము మఱి దే
నిని బల్కకూరకుండెను, జనకజ యప్పలుకుల విని ♦ స్వాంత మలరఁగన్. ౧౬

క. ఇదియేమి యిచటనివ్విధి, ముదమొనరఁగఁబల్కుసుగుణ♦ముఖ్యుఁడెవఁడొయీ
యదనున నని విస్మయమును, మదిఁ గాంచినదయ్యె; నంత♦మానవిపూన్కిన్.

తే. కొనల వక్రతగల్గిన♦కురులు వెలయ
నైజముగ భీరుతం దగు♦నాతికురులు
గ్రమ్ముకొనియున్నమోము నొ♦క్కటను బైకి
నెత్తి యాశింశుపావృక్ష ♦ మెలమిఁ గాంచె ౧౭ 1248

చ. జనకజ వానరర్షభువ♦చస్తతిఁ జక్కఁగ నాలకించి వే
కనుఁగొని దిగ్విదిక్కులను ♦ గానక యెవ్వరి రామునందు నె
మ్మనమును నిల్పి ధ్యానము స♦మంబుగఁ గైకొని సంప్రహర్షముం
గనియెఁ; దదీయవృక్షమునఁ ♦ గామిని చూడ్కులఁ ద్రిప్పి యాదృతిన్. ౧౮

తే. పైనఁ గ్రిందను బ్రక్కల ♦ బాగుగఁ గని
యాయచింత్యమతిన్ గపీం♦ద్రాభిమతుని
వాయునూనుని నుదయించు♦భానురీతి
వెలుఁగువానిని గనియె నా♦వెలఁది యచట. ౧౯ 1250

ముప్పదియొకటవ సర్గము సంపూర్ణము.

---

## 3౨ - వ సర్గము.

### సీత హనుమదుక్తుల విని భ్రమించుట.

*చ. జనకజ యంతభూరితరు♦శాఖలయంతరమందు లీనమౌ
తను వమరంగ నొప్పెడున♦దాగతినూనునిఁగాంచి సాధ్వసం
బున హృదయంబు బెగ్గిలఁగఁ ♦ బోలఁగ నింకనుగాంచె నాతఁ డ
ర్జునవసనంబుఁ గట్టుకొని ♦ సొంపగు కాఱు మెఱుంగుపిండురీ
తిని దగుపింగళచ్ఛవిని ♦ దేజరిలెం గన నద్భుతంబుగన్. ౧ 1251

---

* వేష్టితార్జునవస్త్రం తమ్-అనిమూలము. సంవేష్టితధవళవస్త్రస్వరూపమ్-అనివ్యాఖ్య.

ఆ. అట్లుమెఱయుచున్న ♦ హనుమంతుఁ బ్రియవాది
వినయమొప్పువాని ♦ వికసితమగు
నయ్యశోకవృక్ష ♦ మట్టితనుద్యుతి
యలరఁ దప్తహాట ♦ కాత్మునొప్ప. ౨ 1252

క. తరుశాఖాంతరమందుం, బరఁగుచునున్నట్టివాని ♦ బాగుగఁ గనియెం;
బరమాద్భుత మందుచుఁ గని, కరము విచారించె నిట్లు ♦ గాఁ దనయాత్మన్. ౨౹

క. ఔరా! భీతికరంబై, యీరూపము చెలఁగె, వాన ♦ రేంద్రు తను విదాఁ
జేరఁగరానిది చూడంగా రాని దిదేల తోఁచెఁ ♦ గడుభీతిదమై. ౩ 1254

క. అనితలఁచి మరల దుఃఖంబున నేమియుఁ దెలియదయ్యె; ♦ భూసుత భీతిం
గని జాలిపుట్ట రామా, యని సౌమిత్రీ యటంచు ♦ నార్తిఁ బొగులుచున్. ౪

క. విలపించెఁ బెక్కురీతుల;, వెలఁదులు వినువార లనెడు ♦ వెఱపుమెయిన్ మి
క్కిలిమధురముగా జానకి, మెలమెల్లన నేడ్చె వగయు ♦ మించుటవలనన్. ౫

క. తనకుం జెంతవినీతున్, ఘనతరుశాఖావిలీనుఁ ♦ గపికులుని నా
హనుమంతుఁ గాంచి స్వప్నమె, యని మైథిలి తలఁచె వార్త ♦ యద్భుతమగుటన్.

చ. తరుణియు నంతఁ జక్కఁగ స♦దాగతిసూనుని దీర్ఘవక్రనుం
దరముఖు సూర్యసూనువచ♦నంబునె చేయఁగనున్నవానిఁ గీ
శరమణుమంత్రి సాధుమతి♦శాలురయందు వరిష్ఠుఁ జూచె ని
క్కరణిని రామువార్తలఁ ద♦గన్ దెలిపెంగద యంచు లోలయై. ౭ 1256

ఉ. జానకి యాకపిప్రవరుఁ ♦ జక్కఁగఁ గాంచి వికారరూపమున్
దాను గనంగ మూర్ఛిలి మృ♦తప్రతికల్పయు నౌచునుండె, వి
జ్ఞానము చాలసేపటికిఁ ♦ జానకు రాఁగ విశాలనేత్ర య
వ్వానరుఁగూర్చి యెంచెనిటు; ♦ స్వప్నమునన్ వికృతంపుఁగోఁతినిన్. ౭౹ 1258

ఉ. కంటిని శాస్త్రసంఘమునఁ ♦ గానఁబడుం, గలలోనఁ గోఁతియుం
గంటికిఁ దోఁపఁగూడదని ♦ కాంచినవారికిఁ జాలకష్టముల్
వెంటనె కల్గుఁ గాన రఘు♦వీరునకుం దదమగ్రహార్థమై
వెంటనె యున్నచాపధర♦వీరున కల్లసుమిత్రపట్టికిన్. ౯ 1260

క. నాతండ్రికి జనకునకున్, బ్రీతియె సంధిల్లుఁగాక; ♦ వితతార్తిని నే
నీతఱినుండుట నిద్రయు, నేతెఱఁగునవచ్చు నిద్ర♦యిది కాకుంటన్. ౯౹

క. కల రాఁగూడదు కావునఁ, గలగా దిది నిద్ర తగుసు♦ఖంబున ననిశన్
విలసితపూర్ణనిశాకరు, వలెఁ దగుముఖమొప్పు రామ♦భద్రునిఁ గనమిన్. ౧౦

క. నాకెట్లు నిద్రగలుగును, నాకెట్లు సుఖంబుఁగలుగు? ♦ నాథునివశతం
బోకరుణానిధి! రామా, యోకౌసల్యాకుమార! ♦ యోరఘువీరా. ౧౦౹

క. అనిబుద్ధి రామమూర్తినె, ఘనభక్తిం దలఁచుదానఁ ♦ గడుఁదమి వాక్యం
బునఁ జెప్పుచుండుదానను, ననుకూలముగాఁ దదీయ♦మగుకథనిట్లే. ౧౦॥

క. వినుచున్నదాన నాథ, ర్తనె తెలియుచునున్నదాన; ♦ రాముని నెడఁబా
సినయదిమొదలుగ విరహం,బున మన్మథపీడితనయి ♦ పొగులుచు సతముౝ.

ఆ. నాథునందె నామ♦నం బింతయుౝ నిల్పి, తలఁచుదానఁ గానఁ ♦ దలఁచినట్లె
కానఁబడెడునట్లె ♦ వీనులవినఁబడుఁ,గాని యిద్దినిజము♦గాదు తలఁప. ౧౨

సీ. ఇచట నల్లదె రాము ♦ నెన్నువానిని గనుచున్నదాననుగద, ♦ యొక్కరీతిఁ
బతిఁగూర్చి నామది ♦ నతిశయప్రేమను దగుమనోరథమె యి♦ట్లగపడునటు
లున్నదంచుఁ దలంచు♦చున్నదానను, దాని కరయ రూపమె లేదు♦ధరణియందు
నేకారణమొ యిటు ♦ లిటవినవచ్చుట కీవానరునిరూప ♦ మి త్తరువునఁ

తే. జక్కఁగాఁ గానవయ్యెఁ గీ♦శవరుఁ డితఁడు
నాయెదుట వచ్చి కనఁబడి♦నాఁడుగాని
వేఱుగాదు, వాచస్పతి♦విబుధవర్య
శతధృతులకును నగ్నికి ♦ సాంద్రభక్తి. ౧౩॥ 1267

క. కరయుగముమోడ్చి మ్రొక్కద, వరకపి యీతం డిచటికి ♦ వచ్చి పలికి న
ట్లరయఁగ సత్యములగుఁగా,క రహితఫలదములుగాక ♦ క్రాలుత మింకౝ.

ముప్పదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## 33 - వ సర్గము.

### హనుమంతుఁడు సీతవృత్తాంత మడుగుట.

చ. అనివచియించె నంతట మ♦హాత్తరవిక్రము మొప్పవాయునం
దనుఁడు వినీతవేషుఁడయి ♦ తత్తరువర్యమునుండి డిగ్గి యా
జనకజదుస్థితిం గనుటఁ ♦ జాలఁగ దీనతనొంది వందనం
బొనరిచి నుంతచేరఁజని ♦ యొప్పఁగ శీర్షమునం గరద్వయం
బును ముకుళించి యిట్లనియె ♦ [1]ముద్దులుగుల్కెడుపల్కులొప్పఁగౝ. ౨

చ. [2]సరసిజనేత్రముల్ వెలయఁ ♦ జాలఁగ మాసినపట్టువస్త్ర మా
దరమునఁ దాల్చి యావిటపి♦తల్లజశాఖను గైగ్రహించి యి

---

1 సీతాం మధురయాగిరా-అనిమూ. 2 కానుపద్మవిశాలాక్షి క్లిష్టకౌశేయవాసిని, ద్రుమస్య శాఖా మాలంబ్య తిష్ఠసి త్వ మనిందితే-అనిమూ హనుమ ఇంతసుముందే సీతయని యెఱింగియు మరల వేల నీవెవతుకవని ప్రశ్నించె ననరాదు. సీతను దానెఱింగినట్లె మాటలాడిన రావణుఁడని సంశయించునేమోయని, యామెనోటనుండియే బదులుచెప్పింపఁగోరి యిట్లడిగెననియు నెఱుంగుట దీనిసారము.

క్కరణిని నున్నదాన వొక♦కందువను బొందనిదాన వీవు నా
కురుకృపఁ దెల్పు మెవ్వతవో ♦ యొక్కతవే యిటనుండ నేలొకో. 3 1270

తే. పుండరీకపత్త్రంబుల♦నుండి యలల
పెల్లునం జిమ్మినట్టినీ♦రెల్లఁదొరఁగు
నట్లు నీకన్నుగవనుండి ♦ యార్త్రిజలము
కాఱుచున్న దదెందుకో♦కరుణఁ జెపుమ. 4 1271

సీ. అమరకన్యకవొ, నీ♦వసురకుమారివో యక్షకిన్నరనాగ♦రాక్షసులయు
గంధర్వులయుఁ బుత్త్రి♦కారత్నమవొ వీరియందెవ్వరికి నీవు ♦ సుందరాంగి
చేరినదానవు? ♦ నారీమణీ, వసువాయురుద్రులయం దె♦వరికి నీవు
సంబంధురాలవు ? ♦ చారుగాత్త్రి! నీవు దేవతవని నామ♦దికిని దోఁచు

తే. చున్నయది; చంద్రునింబాసి ♦ యున్నతమగు
స్వర్గమును వీడి పుడమికి ♦ వచ్చియున్న
సకలసుగుణాకరయును దే♦జఃప్రకాశ
యు నగురోహిణివా యేమి ♦ యువిద నీవు. 2 1272

క. సురుచిరగాత్త్రి, నీవె, వ్వరిదానవు? చక్కనగుచు ♦ భాసిలుసత్కుల్
నిరుపమరీతిం దోఁచెదుఁ;, గరుణాఢ్యా! యసితనేత్ర ♦ కడువడిఁ జెపుమా.

క. తెలియకగానీ క్రోధము, పొలయుటచేఁగాని నీవి♦భుండగుమునిరా
డ్తిలకువసిష్ఠునిఁ గోపము, గలవానిగఁజేసి త్రిదశ♦కాంతాలయమున్. ౮ 1274

తే. వదలి పుడమికి నిత్తతి ♦ వచ్చినట్టి
యయ్యరుంధతి వగుదు వం♦చరయువాఁడఁ;
జారుమధ్యమరాజితా ! ♦ త్యాతలమును
వదలి పరలోకగతుఁడైన ♦ [1]వరతనయుని. ౮౪ 1275

క. జనకుని, భ్రాతను బ్రాణేశుని వీరలయందు నొకని ♦ శుభగుణుని గుఱిం
చి నిరతదుఃఖమునొందెద, వని తలఁపఁగనయ్యెఁ జెపుము♦యతఁడెవ్వఁడొకో.

సీ. ఇట్టు లేడ్చుటచేత, ♦ నిట్టూర్పువిడుచుటచేత భూస్పర్శము♦చేత, రాజ
సంజ్ఞలు గలుగుటఁ ♦ జానరో నీవెన్న నమరనారివి కావ♦టంచుఁ దలఁతు;
నవయవంబులచంద ♦ మట్టులె మంగళకరములౌ శాస్త్రల♦క్షణసమూహ
మునుబట్టిచూడఁగా ♦ మను జేంద్రపట్టపురాణివి, మఱియును ♦ రాజతనయ

ఆ. వనుచు నాకుఁదోఁచె ♦ నాజనస్థానంబు, నుండి రావణాసు♦రుండు బలిమిఁ
బట్టితెచ్చినట్టి ♦ పరమసాధ్వివి సీత, వగుదువేని తెలుపు ♦ మదుగువాకు.

ఆ. భద్రమగునుగాక ♦ పరఁగునీదైన్యము, మనుజతరుణులందుఁ ♦ గనఁగరాని

---

1 కోసుపుత్త్రః పితా భ్రాతా భర్తా వా తే సుముఖ్యమే,అస్మా ల్లోకా దముం లోకం గతం
త్వ మనుశోచసి-అనిమా.

చక్కఁదనము, మానిసామాన్యవేషమి, వెట్లొ యట్లె రాముఁనింతిపీవె.

చ. మనమున నెన్ననిశ్చయమె ♦ మానిని సందియమేమిలేదు; నా
విని రఘురాముకీర్తనము ♦ వీనులకింపుగ తిన్నదాట హా
ర్షనిరతచిత్తయై విటపి♦శాఖలక్రిందఁ జెలంగునాంజనే
యుని గని యిట్లుపల్కెఁ; విను♦మోకపిసత్తమ! నేను భూస్థలిన్. ౧౪॥ 1279

క. ధరణీపతిముఖ్యుండై, పరఁగుచు విదితాత్ముఁడగుచు ♦ భాసిలుచున్ భా
సురకీర్తిమెఱయు దశరథ, ధరణీంద్రునికోడలను, బ్ర♦తాపవిభూతిన్. ౧౫॥

క. అరిజనులసైన్యమును నిర్భరతాపము నందఁజేసి ♦ భవ్యాత్మండౌ
నిరుపమకీర్తికి జనకున, కురుశౌర్యా! తనయనగుచు ♦ నొప్పెదుదానన్. ౧౬

ఆ. పేరుసీతయనుచుఁ ♦ బిలుతు, రామతిమంతుఁ
డైనరాముపత్ని ♦ నగుదు నేను;
బెండ్లియైనపిదపఁ ♦ బ్రియమున దశరథు
నింట ద్వాదశసమ ♦ లేనుమిగుల. ౧౭ 1282

క. మనుజాఖిలభోగంబుల, ననిశము పొందుచును గామి♦తార్థములెల్లం
గనుచుంటి నవలివత్సరమున దశరథుఁ డవ్వసిష్ఠ♦మునిసంయుతుఁడై. ౧౮

తే. రామునిక్ష్వాకువంశహ♦ర్షదునిఁ బట్ట
భద్రుఁ జేయంగఁబూనె; నా♦పరమయత్న
మునకుఁ దగినట్టివస్తువుల్ ♦ మొనసి కూర్చు
చుండఁ గైకేయి పతిఁగాంచి ♦ యొప్పుదప్పి. ౧౯॥ 1284

క. పలికెనిటు; రామభద్రున, కలరఁగఁ బట్టాభిషేక♦మగునేని యిఁకన్
జలములఁ ద్రాగను, దిన, భుక్తుల [1]నీయభిషేకమేయ♦గును ననుఁజంపన్.

క. మును నాకు వరములిచ్చితి, ననిచెప్పితివిగద ప్రీతి ♦ యలరఁగ నమ్మా
టను వ్యర్థపఱుపఁ దగదే, వనికేగునుగాక రామ♦భద్రుఁడు త్వరఁగన్.

చ. అనవిని రాజు కైకకును ♦ నాదృతి మున్ను వరంబు లిచ్చుటన్
మనమున నెంచి సత్యమును ♦ మాననివాఁడగుటన్ రఘూత్తమున్
వనమున కంపుమన్న ప్రియ♦భామిని క్రూరతరాప్రియోక్తినిన్
విని మది నేమితోఁపమికి ♦ విహ్వలతం గనుచుండె నార్తుఁడై. ౨౨॥ 1287

సీ. అంతట వృద్ధుఁడౌ♦నవనిపాలుఁడు సత్యధర్మంబుల నెపుడు ♦ తప్పకుండ
జరపువాఁడౌట య♦శస్సునఁ బొదలెడు [2]నగ్రపుత్రునిరాము ♦ నార్తుఁడగుచు
నేడ్చుచు మును పట్టి ♦ కిచ్చెద నేనన్నరాజ్యము నాకు మ♦రలనొసంగు
మనుచు యాచించె; శ్రీ♦యలరురాముఁడు తనయభిషేకమునకంటె♦నతిశయప్రి

1 ఏష మే జీవితస్యాంతో రామో యద్యభిషిచ్యతే-ఆనిమా. 2 జ్యేష్ఠం యశస్వినం పుత్రం రుద న్రాజ్య మయాచత-అనిమా.

నే రామునాజ్ఞ దూతను, గా రామునివార్తఁ దెలుపఁ♦గా వచ్చితిఁ జూ. ౧౹

క. జనకసుతా! శ్రీరాముఁడు, వినుమా కుశలముగనుండి ♦ వివరింపుమనెం
దనకుశలవార్త సీతో;, వనితా! బ్రహ్మాస్త్రవేద♦పార మెఱుఁగుటన్. ౨౹

ఆ. వేదవిదులయందుఁ ♦ బెద్దయె తానయి, యెవ్వఁడలరునట్టి ♦ యింగితజ్ఞుఁ
[1]డాజితనయుఁడు నగు♦నా రాఘవుఁడు తన, క్షేమవార్త నీకుఁ ♦ జెప్పుమనియె.

క. వనితా! గురుతేజుఁడు నీ,పెనిమిటి కనుచరుఁడు మిగులఁ♦బ్రియుఁడుననగునా
యనఘుఁడు లక్ష్మణుఁడార్తిం,గనుచున్ దలవంచి మ్రొక్కెఁ♦గడుభక్తిమెయిన్.

చ. పురుషవరేణ్యులై నరఘు♦పుంగవు లిర్వురు క్షేమయుక్తులై
పరఁగుచునున్నవా రనెడు♦భవ్యతరోక్తుల నాలకించి య
త్తరుణియుఁ బ్రీతి నంగములు ♦ తద్దయుఁ బొంగఁగఁ బల్కె నిట్టులా
హరివరుతో; [2]శతాబ్దముల♦కైన మనుష్యుఁడు ప్రాణయుక్తుఁడేన్. ౫౹

క. ఆనందమొందు ననియెడు, నీనుడి లోకప్రసిద్ధ♦మేయగు నిదియున్
వానరవర! నాపట్లను, గానంబడె సత్యమైన♦గతిగా నహహా!. ౬ 1302

క. అనె; భర్తచెంతనుండియె, చనుదెంచినహనుమయందు ♦ జానకి కచటన్
జనియించె నద్భుతప్రీ,తి, నెలంతయు నంత వాయు♦దేవుతనయుఁడున్. ౭౹

క. ఇతరేతరంబు నమ్మక,ముతగన్ మాట్లాడుటకును ♦ మొదలిడి రంతన్;
గృతవేత్త హనుమ [3]హరిగణ,పతి యప్పలుకాలకించి ♦ పరమార్తిగన్. ౮౹

తే. దీనయైయున్నజానకీ♦దేవికడకుఁ
జనఁగ మొదలిడె; నంతెంత♦సన్నికృష్ట
మునకు నాతండుపోయెనో ♦ దనుజుఁ డిట్టి
తనువునన్ వచ్చెనేమొకో ♦ యనెడుశంక. ౯౹ 1305

క. జనకజయుం గనుచుండెను;, మనమున నాదేవి యేమొ♦మాట లితనితో
డనుబల్కితినే, తగునే, యనుచితమాఁగాదె యిద్ది; ♦ యారావణుఁడే. ౧౦౹

క. రూపాంతరమును దాలిచి, యీపగిదిగ వచ్చె నిప్పు♦డిచటికనియె; న
ట్లాపడఁతి శోకకర్శిత, యై పట్టుకొనినమహీరు♦హాయతశాఖన్. ౧౦౹ 1307

తే. విడిచి యాయనవద్యాంగి ♦ పుడమిఁ గూరు
చుండె; నాదీర్ఘబాహుఁ డ♦ట్లురుతరమగు
వగను గుందుచు భీతివి♦వశయునగుచు
నున్నయాజానకింజూచి ♦ సన్నుతించి. ౧౧౹ 1308

క. వందన మొనరిచె; నట నా, సుందరి భయవిహ్వలయయి ♦ చూడకయే యుం
డెం; దగ శశిముఖి సీతయు, వందనములు చేయుచున్న♦వానిఁ బవనజున్. ౧౩

---

1 దాశరథీరామః-అనిమూలము. అజమహారాజుకొడుకు అజి=దశరథుఁడు. 2 ఏతిజీవంత మానందో నరం వర్షశతాదపి-అనిమూలము. 3 హనుమాన్ హరియూథపః-అనిమూలము.

క. కని దీర్ఘోచ్ఛ్వాసంబులఁ, దనవగలం దెల్పుకొనుచుఁ ♦ దతమధురతర
స్వనమలర నతనితో ని, ట్లనియెను; మాయావియైన ♦ యసురుఁడు నన్నున్.

క. ఇంతకుమును పే యిచటికిఁ, బంతంబున నేగుదెంచి ♦ పలికె దురుక్తుల్
సంతసములరఁగ నీతను, వెంతయు గ్రహియించి పగలు ♦ నెల్లను మరలన్.

క. *కలిగించెదవో నన్నా, ర్తులముంచు టమంగళంబు; ♦ తోరపుశక్తిన్
వెలుఁగుచుఁ దనరూపము ని,మ్ములమాఱువడంగఁ జేసి ♦ మూర్ఛతమీఱన్.

సీ. సన్న్యాసిరూపంబు ♦ సరగున ధరియించె యాజనస్థానంబు♦నందు నాకుఁ
గనఁబడినట్టి యా♦దనుజుండ వేనీవు; కామరూపుండవు♦గాన నేను
నుపవాసకృశనయి ♦ యొక్కరీతిఁగ దీననై యున్నదాన న♦హార్యదుఃఖ
ములనొందుదాన ను♦రలనిట్టినన్ను దుఃఖార్ణవమగ్నగా ♦ నరయకీవు
తే. చేయుచున్నావు, నీకిది ♦ న్యాయమౌనె?
వనచరా! నిన్నుఁగనుచు శం♦కను గనుటయు
యుక్తమే కాదదేలన♦నొగి నినుఁ గన
మదిని సంతోషమలరుచు♦న్నది నిజముగ ౧౩॥ 1313

చ. వనచర, రాముదూతగనె ♦ వచ్చుటయే నిజమేని నీకు శో
భనమగుఁగాక నిన్ను రఘు♦వర్యునిగాథలు ప్రీతినించుఁ గా
వున నడుగందలంతు రఘు♦భూషణుసద్గుణరాజినెల్ల నా
కు నెఱుఁగఁ జెప్పుమా, తటిని♦కూలము నీటిజవంబులాగురీ
తిని హరియించెదీవు కడుఁ ♦ దీవ్రముగాఁ గపివర్య! నామదిన్. ౧౪ 1314

క. చిరకాలము రాముని విడి, కరము వగంబొందు నేను ♦ గలలో రఘుభూ
వరకులతిలకుఁడు పంపిన, హరిపుంగవుఁ జూడ నర్హ♦నైతినిగాదే. ౧౫ 1315

క. ఔరా! కలయెంతసుఖా, ధారంబో; స్వప్నమందుఁ ♦ దరణికులవిభున్
శ్రీరామువీరులక్ష్మణు, నారూఢిగఁ గాంతునేని ♦ యార్తిఁ గననుగా. ౧౬

ఆ. స్వప్నమునకుఁగూడ ♦ భర్తకువలెనె నా, పైనిమచ్చరంబు ♦ గానఁబడెడు;
స్వప్నమనుచు దీని♦స్వాంతమునన్ నేను, దలఁపఁ, జూడఁబడినఁ♦గలను గోఁతి.

క. కలుగదు మేలేమాత్రము, కలుగుచు నున్నయది నాకుఁ ♦ గడుమోదం బి
మ్ముల నిప్పుడు; పతికుశలం, బుల వినఁ గోరుచును జింతఁ♦బూనుచు నుందున్.

తే. అట్టిచింతయె యీరూప ♦ మంది భ్రాంతిఁ
గలుగఁ జేయుచు నున్నదో♦గాని లేక
యుపవసించుట ధాతువు ♦ లొగిఁ గలంగి
వాతవికృతిని గల్పింప ♦ వరుసనిట్లు. ౧౯ 1319

---

* సంతాపం తన్మశోభనమ్-అనిమా.

క. మనమునఁ దోఁచుచునున్నదొ, కన నున్మాదోద్భవంబు♦గాఁదగు భ్రమయో
వినుచుందుము మృగతృష్ణిక, లననట్టులె యొకటికొకటి ♦ యగపడెడునొకో.

సీ. ఉన్మాదమిదియని ♦ యూహింపఁగారాదు దానిచందముగనె ♦ తనరుఁ జిత్త
విభ్రాంతిగావున ♦ వివరింప నున్మాదమే కానియపుడు నా♦హృదయమోహ
మునుగాదు మఱియుఁ ద♦క్కిన రెండునుంగావు నన్ను నే నీకపి♦నాథుఁ జక్కఁ
గా నెఱుంగుచు నున్న♦దాననే; యనియిట్లు పలువిధంబుల భూమి♦పట్టి వాని

తే. యందలి బలాబలంబుల ♦ నరసి యవలఁ
గామరూపులు దనుజులు ♦ గాన నతని
రావణునిగానె తలఁచె; నా♦రమణి సింహ
మధ్యమయు నిట్లుతలఁచి య♦మ్మారుతిఁ గని. ౨౯ 1321

క. పలుకక యూరకయుండెను, వెలఁదియభిప్రాయ మిట్టి♦విధమనిలోనం
దలపోసి హనుమ యామెచె,వులకుఁ విందుగఁజెలంగఁ ♦ బోలుపలుకులఁ.

క. జనకజకు హర్ష మొసవం, గనుజేయుచుఁ బలికె నిట్లు♦గా; రాముఁడు సూ
ర్యునివలెఁ దేజస్వియుఁ జ,క్కనిచంద్రునిమాడ్కి లోక♦కాంతుఁడు సుమ్మీ.

సీ యక్షేశ్వరునియట్టు ♦ లఖిలలోకములకుఁ దారాజరాజు, మా♦ధవునిభంగి
శౌర్యసంపన్నుండు ♦ సత్కీర్తిమహితుండు సురపతిదేశికు♦కరణి సత్య
వాదియు, మంజుల♦భాషియు, మూర్తిమద్దర్పకురీతి సౌం♦దర్యశాలి
మనమున కానంద♦మునుగూర్చువాఁడును,గాంతిమంతుఁడు;తగు♦కారణములఁ

తే. దనదుకోపంబుఁ జూపునా♦తనియమర్ష
మెప్పటికి సార్థకంబగు♦నెవఁడు క్రోధ
మందు నవ్వానిఁ బ్రహరించు ♦ నవనివర్యుఁ
డై మహారథుఁడయి యొప్పు ♦ డలరుచుండు. 30౪ 1324

తే. ఏమహాత్ముబాహుచ్ఛాయ ♦ నెల్లజగము
లాశ్రయించి చెలంగునో ♦ యట్టిరాముఁ
గపటమృగరూపమున నా శ్ర♦మపదముననె
యుండనీయక తొలఁగించి ♦ యుద్ధతిఁగొని. 3౨ 1325

క. నిను నపహరించి తెచ్చిన, దనుజునకుం గలుగనున్న♦దారుణఫలముం
గనఁగలవు; స్వల్పకాలం, బుననే వీర్యాధికుఁడగు ♦ భూపతిలకుఁడుఁ. 33

క అనిఁ గోపంబున జ్వలియిం,చు నిప్పుకలరీతి మిగుల ♦ శోభిలుబాణా
ళినివైచి దనుజుఁజంపును, వినుమా యారామచంద్ర♦విభుఁ డనిచె ననుఁ.

క. చనుదెంచితి నీకడకా, తనిపనుపున; నిన్నుఁబాసి ♦ ధరణీశుం డెం
తనరానివగలఁబొగులుచు, జనకజ! యడుగుమనె నీకు♦శల మాదృతితోఁ.

క. గురుబాహుఁడు తేజస్వియుఁ, దరుణీమణి, యాసుమిత్ర♦తనయుఁడు హర్షం
బరుదుగఁ దల్లికిఁ గూర్చెడు, పురుషోత్తముఁ డతఁడు నీకుఁ ♦ బొలఁతీ భక్తిఁ.

ఆ. వందనం బొనర్చి ♦ బాగుగ నీక్షేమ
మడుగు మనియె; వాన♦రాధిపతియు
రామచంద్రసఖుఁడు ♦ భీమవిక్రముఁడు సు
గ్రీవుఁ డడుగు మనియె ♦ క్షేమవార్త. ౩౮ 1330

తే. రామసౌమిత్రిసుగ్రీవు ♦ లోకమహీజ
ప్రతిదినము నిన్ను స్మరియించు♦వారు; తల్లి
దనుజవశవర్తిని వెయయ్యు ♦ దైవకృపను
బ్రదికియున్నావు జానకీ! ♦ పలుకు లేల. ౩౯ 1331

సీ. రాము మహాబలు♦సౌమిత్రి, వనచరాంతరమున వలసును♦ద్ధామసత్వ
శాలి సుగ్రీవుని ♦ సత్వరముగ నె కాంచంగల; వేను గీ♦శపతియైన
సుగ్రీవుమంత్రి [1]నా♦శుగనూనుఁడను హనుమంతుఁ డన్వాఁడను♦మహితవార్ధి
దాఁటి యీపత్తన♦తల్లజంబును జొచ్చితిని; నేను విక్రమం♦బును దగంగ
తే నాశ్రయించి [2]దురాత్ముఁడౌ♦నసురవరుని
తలను గాలిడి నినుఁజూచు♦తమిని నిటకు
వచ్చినాఁడను; నన్నెట్టి♦వానిఁగాఁగ
భ్రాంతినొందెదవో యట్టి♦వాఁడఁ గాను. ౪౦ 1332

క. కనుక నె యీశంకను నీ, మనమున విడనాడవలయు ♦ మానిని నామా
టను వినుటయందు శ్రద్ధను, నునుపుము నామాట నమ్ము ♦ ముదమ్మమలరన్. ౪౧

ముప్పదినాల్గవ సర్గము సంపూర్ణము.

---

౩౫ - వ సర్గము.

హనుమంతుఁడు రాములక్షణములఁ జెప్పి సీతను నమ్మించుట.

చ జనకతనూజ! యాప్లవగ♦సత్తముఁ డెంతయు భక్తిమీఱఁ జె
ప్పినరఘురాముసత్కథను ♦ బ్రీతిచెలంగఁగ విన్నయంత ని
ట్లనియె మనోజ్ఞవాక్కులను; ♦ నార్య! రఘూత్తముతోడ నీకు నెం
దునలరె సంగమంబు దయ♦తో నెఱిఁగింపుము నాకుఁ జక్కఁగన్. ౧ 1334

తే. ఎట్లులక్ష్మణు నెఱుఁగుదు ♦ వెట్లునరుల
కటవిచరులకు సంగమం ♦ బలరెఁ; బ్లవగ
వర్య! రాముని గుఱుతు లె♦వ్విధంబొ నగునొ
యతనితమ్ముని గుఱుతు లె♦య్యవియొ చెపుమ. ౨ 1335

క. వానిని వినినఁ దుఃఖము, నేనొందను; రామమూర్తి ♦ కెట్లవయవసం
స్థానం బలరునొ యాతని, జానగుమాపంబదెట్టి♦చందమొ చెపుమా. ౩ 1336

---

1 అశుగసూనుఁడను=వాయుపుత్రుఁడను. 2 కృత్వా మూర్ధ్ని పదన్యాసం రావణస్య దురా
త్మనః, త్వాం ద్రష్టు ముపయాతోఽహం-అనియూ.

క. [1]అరయ సుమిత్రాపుత్త్రుని, కరములు నూరువు లవెట్టి♦కరణిఁ జెలఁగునో
కరుణించి తెలుపుమా యని, తరుణీమణి పలుక శ్వసన♦తనయుం డంతన్.

క. రామునిరూపవిలాసము, లేమాడ్కిఁ జెలంగునట్టు♦లేవివరింపం
దామదిఁ దలంచి యిట్లనె:, నోమానిని! కమలనేత్ర! ♦ యొప్పుగ నన్నున్. ౫

తే. రాముదూతగ నెఱిఁగియు ♦ నీమెయివిధి
వశమునం బ్రశ్న చేసెదు♦భర్తయును ద
దనుజునియు నంగచిహ్నంబు♦లను దగంగ:
నౌర! తద్వర్ణనము చేయ♦నయ్యె నాకు. ౬ 1339

క. [2]ఏయేగుఱుతుల మును నీ, వాయనఘులయందుఁ గంటి ♦ వాచిహ్నములన్
నాయెఱిఁగినంతవట్టును, నీయెడ నెఱిఁగింతు వినుము ♦ హిత మలరంగన్. ౭

సీసమాలిక:——

శ్రీరాఘవుఁడు సర♦సీరుహేక్షణుఁడును, సర్వసత్త్వస్వాంత♦సంప్రహర్ష
దుఁడు, చారుసుందరాం♦గుఁడును, దాక్షిణ్యాదిసకలగుణాళికి♦జలధియగుచు
జనియించెఁజుమ్ము శ్రీ♦జనకాత్మజా! తేజమునసూర్యతుల్యుఁ,దో♦ర్పునఁబుడమికి
సముఁడు, బుద్ధిని బృహ♦స్పతిసమానుండగు యశమున శతముఖు♦నట్టివాఁడు
జీవలోకమును ర♦క్షించెడువాఁడగు, బంధురక్షకుఁడయి ♦ పరఁగునతఁడు
క్షత్త్రియజాతికిఁ ♦ జాలినవృత్తిని నాశ్రమధర్మాళి ♦ నరసి ప్రోచు
వాఁడు, శత్త్రువులను ♦ బాఱఁదోలెడువాఁడు; భామినీ! జగమునఁ♦బరఁగునట్టి
మర్యాదలను దాను♦మానక యాచరించుచు నెల్లరును జేయు♦చును జెలంగు
నట్లుచేయుచునుండు♦నమలకాంతియుతుండుసాధుపూజితుఁడయి♦క్షమనుబాలు
శాస్త్రోక్తరీతిని ♦ స్వకళత్త్రమునుగూడి బ్రహ్మచర్యవ్రత♦పరుఁ డనంగ [చు
సత్కీర్తి గనువాఁడు ♦ సాధూపకారజ్ఞుఁ, డాయాయికర్మాళి ♦ నాత్మ నెఱిఁగి
వానిహేతువులను ♦ వానిఫలంబుల తత్త్వంబెఱుంగు న♦తఁడు సుసాధ్వి
యన్వీక్షకియుఁ, ద్రయి,♦యట్లె వార్తయు, దండనీతియు నఁగఁబడు♦నృపునివిద్య
లందు వినీతుఁడై ♦యలరుచుండును, బ్రాహ్మణుల నుపాసించు వి♦ద్యలనుమేటి
శీలసంపన్నుఁడై ♦ చెలఁగు, సజ్జనులందు వినయయుక్తుం, డరి♦పీరమ్మృత్యు
వగు, యజుర్వేదంబు ♦ నంతయుఁ జదివినవాఁడు, వేదజ్ఞుల♦వలన మెప్పు
గన్నవాఁడగు; మఱి♦సన్నుతాంగిరో ధనుర్వేదంబుఁ దక్కిన♦వేదములను
వేదాంగముల నేర్చి♦విమలపాండిత్యంబు వెలయఁగా, విపులాంస♦ములను,దీర్ఘ

---

1 కీదృశం తస్య సంస్థానం రూపం రామస్య కీదృశం, కథ మూరూ కథం బాహూ లక్ష్మ ణస్య చ శంస మే-అనిమూ. సంస్థానం - అవయవసన్నివేశః. రూపం ఆకారః వర్ణః కాంతిర్వా-అని వ్యాఖ్య. 2 లక్షితాని విశాలాక్షి వదత శ్శృణు తానిమే-అనిమూ.

బాహువులం దగు♦వాఁడు, కంబుగ్రీవుఁ, డతిశుభాననుఁ డయి ♦ యలరువాఁడు
సంధిబంధంబులు♦చక్కఁగా నమరంగఁ దామ్రోష్ఠుఁడై ప్రజా♦తతి యెఱుంగఁ
తే. దగినవాఁడయి, దుందుభి♦ధ్వనిసమాన
కంఠరవమొప్పు, సుస్నిగ్ధ♦కాంతి వెలయఁ
దారుషమమిూఱ, సమమగు♦వపువు గ్రాల
సమవిభక్తాంగుఁడై యొప్పు♦శ్యామతనుఁడు. ౧౬ 1341

సీసమాలిక:—

*కాంతరో రాముప♦క్షము, పిడికిలి, మని
కట్టు నీమూఁడును ♦ గ్రాలు స్థిరము
లయి, కనుబొమలును ♦ నట్లెముష్కంబులు,
బాహువు లీమూఁడు ♦ పరఁగుదీర్ఘ
ములుగాఁగఁ, గేశాగ్ర♦ములు, ముష్కములు, జాను
వులు మూఁడు సమములై ♦ పొలుచుచుండుఁ,
గమనీయమైన క్రిఁ♦గడుపును నాభియు
వక్షంబు మూఁడును ♦ వఱలు నున్న
తములౌచు; మఱియు నే♦త్రంబులచివరలు,
హస్తపాదతలంబు♦లట్లె గోళ్లు
మూఁడుతామ్రములయి ♦ మొనయుచుండును; మఱి
పాదరేఖలు, కేశ♦వరము లట్లె

---

* త్రిస్థిర స్త్రిప్రలంబశ్చ త్రిసమ స్త్రిషు చోన్నతః, త్రితామ్ర స్త్రిషు చ స్నిగ్ధోగంభీర స్త్రిషు నిత్యశః. త్రివలీవాం స్త్ర్యవనత శ్చతుర్వ్యఙ్గ స్త్రిశీర్షవాన్, చతుష్కల శ్చతుర్లేఖ శ్చతుష్కిష్కు శ్చతుస్సమః. చతుర్దశసమద్వంద్వ శ్చతుర్దంష్ట్ర శ్చతుర్గతిః, మహోష్ఠహనునాసశ్చ పంచస్నిగ్ధోష్టవంశవాన్. దశపద్మో దశబృహ త్రిభి ర్వ్యాప్తో ద్విశుక్లవాన్, షడున్నతో నవతను స్త్రిభి ర్వ్యాప్నోతి రాఘవః-అనిమూలము. దీనికి వ్యాఖ్యాతలు వ్రాసినయర్థమే యిట సీసమాలిక యందుఁ జేర్పఁబడిన దనియెఱుంగనగును. కొందఱు ఈశ్లోకార్థమట్లే తెనిఁగింపవలయుంగాని దానిని విస్తరించి తెనిఁగింపరాదనియు, అట్లు తెనిఁగించినచో రసభంగ మగుననియు, రామాయణమునకుఁ గావ్యత్వహానియే సంభవించుననియు, నౌచిత్యహానియుఁ గల్గుననియు నింకను సెన్నియో యవర్థములు గల్గుననియుఁ జెప్పుదురు. సీత వచ్చియున్న యీదూత మగఁడు పంపినవాఁడా? లేక రావణుఁడే యిట్టిరూపమునఁ దనను మోసపుచ్చఁదలంచెనా? యని యనుమానించి నీవు రామదూతవేయైన నామగని లక్షణము లెట్టివి? నామఱఁది యగుసౌమిత్రిలక్షణము లెట్టివని ప్రశ్నించెను. హనుమ యామె సంశయించి యిట్లడుగుచున్నదని యెఱింగి "త్రిస్థిర స్త్రిప్రలంబశ్చ......... ఇత్యాదిశ్లోకములఁ గలయర్థమును గూఢముగాఁ జెప్పెను. అట్టితావులను దెనిఁగించినప్పుడు "త్రయీయాయావయవములు పొట్టివి ఇవి పొడుగుగా నుండును. ఇవ్వివి సమములుగా నుండును. ఇట్లే చెప్పినట్లు తేటపఱచినయెడల నందు వృషణాదిపదము లుండుటఁగావ నవి విని యుచితానుచితజ్ఞానవిహీనుఁ డగునట్టివానికి వాళ్ళు

లింగము మూఁడు చె♦లంగును నునుపుగా;
స్వరగతి నాభులు ♦ వళులుచాల
గంభీరముగఁ, ద్రిరే♦ఖలు భాగ్యచిహ్నంబు
లై కంఠమున నొప్పు ♦ నతఁడు వెలయు;
స్తనములు, నట్లై కు♦చంబులచివరలు,
పాదరేఖలు మూఁడు ♦ పరఁగులోఁతు
గాఁగ నాతనికిని, ♦ గంఠ, లింగములు, జం
ఘలు, పిఱుఁదులు హ్రస్వ♦ములుగ నాల్గు
తనరారు, మూఁడుసు♦ళ్లను గ్రాలి, సమముగా
వలయంబుగా, నాత♦పత్రమువలెఁ
గడువిశాలమ్ముగఁ ♦ గనఁబడు నాతని
తలయును; మఱియు నా♦తనిమనోహ
రాంగుష్ఠమూలంబు♦నందు నాలుగు రేఖ
లలరారు; ఫాలంబు♦నందుఁ బాద
తలముల, మఱిహ స్త♦తలముల నాల్గు రే
ఖలు గ్రాలుచుండును; ♦ గాయమెల్ల
షణ్ణవత్యంగుళ♦సమపరిమితమయి
కనఁబడు; నాతని♦కరములు, తొడ
లట్లై జానుద్వయ♦మారీతిఁ బిక్కలు
నాలుగు సమముగాఁ ♦ గ్రాలుచుండు;

---

నాయునికి నెఱింగి మాటలాడిరమ్మని పంపఁడని తలంచి మాటలాడియే యుండదనియు, నట్టితావుల నట్లే గూఢముగా నుంచుట మేలనియు వారిభావము. ఇంతియగాక భాషావిశేషము పాత్రోచితముగా నుండవలయు, రహస్యము లట్లేయుండవలయుననియు వారియాశయమని తేలకమానదు.

ఇట్టిమహాత్ములకు సమాధానముగా నిట నాలుగుమాటలు వ్రాయుట యనవసరమేయైనను వ్రాయవలసివచ్చినది. ప్రశ్న మొనరించినసాధ్వి త్రిలోకపావని సీత. ప్రతివచన మిచ్చువాఁడు సకలశాస్త్రవేత్త, పరమభక్తుఁడు, జ్ఞానధనుఁడు నగుహనుమంతుఁడు. కాఁబట్టి రహస్యవిషయములు గూఢముగనేఁ జెప్పఁదగియుండును. తెలియఁదగియుండుననుటకన్న వెఱ్ఱితనము వేఱొకలేదు. అట్లు హనుమంతునినోట వాల్మీకి చెప్పించిన నుచితజ్ఞుఁడగుకవి యనఁబడునా? యని ప్రశ్నించుటయు నజ్ఞానము. ఈ క్రిందివిషయములు పరికింపుఁడు. ఈసర్గమున నాల్గవశ్లోకమున సీతనోట కవి "కథమూరూ? కథంబాహూ? లక్ష్మణస్య చ శంసమే" యని పలికించెను. 38-వ సర్గమున కాకాసుర వృత్తాంతమును జెప్పుసమయమున "సమాం దృష్ట్వా మహాబాహు ర్వితున్నాం స్తనయో స్తదా" యని చెప్పించెను. అందే "కేన తే నాగనాసోరు విక్షతం వై స్తనాంతరం" అని రాముఁడు తనను ప్రశ్నించినట్లు సీతనోటఁ బలికించెను. 1 లక్ష్మణునితొడ లెట్లుండును? బాహువు లెట్టివి? 2 నావక్షోజములు చీఱంబడి గాయము గనఁబడనుండఁగా నామహాబాహువగురాముఁడు చూచి 3 ఏనుఁగు

గనుబొమల్ మఱినాసి♦కాపుటంబులు, నేత్ర
ములు, శ్రోత్రములు, పెద♦వులును, జూచు
కములు, మోఁచేతులు♦ను మనికట్టులును, మోఁ
కాళ్లును, ముష్కముల్ ♦ కటితలములు
పాదముల్ పిఱుఁదులు ♦ బాహువుల్ పదునాల్గు
సమములై యొప్పును ♦ జారురీతి;
దంష్ట్రాకృతిం దగు♦దంతచతుష్క మా
తనికి నొప్పారు; నా♦తండు వృషభ
సామజపంచాస్య♦శార్దూలములరీతి
గంభీరగమనంబుఁ ♦ గలిగియుండుఁ;
బెదవు లెఱ్ఱఁగఁదగి ♦ వెలయుబింబఫలంబు
వలె నొప్పు; హనువులు ♦ బలువుగలిగి
యలరారు; నిమదయై ♦ వెలయునాసికయు; నే
త్రంబులు, దంతముల్ ♦ రమ్యదేహ
చర్మ, మంఘ్రులును, గే♦శంబులు నైదును
నిగనిగలాడుచు ♦ నెగడుచుండు;

---

తొండమువంటి తొడలుగలయోసీతా! నీ స్తనములనడుమ నెవ్వఁ డిల్లుచీలెను? అని పైవాని యర్థములు.

పైశ్లోకములు రామాయణమున నున్నవని స్పష్టముకదా? సీత విదుషీమణి. హనుమ అప్పటికి సీతదృష్టికిం గ్రొత్తవాఁడు. సీతచిత్తమున నీతఁడు రామదూతయా? రాక్షసుఁడా? యనుసంశయము పీడలేదు. అట్టిఘట్టమున నామహాసాధ్వినోట మహాకవిశిరోమణి యగువాల్మీకి వానిచేతి యము పీడలేదు. తొడ లెట్టివని ప్రశ్నించినట్లు చెప్పినాఁడుగదా? పరపురుషునియెదుట తనభర్త తనతో ''నేమఁను తొండమువంటితొడలుగలదానా! యని పిలిచి నీ స్తనమధ్యభాగము నెవఁడుంచెను?'' అని యడిగి నట్లు సీతనోటఁ జెప్పించెను. ఈకారణములంబట్టి వాల్మీకికి నుచితజ్ఞత లేదనుట యుక్తమా? కంఠని చెప్పుట న్యాయమా? ఇట్లెన్నియోతావుల నిట్టివాక్యములు గలవు. వానిం జూపఁబూనుకొనుట యాక్షేపకులకన్న వెఱ్ఱితనమే. సమాధాన మిట్లుచెప్పఁదగును. సీత ''కీదృశం తస్య సంస్థానం రూపం రామస్య కీదృశం, కథ మూరూ కథం బాహూ లక్ష్మణస్య చ శంసమే'' యనుశ్లోకరూపమున హనుమను జూచి ప్రశ్నింపలేదు. హనుమంతుఁడును, ''త్రిస్థిర స్త్రిప్రలంబశ్చ........రాఘవః.'' అని శ్లోకమున బదులుచెప్పలేదు దుఃఖసాగరమున మునింగియున్నసీత హనుమంతుఁ డొనరించిన రామ కుశలవార్తాశ్రుతిని నాలకించి యుండక యూఁతడిల్లి రాక్షసమాయ లనుసంశయమున ''క్వ తే రామేణ సంసర్గః కథం జానాసి లక్ష్మణమ్'' ఇత్యాది శ్లోకార్థప్రాయము గలదియై రామదూతయే యైన రామసన్నిధిని గొంతకాలమైన నుండును గాన రామునిగుణములు దెలిసియుండును. అదిగి చూచి తర్వాత నిశ్చయింతు నని యూహించి ఆర్యా! నీవు రామదూత వేయైన యెడల రాముని దేహమునఁ గలగుణములు చెప్పుము. అట్లే లక్ష్మణునిగుణములు చెప్పుమని యడిగియుండును. హనుమ తా నెఱిం

నతనివెన్నును, మేను ♦ నంఘ్రికరాంగుళుల్
కరనాసికాక్షులు ♦ కర్ణములును
బురుషావయవమును ♦ బొడవుగా నుండును;
నాస్యము, నోరును ♦ నక్షి, జిహ్వ
లును, బెదవులు, చన్ను♦లును మఱిదవుడలు,
కరపదనఖరముల్ ♦ క్రమరీతిఁ
బదియును బద్మంబు♦వలె నొప్పుచుండును;
దలయు, శ్రోత్ర, లలాట♦ములు, గళంబు
వక్షంబు, హృదయంబు, ♦ కుక్షియుఁ బిఱుఁదులు,
పదములు, కరములు ♦ పదియుఁ బెద్ద
విగనుండు; యశమున ♦ విపుల తేజంబున,
సంపత్తినాల్గుదె♦సల నతండు
వ్యాపించియుండును ♦ నాతనిదంతముల్
కనులును, దెల్లగాఁ ♦ గ్రాలుచుండుఁ;
గక్షంబు, కుక్షియు ♦ వక్షంబు, నాసయు,
స్కంధ, లలాటముల్ ♦ కానఁబడును

---

గినవిషయములు విడువక చెప్పి నమ్మకము పుట్టించియుండును. ఈఘట్టమునఁ గవిశిరోమణియగు వాల్మీకిమహర్షి మహాపురుషలక్షణము లన్నియు రామునియందున్నట్లు హనుమన్ముఖమునఁ బల్కించెను. వానియర్థమును జదువరులకుఁ దెల్పుట కవికిం గర్తవ్యము. కాని యారహస్యమును రహస్యముగానే యుంచవలెననుట పాడిగాదు. దీనిచే వాల్మీకి యుచితజ్ఞుఁడు కాఁడని తేలునేమోయని భీతినొందుట వెఱ్ఱితనము. మఱియు మాతృభావముగలిగి జ్ఞాననిధియగుహనుమకు ఈమాటచెప్పినఁ గొంపమునుఁగునని భీతియుండదు. పుట్టుసన్న్యాసి యనఁబడు శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యులు సౌందర్యలహరియందు "క్వణత్కాంచీదామా కరికలభకుంభ స్తననతా పరిక్షీణా మధ్యే పరిణతశరచ్చంద్రవదనా" అని శ్రీపరమేశ్వరిని నుతించెను. స్తనములప్రస్తావ మాసన్న్యాసికేల? యని ప్రశ్నింపరాదు. నిష్కల్మషహృదయులగు హనుమత్ప్రభృతుల కట్టితావుల నేదియుఁ దప్పుగాఁ దోఁచదని కొందఱు సమాధానము చెప్పుదురు. అది న్యాయమే. అయితే తెనుఁగున నట్టితావులఁ గవి జాగరూకుఁడై తేటతెల్లమగుపదములతోఁగాక యించుక గూఢముగానున్నపదములతో నాయర్థమును జెప్పవలయుననుట సర్వసమ్మానార్హవిషయము. వ్యాఖ్యాతలభావము కవిది కాకపోవచ్చునని పలుకుట మూర్ఖపద్ధతి యనవచ్చును. ఏలయన నాశ్లోకమునకు నర్థమేదియైనఁ జెప్పిన నది కవిదని యెట్లు నీకుఁ దెలిసినదని ప్రశ్నము రావచ్చును. అప్పుడు నోరుమూసికొనక తప్పదు. కాఁబట్టి వ్యాఖ్యాతలయభిప్రాయమే లేకున్న రామాయణ మింతప్రాశస్త్యమును జెందియుండదు. దానియం దిట్టిరహస్యార్థములు గలవని తెలిపినవారు వారే. ఆమహాత్ములభావములను దెనుఁగునఁ జెప్పఁజాలకపోతిమని చింతిల్లవలయునేగాని యేలచేర్చితిమని దుఃఖింపరాదని పాఠకు లూహింతురుగాక. ఇట్టియాక్షేపములకు సమాధాన మింతకన్నఁ బెంచి వ్రాయుటకన్నఁ బెద్దల నడిగినఁ దెలియునని చెప్పుటకూడ సరసమే యని తోఁచెడిని.

నున్నతంబులునయి; ♦ యొప్పునంగుళిపర్వ
ములు, కేశములు, రోమ♦ములు, నఖములు
చర్మలింగములు, మీ♦సంబులు, దృష్టిబు
ద్ధులు, సూక్ష్మములగునీ♦తొమ్మిదియును;
నతఁడు పూర్వాహ్ణమ♦ధ్యాహ్నపరాహ్ణంబు
లను మూఁడుకాలంబు♦లను దగంగ
ధర్మార్థకామముల్ ♦ తా నాచరించును,
సత్యధర్మపరుండు ♦ నిత్యలక్ష్మి

తే. గల్గువాఁడును, ద్రవ్యసం♦గ్రహ మొనర్చి
దాని సత్పాత్రములకెల్ల ♦ దానమిచ్చు
వాఁడు దేశకాలంబుల♦వైఖరి నెఱుఁ
గంగఁ దగువాఁడు శ్రీరఘు♦కాంతుఁ డబ్జ. ౨౦। 1342

క. జనులకునెల్లఁ బ్రియంబుగ, ననవరతము మాటలాడు♦నా శ్రీరఘుభూ
పుని సవతితల్లికొమరుం, డనిమొన నోటమియె లేక ♦ యలరుం జాబ్జా. ౨౧।

క. అనురాగంబున సూపం,బునఁ దక్కినసుగుణవార♦మున నాతఁడు రా
మునివంటివాఁడె తల్లీ, జనకసుతా వినుము పురుష♦సత్తములగుచున్. ౨౨

క. అనిహతవిక్రము లగునా,మనుజేంద్రులిర్వు రెవుడు ♦ మానవిపూన్కిన్
నినుఁజూడ నాతురంపడు,చును భూస్థలినెల్ల వెదకు♦చున్ వగపాలై. ౨౩ 1345

క. తిరుగుచునుండఁగ నొకచో, ధరణీధరనికటమందుఁ ♦ దల్లీ మాతోఁ
బరఁగె సమాగమ మారఘు,వరులకు; నాసోదరులొగి ♦ వసుధ నినుఁ గనన్.

తే. సంచరించుచుఁ బోయి భా♦స్కరతనూజు
వనచరేంద్రుసుగ్రీవుని ♦ వాలియనెడు
నగ్రజుఁడు రాజ్యముననుండి ♦ యవలఁ ద్రోయ
నన్నభయమున మిక్కిలి ♦ యార్తుఁ డగుచు. ౨౪। 1347

క. తరువరగణసంకులమై, పరఁగెడునా *ఋశ్యమూక♦పర్వతభూపాం
తరమున నుండఁగఁ గాంచిరి, తరుణీ! ప్రియదర్శనుం డ♦తం డగుఁ జాబ్జా.

క. తనయగ్రజుండు రాజ్యం,బుననుండఁగ వలదటంచుఁ ♦ బూనికఁ ద్రోయన్
జనుదెంచుసత్యసంగరు, వనచరపతి మేము గొలుచు♦వారము తల్లీ. ౨౬ 1349

క. తరువాత నారచీరలు, ధరించి వరకార్ముకములఁ ♦ దాలిచి యాభూ
ధరరమ్యభాగమున్ రఘు,వరు లొందిరి; వారిఁ బురుష♦వాసవులఁ దగన్. ౨౭

చ. ధనువులు దాల్చి వచ్చినప్ర♦తాపమహోదధులన్ గనుంగొనన్;
వనచరనాథుఁ డంతభయ♦భారవికంపితచిత్తుఁడై యిదే

---

* పర్వతభూపాంతరమునన్=పర్వతరాజమధ్యభాగమునందు.

మని తలపోయలేక యవు♦డాగిరిశృంగముమీఁది కొక్కరీ
తి నెగిరె; నంతనాతఁ డటఁ ♦ దేకువమాలి వసించి యార్తుఁడై. ౨౮    1351

క. త్వరగా నన్నే యారఘు,వరుఁ డుండెడుచోటికనిపె; ♦ వానరపతి యు
త్తరువునఁ బురుషశ్రేష్ఠుల, వరరూపసులక్షణములఁ ♦ బరఁగెడువారిన్. ౨౯

క. కననేగి కృతాంజలినై, జననీ! నిలువంగఁబడితి; ♦ సాధుత్వమునం
బెనుపొందువారివిషయం,బును జక్కఁగ నెఱిఁగి ప్రీతిఁ ♦ బూనినవారిన్.

తే. వారినిర్వుర నావీఁపు♦పైఁ రయమునఁ
గొంక కెక్కించుకొని తీసి♦కొని మదధిపుఁ
డున్నయెడ కేగితిని; [1]నున్న♦దున్నయట్లు
వారివృత్తాంతమేను నా♦భానుజునకు. ౩౦    1354

క. తెలిపితి నంతట వారుభ,యులు చక్కఁగ మాటలాడి ♦ రొగి నంతట వా
రలకుఁ బరస్పరమైత్రియుఁ, గలిగె; హరీశ్వరుఁడు మనుజ♦కాంతుం డంతన్.

తే. ప్రీతిసంపన్నులై సంభ♦వించియున్న
కష్టములఁ దెల్పుకొనుచు నొ♦క్కరు మఱొకరి
నూఱడిలఁ బల్కుకొని యంత ♦ నూఱడిలిరి;
భాస్కరాత్మజుఁ డొక్కట ♦ భార్యకొఱకు. ౩౩    1356

క. ఘనతేజంబున నొప్పిన, తనయగ్రజుచే నిరస్త♦దర్పుండయి చెం
దినయవమానము తెల్పిన, విని రాఘవుఁ డూఱడించె ♦ విగతభయునిగన్.

క. [2]ఒరులకుఁ గష్టము గల్గెడు, పరుషవుఁబను లెవ్విచేయ ♦ వాంఛింపనియా
పురుషలలామునకున్ రఘు,వరునకుఁ ద్వద్దర్శనంబు♦వలనన్ మదికిన్. ౩౪

క. కలిగినదుఃఖములెల్లం, దెలిపెన్ లక్ష్మణుఁడు మా య♦ధిపునకు; విని య
ప్పలుకుల సుగ్రీవుఁడు తన,వలెనే తనమిత్రుఁడైన ♦ వసుధేశునకున్. ౩౫

క. పెనుదుఃఖము గల్గెంగద, యని [3]రాహుగ్రస్తుఁడైన♦యర్కునివలె మో
మునఁ జింతతోఁపనుండెను;, దనుజుఁడునినుఁగొంచుఁబోవు♦తరుణమునందున్.

తే. నీవు నీయంగములయందు ♦ నెలకొని తగు
నాభరణములఁ గొన్నింటి ♦ నవనివైచి
తివిగదా వానినెల్ల న♦ధిపునియాజ్ఞ
హరివరులు తెచ్చి చూపిరి ♦ ధరణిపతికి. ౩౭    1361

ఉ. అంతియకాని నీవు చని♦నట్టిప్రదేశము చెప్పలేక వా
రంతట నూరకుండి; రవి ♦ యంబరమార్గమునుండి భూమి న

---

1 నివేదితా చ తత్త్వేన-అనిమూలము. 2 రామస్యాక్లిష్టకర్మణః-అనిమూ. 3 తదాసీన్నిష్ప్రభోత్యర్థం గ్రహగ్రస్తఇవాంశుమాన్-అనిమూ.

త్యంతరవంబునం బడఁగ ♦ దధ్వనిన్ విని నేనెపోయి ము
న్నెంతయు నాస్థలిన్ జెదరి♦యే కనుపట్టఁగఁ దెచ్చినాఁడఁజూ. ౩౯ 1362

క. [1]వానిని సుగ్రీవుఁడు రఘు,సూనునకున్ జూపె; నతఁడు ♦ సురతేజం బ
ర్వానిం జూడంగఁగుటన్, దానెంతయుఁ బ్రీతిఁగాంచి ♦ తనతోఁ బలపయిన్.

క. ఉనుచుకొని పెక్కుభంగుల, వనితా! పలవించె; వానిఁ ♦ బలుమాఱులు తాఁ
గనుచుం బొగులుచుఁ దాపం, బును బొందుచునుండె; నవ్వి♦భూవరుఁ కోరిన్.

ఆ. [2]కంటఁబడినయంతఁ ♦ గడుశోకవహ్నిని, మండఁజేసె; నంత ♦ మహితచిత్తుఁ
డైనరాముఁ డుగుత♦రాత్రిని గుందుచుఁ, జాలసేపు మూర్ఛ ♦ సోలియుండె.

క. అనుజుఁడు నేనును బూనిక, వనచరనాయకుఁడు వివిధ♦వాక్యంబులఁ దే
ర్చిన నెట్టకేల కాతఁడు, తనయెప్పటి తెలివిగలిగి ♦ తా లేచె సతీ. ౪౨ 1366

క. గురుబాహాబలుఁ డగునారఘు,వరుఁ డనుజునిగూడి వానిఁ ♦ బలుమఱుగని కీ
శరమణునకుఁ జూపుచు న,త్తరుణమున నె వాని సూర్య♦తనయున కొసఁగెన్.

క. [3]కనఁబడకయె నీవుండుట, ఘనుఁడో రాముండు మంట♦గా మండెడున
గ్నిని దాపంబునఁ బొందెడు, ననలగిరీంద్రంబుపగిది ♦ ననవరతంబున్. ౪౪

ఆ. [4]తాపమందుచుండుఁ; ♦ దరుణిరో మహితాత్ముఁ,డైనరాఘవుండు ♦ నీనిమిత్త
మయియె నిద్రలేమి ♦ నధికదుఃఖంబునఁ, జింతచేత మిగులఁ ♦ జిక్కపడుచు.

క. అనలముచే నగ్నిగృహం, బునుబోలి తపించుచుండు; ♦ భూపతి త్వద్దర
ర్శనశోకంబునఁ గుందుచుఁ, [5]జెనుభూకంపమునఁ గదలు♦విపులగిరివలెన్. ౪౬

క. చలియించుచున్నవాఁ; డో, లలనాతిలకంబ నిన్ను ♦ లక్షింపమి మి
క్కిలి రమ్యములౌ కానన, ముల, నదులను, నిర్ఝరముల ♦ మొనసి తిరిగియున్.

ఆ ఇంచుకంతమదిని ♦ తృప్తినొందక యున్న
వాఁడు; వినుము పురుష♦వర్యుఁ డతఁడు
పుత్రమిత్రయుతునిఁ ♦ బొలియించి రావణుఁ
బొందఁగలఁడు నిన్నుఁ ♦ బొలఁతి వేగ. ౪౮ 1372

క. వనచరపతియును రాముఁడు, నిను వెదకింపంగ వాలి♦నిం జంపఁ బ్రతి
జ్ఞను జేసికొనిరి; తరుణీ, విను మవ్వల [6]నాకుమార♦వీరులిరువురున్. ౪౯

క. చని కిష్కింధకు యుద్ధం, బున వనచరనాథువాలిఁ ♦ బొలియించిరి; వై
రిని జంపి రాముఁ డొసఁరిచె, వనచరభల్లూకతతికి ♦ భానుజుఁ బతిగన్. ౫౦

---

1 తా న్యంకే దర్శనీయాని కృత్వా బహువిధం తవ-అనియూ. 2 ప్రాదీపయత్ దాశరథేః ప్తాని శోకహుతాశనమ్ - అనియూ. 3 మహాత్మా జ్వలతా నిత్య మగ్నినే వాగ్నిపర్వతః - అనియూ. 4 త్వత్కృతే తమనిద్రా చ శోక శ్చింతా చ రాఘవమ్-అనియూ. 5 మహాత్మా భూమికంపేన మహా నివశిలోచ్చయః-అనియూ. 6 తత ప్తాభ్యాం కుమారాభ్యామ్-అనియూ.

క. దేవీ! రామార్కజులకు, నీవిధమున మైత్రిగలిగె ♦ నే హనుమ యనం
గా [1]వాయుజుఁ డననొప్పుదు, నే వారలదూత నగుచు ♦ నిటవచ్చితిఁ జూ.

ఉ. వారలయాజ్ఞ మౌళినిడి ♦ వచ్చితినంచుఁ దలంపు; మట్టులా
సారసమిత్రసూనుఁడును ♦ శౌర్యముఁ బొంగఁగ రాజ్యమొంది గం
భీరమనస్కులై బలము ♦ విక్రమముం దగనున్నవారలన్
వీరుల వానరేశ్వరుల ♦ వేగము పిల్చి త్వదర్థ మందఱన్. ౫౩ 1376

క. నలుదెసలకుఁ బంపెను; సుజ్జ్వలతేజుండైన కీశ♦సత్తమునాజ్ఞన్
దలనిడి [2]పెనుగొండలవలెఁ, బొలుపారెడుకపులు చనిరి ♦ భూమి నినుఁ గనన్.

క. [3]సుగ్రీవుని యానతి యత్యుగ్రంబని జంకి నిన్ను ♦ నుర్విని వెదకం
గాఁ గ్రమమున మత్ప్రభృతులు, నుగ్రబలం బూని తిరుగు♦చున్నారు సుమీ.

తే. అందు శ్రీసంయుతుండు మ♦హాబలుఁడును
నైనయవ్వాలిప్రియపుత్త్రుఁ ♦ డంగదుండు
భటగణంబున [4]మూఁడవ♦భాగముఁ గొని
బయలుదేరెను; మేమెల్లఁ ♦ బంతమూని. ౫౬ 1379

క. నినువెదకుచుఁ జని వింధ్యం, బనుపర్వతరాజమందు ♦ నలరునొకబిలం
బునఁ జిక్కి మరలి రా లేక నిలిచి దుఃఖాతురులము♦గా నుండంగన్. ౫౭

క. చనియెను బెక్కుదినంబులు; మనముల మాకెల్ల నింత♦మహితంబగుని
ప్పనినిన్ సాధింపంగల, మను నాశయె లేమి, దినము♦లందుఁ గడచుటన్. ౫౮

ఆ. దాన గడవుచనుటఁ ♦ దరలి వెన్కకుఁబోవఁ
గఠినశిక్షచేయుఁ ♦ గపిపతియను
భయమునను గలంగి ♦ ప్రాణముల్ విడువంగ
నిశ్చయించితిమి య♦నింద్యచరిత. ౫౯ 1382

క. వనదుర్గగిరుల సెలయేళ్లను వెదకి భవన్నివసతి ♦ లక్షింపఁగ లే
కనిలిచి యందే ప్రాణము, లను వదలఁగ నెంచితిమి త♦లంపులు చెదరన్.

సీ. ప్రాయోపవిష్టులై ♦ ప్రాణపరిత్యాగమును నిశ్చయము చేసి♦కొనినకపుల
నందఱఁ గనుఁగొని ♦ యంగదుం డటశోకసాగరమగ్నుఁడై ♦ జనని నీవు
కనఁబడకుండుటఁ ♦ దనతండ్రి వధియింపఁబడుట, మే మివ్విధిఁ♦బ్రాణములను
వదలంగఁ బూనుట ♦ భవ్యచిత్తుండగునాజటాయువు మృతి♦నందియుంటఁ
తే. దలఁచి పలవించె; నధిపు న♦త్తరువుఁ దలఁచి
ప్రాణములయందు నాశను ♦ వదలి చావఁ

---

1 హనూమంతం చ మాం విద్ధి-అని మూ. వాయుజుఁడను-అనునది ప్రకృతోపయుక్తమని చేర్పఁబడినది. 2 అద్రిరాజప్రతీకాశాః-అని మూ. 3 సుగ్రీవవచనాతురాః-అని మూ. సుగ్రీవాజ్ఞాభీతాః-అని వ్యాఖ్య. 4 త్రిభాగబలసంయుతః-అని మూ. ఇట హనుమ యంగదుని వర్ణించుటచే స్వామిభక్తి తేటపడునని యెఱుంగునది.

దలఁచియున్నట్టిమాకార్య ♦ మెలమిఁ దీర్ప
వచ్చెనన [1]శౌర్యనులరంగఁ ♦ బక్షియొకఁడు. ౬౬ 1384

క. చనుదెంచె జటాయువునకు, ఘనునకు సోదరుఁడు గృధ్ర ♦ కాంతుండగు నా
తనినామము సంపాతి య,తనితమ్ముఁడు చంపఁబడుటఁ ♦ దా విని యంతన్.

తే. అమితకోపంబుఁ బొంది యి ♦ ట్లనియె నతఁడు:
చంపె నెవ్వఁడు నాయను ♦ జాతు, నెచటఁ
గూల్చె నీవార్త మీరు నా ♦ కుఁ దగఁ జెప్పు
డలయు; ననవిని యంగదుం ♦ డు లలితాంగి. ౬౭ 1386

తే. నీనిమిత్తముగా జన ♦ స్థానమందు, భయదరూపంబు గలుగురా ♦ వణుఁడు కఠిన
పద్ధతిని బూని యాతని ♦ బవరమందుఁ, జంపినది చెప్పె నవ్వార్త ♦ జరిగినట్లు.

క. అరుణాత్మజుఁ డతఁడు సహో,దరువధమును వినుచు వగచి ♦ తద్దయు దుఃఖా
తురుఁడయి రావణుగృహమునఁ, దరుణీ నీవుంటఁ జెప్పెఁ ♦ దగువిధ మలరన్.

చ. అతఁడు వచించినట్టిప్రియ ♦ మందఁగఁజాలినవార్త దానిమే
మతిశయభక్తితో వినుచు ♦ హర్షము పొంగఁ బ్రయాణమైతి మా
క్షితి విడనాడి వేగ; నినుఁ ♦ జేరి కనుంగొను వేడ్క పైఁబయిన్
జతనమునం జెలంగఁ బెను ♦ శైలమునుండి ప్రయాణమై సతి. ౬౮ 1388

తే. సాగరోత్తరతీరంబు ♦ సరగఁ జేరి
రెల్లవానరు; లంతని ♦ న్నెలమిఁ గనఁగఁ
గౌతుకమునొంది సంభ్రము ♦ గట్టుఁ జేరి
దానిఁ గని చింతచేయంగఁ ♦ బూని రొకట. ౬౯ 1390

క. సరిదధిపతిఁ గని చింతిలు, హరిసైన్యముఁ గాంచి తద్భ ♦ యము పోవఁగ భీ
కరశతయోజనమితసా,గరమును లంఘించినాఁడఁ ♦ గడువడిఁ దల్లీ. ౭౦ 139[illegible]

క. దనుజాఘనిబిడమగు లం,కను రాత్రి నేను జొరఁగఁ ♦ గల్గితి, దనుజే
శుని జూడఁగంటి దుఃఖం, బునఁ గుందెడునిన్నుఁ గంటిఁ ♦ బూతచరిత్రా. ౭౧

క. [2]ఉన్నది యున్నట్లుగ నీ, సన్నిధి నెఱిఁగించినాఁడ ♦ జననీ, నను శ్రీ
సన్నుతుదూతఁగ నీ విపు, డెన్నుము నాతోడఁ బల్కు ♦ మింక నిజముగన్.

ఆ. నేను రాముఁ డనుప ♦ నీకొఱకిచటికి, వచ్చినాఁడఁ బ్లవగ ♦ వర్యమంత్రి
ననిలసుతుఁడ, [3]మోన ♦ మును బూని వచ్చిన, రాక్షసుఁడనుగాను ♦ రాజవదన.

సీ. తరుణిరోనకలాస్త్ర ♦ ధరులందు మేటియై కాకుత్స్థులందు వి ♦ ఖ్యాతినంది
యున్ననీపతి రాముఁ ♦ డున్నాఁడుకుశలియై, గురుపూజయందు ద ♦ క్షుఁడయి సర్వ

---

1 శకుని ర్వీర్యవాన్ మహాన్-అనిమూ. 2 ఏత త్తే సర్వ మాఖ్యాతం యథావృత్త మనిం దితే-అనిమూ. 3 ఈమోసము ప్రకరణవిషయపరిపోషకమాటఁ గ్రొత్తదిగఁ జెప్పఁబడినదని యెఱుంగందగు.

లక్షణాకరుఁడయి ♦ లక్ష్మణుండును క్షేమమున నున్నవాఁడు;నీ♦పెనిమిటియయి
వీర్యవంతుండయి ♦ వెలయుశ్రీరాముని హితమునుగోరి క♦పీశునాజ్ఞ

తే. నొక్కఁడనె యేనువచ్చితి ♦ నిక్కడకును;
గామరూపి నేనొక్కఁడ♦నై మహీజ
నీవు చన్నట్టిత్రోవను ♦ నేనెఱుంగఁ
దలఁచి తిరుగుచుఁ జేరితి ♦ దక్షిణదిశ. ౨౬ 1395

క. జననీ నాభాగ్యవశం, బున నినుఁగన్గొంటి వగలఁ ♦ బొగులుచుఁ దగు న
వ్వనచరసేనల తాపం,బును దీర్పంగలను గుశల♦మును జెప్పుటచేన్. ౨౭ 1396

చ. అనుపమమైనభాగ్యమున ♦ నంబుధి దాఁటుట సార్థకంబ య
య్యెను [1]నినుఁజూడఁగల్గితిని ♦ నిందునఁ గల్గెడుభూరికీర్తినిం
గనుటకు నోచినాఁడ; నృప♦కాంతుఁడు భూరిపరాక్రమంబునన్
దనుజవరేణ్యురావణుని ♦ దప్పక వేగ సమిత్రబాంధవున్
ఘనతరశక్తిఁ జంపి నినుఁ ♦ గైకొనఁగాఁ గలవాఁడు తల్లిరో. ౨౮ 1397

చ. [2]అనిలున కాత్మజుండ నని ♦ యంటివి కోఁతివదెట్లులైతి వా
తనికి సుతుండవంచు నను ♦ దల్లిరొ ప్రశ్నమొనర్తువేమొ భూ
ధ్రనిచయమందు శ్రేష్ఠమయి ♦ రాజిలుచుండును మాల్యవంతమన్
ఘనగిరి, యందు నుండుఁ గపి♦కాంతుఁడు కేసరినాముఁ డొక్కటన్. ౨౯

క. వనచరుఁ డతఁ డప్పర్వత, మును విడి గోకర్ణశైల♦మునకుం జనియెన్;
జనకుఁ డతండే నా కగు, మునివరులయనుజ్ఞ నతఁడు ♦ ముదమున నందున్.

ఆ. పుణ్యవంతమగుచుఁ ♦ బొలుచునంబుధితీర
మందు శంబసాద♦నాసురవరుఁ
జంపె; నంజనయను♦సాధ్వి యాతనిపత్ని
యలరుఁ గేసరియును ♦ నందె యుండ. ౩౧ 1400

సీ. ఆతనిపత్నియం ♦ దనిలునివలన నే జనియించితి, [3]స్వకర్మ♦మున నె నాకు
హనుమంతుఁ డనునామ♦మలరె;నీమదినమ్మకముగల్గుటకు రఘు♦కాంతుగుణము
లను వచించినవాఁడ ♦ జనకజా; రాఘవుం డింక వేగమె వచ్చి♦యిచటనుండి
కొనిపోవఁగలఁడు ని;♦న్నని శోకకర్శితయైనసీతకుఁదగి♦[4]నన్ని హేతు

తే. వులను నమ్మికఁ బుట్టింప ♦ లలన యతఁడు
తనకుఁ జెప్పిన గుర్తులె♦ల్లను దగినటు
లుంట నాతని దూతయై ♦ యుండవచ్చు
ననుచు నమ్మెను; జానకి ♦ యంతమదిని. ౩౨ 1401

1 త్వద్దర్శనకృతం యశః-అనిమా. 2 వానరస్య తవపవనాత్మజత్వం కథమ్ - అనివ్యాఖ్య.
3 హనుమా నితి విఖ్యాతో లోకే స్వే నైవ కర్మణా-అనిమా. 4 ఉపపన్నై రభిజ్ఞానై ర్దూతం త
మవగచ్ఛతి-అనిమా.

[1]క. ఎవ తేనివంతసంబును, గని దానఁ గుటిలపక్ష్మ♦కాంతము లగుచుం
దన రెడునక్షులనుండియె, యనూనహర్షాంబువులను ♦ నల్లనవిడిచెన్. ౨౫

తే. [2]తామ్రశుక్లాయతాక్షిని♦కాంతరుచిర, మగుమహీపుత్రి చెల్వగు♦నట్టిమోము
రాహుని ర్ముక్తతారకా♦రాజుభంగి, వెలసె; నంతట నామె య♦నిలతనూజు.

క. వనచరుఁడేయగు మాయం, గొని రాలేదనుచుఁ దలఁచెఁ♦గోరి యతఁడు నా
మెను బ్రియదర్శనఁ గని యిట్లనియె; నచటివార్త లేను ♦ నన్నియు నీకున్.

ఆ. తెలిపినాఁడ నూఱ♦డిలు మింకజానకీ!, యిప్పుడేమొనర్తు ♦ నేను దావ
కేష్టమెట్టులున్న ♦ దిపుడె యానతియిమ్ము, మరలిపోవువాఁడ ♦ మహిపుకడకు.

చ. మునివరులాజ్ఞ చేయఁ గపి♦ముఖ్యుఁడు కేసరిశంబసాదనుం
డనుసురవైరి యుద్ధమున ♦ నంతము నొందఁగఁజేయ దాననే
యనిలుఁడు మెచ్చి యాతనికి ♦ నాత్మజుగా నను నిచ్చెఁ గాన నా
తనికృప నేను గల్గితిని ♦ [3]దత్సమశౌర్యుఁడ వానరుండఁజా. ౨౯ 1406

ముప్పదియెనవ సర్గము సంపూర్ణము.

---

## ౩౯ - వ సర్గము.

హనుమంతుఁడు సీతకు రామాంగుళీయకము నిచ్చుట.

చ. అనివచియించి గొప్పది య♦హార్యమునై తగువిక్రమంబు నొం
దినయనిలాత్మజుండు ధర♦ణీప్రియపుత్రికి నమ్మకంబుగ
ల్గను మరలన్ వచించె నిటు ♦ కమ్రతరస్వన మొప్పుచుండఁగా
వినయము మీఱ; నోజనని ♦ వీరుఁడ వానరుఁడన్ గృతార్థుఁడన్. ౧౪ 1407

ఆ. బుద్ధిమంతుఁ డగుచుఁ ♦ బొలుచు రాముని దూత
దేవి! చూడు మిదిగొ ♦ [4]దివ్యరామ
నామముద్రితంబు ♦ క్షేమవార్తను దెల్పు
నంగుళీయకము మ♦హార్హతనుము. ౫ 1408

తే. అమ్మహాత్ముఁడు రాఘవుఁ ♦ డాత్మ నీకుఁ
బ్రత్యయము గల్గుటకునిచ్చెఁ ♦ బరమహర్ష
మలరఁ దెచ్చితి [5]నీవు నూఱ♦డిలుము శుభము
గలుగుఁగావుత నీకు దుః♦ఖంబు లడఁగె. 3 1409

---

1 నేత్రాభ్యాం వక్రపక్ష్మాభ్యాం ముమోచానందజం జలమ్-అనిమూలము. 2 తామ్రశుక్లాయతేక్షణమ్-అనిమూలము. 3 ప్రఖ్యాత స్తత్ప్రతిమశ్చ వానరః-అనిమూలము. 4 రామనామాంకితం చేదం పశ్య దేవ్యంగుళీయకమ్-అనిమూలము. రామనామాంకిత మనఁగా రామనామాక్షర ముద్రితమనియే యర్థము. రామాయణకాలము నాఁటికే తెలుఁగు దుర్యాత్ప్రవృత్తమున ...... సమము కావచ్చుఁగదా. 5 సమాశ్వసిహి భద్రం తే క్షీణదుఃఖఫలా హ్యసి-అనిమూలము.

సీ. [1] ప్రియబంధువునుజూచి♦ప్రీతినొంది గ్రహించునట్టుగా గ్రహియించి♦యంగుళీయ
కము పైనిజేర్చిన♦కనుల మరల్పఁగాఁ జాలక చూచుచు ♦ శ్వసనతనయుఁ
గపటవేషముఁ బూని ♦ కడుఁదాపునకు వచ్చినట్టిరావణునిగ ♦ నాత్మశంక
నంది యిప్పుడు తన♦సుందరుదూతగా నిశ్చితచిత్తయై ♦ నెగడుచున్న
యాసీత యొకసమ♦యంబునఁ బ్రణయకోపము గల్గి ప్రియునితోఁ♦బలుకులేని
లేనియట్టులు బింక♦మూనియుండఁగ రాముహస్తాంగుళీయక ♦ మవనిజాతి
పడిన నాసెపమునఁ ♦ బ్రాణేశ, యంగుళీయక మిలఁబడెననె ♦ నంతఁ గోప
మంతరింపఁగఁ బూర్వ ♦ మట్లుగాఁ బ్రణయంబుగల్గె నట్టిదియగు♦కరవిభూష
ఆ. ణము గ్రహించి ప్రాణ♦నాయకురీతిని, గనుచు మించుచున్న♦గాఢహర్ష
మొందె; సంతసంబు ♦ నొందుటఁదాప్రశు,క్లాయతేక్షణమగు♦నామెమోము.

తే. [2] రాహుని ర్ముక్తతారక♦రాజురీతి
నపుడు భాసిల్లె; నాబాల ♦ యంతభర్త
వార్త విన్నందులకుఁ దమి ♦ వఱల మేను
పులకరింపఁగ సిగ్గును♦బొంది యపుడు. ౫౹ 1411

క. పరితుష్ట యగుచు నవ్వన,చరవర్యునిఁ బొగడఁజొచ్చె; ♦ శ్వసనతనూజా
సురవైరిపదము దీని నొ,కరుఁడవె కని చొచ్చినావు ♦ గావున నిలలోన్. ౬౹

క. నీవెసమర్థుఁడవనిరన్, నీవేప్రాజ్ఞుండ వనిన ♦ నిర్భరశౌర్య
ప్రావీణ్యము గలవాఁడవు, నీవే నినుఁబోలువాని ♦ నేఁ గనఁజాలన్. ౭ 1413

క. ఘోరగ్రాహాలయమై, యారయ శతయోజనాయ♦తాకృతితో నా
పారెడునీసాగరమును, ధీరతగోష్పదముభంగిఁ ♦ దీవ్రత్వరతోన్. ౭౹ 1414

తే. [3] దాఁటితివిగాదె నీశౌర్య♦ధైర్యములను
బొగడఁజాలను దానవ♦పుంగవుఁడగు
ఘోరరావణువలన నీ♦కున్ భయంబు
తొట్రుపాటును గల్గవు ♦ ధ్రువము సుమ్ము. ౮౹ 1415

క. కనుకనె సామాన్యుండగు, వనచరుఁడవు నీవుగావు ♦ బలశాలివి ని
న్నునుగాంచినఁ గపిమాత్రుఁడ,వని నాకుం దోఁపకున్న♦యది చిత్తమునన్. ౯

చ. వనచరవర్య! సాధుమతి ♦ వైభవయుక్తుఁడు రామచంద్రుఁడే
యనుపఁగవచ్చినాఁడ వటు♦లొటను నన్గని మాటలాడ నీ

---

1 వ్యాఖ్యయందలియభిప్రాయ మీపద్యమునఁ జేర్పఁబడినదని యెఱుంగందగు. ఇం దుద
హరించినగాథయు వ్యాఖ్యానోదాహృతమే. ఈయభిప్రాయమే తెనుఁగునఁ జేర్పకున్న నీఘట్టమున
స్వారస్యమే లేకపోవుననుటయుఁ బండితులకు సుగమమే. 2 తత స్సా హ్రీమతీ బాలా భర్తృసం
దేశహర్షితా-అనిమూలము, 3 యస్య తే నాస్తి సంత్రాసో రావణా న్నాపి సంభ్రమః-అనిమూలము.

కు నలరె నర్హభావము, త♦గుఁ బలుకంగను, నెట్టివారికై
నను నెదిరింపరానిరఘు♦నాథుఁడు ప్రాజ్ఞతముండు గావునన్. ౧౦ 1417

తే. ఎవనినింగాని తానుగా♦నే బహువిధ
ములఁ బరీక్ష నొనర్పక ♦ యొలమిఁ బనుపఁ
డఁట, విశేషించి నాయొద్ద♦కనుపఁ డతఁడు;
కానసామాన్యుఁడవు నీవు ♦ గావు తలఁప. ౧౧ 1418

చ. అతిశయధర్మచిత్తుఁడు ని♦తాంతము సూనృతవాది రాఘవుం
డతులితతేజుఁడై వెలయు♦నట్టిసుమిత్రకుమారుఁడున్ మహో
న్నతమగునాయదృష్టమున ♦ నాకులరీతిని క్షేమమొప్ప నా
క్షితిఁ దగియున్నవారు; పరి♦కింపఁగ నోప్లవగర్షభా, తగన్. ౧౨ 1419

[1]సీ. కాకుత్స్థకులుఁడురా♦ఘవుఁడు క్షేమంబుగనున్నచో ననురేంద్రుఁ♦డాకటతనదు
పత్నిని గొనిపోవ ♦ బహుళకోపంబునఁ బ్రళయకాలానలు♦పగిది మండి
పడుచుఁ దాఁ జెలరేఁగి ♦ వార్ధిమేఖలయగుధరణీతలంబెల్లఁ ♦ బగువిధమున
దహియించి యుండునే♦దహియింపఁ జేలోకో; శక్తిసంపన్నులా♦ననుజు లిర్వు

తే. రమరులకునైన నవిజేయు♦లగుదురైన
నాదుదుఃఖంబునకును నం♦త మన లేదొ
యేమొ కావున నే వార♦లిద్ధశక్తిఁ
జూపకున్నార లీదుష్ట♦సురరిపుపయి. ౧౩ 1420

క. ననుఁ దలఁచుకొనుచు దుఃఖం,బునఁ దాఁ గృశియింపఁడుగద♦పొగిలెడునన్నున్
మనమునఁ దలంచి తాపం,బును బొందఁడుగద నితాంత♦మును గపితిలకా.

క. పురుషోత్తముఁడా శ్రీరఘు,వరుఁ డార్తిం గనక చేయ♦వలసినరీతిన్
దరుణిం బొందఁగఁ దానై, జరపందగుకార్యములను ♦ జరపెడుఁ గాదే. ౧౫

క. ఆనరపతిసూనుఁడు మది, దీనత గనకాతురపడి ♦ తెలివిని నిమమం
తైనను దప్పక యూరక, తానుండక [2]పురుషకృత్య♦తతి ననిశంబున్. ౧౬

తే. చేయుచున్నాఁడుగద; కార్య♦సిద్ధిఁగోరి
యాపరంతపుఁ డాత్మమి♦త్రాళియందు
సామదానము లనఁబడు♦సరసములగు
నట్టియాయుపాయంబుల ♦ నాశ్రయించి. ౧౬ 1424

సీ. మంచిమనస్సున ♦ గాంచి ప్రయోగించుచుండునుగద తన♦యుగ్రవైరు
లను జయింపంగోరి ♦ లలి దానభేదదండోపాయములను బ్ర♦యోగవిధిని

1 ఈపద్యమున వ్యాఖ్యావిశేషార్థము చేర్పఁబడినది. కుశలీ యది కాకుత్స్థః-అనునది దీనిమూలము 2 కచ్చి త్పురుషకార్యాణి-అనిమూలము.

నుపయోగపఱచుచు ♦ నుండునుగద; సుహృజ్జనులకు నుపకార♦మును దగినటు
లొనరించుఁగద, వారి♦నుండి తా నేదైన నుపకారమును బొందు♦చుండునుగద;

తే. సాధుమతులైనమిత్రుల ♦ సరస నునుచు
కొనుచునుండునుగద వా రి♦తనిని ముందు
నిడుకొనుచు నుందురేగద ♦ పుడమిజేని
తనయుఁ డాతఁడు సతతంబు ♦ మనమునందు. ౧౯ 1425

క. సురలను వేఁడునుగద తత్కరుణను దాఁ గోరి, పురుష♦కారంబును జే
యురతిని బొందుచు దైవముఁ, గరుణింపఁగఁ గోరుచుండుఁ♦గాదె వనచరా.

క. తనువిడిచి దూరదేశంబున నే నుండుటను మైత్రి ♦ పోకున్నదిగా
మనుజేంద్రున కతనికి నో, వనచర! నాదుఃఖములను ♦ వారించుఁగదా. ౨౦

క. [1]అనిశము సుఖానుభవమునకు నర్హుఁడగుఁ గష్టతతుల♦కుం దగ కుండున్
మనుజేంద్రసుతుఁడు దుఃఖంబును నిప్పుడు గాంచికార్శ్య♦మునుబొందఁడుగా.

తే. రామలక్ష్మణజననుల♦క్షేమవార్త
లల్లె భరతునికుశలంబు ♦ నప్పుడపుడు
వినఁగఁబడుచుండుఁగద; [2]నాదు♦విషయముననె
తాను వగచుట మానార్హుఁ♦డౌనుగాదె. ౨౨ 1429

క. ననుమఱచి వేఱుకార్యంబును జేయఁగఁ దనమనసునఁ ♦ బూనఁడుగాదే
నను నీకష్టమునుండి ప్లవనజా! కడతేర్చుఁగాదె ♦ వరుసం జెప్పుమా. ౨౩

క. [3]భరతుండు భ్రాతృవత్సలుఁ, డరయంగా నాకుఁగా భ♦యంకరరీతిం
బరఁగెడునక్షౌహిణిసేన రయంబున మంత్రిరక్ష♦ణంబున నిటకున్. ౨౪ 1431

తే. పనువునాయేమి? వానర♦పతి సిరిఁదగు
నట్టిసుగ్రీవుఁడును వీరు♦లగుచు [4]దంత
నఖగణాయుధులైనవా♦నరులఁగూడి
వచ్చుఁగద నానిమిత్తమై ♦ యిచ్చటికిని. ౨౫ 1432

క. శూరుఁడు శస్త్రాస్త్రవిదుండై రామున కానుమిత్ర ♦ కానందంబున్
గూరుచు లక్ష్మణుఁ డిచటికిఁ, దా రయమున వచ్చి బాణ♦తతుల నసురులన్.

క. [5]అనిమొనఁ జెండాడునుగద; యనలునివలె మండుచున్ భ♦యంకరమునునై
తనరెడునస్త్రమున సుహృజ్జనయుతుఁ డౌ రావణుండు ♦ సంగరసీమన్. ౨౬

1 సుఖానా ముచితో నిత్య మసుఖానా మనౌచితః-అనిమూలము. 2 మన్నిమిత్తేనమానార్హః
కచ్చి చ్ఛోకేన రాఘవః-అనిమూ. మన్నిమిత్తేన శోకేన రాఘవో మానార్హః-అని యన్వయము.
3. ధ్వజినీం మంత్రిభి ర్గుప్తాం ప్రేషయిష్యతి మత్కృతే-అనిమూ. 4 దంతనఖాయుధైః-అనిమూ.
5 రావణం ససుహృజ్జనమ్-అనిమూ.

తే. అల్పకాలంబునసె యిఁక ♦ నంతమొందఁ
గాంచఁగలనుగదా; త ప్త♦కనకవర్ణ
మగుచు నంబుజపరిమళ♦మగుచు నలరు
రాముసెమ్మోము నాదువి♦రహమువలన. ౩౭ 1435

సీ. విన్ననై వగచేత ♦ విహ్వలంబయి జలక్షయమున సూర్యని♦కాంతిఁ గంది
నట్టిసరోజాత ♦ మట్లుగా వాడక యున్నదిగదె; యెవ్వఁ ♦ డుత్తరనిజ
ధర్మము గావఁగాఁ ♦ దనరాజ్యమును వీడునప్పుడు చింతయు ♦ నడవిఁ దిరుగు
నప్పుడు భయము, నే♦నడవిఁ గాల్నడకతోఁజనుదెంచుతఱిశోక♦మును గనండొ
తే. యట్టిరాముఁడు నావిర♦హమున మదిని
గలుగుధైర్యంబు విడువఁడు♦గాదె; పవన
తనయ! రాముని విడిచియుఁ ♦ దనువున నసు
వులను ధరియించితి నని నన్ ♦బలుకకు; విను. ౩౮ 1436

సీసమాలిక:—

*తల్లిదండ్రులు మఱి♦తక్కిన బంధువు లెవరైన మజ్జీవి♦తేశుఁడైన
యారామునకు మైత్రి♦యందు నాకంటెను నధికుండు సముఁడును♦నరయ లేరు
గాన రాముఁడు చాలఁ♦గష్టము లంది నా కడకువచ్చినమున్నె♦విడుతు నేని చుఁ
ప్రాణముల్,ననుఁగాంచి♦రాముఁడునశియించుఁ గాననాతనిఁబాయఁ♦గలిగె నను
బ్రాణముల్ విడువంగ♦రాదుగదా, ప్రియుఁ డిటుఁగుందు నన్ను న♦హీనశౌర్య
మలరఁ జేకొని పోవు♦నన్నవార్తను వినునంతదాఁకను మృతి♦నందకుండఁ
గోరుచున్నాను శ♦రీర మాతనిదౌట దానిని విడుచుస్వ♦తంత్ర మిపుడు
నాకెట్లుగలదు? గా♦న నతఁడు వచ్చునంతదనుక దీనిని ♦ దాల్చియుండ

* నచాస్యమాతా నపితాచ నాన్య స్స్నేహా ద్విశిష్టోస్తి మయాసమోవా, తావ త్త్వహం దూత జిజీవిషేయం యావత్ప్రవృత్తిం శృణుయాం ప్రియస్య. ఇతీవ దేవీవచనం మహార్థం తం వానరేంద్రం మధురార్థ ముక్త్వా, శ్రోతుం పున స్తస్య వచోభిరామం రామార్థయుక్తం విరరామ రామా- అనియూ, సీత హనుమంతునకుఁ దనవిషయమునఁ గలుగఁబోవుశంకలఁ దానేయూహించి సమాధానము చెప్పుచున్నది. అని వ్యాఖ్యాతలు వ్రాసిరి. దీనికి దృష్టాంతముగా రెండవశ్లోకమున "దేవీవచనం మహార్థమ్" అని వాల్మీకి వ్రాయుటయే యని వ్యాఖ్యాతల యభిప్రాయము. వ్యాఖ్యాతల యభిప్రాయ మంగీకారముకానిచో నీలాటిశ్లోకముల కర్థము నిరర్థకమౌను. భాష్యకర్తలకు గౌరవ మిందుమూలముననే కలిగినది. వారిభావములే గ్రాహ్యములు. వాల్మీకిభావము ఇదమిత్థమని చెప్పఁగల వారు వ్యాఖ్యాతలేగాని పామరులుగారు. కాన వ్యాఖ్యాతలయభిప్రాయము వాల్మీకియభిప్రాయము కాకపోవచ్చు ననువాదము దుర్వాదము. వాల్మీకియభిప్రాయ మిదియేయని చెప్పినవారు వాల్మీకు లగుదురా. కాన మహనీయులగువ్యాఖ్యానకర్తలభావమే గ్రహింపఁదగునవియు నప్పుడే రామాయణార్థము తెలిసికొనఁగలమనియు నెఱుంగఁదగు. ఈసీసమాలికయం దాయర్థము పారదర్శకముగ నున్నది.

వలయు, నుండనియెడ ♦ వదలుఁ బ్రాణంబుల రఘువీరవర్యుఁ డో ♦ రామదూత;
యని యిట్టులెవ్వరి ♦ కైనను దెలియంగ ననువుగాకయుఁ రహ ♦ స్యార్థయుక్త
మునునయి మధురార్థ ♦ మునగు పల్కును రాఘవునిగూర్చి హనుమను ♦ బోలునంత
వాఁడు మఱొక్కఁడు ♦ లేఁడు శ్రీరామునిభక్తులం దట్లాట ♦ వానితోడఁ
బల్కు మనోహర ♦ వనచరవాక్యంబు రామప్రయోజనా ♦ ర్థమును వినఁగఁ
దమిఁగోరి యారామ ♦ తానూరకుండె; భయంకరవిక్రముం ♦ డైనహనుమ
యామెపల్కులు విని ♦ యాకృతి శిరమున నంజలి ఘటియించి ♦ యనియె నిట్లు;
పద్మాయతాక్షి! నీ ♦ ప్రాణేశుఁ డిచ్చట నీవున్నవార్తయే ♦ యెఱుఁగఁడట్టు

తే. తెలిఁగియుండినఁ బద్మాయ ♦ తేక్షణములఁ
దనరు నీవంటిపత్నిని ♦ దాను వదలి
యుండఁగలఁడే, యనుహ్లాదు ♦ నొద్దనున్న
శచి నెఱుంగమిఁ గొనిపోని ♦ శక్రు రీతి. ౩౨ 1437

క. కొనిపోవకున్నవాఁడే, యనితలఁపు మొఱింగినతఱి ♦ నమరేంద్రుం డా
మెను గొనిపోయినగతి నిను, వనితా! నావలన నీదు ♦ వార్త నెఱిఁగినఁ. ౩౩

క. వనచరులు నెలుఁగుబంట్లును, దనవెంటఁ జెలంగిరాఁగఁ ♦ ద్వరఁగా రాముం
డునువచ్చు నతనిసైన్యము, తనరారును జలధిపోల్కిఁ ♦ దరుణీమణిరో. ౩౪

ఆ. [1]కలఁచిపుచ్చరాని ♦ జలధిని రాముండు
బాణములను గట్టి ♦ వచ్చి యీ న
గరము శాంతదనుజ ♦ గణముగ నొనరింపఁ
గలఁడు; త్రోవనడుమ ♦ జలజనయన. ౩౫ 1440

క. విను మృత్యువేని త్రిదశులు, దనుజౌఘుంబేని మిగుల ♦ దర్పంబున వ
చ్చినిలిచి యుద్ధముచేసిన, ఘనబాణంబులను వారి ♦ గండడఁగించుఁ. ౩౬

క. నినుఁ గననిదుఃఖమునఁ దా, మునుఁగుచు రాఘవుఁడు సింహ ♦ మునఁ బీడితమౌ
ఘనహస్తిఁబోలి సుఖముం, గనకున్నాఁ డార్య! సొగసుఁ ♦ గన్నుల లరఁగఁ.

సీ. [2]అందమై బింబోష్ఠ ♦ మై చారుకుండలమండితంబయి చంద్ర ♦ మండలంబు
ప్రాక్కున నుదయించు ♦ పగిది మనోజ్ఞమై తనరారు రాముమో ♦ మును నిజముగఁ
గనుఁగొనఁగలవు నీ ♦ వని మేరుమందరదర్దురమలయవిం ♦ ధ్యముల సాక్షి
గాఁగ నందుండెడు ♦ కందమూలఫలంబులెల్ల సాక్షిగ నని ♦ తల్లి నేను

తే. శపథ మొనరించుచున్నాను; ♦ జనకతనయ
త్వరగ [3]నాకపృష్ఠంబునఁ ♦ దనరునింద్రు

---

1 పురీం లంకాం కాకుత్స్థ శ్శాంతరాక్షసామ్-అనిమూలము. 2 మలయేన చ వింధ్యేన మేరుణా మందరేణచ, దర్దురేణ చ తే దేవి శపే మూలఫలేన చ-అనిమూలము. 3 నాగపృష్ఠమని యొకపాఠము గలదు.

భంగిఁ బ్రస్రవణాద్రిపైఁ ♦ బరిఢవిల్లు
రాముఁ జూడంగఁగలవు వి♦రాజితాస్య. ౪౦ 1443

చ. నిను విడనాఁడి దుఃఖమున ♦ నీపతి మాంసముఁ గైకొనండు, తే
యనిమధు వానఁ బూనఁడు ది♦నాంతమునం దొకమాఱు సుందరీ
వనమున నున్న *యోగులకు♦భక్ష్యములం చను శాస్త్రమందుఁ జె
ప్పినవనవస్తువుల్ గొనును ♦ ప్రీతిఁగ దేహము నిల్ప రాముఁడున్. ౪౧ 1444

తే. అడవిఁబాఱఁగలదోమల ♦ నల్లపురుగు
లను సరీసృపములఁగాని ♦ తనమనమ్ము
త్వద్గతంబయియుంట న♦వ్వలికిఁ బోవు
నట్టియత్నంబుచేయఁ డ♦య్యవనివిభుఁడు. ౪౨ 1445

క. నినుఁబాసి కామవశమునఁ, దనమనము దగంగ నిన్నె ♦ ధ్యానించుచుఁ జిం
తనుబొందియుండు నిత్యము, వనితరొ నినుఁదప్ప వేఱు♦వాంఛఁ గనఁడునా.

చ. పురుషలలాముఁడై నరఘు♦పుంగవుఁ డెప్పుడు నిద్రపోఁడు సుం
దరి, భవదీయదుఃఖమునఁ ♦ దా నొకయించుక నిద్రపోయినన్
దద్వరపడి సీతయంచును ని♦తాంతమనోహరవాక్కుఁ పల్కుచున్
గరము వగం గృశత్వమును ♦ గాంచుచు మేల్కొనుఁజుమ్ము నిత్యమున్. ౪౪

క. ఫలములఁ బుష్పంబుల మిక్కిలియింపగు దేనిఁగాని ♦ క్షితిపతి గనెనే
లలితాంగి నినుఁ దలంచుచుఁ, బలుభంగుల హా ప్రియ యని♦పలుకుచువగలన్.

తే. వేఁడినిట్టూర్పుగములను ♦ విడుచుచుండు;
జనకునాజ్ఞ దృఢవ్రత♦మునఁ జెలంగు
నమ్మహాత్ముఁడు నినుఁగూర్చి ♦ యార్తుఁడగుచు
జనకజా యనిపేర్కొను♦సతత మతివ. ౪౫ 1419

క. నినుఁ బడయుటకే యత్నం, బును జేయుచునుండుఁ దాప♦మునుబొందుచునుం
డును జుమ్మన; నాజనకజ, తనపతివిషయమునఁ గల్గు♦తద్దుఃఖంబున్. ౪౬

చ. హనుమ వచించు వాక్యముల ♦ నప్పుడు తా విడనాడి, ప్రాణకాం
తునిమదిఁ గల్గుభూరితర♦దుఃఖముతో సరియైన దుఃఖముం
గనుచు శరన్ముఖంబునను ♦ గప్రనిశాపతి మేఘమింత గ
ప్పిన నినుమంత గన్పడుచు ♦ వెల్వెలఁబాఱఁగనుండురాత్రిరీ
తిని వనితాశిరోమణియుఁ ♦ దేజము దూలఁగనుండె మోమునన్. ౪౭ 1451

ముప్పదియాఱవ సర్గము సంపూర్ణము.

---

* సువిహితం ధ్రుం క్తే-అనిహారము. సువిహితం వానప్రస్థయోగ్యత్వేన విహితమ్ - అని
వ్యాఖ్య.

## 32 - వ సర్గము.

—:o:— సీత హనుమతోఁ దనకున్నగడువు చెప్పుట. —:o:—

ఆ. పూర్ణచంద్రవదన • పూఁబోఁడి యంత నా,హనుమవాక్యములను • నాలకించి
తా వచించె నిట్లు ? •ధర్మార్థసహితవా,క్యముల నతనితోడ • నాదరమున. ౧

చ. [1]మనమున నిన్నె నెంచు రఘు•మండనుఁ డక్ప్రియవాక్యముల్ సదా
ఘనతరశోకమొందుఁ బ్రియ•కాంతను నిన్నుగుఱించి యన్నచిం
తనుఁ గలిగించువాక్యమును • దప్పక చెప్పితి వట్లుకాన నా
కు నమృతమట్లుగా విషము • గూర్చినయట్లుగ నున్న వీనుడుల్. ౨ 1453

సీ. [2]జీవి తేశునివిడి • చేరినదిచ్చట నాబుద్ధిచేఁగాదు • వయగుణాఢ్య
సంపూర్ణమైనయై•శ్వర్యము వచ్చినతఱిఁగాని, యత్యంత•దారుణమగు
నాపదవచ్చిన•యప్పుడుగాని యెవ్వఁడును స్వతంత్రుఁ డె•వ్వరునఁగాఁడు
దైవము వానిని • ద్రాటిచే బంధించిన ట్లీడ్చుకొనిపోవు • నరయ ధ్రువము;
తే. దానివారింపఁ బ్రాణుల•తరముగాదు
రామసౌమిత్రు లేను ను•న్నాము చూడు
మిట్లుమోహితులమయి, క•పీంద్ర ! నొక
జలధివిఱుగంగ నీదుచుఁ • బలువిధముల. ౩౪ 1454

క. అలజడిఁబడియెడుమనుజుని, వలె నీదుఃఖాబ్ధియందుఁ • బడి తడఁబడుభూ
పలలాముఁ డెట్టులెవుడ,వ్వలిగట్టును జేరఁగలఁడో • వారక చెవుమా. ౫ 1455

క. దనుజులనెల్లరఁ జంపుచు, దనుజేంద్రునిజంపి నగర•తల్లజమును దీ
నినిగలఁచి రాఘవుఁడు ననుఁ, గనఁగలఁ డెత్తఱిని బ్లవగ•కాంత! పలుకుమా.

ఆ. అబ్దపరిమితంబె • యైనయీసమయము, దాఁటకుండ వేగ • తరలి యిటకు
రావలయు ననుచును • రామునకుం జెప్పు, మంతవఱకె నాకు • నాయువుగద.

తే. క్రూరుఁడౌ రావణుండు నా•కు నిడినట్టి
నబ్దమితమైనసమయంబు•నందుఁ బదియ
వదగుమాసము కావచ్చెఁ • గద ద్విమాస
ములెగదా మిగిలినవని • పలుకు మచట. ౭ 1458

[3]చ. విను మనురేంద్రుతమ్ముఁడు వి•భీషణుఁ డన్మహనీయమూర్తి రా
మునకు ననుల్ సమర్పణము • ముందుగఁ జేయుట యుక్తమంచుఁ జె
ప్పెను శ్రమమొందియత్నమును • బ్రీతినొనర్చెను గాని దాన నా
దనుజునిచిత్తమింతయును • దత్పథముల్ విడనాడదయ్యెఁజూ. ౮ 1459

---

1 అమృతం విషసంస్పృష్టమ్-అనిమూలము. 2 రజ్జ్వేవ పురుషం బద్ధ్వా కృతాంతఃపరికర్షతి-అనిమూలము. కృతాంతః, దైవమ్-అనివ్యాఖ్య. 3 విభీషణేన చ భ్రాత్రా మమనిర్యాతనం ప్రతి, అనునీతః ప్రయత్నేన నచ తత్కురుతే మతిం-అనిమూలము.

క. నను మరల రామునకు నీ, యను రావణుఁ డొప్పఁ డెట్టు ♦ లైనను గాలం
బున కతఁడు చిక్కినాఁ డా, తనిమృత్యువు యుద్ధమునకుఁ ♦ దాఁ గొనిపోవన్.

తే. వెదకుచున్నదిసుమ్ము; వి ♦ భీషణునకుఁ, బెద్దకూఁతురు నల యను ♦ వెలఁది తనదు
తల్లిపంపఁగ వచ్చి నా ♦ యుల్లమునలఁ, జెప్పె నీవార్తయుం దెలి ♦ సెను గపివర.

సీ. ప్రాణేశుఁడౌ రఘు ♦ పతి నన్ను శీఘ్రమ పొందఁగాఁగలఁడ దే ♦ నందియంబు
గలుగదు దీని కె ♦ ట్టు లనఁగ నాయాత్మ నిర్మలంబుగఁ దగి ♦ నెగడుచున్న
దా రాఘవునియందు ♦ నలరుఁ బెక్కుగుణంబు, లుత్సాహవత్త్వంబు ♦ లుగ్రపౌరు
షము మఱి నానృశం ♦ స్యము, కృతజ్ఞతయును, శక్తిప్రభావముల్ ♦ సతతమతని

ఆ. యందు నలరుచుండు; ♦ నా జనస్థానంబు
నందు లక్ష్మణునిస ♦ హాయమైనఁ
గొనక యొకఁడె చంపె ♦ దనుజులఁ బదునాల్గు
వేల నతనితోడఁ ♦ బృథివి నెవఁడు. ౧౪ 1462

క. నిలువంగఁగలఁడు పగఁగొని;, చలియింపం డెట్టికష్ట ♦ సంతతులకు నా
యలఘుఁడు శత్రుప్రభావం, బులు శచికిం దెలిసియుండు ♦ పౌలికి నాకున్. ౧౫

తే. తెలిసియున్నవి శ్రీరాము ♦ దివ్యమహిమ
ములు; మహాశూరుఁడౌ రాము ♦ మూర్తియనెడు
భానుఁడు శరాళికరములఁ ♦ బఱపి వైరి
దనుజజలము శోషిలఁజేయఁ ♦ గను గలండు. ౧౬ 1464

క. ఈరీతిఁ బలువిధంబుల, నారాముని గూర్చి పలికి ♦ యతిశోకమహా
భారమునఁ గుంది నేత్రాం, భోరుహములనిండ నశ్రు ♦ వులు గ్రమ్మఁగొనన్. ౧౭

తే. కలఁగునాసీతఁ గని కపి ♦ పలికె నిట్లు;, నావలన నీదువార్త వి ♦ న్న వలరాముఁ
డఖిలభల్లూకవానరేం ♦ ద్రాళి నలరు, సైన్యమును గొని వేగ రాఁ ♦ జాలుఁజుమ్ము.

*చ. నిరుపమవక్త్రపద్మమున ♦ నిర్మలశీలమునం జెలంగునో
ధరణిజ! యింతయేల? యిపుడె ♦ తావకదుఃఖముఁ బావువాఁడ ని
త్తరుణమునందె వీఁపుపయిఁ ♦ దప్పక యెక్కుము; నిన్ను నబ్ధి పా
గరముఁ దరింపఁజేసెదను ♦ గాంతునిచెంగటఁ జేర్తుఁ జాదురీ. ౧౯ 1467

క. ననుఁ గొంచుఁబోవుశక్తి యి,తనికినిగలదే యటంచుఁ ♦ దలఁపకు మిలలం
కను రావణుతో వీఁపునఁ, గొనిపోవంగలను నమ్ము ♦ శోణితమాలా. ౨౦ 1468

ఆ. అగ్నివేల్వఁబడిన ♦ యాహవిస్సును దేవ, పతికొనంగునట్లు ♦ ప్రస్రవణము
నందునున్న యమ్మ ♦ హాత్మునకున్ నిన్ను, నొసఁగువాఁడ నమ్ము ♦ యుత్పలాక్షి.

క. అనుజునితోఁ గూడినరా,ముని దైత్యులఁ జంపుయత్న ♦ మునఁ దనుశ్రీవా
ఘునిరీతి నున్నవానిని, గనఁగల విత్తరుణమందె ♦ కమలదళాక్షీ. ౨౧ 1470

* అహ్నా దుఃఖా దుపారోహ మమపృష్ఠ మనింద తేఽనఘ.

క. [1]నినుఁ జూడఁ బ్రయత్నంబుల, నొనరుచు చాశ్రమమునందు♦నున్నబలయుతున్
ఘననాకపృష్ఠగతుఁడై, న నముచిసూదనసముం గ♦నంగల విపుడే. ౨౩ 1471

క. దేవీ! యోకల్యాణీ, నావీఁపున నెక్కు మేల♦నను శంకింపన్
వే వేయెక్కు ముపేక్షను, గావింపకు రోహిణి శశిఁ♦ గని కూడుగతిన్. ౨౪

[2]క. నీనాథుఁ జేరఁగోరుము;, వే నా వీఁపెక్కి యభ్ర♦వీథిన్ శశితోఁ
భానునితోఁ బలికెడుగతి, నోనారీమణిరొ కడలి♦నుడువీథిఁ ద్వరన్. ౨౫

క. తరియింపు; మిచటనుండియె, తరుణీమణి నిన్నుఁ గొనుచుఁ♦ దరలఁగ దనుజో
త్కరము ననుఁ బట్టుకొన భీ, కరగతిఁ జనుదెంచు ననుచుఁ♦ గలఁతఁ గనకుమా.

క. వినువీథిఁ బఱచు నాతోఁ, జనుదేరఁగ లంక నున్న♦చతురుం డెవఁడై
ననుజాలఁడు; వైదేహీ, నినుఁగన నెటువచ్చినానొ♦ నినుఁగొని యట్లే. ౨౭

క. అరిగెద నిస్సంశయముగఁ, బరిశ్రమము లేక యభ్ర♦పథమున; ననఁగా
ధరణిజ! యపు డత్యద్భుత, హరివచనము లాలకించి♦ హర్షముఁ గనుచున్.

తే. [3]విస్మయమున గగుర్పాటు♦వెలయ నిట్టు
లనియె; హనుమంత! నన్నుఁ బె♦క్కామడలు జ
వంబునన్ మోసికొనిపోవ♦ వాంఛఁ గనెదె
దాన నీయందుఁ గపితనె♦ యేనుదలఁతు. ౨౯ 1477

చ. వనచరపుంగవా! కన భ♦వత్తను వెంతయుఁ జిన్నదానుగా
మనుజవరేణ్యుఁడై నృపతి♦మండలుఁ డౌరఘురాముఁ డున్న తా
వనబహుదూరమా నిచటి; ♦ కట్లగుటన్ నను నెట్లు వీఁపునం
గొనిచన నెంచెదీ విది య♦గుం గదుఁ జిత్ర మటంచుఁ బల్కినన్. ౩౦ 1478

[4]క. జనకజపల్కుల విని యా, యనిలజుఁ డురుకాంతియుక్తుఁ♦ డటఁ గ్రొత్తగఁ గ
ల్గినయవమతిని గుఱించియె, తనలోఁ దా నివ్విధమునఁ♦ దలఁచెన్ మిగులన్. ౩౧

ఆ. అసితనేత్ర! యీమె♦యస్మద్బలప్రభా
వముల నెఱుఁగ దస్మ♦దమలరూప
మును యథేచ్ఛముగనె♦ కనుఁగొనుఁగాక యం
చరివిమర్దనుఁ డపు♦డాత్మ నెంచి. ౩౨ 1480

క. జనకజకు నైజరూపం, బును జూపెను; బుద్ధిబలము♦ పొంగ నలరునా
వనచరవర్యుఁడు తనఘన, తనువును బెంచుటకు సరిగఁ♦ దత్పాదపమున్. ౩౩

ఆ. [5]విడిచి దాని క్రింద♦ వెస మేనుఁ బెంచిన, దాని శాఖ లెల్లఁ♦ దత్క్షణంబ

1 నాకరాజస్య మూర్ధని-అనిమూ. నాకపృష్ఠసంజ్ఞస్య మూర్ధని నగరాజస్య పాదే మేరో రిత్యర్థః-అనివ్యాఖ్య. 2 కథయంతీవ చంద్రేణ సూర్యేణచ-అనిమూ. 3 తదేవకులు తే మన్యే కపిత్వం హరియూథప-అనిమూ. 4 చింతయామాస లక్ష్మీవాన్నవం పరిభవం కృతమ్-అనిమూలము. 5 వ్యాఖ్యానాభిప్రాయ మిందున్నది.

విరిగిపోవుదాన ♦ జెనుశబ్దమగు, దాన, గిడుమూఁడు సనుచుఁ ♦ గీశవరుఁడు.

క. [1]ఇంచుక యవ్వలికేగి స,ముంచితగతి మేనుఁ బెంప ♦ నారంభించెన్
జంచలనేత్రయు సమ్మెకఁ, గాంచంగా వలయునన్న ♦ కాంతుల్ మిగులన్. ౩౮

చ. వనచరుఁ డామెకట్టెదుర ♦ వర్ధితగాత్రుఁడు నౌచు ఖీతికృ
ద్ఘనతరమేరుమందరని ♦ కాశసమానత సంది యచ్చటన్
గనఁబడుచున్ జ్వలించెడుధ ♦ నంజయురీతి వెలుంగుచుండె; ని
ట్లనిలకుమారుఁ డద్రివలె ♦ నాస్యము తామ్రముగాఁ జెలంగఁగన్. ౩౯ 1481

తే. వజ్రదంష్ట్రానఖంబులు ♦ వఱలభయద
వపువునం గ్రాలునమ్మహా ♦ బలుఁడు హనుమ
జనకజం గాంచి యిట్లని ♦ యెను; సపర్వ
తవనముగ సట్టపాలయు ♦ తంబుగాఁగ. ౩౬౪ 1485

క. గోపురయుతముగఁ దగు లం,కాపురమును దీని దనుజ ♦ కాంతునితోడన్
వే పట్టిలాగికొని చన, నోపుదు నాకట్టిశక్తి ♦ యొప్పెడుఁ దల్లీ. ౩౭ 1486

క. కనుకనె దేవీ! భయముల్, గనకుము నీబుద్ధి స్థిరము ♦ గానుంచు, ముపే
క్షను జేయఁబూనకుము రా,మునిలక్ష్మణుఁ జేయు దుఃఖ ♦ మును గనకుండన్.

[2]చ. అనవిని చారుపంకజద ♦ ళాయతలోచన సీత వాయునం
దనుభయదాకృతిం గని సి ♦ తాంతముఁ బొల్చెడునాంజనేయునిం
గని యిటుపల్కె; నోప్లవగ ♦ కాంత భవద్బలసత్త్వముల్ మనం
బున నెఱుఁగంగనైతి గతిఁ ♦ బొల్పుగ వాయువునంతవాఁడవే. ౩౯౪ 1488

క. అనలునియద్భుతతేజం,బును గల్గినవాఁడ వనియి ♦ పుడు తెలిసెను; బా
వని! ప్రాకృతుఁ డింకొక్కఁడు, ఘనతరజలధిం దరింపఁ ♦ గల్గునె చెపుమా.

క. నినుబోఁటివాఁడు గాకు,న్న నసాధ్యముగాఁ జెలంగు ♦ నాయున్నవనం
బును దీనిఁ గాంచఁగలఁడే;, ననుఁగొనివేగమున నసుర ♦ నాథులకెల్లన్. ౪౧

తే. చిక్కకయెపోఁగలవని ♦ చిత్తమునకుఁ
దెలిసె; నమ్మహాత్మునివని ♦ తీవ్రవిఘ్న
ములను నాలస్యమునుగాక ♦ వెలయునట్టు
లరయుమా ముఖ్యమగుపని ♦ యదియెగాదె. ౪౨ 1491

[3]క. అనఘా! కపివర్యా! నే,నును నీతో వచ్చుటరయ ♦ న్యాయము ముప్పా
యనిలసమవేగమును గాం,చినవాఁడవు నీవు గాన ♦ జెచ్చెలిఁ జనుచోన్. ౪౩

తే. భ్రమసిపోలుదు; నీవేఁవు ♦ పై ననుఁగొని
యతిజవంబును మీఱ నీ ♦ వరుగుచుండ

1 సీతా ప్రత్యయకారణాత్-అనిమా. 2 పద్మపత్రవిశాలాక్షీ మాయత స్యాతం మతిమా-అనిమా. 3 అయుక్తం తు కపిశ్రేష్ఠ మమగంతుం త్వయానఘ-అనిమాంము.

గడలిపయిఁ బోవునపు డేను♦గడలిఁ గని భ
యంబునఁ బీఁపునుండియొ ♦ యందుఁ బడుదు. ౪౪ 1493

సీ. గ్రాహముల్ తిమిఝుష♦గణములు సిండారఁ బరఁగుసంభ్రమ ము కనఁ♦బడిననేను
బరవశనై వేగ ♦ పాథోధిజలజంతువారంబునకుఁ [1]బ్రియా♦హారమగుదు;
శత్రువినాశనా! ♦ శక్తిచాలదు నాకు నినుఁగూడిరాఁగ, నె♦వ్వనికైనఁ
గావంగఁదగు మఱొ♦క్క పదార్థమును గూడి చనునేని దానివ♦లననె మిగుల

తే. నాపదయుఁ గల్గు, నీకు న♦న్నరసి గాచు, భారముండుట నీవెంట♦వచ్చునన్నుఁ
బట్టి యాపద యొకవేళ ♦ వచ్చునెడు, శంక కలిగెడు [2]లేదేమి♦సందియంబు.

చ. కలుగునదెట్టులాపద ల♦ఖండజవంబున నేనుఁబోవఁగాఁ
గలఁగకుమంచుఁ జెప్పెదవొ ♦ గాలికుమారక! నేను వీఁపుపై
నలరఁగ నీవుపోవువిధ ♦ మాదనుజేంద్రుఁడు దుష్టబుద్ధియై
కలిగినరావణాసురుఁడు ♦ కాంచి జవంబునఁ బంప రాక్షసుల్. ౪౬ 1495

తే. భయదవిక్రమముల నినుఁ ♦ బట్టుకొనఁగ
వెంబడింతురు; వీరులై ♦ వెలయువారు
శూలముద్గరపాణులై ♦ చుట్టుకొనుదు
రంత నీవొక్కఁడవెకాక ♦ యతివనన్ను. ౪౭ 1496

తే. కావఁదగుదానిఁ గావంగఁ ♦ గడఁగుటను ద
గంగ నాపదగల్గు వి♦క్రమగుణాఢ్య
యన్నసందియ మొక్కటి ♦ యాత్మఁగలుగు
చున్నయది; యాసురారు లా♦యుధము లూని. ౪౮ 1497

క. పలువురు నభమునఁ గదియఁగఁ, గలనకుఁ దగునట్టిశస్త్ర♦గణమే లేకె
ట్టులుగా నొక్కఁడ వాదనుజులతో యుద్ధంబుచేయ ♦ సుదతిని గావన్. ౪౯

క. వనచర! శక్తుఁడవగుదువు;, దనుజులు భీతికరకర్మ♦తత్పరులుగదా
యని వారలతోఁ జేయుచుఁ, గనదురుశౌర్యమున నీవు ♦ గ్రాలుచు నుండన్.

ఆ. నేభయార్తనగుచు ♦ నీవీఁపుపైనుండి,పడుదుఁ గ్రిందఁ; జాల ♦ భయదరూపు
లుగ్రబలులు నగుచు ♦ నొప్పురాక్షసులు యుద్ధమున నొక్కవేళ♦దర్పమలర.

క. నినుఁ గష్టంబున నోరిచి, కనినం గనవచ్చుజయముఁ; ♦ గపివర! యుద్ధం
బునువారిఁ గనుచుఁ జేయుచుఁ, దను వేమఱచియును నుందు♦దర్పముపొంగన్.

ఆ. [3]అట్టితరుణమందు ♦ నబ్ధి నేఁబడినంత, నీకుఁ దెలియకుండ ♦ నీచమతులు
దనుజులెల్ల నన్నుఁ ♦ దవ్వర నెత్తుకొనిపోదు;, రని జయాపజయము♦లనెడువివ్వ.

---

1 యాదసా మన్న ముత్తమమ్ - అనిమూ. 2 త్వయ్యపి స్యా దసంశయః-అనిమూలము. 3 పాంశా హారేయుః త్వద్ధస్తా ద్విశసేయు రథాపివా, అవ్యవస్థా హి దృశ్యతే యుద్ధే జయప రాజయౌ-అనిమూ.

క. అనుమానింపఁ దగియుండు, ననుఁ దనజయ మొక్కటియె సీ♦తను బొందినఁ బొం
దును గాన నపుడు నీకర, మునఁ బొందిన సురాసురులు నను♦ మోసము చెలఁగన్.

క. కొనిపోయినఁ గొనిపోవచ్చును జంపినఁ జంపవచ్చు; ♦ శుభగుణనిలయా
విను మివ్వి గలుఁగకున్నను, దనుజులఁదర్శనములకె ని♦తాంతభయమునన్.

ఆ. ప్రాణహాని నాకుఁ ♦ బ్రాపింపవచ్చును, దాన నీప్రయత్న♦మౌ నఫలము
నీవె భయదదనుజ♦నికరముఁ జంపఁగఁ, దగుదు వట్లు పోనఁగ ♦ దానివలన.

క. [1]కనురాముయశముకొఱఁతను;, వనచర! కాదేని దనుజ♦వధ్యలు నను జే
కొనిపోయి రామలక్ష్మణ, వనచరులకుఁ దెలియరాని♦వసుధాస్థలిలోన్. ౫౪

క. కనఁబడకయుండఁగా దాఁ, చినదాతురు; నాకొఱకును ♦ జేసినయత్నం
బనిలకుమారా! నిష్ఫల, మని చెప్పఁగ వచ్చుఁగాదె ♦ యరయఁగ నింకన్.

క. త్వరగా నీవచటికిఁ జని, ధరణీపతితోడ నాయ♦నంతము నెల్లన్
గరుణ నెఱిఁగించి తోడ్కొని, హరివర! వచ్చినటులైన ♦ నగు మేల్ నాకున్.

క. వినుము మహాబాహూ! రా,ముని ప్రాణము లతని భ్రా♦తృముఖ్యులయసువుల్
వనచరపతిబంధ్వసువులు, నిను నూఁతఁగఁగొనియె యిపుడు♦నిలిచినవి సుమా.

తే. రామలక్ష్మణు లిర్వురు♦ద్దామశోక, తాపకర్శితులై రిగ♦ద యిఁకనిచట
హానియే దేనిగల్గ ని♦రాశు లగుచు, సకలవానరభల్లూక♦నమితితోడ. ౫౮

క. అసువులతోఁ బనియేమని, వెస విడువంగలరు; భర్తృ♦విమయకభక్తిన్
శ్వసనసుతా! ముందిడుకొని, సునమాహితచిత్తవగుచు ♦ క్షోణీస్థలిపై. ౫౯

క. పరపురుషునితనువు స్పృశిం,పరాముని ందక్క; దనుజ♦పతియంగము నీ
వరుదెంచుతఱి స్పృశింపవె, పరుఁడుగదా యాతఁడనెదొ ♦ పవనతనూజా.

చ. [2]తరుణిని గాన నాదనుజుఁ ♦ దాఁకకయుండఁగ నేమిచేయ న
త్తరుణమునం దశక్తనయి ♦ దైవమె దిక్కనియుంటి రాముఁ డా
హరిణము వెంటఁబోయె వివ♦శాంగిని నై యపుడుంటి దానవే
శ్వరుబలవద్విధానమును♦బట్టి స్పృశించితి నేమిచేయుదున్. ౬౧ 1513

క. చనుదెంచి రాముఁ డిచటికి, దనుజేంద్రు నబంధుఁ జంపి♦తగ నన్ఁగొనుచుం
జనునే నాతని కదితగు;, ననిఁ బగఱం గూల్చునమ్మ♦హాత్ముని వమలన్. ౬౨

క. విని కనియు నున్నదానను, విను సురగంధర్వదనుజ♦విమధరు లెవరై

---

1 రాఘవస్య యశో హీయేత్ త్వయా శస్త్రైస్తు రాక్షసైః-అనిమూ. దీనిచే సీతపాతివ్రత్యము ప్రకటితమని యెఱుంగఁదగు. 2 యదహం గాత్రసంస్పర్శం రావణస్య బలాద్గతా, అనీశా కింకరిష్యామి వినాథా వివశా సతీ-అనిమూ. దీనికి వ్యాఖ్యాతలర్థంబు వ్రాసినయర్థమే యీపద్యమున కాధారమని తెలియందగు. వ్యాఖ్యాతాభిప్రాయము మూలమునకు సీతపట్టయూన పాతివ్రత్యము మేలేమి వాల్మీకి భావము వ్యాఖ్యాతలకట్లు తెలియనగు నన్న దిబ్బ్రిత్నము.

వను యుద్ధంబున నతనికి, నెనయని చెప్పంగ లేర ♦ హీనబలాఢ్యా. ౬౩

చ. [1]హరిహయతుల్యశౌర్యుఁడు మ ♦ హాబలవంతుఁడునైన రాఘవే
శ్వరుఁ డతిచిత్రరీతులను ♦ జాపముఁబూని సలక్ష్మణుండునై
మరుదధిపేరితంబగుచు ♦ మండెడునగ్నినిబోలి వెల్గ నె
వ్వ రతనిమ్రోల యుద్ధమునఁ ♦ బాఱక నిల్వఁగలారొ చెప్పుమా. ౬౪ 1516

చ. అనిమొనయందు భీకరసు ♦ దావిలమై తగు దిగ్గజంబురీ
తి నిలిచి లక్ష్మణుండును న ♦ తిస్థిరశూరుఁడు వెంటనుండ నే
వునఁ బగవారినొంచుచును ♦ భూతభయంకరుఁడౌలయార్కుఁడో
యనఁగ శరప్రభాపటలి ♦ నాజి నిగుడ్చుచు నుండురాము నె
వ్వనికిని దేఱిచూడనగుఁ ♦ బాఱక యెవ్వని కోర్వఁగానగున్. ౬౫ 1517

చ. వనచరవర్య! లక్ష్మణుని ♦ బాయనినావిభుసైన్యయుక్తుఁ డో
డ్కొని జవమొప్ప రమ్ము; నృప ♦ కుంజరుఁ గూర్చి నితాంతదుఃఖముం
గని తపియించునాకుఁ గలు ♦ గం దగఁజేయుము హర్షమాత్మలో;
నని పతిభక్తి తేటపడ ♦ నాకమలాక్షి వచించె నింపుగన్. ౬౬ 1518

ముప్పదియేడవ సర్గము సంపూర్ణము.

---

## ౩౮ - వ సర్గము.

{ హనుమంతుఁ డానవాలిమ్మనఁగా సీత కాకాసురవృత్తాంతమును చెల్పి చూడామణి నిచ్చుట. }

చ. వనచరసింహుఁ డంతరఘు ♦ వర్యనిపత్ని మనోజ్ఞవాక్యముల్
విని వచియింప నేర్పరియు ♦ వీరుఁడుగావున ధర్మయుక్తమై
తనరెడునామెపల్కులకుఁ ♦ దద్దయు మోదమునొంది యామెకి
ట్లనియె; నిమంగనంగ [2]విమ ♦ లాయతమంగళముల్ పొసంగెడున్. ౧ 1519

సీ. తల్లి! నీచెప్పిన ♦ దెల్లను స్త్రీస్వభావమునకు సాధ్వులా ♦ వనితలకును
దగు వినయమునకుఁ ♦ దగి యుక్తమైయున్న; దిట్లుగాఁ బెరిగి య ♦ హీనరూప
మలరఁగాఁ దగునన్ను ♦ నెలమిమీఱఁగ నెక్కి శతయోజనాయత ♦ సాగరంబు
దాఁటి స్త్రీకెంతమా ♦ త్రము శక్యమేగాదుకద, [3]జానకీ! నీవు ♦ కడువినయము

తే. గలుగుదానవు గనుక నీ ♦ కాంతుఁ దప్ప
నొరుని స్పృశియింపఁదగదని ♦ యొత్తిచెప్పి
నట్టిరెండవకారణ ♦ మామహాత్ము
భార్య వగునీకు యుక్తమౌఁ; ♦ బలుకులేల. ౨ 1520

---

1 మహాబలం వాసవతుల్యవిక్రమమ్-అనిమూ. 2 భాషితం శుభదర్శనే-అనిమూ. 3 ఏతత్తే దేవి సదృశం పత్న్యాస్తస్య మహాత్మనః-అనిమూ.

క. అనవద్యమైనవచనం, బును దీనిని నీవు తప్పఁ ♦ బొలఁతి యెవ్వతెచె
ప్పును దేవి; నాకు మ్రోలనె, ఘనమతి రాఘవునిఁ బాయు ♦ గాఁ జాలమి చేన్.

క. ఉరిపోసికొని మృతింగనఁ, దృరపడి కావించినట్టి ♦ వ్యాపారములన్
మరవైరి లెక్కసేయుడి, బరవసము న నాకిచ్చినట్టి ♦ పల్కులనెల్లన్. 1522

క. వినిపింపఁగలను శ్రీరామునకు కేమియు మిగులకుండ; ♦ ముమ్మనాని నీకుం
గనుపట్టు దుఃఖహేతువు,లను మిగులంగాంచి నృపుల ♦ లాముక కెలమిన్. 1524

తే. [1] ప్రియము నవ్వుఁగఁగోరి యా ♦ కేతిస్నేహ
మున మనసుమెత్తఁబడ నిట్టు ♦ లనితిఁగాని
యితరభావము లేదసు; ♦ మ్మీనగరవ
రంబుఁ జొచ్చుట కష్టత ♦ రంబె యగుట. 1525

క. వననిధి దాఁటుట యట్టిదె, యనఁదగియుండుటను; నెట్టు ♦ లైనను నీ రెం
టిని సాధించుట శక్తియె, యని, యది నాకుంట, దాని ♦ పంతయుఁ జూపన్.

తే. ఇట్లు పల్కితిఁగాని వే ♦ ఱేమి లేదు;
రఘువరాన్వయుతోడ నో ♦ రమణి నిన్ను
నిపుడె చేర్పంగ నామది ♦ నిచ్ఛగలిగి
యుంట మిక్కిలి స్నేహము ♦ ట్లొప్పియుంట. 1526

క. గురుభక్తి యల్లెపొసఁగుటఁ, దరుణీ యిటు పల్కినాఁడఁ ♦ దప్పు మతే మె
వ్వరుసఁ దలంచినలేదో, ధరణికుమారీ! యనిండి ♦ తా! నాతోడన్. 1527

క. [2] చనుదెంచుటకున్ సమ్మతిఁ, గనవే నిటకేను వచ్చి ♦ గనినది నిను, రా
మునకుం దెలియుట కొకగు,ర్తునువిమ్మా దాన నృపతి ♦ ధూర్జటి యెఱుఁగున్.

క. అన దేవకన్యఁబోలిన, జనకజ యప్పవనజోక్తి ♦ జాలము విని యం
త నతని కిట్లను నొకవా, [3] ర్తను దలఁచుచు నశ్రుజలము ♦ తద్దయుఁ గ్రమ్మన్.

క. పలుకులు తడఁబడుచుండఁగ, మెల్లమెల్లనఁ; బలుకుదాన ♦ [4] మేలగు గుఱుతున్
లలితమదియౌను నద్విధ, మెలమిన్ వినవయ్య యోక ♦ పీంద్రా! యింకన్.

సీ. చిత్రకూటాద్రికిఁ ♦ జేరువ నీశాన్యభాగంబునందు దే ♦ వతటినికిని
జేరువఁ దనరుచు ♦ సిద్ధుల కాశ్రమమై ఫలమూలజ ♦ లాదులొప్ప
వెలయు భాగంబొండు ♦ కలదందుఁగల తాపసాశ్రమముల నేను ♦ నాశ్రయించి
యుండఁగా జరగిన ♦ దొకకార్య మద్దానిఁ బ్రియుఁడగు రామమూ ♦ ర్తికిని దెల్పు

ఆ. మేను జెప్పినట్లు ♦ నేను నో ప్రాణేశ!
యందుఁ జాల [5] బహువి ♦ ధామలసుమ

---

1 స్నేహప్రస్కన్నమనసా మయైత త్సముదీరితమ్-అనిమా. 2 అభిజ్ఞానం ప్రయచ్ఛ త్వం జానీయా ద్రాఘవో హి తత్-అనిమా. 3 శావ్ప ప్రగ్రథితాక్షరమ్-అనిమా. 4 ఇదం శ్రేష్ఠ మభిజ్ఞానం బ్రూయా స్త్వం తు మమ ప్రియమ్-అనిమా. 5 తపస్యాపనమండేషు నానాపుష్పసుగంధిషు-అనిమా.

పరిమళములఁ దగు సు♦పవనవారంబుల
నెలమి విహారణమును ♦ సలిపి యంత. ౧౩౪ 1531

క. చెమటం దోఁగుచు నీయంకమునం గూర్చుంటి; నొక్క ♦ కాకి యపుడు మాం
సముఁ గోరి మత్కుచద్వం, ద్వమునడుమం బొడిచెముక్కు ♦ నఁ గమిక్కిలియున్.

క. నేనొకమృత్పిండంబును, దానిపయిన్ వైచి తోలఁ ♦ దద్వాయస ము
ద్దానిపయి నానఁబోవమిఁ, [1]దా నాపరిసరమునందు ♦ దాఁగియె యుండెన్.

చ. మనమున క్షుత్తు తోఁచుటను ♦ మాంసము నాహృదయస్థమున్ దమిన్
గొనఁ దలపోసి దానిఁ గలుఁ♦గొంచునె యుండెనుగాని యవ్వలన్
జనఁగఁ దలంపదయ్యె; రఘు♦సత్తమ! [2]యంబరమట్లు కాకిచే
తను దొలఁగింపఁగాఁబడఁగ ♦ దానిని జక్కనొనర్చుకొంటకై. ౧౬౪ 1534

క. కాంచీదామము నేను బిగించుకొనుచుఁ గాకముపయిఁ ♦ గినుక వొడముఁగాఁ
జంచలమతినై యుండఁగఁ, గాంచితి వవు డీవు నన్ను ♦ క్ష్మాపతితిలకా. ౧౭

సీ. అట్లు కోపమున నీ♦యంకంబువిడి లేచి కాకిని దఱుముచుఁ ♦ గడఁగి దాని
నవ్వలికిం జను♦నట్లు సేయఁగ లేకయుండఁగా ననుఁ జూచి ♦ యొక్కరీతిఁ
బరిహాసించితివి; నీ♦పలుకులకే నులజ్జనుబొంది యాహార♦మునకుగాను
గాకము చేరఁగా ♦ నీకడకే తెంచి బడలి కూర్చున్న నీ♦తొడపయిఁ దగఁ

ఆ. గూరుచుండి మిగులఁ ♦ గోపము నొందఁగాఁ, గాంచి నన్ను బుజ్జ♦గించితిదమి
నట్లు కాకముపయి ♦ నాగ్రహముంగొని, బాష్పపూర్ణమైన♦వదన మొప్ప.

క. కనుయుగ్మమ్మును మెఱమెల్లనఁ దుడుచుకొనుచునునుండ ♦ లలిఁ గాంచితివో
యినకులనాథా యని రాముసకుం దగఁ జెప్పవయ్య ♦ మోదమునొందన్. ౨౦

క. [3]వినుమా హనుమా! బడలికఁ, గని రామునితొడపయిఁ జిర♦కాలము నిద్రం
గనితిని నే నంతట లేచినవరుసన్ రామమూర్తి ♦ చెందిన వేడ్కన్. ౨౧

ఆ. మామకాంకసీమ ♦ మానితశయ్యగాఁ, బవ్వళించి నిద్రఁ ♦ బరమముదము

1 తత్రైవ పరిలీయతే-అనిమూ. 2 ప్రస్యమానే చ వసనే-అనిమూ. 3 పరిశ్రమా త్ప్రసుప్తా చ రాఘవాంకే ప్యహం చిరం. పర్యాయేణ ప్రసుప్తశ్చ మమాంకే భరతాగ్రజః, సతత్ర పునరేవాథ వాయస స్సముపాగమత్. తతస్సుప్తప్రబుద్ధాం మాం రామస్యాంకా త్సముత్థితామ్, వాయస స్సహసాగమ్య విదదార స్తనాంతరే-అనిమూ. మొదట సీత రామునితొడపై నిదురించెను. ఆమె నిదురఁజాలింప రాముఁ డామెతొడపైఁ బడుకొనియెను. ఆసమయమున వాయసము మరలవచ్చెను. ఇది యిందలికథాభాగము. మూలమును జదువునపుడు "పునరేవాథ వాయస స్సముపాగమత్" మరల నాకాకము వచ్చెను. "తతస్సుప్తప్రబుద్ధాం మాం రామస్యాంకా త్సముత్థితామ్" అంత రామునితొడపైఁ బరుండి నిదురించి నేను లేవగా-అని యర్థము. దీనిం జదువఁగనే పునరుక్తిగాఁ దోఁచవచ్చును. సీత హనుమతో పైమాటనే మరల స్పష్టముగాఁ దెలియుటకై చెప్పెనని యూహింపవలయు. ఏశంకలు కవకాశము లేదని గ్రహించుట సరసము

నియ్యెఁజాలుదానిఁ ♦ జయ్యనఁబొందె; న,య్యవసరమునఁ గాకి♦యరుగుదెంచె.

క. విను మేను మేలుకొని రా,ముని నిద్రకు నంతరాయ♦మును జేయక మె
ల్లన లేచితిని దశకం,ఠున శీఘ్రముఁ జేర్చియుండి ♦ ప్రాణికతోఁ గర. ౨౨ 1540

ఉ. నేనటు లేవ వాయసము ♦ నిర్భరరీతిని నేగుదెంచి నా
పైని జెలంగుకోపమున ♦ భవ్యకుచాంతరసీమఁ జీరె; న
ట్లూనినపూన్కి మై నెగిరి ♦ యుద్ధతిఁ బల్మఱుఁ జీఱఁ జొచ్చె న
ద్దానిన రక్తబిందువులు ♦ తద్దయుఁ జిమ్మఁగ నవ్వి సోఁకుటర్. ౨౫ 1541

సీ. తడిసె శ్రీరాముఁ; డం♦తట నేను బలుమాఱు కాకబాధితనయి♦గాఢసుఖము
మించఁగా నిద్రను ♦ గాంచునా సుందరతమమూపు శ్రీమంతు♦విమతహరుని
మేలుకొల్పితి; నంత ♦ మించుకరంబులు తగు నావిభుండు నా♦ స్తనములట్లు
కాకిచీఱఁగ వ్రణ♦కలితములై యుంటఁ గనుఁగొని కాలాహి♦కరణిఁ గుపితుఁ

తే. డగుచు నిట్టూర్పులెసఁగ ని♦ట్లనియె; హస్తి
కరసమోరూ! మనోహర♦గాత్రి యెవఁడు
తావకకుచాంతరమునందు ♦ దర్పమొప్ప
వ్రణము గావించెఁ దెల్పుమా ♦ వానినాకు. ౨౬ 1542

క. [1]తలలైదు వెలయఁ గ్రోధము, పొలయం దగుపాముతోడఁ ♦ బోలఁతీ యిటు క్రీ
డలఁ దేలువాఁ డెవ్వఁడు?, తెలుపుమయని యడిగె; నంత♦దెసలనలుఁగఁ గర.

క. తనదృష్టిఁ బరపి రక్తం,బునఁ దోఁగిననోళ్లతోడఁ ♦ బూనిక నామ్రో
లనె యున్నకాకి దానిం, గనియెను; నాకాక మనుర♦కాంతునిసుతుఁడా.

క. పతగాధిపుఁడై వెలసెను, నతఁ డప్పుడు వచ్చియుండె ♦ నవనికి, వేగం
బతులిత మనిలసమానం, బతనికిఁ జెలువారుచుండు ♦ ననిలతనూజా. ౨౮

క. మతిమంతుఁడు గురుబాహుఁడు, నతులితశౌర్యుండు నైన♦యారాముఁడు క్రో
ధతరళితనేత్రుఁడై యు,ద్ధతకాకముఁ జంప మదిని ♦ దలఁచెం; బిదప. ౨౯

చ. తనదగు నాసనస్థమగు♦దర్భ నొకండు గ్రహించి వేగమే
వనజభవాస్త్రమంత్రమును ♦ భక్తిని దానికిఁ గూర్చె నద్ది యా
యనలుఁడు తా లయంబుతఱి ♦ నట్టె జ్వలించెడునట్లు మండుచుం
ఘనవిహగంబుపై నడరఁ♦గాఁ దగియుండఁగ దానిఁ గాకిపై. ౩౦ 1547

తే. వైచె నది మండుచుం సుర♦వర్త్మమునను
బోలిచి యాకాకివెనువెంటఁ♦బోయె; నంతఁ

---

1 క. క్రీడతి సరోషేణ పంచవక్త్రేణ భోగినా - అనియూ. పంచవక్త్రేణ=ఐదుతలలపాముతోఁగూడి యొకళ్లోకము. పంచశిరస్సులు గలదని లోకులఁ జెప్పు మాటలు జెప్పియున్నందున నట్లే చెప్పఁబడినదని యెఱుంగందగు.

గాకి నానావిధములగు • గతులఁ బాఱె
బాణమయ్యది వెనువెంటఁ • బాఱుచుండె. 32½ 1548

చ. తను నెవరైనఁ గావఁదగు • ధన్యులు గల్గుదు రేయటంచు భీ
తినిగొని యెల్లలోకములఁ • దీవ్రగతిం దిరిగెన్; బరాక్రమం
బునఁ దగి తండ్రియైన సుర • ముఖ్యుఁడు నాతనిఁ గావఁజాల నే
నని విడనాడె దేవతలు • నట్లె మహర్షులు పుచ్చి రాతనిన్. 33 1549

చ. [1]తిరుగుచు మూఁడులోకములఁ • దీవ్రతదస్త్రమునుండి కాచు వా
రరయఁగ లేమి నెవ్వరు స • హాయము చేయఁగఁజాలకుంట నా
ధరణిపతీంద్రు రక్షకుని • దర్పసమగ్రునిఁ గానవచ్చి యి
త్తరుణమునందు నీవెగతి • తప్ప మఱొక్కఁడు లేఁడు చూడఁగన్. 33½ 1550

క. [2]అని వేఁడుచు దీనానన, మున నమరుండయ్యు భూమి • ముట్టుచు దుఃఖం
బునఁ దల్లి పదములం బెడు, తనయునిగతి నేలఁబడిన • దర్పవిహీనున్. 34

క. సురపతితనయుని, వధ్యుని, శరణ్యుఁ డగు నాకకుత్థ్స • సద్వంశమహా
శరనిధిపతి శీతాంశుఁడు, కరుణం గాపాడెఁ దన్నుఁ • గని వేఁడంగన్. 34½ 1552

తే. కాక మయ్యది తపియించి • కదలి లోక
ములను మూఁడింటిఁ దిరిగియు • ఫలము లేమి
నతివిషాదముతో రాఁగ • నపుడు దాని
దనను వేఁడంగ వచ్చెడు • నని యెఱింగి. 35 1553

క. ఫలికెను బ్రహ్మాస్త్రంబిది, ఫలవంతముగాక మరలు • పంబడ దెబ్బం
గులనైనఁ జేయనేమగుఁ, బలుకుమయనఁ గాకము రఘు • పతికిట్లనియెన్.

తే. అస్త్రమియ్యది నాదక్షి • ణాక్షి నిపుడు
శక్తి హింసించుఁగాక నా • శరము దానిఁ
జెండివైచెను; దక్షిణా • క్షిని నొసంగి
ప్రాణములఁ గాచుకొనియె నా • వాసవజని. 36½ 1555

సీ. రామచంద్రునకు స్వ • ర్గంబున నుండుట మిత్రుఁడౌ దశరథ • మేదినీశ్వ
రునకు మ్రొక్కుచు రాఘ • వుని సెలవంది తా నావాసమున కేగె; • నని వచించి
తనవిభుఁ గూర్చి యి • ట్లనియె నో ప్రాణేశ! మునునీవు నాకుఁగా • మొనసి యొక్క
కాకంబుపయిని లో • కంబుల దహియించు బ్రహ్మాస్త్రమును బూన్కి • వైచితివిగ

తే. యిపుడు నీయొద్దనున్న న • న్నిట్లు దొంగి
లించుకొనిచన్న నీచు క్ష • మించుచున్న
వాఁడ విది యేమి? యో నర • వర్య! నీవు
మిన్నకుండక నాపయి • మించు కరుణ. 37½ 1556

---

1 త్రీఁల్లోకాన్ సంపరిక్రమ్య తమేవశరణంగతః-అనిమూ. 2 సతం నిపతితం భూమౌ శరణ్య శ్శరణాగతమ్-అనిమూ. దీనివ్యాఖ్యానార్థ మిటఁ జేర్పఁబడినది.

క. మనమున నుత్సాహముఁగొని, ఘనతరదయఁ జూపుమా, త♦గ న్మన్నాథా
నినుఁబోఁటివానిఁ బలెఁగాఁ, దనరిన నే నసద నగుట ♦ ధర్మమె యిచటన్. ౨౦

ఆ. [1]అట్టు లేననాథ ♦ నగునట్లు సేయుట్టు, చున్న దేయి దేమి! ♦ యెన్నిచూడ
దయయె గలిగియుండు♦టయె మహాధర్మమం, చీవె చెప్ప వింటి♦ నేను మున్న.

క నీవేదయతప్పినచో, నేవిధమునఁ బలుకుదాన ♦ నిఁక నోనాథా
తావకబలవీర్యములౌ, నీవసుధను ననసుములని♦యే నెఱుఁగుదుఁజా. ౨౨

క. అనుపమమగు నుత్సాహము, తనరారెడునీసుగుణవి♦తాన మనుపమం
బును నగు నక్షోభ్యంబై, మనముచెలంగెడిని నీకు ♦ మానధనాఢ్యా. ౨౩

సీ. కలశాబ్ధికై వడి ♦ గాంభీర్య మలరారుఁగాదె నీయందు నా♦గరపరిసృత
మగుభూమికంతకు ♦ నధిపుఁడవగుదువు వాసవసముఁడవై ♦ వఱలుచుందు;
వీవని యెఱుఁగుదు ♦ నేను; నంచనిపల్కి హనుమంతుఁ గాంచి యి♦ట్లనియె సీత
రఘువీరుఁ డఖిలశ♦స్త్రాస్త్రపాండిత్య మలరెడు వారల♦యందు మేటి

తే. సత్యవచనుండు బలశాలి ♦ సాధుమతియు
నయ్యు నను నేఁచుదనుజుల♦యందు నేల
యస్త్రమును వైవకున్నాఁడో ♦ హనుమ చెపుమ;
యమరగంధర్వఫణిమరు♦త్సముదయములు. ౨౪ 1561

చ. అని మొన నారఘూత్తముని♦యగ్రతలంబున నిల్వఁజాల ర
య్యనఘుని యుద్ధవేగము సు♦రాసురముఖ్యులు కోర్వగానిదా;
ననుఁ గొనిపోవ శూరుఁడగు♦నాపతికిం ద్వరయుండు నేని యీ
దనుజులఁ దీక్ష్ణసాయకవి♦తానములన్ వధియింపఁడేలొకో. ౨౫ 1562

చ. అనుజుఁడు లక్ష్మణుండును మ♦హాబలశాలియొగాన శత్రుసూ
దనుఁ డగునాతఁడై నగుణ♦ధాముని రాముని యాజ్ఞనొంది యీ
దనుజులఁ జంపి బాధపడు♦తన్వని నన్నును గావఁడేలొకో;
యనలమరుత్సుతేజు లమ♦రాళికి దుర్జయులై నరాఘవుల్. ౨౬ 1563

క. ఇరువురు నొకచోనుండినఁ, బురుషశ్రేష్ఠులగువారు ♦ పోలఁతిని నన్నుం
బరిరక్షింపక యుండుట, కరయఁగఁగతమే మొ? చెపుమ ♦ హనుమా నాకున్.

క. అరిమర్దను లౌ శ్రీరఘువరు లీనాదుఃఖమును ని♦వారింపంగన్
గరము సమర్థులె యయ్యును, దరుణమునం దూరకుండఁ ♦ దగువిధమే మో.

క. [2]ఈవిషయమె మది నెన్నఁగ, నేవిధముననో యఘంబు ♦ నేఁజెప్పినదే
కావలసివంతయుండును, గావలయు ననంశయంబు ♦ గాలికుమారా. ౨౭

1 ఆనృశంస్యం పరోధర్మ స్త్వత్తఏవ మయా శ్రుతః-అనియూ. 2 మమైవదుష్కృతం కించి
న్మహ దస్తి నసంశయః-అనియూ. కించి దనిర్వచనీయము-అనివ్యాఖ్య.

చ. అనియిటు లశ్రుజాలముల ♦ నాతరుణీమణి జాలిపుట్టఁజె
ప్పినవచనంబులన్ వినుచుఁ ♦ బెంపగు తేజము గల్గువాయునం
దనుఁడిటుపల్కె; నిన్గుతిచి ♦ తద్దయు వంతలఁగుంది రాముఁడా
త్మను సకలంబునందుఁ బ్రమ♦దంబును బొందక తా నసిష్ఠుఁడై. ౫౦ 1567

తే. ఉన్నవాఁడని సేనివు ♦ డున్నతమగు
సత్యమున నొట్టువెట్టి ని♦జంబ పల్కు
వాఁడ రాముఁడు వగనొంద ♦ వనటనొందు
నతనితమ్ముఁడు లక్ష్మణుం ♦ డనవరతము. ౫౦౪ 1568

క. ఎంతో కష్టంబున నిను, నింతటఁ గనఁగల్గెఁ బొంద ♦ నీభాగ్యము నా
స్వాంతము నోచెను దీనికి, సంతసమును బొందఁదగు వి♦చారం బేలా. ౫౧

క. జనకసుతా! యీతఃణమున, ననూనదుఃఖంబులెల్ల ♦ నంతము గనఁగాఁ
గనుఁగొనుదువుగా వినుమా, ఘనబలులై పురుషసింహ♦కల్పులు నగుచున్.

చ. అనుపమరీతి వెల్గువన♦జాప్తకులాభరణంబు లిర్వురున్
నినుఁ గనునుత్సుకంబు దగు♦నేర్పునఁ బొందెడువారు గానఁ బ
త్తనమును దీని శీఘ్రముగఁ ♦ దప్పక నీఱుగఁ జేయువార; లో
వనరుహనేత్ర! బంధుయుతుఁ ♦ బాపునిఁ గ్రూరుని రావణాసురున్.

చ. అని మొనఁ జంపి నిన్నుఁగొని ♦ యాత్మపురంబున కేగఁజాలు నా
వనరుహమిత్రవంశమణి ♦ వాసవతుల్యుఁడు రాముఁ; డింక నా
తనికి మహాబలుండయిన ♦ తత్సహజన్మ నకున్ గపీంద్రుఁడై
తనరి సుతేజుఁడై ప్రబల♦దర్పమునం దగుసూర్యసూతికిన్
వనచరవర్యసంతతికిఁ ♦ బల్కుమ చెప్పఁగనైనమాటలన్. ౫౮౪ 1572

క. *అన సురకన్యనుబోలిన, జనకజమది నుప్పతిల్లు♦సంతాపమునన్
హనుమకు నిట్లనిపల్కెను; మనస్విని యనంగఁ బోలిచి♦మహిమాఢ్యయునై.

సీ. అలరెడు కౌసల్య ♦ యఖిలజగద్రక్షకుఁ డగుసత్పుత్త్రునిఁ ♦ గూర్మి నెవనిఁ
గాంచె నావాసవ♦కల్పుని శ్రీరామునిని సుఖంబడిగి త♦లనుధరణిని
దగులునట్లుగఁ జేసి ♦ తగినరీతిని మ్రొక్కు, మఖిలరత్నంబులు ♦ నమలకుసుమ
హారముల్, ప్రియమైన♦యంగనామణులును, నఖిలభూతలమున♦యందు దుర్ల
భమగునైశ్వర్యము ♦ నమితముగాఁ గల్గియుండియును సుమిత్ర♦కొప్పఁగూర్పు
నట్టిలక్ష్మణుఁడు ని♦వన్నియు దిగనాడి తలిదండ్రులన్ బ్రమో♦దంబు గనఁగ
నర్పించి సుప్రస♦న్నాత్ములఁ గావించుకొని రాఘవునితోడ ♦ వనికివచ్చె;
నతఁడు ధర్మాత్ముఁడై ♦ యగ్రజునందలిభక్తిచే నుత్తమ♦భవ్యసుఖము
విడనాడి వనమునఁ ♦ గడుజాగరూకత నన్నను గావంగ ♦ నరుగుదెంచెఁ;
బంచాస్యమునకును♦వలె స్కంధములు తగఁ బ్రియదర్శనుఁడు మన♦స్వియు సుదీర్ఘ

* సీతానుకసుతోపమా, ఉవాచ శోకసంతప్తా-అనియూ.

బాహుండునై తండ్రి♦వలె రాఘవునిఁ, దల్లి వలెనన్ను నెంచుచు♦సత్తిలుఁడును;
నను బల్మిమీఱ నీ♦దనుజుఁడు గొనిపోవుటాప్తుఁడెఱుఁగఁడు♦హనుమ, యతఁడు

ఆ. వృద్ధసేవకుండు ♦ విమలకాంతియుతుండు
శక్తుఁ డధికముగను ♦ సమయమందుఁ
గాని పల్కువాఁడు ♦ గాఁ డట్టిరాట్సుతుఁ
డెల్లరకును బ్రీతి ♦ నింపుచుండు. ౬౧ 1574

క. ఎల్లరలో శ్రేష్ఠుండై, సల్లలితగుణాళి నాదు♦శ్వశురున కీతం
డుల్లమురంజిల రఘుభూ,వల్లభునకుఁ జేయుచుండుఁ ♦ బవనతనూజా. ౬౨

క. ఆరీతి నాకుఁ బ్రియమును, గూర్చుచు మనెయుండుఁ గోరి♦కొంచగుఁ దతఁడా
శ్రీరాముఁ డేమిచేయుఁగ, నేరీతిం జెప్పునట్టు♦లే యొనరుచుఁజా. ౬౩ 1576

*చ. నిరతము దన్నుఁ దండ్రివలె ♦ నేర్పున నెవ్వఁడు ప్రోవ రాముఁడా
ధరణిపతీంద్రుఁ డైనతన♦తండ్రిఁ దలంపకయుండునో సమా
దరమున నట్టిలక్ష్మణుని ♦ ధర్మవిదుత్తము నాకుఁగాఁగ నీ
వె రమణ క్షేమవార్తలను ♦ నెల్లను బ్రశ్నమొనర్పు మారుతీ. ౬౪ 1577

క. పరిశుద్ధవర్తనుఁడు మృదు,తరచిత్తుఁడు కార్యకరణ♦దక్షుఁడు ప్రాణే
శ్వరునకుఁ బ్రియుండు నతఁడగు, హరివర! రాముండు నామ♦హార్తిని బాపన్.

క. ఏయేకార్యము తగునో, యాయాపద్ధతుల నీవె ♦ యలరింపఁదగున్;
నీయత్నముననె రాఘవుఁ, డీయెడఁ దపియించునన్ను ♦ నెలమిఁ జెలంగన్. ౬౬

క. కొనిపోవ యత్నపరుఁడవొ, హనుమా! శూరుఁడగునట్టి ♦ యారామునితో
డను నీమాటను జెప్పుము, నినునమ్మితి దశరథసుత ♦ నే నెంకదిగాఁదన్. ౬౭

తే. ఒక్కమాసమె ప్రాణాళి ♦ నొక్కరీతి
గా ధరించియుండెదఁ♦గాని యవల
నెంతమాత్రము బ్రదుక నే♦నిది నిజంబు
సత్యము ప్రమాణముగ నిట్టి♦సరణి నంటి. ౬౮ 1581

క. దనుజుం డిచ్చినపరిమితి, దనుకన్ జీవింపఁజాలు; ♦ దర్పనమగ్రా
మును శత్రులక్ష్మీ ఘనిలో,కనివానముచేయ నేఁగఁ♦గా నిర్ణయుల్లున్. ౬౯ 1582

చ. వనరుహనేత్రు వేఁడుటయు ♦ వారలప్రార్థన మాదరించి దా
నిని గొనితెచ్చినట్లు బహు♦నీచుఁడు క్రూరుఁడు రావణుండు వం
చనఁ గొనితెచ్చి యోఁచ నిటఁ ♦ జాల వగం దపియించునన్నుఁ బెం
పునఁ దగఁ గావఁగావలయు ♦ భూరికృపామతి సత్వరంబుగన్. ౭౦ 1568

చ. అని వచియించినా వమచు ♦ నారఘువీరునితోడఁ జెప్పుమా
యని తనయంబరాంచలము♦నందుఁ జెలంగుచు దివ్యమై ముదం

---

* కుశలం ఐక్తవ్యో వచనాన్మమ-అనిమా.

బును నిడఁజాలు రత్నమును ♦ బొందుగఁ దీసి మరుత్తనూజ! రా
మునకును దీని నిమ్మనుచు ♦ భూసుత యిచ్చెను బ్రేమమీఱఁగన్. ౭౯ 1584

క. వీరుం డాచూడామణిఁ, జారుతరంబును గ్రహించి ♦ సరగున వ్రేలన్
గూరిచె నల్పతనుండై, మారుతి యపుడుంట నతని♦మంజుకరంబున్. ౭౦

క. [1]స్థూలము గాకుండెను; వని,తాలలితమణిన్ గ్రహించి ♦ తమి వలగొనుచున్
జాలఁగ వందనముల నిడి, తా లలనాపార్శ్వమునందుఁ ♦ దగువినయమునన్. ౭౧

సీ. నిలుచుండె; భూపుత్రి ♦ నెలమి దర్శించుటవలన సంతోష మ♦వారిగాఁగఁ
గని హృదయంబుచే♦త్సాహాలునింబొంది తనువున నిచటనుం♦డెను; మఱియును
మారుతి తనదుసా♦మర్థ్యంబువలన నాజనకజ దర్శించి ♦ యనుపమమయి
యామెధరించునా♦యమలచూడామణి గ్రహియించి, పవనాభి♦కంపితమయి

ఆ. యదియుఁబోవ స్వస్థ♦మై యున్నపర్వత, మట్లు కుదుటఁ బడిన♦యంతరంగ
మలర రాముకడకు♦నరుగంగ నుద్యుక్తుఁ, డయ్యెఁ గార్యసిద్ధి♦యయ్యెననుచు.

ముప్పదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

3౯ - వ సర్గము.

సీతప్రశ్నములకు హనుమంతుఁడు తగినయుత్తర మిచ్చుట.

క. జనకజ యంతట నతనికిఁ, దనచూడామణి నొసంగి ♦ తమి నాతనికి
ట్లనియెను గుర్తియ్యది రా,మునకెంతయుఁ దెలిసినదియె ♦ మునుపె పవనజా.

తే. వీరుఁ డాతండు దీనిని ♦ వేడ్కఁ గనిన
యంత నిది పెండ్లికాలంబు♦నందొసఁగుట
[2]నాదుతల్లిని నపుడున్న♦యాదశరథు
దీనిఁ గైకొన్నయన్ను మ♦తిందలంచు. ౨ 1589

క. వనచరవర యెట్లో రా,మునిఁ బురికొల్పుమయటంచు ♦ మొక్కలముగ ని
న్నును బ్రేరేపించెద నీ, పనియందుఁ బ్రయత్న మొనరు♦పం దగుఁజుమ్మీ. ౨౪

తే. ఇంకముందేమిచేయంగ ♦ హితమొ దాని
నెన్నుమా; హరిసత్తమా ♦ యాపని ఘటి
యించునట్టిప్రయత్నంబు ♦ నీకనొనరుచు
భారమంతయు నీపయిఁ ♦ బరఁగుఁజుమ్ము. 3 1591

క. హనుమంతా! యెట్లైనను, బనిపూని మదీయదుఃఖ♦భారము నశియిం
చునటులొనరింపుమా; నీ, వనఘా! యటులెంచి చేయ ♦ నార్తి యడంగున్.

---

1 అంగులీం యోజయామాస న హ్యస్య ప్రాఘ్నత ద్భుజః-అనిమా. 2 వీరో జనన్యా మమ చ రాజ్ఞో దశరథస్య చ-అనిమా.

చ. అనవిని భీమశౌర్యుఁడగు♦నాహనుమంతుఁడు సీతఁగాంచి నీ
పనిచినయట్లు చేసెదన ♦ బాగుగ నంచుఁ బ్రతిజ్ఞచేసి యా
జనకజపాదపద్మముల ♦ భక్తిచెలంగ శిరంబుసోఁక వం
దనములుసల్పి రాముఁగనఁ ♦ దాఁ బయనంబును జేయఁగోరినన్. ౯౪ 1598

క. హనుమ ప్రయాణంబగుటను, గని బాష్పపయఃకణముల ♦ గద్గదముగువా
క్కున నాతని కిట్లను; నో, హనుమంతా! కుశలమడుగు♦మా రాఘవులన్. ౯

క. వనచరపతిఁ దన్మిత్రుల, వనచరులను వృద్ధులైన♦వారల నెల్లఁ ద
క్కినవారి ధర్మమార్గం,బునఁ గ్రమముగ క్షేమమడుగు♦ము ముదుక్తిగనే. ౯

క. గురుభుజుఁ డా రాముఁడు దు, స్తరదుఃఖపయోధి దీని♦దాఁటించున దే
వరుసను దద్విధిఁబల్కుము;, పరికింపఁగ నీవెదిక్కు ♦ పావనశీలా. ౯ 1596

తే. కీర్తిమంతుఁడు శ్రీరాముఁ ♦ డార్తిహరుఁడు
గాన నిల్లాలనగునన్నుఁ ♦ గాచుదిక్కు
గానకయె చావకుండెడ♦కరణి నెట్లు
చేయునట్లుగ నతనికిఁ ♦ జెప్పుమీవు. ౯౪ 1597

క. దానన్ ధర్మము గల్గును, మానక యిమ్మాటచేత ♦ మహిధర్మంబున్
వానరవర! నీవొందుము;, భూనాథుఁడు యుష్మదుక్తి♦పుంజమువలనన్. ౧౦౪

క. ననుఁ గొనిపోవఁగవలయును, నను పౌరుష మట్టె వృద్ధి♦యగుటవలన నీ
పనియందు సాహసించును;, హనుమంతా! వీరుఁడైన♦యా రాఘవుఁడున్.

క. నావార్తఁ జెప్పిపంపిన, యీవాక్కుల నీవలనని ♦ హితముగ వినుచున్
వేవేగ నన్నుఁబొందుట, కై విక్రమవిధిని నెఱపుఁ ♦ గడుఁ జక్కంగన్. ౧౨

క. అనవిని పవనాత్మజుఁ డా, హనుమంతుఁడు సీతపల్కు♦నావాక్యములన్
విని యంజలి తలఁ జేర్చి, యనియెం: గాకుత్స్థుఁడిటకు ♦ నతివేగమునన్. ౧౩

క. హరిభల్లూకేశ్వరగణ, పరివృతుఁడై వచ్చి యసుర ♦ బవరంబున నె
ల్లరఁజంపి నీదుదుఃఖముఁ, బరిమార్పంగలఁడు; దేవ♦వారమునందున్. ౧౮

క. దనుజులయందును నరులం, దును సంగరమందు నృపతి♦ధూర్జటి తీవ్రా
స్త్రనికరము వైచుచుండం, గను నాతని మ్రోల నిలువఁ♦గలవాఁ డొకఁడున్.

చ. కనఁబడలేదు నాకు; రఘు♦కాంతుఁడు సూర్యయమేంద్రులన్ రణం
బునఁ దగ నోర్వఁగాఁగలఁడు ♦ భూతనయా యిఁక నీవిముత్తమై
చని యనియందు నోర్వఁగను ♦ జాలునటంచు వచింపనేల? యో
జనకసుతా! సముద్రవృత♦సర్వమహీతల మేలఁబూనెడున్. ౧౬౪ 1604

క. అంతటియుత్సాహంబున, నెంతయు రాజిల్లుచుండు ♦ నిఁకనీకొఱకై
పంతంబున నని చేయును, గాంతరొ జయమలరుఁజుమ్ము ♦ కడుధ్రువ మిదియా.

క. అనియిట్లు సత్యమును జక్కనిదియు శ్రోత్రహితము నగు♦గాలికొడుకు వా
క్యనికరమును విని బుద్ధి న,తని గొప్పఁగఁదలఁచి, నృపతి♦తల్లజుకడకున్. ౧౮

క అరుగందలఁచెడునాతని, త్వరఁ బలుమరు గాంచి తనదు♦ధవునందలిని
ర్భరమోదము వెలిఁబుచ్చుచు, సురుచిరవాక్యమును మైత్రి♦చొప్పలరంగాన్.

క. పలుకంగఁదలఁచి యిట్లను;, బలవదరివ్రాతకాల,♦పౌరుషయుక్తో
జ్జ్వలతేజా! కోరికయుం, గలదేని రహస్యమైన♦తుమ నిం దొకచోన్. ౧౯

తే ఒక్కదినముండి విశ్రాంతి♦నొంది రేపు
పొమ్ము దురదృష్టమున వగఁ ♦ బొందునన్ను
నిచట సన్నిహితుఁడవయి ♦ యీవెయున్న
నిమ్మహాదుఃఖ మొకక్షణ♦మేని పాయు. ౨౦ 1609

క. వనచరవర! యీలంకకుఁ, బునరాగమనంబునకయి ♦ పూని తరలి నీ
వనుజనినఁ బ్రాణసంశయ,మునగున్ నాకిందు సత్య♦ముగ నోయనఘా. ౨౨

క ఇందులకేమాత్రంబును, సందేహము లేదు; మునుపె ♦ చాలవగల నేఁ
బొందినదానను మఱినీ, విందుండియె చనిన నాదు♦హృదయమునందున్.

ఆ. కలిగియున్నవగల♦కంటెను బెనువగ, లమరి యవ్విధన్ను ♦ నార్తిమునుఁగఁ
జేసి తాపమును న♦చింత్యంబు హెచ్చించు;, వానరేంద్ర! వీర♦వరగుణాఢ్య.

సీ. నీకు సహాయులౌ ♦ నిఖిలవానరభల్లుకంబులనుగుఱించి ♦ కడువివృతము
గను నందియంబు నా♦కును మ్రోఁలనిల్చినయట్టులున్నది; దాఁటు♦ననువుగాని
యీమహాజలనిధి ♦ నెట్లుదాఁటంగలవార లాభల్లూక♦వరులుగాని
వనచరులునుగాని ♦ వసుధేంద్రపుత్రులు గాని, యే లనఁగ ని♦క్కడలిదాఁటఁ

ఆ. గల్గునట్టిశక్తి ♦ గరుడునకును, వాయు,వునకు, నీకు, నీము♦వురకుఁ దప్ప
నొరులకెన్న లేక ♦ యుండు, వీరా! యిట్టు, లలవిగానిపనిని ♦ నరయు దీని.

క. ఒనఁగూర్పఁ జేయువిషయం,బున నీవిఘ్నమున కీవు ♦ బుద్ధిని దలపో
సినఁ దోఁచెడు పరిహారం,బును దెల్పుము కార్యవిదుల ♦ ముఖ్యుఁడవుగదా.

క. పరవీరహంత వీవా, దరయఁగ నీవొక్కఁడవె మ♦హాకార్యము ని
త్తరుణమునఁ జేయఁజాలుదు, వురుశక్తిం జూపి యిట్టు ♦ లొనరుపఁబూనన్.

తే. నీదుశక్తిసమృద్ధియు ♦ నీకె కీర్తి
కరముగానుండు నాకేమి♦కాదు; రాముఁ
డఖిలసేనాసమేతుఁడై ♦ యరుగుదెంచి
జన్యమున రావణుంజంపి ♦ జయముఁ గాంచి. ౨౮ 1616

క. తనపురికి నన్నుఁ గొనిపో,వున యే నదియే సుకీర్తిఁ ♦ బొందించును న
న్నును; బరసేనాళివిమ,ర్దనచణుఁడౌ రాముఁ డీవు♦రంబును నెల్లన్. ౨౯ 1617

క. ఘనబాణసంకులంబుగ, నొనరిచికొనిపోవు నేని ♦ యొగి ననువిది యా
తనికీర్తికిఁ దుల్యంబగు;, నని శూరుండై మహాత్ముఁ ♦ డారాఘవుఁడున్. ౩౦

క. అనురూపమౌ పరాక్రమ,మును నెఱపెడునట్లు చేయు ♦ ము మహాత్మా! నీ
వనియెదు; సదర్థయుతంబై, పనివడి యన్యోన్యవిహిత ♦ భావము తగఁగన్. ౩౧½

తే. హేతుయుక్తము నై యున్న ♦ యింతిమిన్న
పలుకు లాలించి చెప్పంగ ♦ వలసియున్న
వాక్కులం జెప్ప నిట్లనె ♦ వాయుతనయుఁ
డఖిలభల్లూకకీశసం ♦ ఘాధివిభుఁడు. ౩౨½ 1620

క. వనచరపుంగవుఁడును బల,మును మిక్కిలిగలిగి మహితశ ♦ మున మించెడు నా
ర్యునితనయుఁడు సుగ్రీవుఁడు, పనిదీని నదెట్టులైన ♦ వారక చేయున్. ౩౩

క. కృతనిశ్చయుఁడై యున్నాఁ, డతివరో! దనుజాంతకుఁడగు ♦ నాతఁడు నమరో
ద్ధతు లగుసహస్రకోటుల, హితవనచరవీరభటుల ♦ నెల్లరఁ గనుఁగొన్. ౩౩½

తే. తోడుకొని వేగవచ్చు; నా ♦ థుఁడగునతని
యాజ్ఞ విక్రమసంపన్ను ♦ లై బలాఢ్యు
లై మహావీరులై మన ♦ స్సట్లు వేగ
గమనులు నగుకపీంద్రులు ♦ గలరు మిగుల. ౩౫ 1623

క. వాహార్ద్వావధ స్థిర్య,శ్వాసగతుల్ మెఱయఁ దిరుగఁ ♦ జాలుదు రతివా
భూరితరతేజు లగుటను, వారలు గీడ్పడరు కార్య ♦ వారమునందున్. ౩౬ 1624

క. అమితోత్సాహులు వారలు, సమీరపథమందు వేడ్కఁ ♦ జరియించుచు సం
ద్రము లద్రులు గలయీధర, నమితగతిన్ సంచరించి ♦ రసత్కృతబలులై. ౩౭

క. విను సుగ్రీవునిపరిసర,మున నాకంటెను మహీర్య ♦ మున నొప్పిన వా
రును మత్సములును నగుకపు, లనేకు లున్నారు గాన ♦ మల్పుని నొకనిన్.

చ. *తరుణిరో! లోక మందలరు ♦ ధారణినాథులు సేనలోన నీ
కరబలశాలి నెచ్చటికిఁ ♦ గాని యొకప్పుడు పంప రల్పులో
నరులను బంపుచుంద్రుగద ♦ నన్నును నల్పునిఁ బంప నిప్డు సా
గరమును దాఁటివచ్చితి నిఁ ♦ కన్ బలవంతులమాటఁ జూడుమా. ౩౯ 1627

చ. కనుకను దేవి! నీవిపుడు ♦ కాంచెదువిప్పురి తాపమేల? యీ
ఘనతరశోకమున్ వదలఁ ♦ గాఁ దగు, వానరయూథనాథు లో
య్యన నొకసారియే యొగిరి ♦ యంబుధి దాఁటి పురంబు దీనిఁ జ
య్యనఁ గనఁజాలువారలు; మ ♦ హాబలవంతులు రామలక్ష్మణుల్. ౪౦½ 1628

క. నావీఁపు నెక్కి తోఁచెదు, నావిధు భానులనుఁ బోలి ♦ యలరుచుఁ దల్లీ
నీవున్న యెడకు రాఁగల;, రావీరులు పురుషవర్యు ♦ లగురాఘవులున్. ౪౧

---

* న హి ప్రకృష్టాః ప్రేష్యంతే ప్రేష్యంతే హీతరే జనాః—అని మూ.

క. ఇరువురును వచ్చి యీపుర,వరమును బహుళోగ్ర బాణ♦వారముచేతన్
గరము వినాశము నొందఁగఁ, దరుణీ చేయంగఁగలరు ♦ తథ్యము సుమ్మీ. ౪౩

క. వినుము వరారోహా! రఘు,తనయుఁడు రాముండు బంధు♦తతియుక్తుని నీ
దనుజేంద్రుఁ జంపి నినుఁగొని, తననగరముఁ జేరఁ గలఁడు ♦ తల్లీ యింకన్.

తే. ఊఱడిల్లుము మంగళం ♦ బొప్పఁగాక
నీకుఁ, గాలము నెన్నుచు ♦ నీవు భీతిఁ
బాసియుండుము జ్వలియించు♦వహ్నిఁబోలు
కాంతు రామునిఁ జూడంగఁ♦గలవు వేగ. ౪౪ 1632

క. తనయులతో మంత్రులతోఁ, దనప్రియబాంధవులతోడ ♦ దనుజేంద్రుఁడు చ
చ్చినఁ జంద్రుని రోహిణిపాం,దినగతిఁ బొందంగఁగలవు ♦ [1]దీనసురమణిన్.

క. జనకసుతా! దేవీ! యీ, ఘనశోకంబెల్ల నడఁగు ♦ త్వరపతి యిట నీ
దనుజేంద్రుఁజంపు, నీవును, గనఁగల వావిధమునెల్లఁ ♦ గనుపండువుగన్. ౪౬

చ. అనియిటు మారుతేంద్రసుతుఁ ♦ డామెను నూఱడిలంగఁజేసి తాఁ
జన మది నెంచుచున్ మరల ♦ జానకిఁ గాంచి వచించె నిట్లు; రా
మునిఁ గృతకృత్యు శత్రుహరు ♦ భూరిధనుర్ధరు లక్ష్మణున్ జవం
బున [2]నిట ద్వారభాగమును ♦ బొంది చెలంగఁగఁ గాంతు వాదృతిన్. ౪౭

సీ. దంష్ట్రానఖాయుధ♦తతి చెలువారఁగ హరివిక్రమంబుల ♦ నతిశయిల్లి
వీరులై మదహస్తి♦విధమునఁ బెంపొంది శోభిల్లుకపులను ♦ జూడఁగలవు
ద్వారసీమల నిందె; ♦ తల్లిరో! శైలాంబుదములట్టిభూరిదే♦హముల వెలసి
వనచరముఖ్యులు♦వరుస గుంపుగఁ గూడి [3]యీపురములయాద్రి♦నెసఁగుసాను

తే. వులను గర్జింపఁగాఁ గనఁ♦గలవు వేగ;
రాముఁ డతిఘోరమదనశ♦స్త్రప్రవిద్ధ
మర్ముఁడై సింహబాధిత♦మదకరియటు
సుఖమునొందక యున్నాఁడు ♦ సుమ్ము; దేవి. ౫౦ 1636

క. అనదవలె నేడువకుమా, మనసున నప్రియముగాంచి ♦ మానిని! తూలం
జనదిఁక; శచి కింద్రునివలెఁ, దనరెడు నాథుండు రామ♦ధరణిపుఁ డెలమిన్.

తే. [4]ధరణి రామునికంటె ను♦త్తరుఁ డెవండు
గలఁడు లక్ష్మణతుల్యుఁడు ♦ గలఁడె యన్యుఁ
డాశ్రయులు నీకునైన యా♦యన్నదమ్ము
లగ్నివాయుసమానులో♦యంబ నిజము. ౫౩ 1638

---

1 దీనసురమణిన్=దీనులపాలిచింతామణిని. ఈపదము ప్రకృతభావోద్ధారకమని చేర్పఁబడినది. 2 క్షిప్రం ద్రక్ష్యసి రాఘవమ్, లక్ష్మణం చ ధనుష్పాణిం లంకాద్వార ముపస్థితమ్-అనిమూ. 3 లంకామలయసానుషు-అనిమూ. 4 అగ్నిమారుతకల్పౌ తౌ భ్రాతరౌ తవ సంశ్రయౌ-అనిమూ.

చ. దనుజనివాసమై మిగుల ♦ దారుణమై కనుపట్టు నీస్థలం
బునఁ జిరకాలముండ వికఁ ♦ భూపతి రాముఁడు వేగవచ్చి నేఁ
జన రఘురాముఁ జేరుటకుఁ ♦ జాలినకాలముమాత్ర మోరిమిం
గని సమయంబునన్ గడవు ♦ క్రమ్మతి వేగమువత్తు రాముతోన్. ౫౮ 1639

ముప్పదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౪౦ - వ సర్గము.

{ సీత యింక నొకగుఱుతు రామునకుం జెప్పి పంపుట. హనుమ మీఁదికార్యము నాలోచించుట. }

చ. సురసుతవోలె నెంతయును ♦ శోభిలుసీత మహాత్ముఁడైన కే
సరిసుతుఁ డిట్లుగాఁ బలుకు♦సారవచస్తతి నాలకించి వే
పరమహితంబుగాఁ బలికె; ♦ భవ్యసువార్తను దెల్పునిన్ను నేఁ
గరము గనం బ్రహర్షమును ♦ గాంచితి వాయుకుమార! కావునన్. ౧॥ 1640

తే. వానగురిసినతర్వాత ♦ వసుధ మున్ను
సగము మొలిచినయట్టిస♦స్యంబు మరల
మొలచునటు లర్ధకార్యంబు ♦ ఫలమునందె
ననుచు సంతోష మందెద ♦ నార్య యిపుడు. ౨ 1641

సీ. ఘనదుఃఖకర్శితాం♦గంబుల నాపురుషోత్తము నాకాంతు ♦ నొగి స్పృశింపఁ
గల్గుచందమ్మునఁ ♦ గరుణ నాపై నుంచి కార్యంబు ఘటియింపు; ♦ కపిగణవర!
కాకిపైఁ గోపించి ♦ కాంతుఁడు తృణమును వైచి తదక్షిని ♦ బాడుచేసె
నట్టివార్తను నీకు ♦ నానవాలుగఁ జెప్పితినిగద మఱొకగు♦ర్తును వచింతుఁ;
ఆ. బల్కు మేను జెప్పు♦పగిదిగ *నోరామ, యొక్కనాఁడు నుదుట ♦ నున్నతిలక
మెట్లొ మాసిపోవ ♦ నీవప్డె మణిశిలఁ, బొట్టుచేసి ప్రీతి ♦ పొదలుచుండ ౪॥

క. చక్కఁగ నునిచితివిగదా, చెక్కిలిపయి దాని నిప్డు ♦ చిత్తమునందున్
జక్క స్మరింపుము; రామా, మిక్కిలిబలశాలి వీవు ♦ మేదినియందున్. ౫ 1643

క. సురపతివరుణోపముఁడవు, పరికింపఁగ నట్టినీవు ♦ భార్యను దనుజే
శ్వరుచేత నపహృతను శ్రీకరదనుజాంతరనివాస♦కారిణి సీతన్. ౬॥ 1644

క. వగపాలు కాకయుండెదు, తగవును విడనాడి యుంట ♦ ధర్మమె? కాంతిన్
మిగిలెడుచూడామణి నిటు, వగలొందుచు నింతవఱకు ♦ బాగుగ దీనిన్. ౭

క. పరిరక్షించితి ననఘా, కరమేఁ జెడువగల దీనిఁ ♦ గనుచున్ నిను నేఁ
బరికించినట్లు మోద,స్ఫురణము నొందుదును; రామ♦నుగుణగణాఢ్యా. ౮॥

---

* సీత హనుమతో నిట్లు చెప్పుటను తెల్పి రామునినే సంబోధించి యీవార్త తెల్పుచున్నదని యెఱుంగవలెను. త్వయా ప్రణష్టే తిలకే తం కిల స్మర్తు మర్హసి-అనియు.

క. సిరులం బొల్చుచు రత్నా,కరసంభవ మైనదీని ♦ క్ష్మాపాలక! నీ
పరిసరమున కనిపితి నే,వరుసను నీవగలఁ జిక్కి ♦ బ్రదుకఁగలనిఁకన్. ౮ 1647

క. నినుఁ గనుదు నన్నయీయా,శను దుర్భరదుఃఖములను ♦ సాధ్వసరూపం
బునఁదగు నీనెలఁతలపిం, డనియెదుహృదయచ్ఛిదంబు ♦ లగుపల్కులనున్. ౯

తే. [1]ఓర్చుకొని యింతదాఁక నే♦నున్నదాన;
శత్రుసూదన! యొక్కమా♦సంబె యింక
బ్రదికియుండెద నామీఁద ♦ బ్రదికియుండఁ
జాల నినుఁగాన కేనొక్క♦క్షణముగాని. ౧౦ 1649

క. దనుజేంద్రుఁ డతిక్రూరుఁడు, ననుఁ గాంచెదువిధమునన్ మ♦నంబున శాత్రిం
గనిపింపఁ జేయుచుండును, వినితెని నీవా ర్తినొందు♦విధ మటుగానన్. ౧౦౺

ఆ. నెలకుమీఁద క్షణము ♦ నే మనఁజాల; నో
రామచంద్ర యనుచు ♦ రాముఁగూర్చి
యశ్రుపూర్ణనయన ♦ యై యేడ్చుజానకి
పలుకు లాలకించి ♦ పవనసుతుఁడు. ౧౧౺ 1651

క. గురుతేజుఁడు గావున నా, కరుణోక్తుల శా ర్తినొంది ♦ కడుఁదమిఁ బలికెన్;
దరుణీ! నీశోకమున నె, ధరణీశుఁడు విముఖుఁడయ్యెఁ ♦ దథ్యము సుమ్మా. ౧౨౺

క. అని సత్యమునే సాక్షిగ, నొనరిచి నేఁబలుకువాఁడ ♦ నోసీతా! రా
మునిదుఃఖముఁ గని లక్ష్మణుఁ, డనుకంపఁ దపించుచుండు ♦ ననవరతంబున్. ౧౩

చ. కనఁబడితీవు కష్టమునఁ ♦ గన్నులపండువుగాఁగ సంతసం
బున కనువైనకాలమిది ♦ పొక్కఁగఁ గాలముగాదు తల్లిరో
విను మిఁక నీముహూర్తమున ♦ విచ్యుతదుఃఖవుగాఁ జెలంగుదీ
వని పనిఁబూని చెప్పఁగల♦నారిపుసూదను లైనరాఘవుల్. ౧౪౺ 1654

చ. ఇరువురు పూరుషోత్తములు ♦ నెంతయు నిన్గన నుత్సహించుచుం
దురు గనుకన్ బ్రయత్నమునఁ ♦ దోడనె యిప్పురిఁ బూదిచేయువా;
రురునమరంబునందు దను♦జోత్తరుఁ గ్రూరుని బంధుయుక్తు ని
ర్భరగురువిక్రమంబు గదు♦భాసిలఁ జంపి [2]విశాలలోచనా. ౧౫౺ 1655

చ. నినుఁ దమపత్తనంబునకు ♦ నెమ్మిని దోడ్కొనిపోవువార; లిం
కను నిను దేవ రాఘవుఁడు ♦ గాదిలిపత్నియె యంచెఱుంగునో
యనుపమమైనచిహ్నమును ♦ నాద్రుతి నింకొకదానినీయఁగాఁ
జను; నన సీత యిట్లనియె ♦ స్పర్శనపుత్ర! మహాపరాక్రమా. ౧౬ 1656

క. అనుపమచిహ్నంబును ని,చ్చినదానను గాదె మున్ను ♦ చెచ్చెఱ మత్క

---

1 మాపా దూర్ధ్వం నజీవిష్యే త్వయా హీనా నృపాత్మజ, ... నజీవేయ మహాం క్షణమ్-అనిమూ. 2 రాఘవౌ త్వాం విశాలాక్షి-అనిమూ.

శనికరభూషణముగు దా,నిని గన నీపల్కు లెల్ల ♦ నృపపతి నమ్మున్. ౨౧ 1657

క. అనవిని శ్రీమంతుం డా, వనచరతిలకుండు దాని ♦ వరమణిఁ గొని యా
జనకజకు మ్రొక్కి తలతోఁ, దనపయనము సాగఁ జేయఁ ♦ దగఁ గోరె మదిన్.

సీ. జానకి యాతని ♦ సాగరలంఘనోత్సాహుని వర్ధిత ♦ తనుని దీవ్ర
వేగుని హరివరు ♦ వీరుని హనుమంతుఁ గని యశ్రుపూర్ణవ ♦ దన మమరఁగ
గద్గదస్వరమునఁ ♦ గడఁగి యిట్లనియె దైన్యంబునఁ; బంచాస ♦ నాథ శౌర్యు
లయినరాఘవులను ♦ సకలవానరపతి నాతనిమంత్రుల ♦ నందఱను ద

తే. గంగ నడిగితి నని పల్కు ♦ కర్బురాంత
రమునఁ గుశలముగ నే యున్న ♦ దమలచరితుఁ
డైన రాముని దలఁచుచు ♦ నంచుఁ బల్కు;
మమ్మహాబాహుఁ డగు రాముఁ ♦ డరుగుదెంచి ౨౨ 1659

క. నను నీ ఘనదుఃఖార్ణవ, మునునుండి తరింపఁ జేయఁ ♦ బూనునటుల రా
మునకుం జెప్పుము చక్కఁగ;, వనచరవర! నీవు భూవ ♦ వరునన్నిధికిన్. ౨౩

క. చనఁగానె యీ భయంకర, ఘనదుఃఖము, [1]రాక్షసులొగిఁ ♦ గడు భయదముగా
ననుఁ బల్కు భర్త్సనంబుల, వినినవి యన్నింటి రామ ♦ విభునకుఁ జెపుమా.

తే. [2]నీకు మార్గము శివమగుఁ ♦ గాక; యనియె
రాజపుత్రిక యొసఁగిన ♦ రత్నవరముఁ
గైకొనుచుఁ గృతకృత్యుఁడై ♦ కడు ముదమునఁ
జిత్త మలరంగ నిఁక నేమి ♦ చేయఁ దగును ౨౪ 1662

క. [3]అని తలఁచి చేయవలసిన, పని యించుకయుంచు నెఱిఁగి ♦ పావని చేత
స్సున నుత్తరదిగ్గమనం,బును జేయఁ దలంపుఁ గొనియెఁ ♦ బొంగుచు నంతన్.

నలువదియవ సర్గము సంపూర్ణము.

---

## ౪౧-వ సర్గము.

హనుమంతుఁ డశోకవనభంగ మొనర్చుట.

చ. [4]జనకజ! చారువాక్యముల ♦ సన్నుతిఁ జేయఁగఁ దాఁ బ్రయాణమై
చన మదినెంచి యాజ్ఞఁ గొని ♦ సాగిలి మ్రొక్కి తదంతికంబు నొ

---

1 రక్షోభి శ్చేభిః పరిభర్త్సనంచ-అని మూ. 2 శివ శ్చ తేఽధ్వాస్తు హరిప్రవీర-అని మూ.
3 అల్పావశేషం ప్రసమీక్ష్య కార్యం దిశం హ్యుదీచీం మనసా జగామ-అని మూ. ఇట మనసా జగామ యనుదానిచేఁ గొందఱు హనుమంతునకు యోగశక్తిగలదని యర్థము చెప్పుచున్నారు. వెఱ్ఱివెఱ్ఱియర్థములఁ జెప్పు వ్యాఖ్యాతలు పూనరేమి. కాని నది [illegible]
4 స చ వాగ్భిః ప్రశస్తాభి ర్గమిష్య న్పూజిత స్తయా-అని మూ.

య్యన నెడఁబాసి తాఁ దలఁచె ♦ నాత్మను బావని; సీతఁజూడఁగా
దనుజునిదౌ బలంబెఱుఁగఁ ♦ దప్పక వచ్చితిఁ గాన నందులోన్. ౧౹ 1664

సీ. [1]అత్యంతముఖ్యమౌ ♦ నవనిజఁ గనుపని యైనది యిఁక రావ♦ణాసురహృద
యమునుగాంచుటయొక్కఁ ♦ డవశిష్టమైయున్నదిదియల్పమగు కార్య♦మెయగుదీని
విషయమై తలపోయ ♦ విమలంబులౌ సామదానముల్ మఱియు భే♦దంబున నెడు
నట్టియుపాయత్ర♦యంబును వదలెద నవ్వలిదగునుపా♦యంబె యిపుడు

ఆ. కార్యసాధనముగఁ ♦ గనఁబడుచున్నది;
యరయ నసురవరుల♦యందు సామ
మప్రయోగ్యమె యగు ♦ నవ్వారుకుమతులు;
ధనికులందుఁ దగదు ♦ దానమెపుడు. ౨౹ 1665

క. [2]దనుజేంద్రుఁడు ధనబలముల, ననుపముఁ డట్లాట భేద ♦ మనెడునుపాయం
బున సాధింప సనర్హుఁడు, జనులు బలాధికులు భేద♦సాధ్యు లగుదురే. 3

క. అరయఁగ దండోపాయమె, తరుణమ్మున నిందుఁ జూపఁ♦దగు సమ్మతమై
పరఁగెడునాకిపు డది దు,స్తరకార్యము దీనిఁ జక్క ♦ సాధింపంగన్. 3౹ 1667

సీ. విక్రమమేతప్ప ♦ వేఱొక్కఁడేదియు నరసినఁ బొసఁగ దె♦ట్లైనఁగాని
యనియొనరిచి దాన♦వాధిపులం జంపితినయేని తక్కిన♦దనుజులెట్లొ [రో
మార్దవంబును గాంత్రు;♦[3]మహిని నెవ్వని నొక కార్యమునొనరుపఁ♦గాఁబనుతు
యతఁడు దానింజేసి ♦ యందుల కవిరుద్ధము లగు నెన్నో కార్య♦ముల నొనర్ప

ఆ. వలయునట్టివాఁడె ♦ యిలఁ గార్యసాధకుఁ, డగును; జేయఁబూని♦నట్టికార్య
మల్పమైన నెట్లొ ♦ యద్దాని నొకహేతు,వునను చక్కఁ జేయఁ♦బోలదెపుడు.

క. జనుఁ డెవ్వఁ డొక్కకార్యం, బునకుం గలహేతువుల స♦మూహా మెఱిఁగి య
ప్పనిని బహూపాయంబులఁ, బనివడి సాధించునతఁడె ♦ పటుఁ డనఁబడెడున్.

చ. అరిబలమున్ స్వకీయబల ♦ మారసి యందలితారతమ్య మి
క్కరణిగ నుండునంచు మది ♦ గాఢముగాఁ దలపోసి యుండె నే
హరిపతిపత్తనంబునకు ♦ నవ్వలఁ బోవుదు నేని సీతనున్
సురరిపుఁ జూచి రావణుని♦చొప్పు సమస్తము నేనెఱుంగుటన్
హరిపతి నాకుఁ జెప్పినది♦యంతయుఁ దీర్చినవాఁడ నౌదుఁగా. ౭ 1670

తే. ఇట్టులొనరింప కపనిజ ♦ నిచటఁ గాంచి
పోవుదునయేని దనుజుల♦పొంకమెట్టి

---

1 ఇందు మూలమునకు వ్యాఖ్యాతలు నిర్ణయించినయర్థసారమే చెప్పఁబడినది. 2 నభేదసాధ్యా బలదర్పితా జనాః-అనిమూ. 2 కార్యే కర్మణి నిర్దిష్టే యో బహూన్యపి సాధయేత్, పూర్వకార్యావిరోధేన సకార్యం కర్తు మర్హతి-అనిమూ.

దనిన నేమనిచెప్పుదు? ♦ నరయ నిపుడు
సంగరం బెట్టులౌనొ యా♦చందముగను. ౭ 1671

క. దనుజులతో నయ్యెడున, ట్లొనరింపఁగ వలయుఁగాదె ♦ యుద్ధము ముఖరీ
తిని గల్గఁజేయులేకద, యచుకూల ష్టుట్లుచేయు ♦ వను రేంద్రుఁడిఁకన్. ౮

క. తనవారిబలము నాబల,మును జక్కఁగఁ దెలిసికొనును; ♦ మొనసి యనిని నా
దనుజేంద్రునిసచివభటే, శనిఖిలసుభటులను నేను ♦ శౌర్యము పొంగన్. ౯

తే. [1]మాఱుకొని సీతనుం గూర్చి ♦ మనసదెల్లు
దనుజపతికున్నదో వాని♦దర్పమెంతొ
చక్కఁగనుఁగొని యిటనుండి ♦ స్వపురమునకుఁ
బోవువాఁడను; వనమిద్ది ♦ పొలుపుమీఱ. ౧౦ 1671

క. పరమక్రూరుం డగుదను, జరమణుని వనంబు మిగులు♦శక్రువనంబున్
బరమము హృదయములకు సుం,దరమును బహుతరులతావి♦తానమ్ము నగున్.

చ. వనమును దీని నిత్తఱిని ♦ బాడొనరించెద శుష్కకాననం
బును జ్వలనుండు కాల్చుక్రియఁ ♦ బొంగుచు నేనటుచేయఁగా దశా
ననున కమర్ష మొప్పునద♦నాగతురంగశతాంగయుక్తమై
తనరి త్రిశూలముఖ్యములఁ ♦ దాల్చినసైన్యముఁ బంపునాతఁడున్. ౧౧

క. వారికి నాకును నిదిగో, ఘోరంబగుసంగరంబ♦గున్ మఱినేనే
వారికిని దుర్భరంబగు, శూరత్వముమీఱ బలముఁ ♦ జూపుచు ననిలోన్.

తే. చండవిక్రము లైనరా♦క్షసులనెల్ల
నొకట నెదిరించి వారల ♦ నొగి వధించి
యంత సుఖముగఁ గిష్కింధ ♦ కరుగువాఁడ;
ననుచుఁ దలపోసి యమ్మరు♦దాత్మజుండు. ౧౩ 1678

చ. అనుపమభీమవిక్రమము ♦ నాహవకాంక్షయుఁ బొంగఁ గ్రోధియై
కనదురువక్షవేగమున ♦ త్రుమరుహాసంతతిఁ గూలఁద్రోయనా
గెను; దరువాత వాయుజుఁడు ♦ కీర్తితశౌర్యుఁడు మత్తపక్షిబృం
దనిబిడమై మహీరుహల♦తాతతిజుష్టము నై చెలంగుచున్. ౧౪ 1679

క. కనఁదగునా ప్రమదావన,మును బాడొనరించె; వృక్ష♦ములు గూలఁగఁ జె
న్నునఁదగు సలిలాశయములు, ఘనశోభ దొలంగి చెడఁగఁ♦గాంచనశిఖరుల్.

ఆ. చూర్ణితంబులగుచు ♦ సొంపుచ జాయంగ, నాయశోకవనము ♦ హాస్యవప్పి
యప్రియంబుగాఁగ ♦ నత్తఱిఁ జూపట్టె; నిట్టులందుఁ బక్షు♦లెల్ల వెదరి. ౧౬

---

1 హృదిస్థితం తస్య మతం బలంచ నై సుఖేన మత్వాహ మితః పునర్యామి-అనిమూ. మతం
సీతావిషయకాధ్యవసాయం బలం చ మత్వా-అనిర్వాహ్య.

సీ. కలనాదములు కడుఁ ♦ జెలంగఁగా మొఱపెట్ట, సలిలాశయంబులు ♦ సమసిపోవ
దరులతాసముదాయ ♦ తామ్రపల్లవములు వాడియుండంగ దా ♦ వహుతవహుని
చేఁ గాల్పఁబడినట్టు ♦ చెచ్చెఱఁ గన్పట్ట; నందలితీఁగ లా ♦ తాశ్రయతరు
వరములు నశియింప ♦ వసుధపైఁ బడియుండి విహ్వలలై యున్న ♦ వెలఁదులవలెఁ
ఆ. గానఁబడియెఁ; బాడు ♦ గావింపఁబడినల,తాగృహాళియట్లె ♦ దగినచిత్ర
భవనములును, గల్గి ♦ [1]ఫణులును సత్వముల్, దెసల కరుగ నద్ది ♦ తీరుదప్పి.
క. కన నప్రియదర్శన మ,య్యెను నందు శిలాగృహమ్ము ♦ లెల్లగృహంబుల్
పసివడి చెడిపోవుట న,వ్వన మప్పుడు రూపుచెడుటఁ ♦ బాడుగఁ దోఁచెన్.
సీ. అసురనాయకు మహో ♦ ద్యానమై తగులతాగణమ దేకీడును ♦ గాంచకుండ
ముద్దుగాఁ బెరుగుచు ♦ ముదమును గూర్చుచు నంతఃపురోద్యాన ♦ మైనయాయ
శోకవనంబద్దు ♦ శూరుఁ డౌహనుమచే విధ్వస్తమై సొంపు ♦ విడిచి శోచ
నీయముగానుండె; ♦ నాయర్థపతి యగునసురేంద్రునకుఁ జాల ♦ నప్రియంబుఁ
ఆ. బొనఁగఁజేసి తాను ♦ భూరిబలాఢ్యుఁడై
ప్రబలులైన దనుజ ♦ వరులతోడ
ననిని జేయఁగోరి ♦ [2]యధికకాంతిని మీఱి
తోరణమున హనుమ ♦ కూరుచుండె. ౨౧ 1684

నలువదియొకటవ సర్గము సంపూర్ణము.

---

## ౪౨ - వ సర్గము.

—వనభంగవార్త విని రావణుఁడు సేనలఁ బంపుట.—

క. అంతట లంకం గలవా, రెంతయు ద్విజనాదముల మ ♦ హీరుహపతనా
త్యంతరవంబుల భయసం,భ్రాంతులు కాఁ చొడఁగి; రచటి ♦ పశుఁలుమృగముల్.
క. భీతిసమాక్రమణాకుల, చేతస్సులఁ బాఱఁజొచ్చెఁ; ♦ జెంతనె యసుర
వ్రాతవినాశనసూచక, భీతిప్రదహేతువు లట ♦ విస్తరిలెఁ గడున్. ౨ 1686
సీ. వికృతాస్యలయినయా ♦ వెలఁదు లాధ్వనికి మే
ల్కాంచి యెంతయును భ ♦ గ్నమగువనము
వీరుఁడై తనరారు ♦ మారుతపుత్రునిఁ
గాంచిరి; శూరుఁడై ♦ మించి దీర్ఘ
బాహువులును మహో ♦ బలము గల్గినమరు
త్తనయుండు రాక్షస ♦ తరుణులఁ గని
వారికి భీతిని ♦ గూరుచు గొప్పరూ
పంబును దాల్చె; నా ♦ పడఁతులెల్లఁ

---

1 మహోరగై ర్వ్యాళశ్చాగై శ్చ-అనియూ. 2 శ్రియాజ్వలన్ తోరణమాస్థితః కపిః-అనియూ,

తే. పర్వతాయతదేహుఁడై ♦ ప్రౌఢబలము, వెలయు నున్నకపింగని ♦ పలికిరిట్లు
జనకసుతతోడ: నెవ్వఁడీ ♦ వనచరుండు, వీని పేరేమ దేపనిఁ ♦ బూనివచ్చె. ౫

క. పనిపినవాఁడెవ్వం డే, జనపదమున నుండివచ్చె? ♦ జానకి! నీతో
డను నేమిగ భాషించెను?, వనజాక్షీ! సుందరీ! భ ♦ వత్స్వాంతమునన్. ౬

ఉ. [1]ఏమియు సాధ్వసంబుఁ గన ♦ కీవిషయంబు సవిస్తరంబుగా
నేమికొఱంతలేక యితఁ ♦ డిత్తఱిఁ జెప్పినమాటలెల్ల మా
తో మగువా వచింపు; మనఁ ♦ దోయరుహానన, చారుగాత్రి, యా
రామునిపత్ని యిట్లనియె ♦ రాక్షసులెల్లఁ గామరూపులే. ౭ 1689

క. కావున వారిచరిత్రము, లేవెరవున నెఱుఁగుదాన; ♦ నిఁక మీరలెగా
దే వారినెఱుఁగఁగల [2]రా,శీవిషపాదములఘనులె ♦ క్ష్మితిని నెఱుంగున్. ౮

క. పనిదేనిఁ బూనివచ్చెనొ, వనచరుఁ డితఁ డెవఁడొ యెఱుఁగు ♦ వారలు మీరే
వినుఁ డిది నిస్సందేహ; మి,తనిఁ గని నామనము చాలఁ ♦ దత్తఱపడెడిన్. ౯

క. ఇతఁ డెవఁడొ మీరె నాకును, హితముగఁ దెల్పుండు; వీని ♦ నేఁ గన నెవఁడో
దితిజుండు కామరూపియొ, యితరుఁడు కాఁడనుచుఁ దోఁచె ♦ నెల్లవిధములన్.

చ. జనకజ యిట్లుపల్క దితి ♦ సంభవకాంతలు భీతినొంది యా
వనమున నెల్లదిక్కులకుఁ ♦ బాఱిరి, కొందఱు సీతఁగావఁగాఁ
జనునని యుండి రక్కడనె ♦ సత్వర మీవిధమెల్ల తేనికిన్
జని తెలుపంగ నో యనుచుఁ ♦ జావలు పోయిరి కొంద ఱత్తఱిన్. ౧౧ 1693

తే. వికృతముఖములు గలుగునా ♦ వెలఁదులెల్ల
దనుజవిభుచెంత కరిగి భీ ♦ తిని జనింపఁ
జేయుచు విరూపుఁడైనయా ♦ చిత్రకపివి
ధంబుఁ దెలుపంగఁబూని రెం ♦ తయును బూన్కి. ౧౨ 1694

చ. దనుజవిభూ! యశోకవన ♦ తల్లజమధ్యమభాగమందు భీ
తిని గలిగించు దేహము, న ♦ తిస్థిరవిక్రమమున్ జెలంగఁగా
వనచరుఁ డొక్కరుండు తగు ♦ భంగిని జానకితోడఁ బల్కి తాఁ
జని ఘనతోరణాగ్రమున ♦ సంతసమొప్పఁగ నున్నవాఁడు మా. ౧౩ 1696

సీ. హరిణలోచనసీత ♦ నాతఁ డెవ్వండని బహువిధంబుల మేము ♦ ప్రశ్నచేయ
వానివిధంబు నే ♦ దైనను జెప్పదు, దూత యీతఁడు పురు ♦ హూతుఁ దనుప
వచ్చినాఁడో లేక ♦ వైశ్రవణుఁడు పంప వచ్చినాఁడో, రఘు ♦ వరుఁడు సీత
వెదకంగఁగోరి యీ ♦ విధమునఁ బంపఁగా వచ్చినాఁడో, చెప్ప ♦ వలనుపడదు;

---

1 ఇందలిసీతావిశేషణములు మూలావిరుద్ధము లేయని యెఱుంగందగు. 2 అహిరేవ హ్యహేః పాదా న్విజానాతి నసంశయః-అనియు.

తే. బహుళమృగగణనిబిడమై ♦ త్వన్మనోహ
రమగు ప్రమదావనంబును ♦ నమిత దేహుఁ
డక్షపీంద్రుఁడు భంజించె; ♦ నవ్వనమున
నతఁడు పాడొనరింపని ♦ వరయ లేదు. ౧౬ 1696

క. జనకసుతయున్నభాగం,బునుమాత్రము ముట్ట లేదు; ♦ భూరికపియు దా
నిని జానకి రక్షింపం,గనో శ్రమమునను నశింపఁ ♦ గాఁ జేయఁడు సూ. ౧౭

క. ఈవిధమే కాకున్నను, నావనచరునకుఁ దలంప ♦ నగునె శ్రమము, ర
క్షోవర! జానకినే తగఁ, గావంగాఁ జెఱుపఁ దయ్యెఁ ♦ గాంతాంతికముల్. ౧౮

తే. చారుపల్లవపుష్పౌఘ ♦ సాంద్రమగుచుఁ
దనరునాశింశుపావృక్ష ♦ మును జనకజ
యాశ్రయించియె యిపుడుండె ♦ నతఁడు దాన
దాని నశియింపఁ జేయఁ దాఁ ♦ బూనఁడయ్యె. ౧౯ 1699

క. వనచరుఁ డుగ్రాకారుఁడు, జనకజతో మాటలాడి ♦ సద్వనమును ద్రుం
చెను గాన నుగ్రదండన,మును జేయఁగ నాజ్ఞయిమ్ము ♦ మునుముందుఁ దగన్.

తే. నీవు మదిని గ్రహించిన ♦ నెలఁతతోడ
నెవఁడు మాటాడు? నీకోఁతి ♦ కింక నాయు
వెంత లేకున్నయది కాన ♦ నే కడంగెఁ
బలుకరింపంగ నన వారి ♦ పలుకులు విని. ౨౧ 1701

చ. దనుజవిభుండు రావణుఁడు ♦ దారుణకోపము నొంది యంతటన్
గనులను ద్రిప్పుచున్ ఘృతము ♦ గాఢముగాఁ గొని వేల్వ దాన మం
[1]డినయనలుండువోలెను గ ♦ డిందిమగంటిమి మండె; నంతఁ జ
క్కనిగతి మండుదీపపుయు ♦ గంబుననుండియె జ్వాలతోడ నా
య్యనఁబడు తైలబిందువుల ♦ యట్టులు కోపము నొందియున్నయ
ద్దనుజుని రెండునేత్రముల ♦ దారుణరీతిని నశ్రుబిందువుల్
చినుకులరీతిఁ గాఁబడియెఁ ♦ జెచ్చెఱ; నంతటఁ దీవ్రతేజుఁ డా
వనచరు నిగ్రహించుటకుఁ ♦ బంపె స్వతుల్యుల విక్రమాఢ్యులన్. ౨౨ 1702

క. [2]దనుజులు వారలు కింకరు, లనఁగా నొప్పుదురు; మఱి బ ♦ లాధికులయి తా
మెనుబది వేలుగఁ దగి జవ,మునననలరుచునుండ్రు; భయద ♦ మూర్తులు వెలయన్.

క. పెనుకడుపులు పెనుదంష్ట్రిలు, ఘనబలములు నొప్పుచుండఁ ♦ గా ముద్గరకూ
టనికరకరులై యందఱు, ననిపైఁ దమమనము లోలయ ♦ హనుమం బట్టన్.

---

1 దీప్తాభ్యామివ దీపాభ్యాం సార్చిష స్స్నేహబిందవః-అనిమూ. 2 కింకరా న్నామ రాక్ష
సాన్-అనిమూ.

తే. బయలువెడలిరి రావణు♦భవనవరము
నుండి తోరణాగ్రంబున ♦ నున్నయట్టి
వనచరునిచెంత కేగి యా♦దనుజవరులు
శలభములు వహ్నిఁబడునట్లు ♦ జవముమీఱ. ౨౭ 1705

క. [1]హనుమంతునిపై కడరిరి; దనుజులు వారెల్లఁ జిత్ర♦తరగదలను గాం
చనదివ్యాంగదపరిఘత,తిని సూర్యాభాంబకములఁ ♦ దెగి ప్రహరింపన్. ౨౮

తే. మఱియుఁ బట్టసశూలతో♦మరవితతిని, బ్రాసముద్గరశక్తులఁ ♦ బట్టి యతని
జవమునం జుట్టుముట్టి ప్ర♦చండశౌర్య,ములరనిల్వంగ గురుతేజుఁ♦డైనహనుమ.

క. అనిసేయుకౌతుకంబునఁ, దనుకాంతి చెలంగఁ బర్వ♦తప్రతిముండై
తనతోఁక నేలఁగొట్టుచు, నొనరిచెఁ బెనునాద మప్పు ♦ డుద్ధతి తోఁపన్. ౩౦

చ. అనిలతనూజుఁ డంతట మ♦హాద్భుతకాయము నట్టిపెంచి లం
కను ధ్వనిపూరితంబుగను ♦ గాఢభుజంబుల నప్పళించెఁ; ద
జ్జనితమహారవంబు గిరి♦సానువులన్ బ్రతినాదముల్ తగం
బొనరిచి పర్వ నభ్రమునఁ ♦ బోయెడుపక్షులు భూమిపైఁ బడెన్. ౩౧ 1709

చ. హనుమయు నంత బిగ్గఱఁగ ♦ నార్చుచు నిట్లనిపల్కెఁ; రాఘవుల్
ఘనబలు లెల్లవారలను ♦ గన్ప్రయశంబున మించియున్నవా
రనఘుఁడు సూర్యపుత్త్రుఁడు కృ♦పాకరుఁ డా రఘురాముఁ డొక్కటన్
దనకు సహాయుఁడై చెలఁగఁ ♦ దాను జెలంగును విక్రమంబునన్. 33 1710

సీ. అక్లిష్టకర్ముఁడై ♦ యలరుకోసలదేశపతికి శ్రీరామభూ♦పతికి నేను
దాసుండ, నరిబల♦సర్పసంహారుఁడను హనుమంతుఁడనువాఁడ ♦ ననిలసుతుఁడ;
శిలలచేఁ దరువరం♦బులచేత వేయివిధంబులఁ గొట్టుచు ♦ దర్పమొప్పఁ
బరఁగెడునాకు రా♦వణసహస్రంబులు సరికావు సంగర♦స్థలమునందు;

తే. దనుజవరులెల్లరును నను ♦ గనుచునుండ
నిదిగొ యీలంకఁ బీడించి ♦ యీజనకజ
కెలమిమై మ్రొక్కి కార్యంబు♦లెల్లఁ గొదువ
పడక ఫలియింప శ్రీరాము♦కడకుఁ బోదు. ౩౪ 1711

క. [2]అనవిని యాకింకరు లా, హనుమంతునినాదమునకు ♦ నధికభయంబుం
గని సంధ్యాంబుదవర్ణం,బున నన్నుతిఁ గనినవాయు♦పుత్త్రుఁ గని రటన్. ౩౫

చ. దనుజులు రావణాజ్ఞకును ♦ దారునిబద్ధులుగాన పాథ్వనం
బును విడనాడి చెంతకును ♦ బోవఁగ వేగమ చాల కొండనం

1 పరిఘైః కాంచనాంగదైః-అనిమూ. కాంచనాంగదైః-కాంచనపదైః-అనిగో. కాంచన
భూషణైః-అనితీర్థులు. 2 తే భృత్యశంకితాః, హనుమన్తం మహాత్మానం సంధ్యామేఘమివో
న్నతమ్-అనిమూ.

దును నిలుచుండి భీతికర♦తోమరముఖ్యమహాయుధంబులం
గొని ప్రహరించి; రాప్లవగ♦కుంజరుఁ డెంతయు దర్పమొప్పఁగన్. ౩౮

క. నలువ్రక్కల భీకరదను,జులు తననుం జుట్టుముట్టి ♦ శూరత్వమునన్
బొలుచుచుఁ గనఁదోరణమునఁ,జెలఁగెడుపరిఘాయుధంబు♦చెంతకుఁజనియెన్.

తే. అరిగి భీమంబుగాఁ దగు♦నాపరిఘముఁ, దాను గైకొని గట్టిగా ♦ దానవులను
మోది యంతకపత్తన♦మునకుఁ బంపెఁ, నంత వీరుఁడుగాఁదగు ♦ ననిలజుండు.

చ. గరుడుఁడు గొప్పసర్పమును ♦ గైకొని యాకసమందుఁ బ్రీతిమైఁ
దిరిగెడునట్టిచందమున ♦ దీప్తమహాపరిఘంబు దానినిం
గరమునఁ బట్టి యభ్రమునఁ ♦ గమ్రగతిన్ విహరించెఁ శూరతం
బరఁగుసమీరపుత్త్రుఁడిటు ♦ వారల వీరులఁ గింకరాఖ్యులన్. ౪౧ 1716

తే. దండధరువీటి కనిపి యు♦ద్ధమును గోరి
యాబహిర్ద్వారమునె తాను ♦ నాశ్రయించి
యుండెఁ నంతట భీతినె♦ట్లో యొకగతిఁ
జావుఁ దప్పించుకొనినరా♦క్షసులు వేగ. ౪౨ 1717

క. చని కొందఱు కింకరులా, దనుజులు హతులైరటంచు ♦ దనుజేంద్రున క
ల్లనఁ దెల్పఁ; రాక్షసేంద్రుఁడు, తనకింకరరాక్షసులును ♦ దగ్ధనబలమున్. ౪౩

చ. హనుమ పరాక్రమంబున నె ♦ యంతమునొందుట నాలకించి వే
ఘనతరకోపవేగమునఁ ♦ గన్నులు త్రిప్పుచు శౌర్యమందు నెం
దును సరిరాకయేచెలఁగి ♦ దుర్జయుఁడైన ప్రహస్తపుత్త్రునిన్
హనుమను జంపఁగా ననిపె; ♦ నచ్చట నాహనుమంతుఁ డొక్కటన్. ౪౪

నలువదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## ౪౩ - వ సర్గము.

—హనుమంతుఁడు చైత్యప్రాసాదమందున్న రక్కసులం ద్రుంచుట.—

క. దనుజులఁ గింకరులం జ,య్యనఁ ద్రుంచి మనంబునందె ♦ ధ్యానింపంజొ
చ్చెను; వనముఁ బాడుచేసితి, దనుజులకు నివాసమైన♦దానిన్ దీనిన్. ౧ 1720

తే. అలరుప్రాసాదమును చైత్య ♦ మనఁగనొప్పు
దాని భగ్నముఁజేయఁగాఁ ♦ బూనవైతిఁ;
గనుక భయదంబుగాఁ బురిఁ ♦ గానఁబడెడు
దీనిగూడను విఱిచెద ♦ నేను నిపుడు. ౧౫ 1721

సీ. అని మదిలో నెంచి ♦ యాత్మబలంబును గనఁబఱుపఁగ ద్వార♦మును వదలుచు
నెగిరి మేరుమహీధ్ర♦శృంగంబుగతి నున్నతమగునాచైత్యంబు ♦ దానుగాంచి

దానిమీఁదికి నెక్కి ♦ వానరతిలకుండు పావని యంతటఁ ♦ బర్వతంబు
వలెనున్న ప్రాసాద♦వరముపై నెక్కి మహాతేజుఁ డౌటచే ♦ నర్కుఁడింక

తే. నొక్కఁ డుదయించెనో యన ♦ నొప్పుమీఱ;
నంతదుర్ధర్షమై కాంతి ♦ ననుపమాన
మైనప్రాసాదమును దాని ♦ నాక్రమించి
తనరుచుల్ దగఁ [1]బారియా♦త్రమన మించె. ౫ 1722

చ. తనమహిమంబునన్ గుఱుతఁ ♦ దాల్చినదేహముతోడ నాపురం
బునఁ దనకంఠనాదమును ♦ బోరుకలంగ భుజంబు లప్పళిం
చెను; జెవులం బగుల్చుచును ♦ జెచ్చెఱ నిండినయాస్వనంబుచే
తనె విహగంబులెల్ల వసు♦ధంబడె నభ్రమునుండి భీతిచేన్. ౬ 1723

తే. దానిఁ గాపాడుచున్నయా♦దనుజులెల్ల
మూర్ఛమున్నిరి; సకలాస్త్ర♦ముల నెఱుంగు
రాముఁ డెల్లర కధికుఁడై ♦ రంజిలెడిని
గాక బలశాలియైనల♦క్ష్మణుఁడు నట్లె. ౭ 1724

క. తనురాముఁడు పాలింపం, గనుదగుసుగ్రీవుఁ డట్లె ♦ క్రాలుచునున్నాఁ
డనఘుఁడయి యెట్టిపనులను, ఘనశక్తిని నశ్రమంబు♦గా నొనరించున్. ౮

తే. అట్టికోసలపతికి నే ♦ ననుఁగుబంటఁ
బగరఁ బొలియించువాఁడను ♦ వాయుసుతుఁడ
హనుమ యనువాఁడ; శిలలచే, ♦ నఖలతరువు
లను గ్రహించియు నడఁతు నే♦దనుజవితతి. ౯ 1726

క. కావున నాకనిమొనలో, రావణు లొక వేయిమంది ♦ రాను సమత; [2]యిం
కే వివిధదానవులు కనఁగా వదలక లంకఁ బొలియఁ♦గాఁ జేసి తగన్. ౧౦

క. జనకజకు మ్రొక్కి వచ్చిన, పని నెఱవేఱంగ రాము♦పాలికి వేవే
చనియెద ననిపల్కెను; నా,హనుమయుఁ జైత్యస్థులైన♦యాదనుజాలతోన్.

క. ఈరీతిఁ దెలియఁబల్కుచు, దారుణభయ మంకురింపఁ ♦ దగుధ్వనితోడన్
భూరితరంబుగ నార్చెను, వారలు శతసంఖ్య లట్టి♦స్వనమును వినుచున్.

క. పలువిధము లైనశస్త్రం,బులఁ బ్రాసంబులను, ఖడ్గ♦ముల గొడ్డండ్రన్
బలిమిం గొని హనుమంతుని, నలయింపఁగఁ జుట్టుముట్ట ♦ నచటికిఁ జనఁగన్.

ఆ. చిత్రగదలపిండు♦చేఁ గాంచనాంగద, పరిఘవితతిచేత ♦ [3]భానుతుల్య
బాణవితతిచేతఁ ♦ బావనిఁ బ్రహరించి; రతనిఁ జుట్టియున్న♦యమరులగుమి.

---

1 పారియాత్రోపమో భవేత్ - అనియు. పారియాత్ర మనఁగా సప్తకులపర్వతములలో నొకటి. 2 ఇంకన్, ఏకన్-అని పదవిభాగము. 3 [illegible]

క. అనుపమగంగానదిలోఁ, బెనుగతిఁ జరియించుచున్న♦పెద్దసుడివలెన్
గనఁబడఁజొచ్చెను; వాయువు,తనయుం డవు డాగ్రహించి ♦ దారుణతనుఁడై.

చ. పరమబలంబు భీమముగఁ ♦ బర్వఁగఁ జైత్యమునందు హాటకో
త్తరమయి యున్న స్తంభమును ♦ దద్దయు వేగమువీఁట లాగి ని
ర్జరపతివజ్రమట్లు రుచి♦భాసిలుదానిని ద్రిప్పె; నంత దు
స్తరమగునగ్ని స్తంభముల♦తాఁకునఁ బుట్టి దహించెఁ జైత్యమున్. ౧౮

చ. అనుపమకాంతిపర్వఁ బ్లవ♦గాధిపుఁ డోహనుమంతుఁ డగ్నిచే
తను దహియింపఁగాఁబడెడు♦దాని మహోత్తరచైత్యముం దగం
గనుఁగొని వజ్రధార సుర♦కాంతుఁడు దానవులన్ వధించుచా
డ్పున నటనున్నరాక్షసుల♦పూగము దాన వధించి హృష్టుఁడై. ౧౯ 1731

క. సురపథమునందె తిరుగుచు, సురవైరులు వినఁగఁబల్కె; ♦ సుగ్రీవునిస
త్పురమున ధీరులు బలయుతు, లురువేగులు వేలకొలఁది ♦ నుగ్రకపివరుల్.

క. నావంటివారు తనరుదు;, రావానరులందుఁ గొంద ♦ ఱారఘుపతిశ్రీ
దేవిని వెదకఁగ వనచర, భూవిభుసంప్రేషితులయి ♦ భూస్థలినెల్లన్. ౨౧

ఆ. తిరుగుచున్నవా రి♦తరులును గొందఱు
మావలెనె సమస్త♦భూవలయముఁ
గడఁగి తిరుగుచుంద్రు ♦ కరిదశకబలాఢ్యు
లందుఁ గొందఱుందు ♦ రసురులార. ౨౨ 1737

క. కొందఱు శతగజబలు లిఁకఁ, గొందఱు దశశతమదాత్త♦కుంజరబలులై
యుందురు మఱి యోఘంబనఁ,గం దగుసంఖ్య గలభీమ♦కరిబలయుతులై.

తే. వఱలుచుందురు; కొందఱు ♦ వాయుబలస
మానబలులయియుందు; రి♦మ్మాడ్కి నితర
వనచరవ్యూహనాథుల♦బలము నెన్నఁ
దరము గాకుండు సుగ్రీవుఁ ♦ డరసి వీరి. ౨౩ 1739

క. దంతనఖాయుధకపిగణ,కాంతులశతనియుత, కోటి♦గణములఁ గొనుచున్
బంతమున మిమ్ముఁ జంపఁగ, నెంతయు విక్రమముపొంగ ♦ నేతెంచుఁజుఁడీ.

తే. మీర లిక్ష్వాకుకులవిభుఁ ♦ డౌరఘుపతి
తో మహాత్మునితోఁ గొంటి ♦ రీమెయిఁ బగఁ
గాన నీపురమున మీరు ♦ దానవేంద్రుఁ
డుండ రిలమీఁద నమ్ముఁ డీ♦యొక్కమాట. ౨౫ 1741

నలువదిమూఁడవ సర్గము సంపూర్ణము.

## ౪౪ - వ సర్గము.

ప్రహస్తపుత్రుఁడు జంబుమాలి హనుమంతునిచేఁ జెడుట.

క. తనకింకరవరు లచ్చట, ననిఁ బడుటకు నాగ్రహించి ♦ యారావణుఁ డు
గ్రుని జంబుమాలి బలవంతుని సేనాధీశ్వరుని ♦ తూర్ణఁ బంపించెన్. ౧ 1742

చ. హనుమను జంపఁగా నతని ♦ యాజ్ఞను వెల్వడి చాపహస్తుఁడై
పెనుదశనంబు లొప్పఁగను ♦ భీషణరక్తసుమాంబరంబు లొ
య్యన ధరియించి రక్తసుమ ♦ హారము లొప్పఁగ రత్నహారముల్
ఘనరుచిమీఱుకుండలయు ♦ గంబు వివృత్తపమాత్తులుం దగన్. ౨ 1743

సీ. చండుఁడై సమరదు ♦ ర్జయుఁడై చెలంగుచు
నింద్రునిచాప మ ♦ ట్లెసఁగుచు గురు
సాయకాంచితమునౌ ♦ చాపంబు మ్రోయించె
జవమున నద్ది య ♦ శనిరవంబు
వలెఁ జెలంగుచును ది ♦ క్కుల, విదిక్కుల, నభ్ర
మును నిండి చెలరేఁగె; ♦ హనుమ యపుడు
జవయుక్తుఁ డౌటచే ♦ స్యందనంబున ఖర
వాహ్యంబునన్ మహా ♦ బలము వెలయ
ఆ. వచ్చుజంబుమాలి ♦ నచ్చటఁ గనుఁగొని, యుద్ధమబ్బె ననెడి ♦ యుబ్బునఁ జెను
నిస్వనంబు చేసె; ♦ నిర్భర బాహుబలాధికుఁ డగు రాతసాధిపుండు. ౩ 1744

క. తోరణమునఁ దిర్యగ్గత, దారువునన్ గూర్చుచున్న ♦ తత్కపిమీఁదన్
ఘోరాంబకములు వైచెఁ మహారాక్షసుఁ డంత నతని ♦ యాస్యముమీఁదన్.

తే. [1]అర్ధచంద్రాకృతిం దగు ♦ నట్టిశరము
శిరమునం గర్ణయుక్తమౌ ♦ శితశరంబు
బాహువుల దశనారాచ ♦ వరముఁ బడిఁ
గ్రుచ్చి నొప్పించె; నుత్కట ♦ క్రోధ మడర. ౫ 1746

క. అనిశము తామ్రం బగునా, హనుమన్ముఖ మంబకాభి ♦ హతమై రక్తం
బున దోఁగి శరత్తువునం, [2]దినభాస్ఫుటనళినమట్టు ♦ లెసఁగె నవమై. ౬

క. అరుణం బగుతన్ముఖమా, శరబాధను రక్తబిందు ♦ సంతతిదోఁగన్
సురపథమున రక్తోత్పల, మరుణం బగుచందనమున ♦ నంచితమగుచున్. ౭

క. తనరారెడువిధమునఁ దగెఁ, దనుజుని బాణాభిహతిని ♦ దద్దయుఁ గోపం
బును బొంది యక్కపీంద్రుఁడు, తనప్రక్క విశాలమైన ♦ దారుణశిలనున్. ౮

---

1 అర్ధచంద్రేణ వదనే శిర స్యేకేన కర్ణినా-అని మూ. కర్ణీ-అంతరా కారాగ్ర శరవిశేషః-అని వ్యాఖ్య. 2 శరదీవాంబుజం ఫుల్లం విద్ధం భాస్కరరశ్మినా-అని మూ. దినభాస్ఫుటనళినమట్టు-ఎండ కాంతిని వికసించినపద్మమనియర్థము.

క. కనుఁగొని బలమొప్పఁగ జవ,మున దానిఁ బెకల్చి దనుజ♦ముఖ్యునిపై వై
చెను బలముకొలఁది; దానన్, దనుజుఁడు కోపించి బాణ♦దళకము చేతన్.

క. శిలను ధరఁ బడఁగఁ జేసిన;, నలఘుపరాక్రమసమగ్రుఁ♦ డగు హనుమయు నా
శిల వ్యర్థమౌటఁ గాంచి వి,పులమగు సాలంబుఁ బెఱికి♦ పూనికమెఱయన్.

క. త్వరగా దానిం ద్రిప్పెను;, దరువును నిటు త్రిప్పుచున్న♦దారుణబలు నా
మరుదాత్మజుఁ గని బలిమై, సురరిపుఁ డగు జంబుమాలి♦ సునిశితశరముల్.

తే. పెక్కురీతులవైచుచుఁ; ♦ బృథులసాయ
కముల నాల్గింట సాలవృ♦క్షమును ద్రుంచెఁ
బంచశరముల హనుమంతు♦బాహువులను
నొక్కశరమున వక్షంబు ♦ నొగిని నొంచె. ౧౫ 1753

క. స్తనమధ్యస్థలమును బది, సునిశితనారాచములను ♦ సొరిదిఁ బగుల్చెన్
హనుమయు శరతతిపూరిత, తనుఁడై పెనుకోప మడరఁ ♦ దత్పరిఘంబున్.

చ కరమునఁ బట్టి వేగమున ♦ గాఢముగా భ్రమియింపఁజేసె; న
మ్మరుదధిపాత్మజుండు బల♦మండితుఁడై యిటు దానిఁ ద్రిప్పి క
ర్బురవరుభూరివక్షమునఁ ♦ బూనికమోఁదెను; దాన నచ్చటన్
శిరమును హస్తజానువులు ♦ చిత్రధనూరథఘోటకంబులున్
శరములు నించుకే నిలువఁ♦జాల కదృశ్యములయ్యె; నంతటన్. ౧౭ 1755

క. హనుమత్ప్రహారమున నద్దనుజేంద్రుఁడు జంబుమాలి ♦ తద్దయు బలశా
లి నిఖిలతనుభూషణములు, తునుకలు కాఁగా ధరిత్రిఁ ♦ దొరలుచుఁ జచ్చెన్.

చ. బలయుతులైన రాక్షసులు ♦ వారి కధీశుఁడు జంబుమాలియున్
గలన వధింపఁగాఁబడుటఁ ♦ గ్రన్ననఁ జారులు వచ్చి చెప్ప ను
జ్జ్వలతరరక్తనేత్రములు ♦ చాలఁ గ్రుధన్ భయదంబులై తగన్
గలవిలపాటునొందె విని ♦ కర్బురనాథుఁడు కీశచేష్టకై. ౧౯ 1757

క. బలశాలిప్రహస్తాత్మజుఁ, డలఘుధనుశ్శాస్త్రవేత్త ♦ యనిఁ గూలినఁ గ
న్నులఁ గ్రుధఁ ద్రిప్పుచు నరుణం,బులుగా నవి యొప్ప మంత్రి♦పుత్త్రుల నంతన్

క. అతివీర్యవిక్రమంబులఁ, బ్రతి గానని యట్టివారిఁ ♦ బంపె హనుమపై
కతిజవమునఁ బొండనియా, దితిజేశ్వరుఁ డాతురమునఁ ♦ దెంపుమెఱయఁగన్.

నలువదినాల్గవ సర్గము సంపూర్ణము.

---

## ౪౫ - వ సర్గము.

మంత్రిపుత్త్రసప్తకము హతమగుట.

చ. అనుపమవిక్రమాఢ్యులు మ♦హాబలయుక్తులు నేడ్గు రయ్యమా
త్యునిసుతు లగ్నిచందమున ♦ నుజ్జ్వలతేజమునన్ వెలుంగుచున్

ఘనభటవారముల్ గొలువఁ♦గా వరచాపము లూని దానవే
శునిభవనంబునుండి కడుఁ♦జోద్యముగా జవరంబు చేయఁగన్. ౧౻ 1760

క. [1]వెలువడి రాయోద్ధరు న,జ్జ్వలతేజులు సత్త్రవిద్యఁ ♦ జాలనెఱిఁగి ధా
సిలువారికి గురువులుగాఁ, జెలఁగెడువా రఖిలశస్త్ర♦సిద్ధులుగానన్. ౨ 1761

క. ఒక్కొక్కరు తా రాకపి, నుక్కడఁగింతుమని చక్క ♦ నూహించుచుఁ దే
రుక్కున వెడలిరి; వారల, చక్కనియరదములు స్వర్ణ♦జాలాంచితముల్. ౩౻

చ. కనకవిభూషితంబులయి ♦ క్రాలుపతాకములున్ ధ్వజంబులున్
దనరఁగ సాధుఘోటకయు♦తంబులుగాఁ దగి యంబుదస్వనం
బునకు సమానమానినద♦ముల్ గడుఁజేయుచు నొప్పుచుండె; నా
దనుజులు వాని నెక్కి పరి♦తప్తహిరణ్మయచాపహస్తులై. ౩౻ 1763

చ. నిరుపమవిక్రమంబు దగ ♦ నిర్భరమై గుణరావమొప్ప నం
గరమును జేయుహర్షమున ♦ గర్జితముల్ తగ నొప్పనంబుదో
త్కర మనఁగాఁ జెలంగుచును ♦ గ్రన్ననఁబోయిరి; కోఁతిచేతఁ గిం
కరదనుజుల్ మృతింగనిన♦కారణముల్ విని వారితల్లులున్. ౪౻ 1764

ఆ. వారిబంధుమిత్ర♦వారంబు శోకసం,భ్రాంతులైరి; తప్త♦భర్మభూష
ణాళిఁదాల్చి యంత ♦ నావీరు లేముందు, నేనుముందనుచును ♦ నెమ్మిమీఱ.

క. ఒరసికొనుచుఁ దోరణమునఁ, బరమాహవకాంక్ష మిగులఁ ♦ బరఁగెడుప్లవగే
శ్వరు మీఁదికేగి; రాయో,ధ్వరు గర్జితమట్లు రథని♦ర్ఘోషధ్వనులన్. ౬౻ 1766

క. వెలయంజేయుచు బాణం,బులు వృష్టిగ నొప్పుచుండ ♦ భూరిధయిదవ్య
ష్టులతోడఁ జెలఁగుమేఘం,బులు నా విహరించి; రంతఁ♦బొంగి హనుమయున్.

క. దనుజులశరవర్షంబున, మునిఁగి నగేంద్రంబు వర్ష♦మునఁ దోఁగినరీ
తిని గానఁబడకయుండెను;, హనుమయు వపు దతిజవమున ♦ వలరెడుఁగానన్.

క. మానక తద్బాణంబులు, మేనునఁ బడకుండ రుచుల♦మించునమరరా
ణ్మానితరథముల వేగం,బేనియుఁ దనుఁబట్టనీక ♦ యేదిన తెగువన్. ౮౻ 1769

క. చరియించె నంబరంబున, శరరథవేగములు తనకు ♦ సమరంబున నే
వసనను బాధింపనిగతి;, మరుదాత్మజుఁ డంత శౌర్య♦మండితుఁడగుచున్. ౯

[2]క. ధనువులఁ దాల్చినయోద్ధరు, దనుజాలతో యుద్ధకేళిఁ ♦ దాఁ జేయుచు నిం
ద్రునిధనువుతోడఁ గూడిన, ఘనములతో నాడువీర♦గంధవహాక్రియన్. ౧౦

చ. కనఁబడుచున్ బ్రతాపమున ♦ గాఢభయంకరనాదమొప్పఁగా
దనుజమహాబలంబును ని♦తాంతము భీతిలఁజేయుచున్ మహం

1 కృతాస్త్రాస్త్రవిదాం శ్రేష్ఠాః - అనిమూలము. 2 ధనుష్మద్భిః యథామేఘైర్మారుతః ప్రభు రంబరే-అనిమూలము.

బున నలరాక్షసావళిని ♦ బూన్కి మృతిం గనఁ జేయుకోర్కితోఁ
దన జవముం గనం బఱచెఁ; ♦ దత్సమయంబున నాతఁ డుద్ధతిన్. ౧౧ 1772

చ. అరిజనకాలుఁ డౌహనుమ ♦ హస్తతలంబున మోఁదెఁ గొందఱిన్
జరణములన్ నఖంబులను ♦ జక్కనిముష్టులఁ దోఁచినట్టులీ
వరుసను గొందఱిన్ మఱియు ♦ వక్షమునన్ వడిమోఁది చంపె; ని
క్కరణిని నూరుఘాతములఁ ♦ గర్బురవర్యులఁ గొందఱిన్ వడిన్. ౧౨ 1773

క. మృతినొందించెను భయదో,ద్ధతనాదముచేత నచటి♦ధరపైఁ బడియే
మృతిఁగనఁ గొందఱిఁ జేసెను;, దితిజులు వారంత నేలఁ ♦ ద్రెళ్ళి మృతిఁ గనన్.

తే. [1]సాధ్వసంబున మిగిలిన♦సైన్యమెల్ల
దశదిశల కేగె; సామజ♦సమితి వికృత
నాదములుచేసె, నశ్వసం♦తతులు పడియె
ధరణి, నీడధ్వజచ్ఛత్ర♦తతులు మఱియు. ౧౪ 1775

క. అరదంబులు పొడిపొడియై, ధరణీస్థలి నిండియుండెఁ; ♦ దరువాత నటం
దొరగెడు నెత్తురు కన్పడెఁ, దరంగిణివిధంబుగాఁగఁ ♦ దదవసరమునన్. ౧౫

సీ. లంకయంతయు బహు♦శంబులౌధ్వనులకు వికృతంబుగా ధ్వని ♦ వెలయఁజేసె
బలశౌర్యములఁజాల ♦ వర్ధిల్లు నాకపివర్యుఁడు తనదగు♦బలముచూపి
ప్రబలదానవభట♦వరులఁ దన్నాధుల నితరరాక్షసతతి♦నెల్లఁజంపి
యింకను లంకలో ♦ నెసఁగురక్కసులతో ననిచేయఁగోరి యా♦వనమునందు

ఆ. వెలయుతోరణమున ♦ విలసిల్లుచున్ బాహు
బలముచూప ననువు ♦ గలిగె ననుచు
బాహునాదములను ♦ బరఁగంగఁ జేయుచు
నిలిచియుండె; నంతఁ ♦ గలఁగి యాత్రి. ౧౬ 1777

నలువదియైదవ సర్గము సంపూర్ణము.

---

## ౪౬-వ సర్గము.

విరూపాక్షుఁడు లోనగు సేనాపతులు హనుమంతునిచేఁ జెడుట.

[2]చ. దనుజులు కొందఱేగి విబు♦ధప్రభువైరికి మంత్రిపుత్రులన్
హనుమ మహాత్ముఁ డాలమున ♦ నందఱఁ జంపెనటంచుఁ జెప్పఁగా
విని మది శంకనొంది తన♦వృత్తము నెవ్వరెఱుంగకుండఁగాఁ
దనువును గప్పుకొంచు నిటు ♦ తా నవు డూహలుచేసెఁ జక్కఁగన్. ౧ 1778

1 భగ్నపీఠధ్వజచ్ఛత్రైః-అనిమూలము. నీడోధ్వజావయవవిశేషః-అనివ్యాఖ్య. 2 రావణ స్సంవృతాకార శ్చ్వకార మతిము త్తమామ్-అనిమూ.

సీ. అంతవిరూపాక్షు ♦ నతిబలులైనయూపాక్షుదుర్ధరులను ♦ నట్లె ప్రఘసు
భాసకర్ణుని సైన్య♦పతుల నీయైదుసుందిని నీతివేత్తల ♦ ననిని వాయు
సమవేగయుక్తుల ♦ శ్వసనపుత్త్రగ్రహణవ్యగ్రచిత్తుల ♦ నాకిసములఁ
గని యాజ్ఞచేసె నా♦దనుజేశ్వరుం డిట్లు; వాహినీపతులార ♦ బలసమేతు
తే. లగుచు రథగజతురగంబు♦లఁ గొని వెడలి
పొందు వానరు నతనిఁ బెం♦పున వనమునఁ
జక్క దండించి రండు; మీ♦రక్క పివరి
సరమునకుఁబోయి మెలఁకువ ♦ పరఁగుచుండ. ౪ 1779

ఆ. [1]అప్రమత్తులగుచు ♦ యత్నంబుచేయుచుం,డంగవలయు నవ్వ♦నచరునికడఁ
గడఁగి మీరు దేశ♦కాలవిరుద్ధకా,ర్యమును గలుగనీక ♦ యరయవలయు. ౫

క. [2]విను మతనికార్యములనే, మనమున నూహింపఁ బ్లవగ♦మాత్త్రుండని నా
కును దోఁపలేదు చక్కం,గనుజూడ మహాబలంబు ♦ గలిగి వెలయుచుౝ. ౫౻

తే. [3]అద్భుతక్రియ లొనరించు♦నట్టిపెద్ద
భూతమేగాని వేఱుగా; ♦ దీతఁడి సుర
పతియొ వేఱొక్కఁడో దితి♦సుతులఁ జంపఁ
దపమొనర్చి సృజించిరో ♦ యిపుడు దీని. ౬౻ 1782

క. మునునేను మిమ్ములం గొని, చని గంధర్వులను యక్ష♦సర్పసురవరా
ళిని దితిజుల మానుల నొ,య్యన నోడించితిని సంగ♦రాంగణమందుౝ. ౭౻

చ. కనుకనె యిద్దియేబదులు♦గా మనకిప్పుడు కీడుచేయఁగా
మనమున నెంచుటుత్తమమె ♦ మానుగ నిద్దియదే యసంశయం
బనిమొన బల్మిఁ బట్టుకొనుఁ ♦ డాతని; నాపలుకాలకింపుఁ డా
వనచరుఁ డెంతొ ధీరుఁ డని♦వార్యపరాక్రముఁడౌట నాతనిౝ. ౯ 1784

క. అవమానింపఁగ సాధ్యం, బవునే మీకెల్లఁ బూర్వ♦మందంచు మహా
జవబలయుక్తుల విక్రమ, మవార్యతేజంబు గలుగు♦నాకపివరులౝ. ౯౻ 1785

తే. వాలిసుగ్రీవులను జాంబ♦వంతుఁ బ్లవగ
వాహినీపతియానీలు♦వరుస ద్వివిద
ముఖ్యులాకీశవరుల నే ♦ ముదముమీఱఁ
గాంచియేయున్నవాఁడ; ని♦క్కరణి బుద్ధి. ౧౦౻ 1786

క. బలశౌర్యభయదవేగం,బులు నుత్సాహంబుఁ దేజ♦మును బెనురూపం
బులఁ దాల్చినట్టిశక్తియుఁ, గలుగవు వారలకు; నిద్ది ♦ కపిరూపంబుౝ. ౧౧౻

---

1 కర్తవ్యాపి సమాధేయం దేశకాలవిరోధినమ్-అనియూ. ఆశ్లోలింగవిభక్తివ్యత్యయః కర్త, సమాధేయం పరిహర్తవ్యమ్-అనివ్యాఖ్య. 2 నహ్యహం తం కపిం మన్యే-అనియూ. 3 భవేదింద్రేణ వా సృష్టమస్మదర్థం తపోబలాత్-అనియూ. ఇంద్రేణవేతివా శబ్దా దన్యే నవేత్యర్థః-అనివ్యాఖ్య.

క. ధరియించివచ్చినదిగా, నరయందగు సత్వమిదియె ♦ యగుఁ గపి కా ది
త్తరుణమునఁ జాలయత్నము, సరిగా నొనరించి యెట్టి♦సరణులనైనన్. ౧౩

ఆ. నిగ్రహింపవలయు; ♦ నిలువంగఁగలరె మీ, పరిసరమున నసుర♦నరులు త్రిజగ
ముల వసించు దేవ♦తలు శతముఖుఁగూడి, వచ్చినను నితాంత♦బలులెయైన.

చ. అని విజయంబుగల్గుటయు ♦ నారయ నస్థిరమానుజుండి కా
వున రణనీతివేత్త యగు♦పూరుషుఁ డెవ్వఁడుకాని సంగరం
బున విజయంబుఁగోరి తనుఁ♦బూనికఁ గాచుకొనంగనౌను, మీ
రనిమొన జాగరూకులయి ♦ యర్హ్వగతిం జరియింపఁగాఁ దగున్. ౧౪ 1790

చ. అనియిటులాడ నావిభుని♦యాజ్ఞను నౌదలలన్ ధరించి య
త్యనుపమ తేజులౌటను హు♦తాశను లట్లు వెలుంగుచున్ మదం
బునఁ బొలుపొందుహస్తగణ♦ముఖ్ వరఘోటకపంక్తి నల్లె స్యం
దనములఁ దీక్ష్ణశస్త్రముల ♦ దారుణశౌర్యము మీఱుసేనలన్. ౧౬ 1791

క. తమవెంటఁగొనుచు నవ్వా,రమితజవం బొప్పుచుండ ♦ హనుమపయికి యు
ద్ధముచేయుకాంక్ష నేగిరి;, సుమహితతేజమున నలరు♦చున్ గపివరుఁడై.

క. ఉదయించుచున్నసూర్యుఁడై, గద యీతండనఁగ దివ్య♦కాంతిం దగి ప
ట్టుదలను మించుచు సత్వం,బు దగన్ బెనుబలము దివ్య♦బుద్ధియు వెలయన్.

క. గురుతరవేగము శక్తియుఁ, బరఁగన్ దోరణమునందు ♦ భయముగొనక సం
గరకాంక్ష నున్నహనుమను, సురవైరులు చూచి రతనిఁ ♦ జోద్యముమీఱన్.

తే. ఇట్లు చూడంగనే వార♦లెల్లదిశల
నావరించుచు నిల్చి భ♦యంకరంబు
లైనయాయుధములఁ గొని ♦ యతని మారు
కొనిరి వాంఛానురూపంబు♦గనె జవమున. ౧౯ 1795

చ. *హనుమశిరంబుపైఁబడ భ♦యంకరరూపములౌచు; వాఁడులై
యినుమునఁ జేయనై మఱియు ♦ నెంతయుఁ బచ్చగనున్నయగ్రముల్
తనరఁ జెలంగుబాణముల ♦ దర్పముపొంగఁగ దుర్ధరుండు వై
చె నియుతిఁ బంచసంఖ్యలను ♦ జెచ్చెఱ నుత్పలపత్త్రముల్ వలెన్. ౨౦ 1796

క. శరపంచకబాధితమగు, శిరమొప్పఁగ నంత హనుమ ♦ చెలఁగి దశదిశల్
సరగఁ బ్రతిధ్వనిఁజేసెడు, కరణిగ నార్చుచును నెగిరె ♦ గగనంబునకున్.

తే. అంత శూరుఁడు దుర్ధరుం ♦ డమితబలుఁడు
సజ్యకార్ముకుఁడై రథ♦సహితుఁడగుచు
గగనతలమున కెగసి తీ♦క్ష్ణశతవిశిఖ
ములను నింపుచుఁ బైఁబడెఁ ♦ జెలఁగి పూన్కి. ౨౨ 1798

---

* శీతరుక్షా శ్శరాః-అనిమా.

క. అనిలుండు శరత్తున వృష్టినిగురిసెడునంబుదమును ♦ జెచ్చెఱ వారిం
చునటులు మార్గణవర్షం,బును మింటం గురియునతని ♦ మునుకొనుకినుకన్.

క. వారించె; దనుజుఁ డిటుతను, గారింపఁగ హనుమ మఱియుఁ♦గాయముపొంగం
గా రయముమెఱయ నుద్ధతిఁ, బోరెను;మఱియున్ జవంబు♦పొదలుచునుండన్.

క. గిరిపైన నశనిపాతము, కరణిఁ దటాలున నతండు ♦ కడుదూరం బం
బరమునఁ జని యాదుర్ధరు, నరదముపై దుమికె; నతని♦యష్టాశ్వంబుల్.

సీ. త్యక్తజీవితములై ♦ యవనిపైఁ బడ నక్షకూబరంబులు చెడఁ ♦ గూలుచున్న
యరదంబునుండియా♦యసురుఁడుమృతుఁడయిధరఁబడఁ; గనిశత్రు♦తతిని జెండు
నావిరూపాక్షయూ♦పాక్షులు సంజాతకోపులై యెగిరిరి ♦ యేపుమీఱ;
నిట్టులాయిరువురు ♦ పట్టుదలల్ మీఱ విమలాభ్రమున నున్న♦విపులబాహు

తే. వును సమీరాత్మజుని గని ♦ భూరివక్ష
మును దగంజూచి ముద్గర♦ములను గొట్టి;
రంతబలశాలి హనుమంతుఁ ♦ డాయిరువుర
భూరివేగంబు నడచి య♦వారితగతి. ౩౧ 1802

క. గరుడునివలె విక్రమమునఁ, బరఁగెడువాఁడౌట మరల ♦ బరవసమొప్పన్
ధరవ్రాలె నంతఁ బావని, [1]గురుసాలద్రుమముఁ బెఱికి ♦ కోయని పెలుచన్.

క. ఇరువురుపీరుల దానన్, మరణము నొందించె; నిట్లు ♦ మారుతి యమ్ము
వ్వురబలవంతులఁ జంపుట, బరికించి జవంబుమీఱఁ ♦ బ్రఘసుఁడు కినుకన్.

క. హనుమంతునిపైఁ గేగుటఁ, గని వీరుండైనభాస♦కర్ణుఁడు శూలం
బునుగొని కీర్తియుతుండై, వనచరగణసింహుపైకి ♦ వారక యడరెన్. ౩౨

చ. ఇరువురు వార లొక్కటిగ ♦ నేపునఁబోయి; రవార్యశౌర్యమున్
సురలు నుతించున ట్లడరి ♦ శూరుఁడు గాఁదగియున్నకోఁతితో
బరవస మొప్పఁగా నవుడు ♦ పట్టసము న్నిశితాగ్రమున్ భయం
కరమును బట్టి యాప్రఘస♦కర్బురవీరుఁడు చేసె యుద్ధమున్. 33 1806

తే. భాసకర్ణుఁడు శూలంబుఁ ♦ బట్టి పోరె;
వార లవయవముల నెల్ల ♦ బలముమీఱ
నొవ్వఁజేయఁగ శౌర్యవం♦తుఁ డగుహనుమ
[2]రక్తసిక్తతనూరుహా♦రాజి వెలయ. 3౪ 1807

క. అరుణాభుఁడై నప్రాత, స్సరసిజహితురీతిఁ గాంతి ♦ సంధిల్లఁగ న
మ్మరుదాత్మజుండు పొల్చెను;, [3]దరుఫణిమృగనిబిడమైన♦ధరశృంగంబున్. 3౫

---

1 సపాలవృక్ష మాసాద్య-అనియా. 2 అసృగ్దిగ్ధతమాతనూః-అనియా. 3 సవృక్షవ్యాళపాట
కమ్-అనియా.

క. కనుకమెయిఁ జెఱికి యంతట, హనుమయు నద్దానిచేత ♦ నాయిర్వురఁ జం
పెను వీర్యము గన్పడ; న,ద్దనుజులు సేనాధిపతులు ♦ దారుణరీతిన్. ౩౬ 1809

క. పొలియుటఁ గని శేషించిన, బలమును దునుమాడె; నంత ♦ [1]వాజుల నశ్వం
బుల, గజములచే నాగం,బుల, యోధులచేత యోధ♦పుంగవుల నరిన్. ౩౭

క. అరదంబులచే నొప్పెడు, నరదంబులఁ బట్టి కొట్టి ♦ యసురుల నాని
ర్జరపతిపోలికఁ జంపెను;, మరణమునొందిన గజేంద్ర♦మండలము లటన్. ౩౮

ఆ. [2]చచ్చియున్న వాజి♦సమితి, భగ్నాక్షంబు, లైనస్యందనంబు♦ల ట్లసురులు
భూమియందుఁ బడిన♦నామార్గమెంతయు, నడువ నలవిగాక♦వుడు కనఁబడె.

ఆ. శూరసైన్యపతుల ♦ సారిది నైదుగురను
సబలవాహనులను ♦ జంపి యంత
మరలి తోరణమున ♦ కరిగి యూరకయుండెఁ
[3]బ్రజలచంపుయముని♦వైఖరిఁ దగ. ౩౯ 1813

నలువదియాఱవ సర్గము సంపూర్ణము.

---

౪౭ - వ సర్గము.

హనుమంతుఁ డక్షకుమారుని బొలియించుట.

క. సేనాపతిపంచకమును, మానక తద్వాహనముల ♦ మంచిభటుల న
వ్వానరుఁడు చంపుటను విని, దానవపతి సమరసమ్మ♦దస్వాంతు సుతున్. ౧

క. [4]అనిహతవిక్రము నక్షుని, దనముందట మెలఁగువానిఁ ♦ దాఁ జూచె; నతం
డును నాచూపున యుద్ధం, బునకుం బురికొల్పఁబడుచుఁ ♦ బొదలెడుకినుకన్.

చ. ఘనతరవిక్రమంబు దగఁ ♦ గాంచనకార్ముకహస్తుఁడై జనం
బున [5]ధరణీసురోత్తములు ♦ పొందుగ భక్తి హవిస్సు వేల్వఁగా
గనఁబడుజ్వాలలన్ బ్రబలు♦గాఢహుతాశనురీతిఁగాఁ గ ది
గ్గున సభనుండి లేచెను; న♦కుంఠితశౌర్యముదోఁప నంతటన్. ౩ 1816

క. దనుజమృగేంద్రుఁడు బాలా,ర్కునివలె భాసిల్లి తప్త♦రుక్మమయంబై
తనరుమహారథమునఁ దాఁ, జనియెను హనుమంతుతోడ ♦ జన్యమొనరుపన్.

సీ. అరదమయ్యదియు మ♦హాతపస్సంచయార్జితముఁ బ్రతప్తసం♦సిద్ధకనక
భూషణశోభితం♦బును, బతాకాత్తంబుఁ, దతరత్నభూషిత♦ధ్వజయుతంబు

---

1 అశ్వైరశ్వాన్ గజైర్నాగాన్ యోధైర్యోధాన్ రథై రథాన్-అనియూ. 2 రుద్ధమార్గా సమంతతః-అనియూ. 3 కాలఇవ ప్రజాక్షయే-అనియూ. 4 సతస్య దృష్ట్యర్పణసంప్రచోదితః-అనియూ. 5 ద్విజాతిముఖ్యైర్హవిషేవ పావకః-అనియూ.

[1]స్వాంత వేగాష్టాశ్వ♦సంవాహితంబునై భాసిల్లె దాని దే♦వతలు దనుజు
లెదిరింపఁగాఁజాల ♦ రెయ్యెడ నడ్డులేకయె సంచరించు, భా♦స్కరసమాభ
తే. మంబరంబునఁ జరియింప♦నై సతూణ
మష్టఖడ్గనిబద్ధ మ♦త్యధికశక్తి
తోమరాద్యాయుధంబుల♦తోఁ జెలంగు
నదియునై యుండె; నట్లుగ ♦ నలరుదాని. ౫ 1818

క. అనికిం దగుపరికరముల, ఘనమై శశిభానుతుల్య♦కాంచనమయర
శ్మినికరమై రవిచందం,బున [2]నింగిఁ జరించుచుండెఁ ♦ బూనిక మెఱయన్. ౫౪

క. [3]సురనాథతుల్యవిక్రముఁ, డురుసాహసుఁడు నగునక్షుఁ ♦ డొయ్యన నపుడా
యరదంబు నెక్కి యంతటఁ, గరితురగరథస్వనములు ♦ గలసేనలతోన్. ౬౪

ఆ. కూడి నిస్వనములఁ ♦ గొండలతోఁ దగు, ధరణి నభము నించి ♦ ద్వారసీమ
నున్నయాసమర్థు ♦ సన్నుతుఁ గపినాథుఁ, జేరవచ్చె; నతఁడు ♦ సింహదృష్టి. ౭

క. విలయంబునఁ దగుకాలా,నిలునట్లుగఁ గానఁబడుచు ♦ నెమ్మి తనరఁగాఁ
జెలఁగెడునాతనియాకృతిఁ, గలయంగని విస్మయంబుఁ ♦ గడుసంభ్రమమున్.

క. పెనఁగొన నక్షకుమారుఁడు, హనుమను శూరునిఁగ నెంచి♦యపుడు బహుమతిం
గనఁబడుచూడ్కులఁ జూచెను;, దనుజేంద్రకుమారుఁ డంతఁ♦దనబల మెల్లన్.

చ. మనమున నెంచి యప్డు హను♦మంతుని వేగము శత్రుదుస్సహం
బనఁదగువిక్రమంబుఁ దగ ♦ నారసి యంతవసంతమందు న
వ్వనజహితుండుపోలెఁ గడు♦వర్ధిలె; నట్లనిసేయు కోర్కితోఁ
గనఁబడి యాకుమారకుఁడు ♦ గంధవహాత్మజువిక్రమంబునన్. ౯ 1824

క. అనిమొన నాతని వారిం,పను సాధ్యము కాకయుంట ♦ బాహుబలంబున్
ఘనమై చెలఁగుటఁ జక్కఁగ, మనమునఁ దా నెఱిఁగి కదన♦మర్మముగలుగన్.

చ. దనుజవిభుండు చెప్పినవి♦ధంబున నే నుసమాహితాత్ముఁడై
ధనువును మూఁడుబాణముల ♦ దారుణరీతిఁ జెలంగువాని వై
చి నియతి నానమీరసుతుఁ ♦ జెచ్చెఱఁ దాఁ బురికొల్పె; నంతఁ బా
వనిని జితశ్రమున్ బ్రబల♦వైరినివారణనక్షు గర్వితున్. ౧౦౪ 1826

క. అనియన్న నరకుచేయని, యనూనశౌర్యాధికునిగ ♦ నక్షుఁడు తనన
మ్మనమునఁ దలంచి గర్వం,బునఁ గేల ధనుశ్శరములఁ ♦ బూని దిటముగన్. ౧౧

చ. హనుమపయిం బరాక్రమము ♦ నప్పుడు చూపఁగ నున్నయట్లుగాఁ
గనఁబడె; [4]నంత నక్షుఁ డటఁ ♦ గాంచననిష్కయుతాంగదంబులన్

---

1 మనోజవాష్టాశ్వవరైః సుయోజితమ్.- అనిమూ. 2 వ్యోమచరం సమాహితమ్-అనిమూ.
3 తురంగమాతంగమహారథస్వనైః-అనిమూ. 4 తతః కపిం తం ప్రసమీక్ష్య-అనిమూ.

దనరఁగఁ జారుకుండలయు♦తశ్రుతియుగ్మము పొల్పుమీఱ నిం
కను దనవిక్రమంబు వెలుఁ♦గన్ హనుమంతుని మారొ్కనెం దగన్. ౧౧౪

చ. ఇరువురువారు మార్కొనఁగ ♦ నెందును సాటియె లేక యుద్ధమా
సురదనుజాళికిం గనఁగఁ ♦ జోద్యము తోంపఱఁగల్గఁజేయుచున్
వరుసగ వృద్ధియయ్యెఁ; గపి♦వర్యుఁడు నక్షకుమారకుండు సం
గర మొనరింపఁజూచి భయ♦కంపితయై ధర మాఱుమ్రోసెఁ దాన్. ౧౨౪

చ. ఖరరుచి యెండఁగాయుట యిఁ♦కం దగదం చపుడూరకుండె; భూ
ధరములు నూఁగులాడెను, స♦దాగతి వీవకయుండె, మ్రోసె నం
బరము కలంగె నంబుధియు; ♦ బాహుబలాధికుఁడై శరంబుఁ గూ
ర్చ్ రయమునన్ దదంబకము ♦ బాగుగనైవ సమర్థుఁడౌట నా
సురపతినూనుఁ డంతటను ♦ [1]శుభ్రముఖంబుల సాయకంబులన్. ౧౩౪ 1830

క. కనకమయపుంఖముల భీ,తినిగొల్పుచు విషముఁ బూయఁ ♦ దీక్ష్ణఫణులభం
గిని గనఁబడి మెఱసెడువా,నిని మూఁడిట నేసె హనుమ♦నెత్తిన కినుకన్.

సీ. అంబకత్రితయ మ♦ట్లాత్త[2]శిరంబున సమముగా నాట ర♦క్తము స్రవించి
కన్నులఁ దడుపుచు ♦ గాత్రము నిండఁగ నుద్యదర్కునిబోలి ♦ యుగ్రరీతి
భాసిల్లి యెత్తైనె ♦ బాణముల్ కిరణంబులనుబోలి మస్తకం♦బునను నాటఁ
గిరణసమూహసం♦కీర్ణ భానునిబోలి తనరారె; సూర్యపు♦త్రసచివవరుఁ

తే. డైనహనుమంతుఁ డుగ్రాయు♦ధాళిఁ జిత్ర
కార్ముకము మెఱయించుచుఁ ♦ గదనమునకుఁ
దలపడెడునక్షునిం గని ♦ యలఘుశౌర్య
మడర యుద్ధోన్ముఖుండయ్యె ♦ నలఘుప్రాజ్ఞ. ౧౬ 1832

క. ధరణీమధ్యమగతమం,దరపర్వతశిఖరమునకుఁ ♦ దావచ్చినభా
స్కరువలె నుగ్రుండై భీ,కరకోపము వీర్యబలము♦ఖంబులు పొంగన్. ౧౬౪

తే. ఉగ్రనయనాగ్నికీలల ♦ నొక్కభంగి
నక్షునినబలవాహను ♦ నపుడు చూచెఁ
జూఱుకుఁజూపుల; సంగర♦క్షోణియందు
ధనువు సురపతిధనువుచం♦దమున మెఱయ. ౧౭ 1834

క. శరవృష్టి నిగుడఁజేయుచుఁ, బరమాద్భుతమేఘమట్లు ♦ భాసిలునాక
ర్బురవీరుఁ డంబుదము భూ,ధరమున వర్షించునట్లు ♦ దారుణశరముల్. ౧౮

[3]చ. అనిలతనూజుపైఁ గురిసె; ♦ నంకట భీకరశౌర్య తేజముల్
ఘనబలవీర్యముల్ మెఱయఁ♦గా వినువీథిఁ జరించునక్షునిం

---

1 శిత స్వనీత స్ఫుముఖాన్ పతత్రిణః-అనిమా. 2 సత్తై శ్చరై ర్మూర్ధ్ని సమం నిపాతితైః-అనిమా. 3 వనాద హాష్టా ఘ్న శత్రూ్య విక్రమః-అనిమా.

గనుఁగొని యంబుదంబటు ల♦ఖండపరాక్రమ మొప్ప వెల్గునా
హనుమయు నార్చి సింహముక్రి♦యన్ బెనుహర్షము లోనఁ బొంగఁగన్.

చ. దనుజుఁడు బాలుఁడౌటను స♦దాగతిపుత్రునిశక్తి యెంతొ యా
త్మ నెఱుఁగలేక యుద్ధమున ♦ దర్పముచేఁ బెనుగర్వమూని యిం
తనియనరానికోపమున ♦ నప్పుడు పొంగుచు రక్తనేత్రముల్
కనఁబడఁగాఁ [1]దృణావృతము♦గాఁ దగుకూపముపైకిఁ బోవ నెం
చినగజమట్టు లాహనుమఁ ♦ జెచ్చెఱఁ దాఁకె ననూనవిక్రమున్. ౨౦ 1837

సీ. ప్రసభంబుగానక్షు♦ బాణముల్ తాఁకంగ ఘనతుల్యభయదని♦స్వనుఁడు హనుమ
యాశరపాతమ♦త్యార్తిని గల్పింప నార్చుచు నూరువు ♦ లతివిశాల
బాహువుల్ కదల నం♦బరమున కెగసెవేగంబున; బలమువి♦క్రమము మెఱయ
నతిరథశ్రేష్ఠుఁడై ♦ యలరునాయక్షుండు వినువీథి కెగురునా♦హనుమపైని

తే. జలద మూర్వీధరముపైని ♦ శిలలతోడ
వానఁ గురిసెడురీతిగ ♦ బాణవృష్టి
నిగుడఁజేయుచు రథముతో ♦ నెగసె నభ్ర
తలమునకుఁ దాను నెత్తుగాఁ ♦ దగుజవమున. ౨౨ 1838

చ. హనుమయు వీరుఁడౌట నని♦యందుఁ బ్రచండపరాక్రమంబునన్
ఘనుఁ డగుచున్ మనోజవము ♦ గ్రాల శరాంతరమందు మారుతేం
ద్రునివలె సంచరించుచును ♦ దోరపుబాణములన్ విదుర్చుచున్
అనిలుసేవితంబయిన♦యంబరవీథిఁ జరించె స్వేచ్ఛఁగన్. ౨౩ 1839

చ. ధనువును దాల్చి యాకరణి ♦ దానవనేతృకుమారుఁ డక్షుఁ డా
యనిమొనఁ బెక్కురీతులుగ ♦ నంబకముల్ పరఁగించి యాకవం
బును గడుఁగప్పఁగా ననిల♦పుత్రుఁడు [2]వాని సగౌరవంబుదృ
ష్టిని గని వీనిమృత్యువును ♦ జెందఁగఁజేయఁగ నౌన దెవ్విధిన్. ౨౪ 1840

క. అని చింతింపన్ సాగెను; ఘనశౌర్యము మెఱయ దనుజ♦కాంతుకొడుకు బా
ణనికరమునఁ గపివక్షం, బును జీల్పఁగ నంత దీర్ఘ♦భుజుఁ డాకపియున్. ౨౫

క. దానికి గట్టిగ నార్చుచు, మానుగఁ గార్యముల నేన♦మయమునఁ జేయం
గానౌనో యెట్టు లని తా, మానసమున నెఱుఁగుఁగాన ♦ మహితబలు నరిన్.

క. అనినెట్లు జయింపఁగ నగు, నని తనలో నిట్లుతలఁచె; ♦ నమరుఁ డితండౌ
ఘనబలుఁడు బాలసూర్యుని, యనువున భాసిల్లి బాలుఁ ♦ డయ్యును జూడన్.

తే. [3]తనకు సాధ్యముగానికృ♦త్యములఁ జేయు
చున్నవాఁ డింతియేకాదు ♦ యుద్ధతంత్ర

1 గజో మహాకూప మివావృతం తృణైః-అనిమా. 2 అవైక్షతాక్షం బహుమానచక్షుషా-అనిమా. 3 నచాస్య సర్వాహవకర్మశోభినః ప్రమాపణే మే మతి రత్ర జాయతే-అనిమా.

నిచయ మెఱిఁగినవాఁడు వీ♦ని నిటువంటి
వానిఁ జంపంగ నాబుద్ధి ♦ పూన దిపుడు. ౨౬ 1844

చ. ఘనమతి వీఁడు విక్రమము ♦ గ్రాల నెసంగు సమాహితాత్ముఁడై
యనిఁ గలకష్టసంతతుల ♦ నన్నిఁటి నోర్వఁగలాఁడు సంగరం
బున నొనరింపఁగాఁ దగిన♦బుద్ధిచమత్కృతి సిద్ధకార్యముల్
గనెడుసుశక్తి గొప్పదిగఁ ♦ గన్పడుచున్నది వీనియందిటన్. ౨౭ 1845

క. [1]కనుకనె నాగులు యక్షులు, మునినిర్జరులెల్ల వీనిఁ ♦ బూజింతురు చ
క్కనిగతి నిందుల సంశయ, మనునదియే లేదు; వి♦క్రమాధికుఁ డగుచున్. ౨౮

తే. దగినయుత్సాహమునను జి♦త్తమ్ము పొంగ
నాముఖముమ్రోల నిలుచుండి ♦ నన్నుఁ జక్కఁ
గాంచుచున్నాఁడు; శీఘ్రంబు♦గాఁ దిరుగుచు
నితఁడు చూపెడుశౌర్యంబు ♦ నెన్నిచూడ. ౨౯ 1847

క. సురదనుజులచిత్తంబు ల,దురు; వీనిం జంపక కృప♦తో విడిచినచో
దురమున ననుఁ గీడ్పఱచును, బరికింపఁగఁ బెరుగఁజొచ్చెఁ♦బౌరుష మిచటన్.

క. దనుజుని నిఁకఁ జంపుట నా, మనమునకున్ సమ్మతంబె ♦ మండుచు వృద్ధిం
గను నగ్ని నార్పకుండుట, యనర్థమగుఁగాదె; యనుచు♦నాతఁడు తలఁచెన్.

చ. హనుమయు వీర్యసారముల ♦ నత్యధికుం డగుటన్ స్వశత్రువా
దనుజుని వేగమున్ గుఱిచి ♦ తా మదిఁ జక్కఁ దలంచి సంగరం
బు నెటులుచేయఁగాఁదగునొ ♦ పూనిక దానిని నిర్ణయించి యా
తని వధియింపఁబూని తన♦దర్పము చూపఁగ వేగముం గొనెన్. ౩౦ 1850

చ. జవము చెలంగ హెచ్చరిక ♦ చాలఁగఁ గల్గి శతాంగభూరిభా
రవహనదక్షతన్ వెలసి ♦ రాజిలు నాతనిఘోటకాష్టకం
బు వరుస నంబరస్థలిని ♦ భూరిపరాక్రమ మొప్పుచుండఁ గూ
ల్చె వసుధపైఁ బడంగ; [2]నఱ♦చేతులవ్రేటుల వాయుజుం డొగిన్. ౩౧

చ. వనచరమంత్రిసత్తముని♦బాహుతలాభిహతిన్ మహారథం
బనితరసాధ్యమయ్యును ర♦థాంగములున్ జెడఁ [3]గూబరంబు ము
క్తినిగన ఘోటకాష్టకము ♦ దెంపున సంయమువీటి కేగ నొ
య్యన దివినుండి వే పడియె ♦ నత్తఱి భూమిపయిన్ మహాధ్వనిన్. ౩౨

తే. ఉగ్రవీర్యము గలదను♦జోత్తముఁడు మ
హారథుం డౌట రథమును ♦ నవుడు వదలి

---

1 సనాగయక్షై ర్మునిభి శ్చ పూజితః-అనిమూ. 2 తలప్రహారైః పవనాత్మజః కపిః-అనిమూ. 3 పరిముక్తకూబరః-అనిమూ.

ఖడ్గకార్ముకములఁ దాల్చి ♦ గాఢతపము
బలిమి ముని తనువట్టు లభ్రమున కెగసె. ౩౩ 1853

చ. [1]గరుడుఁడు సిద్ధవాయువులు ♦ క్రమ్రగతిॅ విహరింపఁ బొల్చునం
బరమున స్వేచ్ఛఁగాఁ దిరుగు ♦ వానిని దానవపర్యుఁజూచి యా
మరుదుపమానవిక్రముఁడు ♦ మారుతి యాతనిచెంతఁజేరి త
చ్చరణయుగంబుఁ బట్టుకొనెఁ ♦ జక్కఁగ నిట్టటు జాఱకుండఁగॅ. ౩౪ 1854

చ. జనకసమానవిక్రముఁడు ♦ సారభుజుండు సమీరసూనుఁడా
తని గరుడుండు భూరిఫణి ♦ తల్లజునిॅ గ్రహియించినట్టు ల
య్యనిమొన సంగ్రహించుచు స ♦ హస్రవిధంబులఁ ద్రిప్పిత్రిప్పివై
చెను ధరణీస్థలిం బడఁగఁ ♦ జెచ్చెఱ; నంతట నఘుఁ డార్తుఁడై. ౩౫ 1855

క. తొడలును గరములు మొలయును, మెడయు నుబ్రద్దలయిర క్తమిళితాంగుండై
వడి నస్థినయనసంధు ల,వుడు చూర్ణములై చెడంగఁ ♦ బొంకము మాయॅ.

క. మొలదట్టియెట్టులో చనఁ, గలఁగుచు హతుఁడౌచుఁ గూలె ♦ క్ష్మాతలమున; ని
ట్టులు వానిఁ జంపి కపిపతి, [2]యలఘుభయం బడరఁజేసె ♦ నాసురపతికిॅ.

సీ. అక్షకుమారుండు ♦ హతుఁడౌట న త్తఱి నంబరంబుననుండు ♦ నమ్మహోవ్ర
తులుమహర్షులు భూత ♦ ములు యక్షపన్నగుల్ సురపతియుతులైన ♦ సురలుమిగుల
నాశ్చర్యమునుబొంది ♦ హనుమంతుఁగాంచిరి; [3]వజ్రసుతుంబోలి ♦ భాసమానుఁ
డయి రక్తతుల్యన ♦ యనుఁడైనయక్షుని రావణుతనయుని ♦ రయముమీఱఁ

ఆ. జంపి వీర్యమొప్ప ♦ నరగ నాతోరణ
మునకె పోయి ప్రశియ ♦ మున సమస్త
విధములైన ప్రాణి ♦ వితతిని బాలియించు
యమునిఁబోలియుండె ♦ హనుమ యంత. ౩౬ 1858

నలువదియేడవ సర్గము సంపూర్ణము.

---

## ౪౮ - వ సర్గము.

రావణుం డాంజనేయుమీఁదికి నింద్రజిత్తుం బంపుట.

క. [4]దనుజేశ్వరుఁడు మహాత్ముఁడు, హనుమంతునిచేత ననిని ♦ నక్షకుమారుం
డునుదెగిన వార్త వే విని, మనము ఘెతంగుంది పొగుల ♦ మండిపడి కడుॅ.

క. [5]సురపతిసమానవిక్రము, సురపతిని జయించినట్టి ♦ శూరునిఁ దనతయుॅ

1 సమేత్య తం మారుతతుల్యవిక్రమః క్రమేణ జగ్రాహ సపాదయోర్దృఢమ్-అనిమూ.
2 చకార రక్షోధిపతే ర్మహద్భయమ్-అనిమూ. 3 నిహత్య తం వజ్రసుతోపమప్రభమ్-అనిమూ.
4 తత స్సరక్షోఽధిపతి ర్మహాత్మా-అనిమూ. 5 తదేంద్రకల్పం సమాదిదేశేంద్రజితం సరోషమ్-
అనిమూ.

మరుదాత్మజుపై కనుపన్, ద్వరపడి యిట్లనియె వాగ్వి♦భవము వెలయఁగన్.

తే. [1]నీవు బ్రహ్మాస్త్రవేత్తవు ♦ నిఖిలశస్త్ర
విద్వరిష్ఠుఁడ వాసుర♦వీరదనుజ
వరులకున్ శోకదాతవు ♦ సురలు శక్ర
సహితులై వచ్చి మాఱ్కొన్న♦సమయమందు. ౧ 1861

క. కనఁబఱచిననీశౌర్యము, వినియెఁగదా జగములెల్ల♦విధిని గొలిచి యా
తనికృపదివ్యాస్త్రంబును, గొనితివిగద; నీమహాస్త్ర♦కూటముచేతన్. ౨

క. సురదనుజులు సురపతితో, దురమొనరుపఁ గూడివచ్చి ♦ తోరపుశక్తిన్
గర మురుదుగఁ జూపెదునిన్, బరికించియె పాఱుదురు జ♦వంబున భీతిన్. ౩

క. అని నీతోఁ ద్రిజగంబుల, నొనరుపఁగావచ్చి శ్రమము♦నొంద కపజయం
బును గాన కుందువారలు, కనుఁగొనినను లేరు సుమ్ము ♦ గాదిలితనయా. ౪

క. గురుభుజవీర్యతపస్సులఁ, బరిరక్షితుఁడవుగఁ బోలిచి ♦ బాగుగఁ గాలం
బరయుచు దేశవిభేదముఁ, బరికించి యెఱుఁగునట్టి♦వాఁడవు నీవే. ౫ 1865

సీ. మతిమంతుఁడవు నీవె♦మఱి లేఁడు జగములఁ; బురుషకారమున సం♦గరములందు
నీ కశక్యము లేదు ♦ నిజము సుమ్ము; వివేకపూర్వకంబుగ నీవు ♦ పూని తలఁప
నెఱుఁగరానట్టి ద♦దే కార్యమును లేదు [2]త్రిజగంబులందు నీ♦దేహశస్త్ర
బలము లెఱుంగని♦వాఁ డొక్కరుఁడు లేఁడు; బవరంబునం దపో♦బలము విక్ర

ఆ. మమును శస్త్రబలము ♦ మానుగ నాయంత
నీకుఁ గలిగియుండు♦నో కుమార
జయము నీకుఁ గల్గు♦టయె నిశ్చయము కాన
సమరకష్టమొలయు♦సమయమందు. ౬ 1866

క. నినుజయశీలునిని దలం,చినచోఁ జిత్తశ్రమంబు ♦ చెందకయుండున్
నను; విను కింకరు లందఱు, చని రాయమసదనమునకు ♦ సంగరసీమన్. ౭

తే. జంబుమాలియు సమసెను ♦ సచివపుత్రు
లైనయేవురువీరులు ♦ హతులైరి
వారె సైన్యాధిపతులు గ♦దా; రథములు
గజతురంగమముల్ నిండఁ ♦ గలబలములు. ౮ 1868

క. [3]హతములె నీకున్ దమిఁగూ, ర్చుతమ్ముఁడగునక్షుఁ డనిని ♦ జొచ్చి సమసె; శ
త్రుతతిసూదన! నీయం, దతిశయవిశ్వాస మున్న♦దరయఁగ నాకున్. ౯

తే. అంత విశ్వాస మవ్వాలి♦యందు లేదు;
దనుజగణకాలుఁడైనయా♦వనచరు పెను

1 సురాసురాణా మపి శోకదాతా-అనిమూ. 2 నహ్యస్తి కశ్చి త్రిషు సంగ్రహేష్వై-అనిమూ. 3 సహోదర స్తే దయితః కుమారోఽక్షస్తు సూదితః-అనిమూ.

బలము మతివిభవంబును ♦ బౌరుషంబుఁ
జక్కఁగా నెంచి నీదగు♦శక్తి నెఱిఁగి. ౯౪ 1870

క. తనయా! తావకబలమున, కనురూపముగాఁగఁ జూపు♦మని నుద్ధతి; నీ
వన శస్త్రవిద్వరుండవు, ఘనుఁడవు పగవాని నడఁపఁ♦గాఁ దగుదువు నూ.

క. కనుక నిటనుండి యచటికిఁ, జని యాకపిఁ జేరి నంత ♦ స్వబలము మఱియా
తనిబలము నరసి సేనకు, వినాశనము గల్గకుండు♦విధమున ననిలోన్. ౧౧

సీ. [1]పరునిమర్దింపుమా; ♦ సురపతిని జయించినట్టివీరా! విను ♦ మాతఁడొకఁడె
శత్రుబలౌఘంబు ♦ సమయించుచున్నాఁడు కనుక నాతనిపయిఁ♦జనుతరుణము
నందు సైన్యములు స♦హాయము చేయంగఁజాలవు; మఱియల్ప♦సారమైన
వజ్రముఁ గొని కపి♦వరుపైకిఁ బోఁకుము వాయువుకంటె జ♦వంబు మిన్న

తే. గాఁగ నాతనికుండును♦గాఢవహ్ని, కల్పుఁడగుఁగాన ముష్ట్యాది♦కములఁ జంప
నలవిగాకుండు; నేఁజెప్పి♦నట్టివిషయ,మున నె చక్కఁగఁ బరికించి ♦ పనినిదీర్పు.

క. మనము సమాహితముగఁ జక్కనిరీతి నొనర్చుకొనుచుఁ ♦ గార్ముకసంబం
ధనిఖిలదివ్యాస్త్రబలం,బును నెఱి స్మరియించుకొనుచుఁ ♦ బొమ్మా యనికిన్.

క. పనియెట్లుచెడదొ యారీ,తిని యత్నమొనర్పు మీవు ♦ దివ్యాస్త్రబలం
బునె స్మరియింపుము; యుద్ధం,బునకు నినుం బంచుటరయఁ♦బోలదు నాకున్.

తే. కానియిది రాజధర్మసం♦ఘంబునకును, దానినేయాశ్రయించిన♦ధరణిపులకు
నరయ నుత్తమమైనదే♦యట్టులౌట, నిన్నుఁ బంపుచునున్నాఁడఁ♦[2]గన్నతండ్రి.

క. అరిసూదనా! మహాసం,గరమున బహువిధము లగుచుఁ ♦ గ్రాలెడునస్త్రో
త్కరమును గొని ప్రహరింపం,గరము సమర్థమగుశక్తిఁ ♦ గన వలయు మదిన్.

ఆ. జయముఁ గోరవలయు ♦ సంగ్రామమునఁ గాన
సకలశస్త్రములను ♦ సంస్మరింపు
మనియె; [3]దక్షతనయు ♦ లగు దేవతలవంటి
సుప్రభావమునను ♦ సొంపుమీఱి. ౧౫౪ 1878

క. బలశౌర్యంబుల నొప్పెడు, బలసూదనజిత్తు తండ్రి♦పలుకులవిని తాఁ
గలహమున కేగఁజాలిన, తలఁపును గొని భక్తిమీఱఁ ♦ దండ్రికి నెలమిన్.

---

1 నవీరసేనాగణశోచ్యవంతి నవజ్ర మాదాయ విశాలసారమ్, నమారుతస్యాస్య గతేః ప్రమాణం నచాగ్నికల్పః కరణేన హంతుమ్-అనిమూ. దీనికి వ్యాఖ్యకర్త లేయర్థమును వ్రాసిరో యది యీసీసమునం దున్నదని తెలియవలయు. వ్యాఖ్యానమేలేకయున్న నీశ్లోకమున కర్థము వాల్మీకియే ప్రత్యక్షమై యందఱికిఁ జెప్పవలసివచ్చును. ఆశ్రమము వారికి లేకుండఁజేసినవారు వ్యాఖ్యాతలే. వారిభావము తెమఁగునఁ జెప్పరాదను దేవానాంప్రియులమాట యపశలం ద్రోయుట సమంజసము. 2 కన్నతండ్రి-అనునది రసపోషకమాట నిట వలయుననియే చెప్పఁబడినది. 3 దక్షసుతప్రభావాః-అనిమూలము.

క. వలగొనియె; నంతనాతఁడు, బలములు తగ బొగడుచుండ ♦ బవరముచేయం
గలయుత్సాహము పొంగఁగ, వెలువడియెను హనుమ నొంచు ♦ వేడుకతనరన్.

[1]చ. సరసిజపత్త్రనేత్రములు ♦ చారుతరంబుగ నొప్పు శ్రీతగన్
గురుతర తేజముల్ వెలయఁ ♦ గోర్కి ఫలింపఁగఁ జేయునింద్రజి
త్తు రయము మీఱఁ బర్వములఁ ♦ దోయధివోలెఁ జెలంగిపోయె సం
గరమున; కింద్రకల్పుఁడగు ♦ కర్బురనాథకుమారుఁ డంతటన్. ౧౮ 1881

క. గరుడోపమవేగంబునఁ, బరఁగుచు సితతీక్ష్ణదంత ♦ వారము తగు కే
సరులను నాల్గింటిని భీ,కరముగఁ గట్టినరథంబుఁ ♦ గడు దివ్యంబున్. ౧౮½

తే. ధరణి నంటకపోయెడు ♦ దానినెక్కి;
రథికుఁడై ధన్వివర్యుఁ డ ♦ స్త్రవిదులందుఁ
డానె ముఖ్యుండునై యాయు ♦ ధముల నెల్లఁ
గలిగి యొప్పెడు నాతండు ♦ చెలఁగు వేడ్క. ౧౯½ 1883

చ. అరదము నెక్కి శీఘ్రముగ ♦ నా హనుమంతుఁడు పొల్చుచోటికిన్
గరము ప్రతాప ముట్టిపడఁ ♦ గాఁ జనియెన్; బవమానసూనుఁ డా
శరపతిపుత్త్రు స్యందనపు ♦ సాంద్రరవంబును, జాపశింజినీ
వరరవమున్ స్వకర్ణముల ♦ వ్రయ్యలు చేయఁగ యుద్ధమత్తఱిన్. ౨౧ 1884

క. వినరింపఁదగుఁగదా యిదె, యని పరమానందభరితుఁ ♦ డయ్యె; రణమునం
దనుపమపాండిత్యమునం, దనరెడు నాయింద్రజిత్తు ♦ దారుణరీతిన్. ౨౧½

[2]మ. పెనుచాపంబును దీక్ష్ణశల్యశరముల్ ♦ భీమంబులై యొప్పఁగాఁ
గొని యప్పావనిపైకిఁ బోయె; నవిలోఁ ♦ గొంకేమియున్ లేక బా
ణనికాయంబును గేలఁ బూని యతఁ డం ♦ తన్ వెల్వడన్ దిక్కులె
ల్లను గంపించె మృగంబులెల్ల నఱచెన్ ♦ లక్షించి పెన్భీతిచేన్. ౨౩ 1886

చ. అనిఁ గనువేడ్క నచ్చటికి ♦ నప్పుడు వచ్చిరి నాగయక్షులున్
మునిపతులున్ నభంబున స ♦ మూహముగాఁ దగుసిద్ధులున్, విహం
గనికర మభ్రసంవృతిని ♦ గాంచి ముదంబున మీఱి గూయిడెన్;
హనుమయు వేగవంతుఁ డటు ♦ స్యందనమెక్కి చెలంగు వేడుకన్. ౨౪½ 1887

క. అరుదెంచు నింద్రజిత్తును, బరికించి యొనర్చెఁ గడుర ♦ వంబును స్వకళే
బరమును బెంచెను; సురరిపు, వరపుత్త్రుం డింద్రజిత్తు ♦ భవ్యరథమునన్. ౨౫

ఆ. పొలిచి చిత్రధనువుఁ ♦ బూనిక గ్రహియించి
యశనిరీతి భయద ♦ మైనశబ్ద

1 శ్రీమాన్ పద్మపలాశాక్షో రాక్షసాధిపతే స్సుతః - అనిమూ. 2 శితశల్యాంశ్చ సాయకాన్-అనిమూ.

మొలయునట్లు గుణము ♦ బలిమిని సారించె;
నంతఁ జండవేగు♦లై పొలుచుచు. ౨౬ 1889

సీ. అతిబలశాలురై ♦ యాహవనిర్విశంకులునయి తగుప్లవం♦గుఁడు సురారి
తనయుండు నపుడు బ♦ద్ధవిరోధమున నొప్పసురగణనాథుఁ డ♦సురపతియును
దలఁపడినట్లుగాఁ ♦ దలఁపడి; రంతట వీరుండు మఱియుమ♦హారథుండు
విలుకాండ్రమేటియై♦కలహంబునఁ శక్తి యలరెడువాఁడునై ♦చెలఁగునింద
తే. జిత్తు బాణాళి వైవఁగాఁ ♦ జిత్తమందు
శంకయే లేక హనుమయు ♦ స్వశనువట్టె
పెంచి శరములు తనమీఁద ♦ నించుకేని
సోఁకకుండఁగఁ దాఁ జేయు♦చుఁ జవమున. ౨౭ 1890

క. తనతండ్రి సంచరింపఁగ, ననూనమగుచున్నయల్ల♦యంబరమున స్వే
చ్ఛను సంచరించె; నంతట, దనుజుఁడు వీరుండు పరవి♦తానభయదుఁడై.
క. తనరారునింద్రజిత్తపు, డనూనములు తీక్ష్ణములును ♦ నాయతఫలశా
లినిదగునవి చిత్రములును, గనకాంచితపుంఖములును ♦ గడు భయదములున్.
తే. కొనలు వంగఁగ వజ్రము ♦ ఘనగతిఁ బడ
నట్టియురవడి తగియుండు ♦ నట్టిబాణ
ములు ప్రయోగించె హనుమపై ♦ నలుకవూని
యనిలసూనుఁడు తత్స్యంద♦నారవంబు. ౨౮ 1893

క. భేరీమృదంగపటహా,ద్యారవమును, లాగుచుండు♦నతనిధనుర్జ్యా
భూరిరవంబును విని తన, నేరుపుఁ గనఁబఱుప నెగిరె ♦ నింగికి నంతన్. ౩౦
క. సురవైరి లక్ష్యపాండితిఁ, బరఁగెడువాఁడనుచుఁ దలఁచి ♦ వనచరపతి త
చ్ఛరనికరాంతరముననే, తిరుగంగాఁ జొచ్చె లక్ష్య♦దీప్తి తఱుఁగఁగన్. ౩౧
క. అనిలజని యింద్రజిత్తుని, ఘనబాణములకును మ్రోలఁ ♦ గనఁబడుచును వై
చినయంత కేలుసాచుచు, వినువీథికి మరల నెగిరె ♦ విక్రమమొప్పన్. ౩౨
క. ఇరువురును వేగవంతులు, దురమొనరించుపనిఁ బండి♦తులు గావున భీ
కరగతి భూతస్వాంతా, హరణముగా నుత్తమంపు♦టనిఁ జేసి రొగిన్. 33 1897
*క. హనుమకుఁ గల్గినఛిద్రము, దనుజున కన్నహితునకును ♦ దగుఛిద్రము పా
వనికిని దెలియకయుండెను; గనుకనె మార్కొనుచుఁ బోరఁ♦గా నుద్ధతిమై.
క. సురవిక్రమమునఁ దగునా,యిరువురకుఁ బరస్పరం బ♦హీనబలము న
త్తరుణమున నోర్వఁగా దు,స్తరమయ్యెను; లక్ష్యశుద్ధి♦తగ దనుజుండున్. ౩౪
క. శరముల నమోఘములఁ గపి,వరుపైఁ గడు హెచ్చరికను ♦ వైచె నవియు దే

* హనూమతో వేద నరాక్షసోంతరం నమారుతి స్తస్య మహాత్మనోంతరమ్-అనిమా. అంతరం ఛిద్రమ్-అనివ్యాఖ్య.

స్త్రరీతిఁ బోయె నతఁడా,శరములు; దప్పించుకొనియె ♦ సరభసములరన్.

క. కనుక నవి నిష్ఫలములై, చనుచుండుటఁ జూచి తనదు♦స్వాంతంబున నా
దనుజుఁడు చింతంబూనెను;, ననంతరము దానవేంద్రు♦నాత్మభవుండున్. ౩౫

చ. *హరివరునాతనిన్ బవర♦మందు వధించు టశక్య మంచు వే
యరసి యుపాయమొప్పు నటు♦లాతనిఁ బట్టుకొనంగ నెంచి యె
వ్వరుసను బట్టనౌనొ తన♦బాహుబలంబును దూలి నాకు సం
గరమున నెట్లుచిక్కునొకొ ♦ ఖ్యాతి యదెట్లుగ నాకుఁ గల్గునో. ౩౬ 1902

క. అనితలఁచి యస్త్రవిద్వరుఁ, డనూనవిక్రముఁడు నైన♦యాదనుజుం డా
వనచరవరుపై నప్పుడు, వనజజునస్త్రంబుఁ గూర్చె ♦ వైవఁగఁ బెలుచన్. ౩౭

—ఇ బ్రహ్మాస్త్రమున హనుమ బంధింపఁబడుట. ఇ—

క. మరుదాత్మజు నీతనిసం,గరమునఁ జంపంగ నాకుఁ ♦ గా దని మదిలో
నరసి మహాబాహుం డా,సురపతిసుతుఁ డస్త్రవిదుఁడు ♦ శుంభచ్ఛక్తిన్. ౩౮

క. పైతామహాస్త్రమేతగు, నీతరుణమునందు నంచు ♦ నెంచి తదస్త్రం
బాతతగతి వైచి తగన్, వాతాత్మజుఁ గీశవర్యు ♦ బంధించె వెసన్. ౩౯ 1905

చ. దనుజవిముక్తమై తగి పి♦తామహమంత్రనియుక్తమైనయా
ఘనతరశక్తిసంయుతిని ♦ గ్రాలెడునస్త్రము మేచుసోఁక నా
హనుమయుఁ జేష్టలన్ వదలి ♦ యంగములెల్లను గట్టువడ్డను
ర్వినిబడియెన్; గపీంద్రుఁ డరి♦వీరకృతాంతుఁడు తత్క్షణంబునన్. ౪౦ 1906

సీ. బ్రహ్మాస్త్రమునఁ బట్టు♦వడుట యెఱింగియుఁ, బ్రభువగువనజసం♦భవునినుప్ర
భావంబునన్ స్వప్ర♦భావంబు వేగంబ పోవుటయు నెఱింగి ♦ పూర్వ మమ్మ
హాత్ముఁడు దయచేసి♦నట్టివరంబును స్మరియించుకొనియె; న♦త్తరుణమందు
నింద్రజిత్తొగి శక్తి♦నెసఁగు నాబ్రహ్మమంత్రంబులనుమంత్రించి ♦ దానివైచి
తే. నాఁడని తలంచి బ్రహ్మ యా♦నాఁడు తనకు
వరమొసంగియెయుండుట ♦ స్వాంతమందుఁ
దలఁచె; లోకగురుండగు♦సలిలజభవు
దయను బ్రహ్మాస్త్రబంధంబు ♦ దలఁగ దనుచు. ౪౧ 1907

క. నాయంత నేనెబంధము, పాయంగాఁ జేసికొనును♦పాయమెఱుఁగ నం
చీయసుర తలఁచియే యిటు, లీయస్త్రముచేతఁ గట్టె ♦ నిట నన్నుఁ దగన్.

క. అనియెంచి హనుమ మఱియును, వనజభవాస్త్రైకకృతవి♦బంధనమును నే
ను నిటన్ గొంతయెన్నైనను, గనియే యుండఁదగునంచుఁ♦గడుఁ దలఁచెమదిన్.

తే. అట్లు బ్రహ్మాస్త్రవీర్యంబు ♦ నాతఁడెంచి
క్షణమె తద్బంధనం బుండుఁ♦గాని యవల

* అవధ్యతాం తస్యకపే స్సమీక్ష్య- అనియూ.

వదలునని పూర్వమే పద్మ♦భవుఁడు తనకు
నిచ్చియున్నట్టివరమును ♦ నెఱిఁ దలంచి. ౪౨ 1910

క. వనజజునాజ్ఞను శిరమునఁ, గొని బద్ధుండయ్యె; మఱియుఁ ♦ గోఁతులలోమే
టినిగాఁ దన్నుఁ దలంపం, జనుశక్తిని గన్నహనుమ ♦ స్మరియించె నిటుల్.

క. [1]వనరుహమిత్రుని బ్రింగం, జనినదిమొదలా మహేంద్ర♦శతధృతులును నా
యునిలుఁడు గాచుచునున్నా, రనయము నట్లాట నిప్పు♦డస్త్ర మిది తగన్.

క. ననుబంధించిన నేభయ,మును గలుగదు నాకు; దనుజ♦ముఖ్యు లిపుడు గ
ట్టిన నాకు గుణముగనె యది, వినుతిం గాంచెడిని దనుజ♦విభునితోడన్. ౪౪

తే. నేను మాట్లాడఁగల్గున♦ట్లానుగానఁ
బట్టుకొందురుగాక యీ♦పరులు నన్నుఁ;
ననుచుఁ బరవీరహంతయా♦హనుమ చిత్త
మందుఁ గృత్యంబు నెంచి చే♦యఁగలపనిని. ౪౫ 1914

ఉ. ఆరసి చేయునేర్పఱియె ♦ యాటను జేష్టలుదక్కి యంత నా
వీరులు రాక్షసుల్ తనను ♦ వింతగ బల్మినిబట్టి భీతిఁజే
కూరుచునట్టిభాషలను ♦ గొంకుచునే బెదరింపఁబూనఁగా
మారుతనూనుఁ డార్చెఁ దన♦మానసభీతిని దోఁపఁజేయుచున్. ౪౬ 1915

ఉ. ఆరిపుసూదనున్ గపిగ♦ణాధిపునిన్ గతచేష్టునిన్ మహా
ధీరునిఁ గాంచి రాక్షసులు ♦ తీవ్రగతిన్ శణవల్కముల్ తగన్
భూరుహచీరముల్ పెనచి ♦ పొందుగఁ ద్రాళ్లఁగఁజేసి కట్టి; రా
మారుతి రాక్షసేంద్రుఁ డభి♦మాని కుతూహలమొప్ప నన్నిఁకన్. ౪౭ 1916

క. కనకుండఁడనుచు నిశ్చయ,మునొందుచున్ వీరవైరి♦ముఖ్యులు పూన్కిన్
దనుఁగట్టుటకున్ బలమును, గొని తనబల మెఱుఁగలేక ♦ కొట్టుటకు మదిన్.

ఆ. సన్నుతించియుండె; ♦ సరభసముగ నిట్లు,వీర్యవంతు హనుమఁ ♦ గ్రౌర్యమొప్ప
వల్కమునను గట్ట ♦ బ్రహ్మాస్త్ర మాతని, విడిచె మఱొకవస్తు♦వితతిచేత. ౪౮

ఆ. [2]బంధనమ్ముచేయ ♦ బ్రహ్మాస్త్రబంధంబు, నిలువ దించుకేని ♦ దెలియరైరి
వార; లంతలోన ♦ వీరుఁ డయ్యింద్రజి, త్తచట నిట్లు వాన♦రాధిపుండు.

క. తరుచీరబద్ధుఁడౌటన్, సరసిజభవు నస్త్రముక్తి ♦ సత్వరమే కాం
చి రహిన్ మించుటఁ గన్గొని, పరమాస్త్రంబిద్ది యితర♦పరికరబద్ధున్. ౪౯

తే. తాను బంధింపదనియెంచి ♦ మానసమున
నక్కటా! గొప్పపనిచేసి ♦ యది నిరర్థ

---

1 వ్యాఖ్యానాభిప్రాయ మిట నూచితము. 2 అస్త్రబంధ స్సచాన్యం హి నబంధ మనువర్త
తే-అనిమూ.

కముగ ననుటను జూడంగఁ ♦ గలిగె వీరు
మంత్రగతుల నెఱుంగరు ♦ మాటలేల. ౪౦౹ 1921

సీ. బ్రహ్మాస్త్ర మీరీతిఁ ♦ బ్రతిహతమైనచోఁ దరువాత మఱొకయ ♦ స్త్రంబు కార్య
మొనరింపఁజాల దిం ♦ కొకసారి దానినే వైచిననదియును ♦ బనిసేయ దనుచు
దల్లాట నింకఱి ♦ యందును సంశయ మంకురించినదని ♦ యార్తినొందె
హనుమంతుఁడట్లు బ్ర ♦ హ్మాస్త్రముక్తుండయ్యు దనుజులు బంధించి ♦ తన్నులాగు

తే. కొనుచుఁ బోవుట నది తన్నుఁ ♦ గొంచెమేని
విడిచినట్లెంచఁడయ్యె; నా ♦ వెడఁగు దనుజు
లంత నాకపివీరుని ♦ నతుల కాష్ఠ
ముష్టిఘాతంబులన్ గొట్టి ♦ ముదముమీఱ. ౪౩౹ 1922

క. దనుజేంద్రుఁడైన రావణు, ననుపమమగు సింహపీఠ ♦ మలరు నెచట న
ద్వనచరు నచటికి నీడుచు, కొనిచని; రాపిదప దనుజ ♦ కుంజరుఁ డెలమిన్.

తే. [1]అస్త్రబంధవిముక్తుఁడై ♦ యపుడు భూజ
చీరసూత్రనిబద్ధుఁడై ♦ చేష్ట లుడిగి
యున్నగురుబలుఁ బావని ♦ నన్నుతాత్ము
సగణుఁడై యున్నదానవ ♦ సత్తమునకు. ౪౮ 1924

క. కనఁబఱచె; మత్తకరివిధమున బద్ధుండైనప్లవగ ♦ ముఖ్యు నతని గై
కొనిపోయి రాక్షసులు తమ, దనుజేంద్రుని కగపఱచిరి ♦ తత్సభ్యులొగిన్.

క. ఎవఁడీతఁ డెవరివాఁడగు, నెవఁడనుపఁగ వచ్చె నిందు ♦ నేపనియొ యిటం
చవిరళముగఁ దమలోఁ దామ వరుసఁగాఁ జెప్పుకొనిరి ♦ మునుముసు; పిదపన్.

క. చంపుఁడు కాల్చుఁడు తమిభక్షింపుఁడు వీని నని మించు ♦ కినుకల నచటన్
దెంపునఁ జెప్పుకొనిరి వారింపఁగ రానట్టివివిధ ♦ రీతుల దనుజుల్. ౪౯ 1927

సీ. అంతమహాత్ముఁ డ ♦ య్యనిలసూనుఁడు త్వరితముగ మార్గముదాఁటి ♦ యమరవైరి
విభుపాదతలమున ♦ వెలయుచున్నట్టియాపరిచారవృద్ధులఁ ♦ బరమరత్న
భూషితతద్గృహం ♦ బును గాంచె; మహిత తేజశ్శాలి రాక్షస ♦ సత్తముండు
వికృతరూపదనుజ ♦ వీరు లిట్టటు లీడ్వ నూరకున్నకపీంద్రు ♦ మారుతిఁ గనెఁ;

తే. గపియుఁ దేజోబలంబులఁ ♦ గ్రాలి వెలుఁగు
భాస్కరునిబోలి భాసిల్లు ♦ వాని రావ
ణాసురునిఁ గాంచె; నంతట ♦ నసురపతియుఁ
గ్రోధసంవర్తితారుణా ♦ క్షుఁ డయి యపుడు. ౫౦౹ 1928

క. వనచరు వార్తలనడుగం,గ నచటికులశీలవృద్ధ ♦ గణముల నెల్లం

1 వ్యదర్శయ త్తత్ర మహాబలం తం హరిప్రవీరం సగణాయ రాజ్ఞే-అని మూ.

గని యాజ్ఞ చేసె; వారా, హనుమంతునిఁ గాంచి యిట్టు♦లనిరి క్రమముగాన్.

తే. చేయవచ్చినపని యేమొ ♦ యీయెడకెవ
రిపుడు నినుఁబంపినారొ యి♦దెల్లఁ జెపుము
యనిన [1]సుగ్రీవుదూత న♦న్నతఁడు పనుప
వచ్చినాఁడ నటంచొగిఁ ♦ బల్కె నంత. ౬౩ — 1930

నలువదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ౪౯ - వ సర్గము.

హనుమంతుఁడు రావణుని తేజోవిశేషములఁ జూచి మెచ్చుకొనుట.

క. భీమపరాక్రముఁ డగునా, సామీరియు రావణుండు ♦ స్వపదమునందు
ద్దామగతినుండి నన్నిట, కీమాడ్కిం దేరఁ బంపె♦నే యని మదిలోన్. ౪

క. అరుణంది యుగ్రకోప, స్ఫురణంబునఁ దామ్రదృష్టి♦పొలయఁగ నతనిం
బరికించె; రావణుండును, వరముక్తాలంకృతమయి ♦ భాసురమగుచున్. ౫

క. వెలలేక కనకమయమై, యలరెడుమకుటమును దాల్చి ♦ యతులద్యుతులన్
దళుకొత్తుచుండె; వజ్రపు, శలాకములఁ గూర్పఁబడుచుఁ ♦ జారుతరములై.

సీ. మణిమయంబులునయి ♦ మనసుచేఁ గల్పింపఁబడినయట్లు విచిత్ర ♦పరిణతిఁగను
భర్మమయామూల్య♦బహుభూషణంబులఁ దాల్చియొప్పుచునుండె; ♦దనుజవిభుఁడు
పట్టువస్త్రము మూల్య♦పరిమాణరహితంబుఁ గట్టి రక్తచ్ఛాయఁ ♦ గలిగియున్న
చందనంబు నలంది ♦ చారుతరంబులుఁ జిత్రంబులునునయి ♦ చెల్వమీఱు
చున్నకస్తూరికా♦ద్యురుతరరచనల మెండుగాఁగ నలంది♦యుండె; వివృత

తే. ములయి చూడఁగ నొప్పుచుఁ ♦ గలితరక్త
వర్ణనయనంబు లొప్పఁగ ♦ భయదములయి
వెలసి తీక్ష్ణమహాదంష్ట్రి ♦ లొలయఁ బెదవు
లట్టె వ్రేలాడనున్నశీ♦ర్షాళి దనర. ౬ — 1934

క. పలువిధము లౌచుఁ గ్రూరం,బులు నగుమృగములనుగూడి♦పొలుచుశిఖరపం
క్తులు గలమందరభూధ్రము, వలె వెలుఁగుచుఁ దేజమొప్పు♦భాసిలుచుండెన్.

తే. మఱియు నీలాంజనచయంబు♦మాడ్కిఁ దనువు
వెలయ వక్షంబునన్ బూర్ణ♦విధునిరీతి
మౌక్తికావృతరత్నను♦మండితమగు
హారమున నబలాకమే♦ఘాభుఁ డగుచు. ౭ — 1936

---

1 హరీశ్వరస్య దూత స్త్వకాశా దహ మాగతోస్మి-అనిమా. వక్ష్యమాణసంగ్రహోయం-అనివ్యాఖ్య. ఇది ప్రాయికముగా వాల్మీకిపద్ధతి. ముందు జరగఁబోవుప్రసంగమును సంగ్రహించి చెప్పి యావల దానివిస్తరించుట కవిసమయమని గ్రహింపఁదగు.

సీ. అలరారె; నాతని♦హస్తముల్ బద్ధకేయూరంబులయి చంద♦నోత్తమమునఁ
బూయఁగాఁబడి రుచిఁ ♦ బొల్చు నంగదములు తనరార బలిమిని ♦ దారుణతర
*మస్తకపంచక♦మండితఫణివలెఁ జెలఁగుచునుండెను; ♦ జిత్రమగుచు
రత్నసంయోగవి♦రాజితంబయి యుత్తమాస్తరణోపేత ♦ మగుచు గొప్ప
తే. దైనస్ఫాటికపీఠంబు♦నందుఁ గూరు
చుండి యొప్పారుచుండెను; ♦ నురుతరముగఁ
గాంతిఁ బొల్చునలంకృతుల్ ♦ గ్రాలఁ జామ
రములఁ దాలిచి చుట్టును ♦ బ్రమదలెల్ల. ౧౦ 1937

క. కొలుచుచు వీచుచు నుండిరి; వెలసెడుమంత్రములతత్త్వ♦విధములనెల్లం
గలయ నెఱింగినయామంత్రులు బలదర్పితులు సన్మ♦తులు ప్రీతిమెయిన్.

తే. దుర్ధర, నికుంభులును, బ్రహ♦స్తుండు మఱియు
నమ్మహాపార్శ్వుఁ డనునల్వు ♦ రమలభక్తిఁ
దనకుఁ జుట్టును నుండ సం♦ద్రములు నాల్గు
నావరించిన లోకమ ♦ ట్లమరి యతఁడు. ౧౧ 1939

క. వారలతో సల్లాపము, లారభటిం జేయుచుండె ♦ నాతఁడు మఱియున్
జేరువనె మంత్రవిదులై, సారమనీషలఁ జెలంగు♦సచివు లితరులున్. ౧౨

క. తనుఁగొల్వ దివిజయుతుఁడై, తనరారెడునింద్రుఁబోలి ♦ తగవిలసిల్లెన్;
గనకమయాస్తరణంబునఁ, దను వసితచ్ఛాయవెలుఁగ ♦ దర్పముపొంగన్.

క. మేరువుశిఖరంబునఁ గడు, వారియుతంబైననూత్న♦వారిదమువలెన్
దారుణతేజంబునఁ దగు, నారాక్షసవిభునిఁ జూచె ♦ హనుమయు నంతన్.

తే. భీమవిక్రము లగుభటుల్ ♦ పీడనంబు
దన్ను నొందఁగ జేయుచు ♦ నున్నవపుడు
విస్మయావిష్టచిత్తుఁడై ♦ వేయివిధము
లను సురారిపతిం జక్కఁ♦గనియె నచట. ౧౩ 1943

చ. హనుమయు దీప్తతేజసుని ♦ నాదనుజేశునిఁ జూచి యాత్మనా
తని కటు తేజమొప్పుటకుఁ ♦ దద్దయు విస్మయమొప్ప నెంచె; నీ
దనుజునిరూప మద్భుతము ♦ ధైర్యబలద్యుతు లట్టివే యగున్
ఘనతరలక్షణంబులు త♦గం బొలుపొందెడువీనిమేనునన్. ౧౪ 1944

క. ఔరా! యీతనివైభవ, మేరీతిం బొగడవచ్చు ♦ నితఁ డిప్పుడు తా
నారయక యొనర్చినయీ, భూరితరాధర్మ మెన్నఁ♦బోయినగురువౌ. ౧౫

1 పంచశీర్షైరివోరగైః-అనిమూ. పెద్దపడగగల పాముని యర్థముచెప్పువారు కొందఱుగలరు. వారికిట నీశ్లోకమున నాయర్థము తప్పని తోఁపకమానదు.

క. [1]ఇతఁడిది యొనరుపకుండిన, దితిజుల కేకాదు సర్వ♦దివిజుల కితఁడే
పతియగు నింద్రునినేలఁగ, హితశక్తిఁ జెలంగు; మఱియు ♦ నీశం డెపుడున్.

సీ. భయదముల్ పరులకు ♦ బాధను గల్గించునవియు నింద్యమ్ములు♦నైనదుష్ట
కార్యముల్ పెక్కులు ♦ గావించియున్నాఁడు కాన సీతనుఁ గని ♦ దానవామ
రులు సర్వలోకులు ♦ గలవిలపాటొంది యున్నారు కోపంబు ♦ నొందునేని
యీతఁడు జగమెల్ల ♦ నేకసాగరమయంబుగఁ జేయఁజాలనం♦చొగిఁ దలంచె;

తే. మతివిభవ మొప్పనాహను♦మంతుఁ డిట్టు
లమిత తేజంబునం దగు♦నట్టిరావ
ణాసురుంజూచి తత్ప్రభా♦వాదులెల్లఁ
దలఁచి చింతించెఁ బెక్కుభం♦గుల మనమున. ౨౦½ 1947

నలువదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౫౦ - వ సర్గము.

### హనుమద్రావణుల సంభాషణము.

[2]క. గురుతర బాహుండును లో,కరావణుఁడునైనపంక్తి♦కంఠుఁడు కోపో
ద్ధురతన్ బింగాక్షుఁ బురో,ధరణిస్థితుఁ దీవ్ర తేజుఁ ♦ దత్కపివర్యున్. ౧½

చ. హనుమను గాంచి సంశయహ♦తాత్ముఁడునై మును నేను శంకరా
ద్రిని బెకలించి యెత్తుతఱిఁ ♦ దీవ్రరుడావిలమానసంబుతో
నను శపియించినట్టియల♦నందిమహాత్ముఁడు తానె యీపురం
బున కిటువంటిరూపమును ♦ బూని తగం జనుదెంచె నేమొకో. ౨½ 1949

తే. అట్లుకాకున్నచో నసు♦రాధిపుఁడగు
బాణుఁడే యీవిధంబున ♦ వానరాకృ
తిని ధరించి పురంబును ♦ గనెడువేడ్క
వచ్చినాఁడేమొ యని యెంచె ♦ స్వాంతమందు. 3 1950

క. అని దనుజేశుఁడు రోషం,బున నేత్రము లెఱ్ఱఁబాఱ ♦ ముఖ్యసచివుఁడై
తనరారుప్రహస్తునిఁ గని, యనియెను గాలోచితమగు♦నట్టివిధమునన్. 3½

[3]సీ. అర్థవంతంబగు♦నట్టిరీతిని, నీదురాత్ముని నడుగు మే♦యవనినుండి
వచ్చితి నీవు? నా♦వరనగరంబున కెవఁడునినుం బంపె ♦ నీయశోక
వనముఁ బాడొనరింప♦వలసినపనియేమి? దనుజాంగనల నేల ♦ [4]తగనిరీతి
బెదరించితి, వని నీ♦వదయత నీభంగి; మఱియును బరదుర్గ♦మమగునాదు

---

1 స్యాద్ధయం సురలోకస్య సశక్రస్యాపి రక్షితా-అనిమూ. 2 పింగాక్షం పురతః స్థితమ్-అనిమూ. 3 దురాత్మా పృచ్ఛ్యతా మేషః-అనిమూ. 4 రాక్షసీనాం చ తర్జనే-అనిమూలము

తే. పురికి నితఁడేలవచ్చెనో ♦ దురమొనరుపఁ
గారణం బేమొ? యని వీనిఁ ♦ గపి దురాత్ము
నడుగుమని యాజ్ఞ చేసె; ని♦ట్లధిపుఁడనిన
నా ప్రహస్తుఁడు విని యని♦లాత్మజుఁ గని. ౬౹ 1952

క. [1]వనచర! యూఱడిలంజనుఁ, గనుదువుగాకీవు శుభము ♦ గాంచకుము భయం
బును: నీరావణునగరం,బునకు నినుం బంపినాఁడె ♦ పురుహూతుండుళ్. ౭౹

తే. [2]ఉన్నదున్నట్లు పలుకుము ♦ నిన్ను విడిచి
పంపెదను భీతిమాను: మీ♦పత్తనమును
యమ, వరుణ, ధననాథులం ♦ దరయ నొక్కఁ
డనుప వేగులవాఁడవై ♦ తేనువు దీని ౮౹ 1954

క. ధరియించి చొచ్చితివొ యో, హరివర! నిశ్చయముపల్కు♦మా విష్ణుండే
యరియగురావణునిళ్ సం,గరమున నె జయింపఁగోరి ♦ కడఁకమెయినినుళ్. ౯౹

క. పనిపినవాఁడా, యెవరేఁ, బనిపిన నీకించుకేని♦భయమువలదు క
ల్గినది వచింపుము, కన నీ,తనువే కపితనువుగాని ♦ తత్త్వంబరయుళ్. ౧౦ 1956

క. ఈనీ తేజస్స్ఫురణము, వానరులకుఁ గల్గదుసుము; ♦ వచ్చినరీతిళ్
జానుగ నిజంబుపల్కుము, వానర! విడిపింతు నిన్ను ♦ భయము గనకుమా.

క. అనృతము చెప్పితివా యో,వనచర; ప్రాణములు నిన్ను ♦ వదలుళ్ [3]నీవే
దనుజపురంబును జొచ్చినఁ, బనియేమో దానినైనఁ ♦ బల్కుము మాతోళ్.

క. [4]అనుచుం బ్రహస్తుఁ డడిగిన, దనుజేంద్రునిఁ బంక్తికంఠుఁ ♦ దాఁ గని పలికెళ్
విను మింద్రధనదవరుణుల,కు నేను నొక్కనికిఁగాను ♦ గూఢచరుండళ్. ౧౨౹

క. ధనపతితో సఖ్యము నా,కును లేనే లేదు దనుజ♦కుంజర! వినుమా
[5]వనజాక్షుఁడు నన్నిచటికిఁ, బనుపఁగలే దేను జాతి♦వానరుఁడనె నూ. ౧౩౹

క. వనచరుఁడనె నైయిచటికిఁ, జనుదెంచితి వేఱుగాదు; ♦ సకలదనుజనా
థుని నిన్నుఁగనుట దుర్లభ,మని విని నినుఁ జూచువేడ్క ♦ నాత్మఁ బొదలఁగళ్.

క. వనభంగముఁ గావించితి, దనుజులు బలశాలు రొక్క♦తలఁపున నాతో
ననిచేయవచ్చి రేనును, దనుసంరక్షణముకొఱకు ♦ దనుజులతోడళ్. ౧౫

తే. యుద్ధ మొనరించినాఁడ మ♦ఱొక్కకోర్కి
గాదు; నన్నును బంధింప ♦ నాదితేయ

---

1 సమాశ్వసి హి భద్రం తే నభీః కార్యా త్వయాకపే-అనిమూ. 2 మాభూత్తే భయం వానరమోక్ష్యసే-అనిమూ. 3 అథవా యన్నిమిత్తం తే ప్రవేశో రావణాలయే-అనిమూ. 4 తదా రక్షో గణేశ్వరమ్ - అనిమూ. ప్రహస్తుని నిర్లక్ష్యముచేసి రావణునితోఁ బల్కెనని దీనిభావము. 5 విష్ణునా నాస్మి చోదితః-అనిమూ. నీపనుకొను విష్ణువు నన్నంపలేదు. నీవినాశనముఁ గోరి మనుష్య రూపమును దాల్చినరామునిబంటనని మారుతిభావము.

దానవులకే నశక్యము ♦ దానవేంద్ర
యీవరము బ్రహ్మవలననె ♦ యేనుగంటి. ౧౬ 1963

క. నీకునువలెనే బ్రహ్మయె, నాకుం గరుణించె దనుజ♦నాయక నన్నుఁ
బ్రాకటవిభవునిఁ గనఁదగు, నేకరణిని నైన నను ♦ నీశరణమునన్. ౧౭

ఆ. [1]అజునియస్త్రమునకు ♦ ననిఁ జిక్కి బంధింపఁ
బడితి; నన్ను దనుజ♦భటులు గట్టఁ
గానె యస్త్రబలము ♦ కదలిపోయెను రాజ
కార్య మొకఁడు నాకుఁ ♦ గలదుగాన. ౧౮ 1965

చ. అది నెఱవేర్ప నీకడకు ♦ నల్లన వచ్చితి భూరితేజుఁడై
పొదలెడు రామచంద్రునకు ♦ భూధరమాళికి దూత నంచు న
న్నెదఁ దలపోయఁగాఁ జను న♦హీనపరాక్రమ! [2]నీకు మేలుగా
ర్పఁదగు మదుక్తి దీనిఁ గడు♦భవ్యము నీవిపుడాలకింపుమా. ౧౯ 1966

ఏఁబదియవ సర్గము సంపూర్ణము.

---

## ౫౧ - వ సర్గము.

-హనుమంతుఁడు రావణునకుఁ గర్తవ్య ముపదేశించుట.-

క. వనచరతిలకుఁడు సత్వం,బున నొప్పెడుమారుతేంద్ర♦పుత్త్రుఁడు బలశా
లిని రావణుఁ గని హెచ్చరి,కను నర్థము మిగులఁ గల్గఁ♦గా నిట్లనియెన్. ౧

తే. నేను సుగ్రీవుసందేశ ♦ మూని నీగృ
హంబునకు వచ్చినాఁడ నో♦యసురనాథ
నీసహోదరుఁ డాకపి♦నేత తనదు
కుశలమును జెప్పుమనియె నీ♦కుఁ దమిమీఱ. ౨ 1968

[3]ఉ. నీదుసహోదరుండు కపి♦నేత మహాత్ముఁడు వాలితమ్ముఁ డ
త్యాదృతిధర్మయుక్తమయి ♦ యర్థయుతంబయి [4]యిందుమీఁద న
న్మోదము నీయనొపలుకు ♦ ముందుగ నీకెఱిఁగింపుమంచు నా
తోఁ దమిఁ జెప్పిపంపెఁ; బరి♦తోషమునన్ వినవయ్య చెప్పెదన్. 3 1969

క. కరితురగస్యందనచయ,పరివృతుఁడై దశరథుఁడనఁ♦బరఁగున్నృపుఁడీ
ధరనుండె; జనులకాతఁడు, పరికింపఁగఁ దండ్రివలెనె ♦ బంధువునుమిత్త్రా. ౪

క. సురపతిసమకాంతియుతుం, డరయఁగఁ గరుణార్ద్రచిత్తుఁ♦డగు; నాతనికిన్
వరపుత్త్రుండు మహాభుజుఁ, డురుతేజుఁడు రాజకార్య♦సోత్సాహుండున్. ౫

---

1 విముక్తో హ్యాహ మస్త్రేణ రాక్షసైస్త్వభిపీడితః-అనియు. బ్రహ్మాస్త్రస్య పాఠాంతరాప
హాత్వాత్-అనివ్యాఖ్య. 2 పథ్యమిదం ప్రభో-అనియు. 3 సహోదరశబ్దము రెండుతావులను తూల
మునవేయున్నది. 4 ఇహ చాముత్ర చ క్షమమ్-అనియు.

క. జనకునకుం బ్రియదౌహిత్రునామముఁ దుదయించె నతఁడు ♦ మహీపునియాజ్ఞన్
గొని పురివెలువడి ధర్మం, బనుమార్గము నాశ్రయించి ♦ యనుజునితోడన్. ౭

ఆ. కాంతతోడ దండ♦కావనమును జేరె, జనకుఁ డనెడుభూప♦సత్తమునకుఁ
దనయయయి పతివ్ర♦తయు రామభార్యయు, నైనసీత యావ♦నాంతరమున.

క. కనఁబడకుండెను; రాముం, డనుజునితో నామెవెదకు♦నాళను విపినం
బునఁ దిరిగి ఋశ్యమూకా,ద్రిని గలసుగ్రీవుఁ జేరెఁ; ♦ దేఁకువమీఱన్. ౮

చ. వనచరనాయకుం డతని♦భార్యను దా వెదకింపఁగాఁ బ్రతి
జ్ఞను బొనరించె రాఘవుఁడు ♦ సత్వర మాతనిరాజ్యలక్ష్మి వ
చ్చునటులు చేయువాఁడ నను♦చున్ శపథంబును జేసె; నంత రా
ట్తనయుఁడు రాఘవుండు ప్రవి♦దారణమందు వధించె వాలినిన్. ౯౫ 1975

ఆ. [1]వాలి నిట్లుచంపి ♦ వనచరభల్లూక
వితతి కిపతనూజుఁ ♦ బతిగ నప్డు
పట్టభద్రుఁ జేసెఁ; ♦ బ్లవగనాథుఁడు వాలి
యెట్టివాఁడొ మున్నె ♦ యెఱుఁగుడుగద. ౧౦౫ 1976

క. శ్రీరాముం డవ్వాలిని, ఘోరశరం బొందువైచి ♦ కూలిచె; వినుమా
వారిజమిత్రజుఁ డట దు,ర్వారవచస్కుండు గాన ♦ వైదేహిఁ గనన్. ౧౧౫

క. మనమున నాతురపడుచున్, వనచరులను నాల్గుదెసల ♦ వరుస వెదకఁబం
పెను; నూర్లువేలులక్షలు,గను గూడుచుఁ బోయి వారు ♦ కలయఁగ దెసలన్.

క. పాతాళంబున దివమున, భూతలమున సీత వెదకఁ♦బూనిరి; వార
ల్యాతతబలశాలురు వి,ఖ్యాతజవోపేతులునయి ♦ యలరుదురు సుమీ. ౧౩౫

క. హరిపీరు లడ్డులేకయె, తిరుగం జాలుదురు వైన♦తేయునములుగా
సరివత్తు రందుఁ గొందఱు, మరుత్తునకు; దానవేంద్ర♦మరుదధిపునకున్. ౧౪

క. ఔరసపుత్త్రుఁడ నాదగు,పేరు హనుమయంచు నలరుఁ ♦ బృథ్విని; నేనున్
శ్రీరాముపత్నికొఱకే, వారిధి శతయోజనముల♦వఱలెడుదానిన్. ౧౫ 1981

తే. దాఁటి జానకి నెలమిని ♦ దర్శనంబు
చేయఁగాఁగోరి యిటకు వ♦చ్చితిని నీదు
సద్మమున సంచరించుచు ♦ జనకతనయఁ
గాంచినాఁడ నదృష్టంబు ♦ గలుగుకతన. ౧౬ 1982

సీ. అవిషయంబెల్ల ♦ నట్లుండఁగా నిమ్ము, శాస్త్రముల్ చక్కఁగా ♦ సంగ్రహించి
వానిధర్మంబుల♦వరుస నెఱింగినవాఁడవు తపమును ♦ వ్రతముగాఁగ
నాచరించినవాఁడ ♦ [2]వాతపంబే నిన్ను గ్రహియించె ననిచెప్పఁ♦గాఁ దగుదువు
ప్రాజ్ఞతముండవు ♦ పరమవీరుండవు నీవగుదువు ధర్మ♦నిరతిఁగన్న

---

[1] త్వయా విజ్ఞాతపూర్వ శ్చ వాలీ వానరపుంగవః-అనిమూ. [2] తపఃకృతపరిగ్రహః-అనిమూ.

తే. నీవె పరకాంతలనుబట్టి ♦ యీవిధమునఁ
జెఱను బెట్టుట తగదు సూ; ♦ స్త్రీల నొరుల
నపహరించెడుకృత్యమ్ము ♦ లఖిలధర్మ
ములవిరుద్ధములైన వి♦య్యుల ననిశము. ౧౭ 1983

సీ. *ధర్మవిరుద్ధకృ♦త్యంబులు సుఖహేతువులుగ నుండినఁజాలుఁ ♦ బలుకు లేల
యనుదువేమో యవి ♦ యట్టివిగాకయే బహ్వపాయంబులఁ ♦ బ్రబలఁజేయు
నవియగు, నెట్లైన ♦ నవాప్తికిం బరిహారంబు చేయంగ ♦ నౌననెదవొ
మొదటికేమోసంబు ♦ ముందుగఁజేయును నిట్టికార్యంబులఁ ♦ బట్టుపట్టి
తే. యిలను నీవంటిబుద్ధిమం♦తులు తగంగఁ
జేయఁబూనరు; నాకెట్లు ♦ చేయు హాని
నందువో రాముకోపంబు ♦ ననుసరించి
తాను లక్ష్మణుఁ డాగ్రహ ♦ మూని యనిని. ౧౮ 1984

క. పఱఁగించుదుర్నివారక, శరనికరాగ్రమున నిల్వ♦శక్తులెవరు! ని
ర్జరులందు నసురులందును;, సురవైరిగణేశ! వినుము ♦ క్షోణినదెందుఁ. ౧౯

క. రామున కప్రియ మొనరిచి, యేమాడ్కి సుఖంబునొంద ♦ నెంచునతఁడు లేఁ
డీమాట నిజము; గనుకనె, యీమాటం జెప్పు మనియె ♦ నినజుఁడు నీతోఁ.

క. ఈరీతిఁ బ్రవర్తిల్లిన, శ్రీరామునిసాధ్వి నీవు ♦ చెఱఁబెట్టినయీ
ఘోరాఘముఁ బ్రాక్కృతమును, దూరముగాఁబోవఁ బాఱఁ♦దోలుచుమఱియుఁ.

తే. ఇప్పుడున్నయైశ్వర్యంబు ♦ నిట్లె నిలిపి
మీఁద శుభమిచ్చుఁ గావున ♦ మేలు నీకుఁ
గలుగఁ జేయును జుమ్ము త్రి♦కాలములను
ధర్మపురుషార్థదంబుగాఁ ♦ దలఁపు దీని. ౨౧ 1988

క. తలపోసి రామునకు నా, లలనామణి నిమ్ము; నే ని♦లాతనయను దొం
గిలి తెచ్చినాఁడ నని యెటు, పలుకంగల వనెదవేమొ ♦ ప్రమదామణినిఁ.

చ. కనుఁగొనినాఁడ వానరని♦కాయసుదుర్లభమైనసీత ద
ర్శన మిట నాకుఁగల్గె; నిఁక ♦ జానకినిం గొనిపోవఁగూడదే
యనియెదవేమొ, మీఁదిపని ♦ కారఘురాముఁడె కర్త, నాకు న
ప్పని యొనరింప నాజ్ఞ యుచు ♦ భానుకులీనుఁ డొనంగ లేదుసూ. ౨౨ 1990

క. కనుఁగొంటివైన నావశ,మున నున్నమహీజ రామ♦మూర్తి యదేరీ
తిని గొనిపోఁగలఁడని నీ, వనుదువొ యేమో మదాశ♦యంబును వినుమా.

---

* నహి ధర్మవిరుద్ధేషు-అను సార్ధశ్లోకమునకు వ్యాఖ్యాకర్తలు వ్రాసినయర్థమంతయు పీఠికయం దుఁ గలదని యెఱుంగఁదగు.

క. కనినాఁడ శోకవివశాత్మను సీతను నీవు తెచ్చి ♦ తగ నీవశమం
దునుచుకొనినట్లు తలఁచితి, వనూనపంచాస్యభుజగి ♦ యటుతలఁపవు సూ. ౨౩

తే. భయదవిషసంయుతాన్న మెబ్బంగినైన
జీర్ణమగునట్టు లెవరును ♦ జేయఁ జాల
నట్టులీసాధ్వి నసురులు ♦ నమరవరులు
నైన దక్కించుకొనఁజాల ♦ రసురనాథ! ౨౪ 1993

క. శ్రమపడి చేసితివిగద తపము ధర్మము లెన్నొ చేయఁ ♦ బాల్పడితివి నీ
వమరారినాథ! వానిఫలముగా నొందితివి నీఫ♦లము జీవితముఁగ. ౨౫ 1994

ఆ. అట్టిదానిఁ బోవు♦నట్లు చేయుట న్యాయ్యమగునె, నాయవధ్య♦మైన యాయు
వంత మొందు టెట్లొ ♦ యని యెదవేమొ నీ, వలఘుతరతపంబు ♦ లాచరించి.

క. కనినాఁడ వవధ్యత్వంబును దేవాసురులచేతఁ ♦ బొలియక యుండన్
ఘనకారణ మొక్కటి నిన్ననిఁ జంపంగలదు నిశ్చ♦యంబుగ వినుమా. ౨౬

క. కారణ మదియే మోయని, యారయఁ బనిలేదు వనచ♦రాధీశుండే
యా, రాక్షసుఁడసురుఁడుదనుజారియుఁ గాఁడతఁడు కాఁడు♦యక్షుఁడు వినుమా.

[1]క. దనుజుఁడు గంధర్వుఁడు కాఁ, డనూనఫణిగాఁడు నీకు ♦ నని మరణంబున్
గనకుండ నెవరిఁగూరిచి, కనినాఁడవొ వరము కాఁడు♦గా యం దేవఁడున్. ౨౭

క. దనుజేంద్ర! యట్టిసుగ్రీవునిచే మృతిఁగనక యుండఁ ♦ బోలునె ప్రాణా
ళిని నిల్పుకొనం జాలుదె, యని తనలో శాస్త్రములను ♦ నారసి యంతన్. ౨౮

సీసమాలిక:—

[2]మునునేను బూన్కిఁ జే♦సినమహాధర్మంబుఁ గాపాడకుండునా ♦ గాఢధర్మ
ఫల, మధర్మంబునఁ ♦ గలుగుఫలంబు నొక్కటిగాఁగఁ గూడుట♦గల, దధర్మ
ఫలముచే నాత్మకు ♦ విలయంబు మఱిధర్మఫలముచే నాత్మకు ♦ భద్రము దగఁ
గలుగఁగూడునటంచుఁ ♦ దలఁచి యందాద్యవికల్పము గలుగనే♦కలుగదనెడు
నర్థముగల్గని♦ట్లనియెఁ బావని, ధర్మఫలరూపసుఖమది ♦ కలియదెవ్వడ
ధర్మఫలంబుతో; ♦ ద్వైతీయమగువికల్పముగూడ నెందును ♦ నమర దనెడు

1 ఈఘట్టమునం దంతటను మూలతత్త్వార్థరూపవ్యాఖ్యానార్థము గలదని యెఱుంగనగు.
2 నతు ధర్మోపసంహార మధర్మఫలసంహితమ్, తదేవఫల మన్వేతి ధర్మశ్చాధర్మనాశనః - అనిమూ.
దీనికి వ్యాఖ్యాతలు చక్కనియర్థమును వ్రాసిరి. ఆయర్థమే యిట సీసమాలికచే సమగ్రముగఁ దెలు
పఁబడినది వాల్మీకిభావ మిదగునో కాదో యనుశంక వ్యాఖ్యానార్థ మెఱుంగఁదగినవారికిం గల్గదు.
ఈయర్థమే కవిసమ్మతము. ముక్కస్యముకార్థః-అనుపామరోక్తి ననుసరించి యర్థము చెప్పిన నిందే
స్వారస్యములేదు. వేదసారము రామాయణమని చెప్పుట యిట్టిగంభీరార్థములు గలుగుటచేతనే గాని
కథచెప్పినందునఁ గాదని యెఱుంగఁదగు. వ్యాససూత్రాదులు భాష్యకర్తలసాయముననే తెలియఁ
దగినవి. లేకున్న నవెంతయుపయోగించునో యందఱకుఁ దెలిసియేయుండును.

సర్థంబుగల్గ నీ♦ట్లనియెను మఱియును; ధర్మమెత్తఱినైన ♦ ధర్మఫలము
నేపొందుఁగాని యం♦దేరీతినైన నాధర్మంబు బాధింపఁ♦దలఁప దట్లె
యాయధర్మఫలంబు ♦ నాధర్మఫలముతోఁ గలియక తనుఁదానె♦కలియఁగోరు
ధర్మ మధర్మముఁ ♦ దగ నాశమొనరింపకుండునా యనుశంక ♦ నొందకుండ
నింకను నిట్లని♦యెను బూర్వకృతధర్మ మద్యతనాధర్మ ♦ మంతమొందఁ
గాఁజేయు దారీతిఁ ♦ గాన ధర్మము ధర్మమును నాశమొనరింప♦దనుట నిజము
విపులపుణ్యఫలంబు ♦ వేడుకమైఁ బొంది యవ్వల నయ్యధ♦ర్మాత్తఫలము
ననుభవంబునకు వ♦చ్చునుగాక ముందఱ ననుభావమును బోవు♦నట్లు పలికె
ధర్మఫలంబెల్లఁ ♦ దమిమీఱ ననుభవింపంబడియె నధర్మ♦ఫలమె యింక
ననుభవింపఁగ నున్న♦దదియును వేగమే యనుభవింపంగల ♦ వరయ నిజము

తే. ధర్మమును గోరకున్నని♦త్తఱిని మీఁదఁ
బడినకార్యంబుఁ జూడు, రా♦ముఁడు మనుష్య
మాత్రుఁడని తలపోయకు ♦ మహీపుఁడాతఁ
డొక్కఁడే జనస్థానమం♦దొప్పువారి. ౨౯॥ 2000

చ. దనుజుల నందఱన్ మిగుల ♦ దారుణసంగరమందుఁ జంపె నొ
య్యన నొకబాణమేసియె మ♦హాబలు వాలి వధించెఁగాదె; యీ
పనులఁ దలంచి భాస్కరుని♦పట్టికి రామునకైన మైత్రినిన్
మనమున నెంచి నీహితము ♦ మానుగ నెద్దియొ నీవెఱుంగుమా. ౩౦॥ 2001

క. కరితురగరథయుతంబగు, పురమిద్దానిని బలంబుఁ ♦ బూనికఁ దగ నొ
క్కరుఁడను నేనేచెఱుపఁగఁ, బరఁగుదు ని దనమ్మతంబు ♦ పార్థివపతికిన్.

క. వనచరభల్లుకసన్నిధి, నినకులతిలకుండు తానె ♦ యెవ రాసీతన్
వినుతచరిత్రను నవమతిఁ, గనఁజేసిరొ వారిఁజంపఁ♦గా శపథంబున్. ౩౨॥

క. ఒనరిచియున్నాఁడుసుమా;, విను రామున కపకృతిఁ దగ ♦ వృత్రారియె తా
నొనరిచి సుఖమొందఁడింకన్, నినుఁజెప్పఁగనేల దనుజ♦నిచయాధీశా. ౩౩॥

శా. *నీ వెప్పావనశీల జానకిగ నీ ♦ నెమ్మిం గనుంగొంచు ను
న్నావో యేసతి నీవశంబున నె యి♦న్నాళ్లున్నదో యార్తయై
యావామాక్షియె లంక దీని నిసుమం♦తైనన్ గనన్ రానియ
ట్లీవార్ధిం గలుపంగ నున్నదని యూ♦హింపందగున్ రావణా. ౩౪ 2005

తే. కాళరాత్రిగ నెఱుఁగు లం♦కాపినాశ
మొనరుపన్ గాన నట్లాట ♦ నుర్వితనయ

---

* యాం సీతే త్యభిజానాసి యేయం తిష్ఠతి తే వశే, కాళరాత్రీతి తాం విద్ధి సర్వలంకావినాశినీమ్, తదలం కాలరూపేణ సీతా విగ్రహరూపిణా, స్వయంస్కంధావసక్తేన క్షమమాత్మని చింత్యతామ్.-అనిమూ.

కాయమున నున్న యాఘోర ♦ కాలపాశ
మును మెడకు నీవు దగిలించు ♦ కొనుట చాలు. ౩౫౹ 2006

క. హితమెయ్యదియో యిఁక నీ,వె తగఁ దలపోసికొమ్ము; ♦ యీపురి క్షోణీ
సుత తేజంబున మును వే, దితిజేంద్రా! దగ్ధమయ్యె ♦ దివిజులు మెచ్చన్. ౩౬

క. [1] శ్రీరామకోపమును దను, ఘోరముగాఁ జుట్టుకొనఁగఁ ♦ గోటలు మఱిప్రా
కారాట్టవీథులున్ జెడఁ,గా రయమున మండ నీన ♦ గరము చెడుఁజుమీ. ౩౬౹

సీ. దాయాదులను సహో ♦ దర మిత్ర పుత్ర మంత్రులను భోగముల భా ♦ ర్యలను లంక
నంత మొందింపకు; ♦ మనురేంద్ర! నే [2] రాముదాసుండ నగుట నా ♦ తని ప్రభావ
ము నెఱుంగఁగలను దూ ♦ తను గాన హితమును దెలుపంగఁ దగువాఁడ ♦ దితిజ మనుజ
జాతులలో నేను ♦ జన్మింపఁగా లేదు వనచరుఁడను గానఁ ♦ గనను బక్ష

తే. పాత మటుగాన నాదగు ♦ పల్కు వినుము
సత్యమేయగు నాపల్కు ♦ సాధుకీర్తి
రాముఁడు చరాచరములతో ♦ రహిఁ దగు జగ
ములను ద్రుంచి యథారీతి ♦ నిలుపు మరల. ౩౭౹ 2009

క. శ్రీరాముఁడు శౌర్యంబున, నారాయణుతో నుపమ గ ♦ నం జాలుఁజుమీ
యారామునితోడం బ్రవి,దారణ మొనరింపఁగలుగు ♦ ధన్యుఁడు కనినన్. ౪౦

క. సురదనుజభూపయక్షో,త్కరమున రాక్షసులలోన ♦ గంధర్వులలో
నురగపతత్త్రుల విద్యా,ధరకిన్నరసిద్ధవితతిఁ ♦ దగ నెందైనన్. ౪౧౹ 2011

తే. ఎవ్వఁడైనను లేఁడు, లో ♦ కేశుఁడైన
మనుజపతిసింహునకును రా ♦ మునకుఁ జాల
నప్రియము చేసి తీవు ప్రా ♦ ణాళిఁ గూడి
బ్రదుకు టేఁక సంశయంబె; నా ♦ పలుకు వినుము. ౪౩ 2012

క. సురగంధర్వులు విద్యా,ధరదైత్యఫణీంద్రయక్ష ♦ తల్లజులును నె
వ్వరుగాని జగత్త్రయపతి, వరుఁడగు రాఘవుని మ్రోల ♦ బవరమునందున్.

సీ. [3] ఇంద్రుఁడై మఱియు మ ♦ హేంద్రుఁడై సురపతియై తగు వజ్రి సం ♦ హారకాల
మందు నెల్లర నేడ్చు ♦ నట్లు చేయుచుఁ ద్రినేత్రములొప్పఁగాఁ బుర ♦ త్రయవినాశ

---

1 పురీం సాట్టప్రతోళికామ్-అనిమూ. 2 మమదాసస్య దూతస్య వానరస్య విశేషతః-అని మూ. రామదాసస్యేత్యాది విశేషణత్రయేణ స్వస్య రామసామర్థ్యపరిజ్ఞానం హితోపదేశాధికారం మాధ్యస్థ్యం చ సూచితమ్-అనివ్యాఖ్య. వ్యాఖ్యయే లేకున్న నీశ్లోకము వ్యర్థమేయని తేలకమానదు. వ్యాఖ్యచూచినపిదప నెట్టి స్వారస్య మగపడుచున్నదో చూడుఁడు. ఆయర్థము పద్యమున ననువదింపఁబడినది. 3 బ్రహ్మా స్వయంభూ శ్చతురాననో వా రుద్ర స్త్రినేత్ర స్త్రిపురాంతకో వా ఇంద్రో మహేంద్ర స్సురనాయకో వా త్రాతుం నశక్తా యుధి రామవధ్యమ్-అనిమూ. అత్ర విశేషణాంతరోపాదానం తేషాం సామర్థ్యవిశేషద్యోతనార్థమ్. ఏతత్ప్రికర్షత్వపరిహారాయ వ్యుత్క్రమేణ

కరుఁడగు శివుఁడును♦బరశివునకుఁ దంౘ్రియయి స్వయంభువుచతు♦రాననుండు
నయి తగుబ్రహ్మయు ♦ నందఱు నొకటిగఁ గలిసిన్మైనను రఘు♦కాంతునకును

తే. వధ్యుఁ డగువానిఁ గాపాడ♦వారు కారు
వారి కాలాటిశక్తి లే ♦ దారయంగ
ననియె; నప్రతిముండగు♦నాదశాస్యుఁ
డనిలసూనుఁ డదీనవా♦క్కగుచు నిట్లు. ౨౫ 2014

చ. పలుకులసౌష్ఠవంబు తగఁ ♦ బల్కినవాక్కులు స్వాంతరంగమం
దెలమిని గల్గనీక మఱి♦యెంతయు నప్రియముల్ జనింపఁజే
య లఘుమనస్కుఁడౌటను మ♦హాత్తరకోపమునొంది యప్పుడ
క్షులు తిరుగంగఁ జంపుఁ డిదె ♦ కోఁతి నటంచని యాజ్ఞ చేసెఁ దాన్. ౨౬

ఏఁబదియొకటవ సర్గము సంపూర్ణము.

---

## ౫౨ - వ సర్గము.

దూత యవధ్యుఁడని విభీషణుఁడు రావణునకు హితముచెప్పుట.

క. హనుమంతుఁ డమలచిత్తుఁడు, తన కుపదేశించినట్టి♦తత్త్వము విని యా
దనుజేంద్రుఁ డధికకోపం, బునఁ దనువునుమఱచి యతనిఁ♦బొలియింపుమనెన్.

క. దనుజేంద్రుఁడు దుర్మతిచే, హనుమను జంపుఁ డనిపల్క ♦ నచట మెలఁగునా
తనితమ్ముఁడౌవిభీషణుఁ, డనువాదము దూతకృత్య♦మై పరఁగుటచేన్. ౧౪

తే. దూతవధ్యుఁడుగాఁడు నే♦రీతినైన
నతనిఁజంపుట యొప్పక; ♦ యాత్మఁ గార్య
విధుల నెఱిఁగినవాఁడౌట ♦ విపులకోప
మును దశాననుఁ డొందుట ♦ హనుమ కట్లు. ౨ 2018

క. మృతికాజ్ఞ యీయఁబడుటయు, మతినెఱిఁగి యొనర్పఁదగిన♦మంచిపనిని వ
ద్దతి నాలోచించెను; ని,శ్చితకృత్యుండౌచు దుష్ట♦చిత్తుని జ్యేష్ఠున్. ౩౪ 2019

క. *తనవైరి నపూజ్యపథం,బున గెలువంబూనియున్న♦బుధనిందితు నా
దనుజేంద్రుఁ గాంచి వాగ్వి,త,తిని బండితుఁడౌట హితగ♦తిం దాఁ బల్కెన్.

క. దనుజేంద్రా! మన్నింపుము, ఘనమగురోషంబుఁ బాఱఁ♦గాఁదోలుము నీ
మనమునఁ గృపఁబూనుము నా, మనవిని నాలింపు మెల్ల ♦ మనుజేశ్వరులున్.

---

యోజనీయం, అనివ్యాఖ్య. ఈశ్లోకమున హనుమ ఇంద్రశివబ్రహ్మలను జెప్పుటచే రాఘవుఁడు మను
జరూపధారియగువిష్ణువని తేటపడఁజేసెను ఇదియే సారమని గ్రహింపఁదగు. * నిశ్చితార్థ స్తత
స్సామ్నా పూజ్యశత్రుజి దగ్రజమ్-అనియూ. అపూజ్యేతిచ్ఛేదః-అనివ్యాఖ్య-

తే. మంచిచెడుగుల నరసి యే ♦ మాడ్కి నైనఁ
జంప రెప్పుడు దూతను; ♦ క్షత్రధర్మ
మున కిదివిరుద్ధ మగు లోక ♦ మునకు నొప్ప
రోమహాత్మక! నినుఁబోలు ♦ నురగుణునకు. ౫౪ 2022

క. [1]సరిగాదు; భూతతతిలో, నిరుపమధర్మములనెల్ల ♦ నీవయెఱుఁగు దీ
వరయఁ గృతజ్ఞుండవు రా,క్షసవర! ధర్మవిదుండవుగద ♦ వాసవతుల్యా. ౬౫

తే. మేలుగీడుల నెఱిఁగిన ♦ మేటివికద; వినుము నీవంటిపండిత ♦ వితతి యసమ
యమున నాగ్రహమూనిన ♦ నఖిలశాస్త్రపఠనజజ్ఞాన మెల్ల ని ♦ ష్ఫలముగాదె.

క. దనుజేంద్రుఁడ వరిచయనూ,దనుఁడవు నినుఁ జెనకి బ్రదుకఁ ♦ దరమెటులగు నే
మనవియొనర్చినకారణ,మును దీని గ్రహించి కోప ♦ మును మానఁదగున్. ౮౫

క. కరుణాత్ముండవు గమ్మా, వరమతి యుక్తం బయుక్త ♦ భంగి నిది యటం
చరసి తగినవిధమున వా,నరునకు దండనమొనర్పు ♦ న్యాయము గానన్. ౯

క. [2]దనుజేంద్రుఁ డవ్విభీషణు, వినీతవాక్యముల నెల్ల ♦ విని రోషముపై
కొన నిట్లనియెను; నరిసూ,దన! పాపులఁ జంప నఘము ♦ తగులదు సుమ్మీ.

క. కావున నే పాపచరుఁడగు, నీవానరుఁ జంపువాఁడ ♦ నిపుడె యనియెఁ; గ్రో
ధావేశ మొప్పఁ బల్కిన, నావాక్య మధర్మమూల ♦ మగు దానిఁ గడున్.

తే. ఆర్యజుష్టంబు గాకయు ♦ న్నట్టిరావ
ణోక్తి బుద్ధిమదగ్ర్యుఁడై ♦ యొప్పుచున్న
యావిభీషణుఁ డాలించి ♦ యమలవాక్య
భంగిఁ దెలుపంగఁ బూని యి ♦ ప్పగిదిఁ బలికె. ౧౨ 2029

క. దనుజేంద్రా! లంకేశ్వర, మనముఁ బ్రసన్నంబుచేయ ♦ మామకవచనం
బును ధర్మాధర్మంబుల, కనుగుణ మగుదాని వినుమ ♦ యాదరమొప్పన్. ౧౩౫

క. ఏయేకాలములందును, నేయేస్థలములనుగాని ♦ హితమును శాస్త్ర
న్యాయము విడి దూతల నృపుఁ, డాయువు దీయంగఁ గూడ ♦ దనిరిగురుజనుల్.

సీ. [3]దూతమాత్రమె గాఁడు ♦ నాతనయునిఁజంపుటరిగదా యందువో ♦ యసురనాథ
యక్షకుమారాదు ♦ లగుమేటులం జంపి వచియింపరానంత ♦ వట్టు మనకు
నప్రియమొనరించె ♦ నప్లాట శత్రువే సంశయమేలేదు ♦ సజ్జనులెటు
వంటివాఁడైనను ♦ వచ్చినదూతను జంపరా దందురు ♦ తెంపుచేసి

ఆ. యతని కెన్నొవిధము ♦ లైనదండనములు
కానఁబడెడుఁగాదె; ♦ కాయమునకు

---

1 ఇందలిరావణవిశేషణములన్నియు మూలానుసారముగాఁ జేయని యెఱుఁగునది. 2 నపాపానాం వధే పాపం విద్యతే శత్రుసూదన-అనిమూ. 3 అసంశయం శత్రురయం ప్రవృద్ధః-అనిమూ. దీని యర్థమంతయు నిట వివరింపఁబడుట యెఱుంగఁదగు.

వికృతిఁ గల్గఁజేయు♦టొకటి, కశాఘాత
మొకటి, తలను గొఱుగు♦టొకటి మఱియు. ౧౪ 2022

[1]క. తనువున ముద్రను వేయుట,యును నివి దూతకును దగిన♦యురుశిక్షలుగా
జను లమలమతులు చెప్పుదు, రనుకూలము లివ్వి దూత♦లందు నృపులకున్.

క. వినినదియె లేదుకద దూ,తనుజంపుట యెందునైన; ♦ ధర్మాధర్మా
ళిని బుద్ధి నెఱపి కృత్యము,లను జేయఁగ నేర్చి లఘు♦లఘువు లెఱిఁగియున్.

తే. జ్ఞానసంపత్తిగలిగి స♦జ్జనులతోడి, పొందుగల్గిన నీబోఁటి♦పూజ్యుఁడెట్లు
కోపవశుఁడగు? సుజనులు ♦ కోపలేశ, మైననుండఁగఁ జేయ ర♦శ్లాటనీవు. ౧౬

ఆ. ధర్మవాదమందుఁ ♦ దగులోకవృత్తమం
దఖిలశాస్త్రరీతు ♦ లరసి వాని
మఱువకుంటయందు ♦ మహి నీకుఁ దుల్యుండు
గలఁడె, దేవదనుజ♦గణములందు. ౧౭ 2036

క. నీవేయుత్తముఁడవు నూ, రోవీరా!; యితనిఁజంప ♦ నొకయించుకయున్
భావంబునఁ దోఁపదు గుణ, మీవిధమా శాస్త్రరీతి♦కే దూరముగన్. ౧౮

క. వనచరు నీతని నిచటికిఁ, బనిపినవారియెడ శిక్షఁ ♦ బఱపుము దీనిన్;
దనుజేంద్ర! సాధువో యీ,వనచరుఁడు ఖలుండొ పరులు ♦ పనుపఁగవచ్చెన్.

క. పరవశుఁడుగాన వారల, కరణిం దాఁ బల్కినాఁడు ♦ గాన నితనియం
దరయ నపరాధముండదు, మరణము నొందింపఁదగదు ♦ మాట లిఁకేలా.

క. [2]దనుజేశ! వీనిఁజంపిన, వనరాశిని దాఁటి యిటకు♦వచ్చుఖచరు నిం
కను నొకనిఁ గానఁజాలను;, గనుక నితనిఁజంప నీవు ♦ గడఁగకు మింకన్.

తే. పరపురంజయ! దేవాధి♦పతినిగూడి, సురలువచ్చిన వారల ♦ శూరతఁ దగఁ
జంప యత్నముచేయంగఁ ♦ జాలుదీవు, కపిని నీతనిఁ జంపఁద♦గదు నిజంబు.

సీ. [3]ప్రధనప్రియా! వీఁడు ♦ పడెనేని తరువాత గరువంబునూని యి♦క్కడకు దూర
గతులొట రాలేక ♦ కడుదుర్వినీతులై యున్నరాఘవులను ♦ నుద్యమమున
నిటకుఁ దోడ్కొనివచ్చి♦యెంతయుఁగడఁకతోఁ గలహమునీతోడఁ♦గాదనకయె
యొనరింపఁజేయఁద♦గినవాఁడు గలఁడని నామదిఁ దోఁపదు; ♦ న్యాయశీల

తే. దానవానందకర! మహో♦త్సాహవిక్ర
మములు ధైర్యంబు గల్గున♦మర్త్యులకును

1 తథా లక్షణసన్నిపాతః-అనిమూ. లక్షణసన్నిపాతః, దూతయోగ్యాంకనసంబంధః-అని వ్యాఖ్య. వ్యాఖ్యలేకున్న నెపరికిఁ దోఁచినట్లు వారర్థము చెప్ప నవకాశము కల్గి రసము విరసముగా మాఱియుండును. 2 నాన్యం పశ్యామి ఖేచరమ్ - అనిమూ. 3 విభీషణుఁడు రావణుని యుద్ధము చేయఁ బురికొల్పుట హనుమను వదలించుటకే యని గ్రహింపఁదగు.

నిన్ను గెలువంగఁ దరమె యా♦సన్నరణము
దొలఁగి పోఁ ద్రోయఁబూనుట ♦ యలఘువగునె. ౨౩ 2042

తే. హితులు శూరులు వశ్యులై ♦ యొసఁగువారు
ఘనగుణంబులు గలవంశ♦మున జనించి
నట్టివారును ధీరులు ♦ నాయుధధరు
లందు శ్రేష్ఠులు భృత్యులై ♦ యలరువారు. ౨౪ 2043

క. దనుజులు యోధులు కోట్లుగఁ, గనఁబడుచున్నారు; తావ♦కంబగునాజ్ఞం
గొని కొందఱుశూరులు బల,మున నుంత గ్రహించిపోయి♦మూఢులన్నృపులన్.

క. ఇరువుర నారాఘవులను, బరికించి వధించి నీప్ర♦భావమ్ము రిపూ
త్కరమునకుఁ జూపఁ గాఁ జను,దురుగాక ప్రతాపవిజిత♦ధూర్తరిపుగణా. ౨౬

చ. అన దనుజాధిపుండు త్రిద♦శారి, మహాబలశాలి రావణుం
డనుజహితోత్తమోక్తి విని ♦ యాత్మను నుంత తలంచి దానిఁగై
కొనె సహజన్ముపైఁ గలుగు♦కూర్మిని నాతఁడు సుస్వభావుఁడై
తనకు హితంబుఁ దెల్పె నని ♦ తద్దయు నిశ్చితుఁడౌట నంతటన్. ౨౭ 2046

ఏఁబదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## ౫౩ - వ సర్గము

రాక్షసులు హనుమంతునితోఁకను గాల్చుట.

క. బలశాలి యిట్లు రావణుఁ, డలఘుగుణుండై నతమ్ముఁ ♦ డాడినయమ్మా
టల దేశకాలనువిహిత,ముల విని యిట్లనియె మోద♦మున నాతనితోన్. ౧

క. సరసముగఁ బల్కితివి వా,నరుదూతను వీనిఁ జంప ♦ న్యాయమెటులగున్
బరికింప నింద్యమే; సో,దర! వీనికి నెట్టులైనఁ ♦ దగుదండనమున్. ౨ 2048

క. ఒనరింపవలయు మృతిత,ప్ప నితర మేదైనఁ గాని; ♦ ప్లవగంబులకున్
గనుపట్టుఁ దోఁకపైఁ జ,క్కనిమక్కువ [1]భూషణంబు♦గాదే యదియున్. ౩

క. కనుకనె తోఁకను గాల్పుఁడు, చనుగా కీతండు తోఁక ♦ జ్వలనుఁడు కాల్పం
గను దానితోనె తనవిభుఁ, గనఁగా; నిఁక జ్ఞాతిమిత్ర♦గణములు మఱియున్.

ఆ. ఆప్తబాంధవులొగి ♦ నంగవైరూప్యక
ర్శితుని జూడఁగలరు ♦ చిత్రరీతిఁ;
గాలుచున్నతోఁకఁ ♦ గ్రాలంగ నీతనిఁ
బురమునందు మిగులఁ ♦ బూన్కి మీఱ. ౫ 2051

* ఇష్టం భవతి భూషణమ్-అనిపాఠా.

తే. నాల్గుత్రోవలు గలిసిన♦నగరవీథు
లందు నెల్లెడఁ ద్రిప్పుఁడీ ♦ యనుచు నాజ్ఞ
చేసె; నాయాజ్ఞ నాలించి ♦ చెలఁగి దనుజు
లాగ్రహాగ్రస్తచిత్తులై ♦ యార్భటించి. ౮ 2052

సీ. హనుమంతులాంగూల♦మునకు [1]జీర్ణంబులౌ కార్పాసపటములఁ♦గలయఁజుట్టి;
రంతటహనుమంతుఁ♦డటవిశుష్కేంధనములఁగాల్చుహుతవహు♦వలెఁజెలంగెఁ
దరువాత నాతోఁక ♦ దనుజులు నూనెలో ముంచి యగ్నిని రగి♦లించి రెలమి
నత్తఱి నతఁడు [2]రో♦షామర్షపరివృతచిత్తుఁడై తనవాలము ♦ చిత్రభాను

ఆ. పగిది నెఱ్ఱవాఱ ♦ బగబగమండెడు, వాలముట్టి త్రిప్పి ♦ వారినెల్లఁ
బాఱఁదోలె; నంతఁ ♦ బౌరులు స్త్రీబాల, వృద్ధయుక్తులగుచు ♦ వేడ్కమీఱ.

క. హనుమద్వాలమ్మును గ,న్గొనవచ్చిరి; బలము పొంగఁ ♦ గ్రూరదనుజులె
ల్లనుగూడి మరల నాతని, ఘనరశ్ములఁ గట్టిరంతఁ ♦ గపిసత్తముఁడున్. ౧౦

క. అప్పటికిఁ దగినబుద్ధిని, నిప్పగిదిఁ దలంచె; నన్ను ♦ నీదనుజులు నే
ర్పొప్పఁగ బంధించిన నా, యిప్పటిబలమునకుఁ జాల♦రిట నిల్వంగన్. ౧౧

ఆ. పాశములను వీని♦బడలువఱం ద్రెంచు
కొనుచు నెగిరి వీరిఁ ♦ గ్రూరమతులఁ
జంపువాఁడ నాకు ♦ స్వామియౌ రాముని
హితముకొఱకుఁ దిరుగ♦నెంచునన్ను. ౧౨ 2056

క. దనుజేంద్రుశాసనంబును, గొని కట్టుదురేని మరలఁ ♦ గ్రూరులు నాచే
సినపనికిఁ దారు ప్రతికృతి, నొనరించినయట్లు గాక♦యుండుఁ దలంపన్. ౧౩

క. దనుజాతుల నందఱ నేఁ,బునఁ జంపంగలను నేన; ♦ భూపతివర్యుం
డనఁబడురామునిప్రీతికి, ననుకూలముగాఁగ నిట్టి♦యవమతి నోర్తున్. ౧౪

ఆ. మరలఁ బురము దీని♦సురవైరులెల్లను, నన్నుఁ ద్రిప్పువారు ♦ కన్నులలరఁ
గాంచువాఁడ నట్లు♦గావున నీయవ,మతిని నోర్చువాఁడ ♦ మదినెఱింగి. ౧౫

క. కనినాఁడ లంక రాతిరిఁ, గనుకన్ దద్దుర్గరక్ష♦కస్థానములన్
గనఁజాలనైతిఁ దొలిసం,ధ్యను వానిం జూడవలయుఁ ♦ దత్పరమతినై. ౧౬

క. ననుబంధించిరి కాదే, దనుజులు మఱితోఁకఁ గాల్చి ♦ దారుణరీతిన్
ననుఁబీడింతురుగాకీ, పనిచే నామనను కుందు♦వడ దించుకయున్. ౧౭

తే. దనుజు లంతట బలశాలి♦వనచరతిల
కుని హనుమ సంవృతాకారుఁ ♦ గొనిచని రతి
హర్షమొదవంగఁ; గ్రూరక♦ర్మాభిరతిని
శంఖభేరీనినాదముల్ ♦ సాగుచుండ. ౧౮ 2062

1 జీర్ణైః కార్పాసకైః పటైః-అనిమా. 2 రోషామర్షపరీతాత్మా-అనిమా.

క. హరినాదము లొనరించుచుఁ, బురమెల్లను హనుమఁ ద్రిప్పఁ♦బూనిరి; పగరం
బరిమార్చునతఁడు దనుజో,త్కరపరివృతుఁ డగుచు సుఖము♦గానటఁజనుచున్.

క. పురమెల్లను శోధించెను;, బరికించె విమానములను ♦ బహుచిత్రములన్
గరమరుదుగఁ బొల్చెడునా, ధరణీభాగములఁ గాంచెఁ ♦ దనరెడువానిన్.

సీ. ప్రవిభక్తచత్వర♦పటలంబులను [1]గృహాసంబాధవీథులఁ ♦ జతురరీతి
నలరుశృంగాటకం♦బులఁ బెద్దవీథుల నల్పవీథుల [2]గృహ♦కాంతరముల
జలదసంకాశస♦త్సద్మములను గాంచెఁ; జత్వరమ్ములయందు ♦ సాంద్రముగను
నమరుపఁబడియున్న♦యట్టిచతుస్తంభమండపమ్ముల రాజ♦మార్గములను

తే. నిలిచి రాక్షసులెల్ల న♦నిలతనయుని
నితఁడె దూతసుఁడీ యంచు ♦ నెల్లరు వినఁ
జాటుచుండిరి; బాలురు ♦ సతులు వృద్ధు
లతనిఁ గనుకౌతుకంబున ♦ నరుగుదెంచి. ౨౩ 2065

క. జ్వలితచలల్లాంగూలుని, జలజాప్తునికరణి మోము♦చాయ వెలయఁగా
నలరారుహనుమఁ గాంచిరి;, గలఁగక యతఁ డుండెఁ దోఁక♦గాలుచునుండన్.

ఆ. వికృతనేత్రలైన♦వెలఁదు లాయప్రియ,వార్త సీతతోడఁ ♦ బలికి రిట్టు
లిచట నింతకు మును♦వేమిరో నీతోడఁ, బలికిచనియె నెవ్వఁ ♦ డలరుఁబోడి!.

క. అరుణాస్యం డగునవ్వన,చరునిం బట్టుకొని తోఁక ♦ జ్వలనార్చులఁ బ్ర
జ్వరిలం జేయుచు నిదిగో, పురిఁ ద్రిప్పుచు నున్నవారు ♦ పొందుగ ననినన్.

చ. జనకతనూజ యాత్మకును ♦ జాలఁగ దారుణరీతి నున్నయా
[3]దనుజసతీరితోక్తివిని ♦ తద్దయు శోకమునొంది స్వాసుపుల్
చనినవిధమ్మునం బొగిలి ♦ చయ్యన నగ్నిని గొల్చె; నామె య
వ్వనచరుమేలుగోరి యతి♦పావనచిత్తయొగాన భక్తితోన్. ౨౭ 2069

తే. అగ్నిఁ బ్రార్థింపఁగాఁబూని ♦ హవ్యవాహ, నేను బతిసేవచేసిన♦దాన నేని
తపమొనర్చినదాన నే♦ని పతిభక్తి, గల్గుదానన యేని ని♦కామకరుణ. ౨౮ 2070

క. హనుమంతుని యెడ శీతల,తను గన్పడఁ జేయవయ్య; ♦ తటుకున; మతిమం
తున కారామప్రభునకు, ననుకంప యొకింత పత్ని♦యందుండినచోన్. ౨౯

తే. అనుభవింపఁగఁదగినభా♦గ్యంబు నాకు
నించుకేనియు శేషించి♦యే కలిగిన

---

1 వీథీశ్చ గృహసంబాధాః-అనిమూ. 2 తథైవ గృహకాంతరాన్-అనిమూ. 3 శ్రుత్వా తద్వచనం క్రూరం-అనిమూ. ఇట దనుజసతీ-అని ప్రయోగింపఁబడినది. సతీశబ్దము పతివ్రతావాచ మనుట యందఱెఱుంగుదురు. కేవలస్త్రీపదముగఁ బ్రయోగించుట సరసము గాదనవచ్చును భార్య యను నర్థమిచ్చునని నాభావమని మన్నింతురుగాక.

హనుమకును జల్లఁగానుండు♦నగ్నిహోత్రుఁ;
డేను సచ్ఛీలసంపన్న♦నేని యెపుడు. ౨౯॥ 2072

క. ననురామునిఁ బొందదగు, నని యాతురపడెడుసతిగ ♦ నాథ స్త్వాత్మం
డనఘుఁడు నగుహనుమంతుఁడు, మనమున నె యెఱుంగునేని ♦ మానితరీతిన్.

క. జ్వలనా! చల్లఁగనుండుము;, పలుకుల సత్యంబె గల్గి ♦ పావనశీలం
బలరారెడుసుగ్రీవుఁడు, కలిగినయీదుఃఖసంతాప♦కంధిని నన్నున్. ౩౦ 2074

తే. మునుఁగనీయక దాఁటింపఁ♦గను సమర్థుఁ
డేని హనుమయెడన్ గృప ♦ నివుడు పూని
చల్లనగు, మోమహాత్మ! యో♦జ్వలన! యనుచు
నగ్నిహోత్రునిఁ బ్రార్థించె ♦ నంత నిచట. ౩౧॥ 2075

క. హరిణాక్షి యైనసీతకు, హరికులతిలకునకు శుభమె ♦ యగునని తెల్పం
గరుణించినట్లు సత్యము;గ రయంబునఁ దీక్ష్ణశిఖలు ♦ గలుగ జ్వలనుఁడున్.

తే. మండఁగాఁజొచ్చె; నంత న♦ఖండరీతి
వాలమందు జ్వలించుహ♦వ్యవహుఁగూడి
యున్నహనుమంతుతండ్రి వా♦యువును సీత
కాత్మధైర్యంబుగలుగున ♦ ట్లపుడు పొలిచి. ౩౩ 2077

క. హిమవాయురీతిఁ జల్లన, నమలగతిన్ వీచె; నంత ♦ హనుమయుఁ దనవా
లము గాలుచుండఁ జింతిం,చె మదిని నీరీతి నిదిగొ ♦ చెందినవేడ్కన్. ౩౪

క. నావాలమందు మండెడు, నీవై శ్వానరుఁడు నన్ను ♦ నేలొకొ యితఁ డి
ట్లీవేళఁ గాల్పఁ డంతట, నీవహ్నియొ విపులశిఖల ♦ నెసఁగెడుఁ జూడన్. ౩౫

క. ఐనను నాకీపీడయుఁ, దానై కలిగింపఁ డేమొ; ♦ తలఁపఁగ నీవై
శ్వానరుఁడు తోఁకకొనయం, దూనినదయఁ జందనాదు♦లొక్కటఁబూయన్.

---

తే. చల్లనగునట్లు కనఁబడు ♦ నుల్లమలర;, దీనికిం గారణమగు ని♦ద్దియనియెపుడు
స్పష్టమైనది నేనట ♦ సాగరంబు, దాఁటునప్పుడు శ్రీరాము♦దయను నందు.

క. కనినాఁడఁ బర్వతాకృతిఁ,గనున్నయాశ్చర్యమొందు ♦ త్త్వాధర మయ్యా
బ్ధిని గల్గుట రామమహీ,శుని మాహాత్మ్యమునఁ గాదె ♦ చోద్య మిదికదా.

తే. అట్లె యీయగ్ని చల్లఁగా ♦ నగుటయును ద
దీయమాహాత్మ్యముననె పం♦దియము లేదు;
పరమకారుణికుండు భూ♦వరతిలకుఁడు
రామభద్రుండు ప్రావు నా♦కేమిభయము. ౩౭ 2083

క. జలనిధి మైనాకుండును, జలజాప్తకులుండు రామ♦చంద్రునకు శుభం

బులఁ గూర్పు సంభ్రమింపఁగ, జ్వలనుం డిఁక మేలుచేయఁ♦జాలఁడె చూడన్.

క. జనకజకరుణను శ్రీరా,మునిదామాహాత్మ్యమునను ♦ మునుకొని నాకున్
జనకుం డగుననిలునికృప, ననలుఁడు కాల్పండునన్ను♦నాగ్రహ మొప్పన్. ౩౮॥

చ. అనితలపోసి వానరకు♦లాధిపుఁ డాహనుమంతుఁ డింక నే
పనినొనరింప నౌ ననుచు ♦ బాగుగ లోనఁదలంచె; నంతనా
హనుమయుఁ దీవ్రవేగమున ♦ నార్చుచుఁ బైకెగసెన్ మహాబలం
బున గిరిశృంగమట్లు కడుఁ♦బొల్పగుతోరణ మెక్కె నంతటన్. ౩౯॥ 2086

తే. అద్దియున్నతమై దను♦జాళియుతము, గాకయుండె నద్దాని వే♦గమునఁజేరి
శైలసంకాశుఁడై బల♦శాలియైన, హనుమ క్షణమున నల్పత♦రాంగుఁడగుచు.

క. తనబంధనముల వదలుచు, కొనె; శ్రీమంతుం డతండు ♦ కొండవలెనె యే
పున మరలఁ బెరిగి దిక్కులఁ, గనుచున్ దోరణమునందుఁ ♦ గలపరిఘంబున్.

చ. కనుఁగొని దీర్ఘబాహుఁడగు♦గాలికుమారుఁడు భీకరంబుగా
నినుమునఁ జేయఁగాఁబడుచు ♦ నెంతయుస్థూలమునైనదాని నే
ర్పున గ్రహియించి రక్షణముఁ ♦ బూన్కి నొనర్చెడురాక్షసాళిఁ జ
య్యనఁ బరిమార్చె; దారుణర♦ణాంగణవిక్రమ మొప్ప నంతటన్. ౪౩॥ 2089

క. కనుచుం బురమును వాలం, బునమండెడునగ్నిశిఖలు ♦ పొలయఁగఁ గాంతుల్
దనుఁగప్పఁ *గాంతిరాశిగఁ, గనఁబడుసూర్యుండుపోలెఁ ♦ గడురాజిల్లెన్.

ఏఁబదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౫౪ - వ సర్గము.

### లంకాదహనము.

క. హనుమంతుఁ డంతవాంఛిత,మును సఫలము చేసికొనుచు ♦ మునుకొని లంకం
గనుచు మహోత్సాహము వృ,ద్ధినిబొందఁగఁ జేయఁ దగుని♦ది యని మనమునన్.

క. తలపోసె; నిచట నిపుడీ, ఖలులగు దానవుల కార్తిఁ ♦ గల్పింపంగాఁ
గలిగినపనితప్ప మఱి, మ్ములనేఁ జేయఁదగుకృత్య♦ము గలదె యరయన్. ౨

క. వనభంగ మ్మొనరించితి, దనుజేంద్రులఁ జంపితిన్ ని♦తాంతబలమునన్
ఘనసేనానివహములం,దున నొకభాగంబు నేను ♦ దునిమితిఁ బూన్కిన్. ౩॥

తే. ఇంకదుర్గవినాశనం♦బే మిగిలిన, పనికదా; దానిఁజేసిన♦వనధిలంఘ
నాధిమామకకృత్యంబు ♦ లన్ని సఫల,ములగు నీదుర్గనాశన♦మునకు నింక.

క. ఒనరింపందగుయత్నముఁ, గనుఁగొన నినుమంతె దీనిఁ ♦ గాదన కొనరిం
చిన నాశ్రమమెల్ల ఫలిం,చును; నావాలమున మండు♦చున్ హుతవహుఁడున్.

---

* ఆదిత్య ఇవార్చిమాలీ - అనియు. అర్చిమాలీ త్యత్ర అర్చిరీకారాంతత్వమార్షమ్-అనివ్యాఖ్య.

తే. నాకు నుపకార మొనరించి♦నాఁడు గాన
నితని కీదివ్యగృహముల♦నెల్ల నాహు
తిగ నొసంగుచు మిగుల సం♦తృప్తిఁ జేయు
టిపుడు న్యాయ్యముగద యంచు ♦ నిట్లుతలఁచి. ౫౪ 2096

క. హనుమయుఁ బ్రదీప్తవాలం,బున విద్యుత్సహితమేఘ♦మువలెఁ దనరుచున్
దనశక్తి యలర లంకా, ఘనగృహములమీఁదఁ దిరుగఁ♦గాఁ జొచ్చెఁ దగన్.

సీసమాలిక:—

హనుమంతుఁ డంత ను♦ద్యానంబులను లసత్ప్రాసాదములనెల్లఁ♦బంతమలరఁ
గాంచుచు భీతిలే♦కయె యిండ్లకేగెను; జవమును బలమును ♦ శ్వసనతుల్య
సత్త్వము వీర్యము ♦ చాలఁగల్గినయాతఁ డంతట మంత్రియై♦నట్టియాప్ర
హస్తునింటికిఁబోయి ♦ యగ్నిని సంధించి యుల్లమహాపార్శ్వ♦నాలయమున
కేగిరి యాయింటికి ♦ నెసఁగుకాలానలజ్వాలలఁబోలిన♦జ్వలనునట్టె
ముట్టించి గురుతేజ♦మునఁ దగుహనుమంతుఁ డంతట వజ్రదం♦ష్ట్రాఖ్య దనుజు
నాలయంబునకును ♦ నవ్వలశుకునిగేహంబునకున్ *మతి♦యందుఁ జాల
విఖ్యాతినిం గాంచి ♦ వెలయుసారణునింటికిని దాఁటి యగ్నిహో♦త్రునిజ్వలింపఁ
గాఁ జేసె; నారీతిఁ♦గా నింద్రజిత్తునిసద్మముఁ గాల్చెఁ గీ♦శప్రభుండు
జంబుమాలిమహాగృ♦హంబు, సుమాలిదౌ భవనంబుఁ గాల్చె న♦ప్పుగిది రశ్మి
కేతుగృహంబును ♦ కీర్తియుతుండగుసూర్యశత్రుగృహంబు ♦ సౌరిపి హ్రస్వ
కర్ణదంష్ట్రులమహా♦గారంబులను, రోమశునియిల్లు మత్తుఁడన్ ♦దనుజగృహము
నట్లె యుద్ధోన్మత్తు♦నాలయంబును, ధ్వజగ్రీవునిదౌదివ్య♦గేహ మంత
విమతుఁడై భయదుఁడై ♦వెలయువిద్యుజ్జిహ్వభవనంబుఁ,గరిముఖు♦వాసమవలఁ
జని కరాళపిశాచ♦దనుజులయిండ్లను, శోణితాక్షునిదైన♦శుభగృహంబుఁ
గుంభకర్ణుగృహంబుఁ; ♦ గోరికమకరాక్షుయజ్ఞశత్రువులగే♦హముల, బ్రహ్మ
శత్రునరాంతక♦సద్మములను, గుంభుభవనంబు, దుష్టుఁడై ♦ వరఁగుచున్న
యానికుంభునిదౌగృ♦హంబును హరిపుంగవుం డగువనిలపు♦త్రుండు తేజ
మలర విభీషణు♦నాలయం బొక్కండుదక్కఁ దక్కినయిండ్ల ♦ నొక్కరీతి
దహియించె; సత్కీర్తిఁ ♦ దగునాకపీంద్రుఁడు పరమమౌనదనవి♦సరమునందుఁ
గలరాక్షసులు భాగ్య♦కలితు లార్జించినసద్వస్తువారంబు ♦ జ్వలనునందుఁ
బడి కాలఁగాఁ జేసెఁ; ♦ బటువీర్య మలరంగ ననిలాత్మజుఁడు దను♦జాలయముల
నన్నింటి దహియించి ♦ యంతట నిలువక రాక్షసేంద్రుండగు♦రావణునిగృ
హంబునకుంబోయె; ♦ నఖిలరత్నవిభూషితంబయి మేరుమం♦దరనిభంబు

* సారణస్య చ ధీమతః-ఆనిమా.

గా నొప్పి సర్వమం♦గళవస్తునిబిడమై, భవనోత్తమంబయి ♦ పరఁగుచుండు
నాభవనంబున ♦ కావీరుఁ డాత్మీయవాలాగ్రమున వెల్గు♦జ్వలనునట్టి
సంధించి ప్రళయాబ్ద♦సంఘంబు తెఱఁగున నార్చెను; నంతట ♦ నగ్నిహోత్రుఁ
డనిలసంయోగంబు♦నందుట నతివేగబలముటఁ బొందుచుఁ ♦ బ్రళయకాల
హుతవహుతీరున ♦ నొప్పి వృద్ధింబొందె; వాయువు, మందునా♦జ్వలనునట్టి
యాయాగృహంబుల♦యందువ్యాపింపఁగాఁ జేయుచుండెను, నగ్ని♦వాయుదేవు
సాయంబునన్ భూరి♦జవమునుబొందుచుఁబురమునందంతటఁ♦బొలయఁజొచ్చెఁ;
గనకగవాక్షముల్ ♦ కల్గి ముక్తామణిమయములౌభూరిస♦ద్మములు కాలి

తే. ధరణిపైఁబడెఁ; బ్రాసాద♦తతులు విఱిగి
పడఁగఁ బుణ్యము క్షీణింపఁ ♦ బటురయమున
సిద్ధుల విమానములు వాయు♦పద్ధతి విడి
ధరణిఁ బడునట్లు కనఁబడెఁ ♦ బురమునందు. ౨౮ 2098

చ. దనుజులు స్వీయగేహముల ♦ ద్రవ్యపరత్వముచేతఁ గావ నొ
ప్పినతమపూన్కి పోవ నభి♦వృద్ధిని బొందెడుసొంపువీడఁగాఁ
జనుచు నయో యితం డగు ని♦జంబుగ నగ్నియె వానరాకృతిం
గొని చనుదెంచె నంచుఁ దమ♦కుం గలభీతిని నార్వ నాధ్వనుల్. ౨౯ 2099

క. తుములంబై వినఁబడియెఁ బు,రమునం దంతటను; నంత ♦ రమణులు ప్రీతిం
దమశిశువులఁ గైకొని ని,ష్ప్రముట్టుకొనియున్న హర్మ్య♦పుంజంబులపై. ౩౦

క. నిలువఁబడియుండి రోదన,ములు చేయుచుఁ దమసుకేశ♦ములు వీడంగా
నిలఁబడిరి వేగముగ; ను,జ్జ్వలసౌధాగ్రములనుండి ♦ వనితలు పడఁగన్. ౩౧

తే. మేఘములనుండి పడుచున్న♦మెఱుపుఁదీఁగె
లో యనఁగఁజూడఁదగియుండి ♦ రాయెడ; నని
లాత్మజన్ముఁడు వజ్రంబు ♦ లమలవిద్రు
మములు వైదూర్యసన్మౌక్తి♦కములు మఱియు. ౩౨ 2102

క. నిరుపమరజతమ్ములు సుం,దరముగ నొప్పారుచుంట ♦ నానావిధని
ర్భరకాంతులఁ దగుభవనో,త్కరమున నగ్నికిని గరఁగి ♦ కనకాదులొగిన్.

తే. కాలిపడుచుండఁజూచె; న♦క్కాలమందు, నెన్నిదారువులుండిన ♦ నెంతగడ్డి
యుండినను దృప్తినొందక♦యుండె నగ్ని, యగ్నియంతజ్వలించిన ♦ నైనదాన.

క. హనుమయు నంతృప్తిని గై,కొనకుండెను భయదదనుజ♦కూటము మృతినిం
గనిపడినభూమియును దృ,ప్తిని బొందకయుండెఁ బురము♦తీరు తొలంగన్.

తే. *మఱియుఁ బురమున నయ్యగ్ని♦మంట లొక్క
యెడఁ బలాశప్రసూనమ♦ట్లెసఁగె నొక్క

---

* క్వచి త్కింశుకసంకాశాః క్వచి చ్ఛాల్మలిసన్నిభాః-అనిమా.

చోటఁ బూరుగుపూవుల ♦ శోభ వెలఁగ
నొక్కచోఁ గుంకుమనుమాళి ♦ యొప్పుఁ గాంచె. 30 2106

క. జవమును మహనీయాత్మ్యముఁ, బ్రవిమలగుణరాజికలుగు ♦ పావని మున్నా
శివుఁడోగిఁ ద్రిపురంబులఁ గాల్చువడువునన్ లంకనెల్ల ♦ శోషిలఁ గాల్చెన్.

సీ. వేగవంతుండయి ♦ వెలయు నాహనుమంతుఁ డాగృహంబులయందు ♦ ననలశిఖల
ముట్టించి విడువంగ ♦ నట్టె యాజ్వాలాళు లాపురంబునకెల్ల ♦ నాశ్రయ మగు
నాత్రికూటమహీధ ♦ రాగ్రంబునన్ భయంకరరీతి వెలిఁగె; నిక్కరణి నగ్ని
యనిలునిఁ గూడి యు ♦ గాంతకాలానలసమవేగమై యభ్ర ♦ సరణినంటె

ఆ. పొగలు లేనిమంట ♦ లెగయుంగ నింద్లను, జుట్టుముట్టి రక్క ♦ సులశరీర
ము లనునాజ్యమునకు ♦ వెలసి వృద్ధినిగాంచె;, నమ్మహాగ్ని దుర్ని ♦ రాకృతిఁ దగి.

క. శతలక్షసూర్యసమవి, ద్యుతు లొప్పఁగ లంకనంత ♦ యున్ జుట్టుచు ను
ద్ధతకులిశసమానధ్వను, లతులితగతి వెలయ బెడిద ♦ మై దుర్భరమై 33½ 2109

తే. వెలయుబ్రహ్మాండమంతయు ♦ విపులశక్తిఁ
బ్రద్దలుగఁ గొట్టినట్లుగ ♦ రాజిలెఁ గడు;
నందు నతిరూక్షకాంతి న ♦ య్యగ్ని కింశు
కప్రసూనచ్ఛవిం దాల్చి ♦ కడఁగె దివము. 34½ 2110

క. తగులుచు నున్నవిధంబున, బెగడుగ వ్యాపించె; గేహ ♦ వితతులు నహియిం
పఁగఁబడి చల్లారెడుతఱి, ని గలుగుపొగ లొలయ మేఘ ♦ నికరము లచటన్.

క. నీలోత్పలవిద్యుతులం, జాలుగఁ గన్పట్టె; నవుడు; ♦ జ్ఞానాధికులై
ప్రాలినదనుజులు కొందఱు, జాలిం గొని యొకటఁ జేరి ♦ స్వపురమునందున్.

సీ. ప్రాణిసంఘంబులు ♦ భవనముల్ వృక్షముల్
క్షణకాలముననె ద ♦ గ్ధమగు టరసి
యీతండు త్రిదశసం ♦ ఘేశ్వరుండయి పొల్చు
వజ్రియో, లేక వై ♦ వస్వతుండో
వరుణుఁడో రుద్రుఁడో ♦ వాయువో, యగ్నియో
ధనదుఁడో, చంద్రుఁడో ♦ తపనుఁడో, తెలి
యంగరాకున్నది ♦ యంతియె కాని వా
నరుఁడు గాఁ డీతఁడు ♦ పరమభయదుఁ
డైన [1]సాక్షాత్కాలుఁ ♦ డగును; లోకేశుఁడై
సర్వంబు ధరియింప ♦ జాలి నాల్గు

తే. మోములన్ వెల్గు బ్రహ్మయే ♦ ముందు దనుజ
తతులఁ జంపఁగ నూహింప ♦ [2]దత్కృద్ధ యిటు

1 న వానరోఽయం స్వయమేవ కాలః-అనిమూ. 2 ఇహాగతో వానరరూపధారీ రక్షోపసంహారకరః ప్రకోపః-అనిమూ.

ప్లవగరూపముఁ దాల్చి యీ♦పత్తనమున
కరుగుదెంచినదా యేమి ♦ యాతురమున. ౩౮॥ 2113

తే ఆద్య మవ్యక్తమును నచిం♦త్యము ననంత
మును సుపూజ్యము వైష్ణవం♦బునగు తేజ
మిట్లు రాక్షసనాశార్థ♦మే స్వమాయ
చేత వానరరూపంబుఁ ♦ జెంది పూనెఁ. ౩౯॥ 2114

క. చనుదెంచెనేమొ యిచటికి, నని తమలోఁ జెప్పుకొనిరి ♦ యాపురమందున్
దనుజులు గుత్తము లరదము, లనూనగజతతులు పక్షు ♦ లఖిలమృగములున్.

క. తరువులు దగ్ధము లగుటన్, బరమార్తిని బొంది యచటి♦ప్రాణితతులు భీ
కరగతి నాక్రోశింపఁగఁ, బరఁగెం దుములముగ నార♦వంబు కడువడిన్. ౪౦

తే. అక్కటా! నాయనా! యంచు ♦ హాకుమార
యనుచు, నాముద్దుపట్టి యం ♦ చనుఁగుమిత్ర
యనుచు, [1]భోగయుతంబు పు♦ణ్యములరాశి
యైనజీవితమా యంచు ♦ నసురులెల్ల. ౪౦॥ 2117

క. అనలార్చులఁ బడి కాలుచు, జనకాదులఁ దలఁచుకొనుచు ♦ శబ్దముచేయన్
నినద మది భీకరంబై, యనూనమై యెల్లయెడల ♦ నావృతిఁ గాంచెన్. ౪౧

చ. [2]హనుమ యనూనకోపమున ♦ నాపురమంతట నిప్పుమంట లొ
య్యన మితిమీఱి చుట్టుకొన ♦ నాసురవీరులు చావ, యోధులె
ల్లను గలగుండునొందఁగను ♦ లంకయు శాపముచేతఁ ద్రుంగెనో
యనునటులుండె; సంభ్రమభ♦యంబులఁ జింతలఁ గుంది రాక్షసుల్. ౪౨

తే. ఆరవంబులు చేయ హు♦తాశనశిఖ
లెల్లఁ జుట్టుకొనన్ దను♦జేంద్రపురము
[3]బ్రహ్మకోపంబునం బుట్టు♦ప్రళయవహ్ని
దగ్ధమగుభూతలంబట్లు ♦ తనరుచుండ. ౪౩ 2120

క హనుమ మహామతి కాంచెను;, ఘనతరుయుతవనము విఱిచి ♦ కదనంబున నా
దనుజేంద్రులఁ జంపి, నికే,తనరత్నమయంబుగాఁగఁ ♦ దగు నాలంకన్. ౪౩॥

క. అనలార్చులచేఁ గాలిచి, యనిలాత్మజుఁ డూరకుండె; ♦ నంతఁ ద్రికూటం
బను శైలశిఖరభాగం,బునఁ జిత్రతరంబుగాఁగఁ ♦ బొలుచు నవనిపై. ౪౪॥

క. [4]తనరారువానరోత్తముఁ, డనిలజుఁ డాత్మీయవాల♦మందుఁ బొలుచునా

1 హా జీవితం భోగయుతం సుపుణ్యమ్-అనిమూ. 2 హనూమతః క్రోధబలాభిభూతా బభూవ శాపోపహతేవ లంకా-అనిమూ. 3 స్వయంభుకోపోపహతా మివావనిమ్-అనిమూ. ప్రళయే భగవతా దగ్ధా మిత్యర్థః-అనివ్యాఖ్య. బ్రహ్మశబ్ద మిట భగవచ్ఛబ్దార్థ మని గ్రహింపఁదగు. 4 వ్యరాజతాదిత్య ఇవాంశుమాలీ-అనిమూ.

యనలార్చులు కిరణములై, కనఁబడఁ గిరణావృతార్కు♦కరణి వెలింగెన్. ౪౫

చ. ఘనమతియైన యాహనుమ ♦ కర్బురసంఘముఁ ద్రుంచి భూరివృ
క్షనిచయమా వనంబు నతి♦సత్వము పొంగఁగఁ బాడుచేసి యా
దనుజులయిండ్ల కగ్నియిడి ♦ [1]తా మది రామునిఁ జేరఁబోవఁగో
రెను; బ్లవగౌఘముఖ్యు నుర♦రీకృతరామపదారవిందునిన్. ౪౬ 2124

చ. అనిలసమానవేగుని, మ♦హామతి, శ్రేష్ఠుని, వాయుపుత్త్రు నా
హనుమను దేవతాగణము ♦ నాదృతిమీఱ నుతించె; నంత న
వ్వనచరముఖ్యుఁ డెంతయును ♦ భవ్యసుతేజుఁ డశోకనామకం
బును గడుఁబాడుచేసి యరి♦ముఖ్యులఁ జంపి రణాంగణంబునన్. ౪౭ 2125

క. సురుచిరలంకాపురమును, గరమర్థి దహించి వెలిఁగె; ♦ గంధర్వులు ని
ర్జరసిద్ధమానివర్యులు, పురమును దగ్ధమును గాంచి ♦ పొంగిరి వేడ్కన్. ౪౮

క. భూతములన్నియుఁ గపివరు, వాతాత్మజుఁ గాంచి [2]కాల♦వైశ్వానరుఁ గాఁ
జేతస్సుల నెంచి మహా,భీతింగనె; నంత దేవ♦బృందమునిపతుల్. ౫౦ 2127

తే. యక్షవిద్యాధరులును భూ♦తాళి నాగ
తతులు గంధర్వు లట్లుప♦త్తనము దగ్ధ
మగుట కెంతయు సంప్రీతి ♦ నందిరి మును
పెన్నఁ డెఱుఁగనిరీతిని ♦ నిచట హనుమ. ౫౧ 2128

ఏఁబదినాలుగవ సర్గము సంపూర్ణము.

---

## ౫౫ - వ సర్గము.

హనుమంతుఁడు సీతనెలవొంది పయనమున కభిముఖుఁ డగుట.

క. బలమలర లంకనంతయు, జ్వలనున కాహుతిని జేసి ♦ సాగరమునయం
దలరుచు వాలము ముంచి య,నలునిం జల్లార్చె; ననిల♦నందనుఁ డంతన్. ౧

తే. అగ్నికాహుతియై చెడి ♦ యనుసు లార్తి,నంది భీతిలఁగా నున్న♦యాపురమును
గాంచి తనలోన నీరీతిఁ♦గా విచార,పరతఁ బూనెను; వతనిహృ♦త్పద్మమందు ౨

క. తొలుత భయ మంకురించె న,వల మదిలో నీచమగుచుఁ ♦ బరఁగువనిని ని
మ్ములఁ జేసినాఁడఁగాయని, తలపోయుచుఁ దిట్టుకొనియెఁ ♦ దానై తననే. ౩

క. పురిఁ గాల్చితి నికార్యము, పరమంబనిచేసితి నిది ♦ బాగే యని లో
విరతింబొందెను; మఱి యెవ్వరు కోపము వృద్ధిఁబొంద ♦ వారకయపుడే. ౪

క. అనలుని దీప్తుని నీటను, ననువొందఁగ నార్చునట్టు ♦ లాకోపంబున్

---

[1] జగామ రామం మనసా మహాత్మా-అనియూ. [2] కాలాగ్నిరితి సంచిత్య సర్వభూతాని తత్రసుః-అనియూ.

మనమున నడంచుకొందురో, ఘనమతు లాపురుషవరులె ♦ గద పుణ్యాత్ముల్.

సీ. [1]ఎవఁడు కోపంబంది ♦ యెంతయేఁ బాపంబు చేయకుండును? పాప♦చింత లేక
క్రుద్ధుండ డైనచో ♦ గురువును జంపును, గోప మొందినయెడఁ ♦ గ్రూరవాక్య
ముల నధిక్షేపించు♦నిలసజ్జనుల నైన; నాగ్రహంబొందిన ♦ నర్హమిద్ది
యిద్ది యనర్హమం ♦ చెఱుఁగఁడు మాటను, గ్రోధికిఁ జేయఁగాఁ ♦ గూడనట్టి

తే. పనియు వచియింపఁ గూడని♦పలుకు లేదు;
పాము జీర్ణత్వచంబును ♦ వదలునట్లు
తనకుఁ గలకోపమును నోర్పు♦ననె యడంచి
పుచ్చునో యతఁడేగద ♦ పురుషుఁ డనఁగ. ౭ 2134

చ. జనకజ యున్న దంచయిన ♦ స్వాంతమునందుఁ దలంప కిట్లు ప
త్తనమున నగ్నిఁ బెట్టితిని ♦ దాననె స్వామివిఘాతుకుండ, దు
ర్మనసుఁడ, లజ్జ నే గనని♦మత్తుఁడఁ, బాపిని, నిస్సిరో కుజీ
వనమిది నాది యేమనుదుఁ ♦ బాపపుఁగార్యమొనర్చినందుచేన్. ౮ 2135

క. పురమేమొ కాలిపోయెను, బరమపవిత్ర యగుసీత ♦ జ్వలనుశిఖల దు
ర్మరణంబు నొందియుండిన, దురంతరంగుఁడను నేను ♦ ద్రోహి నె పతికిన్.

తే. స్వామికార్యంబు చెఱచిన♦వాఁడ నెగద
యెందుకొఱకింతయత్నంబు ♦ నేను జేసి
తినో యదంతయుఁ బాడయ్యె ♦ దివ్యపురిని
గాల్చునప్పుడు సీతను ♦ గావనైతి. ౧౦ 2137

చ. వననిధి దాఁటి జానకి ని♦వాసము గన్గొని దాని రామభూ
పున కెఱిఁగించునట్టి దగు♦భూరితరం బగుకృత్యతంత్రముం
గొని యినుమంతయే మిగులఁ ♦ గోరిక నంతయుఁ జేసినాఁడ నిం
కను దెలుపంగ నోపనియె ♦ గావలయుంగద యిట్టిపట్టునన్. ౧౧ 2138

క. జనకజ మృతినొందుట నీ, పెనుకార్యము చాలవఱకుఁ ♦ బృథుశక్తితగం
బొనరింపఁబడినదైనను, నొనరింపనియట్టు లయ్యె ♦ నొకతప్పున నే. ౧౨ 2139

తే. క్రోధవశుఁడ నైయె యిట్టి♦గొప్పకార్య
మును సమూలము బెఱికితి ♦ ననయమూని;
పురమునం దొక్కభాగంబు ♦ భూరిదహన
శిఖలదగ్ధముగానిది ♦ చేరిచూడ. ౧౩ 2140

క. కనఁబడ దల్లాటను నా, జనకజ మృతిగనియెయుండు ♦ సందేహము లే
దు నగరము భస్మమయ్యెను, గనుఁగొన నా తెలివి లేమి ♦ త్వాసుత యాగ్గెన్.

---

2 యథోరగ స్త్వచం జీర్ణాం సవై పురుష ఉచ్యతే-అనిమూ.

తే. దాన నాకార్యమంతయు ♦ దగ్ధమయ్యె
నిట్టులేయయ్యె నేని [1]యీ ♦ యెడనె నేను
బ్రాణముల వీడుటొప్పు ని ♦ ప్పునియె నాకుఁ
దగినదని తోఁచుచున్న ది ♦ త్తరుణమందు. ౧౩ 2142

సీ. అనలునిమంటల ♦ యందును బడుదునా బడబాముఖంబునఁ ♦ బడుదునా స
ముద్రమునంబడి ♦ మునిఁగి యందలిజంతువులకు నాహారంగ ♦ ములను నాహు
తిగ నిత్తునా; నేను ♦ దేహంబునం బ్రాణములఁ దాల్చి యేమని ♦ యుల వనచర
పతియైనసుగ్రీవు ♦ పరిసరమునకును జన నేర్తుఁ? బూరుష ♦ సత్తములను

తే. నారఘూద్వహులను జూడ ♦ నరుగువాఁడ
నెట్లుతత్కార్యఘాతినై ♦ యింకమీఁద;
నిట్లురోషదోషంబున ♦ నీపురంబుఁ
గాల్చి త్రిజగంబులన్ ఖ్యాతిఁ ♦ గన్న కపిత. ౧౪ 2143

క. [2]వెలిపుచ్చుకొంటఁగాదే, తులువతన మ్మెవుడుచేయు ♦ దోషమునక యి
మ్ములఁ గోఁతిజాతి యనుని, ప్పలుకును సార్థకముచేయు ♦ వాఁడనైయెనన్. ౧౫

తే. సీతఁ గావంగఁదగుశక్తిఁ ♦ జెలఁగియుండి
యును గ్రుధంబూని రక్షింప ♦ కుంటిఁ గానఁ
గట్టుదిట్టములేలేక ♦ కడుస్వతంత్ర
మైనరాజసభావం బ ♦ మానితంబు. ౧౬ 2145

క. ఏమనిచీకొట్టుదు నిఁక;, నామైథిలి మృతిని గనుట ♦ యాలించినచో
రాముఁడు లక్ష్మణుఁడును మృతిఁ, దా మొందంగలరు వారి ♦ దశఁ గనినంతన్.

క. వనచరపతిసుగ్రీవుఁడు, తనబంధులఁ గూడి కాల ♦ ధర్మము నొందున్;
దనసోదరమృతి భరతుఁడు, విని భ్రాతృప్రీతిమీఱ ♦ వెతలం బడుచున్. ౧౮

క. తనయనుజుఁడు శత్రుఘ్నుఁడు, తనతోడంగూడి పొగులఁ ♦ దా జీవింపం
గను నేర్చునెట్లు? ధర్మం,బునఁ దగునిక్ష్వాకువంశ ♦ ము ధర నశింపన్. ౧౯

క. నరులెల్ల దుఃఖతాపో,త్కరపీడితులగుచుఁ గుందఁ ♦ గల రిందులకుం
బరికింప సందియం బే, వరునం గనరాదు; గాన ♦ బహుభంగులచేన్. ౨౦

క. [3]తలఁచిన నిర్భాగ్యుఁడనై, యిలఁ బరఁగితి ధర్మ మర్థ ♦ మీరెంటిని ని
మ్ములఁ ద్రోసిపుచ్చితిని రో,షలతావృతమతిని దోష ♦ నదనుఁడనైతిన్. ౨౧

---

1 ఇహైవ ప్రాణసన్న్యాసో మమాపి హ్యద్య రోచతే-అనియూ. ప్రాణసన్న్యాసః ప్రాణత్యాగః-అనివ్యాఖ్య. 2 ప్రథితం త్రిషు లోకేషు కపిత్వ మనవస్థితమ్-అనియూ. అనవస్థితం-చాపలాత్మక మిత్యర్థః-అనివ్యాఖ్య. 3 రోషదోషపరీతాత్మా-అనియూ. పరీతశబ్దార్థిచే నిటఁ దెఱఁగున దోషమునఁ లతాత్వ మారోపితమని యెఱుంగునది.

ఆ. విశ్వనాశకరుఁడ ♦ విదిత మీయదియయ్యె;
నను నుఁ జింతచేయు♦నతనికి మును
మదికిఁ దోఁచియున్న♦మంచిశకునము లే
స్పష్టములుగఁ గానఁ♦బడియె నపుడు. ౨౨ 2151

క. మనమున మరలఁ దలంచెను, హనుమంతుం డొక్కవేళ ♦ నామంగళరూ
ప నితాంతప్రియదర్శన, యనూనలావణ్యరాశి ♦ యాజనకజయున్. ౨౩

క. తన తేజమె రక్షింపం, గను నాశంబందకుండఁ♦గలదు జ్వలనుఁ *డ
గ్నిని గాల్పఁడు; ధర్మాత్ముం, డనూనతేజుఁడగు రాము♦నతివను సీతన్. ౨౪

క. తనసత్పతివ్రతమునన్, బనివడి రక్షింపఁబడెడు♦పావనచిత్తన్
గని పావకుండు స్పృశియింపను శక్తుఁడు గాఁడు; జ్వలను♦పని కాల్చుటయే.

తే. అట్టిదహనుండు ననుఁ గాల్పఁ ♦ డరయ నిద్ది
రామచంద్రప్రభావంబు ♦ రమణిపుణ్య
మివ్వికాల్పకయుండఁగా ♦ నిపుడు చేసె
నిశ్చయంబగు నీయూహ ♦ నిజమునిజము. ౨౬ 2155

క. భరతాదులకున్ ముగురికిఁ, బరదేవత యగుచు రామ♦భద్రునిప్రియసుం
దరి యగుచు నలరుజానకిఁ, దరమే నశియింపఁజేయ ♦ ధాతకునైనన్. ౨౭

సీ. దహనమే పనిగాఁగఁ ♦ దగుహవ్యవాహనుం డాత్మశక్తికి నెప్డు ♦ డడ్డులేక
వ్యయమనునది లేక ♦ వఱలువాఁడై యుండి నావాలమునుగాల్ప ♦ నేవిధమునఁ
జాలకున్నాఁడుగా ♦ సాధ్వినిఁకసీత దహియించునే యెవ్వి♦ధమున నైన;
ననుచుఁ జింతించె నా♦హనుమయు విస్మితుండై సాగరాంతర♦మందుఁ దనకుఁ
ఆ. గానఁ బడినయట్టి♦మైనాకభూధ్రంబు, మరలఁ దలఁచుకొనుచు ♦ మదిని నిట్లు
తలఁచె; స్వీయతపము♦వలన సత్యంబున, భర్తృతత్పరతను ♦ భవ్యమతిని. ౨౮

క. జనకజ యగ్నిని గాల్పం, గను జాలునుగాదె, యగ్ని ♦ కాల్పఁగలఁడె యా
వనితామణి ననితలఁచెను;, హనుమంతుం డిట్లుజనకు♦నాత్మజమహిమన్.

క. మనమున నెన్నుచు నచటన్, వినియె మహాత్ములయి ఖచర♦బృందంబునఁ గీ
ర్తినిగన్నచారణులవాక్యనికరముల నిట్లు; వారు ♦ కడువిస్మితులై. ౩౦ 2159

క. ఔరా! హనుమంతుఁడు దు,ర్వారబలోపేతుఁడైన♦రాక్షసుల లస
ద్భూరిగృహంబుల కెల్లను, దారుణశిఖిఁ బెట్టి యెట్టి♦ధైర్యయుతులకున్.

తే. చేయసాధ్యముగానియీ♦చిత్రకార్య
మును దగంజేసె నాశ్చర్య♦ముగద యిద్ది;
దనుజులును స్త్రీలు బాలవృ♦ద్ధతతు లార్తిఁ
దొలఁగి చనుచుండఁ దనసొంపు ♦ తొలఁగిపోవ. ౩౨ 2161

---

* నాగ్నిరగ్నౌ ప్రవర్తతే- అనిమూ.

క. [1]జనకోలాహలముల కొ, య్యనఁ బర్వతగుహాలు ప్రతిగ ♦ నారవములు చే
యు నిపుడు లంకాపురమిది, యనూనదైన్యమున నేడ్చు♦నట్లున్నదిగా. ౩౨

క. [2]పురిసాట్టప్రాకారో,త్కరతోరణ యగుచు నిపుడు ♦ దహింపఁబడెఁ
దరుణీమణిజానకి యు,చ్చైరువుగ దహింపఁబడక ♦ చెలఁగెడు సహాహా. ౩౩

సీ. హనుమంతుఁ డామాట ♦ లాలించి సఫలంబు లైననిమిత్తాళి ♦ సవనితనయ
సద్గుణాళులు రామ♦చంద్రుమాహాత్మ్యమి మొదలగుకారణం♦బులను, జార
ణోక్తుల సీతకు ♦ నొక్కయాపదయును గలుగ లేదని హర్ష♦కలితుఁ డయ్యె;
నంత నాతఁడు తాను ♦ నటవచ్చియున్న కార్యంబుఫలించి ధ♦రాకుమారి

ఆ. యగ్నిబాధలేక ♦ యలరుచుండుట కెఱింగి
మరలఁ గన్నులలర ♦ మానినిఁ గని
పయన మొనరుపంగఁ ♦ బరమచిత్తంబునఁ
దలఁచె రాముఁజూడ ♦ నలరువేడ్క. ౩౪ 2164

ఏఁబదియైదవ సర్గము సంపూర్ణము.

---

## ౫౬ - వ సర్గము.

హనుమంతుఁడు సీతయనుమతిం గైకొని పయనము చేయఁబూనుట.

క. అనిలజుఁ డంతట నవ్వన, మున నావృక్షంబుక్రింద ♦ మోడ్చినకేలం
గనుపట్టు సీతకడకుం, జని మ్రొక్కి మదీయభాగ్య♦నరణిని నిన్నుఁ. ౧ 2165

క. నిరపాయంబుగ నుండుటఁ, బరికించితి ననియె; సీత♦పయనముచేయం
ద్వరపడుహనుమంతునిఁ గని, పరమపతిప్రియత నెఱపఁ♦బల్కె నతనితోఁ. ౨

క. పరవీరహా! మహాత్మా!, పరులఁ వధియించి నన్ను ♦ భర్తకడకు న
త్వరగతిఁ గొనిపోవఁగ నొ,క్కరుఁడవె చాలుదువు నీవు ♦ కడిఁదిబలంబుఁ.

క. కనఁబఱచితి విది నీకుఁ, ఘనకీర్తి నొసంగఁగలదు♦గాని రఘుపతీం
ద్రునకుం గాదుకదా; విను, మనఘా! రిపుహరుఁడు భూవ♦రాధిపుఁ డతఁడే. ౩

క. చనుదెంచి యిచటి కుజ్జ్వల, ఘనశరముల లంకఁ గలఁచి ♦ కాంతను నన్నుం
గొనిపోవునేని గాకుత్థ్సున కతనికి సదృశ మిద్ది ♦ శుభగుణనిలయా! ౪ 2169

చ. అనిమొనవీరుఁడై మఱి మ♦హాత్ముఁడునై తగురామమూర్తియే
తనకు సమానమౌవిధిని ♦ దారుణసంగరమందు విక్రమం
బును నెఱపంగఁజాలునటు♦పూని యొనర్పుము నీవె యంచు నా
జనకజ యర్థవంతమయి ♦ సద్వినయాన్వితమై సహేతుకం
బునునయి యొప్పువాక్యమును ♦ బూన్కి వచింపఁగ నాలకించుచుఁ. ౫

---

1 జనకోలాహలాధ్మాతా క్రందంతీ వాద్రికందరే-అనిమా. 2 జానకీ నచ దగ్ధేతి-అనిమా.

చ. అనిలజుఁ డిట్లుపల్కె; విను ♦ మంబ వలీముఖభల్లుకాదివా
హీనులనుగూడి వేగమున ♦ నిచ్చటికిం జనుదెంచి సంగరం
బున రిపులన్ జయించి వగఁ♦బొందెడునిన్ను ముదబ్ధిఁ దేల్చు నా
యినకులసంభవుండనుచు ♦ నివ్విధిఁబల్కుచు నూఱడింపుచున్. ౮ 2171

క. తనవిభునిచెంతకుం జను,మనమున వందనముచేసె ♦ త్క్ష్మాపుత్రికిఁ న
వ్వనచరవీరుఁడు శ్రీరా,మునిఁ గన్గొనఁ దమకపడుచు ♦ మోము వెలుంగన్.

క. ఘనగిరివైనయరిష్టం,బును నెక్కెను శత్రుహంత; ♦ పొడవుగ నదియున్
*వనజచ్ఛాయలఁ దగున,వ్వనపంక్తులు నీలములుగఁ ♦ బరఁగుచు నుండన్.

ఆ. చిత్రయుక్తమగుచుఁ ♦ జెలఁగుచుఁ గట్టువు
ట్టమునుగూడి తగువి♦ధముగ నుండె;
శృంగమధ్యమమునఁ ♦ జెలఁగి వ్రేలాడుమే
ఘముల సోత్తరీయ♦కముగ నలరె. ౧౦ 2174

క. ఖరకరుఁ డాత్మకరంబుల, ధరాధరము దానిఁ బ్రీతి ♦ తనరఁగ నిదియాఁ
దరుణము మేల్కొన నని చి,త్తరంజనముగాఁగఁ దెలుపఁ♦దగి నట్లుండెన్ ౧౦౪

క. గిరియందుఁ గ్రాలుధాతూ,త్కరములఁ జూడంగ రవియుఁ ♦ గరములఁ దెలుపన్
ధరమద్ది కనులువిప్పుచు, ధరణిం గనునట్లు చెప్పఁ♦దగి యలరారెన్. ౧౧

సీ. నిర్ఝరజలపూర♦నినదముల్ గంభీరముగఁ బర్వ వానిచేఁ ♦ దగ శ్రుతులను
జదువుచున్నట్లుండె, ♦ స్పష్టంబుగాఁ బలువిధముల నందొగి ♦ విపులములగు
ప్రస్రవణాలిని♦స్వనములచేతఁ జక్కఁగఁ బాడుచున్నట్లు ♦ కానఁబడియెఁ;
మింటికిఁ బెరుగుచు ♦ మించినయా దేవదారుద్రుమంబులఁ ♦ దగఁ గరములు

ఆ. పైకి నెత్తి తపము ♦ పరమంబు సల్పెడు, కరణి నొప్పుచుండె; ♦ గాఢసాను
పతితజలరవములఁ ♦ బటువుగఁ దిట్టెడు,భంగి నొప్పుచుండెఁ ♦ బర్వతంబు. ౧౩

సీసమాలిక:—

శ్యామవర్ణంబులై ♦ సాంద్రంబుగా శరత్కాలపుష్పితములై ♦ క్రాలుచున్న
సప్తపర్ణసుమాళి♦సర్వస్థలంబుల గాలికిఁ గంపింపఁ♦గా ముదిమిని
వడఁకుచున్నట్లుండె ♦ వాయువు తాఁకున ధ్వనిచేయుకీచక♦తతుల నద్ది
కూయుచున్నట్లుండెఁ;♦ క్రూరసర్పంబులు నిట్టూర్పువాయువుల్ ♦నిగుడఁ జేయ
హనుమంతుపైఁ గల్గు♦నాగ్రహంబున నె నిశ్వాసమ్ములం బుచ్చు♦చందమునను
గనఁబడెఁ, దుహినముల్ ♦గ్రమ్మి గంభీరంబులయి నిస్వనములఁ జే♦యనిగుహలను
గనుఁగొన నింద్రియా♦ఘము నడ్డి ధ్యానము చేయుచున్నట్లుండెఁ ♦ జిత్రరీతి;
జలదావరోహాళి♦సమతనొప్పెడులనత్ప్రత్యంతగిరు లను♦పాదములను

* తుంగపద్మకజుష్టాభి ర్నీలాభి ర్వనరాజిభిః - అనిమూలము. పద్మకాః పద్మవర్ణా ద్రుమాః- అనివ్యాఖ్య.

జరియింప నుంకించు♦చందంబుగా నుండె, నభ్రంలిహంబులై ♦ యలరుశిఖర
ములచేత నవయవం♦బులను విదుప్చుచు నున్నట్టు లాగిరి ♦ యొప్పుచుండె;
బహుకందరంబులఁ♦బరఁగుతచ్ఛిఖరముల్ హనుమంతు పదవేగ♦మునకుఁ గలఁగి
క్రొత్తశోభలను గ♦ల్గువిధంబునం జేయునుండె దానికి, సుశ్రీ♦యును బొడవగు
నశ్వకర్ణంబులు ♦ నశ్లెసాలంబులు తాళముల్ వంశముల్ ♦ దానిఁ జుట్టి
యుండెను, బుష్పంబు♦లొప్ప విస్తృతములై తగులీఁగజొంపముల్♦దాని కొక్క
సొంపును గల్గించు♦చును బొల్చె; నయ్యద్రి బహుమృగగణములు♦పరఁగుచుండె
ధాతువుల్ కారుచుఁ ♦ దగువన్నెఁ గల్పించుచుండెను, సెలయేఱు♦లు సుతరశిల

తే. లాగిరీంద్రమునిండుగ ♦ నమరియుండెఁ, బరమమానులు గంధర్వ♦పటలములును
యక్షకిన్నరఫణివరు♦లందుఁ జెలఁగు,చుండి రుర్వీజలతలను ♦ నొగిఁ జెలంగి.

క. గిరికందరముల సింహో,త్కరములు నిబిడంబులగుచుఁ ♦ గన్పడెను భయం
కరములగువ్యాఘ్రములును, బరఁగుచు నెల్లరకు భీతిఁ ♦ బడయుం జేసెన్.

క. సురుచిరఫలవృక్షంబులు, వరమూలంబులును నందు ♦ భాసిలుచుండెన్
మరుదాత్మజుఁ డాగిరి రఘు,వరుఁ గనుకౌతుకము తన్నుఁ ♦ ద్వరపెట్టంగన్.

క. ఆరోహించెను; నంతట, మారుతి రమ్యాద్రిసాను♦మండలములఁ బెం
పారుశిలౌఘంబులఁ దన,భూరిపదంబులను ద్రొక్కఁ♦బూనఁగ నవియున్. ౨౧౪

క. ఘనరవములఁ బిండిగనయి, వనధింబడఁజొచ్చె; నంత ♦ వనచరవర్యుం
డును శైలవరము దానిని, దనగతివెలయంగ నెక్కి ♦ తనమదిలోనన్. ౨౨౪

తే. యామ్యతీరంబునుండి సౌ♦మ్యమగుతీర
మునకుఁ జనవేఁడి మేనుఁ బెం♦చెను ఘనముగఁ;
బవనసుతుఁ డిట్టులాగిరి♦వరము నెక్కి
ఝుషఫణివ్రజభీమమా♦జలధిఁ గాంచె. ౨౭ 2183

క. వనచరతిలకుఁడు పవనుని, తనయుం డుత్తరతటంబు ♦ దక్షిణతీరం
బుననుండి చేర నాకస,మున కెగసెను వాయువట్లు ♦ మోదము చెలఁగన్. ౨౮

తే. అప్పుడాగిరివర్యంబు ♦ హనుమచేతఁ
బీడితంబయి శిఖరముల్ ♦ వృక్షములును
వడఁకఁద్రెళ్లఁగఁ దనయందు ♦ వఱలు జంతు
సమితితోఁగూడఁ దాను ని♦స్వనము లొప్ప. ౨౯ 2185

క. ధరణికి సమముగఁ గ్రిందికిఁ, దర్దరఁగ్రుంగెను; వతనితొడల♦వడికిం బుష్పో
త్కరయుతపాదపములు సుర,పవువజ్రప్రహతిఁ గూలు♦భంగి నిలఁ బడెన్.

క. గిరికందరాంతరంబులఁ, బరాక్రమము నొప్పునున్న♦పంచాస్యము ల
మ్మరుదాత్మజుపదపీడన్, భరింపలే కార్వ నార♦వంబు భయదమై. ౩౧ 2187

క. అనిలపథంబును బ్రద్దలు, గను జేయుచు వినఁగఁబడియె ♦ త్క్ష్మాధరమందున్

గనఁబడువిద్యాధరవర, వనితలు వస్త్రములు జాఱ ♦ బహుభూషణముల్. ౨౯

ఆ. తాఁ బుమాఁబుపడఁగఁ ♦ దటుకున నాపర్వ, తమ్మునుండి యాఁక♦సమ్మునకును
నుద్గమించి; రంత ♦ నురుతనువులు దీప్త, జిహ్వ లొప్ప విషము ♦ చిచ్చుపగిది.

క. చెలఁగంగ నొప్పుసర్పం, బులు శిలలును మెడలు పగుల ♦ ముడుచుకొనుచు బా
ధలనంది పొరలుచుండెను;, గలఁగుచుఁ గిన్నరులు నురగ♦గంధర్వవరుల్. ౩౧

తే. యక్షవిద్యాధరులుఁ బవ♦నాత్మజాభి
పీడితం బైనయాగిరి ♦ వీడి యాఁక
సమున కెగసిరి; తరుశిఖ♦రముల వెలసి
యున్నతము శ్రీయుతంబునై ♦ యొప్పుగిరియు. ౩౨ 2191

క. బలవంతుఁ డైనపావని, వలనం దగుబాధనొంది ♦ పాతాళంబుల్
గలఁగుచుఁ జొచ్చుచు వసుధా, తలమునకు సమంబుగాఁగఁ ♦ దాఁ గనుపట్టెన్.

క. పదియామడలవెడల్పును, బదినేఁ మూఁడింటఁ బెంప♦వచ్చుగణనతో
డఁ దగినపొడవును గలగిరి, యది ధరణికి సమముగాఁగఁ♦దద్దయుఁ గ్రుంగెన్.

తే. అలలవరుసలు తటమును ♦ నట్టెకొట్ట
భయదమై యొప్పుచున్నల♦వణసముద్ర
మును సలీలముగా దాఁటు♦మనసునఁ బవ
నాత్మజుఁడు మింటి కెగసె ధై♦ర్యంబు పొంగ. ౩౫ 2194

ఏఁబదియాఱవ సర్గము సంపూర్ణము.

---

౫౭ - వ సర్గము.

హనుమంతుఁడు సముద్రము దాఁటి జాంబవదాదులను గనుఁగొనుట.

సీ. శశి తెల్లకల్వఁగా ♦ సరసిజమిత్త్రుండు
జలకుక్కుటంబుగా ♦ శ్రవణపుష్య
తారకాద్వయము కా♦దంబంబులుగ, మఱి
జలదముల్ శైవాల♦శాద్వలంబు
లుగఁ, బునర్వసు వనఁ♦దగుతారయును మహా
మీన మట్లుగ, భూమి♦సూనుఁ డతుల
కాయంబుగల్గిన♦గ్రాహంబుగా, మఱి
యైరావతము ద్వీప♦మై తనరఁగ,
స్వాతినాఁ దార, హం♦సవిలోలితంబుగ,
శ్వసనసంఘాతసం♦జాతములయి
వీచీసమంబులౌ♦విధుకరములు శీత
జలములుగాఁ దగఁ ♦ బలువిధంబు

లైనఛాయలనొప్పు♦యక్షగంధర్వోర
గులు ఫుల్లనీరజో♦త్పలములుగను,
దనర నపారమై ♦ వనధిపోలికనున్న
గగనంబు వాయువే♦గమునఁ బొల్చు

తే. హనుమ యాయాసమే లేక ♦ యపుడు పెద్ద
యోడ సంద్రముదాఁటున ♦ ట్లొప్పుమీఱ
దాఁటెః శ్రీమంతుఁడగువాయు♦తనయుఁ డంత
నంబరము మ్రింగఁజూచెడు♦నట్లు పూన్కి. ౪౹ 2195

క. వనజారినఖంబులఁ జీల్పను బూనినయట్లు, తార♦లను సూర్యునితోఁ
గనుపట్టునట్టియాకస,మును హరియించునటు మేఘ♦ములసంతతులన్. ౫౹

క. ఆకర్షించెడురీతిని, నాకాశమునందుఁ దాను ♦ నరిగెఁ దిరుగుచున్;
బ్రాకట తేజుండయి ఘనుఁ,డాకపివరుఁ గాంతిపొలయ ♦ నటమేఘంబుల్. ౬౹

ఆ. అరుణపాండరములు ♦ నసితమాంజిష్ఠముల్
హరితకృష్ణలోహి♦తాంగకంబు
లగుచు వెలసె; నంత ♦ నభ్రజాలంబులఁ
జొరఁగఁబడుచు వానిఁ ♦ దవ్వర విడుచుచు. ౭౹ 4198

క. ఘనజాలపినద్ధుండై, కనఁబడకయె యుండి మరలఁ ♦ గానఁబడెడుచం
ద్రునిరీతి నమరియుండెను;, హనుమయుఁ గపివీరుఁ డంబ♦రాంతరమందున్. ౮

క. సితవస్త్రంబును దాలిచి, వితతాంబుదరాశి వేగ ♦ విరియించుచు ను
దతిమీఱఁ బోవుటన్ క్షణ, మతఁడటఁ గన్పడుచు మరల ♦ నంతర్హితుఁడై.

క. చనుచున్నచంద్రురీతిని, గనఁబడుచున్ వెలుఁగుచుండెః ♦ గాలికొమరుఁ డా
హనుమయు మాటికిమాటికి, ఘనముల విరియించి దారిఁ ♦ గైకొని వానిన్.

తే. చొచ్చుచున్ వీడుచున్ మేఘ♦శుంభదుగ్ర
నినద మట్లుగ నార్చుచు ♦ నింగి గరుడు
పోల్కిమీఱఁ బ్రకాశించె; ♦ భూరి తేజుఁ
డై నయాతఁడు భీకర♦దానవాళి. ౧౦౹ 2201

చ. అని వధియించి స్వీయసుగు♦ణాహ్వయమున్ వెలయించి వత్తవం
బును గలగుండునొందునటు ♦ పూనికఁజేసి సురారినాథు నా
ర్తిని గలఁగంగఁజేసి యతి♦తీక్ష్ణపరాక్రములైనవీరులన్
బెనువగనొందఁ గూర్చి పృథి♦వీసుతకుం దమి మ్రొక్కి యంతటన్. ౧౧

క. వనరాశ్యంతరమున వే, చనుచుండెన్; వీర్యమలర ♦ శ్వసనతనయుఁ డ
ద్రిని మైనాకంబును నొ,య్యనఁ గరమునఁ దాఁకి యతని♦నట వీడ్కొనుచున్.

క. జ్యాముక్తశరమువలె నుద్దామగతిం బోయె; నట్లు ♦ తగువడిఁ జని యం

దామారుతి మేఘమువలె, భీమం బగునామహేంద్ర♦పృథ్వీధరమున్. ౧౪

క. కని సంతోషంబున నా,ర్చెను; నీగతిభూరిరవము ♦ చెలఁగ నటుచునున్
ధ్వని దాని దిశల నించెను;, వనచరపంచాస్యుఁ డంత♦వఱలుచుఁ జెంతన్. ౧౫

క. తనమిత్రులుండ వారలఁ, గనఁగాఁ జనె వార్తఁదెల్పు♦కౌతుకమున; నం
త నతండు సింహనాదం, బొనరిచి వాలమును ద్రిప్పె ♦ నురువేగమునన్.

క. గనుడుఁడు తిరిగెడున న్యం,బరమున నార్వంగ నార♦వంబున కట భా
స్కరమంకలంబుతో నం,బరమెల్లను బగులునట్టి♦వడువున నుండెన్. ౧౬

క. వననిధ్యుత్తరతీరం,బునఁ బావనిఁ జూచుకోర్కె ♦ పొదలుచునుండన్
మునువున్నమహాబలులా, వనచరులూరు లొగిఁ దద్ర♦వంబును మునుతన్. ౧౭

క. అనిలప్రేరితఘనగ,ర్జనమున కుద్దియగుదాని ♦ సాంద్రామోదం
బును దెల్పుదాని మఱి యా,తనియూరుజవంబు వినిరి ♦ తత్సనుయమునన్.

క. ఏవార్త వినుదుమో యని, యావనచరు లెల్ల దీను♦లై యుండుటచే
నావాయుతనయునినదము, లావారిదరవముఁబోలి ♦ యలర విని రటన్. ౨౦

క. వనచరులంతఱు నార్చెదు, హనుమద్గళరవమునకై ♦ యాలించి సఖున్
గనఁగోరి సంభ్రమంబులఁ, గనుచుండిరి హనుమరాకఁ ♦ గడు శుభదంబున్.

క. హరివరుఁడు జాంబవంతుఁడు, పరమముదం బార నచటి♦ప్లవగోత్తములన్
ద్వరఁ బిల్చి యిట్టులనియెను;, హరివరులారా! సమీరు♦నాత్మజుఁ డందున్.

తే. సర్వవిధములఁ గార్యంబు ♦ సఫలమైన
దానిగాఁ జేసికొని తాను ♦ తరలివచ్చు
చున్న వాఁ డించుకైన నిం ♦ దుండఁబోదు
సంశయము, కార్య మద్ది ని♦ష్ఫలమెయైన. ౨౩ 2214

క. ఇతనిగళస్వన మిపుడీ, వితమున నుండంగఁగలదె; ♦ విదితముగా దే
కృతకృత్యుఁడౌట దీనన్, గతసంశయులము గు టిపుడు ♦ కర్తవ్య మగున్.

క. [1]వనచరులంత మహాత్ముని, ఘనబాహూరుయుగ వేగ♦గాఢరవములన్
గని విని సంతసమున నొ,య్యన గంతులు వేయ సాగి♦రందందు వడిన్. ౨౪

క. [2]వనచరు లతిసంతోషం,బున వృక్షమునుండి వృక్ష♦మునకున్ శిఖరం
బుననుండి శిఖరమునకున్, ఘనగతిచే నెగిరి యొకటి♦గాఁ జేరి రొగిన్. ౨౫

చ. [3]హనుమను జూడఁగోరి యిటు ♦ లాకపులెల్లరు భూరుహాగ్రముల్
గొని యటఁ గూరుచుండి యొక♦కొంతపథంబున నుండివచ్చుమి
త్రనికరముం గరంబు వడి ♦ రమ్మనిపిల్వఁగ వస్త్రముల్ కరం

1 తస్య బాహూరువేగం చ నినాదం చ మహాత్మనః-అనిమూ. 2 తే నగాగ్రా న్నగాగ్రాణి శిఖరా చ్ఛిఖరాణిచ-అనిమూ. 3 వాసాంసీవ ప్రశాఖాశ్చ సమావిధ్యంత వానరాః-అనిమూ. సమావిధ్యంత, పర్యభ్రామయన్-అని వ్యాఖ్య.

బునఁ గొని వీచున ట్లచటి♦భూజములందగు చిన్నకొమ్మలన్
హనుమకుఁ గానుపించునటు ♦ లాదృతి నూఁచిరి వేడ్కఁ బొంగఁగన్. ౨౬

క. గిరిగుహలఁ జేరి వాయువు, విరావముం జేయునట్టి♦విధమున బలవ
న్మరుదాత్మజుండు గర్జించె రహిన్ దమవార లెల్లఁ ♦ జింతలఁ బాయన్.

తే. మేఘసముదాయమట్టులు ♦ మింటినుండి
వచ్చునాకపివీరుని ♦ వరుసఁ గాంచి
[1]ప్రాంజలులు గ్రాల వనచరు♦లంద ఆచట
నిలిచియుండిరి హర్షంబు ♦ లోలయుచుండ. ౨౮ 2220

చ. ధరణిధరాభుఁడై జవము ♦ తద్దయు నొప్పఁగ నాంజనేయుఁ డా
తరునిబిడాద్రిశృంగమునఁ ♦ దా నట వ్రాలెను; మిత్రదర్శనా
దరమునఁ బూరితంబయి ని♦తాంతము పొంగుమనంబుతో మనో
హరగిరినిర్ఝరంబు కడ ♦ నభ్రపథంబుననుండి యాతఁడున్. ౩౦ 2221

తే. [2]ఛిన్నపక్షంబు గాఁదగు♦శిఖరిరీతి
నంచు వ్రాలెను; నంతట ♦ నాకపులొగి
మదుల మిక్కిలిమోదంబు ♦ పొదల నమ్మ
హాత్ము సేవించి సంతుష్టి ♦ నంది రపుడు. ౩౧ 2222

చ. వనచరు లంత క్షేమముగ ♦ వచ్చిన వాయుతనూజుఁ గాంచి యా
తనికి ఫలాళిమూలసము♦దాయముఁ దెచ్చి యుపాయనంబుగా
మనములఁ గల్గుతృప్తిని స♦మర్పణముం బొనరించి సంతసం
బునఁ దమమోము లొప్పఁగను ♦ బూజలు సల్పిరి; వాయునూనుఁడున్. ౩౩

సీ. అంతట జాంబవ♦దాదులౌ గురువృద్ధులకు, నంగదకుమారు♦నకును మ్రొక్కి
వారిచేఁ బూజలఁ ♦ బడసి యాకపులచే నలరింపఁగాఁబడి ♦ యచటఁ గంటి
[3]సీతను నే నని♦చెప్పి సంక్షేపంబుగా శుభవార్త; న♦క్కపివరేణ్యుఁ
డంతట వాలిజుం♦డైనయంగదుకరమ్మును గ్రహియించి యి♦మ్ముగ మహేంద్ర

తే. ధరమునన్ రమణీయమై ♦ పరఁగువనము
నందుఁ గూర్చుండె నవ్వల ♦ హనుమ మోద
మలర నక్కపివర్యుల ♦ నాదృతిఁ గని
యనియె నిట్లు; లశోకాఖ్య♦వనమునందు. ౩౨ 2224

క. ఘోరాకృతు లగురాక్షస, నారులు తనుఁ గాచుచుండ ♦ నైజమహిమచే
నేరీతిఁ గందుఁబొందని, శ్రీరాముని సాధ్వి యైన♦సీతను గంటిన్. ౩౫ 2225

---

1 తస్థుః ప్రాంజలయ స్తథా-అనిమూ. 2 గిరేర్గిరిరిధిః కపిః-అనిమూ. అవిచ్ఛిన్నపక్షస్య పాతాసంభవాచ్ఛిన్నపక్ష ఇత్యుక్తమ్-అనివ్యాఖ్య. 3 దృష్టా సీతేతి విక్రాంత స్సంక్షేపేణ న్యవేదయత్-అనిమూ.

ఆ. ఏకవేణిఁ దాల్చి♦యాకాంత శ్రీరాముఁ, గనెడువాంఛ మిగులఁ♦గాఁ గృశించి
నుర్వి ధూళిఁ బ్రుంగి♦యుపవాసకష్టంబు,లంది జడలుదాల్చి♦యందు నుండె.

క. కనినాఁడ నన్న వాక్యం,బును నమృతోపమము నర్థ♦పూరితమును నా
హనుమవచింపఁగ విని యా, వనచరు లామోదపార♦వశ్యము గనుచున్. ౮౦

సీ. బలవంతులైనయా♦వానరుల్ కొందఱు సింహనాదంబులు ♦ చేసిరప్లె
మఱికొందఱార్చిరి ♦ మఱికొందఱుబ్బున గర్జించి రెలమిమైఁ ♦ గపులుకొంద
ఱట్టులె కిలకిల ♦ యని ధ్వనుల్ చేసిరి కొందఱుగర్జింపఁ ♦ గూర్మి మాఱు
గర్జించి; రంతటఁ ♦ గపివరుల్ కొందఱు పరమసమ్మదమున ♦ బరవసమున

తే. [1]జక్కఁగాఁ బలమొప్పఁగఁ ♦ జాలఁ బొడవు
లైనతోఁకలఁ బైకెత్తి ♦ యవనిఁ గొట్టి;
రవలఁ గొందఱు సమ్మద♦మలర శైల
శృంగములనుండి దుముకుచు ♦ నేపుమీఱ. ౮౧ 2228

క. [2]కరినిభు హనుమను స్పృశియిం,చిరి; హనుమయు నిట్లుకంటి ♦ సీతననఁగవా
నరవీరమధ్యమంబునఁ, బరఁగుచు నంగదుఁడు పల్కె ♦ నరవాక్యంబున్. ౮౨

తే. విరివిగలయట్టికడలిని ♦ వేగ దాఁటి
పోయి మరలను దాఁటి యీ♦పుడమి కేగు
దెంచితివి కాన బలమునఁ ♦ దీవ్రపౌరు
షమున నినుఁబోలువాఁడు లేఁ♦డు మహి నెవఁడు. ౮౩ 2230

తే. [3]శూర! నీస్వామిభక్తి; య♦యారె! నీదు
వీర్య, మయ్యారె! ధీరత ♦ వినుతిచేయ
నగును మాభాగ్యవశమున ♦ యశమునఁ దగు
నవనిజను గంటి వీవు సు♦రారిపురిని. ౮౪ 2231

క. కాకుత్స్థుఁడు మాభాగ్యం, బీకరణి ఫలించెఁగాన ♦ నిఁక సీతకుఁగా
శోకంబు నందకుండుం, గాక మహాసుఖము నొందుఁ♦గా కని పలికెన్. ౮౫

క. వనచరులంతట నంగదు, హనుమంతుని జాంబవంతు ♦ నటఁ గొల్చుచు వా
రిని ముపురఁ జుట్టుకొనుచున్, [4]బెనుశిలల వసించి రంత ♦ వీరవనచరుల్. ౮౬

క. అనిలజుఁ డంబుధిదాఁటుట, దనుజేంద్రుపురంబుఁ గనుట ♦ ధాత్రీతనయన్
గనుటయు రావణుఁ గాంచుట, యనునీవార్తల వినంగ ♦ నాతురపడుచున్.

క. చేమోడ్పులు గీలించుచు, నామారుతిమోముఁ గనుచు ♦ నటనుండఁగ; నా

1 అంచితాయతదీర్ఘాణి లాంగూలాని ప్రవిన్యధుః-అనిమూ. అత్ర దీర్ఘపదసన్నిధానాదా యతపదం స్థూలపరమ్-అనివ్యాఖ్య. 2 వానరావారణోపమం-అనిమూ. 3 అహో స్వామి నితే భక్తి రహో వీర్య మహో ధృతిః-అనిమూ. 4 పరివార్య ప్రముదితా భేజిరే విపులాః శిలాః-అనిమూ.

శ్రీమంతుఁ డంగదుం డు, ద్దామబలాధికులు కపులు ♦ తన్నుఁ గొలువఁగన్.

క. సురసేవ్యమానుఁడై నిర్జరనాథుఁడు స్వర్గమందు ♦ రాజిలు రీతిన్
గిరియందుఁ బొలుచుచుండెను; వరకీర్త్యన్వితుఁడు గంధ♦వహసూనుండున్.

క. కనకాంగదయుతబాహుఁడు, ఘనయశుఁ డంగదుఁడు పరమ♦కౌతుకమొప్పం
గ నధిష్ఠించుట విస్తృతిఁ, గనునా గిరిశిఖర మతుల♦కాంతి వెలింగెన్. ౫౭

ఏఁబదియేఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౫౮ - వ సర్గము.

అంగదాదులతో హనుమ లంకావృత్తాంతమును దెల్పుట.

క. తరువాత నతులబలులౌ, మరుత్సుతాద్యఖిలకీశ♦మండను లెల్లం
బరమముదంబు మహేంద్రశిఖరిశృంగమునందుఁ గూడి♦కాంచిరి మిగులన్.

తే. సంతసంబున నా జాంబ♦వంతుఁ డంగ
మందుఁ బులకలు పొడమ మ♦హాబ్ధిఁ దేలు
కపివరుని హనుమంతునిఁ ♦ గాంచి పలికె
గార్యవృత్తాంతమును నడు♦గం దలంచి. ౨ 2239

చ. జనకజ నెట్లుగాంచితివి ♦ సాధ్వియు నచ్చట నెట్టులున్న దా
దనుజవిభుండు దుష్టమతి ♦ దారుణకర్ముఁడు సీతయందుఁ దా
ను నెటులువర్తనంబును గ♦నున్; గపివర్య! యథార్థరీతి నీ
పని సకలంబుఁ దెల్పు మిద♦పం దగుకృత్యము నిశ్చయింత మో
హనుమ! రఘూత్తముం గనఁగ ♦ నందఱ మేగినయప్పు డచ్చటన్. ౪ 2240

క. [1]ఏమాట చెప్పఁదగునో, యేమాటయుఁ దాఁపఁదగునొ ♦ యోజఁగింపుము నీ
వే మాకు, బుద్ధిమంతుఁడ, వై మాకుం దెల్పఁజాలు♦వట్టింపవునూ. ౫ 2241

క. [2]అని జాంబవంతుఁ డిప్పగిది నియోగింపంగ హనుమ ♦ తీవ్రపులకలం
గనుచున్ మూర్ధమ్మున నా, జనకజకున్ మ్రొక్కి పల్కె ♦ సాధుభణితులన్.

క. విను నేను సమాహితమతి, వననిధిదాయామ్యతటము ♦ వైళమ చేరం
గను గోరి మహేంద్రాచలమునకనుండియె వ్యోమమార్గ♦మున కెగిరితిఁగా. ౭

క. ఇది ప్రత్యక్షమె మీకుం, గడ నేనవ్వలను జనఁగఁ ♦ గ్రమ్ము జాంబూ
నదమయమునైన శిఖరంబు దారుణంబైనవిఘ్న♦మువలెఁ జెలంగెన్. ౮

క. కనినాఁడ దాని, నది ద్రోవను జక్కఁగ నావరించి ♦ వదలక యుంటన్
మనమున నెంచితి విఘ్నమె, యని యవ్వలఁ గనకమయము ♦ నద్రివరంబున్.

---

1 యశ్చార్థ స్తత్ర వక్తవ్యో గతై రస్మాభి రాత్మవాన్, రక్షితవ్యం చ యత్తత్ర తద్భవాన్ వ్యాకరోతు నః-అనియూ. 2 ప్రణమ్య శిరసా దేవ్యై సీతాయై ప్రత్యభాషత-అనియూ.

తే. భవ్యమును జేరి దీనిని ♦ బగులఁగొట్ట
వలయునను బుద్ధి నాకప్డు ♦ గలిగె; నంత
నర్కతుల్యముగాఁ గను ♦ నగ్గిరివర
శిఖరమును వాలమున మోఁద ♦ శృంగమద్రి. ౧౦ 2246

క. [1]శతదళములుగాఁ బగిలెను, క్షితిధర మది తన్నుఁగూల్పఁ ♦ జేయు ప్రయత్నం
బతులితముగా నెఱుంగుచు, [2]సుతా! యటంచు ననుఁబిల్చి ♦ శుభమధురోక్తిన్.

క. నామది సంతస మందం, గా నుతిమతిఁ జేసి యనియె; ♦ గంధవహునకున్
నేమిత్రుఁడఁ బినతండ్రిగ, నో మారుతి నన్నునెఱుఁగు ♦ ముద్యమ మలరన్.

క. నను మైనాకుం డందురు, వననిధిలో నున్నవాఁడఁ ♦ బావని! పుత్రా;
మును గిరివర్యము లన్నియుఁ, గనియుండును బక్షములను ♦ గావున నవియున్.

క. తమయిచ్చరీతిగా భూ, ధ్రములెల్లను నప్డు భూత ♦ తతులకు విపరీ
తముగాఁ దిరుగుచు నేఁచుచు, క్షమఁ దిరుగుచు నుండెఁ; బాక ♦ శాసనుఁ డంతన్.

క. తనమహిమ మెప్ప భూధ్రము, లొనరించుమహార్తి నెఱిఁగి ♦ యురుతరవజ్రం
బున వానిపక్షములఁ జెండెను వేలకువేలుగాఁగ ♦ నిర్భరశక్తిన్. ౧౪ 2251

తే. నాయనా! మహితాత్ముఁడై ♦ నీయనుంగు
జనకుఁడౌ వాయుదేవుఁ డా ♦ సమయమందు
నీమహార్ణవమున వైచి ♦ యింద్రుబారిఁ
బడఁగ నీయక తప్పించెఁ ♦ బరమకరుణ. ౧౫ 2252

చ. [3]అనిలుని సాయముం గనితి ♦ నాతనిపుత్రుఁడవై ననీకుఁ జే
తనయినయంతసాయమును ♦ దానికి మాఱుగఁ జేయువాఁడ ధ
ర్మనిరతిఁ గాంచినట్టి రఘు ♦ రాముఁడు వాసవతుల్యవిక్రముం
డనఘుఁడు గాన నాతనికి ♦ సర్వసహాయముఁ జేయఁ బూనితిన్. ౧౬ 2253

తే. అనిమహాత్ముఁడు మైనాకుఁ ♦ డనిన వినుచు
నతనికిని నాదుకార్యంబు ♦ ననువదించి
యవలఁబోవ నుద్యుక్తుఁడ ♦ నైతి నమ్మ
హాత్ముఁడటఁ బోవఁగా నాకు ♦ ననుమతి యిడె. ౧౭ 2254

క. ఘనగిరి నాతోఁ బలుకం, గను బూనినమనుజతనువు ♦ గ్రన్నన విడి య
వ్వనధిపయి నుండెఁ బర్వత, తనువున నాపిదప నే ని♦తాంతజవమునన్. ౧౮

క. చనుచుంటి శిష్టమార్గం, బును గడవఁగఁ జాలకాల♦మును బిదప దివం
బున సర్పజనని సురసను, గనినాఁడను; నామె నన్నుఁ ♦ గడలికి నడుమన్.

క. కనుఁగొని యిట్లనిపలికెన్, వనచరవర! సురలు నిన్ను ♦ భక్ష్యంబుగ నా

---

1 వ్యశీర్యత సహస్రధా-అనిమూ. 2 పుత్రేతి మధురాం వాణీమ్-అనిమూ. 3 రామో ధర్మభృతాం శ్రేష్ఠో మహేంద్రసమవిక్రమః-అనిమూ.

కు నొసంగిరి కావున నిను, దినియెడఁ జిరకాలమునకు ♦ దేవపథమునన్. ౨౧౪

క. దొరకితివి నీవు నాకును, బరమంబగు భక్ష్య మైతి; ♦ బళి రే! యనఁగాఁ
గరములు ముకుళించి నమస్కరణము గావించి [1]నేనుఁ ♦ గడు దైన్యమునన్.

క. నిలుచుండి యామెతో నిటు, పలికితిని: బరంతపుండు ♦ బలశాలియు శ్రీ
లలితుండు దశరథుండను, నిలేశనందనుఁడు రాముఁ ♦ డేపుమెఱయఁగన్.

క. అనుజుఁ డగులక్ష్మణుండును, జనకజయును దోడరాఁగ ♦ జనకుని యాజ్ఞన్
గొని దండకాటవికి వచ్చెను: రాముని ధర్మపత్ని ♦ సీతను వనిలోన్. ౨౮౪

క. దనుజేంద్రుఁడన దురాత్ముం, డన నొప్పినరావణుండు ♦ హాతభాగ్యుఁడు తాఁ
గొనిపోయె; నిపుడు నే రాముని యానతి దూతనగుచుఁ ♦ బోయెదఁ జుమ్మీ.

క. జనకజకడ కేగెదునను, వనితా! శ్రీరాము దేశవాసిని వగుటన్
జను రాజునకు సహాయం, బొనరింపఁగ నట్లు చేయ ♦ నూల్కొనకున్నన్.

క. చని నేను సీతఁగని యెవ్వనికైనను [2]నించుకయును ♦ బాధను జేయన్
మనమునఁ దలఁపని శ్రీరాముని కావార్తలను దెల్పి ♦ మోదముతోనరన్.

ఆ. మరలవచ్చి చొత్తు ♦ మానినీ! నీవక్త్ర, మనుచు నొట్టుపెట్టుకొనుదుఁ జుమ్మీ;
యనుచు నేనుబల్క ♦ నాకామరూపిణి, సురస సమ్మతింప ♦ కురుజవమున. ౨౭

క. ననుఁ గడచి పోవఁజాలఁడు, విను మెవ్వండైన నిట్లు ♦ విధి వరమిచ్చెన్
మును నాకనియెను; దశయోజనవిస్తృతిఁగల్గు నామె ♦ పరగ నిటుల నన్.

సీ. విని నేను క్షణకాలమున నామెకంటెను మఱికొంతవిస్తృతి ♦ మైఁ జెలంగ
నుంటి, నాతనువెంత ♦ యొప్పెనో దానికిఁ దగినట్లు తనదువదనము నామె
విస్తృతంబుగాఁ జేసి ♦ వెస ననుమ్రింగఁగాఁ దెఱచెను: నప్పు నా ♦ దేహమెల్ల
నల్పతమంబుగా ♦ నలవరించుకొనుచు నాముఖాంతరంబున ♦ యుండె యొక్క
యంగుష్ఠమాత్రుండనైతి; నంతట నేను దద్వక్త్రమును జొచ్చి ♦ తడవు చేయ

తే. కుండ వెలువడివచ్చితిఁ ♦ జండతనువు
దాని దిగనాడి సురసయుఁ ♦ దనమునుపటి
యాకృతిందాల్చి ననుఁజూచి ♦ యనియె నిట్టు;
లర్థసిద్ధికిఁగాఁ జన ♦ వయ్య! నీవు. ౩౦ 2266

క. వనచరవర్యా! సుఖముగఁ, జనుమా! యిఁక సీత రాము ♦ చంద్రునకు మహా
త్మునకు నొసంగుము మోదం,బును బొందితి నిన్నుఁగాంచి ♦ భూరితరభుజా.

క. [3]నను భూతవితతి మేల్మే, లనుచుం గొనియాడె నంత ♦ నంబరమున నా
వినతాద్వితీయతనయుని, యనువునఁ బోవంగఁ దలఁప ♦ నయ్యెడ వినుఁడీ.

---

1 విషణ్ణవదనో భూత్వా-అనిమూ. 2 రామం చాక్లిష్టకారిణమ్-అనిమూ. 3 తతో౽జాం
సాధుసాధ్వీతి-అనిమూ.

తే. నాతనుచ్ఛాయయును దేని♦చేతనో గ్ర
హింపఁబడియెను నాకు న♦దేదొ కానఁ
బడకపోయెను; విగతజ♦వమున దశది
శలను గాంచితిఁగాని య♦చ్చటను నాకు. ౩౪ 2269

క. నను విగతునిగాఁ జేసిన, తనువెద్దియొ తోఁపదయ్యెఁ; ♦ దన్నభమున నా
కును దోఁపనిరూపముగల, యనూనవిఘ్నం బిదేల♦యార్తిని ముంచెన్. ౩౬

చ. అని మదిఁదోఁచెఁ నిట్లుపగ♦నందుచుఁ గ్రింద జలంబువంకఁ జూ
చిన నట భీతిఁగల్గునటు♦చేసెడురూపమునం జెలంగునొ
క్క నెలఁత దానవాన్వయయె ♦ కన్పడెఁ నావికృతాంగి నన్ను వే
కని వెడనవ్వు నవ్వి [1]త్వరఁ♦గాంచనియట్టి యనిష్టవాక్కులన్. ౩౭ 2271

ఆ. పలికెనిట్లు లోరి! ♦ బహుదీర్ఘకాయంబు, గలిగినాఁడవీవు ♦ కడఁగి యెచటి
కేగుచున్నవాఁడ ♦ వివు డేను నాఁకట, నలఁగుచున్నదాన ♦ నాకునీవు. ౩౮

తే. మంచియాహారమైతివి ♦ కాంచనైతిఁ
జాలకాలమాహారము, ♦ సరగ నీవు
తృప్తిఁ గావింపుమా నాకు ♦ నిప్పుడనియె;
[2]నంత మంచిది యనినేను ♦ ననుమతించి ౩౯ 2273

క. వినుఁ డాదానవివదనం,బునకంటెను నధికముగనె ♦ పొల్చెడుదేహం
బును గాంచితి దానవియును, దనభయదాస్యంబుఁ బెంచెఁ ♦ దగవిస్తృతిగన్.

క. నన్మ్రింగుకాంక్షఁ బూనెను; గనుకనె ననుఁ గామరూపుఁ♦గాఁగాని, మృతిం
దనుఁబొందఁ జేయువికృతవుఁ, దనువొందితినంచుఁగాని ♦ తానెఱుఁగ దెదన్.

సీ. ఒకక్షణంబుననె నా♦యుగ్రరూపంబును నల్పతరంబగు♦నట్లు చేసి
కొని దానిహృదయంబు♦ననె చొచ్చి యంకలిసారమెల్లనుగొంచు♦సరభసమున
నాకసంబున కేగ; ♦ నద్రితుల్యాకృతి యాభీమదానవి ♦ యట్లు నేను
హృదయంబు ఛేదింప ♦ నెంతెయు జవమునఁ గరములు వ్రేలాడఁ♦గాఁ గడలిని
తే. బడియె; సిద్ధులు చారణుల్ ♦ పటుజవమున
భయదరాక్షసిసింహికఁ ♦ బవనతనయుఁ
డంతమొందించె ననిపల్కి ♦ నాలకించి
తి నిటు చేసినఘోరమా♦పనిఁ దలఁచుచు. ౪౪ 2276

క. చని చాలదూరమంతట, వననిధిదాయాన్యతటము ♦ వరతరుసంఘం
బును లంకయున్నచోటును, గనినాఁడను; బశ్చిమాబ్ధి♦కడకు రవిచనన్. ౪౬

చ. ఘనభయదాకృతుల్ దనుజ♦కాంతులు నన్గనకుండునట్లుగా
దనుజనివాసమై తనరు♦తత్పురవర్యముఁ జొచ్చినాఁడఁ; జొ

---

[1] అవస్థిత మసంభ్రాంత మిదం వాక్య మశోభనమ్ - అనిమూలము. [2] కాంక్ష మిత్యేవ తాం వాణీం-అనిమూ.

చ్చునపుడు నాదుమ్రోలఁ బెను♦ఘోరతమైఁ బ్రళయాంబుదంబునాఁ
గనఁబడునొక్కకాంత నను♦గాంచుచు నిల్చి మహాట్టహాసముల్
బొనరుచుచున్; [1]జ్వలచ్ఛుచిని♦బోలెడు వెండ్రుక లొప్పుచుండఁగన్. ౪౮

క. అతిభయదాకృతితో నను, జతనంబునఁ బట్టికొట్టి ♦ చంపఁగ యత్నిం
చుతలోదరిసవ్యకరో,ద్ధతముష్టింబొడిచి గెలిచి ♦ తత్పుర మంతన్. ౪౯ 2279

ఆ. [2]అప్రదోషకాల♦మందుఁ జొచ్చితి; నన్ను
భయముమీఱఁ గాంచి ♦ పడఁతి పలికె
వీర! వినుము నాదు♦పేరు లంక, పరాక్ర
మమున గెలిచితి వీఁక ♦ నమలచరిత. ౫౦ 2280

క. పురమునఁ జెలంగుదనుజో,త్కరమును నిర్జింపఁగలవు ♦ తప్పక యనియెన్;
బురిఁ జొచ్చి రేయియంతయుఁ, దరుణీమణి వెదకినాఁడఁ ♦ దత్పురమతినై. ౫౧

క. దనుజేంద్రునియంతఃపుర,మునకుం జని వెదకినాఁడ ♦ ముగ్ధయు నాకుం
గనఁబడదయ్యెను; నటసీ,తను గానక దుఃఖజలధిఁ ♦ దగ మున్గితిఁగా. ౫౨

క. దానికిఁ దుదిఁగానకయే, యేనుండఁగఁ గనకసాల ♦ మెంతయు వెలయం
గా నొకభవనారామము, గానంబడె; నంత నేనుఁ ♦ గడుఁ బూన్కితగన్.

క. తరునికరాంచితమై యం,బరమునకుం బ్రాకియున్న♦ప్రాకారంబున్
బరికించి దాఁటి వనమున్, గరము ప్రమోదావహంబుఁ ♦ గంటిని జండీ.

సీ. అయ్యశోకోపవ♦నాంతరంబునఁ బెద్దశింశుపావృక్షంబు ♦ చెలఁగుచుండె
దానిపై నెక్కి యు♦ద్దామకాంచనమయకదళీవనంబును ♦ గంటిఁ; శింశు
పాహ్వయతరువున ♦ కంతికంబున వరవర్ణినిఁ గంటి నా♦వనిత నడవ
యన్నునఁ జెలఁగుచు ♦ నంభోజపత్రాక్షియై యుపవాసాళి ♦ కార్తినొంది

ఆ. యాస్యమెల్ల వాడ ♦ నాసురపతి యొత్తి,కొనుచుఁ బాఱినట్టి♦దినమునందుఁ
గట్టినట్టిచీరఁ ♦ గట్టి శిరోజముల్, ధూళిబ్రుంగ బహుళ♦దుఃఖ మొలయ. ౫౫

క. తనువెల్ల దుఃఖతాపం,బున విన్నదనంబు మిగులఁ ♦ బొందఁగఁ బ్రాణే
శునిహితమెగోరుచున్ మే,దినిపైఁ గూర్చుండి యుండె ♦ దిటవు మదిఁ దగన్.

ఆ. వికృతరూపలగుచు ♦ విగతదయాచిత్త, లగుచు మాంసశోణి♦తాదులఁ దిని
కడుఁ జెలంగుదనుజ♦కాంత లాఁడుపులియు, హరిణిఁబోలెఁ జుట్టు♦నావరించి

క. తనుఁగాచుచుండ నుండెదు;, దనుజాంగనలందు నడుమఁ ♦ దాఁ జిక్కుచు వా
రనయము బెదరింపఁగఁ గే,శవిచయ మొకజడఁగనుండ ♦ సాధుత్వమునన్. ౫౮

క. పతినే దలఁచుచు నతిదీ,నత భూమియె శయ్యగాఁగ ♦ వశినియుఁ దుహిన
ప్రతతిని సొంపుదొలంగెడు, గతిని వివర్ణాంగి యగుచుఁ ♦ గనఁబడఁ గంటిన్.

1 జ్వలదగ్నిశిరోరుహామ్.-ఆనిమూ. 2 ప్రదోషకాలే ప్రవిశమ్-ఆనిమూ.

[1]సీ. అట్టిస్థితిం గను ♦ నంగనారత్నంబు నాయశస్విని రాము♦ననుఁగుఁబత్ని
మృతినంద యత్నించు♦మేదినీపుత్త్రిని రావణునం దను♦రాగలేశ
మైనను లేనియా♦యమలచరిత్రను హరిణశాబాక్షిని ♦ నతిశయప్ర
యాసమునం జేరి ♦ యచ్చటఁ గన్గొని యామెఁ జూచుచు నేను ♦ నందె శింశు
ఆ. పాగ్రసీమనుంటి; ♦ నంత రావణునాల, యంబునుండి నూపు♦రాళిరవముఁ
గలిసిమొఱయుచున్న♦కాంచీరవంబును, గూడియున్నరవము ♦ గుబులుకొనియె.

ఆ. అతిగభీర మగుచు ♦ హలహలాక్షరయుక్త,మగుచు నారవంబు ♦ తగి వినఁబడె;
నంత నేను [2]బెనుభ♦యమునొంది రూపంబు, నల్పతరముగాఁగ♦నమరియుండ.
క. తరుపరమున నొకచోటనె, యరణ్యమున దాఁగియున్న♦యండజమువలెన్
బరమరహస్యస్థలి నెవ్వరికైనం దెలియరాని♦భంగిగ నుంటిన్. ౬౩ 2292

చ. జనకజ యుండుచోటికి వి♦శాలబలుండగు రావణుండు నా
తనితరుణుల్ జవంబున ని♦తాంతముమీఱఁగవచ్చి; రంత రా
మునిప్రియపత్ని [3]యూరుయుగ♦మున్ బిగియంగనుబట్టి చేతులన్
ఘనకుచముల్ గనంబడని♦కైవడిఁ గప్పి విచంచలాత్మయై. ౬౪ 2293

ఆ. పరమభీతిఁ గంది ♦ వ్యథలపాలై దెసల్, గనుచుఁ దన్నుఁ గావఁ♦గాఁదగినది
కానఁబడమి మిగులఁ♦గంపమునొందుచుఁ, గరుణఁజూప నర్హఁ♦గా వగచుచు.
క. నిరతం బార్తినిమున్గెడు, తరుణీమణిఁ గాంచి యంత♦దశవదనుండున్
బరికించి యవాక్ఛిరుఁడై, పరమాదృతి మ్రొక్కి పలికెఁ ♦ బడఁతీ! యింకన్.
క. ననుమన్ననతోఁ జూడుము, యని ప్రార్థించుచును మఱియు♦ననియె నిటుల నో
వనితా! గర్వితవౌదువు, కనుకనె దర్పమున నన్ను ♦ గౌరవ మలరన్. ౬౫
క. మన్నింపకుందువేని మ,దున్నతమగు నాజ్ఞ మాస♦యుగ్మమె యామీఁ
ద న్నినుఁ జంపుచు రక్తం,బు స్నేనేత్రాగువాఁడఁ ♦ బొలఁతి! నిజముగన్. ౬౬
చ. అనిన దురాత్ముఁడైన దను♦జాధిపువాక్కుల నాలకించి యా
జనకజ తీవ్రరోషమున ♦ స్వాంతము పొంగవచించె నిట్లు చ
క్కనిగతి; రాక్షసాధమ! య♦ఖండపరాక్రమ మొప్పువెల్లు రా
మునిప్రియపత్ని నేను; ప్రభు♦ముఖ్యుఁడు నా ఘనకీర్తి నొప్పుచున్. ౬౭
తే. తనరి యిక్ష్వాకుకులపతి ♦ యనఁ జెలంగు
దశరథునికోడలను నన్నుఁ ♦ దగ వచింప

1 ఇందలి విశేషణములన్నియు మూలానుసారములే యని గ్రహింపఁదగు. 2 అహం తు పరమోద్విగ్నా-అనిమూ. 3 సంకుచ్యోరూ స్తనాపీనా బాహుభ్యాంపరిరభ్య చ-అనిమూ. పండితుఁడనుట సీతకుశలవార్తను వానరులకుం జెప్పుసమయమున 'స్తనాపీనా' అనిచెప్పినట్లు కవి వచించెనుగదా. దీనిచే వాల్మీకికి మచితజ్ఞత లేదనవచ్చునా కలదనవచ్చునా యని ప్రశ్నముచేయుట తెలివిలోపము. అట్టిమహాత్ముల కన్నదున్నట్లు చెప్పుట తప్పుగాఁ దోఁపదని గ్రహించుట సరసము.

[1]ననువుగానట్టిపల్కుల ♦ నాడెదీవు
నాలుకయు వీడి పడిపోవ ♦ దేలొకొ యిట ౭౦ 2299

క. దనుజ యనార్యా! పాపీ, విను నాపతి చెంత లేని♦విషయంబున న
న్నను దొంగిలించి యీమా,న్యునికంటంబడకపోతి ♦ వోహో యనఘా. ౭౧

క. నీవీర్య మల్పతరమా, నీ వాతనిసముఁడ వనఁగ ♦ నిలుచునె పలుకి
ట్లీవతనికి దాసుఁడవని,యేవల్కుఁగనైనఁదగుదు♦వే పాపమతీ!. ౭౨ 2301

ఆ. వివిధయజ్ఞములను ♦ విధిగ నొనర్చువాఁ
డెవుడు సత్యవాది ♦ యినకులజుఁడు
సంగరమున నతికిఁ ♦ జాలినవాఁడు రా
ఘవుఁడటంచు నిట్లు ♦ కఠినరీతి. ౭౩ 2302

క. [2]వనితవచింపఁగ విని యా,దనుజేశుఁడు చిటిని వెలుఁగు♦దహనునిరీతి౯
ఘనకోపంబున మండుచుఁ, దననేత్రములట్టె విప్పి ♦ దారుణరీతి౯. ౭౪ 2303

క. [3]దక్షిణముష్టిని గైకొని, యాక్షణ మాసాధ్విఁ జంపు♦నాదృతిఁ గొనఁగా
వీక్షించి యచటఁదగు హరి,ణాక్షులు హాహారవంబు ♦ నందఱుఁ జేయ౯. ౭౫

క. తరుణులనడుమఁ జెలంగెడు, హరిణాయతనేత్ర యాదు♦రాత్మునిప్రియనుం
దరి మందోదరి యప్పుడు, త్వరగా నరుదెంచి చంప♦వలదని యడ్డె౯. ౭౬

చ. చెలువలమిన్న యిట్లనుచుఁ ♦ జెప్పె; స్మరార్దితుఁడైనభర్తతోఁ
బలుకులు తీయనై వెలయ ♦ వజ్రసమానపరాక్రమంబునం
జెలఁగుదు వీవుకాదె యిట ♦ సీతను జంపఁగనేల? దీనితోఁ
గలదె ప్రయోజనంబు ధరఁ ♦ గల్గుదురే నినుఁబోలుశూరులు౯. ౭౭ 2306

సీ. గంధర్వనిర్జర♦కాంతల యక్షకన్యకలను దమిఁ గూడి ♦ యతను కేళిఁ
దేలుమా, యెవరితోఁ ♦ బోలనియీసీతతోడ నీకే లని♦తోయజాక్షి
పలికె; నంతటఁ దరు♦ణుల వారలంగూడి యమ్మహాబలశాలి ♦ నమరవరుని [దు
నుప్రసన్నునిఁ జేయు♦చు౯ నిజగృహమునకును దోడుకొనిపోయి;♦దనయెడఁదతేఁ

తే. చనినపిమ్మట వికృతాస్య♦లును దురాత్మ
లైనరాక్షసకాంతలు ♦ జానకిని గ
ఠోరభీతిదవాక్యముల్ ♦ బోరన వచి
యించి బెదరించి; రాసీత ♦ యెల్లనుడుల. ౭౮ 2307

---

1 అవాచ్యం వదతో జిహ్వా కథం న పతితా తవ-అనియా. 2 జ్వాలసహసా కోపా చ్చిత్రాస్థఇవపావకః-అనియా. భయంకరదోశ్యతనార్థమై చితాస్థ మనటయనిరో ఉంగవరు 3 ముష్టిముద్యమ్య [illegible] దక్షిణమ్-అనియా. పూర్వం ధాన్యమాలిన్యా ప్రతిషిద్ధ ఇత్యుక్తం ఇదానీం ముష్టి [illegible] దుర్భాష్యా మపీతి కల్పనీయమ్. - అనివ్యాఖ్య. ఇది వ్యాఖ్యాకర్త యూహగావు [illegible]

క. తలఁచెను దృణములవలెనే;, ఖలచిత్తములఁ దగ నసుర♦కాంతల బెదరిం
పులుసీతయొడల వ్యర్థం,బులెయయ్యె ఫలింపవయ్యెఁ♦బో యించుకయున్. ౧౦

క. పలలాశనలౌసురరిపు, లలనలు తమగర్జితము లి♦లాసుతయందున్
ఫలియింపమి నిశ్చేష్టలఁ, గలఁగుచు దనుజాధినాథు♦కడకేగి వెసన్. ౧౧

క. జనకజపూనికయంతయు, ననువాదము చేసి; రంత ♦ నయ్యంగన లె
ల్లనుగూడి నిర్గతాశల, జనకజ వశపఱచుకొనెడు♦సంగతి వాయన్. ౧౨ 2310

చ. [1]వనితకు నేమియేని చెడు♦బాధను గల్గఁగఁజేయకుండుఁడీ
యనుదనుజేంద్రునాజ్ఞఁ గొని ♦ యామెకుఁ జుట్టును నుండి నిద్దురం
గని; రలరాక్షసాంగనలు ♦ కావలికాచుచు నప్డు నిద్రఁబొం
దినఁ బలిమేలు గోరుసుద♦తీమణి జానకి దుఃఖితాత్మయై. ౧౩ 2311

క. కరుణముగా దీనత నా,తురముగఁ దానేడ్వ; [2]దనుజ♦తోయజనేత్రాం
తరముననుండియె త్రిజటయుఁ, ద్వరఁగా మేల్కొనుచు లేచి♦తగ వచియించెన్.

క. ననువలచినభక్షింపుఁడు, జనకజ భక్షింపవలదు ♦ సాధ్వియు రఘువం
శ్యునికోడలు నగుసీతయు, వినాశమును బొంద దెట్టి♦విషయములందున్. ౧౫

చ. దనుజవినాశనాస్పదముఁ ♦ దన్విభుం డగురామమూర్తికిన్
ఘనజయసూచనంబు నతి♦గాఢభయంకరమున్ గతోరరీ
తిని దగునట్టిస్వప్నమును ♦ దృష్టిగఁ గంటి; హితంబు తెల్పెదన్
వనితల నందఱన్ మనల ♦ వారక రాముఁడు చంపకుండఁ గా
వను నొకయీసతీమణియె ♦ బాగుగఁ జాలును గాన సీసతిన్. ౧౬ 2314

క. మనమెల్లం బ్రార్థింతము, మనమున కిదె నాకు నీస♦మయమునకు శుభం
బనితోఁచుచున్న; దెవ్వతె, కనూనదుఃఖములు గల్గు♦నాసమయమునన్. ౧౭

తే. ఇట్టికలతోఁచునేని యా♦యింతి వివిధ
దుఃఖములనుండి ముక్తయై ♦ తోరపుసుఖ
ములను గాంచును; జానకి ♦ మ్రొక్కి వేఁడఁ
గాఁ బ్రసన్నాత్మయగు నని ♦ కడఁగి పలికె. ౧౮ 2316

సీ. [3]అంతనా జనకజ ♦ యాత్రేశునకు జయ మబ్బునన్నాటకు ♦ నలరి బేల
గావున సిగ్గొంది ♦ క్రవ్యాదవనితల కనియె నీపల్కు స♦త్యమగునేని
నే మిమ్ముఁ గాచెద ♦ నెలమి నంచనిపల్కె; నట్టిదారుణదుర్ద♦శానుభవము
నందియున్నట్టియా♦యంగనామణి నేనుఁ గని చాలఁ జింతించి ♦ మనమునందు
తే. నూఱటను బొందకుంటి; నే ♦ నుర్వితనయఁ
బలుకరింపఁగ నొక్కయు♦పాయ మరసి

---

1 తత స్తా స్సహితా స్సర్వాః-అనిమా. తూష్ణీం రక్ష తేతి రావణోక్తా ఇతిశేషః-అనివ్యాఖ్య.
2 దనుజతోయజనేత్రాంతరము=రాక్షసస్త్రీలనడుమనుండి అనియర్థము. 3 అవోచ ద్యది తత్సత్యం భవేయం శరణం హి వః-అనిమా.

తిని, వచించెద వనచర♦ధీరులార
ముందు నిక్ష్వాకుసద్వంశ♦మును గ్రమముగ. ౯౧ 2317

క. వినుతి యొనర్చితి; రాజ, ర్షినికరపూజితముగాఁగఁ ♦ జెలఁగెడు నవ్వా
క్యనిచయమునఁ బల్కఁగ విని, జనకజనయనముల బాష్ప♦సలిలము గ్రమ్మెన్.

క. ననుఁ గాంచి యిట్లు పల్కెను;, వనచరవర! యెవఁడ వీవు ♦ వచ్చితి విట కె
వ్వనికయి రామునితో నీ,కు నెటుల నెయ్యంబు గల్గెఁ ♦ గూర్మిన్ దీనిన్. ౯౩

తే. విస్తరించి వచింపుమా ♦ వేడుకయ్యె
వినఁగ నని పల్క నిట్లంటి ♦ వనజనయన
దేవి నీభర్త యగు రఘు♦ధీరునకు స
హాయుఁడయి భీమవిక్రముఁ♦డై చెలఁగుచు. ౯౪ 2320

క. బలమున మిన్నందిన కపి, కులపతి సుగ్రీవుఁ డనఁగ ♦ క్షోణిస్థలిలోఁ
గలఁ డొకవనచరుఁ డతనికిఁ, బలువిధములఁ బ్రీతిలతకుఁ♦బాత్రుఁడ నగుచున్.

క. పురికిచటికి వచ్చిన నను, నరయుము భృత్యునిగఁ బేరు ♦ హనుమంతుఁడనన్
ధర నెగడువానిగా; నె,క్కరణిని శ్రమమొరుల కెల్లఁ ♦ గలుగక యుండన్.

క. చరియించు నీదు ప్రాణే,శ్వరుఁడే నను నిచటికిట్లు ♦ చనుమని పంపెన్;
బురుషోత్తముఁ డా దశరథ, వరసూనుఁడు శ్రీయుతుండు ♦ వనితామణిరో.

ఉ. తానుగ నంగుళీయకము ♦ దారుణదుర్దశనున్న నీకు గు
ర్తానని యిచ్చి పంపె; భవ♦దాజ్ఞను గోరెద నేమి చేయనో
నేనిఁక రామలక్ష్మణుల♦నిర్మలసన్నిధి కిప్డు నిన్నుఁ బెం
పూనుచుఁ గొంచుఁ బోయెదను ♦ నోజననీ బదులేమి దీనికిన్. ౯౮ 2324

చ. అని యడుగంగ నా జనకు♦నాత్మజ నా పలుకాలకించి నె
మ్మనమున నెంచి పల్కె; రఘు♦మండనుఁ డీఖలుఁడైన రావణున్
గనదురుశక్తిఁ జంపి ననుఁ ♦ గైకొనిపోయెడుఁ గాక యన్న; నే
ననఘుమతిన్ బవిత్రతమ ♦ నామెను భక్తిపురస్సరంబుగాన్. ౯౯ 2325

చ. శిరమున మ్రొక్కి రాఘవుని♦చిత్తము నింపును బొందఁజేయనై
పరమమునైన గుర్తును గృ♦పన్ దయచేయు మటంచు వేఁడితిన్;
గరము కృపావలోకనము ♦ గన్పడ నన్గని యోమహాభుజా
నిరుపమమైన యీ మణిని ♦ నీకు నొసంగెద వే గ్రహింపుమా. ౧౦౦ 2326

ఉ. దీనిని గాంచినంత రఘు♦ధీరుఁడు నిన్ను బహూకరించు; నం
చానియతిం గృశించు సతి ♦ యద్భుతకాంతిఁ జెలంగు నామణిన్
జానుగ నా కొసంగి రఘు♦చంద్రునకే తెలియంగనైన మ
న్నైన చరిత్ర మొండు తెలి♦యంగను జెప్పెను జాలఁ బ్రీతితోన్. ౧౦౧

చ. జనకనరేంద్రపుత్రికిని ♦ స్వాంతము హెచ్చరికం దగంగ నీ
వననిధియుత్తరస్థలికి ♦ వైళమ రావలెనన్నబుద్ధితోఁ
బ్రణతియొనర్చి యామె నలుఁ ♦ బ్రక్కల భక్తిఁ జరించితిన్; మహీ
తనయయు నంతటన్ మదిని ♦ దాఁ దలపోసి వచించె నీక్రియన్. ౧౦౩

క. హనుమంతా నావార్తను, జని రామున కెఱుకపఱుపఁ ♦ జను; నద్దానిన్
వినినంత శూరులగున, య్యినకులసంభూతు లిర్వు ♦ రేడ్తెఱమీఱన్. ౧౦౪

క. హరిపతితోఁ జనుదెంచెదు, కరణి నొనర్పంగ నీవు ♦ గా కింకిల నె
వ్వరుగలరు? రాకయుండిన, నిరుమాసములే శరీర ♦ మిది యుండుఁజుమీ.

క. తరువాత ననాథక్రియ, మరణింతును నేను భూప ♦ మండనుఁడగు నా
పరమపవిత్రుఁడు రాఘవుఁ, డరుదెంచియుఁ జూడఁజాలఁ ♦ డవ్వల నన్నున్.

చ. అనికరుణంబుగాఁ బలుక ♦ నాపలుకుల్ వినినంతనే మనం
బునఁ గ్రుధ యగ్గలంబగుచుఁ ♦ బొల్చెను; నే నటమీఁదఁ జేయునా
పనిఁ దగ నెంచి యమ్మెయిని ♦ బర్వత మంతగ మేనుఁ బెంచి నే
నని నొనరింపఁ గోరి వన ♦ మంతయు ధ్వంసముచేసితిం గడున్. ౧౦౭ 2332

ఆ. వికృతవక్త్రలైన ♦ వెలఁదు లందలివారు, వృక్షషండమెల్ల ♦ విఱుప బెదరి
చెదరిపఱచుమృగస ♦ ముదయపక్షిగణంబు,గా వనంబు పాడ ♦ గాఁగఁ గనిరి.

క. వనితలు వారలు నన్నుం, గని వననాశకుఁడు వీఁడె ♦ గాఁదగు ననుచున్
మనముల నెంచుచు నొక్కటి,గనె యందఱుఁగూడి దనుజ ♦ కాంతునికడకున్.

క. *చని వేగ పల్కిరిట్లని, విను రాజా! భూరిబాహు ♦ విక్రమశీలా!
వనచరుఁ డొకఁడు దురాత్ముఁడు, చనుదెంచి భవద్బలంబు ♦ సరణి నెఱుఁగమిన్.

క. వనమతిదుర్గమమును బా,డొనరించెను; రాజచంద్ర! ♦ యొక్కట దుర్బు
ద్ధినిఁ బూని యప్రియము నీ, కొనరించిన యతఁడు నాశ ♦ మొందెడురీతిన్.

క. వానివధియింప నాజ్ఞను, దానవుల కొసంగుమనిరి; ♦ తద్వాక్కుల నా
దానవభూపతి విని క్రుధఁ, బూని జయింపంగ రాక ♦ పొలుచుచు ఘనుఁడై.

క. తనమదికెక్కఁగ వర్తిం,చు నిశాటులఁ గింకరులను ♦ శూరులఁ బంపెన్;
వినుఁ డే నెనుబదివేవుర, దనుజుల శూలాదిధరులఁ ♦ దద్వనసీమన్. ౧౧౩

క. కనఁబడు నొకపరిఘంబు నె, కొని నాశమొనర్చినాఁడ; ♦ గొదువపడిన యా

---

* రాజ న్వన మిదం దుర్గం...ఇత్యాదిమూలము. రాక్షసస్త్రీలు రావణునితోఁ జెప్పినట్లు హనుమ యిట వానరులతోఁ జెప్పుచున్నాఁడు. ఇవెట్లు హనుమకుఁ దెలిసినవి? అని ప్రశ్నము రావచ్చును. బదులేమనఁగా కవిశిరోమణి వాల్మీకి లోకవృత్త మెఱింగినమాన్యుఁడు. కాన జరగినసంగతియంతయు నంతర్దృష్టిచేఁ దెలిసికొని హనుమనోటఁ బలికించెను. దీనిచే హనుమంతుఁ డసత్యవాది యనికాని వాల్మీకి యుచితజ్ఞత లేనివాఁడనికాని భ్రమింప నవసరము. లోకజ్ఞానమేమాత్రమున్నను ఇట్లు సందేహమున కవకాశముండదు.

దనుజులు వేగమచని మన, దనుజులు నశియించి రనిరి ♦ తదవసరమునన్.

సీ. బుద్ధి యొక్కటి నాకుఁ ♦ బుట్టె నేనచ్చటఁ జైత్యంబునాఁగఁ బ్రా♦సాద మలర
దానిపై దుమికి వే♦ స్తంభంబు నొకదానిఁ బెకలించి యుందున్న♦వీరదనుజ
శతమును జంపితి, ♦ సరగున లంకకు సొంపునొసంగుచుఁ ♦ బెంపుఁగన్న
దాని నా ప్రాసాద♦తల్లజంబును గూడఁ బాడుచేసితిని; రా♦వణుఁడు మరల
జంబుమాలిని బ్రహ♦స్తతనయు మఱియును భయదరూపంబులఁ ♦ బ్రజ్వరిల్లి
భయదకర్మములను ♦ బాగుగ నొనరించుపెక్కండ్రు దనుజులఁ ♦ బిలిచి వన్న
మార్కొని వధియింప ♦ మహిత తేజంబునఁ దగువారి నేపంపె ♦ నగణితబల
విక్రమంబుల నొప్పు♦వీరు నాతనిఁ బరివారయుతంబుగ ♦ బవరమునను

తే. నాఁటి తేఁటినవాని ఘో♦రాతిఘోర
మైన యాపరిఘంబున ♦ నవనిఁ గూల్చి
తిని; మహాసురవర్యుఁడు ♦ వినియె వారి
వార్త నంతట నతఁడు దుః♦ఖార్తుఁడగుచు ౧౯ 2340

చ. బలముల మిన్నలైనసచి♦వప్రవరాత్మజులన్ మహాబలం
బులఁ దగు సేనలం బనిచెఁ; ♦ బొల్చెడు నా పరిఘంబు చేత నే
విలయము నొందఁ జేసితిని ♦ వీరల వారల; నంత సంగరం
బుల ఘనశౌర్యమున్ నెఱపు♦భూరిభటుల్ మృతినొందియుండుటన్. ౨౦

చ. విని యట రావణుండు ఘన♦విక్రమముల్ తగు వాహినీశులన్
బనిచెను నైదుమంది రణ♦భాగమునం బరిఘంబు చేత నే
పనిపితి దక్షిణాధిపతి♦పత్తనసీమకు; నా దశాస్యుఁడుం
దనయుని నక్షు భూరిబలు ♦ దానవవీరభటాన్వితున్ ద్వరన్. ౨౧ 2342

క. నను వధియింపం బంపెను, నని దిట్ట మహాబలుండు ♦ నా యక్షుఁడు వే
ననుఁ జంపఁ బైకి నెగసినఁ, గని మందోదరితనూజు♦కాళ్ల నొకవిధిన్. ౨౨

ఆ. ఒడిసిపట్టుకొంటి ♦ నుద్ధతిఁ జర్మాసిధరుని నూఱుసార్లు ♦ తగుజవమునఁ
ద్రిప్పి నేలఁ గొట్టి ♦ తెంపున ముద్దయా, భంగిఁ జేసినాఁడ; ♦ వాని వార్త.

క. విని దశకంఠుఁడు రెండవ, తనూజవరు నింద్రజిత్తు ♦ ధైర్యంబున మే
టిని దుర్మదుబలశాలిని, బనిపెన్ నాపైకి; వాని ♦ భటసముదయమున్. ౨౪

తే. యముని ప్రోలికిఁ బంపి యా♦యసురవర్యు
తేజమెల్లను దూలించి ♦ తృప్తినొంది
తిని; మహాబాహుఁడయి బలం♦బునఁ జెలంగు
నతని భటవీరయుతముగ ♦ నసురవిభుఁడు. ౨౫ 2346

క. ననుఁ జంపు మన్న నమ్మక, మునఁ బంపెను, వాఁడు నన్నుఁ ♦ బొలియించుటయే
తనకు నసాధ్యంబనియును, దవబలము నశించె ననియుఁ ♦ దగఁ దెలిసెన్ వెన్.

తే. అంత బ్రహ్మాస్త్ర మేసి; య♦త్యంతజవము
మెఱియబంధించె; నంతట ♦ మేటిదనుజు
లవుడె రజ్జువులను దెచ్చి ♦ యంగమెల్లఁ
గదలకుండంగ నన్నును ♦ గట్టిరెలమి. ౧౨౯ 2348

చ. దనుజులు రాక్షసేశ్వరుని♦ధామమునొద్దకు నన్నుఁ గొంచు వే
చనిరి; దురాత్ముఁడానతఁడు ♦ శౌర్యముపొంగఁగ నన్నుఁ గాంచి చ
క్కనిగతి మాటలాడె మఱి♦కారణ మే నట కేగుదేరఁగా
దనుజులఁ జంపుకారణముఁ ♦ దప్పకచెప్పు మటన్నఁ బూన్కితోన్. ౧౩౦

క. జనకజకొఱకే యంతయు, నని తెల్పితి; మఱియు నేను ♦ నాతని కిట్లం
టిని రాక్షసేంద్ర! జానకిఁ, గనుటకె వచ్చితిని నీవు ♦ గామనగరికిన్. ౧౩౧

క. మనుదారసపుత్త్రుఁడ, వన,చరుఁడను హనుమంతుఁ డనుచు ♦ సజ్జనులనఁగాఁ
బరఁగుదు; సుగ్రీవున కే, నరయుము మంత్రినని దూత♦నని రామునకున్.

క. విను రాముఁడు సందేశము, గొని చనుమని నన్నుఁ బంపఁ ♦ గోరిక దానిన్
వినిపింప నీదుచెంతకుఁ, జనుదెంచితి, భూరిశౌర్య♦శాలి యనుజుఁడున్. ౧౩౩

క. తనకుశలవార్త నెఱిఁగిం,పు నీకునని చెప్పె నాకుఁ♦బోలఁగ ధర్మం
బున కర్థమునకుఁ గామం,బునకు హితంబగుచుఁ బథ్య♦భూతంబగుచున్.

తే. అలరువాక్యంబు నీతోడ ♦ నాడుమని యొ
నిహపరంబులకయ్యది ♦ హితమునుమ్ము;
వినుము తెల్పెద నారీతి ♦ వృక్షషండ
కలితమగు ఋశ్యమూకంబు♦కడను నాకు. ౧౩౪ 2354

క. రామునితోడను సంగర, భీమపరాక్రమునితోడ ♦ వెలసెను సఖ్యం
బీమాడ్కినుండ నాతో, రాముండనె నాదుసాధ్వి ♦ రక్కసుఁ డొకటన్.

తే. అపహరించినవాఁడు చ♦య్యన నతనిని
జంపి భార్యను దేఁబోదు ♦ సమయమందు
నెల్లరీతుల సాహాయ్య ♦ మీవొనర్చ
వలయుననికోరె నారాము♦పలుకుల విని. ౧౩౬ 2356

క. నాకును వాలికిఁగల్గిన, భీకర మగుపగను దెల్పి ♦ వీరు నతనినిన్
బోకార్చువిషయమున నే, నాకున్ సాయపడునట్లు ♦ నయగుణనిలయా.

ఆ. *ప్రతినచేయుమనుచు ♦ రాఘవు నడిగితి;, నామహాప్రభుండు ♦ ననుజుతోడఁ
దాను రాజ్యహీనుఁ♦డైననాతో నగ్ని, సన్నిధిన నొనర్చె ♦ సఖ్యమంత.

---

* చక్రే౽గ్నిసాక్షికం సఖ్యం రాఘవస్సహలక్ష్మణః-అనిమూ. ఇట అగ్నిసాక్షిక మనుదానికి నగ్నిసన్నిధిని నొనర్చెనని తెనిఁగింపఁబడినది. సన్నిధినన్ అనుదానిచేఁ దై యర్థమునకు భంగమించుకంతయుఁ గలుగదని తెలియునది

చ. అని యొకబాణమేసి ప్లవ♦గాధిపు వాలిని సంహరించి యా
వనచరరాజుఁ జేసె నను; ♦ వారక యిందులకే ప్రతిక్రియన్
బొనరుప సర్వరీతులను ♦ బూనఁగనొప్పను; ధర్మమూని యి
వ్వనచరు నీదుసన్నిధికిఁ ♦ బంపెను రాఘవుఁ డిష్టదూతగన్. ౧౮౦ 2359

చ. వనచరవీరు లెల్లరును ♦ వచ్చి భవత్పురిఁ జుట్టుముట్టి నీ
ఘనబలసంచయంబుల వి♦కావికలై చను నట్లు చేయకుం
డ నిపుడె సీతఁ దెమ్ము రఘు♦నాథున కెంతయుభక్తినిమ్ము; మా
వనచరులన్ సహాయమును ♦ వారికిఁ జేయఁగఁ బిల్వ దానికై. ౧౮౧ 2360

క. సురపరిసరమునకుం జని, పరమాద్భుతశక్తిఁ జూపి ♦ బవరమున జయం
బరుదుగ వారికి నిచ్చిన, హరులప్రభావంబు నెఱుఁగ♦నతఁ డెవ్వఁ డిలన్.

క. అని నీతో సుగ్రీవుఁడు, దనుజేశ్వర జెప్పుమనియెఁ ♦ దప్పక యనఁగా
విని రావణుండు కోపంబున నతులిత నన్నుఁ గాల్పఁ♦బూనినరీతిన్. ౧౮౩

చ. కనుఁగొని క్రూరకర్ముఁడు ♦ గాన దురాత్ముఁడు వాఁడు నాదుశ
క్తిని నెఱుఁగండు గావునను ♦ తేఁకువ నన్ను వధింప నాజ్ఞని
చ్చె నతనిసోదరుండు గురు♦సేవ యొనర్చిన బుద్ధిశాలియై
తనరువిభీషణుం డపుడు ♦ దానవనేతకు నానిమిత్తమై. ౧౮౪ 2363

తే. చాలసారులు వేఁడుచు ♦ సాధుభణితి
దానవేశ్వర ! యటుచేయఁ ♦ దగదుసుమ్ము
వదలుమీ నిశ్చయంబును ♦ బట్టువల యి
దగును నృపధర్మశాస్త్రాళి ♦ కరయ దప్ప. ౧౮౫ 2364

చ. నరపతి ధర్మశాస్త్రముల ♦ నాథ! యదెచ్చటనైన దూత యె
క్కరణినినైన వధ్యుఁడని ♦ గానఁగ రాదు స్వనాథునాజ్ఞచే
నరిగి హితంబుపల్కెడు న♦రాధిపుదూత యథార్థవాక్యమే
పరనృపుచెంగటన్ భయముఁ ♦ బాసి వచింపఁగనొను స్వేచ్ఛఁగన్. ౧౮౬

క. అనుపమవిక్రమశీలా, విను దూత యదెంతతప్పు ♦ విడువక యొనరిం
చిన వానియంగవికలత, నొనరింపఁగ వచ్చుఁ జంప♦నొప్పదు సుమ్మీ. ౧౮౭

క. అని శాస్త్రంబులుచెప్పెడు;, ననిన విభీషణునిపల్కు ♦ లాలించి యతం
డును రాక్షసులను గని యి, ట్లను గాల్పుఁడు వీనితోఁక ♦ నానురులారా!.

సీ. అనియాజ్ఞ చేయ న♦య్యసురులు శణవల్కములను మాసినవస్త్ర♦ములను దెచ్చి
వాలమునకుఁ జుట్టి♦భయనవిక్రములై నయా రాక్షసులుపూని♦నాగ్రహించి
బహురజ్జువులఁ గట్టు♦వడి పెక్కురాక్షసుల్ చుట్టుముట్టఁగ బాధ♦పొక్కుచున్న
గాఢతాడనముష్టి♦ఘాతంబులను నొవ్వఁ జేయుచుఁ గోఁకకుఁ ♦ జిత్రగాను

తే. నెలమి ముట్టించి; రంతట ♦ నెల్లఁ గూర
దనుజు లిటు నన్నుఁ గొని పుర♦ద్వారమార్గ
మునకుఁ జనుదెంచి యందుఁ దా ♦ రొనరిచినమ
హాత్తరం బగుకృత్యంబు ♦ నఱచి చెప్పి ౧౫౭ 2368

క. [1]పలువిధముల బాధింపఁగఁ, గలఁగినమదితోడఁ దొంటి♦కాయమ్మును ని
మ్ములఁ గుంకఁజేసి బంధం,బులు నన్నిఁటిఁ బాపుకొనుచుఁ ♦ బొంగెడుకాంక్షన్.

తే. తొంటిరూపంబుఁ గైకొని ♦ తోఁచినగతి
వదరుచున్నట్టిదనుజులఁ ♦ బరిఘ మూని
చంపి; యంతట నేనును ♦ జవముమీఱ
నాపురద్వారమును జేరి ♦ యాత్మ నెంచి. ౧౫౯ 2370

చ. పురమును సాట్టగోపురము ♦ భూతభయంకరవాలవహ్ని నా
తురమునఁ గాల్చినాఁడ మును ♦ తోరపువేడుకచే లయాగ్ని వి
స్ఫురదురుతేజ మొప్ప నిల ♦ భూతగణంబును గాల్చురీతి; న
క్కరణిని గాల్చి సీతయును ♦ గాలెనొకో పురమెల్లఁ గాలెఁజూ. ౧౬౦ 2371

సీ. కాలనిభాగ మొ♦క్కడఁ జూచినను లేదు సీతయుఁ గాలెను ♦ సిద్ధ మిద్ది
నగరంబుఁ గాల్చుచు ♦ నారీమణిన్ సీతఁ గాల్చితే యుందు ని♦క్కమిది సంశ
యము లేదు; రాముని♦హా కార్యమంతయుఁ బాడుచేసితి నని ♦ పరమదుఃఖ
వివశచిత్తుఁడనయి ♦ వేదనఁ బొందితి; నంతఁ జారణులు వి♦య త్తలమున

తే. జానకియుఁ గాల్పఁబడ లేదు ♦ సత్యమిద్ది, పత్తనం బిద్ది కాలె నా♦పడఁతి కాల
కున్న దేమద్భుతం బని ♦ యెన్నుకొనుచు, భాషురాన్వితవాక్యల ♦ నాలకించి.

క. [2]మనమునఁ జిత్రముశోఁషం,గను సీత నశింపలే ద♦ఖండనియతి నం
చనితోఁచె నిమిత్తంబులు, కనఁబడియె శుభాస్పదములు ♦ కడునడి నాకున్.

క. వానినిబట్టియు నృత్యుప్తు, జానకి గనలే దటంచు ♦ స్వాంతమ్మున నే
జానుగ నెంచితి; మఱి వై,శ్వానరుదీప్తును నాదు♦వాలము వదనన్.

తే. మండుచున్నను నను నగ్ని ♦ మహితశక్తిఁ
గాల్పదయ్యె; నామనను ని♦కామతృప్తి
నందియున్నది వాయు వ♦త్యధికసురభి
యగుచు వీఁచుచు నున్నాఁడు ♦ హారిరీతి. ౧౬౧ 2375

క. ఫలవంతములుగఁ దగునీ, యలఘునిమిత్తములచేత ♦ నత్యమలగుణం
బులఁదగురాముప్రభావం,బుల, సూనృతసిద్ధవాక్య♦ములచేతఁ గడున్. ౧౬౨

1 తతో౽హం సుమహాద్రూపం సంక్షిప్య పున రాత్మనః- అనిమూ. 2 తతో మే బుద్ధిరుత్పన్నా...నిమిత్తై శ్చోపలక్షితా- అనిమూ.

క. జనకజ నశింపలేదని, మనమున నేనెఱిఁగి యటుఁ బ్ర♦మద మొందితి; నేఁ
జని మరల సీతనుంగని, యనుమతిఁ గొని లంకఁ జెంత♦నగుభూధరముల్. ౧౬౩
ఆ. చిత్రశృంగ మగుచుఁ ♦ జెలఁగునరిష్టనా, మమ్ము నెక్కి వేగ ♦ మిమ్ముఁ జూచు
తలఁపు తొందరింప ♦ జలనిధిదాఁటితి;, నంతఁ జంద్రసూర్య♦లయ్యనిలుఁడు.
తే. సిద్ధగంధర్వు లెప్పుడు ♦ చెలఁగి కొల్చు
చుండు నాకాశపథమున ♦ నురుజవమున
వచ్చి చూడంగఁగంటి మి ♦ మ్మిచ్చటఁ దమి;
నేను శ్రీరాముమహిమచే ♦ మీఁసియతిని. ౧౬౪ 2379
క. వనచరనాథుని కార్యం,బుధు జేసితిఁ గొఱఁతపడని♦పోలిక; నందే
నొనరిచితి యథాయుక్తము, గనె యిఁకఁ జేయఁదగుదానిఁ♦గావింపఁదగున్.

ఏఁబదియేనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ౫౯ - వ సర్గము.

హనుమంతుఁడు స్వబలాదులఁ గొంచెము చెప్పుట.

క. అనిలాత్మజుఁ డీరీతిగ, జనకజఁ గనినట్టివార్త♦సర్వము వినిపిం
చెను మరలమీఁదివాక్యం,బును జెప్పఁగ వారితోడఁ ♦ బొలువుగ వనియెన్.
క. జానకియు శీలవతియే, కానన్ శ్రీరామచంద్రు♦ఘనయత్నము నా
వానరపతియుత్సాహము, జానుగ సఫలంబు లగుచు ♦ సరగున నింకన్. ౨
క. మామకచిత్తము మందే, యామానితశీలయందు ♦ నతిభక్తియుతం
బై మగ్నమయ్యె; రాక్షస, భూమీశుఁడు రావణుండు ♦ భూరితపమునన్. ౩
క. జగములఁ గాల్పంగల్గును, దగఁ గ్రోధియెయైన లోక♦తతులం గాల్పం
గఁ గలఁడు సర్వవిధంబుల, జగములలో మేటితపసి ♦ సత్యము సుండీ. ౪
ఆ. [1]సాధ్వియైనయట్టి♦జనకజ స్పృశియించి, తపముబలిమి దనుజ♦తల్లజుండు
చావకున్నవాఁడు; ♦ సతిసీతఁ గరమునఁ, దాఁకినట్టులైనఁ ♦ దక్షణంబ. ౫
క. వనితామణియత్యాగ్రహ,మున రేఁగి దహించినట్లు ♦ మునుకొని కార్చి
చ్చును గాల్పఁజాల దాసతి, తనపతిచే నతని సమర♦ధాత్రిని బెలువన్. ౬
క. మృతినొందింపఁదలంచెను, హితమగునీకార్యసిద్ధి ♦ యిట్లున్నది నే
నతిముదమున నిచ్చటి యుద్ధతులగు నీప్లవగముఖ్య♦తతులన్ మిమ్మున్. ౭
ఆ. అనుమతింపఁజేసి ♦ యాలంకకే నిప్డు, మరలఁబోయి సీతఁ ♦ గరముభక్తిఁ
బిలుచుకొని చెలంగు♦వీర్యంబునన్ సీతఁ,గూడి రాఘవులను ♦ గోర్కి మీఱ. ౮
క. [2]కనుటే యుక్తంబని నా,యనుమతమిది; నేను నొకఁడ♦నైనను నటఁ గ

---

1 తస్య తాం స్పృశతో గాత్రం తపసా నవినాశితమ్-అనిమా. 2 తాం లంకాం అహం హంతుం రావణం చ మహాబలమ్-అనిమా.

ల్గినదనుజుల బలశాలిని, దనుజాధిపుఁ జంపఁగలను ♦ దర్పము పొంగన్. ౬

సీ. వీరులై బలమునఁ ♦ బెంపొందె మతిమంతులై యస్త్రవిద్యయం ♦ దాఱితేఱి
శూరులై విజయకాం♦క్షులు నైనమిముఁ గూడియుండ నేనిఁక వారి♦నుక్కడంపఁ
జాలుదు నని చెప్ప♦నేల?; నేనొక్కండ సంగరంబున రాక్ష♦సప్రవరుని
నతనిబలంబుల ♦ నాత్మజసోదరులను భృత్యులను జంపె♦దను, మఱియును

తే. నింద్రజిత్తు బ్రహ్మాస్త్రంబు ♦ నిద్ధరౌద్ర
వాయువారుణములు నింద్రుఁ♦డేయధిపతి
గాఁగఁగల్గినయస్త్రంబు ♦ గడఁగివైచు
నేని విదళించువాఁడ న♦వ్వాని నెల్ల. ౧౧ 2390

చ. [1]దనుజులఁ ద్రుంచువాఁడ నిఁకఁ ♦ దా రనుకంప ననుజ్ఞ యిచ్చినం
జని దశకంఠునిం బ్రబల♦సాహసమూని వధించువాఁడ నే
నని మొన సందులేక బల♦మార నిగుడ్చెదునశ్మవృష్టి దే
వనికరముల్ వధించు సుర♦వైరులఁ జంపుట యొక్కచిత్రమే. ౧౨ 2391

చ. జలనిధి కట్టదాఁటినను ♦ జయ్యనదాఁటును, బర్వతంబులుం
జలనము నొందినం బ్రబల♦శౌర్యము మీఱఁగ నొందఁ గాని శ
త్రులబలమెట్టిదైన మది ♦ రోషము నూనినజాంబవంతునిం
గలనఁ జలింపఁ జేయఁగను ♦ గల్గు నెయెన్నితెఱంగులన్ ధరన్. ౧౩ 2392

చ. దనుజులసేనలం బ్రబల♦దర్పసమగ్రుల సైన్యముఖ్యులన్
ఘనతరవిక్రమం బలరఁ♦గా వధియింప నొకండె వాలినం
దనుఁ డితఁడే సమర్థుఁడగు; ♦ దారుణశౌర్యమునం జెలంగునీ
పనసుని యూరువేగమునఁ ♦ బర్వతరాజి వడంకు నాజిలోన్. ౧౪ 2393

ఆ. మహితచిత్తుఁడైన♦మననీలునూరువే,గమున మందరాద్రి♦కంపనంబు
నందు నింక యుద్ధ♦మందు నీరాక్షసు,లుక్కడంగుదు రను♦టొక్కపలుకె. ౧౫

క. సురగంధర్వులయందు న,సురులందున్ యక్షులందుఁ ♦ జొక్కపుఘనులం
దరసినఁ బక్షులయందున్, దురమున మైందద్వివిదుల♦తో మార్కొనఁగన్.

క. చాలినవాఁ డెవ్వఁడు! మీ, రాలోచింపుఁడు; కపీంద్ర ♦ లశ్వికుమారుల్
గ్రాలుదురు వీరు బలములఁ, జాలరు వీరికిల నెవరు♦సంగరమందున్. ౧౬

క. [2]వనజాసనువరమున న,త్యనుపమదర్పిష్ఠునంది ♦ రమృతంబును ద్రా
వినవారు వనచరోత్తము, లనఁదగియున్నారు; పూర్వ ♦ మయ్యజుఁ డొకటన్.

తే. వీరితండ్రుల నెలమిని ♦ గారవింప, నెవరికిని వీరిఁజంప న♦నువుపడనిమ
హావరంబును గరుణించె; ♦ నావరమున, మత్తులై దేవసేనల ♦ మారుకొనుచు.

---

1 దేవానపి రణే హన్యాత్ కిం పున స్తాన్ నిశాచరాన్-అనియూ. 2 అమృతప్రాశినా వేతౌ సర్వవానరసత్తమౌ-అనియూ.

క. కలగుండుపడం జేయుచుఁ, జెలఁగుచు నమృతంబుఁ ద్రావి ♦ క్షితితలమందున్
వెలసిరి; తక్కినకపివ,ర్యులమాట యటుండనిండు ♦ యుద్ధమునందున్. ౨౦

చ. ఇరువురు వీరె క్రుద్ధులయి ♦ యేర్తెఱమీఱఁగ లంకఁ బొల్చునుం
జరహయసంతతిన్ మఱియు ♦ స్యందనరాజి నశింపఁజేయ నే
ర్తురు; దనుజేంద్రపత్తనముఁ ♦ దోరపుశక్తిని నేనొకండనే
నురలు నుతింపఁ గాల్చి తగఁ ♦ జూర్ణముచేసితి నందఱుం గనన్. ౨౧॥ 2400

తే. రాజమార్గంబులందును ♦ రాక్షసులకుఁ
దెలియ నాపేరు చాటించి♦తిని; మహాబ
లుఁడగురాముఁడు నాలక్ష్మ♦ణుఁడును మిగుల
నందఱను మీఱియున్నవా ♦ రవనియందు. ౨౨॥ 2402

సీ. రామాభిపాలితుం♦డై మహీసుగ్రీవుఁ డుత్కృష్టుఁడై తగ♦నున్నవాఁడు;
నేనును గోసల♦నృపుఁడగుశ్రీరామునకు దాసుఁడను వాయు♦నందనుండ
హనుమంతుఁ డనువాఁడ♦నని యెల్లతావులఁ జాటితి; సాధ్వియా♦జనకతనయ
కఠినాత్ముఁడైనయా♦క్రవ్యాదపతి యశోకవనికళింశుపా♦ఖ్యతరువరము

తే. క్రింద రాక్షసకాంతలు ♦ కృత్రిమస్వ,భావ లెల్లను దనుఁగావ ♦ బహుళశోక
తాపకర్శితయై మేఘ♦తతివిలుప్త,శశికళం బోలి తనతను♦చ్ఛాయతఱుగ. ౨౩

క. బలదర్పితుఁ డగురావణుఁ, గలనైనఁ దలంప కాత్మ♦కాంతుని సతముం
దలఁచుచు నున్నది చూచినఁ, [1]గలిగెడుఁ గఠినాత్మునకును♦గరుణ మనమునన్.

ఆ. అవ్వరారోహ జానకి ♦ యతిపవిత్ర,చరిత చెఱఁబెట్టఁబడియె రా♦క్షసుని చేత
నైన నాసాధ్వి రాముని♦యందె చిత్త,మంతయును జేర్చి యెల్లప్పు♦డాత్మనాథు.

క. ధ్యానించు చతనియందే, యూనినయనురాగయుక్తి ♦ నొప్పెడుఁ జండీ
[2]యానహుషుఁడు చెఱఁబట్టినఁ, దా నింద్రునియందె శచి ము♦దమునిడినట్టుల్.

క. మనుగట్టినయంబరమిం,కను విడువక ధూళిఁబ్రుంగు♦కాయముతోడన్
ఘనశోకతాపదీనాం,గనిచయము, తగంగ నాత్మ♦కాంతహితరతిన్. ౨౭

క. ధరణిని గూర్చుండినయది;, తరుణియుఁ బ్రమదావనమున ♦ దనుజవనితలె
ల్లరు చుట్టుకొనఁగఁ బొక్కుచు, విరూప లగువారు పెక్కు♦విధములఁ దన్నున్.

క. పలుమఱు బెదరింపఁగ నా,కులమతియై యుండఁ గంటి; ♦ క్షోణిసుతయున్
సులలితకేశము నొకజడ,గ లలిం బెనుచుకొన సతము♦కాంతుఁ దలఁచుచున్.

తే. దీనయై ధాత్రిని బరుండి ♦ తాను హిమము
నందుఁ బద్మినివలె నవ♦యవము లెల్లఁ

1 మూలార్థమును బోషించుననని యిది క్రొత్తగాఁ జేర్పఁబడినది. 2 పాఠాంతరము: పులోమజా పురందరే.
అనిమూ. నహుషనిర్బంధ ఇతిభావః-అనివ్యాఖ్యా.

గాంతి విడనాడ కున్నది; ♦ కర్బురేశుఁ
డామె వశపఱుపంగ మా♦య లోకశాన్ని. ౩౧ 2409

క. పచరించెఁగాని యవ్వని,త చలింపకయుండె; మఱియుఁ ♦ దరుణీతిలకం
బచటనె మరణము గనఁగఁ ద,లఁచి నిశ్చితచిత్త యయ్యె ♦ లంకాపురిలోన్.

ఆ. హరిణశాబనయన ♦ నామె శ్రమంపడి, నన్ను నమ్మునట్లు ♦ నయముమీఱఁ
బలికి నమ్మకంబు ♦ గలుగఁ జేసికొంటి, నవలఁ గార్య మెల్ల ♦ నామెతోడ. ౩౨

క. ఉపపాదించితి నాసతి, యపు డాత్మన్ రామవనచ♦రాధిపసఖ్యం
బు పరమశుభదాయకమని, యపరిమితామోద మందె ♦ నగచరులారా. ౩౩

సీ. జనకపుత్త్రికయందు ♦ సాధుతరాచారనియతులున్నవి భర్త♦పయి నితాంత
భక్తి యుత్తమమయి ♦ పరఁగుచున్నది యైననాసాధ్వి కృ♦తాపరాధు
దశకంఠునిం బూన్కిఁ ♦ దానయి యేలొకోవధియింపరాదన్న ♦ వానికెట్టి
శాపమొసంగినఁ ♦ జావు దుష్టము గల్గ దటుకాన శ్రీరాముఁ ♦ డతనిఁ జంపఁ

తే. గా నిమిత్తమాత్రంబగుఁ♦గాని సీత
యే నిమిత్తకారణ మగు; ♦ నింతి ప్రకృతి
చేతనే సూక్ష్మదేహయా ♦ సీతఱేఁ బతి
విరహకర్శితయయ్యె నో♦వీరులార. ౩౪ 2413

క. *ప్రతిపత్తునఁ జదివెడునే,యతిమూర్ఖుం డతనివిద్య ♦ యనుదినము కృశిం
చి తగం జెడెడువిధంబున, నతికార్శ్యమునందె యేమి♦యనువాఁడ నికన్.

తే. అమ్మహాభాగ శోకతా♦పాభిభూత
యయ్యె దానికిఁ బ్రతికార ♦ మరసి చేయఁ
దగిన దేదియొ దాని నం♦తయును మీరు
చేయుదురుగాక యంచని ♦ చెప్పె హనుమ. ౩౫ 2415

ఏఁబదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౬౦ - వ సర్గము.

అంగదాదులు సీతను దెత్తు మన జాంబవంతుఁడు వల దనుట.

క. అనుహనుమంతునిపల్కుల, విని యంగదుఁ డిట్టులనియె; ♦ వినుఁడు మదుక్తుల్
వనచరులారా! జానకిఁ, గనియును జేకొనక యామెఁ ♦ గడువడి మనముల్. ౧

క. అనఘాత్ముఁ డైన శ్రీరా,మునిచెంతకుఁ బోవ యుక్త♦ముగఁ దోఁపదు; మీ
రనయము శూరులుగా నుతిఁ, గని సీతం గంటి మంతె♦కాని జనకజన్. ౨

క. కొనిరాలేదని రామున,కును దెల్పు టయుక్తమ♦గున్ నాకిది చ
క్కనిదిగఁ దోఁపదు; నిర్జర, దనుజులయందైన లోక♦తతులం దెవరున్. ౩

* ప్రతిపత్పాఠశీలస్య విద్యేవ తనుతాం గతా - అనిమూ.

క. మనతో సమముగ నాకసమున నెగిరెడువారు లేరు; ♦ మునుకొని శౌర్యం
బునసల్లి; దనుజవీరుల, హనుమంతుఁడు దునిమెఁ జేయ♦నగు నే మచటన్. ౪

క. కనుకం జని మనమెల్లను, జనకజఁ గొనిపోవుదము వి♦శాలఖ్యాతిం
గనవచ్చు; ననఁగ నంతట, వనచరతల్లజుఁడు జాంబ♦వంతుఁడు మదిలోన్. ౫

ఆ. ఎల్లకార్యరీతు ♦ లెఱిఁగినవాఁడౌట
నంగదునితలంపు ♦ నరసి హర్ష
మంది యర్థవంత ♦ మగువాక్యసం బల్కె
నతనితోడ నిట్టు♦లని: కుమార. ౫½ 2421

క. మీరాలోచించినఁ దగు, నీరీతియు యుక్తమనుచు ♦ నిట మాకెల్లన్
భూరితరంబుగఁ దోఁచెను, శ్రీరామునియాజ్ఞ యెట్లు♦చెల్లునొ దానిన్. ౬

తే. అనుసరించి వర్తింపఁగ ♦ నౌనుగాన
నతనిమతి యెట్లులుండునో ♦ యల్లె యీమ
హాత్తరంబగు కార్యంబు ♦ నాచరింపఁ
జూడుమా చిత్తమందు నెం♦చు మిసుమంత ౬½ 2428

అఱువదియవ సర్గము సంపూర్ణము.

---

## ౬౧ - వ సర్గము.

హనుమదాదులు కిష్కింధకుఁ బోవుచు మధువనమునఁ దేనెఁద్రావ దధిముఖుఁ డాక్షేపించుట

క. అన నంగదహనుమత్ప్రముఖ, ఘనిఖిలవనచరులు భల్లు♦కప్రవరుని మా
టను నీయకొనిరి; పిదపన్, వనచరపుంగవులు వారు ♦ వాయుతనయునిన్. ౧½

క. ముందిడుకొని సంతోషము, నొందుచును మహేంద్రశిఖరి♦నొయ్యనవిడి యా
మందరసుమేరుముఖగిరి, బృందమువలె మత్తదంతి♦బృందము వగిదిన్. ౨½

క. పెనుకాయంబులఁ దగుటన్, వినువీథిని గప్పివుచ్చు♦విధమున వారం
త నెగసిరి పైకి; భూతౌ,ఘనిరతపూజితుఁడు వేగ♦కలితుఁడు బలియున్. ౩½

క. ధీరుఁడునగు హనుమంతుని, గారవమున స్వీయదృష్టి♦గణముల సతముం
గోరికఁ గొనిపోయెడుగతి, వీరులు తత్కపులు చూడ ♦ వెలసిరి పిదపన్. ౪

చ. వనచరులెల్లఁ బట్టుసల ♦ వర్ధిల వచ్చినకార్యమంతయున్
మునుకొని సాగి సిద్ధిఁగని ♦ మోదము నీయఁగఁజాలియుంటరా
మునిపని సిద్ధిఁబొందుటయుఁ ♦ బొంగుచుఁ బోయి తదీయవార్తఁ జె
ప్పను ద్వరనొందుచున్ సమర♦వాంఛలఁ బూనుచుఁ బ్రీతిమీఱఁగన్. ౫

క. శ్రీరాఘవునకుఁ బ్రత్యుప,కారము చేయంగఁదలఁచి ♦ కడఁగి తదద్రిన్
భూరితరంబును విడి యపు,డేరయమున నాకసమున ♦ నెగసిరి ప్లవగుల్. ౬

క. సురమార్గంబునఁ జను చం, తరమున నందనసమాన♦ధర్మముఁ గనుచున్
దరువరలతాభియుతమై, పరమంబగు వనముఁ గనిరి ♦ ప్లవగము లంతన్. ౭

క. అది మధువన మనఁగా నిల, విదితము సుగ్రీవుఁ డగుచు ♦ విభుఁ డావని క
య్యది భూతౌఘావృత్యము, పొదలు మనోజ్ఞముగ మిగుల♦భూమిస్థలిలోన్.

క. దానిని దధిముఖుఁ డనియెడు, వానరపతిమేనమామ ♦ వరమతి సతమున్
దానయి కాచుచు నుండును;, వానరపతిచిత్తరమ్య♦వనమున్ దానిన్. ౯

క. పరమామోదముతో గురు, తరమగునుత్సాహ మొలయఁ♦దత్కృపు లోగిఁ జొ
చ్చిరి; దానిమహిమఁ గన్గొని, బరవసమున మధువుఁ ద్రావ♦ బద్ధాదరులై.

సీ. మధుపింగళచ్ఛాయ ♦ మైనిండఁ దగునట్టియావానరులు మధు♦వనసమాఖ్య
గలుగునాతోఁటను♦గని తేనియలఁ ద్రావనాసఁ బూనుచుఁ బోయి♦యంగదుఁ గని
ప్రార్థించి; రంతనా♦ప్లవగముఖ్యకుమారుఁ డాజాంబవత్ప్రిము♦ఖాఖిలవన
చరవృద్ధులయనుజ్ఞఁ ♦ బరమాదృతిం గొని యావానరులకుఁదా♦నాజ్ఞ యిచ్చె;

తే. వార లత్యంతహృష్టులై ♦ వాలితనయు
ననుమతిం గొని మోద మ♦త్యధికముగను
బొంగఁ దత్ప్రీతులయి యు♦బ్బున ననల్ప
నర్తనము చేయసాగి రం♦దముగ నంత. ౧౩ 2434

క. కొందఱు పాటలు పాడిరి, కొందఱు తలక్రిందుగాఁగఁ ♦ గోరి పడిరి వే
కొందఱు నృత్యము సల్పిరి, కొందఱు ప్రహసించిరెలమిఁ♦గొందఱు కోఁతుల్.

ఆ. వెల్లకిలఁగఁ బడిరి ♦ వెసఁ బరుగెత్తిరి
కొంద ఱెగిరి రవలఁ ♦ గొంతమంది
యార్చి రొకరి నొక్క ♦ రాశ్రయించిరి కొంద
ఱొకట బిగియఁబట్టి ♦ రొకరి నొకరు. ౧౪ 2436

క. ఒరులం గని తగ భాషిం, చిరి కొంద ఱితరులఁగూడి ♦ చెలఁగుచుఁ గ్రీడిం
చిరి యొక్కచెట్టునుండియె, యరుదుగ నొకచెట్టుదరికి ♦ నరిగిరి వేడ్కన్.

క. వారివరు లుర్వీజాగ్రో, త్కర మెక్కియె దుమికి రట్టె ♦ ధరణికి నట్లే
యురవడి క్షితినుండి మహో, తరునికరాగ్రములపైకిఁ ♦ దగ నెక్కి రటన్.

సీ. ఒకఁడు పాడంగ మ♦ఱొకఁడు మిక్కిలినవ్వుచును వానిపైఁ బడ♦జనునొకండు
ప్రహసింపఁగా విలా♦పముచేయుచును నొక్కఁ డాతనిపైఁ బడు♦నట్టు లేడ్చు
చుండఁగాఁ గాంచి మ♦ఱొక్కఁడు వానిని నవలఁ ద్రోయుచును బై♦నడరునట్లె
వానిని గని యొక♦వనచరుఁ డార్చుచుఁ బైఁబడు; నొకపి♦పటల మెల్ల

తే. మధువు నతిశయముగఁ ద్రావి ♦ మత్తుగొనుచు
నత్వచేష్టలు పెక్కులు ♦ సరభసముగఁ

జేయుచుండెను మత్తును ♦ జెంద నట్టి
వాఁడు వారలలోఁ గాన♦రాఁ డొకండు. ౧౭ 2439

చ. మనసునఁ దృప్తిఁ గన్నకపి♦సుండనుఁ డొక్కఁడుగాని లేఁడు; త
ద్వనమును గాచుచున్నదధి♦వక్త్రుఁడు తేనెలఁ ద్రావుటల్ మహీ
జనికరపత్త్రపుష్పతతి ♦ చాల వినాశము నొందుటల్ గనుం
గొని యలవానరోత్తములఁ ♦ గోపము నొంది యడల్చె బిట్టుగన్. ౧౮

క. వనపాలకుండు వృద్ధుఁడు, వనచరపతి దధిముఖుండు ♦ వారలు మత్తుం
గొని తన్నుఁ దిరస్కరణము, నొనరించుచునుండ విక్ర♦మోద్ధతుఁ డగుచున్.

క. వనమును వారలు పాడుగ, నొనరింపకయుండఁ గావ ♦ నుద్ధతిఁ బూనెన్
వనచరులఁ దిట్టెఁ గొందఱి, దనకరతలములను గొట్టె ♦ దారుణరీతిన్. ౨౦

తే. కొందఱుండెడుకడ కేగి ♦ క్రూరమతిని
గలహ మొనరించెఁ గొందఱిఁ ♦ గాంచి సాధు
వాక్కులను బల్కి వారించె; ♦ వాఁడు తమ్ము
నిట్లు బలవంతముగ వల ♦ దీపని యని. ౨౧ 2443

క. వారించుచుండ భీతిని, వారలు విడనాడి వేగ ♦ వరుసఁగ నొకచోఁ
జేరి యొకింతయు సంశయ,వారితచిత్తులును గాక ♦ వాక్కుల నతనిన్. ౨౨

తే. ధిక్కరించుట యేగాక ♦ యిక్కరణిని
దా నొనర్చుట తప్పని ♦ తలఁప కతనిఁ
బట్టి యీడ్చిరి; మత్తిల్లి ♦ యిట్టు లతనిఁ
గోళ్లఁజీఱియుఁ బండ్లచేఁ ♦ గొఱికియుఁ దగ. ౨౩ 2445

క. కరతలములఁ గాళ్లను భీ,కరబలములఁ దన్నుచున్ ని♦కామము వనిలోఁ
బరఁగెడువస్తువుల నొన,ర్చిరి పాడుగ స్వేచ్ఛఁ బూన్కిఁ♦జెలఁగుచు నంతన్.

అఱువదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## ౬౩ - వ సర్గము.

దధిముఖుఁడు వానరబాధితుఁడై సుగ్రీవునికడకుఁ బోవుట.

చ. వనచరపుంగవుండయిన♦వాయుతనూజుఁడు వానరాళిఁ దా
గని యిటుపల్కె నుంతయును ♦ గ్రమ్మఱ కాదృతిఁ దేనెఁ గ్రోలుఁ డే
వనచరుఁడైన మిమ్ము మధు♦పానము చేయఁగనీయఁడేని నేఁ
బనివడి వానినడ్డెదను; ♦ వారక నెమ్మది సంచరింపుఁడీ. ౧ 2447

చ. *హరిపతియైనయంగదుఁడు ♦ నప్పలుకుల్ విని సుప్రసన్నుఁడై
హరిగణమెల్లఁ దేనె మన♦సారఁగఁ గ్రోలెడుఁగాక హనుమం

---

* అకార్య మపి కర్తవ్యం కి మంగ పున రీదృశమ్-అనియూ.

డరయఁగ బంపినట్టిపని ♦ నంతయు బావని చక్కఁజేసె నీ
హరివరుప ల్కృత్యతమ♦మైన నొనర్పఁగ నౌనిదేమిఁకన్. ౩౪ 2448

క. అంగదవక్త్రచ్యుతవా,క్యం గర మర్థివిని చాల♦కుతుకంబున న
య్యంగదుని బాగుబాగని, పొంగుచుఁ గొనియాడిరాక♦పుల్ మొత్తముగాన్.

చ. వనచరవర్యు లిట్టు లల♦వాలితనూభవు గారవించి ప్రో
దిని జవమొప్పునట్లు చను♦దెంచి మహీజముఁ గూల్చురీతి నా
వనమును బాడుచేయుటకుఁ ♦ బైఁబడి; రీగతి నంగదుండు నా
జ్ఞనిడుట వీర్యయుక్తులయి ♦ సాహసముం గనియుంట నింకనున్. ౬౪ 2450

క. అనిలజుమూలంబున సీ,తను జూచుట వినుట వారు ♦ తగఁ బాటవముం
గని వనముఁ జొచ్చి పాలకు,లను బలమునఁ ద్రోసి యటఁ గ♦లమధువునెల్లన్.

ఆ. తనివిదీఱఁ ద్రావి ♦ యనుపమరసముల, నలరుఫలములఁ దిని; ♦ రంతవారు
వనముఁ గావ నటకు ♦ వచ్చినవనపాల, [1]కులను గొట్టి రట్టె ♦ పలుతెఱఁగుల.

సీ. అందఱొక్కటఁజేరి ♦ యాఢకమాత్రంబు తేనెఁగల్గినయట్టి♦తెట్టియలను
గరముల బంధించి ♦ కడుపారఁ ద్రావిరి త్రాగిన తెట్టెల ♦ ధరణిఁబడఁగఁ
గొట్టుచునుండిరి ♦ కొందఱు; మధుపింగళాకృతిచ్ఛాయల ♦ నలరుకపులు
కొందఱు తేనెలఁ ♦ గొదువలేకుండఁగఁ ద్రాగి తెట్టెల నట్టె ♦ రేఁగిపాఱి

తే. [2]వైచి రొకకొంద ఱవ్వానిఁ ♦ బట్టుకొనుచు
మత్తులయి యొండొరులమీఱి ♦ మమత వీడి
కొట్టుకొనుచుండి; రంతటఁ ♦ గొందఱు తరు
శాఖలం బట్టుకొని క్రింది♦స్థలములందు. ౧౦౪ 2453

క. తేనెలఁ గ్రోలినమత్తున, నానెలవులయందె యుండి ♦ యామత్తు మఱిం
తైనన్ సోలుచు నాకుల, నానేలం బఱచుకొనుచు ♦ నట్టె సుఖముగన్. ౧౧

తే. తెలివితప్పి పరుండిరి; ♦ తేనెదైన, మత్తునన్ వెఱ్ఱి యెంతయు ♦ నెత్తినట్లు
సంతసంబున నితరుల ♦ నెంతొబలిమిఁ, బడఁగఁద్రోసిరి కొందఱు ♦ నడువలేక.

క. కడఁబదములు తొట్రిలఁగాఁ, బడుచుండిరి; మధుమదమున ♦ వానరు లట్లే
బెడిదపుసింహారవంబు ల,పుడు గావించి రొకచోటఁ ♦ బొంగుచుఁ బెలుచన్.

తే. పక్షు లట్లుగఁ గూయుచుఁ ♦ బరుగులిడుచు
నుండి రొకకొంద ఱవనిఁ బ♦రుండి నిద్రఁ
బొంది; రొకకొంద [3]ఱెట్లుచె♦ప్పుకొనఁ దగని
కార్యమును జేసి యట నవ్వఁ♦గాఁ దొడఁగిరి. ౧౩౪ 2457

---

1 తాడయంతిస్మ శతశః-అనిమూ. 2 మధూచ్ఛిష్టేన కేచి చ్చ జఘ్నురన్యోన్య ముత్కటాః-అనిమూ. ఉత్కటాః=మత్తాః-అనివ్యాఖ్య. 3 కేచి త్కుర్వంతి చేతకత్-అనిమూ. అన్యే అవాచ్యం కించిత్ గ్రామ్యం కర్మ కృత్వా హసంతి-అనివ్యాఖ్య.

క. వనచరు లొకకొందఱు చెప్పను సాధ్యముగానిపనిని ♦ బరులవలెనె తా
రొనరించిరి మఱికొందఱు, పనియట్టిది చేసి స్వీయ♦బంధుల కెల్లన్. ౧౪ 2158

ఆ. చెప్పుకొనిరి దానిఁ ♦ జేయనెంచిరి కొంద;, ఱావనమున దధిము♦ఖాఖ్యవనుపు
చేయుచుండుకపులు ♦ చిత్రబలంబులఁ, దనరునాకవు లిటు ♦ తమ్ము నొంప. ౧౪౻

క. భరియింపలేనిబాధలఁ, బరుగెత్తిరి దశదిశలకుఁ ♦ బాలకు లటపై
చరజానుఘాతముల భీ,కరబాధల నంది రంతఁ ♦ గపులు జవమునన్. ౧౫౻

క. [1]వారలకెల్ల నపాన,ద్వారంబులఁ జూపఁ గుత్సి♦తంబగుపనికిన్
వారలు కలంగి వగఁగొని, చేరువఁ దగుదధిముఖునిని ♦ జేరి యని రిటుల్.

క. హనుమద్దత్తవరంబున, వనచరు లీమధువనంబు ♦ బలవంతముగాఁ
బనివూని పాడొనర్చిరి, వినుమా మోకాళ్లఁబట్టి ♦ వే యెత్తి కడున్. ౧౬౻

ఆ. పలుకలేము వార♦పానమార్గంబులఁ, గనఁబఱచిరి నాఁగఁ ♦ గనలి యవ్వ
నంబుఁ గాచుకీశ♦నాథుఁడు దధిముఖుఁ, డావనంబు చెడుట ♦ కాత్మఁ గుంది.

క. హరిగణము నూఱడించుచు, బరవసమునఁ బల్కె రండు ♦ వనపాలకులా
ర! రయంబునఁ జనిమధు వా,తురమునఁ గ్రోలుచును బలము♦తోఁ దగువీరిన్.

క. మనమెల్ల నివారింతము, చనుదెం డనిపల్క; వినుచు ♦ సరగున వీరుల్
వనచరులు వారు దధివ,క్త్రునితోఁ గూడుకొని యమ్మ♦ధువనముఁ గావన్. ౨౦

క. చనిరంత దధిముఖుండును, ఘనతరువును బలముమీఱఁ♦గాఁ గైకొని యా
వనచరులనడుమ వేగం,బునఁ బరుగిడె నతనివెంటఁ ♦ బోయి రలకపుల్. ౨౧

క. ఆతనిసేవకకీశ, వ్రాతము కోపమున శిలలఁ ♦ బర్వతతరుసం
ఘాతములఁ బట్టుకొని యెం,దాతతకపు లుండి రచటి ♦ కరిగి రతిగతిన్. ౨౨

సీ. వీరులాకింకరుల్ ♦ విభునాజ్ఞ మది నిడుకొని సాలతాళముల్ ♦ ఘనశిలలును
దమకాయుధంబులై ♦ యమరంగ వేగంబ పరుగెత్తి భూజాళి♦పైని గ్రింద
నున్నట్టికోఁతుల ♦ నురుబలదర్పితులను మాఱుకొని రొక్క♦టను గడంగి
యంత మరుత్సూనుఁ ♦ డాదియౌ ప్లవగేంద్రు లతికోపమున వచ్చు♦నట్టి దధిము

తే. ఖునిని వనపాలకులను మా♦ర్కొనఁగవచ్చు
వారలను గాంచి వేగంబ ♦ తారు మాఱు
కొనిరి; ఘనభుజుఁడై బల♦మునఁ జెలంగి
యందమునఁ బొల్చు దధిముఖుఁ ♦ డంత వేగ. ౨౩౻ 2168

చ. కరమున వృక్షముంగొనుచు ♦ గాఢపరాక్రమ మొప్ప రాఁగ ని
ర్జరవరపౌత్రుఁ డంగదుఁడు ♦ సత్వర మాతనిఁ గోప మొప్పఁగాఁ

---

[1] దేవమార్గం ప్రదర్శితాః-అనిమా. దేవమార్గం అపానద్వారం దేశశ్లోఽత్ర. వాయు
వాచీ-అనివ్యాఖ్యా.

గరములఁ గొట్టె; మద్యము ని♦కామముఁ గ్రోలుటఁ [1]బూజ్యుఁ డీతఁడం
చరయఁగ నేరఁడయ్యె జవ♦మారఁగఁ జుల్కఁగ నావనాధిపుల్. ౨౭ 2469

తే. ధరణిఁ బడఁద్రోసి పిష్టంబు♦కరణి నలిపి
విడిచె; నావీరుఁ డంతటఁ ♦ దొడలు కరము
లల్లె మూఁపులు నలఁగ వి♦హ్వలత నొంది
రక్తసిక్తాంగుఁడై ముహూ♦ర్తంబు సోలి. ౨౮ 2470

చ. వనచరనాథుమాతులుఁడు ♦ భాసురతేజుఁడు నైనయాతఁడం
త నిజబలంబు తోఁప నతి♦దారుణరూపముతోడ లేచి భీ
తిని గలిగించుకోపమునఁ ♦ దెప్పున మద్యవిమోహితాత్ములన్
[2]వనచరులన్ స్వదండమున ♦ బాగుగ నిల్పె ననూనశక్తిచేన్. ౨౯ 2471

క. [3]వనచరపతిదధిముఖుఁ డా,వనచరతతినెట్లొ వేగ ♦ వదలి రహస్యం
బునకుం దగినస్థలంబున,కు నరిగి యిట్లనియె సేవ♦కులతో నార్తిన్. ౩౦ 2472

క. మనమెల్ల [4]భూరికంఠుం,బునఁదగుసుగ్రీవుకడకుఁ ♦ బోదము వీరిం
దె నిలిచియుందురుగా క,వ్వనచరపతి రామునొద్ద ♦ వదలక యుండున్. ౩౧

క. మన మాతనిచెంతకు వే, చని యీతప్పెల్లఁ బ్లవగ♦సత్తముఁ డగునీ
తనయునిదే యని తెల్పుద, మనయ మమర్షి యతఁడౌట ♦ నప్పలుకులకున్.

క. వనచరులనెల్లఁ జంపించును; నీమధువనము మిగుల ♦ సుగ్రీవునకున్
మనసున కింపైనదియున్, [5]జనకపితామహులనుండి ♦ సంభవ మగుచున్.

క. సురసంతానంబునకున్, దురాసదము నౌచు నుంటఁ ♦ దోరపుఁబ్రియముం
బరిపరిఁ గల్గించును; మధు,నిరతులు నల్పాయువులును ♦ నిర్దయులును నై.

ఆ. ఇందు నున్నవీరి♦కెల్లను వీరిమి,త్రులకు మరణశిక్ష ♦ గలుగఁ జేయు;
దుష్టచిత్తములను ♦ దోఁచువీరలు నృపు,నాజ్ఞ ధిక్కరించి ♦ రండుచేత. ౩౪

సీ. వధ్యులేయగుదురు, ♦ వనభంగమున కోర్వఁజాలనిమనరోష♦మోలి సఫల
మేయగు; ననిపల్కి ♦ యాయపారబలుండు దధిముఖుఁ డాకపి♦తతులఁ గూడి
యభ్రమ్మునకు దాఁటి ♦ యతిజవమునఁ బోయె; నొకనిమేషములోన♦నుగ్రరశ్మి
తనయుఁ డుండెడుచోటి♦కిని జేరె; మతిమంతుఁ డైనసుగ్రీవుని ♦ నామహాత్ము

తే. రామచంద్రుని లక్ష్మణు ♦ రమణఁ గాంచి
సమముగా నున్నభూమిపై ♦ సరభసమున
వ్రాలె నాకాశమునుండి; ♦ వనముఁ గాచు
వారలకు నీశుఁడై మహా♦వీరుఁ డగుచు. ౩౬ 2478

---

1 ఆర్యకం ప్రాహార తత్ర-అనిమూ. ఆర్యకః సుగ్రీవమాతులత్వా త్పూజ్యః-అనివ్యా.
2 వానరాన్ వారయామాస స్వదండేన-అనిమూలము. 3 ఉవా చైకాంత మాశ్రిత్య-అనిమూలము.
4 సుగ్రీవో విపులగ్రీవః-అనిమూ. 5 పితృపైతామహం దివ్యమ్-అనిమూ.

క. చెలువారుదధిముఖుఁడు భృత్యులతో దీనాస్యుఁడగుచు ♦ నొక్కెమొగిని శే
తుల శిరమునఁ గీలించుచుఁ, దలఁ బతి[1]శుభచరణములకు ♦ దాఁకనతుండిడెన్.

అఱువదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## ౬౩ - వ సర్గము.

{ దధిముఖుఁడు వనభంగముచెప్పఁగా సుగ్రీవుఁ డతని సాంత్వసించి వారలఁ దోడ్కొనిరమ్మని పంపుట. }

క. శిరసున మాతులుఁడయ్యున్, ధరణీశుం డనుచు మ్రొక్కి♦దధిముఖుఁ గని భా
స్కరతనయుఁ డట్టి మనమునఁ, బరమార్తిం బొంది యిట్లు♦పలికె నతనితోన్.

క. [2]మామా లెమ్మాలెమ్మా, యీమెయి నాచరణయుగళి ♦ నీవు పడుట యే
లా? మాటయిత్తు నభయం,బో మహితా! చెప్పవలయు ♦ నొగి నీవార్తన్. ౨

క. అనుచు మహాత్ముం డారవి, తనయుం డభయంబొసంగి ♦ తా నూరార్పం
గ నవలఁ బ్రాజ్ఞుఁడు దధిముఖుఁ, డనియెను వడి లేచి; వానరాధిప! వినుమా.

క. నీతండ్రి ఋక్షరజనుఁడు, భ్రాతయు వీరుండునైన♦వాలియు నీవున్
జేతమున నొప్పి పూర్వ మ,దేతఱినే మధువనమ్ము ♦ నెవరికినైనన్. ౩౪ 2483

ఆ. స్వేచ్ఛ ననుభవింప ♦ నిది విడువనిదియె, వనమునట్లు సొంపు♦తనరునదియు
నిపుడు కపులచేత ♦ నెల్లవిధంబుల, ననుభవింపఁబడియె ♦ నాలకింపు. ర 2484

చ. వనమును గాచుచున్నమన♦వానరు లిచ్చటనున్నవీరు వే
చని బెదరించినన్ గొనక ♦ సంతసమొప్పఁగఁ దేనెఁ ద్రావి య
త్యనుపమమంజుదివ్యసుఫ♦లాళిని దించును బొల్చువార; లా
వనచరు లొక్కకొందఱును ♦ బౌరుష మూని చెలంగువేడుకన్. ౫ 2485

తే. త్రాగ మిగిలిన తేనెను ♦ దాని పెఱల
ధ్వంసమును జేయుచున్నారు ♦ తగ వనపరి
పాలకులు పోయి వలదని ♦ పలుక వీరిఁ
గనుబొమలుచూపి నవ్వెద ♦ రనయులగుచు. ౬ 2486

సీ. ఈవనపాలకు ♦ లేగి సంరంభించి యిటనుండి పొండని♦యెంతయొత్తి
పలికిన నంగదా♦దులు క్రుద్ధులై వీరి బెదరించి రెన్నియో♦విధములుగను
వానరర్షభ! వీర! ♦ వానరు లావ్వరెల్లఁ గోపసంరక్తనే♦త్రులయి వీరిఁ
దఱుమఁగొట్టిరి; కర♦తలములఁ గొందఱఁ దన్నిరి, మఱియుఁగొం♦దఱనుజాను
తే. వులను బొడిచిరి కొందఱ♦కెలమిఁ బృష్ఠ
భాగమును జూపి; రిట్టులో♦ప్రభువరేణ్య

---

1 సుగ్రీవస్య శుభౌ మూర్ధ్నా చరణౌ-అవనీతః. 2 ఉత్తిష్ఠోత్తిష్ఠ-అవనీతః.

నీవు వెలయఁగ వీరుల♦సేవకులను
దావకాజ్ఞల శిరములఁ ♦ దాల్చువారి. ౯౪ 2487

క. బలములు మెఱయఁగఁ దన్నిరి;, యలరారెడుమధువనంబు♦నందలివిలస
త్ఫలముఖములఁ దిని త్రాగుచు, నెలమిం గనుచున్నవార ♦ లెల్లవనచరుల్. ౧౮

చ. అనియిటు విన్నవించుసమ♦యంబున శాత్రవవీరహంతయై
తనరుచుఁ బ్రాజ్ఞుఁడై సుగుణ♦ధాముఁడునై తగులక్ష్మణుండు కీ
శనృపతితోడ నాతనివి♦చారము నెంచి వచించె నిట్టు; లీ
వనపరిపాలకుం డితఁడు ♦ వచ్చినకారణ మేమొ యుత్తరా. ౧౧౪ 2489

క. దేనినిగుఱించి దుఃఖం, బూనినమదిఁ బల్కునిట్లు; ♦ పొందుగఁ జెపుమా
దీనినటంచు మహాత్ముం, డౌనరపతితమ్ముఁ డిట్టు♦లడిగిన నంతన్. ౧౨౪ 2490

తే. వాగ్విశారదుఁ డైనయా♦వనచరపతి, పలికె నాలక్ష్మణున కిట్టు ♦ లెలమిమీఱ;
వీరుఁ డీదధిముఖుఁ డు♦ర్వీన యమాశ, వెదకి వచ్చినయట్టి యం♦గదముఖులొగి.

క. నామధువనమునఁ దగుమధు, వేమాత్రము గొంకులేక♦యే త్రావి రటం
చీమాన్యుఁడు చెప్పెడు; నిపు,డామారుతిమొదలుగాఁగ ♦ నలకపివీరుల్. ౧౫

క. చనుదెంచుచునే యామధు,వనముం గని చొచ్చి మధువు ♦ వరఫలములఁ దృ
ప్తినిమీఱఁ ద్రాగి తిని రఁట, వనచరు లట కేగినపని ♦ వమ్మయియున్నన్.

క. తొలుతనె యిట్టియకార్యము, గలఁగక యొనరింప; రల్ల♦కపివీరులు నా
సులలితవనమును జొచ్చి య,సులఫలముఖములను దినిన♦మాట వినుటచేన్.

క. వారలు కార్యము సఫలము,గా రహి నొనరించి రనుట ♦ కడు స్పష్టమె యా
ధారణితనయను దమిఁగని,నా రిది నిశ్చయము; పవన♦నందనుఁ డొకఁడే.

క. *జనకజను జూచి యుండును, ననిలకుమారుండు తక్క ♦ నన్యులు కార్యం
బును దీనిఁ జేయఁజాలరు;, పని సాధించెడుసుశక్తి♦భవ్యధిషణయున్. ౧౬౪

తే. పౌరుషోత్సాహవిద్యలు ♦ ప్లవగవర్యుఁ
డైనపావనియందుండు; ♦ ననిశమెట్టి
కార్యమున జాంబవంతుఁ డ♦ఖండబలము
గలుగునంగదుఁడును నాయ♦కులుగ నున్న. ౧౯ 2497

క. హనుమయుఁ బరిపాలకుఁడై, తనరునొ యాకార్యమెల్లఁ ♦ దప్పక ఫలియిం
చునుగాని యన్యథాగతిఁ, జన; దంగదముఖ్యకీశ♦సత్తము లెల్లన్. ౨౦ 2498

క. చనుదెంచి వనమునంతయు, మనసునకుం దోఁచినట్టి♦మాడ్కి హతముచే
సినవారఁట వీరందఱు, చని గుంపుగ వల దటన్న ♦ జానుతలములన్. ౨౦౪

ఉ. వారలు వీరిఁ దన్ని రఁట ♦ వానరతల్లజుఁ డీతఁ డింపు చే
కూరఁగ మాటలాడఁగల♦కోవిదుఁ డద్భుతశౌర్యసాహసో

* కార్యసిద్ధి ర్మతిశ్చైవ తస్మిన్ వానరపుంగవే-అనియూ.

దారుఁడు సుప్రసిద్ధుఁడయి ♦ ధారణిపై దధివక్త్రుఁ డన్నయా
పేరున నొప్పు నాపయిని ♦ బ్రీతిని వచ్చెను దీనిఁజెప్పఁగన్. ౨౧ 2500

క. ఘనబాహూ! సౌమిత్రీ, జనకజఁ గనియుందు రీవి♦షయమును జక్కం
గను దలపోయుము నీవును, గనుకనె చనుదెంచి వారు ♦ కమ్రవనంబున్.

తే. చొచ్చి యందలిమధువుల ♦ నిచ్చవచ్చి
నట్లు త్రాగుచునున్నవా ♦ రలవనచరు
లతులబుద్ధిపరాక్రము ♦ లౌట సీతఁ
జూడకయె వచ్చియుండిన♦చో నిటువలె. ౨౩ 2502

క. పరమేష్ఠి నాదుతండ్రికి, వరముగ దయచేసియున్న♦భవ్యవనము నో
పురుషవరేణ్యా! వారలు, చొరఁబడుదురె ధైర్య మూని ♦ చోద్యముగాదే.

సీ. అంత ధర్మాత్ముఁడై ♦నట్టిలక్ష్మణుఁడును రాముండు సుగ్రీవు♦మోమునుండి
కర్ణసుఖంబును ♦ గలిగించునమ్మాట వెడలఁగా విని యప్డు ♦ విపులహర్ష
మొందిరి బలముల ♦ నొప్పునావీరులు; తర్వాతఁ జారుకం♦ధరుఁడు ప్లవగ
పతియును దధిముఖు♦పలుకుల నాలించి సంతుష్టుఁడై తదా♦స్యంబుఁ గాంచి

తే. పలికె నిట్లని; వీరు లా♦ప్లవగవరులు
కార్యసిద్ధిని గనినారు♦గాన మధువుఁ
ద్రాగినందుల కేను సంతసమునంది
తిని మఱియు నేనుజెప్పిన♦పనిని బూన్కి. ౨౬ 2504

క. ఒనరించి వచ్చియుందురు, గనుకం దచ్చేష్టలను స♦కామము క్షమియిం
పనుదగు క్షమించినాఁడను;, వినుమా మృగరాజదర్ప♦విలసితభుజులన్.

క. కృతకృత్యుల హనుమన్ముఖ, వితతమహాబలులఁ బ్లవగ♦వీరులఁ గనువిం
దు తగం గూల్చెడువారల, నతివేగమ చూడఁ దత్ప్రి♦యత్నము వినఁగన్.

క. నేనును రాఘవుఁడు సుమిత్రా నందనుఁ డిపుడు కోరి ♦ తమి నున్నామో
వానరవర్యా! యనియిటు, వానరపతి కార్యసిద్ధి♦వఱలె ననుమదిన్. ౨౮

క. కనుదోయయు వికసిల్లన్, దనువెల్లం బులకరింపఁ ♦ దనవలె హర్షం
బును గాంచురామలక్ష్మణు, లను గని కరగతము యయ్యె ♦ లలి నీపనియున్.

క. అనిపలికి దేహమంతయు, ఘనపులకాంకురయుతంబు ♦ గాఁగా మిఱిమిఱి
ఱినయానందము నొందెను, జనకజ గనఁబడియె నన్న♦సంతోషమునన్. ౩౧

అఱువదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౬౪ - వ సర్గము.

అంగదాదులు కిష్కింధకు వచ్చుట, హనుమకాంచితివి సీత నని రామునితోఁ జెప్పుట.

మ. అని సుగ్రీవుఁడు పల్కఁగా దధిముఖుం ♦ డత్యంతమున్ శ్రీరా
మునకున్ లక్ష్మణమార్గవుత్రులకు న♦మ్మోదంబు వెల్వార నం

దనముల్ చేసెను; శూరులౌకవుల నం♦తంగూడి యాకాశసీ
నుసుబొందెన్ ; దధివక్త్రుఁ డెంతయు వడిన్ ♦ మైకొన్నహర్షంబునన్. ౨ 2510

క. ముసు చనుదెంచినయట్లే, చని యభ్రపథంబునుండి ♦ త్ర్యాస్థలి వ్రాలెన్
వనముం జొచ్చె ననంతర,మున మధువనమునను గీశ♦ముఖ్యులు తమితోన్. 3

తే. [1]మధువు నుదకంబునున్ మూత్ర♦మార్గమునను
విడిచి మత్తును విడి లేచి ♦ కడుఁ జెలంగు
ప్లవగయూథవులను గాంచె; ♦ భక్తి నతఁడు
వారికడ కేగి యంజలిఁ♦బట్టి నిలిచి. ౪ 2512

క. వనచరపతి నాయంగదుఁ, గని తమి మధురోక్తు లలరఁ♦గా నిట్లనియెన్;
విను సౌమ్యా! వీరలు మి,మ్మును వారించి రని కోప♦ముం బూనకుఁడీ. ౫

క. తెలియమిచేతను గోపము,వలనన్ వీరెల్ల మిమ్ము ♦ వారించిరిగా;
బలవంతా! యువరాజవు, తలఁపక యీవనమునకును ♦ ధరణిపుఁడవె నూ. ౬

తే. తెలియ కొనరించినట్టిత♦ప్పుల క్షమింప
వలయు; ననఘా! వడిన్ నేను ♦ నలఘుగతిని
బోయి నీపినతండ్రితో ♦ మీాయనుంగు
వానరులు వచ్చినా రను♦వార్తఁ దెలుప. ౭ 2515

చ. వనచరవర్యులం గలిసి♦వచ్చితి వీవని తెల్పి సమ్మదం
బునుగనె నీవు వీరలును ♦ బూనిక నీవనమెల్లఁ బాడుచే
సిన బెడిదంపువార్తవిని ♦ చిత్తము నం దినుమంతకోపముం
గనఁడు; భవత్పితృవ్యుఁడగు♦కంజహితాత్మజుఁ డట్లుహృష్టుఁడై. ౯ 2516

తే. వారి నందఱ జవమునఁ ♦ బంపు మిచటి
కనుచు నాకాజ్ఞ యిడె; నని ♦ యాదధిముఖుఁ
డతిమధురవాక్కులం బల్కి ♦ నాలకించి
వాగ్విశారదుఁడైన యా♦వాలిసుతుఁడు. ౧౦ 2517

క. వనచరులం గని యిట్లని,యెను గీశవరేణ్యులార! ♦ యెల్లరిపుల శ
క్తిని జెండెడుమీారలు వినుఁ, డనుపముఁడగురామభద్రుఁ ♦ డందఱ మిటకున్.

ఆ. వచ్చియున్నవార్త ♦ వనచరపతియైన, యితనివలనవినియె ♦ నిప్పు డనుచు
శంక నొందువాఁడ;♦నింకఁ గార్యమును సా,ధించినట్టిమనము ♦ తెగువఁబూని.

క. నిలువఁగరాదిటఁ బ్లవగం,బులు మధువును స్వేచ్ఛఁ ద్రావి ♦ పొదలిరి కష్టం
బులఁ బాసి యిచటఁజేయఁగ, వలసినపనియేమి లేదు ♦ త్వరపడి యింకన్.

క. [2]పినతండ్రియైనసుగ్రీ,వునికడకుం బోవవలయుఁ; ♦ బొందుగ మీారె
ల్లను గూడి యెట్లుచెప్పిన, విని యట్లుసేచేయువాఁడ ♦ విశ్వాసమునన్. ౧3

---

1 వివదా మత్థితాన్ సర్వాన్ మేహమానాన్ మధూదకమ్-అనిమూ. మేహయతః మూత్రయత ఇత్యర్థః-అనివ్యాఖ్య. 2 సుగ్రీవో యత్ర మే గురుః-అనిమూ.

తే. చేయఁదగుకార్యమున నెందు ♦ మీయనుమతిఁ
జేయువాఁడనె కాని నే ♦ నేయెడలను
గనినచోఁ బరతంత్రుఁడఁ ♦ గాదె; తలఁప
నేను నిజముగ యువరాజ♦నైన నిపుడు. ౧౮॥ 2522

సీ. మిమ్ము నాజ్ఞాపింప ♦ మీకెల్లహితమును వచియింపఁదగినట్టి♦వాఁడఁగాను
గార్యమ్ము సాధించి ♦ కడు నుపకర్తలై తగుమిమ్ముఁ బరతంత్రు♦లుగ నొనర్చు
టరయ నయుక్తమా♦నాదరించినయట్లుగాదు; నావిని ప్లవ♦గవరు లెల్ల
[1]నవ్యయంబగునట్టు ♦ లాడినయతనితో సమ్మనమందుచుఁ ♦ జారుతరము

తే. గా వచించితి రేరీతిఁ ♦ గపివరేణ్య
ప్రభువయినవాఁడెవం డిటు;♦పలుకు నంద
ఱొదవు నధికారమత్తత ♦ నొంది మేమె
యధికుల మటంచుఁదలఁతు ర♦హంకృతిఁగని. ౧౯ 2525

క. వనచరనాథా! యీరీతిని జెప్పుట నీకెతగును ♦ దెల్ల మొరుని కె
వ్వనికిని దగ దీవినయమె, ఘనతరమంగళము నీకుఁ ♦ గల్గునటంచున్. ౨౦॥

ఆ. దానికీవు మిగులఁ ♦ దగుదు వటంచని,యును వచింపుచున్న♦దనఘ! మేము
వనచరేజ్యుఁడయిన♦భాస్కరతనయుని, కడకుఁబోవుటకు ని♦కామ మెలమి.

క. అవసరముఁ గోరియున్నా,ము; వనచరేజ్య! త్వదాజ్ఞ ♦ మొదటఁగనక యే
ప్లవగునకుఁగాని యొకపద, మవలం బెట్టంగ నలవి♦యగునే తలఁపన్. ౨౧॥

క. హరివర! యిదిసత్యంబని, పరమాదృతిఁ జెప్పఁగలము; ♦ ప్లవగేశ్వర! యం
చురుమునమునఁబల్కఁగవిని, పురుహూతునిపౌత్రుఁడనియెఁ♦బొంగెడువేడ్కన్.

క. మంచిదికానిం డింక న,మంచితగతిఁ బోదమనియె ♦ నంతటఁ గపిరా
ట్సంచయములు బలముల మెఱ,యించుచు నాకాశమునకు ♦ నెగిరిరి వడిగన్.

క. యువరాజగునంగదుఁ డ,ట్టె వియత్పథమునకు దాఁట ♦ నెల్లకపివరుల్
జవములను నిరవకాశము,గ వియత్తలమును నొనర్చు♦కరణి నొకటిగన్.

క. వరయంత్రోత్క్షిప్తమహీ, ధరములవలె నతనివెంట ♦ దాఁటిరి; వేగ
స్ఫురణమునఁ బొల్చునాకవు, లరసి హతాత్తుగనె యెగసి ♦ యభ్రవ్రజలికిన్.

క. అనిలప్రేరితఘనములో, యనఁగాఁ బెనునాదములర ♦ నార్చుచుఁ ద్వరఁగా
జనిరంత నంగదుండిటఁ, జనుదేరక మునుపె సూర్య♦జని క్రీతుండై. ౨౩॥

చ. [2]సరసిజలోచనుండగుచు ♦ సంతతశోకము నందియున్న భా
స్కరకులజాతహాళిఁ గని ♦ సాధుగతిన్ వచియించె నిట్లు; భూ
వరమణి! యూఱడిల్లు మిఁక ♦ భద్రము నీకగుఁ గాక యాప్లవం
గరమణు లెల్ల సీతఁగని ♦ క్రమ్మఱవచ్చిరి నిశ్చయంబుగన్. ౨౪॥ 2532

---

1 శ్రుత్వా వచన మవ్యయమ్-అనిమూ. 2 ఉవాచ శోకోపహతం రామం కమలలోచనం-అనిమూ.

క. జనకజఁ గనకుందురయే, వనచరులును గడువుదాఁటి ♦ వచ్చెదువారే
మనయొద్దకు; మనమంపిన, పనియే ఫలియింపకున్నఁ ♦ బ్లవగతిలకుఁడై. ౨౬

క. ఘనబాహుబలుండును యువరాజును నగునంగదుఁడు నన్నుఁ ♦ జూడఁగ రాఁ జా
లునె; యొక్కవేళఁ గోఁతులు, పనిఁదీర్పక వచ్చి వనము ♦ భంజించినచోన్.

ఆ. అంగదుండు తాను ♦ నట్టి యకార్యంబుఁ
జేయఁబంచి నందు♦కే యనూన
మైన వంతనొంది ♦ యాస్యము వెలవెలఁ
బాఱఁ గలఁత మిగులఁ ♦ బడుచునుండు. ౨౭ 2535

సీ. కపివర్యుఁడై నయం♦గదుఁడు కార్యముసిద్ధిఁ గనుటచేఁ బ్రమదంబుఁ♦గనఁడయేని
దంష్ట్రి తాతలనుండి ♦ ధనముగావచ్చి మాపూర్వులచేఁ జాలఁ♦బూన్కి మీఱ
రక్షింపఁబడెడు నా♦రామంబు ధ్వంసము గావింపఁ డెట్టెట్టి♦కారణముల;
సువ్రతా! భూపుత్రి♦శుభములు తెలిసెను నినుఁగన్నకౌసల్య ♦ యనుపమాన

తే. సుప్రజయె యగు; నీవింక ♦ శోక ముడిగి
యూఱడిల్లుము సంశయ ♦ మొక్కయింత
యైన లేదు మహీసుత ♦ యగపడియెను
హనుమయే చూచియుండుఁ, గాఁ ♦ డన్యుఁడొకఁడు. ౨౮ 2536

క. మతిమంతా! రవియందా,తత తేజ స్సుండునట్లు ♦ తగ మారుతియం
దతిమానుష మతిసిద్ధులు, సతతోత్సాహమును మిగుల♦శౌర్యము లుండున్.

క. కనుకనె హనుమంతుం డీ, పనినిన్ సాధింపఁజాలుఁ ♦ బరుఁ డెవ్వండీ
పనిఁ జేయఁజాలఁ డని మీ, మనమున నెఱుఁగంగఁ దగును ♦ మహితవిచారా.

తే. జాంబవంతుఁడు మంత్రిగ ♦ సైన్యపతిగ
నంగదుఁడు రక్షకుఁడుగ నా♦యనిలతనయుఁ
డేపనికి నుందురో యది ♦ యిలఫలించుఁ
గాని వేఱుగతింబొంద ♦ దోనృపాల. ౩౦ 2539

క. అమితపరాక్రమ! నీదుమ,నమున నిఁకం జింత విడువు ♦ నా నంతహరి
ప్రముఖులు బలయుతులై నగ,రము చేరువఁజేరి వేగ ♦ రంజిలువేడ్కన్.

క. అనిలకుమారుఁడు సాధిం,చినకార్యముచేత ముదముఁ ♦ జెందినవారౌ
టను గార్యసిద్ధి యెల్లర,కును జూపెడునట్లు మిగులఁ♦గూయిడుచుఁ దగన్.

క. చనుదేరఁ గిలకిలధ్వను, లనుపమగతిఁ ద్రిదశమార్గ♦మందుండి కడున్
వినవచ్చె వనచరేశున,కును నతం డాకపుల ధ్వనుల♦కున్ మోదమునన్. ౩౮

క. *మన ముఖ్యాంగఁగ వాలం,బును నీడివిగఁ జూపె శిఖర♦మును దాఁకఁగఁ బెం
పున; నంతరామదర్శన,మును జేయంగోరుకీశ♦ముఖ్యులు పెలుచన్. ౩౯

* ఆయతాంచితలాంగూలః-అనిమూ

క. హనుమంతుని నంగదునిన్, మును నిడుకొని వచ్చిరి; హరి♦ముఖ్యులు శౌర్యం
బునఁదగు నంగదముఖ్యులు, తనువులఁబుల కాంకురములు♦తద్దయుఁబొలయన్.

తే. సంతసంబున శ్రీరామ♦చంద్రునకును
వనచరేశునకును జెంత♦వ్రాలి; రంత
గురుభుజుం డగుపావని ♦ శిరముసోఁక
రామునకు మ్రొక్కి భక్తియు♦ రంజిలంగ. ౩౭ 2545

క. *కనినాఁడ లంకలోపల, జనకాత్మజ నియత యగుచు♦ క్షతి నేమాత్రం
బును గనక యున్నయది సు,మ్మనిచెప్పెను; నిశ్చితార్థుఁ♦ డౌరవినుతుఁడున్.

తే. లక్ష్మణుండును ముదమంది♦ లలితదృష్టి
సంతసము నొందియున్నయా♦శ్వసనతనయుఁ
గాంచి; రరివీరహంత రా♦ఘువుఁడు ప్రమద
మంది గౌరవమునఁ గాంచె♦ ననిలతనయు. ౩౯ 2547

అఱువదినాల్గవ సర్గము సంపూర్ణము.

---

## ౬౫ - వ సర్గము.

సీతావృత్తాంతమును జెప్పి హనుమంతుఁడు రామునకుఁ జూడామణి నొసంగుట

సీ. అంతట నతిచిత్ర♦కాంతారమైతగు ప్రస్రవణాఖ్యభూ♦ధ్రమున కేగి
వనచరుల్ శిరసున♦వందనములు రామచంద్రునకున్ మహా♦సత్వుఁడైన
యాలక్ష్మణునకు సూ♦ర్యాత్మజునకు సల్పి యువరాజుముందఱ♦నుండి సీత
వృత్తాంతమును జెప్ప♦వేడుకఁబూనిరి; వారెల్ల సీత రా♦వణునియింటి

తే. యందుఁ జెఱఁబెట్టఁబడుటయు; ♦ నసురవనిత
లామె బెదరించుటయు, రాము♦నందె మనసు
రాగమును నిల్పి యుంటయు ♦ రావణుఁ డిడి
నట్టిసమయంబుఁ దెల్పి రా♦యవనిపతికి. ౩౧ 2548

చ. జనకజ యేక్షితిం గనక ♦ చాలఁ దపించుచునున్నదంచు వా
రన విని యిట్లుపల్కెఁ; బ్లవ♦గాధిపులార! మహీకుమారి యెం
దున వసియించె? నాయెడలఁ ♦ దోయరుహాక్షి యదెట్టిభంగిగా
మనసును నిల్పె? నీవిధము ♦ మానక నాకు నెఱుంగఁజెప్పుఁడీ. ౨౪ 2549

చ. అనిరఘునాయకుం డడుగ ♦ నాకపు లాతని సన్నిధానమం
దనిలజు నామెవార్తలను ♦ వన్నెఁగఁ జెప్ప నెఱింగియున్నవా
నిని వచియింపుమా యనుచు ♦ నెమ్మిమెయిన్ నియమించి; రంతఁ దా
వని కపులాజ్ఞ జేయఁ టయు ♦ భక్తిపూరితచిత్తుఁడై - ౬౪ 2550

* నియతా మక్షతాం దేవీం రాఘవాయ న్యవేదయత్ - అనుమా.

చ. ధరణికుమారి నేదిశను ♦ దాఁ గని నాదెసవైపు మోమునుం
బరఁగఁగఁ జేసి శీర్షమును ♦ వాంచి మహీసుత కట్టెమ్రొక్కి యే
*తరుణమునందు నెవ్విధిని ♦ దాఁ బలుకందగునట్టిఫక్కి నిట్
సరిగ నెఱుంగుఁగాన నట ♦ సాధ్విని గాంచినరీతి నిట్లనున్. ౭౫ 2551

చ. విను రఘురామ! నేనచట ♦ విస్తృతిచే శతయోజనంబుగాఁ
గనఁబడునుప్పసంద్రమును ♦ గ్రక్కున దాఁటి మహీకుమారికం
గనుఁగొనువాంఛఁ బోయితిని; ♦ గావున దక్షిణవార్ధి దక్షిణా
శను దురితాత్ముఁడౌదనుజ♦సత్తముఁ డేలెడిలంక యొప్పెడున్. ౯౫ 2552

సీ. అచ్చటిరావణు♦నంతఃపురంబున సాధ్వీమతల్లియా♦జనకతనయఁ
గనినాఁడ; నాతల్లి ♦ తనమనోరథ మెల్ల నీయందె నెలకొల్పి ♦ నీవలనిమ
హాశ జీవితముల ♦ నాత్మ నిల్పినయది; ప్రమదావనంబున ♦ రాక్షసవని
తలయంతరంబున ♦ నిలిచి వికృతాకారలునుం బెక్కు ♦సారులు తను
తే. నట్టె బెదరించుచుండ ను♦న్నది మహాత్మ
కాంచితిని; దుఃఖమును బొందఁ♦గాఁ దగనిప
తివ్రతామణి యాదేవి ♦ దీనయగుచు
వగలఁ బొగులుచు నున్నది ♦ తగనిరీతి. ౧౨ 2553

క. దనుజేంద్రునంతిపురమున, దనుజాంగన లెల్లఁ గావఁ ♦ దాఁ జెఱఁబెట్టం
గనుబడి యొకవేణిగఁ గేశనిచయము తగంగ మిగుల♦సత్త్వము దూలన్.

క. నిను నిరతము ధ్యానించుచు, ననవరతము ధరణియే శ♦యనముగఁ దుహినం
బునఁ బద్మినివలె నవయవ,తనుతం దగి కృశత నంది ♦ తగనివిధమునన్. ౧౩

తే. వగలఁ గుందుచుఁ దన్నురా♦వణుఁడు బలిమి
వశము చేసికొనం జూడ ♦ వానివాంఛ
వమ్ముగాఁజేసి మృతినొందఁ ♦ బరమనిశ్చ
యమ్ము నొనరించుకొనియున్న ♦ దమలచరిత. ౧౪ 2556

క. ఓకాకుత్స్థా! నీయం, దేకప్రమనంబుఁ జేర్చి ♦ యెప్పుడు ఘనమా
శోకమునఁ గుంది యుండ న,శోకవనంబునను గంటి ♦ క్షోణీతనయన్. ౧౫

సీ. ఇక్ష్వాకువంశంబు ♦ నేను గీర్తింపఁగాఁ దత్కులవిఖ్యాతిఁ ♦ దమిని వినుచుఁ
బురుషశార్దూల!న♦న్నొబ్బడఁగాంచి యాసాధ్వివిశ్వాసమునుబొంది♦వినియె; నంత
నామెతో మాట్లాడి ♦ యఖిలవృత్తాంతంబుఁ జెప్పితి నీకు మా♦క్షితిపుఁడైన
యట్టిసుగ్రీవున ♦ కైనసఖ్యము విని సంతసించెను; సదా♦చారనియతి
తే. సతము నీయందె దృఢభక్తి ♦ యతిశయిల్ల
నుగ్రతపము నొనర్చుచు ♦ నుండ నమ్మ

* ఉవాచ వాక్యం వాక్యజ్ఞః=అనియూ.

హోత్తురాలిని గాంచితి; ♦ నార్యవర్య
యామెయును జిత్రకూటాద్రి♦యందు మున్ను. ౧౮ 2558

క. నీయంతికమున జరగిన, వాయసవృత్తాంత మొకటి ♦ వరుసఁగఁ దెలిపెన్
నీయాత్మ నమ్ముటకుఁగా, నాయమ నాకిచ్చె గుఱుతు ♦ సద్గానిఁ బ్రభూ. ౧౯

చ. అనిమతిఁయున్ వచించె నిటు ♦ లాయనిలాత్మజుఁ డిట్లొనంగి యా
జనకజ యిట్లుపల్కె విను ♦ సర్వము నీవిటఁ జూచినట్టులో
యనిలతనూజ! రాఘవుని♦యాత్మకుఁ దెల్లముగాఁగఁ దెల్పుమా
దనుజుఁడు వచ్చినట్టిగతి ♦ దాపక యున్నది యున్నయట్లుగన్. ౨౦ 2560

క. ఇనజుఁడు వినుచుండఁగనే, వినిపింపఁగఁ బోవునుడుల ♦ విన్నప మొనరిం
చినపిదపఁ బ్రాణపదముగ, ననయము గాపాడినట్టి♦యాభరణంబున్. ౨౧

తే. ఇదిగొ చూడామణిని దీని ♦ నినకులపతి
కొసఁగు; శ్రీమంతమైనయీ♦యురుతరమణిఁ
జాల! యత్నము మీఱ ర♦క్షణము నేను
జేసియున్నాను; గథవిను ♦ శ్రీరఘుపతి. ౨౨ 2562

క. మునుపొకతఱి నాఫాలం,బునఁ దగుతిలకంబు మాసి♦పోయిన మోదం
బున నీవె మణిశిలను బ్రొ,ట్టునుగా నొనరించి నెన్ను♦దులను బలుకుచున్. ౨౩

క. పరిహాసమునకుఁ జెక్కిలి, సురుచిరముగఁ బెట్టితి గద ♦ శుభగుణ! రామా
స్మరియింపుము దానిని; బా,పరహితచిత్తా! సముద్ర♦భవమగుదీనిన్. ౨౪

తే. పరమచూడామణిని నాకుఁ ♦ బంపినాఁడ
విట్టిపెనువగలందు ని ♦ న్నేను గాంచి
నట్టులే దీనిఁజూచి మ♦హాముదంబుఁ
గాంచుడానను; దశరథ♦క్ష్మాపతిసుత. ౨౫ 2565

క. ఒకమాసము ప్రాణంబుల, నిఁకనే భరియింపఁగలను ♦ నీబాధలకున్
సకలాంగంబులు చెడఁగా, నొకనెలపై బ్రదికియుండ♦నోపం జుమ్మీ. ౨౬

క. అని నేఁ జెప్పినయట్లుగ, వినిపింపుము రామున కని ♦ వెలఁది వచించెన్;
జనకజయుఁ జిక్కి ధర్మం,బును వదలక దనుజునంతి♦పురమున రామా. ౨౭

క. హరిణవరేణ్ ఫుల్లాక్షులు, పరఁగఁగఁ జెఱఁబెట్టఁ బడిన♦భావము తగఁగా
గురుభయమున నను గని యి,క్కరణిన్ వచియించె నట్లు♦కడఁగి తెలిసితిన్.

క. ఏరీతిగనైనను నీ,పారావారంబుగట్టు♦పనిఁ జూడుఁడు నే
శ్రీరామ! యనుచు ననిలకు,మారుఁడు రాఘవులు కొంత♦మది మాఱిరిగా.

క. కని యాచూడారత్నం, బును సీత యొసంగినట్టి ♦ పొందగు గుఱుతుం
గనఁబఱచి యిచ్చి సీతో, క్తినిచయ మెఱిఁగించె నామె ♦ తెలిపినరీతిన్. ౨౮

అఱువదియైదవ సర్గము సంపూర్ణము.

---

### ౬౬ - వ సర్గము.

రాముఁడు చూడామణిం గాంచి సీతవృత్తాంత మంతయు వినఁగోరుట.

క. అంతట దశరథనందనుఁ, డెంతయు వేగమున నాతఁ ♦ డిచ్చినసీతా
కాంతయొసంగినరత్నము, వింతగఁ గని యెదను జేర్చి ♦ వివిధవిధములన్. ౧

క. అనుజునితోఁ బలవించెను;, నినకులరత్నంబు తనకు ♦ నిష్టంబగునా
జనకజమణివర్యంబును, గని వగలం గుంది యశ్రు♦కణపూర్ణాక్షుల్. ౨ 2572

ఆ. వెలయుచుండ నిట్లు ♦ పలికె సుగ్రీవుతోఁ;
దూడయందుఁ బ్రేమ♦తోఁ జెలంగు
నావు చేఁపునట్టు ♦ లీవరమణిఁ గని
నంతనే ద్రవించె ♦ నాత్మ మిగుల. 3 2573

క. ఈమణిరత్నము సీతకు, నామామ యొసంగెఁ బెండ్లి♦నాఁ డద్దానిన్
భూమిజమోమునఁ గట్టిరి, శ్రీమంతంబగుచు మిగులఁ ♦ జెలఁగెన్ బెడఁగై.

క. జలసంభూతం బియ్యది, పలువురు సజ్జనులు దీని♦బహువిధములఁ బూ
జలఁ దన్పిరి జన్నము నిమ్ముల జనకుఁడుచేయఁ ద్రిదశ♦ముఖ్యుఁడు ప్రీతిన్. ౪

క. కరుణించె బుద్ధినియతిం, బరికించి; మహాత్మ! సుగుణ♦భద్రా! సామ్యా
వరమణి దీనింజూడఁగఁ, గర మరుదుగ నాదుతండ్రిఁ ♦ గనినట్లాయెన్. ౫

క. *జనకుని సీతాజననిని, గనిన ట్లున్నయది; దివ్య♦కాంతులఁ దగునీ
ఘనమణి ప్రేయసి శీర్షం,బున నలరుచు నుండుఁ గానఁ ♦ బొందుగ దీనిన్.

తే. నేను జూడఁగ నాప్రియ ♦ తానె వచ్చి
నట్టు లున్నదటంచు నా♦యాత్మఁ దలఁచు
వాఁడ; నని పావనింజూచి ♦ పలికె సౌమ్య
దప్పిఁగొనువానిఁ దగినయు♦దకముచేత. ౮ 2578

---

* ఆద్యా స్త్ర్యవగత స్సామ్య వైదేహ్యా స్తథా విభోః-అనిమా. ఇహ వైదేహ్యగ్రహణం సీతాజనన్యా అ ప్యుపలక్షణమ్-అనివ్యాఖ్య.

సీ. ఆప్యాయతుం జేయు ♦ నట్లుగఁ దనవాక్య
జలములఁ దడుపుచు ♦ స్వాంత మలర
జనకజ యేమని ♦ నరసోత్తములను జెప్పె
మనియె; నంచాలత్మ♦జునిఁ గనుఁగొని
జానకిం జూడక ♦ జలములఁబుట్టిన
చూడామణిని దీనిఁ ♦ జూడఁ జాలి
తిని గాన దీనికం♦టెను నాకు మిక్కిలి
పగ మత్తేమున్నది ♦ వారిజాక్షి

తే. యింక నొకమాసమాత్ర మ♦దెట్టులేని
బ్రదికియుండిన ననుఁ గాంచి ♦ బహుశరత్తు
లవని జీవింపఁ గలదు, సౌ♦మ్య! యసితాక్షిఁ
బ్రేయసిం బాసి [1]క్షణము జీ♦వింపఁ జాల. ౧౦ 2579

చ. అని హనుమంతుఁ గాంచి జన♦కాత్మజ యెచ్చటనున్నదో జవం
బున నను నాస్థలంబునకు ♦ భూరిపరాక్రమ మూని నీవు తో
డ్కొనిచను మామెవార్త విని ♦ కోమలిఁ జూడకయే క్షణంబునే
వును నిట నిల్వఁ జాల; క్షితి♦పుత్రిక భూరిభయాకులాత్మమా. ౧౧ 2580

తే. అట్టిసుశ్రోణి యెపుడు భ♦యంబుఁ గల్గఁ
జేయుదనుజాలనడుమ ని♦ల్చి యెటులున్న
దో; శరత్కాలమునయందు ♦ నుగ్రతిమిర
ముక్తుఁడౌచంద్రునిఁ మేఘ♦ములు చెలంగి. ౧౨ 2581

ఆ. ఆవరించినట్లు ♦ లాసీత మోమట
దనుజు లావరింప ♦ వసటఁ గుంది
విలసనంబుఁ గనక ♦ వెలవెలఁ బోఋచు
నుండు నిశ్చయముగ ♦ నోయనిలజ!. ౧౩ 2582

క. జనకజ యేమని చెప్పెనొ, వినిపింపుము నంతయేని ♦ విడువక నాతో
విను మందు తీవ్రరోగం,బును బాపెడునట్టు లిట్టి♦భూరితరార్తిన్. ౧౪ 2583

క. [2]చెలువ వచించిన యాపలు,కులు తొలఁగించును; వచించు♦కూర్మి [illegible]
వలుకులమాధుర్యముగల, లలితవరారోహ యాయి♦లామత [illegible]. ౧౫

---

1 క్షణం సౌమ్య నజీవేయమ్-అనిహా  2 [illegible]

క. ననుఁ బాసి భూరిదుఃఖాం,బునిధిని దా మున్గి నిన్నుఁ ♦ బొడఁగని నాతో
డను జెప్పుమనినపలుకుల, వినిపింపుము వానిఁ జక్క ♦ విని యెద నిపుడే. ౧౫

అఱువదియాఱవ సర్గము సంపూర్ణము.

---

## ౬౭ - వ సర్గము.

హనుమంతుఁడు రామునకు సీతపలుకులు చక్కఁగా వినిపించుట.

క. అనుచు మహాత్ముఁడు రాముఁడు, తను నడిగిన హనుమ జనక♦తనయ తనకుఁ జె
ప్పినమాటల నెల్లను జె,ప్పను బూని వచించె; నిట్లు ♦ పార్థివవర్యా!. ౧ 2586

క. మును చిత్రకూటపర్వత,మున జరగినవార్త తత్వ♦ముగ నాతోడన్
వినిపించె నానవాలుగ;, జనకజ యాకొండయందు ♦ సమ్మద మలరన్. ౨

క. నినుఁ గూడి హాయిగా సు,ప్తిని బొందుచు నుండి ముందుఁ ♦ దెఱవయె యాసు
ప్తినిబాసి లేచినది యం,త నొకానొక వాయసంబు ♦ తడయక వచ్చెన్. ౩

క. అరుదెంచి *తీరనిలయాం,తరమున గీఱె; మును సీత ♦ తా నీయొడినుం
డి రయమున లేవ నీ వా,తరుణీమణి యంకసీమఁ ♦ దమి శయనింపన్. ౪

క. భరతాగ్రజా! మహాత్మా, మరలను నాకాకి సీత♦మార్గాని వత్సాం
తరమున వ్యథపెట్టెను; ని,ష్కరణిని బలుమాఱు బాధఁ♦గలుగఁగఁ జేయన్.

క. తరుణి నిను లేప శోణిత,పరిప్లుతాంగంబు గ్రాలఁ ♦ బరువడి నీవా
తరుణమున లేచితివి గద;, పరంతపా! యిట్లు కాకి ♦ బాధింపంగన్. ౬ 2591

క. తొలఁగనియాబాధకుఁ గో,మలి తాళఁగ లేక సుఖము ♦ మైకొన నిద్రన్
లలిఁబొందునిన్ను లేపెను;, నలఘుభుజా! భూమిజా స్త♦నాంతరసీమన్. ౭

ఆ. కాకి గీఱుచుంటఁ ♦ గని నీవు సర్పంబు
కరణిఁ గ్రోధమంది ♦ కడఁగి యూర్పు
లొలయ సీత కిట్లు ♦ పలికితి వోభీరు
త్వత్స్తనాంతరం బె♦వండు కినుక. ౮ 2593

క. తననఖరాగ్రంబుల భీ,తిని బొందక యిట్లుగీఱెఁ ♦ దెగువ నెవండో
వనితా! యైదుశిరస్సుల, ఘనఫణి రోషించి యుండఁ♦గాఁ దెలియమిచేన్. ౯

---

* స్తనాంతరే-అనిమూ.

తే. ఆటలాడుచు నున్నవాఁ♦డని యడిగితి;
వంత నంతటఁ జూచుచు ♦ నామె కెదుట
వాయసం బది రక్తసి♦క్తాయతనఖ
రముల నుండఁగఁ గాంచితి ♦ వమరవంద్య. ౯ 2595

క. వాయసమది పక్షివరం,బై యింద్రునిపుత్త్రుఁ డగుచు ♦ నద్రితటములం
దే యనిశము తిరుగుచు నది, వాయుసమానంపుగతిని ♦ వఱలు నఁట విభూ.

సీ. మతిమంతులం దవ♦మానవిఖ్యాతిని
గలనీవు క్రుధ నేత్ర♦ములను విప్పి
వాయసంబును దాని♦వదలక మృతినొందఁ
జేయఁగఁ దగునని ♦ చిత్తమందు
దారుణంబై నట్టి♦తలఁపును బొందితి;
వంత దర్భాసన♦మందు నున్న
దర్భను గైకొని ♦ దానిని బ్రహ్మాస్త్ర
మంత్రయుక్తముఁ జేసి ♦ మదినిలుకెడ

తే. వైచితివి; లయకాలాగ్ని♦వలె నదియును
బ్రజ్వలించుచు వాయసా♦గ్రమున నలరి
దానిఁ దలఁపడి మండుచు ♦ దారుణగతి
వెంటనంటె నాకాకిని ♦ విడిచెఁ దండ్రి. ౧౩ 2597

క. సురలు మహర్షులు వదలిరి, బరువడి నది ముజ్జగములఁ ♦ బరువిడి తనకున్
శరణం బెందును గానక;, యరిందమా! క్షితినొంది ♦ యార్తంబగుచున్. ౧౪

క. మరలను నీయొద్దకె వచ్చె రయంబున; నెల్లరకును ♦ సిద్ధశరణ్యం
బరయఁగ నీవౌటను నీ, శరణును వడిఁజొచ్చి మ్రోల ♦ క్షమ వ్రాలె వెతన్.

క. వినయమున వేఁడువాయసమును వధ్యముఁ గరుణ చిత్త♦మున వ్యాపింపన్
మునుకొని కాచితి; వనఘా, వనజజునస్త్రము వతంబు♦వంధ్యము గావన్ ౧౬

క. శరణంబూనియు నంతటఁ, బరికించియె దక్షిణాక్షి ♦ వధియించితి; వో
ధరణీశ! విసృష్టంబై, పరమంబగుభక్తి నీకుఁ ♦ బ్రణతులొనర్చెన్. ౧౭

తే. దశరథక్షితిపునకు వం♦దనము చేసి
తననివాసమునకుఁ బోయెఁ; ♦ గనుక నిట్లు
లరయఁగా రాముఁ డఖిలశ♦స్త్రాస్త్రవిద్వి
శిష్టుఁడౌ బలశాలి య♦రిప్రహంత. ౧౮

క. శీలము గలవాఁడునునయ్యు, యేలా రాఘవుఁడు నన్ను ♦ నిట్లుల విడెనో

జాలం దూలించెదు దను,జాళిపయిన్ బైపఁ డామ♦హాస్త్రముల నికన్. ౧౮

క. సురగంధర్వులు సర్పా,సురు లెవ్వరుగాని యనిని ♦ శూరత వంశా
భరణుని రాముని మార్కొ,ని, తరమే నిలువంగ నొరులఁ ♦ దలఁపగ నేలా.

ఆ. వీర్యవంతుఁడైన♦యార్యునకున్ ననుఁ
గూర్చి సంభ్రమంబు ♦ గొంచెమైనఁ
గలిగెనేని దీవ్ర♦ములగు బాణంబుల
ననిని జంపుఁగాక ♦ దనుజు వేగ. ౨౦ 2605

క. పురుషవరేణ్యుఁడు రఘుకుల, వరరత్నము లక్ష్మణుండు ♦ వైరిహరుండై
పరఁగియు నన్నయనుజ్ఞను, బరువడిఁ జనుదెంచి యన్న♦భార్యను నన్నున్.

తే. కావఁ డేలొకో యింకను; ♦ గాఢ తేజ
మున సమీరాగ్నులంబోలు♦మనుజతిలకు
లిద్దఱును శక్తిగలవార ♦ లెల్లసురలు
వారి నెదిరింప రా దట్టి♦వారలయ్యు. ౨౨ 2607

క. ననుఁ గావ కుపేక్షించుట,కును గారణమేమొ? శత్రు♦కూటము బాధిం
పను శక్తులయ్యు నిద్దఱొ,క నెలవునం గూడియుండి ♦ కాంతను నన్నున్. ౨౩

క. [1]పరులిటు బాధింపంగాఁ, బరికింపక యుండు టరయఁ ♦ బాపము మిగులన్
నరియని చేసియొ యుందును, నరసిన సందియమె దీని♦యం దుండదు నూ.

చ. జనకజ యశ్రుయుక్తముగ ♦ జాలిని గల్గఁగఁ జేయునట్లు ప
ల్కినవచనంబులన్ వినుచుఁ ♦ గేవలభక్తిని బూజ్యరాలి నా
జనకకుమారిఁ గాంచి సర♦సంబగుమాటల నిట్టులంటి; ని
న్ననక భవద్వియోగమునఁ ♦ గార్యము లెల్లను మాని రాముఁడున్. ౨౪

ఆ. వగచు చున్నవాఁడు ♦ వనితామణీ! నిజ
మిద్ది; రామభద్రుఁ ♦ డిట్లు వగలఁ
బొగుల లక్ష్మణుండు ♦ వగఁ గుందుచుండును
దల్లి! నిన్నుఁగంటి ♦ దగ నదెట్లొ. ౨౫ 2611

క. [2]నినుఁ జూడఁగల్గెనని నే,మ్మనమున సమ్మోదమంది ♦ మానిని యుండం
జనుఁగాని వగలఁబొగులం, జనునే, యీక్షణమునందె ♦ సకలాపదలున్. ౨౬

---

1 మమైవ దుష్కృతం కించి న్మహద స్తినసంశయః-అనిమూ. 2 కథంచి ద్భవతీదృష్టా నకాలః పరిశోచితుమ్-అనిమూ.

తే. *తొలఁగిపోవంగఁ జూడఁగాఁ ♦ గలవు నీవు
నిందఁబొందని యిర్వురు ♦ నృపకుమారు
లెపుడు సీతను గాంతురో ♦ యెపుడు శత్రు
వును వధింతురొ యని త్వరఁ ♦ గనుదు రబల. ౨౭ 2613

క. కనుక నె భస్మముగా లం,కను జేయంగలవు; నీదు♦కాంతుఁడు క్రూరుం
డనుకంపాహీనుఁడు నగు, దనుజేంద్రు సబాంధవునిఁ బ్ర♦ధనమునఁ జంపున్.

చ. తనరిపుఁ జంపి సిన్నుఁ బ్రము♦దంబునఁ దాఁ గొనిపోవుఁ బత్తనం
బున కిదినిశ్చయంబు; నృప♦పుత్త్రి! యనిందితచిత్త! నీమగం
డనుముద మంది నమ్మఁదగి♦నట్టి యొకానొకయానవాలు నా
కు నొసఁగనొప్పు; నన్నపలు♦కుల్ విని జానకి సంతసంబునన్. ౨౯ 2615

సీ. పరికించి దెసల నె♦వ్వరునైన లేమిని
జక్కఁగా నెఱిఁగి శీ♦ర్షమునఁ దాల్పఁ
దగినచూడామణిఁ ♦ దనచీరకొననుండి
విడిచి నాచేతికిఁ ♦ దడయ కిచ్చె,
నోమహాబల! రామ♦యుత్తమంబగుగుర్తు
దీని నంతట నేను ♦ దివ్యమణిని
భవదర్థమై కొని ♦ పరమసాధ్వికిఁ దల
సోఁకఁగా మ్రొక్కి వే ♦ మీకడ కరు

తే. దేరఁగా యత్నమును జేసి♦తిని; విదేహ
నరవరేంద్రతనూభవ ♦ నాతిమిన్న
పయనమును జేయ సమకట్టి ♦ పటుతరముగఁ
దనువు పెంచెడు నను గాంచి ♦ వనటవేర్మి. 3౦ 2616

క. వదనంబునిండ నశ్రులు, పొదలన్ దీనయయి బాష్ప♦పూరంబున వా
క్కుదగం దొట్రిల నేఁ జో,యెద నెగసి యటన్నఁ ద్వరను ♦ నెంతయు వగతోన్.

క. తన మోము వివర్ణముగాఁ, గనఁబడ నిట్లనియె; నోయి♦కపివలితనయా
చని నీవు సింహతుల్యుల, ఘనమతులన్ రాఘవులను ♦ గపికులపతినిన్. 3౨

తే. అతనిమంత్రుల మఱియును ♦ నందఁగలుగు
నందఱను క్షేమ మడిగితి ♦ నని వచింపు
మమ్మహాబాహుఁడై నరా♦మావనీశుఁ
డతిజవంబున నిచ్చటి ♦ కరుగుదెంచి. 3౩ 2619

* తా పృథా నరశార్దూలౌ రాజపుత్త్రౌ వనిందితౌ-అనిమా.

క. నను నీదుఃఖమహార్ణవ,మునఁ నుండి విముక్తి చేయ ♦ మునుకొని నీవే
యొనరింపవలయుఁ బద్ధతి;, వనచరవీరా! రఘుప్ర♦వరుచెంగటికిన్. ౩౫

చ. చని యిట నేను బొందెడుమ♦హాత్తరదుఃఖము నీకువృత్తతా
దనుజనితంబినుల్ పలుకు♦దారుణవాక్యతతిన్ సమస్తమున్
మనమున కెక్కఁజెప్పఁదగు ♦ *మార్గము నీకు శుభస్కరంబె యా
ననియెను, రాజసింహ! విను ♦ మార్య విషాదము పేర్మి నీగతిన్. ౩౬ 2621

క. తనమాటలెల్ల విన్నప, మును జేయుమనెన్ సమగ్ర♦ముగ నేనెఱిఁగిం
చినగుర్తు లెఱిఁగి కుశలం, బును గనియున్న దని నమ్ము ♦ భూసుత మిగులన్.

అఱువదియేడవ సర్గము సంపూర్ణము.

---

## ౬౮ - వ సర్గము.

హనుమంతుఁడు సీతనుగుఱించిన వాక్యముల మఱికొన్నింటిని రామునకుం దెల్పుట.

సీ. పురుషవరేణ్య! నే[illegible] ♦ బోవఁగా త్వరపడు
చుండుటఁ గని సీ[illegible] ♦ యుద్యముదంబు
నాపైని నీకు ను♦న్నదటంచు నెఱిఁగిన
కారణంబునను నేఁ ♦ గరుణమీఱ
సాయ మ్మొనర్పఁగాఁ ♦ జాలినవాఁడనే
యనెడువిశ్వాసంబు♦నను ననుఁగని
గారవించుచుఁ జేయఁ♦గాఁ దగుకృత్యంబు
దెలుపఁ దలఁచి యిట్లు ♦ పలికె; నోయి

ఆ. పవనతనయ! నీవు ♦ బహువిధముల రాఘ
వునకుఁ జెప్పవలయు ♦ నని దురాత్ము
దనుజపతిని జంపి ♦ త్వర ననుఁగొనిపోవు
నట్లు; వీర! యిచ్చ ♦ యలరునేని. ౨ 2623

క. అరిహరణ! యొక్కదిన మి,ప్పరిసరమున నుండు మీవు ♦ బహుగుహ్యావనుం
ధర విశ్రమించి యెల్లియె, యరుగఁగలవు, గాఢశౌర్య ♦ యట్లు నిలిచినన్. ౩

క. భవదీయసమక్షంబున, బ్రవిగతభాగ్యనగు నాకుఁ ♦ బాటిల్లిన యి
ట్టివగయు క్షణమైనను బో,వు వదలి; నీ విచటనుండి ♦ వోయి జవమునన్. ౪

క. మరలి చనుదెంచునంతకుఁ, గరువలిపట్టీ! మదంగ♦కలితప్రాణో
త్కరము చనవచ్చు నందియు, మరయంగా లేదు; నేను ♦ నాత్మేశ్వరునిన్. ౫

* శివశ్చ తేధ్వాఽస్తు హరిప్రవీర-అనియూ.

క. ఎడఁబాసి దుఃఖతతినిం, గుడుచుచు దురవస్థ లెల్లఁ ♦ గుందఁగఁ జేయన్
దడఁబడుచు నున్నవను నీ,వెడఁబాసి చనంగ మఱియు ♦ నెల్లవిధములన్. ౫

క. నిను విడనాడినదుఃఖము, వనటం గుందంగఁ జేయుః ♦ వానరవర! నీ
వనుపమశక్తియుతుండవు, గనె గనఁబడితివి సుశౌర్య♦కలితుఁడ వగుటన్. ౬

ఆ. నీసహాయులైన ♦ నిఖిలభల్లూకవా
నరులఁ గూర్చి నామ♦నంబునందు
మిగుల సందియంబు ♦ మేనుదాల్చినయట్లు
కానఁబడెడుః భల్లు♦కప్రముఖులు. ౭ 2629

క. తరియింపరానిసాగర,వరమును నిద్దాని దాఁటి ♦ వత్తురొ? యాభూ
వరతనయు లిద్దఱును నె,వ్వరుసను దాఁటంగఁ గలరొ ♦ వాయుతనూజా. ౮

క. గరుడునకు నీకు ననిలున, కరయఁగ నీమువ్వురకె మ♦హాసాగరమున్
దరియించుశక్తి యున్నది, యొరులకు నెవ్వరికిఁ గాని ♦ యుండదు మద్యా. ౯

సీ. కార్యవేత్తలయందుఁ ♦ గడు మేటివగుదువు
వీరుఁడ వగుదు వి♦క్కారణమున
దుస్తరమేయని ♦ తోఁచునిక్కార్యంబు
సాధించుటకు నెట్టి♦సరణి నీవు
తలపోసినాఁడవో ♦ పలుకుమా; పరవీర
హరణా! మహాత్మ! కా♦ర్యమును దీనిఁ
జక్కఁ జేయుటకు నీ ♦ వొక్కఁడవే చాలు
దిదియుక్తమేగాని ♦ యిట్లుచేయఁ

ఆ. గలుగుకీర్తి నీకె ♦ కాని రామునకు లే
దఖిలవీరయుక్తుఁ♦డై యతండు
వచ్చి యనిని దనుజ♦వర్యుని వధియించి
జయముఁ గాంచి పౌరు♦షంబు నెఱపి. ౧౧ 2632

క. ననుఁ దనపట్టణమునకుం, గొనిపోవునయేని గీర్తి ♦ కొమరారును నా
థును రామునకున్; మఱియీ,దనుజుఁడు రావణుఁడు దొంగ♦తనమున నన్నున్.

తే. రాముపత్నిని గపటయం♦త్రంబుఁ దాల్చి
యపహరించెను నారీతి ♦ నారఘుపతి
నన్నుఁ గొనిపోవు టిద్ది సుం♦తయును దగదు
దుర్యశము రాఘవునియందుఁ ♦ దోఁచరాదు. ౧౩ 2634

చ. వరబలహంత రాఘవుఁడు ♦ పౌరుషమొప్ప బలంబు నెల్ల ని
ప్పురమున నిండఁజేసి ననుఁ ♦ బొంకముగాఁ గొనిపోవునేని ఖ్యా

వరునకు నద్రితుల్యమయి ♦ భాసురకీర్తిదమై చెలంగు; సం
గరమున శూరుఁడై మహిమ ♦ గ్రాలఁగ నొప్పురఘూద్వహుం డొగిన్. ౧౮౪

క. తనకున్ సమానముగు నీ,తని బౌరుషమెల్ల నిచటఁ ♦ దృప్తిగ వైరుల్ తే.
గనునట్లు చేయ నీవే, యొనరింపుము నాకుఁ బ్రియము ♦ నొనరువు మింకన్.

చ. అనియిటు లర్థవంతముగ ♦ నాదృతిమీఱఁగఁ బ్రశ్రితంబుగాఁ
గనఁగ సహేతుకంబుగను ♦ ద్వాసుత పల్కిన నాలకించి నే
వినయము మీఱఁ జేయఁదగు ♦ వృత్తము నెంచుచు నిట్టులంటి; నో
జనకజ! కీశభల్లుకవి ♦ శాలబలాధిపుఁడై మహాత్ముఁడై. ౧౬౫ 2637

చ. బలమున విష్ణువీఁగు కపి ♦ వల్లభుఁ [1]డారవిసూనుఁ డీపనిం
బొలుపుగఁ జేయ నిశ్చయముఁ ♦ బూనినవాఁడు; పరాక్రమంబునన్
బొలిచి బలమ్మునన్ వెలసి ♦ భూతవిచిత్రకృదుగ్రశక్తిచే
నలరి మనస్సునం గలుగు ♦ నట్టితలంపులఁ బోలి వేగముం
జెలఁగ నెసంగువానరులు ♦ సిద్ధముగాఁ దగువారు తల్లిరో. ౧౮ 2638

సీ. వారికి నెల్లనం ♦ బరమున భూమిని
పాతాళమున మధ్య ♦ భాగములను
ననదృశగతిగల ♦ దదిగాక యెంతటి
పనినైన నమితశ ♦ క్తిని జెలంగు
వారౌట సాధింప ♦ వలసినవారలై
యుందురు; బలముల ♦ నుద్ధతులయి
శక్తి సమేతులై ♦ సకలవిధంబుల
నలరారు వానరు ♦ లాకసమున

తే. సంచరించుచుఁ బలుమఱు ♦ క్ష్మాతలమున
కెలమిని బ్రదక్షిణము చేసి; ♦ రినతనూజు
పరిసరంబున నున్నట్టి ♦ ప్లవగముఖ్యు
లొక్కకొందఱు నాకంటె ♦ నుగ్రబలులు. ౨౦౪ 2639

క. కొందఱు నాకుం దలపో,యం దుల్యులుగాని యల్పు ♦ లనఁదగుకపు లం
దుం దగ నెవ్వరులే; రో,సుందరి! నేనే జవంబు ♦ శోభిల వార్ధిన్. ౨౧ 2640

క. [2]తరియించితిఁ గన బలవి,స్ఫురణంబున మిగులు నాక ♦ వులు వత్తురు సా
గరమును దాఁటి యటంచున్, బరిపరిప లుకంగనేల; ♦ పని ద్రయేదైనన్. ౨౧౪

---

[1] తవార్థే కృతనిశ్చయః-అనియూ. 2 ఇట్లు హనుమంతుఁడు తనకంటెఁ గపులందఱు బల విక్రమసంపన్నులని యనువదించుట సీతకుం గల్గునధైర్యమును బోఁగొట్టుట కని గ్రహింపందగు.

ఒనఁగూర్పఁగవలసినచో, జనపతు లల్పులనె పనుపఁ♦జాలుదురు మహో
ఘనభటులం బంపరుగద; జనకసుతా! దుఃఖ మింకఁ ♦ జాలుం దల్లీ. ౨౨

[1]ఇంక రామునిపైఁ గోప ♦ మించుకయును
నునుపఁబోకుము హరిపతు ♦ లొక్కరంతు
వైచి దాఁటుదు రీభూరి♦వార్ధిఁ; బురుష
సింహులగురామలక్ష్మణుల్ ♦ చెలఁగువేడ్క. ౨౩ 2643

నాదువీఁపున నెక్కి చం♦ద్రరవు లుదితు
లైనయట్టులు నీయొద్ద ♦ కరుగుదెంచు
వారు; పంచాస్యతుల్యుఁడై ♦ వైరిహంత
యైనరామునిఁ జూతు వో♦యంబ వేగ. ౨౪ 2644

ధనువును దాల్చి లక్ష్మణుఁడు ♦ తప్పక యీపురికోటవాకిటన్
ఘనభుజసార మేర్పడఁగఁ ♦ దా నలరారఁగఁ జూతు వింక న
వ్వనచరులన్ మృగేంద్రసమ♦పౌరుషయుక్తుల వీరవర్యులన్
ఘననఖదంష్ట్రలాయుధము♦గాఁ గలవారల దంతితుల్యులన్. ౨౫ 2645

క. గలవు శీఘ్రకాలంబున నేఁ లంకాపురమునఁ ♦ బొలిచెదు మలయా
చలసానువులందును, ఘనగిరినిభకాయులైన♦కపులనినదమ్ముల్. ౨౬ 2646

క. నీకు శీఘ్రము;, జననీ! యిఁకమీఁద రామ♦జనపాలకుఁడున్
నానప్రతపూర్తిం, బొనరిచి శత్రువులఁ జెండి ♦ వూనిక మెఱయన్. ౨౭

నినుఁగూడి యయోధ్యాప, త్తనమునకుం బోయి ప్రీతి ♦ దగఁగా సింహా
సనమున నభిషిక్తుఁడు కాఁ, గనుజూడం గలవటంచుఁ ♦ గడఁగి పలికెన్. ౨౮

ఒన మ్మి బాసి నీవిందు ననుభవించెదు శ్రమాళిఁ ♦ [2]దొలఁగింపక నే
వినిపింప నామె దుఃఖంబునఁ గుందఁగ సాహసమ్ముఁ ♦ బూనెదురికన్. ౨౯

ఇంపగునుడులను నే విని,పింపన్ శాంతిల్లి సుంత ♦ పృథ్వీసుత యా
పెంపగువగఁబాసెను [3]నా,కంపితరిపుజాల సాధు♦గుణపరిపాలా. ౩౦ 2650

అఱువదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

1 తదలం పరితాపేన దేవి మన్యుర్వ్యపైతు తే-అనిమూ. 2 తొలఁగింపక — విడిచిపెట్టక, అనియర్థము. 3 ఇందలి విశేషణద్వయము రామచంద్రుఁడు శత్రునాశనదీక్షగలిగి పాఁటించు సాధ్వీమణీదుఃఖవిమోచనప్రయత్నమఁ జేయవలయునని నభిప్రాయమును హనుమ ప్రకటించి నట్లు స్ఫూర్తిగాఁ జెప్పఁబడియెనని యెఱుంగవలెను.

మ. శ్రుతిసంఘాతవిదుత్తమప్రకరసం♦స్తుత్యప్రభావా, నరా
కృతిసంధారణసంప్రకాశితలస♦త్కీర్తీ, కృపానీరధీ
మతిమత్సంతతలక్ష్యభూతవిమలా♦త్మస్తవ్యవృత్తీ! మహో
ద్ధతశత్రుప్రకటాటవీదహనభూ♦తస్ఫారదివ్యాయుధా.

సీ. ఇది మహీసురకుల♦విదితకాశ్యపమానిగోత్రజాపస్తంబ♦సూత్ర, శ్రీత్రి
పురసుందరీవర♦కరుణాత్తసంస్కృతాంధ్రకవిత్వవైభవ♦ప్రథితకీర్తి
జనమంచివంశాబ్ధి♦చంద్రసుబ్రహ్మణ్యవిబుధవర్యసుపుత్ర ♦ వినుతిపాత్ర
పండితగురుభక్త♦తాండవకృష్ణాపరాభిధేయార్యజ♦నాళిభజన

తే. నిరతశేషాద్రిశర్మప్ర♦ణీతమైన, యాంధ్రరామాయణమున న♦నంతశోక
కష్టహారమగుసుందర♦కాండ మవని, నారవిసుధాంశుతారక♦మై చెలంగు.

సుందరకాండము సంపూర్ణము.

---

శ్రీ. శ్రీ. శ్రీ.

# ఆంధ్రగ్రంథములు

## వచనగ్రంథములు.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశ స్కంధములు, ఒకేసంపుటం | 9 | 0 |
| ,, మూడుసంపుటములు | 10 | 8 |
| ఆంధ్రవచనభారతము— | | |
| ,, ఆదిసభాపర్వములు | 3 | 0 |
| ,, ఆరణ్యపర్వము | 3 | 0 |
| ,, విరాటోద్యోగపర్వము | 3 | 0 |
| ,, భీష్మద్రోణపర్వములు | 4 | 8 |
| ,, కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | 3 | 0 |
| ,, శాంతిపర్వము | 4 | 8 |
| ,, ఆనుశాసనికము మొదలు స్వర్గారోహణపర్వము వరకుగల సంపుటము | 4 | 8 |
| ఆంధ్రవచనవాల్మీకిరామాయణము, 2 సంపుటములు (అచ్చు) | | |
| ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము | 1 | 12 |
| ఆంధ్రకవిత్వచరిత్ర, బసవరాజు అప్పారావుగారిది | 1 | 12 |
| శ్రీగురుజాడ శ్రీరామమూర్తిగారి ఆంధ్రకవిజీవితములు | 4 | 0 |
| అరేబియన్‌నైట్సుకథలు | 1 | 4 |
| న్యాయవిచారము, ప్రహసనం | 0 | 4 |
| తులసీదాసు రామాయణము | 8 | 0 |
| తిలకుగారిసెక్యూరిటీకేసు, ఉపన్యాసములు | 0 | 14 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ద్వాదశోపనిషత్తులు, వచనం | 3 | 8 |
| భారతరమణీమణులు, 1 భా॥ | 0 | 12 |
| డిటో రెండవభాగము | 0 | 10 |
| యజుర్వేదకథాసంగ్రహము | 0 | 8 |
| శ్రీమహాభక్తవిజయము, నూతనముద్రితము | 6 | 0 |
| నీతిచంద్రిక, చిన్నయసూరి | 0 | 8 |
| పంచతంత్రము, వచనము, సులభశైలి | 0 | 8 |
| నవనాథభక్తులచరిత్ర | 2 | 0 |
| నీతిరత్నాకరము | 0 | 8 |
| సంగ్రహరామాయణము | 0 | 12 |
| సంగ్రహభారతము | 1 | 4 |
| సంగ్రహభాగవతము | 1 | 4 |
| ప్రాచీనదేశచరిత్రలు | 1 | 12 |
| పతివ్రతలచరిత్రలు | 2 | 0 |
| దక్కనుపూర్వకథలు | 2 | 0 |
| భోజునికథలు | 0 | 8 |
| హితోపదేశము, సులభశైలి | 0 | 12 |
| భోజకాళిదాసకథలు, 1 భా॥ | 0 | 12 |
| ,, 2 భా॥ | 0 | 12 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము | 0 | 6 |
| సంస్కృతనాటకకథలు | 1 | 8 |
| దశకుమారచరిత్రము | 1 | 8 |
| మదనకామరాజుకథలు, చక్కనిపొత్తు | 0 | 14 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| రాజశేఖరుడు, గోపాలుడు | 0 | 8 |
| విక్రమార్కునికథలు | 0 | 8 |
| చార్ దర్వీషుకథలు | 0 | 8 |
| తాతాచార్యులకథలు | 0 | 6 |
| వైద్యులకథలు | 0 | 4 |
| బేతాళునికథలు | 0 | 8 |
| వీరాంగనలు | 0 | 12 |
| పరమానందశిష్యులకథలు | 0 | 3 |
| నలుగురుమంత్రులకథలు | 0 | 4 |
| అయిదుగురుదొంగలకథలు | 0 | 6 |
| రేచుక్కపగటిచుక్కకథ | 0 | 3 |
| సత్యసేనవిజయము | 0 | 4 |
| ఋషులచరిత్ర | 0 | 8 |
| పురాణగాథలు I | 0 | 12 |
| ,, II | 0 | 12 |
| బాజీరాయని చరిత్ర | 0 | 14 |
| రఘువంశకథ | 0 | 8 |
| విక్రమార్కచరిత్ర | 1 | 0 |
| వివేకానందవిజయము | 2 | 0 |
| పరిహాస్యవినోదకథలు | 0 | 12 |
| ఈసబునీతికథలు, 1-వ భా॥ | 0 | 6 |
| డిటో 2-వ భా॥ | 0 | 8 |
| పంజాబుఅల్లరి | 0 | 8 |
| శుకసప్తతికథలు | 0 | 6 |
| మర్యాదరామన్నకథలు | 0 | 3 |
| మైరావణచరిత్ర | 0 | 1 |
| షేక్స్పియర్ నాటకకథలు | 1 | 8 |
| అనంతసాగరము, బుక్కరాయ సముద్రచరిత్ర | 0 | 12 |
| ప్రహ్లాదచరిత్ర, ప్రతిమలతో | 0 | 6 |
| శకుంతల ,, | 0 | 6 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| నల | ,, | 0 | 8 |
| సావిత్రి | ,, | 0 | 6 |
| హరిశ్చంద్ర | ,, | 0 | 8 |

## నవలలు.

| | | | |
|---|---|---|---|
| సీతారామము | | 1 | 4 |
| ఐవన్హో, | నవల | 0 | 8 |
| మదాలస | ,, | (అచ్చు) | |
| సుజనరంజని | ,, | 0 | 8 |
| విజ్జలదేవి | ,, | 1 | 8 |
| ఉన్మాదిని, | నవల | 0 | 4 |
| రాధారాణి | ,, | 0 | 4 |
| అస్తమయము | ,, | 1 | 8 |
| దుర్గేశనందని | ,, | 0 | 12 |
| కపాలకుండల | ,, | 0 | 12 |
| లక్షణ | ,, | 0 | 12 |
| టిప్పుసుల్తాన్ | ,, | 1 | 8 |
| లీల | ,, | 0 | 6 |
| రాజర్షి | ,, | 1 | 0 |
| తారాబాయి | ,, | 0 | 14 |
| దిలారామ | ,, | 1 | 4 |
| కోవలన్ కన్నకి | | 0 | 12 |
| మనోహరి | ,, | 0 | 14 |
| వీరబాల | ,, | 0 | 8 |
| ఆనందమఠ | ,, | 0 | 12 |
| లాలాబాయి | ,, | 0 | 8 |
| ఆంధ్రరాష్ట్రము | ,, | 1 | 8 |
| రోషినార | ,, | 0 | 12 |
| బాలాదిత్య | ,, | 2 | 0 |
| దేశభక్తుడు | | 1 | 0 |
| శంభుతోనొక నాటిసహవాసం | | 0 | 4 |
| చంద్రగుప్తుడు, నవల | | 2 | 8 |